# అంకితం

★

రాజకీయాలను ప్రారంభంలో నాకు నేర్పినట్టి
భారతప్రజలను, స్వాతంత్ర్యానికై పోరాటం
నడిపే సర్వప్రజలను ప్రేమించడం
నేర్పినట్టి
మా తండ్రి
**ఉపేంద్రకృష్ణదత్తుకు**

జననం: కలకత్తాలో అక్టోబర్ 17, 1857
మరణం: లెచ్వర్త్‌లో (ఇంగ్లాండు) మే 12, 1939

ప్రచురణ నెం. 237

# ఏ డు రూ పా యి లు

ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ
కె. 13/సి. — 1500 కాపీలు — 22-10-47

# విషయసూచిక



## భాగం 1

### భారతదేశం ఎలా ఉంది - ఎలా ఉండవలసింది



## భాగం 2

### భారతదేశంలో బ్రిటిష్ పాలన

# భాగం 3

## భారతదేశ ప్రధాన సమస్య రైతుసమస్య

# భాగం 4

## భారత ప్రజల ఉద్యమం

# రెండో ముద్రణకు పీఠిక

"నేటి భారతదేశం" మొదట ఇంగ్లాండులో 1940 లో ప్రచురితమైంది. అప్పుడు దీనిని ఇండియాలో నిషేధించారు. ఇంగ్లాండులో నిలవవున్న పుస్తకాలన్నీ విమానదాడుల్లో పోయాయి. యుద్ధపరిస్థితులవల్ల అమెరికాలో ప్రచురించాక క్రొత్త ప్రతి చేరలేదు. కాగితం కరువువల్ల పునర్ముద్రణకు వీలులేకపోయింది. ఈ కారణాలంగా చాలకాలంబట్టి ఈ పుస్తకం దొరకటమే కష్టమయిపోయింది.

ఇప్పుడు ఇండియాలోని పీపుల్సు పబ్లిషింగ్ హౌసువారు దీనిని ప్రకటించబూనుకున్నారు. అందువల్ల పుస్తకాన్ని తిరిగి సంస్కరించే అవకాశం నాకు చిక్కింది.

1940 నుండీ చాల సంఘటనలు జరిగాయి. ప్రపంచంపై సామ్రాజ్యతత్వ పెత్తనం బలహీనమవుతోంది. బ్రిటన్‌కు ఇండియాకు మధ్యనున్న సంబంధాలలో చాలా పెద్దమార్పులు జరుగుతున్నా . అయినప్పటికీ స్వతంత్రత ఇంకా సాధించబడలేదు 1946 రాజ్యాంగ సంస్కరణల తర్వాతకూడా. భారతదేశంపై సామ్రాజ్యవాదుల పెత్తనం తొలగిపోలేదు – దాని స్వరూపంలో మార్పుమాత్రమే జరిగింది. సామ్రాజ్యవాదం తుదిసారిగా ఇంకా తెగతెంపులు చేసుకోవలసే ఉన్నది.

కాబట్టి సంపూర్ణ జాతీయ స్వతంత్రసమస్యే — 1940 లోలాగే 1946 లో కూడా భారతదేశపు ప్రధానసమస్యగా ఉన్నది. కాని భారతదేశం స్వతంత్రాన్ని సమీపించేకొద్దీ నేటి భారతదేశపు వివిధ క్లిష్టసమస్యలూ — ఆర్థిక, సాంఘిక, రాజకీయ, వివిధజాతి సమస్యలు — మరింత తీవ్రంగా బయటపడుతున్నవి. ఎందుకంటే

ఎన్నాళ్ళనుంచో అభివృద్ధి నిరోధించబడి ఈ సమస్యలన్నీ పేరుకుపెట్టబడి ఉన్నాయి.

చారిత్రికంగా జరిగిన అభివృద్ధినిబట్టీ, ముఖ్యంగా రెండువందల సంవత్సరాల సామ్రాజ్యవాద పాలననుబట్టి మాత్రమే ఆధునిక భారత దేశ సమస్య లన్నింటినీ అర్థం చేసుకోగలుగుతాము. ఈ కారణంవల్ల ఇప్పుడు మనం భారతదేశంలోని సామ్రాజ్యవాద పాలనగూర్చి, ఎన్నాళ్ళనుంచో సామ్రాజ్యవాదానికీ స్వాతంత్ర్యోద్యమానికీ మధ్య జరుగుతున్న సంఘర్షణను గూర్చి, మనం పరిశీలించడం ఇంకా పాత బడిపోలేదు. ఇందులోని చాల విషయాలు చరిత్రకు సంబంధించినవే. కాని ఇవన్నీ నేటికీ చాల ముఖ్యమైనవే.

ఈ ముద్రణలో 1946 వరకు జరిగిన సంగతులన్నీ, బ్రిటిష్ మంత్రివర్గ రాయబారం తెచ్చిన నూతన రాజ్యాంగ ప్రతిపాదనలతో సహా భారతదేశ రాజకీయపరిస్థితి నంతటినీ చేర్చాను. ఇందుతో పాటు మొదటి ముద్రణలోని చరిత్రకు సంబంధించిన విషయాలలో చాల భాగం, భారతదేశ ప్రధానసమస్యల పరిశీలనం అలాగేఉంచాను.

ఇందులోని లెక్కలు, ఇతర విషయాలను నేటివరకూ సమకూర్చడంలో సాయపడినట్టి, సలహాలిచ్చినట్టి, ప్రేమసాగర్ గుప్త, అరుణాబోస్, ఎ. యస్. ఆర్. చారి మొదలైన చాలమంది భారతీయ మిత్రులకు కృతజ్ఞుడను.

త్వరత్వరగా అభివృద్ధిచెందుతున్న భారత ప్రజాతంత్ర ఉద్యమమూ, తయారవుతున్న భారత మహావిప్లవమూ త్వరలో తీవ్రమైన మార్పులు తేగలవని, అందుతో ఈ పుస్తకాన్ని కేవలం చారిత్రికంగా ప్రధానమైనదిగా మాత్రమే చేయగలవని ఆశిస్తున్నాను. కాని అలాంటి సమయ మింకా రాలేదు.

జూలై, 1946

— ఆర్. పామీదత్తు

# ఒకటో అధ్యాయం

# ఆధునిక ప్రపంచంలో భారతదేశం

"ప్రపంచ చరిత్రలో ఒక దేశం ప్రజలు ఇంకో దేశంతో ఉన్న రాజకీయ బంధనాలను త్రెంచివేసుకోవడం అవసరమవుతుంది. ఇతర దేశ ప్రజలతో సమాన హోదాను స్వీకరించవలసి వస్తుంది. అది ప్రకృతి సిద్ధమైన హక్కు. ఇలాంటప్పుడు వారు అలా విడిపోవడానికున్న కారణాలేమిటో ఆ ప్రజలు ప్రకటించాలి. ప్రపంచ జనాభిప్రాయాన్ని గౌరవించాలి." — అమెరికా స్వాతంత్ర్యప్రకటన.

భారత దేశ భవిష్యత్తేమిటి అన్నది, నేటి ప్రపంచ రాజకీయాల్లో ప్రముఖ సమస్య.

నలభై కోట్ల భారతప్రజలు, మానవజాతి మొత్తంలో అయిదోవంతున్నారు. రెండుశతాబ్దాలుగా వారు విదేశపాలనకు లోబడి ఉన్నారు. నేడా విదేశపాలనకు ఆఖరు ఘడియలు సమీపించాయి.

అంతర్జాతీయంగా చూస్తే, భారతదేశ దాస్యం ఆధునిక ప్రపంచంలో సామ్రాజ్యవాద పాలనకు ప్రధానమైన మూలపీఠమయింది. ఈ విశాల భూభాగం లోని అనంత సహజ సంపత్తి ఈ దేశప్రజల జీవితం, కాయకష్టం పశ్చిమ దేశ ధనికుల దాడికి గురయినవి. పాశ్చాత్య ధనికులు ఈ దేశంలో జొరబడి, దురాక్రమణచేసి, తమ బలాన్ని విస్తరించుకుంటూ వచ్చి ఆఖరుకు దేశాన్నంతటిని ఆక్రమించి పీడించసాగారు. ఈ విదేశపాలన నిర్మూలనమైతే మానవజాతిలోని అయిదో భాగానికి నూతన భవిష్యత్తు పొడసూపుతుంది; అంతేకాక, ప్రపంచ రాజకీయాలలో ఆయా దేశాలకున్న ప్రాబల్యంలో పెద్దమార్పువస్తుంది; ప్రపంచ సామ్రాజ్యవాదం మరింత దుర్బలమవుతుంది; యావత్ భూగోళంలోని ప్రజల స్వతంత్రపురోగమనానికి బలమేర్పడుతుంది. భారతదేశం చైనాతోపాటు స్వతంత్ర మయితే అఖిలాశియా ప్రజల విముక్తికి, వలసదేశ ప్రజాకోటి అంతటి విముక్తికి దారి దొరుకుతుంది.

నేటి ప్రపంచంలోని అన్నిసమస్యలు, అన్ని వైరుధ్యాలు భారత దేశంలో కేంద్రీకృతమై వున్నాయి. విదేశ దురాక్రమణదారుల ధాటికాగలేక,

2)

అణగి, పెరుగుపెంపుదలలులేని ప్రాచీనచారిత్రకసభ్యత ఇక్కడ శిధిలీకృతమయింది. ఆ శిధిలాల్లో ఒకవేపు పాతకాలపు అతినికృష్ట ఆర్థిక వ్యవస్థ, దరిద్రం, దాస్యం, మరొకవైపు ధనికవర్గ మవలంబించే అతినూతన పీడనా పద్ధతులూ ఒకదాని ప్రక్కనొకటి మనకు గోచరిస్తున్నాయి. వ్యవసాయంలో ఎల్లప్పుడు సంకటావస్థలే. కరువు. కాటకాలు, ఋణభారం, కుల మత స్పృశ్య అస్పృశ్యతలనే సంకెళ్లు, అంతులేని పారిశ్రామిక పీడన. ప్రపంచంలో మరెక్కడా కనిపించనంతగా ధనిక-దరిద్రులస్థితిగతులమధ్య విభేదాలు, మత, సాంఘికవిద్వేషాలు, వర్గపోరాటం, నూతనంగా ఉదయిస్తున్న వివిధ జాతిసమస్యలు—— నేడు భారతదేశంలో కని పిస్తున్నాయి ఈ సమస్యలన్నీ పరాధీనదేశాల అధోగతిని, అభివృద్ధి రాహిత్యాన్ని, వేనోళ్ళ చాటుతున్నవి. విదేశపాలన మూలంగా మరింత తీవ్రతరమై ఈ సమస్య లన్నీ సామ్రాజ్యవాదంనుండి విముక్తిపొంది స్వతంత్రం పొందాలనే ప్రధాన సమస్యతోపాటు మనల నెదుర్కొంటున్నవి అందువల్లనే స్వతంత్ర పోరాట పరిస్థితి కొంత క్లిష్టతరమవుతున్నది.

భారతదేశం నేడు, ఆర్థిక, సాంఘిక- రాజకీయ తీవ్రవిప్లవ యుగంలో ప్రవేశిస్తున్నది. విదేశ పాలననుండి విముక్తిపొంది సంపూర్ణ స్వతంత్రాన్ని సాధించడం ఆ విప్లవంలో ప్రథమ ఘట్ట మవుతుంది కాని, అది అప్పుడే అతి సమీపంలో ఉన్నది. కాని, వందలాది ఏండ్లుగా విదేశపాలనతో, అభివృద్ధి లేమితో పేరుకొనిఉన్న ఆంతరంగిక సమస్యలు, సమాజ విద్వేషాలు, తగాదాలు ఆ స్వతంత్రంతో బయట పడతాయి. వాటిని పరిష్కారం చెయ్యడం అత్యవసరమవు తుంది. జాతీయ సామాజిక పునర్నిర్మాణ కర్తవ్యం భారత ప్రజలమీద నేడు పడుతున్నది.

## 1. స్వతంత్రం ముంగిటనున్న భారతదేశం

ఫాసిస్టు రాజ్యాలను మిత్ర రాజ్యాలు ఓడించడంతో ఒక నూతన ప్రపంచ పరిస్థితి ఏర్పడింది. ఇందువల్ల, అంతర్జాతీయ రాజకీయాల్లో నేడు భారతదేశ స్వతంత్ర సమస్య ప్రధానస్థానాన్ని ఆక్రమించింది.

1914 - 18 లో జరిగిన మొదటి ప్రపంచయుద్ధంతో పాటు, దానితర్వాత వచ్చిన విప్లవ తరంగాలు ప్రపంచాన్నంతా ముంచివేశాయి. అందుతో ఇతర వలస దేశాలన్నిటిలో వలెనే భారతదేశంలో కూడ గొప్ప మార్పులు వచ్చాయి. 1919 - 22 లలో మహత్తర రూపంతో ప్రజా పోరాటాలు భారతదేశాన్ని కదిపి వేశాయి. ప్రపంచంలో వచ్చిన ఆర్థిక విషమదశ దేశాన్ని కబళించడంతో, 1930 - 34 లో ప్రజా పోరాటాలు మరింత తీవ్ర స్వరూపంతో బయలుదేరాయి. ఇలా విజృంభిస్తున్న జాతీయోద్యమాన్ని, ఒకతూరి సంస్కరణలు, మరొకతూరి దారుణ దమననీతి ప్రయోగంద్వారా అణచాలని బ్రిటిష్‌ప్రభుత్వం ప్రయత్నించింది. స్వపరిపాలన ఇవ్వబోతామని వాగ్దానంచేస్తూ కొన్ని రాజ్యాంగ సంస్కరణలను

బ్రిటన్ ప్రవేశపెట్టింది. కాని ఈ సంస్కరణల్లో అసలు అధికారం మట్టుకు బ్రిటన్ చేతుల్లోనే నిలిచిపోయింది. ఈ సంస్కరణల మూలంగా 1937 లో, 11 రాష్ట్రాలకు 8 రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రిపదవులు స్వీకరించింది. కాని దేశంలో బయలుదేరిన అశాంతి అందుతో అణగిపోలేదు సరికదా, అందుకు మరో మాతన ప్రోత్సాహం చేకూర్చింది. బ్రిటిష్ ప్రభుత్వం అమలు జరుప దలచుకొన్న ఫెడరల్ రాజ్యాంగ విధానానికి ప్రతికూలంగా స్వతంత్ర పోరాటం 1939లో సునిశితమవుతున్నది. అప్పుడే రెండో యుద్ధం ప్రారంభమైంది. నామమాత్రంగానైనా ప్రజలతో సమాలోచించకుండా ప్రజల అనుమతి లేకుండా భారతదేశాన్ని యుద్ధం లోకి ఈడ్చి బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధకాలపు నియంతృత్వాన్ని ఏర్పాటు చేసింది. ఇందువల్ల, పాలకులకు పాలిత ప్రజలకు మధ్య ఎంత పెద్దఅఘాత మున్నదో మరింత స్పష్టపడడం మాత్రమే జరిగింది.

భారతదేశాన్ని విదేశ పాలనా శృంఖలాలనుండి విమోచనం చేయాలన్న సమస్య రెండోయుద్ధంతో మరింత వేగంగా పరిష్కరించడం అవసరమని తేలింది. "సర్వదేశప్రజలకు తమకు నచ్చిన ప్రభుత్వాన్ని తా మేర్పరుచుకొనే హక్కున్నది" అని మిత్రరాజ్యాలు ప్రకటించాయి. గత యుద్ధంలోలాగా కాకుండా ఈతూరి మిత్రరాజ్యాలకు నాయకత్వం వహించిన నాల్గు దేశాలలో రెండు సామ్రాజ్యవాద ప్రభుత్వాలతోపాటు — బ్రిటన్, అమెరికా — రెండు సామ్రాజ్య వాదులు కానిదేశాలు — జాతీయ చైనా, సోవియట్ రష్యా — చేరాయి. ప్రపంచమంతటా, అతిసమర్థములైన జాతీయ మహోద్యమాలు ఫాసిజాన్నెదిరించి స్వతంత్ర పోరాటాలను సాగిస్తున్నాయి. ఇలాంటి అంతర్జాతీయ పరిస్థితిలో, అన్నిదేశాలవారు దేనికోసం పోరాడుతున్నారో — దేనికోసం భారత సేనావాహిని జీవితాలను బలిచేయవలసిందని కోరుతున్నారో, ఆ స్వతంత్రాన్ని మరింత గట్టిగా వాంఛించడంలో ఆశ్చర్యమేమీలేదు.

ఆసియా యుద్ధంవల్ల ఏర్పడిన ప్రత్యేక పరిస్థితులు, భారత స్వతంత్రం వెంటనే రావాలన్న అవసరాన్ని సూచించాయి. ఆసియాలో బ్రిటిష్ సామ్రాజ్య వాదులు, ,అంతవరకూ, జపాను దురాక్రమణను ప్రోద్బలపరుస్తూ, తోడ్పడుతూ, ఆత్మవినాశకరమైన పద్ధతిని అవలంబించారు. దానిమూలంగా పెరల్ హార్బరు దాడితర్వాత, జపాన్ దురాక్రమణ ధాటికాగలేక బ్రిటిష్‌సామ్రాజ్య పాలన పునాదులతో గజగజలాడిపోయింది. దురాక్రమణదారుల ముందు, ఆగ్నేయాసియా దేశాలన్నీ ఏమాత్రం ప్రతిఘటనలేకనే శరణన్నాయి. విదేశపాలకులు తమ పాలిత ప్రజలను సమీకరించలేకపొయ్యారు. కేవలం దిగుమతిచేసిన సేనలతో నామమాత్ర మైన రక్షణకార్యాలు నడిపారు. కాని అవేమాత్రం సఫలంకాలేదు. ఇందుతో పాత్ వలసదేశ పాలనావిధాన మెంత అసమర్థమైందో, ఎంత బూజుపట్టినదో, యావత ప్రజానీకం కళ్ళయెదుట ప్రత్యక్షంగా కనిపించింది.

బ్రిటిష్ పాలనలోని అసమర్ధత బట్టబయలు కావడంతో, భారత ప్రజల భావాలు తీవ్రంగా మారాయి. బ్రిటన్ శక్తి అభేద్యమన్న భ్రమలు తొలగిపోయ్యాయి. జపాను సేనలు భారతదేశపు సరిహద్దులకువచ్చి ముందుకుకూడా సాగాయి. తమవద్దకువచ్చిన మాజీ కాంగ్రెసు అధ్యక్షుడు సుభాష్‌చంద్ర బోసును, అక్షరాజ్యాలు బహుచాకచక్యంతో ఉపయోగించుకున్నాయి. తమ దురాక్రమణ దుర్దేశాన్ని కప్పిపుచ్చుకునేందుకు 'ఆజాద్ హింద్ ఫౌజ్' అనేపేర ఒక సేనాదళాన్ని ఏర్పరచారు. తమకేదో భారత దేశంపై అభిమానమున్నట్టు కపట నటన చేశారు. భారత దేశం స్వతంత్రంగానేఉండి ఉంటే ఆ ప్రచారం నిష్ప్రయోజనమయ్యేది. దాస్యంలోఉన్న భారత దేశంలో ఆ ప్రచారఫలితం కొంత కనిపించడం తప్పలేదు.

ఇలా రెండోయుద్ధంలో ఒక నూతన పరిస్థితి ఏర్పడింది. కేవలం ప్రజాతంత్ర సూత్రాలకోసమే కాక, భారత దేశరక్షణకు, మిత్రరాజ్య యుద్ధతంత్రానికి కూడ భారత దేశాన్ని త్వరలో స్వతంత్రం చేయడం అత్యవసరమయింది. ప్రపంచ ఫాసిస్టు రాజ్యాలకు వ్యతిరేకంగా ప్రజాతంత్రదేశ జనానీకానికీ తమకూ సమాన ప్రయోజనాలున్నట్టు భారత నాయకులు తొలుతనే గుర్తించారు. ఫాసిస్టు దురాక్రమణకు బ్రిటన్ ప్రోత్సాహమిస్తూ, సాయపడుతూ ఉన్నరోజుల్లోనే, భారత నాయకులు ఫాసిజాన్ని బలపరిచే అభివృద్ధి నిరోధక విధానాలను తీవ్రంగా ఖండిస్తూ వచ్చారు. పెద్దఆందోళన చేశారు. యుద్ధంలో, ఫాసిజం ఓడిపోవడం, జాతీయ చైనా, సోవియట్‌రష్యా. యూరోపులో స్వతంత్ర ప్రజాఉద్యమాలు పనిచేస్తున్న పక్షంగెలవడం తమ భవిష్యత్తుకు అనుకూలమని వారుగ్రహించారు. కాని మిత్రరాజ్యాలలో స్వచ్ఛంద సహచరులుగా భారత ప్రజలు పనిచేసేందుకు, ప్రజలను పూర్తిగా సమీకరించేందుకు నిజమైన సంపూర్ణాధి కారాలతో జాతీయ ప్రభుత్వం ఏర్పడాలని, భారత దేశం స్వతంత్రం కావాలని, ఆనాయకులు వాంఛించారు. ఈ వాంఛ న్యాయమైనది. ఈ వాంఛ మిత్రరాజ్యాల ఆశయాలకు సన్నిహితమైనది. ఈ వాంఛను ప్రపంచ దేశాల్లోని ప్రజాతంత్ర వాదులందరూబలపరిచారు అంతేకాక, బ్రిటన్‌యొక్క మిత్రరాజ్యాధి పతులైన రూజ్వెల్టు, మార్షల్ జంగ్‌కైషేక్‌లు అధికారయుతంగా కూడ భారత స్వతంత్రవాంఛకు తమ తోడ్పాటును బ్రిటన్‌కు తెలియబరచారు.

ఏమైనప్పటికీ, రెండో యుద్ధసమాప్తితో భారతదేశం స్వతంత్రం కాలేదు. బ్రిటన్‌లో కన్సర్వేటివ్‌పక్షం అధికారంలోవుంది. భారత స్వతంత్రంకోసం చేసిన ప్రతి ప్రతిపాదనను నిరాకరించింది. భారత ప్రజానాయకులచేతుల్లో అధికారంవుంచే తాత్కాలిక యుద్ధకాలపు ఒడంబడికకుకూడా చర్చిల్‌ప్రభుత్వం ఒప్పుకోలేదు. "బ్రిటిష్ సామ్రాజ్యాన్ని రద్దుచేసేందుకు నేను ప్రధానిని కాలేద"న్న చర్చిల్ ఆశయమే, ప్రమాద పరిస్థితి ఏర్పడిన రోజుల్లోకూడ బ్రిటిష్ విధానానికి ఆదర్శమైంది. 1942లో క్రిప్సు రాయబారాలు విఫలమయ్యాయి. జాతీయనాయకులు నిరాశాహతులై డోలాయమాన స్థితిలో పడ్డారు. ఆగష్టు తీర్మానంవల్ల ఏర్పడిన ప్రతిష్టంభనలో కూరుకొనిపోయారు.

జాతీయ నాయకులను బ్రిటిష్ ప్రభుత్వం జైళ్ళలో తోసింది. నాయకుల నిర్బంధంతో దానంతటది అనధికారఉద్యమం బయలుదేరింది. అరాచకాలు జరిగాయి. వీటిని ప్రభుత్వం సులభంగా అణచివేయగల్గింది.

యుద్ధానంతరంకూడ భారతదేశం దాస్యంలో వుంది. రాజకీయ ప్రతిష్టంభన అలాగే కొనసాగింది

కాని, మిత్రరాజ్య విజయంతో నూతనయుగోదయ మైంది. ఫాసిస్టురాజ్యాల సైనికబలం పరిపూర్ణంగా పరాజితం కావడంతో వివిధదేశాల్లోని అభివృద్ధినిరోధక వర్గాలకు పెద్ద దెబ్బ తగిలింది. 1917 తర్వాత ఇంతదెబ్బ వారికెన్నడూ తగల్లేదు. అన్ని దేశాల్లోని ప్రజాఉద్యమాలు విజృంభించాయి. సామ్రాజ్యవాదం చాల దుర్బలపడింది. జర్మనీ, ఇటలీ, జపాను సామ్రాజ్యవాదాలు ప్రపంచపటంలోనుండి పూర్తిగా మాయమయ్యాయి. ప్రధాన సామ్రాజ్యవాదాలు రెండే మిగిలాయి — అమెరికా, బ్రిటన్‌లు. వీటితోపాటు చిన్న వలసదేశాలు గల ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు, పోర్చుగీసులు నిలచాయి. యూరోపంతటా పాత అభివృద్ధికరరాజ్యాలు — అవి ఫాసిజంతో చేరినవైనా, లేక వారికి శరణన్నవైనా సరే — పోయి, ఆ స్థానంలో నూతన ప్రజాతంత్ర ప్రభుత్వాలు స్థాపితమైనవి. బ్రిటన్ ఎన్నికలలో కన్సర్వేటివ్‌లకు పరిపూర్తిగా శృంగభంగమైనది. తొట్టతొలిసారిగా అత్యధిక సంఖ్యతో లేబర్‌పార్టీ ప్రభుత్వం ఏర్పడింది. ఆశియాఖండ మంతటా, వలసదేశాలలో స్వతంత్ర ప్రజాపోరాటాలు పురోగమించాయి: ఇండొనేషియా రిపబ్లిక్కు, ఆంగ్లో-డచ్చి సామ్రాజ్యవాదం తమ జపానుసేనలతో సాగించినదాడిని ఎదుర్కొని నిలిచింది భారతదేశంలో స్వతంత్రవాంఛ విశ్వజనీనంగా ప్రకటితమైంది. జాతీయ విప్లవోద్యమం 1945—46 చలికాలంలో మహోన్నతశిఖరాలకు వెళ్ళింది. హిందూ-ముస్లిం ఐక్యతాప్రదర్శనాలు బ్రహ్మాండరూపంతో సాగాయి. సేనావారంలోకికూడ జాతీయ విప్లవజ్వాలలు నాలుకలు చాచాయి.

ఈ పరిస్థితులవల్ల, కొత్త లేబర్ ప్రభుత్వం నాయకత్వంక్రింద బ్రిటిష్ విధానంలో త్వరగా మార్పురాక తప్పిందికాదు. 1946 ఫిబ్రవరి 19 న ప్రధాని అట్లీ భారతదేశానికి బ్రిటిష్ మంత్రివర్గ రాయబారాన్ని పంపుతూన్నట్లు ప్రకటించాడు. ఆ రాయబారం వెళ్ళనున్న సందర్భంలో మార్చి 15 న అట్లీ ఇలా ప్రకటించాడు:

> "నేటి పరిస్థితుల్లో, పాత ప్రతిపాదనలను అమలు జరిపితే ఏమీ ప్రయోజనం లేదు 1946 లోని వేడి, 1920 లో, 1930 లో, కడకు 1942 లో ఉన్న వేడి కాదు.
>
> "ప్రజాభిప్రాయాన్ని మహాయుద్ధంకంటే ముందుకు నడిపేదింకేదీ లేదు. రెండు యుద్ధాల సంధియుగం మొదటిరోజుల్లో ఈ సమస్యతో అంతో ఇంతో సంబంధమున్న ప్రతివారికీ 1914—18 యుద్ధం భారతదేశ వాంఛల కెలా ఉత్తేజకరమైందో తెలుసు. సామాన్యకాలంలో కొంత మందగతితో

పారుతున్న ప్రవాహం, యుద్ధకాలంలో వేగవంతమవుతుంది. యుద్ధ సమయంలో కొంతవరకు ఆనుకొన్న ప్రవాహమంతా యుద్ధానంతరం ముఖ్యంగా అతివేగంతో ముందుకు పరువులు పెడుతుంది. ప్రస్తుత సమయంలో భారతదేశంలోని జాతీయతా ప్రవాహం మహావేగంతో ముందుకు సాగుతున్నదనడంలో సందేహం లేదు. అంతేకాదు; ఆశియా అంతటా అలాగే ఉంది.

"ప్రపంచంలో తన భావిస్థితి, తాహతు ఎలా ఉండాలో భారతదేశం స్వయంగా నిర్ణయించుకోవాలి. మిత్రరాజ్య సమితిద్వారాగాని, కామన్వెల్తు ద్వారాగాని ఐక్యత ఏర్పడవచ్చు. కాని, ఏ పెద్దదేశంకూడా ప్రపంచ వ్యవహారాల్లో భాగస్వామిని కాకుండా తనంతట తానుండడం సాధ్యంకాదు.

"భారతదేశం బ్రిటిష్ కామన్వెల్తులో ఉండాలని నిర్ణయించవచ్చునని నేనాశిస్తున్నాను. అలా చేస్తే వారికెంతో లాభం ఉంటుంది. కాని అది భారతీయులు తమకు యిష్టముంటేనే చేస్తారు. బలాత్కారంమీద బ్రిటిష్ కామన్వెల్తు సామ్రాజ్య దేశాలు కలుసుకొని ఉండడంలేదు. కామన్వెల్తు, స్వతంత్ర ప్రజల స్వచ్ఛంద సమితి

"అలాకాక స్వతంత్రంగా ఉండాలనే భారతదేశం నిర్ణయించుకుంటే-అందుకు వారికి హక్కున్నదని మన అభిప్రాయం. సంధియుగంలోని అధికారం మార్పును సాధ్యమైనంత సులువుగా జరిగేట్టు చూడడం మనపని."

భారతదేశ లక్ష్యం 'స్వతంత్రం' అన్న మాటను బ్రిటిష్ అధికారులు ఉపయోగించడం ఇదే మొదటిసారి అన్న సంగతిని అందరూ గమనించారు.

అయినప్పటికీ, బ్రిటిష్ మంత్రులను పంపడం, వారిచ్చిన బ్రిటిష్ ప్రణాళిక స్వతంత్రం ఇచ్చివేసిందని, ఇంగ్లాండు ఇండియాలలోని చాలవర్గాలు ఆశపడటం మాత్రం వట్టి అడియాసే. ఆ పరిస్థితింకా ఏర్పడలేదు. బ్రిటిష్ రాయబారాల చరిత్ర, తర్వాత రాయబారులిచ్చిన బ్రిటిష్ ప్రణాళికలను ఈ పుస్తకంలో తర్వాత విమర్శిస్తాను. వీటిఫలితమేదో కేవలం అనుభవములో మాత్రమే బోధపడాలి. కాని. ఈ ప్రణాళిక కేవలం బ్రిటన్ తొలినుంచీ అనుసరిస్తూ వచ్చిన ఏవో సంస్కరణలద్వారా రాజీపడ్డానికి చేసే ప్రయత్నాలలో ఆఖరుది మాత్రమే గాని, స్వతంత్రమేమీ రాలేదని చరిత్రగతి ఋజువుచేస్తుందని విశ్వసిస్తున్నాను.

1946లోకూడ భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యంలోని భాగంగానేవుంది. ఇంకెప్పుడో స్వతంత్రం ప్రకటించే హక్కున్నదని మాత్రమే ఇప్పుడు నామకః వాగ్దానం జరిగింది. కాని. స్వతంత్రమే మాకుకావాలి అని ప్రకటించవలసిన హక్కును రాజ్యాంగ నిర్మాణసభకు మాత్రమే బ్రిటన్ కట్టబెట్టింది. ఆ సభ ఎలా ఏర్పడాలో, అదెలా కార్యక్రమం నిర్వర్తించాలోకూడ బ్రిటిష్ ప్రభుత్వమే

ముందుగానే నిర్ణయాలు చేసింది. ఆ సభ సరైన ప్రజాప్రాతినిధ్యం కలదిగా ఉండ నీకుండా, బ్రిటన్ దాని స్వరూపాన్ని నిర్ణయించింది.

కాబట్టి, వచ్చేదశలోకూడ సామ్రాజ్యవాదానికి మరికొన్నాళ్ళు ప్రాణంపోయ డమే జరిగింది. కొత్తరాజ్యాంగ విధానంలోకూడ సామ్రాజ్యవాద పాలనం ఏ మాత్రం చెక్కు-చెదరకుండా సాగుతుంది. భారత స్వతంత్ర పోరాటమింకా విజయం సాధించలేదు.

కాని, నేడు చరిత్రఘటనల ప్రవాహమంతా భారత స్వతంత్రంపైపే ప్రవహి స్తున్నది. అచిరకాలంలోనే భారత దేశం సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధిస్తుంది. ఇందులో ఎవ్వరికీ అణుమాత్రంకూడ అనుమానంలేదు. ఇవి సామ్రాజ్యవాద పాల నకు ఆఖరుఘడియలు. చిరకాలంనుంచిసాగించిన అధికారం ముగియనున్న రోజులు. భారత ప్రజానీకం అభ్యుదయ పథంవైపు అంచెలతో ముందుకు సాగుతున్న దశ యిది. ఈ సన్నివేశాన్ని గుర్తుంచుకొనే నేటి భారతదేశాన్ని ఏ పరిశీలన చేసినా చెయ్యాలి.

## 2. సామ్రాజ్యతత్వం — భారత దేశం

ఆధునిక సామ్రాజ్యవాద పాలనకు, విస్తరణకు, భారతదేశం ఎన్నో శతాబ్దా లుగా ప్రధాన స్థానంగాఉంది.

భారతదేశ వైశాల్యం 1,8,08,679 చదరపుమైళ్ళు. అంటే బ్రిటిష్‌ద్వీపాల కన్నా పదిహేనురెట్లు హెచ్చు. గ్రేట్‌బ్రిటన్‌కన్నా ఇరవైరెట్లు వైశాల్యం ఉంది. 1941 లెక్కల ప్రకారం భారతదేశ జనసంఖ్య 38 కోట్ల 90 లక్షలు. ఇప్పుడు 40 కోట్లు దాదాపు ఉంటుందని అంచనా వేస్తున్నారు. అంటే మానవజాతిలో అయిదోవంతు భారతీయులన్నమాట.

బ్రిటిష్ సామ్రాజ్యం జనసంఖ్యలో మూడు వంతులు భారతీయులున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యంలో బ్రిటన్‌ను వదిలితే, మిగతా జనాభాలో అయిదులో నాలుగో వంతున్నారు — బ్రిటిష్ వలస ప్రజల సంఖ్యలో పదిలో 9 వ వంతు భారతీయులది.

మొన్నటి యుద్ధ ప్రారంభసమయంలో ప్రధానంగాఉన్న వలససామ్రాజ్యా లతో పోల్చి చూచినట్టయితే 1938 లో బ్రిటిష్ సామ్రాజ్యం కిందఉన్న భారత జన సంఖ్య ప్రపంచంలో వలసదేశాల మొత్తం జనాభాలో సగంపైగా ఉంది. ఫ్రెంచి, జపాన్, డచ్చి, అమెరికా, బెల్జియం, ఇటలీ, పోర్చుగల్లు సామ్రాజ్యాలన్నిటి వలస దేశాల జనాభాకంటే ఒకటిన్నర రెట్లు భారతీయులున్నారు.

సామ్రాజ్యవాద వలసల్లో పెద్దదేకాక, భారతదేశం, చిరకాలంనుంచి, చాలా రోజులు ఎన్నో తరాలుగా బ్రిటన్‌తో పాలితమౌతూ పీడింప బడుతూన్న దేశం. కాబట్టి వలసవిధాన ఫలితాలన్నీ ఈ దేశంలో సమగ్రంగా ప్రదర్శిత మయ్యాయి.

యూరోపులోని సామ్రాజ్యవాదు లందరూ తొలుత తమ ప్రయత్నాలన్ని టిని భారతదేశం వైపు, భారతదేశ సంపదవైపు గురిపెట్టారు. భారతదేశానికి కొత్త సముద్రమార్గం వెదుకుతూ అమెరికా వెస్టుఇండీసులవేపు పోయారు. భారత దేశం తర్వాతనే తమ సామ్రాజ్యాలను ఆఫ్రికా, ఆస్ట్రేలియా, చైనా, మిగతా ఆశియా భాగాలకు విస్తరింప జేసుకున్నారు.

ప్రపంచ పటంవైపు మనం చూచినట్టయితే, సామ్రాజ్య పాలనకు భారత దేశమెలా కేంద్ర ప్రాంతమో సులువుగా గోచరిస్తుంది.

భారతదేశం మధ్యలోఉంది చుట్టూ విశాల భారత సముద్రం. అందు లోంచి శాఖలు—పర్షియాఅఖాతం. కొత్త మధ్యప్రాచ్య సామ్రాజ్యం. అరేబియాలు పడమట కనిపిస్తాయి. తర్వాత యెర్రసముద్రం. ఈజిప్టు, ఆఫ్రికా నైఋతి దిక్కున ఉన్నాయి. తూర్పున బర్మా, మలయాదీవులు, ఈస్టిండీస్; ఆగ్నేయంగా ఆస్ట్రేలియా, సింగపూరు ద్వారం గుండాను కొత్తబర్మా యెనాన్‌రోడ్డు ద్వారాను చైనాకు మార్గముంది. ఉత్తరంలో చొరరాని కొండలు. (వాయువ్యంగా దాడి చేయాలనుకుంటేనే ఇందులోంచి దారి) సముద్రంమీద ఆధిపత్యం ఉండ డంతో భారతదేశం ఈ ప్రాంతాల పరిపాలన కంతటికీ పునాదిగా, కేంద్ర దుర్గంగా ఉంది. అంతేకాక, ఆదేశంలోనే కావలసిన సహజ సంపత్తి ఉంది. అందుకే ఎనలేని పీడనకు గురయింది.

యూరోపు ధనికులు భారతదేశంలో నాలుగు శతాబ్దాల క్రితం ప్రవేశించారు. పోర్చుగీసువారు కళ్ళికోటలో 1500 సంవత్సరంలో కర్మాగారం కట్టడంతో ఇది ప్రారంభమయింది. వారే 1506లో గోవాను ఆక్రమించారు. బ్రిటిష్ ఈస్టుఇండియా కంపెనీ 1600 లో స్థాపితమైంది. డచ్చి ఈస్టు ఇండియా కంపెనీ 1602 లోను, ఫ్రెంచి ఈస్టు ఇండియా కంపెనీ 1664 లోను స్థాపింపబడినాయి. దురాక్రమణకు ప్రాతిపదికలుగా ఏర్పడిన వ్యాపారకేంద్రాలుకాక, బ్రిటన్ ప్రత్యక్షంగా భారత దేశాన్ని పాలించడం 18 వ శతాబ్ది మధ్యభాగంలో ఆరంభమయింది. సాంప్రదాయ సిద్ధంగా ప్లాసీ యుద్ధం (1757) తో మొదలుపెట్టి లెక్కిస్తారు. అప్పటినుంచి ఇప్పటికి బ్రిటిష్ పరిపాలన దాదాపు రెండుశతాబ్దాలు సాగింది.

యూరోపులో ధనికతత్త్వం అభివృద్ధిచెందడానికి, బ్రిటన్‌కు ప్రపంచంలో ఆధిక్యం వచ్చేందుకు. మొత్తం నూతన సామ్రాజ్యవాద సౌధానికి భారతదేశాక్ర మణ ప్రధాన స్తంభాలలో ఒకటి. భారతదేశ పాలన ప్రాతిపదిక మీదనే యూరోపు రెండు శతాబ్దుల చరిత్ర మనం గుర్తించేంతకన్నా ఎక్కువభాగం నిర్మితమయింది. స్పెయిన్‌లో. పోర్చుగల్‌లో. హాలెండులో, ఫ్రాన్సులో. రష్యాలో. జర్మనీలో బ్రిటన్ విజయవంతంగా సాగించిన యుద్ధాల వెనుకనున్న సమస్య భారతదేశానికి మార్గం, భారతదేశ పాలన, అని మనం పరిశీలిస్తే కనిపిస్తుంది. ఇంగ్లాండు ఆంత రంగిక గాజకీయాల్లోనూ, ఎంతో శ్రమతో మహోన్నతంగా నిర్మించిన సామాజిక

రాజకీయ వ్యవస్థ వెనక ప్రాపుగా ఈ భారతపాలనం పని చేసిందనికూడ మనం కనిపెట్టవచ్చును.

బ్రిటిష్ సామ్రాజ్యంలో భారతదేశం ప్రధానమైనదని చాలరోజులనాడే గుర్తించారు. ఇంకా విస్తృతమవుతున్న భారత సామ్రాజ్యానికి ఆఖరు ముఖ్య వైస్రాయి అయిన లార్డు కర్జన్ 1894లో ఇలా వ్రాశాడు. (అప్పటికింకా వైస్రాయి కాలేదు.) :

> "భారతదేశాన్ని జయించి పాలించడం నిజంగా గొప్పదనీ, దాని మూలంగానే ప్రపంచంలో ఇంగ్లండుకో స్థాయి వచ్చిందనీ డిటాక్వెలిల్లీ అన్నాడు. అలాగే, ఇంగ్లాండుకు ఆశియాలో ఏర్పడిన స్థానంమూలంగా వచ్చిన ధనం, ప్రతిష్ఠ బ్రిటిష్ సామ్రాజ్యానికి పునాదిరాళ్ళు. ప్రాచీన ఆశియాఖండ మధ్యభాగంలో, తూర్పునంతా పాలించిన సింహాసనంపై ఇంగ్లాండు కూర్చున్నది. దాని నీడలు భూమిమీద, సముద్రముమీద జీరాడు తున్నవి. దేవతలా త్రిశూలధారియై, రాజులా కిరీటాన్ని ధరించింది."
>
> (కర్జన్, "దూరప్రాచ్య సమస్యలు" 1894, పుట 419)

నాలుగేళ్ళతర్వాత ఈ సామ్రాజ్యవాద మత్త వందిమాగధుడు కొత్తశ్రుతిలో పాడాడు. "భారతదేశం సామ్రాజ్యానికి మూలస్తంభం....... సామ్రాజ్యంలోని ఏ అధినివేశరాజ్యం పోయినా మనం జీవించగలం. కాని, మనం భారతదేశాన్ని పోగొట్టుకున్నామంటే మన సామ్రాజ్యభానుడు అంతరించగలడు" దీనిని తరుచుగా ప్రతివారు ఉటంకిస్తుంటారు. ఇందులో త్వరలోరానున్న అంత్యకాల సూచనల ప్రారంభం అప్పుడే గమనించినట్టు కనిపిస్తుంది.

ఆర్థికంగా బ్రిటన్‌కు భారతదేశం ప్రాణప్రదమని, బ్రిటిష్ ధనికవాద వ్యవస్థకు, దాని అభివృద్ధికి, ప్రధానమని చరిత్రనుబట్టి విస్పష్టమవుతుంది. ఇప్పుడిది దుర్బలపడుతున్నది. కాని ఇంకా కావలసినంత ఈ ప్రధానత గోచరిస్తుంది. 19వ శతాబ్దంలో భారతదేశపు మార్కెట్టులో అయిదులో నాలుగోవంతుపై బ్రిటను సర్వాధికారాలు చలాయించింది. 1914–18 యుద్ధప్రారంభసమయంలో కూడ మూడుకో రెండువంతులు బ్రిటన్ అధీనంలోనే భారతదేశ వాణిజ్య ముండేది. ఆ పాత సర్వాధిపత్యం ఇప్పుడు పోయింది. ఇంకెన్నటికీ రాదుకూడ. 1920 తర్వాత బ్రిటిష్ వస్తువులకు భారతదేశం ప్రధాన వర్తకస్థానంగా లేదు 1938కి బ్రిటిష్ వర్తక కేంద్రాల్లో మూడోస్థానానికి దిగిపోయింది. కాని, భారత వాణిజ్యంలో ప్రముఖభాగం మాత్రం బ్రిటన్ చేతిలోనే ఇప్పటికీవుంది. భారతదేశంలో బ్రిటిష్ పెట్టుబడి నూరుకోట్ల పౌనులని 1933లో అంచనా వేశారు. (భారతవాణిజ్య మండలి లెక్కలు) అంటే విదేశాలలోవున్న బ్రిటిష్ పెట్టుబడిలో నాలుగోవంతు భారతదేశంలో వుందన్నమాట. రెండో యుద్ధసమయంలోను. తర్వాతను ఏయే మార్పులు వచ్చాయో ఇంకా అంచనా వేయలేదుకాని, ఆ పెట్టుబడి ఇప్పుడు తగ్గి

పోయిందని చెప్పవచ్చు. యుద్ధం ఒత్తిడిమూలంగా మిగతా దేశాలలోని పెట్టుబడిని బ్రిటన్ గబగబా అమ్మివేసింది. కాని, భారతదేశంలోని పెట్టుబడినిమాత్రం అమ్మకుండా చాలగట్టిగా పట్టుకు కూర్చుంది. ఈ విషయం గుర్తుంచుకోవలసినది. డబ్బివ్వకుండా భారతదేశ వస్తువులను తెచ్చుకున్నందువల్ల సమకూడిన స్టెర్లింగు నిల్వలబాకీలు ఇప్పుడున్న పెట్టుబడికన్న ఎక్కువగా కాగితంమీద తేలాయి. కాని, ఆ స్టెర్లింగు నిల్వల భావిగతి ఏమవుతుందో ఇంకా తేల్చలేదు. ఏవిధంగా, ఏ రూపంగా నైతేనేమి - ప్రతిసంవత్సరం బ్రిటన్‌కు భారతదేశంనుండి ముట్టుతూన్న డబ్బు పదిహేనుకోట్ల పౌనులని అంచనావేశారు. (1921–22 లెక్కల ప్రకారం షా, ఖంబటా అనేవారు వ్రాసిన "ధనమూ, భారతదేశానికున్న పన్నులు మోసేశక్తీ" అన్న పుస్తకంలో వేసిన అంచనా 234వ పుట) అంటే అదే సంవత్సరంలో భారత దేశపు బడ్జెట్ మొత్తంకన్నా ఎక్కువ. బ్రిటన్‌లోని ప్రతిమనిషికి సం॥కి 3పౌ॥ చొప్పున దానినిసగటున విభజించవచ్చు. మరోవిధంగా చెప్పాలంటే, ఆసమయంలో బ్రిటన్‌లో అధిక లాభాలపన్ను చెల్లించే ప్రతివానికి దాదాపు 1,700 పౌనులు ఏటా జమపడుతున్న దన్నమాట.

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ఇంతేకాక భారత దేశం కీలకస్థానం. ఈ దేశం నుండే తమ సామ్రాజ్యాన్ని విస్తరింప జేసుకోవడానికి మూలపీఠం చిక్కింది. విదేశ యుద్ధాలకు, దండయాత్రలకుకావలసిన ధన, మనుష్యబలాని కీదేశం ఆధార భూతమైంది. అంతేకాక, మధ్యధరా సముద్రం, సూయజ్‌కాలువ, ఎర్రసముద్రం, పర్షియా అఖాతం, మధ్యప్రాచ్యసామ్రాజ్యం, సింగపూరు-వీటన్నింటిమీద అధికారం వుంచుకొనేందుకు తగిన ఎత్తులకు కేంద్రస్థానంగా భారతదేశాన్ని బ్రిటన్ బాగా ఉప యోగించుకుంటున్నది. భారతదేశమెంత కీలకస్థానమో రెండో ప్రపంచయుద్ధంలో మరింత ప్రదర్శితమయింది

## 3. భారతదేశంలో సామ్రాజ్యవాదుల అసమర్థత

భారతదేశంలో సామ్రాజ్యవాద పరిపాలనవల్ల కలిగిన ఫలితమేమిటి ?

భారతదేశం విషయాలను పరిశీలించే వారిలో రాజకీయ సాంఘిక విష యాల్లో ఎన్నివిచ్ఛిన్న దృక్పధాలున్నప్పటికీ, ఒక్క అంశంలోమట్టుకు ఆ పరిశీల కులు — అతివాదులైనా, మితవాదులైనా సరే అందరూ ఏకీభవిస్తున్నారు. రెండు శతాబ్దాలు సామ్రాజ్యవాదం పరిపాలించిన తర్వాత, భారతదేశం దారుణ దరిద్రా నికి నిదర్శనంగా తయారయింది. ప్రపంచంలో ఎక్కడా కని విని యెరుగని రీతిగా ప్రజాసామాన్యం నానాబాధలు పడుతున్నారు. ఈ అంశంలో ఎవ్వరికీ భేదాభి ప్రాయాలు లేవు.

ఈ దరిద్రం ఆ దేశానికి సహజమైనదికాదు. ఆ దేశంలో సహజ సంపత్తికి లోపములేదు. భారత ప్రజలు నివసిస్తున్న విశాల భూభాగం రత్నగర్భ. మితిలేని సహజ సంపత్తికలది. భూమి బహుసారవంతమైనది. వ్యవసాయోత్పత్తి సరిగా

చేసినట్టయితే, ఇప్పుడున్న జనాభాకన్న యెక్కువమందిని పోషించ వీలవుతుంది. ఇంతేకాక, ప్రధాన మూలపరిశ్రమలకు అవసరమైన ముడిసరుకు బొగ్గు, ఇనుము, నూనె, జలశక్తి, అందుతోపాటు ప్రజల ప్రతిభా సంపత్తి, వైజ్ఞానిక జిజ్ఞాస (భారతీయులు సామ్రాజ్య పాలనకుముందు ప్రపంచంలో పారిశ్రామిక విజ్ఞానంలో పేరుమోసిన వారు, అదింకా పూర్తిగానిర్మూలనం కాలేదు.)

ఇంత ఉన్నప్పటికీ, ఈసహజ సంపదను బొత్తిగా అభివృద్ధి చేయలేదు. ధనికవాదం ఎప్పటికీ ఉత్పత్తి శక్తులను సమగ్రంగా ఉపయోగించు కోలేదు. ఎన్నిటినో వ్యర్థం చేసివేస్తుంది. ఇది ధనికవాద లక్షణం. ఈలక్షణం భారత దేశంలో పరాకాష్ఠచెంది నగ్నంగా కనిపిస్తున్నది ఏ సామ్రాజ్యవాద దేశంలో కూడ ఇంత అభివృద్ధి శూన్యత కనిపించదు.

ఇటీవల ప్రొఫెసర్ బుచానన్ అనే అమెరికన్ పరిశీలకుడు, భారతదేశ ఆర్థిక పారిశ్రామికాభివృద్ధి విషయమై బ్రహ్మాండంగా 1934 వరకు పరిశోధించి ఈక్రింది విషయ నిర్ణయానికి వచ్చాడు.

"ఈ దేశంలో యంత్రవస్తు ఉత్పత్తికి కావలసిన ముడి పదార్థాలన్నీ ఉన్నాయి. అయినప్పటికీ వంద ఏండ్లకుపైగా ఇతర దేశాలనుండి అసంఖ్యాకంగా వస్తువులు ఇక్కడికి దిగుమతవుతున్నాయి. ఇతర దేశాల్లో పరిపూర్ణంగా అభివృద్ధి చెందిన అతిసులువైన పరిశ్రమలు కొన్నిమాత్రం ఏర్పాటయ్యాయి. ఇక్కడ ముడిపత్తి, జనుము, సులభంగా తీయవీలైన బొగ్గు, అత్యుచ్ఛస్థాయికి చెందిన ఇనుము, అనంతంగా ఉన్నాయి. ప్రపంచంలో ఏదేశానికీ లేనంత వెండి బంగారు నేలలో మూలుగుతున్నది. సరియైనపని దొరక్క అటమటించే జనం కావలసినంతమంది ఉన్నారు. ఇతరులు వచ్చి దిక్కులేనన్ని వస్తువు లమ్ముకొంటున్న తన మార్కెట్టే ఈ దేశానికి అతి సమీపంలో ఉండనేఉంది. ఇన్ని అనుకూలా లున్నప్పటికీ భారత దేశంలో, వందయేండ్ల తర్వాతకూడా జనాభాలో నూటికి ఇద్దరిని మాత్రమే పరిశ్రమలు పోషింప గలుగుతున్నాయి"

(డి. హెచ్. బుచానన్, "భారతదేశంలో ధనిక పరిశ్రమాభివృద్ధి" 1934, పుట 450)

భారతదేశ అర్థ శాస్త్రంలో ప్రముఖ బ్రిటిష్ పండితుడు డాక్టర్ వి. అన్‌స్టే (లండన్ విశ్వవిద్యాలయ వాణిజ్యోపన్యాసకుడు) భారత దేశంలో ఆర్థికాభివృద్ధి అరికట్ట బడిందని చెబుతున్నాడు.

"ఇది మరీ విచిత్రంగా కనబడుతుంది. 18 వ శతాబ్దివరకు భారత దేశపు ఆర్థికస్థితి ఎంతో అభివృద్ధిలో ఉండింది. ఆకాలంలో ఇతర ఏ దేశానికీ తీసిపోని పరిశ్రమలు వాణిజ్య వ్యవస్థ ఉండేది........

"అయినా బ్రిటిష్‌పాలనలో ఏ మాత్రం ఆర్థికాభివృద్ధి జరగలేదని చెప్పడం లేదు. బ్రిటన్ సంబంధంవల్ల కలిగిన ఫలితాలివి. చౌకగా వస్తు

వులు భారతదేశానికి దిగుమతవుతున్నాయి, ఛాలారకాలైన పంటలను, ఇంగ్లాండుకు ఎగుమతి చేసేందుకు పండించవలసి వచ్చింది. ఆనకట్టలు, రోడ్లు పరిపాలనావిధానం ఇవన్నీ ఏర్పడి పంట పండించేందుకు రవాణాచేసేందుకు వీలయింది. ముఖ్యంగా 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో భారతదేశపు మొత్తం ఉత్పత్తి, వ్యాపారం విపరీతంగా పెరిగింది.

"కాని ఈ మార్పులవల్ల పశ్చిమానికి భారతదేశానికి అదో విచిత్ర మైన పరస్పరాశ్రయత ఏర్పడింది. భారతదేశం కేవలం ముడిసరుకులను, ఆహారపదార్థాలను ఉత్పత్తిచేసి ఎగుమతి చేయసాగింది. మరియు బట్టలు, ఇనుము, ఉక్కు వస్తువులు, యంత్రాలు, రకరకాలైన ఇతరయంత్రోత్పన్న వస్తువులు దిగుమతిచేసుకోవలసిన స్థితిఏర్పడింది. పైగా ఉత్పత్తి పెరిగి నప్పటికీ, అందుతోపాటు జనసంఖ్యకూడ పెరిగింది కాబట్టి ప్రతిమనిషికి సగటున లెక్కవేస్తే ఉత్పత్తేమీ అంత పెరగలేదు. ఈ పరిస్థితులను గమనిస్తే భారతదేశంలో ఆర్థికాభివృద్ధి విరుద్ధమైనదన్న భావం మరింత ధృవపడుతుంది.

"19 వ శతాబ్ది అంతంవరకు బ్రిటిష్ పాలనవల్ల ఏర్పడిన ప్రజా సౌభాగ్యం ఆశాభంగం కలిగిస్తున్నదనడంలో ఏమాత్రం సందేహం లేదు."

**(వి. అన్‌స్టే, "భారతదేశ ఆర్థికాభివృద్ధి" 3 వ ముద్రణ, 1936. పీఠిక పుట 5)**

ఇక, పరిస్థితి మారిపోయిందని, పరిశ్రమలు బాగా పెంపొందుతున్నాయని చెప్పే ఇటీవలి కాలంలో ఏం జరిగింది? పైన వ్రాసినాయనే, 1931 నాటి సెన్సెస్ వల్లతేలిన అంకెలను పరిశీలించిన తర్వాతకూడ ఏమీ అభివృద్ధి జరగలేదనే నిర్ణయానికి వచ్చాడు.

"త్వరత్వరగా పారిశ్రామికాభివృద్ధి జరుగుతున్నదని చెప్పేందుకు ఈ అంకెలుతోడ్పడవు....వ్యవసాయంతో పోలిస్తే జరిగిన పరిశ్రమాభివృద్ధి ఏమాత్రం గమనించవలసింది కాదు. అంతేకాక, భారతదేశం ఇప్పటికి యే కాస్త అభివృద్ధిచెందిన దేశానికైనా అవసరమైన ఎన్నోవస్తువులకు, ఉద్యోగాలకు విదేశీయులమీదనే ఎక్కువగా ఆధారపడి ఉంది....సువ్యవస్థితమైన ఆర్థికజీవితం ఏర్పడలేదు. సామాన్యప్రజల జీవిత ప్రమాణం అతిహీన స్థితిలోనే ఉంది."

**(అదే పుస్తకం పుట 8)**

ఇలా ఏ ఇతర దేశంలో లేనంత స్థాయిలో, ఒకవేపు అపార సహజసంపద, మరోవేపు అఖండదారుణ దరిద్రం ఒకేచోటఉన్న యీ విరుద్ధ సంఘటనకు కారణ మేమిటి? బాగా పరిశ్రమల్లోను పారిశ్రామిక విజ్ఞానంలోను అభివృద్ధి చెందిన దేశం రెండువందల ఏండ్లు పరిపాలించిందర్వాత దేశ ఆర్థికాభివృద్ధి అరికట్టబడి పెరక్కుండా ఎందుకుంది?

ఈపరస్పర వైరుధ్యాన్ని అర్థంచేసుకోవాలంటే, భారత ప్రజల సాంఘిక, ఆర్థిక స్థితి విషయంలో సామ్రాజ్యవాదమెలా పనిచేసింది అన్న యదార్థాంశాలను మరింత సూక్ష్మంగా పరిశీలించడం అవసరమవుతుంది.

భారతదేశంలోని సహజ సంపదను అభివృద్ధిచేయలేక పోవడం మూలంగానే సామ్రాజ్యవాదం నేడుభారతదేశంలోఅవసానదశకువచ్చింది. పూర్వం ఇలాగే రెండువందల యేండ్ల క్రితం మధ్యయుగపు రాచరికంకన్నా బ్రిటిష్ దురాక్రమణదారుల ఆర్థికస్థితి ఉత్తమమైందిగనకనే అప్పుడు వారు జయించ గలిగారు. (ఆదురాక్రమణలో జరిగిన విధ్వంసన విచ్ఛిన్నత చాల ఉన్నప్పటికిన్నీ).

భారతదేశంలోని పాత పాలనాయంత్రపు సాంఘిక రాజకీయ అసమర్థత క్రమక్రమంగా మరింత బయల్పడడం, మరో కొత్తస్థితి ఉదయిస్తుండటం నేడు కనిపిస్తున్నది. భారతప్రజలు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేస్తు న్నారు. ఇదే 20 వ శతాబ్దిలో భారతరంగస్థలంలో ప్రముఖంగా కనబడుతున్నది.

పరిస్థితి మారేందుకు తగిన పరిస్థితులు పరిపక్వస్థితికి వచ్చాయి. ఇందులో భారత దేశంలో ఎదుగుబొదుగుల్లేక శిథిలావస్థలో ఉన్న సామ్రాజ్యవాదం పోయి. ఆ స్థానంలో ఆధునికపద్ధతుల్లో పురోగమించిన నూతనప్రజా భారతదేశం నిలబడు తున్నది. ఇందులో సందేహం లేదు.

## 4. భారతదేశంలో నూతన చైతన్యం

ఇలా అస్తమిస్తున్న అసమర్థ సామ్రాజ్యవాద పాలనాన్ని వ్యతిరేకిస్తూ భారతప్రజలు విప్లవం నడుపుతున్నారు. ఆ తిరుగుబాటు క్రమాభివృద్ధిచెందుతూ నేడు విశ్వజనీన విప్లవంగా మారింది.

భారత జాతీయోద్యమం * గత శతాబ్దంలో చాలదశలను స్వరూపాలను గడిచి అభివృద్ధిచెందింది. 19 వ శతాబ్ది మూడోపాదం నుండి ఇప్పటి ఆధునిక రూపాలలో అది పెరుగుతున్నది. చట్టబద్ధమైనట్టి, చట్టవ్యతిరేకమైనట్టి, శాసన సభాపోరాటరూపమైనట్టి, విప్లవాత్మకమైనట్టి అనేక రూపాలలో అది పెంపొం దింది. ఆ ఉద్యమంలో కన్సర్వేటివ్‌లు, మతదృష్టికలవారుకూడ ఉండినారు. ఆధునికయుగంలో అందులో సోషలిస్టులు కమ్యూనిస్టులుకూడ ఉన్నారు

* ఇక్కడా, తర్వాతి పుటల్లోనూ భారతజాతి, భారత జాతీయోద్యమం అనేమాటలు వ్రాశాను. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, తమ రాజకీయభవిష్యత్తును తీర్చి దిద్దు కునేందుకు భారతప్రజలు నడుపుతున్న పోరాటంలోని ఐక్యతను వివరించేందుకే ఆమాటలు వాడాను. ఈమాటలనుబట్టి స్వతంత్ర భారతదేశంయొక్క భావిరాజ్యాంగ పద్ధతెలా ఉండా లన్న సమస్యపై తీర్పుచెప్పడం ఉద్దేశంకాదు. భావి స్వతంత్ర భారతదేశం వివిధ జాతుల లక్షణాలతో ఏర్పడవచ్చు. ఈ ప్రత్యేక సమస్యను తర్వాత ప్రత్యేకంగా పరిశీలిస్తాను.

యాభైఏళ్ళ క్రితం, చట్టబద్ధమైన జాతీయోద్యమం వాంఛ, కేవలం సామ్రాజ్యహద్దులలోనే పరిమితమైన సంస్కరణలు మాత్రమే ఆ ఉద్యమ నిర్మాణం అప్పటికి చదువుకున్న కొందరు మధ్యతరగతి వారికి చెందినది మాత్రమే. కాని 20 వ శతాబ్ది ఆరంభంనుండి ఆఉద్యమలక్ష్యమూ, కార్యక్రమమూ క్రమంగా విశాలమవుతూవస్తున్నది. మొదటియుద్ధం తర్వాత జాతీయోద్యమం పూర్తిగా ప్రజాఉద్యమంగా తయారయింది. వారి వాంఛ సంపూర్ణ స్వపరిపాలనంగా ముందుకు నడిచింది 1929 తర్వాత కడపటికి తమలక్ష్యం సంపూర్ణ స్వతంత్రమనీ, బ్రిటిష్‌సామ్రాజ్యంనుండి విడిపోవటమనీ, స్పష్టంగా జాతీయోద్యమం నిర్వచించింది

భారతదేశం మేల్కొంటున్నది. వేలాది ఏండ్లుగా వరసగా దాడుల పరంపరకు ఆహుతవుతూ వచ్చిన భారతప్రజలు నేడు స్వతంత్రంగా నిలబడి, స్వతంత్రులుగా ప్రపంచంలో తమపాత్ర నిర్వహించేందుకు ఆయత్తమవుతున్నారు. ఈ నూతన చైతన్యం మనజీవిత కాలంలోనే అమాంతంగా పురోగమించింది. గత పాతికేళ్ళలో ఒకనూతన భారతదేశం ఉద్భూతమైంది. ఇంకా ఎన్ని ఆటంకాలను దాటవలసి ఉన్నప్పటికి, భారతదేశం స్వతంత్రాన్ని త్వరలో విజయవంతంగా సాధిస్తుందని ప్రపంచ ప్రజలందరూ గుర్తించిన అంశం. భారతదేశం స్వతంత్రమైతే వలస ప్రజలపై ఆధునిక సామ్రాజ్యవాదం చేస్తున్న పెత్తనానికి పునాది పడిపోతుంది

ఒకప్పుడు తీవ్ర దమననీతిని ఉపయోగిస్తూ, మరొకప్పుడు ఏవో రాజ్యాంగ సంస్కరణలనిస్తూ, ఇంకొకప్పుడు చాకచక్యంతో విభేదాలను వుపయోగించుకొని నాటకమాడుతూ, మరొకప్పుడు ఉద్యమంలోని ఉన్నత నాయకత్వాలతో సంప్రదిస్తూ—ఇలా ఏదోఒక సాధనంతో జాతీయ వుద్యమాన్ని ఎదుర్కొనేందుకు, ఆపేందుకు, విచ్ఛిన్నం చేసేందుకు, నైతికబలం పోగొట్టేందుకు, ఆటంకపరచేందుకు మాత్రమే బ్రిటిష్ ప్రభుత్వం గత యిరవై అయిదేళ్ళుగా ప్రయత్నిస్తూ వచ్చింది. బ్రిటిష్ సామ్రాజ్యవిధానం అతినైపుణిగలది ; సమయానుసారం మారగలది; మంచిఅనుభవంగలది. కాబట్టే దమననీతిని సంస్కరణలను కలిపి వీలైన సాధనంతో, సరైన పరిస్థితులకు అనుగుణంగా మారి నిజమైన అధికారాన్ని మాత్రం చేతిలో వుంచుకుని పీడనను యధాప్రకారం కొనసాగిస్తూ చూడడానికిమాత్రం చాల్తవుదారంగా తీవ్రమైన సంస్కరణలు ప్రవేశపెట్టింది. వలస ప్రజలు క్రమక్రమంగా శాంత పద్ధతులతో స్వరాజ్య స్వతంత్రాలవేపు పురోగమించే అవకాశముందని ఉదార సామ్రాజ్యవాదులూ, సంస్కారవాదులూ చెప్పే సిద్ధాంతాలకు ఆచరణలో పరీక్షాసమయం వచ్చింది. ఈ తగాదా ఫలితంగా కేవలం భారత ప్రజల భవిష్యత్తునేకాక, బ్రిటిష్ సామ్రాజ్య భవిష్యత్తునుకూడ చరిత్ర నిర్ణయిస్తుంది.

గడచిన పాతికేళ్ళ చరిత్రచూస్తే సామ్రాజ్యవాదులు వేసిన ఎత్తుగడలన్నీ—

వాళ్ళ సంస్కరణలూ, దమననీతి ఒకటి తర్వాత ఒకటిగా ప్రయోగించడం, సమయానుకూలంగా మారడం—ఇవన్నీ మహత్తరవేగంతో ముందుకురుకుతున్న జాతీయోద్యమ ప్రవాహాన్ని విచ్ఛిన్నం చేయలేకపోయాయని రుజువయింది. ఈ సామ్రాజ్యవాదుల ప్రయత్నాలన్నీ ఉద్యమాన్ని ఆపలేకపోవడమేకాక భారత సమస్యకు ఏ విధమైన పరిష్కారాన్ని కూడ చూపలేకపోయాయి.

సామ్రాజ్యవాదపాలనలో సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల్లో వేరులు పారి పొటమరిల్లుతున్న విరోధాలు, వ్యత్యాసాలు పదే పదే సామరస్యం చేకూర్చాలనే ప్రయత్నాలను భగ్నం చేస్తున్నాయి. పైన బాగా అభివృద్ధిచెందిన తీవ్ర ధనికవర్గ పీడనాపాలనలు, క్రింద అతిహీనమైన సామాజికబాధలూ, అధ్వాన్నస్థితీ-ఈరెండు విభిన్నస్థితులు ఒకదానితో ఒకటి కారణ కార్యభావాలుగా పడుగుపేకలగా అల్లుకొని పొయ్యాయి. కొండమీద సామ్రాజ్యవాద పీడకులూ, అట్టడుగున కష్టజీవి కళేబరాలూ, ఉన్న ఈరెండు విరుద్ధ స్థితులకు మధ్య సంధిదశలో ఉన్న వర్గాలు అటూయిటూ కాని పరాశ్రయజీవులూ, రెండోరకపు పీడనాయంత్రాలూ, కుళ్ళి చెత్తయి పోతున్న పాతశక్తులూ, ఉద్భూతమౌతున్న నూతనశక్తులూ, బయలు పడుతున్నవి. వీటన్నిటిద్వారా, రోజు రోజుకు పెంపొందుతూ ప్రజల జాతీయ చైతన్యం ఉజ్వలమవుతున్నది. శ్రమజీవుల ఆర్థికవాంఛలు పెరుగుతున్నవి. ఎటు తిరిగినా సామాజిక బాంబులతో నిండిన ప్రత్యేక పరిస్థితియిది.

భారతదేశ ప్రధాన సమస్య కేవలం జాతీయం మాత్రమేకాదు. సాంఘికమైనదికూడాను. సామ్రాజ్య వాదాన్ని భారత ప్రజలు ధిక్కరించడమంటే స్థూలంగా అయిదోవంతు మానవలోకం విదేశ పాలననుండి స్వతంత్రం అపేక్షిస్తున్నదని అర్థం చేసుకోవచ్చు. కాని ఆ స్వతంత్రవాంఛ కేవలం రాజకీయ స్వతంత్ర వాంఛకన్నా గంభీరమైనది. ఇదికేవలం దాని రాజకీయ స్వరూపం మాత్రమే. సూక్ష్మంగా పరిశీలిస్తే ఆ స్వతంత్రవాంఛ అంతరాళంలోపడినా వ్యవస్థనే వారు ధిక్కరిస్తున్నారని కనబడుతుంది. లండన్ పట్టణంలో ఆ పీడనా వ్యవస్థకు మూలపీఠమున్నా, దానితో అతి సమీపంగా పెరిగిన భారతదేశంలోని పీడనా శక్తులను కూడ ఆ వాంఛ సవాలు చేస్తోంది. ఒకదానిని వదలి ఇంకొక దానిని ఉంచడం వల్లకాదు.

ఇలాగ భారత సమస్య సాంఘికమైనది. అత్యధికసంఖ్యాకులు అర్థాకలితో అతిదరిద్రస్థితిలోవున్న 40 కోట్ల భారతీయుల సమస్యయిది. వారి నీ నీచస్థితికి తెచ్చిన సమాజవ్యవస్థను బలవంతంగా వారిపై రుద్దుతూ వారి ప్రాణాలను తన గుప్పిట పట్టుకొన్న విదేశపాలనక్రింద ఆభారతీయులు పడివున్నారు. ఈ కోటాన కోట్ల ప్రజలు జీవితంకోసం, జీవిత సదుపాయాలకోసం, ప్రాధమిక స్వతంత్రం కోసం పోరాటం సాగిస్తున్నారు. వారి పోరాటము వారెలా తమలక్ష్యాన్ని సాధించుకో గలుగుతారు అన్నదే భారతదేశసమస్య.

భారత ప్రజాపోరాటంయొక్క తక్షణలక్ష్యం, జాతీయ స్వతంత్రం, జాతీయ స్వతంత్రసాధనం. ప్రజాస్వామ్య హక్కయిన స్వరాజ్యం. కాని ఈ లక్ష్యం మరింత లోతులకుప్రాకిన సామాజిక పోరాటంయొక్క, భారతదేశంలో నడుస్తున్న సామాజిక విప్లవముయొక్క ప్రథమదశనుమాత్రమే ప్రతిబింబిస్తున్నది. జాతీయ సాంఘిక సమస్యలు అతిసన్నిహితంగా కలిసిపోయ్యాయి ఈ పరస్పర సంబంధాన్ని అర్థంచేసుకోవడంలోనే భారతపరిస్థితి అవగాహనకు సాధనం దొరుకుతుంది.

సామాజిక ఛాందసత్వం (కన్సర్వేటిజం) ఇప్పటికీ భారతదేశంలో బాగా నాటుకుని ఉన్నది. జాతీయోద్యమ స్వరూప సమస్యల నిదెంతో మారుస్తున్నది. అలాంటి ఛాందస భావప్రాబల్యం అభివృద్ధినిరోధక దృక్పథాలూ జాతీయోద్యమ పురోగమనాన్ని విచ్ఛిన్నంచేసి దుర్బలపరుస్తాయి. దేశాలను "నాగరికం చేసే" ఉద్యమం మాదంటూ తమ దోపిడీని దాచుకోవాలని సామ్రాజ్యవాదం పుక్కిటి పురాణాలను తయారుచేసినట్టుగానే, దానికి వ్యతిరేకంగా అలాంటి పాత పుక్కిటి పురాణాలు. హేతువాదరహిత ఊహలూ, బయలుదేరకుండా మనం జాగర్త పడ వల .ుంటుంది.

ఈ సామ్రాజ్యవాదుల కటుకథకు ప్రతిగా భారతదేశంలోని వెనుకచూపుగల వర్గాలవారు కొందరు మరో పుక్కిటిపురాణం సృష్టించ ప్రయత్నించారు. సామ్రాజ్యవాదుల పరిపాలనవల్ల కలిగిన కష్టనష్టాలకు వ్యతిరేకంగా బ్రిటిష్‌పాలనకు పూర్వం భారతదేశంలోని స్వర్ణయుగాన్ని చిత్రించిచూపారు. బ్రిటిష్‌పాలన రాగానే కుళ్ళిపోయిన సమాజవ్యవస్థలోని పాడుపద్ధతులను స్థాపించాలని వారి భావం. చారిత్రికంగా వివరించటం కాక, భారతదేశ ప్రాచీనచరిత్రలో మిగిలిన అభివృద్ధి నిరోధకస్థితిని ఆదర్శప్రాయమని, ఉజ్జ్వలమని చెప్పసాగారు. ఆ పద్ధతులు అభి వృద్ధిని అరికట్టి, ప్రజాచైతన్యాన్ని అణగద్రొక్క. ఐక్యతను భంగపరుస్తాయి, ఆ అభివృద్ధినిరోధక శవప్రాయ ఛాందసాచారములనుంచి, జాతీయచైతన్యాన్ని నిర్మించాలని వారు ప్రయత్నిస్తున్నారు. ఇలా వారు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని పాశ్చాత్య నాగరికతకే వ్యతిరేకంగా మార్చాలని చూస్తున్నారు. వారు వెనుకవేపుచూస్తున్నారు, కాని, ముందుకు చూడటంలేదు

ఇలా చేయడం జాతీయ సంఘటనను బలపరచడం కాదు సరికదా దుర్బల పరచడమే అవుతుంది సామ్రాజ్యవాద పాలనవల్లనే కాక, ప్రాచీన చరిత్రనుండి కూడ సంప్రదాయసిద్ధమైన భారత సాంఘిక లోపాలను గమనించకపోతే వచ్చే లాభమేమీ లేదు. సామ్రాజ్యవాదం ఆ సా. ఘిక అభివృద్ధి నిరోధక భావాలను తొలినుంచీ మరింత పెంపొందిస్తూ వచ్చింది. దాని స్వభావమే అది. అలాం టప్పుడు, సాంఘిక దురాచారాలను, అర్థంలేని విభేదాలను సామ్రాజ్యవాదంకన్నా గట్టిగా తొలగించడానికి ప్రయత్నించడం మూలంగానే జాతీయ సంఘటితశక్తి మరింత బలపడుతుంది. సామ్రాజ్యవాదం స్వభావసిద్ధంగా ఉన్న సంఘ లోపాలను

సహించడమేకాక వాటిని మరింత ప్రోద్బల పరుస్తుందికూడ. ఎందుకంటే ఆ అభివృద్ధినిరోధక లోపాలు సామ్రాజ్యవాదానికి పునాదిగా పనికివస్తాయి.

ఎంతవరకైతే, మరింత అభివృద్ధికరమైన సామాజిక, ఆర్థిక వ్యవస్థకు ప్రతినిధిగా సామ్రాజ్యవాదం ఉండినదో, అంతవరకు ఎన్నిదురంతాలు, వినాశమూ చేసినా జయించగలిగింది. నేడు భారతప్రజల అభివృద్ధికర సామాజిక శక్తులకు జాతీయ సంఘటన ప్రాతినిధ్యం వహిస్తున్నది. కాబట్టి, సామ్రాజ్యవాదంకన్నా ఇదెంత ఉన్నత వ్యవస్థకు ప్రతినిధిఅయితే వారి విజయం అంత తథ్యమవుతుంది.

రానురాను ఎక్కువవుతున్న సంకటావస్థ నేడు దేశాన్నెదుర్కొంటున్నది. అందువల్ల, ఆంతరంగిక సామాజిక వ్యత్యాసాలు, విరోధాలు, సమస్యలు ముందుకు వస్తున్నవి. అందువల్ల ప్రపంచంలో ఎవ్వరూ ఎదుర్కొని అతిప్రధాన విప్లవ కర్తవ్య బాధ్యత నేడు భారత ప్రజలమీద పడుతున్నది. భారతదేశంలో వేరులు పారిన హీనస్థితిని తరతరాల దాస్యంవల్ల ఏర్పడిన కల్మషాన్ని కడిగివేయ వలసి ఉంది. అరికట్టబడిన అభివృద్ధిని ఛాందస సంఘదురాచారాలను తొల గించాలి. ఈసమస్యలన్నీ దేశస్వాతంత్ర్యంవచ్చిన మరుక్షణమే పరిష్కారంకావు. అంతేగాక, అవిపూర్తిగా బయటపడతాయి. వానిని తొలగించడం ప్రధాన ప్రథమకర్తవ్య మవుతుంది. శ్రమజీవులు చైతన్యవంతులై తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకోగల స్థితికివచ్చి ఈ తగాదాలను, సమస్యలను పరిష్కరించుకో వలసి ఉంటుంది. నేటి ఆర్థిక, నాగరికతల దుస్థితినుండి భారతదేశాన్ని అత్యుచ్చ స్థితినందిన దేశాల స్థితికి తేవలసి ఉంటుంది. ఈ కార్యక్రమంద్వారా భావిప్రపంచ సోషలిస్టు అభివృద్ధి కార్యంలో, తూర్పుపడమరల వ్యత్యాసాన్ని తొలగించడంలో భారతప్రజలు ఊహింపరాని ఉజ్వలపాత్రను నిర్వహించనున్నారు.

వర్గసమాజంలోని నాగరికత సభ్యతల ప్రతిదశా — ఆదిమ స్థితినుండి అత్యుచ్చస్థితివరకు — నేడు భారతదేశంలో ఉన్నవి. అందువల్లనే, భారత వ్యవహారాలలో సాంఘిక, రాజకీయ, సభ్యతా సమస్యలు అతి తీవ్రతర స్థితిలో కనిపిస్తున్నాయి. విభిన్న మతాలకు, జాతులకు ఉన్న సంబంధాల సమస్యలు, తీర్చాలి; కుళ్ళిపోయి కంపు గొడుతున్న శుద్ధఛాందస పద్ధతులతో పోరాడాలి; విద్యాభివృద్ధికై పాటుబడాలి; స్త్రీల స్వతంత్రంకోసం పోరాడాలి; వ్యవసాయాన్ని, పరిశ్రమలను పునరుద్ధరించి పల్లెలకు పట్టణాలకు సామరస్యం కుదర్చాలి. అనేక రూపాలలో అతి తీవ్రంగా ఉన్న వర్గతగాదాలను తీర్చాలి. జాతీయతకు సోష లిజానికి ఉన్న సంబంధాల సంగతి చూడాలి. ఇలాంటి అనేక ఆధునిక ప్రపంచ సమస్యలు అతితీవ్రరూపంలో అత్యవసరంగా పరిష్కరించవలసిన స్థితిలో ఉన్నవి.

ఈ వివిధసమస్యలు వేనంతటవి పరిష్కరింప వీల్లేదు. కేంద్రదేశస్వతంత్ర సమస్యతో ఇవి సంబద్ధమైఉన్నవి అప్పుడు నూతన భారత నిర్మాణానికి తగిన

మనుష్య భౌతికశక్తులు విడుదలపొంది ముందుకువస్తాయి. భారతసమస్యలను పరిష్కరించడమంటే, ప్రపంచప్రజలందరినీ ఎదుర్కొంటున్న తీవ్రసమస్యలను పరిష్కరించడమన్నమాట.

దురాక్రమణ దారులుగాకాక, భారతప్రజలు ప్రపంచచరిత్రలో, సభ్యత, వైజ్ఞానిక, కళా, పరిశ్రమ రంగాలలో ఇప్పటికెంతో ప్రముఖపాత్రను నిర్వహించారు. ఇప్పుడీ భారతప్రజల జాతీయ, సాంఘిక స్వతంత్రప్రాప్తి మానవలోక సౌభాగ్యానికి మరింత దోహదం కాగలదు.

# ఒ క టో భా గ ం

## భారతదేశం ఎలా ఉంది - ఎలా ఉండవలసింది

### అధ్యాయం II : భారతదేశ సంపద - దరిద్రము

1. భారతదేశ సంపత్తి
2. భారతదేశ దారిద్ర్యం
3. జనాభా ఆధిక్యత అనే భ్రమలు

### అధ్యాయం III : రెండు ప్రపంచాల వ్యత్యాసం

1. సోషలిజం, సామ్రాజ్యవాదపాలనలో ఇరవై యేళ్ల
2. మధ్య ఆశియా రిపబ్లిక్కుల అనుభవాలు

# రెండో అధ్యాయం

# భారతదేశ సంపద - దరిద్రము

"భారత దేశంగూర్చి మరీ కొట్టొచ్చినట్టు కనిపించే అంశమేమంటే : ఆ దేశం అతిసమృద్ధమైనది; మరి ప్రజలేమో దరిద్రులు."

(యమ్. యల్. డార్లింగ్, "పంజాబు రైతు ఆస్తి-అప్పులు" 1925, పుట 73)

నేటి భారతదేశ పరిస్థితిలో రెండు అంశాలున్నవి. ఒకటి దేశసంపద — సహజసంపద, కావలసినన్ని ఆధారాలు. ఇప్పుడున్న జనాభాకంతటికీ చాలిన భౌతిక సౌభాగ్యం, ఇంతకన్నా జనాభా ఎక్కువ పెరిగినా కావలసినంత సహజ సంపద.

ఇంకొకటి దేశదారిద్ర్యం — జనసంఖ్యలో ఎక్కువమంది దరిద్రులు. పాశ్చాత్య దేశపరిస్థితులతో పరిచయమున్న వారెవ్వరూ ఊహించుకోనుకూడా లేనంత నిరుపేదతనం.

ఈ రెండు అంశాలమధ్యే భారతదేశ సామాజిక, ఆర్థిక వ్యవస్థకుచెందిన సమస్యలున్నవి.

## 1. భారతదేశ సంపద

భారతదేశం దరిద్రప్రజల దేశం, కాని దరిద్రదేశంకాదు.

వ్యవసాయాన్ని, పరిశ్రమలను అభివృద్ధిచేసి జనుల సౌభాగ్యాన్ని అత్యుచ్చ స్థితికి కొనిపోగలిగిన సహజసంపత్తి కావలసినంత ఉంది. అంతమాత్రమేకాదు, బ్రిటిష్ పరిపాలనకు పూర్వం, ఈ దేశ ఆర్థికస్థితి అప్పటి ప్రపంచస్థితిలో ప్రముఖ స్థానంలో ఉండినది.

పూర్వకాలపు భారత సంపత్తినిగూర్చి ఇతరదేశవాసులు కథలుగా చెప్పు కునే సంగతి అందరికీ తెలిసిందే. అలాంటి కథలను కొంత అనుమానంతోనే వదలాలి. ఎందుకంటే, ఆరోజుల్లో ధనవంతుల చేతుల్లో, బలశాలులచేతుల్లో చేరు కున్న ధనంపైపే చూచేవారు. కాని, ఆ ధనం ప్రజలందరికి ఎలా పంపకమైంది ? అన్న దృష్టితో చూచేవారుకాదు. ఇలాంటివారికి నిదర్శనం క్లైవు. ఈయన బెంగాల్ పూర్వ రాజధాని అయిన ముర్షిదాబాదుకు 1757 లో వెళ్లాడు. ఇలా వ్రాశాడు:

"ఈ పట్టణం వైశాల్యంలో, జనసంఖ్యలో, ధనంలో లండన్‌పట్టణ మంత ఉంది. కాని ఒక భేదముంది. ఈ పట్టణంలోని వ్యక్తులు లండన్‌లోనివారికన్నా, మహత్తర సౌభాగ్యంతో తులతూగుతున్నారు.
(భారతదేశ ఇండస్ట్రియల్ కమిషన్ రిపోర్టులో ఉదహరించబడినది, పుట 249)

ఇలాంటివానిలో కొన్ని అతిశయోక్తులు వ్యత్యాసాలు ఉంటాయనుకున్నా, సరైన శాస్త్రీయసాక్ష్యం లేకపోయినా, ఒక సంగతి గమనించొచ్చు. 17, 18 వ శతాబ్దులలో భారతదేశంలో సంచారం చేసినవారు నేటి దుస్థితికి ఏమాత్రం సంబంధంలేనట్టి గ్రామసౌభాగ్యాన్ని పదేపదే చెబుతూవచ్చారు. * 17 వ శతాబ్దిలో భారతదేశంలో తన యాత్రను గురించి రాస్తూ టావర్నీర్ ఇలా అన్నాడు:

---

* డబ్లియు. హెచ్. మూర్లాండు, "అక్బర్ మరణకాలంలో భారతదేశం (1920) "అక్బరునుండి ఔరంగజేబు వరకు" (1923) అనే తన పుస్తకాల్లో 17 వ శతాబ్దంలోకూడ భారతదేశ జనసామాన్యం దరిద్రం అనుభవించేవారని రుజువు చేయడానికి సాక్ష్యం సమకూర్చేందుకే ప్రయత్నించాడు. అయినప్పటికీ తన పరిశీలన సారాంశం తేల్చవలసివచ్చేప్పటికి "అక్బర్ మరణకాలంలో భారతదేశం" అనే పుస్తకంలో "భారతదేశ సంపద" అనే అధ్యాయంలో ఇలా రాయకతప్పలేదు.

"భారతదేశం మొత్తంమీద తీసుకుంటే గ్రామప్రజల సగటు మనిషి ఆదాయం ఏమంత పెద్దమార్పు చెందలేదు ; బహుశా అప్పటికన్నా తక్కువ ఉండొచ్చు. అంతకన్నా కొంత ఎక్కువైనా అయిఉండొచ్చు. ఇందుకే అవకాశమెక్కువ. కాని ఏమైనా ఆర్థికస్థితిలో స్పష్టమైన మార్పును సూచించేంత భేదం ఉండదు." (పుట 286)

"ప్రాథమిక ఉత్పత్తిలో వ్యవసాయం ఇపుడంతే పంటనిచ్చేది. సగటు ఆదాయం ఇప్పటంతే వుండేది. అడవుల ఆదాయం ఇంతే. చేపల పరిశ్రమ ఇంతకన్నా ఎక్కువుండేది. లోహాలు ఇప్పటికన్నా తప్పకుండా తక్కువే. - ఇక చేతిపనులు వ్యవసాయ పరిశ్రమలు పెద్దగా మారలేదు : వివిధ చేతిపరిశ్రమలవల్ల, ఉన్నినేతవల్ల, నౌకానిర్మాణం తప్ప ఇతర రవాణాయంత్రోత్పత్తివల్ల వచ్చే ఆదాయం అప్పటికన్నా ఇప్పుడు పెరిగింది. కాని పట్టునేత ఇప్పుడు పడిపోయింది........నష్టాలకన్నా మిగత లోహ - రవాణా ఉత్పత్తుల వల్ల చిన్న చేతిపరిశ్రమలవల్ల ఏర్పడినలాభం ఎక్కువేకాని ఈ లాభాలు వేరుగాచూస్తే పెద్దవైనా వ్యవసాయాదాయంప్రక్క ఉంచితే మరీ స్వల్పంగా కనిపిస్తాయి." (పుట 287)

"అప్పటి నౌకానిర్మాణం, విదేశవ్యాపారం, బట్టల పరిశ్రమ (మూలు, జనపనార) అనే మూటిద్వారా వృత్తులను చూచినా ఇప్పటికన్నా దేశం మొత్తంమీద సగటు ఆదాయం ఎక్కువ చేసిఉండవని చెప్పొచ్చు." (పుట 293)

"భారతదేశం ఆ కాలంలో (అక్బర్ కాలంలో) ఇప్పటికన్నా ఎక్కువ ధనవంతం కావేకాదు. బహుశా కొంత తక్కువే కావచ్చు" (పుట 294 )

ఈ ప్రతిపక్షవాదం ఎంత కష్టపడిచేసినా మూడు శతాబ్దాల తర్వాత (అదే మూడు శతాబ్దాల్లో యూరోపుదేశాల అభివృద్ధికి దీనికున్న వ్యత్యాసం చూడండి) కూడ అదేస్థితిలో ఉన్నదని మాత్రమే తేలుతోంది, అదే ఆ వాదం చెబుతున్నదల్లా — అంటే, ప్రపంచం మొత్తం మీద జరిగిన అభివృద్ధితో దీన్ని పోల్చిచూస్తే, ఇదెంత శిథిలదశో స్పష్టంగా కనబడుతుంది.

"మరీ చిన్న పల్లెలోకూడ బియ్యం, పిండి, వెన్న, చిక్కుడు మొదలైన కాయగూరలు, చక్కెర, రకరకాలైన మిఠాయీలు కావలసినవన్ని దొరుకుతాయి."

(టావర్నీర్ "భారతదేశ సంచారం" ఆక్స్ఫర్డు యూనివర్శిటీ ప్రెస్ ప్రచురణ, 1925, వాల్యూం 1, పుట 238.)

వెన్నీసుకు చెందిన మనోచీ 17 వ శతాబ్దంలో ఔరంగజేబుకు ప్రధాన వైద్యుడుగా పనిచేశాడు. ఆయన తన 'స్మృతులలో' భారతదేశ సౌభాగ్యాన్ని రాష్ట్రాలవారీగా ఆనందతన్మయుడై వర్ణించాడు; అందులో బెంగాలు తీసుకోవచ్చు. ఎందుకంటే, ఆ రాష్ట్రాన్ని తర్వాత క్లైవు మొదలైనవారు సర్వనాశనం చేయడం, నేటి దారుణ దరిద్రస్థితి బాగా తెలుసుకొన వీలవుతుంది.

"మొగలురాజ్యాలన్నింటిలోనూ బెంగాలునుగూర్చి ఫ్రాన్సులో బాగా తెలుసు. అక్కడినుండి వస్తువులు యూరోపుకు సరఫరాకావడం, బెంగాలు సమృద్ధికి నిదర్శనం. ఈజిప్టుకంటె బెంగాలు దేనిలోనూ తీసిపోదనీ, పైగా సిల్కు, నూలుబట్టలు, చక్కెర, నీలిమందు వీనిలో దానిని మించుతుందనీ మనం చెప్పవచ్చు. ఇక్కడ పళ్ళు, పప్పుధాన్యాలు, ధాన్యాలు, మజిలిన్‌లు, జలతారు పట్టుబట్టలు మొదలైన అన్ని వస్తువులూ అత్యధికంగా ఉన్నాయి."

(యఫ్. యఫ్. కాట్రూ "మొగల్ సామ్రాజ్యచరిత్ర: ఔరంగజేబుకు 40 ఏళ్ళు వైద్యుడుగాఉన్న మనోచీ స్మృతులనుండి ఉపహరింపబడినది. జాన్ బోయర్ ప్రచురణ, లండన్, 1709.)

అలాగే ఫ్రెంచి యాత్రీకుడు బెర్నీ 1660 సం॥ల మధ్య రెండు తూర్లు బెంగాలు వెళ్ళాడు. మొగల్‌సామ్రాజ్య విచ్ఛిత్తికి ముందు తాను చూచిన సంగతులు వ్రాశాడు.

"రెండుతూర్లు బెంగాలులో సంచారంచేసి తెలుసుకున్న సంగతులనుబట్టి, బెంగాలు ఈజిప్టుకన్నా ధనవంతమైనదని విశ్వసిస్తున్నాను. ఇక్కడనుండి, పట్టునూలు బట్టలు, బియ్యం, పంచదార, వెన్న ఎగుమతవుతున్నాయి. ప్రజలకు కావలసినంత గోధుమ, కూరగాయలు, గింజలు, కోళ్ళు, బాతులు, అక్కడ ఉత్పత్తవుతున్నాయి. బెంగాల్లో పందుల గుంపులు, గొర్రెల, మేకల మందలు విపరీతంగా ఉన్నాయి. రకరకాల చేపలు అసంఖ్యాకంగా ఉన్నాయి. నౌకాయానానికి, పంటభూములకు ఎంతో శ్రమించి ఏనాడో గంగనుండి త్రవ్విన చాలా కాలవలు రాజమహల్‌నుండి సముద్రం వరకూ ఉన్నవి."

(బెర్నీ, పర్ విలియం విల్‌కాక్సు ఉదహరించినది "బెంగాలులోని ప్రాచీన జల వసతులపద్ధతి గూర్చిన ఉపన్యాసాలు" కలకత్తా విశ్వవిద్యాలయం, 1930, పుట 18–19.)

దొరికిన సాక్ష్యాన్నిబట్టి, జనశ్రుతిని బట్టి చాలా సౌభాగ్య వంతంగా ప్రజ లుండేవారని తెలుస్తున్నప్పటికీ, బ్రిటిష్ పాలనకు ముందు భారత దేశంలో సామాన్య ప్రజల జీవితప్రమాణం ఎలాఉందన్నది వివాదాస్పదమైనదిగానే ఉన్నది.

బ్రిటిష్ పాలనకు ముందు, సమకాలీన ప్రపంచ స్థాయినిబట్టి భారతదేశం పారిశ్రామికంగా అత్యుచ్చ స్థితిలో ఉండినదన్న విషయంమాత్రం అందరూఅంగీక రించారు. ఇందులో ఏ మాత్రం వివాదాంశంలేదు. ఇండియన్ ఇండస్ట్రియల్ కమిషన్ (1916—18) తమ నివేదికను ఈ క్రింది విధంగా ప్రారంభించారు :

"ఆధునిక పారిశ్రామిక వ్యవస్థకు పుట్టినిల్లయిన యూరోపు పశ్చిమ భాగంలో అనాగరిక ఆదిమ జాతులు నివసిస్తున్న రోజుల్లో, భారతదేశం రాజుల ధనానికి ఆ శిల్పుల కళాకౌశల్యానికి ప్రఖ్యాతమైన స్థానం సంపాదిం చింది. తర్వాత చాలా కాలానికి, తొలుత పశ్చిమ వర్తకులు భారతదేశానికి వచ్చినప్పుడుకూడ, ఈ దేశ పారిశ్రామికాభివృద్ధి, ఉన్నతస్థాయిలో ఉన్న ఏ యూరోపుదేశం కన్నా ఏమాత్రం తక్కువ స్థితిలోలేదు."

(ఇండియన్ ఇండస్ట్రియల్ కమీషన్ రిపోర్టు, పుట 6)

ఆ కమీషన్ అధ్యక్షుడు, పండితుడు అయిన సర్ థామస్ హాలండు, భారత లోహసంపద విషయంలో 1908 లో ఇలా వ్రాశాడు.

"ఇక్కడివారు తయారుచేసిన ఇనుము అత్యుత్తమమైనది. యూరో పులో నేడు ఉత్తమమైన ఉక్కు వస్తువులు తయారుచేసే పద్ధతులు అప్ప టికే ఈదేశంలో ఉన్నాయి. కళావంతములైన వస్తుసంతతిని రాగి, కంచు వీనితో తయారుచేసేవారు. వీటన్నిటివల్ల భారతదేశం ఒకప్పుడు లోహ ప్రపంచంలో అతిప్రాముఖ్య స్థానాన్ని ఆక్రమించింది"

("భారతదేశ లోహసంపద" టి. హెచ్ హాలండు రిపోర్టు, 1908)

అప్పటికే ఇనుము, ఉక్కు ఉత్పత్తి అత్యున్నత స్థాయిచెందిందని గుర్తిం చవచ్చును. ఆ విషయంలో ఆధునిక పారిశ్రామికాభివృద్ధికి తగిన పరిస్థితులు ఉన్నాయన్నమాట.

ఈ పరిస్థితిని బ్రిటిష్పాలనలో ఎందుకు విచ్ఛిన్నం చేశారో, భారతదేశం ఎందుకు వెనుకబడిన స్థితికివచ్చిందో కారణాలు తర్వాతి అధ్యాయంలో పరిశీ లించుదాము.

భారతదేశంలో అత్యున్నత ఆధునిక ఆర్థికాభివృద్ధికి కావలసిన సహజ వస్తుసంపద ఉన్నదనే అంశంకూడ అందరూ గుర్తించినదే.

వ్యవసాయ విషయంలో, భారత ప్రభుత్వానికి ఆర్థిక వస్తూత్పత్తిపై నివేదికలిచ్చే సర్ జార్జి వాట్ చెప్పిన మాటలను ఉదహరిస్తాను.

"ఇరిగేషన్ వసతులను ఎక్కువచేసి, చక్కని రవాణా సౌకర్యా లేర్పరచి, వ్యవసాయ పనిముట్లలోను పద్ధతులలోను అభివృద్ధి కల్పించి

సాగుచేయబడే భూమివైశాల్యాన్ని పెంచినట్లయితే ... .... భారతదేశంలో ఉత్పత్తి కనీసం నూటికి 50 వంతులు సులువుగా అధికం చేయవచ్చును. ఇక కేవలం సహజసంపదను, అభివృద్ధిచేయని అవకాశాలను మాత్రం చూచినా వ్యవసాయానికి ఇంత ఉజ్వల భవిష్యత్తుకల దేశాలు ప్రపంచంలో చాలా తక్కువవున్నాయి."

(సర్ జార్జి వాట్ "బ్రిటిషు ఇండియాలోని ఉత్పత్తి అవకాశాలపై నివేదిక" కలకత్తా, 1894, పుట 5)

ఇంతకన్నా స్పష్టంగా పారిశ్రామికాభివృద్ధికి తగినవస్తుసంతతి కనిపిస్తుంది. భారతదేశంలో అపారంగా బొగ్గు, ఇనుము, నూనె, మాంగనీస్, బంగారు, సీసం వెండి, రాగి ఉన్నాయి. (కొత్తచట్ట ప్రకారం (1935) బర్మాను వేరుపరచడంతో నూనె విషయంలో సరఫరా తగ్గిపోయింది. బర్మానూనెను రక్షించుకోవాలన్న బ్రిటిష్‌సామ్రాజ్యవాదుల ఆశయమే. బర్మా విభజన కారణాలలో ఒకటి. కాని ఇప్పుడున్న సాక్ష్యాన్నిబట్టి భారతదేశంలో నూనె తీసేందుకు కావలసినన్ని అవకాశాలున్నట్టు తెలుస్తుంది. వాటినిగూర్చి యింకా ప్రయత్నాలు చేయనేలేదు.)

అమెరికా టెక్నికల్ మిషన్ * 1942 లో భారతదేశానికి వచ్చింది. "భారతదేశంలోని పరిశ్రమావకాశాలను పరిశీలించి, ఆ దేశపు యుద్ధోత్పత్తికి అమెరికా ప్రభుత్వం ఏవిధంగా సాయపడగలదన్న అంశంలో మార్గాలనూ సలహాలనూ ఇచ్చేందుకు" ఆకమిషన్ ఇండియాకువచ్చింది. వారి నివేదికలో ఇలా వుంది :

"బెంగాలు, బీహారులలోని బొగ్గు 60 బిలియన్ల (బిలియను 1 లక్ష కోట్లు) టన్నులని అంచనావేశాము. అందులో 20 బిలియన్ల టన్నులు తీయ వీలున్నది. సి. పి; బీరారులలోని రిజర్వు 17 బిలియన్ టన్నులు అందులో 5150 కోట్ల టన్నులు తీయ వీలున్నది. ఇందుతోపాటు అస్సాం, లాంగ్రిన్ పీఠభూమిలో 6 నుండి 8 కోట్ల టన్నులవరకు, నాంగ్‌ట్సోయిన్‌లో 7 కోట్ల టన్నులు బొగ్గు చిక్కుతుంది. లోహ సంబంధమైన 'కోక్' (బొగ్గు కరిగించి తయారుచేసే ఒకవిధమైన ఫ్యుయల్) తయారుచేసేందుకు వీలయిన బొగ్గు 50 కోట్ల టన్నుల వరకు వుంది. ఇప్పుడున్న పద్ధతుల్లో గనులు త్రవ్వితే సగం తీయడంలోనే పోతుంది. ఈ రిజర్వును యేటా 7½ కోటి టన్నుల ప్రకారం ఉపయోగిస్తున్నారు. ఎక్కువగా 'కోక్' కోసంకాక ఇతరంగానే ఉపయోగిస్తున్నారు. వట్టి కోక్ ఉత్పత్తికే వదిలితే చాలా సంవత్సరాలకు యివి చాలుతాయి. ఉక్కు, ఇనుము ఉత్పత్తి చేసినప్పటికూడ."

(అమెరికన్ టెక్నికల్ మిషన్ రిపోర్టు, ఆగస్టు 1942, పుట 25.)

భారతదేశంలో 'బాక్సైట్' 25 కోట్ల టన్నులుంటుందని వారే అంచనా

---

* ఈ కమిషన్ చర్చలు, నివేదికలు బ్రిటిష్ ప్రభుత్వం అతిరహస్యమని చెప్పి, ప్రకటించలేదు; దానిని అమలు జరపనూలేదు. ఈ అంశం పాఠకులు గుర్తించాలి.

వేశారు. వారి నివేదిక ప్రకారమే ప్రపంచం మొత్తం మాంగనీసు ఉత్పత్తిలో 30% భారతదేశంలో ఉన్నదని, షీట్ నల్లఅభ్రకం ప్రపంచంమొత్తం పరిసరాల్లో ⅘ వంతులున్నదని, ప్రపంచంలోకల్లా ఎక్కువ లక్క ఇక్కడున్నదని తెలుస్తుంది.

ఇక ముడి ఇనుము చాలా ముఖ్యమైనది. భారతదేశంలో ఇనుము 300 కోట్ల టన్నులుంటుందని అంచనావేశారు. గ్రేట్ బ్రిటన్‌లో 225 కోట్ల 40 లక్షల టన్నులు, జర్మనీలో 137 కోట్ల 40 లక్షల టన్నులు; అమెరికాలో 988 కోట్ల 50 లక్షల టన్నులు; ఫ్రాన్సులో 436 కోట్ల 90 లక్షల టన్నులు ముడి ఇనుము దొరుకుతుంది. అంటే ఒక్క అమెరికా, ఫ్రాన్సులు వదిలితే భారతదేశములోని ఇనుము సంపత్తి అన్నిటికన్నా ఎక్కువ. (సిసిల్ జోన్సు - భూగర్భశాస్త్ర శాఖ - 'కాపిటల్' అనుబంధ సంచిక డిసెంబరు 19, 1929.)

"భారత దేశంలో ముడి ఇనుము సమృద్ధిగా దొరుకుతుంది. అందులో లోహ భాగం చాలఎక్కువ. ఇప్పుడు వానిని సరిగా ఉపయోగించుకోకపోతే వృధా అని చెప్పవచ్చు. ఇతర దేశాలతో సమానంగా ఇనుము ఉత్పత్తి చేయవీలుంది. అమెరికా, బ్రిటన్, జర్మనీ, స్వీడెన్, స్పెయిన్, రష్యాలలో సగటున 1 కోటి 62 లక్షల టన్నులు ఇనుము ఉత్పత్తి అవుతుంది. భారతదేశంలో 18 లక్షల టన్నులు ఉత్పత్తి అవుతున్నది. అంటే ఇప్పుడు ఇక్కడున్న ఇనుములో కేవలం నూటికి 11 వంతులు మాత్రమే ఉపయోగింపబడుతున్నది మిగత 89 పాళ్ళు వ్యర్థమైపోతున్నది. (ఆర్. కె. దాస్, "భారతదేశ పారిశ్రామిక శక్తిసంపత్తి" 1930, పుట 17.)

సరిక్రొత్తగా భారతదేశపు ఇనుముగూర్చి అమెరికన్ టెక్నికల్ మిషన్ అంచనా వేసింది. వారి నివేదికలో ఇలా ఉంది :

"భారతదేశంలోని ముడి ఇనుము రిజర్వులు ప్రపంచంలోకల్లా ఎక్కువవున్నది. నాణ్యంలోకూడ ఇతరదేశాల ఇనుముకంటె ఉత్తమమైనది. సింగ్‌భూమ్‌జిల్లా ఒక్కదానిలోనే, 60 వంతుల ఇనుముగల ముడియినుము చూరు 300 కోట్లు టన్ను లుంటుందని అంచనా వేయవచ్చును మొత్తం 2 వేల కోట్ల టన్నులు ఉండవచ్చును. బస్తరు సంస్థానంలోని ఉత్తమతరగతికి చెందిన రిజర్వులు 72,40,00,000 టన్నులని అంచనా వేయబడ్డాయి. మధ్యపరగణాల దగ్గరిజిల్లాలలో చాల గనులున్నాయి. రయూనా కొండల్లోని గనుల్లో 25,00,000 టన్నుల ముడియినుము ఉంటుంది. అందులో నూటికి 67½ వంతులు ఇనుము దొరుకుతుంది."

(అమెరికా టెక్నికల్ మిషన్ నివేదిక, ఆగస్టు 1942. పుట 24)

1918 లో ఇండస్ట్రియల్ కమీషన్ రిపోర్టులో ఇలాఉంది :

"భారత దేశంలోని లోహసంపదనుగూర్చి సక్రమంగా ఎంత ఉందో,

ఎలాంటి స్థితిలో ఉందో భూగర్భ పరిశోధనశాఖ పరిశీలించింది. ఈ శాఖకు పరిమితంగా డబ్బున్నందువల్ల, తగిన సాధనసంపత్తి లేక పూర్తిగా విచారణ కొనసాగించలేకపోయింది. ఇంక ఎక్కువ వివరంగా విచారణకు దిగకుండానే వాణిజ్యానికి దీనిని ఉపయోగించుకోవాలి.

"ఒక్క వనడియమ్, నిక్కల్, మోలిబ్డినమ్ అవసరమయ్యేవి తప్ప మిగత ప్రధాన ఘన పరిశ్రమలన్నిటిని పోషించేందుకు తగినంత లోహ సంపద ఇక్కడ ఉంది.

"భారతదేశంలో ముడియినుము చాలచోట్ల దొరుకుతుంది. కాని మంచి ముడియినుమున్నచోట తగినంత బొగ్గు సరఫరా ఉన్న ప్రాంతాలు ఎక్కువలేవు. అయినప్పటికి ఇప్పుడున్న ఇనుప, ఉక్కు పరిశ్రమలు అతివిశాలం చేసేందుకు అన్నివిధాలా తగినంత సరఫరా ఉంది."

(ఇండియన్ ఇండస్ట్రియల్ కమిషన్ రిపోర్టు పుట 36.)

భూగర్భ శాఖ సూపరెంటెంటు డాక్టర్ సి. యస్. ఫాక్సు భారత ఇనప ఉక్కు పరిశ్రమలతో పాతికేళ్ళ సన్నిహిత సంబంధమున్న సి. పె. పెరిన్ అనే అమెరికా మైనింగ్ ఇంజనీరును ఉదహరించాడు. ఒక చతుష్కోణంలోని ఈశాన్య కోణంలో కలకత్తా ఉందనుకుంటే, దానికి పడమట 400 మైళ్ళలోను దక్షిణానికి 3200 మైళ్ళలోను అత్యుత్తమైన 2 వేల కోట్ల ముడియినుము ఉంది. అక్కడికి సగటు 125 మైళ్ళలో బెంగాల్‌లో బొగ్గుగనులున్నాయని వ్రాశాడు. (ఉక్కు పరిశ్రమకు రక్షణ ఇవ్వడం విషయమై ఇండియన్ టారిఫ్‌బోర్డు (—సుంకాలు నిర్ణయించే కమిటీ—రిపోర్టు 1924)

భూగర్భ పరిశోధన శాఖకు విచారణలు జరపడానికి తగినంత నిధిని ప్రభుత్వం ఇవ్వడంలేదన్నది గమనించవలసినవిషయం. కాబట్టి ఆసహజసంపత్తిని గూర్చి వారు జ్యోతిష్కులు నక్షత్రాల పటంలో గుర్తులుంచినట్టు మాత్రమే వ్రాశారు. 1933—34లో భారతదేశంలోని వైజ్ఞానిక శాఖలన్నిటికి పెట్టినఖర్చు మొత్తం ప్రభుత్వ వ్యయంలో 1/3% మాత్రమే. మిలిటరీకి పెడుతున్న ఖర్చులో 17 వంతుకన్న ఇంకా తక్కువే. ఈ సంగతి గుర్తుంచుకోవాలి. ఈ నివేదిక అస్పష్టంగా "అన్నివిధాలా ఇప్పుడున్న ఇనుము, ఉక్కు పరిశ్రమలను అత్యధికం చేయడానికి తగిన బొగ్గు, ఇనుము ఉంద"ని మాత్రమే చెప్పి సంతృప్తి పడిందన్న విషయంకూడ గమనించాలి.

ఇంతకన్నా భారతదేశాన్ని విద్యుచ్ఛక్తి పూర్ణంచేయడానికి కావలసిన జలశక్తి అధికంగా కనిపిస్తుంది. అలాంటి శక్తిని ఉపయోగించక ఉదాసీనంగా చూడడం మరీ స్పష్టంగా కనిపిస్తోంది. ఇతరదేశాలకున్న జలశక్తిని వారెంత ఉపయోగిస్తున్నది, భారతదేశంతో పోల్చి ఈ క్రింది పట్టికలో ఇస్తున్నాను:

# జలశక్తి అవకాశాలు

## (పది లక్షల అశ్వశక్తిలో)

| దేశం | ఉన్న అవకాశాలు | ఉపయోగం | ఉపయోగం నూటికి ఎన్నివంతులు? |
|---|---|---|---|
| అమెరికా | 35.0 | 11.7 | 33 |
| కనడా | 18.2 | 4.5 | 25 |
| ఫ్రాన్సు | 5.4 | 2.1 | 37 |
| జపాను | 4.5 | 1.7 | 37 |
| ఇటలీ | 3.8 | 1.8 | 47 |
| స్విట్జర్లాండు | 2 5 | 1.8 | 72 |
| జర్మనీ | 2.0 | 1.1 | 55 |
| ఇండియా | 27.0 | 0.8 | 3 |

జలశక్తిలో భారతదేశం అమెరికాకంటె మాత్రమే తక్కువ. అయినప్పటికీ నూటికి మూడువంతులు మాత్రమే ఆ జలశక్తి ఉపయోగింపబడుతున్నది. స్విట్జర్లాండు 72 వంతులు, జర్మనీ 55 వంతులు, ఇటలీ 47 వంతులు, ఫ్రాన్సు, జపానులు 37 వంతులు, అమెరికా 33 వంతులు ఉపయోగిస్తున్నాయి. వీటికి ఇండియాతో సామ్యమెక్కడ?

ఇలాగే భారత ఆర్థిక వ్యవస్థలో ఏవైపుచూచినా ఒకవేపు కావలసిన సహజ సంపత్తి, మరోవైపు ఇప్పటి ప్రభుత్వం ఆ సంపదను ఉదాసీనంగా ఉపయోగించకపోవడం మనకు కనిపిస్తుంది.

ఈ పరిస్థితిలోని ప్రమాదాన్ని సామ్రాజ్యవాదులే గ్రహించారు. అయినా వారేమీ ఇందుకు పరిష్కారం చూపెట్టలేదన్నమాట సరే ననుకోండి. భారత దేశంలోని ప్రధాన పత్రికల్లో ఒకటయిన కలకత్తా స్టేట్సుమన్ పత్రిక సంపాదకుడు, లండన్ టైమ్సు కలకత్తా విలేఖరి అయిన సర్ ఆల్ఫ్రెడ్ వాట్సన్, 1933 లో రాయల్ ఎంపైర్ సొసయిటీ సమావేశంలో ఈవిషయమై హెచ్చరిక చేశాడు :

"భారతదేశం పారిశ్రామికంగా అవకాశాలు జారవిడిచిన దేశము. ఇందుకు ప్రధాన బాధ్యత బ్రిటిష్‌మీద పడుతుంది.... పెద్ద పారిశ్రామిక దేశానికి తగిన పరిస్థితులు భారతదేశంలో అపారంగా ఉన్నప్పటికీ, ఆర్థికంగా ప్రపంచ దేశాలకన్న వెనుకబడిన స్థితిలో ఉంది. పారిశ్రామికంగా అతి హీన స్థితిలో ఉంది.... పారిశ్రామిక శక్తి ఉన్నదనడంలో ఎప్పుడూ అనుమానంలేదు. ఈశక్తిని అభివృద్ధిపరచే సమస్యను తీవ్రంగా మనమెన్నడూ ఆలోచించలేదు....

"ఇక వచ్చే సంవత్సరాలలో, భారత జనాభా పెరుగుదలకు తగినట్లు సమగ్రంగా అభూతపూర్వస్థితిలో భారత దేశాన్ని అభివృద్ధిపరిస్తే తప్ప, ఇప్పుడే అతిహీనస్థితిలోఉన్న దేశజీవనం మరింత అధమస్థితికి - ఆకలితో ప్రజలు మాడిపోవలసిన స్థితికివస్తుంది."

(రాయల్ ఎంపైర్ సొసైటీలో, సర్ ఆల్ఫ్రెడ్ వాట్సన్ ఉపన్యాసం. లండన్ టైమ్సు జనవరి 4, 1933.)

## 2. భారతదేశ దరిద్రం

ఇలాంటి అపార సహజసంపద ఉన్నప్పటికి, దానిని అభివృద్ధి పరచలేక పోవడం, భారతీయులు దారుణ దరిద్రంతో బాధపడడం గమనించినప్పుడు ఈ విషయ ప్రాముఖ్యం బోధపడుతుంది.

పరిపాలనాయంత్రం పనిచేసేందుకు అన్ని విధాలా పనికివచ్చే లెక్కలు కట్టలుకట్టలుగా ఉన్నాయి. కాని భారతప్రజల స్థితిగతులెలా ఉన్నాయనే విషయంలో మట్టుకు ఇవి ఏమాత్రం ఉపయోగపడవు. ఎందుకూ చాలవు. జాతీయాదాయం గురించి కాని, సగటు ఆదాయం గురించి గాని అధికారయుతమైన అంచనాలేదు. (అనేకఅధికార విచారణల ఫలితాలు రహస్యంగా బయటపెట్టకుండా దాచారు) మొత్తం భారతదేశంమీద కాని బ్రిటిష్ఇండియాకు కాని, ఉత్పత్తి, జీతాలు, జీతాల సగటు మొత్తం, పనిగంటలు లేక కార్మికుల స్థితిగతులు వీటినిగురించి లెక్కలూ లేవు. ఆరోగ్యం, ఇళ్ళవసతి లాంటి వాటికీ లెక్కలు లేవు.

సగటున మనిషి 1కి ఆదాయం ఇంత అని చాల అంచనాలున్నాయి. అందులో 1868 నుండి యుద్ధానంతర దశవరకు ఈ క్రిందివి ఇస్తున్నాను.

### సగటున తల 1కి జాతీయాదాయం

| అంచనా వేసినవారు | అధికారులదా అనధికారులదా | అంచనావేసిన సంవత్సరం | ఏ సం॥కి చెందినది? | సం॥ర ఆదాయం |
|---|---|---|---|---|
| డి. నౌరోజీ (1) | అనధి | 1876 | 1868 | 20/- |
| బేరింగ్, బార్బర్ | అధి | 1882 | 1881 | 27/- |
| లార్డు కర్జన్ | .. | 1901 | 1897-98 | 30/- |
| డబ్ల్యు. డిగ్బి (2) | అనధి | 1902 | 1899 | 18/- |
| ఫిండ్లే షిరాస్ (3) | అధి | 1924 | 1911 | 49/- |
| వాడియా - జోషి (4) | అనధి | 1925 | 1913-14 | 44/½ |

(1) దాదాభాయి నౌరోజీ, "దరిద్రం - భారతదేశంలో బ్రిటిష్ పాలన" 1876;

(2) డబ్ల్యు. డిగ్బి. "సౌభాగ్యవంతమైన బ్రిటిష్ ఇండియా" 1902;

(3) జి. ఫిండ్లే షిరాస్, "దేశాదాయ శాస్త్రం" 1924;

(4) వాడియా - జోషి, "భారతదేశ సంపత్తి" 1925;

| | | | | |
|---|---|---|---|---|
| షా-ఖంబతా (5) | .. | 1924 | 1921-22 | 74/- |
| సైమన్ రిపోర్టు | అధి | 1930 | 1921-22 | 116/- |
| వి. కె. ఆర్. వి రావు(6) | అనధి | 1939 | 1925-29 | 78/- |
| సెంట్రల్ బ్యాంకింగ్ విచారణ కమిటీ (వ్యవసాయకులకు మాత్రం) | అధి | 1931 | 1928 | 42/- |
| ఫిండ్లేషిరాస్ (7) | .. | 1932 | 1931 | 63/- |
| సర్ జేమ్సు గ్రిగ్ (8) | .. | 1938 | 1937-38 | 56/- |
| వి. కె. ఆర్. వి. రావు(9) | అనధి | 1940 | 1931-32 | 62/- |

ఈ అంకెలను ఒకదానితో ఒకటి పోల్చ వీలులేదు. ఎందుకంటే ఇవి తయారు చేయడంలో ఒక్కొకరు ఒక్కొక ప్రాతిపదికమీద చేశారు. అదీగాక పదార్థాలధరలు విపరీతంగా మారుతుంటాయి. భారతదేశంలోని పదార్థాల ధరల ఇండెక్సు నెంబరు చూడండి. 1873 లో 100 ఉందనుకుంటే (1897 వరకు ఆహారధాన్యానికి తప్ప మిగిలిన 39 వస్తువులకు సరైన అంచనాలేదు.) 1900 లో 116; 1913 లో 143; 1920 లో 281 కి పెరిగింది. మరల తగ్గింది. 1921 లో 236; 1925 లో 227; 1930 లో 171; 1936 లో 125.

ఇక ఈ అంచనాలకు ప్రాతిపదికలు విభిన్నంగా ఉన్నాయి. కాబట్టి వీనిని స్థూలంగా సూచనామాత్రాలుగా మాత్రమే గ్రహించాలి. పాత అధికారుల లెక్కలన్నీ మొత్తం వ్యవసాయ ఉత్పత్తిని వెలకట్టి. వ్యవసాయేతరాదాయం అందులో సగముంటుందని చేర్చి పై సగటు లెక్కలు తేల్చారు. (ఇదిపూర్తిగా అధిక అంచనా) డిగ్బీ అంచనాలలో ఉద్యోగాలవల్ల వచ్చేఆదాయం చేరలేదు. సామాన్యంగా అందరూ ఎరిగిన, అంగీకరించిన పాత అంచనాలివి: నౌరోజీ 1868— తలకు రూ 20; మేజర్ బేరింగ్ (తర్వాత లార్డు క్రామర్) తలకు ఆదాయం రు 27/—ప్రకటించారు. వైస్రాయిగా పనిచేస్తూ లార్డు కర్జన్ 1901 లో ఒక ఉపన్యాసంలో ఆదాయం రు 30 అని చెప్పాడు· ఈలెక్కలనుబట్టే ఒకశతాబ్దిపైగా బ్రిటిష్‌వారు పరిపాలించినతర్వాత భారత దేశ స్థితిగతులు-అధికారులు అంగీకరించినవి ఎలా ఉన్నాయో తెలుస్తుంది.

తర్వాత లెక్కలు చాల భిన్న భిన్నంగా ఉన్నాయి. ఇందుకు కొంతకారణం

---

(5) షా - ఖంబతా, "ధనము, పన్నుమోసే శక్తి - భారతదేశం" 1924;

(6) వి కె. ఆర్. వి. రావు, "భారతదేశ జాతీయాదాయం" 1939;

(7) జి, ఫిండ్లే షిరాస్, "దరిద్రము భారతదేశ ఆర్థిక సమస్యలు" 1932;

(8) సర్ జేమ్సు గ్రిగ్స్, "భారత ప్రభుత్వ ఆర్థిక సభ్యుడు, కేంద్ర శాసనసభలో బడ్జెటు ఉపన్యాసం" — ఏప్రిల్ 1938;

(9) వి. కె. ఆర్. వి. రావు, "బ్రిటిష్ ఇండియాలోని జాతీయాదాయం" 1940.

ధరలు ఏమాత్రం స్థిరంగాలేకపోవడమే. 1912, 1920 ల మధ్య దాదాపు రెట్టింపు పెరిగాయి. 1931 తర్వాత గత యుద్ధం పూర్వంకన్నా చాలతగ్గాయి. 1914 నుండి 1921 వరకు భారత ప్రభుత్వానికి లెక్కల డైరెక్టరుగా ఉన్న ఫిండ్లేషిర్రాస్ కూడ యుద్ధానంతర, వ్యవసాయేతర ఆదాయంపెరిగినట్టు ఊహించుకొని లెక్కలు కట్టాడు

భారతదేశంలోని సామ్రాజ్యవాద పాలనకు క్షమాపణ చెప్పుకున్నట్టుగా వున్న సైమన్ కమీషన్ రిపోర్టు (1930) మొదటిభాగం చాల ప్రచారమైంది. ఇందులో సగటుఆదాయం రూ 116 అని మరీ ఎక్కువగా వేశారు. అప్పటినుండి ఈ అంకెకు చాలా ప్రచారం వచ్చింది. ఇంతఅంచనా ఎప్పుడూ ఎవ్వరూ వేయలేదు. కాబట్టి దీని ప్రాతిపదికేమిటో పరిశీలించడం అవసరమే.

1930లో సైమన్‌కమీషన్ రిపోర్టు తయారుచేస్తున్నప్పటికీ అంతకు పదేళ్ళ క్రితం బాగా ధరలున్న సంవత్సరాలను లెక్కలకు తీసుకున్నారు. అవి యుద్ధం అప్పుడప్పుడే ముగిసినరోజులు. ఆ రిపోర్టులో వరసగా 1919-1920, 1920-21, 1921-22 సంవత్సరాల సగటు ఆదాయాన్నిచూపించారు. ఆ ఆదాయం రు 74నుండి 116 వరకు వెడుతోంది. అందులో అత్యుచ్ఛంగాపున్న 116 రు. వారు సగటు లెక్కకు తీసుకున్నారు (వాల్యూం 1-334పుట). ఆతర్వాత ఆకాలానికంతా సరైన లెక్కయినట్టుగా ఆసంఖ్యనే ఉదహరిస్తూవచ్చారు. అసలు యుద్ధానంతరం ఆర్థిక ఉచ్ఛదశకుచెందిన సంఖ్యఅది. (ఆతర్వాత ధరలు పడిపోయాయి గనుక అంత కన్నా ఆసంఖ్యను ఎక్కువగా వెయ్యలేము. "వాల్యూం" 2, పుట 207—నిజమే మంటే 1920 లో ఇండెక్సు నెం. 281 నుండి 1930 లో 171 కీ, 194 లో 119 కి పడిపోయింది) ఆసంఖ్యను ఇంగ్లీషు డబ్బులో 8 పౌ॥ గా వేశారు. అప్పటి ఇంగ్లీషువాని సగటు ఆదాయం 95 పౌన్లు.

ఇలాంటి 'ఆశావాదుల' అంచనాఅయిన అధికార సైమన్ కమీషన్ రిపోర్టు చెప్పిన సగటు భారతీయుని ఆదాయంకూడ 1921-22 లో రోజుకు 5 పెన్నీలుగా తేలింది.

ప్రభుత్వం ధరలఇండెక్సు 1921 లో 236 నుండి, 1936 లో 125 కు— దాదాపు సగానికి పడిపోయింది. ఈ ధరల తగ్గుదల వ్యవసాయ పంటల ధరలపై చాలా తీవ్రంగా పడింది. ఆ ధరలే అసలు భారతీయాదాయంలో ప్రధానభాగం. 1921—1936 ల మధ్య ధాన్యాలచిల్లరధర పడిపోయింది. బియ్యానికి ధర 355 నుండి 178, గోధుమలు 360నుండి 152కు, పప్పు 406నుండి 105కు, బార్లీ 325 నుండి 134కు పడిపోయింది. అంటే దాదాపు సగంకన్నా ఎక్కువగా ధరలు పడిపోయాయన్నమాట.

ఇలా సైమన్ కమిషన్ లెక్క ప్రకారం 1921—22లో
5 పెన్నీలు రోజు ఆదాయం అనుకుంటే యుద్ధపూర్వదశలో
దినానికి 2½ పెన్నీలు పడుతుంది.

కాని ఇదికూడ సగటు ఆదాయం. దేశంలోని అధికసంఖ్యాక ప్రజల నిక రాదాయం కాదిది. ఈ ఆదాయంలోనుండే సామ్రాజ్యవాదులకు పెద్ద మొత్తాలు అచ్చుకోవాలి. (అప్పులకు వడ్డీ, బ్రిటిష్ పెట్టుబడిపై డివిడెండులు, బాంకింగు, ఫైనాన్షియల్ కమిషన్లు వగైరా) ఇవన్నీ భారతదేశంనుండి ప్రతిఫలం ఇవ్వకుండా ఎగుమతిచేసిన వస్తువులద్వారా లాగబడతాయి. ఈ కోత షా - ఖంబతాల లెక్క ప్రకారం మొత్తం జాతీయాదాయంలో పదోవంతుంటుంది; కాబట్టి ఆ రెండున్నర పెన్నీలు 2¼ పెన్నీలయింది.

ఇక తర్వాత ఈ సగటు ఆదాయంలో ఉన్న అసమానత లొకటి చూడాలి. బ్రిటిష్‌వాని ఆదాయం సైమన్‌రిపోర్టు ప్రకారం తలకు 95 పౌన్లు గనక, ఒకభార్య 3 గ్గురు పిల్లలున్న బ్రిటిష్ కార్మికునికి ఏటా 475 పౌన్లు ఆదాయం రావాలిమరి. నిజానికి అందులో సగం వచ్చే కార్మికుడే చాలా అదృష్టశాలి. సామాన్యంగా కార్మికునికి మూడోవంతు, అంతకన్నా తక్కువమాత్రమే వస్తుంది. ఇలాంటి ఆదాయంలోని వ్యత్యాసమే భారతదేశంలో కనిపిస్తుంది. "భారతదేశపు ధనము-పన్నులు మోసే శక్తి" అనే పుస్తకంలో (1924) కె. టి. షా; ఖంబతాగారలు జాతీయాదాయంలో మూడోవంతు నూటికి ఒకరికి వస్తుందని, నూటికి 60 మంది సగటు ఆదాయంలో 30% మాత్రమే తీసుకుంటారని అంచనా వేశారు. అంటే, అధికసంఖ్యాకుల ఆదాయం లెక్క వేయాలంటే, జాతీయాదాయాన్ని సగం చేయాలన్న మాట. *

| ఆదాయం రూ॥లు | ఎన్ని కుటుంబాలు |
|---|---|
| 100,000 పైగా | 6,000 |
| సగటున 5000 | 270,000 |
| ,, 1000 | 250,000 |
| ,, 200 | 3,50,00,000 |
| ,, 50 | మిగిలిన కుటుంబాలన్నీ |

సొంత ఉపయోగానికై బ్రిటిష్ పెట్టుబడిదారులు తయారుచేసుకున్న ఈ లెక్కలకు వేరే వ్యాఖ్యానం అవసరం లేదు.

* భారతదేశంలో ఆదాయాలలో ఉన్న విభేదాలు, "ది ఇండియన్ మార్కెట్" అనే పత్రిక 'ది ప్రైస్సు ట్రేడ్ అండ్ ఇంజనీరింగ్ ఇండియన్ సప్లిమెంటు' 1939 ఏప్రెల్ సప్లిమెంటులో అంచనావేశారు, ఈ అంచనా తమ సొంత ఉపయోగంకోసం వేసుకున్నారు. అందులో సామ్రాజ్యవాద పీడనాఫలితాలు చాల బాగున్నాయని చెప్పడం కాక, అసలు స్థితిగతులేమిటి, తమ వస్తువులు ఎంతమందికి చేరగలవు అన్న దృష్టితో ఇవి తయారుచేశారు. ఇందులో భారతీయకుటుంబాల ఆదాయాలలో విభేదాలను ఇలా అంచనా వేశారు :

సైమన్ కమిషన్‌వారు వేసిన 'అత్యాశావాదపూరితమైన' అంచనాలో తర్వాతధరలు పడిపోయిన అంశానికి కొంత, ఇంగ్లాంకుకు వెళ్ళిన ధనం కొంతా తీసివేస్తే, మన మిశ్రిం చీ నిర్ధారణకు రాకతప్పదు. భారతీయులలోని అత్యధికసంఖ్యాకులకు నేడు దినం సగటున ఒకఅణానుండి ఒకఅణా 3 పైసలకులోపుగా (1:1 పెన్సు) ఆదాయం వస్తుందన్నమాట.

ఈ లెక్కంతా సామ్రాజ్యవాదుల అంచనామీదనే, వారి కనుకూలమైన అంశాలమీద తయారైన లెక్కలమీదనే, ఆధారపడివేసిందే.

ఈ విషయంలో దాదాపు సరిపోయేట్టు (అంతకన్నా లెక్కలు సరిగా లేవు గనక సాధ్యం కాదు.) ఇటీవల మరిరెండు అధికారుల అంచనాలుకూడ జరిగాయి. 1931 లో ఇండియన్ సెంట్రల్ బాంకింగు విచారణ కమిటీ, ఇలా నివేదికలో వ్రాసింది :

"రాష్ట్ర కమిటీలిచ్చినవి, ఇతరులు ప్రకటించినవి లెక్కలనుబట్టి 1928 ధరలతో లెక్కవేస్తే మొత్తం వ్యవసాయోత్పత్తిని రు. 1200 కోట్లని లెక్కకట్టవచ్చును. వ్యవసాయేతరంగా వచ్చే ఆదాయం ఇందులో 20% ఉంటుందని లెక్కవేయవచ్చు వీటిమీద ఆధారపడి, జనాభా తర్వాత పెరిగిందన్న అంశాన్ని విడిచిపెట్టినా, 1929 లో ధరలు పడిపోయాయన్న అంశాన్ని వదిలివేసి లెక్కవేస్తే బ్రిటిష్ ఇండియాలోని సగటు రైతు ఆదాయం సంవత్సరానికి రు. 42 లు కన్నా ఎక్కువగా ఉండదు"

(ఇండియన్ సెంట్రల్ బాంకింగు విచారణకమిటి రిపోర్టు 1931, వాల్యూం 1, పుట 39)

ఈ లెక్కలప్రకారం రైతు ఆదాయం రోజుకు రెండణాలుగా తేలుతుంది. ఈ లెక్కలు 1928వ సంవత్సరం ధరలనుబట్టి నిర్ణయించినవి. 1928నుండి 1936 లోగా ధరల ఇండెక్సు 201 నుండి 125 కు పడిపోయింది. కాబట్టి ఆదాయం రెండణాలనుండి అణా మూడుపైసలకు తగ్గుతుంది.

భారత ప్రభుత్వ ఆర్థిక సభ్యుడు (అప్పటికి) సర్ జేమ్సు గ్రిగ్గు 1938 ఏప్రిల్‌లో ఢిల్లీ శాసనసభలో భారతదేశ జాతీయాదాయం రూ 1600 లు కోట్లని అంచనా వేశాడు. ఆ మొత్తానికీ - వేస్తున్న మొత్తం పన్నులకూ సరిపోల్చి చెప్పేందుకై వేసిన అంచనా ఇది, కారణం కేవలం ఇది బ్రిటిష్ ఇండియాకు చెందినదే అనుకోవచ్చును. (ఇదే ఇండియా మొత్తానికి చెందినదైతే సగటు ప్రతి మనిషి ఆదాయం మరింత తగ్గుతుంది.) బ్రిటిష్ ఇండియా జనసంఖ్య 28 కోట్ల 50 లక్షలనీ దానిప్రకారం భాగిస్తే ఏటా మనిషికి సగటు ఆదాయం 56 రూపాయలనీ తేలుతుంది. ఇందులో ఆదాయ వ్యత్యాసాలు (నూటికి అరవైమంది ఆదాయంలో 30% తీసుకుంటున్నారు) బట్టి తీసివేస్తే అత్యధికసంఖ్యాకులైన భారతీయు

లకు సగటు దినసరి ఆదాయం దాదాపు అణాకానీ అనే తేలుతుంది. డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు మనిషి 1కి ఏటా సగటు ఆదాయం రూ. 62 లు అన్నాడు. మరీఆదాయ వ్యత్యాసాల విషయంలో కె టి. షా పద్ధతిని అవలంభిస్తే అణన్నర అధిక సంఖ్యాకులైన భారతీయుల దినసరి సగటు ఆదాయ మని తేలుతుంది.

భారతీయుల దరిద్రం ఎంత దారుణస్థితిలో ఉందో అర్థం చేసుకునేందుకు. పీఠికగా ఈ అంకెలు పనికి వస్తాయి.

ఈ అంకెలకు యదార్థజీవితంలో అర్థమేమిటి? ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్తలు షా - ఖంబతాలు ఇలా వివరించారు.

> "భారతదేశ సగటు ఆదాయం. జనాభాలో ప్రతి ముగ్గురిలో ఇద్దరికి మాత్రమే తిండికి సరిపోతుంది. శేషా అందరూ మూడుపూటలు వదిలి రెండుపూటలే తింటే సరిపోతుంది. అందులోను వారందరూకూడ దిగంబరంగా ఉండేందుకు ఒప్పుకోవాలి. సంవత్సరం పొడుగునా ఇల్లూ, వాకిలీ లేకుండా బయట తిరగడానికి, ఏ వినోదాలుగాని, ఆనందంగాని లేకుండా ఉండదానికి ఒప్పుకోవాలి అతినీచమైన.పుష్టికరంగాని పాడుతిండి మాత్రమే తింటూ ఉంటే ఆ ఆదాయం సరిపోతుంది."

(షా - ఖంబతా. "భారతదేశ ధనమూ, పన్నులుమోసే సామర్థ్యమూ" 1924 పుట 253)

జైలుకోడ్లు, ఫామిన్‌కోడ్లులలోని జీవితప్రమాణంతో పోల్చిచూస్తే ఇదెంత హీనమో కొంత తెలుస్తుంది. 1939 లో ఒకఖైదీని సంవత్సరం పోషించేందుకు 116. 67 రూపాయలయిందని. అంటే బాంకింగు విచారణ కమిటీవారు అంచనా వేసిన రైతు ఆదాయంకన్నా మూడింతలెక్కువ 1923 లో బొంబాయిలో కార్మికుల ఖర్చుపట్టికను అధికారులు విచారించారు. ఆ ఖర్చును జైలు ఫామిన్ కోడ్లులతో సరిపోలిస్తే. ఈ క్రింది విధంగా ఉంది.

## పెద్దవారికి ఒక్కొక్కరికి దినం ఉపయోగించే ఆహారం

| | బొంబాయి కార్మికుల బడ్జెట్ | బొంబాయి కఠిన శిక్ష | జైలు సామాన్యశిక్ష | ఫామిన్‌కోడ్లు (త్రవ్వేవారు) |
|---|---|---|---|---|
| ఆహారధాన్యం | 1.29 పౌ. | 1.5 పౌ. | 1.38 పౌ. | 1.29 పౌ. |
| పప్పులు | 0.09 | 0.27 | 0 21 | లెక్కలు |
| మాంసం | 0.03 | 0.04 | 0.04 | లేవు |
| ఉప్పు | 0.04 | 0.03 | 0.03 | — |
| నూనె | 0.02 | 0.03 | 0 03 | — |
| మిగతావి | 0.07 | — | — | — |
| | 1.54 పౌ. | 1.87 పౌ. | 1.69 పౌ. | |

(బొంబాయిలోని కార్మికుల బడ్జెట్టుల విచారణ రిపోర్టు. బొంబాయి లేబరు ఆఫీసు, 1923.)

గ్రామ సామాన్య ప్రజలకన్నా మంచిస్థితిలోవున్న బొంబాయి కార్మికుడు, కరువు పనిచేసేవారి రేషన్ తింటున్నాడు జైలులోని ఖైదీల రేషనుకన్నా తక్కువ తింటున్నాడు. *

ప్రజాసామాన్య జీవిత పరిస్థితులను గూర్చి చెప్పుకు. ప్రభుత్వ నివేదికలు ప్రతి ఏటా ఆ స్థితినే తెలుపుతున్నవి.

"అత్యున్నత శ్రేణికి చెందిన కార్మికులు తప్ప. భారతదేశంలోని మిగతా వారందరూ తిండికి బట్టకు కూడ చాలీచాలని జీతాలు తీసుకుంటున్నారు. క్రిక్కిరిసి ఉన్న జనం, మురికి, పచ్చిబాధలు ఎక్కడ చూచినా కనిపిస్తాయి"

("1927—28 లో ఇండియా")

"భారతదేశంలో అత్యధిక సంఖ్యాకులు పశ్చిమ దేశాల్లో ఎక్కడా పోలికల్లేని పరమదరిద్రాన్ననుభవిస్తున్నారు. చావకుండా మాత్రమే వారు బ్రతుకుతున్నారు.

("1929—30 ఇండియా")

"జనాభాలో నూటికి 70 మందినుండి 80 మంది వరకు జీవచ్ఛవాల్లా ఉన్నారు. ( Living on almost the margin of subsistence ) (సర్ ఆల్ఫ్రెడ్ చాటర్టన్, జర్నల్ ఆఫ్ ది ఈస్టు ఇండియా అసోసియేషన్ 1930 జులై)

ఇండియన్ మెడికల్ సర్వీసు డైరెక్టరు మేజర్ జనరల్ సర్ జోన్‌మెగా, 1933 లో ప్రజారోగ్యంగూర్చి ఒక ప్రకటన చేశాడు. అందులో నూటికి 39 మంది చక్కని ఆహారం తింటున్నారనీ. నూటికి 41 మంది తక్కువ ఆహారం తింటున్నారనీ నూటికి 20 మంది బొత్తిగా చాలని ఆహారం తింటున్నారనీ ఆయన అంచనా వేశాడు. అంటే నూటికి 61 మంది, దాదాపు మూడింట రెండోవంతు భారతీయులకు తగిన ఆహారం లేదన్నమాట. ఇలాగే బెంగాలుకు ప్రత్యేకంగా లెక్కవేశారు. అక్కడ బాగాతింటున్నవారు 22%. తక్కువ తిండి తింటున్నవారు 47%. బొత్తిగా చాలని ఆహారం నూటికి 31 మంది తింటున్నారని తేలింది— అంటే నూటికి 78 మందికి బెంగాలులో ఆహారం చాలదన్నమాట. రోగాలు

* పై లెక్కల ఫలితం భయంకరంగా ఉండడం చూచి, కార్మికులు తినే చిరుతిండి వదిలివేశారంటూ తిరిగి 1925 లో అధికారులు లెక్కలు కట్టారు. ఆ చిరుతిండి అంతా 4.61 "ఆహారం పైదాన్లో కలిపారు. రెండూచేరి కాలరీలుగా లెక్కిస్తే దినం 2.563 గా తేలింది. (బొంబాయి లేబరు గజెట్ ఏప్రిల్ 1925, పుట 841—2) బ్రిటిష్ మెడికల్ అసోసియేషన్‌వారి ఉపసంఘనివేదిక ప్రకారం, కనీసం 3.390 కాలరీల ఆహారం ప్రతిదినం మనిషి తినాలి. భారతదేశ పరిస్థితులనుబట్టి కనీసం 2.800 కాలరీల ఆహారముండాలని) ప్రొఫెసర్ ఆర్. ముఖర్జీ వ్రాశాడు. ("నలభైకోట్లమందికి ఆహార ప్రణాళిక" 1938 ఈ రెంటితో పై ఆహారం పోల్చి చూడవచ్చును.

"భారతదేశమంతటా విరివిగా వ్యాపిస్తున్నాయి. రాను రాను క్రమంగా త్వరగా ఎక్కువవుతున్నాయి." అనికూడా ఆయన వ్రాశాడు.

ఆహార శాస్త్రంలో పండితుడయిన డాక్టరు అక్రాయిడ్ ఇలా అన్నాడు: "భారతదేశంలో ఎల్లప్పుడూ మూడోవంతు ప్రజలు తీవ్రమైన ఆహారలోపంతో బాధలు పడుతున్నారు." (ఆహార ధాన్య విధానసంఘ నివేదిక పుట 333, 194)

ప్రభుత్వం 1926 లో భారతదేశంలోని వ్యవసాయ విషయమై విచారించేందుకు ఒక రాయబార కమిషన్‌ను నియమించింది. ఆ కమిటీ విచారించవలసిన విషయాలలో దరిద్రానికి మూలకారణాలైన భూస్వామి పద్ధతి, భూమి పన్ను విధానం, కౌలు, ప్రభుత్వపు పన్ను ఇలాంటి ప్రధానాంశాలులేవు. అయినప్పటికీ ఆ కమిషన్‌కు ప్రభుత్వపు కార్యాలయాలనుంచి వచ్చిన సాక్ష్యమే, రైతులఅధ్వాన్న స్థితిని వెల్లడించింది. మొదటిసాక్షి ప్రభుత్వ వ్యవసాయ సలహాదారైన డాక్టర్ డి. క్లౌస్టన్ ఇలా చెప్పాడు: "గ్రామ ప్రజలకు దేహదార్ఢ్యం లేదు. అందువల్ల అంటురోగాలకు సులభంగా బలిఅవుతున్నారు". కర్నల్ గ్రహాం ఇలా సాక్ష్యమిచ్చాడు: "వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికున్న ఆటంకాల్లో చాలీచాలని ఆహారం ఒకటి" ఆహార లోపంవల్ల వచ్చే రోగాల విచారణాధికారి కూనూర్ పాస్టర్ ఇన్‌స్టిట్యూట్ లెఫ్టినెంట్ కర్నల్ ఆర్. మక్‌హారిసన్ మరింత గట్టిగా ఇలా చెప్పాడు:

> "భారత ప్రజలు పడుతున్న బాధలలో ప్రధానమైనది ఆహార లోపం... భారతదేశంలోని రోగాలకు ఆహారలోపం అతిప్రధానమైన కారణం"
>
> (లె కర్నల్, ఆర్. మక్‌హారిసన్. "భారత ప్రజల అనారోగ్యానికి శరీరబలం లేకపోయేందుకు కారణమైన ఆహారలోపంపై నివేదిక" వ్యవసాయ రాయల్ కమీషన్ సాక్ష్యం, వాల్యూం I, II అధ్యాయం పుట 95)

ప్రభుత్వం 1929లో కార్మికుల విషయమై ఒకరాయల్ కమీషన్‌ను నియమించింది. ఆ కమిటీ ఈ నిర్ధారణకు వచ్చింది. "చాలా పరిశ్రమ కేంద్రాలలో అప్పులలో మునిగినవ్యక్తులు, కుటుంబాలు మొత్తం జనసంఖ్యలో మూడొంతులుంటారు.... చాలామంది విషయంలో ఈ అప్పు వారిమూడునెలల జీతంకన్నా ఎక్కువ, సామాన్యంగా అంతకన్నాచాల ఎక్కువగా వుంటుంది" (పుట 224)

మంచి జీతాలువచ్చే కార్మికులైన బట్టలమిల్లుకార్మికుల్లో పురుషులకు నెలకు 56షిల్లింగులు (1షి॥ = 10½అణాలు), స్త్రీలకు 26షిల్లింగులు వస్తున్నాయి బొంబాయిలోని సాధారణ కూలీలకు (Unskiled) నెలకు 30 షిల్లింగులు (రు 19-11-0) యిస్తున్నారు. ప్రధానమైన ఝరియా బొగ్గుగనుల్లో బొగ్గుతీసే కార్మికులకు సగటున 15షి. నుండి 25 వరకు నెలకు యిస్తున్నారు; అప్పుడప్పుడూ పనిచేసే ఫ్యాక్టరీల్లో కార్మికులకు పురుషులకు రోజుకు 6 అణాలనుండి 12 అణాలవరకు, స్త్రీలకు 4 అణాలనుండి 9 అణాలవరకు కూలి యిస్తున్నారు. బెంగాలు, బీహారు, ఒరిసా,

లలో సాధారణ కూలీలకు రోజుకు పురుషులకు 9 అణాలు, స్త్రీలకు 6 అణాలు ఇస్తున్నారు. పిల్లలకు 4 అణాల కూలి. మదరాసు, యు పి. లలో పురుషులకు 5 అణాలుమట్టుకే యిస్తున్నారు. ఈ సంగతులన్నీ రాయల్ కమీషన్‌వారు విచారించి తెలుసుకున్నవే. ఇక ప్రభుత్వ నిబంధనల ప్రకారం పనిచేయని చిన్న చిన్న కర్మాగారాలలోను, పరిశ్రమల్లోను మరీ ఈ స్థితి అధ్వాన్నంగా వుంది. వీనిని గూర్చి కమిషనే ఇలా అంటున్నది : వీనిలో అయిదేళ్ళ కుర్రాళ్ళుకూడ చాలచోట్ల పనిచేస్తున్నారు. వీరికి తగిన తిండిగాని, వారాంతపు సెలవుగాని లేదు. ఈ పసిపాపలు రోజూ రెండణాలకు 10 - 12 గంటలు పనిచేస్తున్నారు." (పుట 96)

ఇక కార్మికుల ఇళ్ళవసతి చెప్పనక్కరలేదు, సామాన్య కార్మికకుటుంబానికి కనీసం ఒక్క గదికూడా లేదు. ఒక గదిలో ఒక భాగంలోమట్టుకే వీరుంటారు. 1911 లో బొంబాయి మొత్తం జనాభాలో నూటికి 69 మంది ఒక గదిలోని భాగాల్లో ఉంటున్నారు (అదే సంవత్సరం లండన్‌లో నూటికి 6 మంది మాత్రమే ఈ స్థితిలో ఉన్నారు.) ఈ ఒక్కొకభాగంలోను సగటున 4.5 మంది ఉంటున్నారు. 1931 జనాభా లెక్కల ప్రకారం, ఈ గదిభాగాల్లో నివసించే బొంబాయి ప్రజల సంఖ్య నూటికి 75 కు పెరిగింది ఈ 20 యేళ్ళలోను ఇళ్ళకరువు మరింత పెరిగిందేగాని తరగలేదు. అంటే మొత్తం ప్రజల్లో మూడోవంతు, ఒక గదిలో ఐదు మందికన్నా ఎక్కువవుంటున్నారన్నమాట. 2,56,379 మంది 6 నుండి 9 మంది వరకు నివసించే గదిలోవున్నారు. 8,133 మంది, 10 నుండి 19 మందివరకు నివసించే గదిలో ఉన్నారు: 15,490 మంది, 20 మందికి పైగా నిండిన గదిలో ఉంటున్నారు. ఇలా మొత్తం జనాభాతో కాకుండా కార్మికుల సంగతే ప్రత్యేకించి చూస్తే, జనమెంత క్రిక్కిరిసి ఉన్నారో మరీ దారుణంగా కనిపిస్తుంది

1937 లో కాంగ్రెసు మంత్రులు బట్టలమిల్లు కార్మికుల స్థితిగతులను విచారించడానికి ఒక కమిటీని వేశారు. వారి నివేదిక 1940 లో ప్రకటితమైంది. అందులో ఇలా వుంది :

> "ఈ విచారణ ముఖ్యంగా బొంబాయిలో ఇ ఎఫ్. జి. వార్డులలో మాత్రమే జరిగింది. ఇక్కడే ముఖ్యంగా కార్మికు లెక్కువమంది ఉంటున్నారు. మేముతీసుకున్న లెక్కలనుబట్టి నూటికి 91.24 కుటుంబాలు ఒక గదిలో చిన్నభాగాల్లో నివసిస్తున్నారు. సగటున ఆ ప్రత్యేక భాగంలో 3 . 84 మంది ఉంటున్నారు. ప్రతి ఒక వ్యక్తికీ దొరికేచోటు దాదాపు 26 . 86 చదరపు అడుగులు. కుటుంబం నివసిస్తున్నచోటు 103 . 3 చదరపు అడుగులు."

(టెక్స్టయిల్ లేబర్ ఎంక్వయిరీకమిటీ రిపోర్టు వాల్యూం 11,1940, పుట 273.)

కరాచీలో మొత్తం జనాభాలో మూడోవంతు జనం ఒక్కొక గదిలో 6 నుండి 9 వరకు నివసిస్తున్నారు అని పీట్లీ నివేదిక తెలుపుతున్నది. అహమ్మదాబాదు కార్మికులలో నూటికి 73 గురు ఒకగది భాగాల్లోనే ఉంటున్నారు.

ఈ గృహసమస్య 1931 నుండి ముఖ్యంగా యుద్ధప్రారంభంనుండి మరీ తీవ్రతరమయింది. బొంబాయి జనసంఖ్య 1945 లో 23 లక్షలకు పెరిగింది. 1931 లో ఈ జనసంఖ్య 11 లక్షలు. 1941 లో 14.89 లక్షలుండేది. తర్వాత కట్టిన నివాసభాగాలల్లా 83,828 మాత్రమే. మొత్తమంతా లెక్కవేస్తే సగటున ప్రతిభాగంలోను 1931 లో 4.91 ఉంటే 1945 లో 7.01 జనం నివసిస్తున్నారన్న మాట. పెద్దపెద్ద నివాసభాగాల్లోకన్నా ఒక్కొక్క గదిభాగాల్లోనే జనసంఖ్య పెరిగింది.

బొంబాయి మునిసిపాలిటీ నియమించిన గృహకమిటీ లెక్కలప్రకారం, బొంబాయిలో సగటున ప్రతిమనిషి నివసిస్తున్న స్థలం 12½ చదరపుటడుగులు. బొంబాయి జైల్ మాన్యుయల్ ప్రకారం ప్రతి ఖైదీకి ఏర్పరచిన చోటు 40 చదరపుటడుగులు.

(హౌసింగ్ పానల్ నివేదిక, జనవరి 1946)

ఇందుకుతోడు. బొంబాయి జనాభాలో నూటికి పదముగ్గురు వీధుల్లో నేడు పడుకొంటున్నారు. యుద్ధానికి పూర్వం వీధుల్లో పడుకుంటున్నవారు నూటికి 5 గురు మాత్రమే.

ఇక గృహపారిశుధ్య విషయంలో పిట్లీ రిపోర్టులో ఇలావుంది :

"పారిశుధ్య విషయం ఉదాసీనంగా చూస్తున్నారన్నందుకు నిదర్శనంగా కుళ్ళిన దిబ్బలు. కుప్పలుగా పడున్న కసవు. వీటితోబాటు పాయిఖానాలు లేనందువల్ల, గాలీనేలా పూర్తిగా కలుషితమైపోయింది. ఎక్కువ ఇళ్ళల్లో కిటికీలుగాని, వెలుతురుగాని వచ్చేందుకు తగిన మార్గాలులేవు. సామాన్యంగా ఒకగదే ఒకఇల్లు. దానికి ఒకేఒక వాకిలుంటుంది. లోపలికి పోవాలంటే వంగిపోవాలి. అంత ఎత్తుతక్కువగా వాకిళ్ళుంటాయి. ఉండటానికి కొంత ఏదో ప్రత్యేకమరుగును ఏర్పచుకోవాలి. గనుక కిరోసిన్ డబ్బాలు, గోనెసంచులు ఆ మధ్యలో తెరలుగా ఉండటంవల్ల గాలి, వెలుతురు ప్రవేశం మరింత పరిమితమైపోయింది. ఇలాంటి ఇళ్ళల్లో మానవులు పుడుతూ, నిద్రపోతూ, తింటూ బతుకుతూ, చస్తూ ఉన్నారు" (పుట 271)

కార్మికుల ఆదాయవ్యయాలను పరిశీలించిన బొంబాయి లేబరు ఆఫీసు విచారణలో (1932-33) నీటిసరఫరా గురించి ఈక్రిందివివరా లున్నవి :

నూటికి ఇరవై ఆరుపాళ్ళు ఇళ్ళమొత్తంలో, 8 భాగాలకు ఒక కుళాయివున్నది. నూటికి 44 యిండ్ల మొత్తంలో 9-15 భాగాలకు ఒకకుళాయి ఉండేది. ఇక నూటికి 29 పాళ్ళు ఇళ్ళల్లో 16 భాగాలకు ఒక కొళాయి ఉండేది (బొంబాయి కార్మికుల బడ్జెట్ల విచారణకమిటీ నివేదిక. 1935) 8 భాగాలకు కలిసి ఒక పాయిఖానా ఉన్న ఇళ్ళు నూటికి 85 ఉన్నవి. 9 నుండి 15 భాగాలవరకు ఒక పాయిఖానా ఉన్న ఇళ్ళు నూటికి 12 ఉన్నవి. 16 కు పైగా భాగాలకు ఒక పాయిఖానా ఉన్న ఇళ్ళు

నూటికి 24 ఉన్నాయి. 1935 లో అహ్మదాబాదు బట్టలమిల్లుల లేబర్ యూనియన్ కార్మికుల యిండ్లవిషయం విచారణ జరిపింది. 28,706 ఇళ్ళ భాగాలలో వీరు విచారణ జరిపారు. వీనిలో 5,669 ఇళ్ళకు ఏవిధమైన నీటివసతి లేదు. ఇక కొళాయిలంటే 200 కుటుంబాలకు పైగా నివసించే ప్రదేశంలో ఒకటో, రెండో వుంటాయి. 5000 ఇళ్ళకు పాయిఖానాలు లేవు. పారిశుధ్యంగాని, మురుగుపోయే కాల్వలుగాని లేవు.

ఇండస్ట్రియల్ కమిషన్ ముందు ఒక సాక్షి ఇలా చెప్పాడు :

"నాజీవితంలో చాలవరకు దరిద్రం చూచాను. చాలా దేశాలు తిరిగాను. దరిద్రాన్నిగూర్చి ఎంతో చదివాను.... అయినప్పటికీ, బొంబాయిలోని పేదవారి ఇళ్ళు అనబడే వానిని పరిశీలించడానికి వెళ్ళేవరకూ, దరిద్ర కఠోరత్వం, నీచత్వం నేను గ్రహించలేక పోయాను........ (కార్మికుణ్ణి చూడండి) అతని ఇంట్లో అతని కుటుంబంలో ఉన్నప్పుడు ఎవరైనా చూస్తూనే ఇలా అనుకుంటారు: "ఇతను మానవుడా ? లేక అగాధలోకాల నుండి విర్జీవమైన జీవి నొకనిని నేను భావించుకుంటున్నానా" ? అని.

"అలాంటి, అటు పదడుగులు, ఇటు పదడుగులు ఉన్నగదిలో, కదలడానికికూడ తావులేనిచోట, కుటుంబాలు కుటుంబాలే పడుకుంటారు. కంటారు, పొగరేగే పిడకలతో వండుకుంటారు కుటుంబ జీవిత కార్యాలన్నీ నెరవేర్చుకుంటారు. ఆగదికంటే పెద్దగా ఉన్నవి సమిష్టి పాయిఖానాలు మాత్రమే. పాత ఇళ్ళ పై అంతస్తుల్లోని గదులనేవి కేవలం పైన పడే కప్పులతో ఉన్న కలుగులు మాత్రమే. మనిషి వానిలో సరిగా నిల్చే వీలుండదు వెనుకగదులు సామాన్యంగా చీకటిగా భయంకరంగా ఉంటాయి. కొంతసేపు లోపల ఉండి చీకటికి కళ్ళు అలవడిన తర్వాతనే తీక్ష్ణంగాచూస్తే అందులో మనుషులు కనిపిస్తారు."

ఎ. యి. మిరాम్స్ "ఇండియన్ ఇండస్ట్రియల్ కమిషన్ ముందు సాక్ష్యం" (IV, పుట 354)

బొంబాయి ప్రభుత్వం, విచారణకై నియమించిన ఒక లేడీ డాక్టరు ఇలా వ్రాసింది

"ఒక చావడి రెండో అంతస్తులోని 15—12 అడుగుల ఒక గదిలో ఆరుకుటుంబాలు నివసిస్తుండడం చూచాను. ఆఇంట్లో ఆరు ప్రత్యేక పొయ్యిలున్నవి విచారణచేసి ఆయింటిలోఉన్న పిన్నలు, పెద్దలు 30 మంది అని తెలుసుకున్నాను..... ఆగదిలోఉన్న ఆమమంది స్త్రీలలో ముగ్గురు ఇప్పుడో అప్పుడో కనేట్టున్నారు..... ఆరుపొయ్యిల పొగతోనిండిన ఆ గదిలో, రాత్రిలో, ప్రసవానికి ముందు, తర్వాత కూడ మిగతా అపరిశుద్ధ పదార్థాలమధ్య, ఏస్త్రీకైనా ఏశిశువుకైనా శారీరకంగా చాలాబాధలు కలగడం తప్పదు. నేనుచూచిన ఎన్నోగదుల్లో ఈగది ఒకటి. అలాంటివి చాలఉన్నవి.

ఇక కిందిఅంతస్తులలోని గదుల పరిస్థితి మరీ అధ్వాన్నం ఇక్కడ పగటి వెల్తురు మాత్రం ఎలాగో దారిచేసుకొని ప్రవేశిస్తుంది. కాని సూర్యరశ్మి మట్టుకు ఇందులో ప్రవేశించలేదు.

(బొంబాయి లేబర్ గజెట్, సెప్టెంబర్ 1922 పుట 31)

బొంబాయి కార్మికకేంద్రమైన పెరేల్ మధ్యభాగంలోని బట్టలమిల్లు కార్మికులు నివసించే ఈ చావిళ్ళను నేను 1946 ఏప్రిల్ 21 వ తేదీ వెళ్ళి చూచాను. ఒకదానికొకటి ఒరుసుకుంటూవున్న పొడు ఒకరూము గుడిసెలు వరుసలు వరుసలుగా ఒకదానిమీద ఒకటి ఉన్నాయి. గది 12 × 10 అడుగులుంటుంది. ఇందులో గాలి. వెలుతురూ లేదు. ఒక్క కిటికీకూడ లేదు. మేము లోపలికివెళ్ళి చూచాము. కొట్టుకుంటావున్న ఓ నూనెవత్తిమాత్రమే ఆచీకటిని భేదించగలిగింది మండుతున్న పొయివేడి దుర్భరంగా ఉంది. మొదట మేము ప్రవేశించిన ఈ గుడిసెలో 10 మంది మనుషులున్నారు. నెలకు దీనికి అద్దె 7 రూపాయలు. ఇంకో గుడిసెలో 13 చిన్న పొయ్యిలున్నాయి - అంటే అక్కడ పదమూడు కుటుంబాలు నివసిస్తున్నాయన్న మాట. ఆ పేటలోనే నివసించే నా మార్గదర్శి ఆయింట్లో కనీసం 20 మందికి పైగా ఉంటారని చెప్పాడు. కాని మొత్తం జనసంఖ్యను దాచి చెప్పటానికి జడుస్తారు, ఎందుకంటే ఎక్కువ జన మున్నారంటే అద్దె ఎక్కువ ఈయవలసి వస్తుంది. మొదటి మూడువరసలలోను 30 గుడిసెలున్నాయి, ఇందులో మొత్తం 300 మంది ఉంటారు. వీరందరికీ మూడేమూడు కొళాయిలున్నాయి. అందులో సన్నగా ఉదయం, సాయంత్రం మాత్రమే నీరువస్తుంది. అక్కడ మూడు పాయిఖానాలున్నాయి. అడుగున కాలవకు సరీగా నేలకు రంధ్రలున్నాయి. ఒకటప్పుడే నిండిపోయి ఉపయోగించ వీలులేని స్థితిలో ఉంది. పక్కవరుసలో 160 గదులున్నాయి. అందులో 6 కొళాయిలుమాత్రమే ఉన్నాయి. బొంబాయిలో భాగ్యవంతులు నివసించే యితరప్రాంతాల్లో రోజల్లా నీరుంటుంది. కాని, ఇక్కడమాత్రం నీళ్ళచాలక తెల్లవారుజామున, సాయంత్రం రెండుగంటలుమాత్రమే నీరు వదులుతారు.

ఇలా సగం కడుపుకు తిండి, క్రిక్కిరిసిన ఇళ్ళు పారిశుధ్యంలేని నివాసం- ఈదుర్భర పరిస్థితులు ఆరోగ్యాన్నెంతగా చెడగొడతాయో ఊహించుకోవచ్చును. 1937 లో ఇంగ్లాండు, వేల్సులలో వెయ్యిమందికి 12.4 మరణ సంఖ్య అయితే, భారతదేశంలో వెయ్యికి 22 4 మరణసంఖ్య. ఇందులో ఆ పరిస్థితుల శక్తి ప్రతిబింబించింది. ఇంగ్లాండు, వేల్సులలోని ప్రజలకన్నా, భారతీయుని సగటు జీవిత ప్రమాణం సగానికి సగం తక్కువ.

"భారతదేశంలోని జీవిత ప్రమాణం, చాలా పశ్చిమ దేశాలకన్న చాలతక్కువ: 1921 జనాభా లెక్కల ప్రకారం, మగవాళ్ళ సగటు జీవిత ప్రమాణం 24 8 సంవత్సరాలు, స్త్రీల జీవితప్రమాణం 24 7 సంవత్సరాలు, అంటే సగటు ప్రజల జీవిత ప్రమాణం 24 75 సంవత్సరాలు. అదే ఇంగ్లాండు, వేల్సుల ప్రజల జీవిత ప్రమాణం 55,6 సంవత్సరాలు. ఆ

భారత జీవిత ప్రమాణంకూడ 1931 కి పరీక్షించింది. పురుషులు 23 2, స్త్రీల జీవిత ప్రమాణం 22,8 అని తేలింది."

("ఇండస్ట్రియల్ లేబర్ ఇన్ ఇండియా" అంతర్జాతీయ కార్మిక కార్యాలయం (ఐ.యల్.ఓ) 1938, పుట 8, 1931 భారత జనాభా లెక్కలు పుట 98 మీద ఆధారపడి వ్రాసినది) *

ఈ అంశం ప్రసూతి మరణాల్లోనూ కనిపిస్తుంది. పుట్టిన శిశువుల్లో వెయ్యికి 24.5 మరణిస్తున్నారు, ఇంగ్లాండు వేల్సులలో ఈ సంఖ్య 4 1 మాత్రమే అందులోనూ ఉన్న విభేదం చూడండి. పైన వర్ణించిన అధ్వాన్న స్థితిలో ఉన్న అహమ్మదాబాద్ పట్టణంలో మరణసంఖ్య వెయ్యికి 41.05 అయితే, యూరపియన్లు తమ ఆరోగ్యానికి వసతులన్నీ కల్పించుకొని నివసించే అహమ్మదాబాద్ కంటోన్మెంటులో మరణసంఖ్య 12.84 మాత్రమే. అంటే మరణసంఖ్యల్లోనే జీవితపరిస్థితులెంత ప్రతిబింబిస్తున్నాయో కనిపిస్తుంది, భారతదేశంలో శిశు మరణాల్లోనూ యీదుస్థితి కన్పిస్తూనే ఉంది.

ప్రతియేటా పుట్టే ప్రతి వెయ్యిమంది శిశువులలో 163 మంది మరణిస్తున్నారు. 1943 సంవత్సర సంఖ్య ప్రకారం వేల్సు ఇంగ్లాండులలో వెయ్యికి 46 మాత్రమే శిశుమరణ సంఖ్య. ఈ మరణసంఖ్య కలకత్తాలో 239, బొంబాయిలో 248, మదరాసులో 227కి హెచ్చింది. (ఒక గదిలో ఎక్కువ కుటుంబాలు నివసించేచోట ఈ శిశుమరణ సంఖ్య మరీ హెచ్చు. బొంబాయిలో 1926 లో ఒక్కగది

---

* ఈ లెక్కలు భారతదేశంలో బొత్తిగా సరైనవి లేవు. 1931 జనాభా నివేదికలో పౌరపాట్లు మాటికి 20 పాళ్ళుండవచ్చన్నారు. జీవితప్రమాణాన్ని గూర్చిన అధికారుల లెక్కలు 1881 నుండి 1911 వరకిలా ఉన్నాయి.

| | 1881 | 1891 | 1901 | 1911 |
|---|---|---|---|---|
| పురుషులు | 23-67 | 24-59 | 23-63 | 22-59 |
| స్త్రీలు | 25-58 | 25-54 | 23-96 | 23-31 |

1921 జనాభాలెక్కలు తీసిన కమిషనర్లనుబట్టి, జీవితప్రమాణం 1881 నుండి 1911 కి తగ్గిపోయింది. 1921 కి లెక్కలు వెయలేదు. ఇదే ఇంగ్లాండు, వేల్సులో ఆయా ఖైయేళ్ళలోను జీవితప్రమాణం 1881—90 లో 45.4 ఉంటే 1933 లో 60 8 కి అభివృద్ధి చెందింది.

1931 లో వేసిన అంచనాలన్నీ పురుషుల సగటు ఆయుర్దాయం 26.9 అని, స్త్రీల ఆయుర్దాయం 26.6 అనిన్నీ. ఇది కొంత పెరిగినట్లు సూచిస్తుంది కాని ఈ లెక్కలు సరిగా లేవనేది మరణసంఖ్యను, ఆయుర్దాయాన్ని సరిపోల్చిచూస్తే మనకు కనిపిస్తుంది. ఈ 1931 జీవిత ప్రమాణ అంచనాలను బట్టిచూస్తే, మరణసంఖ్య పురుషులలో వెయ్యికి 37, స్త్రీలలో వెయ్యికి 38 ఉండాలి. కాని కాగ్దులలో మరణసంఖ్య వెయ్యికి 23గా ఉంది. "సగటు ఆయుర్దాయాన్ని తెలిపేలెక్కలలో పరమాయస్పష్టగా ఉన్నాయి. అలా ఉన్నవిపున్నట్లు గ్రహించినప్పటికీ సామాన్య మరణసంఖ్య భారతదేశంలో, వెయ్యికి 33 కు తగ్గదని చెప్పడం న్యాయమే."

(జి. చంద్, భారతదేశ కష్టజీవ కోటి, పుట 113.)

భాగాల కుటుంబాల్లో వెయ్యి జననాలకు 577 మరణాలు. రెండుగదుల కుటుంబాలలో వెయ్యికి 254 మరణాలు. ఆసుపత్రులలో శిశుమరణ సంఖ్య వెయ్యికి 107)

సామాన్యంగా భారత దేశంలోని చావులను ప్రభుత్వ లెక్కల్లో "జ్వరం" వల్ల అని వ్రాయటం అలవాటు. (1932-41 లలో బ్రిటిష్ ఇండియాలో 62 లక్షలలో 36 లక్షల చావులు ఏటా) జ్వరమనేది చాలా అస్పష్టమైన పదం. ఇందుతో చాలీ చాలని తిండీ, దరిద్ర పరిస్థితులూ, వానివల్ల ఏర్పడిన అనారోగ్యం-వీని నన్నిటినీ కప్పిపుచ్చు తున్నారు సామ్రాజ్య వాదంపై సానుభూతిగల భారతదేశ ఆర్థిక శాస్త్ర పండితు డొకాయన ప్రతి నాలుగు మరణాలలోను మూడు "దరిద్రంవల్ల వచ్చే రోగాలవల్ల" అని తీర్పు చెప్పాడు చూడండి :

> "1926 లోని ప్రతి వెయ్యిమందికీ 26 7 మరణించు చున్నారు. ఇందులో 20 5 మంది మరణాలు కలరా. మశూచికం, ప్లేగు, జ్వరాలు, అతిసారం,రక్తగ్రహణివల్ల-అనిలెక్కకట్టారు. ఈరోగాలన్నీదరిద్రరోగాల జాబితాలోకి దాదాపు చేరేవే. వీనిలో చాలవరకు అనబడేవే ఉన్నాయి. చక్కని పారిశుధ్య సౌకర్యాలు కల్పిస్తే (పరిశుద్ధమైన నీటి సరఫరా, ఆహారంలో అంటురోగాలు రాకుండా రక్షించడం, మురికిపోయే మంచి మార్గాలు (డ్రైనేజి) ఇంతకన్న గృహసౌకర్యం అవి ఏర్పాటుచేస్తే, అందుతోపాటు తగిన వైద్యసలహా, వైద్యాలయ చికిత్సా ఏర్పరిస్తే పట్ట ణాల్లోని ఈఅపార మరణ సంఖ్యను చాలవరకు తగ్గించవచ్చు; క్షయ, అంటువ్యాధులను చాలా ఆపవచ్చు.... మరణసంఖ్యలో ఎక్కువ భాగాన్ని, ఇప్పటికే విజయవంతంగా పశ్చిమ దేశాలలో అమలు జరిపిన పద్ధతుల ద్వారా రోగాల నరికట్టి తగ్గించవచ్చును."
>
> (వి. అన్. స్త్రీ, "భారత దేశ ఆర్థికాభివృద్ధి' పుట 69)

భారత ప్రభుత్వం 1943 అక్టోబరులో, ఆరోగ్య విచారణ-అభివృద్ధిసంఘం అనేదాన్ని సర్ జోసఫ్ భోర్ అధ్యక్షతను నియమించింది. వారినివేదక 1946 లో ప్రకటితమైంది. అందులో ఖచ్చితంగా ఇలా చెప్పారు:

> "ప్రజారోగ్యానికి కొన్ని ప్రధాన పరిస్థితులను కల్పించాలి. ఆరో గ్యానికి తగిన పరిసరాలు కల్పించడం, తగిన పుష్టికర ఆహారం, ఆరోగ్య రక్షణకు-రోగం రాకుండా చేయడం. వచ్చినప్పుడు చికిత్సకూడ-జనాభా అంతటికీ డబ్బిచ్చుకొనేశక్తి ఉన్నవారికి లేనివారికికూడ వసతికల్పించడం- ఇవి ఆ ప్రధానపరిస్థితులు అపడాఓకివీలున్నరోగాలు, మరణాలు-వీటినిగూర్చి ముందురాశాము. ముఖ్యంగా పై పరిస్థితులు చాలినంత కల్పించకపోవడం వల్ల ఏర్పడినవే పరిసరాల పారిశుధ్యం దేశంలోని చాలప్రాంతాల్లో అతి హీనస్థితిలోఉంది. పుష్టికరంకాని ఆహారం, ఆహారలోపం ఇవి దేశీయుల లోనిఎక్కువమందిలో రోగనిరోధకశక్తిని తగ్గించివేస్తున్నవి. ఇప్పుడున్న చికిత్సావసతులు బొత్తిగా ప్రజావసరాలకు చాలవు. తమ పరిసరాల

అశుభ్రతను, విపరీత రోగాలను సహిస్తూ ప్రజలుచూపే ఉదాసీనతను అరికట్టాలి. అందుకు తగిన ఆరోగ్య విజ్ఞానం, శిక్షణ, లేక పోవడంకూడ ప్రజల అనారోగ్యానికి కారణంగా పరిణమిస్తున్నది."

(ఆరోగ్య విచారణ-అభివృద్ధి సంఘ నివేదిక, 1946, వాల్యూం 1, పుట 11)

ఈ దరిద్ర దారుణబాధలు ప్రపంచంలోకల్లా భారతదేశంలో మరీ నీచ స్థితిలో ఉన్నవన్న అంశం అధికారేతరులైన పరిశీలకులందరూ గుర్తించిన విషయం. భారతదేశంలోని ఒక గ్రామములో నివసించడానికి వెళ్ళిన ఒక అమెరికన్ గుర్తించిన విషయమేమంటే, గ్రామప్రజల వైద్యసహాయ ప్రయత్నాలన్నీ దరిద్రసమస్యతో అరికట్టబడుతున్నాయని, ఆయనిలా రాశాడు :

"మూడు నాల్గు కోట్లమంది ప్రజలు దినానికి ఒకపూటకంటే తిండి లేక శాశ్వత క్షుధాపీడితులై ఉన్నారు. మా యింటిచుట్టూ మూగిన రోగులకు ఆహారం, పథ్యం నిర్ణయించ ప్రయత్నించడం అసాధ్యమైన అంశమైంది".

"కలరా రోగి అంటుగుడ్డలు కాల్చివేయమని సలహాఇస్తే, ఒకవేళ అతను బ్రతికితే కట్టుకోడానికి వేరే గుడ్డలుండవే అని జవాబు వస్తుంది. దరిద్రం అలాంటి దుబారాను అరికట్టుతుంది".

"భారతదేశ గ్రామాలకు అవసరమైనవి మందుమాత్రలు కావు — ఆహారం, విద్య, వారికి కావాలి."

(జి. ఎమర్సన్ "నోరులేని భారతదేశం" 1931)

లండన్ టైమ్సు కలకత్తా విలేఖరి-అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాది-కూడ ఇదే మాట వ్రాశాడు. దగ్గరగా భారతదేశాన్ని చూస్తే "చాలనితిండి" కళ్ళకు వద్దన్నా కనిపిస్తుందని ఆయన కూడా అన్నాడు

"కళ్ళకు వద్దన్నా కనిపించే పుష్టిరహితాహారం, ఆహారలోపం విషాదదృశ్యాలను, చూచి కరిగిపోకుండా, ఎవ్వడూ భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో సంచరించలేడు కడుపార భోంచేయడ మనేది భారతీయులలో అధిక సంఖ్యాకులు ఎరగరన్న అంశాన్ని కూడ ఎవ్వరూ సందేహించలేరు

"అలాగే నాకెక్కువ పరిచయ మున్న బెంగాలులోని ఆరోగ్య ఉద్యోగులు, ప్రజలు ఒకటి రెండు తరాల ముందుకన్నా తక్కువ పుష్టికరమైన ఆహారం తింటున్నారని నొక్కి చెబుతున్నారు"

(కలకత్తా విలేఖరి, లండన్ టైమ్సు, ఫిబ్రవరి 1927)

సామ్రాజ్య వాదుల 180 ఏళ్ళ పరిపాలన తర్వాత తేలిన భారతదేశ ప్రజల పరిస్థితి ఇది.

ఈ దరిద్రస్థితికూడ స్థిరంగా ఉన్నచోటనే ఉండడంలేదనే సంగతి గ్రహించుకోడం ముఖ్యం. ఈ స్థితి నానాటికీ పెరిగి పోతున్నది. ఇటీవల పరిస్థితి దిగనారి

పోతున్నదని కలకత్తా స్టేట్స్మన్ విలేఖరితో చాలమంది సమర్ధులైన పరిశీలకులు ఏకీభ విస్తున్నారు. 1927-28 లలో బెంగాల్ ఆరోగ్య శాఖాధికారి నివేదికలో ఇలాఉంది: "నేటి బెంగాలు రైతులలో ఎక్కువమంది తింటున్న ఆహారం, ఎలుకలు కూడ తిని అయిదు వారాలకంటె ఎక్కువ బ్రతకలేవు....వారి శక్తి ఆహారలోపంవల్ల బొత్తిగా పడిపోవడంవల్ల పాడురోగాల వ్యాప్తిని ఎదుర్కొన లేని స్థితికివచ్చారు" అలాగే 1933లో ఇండియన్ మెడికల్ సర్వీస్ డైరెక్టర్ పూర్వం ఉదహరించిన ట్లుగా "భారతదేశ మంతటా రోగాలు క్రమంగా. వేగంగా అభివృద్ధి చెందుతు న్నాయి" అని రాశాడు. ఈ పరిస్థితి విషమదశలో సామ్రాజ్యవాద పాలనవల్ల మహోన్నతంగా విజృంభిస్తున్న రైతులోకంలోని సంక్షోభానికి సంకటావస్థతో సంబంధముంది. ఆ రైతు సంక్షోభం ప్రధాన సామాజిక రాజకీయ మార్పులకు అతిశక్తి వంతమైన ములుకోల కాగలదు.

## 3. జనాభా ఎక్కువనే వెఱ్ఱివాదాలు

భారతప్రజల దుర్భర దరిద్రానికి మూలకారణమేమిటి?

వాస్తవమైన కారణాలను పరిశీలించేముందు, సామాన్యంగా తీవ్రవిమర్శకు ముందు బదులుచెప్పే కృతక కారణాలను తొలగించే మార్గాన్ని సుగమం చేసుకోవ డం అవసరం.

వీటిలో సామాన్యంగా భారత దరిద్రానికి కారణం సాంఘికంగా దేశం వెనకబడి ఉండడం. అజ్ఞానం, సామాన్యప్రజల్లోఉన్న మూఢాచారాలు (కులభేదాలు గోపూజ, అపరిశుభ్రత, స్త్రీలదుస్థితి వగైరా) అని చెబుతుంటారు. ఇలాంటి అం శాలు భారతదేశ దారిద్ర్యానికి కొంత దోహదమిస్తూన్న వనడంలో సందేహంలేదు. ఇలాంటి అభివృద్ధి నిరోధకరూపాలను నిర్మూలించడం భారతప్రజల ముందున్న పునర్నిర్మాణ కార్యక్రమంలో ప్రధమఘట్టం. కాని వీనిని భారతదేశ దరిద్రకారణ మనడం మట్టుకు గుర్రంముందు బండినుంచడమే అవుతుంది సాంఘిక, సభ్య తల్లో దేశంవెనకబడి ఉన్నదంటే, అందుకు అధమస్థితిలో వున్న అర్థికజీవనం, రాజ కీయదాస్యం ఇవేకారణాలు. అంతేగాని ప్రజలమూఢాచారాలు దరిద్రానికి, దాస్యానికి కారణంకావు. అవిద్యకు దూషణీయమైంది ప్రభుత్వంకాని ప్రజలుకారు. విద్య చెప్పించకుండా ప్రజలనుఅజ్ఞానంలోఉంచే ప్రభుత్వాన్ని ఖండించాలి. ప్రభుత్వం చదు వుకు అవకాశాల్లేకుండా చేసినప్పుడు ప్రజలను దూషించడంలో అర్థంలేదు. మూల సమస్య ఆర్థిక,రాజకీయమైనది. దానిమీదనేసభ్యతాసమస్య ఆధారపడిఉంటుంది. ఒక వేపుదరిద్రపిశాచి కరకరా నములుతుంటే, ప్రయత్నాలన్నింటినీ భగ్నంచేస్తుంటే పున రుద్ధరణ గూర్చి బోధనలుచేసినా, ఆరోగ్యాన్ని గూర్చి ఉపన్యాసాలిచ్చినా సాంఘిక, సభ్యతా హీనస్థితిని పోద్రోలడం సాధ్యంకాదు సమాజవ్యవస్థకు మూలకందమైన భౌతిక పరిస్థితిని మార్చాలి. అప్పుడే జనుల హీనస్థితి తొలగిపోగలదు. అదేఅన్ని టికీ మూలసూత్రం. దీనిని సాధించడానికి వర్గసంబంధాలలో మార్పురావడం అవ

పరం. అంటే ప్రభుత్వస్వరూపంలో మార్పురావాలన్నమాట. ప్రపూర్ణమైన ప్రజా ఉద్యమం ఒక్కటే, సామ్రాజ్యవాద భూస్వామ్య వర్గ కఠోర బంధనాలను విచ్ఛిన్నంచేసి, భౌతిక, సాంఘిక, సభ్యతా అభ్యున్నతికి ఒకేమారు దారితీయ గలదు.

ఈ వివరణంలోని సత్యాన్ని సోవియట్ యూనియన్ బాగా ఋజువుచేసింది. జారుప్రభుత్వం క్రింద ప్రజలనుభవిస్తున్న దరిద్రానికి, వారి అధమస్థితికి, కారణం రష్యా ప్రజల్లో ఏదో సహజమౌఢ్యం ఉన్నదంటూ పండితప్రకాండులు వ్యాఖ్యా నిస్తూండేవారు. కాని కార్మికకర్షకు లేకమై ఒకతూరి తమ పీడకులను నిర్మూ లిస్తూనే, వైజ్ఞానిక సభ్యతావిషయాల్లో తాము సమర్థులమని నిరూపించుకోగలిగారు. సభ్యతాభ్యుదయం నేడన్నిదేశాలకన్న అక్కడ మహోన్నతస్థితి నందుకొన్నది. అవే భారతదేశంలోకూడ రుజువవుతుంది. ఒకవేళ ఆ అభ్యుదయపద్ధతి, దశలు విభిన్నం కావచ్చు కాని ఫలిత మదేఅవుతుంది. దాస్యంయొక్క పురోగమనం ఆగిపోవటంయొక్క బాహ్యచిహ్నమైన వైజ్ఞానిక సభ్యత్వ హీనస్థితిలోనేకాక, అసలు దాస్యంలోనే సామ్రాజ్యవాదులకు, భూస్వాములకు లొంగిపోవడంలోనే, భారతదేశ కర్షకుల వెనుకబడినతనం కనిపిస్తుంది. కాని ఈ హీనస్థితి అంతమై పోతోంది. ఇక్కడే భవిష్యత్తుపై ఆశ పొడసూపుతోంది.

ఇక భారతదేశ దరిద్రానికి పదేపదేచెప్పే మరోకారణం, జనాభా అధికంగా పెరిగిపోతోందన్న ఊహాజనితవాదం. ఈ వాదం పునరుక్తివల్ల పశ్చిమదేశాల పాఠకుల్లో మరీ విపరీతంగా పాతుకొనిపోయింది. వాస్తవాంశాలను పరిశీలించే అవకాశం వారికి లేదు అందుకోసం ఈ అంశాన్ని పూర్తిగా పరిశీలించి, యధార్థ స్థితికి ఇదెంత విరుద్ధమో చూపడం అవసరం.

క్రూరమానవులను సంతృప్తిపరచే సులువైన అబద్ధాలన్నింటిలోను. దరి ద్రానికి జనాధిక్యత కారణమనేది బహుపెద్దది. ఈసిద్ధాంతానికి మూల పురుషుడు మాల్థస్ అనే అభివృద్ధి విరోధకవ్యక్తి అని అందరికీ తెలుసు. ఫ్రెంచి విప్ల వానికి, లిబరల్ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా కొత్తదేమీ చెప్పలేక తన సిద్ధాంతాన్ని వెళ్ళబుచ్చాడు. ఇది 1798 నాటిమాట. ఇందుకు బహుమతిగా ఈస్టు ఇండియా కంపెనీ కళాశాలలో ఇతనికి ఉపాధ్యాయుని ఉద్యోగం దొరికింది. "మానవ సమాజ అభివృద్ధికోసం చేసే ప్రయత్నాలన్నింటిని, ఇది భగ్నం చేసివేస్తుందని ఇంగ్లీషు భూస్వామి ధనిక పాలక వర్గాలు మహానందంతో ఈసిద్ధాంతాన్ని అభి నందించారు." (మార్క్సు, "కాపిటల్" వాల్యూం 1, అధ్యాయం XXV) వివిధ స్రక్పధాలకు చెందిన వైజ్ఞానికులు, ఆర్థికవేత్తలు ఎంత అవహేళనం చేసినా, ఈసిద్ధాంతం అభివృద్ధి నిరోధకుల వేదాంతంగా అలాగే నిల్చింది. ఉత్పాదనశక్తి బాగాఅభివృద్ధిచెందే సమయంలో. ఇంకీ ఉత్పత్తి ఏమాత్రం పెరగదని ఏవో ఇసప గ్డీలతోగోడకట్టి ఆఊహాసౌధంమీద ఈసిద్ధాంతం మేడలు కడుతుంది. దానిని 19 శతాబ్ది అనుభవం తుత్తునియలు చేసింది. ఆ శతాబ్దిలో జనాభా ఎక్కువకావడం

కన్నా మహత్తరంగా వస్తూత్పత్తి ఎక్కువయింది. అందువల్ల దరిద్రానికి జనాభా పెరగడం కారణంకాక ఇంకెక్కడో దరిద్రానికి మూలముందని తేలిపోయింది. తిరిగి 20 వ శతాబ్దంలో ముఖ్యంగా మొదటి యుద్ధానంతరం ఆర్థిక ప్రతిష్టంభన ఏర్పడినరోజుల్లో, ఈసిద్ధాంతాన్ని తిరిగి బయటికి లాగారు. కాని అంతర్జాతీయంగా లెక్కలున్నందువల్ల తిరిగి ఇది విధ్వంసమయింది; యుద్ధసమయంలో సర్వ విధ్వంసనం జరిగినప్పటికీ ప్రపంచ ఆహారపదార్థోత్పత్తి, ఇతర వస్తూత్పత్తి జనాభా పెరగడంకన్నా చాల ఎక్కువగా ఉంటూనే ఉన్నందువల్ల, ప్రజలు తమ నీచస్థితికి సమాజవ్యవస్థలోని లోపమే కారణమని గ్రహించక తప్పిందికాదు. ఈ వస్తూత్పత్తిని ఎలా ఆటంకపరుద్దామా అని ధనికవర్గం ఆలోచించ సాగింది; ఎన్నో అపూర్వప్రణాళికలను తయారు చేసింది; జనాభా విషయంలో కూడ వారివాదం మారింది. యూరోపు, అమెరికా ప్రజలు తుపాకులకు బలి అవడానికి పిల్లలను తగినంతమందిని తయారు చేయడంలేదని దూషించ సాగారు. ఇలా మాల్థూస్ వాదాన్ని తలక్రిందులుచేసి, "వస్తూత్పత్తిని తగ్గించాలి - జనాభాను పెంచాలి" అని ఆధునిక పాలకవర్గాలు నినాదమిచ్చాయి.

అలా యూరోపు, అమెరికాలలో అపఖ్యాతిపాలై వెళ్ళగొట్టబడిన ఈ కుళ్ళు సిద్ధాంతం, ఇప్పుడు ఆసియాలో తావుచూచుకోవాలని ప్రయత్నిస్తూంది భారతదేశంలోను, చైనాలోను ఉన్న దరిద్రానికి కారణం సమాజ వ్యవస్థకాదని 'జనాభా ఆధిక్యతే'నని అంటగట్ట జూస్తున్నారు. వారు చెప్పేవాదమిది: సామ్రాజ్యవాదుల ఘనమైన పాలనమూలంగా భారత ఖండంలో యుద్ధములేకుండా పోయింది. ఈతి బాధలు, కరువు కాటకాలుకూడా తగ్గాయి. (కాని కరువులు తగ్గలేదన్నది స్పష్టమే. బ్రిటిష్‌పాలనలో 1770 నుండి 20 వ శతాబ్ది ప్రారంభంవరకూ దారుణమైనక్షామాలు వచ్చాయి. వాటితోపాటు, ఒక కోటి 40 లక్షల ప్రజలు 1918 ఇన్ఫ్లుయంజాతో చనిపోయారు. గడచిన బెంగాలు కరువులో 35 లక్షలమంది ప్రజలు మరణించారు. ఇక మిగిలిన ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు ఎడకలతిండితో బతుకుతున్నారు. ఇలా ఉంటే పై పాలకులుచెప్పే కారణాలు తప్పనేది సుస్పష్టమే) అందుమూలంగా జనసంఖ్య పెరక్కుండా ప్రకృతి సిద్ధమైన ఆటంకాలు లేవట! భారత ప్రజలు ఉన్న వస్తు సంపదకన్న ఎక్కువమందిని కంటున్నారట! కాబట్టి భూమి చాలక రైతుల ఒత్తిడి ఎక్కువవుతున్నదట; ఆకలితీరడంలేదట! - (ఇవిరెండూ బ్రిటిష్‌పాలనాఫలితాలేమరి) ఈ బాధలు తొలగాలంటే తెలివైన యూరపియన్ల దామాషాలో తమ జనాభా పెరక్కుండా అదుపులో పెట్టుకోవాలట! ఇదీ పాలకవర్గాల పాట!

భారతసమస్య తీవ్రరూపం తాల్చేకొద్దీ, ఈ వాదం సామ్రాజ్యవాదవర్గాల్లో మరీ ప్రచారమయింది. "భారత శిశువులు తెచ్చే వినాశస్థితిని అరికట్టే భారతదేశపు మాల్థూస్ ఏడీ?" అని ఒక సామ్రాజ్యవాద ఆర్థికశాస్త్రవేత్త అంటున్నాడు. (అన్‌స్టే. "భారతదేశ ఆర్థిక అభివృద్ధి" పుట 475). మరోసామ్రాజ్యవాద అర్థశాస్త్రజ్ఞుడు ఇలా అంటున్నాడు: "యుద్ధము, క్షామం, అంటురోగాలు మొదలైన

ఆటంకాలు లేకుండా. జనాభా ఉన్నతిండికన్నా ఎక్కువ పెరిగిపోయిన భారత దేశం. మాల్థూస్ సిద్ధాంతానికి ఉదాహరణగా కనపడుతున్నది" (యల్ సి. ఏ. నోలెస్. "బ్రిటీష్ సామ్రాజ్య ఆర్థికాభివృద్ధి" పుట 351). ఈ అభిప్రాయం సామ్రాజ్యవాదుల వలలో పడిపోయిన "అతివాద" "అభ్యుదయ నాయక" వర్గాల లోకికూడ వ్యాపించింది. జనన నిరోధక అంతర్జాతీయ కేంద్రం వారి యాజమాన్యంతో లండన్ హైజిన్ ట్రాపికల్ మెడిసన్ స్కూల్లో 1933 న ఆశియాలో జనన నిరోధ మహాసభ సమావేశమైంది. వైద్యసమస్యగానేకాక, జనన నిరోధకం ఆశియా ప్రజల దరిద్ర నిర్మూలనకు ఆర్థిక సాధనంగా ఉపయోగించాలని ఈసభ ఆశయం (ఆశియా జనన నిరోధం నివేదిక: బర్త్ కంట్రోల్ ఇంటర్నేషనల్ సెంట్రల్ ప్రచురణ 1935) ఈవాదం ప్రభుత్వ నివేదికలలోకి ఎక్కింది.

"ఈ అనుకూల పరిస్థితులవల్ల జనాభా త్వర త్వరగా పెరుగుతున్నందువల్ల, ఆహార పదార్థాల ఉత్పత్తి పెరిగినప్పటికీ జీవన ప్రమాణంలో మార్పు రావటంలేదు మంచి రకమైన ఆహారం దొరకటంలేదు. కారణం జనాభా అంతకంటే త్వరగా పెరగడమే భూమి పోషించవలసిన జన సంఖ్య. పూర్వం యుద్ధాలవల్ల ఈతి బాధలవల్ల కరువులవల్ల తగ్గుతూ వచ్చేది ఇప్పుడు యుద్ధం. క్షామం ప్రాబల్యం తగ్గిపోయింది రోగాలవల్ల చనిపోయే వారి సంఖ్య తగ్గింది. అందువల్ల భూమిపై ఒత్తిడి ఎక్కువవుతున్నది.... ఈ పరిస్థితి జనసామాన్యపు జీవిత ప్రమాణంలోని హీనస్థితికి కారణమని మాతోపాటు మరి కొందరు కూడ అంటున్నారు."

(విట్లే కమీషన్ కార్మిక స్థితిపై ఇచ్చిన నివేదిక పుట, 249)

మాల్థూస్ రాయల్ కమీషన్‌కు అధ్యక్షత వహించి కామన్సు మాజీ సభ్యుని నోటగుండా మాట్లాడు తున్నట్టుంది.

అసలు యదార్థాంశా లేమిటి ?

పైవాదనలన్నిటి లోను మొదటిది. బ్రిటిష్ పాలనలో భారతదేశ జన సంఖ్య అపరిమితంగా పెరిగి పోతున్నదని, ఇతర దేశాల కంటే ఇది మితిమీరి పోయినందువల్ల, విపరీత దరిద్రస్థితి ఏర్పడుతున్న దనిన్నీ. కాని చరిత్రాంశాలు ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉన్నాయని ఎందరు గ్రహించ గలరు ?

బ్రిటిష్ పాలనలో భారతదేశ జననంఖ్య పెరుగుదల మిగత యూరపియన్ దేశాలలోకన్నా తక్కువ, ప్రపంచ జనాభా పెరుగుదలలో ఇది అట్టడుగున ఉన్నది. బ్రిటిష్ పాలన మొత్తంగా తీసుకున్నా గడచిన యాభై యేళ్ళ మాత్రం తీసుకున్నా పై అంశం యదార్థమని బోధపడుతుంది.

బ్రిటిష్ పాలనయుగమంతా తీసుకోవాలంటే అంచనాలే తీసుకోవాలి. ఎందు కంటే 1872 వరకూ భారతదేశంలో జనాభాలెక్కలు తీసుకోలేదు. 16 శతాబిఆఖరు

భాగంలో భారతదేశ జనాభాను గూర్చి మార్లాండు ("అక్బరు మరణమప్పటి భారత దేశం" పుట 22) పదికోట్లని అంచనా వేశాడు. ఇప్పటి జనసంఖ్య 35 కోట్ల 30 లక్షలు. అంటే మూడు శతాబ్దులలోను మూడున్నర రెట్లు జనాభా పెరిగిందన్నమాట. ఇంగ్లాండు వేల్సుల జనసంఖ్య 1700 సంవత్సరంలో (ఫిన్‌లాయిసన్-ఇతను ప్రభుత్వోద్యోగి - 1931 జనాభా లెక్కల పీఠికలో వేసిన మొదటి చక్కని అంచనా) 51 లక్షలు ఇప్పుడు జనసంఖ్య 4 కోట్ల 4 లక్షలు అంటే 2½ శతాబ్దిలో 8 రెట్లు పెరిగిందన్నమాట ఇంగ్లాండుజనాభా అభివృద్ధి. భారతదేశం కన్నా రెండింతలు పెరిగింది *

పారిశ్రామిక విప్లవం జరిగింతరవాత యూరోపులోని ప్రాంత విస్తరీకరణం తగ్గింది కనుక. ఆ గత యాభైయేళ్ళలోని లెక్కలను చూదాం 1914 ముందు యూరోపు దేశాలలోని జనాభా పెంపునూ, భారత దేశ జనసంఖ్య పెరుగుదలనూ పోల్చి చూదాం. తర్వాత ఏళ్ళల్లో కొన్నిదేశాల ప్రాంతాలు మరికొన్ని దేశాలలోకి పోవడం జరిగింది అందువల్ల ఆ లెక్కలు కాస్త చిక్కుగాఉంటాయి ఆ దేశాల జనాభా 1870 నుండి 1910 వరకు ఎంతెంత పెరిగిందో ఈ క్రింద ఇస్తున్నాను.

## జనాభా పెరుగుదల 1870 — 1910

| | నూటికి ఎన్నివంతులు |
|---|---|
| భారత దేశం | 18.9 |
| ఇంగ్లాండు - వేల్సులు | 58 0 |
| జర్మనీ | 59.0 |
| బెల్జియం | 47.8 |
| హాలెండు | 62 0 |
| రష్యా | 73 9 |
| యూరోపు (సగటన) | 45.4 |

(బి. నారాయణ్, భారతదేశ జనాభా 1925 పుట 11) ఫ్రాన్సు మినహాయించి, మిగత ఏ యురపియన్ దేశంకన్నా గూడ, భారతదేశ జనాభా పెరుగుదల తక్కువే.

1872-1931 ని మనం తీసుకుంటే, ఈక్రిందివిధంగా పోలిక కనిపిస్తుంది. ఈసమయంలో భారతదేశంలో నూటికి 30 వంతులు పెరిగితే, ఇంగ్లాండు. వేల్సు

* ప్రొఫెసర్ కార్ సాండర్సు ఇటీవల ప్రపంచజనాభాగూర్చి వ్రాసిన ఉద్గ్రంథంలో ("ప్రపంచ జనాభా పాతిపెరుగుదల నేధోరణి" కార్ సాండర్సు రచన, 1936) ఒక విషయం చెప్పాడు. ప్రపంచం మొత్తంమీద జనాభా పెరుగుదలలో యూరోపు భాగం 8 3, నుండి 25.2. ఎక్కువయింది. ఆశియాభాగం 60.6 నుండి 54.5 కు తక్కువయింది. కాబట్టి ప్రపంచచరిత్రలోని యూర్జువాయుగంలో, ఆశియా జనాభా తగ్గిపోతున్నది. యూరోపు జనాభా పెరిగిపోతున్నది.

లలో నూటికి 77 వంతులు జనాభా పెరిగింది. కాబట్టి గడచిన అరవైయేళ్ళుగా ఇంగ్లాండు వేల్సులలో. భారతదేశంలోకన్నా, జనాభా ఇబ్బడిగా పెరిగింది.*

1921—40 ఏళ్ళమధ్యనే భారతదేశ జనాభా ఇంగ్లాండు, మిగతాపశ్చిమ యూరోపురాజ్యాలకన్నా పెరిగింది. (భారతదేశ జనసంఖ్య ఈఏళ్ళలో నూటికి 21 వంతులు పెరిగింది. ఇదే సంవత్సరాలలో అమెరికా సంయుక్తరాష్ట్రాల జన సంఖ్య నూటికి 24 వంతులు పెరిగింది. కాని, భారతదేశంలో దరిద్రసమస్య మట్టుకు 1921 తర్వాతనుండి ఏర్పడింది. కాదు. •

సెంట్రల్ బాంకింగ్ విచారణకమిటీ భారతదేశ ఆర్థికతస్థితినిగూర్చి చాలవరకు సమగ్రంగా విచారణ జరిపింది. ఇదే ఇటీవల విచారణల్లో అధికార పూర్వకమైనది. ఈకమిటీ నివేదిక 1931 లో ప్రకటితమైంది. జనాభా పెరగడమే భారతదేశ దరిద్రానికి హేతువన్నవాదంలోని బండారాన్ని ఈనివేదిక బయటపెట్టక తప్పిందికాదు.

> "మనిషి ఒక్కంటికి, ఎకరం ఒక్కంటికి ఇపుడుజరిగే భూమిపంట ఇతర దేశాలలోకంటె చాల తక్కువ.... సామాన్య రైతు ఇప్పటికీ చాలని తిండితో పనిచేయలేకపోతున్నాడు. ఇందువల్ల దేశంలో మరణసంఖ్య విపరీతంగా పెరుగుతోంది.... ఇందుకు కారణం కేవలం జనాభా పెరిగి భూమిమీద ఒత్తిడి ఎక్కువ కావడమేనని అంతా దానికే అంటకట్టలేము.

---

* ఫామిన్ ఎంక్వయిరీ కమీషన్, ఆఖరి నివేదిక, 1945 పుట 75

• భారతదేశంలో 1921-31లలో జనాభా పెరిగిన ఉదాహరణ చూసి సామాన్యంగా కొందరు చేసే నిర్ణయాలపై ప్రఖ్యాత సంఖ్యా శాస్త్రవేత్త (Statistician) డాక్టర్ ఆర్. ఆర్. కుక్‌జిన్‌స్కీ అనుమానం వెళ్ళబుచ్చాడు. ఈ కొందరి నిర్ణయాల మీదే 'భావిజనాభా అధిక్యం' పై జోస్యాలు చాలమంది చెప్పారు: కుక్‌జిన్‌స్కీ ఇలా రాశాడు

> "జనాభా లెక్కలు తీసిన చాల దేశాలలో ఇప్పుడెంతమందున్నారో సుమారు దాదాపుగా చెప్పగలమేమో గాని, జనన మరణాల లెక్కలు సమగ్రంగా లేవు గనుక, జనాభా భావిగతిని గూర్చి మనకేమీ తెలియదు. భారతదేశంలోని జనాభా లెక్కలను బట్టి చూస్తే, 1921-31 లలో 3 కోట్ల 40 లక్షల జనం-నూటికి 10.6 మంది-ఎక్కువైనట్టు కనిపిస్తుంది. కాని 1931 జనన మరణ లెక్కలు చూస్తే, మరణాలెక్కువగా కనిపిస్తాయి. ఇక ఒకొకదంపతులకు పుట్టిన బిడ్డలసంఖ్య, చాలమంది విధవలు ఉండడం గమనిస్తే జననసంఖ్య తక్కువ స్థితిలో ఉందని చెప్పవచ్చు. కాబట్టి 1931లో కనపడే జనాభా అధిక్యత నిజమైందికాదు. 1931 లో లెక్కలు కొంత వికరంగా తీయడంవల్ల, తాత్కాలిక ప్రయోజనంవల్ల, జననా లెక్కువ ఉన్నట్టు మరణాలు తక్కువ వున్నట్టు కనిపిస్తూంది"

(డాక్టర్ ఆర్. ఆర్. కుక్‌జిన్‌స్కీ, "ప్రపంచం జనాభా భావిగతి" స్టాటిస్ట్ పత్రిక, డిశంబర్ 25-1937)

ఇక జననాల దామాషా తగ్గుతొందని లెక్కలే చూపిస్తున్నాయని తెలుసు కోవడం మంచిది. జననాలు వెయ్యికి 38 (1901-1910 లోను) 34, (1931-40 లో) 26, (1943 లో) ఇలా క్రమంగా తగ్గిపోతున్నవి.

ఇంగ్లాండులో జనాభా ఎంత పెరిగిందో, భారతదేశంలో ఎంత పెరిగిందో పోల్చిచూదాము: రెండు దేశాల లెక్కలువున్న 30 ఏళ్ళలోని సంఖ్యలను పోలిస్తే ఇంగ్లాండు వేల్సులలో 1891 నుండి 1901 కి నూటికి 12.17 పెరిగింది; 1901 నుండి 1911 కు నూటికి 10 . 91 పెరిగింది; 1911 నుండి 1921 కి నూటికి 4 . 8 పెరిగింది. అదేకాలంలో క్రమంగా బ్రిటిష్ ఇండియాలో నూటికి 2 . 4; 5 . 5; 1 . 3 మాత్రమే జనాభా పెరిగింది."

(సెంట్రల్ బ్యాంకింగు ఎంక్వయిరి కమిటీ రిపోర్టునుండి. 1931. పుట 40 . 1)

ఈజనాభా క్రిక్కిరిసి ఉన్నదా? భారతదేశం మొత్తంమీద 1941 లో ఒక చదరపు మైలుకు 246 గురు చొప్పున ప్రజలు నివసిస్తున్నారు మరి ఇంగ్లాండు వేల్సులలో 703, బెల్జియంలో 702, హాలండులో 639, జర్మనీలో 348 మంది ఒకొక చదరపు మైలుకు నివసిస్తున్నారు. ఈలెక్కలు పరిమితమైనవి. ఎందు కంటే ఒకొక జిల్లాలో ఒకొకరకంగా ఈసంఖ్య ఉంటుంది. కాని ఎక్కువ జన సంఖ్య క్రిక్కిరిసి ఉన్న బెంగాల్లో చూచినప్పటికీ ఒకొక చదరపు మైలుకు 779 మంది మాత్రమే ఉన్నారు. అంటే ఇంగ్లాండు, వేల్సులకన్నా కాస్త ఎక్కువ. బెంగాలులోని కొన్ని ప్రత్యేక జిల్లాల్లో జనం మరీక్రిక్కిరిసివున్నమాట వాస్తవమే. ఉదాహరణకు ఢక్కాలో ఒకొక చదరపు మైలుకు 1542 మంది, తిప్పేరాలో 1525, ఫరీదుపూర్‌లో 1024 మంది జనం ఉన్నారు. కాని ఈప్రత్యేకం జనం క్రిక్కిరిసి ఉన్న జిల్లాలను బట్టి చూచినప్పటికీ, ఆహార వుత్పత్తికన్నా జనాభా పెరిగిపోయిందా అనే విషయం "బెంగాలు జనాభా రిపోర్టు" 1931 లో చూడ వచ్చును. (పుట చూడు 71—72)

దేశంలో ఉత్పత్తి అవుతున్న ఆహార పదార్థాల కన్న జనసంఖ్య ఎక్కువగా పెరిగి పోతూంచా? వ్యవసాయాభివృద్ధిని బుద్ధిపూర్వకంగా ఉదాసీనంగా చూచి నప్పటికీ, వ్యవసాయానికి తగిన భూమిలో ఏదో కొంత భాగాన్నిమాత్రమే సేద్యం చేస్తున్నప్పటికి కూడ ఉన్న లెక్కలు నేటివరకూ అలాంటిదేమీ జరగలేదని సూచి స్తున్నవి. ఉత్పత్తి అవుతున్న ఆహారం మాత్రమే చూస్తే తగినంత లేదు; అందు లోనూ కొంత ఎగుమతయి పోతున్నది. కాని ఈ లోపానికి కారణం, ఉత్పత్తి సాధనాలు పాతకాలం నాటివి కావడం, భూస్వామ్య జమీందారీపద్ధతి, వ్యవసాయ కుల మీదున్న భారాలు మాత్రమే కాని, జనాభా ఉత్పత్తిని దాటిపోవడం కాదు. అంతేకాదు, పైగా నేటివరకూ ఆహారోత్పత్తి జనాభా ఉత్పత్తికన్నా యెక్కువే ఉన్నది.

1891 నుండి 1921 వరకు జనాభా నూటికి 9 . 3 హెచ్చింది. అదే కాలంలో ఆహార ధాన్యం ఉత్పత్తి చేసే భూమి నూటికి 19 పాళ్ళు హెచ్చింది. అంటే జనం పెరుగుతున్నంతకు రెండింతలు ఎక్కువగా.

పి. జె. థామస్ రచించిన "జనాభా ఉత్పత్తి" లో (1935 లో ప్రచురితం) 1921—31 కి సంబంధించిన లెక్కలు మనకు దొరుకుతాయి. 1920-21,

1921-22 సం॥ల సగటుసంఖ్యను 100 గా తీసుకొని 1930—31, 1931—32 సంవత్సరాలకు 110.4 కు జనాభా పెరిగిందని, 116 కు వ్యవసాయోత్పత్తి పెరిగిందనీ, 151కి పారిశ్రామికోత్పత్తి పెరిగిందనీ ఆయన లెక్కవేశాడు ఇంకోవిధంగా చెప్పవలసివస్తే, విపరీతంగా జనాభా పెరిగిన ఆపదేళ్ళలోను, జనం నూటికి 10.4 వంతులు పెరిగితే, వ్యవసాయం నూటికి 16 వంతులు, వ్యవసాయోత్పత్తి 51 వంతులు పెరిగింది.

మాల్థాస్ ప్రియశిష్యుడు, మహాప్రళయం రానున్నదనిచెప్పే ప్రవక్త అయిన రాధా కమలముఖర్జీ, ఇటీవల తానురాసిన "నలభైకోట్ల మందికి ఆహార ప్రణాళిక" (1938) అనేపుస్తకంలో "మొత్తం వ్యవసాయోత్పత్తి, జనాభా అభివృద్ధికన్నా మించిపోయింది." (పు13) అని ఒప్పుకోక తప్పలేదు. ఈనిశ్చయానికి హేతువులైన ఈక్రింది లెక్కలను ఇవ్వకాతప్పలేదు.

## భారతదేశంలో జనాభా ఉత్పత్తుల అభివృద్ధి 1910-1933

(1910-11 నుండి 1914-15 వరకున్న సగటుసంఖ్యను ప్రాతిపదికగా తీసుకొనివేసిన ఇండెక్సు నెంబరు)

| | జనాభా | అన్ని పంటలు | ఆహారం పంటలు | ఇతర పంటలు | పారిశ్రామిక ఉత్పత్తి |
|---|---|---|---|---|---|
| 1910 - 11 నుండి 1914 - 15 వరకు సగటున | 100 | 100 | 100 | 100 | 100 |
| 1932 - 33 లో | 117 | 127 | 134 | 121 | 156 |

(ఆర్. ముఖర్జీ, "నలభైకోట్ల మందికి ఆహార ప్రణాళిక" 1938 పుట 17, 27)

జనాభాకన్నా ఆహారోత్పత్తి రెండింతలు వేగంగాను, పారిశ్రామికోత్పత్తి మూడింతలు వేగంగాను అభివృద్ధి చెందింది.

1900 - 30 వరకున్న ముప్పై ఏళ్ళ సంగతిని సమీకరించి ప్రొఫెసర్ థామస్ ఇలా వ్రాశాడు.

> "1900 నుండి 1930 వరకు భారత దేశంలో జనాభా నూటికి 19 వంతులు ఎక్కువయింది. కాని ఆహారవస్తూత్పత్తి, ముడివస్తూత్పత్తి 30 వంతులు, పారిశ్రామిక వస్తూత్పత్తి 189 వంతులు పెరిగింది. 1921 - 30 ల మధ్య జనాభా ఒక్కగంతు ముందుకేసింది; కాని ఉత్పత్తికూడా దానికి తగ్గిపోలేదు. అలా అభివృద్ధి, తర్వాత వాణిజ్యంలో క్లిష్టసమయం వచ్చినా తరగలేదు. పారిశ్రామికోత్పత్తి ఇండెక్సు నెంబరు (1928 లో 100 అనుకుంటే) 1934 - 35 లో 144 కు పెరిగింది. 1935 లో మరింత ఎక్కువకూడా కావచ్చు."

"ఇదంతా జనాభా, ఆహారోత్పత్తిని మించి పెరిగిపోవడంలేదని సూచిస్తున్నది.... జనాభా, ఆహార ఉత్పత్తిని మించిపోతుందనే భయ భ్రాంతులకు లెక్కలు అనుకూలంగాలేవు. భారతదేశంలో 'దిక్కు మొక్కు లేని పిల్లలను' గూర్చి గాభరాపడేవారు; జాతీయాదాయాన్ని పంచడంలో చక్కని ఏర్పాట్లుచేయడం, వస్తు వుపయోగంలో గుణాన్ని పాటింప జేయడం, జనాభాను భూమికి తగినట్టు సర్దడం, ఇలాంటి అంశాలవైపు తమ దృష్టిని మరలించడం మంచిది."

(ప్రొఫెసర్ పి. జె. థామస్, లండన్ టైమ్సు, అక్టోబర్ 24, 1935)

ఈ లెక్క లన్నిటివల్లా వస్తూత్పత్తిని మించి జనాభా ఉత్పత్తి పెరగడమే భారతదేశ దరిద్రానికి కారణమనడానికి యదార్థాంశాలేవీ అంగీకరించడంలేదు. జనాభా ఉత్పత్తిని మించి ఆహార వస్తూత్పత్తి ముందుకు పోయింది. దరిద్రానికి మూలం ఇంకెక్కడుందో చూడాలి. *

ఇలా చెప్పామని, భూస్వామ్య విధానం పన్నువిధానం. ఉత్పత్తి విధానం, పరాన్నభుక్తులు, ఉన్న కార్మికశక్తిని దండగ చెయ్యడం మొదలైన నేటి విషమ పరిస్థితులక్రింద జరిగే ఇప్పటి ఉత్పత్తి, జనాభా అవసరాలకు తగినంత చాలు అని అర్థంకాదు. ఇది బొత్తిగా చాలదు. సామాన్యజీవనం గడిపే ఏ వ్యక్తికిగాని, స్త్రీ గాని, పురుషునకుగాని రోజుకు 2,400 కాలరీలను ఉత్పత్తి చేసే ఆహారం కావాలి. అందులోనూ శరీరకష్టం చేయనివారికి, కొద్దిగా పనిచేసేవారికి 2500 నుండి 2600 కాలరీలవరకు ఉత్పత్తి చేయగల ఆహారం కావాలి; బరువు పనిచేసేవారికి 2800 నుండి 3000 వరకు కావాలి. "భారతదేశంలోని కోట్లకొలదిమంది సామాన్యంగా తీసుకునే ఆహారం" కేవలం 1750 కాలరీలు మాత్రమే రోజుకు ఉత్పత్తి చేయ

---

* దరిద్ర కారణం భారత సామాజిక - ఆర్థిక వ్యవస్థలోవుంది. దీనిని సామ్రాజ్య తత్వం ప్రజలపై రుద్దింది. తత్ఫలితంగా రైతులు దిగజారిపొయ్యారు. ఆహారోత్పత్తి తగ్గి పోయింది. ఈ విషయం బ్రిటిష్ ఇండియాకు చెందిన భారతప్రభుత్వోద్యోగి డబ్ల్యు. బర్న్స్ లెక్కలవల్ల స్పష్టమవుతుంది:

| సంవత్సరం | ప్రధాన ఆహార ధాన్యాల భూమి (లక్ష ఎకరాలు) | ప్రధాన ఆహార ధాన్యాల ఉత్పత్తి (లక్ష టన్నులు) | జనాభా (లక్ష మనుష్యులు) |
|---|---|---|---|
| 1921 – 22 | 15,86 | 5,43 | 23,36 |
| 1931 – 32 | 15,69 | 5,01 | 25,68 |
| 1941 – 42 | 15,65 | 4,57 | 29,58 |

(డబ్ల్యు. బర్న్స్, "భారత వ్యవసాయాభివృద్ధికి సాధన సంపత్తి, వాని అవకాశాలు" 1944

1921 – 22, 1941 – 42 ల మధ్య బ్రిటిష్ ఇండియా జనాభా 6 కోట్ల 22 లక్షల ఎక్కువయితే, ప్రధాన ఆహార ధాన్యాలు పండించే భూ వైశాల్యం 20 లక్షల ఎకరాల తగ్గింది. ఉత్పత్తి మరీఘోరం. 86 లక్షల టన్నులు లోటు ఏర్పడింది.

గలిగినదని డాక్టర్ ఆయ్క్రాయిడ్-కూనూరులోని ఆహారపరిశోధనశాలల డైరెక్టర్- "భారత ప్రజల ఆహారంలోని పోషణశక్తి-సంతృప్తికరమైనా అహార ప్రణాళిక" అనే ఆరోగ్యకరపత్రం 23 లో వ్రాశాడు. (1) (ఆరోగ్య విచారణ అభివృద్ధి కమిటీ నివేదిక, వాల్యూం ! పుట 69–70) అంతేకాక భారతప్రజల ఆహారంలో, క్రొవ్వు, మాంసకృత్తులు సామాన్యంగా రక్షక పదార్థాలు చాలతక్కువ. దేశం సగటున అంచనా వేసిన పాల ఉత్పత్తి 11300 కోట్ల పౌనులు. ఇది కనీసం కావలసిన ఆహారభాగంలో సగంకూడాలేదు.

దేశంలోని అపారంగా ఉన్న సహజసంపదను అభివృద్ధిచేసి భారత ప్రజలకు సరఫరా చేయలేకపోయిన, నేటి సమాజ ఆర్థిక వ్యవస్థను, ఈ పైజెప్పిన అంశాలు తీవ్రంగా ఖండిస్తున్నవి. అంతేకాని జనాధిక్యతను ఆలెక్కలు రుజువు చేయడంలేదు. దేశంలోని ఉత్పత్తి అవకాశాలను సమగ్రంగా ఉపయోగిస్తే, ఇంతకన్నా మంచిస్థాయిలో ఉన్న ఆహారాన్ని ఇప్పుడున్న జనసంఖ్యకన్నా ఎక్కువ మందికి, ఇంకరానున్న కొంతకాలంలో ఎక్కువయ్యే జనాభాకంతటికీ సరఫరా చేయవచ్చునని ఆహారనిపుణులందరూ అంగీకరిస్తున్న విషయం. భారతదేశంలోనే సేద్యానికి అర్హమైన భూమిలో ఇప్పుడు మూడోవంతుకు పైగా బీడు పడి ఉన్నది. ఇప్పుడు సేద్యం చేస్తున్న పొలంలోకూడ, మరీపాతకాలపు పద్ధతులనే అవలంబిస్తున్నారు. అందువల్ల, ఇంతకన్నా తక్కువ మనుష్యశ్రమతో ఒకే పంట, (గోధుమను పోల్చిచూస్తే) బ్రిటన్‌లో పండిస్తున్న దానిలో మూడోవంతుమాత్రమే పంటపండుతూంది. అలా భారతదేశ సహజసంపదను సమగ్రంగా ఉపయోగించేందుకున్న ఆటంకాలను తొలగించడంలోనే భారత దరిద్ర నిర్మూలనకు ప్రధాన కర్తవ్యం ఇమిడి ఉన్నది.

ఇక్కడే సామ్రాజ్యవాద ఆర్థికవేత్తలందరూ అసలు ప్రశ్నను వదలి వేసేందుకు "ఇప్పుడున్న పరిస్థితుల్లో" —అంటే ఇప్పుడు సామ్రాజ్యవాద, జమీందారీ భారం, అప్పుల బాధలు, ఆర్థిక అభివృద్ధివిరోధకం, నిర్మాణయుతంకాని ఆర్థిక జీవితం - ఇవన్నీ దేవుడు ప్రసాదించిన సహజ అవసరాలనుకొని - నేటి ఉత్పత్తి చాలదుగనుక, భారతదేశంలో జనసంఖ్య ఎక్కువయిపోయింది అంటున్నారు. భారత దేశంలో మాల్థాస్ పుట్టి "భారత శిశువుల దారుణ వినాశాన్ని" అరికట్టాలని ఆక్రందించే డాక్టరు అన్‌స్టీ, చల్లగా ఈక్రింది విధంగా వాదిస్తున్నాడు:

"భారత దేశంలో ఎక్కువ జనాభా లేదని, ఇప్పుడున్న జనాభానే కాక మరింత ఎక్కువైనా, ఉత్పత్తి పంపకం, ఉపయోగం, వీటిలో అనుభవ సిద్ధమైన చక్కని పద్ధతుల నవలంబిస్తే బాగా పోషించ వచ్చునని

(1) ప్రస్తుతం భారతదేశంలో రేషన్ విపరీతంగా తగ్గించారు. 950 కాలరీలు మాత్రమే ఇప్పటి ఆహారం- మరి బ్రిటన్‌లో 3000 కాలరీలు, అమెరికాలో 3150 కాలరీల ఆహారం నేడు ఇస్తున్నారు (950 కాలరీలుకూడ ఇంకా తగ్గిపోతున్నది. రేషన్ క్రమంగా తగ్గుతున్నది. — అనువాదకుడు.)

కొందరి వాదం. అలాచేస్తే ఇప్పటికన్నా ఎక్కువ జనాభాను పోషించ వచ్చుననేది ఎరూ కాదనడం లేదు. కాని, జనాభా ఆధిక్య స్థాయి ఎంతఅనే సమస్యనిది పరిష్కరించదు. ప్రస్తుత పరిస్థితుల్లో తక్కువ జనాభా ఉంటే తలకు కాస్త ఎక్కువచేయ వచ్చుననేది మట్టుకు నిజం"

(వి. అన్‌స్టీ, "భారతదేశ ఆర్థికాభివృద్ధి" 1936, పుట 40)

"ప్రస్తుత పరిస్థితిల్లో" అనేమాటలో ఉంది కీలకం. ఇదిపైకి ఏదో ఉన్న అంశాలను గుర్తిస్తున్నట్టు కనిపిస్తుంది. కాని, వాస్తవంలో ఇప్పుడున్న సామ్రాజ్యవాదుల. జమీందార్ల పతనా వ్యవస్థ దాని ఫలితాలు ఏదో అవసరమైన పరిస్థితిగా చెబుతున్నది.

ఇలాగే భారత దేశ వ్యవసాయాన్ని విచారించ బయలు దేరిన పెద్దరాయల్ కమిషన్. లావాటి సాక్ష్యాల నివేదికల పుస్తకాలను ఎన్నో భాగాలు ప్రకటించింది. కాని, ప్రధాన సమస్యలైన, భూస్వామ్య విధానం, పన్నుల విధానం, ఇప్పుడున్న పన్ను లెంత అనే సమస్యల జోలికి వెళ్ళలేదు. ప్రభుత్వం ఈ విచారణను నిషేధించింది. ఇవి విచారించకనే ఈ కమిషన్ ఈ సమస్య పరిష్కారసాధ్యంకాదను కున్నట్లుగా, భారత దేశంలో జనాభా ఎక్కువయి పోయింది అని కల్పిత గాధనే వల్లె వేసింది.

పరుపు చాలదని కాళ్ళు కోయాలన్నట్టుగాఉంది, ఈఅధునిక ఆర్థికవేత్తల వ్యవహారం. సామ్రాజ్యవాద పాలనక్రింద నేడున్నఉత్పత్తి వ్యవస్థసరికాదని, జనాభా అవసరాలకు, వారి సహజ సంపత్తివి అభివృద్ధి పరిచేందుకు అసమర్థమని ఈ ఉత్పత్తి వ్యవస్థను అభివృద్ధి పరిస్తే జనావసారాలు తీర్చవీలుందనేందుకు అనుమానం అక్కరలేదు. ఇది తెలినప్పుడు వీరుచేస్తున్న నిర్ణయం, ఇప్పటివ్యవస్థను అభివృద్ధి పరచాలనికాదు, మరి జనాభాను తగ్గించాలి అనే. "పరుపుకన్నా చాలా పొడుపుగా వున్నాడతను; ఇతనికాళ్లు నరికి వేయండి." ఇదీ ధోరణి.

జనాభా సమస్యలవిషయంలో ప్రఖ్యాత ప్రవీణుడు (ఈసంగతిని ఈమహాసభ అధ్యక్షుడే చెప్పాడు.) డాక్టర్ కుక్‌జిన్స్కి ఆశియాలో జన్మనిరోధక మహాసభలో 1933 భారతదేశం విషయంలో జనాభా ఎక్కువయిందన్న భ్రమలను ఖచ్చితంగా బట్టబయలుచేశాడు.

"మనమీ విషయాలను ఉన్నపరిస్థితులలాగే ఉంటాయన్న దృష్టితో ఆలోచించకూడదు. నేడు 20 కోట్ల ఎకరాల భూమి భారత దేశంలో సేద్యం చేస్తున్నారనీ. జనాభాను పోషించేందుకు 35 కోట్ల 30 లక్షల ఎకరాలు సేద్యం చేయాలని చెబుతున్నారు. కాని అన్ని ఎకరాలెందుకు కావాలి ? ఏ పరిస్థితుల్లో అన్ని కావాలి ? ఇప్పుడున్న వ్యవసాయాన్ని మనం అభివృద్ధి పరచక, ఎరువులు వివిధరకాలవి ఉపయోగించకపోతే ఎకరాలెక్కువకావాలి.

భారత రైతులకు శిక్షణకూడ ఇవ్వకనే, భారతీయులందరికీ కావలసిన ఆహారాన్ని 20 కోట్ల ఎకరాలలో పండించి ఉండొచ్చునన్న అంశాన్ని, ఆధునిక వ్యవసాయంగూర్చి ఏ కొంచెం తెలిసినవారుకూడ కాదనలేరు భారత దేశంలోని రైతులు ఈ విషయాలను ఒకటి రెండేళ్ళలో సులువుగా నేర్చుకొనగలరు. భారత దేశంలోనిఅత్యధిక మరణసంఖ్యను, ఆరోగ్యపారిశుధ్య పద్ధతులతో తొలగించ వీలయినట్టే, వ్యవసాయాన్ని అభివృద్ధిపరిస్తే ఆహార లోపాన్ని తొలగించి వేయవచ్చును."

1894 లో ప్రకటించిన "బ్రిటిష్ ఇండియా సహజ సంపదలను గూర్చిన నివేదిక"లో సర్ జార్జి వాట్సు చెప్పిన మాటలను (పూర్వం ఉదహరించాడు) జ్ఞాపకం చేసుకోవచ్చు. ఆయనన్నదేమంటే, "దేశంలోని ఉత్పాదనశక్తిని మాటికి యాభైవంతులు పెంచవచ్చును" అభివృద్ధిపరచకుండా వున్న వస్తుసంపదను మాత్రం చూచినా వ్యవసాయాభివృద్ధికి ఇన్ని అవకాశాలున్న దేశాలు ప్రపంచంలో ఏ ఒకటి రెండో మాత్రమే ఉన్నవి."

ఇటీవల సామ్రాజ్యవాద సానుభూతిపరులైన కొందరు బ్రిటిష్ ప్రవీణులు ఇటీవల తయారుచేసిన ప్రణాళికకూడ మాల్థాస్ జనాభా సిద్ధాంతాన్ని ఖండించి వేస్తున్నది. ఈ ప్రణాళికను గూర్చి పీఠికలో ప్రొఫెసర్ ఎ. వి. లాల్ యిలా వ్రాశాడు .

"అనుభవసిద్ధమైన, కొన్నిసులువైన మార్పులు అమలుజరిపి ఏడేండ్లలోగా భారతదేశంలోని ఆహారోత్పత్తిని 1¼ నుండి 1½ అంతలు ఎక్కువచేయడానికి తగిన సంస్థలనుగూర్చి వివరాలు తయారుచెయ్యడమే" ఈ ప్రణాళిక ఉద్దేశ్యం.

("భారతదేశాని కొక ఆహార ప్రణాళిక" 1945.)

ఈ విషయంలో బెంగాలు జనాభా రిపోర్టు (1931) చెప్పిన అంశాలు తెలుసుకోదగినవి. దాని పీఠికలో ఆహార సరఫరా - జనాభా సమస్యనుగూర్చి ఇలా చర్చించారు ;

"ఇప్పటికే ప్రపంచం అంతటిలోకీ ఇక్కడ జనాభా చాల క్రిక్కిరిసి వుంది. ఇక మరింత జనాభాపెరిగితే - పెరిగే అవకాశాలుకూడా ఉన్నవి - బెంగాలు ప్రజానీకానికి ఇప్పటి ఆహారోత్పత్తి చాలదు. అందువల్ల తగినంత ఆహారం ప్రజలకు ఉండదు అని అపోహలు కలుగవచ్చు.... ఇప్పటికే జనం అతి హీనమైన ఆహారం తింటున్నారు. రాష్ట్రంలోని ఉత్పత్తి అవకాశాలను అభివృద్ధిపరిస్తేతప్ప, జనాభా పెరిగితే మరింత హీనస్థితికి దారితీస్తుందన్నది కూడ కాదనలేము. ఈ రాష్ట్రంలో అవకాశాలు చాల వున్నవి. వానిని తగినంత పెంపొందిస్తే భావి జనాభానుగూర్చి ఆందోళన చెందవలసిన పనిలేదు. మిగత భారతదేశంలాగే బీడుపడిన ఉత్పత్తిశక్తులకు బెంగాలు పేరుమోసింది. ఈ అవకాశాలను అసమర్థమైన సాధనాలతో ఇప్పటివరకు వినియోగించడం జరుగుతోంది. భూసారం ఇంతకన్నా

చెడదు. ఈ ప్రాంతంలో ఎరువులు వేయకనే పంటలు తక్కువ వస్తున్నాయి. ఇప్పటికే పంటలు కనిష్ఠదశకు వచ్చాయి. ఇంక తగ్గవు ఇప్పటి పైరులు తమ ఆహారాన్ని కేవలం వాతావరణంనుండే తీసుకుంటున్నవి. బెంగాలులో రైతు ఎరువుతో భూమిని బలపరచడు. ఎరువులు బాగా వుపయోగించి వ్యవసాయ పరికరాలను అభివృద్ధిపరిస్తే పంటలు చాల ఎక్కువగా పండవచ్చును. ఇలాచేస్తే ఇప్పటికన్నా భారతదేశం మొత్తంమీద ఆహారోత్పత్తి నూటికి 30 వంతులు పెరగ వీలున్నదని అంచనా వేశారు. (జి. క్లార్కు. 17వ వైజ్ఞానికమహాసభ చర్చలు) వ్యవసాయాన్ని చక్కగా చేయవలసినప్పుడు అవసరమైన శరీరకష్టాన్ని మరింత ఎక్కువ తీసుకోవచ్చును. ఇప్పుడు ఇతరదేశాల రైతులకన్నా బెంగాలు రైతు తక్కువ పని చేస్తున్నాడు. అంతేకాక సేద్యానికి తగిన పొలంలో కేవలం నూటికి 67 వంతుల భూమిమాత్రమే ఇప్పుడు సాగుచేయబడుతోంది. పొలాన్నంతటినీ సాగుకుతెచ్చి ఇప్పటికన్నా 30 వంతులు పంటను పెంచగల ఆధునిక వ్యవసాయ పద్ధతులను అమలు జరిపినట్టయితే ఇప్పుడున్న (1931) జనాభా రెండింతలైనా, బెంగాలు సులభంగా ఇప్పటి స్థాయిలో పోషించుకోగలదు" (బెంగాల్ జనాభా నివేదిక, 1931, వాల్యూం 1, పుట 63)

భారతదేశానికి, యురపియన్ దేశాలకు జనాభా పెరుగుదలలో భేదంలేదు. ఇంకా యురపియన్ దేశాలలో జనాభా ఎక్కువగా పెరిగిపోతున్నది. ఉన్నవిభేద మల్లా యురపియన్ దేశాలలో ఆర్థికాభివృద్ధి, ఉత్పత్తి అవకాశాల వైశాల్యం అధికమయింది. అందువల్లనే దేశజనసంఖ్యకూడ త్వరత్వరగా పెరుగుతున్నది. ఆ అభివృద్ధి భారతదేశంలో జరుగలేదు. బ్రిటిష్ ధనికతత్వపు స్వార్థచర్యలవల్ల అభివృద్ధి అరికట్టబడింది. పెరిగిన జనసామాన్యం పూర్తిగా పాతకాలపు సేద్యంపైనే ఆధారపడేస్థితి ఏర్పడింది. దేశంలోని సంపదంతా బయిటికి పోతోంది. పారిశ్రామికాభివృద్ధి ఇతర అవకాశాలు లేకుండా బ్రిటిష్ప్రభుత్వం అరికట్టింది. ఇప్పటికే అధికభారాలతో క్రుంగిపోయిన వ్యవసాయం మాత్రమే ప్రజాసామాన్యానికి ముఖ్య పోషకంగా మారిపోయింది. ఆవ్యవసాయంకూడ అధమస్థితిలో ఉంది దాన్ని పెంచకుండా ఔదాసీన్యంతో చూడడంవల్ల పరిస్థితులంత అధ్వాన్నమయ్యాయి.

భారత ప్రజలుదారుణ దరిద్రానికి మూలం సామ్రాజ్య వాదపాలనకింద ఏర్పడిన సామాజిక ఆర్థిక పరిస్థితుల్లోనే ఉంది. ఇందులో మనుష్యశక్తికి మించిపోయిన సహజకారణాలేవీలేవు. జనభా ఎక్కువయిందన్న భ్రమలకు అవకాశంలేదు. ఈనిర్ణయానికి తగిన సాక్ష్యాన్ని ముందు అధ్యాయాలలో వివరిస్తాను. ఈసాక్ష్యంవల్ల మనంచేసుకోవలసిన రాజకీయ నిర్ణయమిది. భారతప్రజలకు తగిన జీవనాధారం కల్పించడంకోసం, సామాజిక రాజకీయ విప్లవం అవసరం. అదిప్పుడు భారతదేశంలో తప్పనిసరి అవుతున్నది. మనపరిశీలనవల్లసహజంగా తేలే సారాంశమిది.

## మూడో అధ్యాయం

# రెండు ప్రపంచాలకున్న వ్యత్యాసం

"మూరేళ్ళ బ్రిటిష్ పరిపాలన తర్వాత మన గ్రామాల్లో ఏర్పడిన పరిస్థితి ఇది: శాశ్వతంగా ఆహారం కోసం, నీటి కోసం ప్రజలు అల్లాడుతున్నారు. పారిశుధ్యం కాని, వైద్యసహాయం కాని లేదు. రహదారుల సంగతి చూచేవాడు లేడు. విద్యా సౌకర్యాలు శూన్యం. మన గ్రామాల్లో ఎక్కడ చూసినా నిరాశ. నిస్పృహలు సర్వ వ్యాప్తంగా ఉన్నవి. ఈ స్థితిని కళ్ళారా నేను చూచినతర్వాత, బ్రిటిష్ పాలనవల్ల కలిగే లాభాలమీద నాకు నిరాశ ఏర్పడింది. మన దేశంలో సోవియట్ రష్యాను గూర్చి మాట్లాడడమే దాదాపు నేరం. అయినా దానికీ మనకూ ఉన్న వ్యత్యాసాన్ని ప్రస్తావించకుండా ఉండలేక పోతున్నాను. ఆహారోత్పత్తి కార్యక్రమాన్ని, విద్యా సౌకర్యాల అభివృద్ధినీ రోగ నిర్మూలనమూ సోవియట్ దేశంలో ఎంత అమూలోత్సాహంతోనో, ఎంత నైపుణితోనో ముందుకు కొనిపోతున్నారు. వారి ఉత్సాహాన్ని చూస్తే అభినందనంతో మిశ్రితమైన అసూయ నాలో కలుగుతున్నదని ఒప్పుకుంటున్నాను. సోవియట్ యూరోపుకు, సోవియట్ ఆశియాకు మధ్య అవిశ్వాసం కాని, పరాభవ సూచకమైన ప్రత్యేకితలు గాని లేనేలేవు. నేను స్వయంగా చూచాను గనుక అక్కడి పరిస్థితులను ఇక్కడి పరిస్థితులను పోలుస్తున్నాను. ఈ పోలికవల్ల నేను తెల్సుకున్న సారాంశమిది. బ్రిటిష్ సామ్రాజ్యంలో మన ఈ పరిస్థితికి బాధ్యత, పాలకులకు పాలితులకు మధ్యమున్న అఘాతమే" (11 రవీంద్రనాథఠాకూర్. 1936)

"భారత దేశం ఎలా ఉంది. ఎలా ఉండవలసింది, అన్న విషయాన్ని ఉదాహరణచూపి ముగిస్తే ఉపయోగకరంగా ఉంటుందనుకుంటాను. సామ్రాజ్య వాదం భారతదేశంలోని సహజావకాశాలను అభివృద్ధి పరచలేకపోయిందని, ప్రజల జీవితప్రమాణాన్ని పెంచలేకపోయిందని విమర్శిస్తేగాని, సామ్రాజ్యవాదాన్ని ఖండిస్తేగాని కొందరనేవారు: "మీదంతా వట్టి ఊహాకల్పన. పూర్తిగా నీచస్థితిలో ఉన్న విజ్ఞానం, బొత్తిగా చదువులేక వెనకబడివున్న అత్యధిక సంఖ్యాక ప్రజలు ఉన్న ఆశియాదేశంలో ఎన్ని ఆటంకాలు దాటాలో మీరు గ్రహించడంలేదు అనీ.

అలా వాదించేందుకు గత ఇరవై ఏళ్ళవరకూ ఈ అవకాశం ఉండినది. అక్కడున్న పరిస్థితులు మరీఘోరంగా ఉన్నవని వారు ఒప్పుకోక తప్పుకున్నా. అలాంటి పరిస్థితుల్లో ఎవరు పాలించినా అంతకన్నా ఎక్కువేమి చెయ్యలేరని ఆ సామ్రాజ్యవాద సానుభూతిపరులు సమర్థించుకొనేవారు.

నేడలాంటి వాదనకు ఏమాత్రం వెలలేదు. అతిహీనపరిస్థితులనుకూడ, అతివేగంగా మార్చడానికి అవకాశాలున్నాయని ఆధునికయుగంలోని అనుభవం

రుజువుచేసింది. యుద్ధానంతరం టర్కీ పునర్నిర్మాణం, పునరుజ్జీవనం. ఈ విషయంలో ఉదాహరణగా పనికివస్తుంది. భారతదేశం దీనినుండి ఎన్నోపాఠాలు నేర్చుకోవీలున్నది. కాని ముఖ్యంగా, సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు విప్లవం, ఇరవై ఏళ్ళలో సాధించిన విజయానుభవమేమిటి ? పూర్తిగా పాతకాలం నాటి సాధనసంపత్తి, పూర్తిగా నిర్మాణవిహీనత, ఎక్కువ నిరక్షరాస్య ప్రజలుగల ఆదేశంలో సోవియట్ యూరోపు ఆసియా ప్రజలను ఐక్యపరచి సాధించిన విజయాలు, ఎంత అభివృద్ధిచేయ వీలున్నదో ఆచరణలో చూపిస్తున్నవి. ఈ సోవియట్ అనుభవం, ప్రపంచ ప్రజలందరినీ, భారతప్రజలనూ కళ్ళు తెరపించింది. ఈ సామ్యపరిశీలన కొంత వివరంగా చూడడంవల్ల ఇప్పటి భారత దేశస్థితి అభివృద్ధిచెందిన దేశంతో పోలిస్తే ఎంత నిర్జీవంగా ఉన్నదీ బోధపడుతుంది. అందుతోపాటు, సరైన సాంఘిక రాజకీయపరిస్థితు లేర్పరిస్తే, ఎంత సాధించ వీలున్నదోకూడ తెలుస్తుంది. అందువల్ల ఓ ఆశాసూచన బయల్పడుతుంది.

## 1. సోషలిజం, సామ్రాజ్యవాద పాలనలలో ఇరవై ఏళ్ళు

సోవియట్ రష్యాకు 1937 కు ఇరవై ఏళ్ళు నిండాయి. సామాన్యంగా ప్రతివారూ చెప్పే ప్లాసీ యుద్ధమప్పటినుండీ లెక్కవేస్తే, అదే సంవత్సరంలోనే భారతదేశంలోని బ్రిటిష్ రాజ్యానికికూడ 180 సంవత్సరాలు పూర్తి అయ్యాయి. రష్యాలో సోషలిజం చేసినంతకన్నా, సామ్రాజ్యవాదం ఇండియాలో 9 అంతలు ఎక్కువగా చేయవీలున్నదన్నమాట. ఈ రెండు విశాల దేశాలకు ముఖ్యమైన విభేదాలు (ఒకటిస్వతంత్ర సామ్రాజ్యవాదదేశం, ఇంకోటివలసదేశం) ఉన్నప్పటికీ, ఈరెంటికీ సమానాంశాలు చాలా ఉన్నవి. నిరక్షరాస్యులై వెనకబడిఉన్న రైతులే జనాభాలో ఎక్కువమంది; వివిధ సభ్యతాదశల్లో ఉన్న అనేకజాతులు, తెగలు నివసించిన విశాల భూభాగాలు, అభివృద్ధిచేయని సమృద్ధ సహజసంపద; విచ్ఛిన్నమైపోతున్న గ్రామవ్యవస్థలు తప్ప ఏ ప్రజాతంత్రానుభవమూలేని నిరంకుశపరిపాలన- ఇవన్నీ రెండుదేశాలకు సమానమే. కాబట్టి 180 సంవత్సరాలలో సామ్రాజ్యవాదం భారతదేశాన్ని ఏ స్థితికి తెచ్చింది. సోషలిజం రష్యాను ఇరవై ఏళ్ళలో ఎలా మార్చివేసిందీ అనేది పోల్చిచూద్దామనిపిస్తుంది

తరతరాలుగా ఉన్న పీడక వ్యవస్థను కూలద్రోసి, ఆ స్థానంలో ఉపయోగం కోసం ఉత్పత్తిని కొనసాగించే సమిష్టి సంస్థను సోషలిజాన్ని ఏర్పరచాలన్నది ఆధునిక పరిస్థితుల మూలంగా జనించిన ఆధునిక భావం. ఈ అభిప్రాయం ఊహాపథాన్నిదాటి, శాస్త్రీయ దృక్పథంగా మారి నూరేళ్ళు నిండలేదింకా ; ఈ శాస్త్రీయ దృక్పథం నూతన సమాజవ్యవస్థను ఆచరణలో ఏర్పరచి మనకాలంలోనే సమగ్రత నందినది. నేడు సోషలిజం ఆచరణలోకి వచ్చింది. కాబట్టి సామ్రాజ్యవాదం సాధించినదేమిటి, సోషలిజం సాధించిన దేమిటి అని సిద్ధాంతరీత్యానే కాక ఆచరణలోగూడ పోల్చిచూడడానికి సాధ్యమవుతుంది.

ఇందుకు మనం జారిస్టు రష్యాను తీసుకుందాం. అందులోనూ పూర్తిగా సిధిలావస్థలో ఉన్న 1917 కాక బాగా వున్నతస్థితిలో ఉన్న 1913 - 1914 జారు కాలపు రష్యాను, తీసుకుందాం. అలాంటి రష్యాను, సోషలిజం ఇరవై ఏళ్ళు పాలించి 1937 నాటికి దేశాన్నే స్థితికి తెచ్చిందో పోల్చిచూదాం. అలాగే యుద్ధ ప్రారంభంలో 1914 నాటి భారత దేశాన్ని తీసుకుని, 20 ఏళ్ళలో 1934 నాటికి సామ్రాజ్యవాదం ఏం సాధించిందీ, దాంతో సరిపోలుద్దాం. ఆఖరున మధ్యాశియా సోవియట్ దేశాలతో మరింత సూక్ష్మంగా పోల్చి పరిస్థితులు గ్రహించుకుందాము. మైనవి. మధ్యాశియాలో భారతదేశంలోని ప్రత్యేక కష్టాలు, సమస్యలు చాల సన్నిహిత పూర్వం ప్రజల అభివృద్ధిమరీ హీనస్థితిలో ఉండినది.

మొట్టమొదట ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని పరిశీలించుదాము అది ఏ అభివృద్ధికైనా ప్రథమ పరీక్ష.

సోవియట్ యూనియన్‌లో పారిశ్రామికఉత్పత్తి (ఘనపరిశ్రమలు) 1913లో 100 ఉందనుకుంటే ఆ ఇండెక్సు 1937 కు 816.4 కు పెరిగింది ఎనిమిది రెట్ల అభివృద్ధి. ఈఅభివృద్ధి వివిధదేశ ఆర్థికచరిత్రల్లోను అసమానమైనది. రష్యా పారిశ్రామికంగా సమగ్రంగా మారడం, విదేశపెట్టుబడి లేకుండా ఘనపరిశ్రమలు, యంత్రోత్పత్తి, చిన్నపరిశ్రమలు స్థాపించడం మాత్రమేకాక, రష్యా యూరోపు దేశాలన్నిటిలో పారిశ్రామికంగా ప్రథమశ్రేణికి చెందింది. ప్రపంచదేశాలలో రెండోస్థానం ఆక్రమించిందని కూడ పైఅభివృద్ధి సూచిస్తున్నది.

అంతకు ముందు రష్యా 'రైతుల ఖండం'గా విదేశ పెట్టుబడితో ఏకొద్ది పరిశ్రమలో ఉండేవి. అలాంటి దిలా మారింది. మొత్తం దేశంలోని ఉత్పత్తిలో పరిశ్రమల ఉత్పత్తి 1913 లో నూటికి 42 వంతులుండేది. 1937 కు 77 వంతులకు పెరిగింది—అంటే ప్రధానంగా వ్యావసాయక దేశమైన రష్యా, ప్రధానంగా పారిశ్రామిక మైంది. పాటకజనం మొత్తంలో 16 వంతులున్న కార్మికులు 31 వంతులయ్యారు. జాతీయాదాయం 1913 లో 210 వేల లక్షల రూబుళ్ళనుండి 1926-27 ధర ప్రకారం) 1937కు 960 వేల లక్షల రూబుళ్ళకు పెరిగింది—అంటే నాలుగున్నర రెట్లు పెరిగింది.

భారత దేశంలో మొదటి రోజుల్లో ఏ లెక్కలుగాని, పారిశ్రామి కోత్పత్తి సూచికగాని దేశం సగటు ఉత్పత్తి ఆదాయాల లెక్కలుగాని వేయలేదు. ఇది చాల భావగర్భితమైన సంగతి. 1936 ఏప్రిల్‌లో జరిగిన రాయల్ ఆర్ట్సు సొసయిటీ భారత శాఖ సమావేశంలో, టి ఐ. మీల్ 'భారత విదేశసామ్రాజ్యం' అనే వ్యాసం చదివాడు. అందులో తొలిసారి ప్రధాన పరిశ్రమల ఉత్పత్తిని గూర్చి అనధికార అంచనా వేయడం జరిగింది దాని ప్రకారం, 1910-11 నుండి 1914-15 లలో ఉత్పత్తి సగటున 100 గా లెక్కిస్తే 1932-33కు ఇండెక్సు 156గా తేలింది. అంటే నూటికి 356 వంతులు-లేదా సోవియట్ అభివృద్ధిలో 16 వ భాగం (1/16) పెరుగుదల కనిపిస్తుంది. అందులోనూ ప్రారంభదశ చాల హీనస్థితిలో ఉండినది.

1931లో కాకున్నా. పారిశ్రామిక జనాభా లెక్కలు 1911 లోను 1921 లోను తీశారు; విద్యుత్ యంత్ర కర్మాగారాల్లో 20 మందికన్నా ఎక్కువ కార్మికులు పనిచేసే వాటిలో 1911లో 21 లక్షలు కార్మికులున్నారు. 1921 కి 26 లక్షలయ్యారు. అంటే ఏటా నూటికి 2.4 వంతులు ఎక్కువయ్యారు. 20 ఏళ్ళలాగే జరిగితే నూటికి 4.8 మంది ఎక్కువవుతా రన్నమాట. (వాస్తవ స్థితిలో యుద్ధ సమయంలోను. ఆ సమీపకాలంలోను పెరిగినట్లు తర్వాత ఈ సంఖ్య పెరగలేదు) అప్పటికి సోవియట్ అభివృద్ధిలో 1 19 వంతుమాత్రం పెరుగుదల కనిపిస్తుంది. పరిశ్రమల్లో ఉద్యోగం చేసే కార్మికులు 1911 లో 175 లక్షలు. 1931 కి 153 లక్ష లయ్యారు. అంటే జనాభా ఎక్కువయి నప్పటికి ఈ కార్మికుల సంఖ్య నూటికి 12.6 వంతులు తగ్గి పోయింది. ఆధునిక పరిశ్రమలను ఏర్పరచకుండా. ఉన్న చేతిపరిశ్రమలను విధ్వంసనం చేయడంవల్ల ఈస్థితి కలిగింది. దీనిమూలంగా, జనసంఖ్యలో వ్యవసాయం పై ఆధారపడిన వారి సంఖ్య 1911లో 72 వంతులున్నది. 1921 లో నూటికి 73 అయి, 1931 లో కూడ అంతేఉంది. కాని జనసంఖ్యలో పరిశ్రమల్లో పనిచేసే కార్మికుల సంఖ్య 1911 లో నూటికి 11.7 నుండి 1931 కి జనాభాలో నూటికి 10 మంది మాత్రానికే దిగింది. ఇరవై ఏళ్ళలో సామ్రాజ్యవాదం సాధించిన 'అభివృద్ధి' యిది. ఈస్థూల చిత్రాన్ని మరింత సూక్ష్మంగా పరిశీలించి ప్రధాన వస్తూత్పత్తితో పోల్చిచూడవచ్చును. భారతదేశంలో బొగ్గుఉత్పత్తి 1914 లో 164 లక్షలటన్నులు. అది 1934 కు 220 లక్షల టన్నులకు పెరిగింది. అంటే ఇరవై ఏళ్ళలో 56 లక్షల టన్నులు-లేక నూటికి 34 పాళ్ళు పెరిగింది. రష్యాలో బొగ్గు ఉత్పత్తి. 1913 లో 290 లక్షల టన్నులనుండి 1937 కు 1280 లక్షల టన్నులకు పెరిగింది. అంటే 990 లక్షల టన్నులు ఎక్కువయింది. లేదా నూటికి 340 పాళ్ళు పెరిగింది. ఉక్కుఉత్పత్తి భారత దేశంలో యుద్ధానికిపూర్వం అప్పుడప్పుడే ప్రారంభమైంది. 1934—35 కు పదిలక్షల టన్నులుకూడ పూర్తికాలేదు (834,000 టన్నులు మాత్రమే). మరి సోవియట్ యూనియన్‌లో 1937 నాటికి 175 లక్షలటన్నులకు పెరిగింది. ఈసంఖ్య యుద్ధ పూర్వపుఉత్పత్తికన్నా 130 లక్షలటన్నులుహెచ్చు. రష్యాలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 1915 లో 190 కోట్ల కిలోవాట్-గంటలు; 1937 కి 360 కోట్లకు పెరిగింది. ఎనిమిదిరెట్లకన్నా హెచ్చు. విద్యుచ్ఛక్తి ఉత్పత్తినిగురించి భారతదేశంలో లెక్కలు దొరకడంలేదు 1935 లో 250 కోట్ల కిలోవాట్ - గంటలుండవచ్చునని అంచనా వేశారు. ఇది సోవియట్ ఉత్పత్తిలో 1/14 వంతులు మాత్రమే. మనిషి 1కి సోవియట్ విద్యుచ్ఛక్తి సగటున పంచితే దానిలో ఇండియాలో సగటున తలకువచ్చే విద్యుచ్ఛక్తి 1/30 వంతులు మాత్రమే.

ఇక వ్యవసాయరంగంలో ఈవ్యత్యాసం మరింత ఎక్కువగా కనిపిస్తుంది. ఎందుకంటే, జనసంఖ్యలోని అత్యధిక సంఖ్యాకులలో పెద్దమార్పువచ్చింది గనుక, దరిద్రంతో క్రుంగిపోతూ, భూస్వాముల దయాధర్మాలమీద, వడ్డీవ్యాపారస్తుల, కులక్కుల దయమీద ఆధారపడి భూమికోసం బాధలుపడ్డ జారు రష్యాలోని

రైతులు, నేడు స్వతంత్ర సౌభాగ్యాలతో తులతూగే సమిష్టి క్షేత్రాల రైతులుగా మారారు. అతి విశాల సమిష్టిక్షేత్రాలను, ఉచ్ఛస్థితివందిన యంత్రాలతో ఆధునిక పద్ధతులతో సాగుచేస్తున్నారు. సమిష్టిక్షేత్రాలుగా స్థాపించిన మొదటిఏళ్ళలోనే వారి ఆదాయం మూడంతలకు హెచ్చింది 1913 లో సాగు అవుతున్న భూమికంటే 1/3 వంతులు ఎక్కువభూమి సాగులోకి తెచ్చారు. ధాన్యపుపంట 1913 లో 80 కోట్ల 10 లక్షల సెంటినర్లు. అదే 1937కు 120 కోట్ల 20 లక్షల సెంటినర్లకు పెరిగింది. అనగా ఒకటిన్నర రెట్లు హెచ్చు. ప్రత్తిపంట 1913 లో 74 లక్షలు సెంటినర్లు ఉంటే. 1937 లో 2 కోట్ల 58 లక్షలకు పెరిగింది. మూడున్నర రెట్లు హెచ్చు భారతదేశంలోని రైతు సంక్షోభాన్ని వచ్చే అధ్యాయాలలో వివరంగా పరిశీలిస్తాము. ఈ రైతు సంక్షోభం ప్రతి ఏటా మరింత విషమరూపం తాలుస్తున్నది. భూస్వాములయొక్క, వడ్డీ వ్యాపారస్తులయొక్క ప్రభుత్వంయొక్క సమిష్టి ఒత్తిడి రైతులను దివాలా తీయిస్తున్నది. భూములనుండి రైతులను వేరు పరచివేస్తున్నది. పంటలు నాటేభూమి వైశాల్యం, పంటల మొత్తం. జనాభాకంటే కొద్దిగా మాత్రమే పెరిగింది. గడచినకొలంది సంవత్సరాలలో పూర్తిగా తగ్గిపోయినట్టుకూడ చాల సూచనలున్నవి.

ఈ ఉత్పత్తి సహజావకాశాల అభివృద్ధి పరిశీలనం వదలి. విద్య. ఆరోగ్యము, ప్రజా సౌభాగ్యము వీని విషయంలో ప్రభుత్వం చేసిన సాంఘిక కార్యక్రమాన్ని చూచినట్టయితే. సామ్రాజ్యవాదానికీ సోషలిజానికీ ఉన్న వ్యత్యాసం అంతకన్నా ఏమీ తక్కువ లేదు

జారు ప్రభుత్వం బుద్ధిపూర్వకంగా అలాగే ఉంచిన ప్రజల అవిద్య నూటికి 78 మందికి వ్యాపించింది. మరి సోవియట్ పాలనలో నూటికి 8 మందికి మాత్రంగా నిలిచిపోయింది. 1930 లో ప్రతివారు విధిగా ప్రాథమిక విద్య చదవాలని శాసనం చేశారు. 1924 లో ఆ విద్య 7 ఏళ్ళు కనీసం చదవాలని శాసనం ముందుకు సాగింది. ఈ విద్యా విధానం పెద్ద పారిశ్రామిక కేంద్రాలనుండి వ్యాపితమవుతున్నది. ఇదిప్పుడు విశ్వజనీన దశవర్ష విద్యా విధానంగా మారింది.

భారతదేశంలో అవిద్య 1911 లో నూటికి 94 గురకు వ్యాపించి ఉంది. 1931 లో కూడ నూటికి 92 గురికి చదువురాదు. 20 ఏళ్ళ లో సామ్రాజ్యవాదం మొత్తం ప్రజలలో ఏభైవంతు మందినుండి మాత్రం అవిద్యను పారద్రోలగలిగింది.

ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల్లో 1937 లో చదువుకుంటున్న సోవియట్ బాలబాలికల సంఖ్య 2 కోట్ల 94 లక్షలు. అంటే జనాభా మొత్తంలోనూటికి 17 మందికి పైగా (17 2). ఇక జారుకాలం పాతరష్యాలో 78 లక్షలు మాత్రమే బాలబాలికలు చదువుకునేవారు.

ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలల్లో బ్రిటిష్ ఇండియాలో ఏవిధమైన చదివిన, చదువుకుంటున్న బాలబాలికలసంఖ్య 1934 లో 1 కోటి 35 లక్షలు-లేక

జనాభా మొత్తంలో నూటికి దాదాపు 5 మంది (4.9). కాని ఒక విచారణవల్ల తెలిసినదేమంటే ప్రాథమిక పాఠశాలల్లో చదివేవారిలో 3 లో రెండోవంతు ఒకటో తరగతిని దాటిపోవడంలేదు. అయిదులో ఒకటి భాగం నాలుగో తరగతిని చేరడం లేదు ( చూడు " భారతదేశంలో విద్య 1928-29 " 1931, పుట 28 ) కాబట్టి ఆ పరిమితమైన నాలుగేళ్ళ చదువుకూడ అధికారులిచ్చిన 111 లక్షలలోను అయిదోవంతు మాత్రమే-22 లక్షలమంది మాత్రం - చదువుతున్నారు. అంటే మొత్తం జనాభాలో నూటికి ఒకటికన్నా ఈసంఖ్య తక్కువ. (0.8%).

సోవియట్ యూనియన్‌లో 1937 లో. విశ్వ విద్యాలయాల్లోను, ఉన్నత విద్యాసంస్థల్లోను చదివే విద్యార్థులసంఖ్య 551,000. జారు రష్యాలో వీరిసంఖ్య 120,000 మాత్రం. సోవియట్ ఉన్నత విద్యార్థులసంఖ్య జనాభాలో నూటికి 3.2 అన్నమాట.

బ్రిటిష్ ఇండియాలో 1934-35 లలో విశ్వ విద్యాలయాల్లోను, ఉన్నత విద్యాసంస్థలలోను చదువుతున్న విద్యార్థులసంఖ్య 109,800. సోవియట్ దామాషాలో ఇది 1/8 భాగం మొత్తం భారత జనసంఖ్యలో వెయ్యింటికి 0.4 మాత్రం.

వెనుకబడిన స్థితిలో ఉన్న దేశాన్ని అభివృద్ధిపరచేందుకు ముఖ్యావసరం టెక్నికల్ శిక్షణ కాబట్టి ఆవిషయంలో ఈరెండుదేశాలకున్న తారతమ్యం చూదాం. సోవియటు యూనియన్‌లో ఉన్న టెక్నికల్, మాధ్యమిక, కర్మాగార పాఠశాలల పరంపరకు భారతదేశంలో సమానమైనవేవీ లేనేలేవు. ఈ ప్రత్యేక వైజ్ఞానిక విషయాల్లో సోవియటు యూనియన్‌లో పట్టభద్రులైనవారిసంఖ్య ఒక 1937 సంవత్సరంలో మాత్రమే 45,900 (ఇందులో పరిశ్రమల, గృహ నిర్మాణ శిల్పులు, రహదారీ, యాన సౌకర్యాల ఇంజనీయర్లు, వ్యవసాయాది వైజ్ఞానిక శాఖా ప్రవీణులు ఉన్నారు.) భారత దేశంలో, ఇంజనీరింగు, వ్యవసాయం, వాణిజ్యం - వీనిలో పట్టభద్రులైన వారిసంఖ్య 1934-35 లో 960 మంది మాత్రం-సోవియటు సంఖ్యలో 48 వ వంతు. జనాభా దామాషా ప్రకారం చూస్తే సోవియటు సంఖ్యలో 78 వ వంతు మాత్రమే,

ఇక పత్రికలు, ప్రచురణాలు మొదలైన సభ్యతా రంగంలో చూస్తే, 1913లో 859 నుండి సోవియట్ యూనియన్లో 1937 కు 8,521కి పెరిగాయి. పదింతల అభివృద్ధి జరిగింది. పూర్వం దిన పత్రికల చందాదారులు 27 లక్షలుంటే 1937 కు 362 లక్షలయ్యారు. 14 రెట్లు అభివృద్ధి జరిగింది. భారతదేశంలో పత్రికల సంఖ్య 1913-14 లలో 8.24, 1933-34 లలో 1,748; దినపత్రికల చదువరుల సంఖ్యకు లెక్కలు లేవు కాని, చాల తక్కువ వుంటుంది. సోవియట్ యూనియన్‌లో పుస్తకాల ప్రచురణల సంఖ్య 1913లో 8 కోట్ల 67 లక్షలనుండి 1937కు 67 కోట్ల 30 లక్షలకు-దాదాపు 8 రెట్లు పెరిగింది. భారతదేశంలో 1913-14 లలో పుస్తకాల సంఖ్య 12,189 నుండి 1933-34 లలో 16,763 కు పెరిగింది-అంటే ఇరవై ఏళ్ళలో మూడోవంతు మాత్రం పెరుగుదల.

ఇక ప్రజారోగ్యం, సామాజిక సౌకర్యాల విషయంలో సోవియట్‌లో ఏ దేశంలోను లేని వసతులున్నవి. సోవియట్ పౌరుల ఆరోగ్య యోగ క్షేమాలకు పుట్టింది మొదలు చనిపోవు వరకు జాగ్రత్తఉంది. వైద్య సౌకర్యం జబ్బుపడినా, దెబ్బలు తగిలినా భత్యం. ప్రసూతి శిశుపోషణకు సౌకర్యాలు; జీతాలతో సెలవులు కార్మికులకు విశ్రాంతి గృహాలు, ముదుసలి అయితే భత్యం, ఇవన్నీ సోవియట్‌లో ఉన్నాయి. భారత దేశానికి ఇందులో పోలికేలేదు అతి పరిమితమైన సోషల్ భీమా కూడ లేదు. ప్రజారోగ్య చట్టంలేదు. సర్వ సాధారణమైన పారిశుధ్యావకాశాల్లేవు. పట్టణాల్లోగాని పల్లెలలోగాని కార్మికులకు ఆరోగ్య సౌకర్యాలు అధమాధమ స్థితిలో ఉన్నాయి. అసలే శూన్యమని చెప్పవచ్చు.

సోవియట్ యూనియన్‌లో ప్రజారోగ్యఖర్చు, 1913 లో 12 కోట్ల 80 లక్షల రూబుళ్ళనుండి 1928 కి 69 కోట్ల 90 లక్షలకు పెరిగింది. 1933 లో 380 కోట్ల 20లక్షల రూబుళ్ళనుండి 1937కు 905 కోట్లకుహెచ్చింది. అంటే 1937లో ప్రతిసోవియట్ పౌరునికీ సగటున 53 రూబుళ్ళు ఆరోగ్యానికి ఖర్చు పెడుతున్నారు. భారతదేశంలో ప్రజారోగ్యం చూచే బాధ్యత ఎక్కువగా రాష్ట్రాలపై వేయడంవల్ల 1913 లెక్కలను పోల్చడం కష్టం: కాని రాష్ట్రాలు కేంద్రప్రభుత్వం కలిసి ప్రజారోగ్యానికి చేస్తున్న ఖర్చు 1921-22 లలో 4 కోట్ల 73 లక్షల రూపాయలు. 1935-36 లలో 5 కోట్ల 72 లక్షల రూపాయలు. అంటే మొత్తం రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు 1921-22 లలో ఖర్చుపెట్టిన మొత్తంలో నూటికి 2.1 వంతులనుండి 1935-36 లలో 2.6 కు పెరిగింది. అంటే తలాకు రెండున్నరణా దాదాపు పడుతుంది.

ఇక అంతకన్నా పోల్చడానికి బాగావీలున్నవి తీసుకుందాం. సోవియట్ యూనియన్‌లో 1913 లో 138 వేల ఆస్పత్రి మంచాలుండేవి. 1937 కు 543 వేలకు ఈసంఖ్య పెరిగింది. అంటే జనాభాలో ప్రతి 313 మందికి ఒక మంచం సగటున లెక్కవేయవచ్చు, బ్రిటిష్ ఇండియాలో మొత్తం ఆస్పత్రి మంచాలసంఖ్య (ప్రభుత్వానివి, వ్యక్తులవి కూడ ఇందులోఉన్నవి. ఇందులో కొన్ని కేవలం యూరపియన్లకు, సేనలకు మాత్రమే ఏర్పాటయినవి) .1914 లో 48,435 నుండి 1934 లో 72,271కి పెరిగాయి. మొత్తం జనాభాలో 3,810 మందికి ఒకమంచం దామాషాన పడుతుంది, సోవియట్ యూనియన్‌లోని సౌకర్యంలో పన్నెండో వంతుకంటే కూడా తక్కువే.

జారురష్యాలో 1913లో మరణసంఖ్య వెయ్యికి 28 3; దాదాపు భారత దేశంలో 1914 లో ఉన్న సంఖ్యకు (వెయ్యికి 30) సమానమే ఇది. మరి సోవియట్‌లో 1926 కల్లా ఈ సంఖ్యను 20.93 తగ్గించారు. భారతదేశంలో మట్టుకు 1926 లో కూడ 26. 7 కన్నా తగ్గలేదు. మాస్కోలో మరణ సంఖ్య 1913 లో వెయ్యికి 23. 1 ఉండేది - 1926 కు 13.4 కు తగ్గింది. బొంబాయిలో 1914 లో మరణాల సంఖ్య 32.7, నుంచి 1926లో 27.6 మాత్రమే తగ్గింది. మాస్కోలో శిశుమరణాల

సంఖ్య వెయ్యికి 270 ; 1928 - 29 లో వెయ్యికి 120 కి తగ్గిపోయింది. అదే సంవత్సరం బొంబాయిలో శిశుమరణ సంఖ్య వెయ్యికి 255.

పారిశుధ్యాన్ని. అదిలేక ఏర్పడే. అంటురోగాలను చూదాం. టైఫాయిడ్ జ్వరంవల్ల రష్యాలో 1913 లో చనిపోతున్నవారి సంఖ్య వెయ్యికి 7. 3 ఉండేది. ఆ సంఖ్య 1929కి 2 0 కు తగ్గించారు - నూటికి 72 వంతుల తగ్గింపు డిఫ్తీరియా వల్ల చనిపోయేవారి సంఖ్యను 31.4 నుండి 5 93 తగ్గించారు - అంటే నూటికి 80 వంతులు తగ్గింది ; మశూచకాన్ని 4.7 నుండి 0.37 కు తగ్గించారు - నూటికి 90 వంతులు తగ్గింది. (హెచ్. ఇ. సి. గేరిస్టు. "సోవియట్ యూనియన్‌లో సమిష్టి వైద్యం" పుట 357) టైఫాయిడ్. డిఫ్తీరియా (పససరోగం)కు భారత దేశంలో లెక్కలు లేవు ; మశూచికపు లెక్కలు తారతమ్యం చూపేందుకు బాగా పనికివస్తాయి. 1914 లో మశూచికంతో భారత దేశంలో 76, 590 మంది చని పోయారు - జనాభాలో వెయ్యికి 3 2 వంతులు - 1934 లో 83 925 మంది చని పోయారు - అంటే వెయ్యికి 3.0 వంతులు ; 1935 కొంత ఎక్కువయింది. ఇలా ఇరవై ఏళ్ళలోను మసూచికంతో చనిపోయేవారి సంఖ్య వెయ్యికి 3 21, 3.0 లోనే ఉంది. తగ్గలేదు. మరి సోవియట్ యూనియలో 4.7 నుండి 0.37 కు తగ్గిపోయింది,

సోవియట్ యూనియన్‌లో డాక్టర్ల సంఖ్య 1913 లో 19,800 ఉంటే 1937 కు 97 వేలకు పెరిగింది. భారతదేశంలో 1934-35 లో మొత్తం డాక్టర్ పరీక్ష ప్యాసయినవారిసంఖ్య 630. ఇదిగాక ఇంగ్లాండునుండి చదివి వచ్చినవారు ఏకొద్దిమందో ఉంటారు.

ఇవన్నీ వదలి, కార్మికులకున్న ఇతర సౌకర్యాలనుకూడ వదిలి ఒక్క పనిగంటలు మాత్రం తీసుకుంటే. 1922 లో కార్మికులందరి పనిగంటలను సోవి యటు యూనియన్‌లో రోజుకు 8 గంటలకు తగ్గించారు. 1927 లో 7 గంటలకు తగ్గించారు. ప్రమాదకరమైన పనులుచేసేవారికి 6 గంటలపని ఇది. భూగర్భంలో పనిచేసేవారికి. మేధస్సుతో పనిచేసేవారికి. 16-18 ఏళ్ళ వయసున్న వారికికూడ ఈ 7 గంటలపని వర్తిస్తుంది..14 ఏళ్ళకు తక్కువవున్నవాలెవ్వరూ ఉద్యోగంలో చేరడానికి వీలులేదు. ప్రత్యేక పరిస్థితుల్లో 14-16 మధ్య వయసున్నవారిని చేర్చు కుంటారు. కాని వారితో 4 గంటలకన్నా ఎక్కువ పనిచేయించ వీలులేదు.

భారత దేశంలో 1922 లో ఫాక్టరీ చట్టం 11 గంటలపనిని, 1934 లో 10 గంటలపనిని నిర్ణయించింది. 12 ఏళ్ళకు లోబడిన బాల బాలికలను పనిలో చేర్చుకోకూడదని నిషేధించింది. కాని ఈనిబంధనలను సరిగా అనుసరిస్తున్నా రేమో చూచే ఇన్‌స్పెక్టర్ల సంఖ్య చాలతక్కువ (1929 లో భారతదేశమంతటికీ 39 మంది ఉన్నారని విట్లే కమిషన్ రిపోర్టు). అందువల్ల సంవత్సరానికి ఒకసారి కూడ వీరు ఫాక్టరీలు చూడరు. పిల్లవాళ్ళతో పనిచేయించడం అరికట్టలేదు. అదీ కాక, ఈఫాక్టరీ చట్టం చాలకొద్ది పరిశ్రమలకే అనువర్తిస్తుంది. ( ఈ కార్మికుల

సంఖ్య 1936 లో 16 లక్షలు. కాని 1931 జనాభా లెక్కల ప్రకారం 177 లక్షల కార్మికులున్నారు) ఇక ఈ చట్టంక్రిందికిరాని అత్యధిక సంఖ్యాకులైన భారతకార్మికులకు పని గంటల నిర్ణయంకాని, కార్మికరక్షణలుకాని, పిల్లవాళ్ళ పీడనకు నిరోధంకాని, లేనేలేదు. విట్లే కమిటీ రిపోర్టులో, 5 ఏళ్ళ వయసువారు రోజుకు 12 గంటలు పనిచేస్తున్నట్లు తెలిపింది.

ఇప్పుడు మనం పోల్చిచూచిన విషయాలన్నీ స్పష్టంగా, ఖచ్చితంగా ఉన్న లెక్కలను బట్టి ఏ రాజకీయ దృక్పధానికి చెందినవారైనా, పై లెక్కలమీద ఆధారపడి, సోవియట్‌కూ భారత దేశానికీ మధ్య, నాగరికతకూ - పశుత్వానికీ ఉన్న తారతమ్య మని తీర్పు చెప్పక తప్పదు.

అయినప్పటికీ 20 ఏళ్ళక్రిందటి జారిస్టు రష్యాకు, బ్రిటిష్ ఇండియాకు పరిస్థితుల్లో పెద్ద భేదంలేదు. ఈ ఇరవైఏళ్ళ సోషలిస్టుపాలన ఈ మార్పును తెచ్చింది. కాబట్టి తగిన రాజకీయపరిస్థితులు ఏర్పడి, వర్గ శక్తుల సంబంధాలలో మార్పులు వస్తే భారతదేశంలో కూడ ఇలాంటి మార్పును తేవచ్చునన్నది సుస్పష్టంగాకనబడుతున్నది

## 2. మధ్యాశియా రిపబ్లిక్కుల అనుభవం

ఈ తారతమ్యం, సోవియట్‌లోని మధ్యాశియా రిపబ్లిక్కుల అనుభవాన్ని చూస్తే మరింత నిర్ధారణ అవుతుంది.

1913 లోని రష్యాను మొత్తంగా నేటి ఇండియాతో సరిపోల్చి చూచినట్టయితే, మార్పునకు ప్రారంభ స్థితి రష్యాకన్నా ఇక్కడ మరింత తక్కువ దశలోనే ఉన్నది. (తర్వాత జారిస్టు రష్యాలో 1913 తర్వాత ఏళ్ళలో అభివృద్ధి పూర్తిగా వెనక్కు పోతున్నస్థితి.) కాబట్టి ఇరవై ఏళ్ళక్రితం భారత దేశంకన్నా వెనక బడిన స్థితిలో ఉన్న సోవియట్ యూనియన్-మధ్యాశియా రిపబ్లిక్కులతో పోల్చిచూడడం మరింత సరైనదిగా కనబడుతుంది.

భారతదేశానికీ సోవియట్‌కూఉన్న తారతమ్యంకన్నా, మధ్యాశియా రిపబ్లిక్కులకున్నభేదం మరింత స్పష్టంగా కనబడుతున్నది, అక్కడకూడ ఇండియాలోనున్న ప్రత్యేక ఇబ్బందులూ, ప్రారంభదశలో ఇక్కడున్న పరిస్థితులూ అన్నీ ఉన్నాయి. అక్కడి ప్రజలు భారతీయులకన్నా దరిద్రబాధితులైపూర్తిగా పాతకాలపు జీవనంతో హీనస్థితిలో పూర్వం ఉండేవారు. స్త్రీల దుస్థితి, మతంలాంటి ఆశియా సామాజిక, ఆర్థిక సమస్యలన్నీ అక్కడ తీవ్రదశలో ఉండేవి. కాబట్టి వానితో భారత దేశాన్ని పోల్చిచూస్తే, సామ్రాజ్యవాద వలసవిధానానికి, సోషలిస్టువిధానానికి ఉన్న తారతమ్యం అతిస్పష్టంగా కనిపిస్తుంది. హీనస్థితిలో ఉన్న ప్రజల విషయంలో ఈవిధానాలెలా పనిచేసినదీ తేటతెల్లమవుతుంది.

సంయుక్త సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కులు ఏడింటిలో, మూడు సమాన హోదాతో మధ్యాసియా సోవియట్ సోషలిస్టురిపబ్లికులో చేరాయి, ఈ మూడింటిలో

ఒకటి టర్కీమినిస్తాన్. దీనిపై శాల్యం 171 వేల చదరపుమైళ్ళు. జనసంఖ్య 12 లక్షల 50 వేలు. రెండోది ఉజ్బెకిస్తాన్—వైశాల్యం 66 వేల చదరపుమైళ్ళు. జనసంఖ్య 50 లక్షలు. తాజికిస్తాన్ మూడవది—55 వేల చదరపుమైళ్ళ వైశాల్యం. జనసంఖ్య 15 లక్షలు. వీనిని ఆనుకునే కారాకల్పక్ స్వతంత్రరిపబ్లిక్కు. కార్జిజో స్వతంత్ర రిపబ్లిక్కు లున్నాయి. ఈ అయిదు రిపబ్లిక్కులున్నూ కాజక్‌స్తాన్‌కు దక్షిణంలో భారత సరిహద్దులకు సన్నిహితంగా ఉన్నాయి.

"కాజికిస్తాన్‌కు దక్షిణంలో మధ్య ఆశియా - అయిదు సోషలిస్టు రిపబ్లిక్కులు ఉన్నవి. ఆ రిపబ్లిక్కులలోని ప్రజల జాతులను ఆ పేళ్ళే సూచిస్తాయి : ఉజ్బెక్, టర్కోమెన్, తాజిక్, కరాకల్పక్ రాజ్యాలివి.

"ఈ ప్రాంతం సోవియట్ యూనియన్‌కు పూర్తిగా దక్షిణంలో ఉన్నది. పర్షియా, ఆఫ్ఘనిస్తాన్, పశ్చిమచైనాల సరిహద్దులలో ఈ ప్రాంత మున్నది. ఈ మధ్యాశియా సరిహద్దుకు 9½ మైళ్ళలో భారత దేశం ఉంది.

"విప్లవానికి పూర్వం మధ్యాశియా బానిసల, వలసకార్మికుల నివాస స్థానంగా ఉండేది. ఇప్పుడు సమాన హోదాగల జాతులకు, సోషలిస్టు వ్యవసాయానికి, నూతనంగా స్థాపించిన పరిశ్రమలకు నిలయంగా మారి పోయింది."

(మిఖిలోవ్, "సోవియట్ భూగోళం" 1937. పుట 6-7)

భారతదేశానికి కొన్ని మైళ్ళలోనే ఉన్న తాజికిస్తాన్‌ను పరిశీలించుదాము. పూర్వం తాజిక ప్రజల జీవితం సౌఖ్యదాయకంగా లేదు-విప్లవానికి ముందు, జారిస్టు రష్యా కోటలలో తగులొక్కని, భూఖారా అమీర్ నిరంకుశపాలనతో అల్లాడి పోతుండేవారు జారుసామ్రాజ్యవిచ్ఛిత్తితో బయలుదేరిన అంతర్యుద్ధాలు 1925 దాకా ఆఖరుకాలేదు. 1925 లో తాజికిస్తాన్ స్వతంత్ర రిపబ్లిక్కుగా మారింది. 1929లో సోవియట్ యూనియన్‌లో స్వతంత్ర ఫెడరేటెడ్ రిపబ్లిక్కుగా చేరింది.

జారుపాలన తాజిక్ ప్రజలనెంత హీనస్థితిలో ఉంచినదీ ఈక్రింది అంశాలు వెల్లడిస్తాయి. విప్లవానికి ముందు రెండువందల మందిలో ఒకరికి మాత్రం చద వను, వ్రాయను వచ్చు (1911 లో భారతదేశంలో 6.1 చదువుకున్నవారున్నారు). మరి 1933 కంతా నూటికి 60 మంది చదువు నేర్చుకున్నారు. (ఇండియాలో 1931లో నూటికి 8 మందికి మాత్రమే చదువు వచ్చును) 1936 లో 3000 స్కూళ్ళు వెలిశాయి (జనాభాలో ప్రతి 500 మందికి ఒకస్కూలు). ఉన్నత విద్యాసంస్థలు— 5,30 కి పైగా టెక్నికలు కళాశాలలు ఏర్పడ్డాయి. 1939 నూటికి 328,000 విద్యార్థులు (1914 లో 100 మంది మాత్రమే). 21 ఉన్నతవిద్యా సంస్థలు తాజికిస్తాన్‌ను కళకళ లాడించాయి.

1924 లో మొత్తం సాగుచేసిన భూమి వైశాల్యం 1,005,000 ఎకరాలు 1936 కు 1,626,000 ఎకరాలకు హెచ్చింది. వీరి ప్రధానమైన పంట పత్తి.

రైతులలో అధిక సంఖ్యాకులు సమిష్టి వ్యవసాయ పద్ధతిని అవలంబించారు. పత్తి పంటకు ఎక్కువగా యంత్రాలను ఉపయోగించారు. దున్నడం, విత్తులు చల్లడం వగైరాలు ఎక్కువగా ట్రాక్టర్లతో చేయించారు. ముఖ్యంగా మనం గమనించవలసింది నీటి వసతులు (ఇరిగేషన్).

> "ఇక్కడ పత్తిపంట ఎక్కువగా ఇరిగేషన్ మీద ఆధారపడివుంది. 1929 లో తాజికిస్తాన్‌లో ఇరిగేషన్‌కు మొత్తం 30 లక్షల రూబుళ్ళు ఖర్చు పెట్టారు. 1930 లో 120 లక్షల రూబుళ్ళు ఖర్చుపెట్టారు. 1931 బడ్జెటులో 6 కోట్ల 10 లక్షల రూబుళ్ళు ఖర్చు ఏర్పాటుచేశారు. అంటే ప్రతి మనిషికి 50 రూబుళ్ళు సగటున ఖర్చు. కాని ఇందులోని ఎక్కువ భాగం స్థానిక ప్రజలపై పన్నులువేసి కూర్చిన డబ్బుకాదు. ఇది సోవియట్ కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన డబ్బు."

(జె. కునిట్జు, "సమర్కండ్ ఉషోదయం" 1935 పుట 235.)

దీనికీ, భారతదేశంలో చేస్తున్న పిసినిగొట్టు తాపేలునడక అభివృద్ధికీ పోలికెక్కడ ? ఉన్న నీటి వనరులనుగూడ మరమ్మతుచేయక పాడుచేస్తున్నారు; కొత్త జలాధారాలు తక్కువ. (1913-14 లో మొత్తం సాగుబడిలోఉన్న భూమి 4 కోట్ల 68 లక్షల ఎకరాలు. 1933-34 లో 5 కోట్ల 5లక్షల ఎకరాలు) - చాల కొద్ది అభివృద్ధి చేశారు. ఆ కొత్తవికూడ, పెట్టుబడిలాగా పెట్టి ఇరిగేషన్ స్కీముల నుండి ఎక్కువ ఆదాయాన్ని ప్రభుత్వం అపేక్షిస్తున్నది. సగటున నూటికి 7 రూపాయల వడ్డీ గిట్టాలని చూస్తున్నది. కాబట్టి రైతులపై మరింత పెద్ద భారం పడి, ఈ వసతులు పేదరైతులకు ఏ మాత్రం అందుబాటులో లేకుండా ఈ ఇరిగేషన్ నామమాత్రమయింది.

తాజికిస్తాన్‌లో పూర్వం అసలే పరిశ్రమలులేవు. కాని తర్వాత వారి పరిశ్రమాభివృద్ధి అత్యద్భుతంగా పెరిగింది. పాత వలసరాజ్యాలను వ్యవసాయ దేశాలుగానే ఉంచి, కొన్ని ప్రత్యేక దేశాలనుమాత్రం పారిశ్రామికంగా అభివృద్ధి పరచడమనేది సోషలిజంలోలేదు. అసలు పూర్వం వెనకబడిన ప్రాంతాల్లోనే పరిశ్రమల అభివృద్ధికి తీవ్ర ప్రయత్నం జరుగుతుంది.

> "విప్లవంవరకు తాజికిస్తాన్‌లో ఒక్క పరిశ్రమకూడ లేనేలేదు. నేడు నిల్వజేసే ఫ్యాక్టరీలు, సిల్కు ఫ్యాక్టరీలు ఉన్నాయి. ఇవన్నీ ఇటీవల కట్టినవే.....ఇప్పుడు పూర్తవుతున్న వర్జూబస్థు విద్యుచ్ఛక్తికేంద్రం, పట్టణ పరిశ్రమలన్నిటికీ విద్యుచ్ఛక్తిని సరఫరా చేయగలదు....బట్టలమిల్లులుస్టాలినాబాదులో ఎడతెగకుండా పనిచేస్తున్నవి. లెనినాబాదులో పెద్ద సిల్కు ఫ్యాక్టరీ పనిచేస్తోంది. ఈ సంవత్సరం పెద్ద బట్టలపరిశ్రమ, మాంసపరిశ్రమ, ఆసవాల, సిమెంటు ఫ్యాక్టరీల స్థాపనకు ప్రారంభం జరిగింది. ఇప్పుడు

రెండు ఇటుకఫ్యాక్టరీలు, రెండు నూనె ఫ్యాక్టరీలు, పది పత్తిమిల్లులు, పది ముద్రాపకశాలలు పనిచేస్తున్నవి."

(బ్రిటన్‌లోని రష్యా ట్రేడ్ డెలిగేషన్, "మంత్లీరివ్యూ" అనే పత్రికలో, అక్టోబరు 1936, పుట 552)

విప్లవానికి ముందు తాజికిస్తాన్‌లో ఆధునికమైన రోడ్లులేవు. తొలిపంచవర్ష ప్రణాళికలో 181 కిలోమీటర్ల (కిలోమీటర్ = 5 ఫర్లాంగులు) రైల్వేరోడ్డును, 12,000 కిలోమీటర్ల బాటలను వేశారు. అందులో 8000 కిలోమీటర్లు చక్కని మోటారురోడ్డు

ప్రజారోగ్యం చూడండి. 1914 లో తాజికిస్తాన్‌లో 13 మంది డాక్టర్లుండేవారు; 1939 లో 440 మంది అయ్యారు. 1914 లో దేశానికంతా 100 ఆస్పత్రి మంచాలుండేవి; 1939 లో 3,675 కు పెరిగాయి. 1914 లో ప్రసూతి ఆస్పత్రులలో సౌకర్యాల్లేవు 1937 లో 240 ప్రసూతిస్థానాలు (మంచాలు) ఏర్పరచారు. 1914 లో ప్రసూతిశిశుపోషణ కేంద్రాలులేవు; 1937లో 36 వెలిశాయి.

తాజిక్ ప్రజలు సోషలిజంలో ఎంత నూతన జీవితాన్ని అనుభవిస్తున్నారో, ఒక సమిష్టిక్షేత్రంలోని రైతు వ్రాసిన క్రిందిపాటవల్ల తెలుస్తుం. ఈపాటను జోషువాకునిట్జు "సామర్కాండ్‌లో ఉషోదయం" అనే పుస్తకంలో ఉటంకించాడు.

"నేను స్వేచ్ఛావాయువును పీలుస్తున్నాను.
బీడుపడిన మైదానాలను దున్నడం చూస్తుంటే,
ఒక ఆనకట్ట నిర్మాణం చూస్తుంటే,
ఈ నూతన జీవితంకోసం కృషి చేస్తున్నవారిని చూస్తుంటే
కొడుకునుచూచి సంతసించే తండ్రిలా
ఆనందపరవశుణ్ణయిపోతాను.
నూతన మానవులకు జేజేలు కొడతాను,
నా కొడుకుపొలంలో యంత్రం నడుపుతుంటే,
ఇనుప మడత పొలాన్ని చీల్చుకొనిపోతూంటే
శ్రమపడేవారికి జై జై అంటాను.
పాతప్రపంచం తిరిగి వస్తుందని బెదరిస్తే
క్రిందపడి విలవిలా తన్నుకుంటాను
తుపాకినిమ్ము సోదరా; కొన్నితోటాలుకూడా ఇవ్వు.
యుద్ధరంగానికి వెళతాను;
నా మాతృభూమిని, నా సోవియట్ భూమిని
నిలబడి రక్షించుకుంటాను."

55 లక్షల జనసంఖ్య వున్న విశాల రిపబ్లిక్కు ఉజ్బెకిస్తాన్ వైపు చూదాం. విప్లవానికిముందు నూటికి 3.5 మంది అక్షరాస్యులుండేవారు. 1932 కల్లా ప్రాథమిక పాఠశాలల్లో చదివే విద్యార్థుల సంఖ్య 531 వేలకు, మాధ్యమిక పాఠశాలల

విద్యార్థుల సంఖ్య 130 వేలకు పెరిగింది. ఇవిగాక వయోజన విద్యకు 710,000 సంస్థలు పనిచేస్తున్నాయి. సమిష్టి వ్యవసాయాన్ని అభివృద్ధిచేయడంతోపాటు పరిశ్రమలు పెంచారు. 1913 లో పరిశ్రమల ఉత్పత్తి 2690 లక్షలుంటే 1936 కు 117 కోట్ల 50 లక్షల రూబుళ్ళకు పెరిగింది విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 1928 లో 340 లక్షల యూనిట్లుంటే 1936 కు 23 కోట్ల యూనిట్లకు పెరిగింది. ఆ పరిశ్రమలలో 51 నూలుమిల్లులు. బొగ్గు పరిశ్రమలు, వ్యవసాయ యంత్ర పరిశ్రమలు (తాష్కెంట్), ఒక సిమెంటు ఫ్యాక్టరీ, ఒక గంధపు గని. ఒక ప్రాణవాయువు కర్మాగారం, ఒక కాగితపు మిల్లు. ఒక తోలుమిల్లు, గుడ్డలమిల్లులు వున్నాయి. 1914 - 1937 ల మధ్య డాక్టర్ల సంఖ్య 128 నుండి 2 8౦ కు పెరిగింది. విప్లవానికి ముందు వీరికి లిపికూడ లేదు. కొత్త లిపినిపెట్టారు. 1935 కల్లా 118 పత్రికలు, 5 భాషలలో సగటున ఏటా పదికోట్ల కాపీలు అచ్చుపడసాగాయి.

ఈ మహోన్నతమైన మార్పునకయ్యే ఖర్చు నెలా చేకూర్చారు ? ఈప్రశ్నకు సమాధానంచెబితే, వెనకబడిన ప్రజలను పీక్కుతినే సామ్రాజ్యవాదానికీ, సోషలిజం క్రింద వివిధజాతుల సమాన సహకార సంబంధాలకూ ఉన్న వ్యత్యాసం అతిస్పష్టంగా తేటపడుతుంది. సామ్రాజ్యవాద పాలనలో, వలసదేశాల పీడిత ప్రజానీకంనుండి పాలకదేశాల పీడత ధనికవర్గాలకు ఏటా ధనం ప్రవహిస్తూంటుంది. సోషలిజంలో పీడిత ప్రాంత ప్రజలను త్వరగా అభివృద్ది పరచేందుకయ్యే అధిక వ్యయమంతా, సోవియట్ కేంద్ర ప్రభుత్వంబడ్జెటులోనుంచి ఎక్కువగా ఖర్చుపెడతారు. ఈ మార్పుయుగంలో ఆ వెనకబడిన దేశాలు ఇచ్చేదానికన్నా తీసుకొనేది చాల ఎక్కువుంటుంది (ఇది ఉచితమేకాని అప్పుకాదు) 1927-28 లలో వివిధ సోవియట్ రిపబ్లిక్కులలో మనిషి 1కి పెట్టిన బడ్జెట్ ఖర్చును ఈ క్రింద ఇస్తున్నాను:

## సోవియట్ రిపబ్లికు బడ్జెటులో మనిషి 1కి ఖర్చు—1927-28

(రూబుళ్ళలో)

| ఎందుకు | రష్యా | ఉక్రైన్ | వైట్‌రష్యా | ట్రాన్స్‌కకేషియా | ఉజ్బెకిస్తాన్ | టర్కుమెనిస్తాన్ | సగటున |
|---|---|---|---|---|---|---|---|
| ప్రభుత్వం | 0.69 | 0·86 | 1·06 | 2.23 | 1·60 | 2·45 | 1.02 |
| ఆర్థికపాలన శాఖలకు | 1 08 | 0.88 | 1.57 | 1·13 | 1.04 | 1.46 | 1·06 |
| సమాజ వైజ్ఞానిక వసరులకు | 2.16 | 1.92 | 2.67 | 3.59 | 2.48 | 3.84 | 2.20 |
| జాతీయ ఆర్థిక అభివృద్ధికి | 1.65 | 1.62 | 2 37 | 4 95 | 3.39 | 8.90 | 1.91 |
| స్థానికబడ్జెటులకు | 5.87 | 5 56 | 5.57 | 6.70 | 5.77 | 5.58 | 5 83 |
| మిగతా ఖర్చులు | 0.04 | — | — | 0.58 | 0 20 | — | 0 06 |
| మొత్తం | 11,76 | 10.84 | ·13.14 | 19.13 | 14.48 | 22.23 | 12.0 |

ప్రతి ప్రధానమైన పద్దులోకూడ బలవత్తరాలైన రిపబ్లిక్కులకు (రష్యా, యుక్రైన్) తక్కువఖర్చు కనిపిస్తుంది. హీనస్థితిలో ఉన్న దేశాల ఆర్థిక, సభ్యతాభివృద్ధికై యూనియన్ జాగ్రత్త తీసుకుంటుంది.

ఇదే 1939 సోవియట్ యూనియన్ బడ్జెట్‌లోకూడ కనిపిస్తుంది మొత్తం యూనియన్ బడ్జెట్ 12.4వంతులు పెరిగింది. మరి ఒక్క తాజికిస్తాన్ బడ్జెటే 20 1% వంతులు. టర్కిమెనిస్తాన్ బడ్జెటో 22 4 వంతులు పెరిగింది. పన్నులలో రష్యా రిపబ్లిక్కు 18.8% మాత్రం తీసుకుంటే, తాజికిస్తాన్ నూటికి నూరువంతులు తీసుకుంది. 1928-9 నుండి 1939 కి మొత్తం సోవియట్ ఖర్చు వైజ్ఞానికాభివృద్ధికి 25 అంతలు పెరిగింది. టర్కిమెనిస్తాన్ ఖర్చు 29 ఇంతలు. తాజికిస్తాన్ 31 ఇంతలకు పెరిగింది. కొత్తపరిశ్రమల స్థాపనలోకూడ మైనారిటీజాతి దేశాలకి విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకోబడింది. అందువల్ల తాజికిస్తాన్ మొత్తం బడ్జెట్ 151 కోటి 30 లక్షల రూబుళ్ళలో 50 కోట్ల 90 లక్షల రూబుళ్ళ యూనియన్ నిధిలోనుంచి బాల్ఖష్ రాగిపోత పరిశ్రమ స్థాపనకై తీసుకున్నారు. సోవియట్ యూనియన్‌లోకల్లా బొగ్గుగనుల్లో 'కరగండ' మూడోస్థానాన్ని నేడాక్రమిస్తున్నవి. ఇక చింకెంటు, రిడర్స్కిలలోని సీసపు పరిశ్రమలు సోవియట్ యూనియన్‌లోని మొత్తం సీసపు ఉత్పత్తిలో మూడోవంతు ఉత్పత్తి చేస్తాయి.

ఇలాగా సోషలిజంక్రింద నూతన పరిశ్రమలను జాగ్రత్తగా పంపకం చేస్తున్నారు. మిఖిలోవ్ 'సోవియట్ భూగోళం'లో చెప్పినట్లుగా జారు సామ్రాజ్యంలో పరిశ్రమలు వివిధప్రాంతాలకు సమానంగా పంచబడలేదు. రష్యా పరిశ్రమల ఉత్పత్తిలో సగం. ఇప్పటి మాస్కో, లెనిన్‌గ్రాడ్, ఇవనోవ్ మొదలైన ప్రాంతాల్లోనే కేంద్రీకరింపబడి ఉండేవి ఆర్థికపటం (మ్యాపు)లో ఈ ప్రాంతం ఒక దీపంలా ఉంటుంది. ఇక్కడనే పరిశ్రమల పెట్టుబడి ప్రారంభమై పెరిగి, ఇక్కడనుండి జారు దురాక్రమణ శాఖలు ప్రాకి విశాల వ్యవసాయక్షేత్రాలనూ, ముడిసరుకులను తమ పరిశ్రమ కేంద్రంకోసం ఆక్రమించివేశాయి. యంత్రోత్పన్న వస్తువులను, ముడిసరుకులకు చాల దూరాంతరాన ఏర్పరచారు. అందువల్ల మానవకష్టం ఎక్కువ వ్యర్థమవుతుంది. కాని ఆ కష్టం వలసలే భరించేవి. "ప్రత్తిని పండించే ఉజ్బెక్ రైతుకు సరైన ధర యివ్వడంలేదు. పైగా అతను తయారైన గుడ్డలకు విపరీత ధనమిచ్చి కొనవలసివచ్చేది.....విద్యుచ్ఛక్తికన్నా, వినాశంచేయబడిన చేతిపరిశ్రమదారుల చేతులకష్టమే చౌకగా వస్తున్నది."

సోషలిస్టు ఉత్పత్తి ప్రణాళిక, సహకార అభివృద్ధి, జాతుల సమానత అనే పద్ధతులమీద పరిశ్రమల పంపకంలోని నూతన సిద్ధాంతాలను ప్రవేశపెట్టింది :

"సోషలిస్టు ఉత్పత్తి పంపకాల ప్రణాళిక కేంద్రంనుండి పోటీని తొలగించింది. పాత నిషేధాజ్ఞలస్థానే, ప్రక్క ప్రాంతాల పరిశ్రమల సభ్యతను అభివృద్ధిపరచాలనే విధానం అమలుకు వచ్చింది.

"సోవియట్ యూనియన్‌లో నివసించే ప్రజలందరి హక్కులు సమానమైనవి. అన్నిజాతుల సమానత చట్టరీత్యా విప్లవ ప్రారంభ దినాల్లోనే స్థాపింపబడింది చట్టరీత్యాకాకున్నా ఆచరణలోవున్న అసమానతను తొలగించేందుకు రష్యా పాత వలసదేశాలలోని ప్రజల ఆర్థిక దుస్థితిని నిర్మూలించడం అవసరమయింది."

(యన్. మిఖిలోవ్. "సోవియట్ భూగోళం" 1935, పుట 51)

కాబట్టి ఈ సిద్ధాంతాన్ని 1923 లో జరిగిన రష్యన్ కమ్యూనిస్టుపార్టీ 12 వ కాంగ్రెసులో స్టాలిన్ ఇలా ప్రకటించాడు :

"తమ తప్పువల్లగాక, పూర్వం వానిని కేవలం ముడిసరకులకోసమనే చూడడంవల్ల వెనకబడివున్న రిపబ్లిక్కులలోను, సరిహద్దు ప్రాంతాలలోను స్కూళ్ళు, భాష వీనితోపాటు పరిశ్రమ కేంద్రాలను స్థాపించాలి. అందుకై రష్యా కార్మికవర్గం అన్నివిధాలా ప్రయత్నించాలి"

(స్టాలిన్, రష్యన్ కమ్యూనిస్టుపార్టీ 12 వ కాంగ్రెస్ 1923 ఏప్రియల్‌లో, జాతుల సమస్యపై ఇచ్చిన నివేదిక.)

సామ్రాజ్యవాదుల వలసల పీడనావిధానానికీ, మూలబడిన జాతులను, చాల ముందుకు వెళ్ళిన దేశాలతో సమానంగాచేసి జాతుల సమానతను స్థాపించిన సోషలిజానికీ ఉన్న తారతమ్యం మనకిక్కడ కనిపిస్తుంది.

మధ్యాశియా సోవియట్ రిపబ్లిక్కుల విజ్ఞానాభివృద్ధి, వారి సమానహోదా భారతప్రజలలో తీవ్రఆలోచనను రేకెత్తిస్తుంది. ఈదృశ్యం, సామ్రాజ్యవాదంక్రింద భారతదేశం నేడనుభవిస్తున్న స్తబ్ధత, పీడనలతో పోల్చిచూచినప్పుడు గగనానికి ఇలకూ ఉన్నంత భిన్నత్వం గోచరిస్తుంది. కాని అందుతోపాటు పైదృశ్యాన్ని చూచినప్పుడు ఇంకొక ఆశా విశ్వాసజ్యోతికూడ తళతళలాడుతుంది. సామ్రాజ్యవాద శృంఖలాలను త్రెంచుకొని భారతదేశంలోని శ్రమజీవులు తమదేశానికితాము అధిపతులైనప్పుడు, అక్కడకూడ ఇలాంటి అభివృద్ధిని సాధించడానికి వీలున్నది.

# రెండో భాగం

## భారత దేశంలో బ్రిటిష్ పాలన

### అధ్యాయం IV : భారతదేశ దరిద్ర రహస్యం

1. భారతదేశంపై మార్క్స్
2. భారతీయ గ్రామ ఆర్థికవ్యవస్థ విధ్వంసనం
3. బ్రిటిష్ పాలనం - విధ్వంసపాత్ర
4. బ్రిటిష్ పాలన- పునర్నిర్మాణపాత్ర

### అధ్యాయం V : భారతదేశంలో బ్రిటిషుపాలన - పాతపునాది

1. భారతదేశపు దోపిడి
2. భారతదేశం - పారిశ్రామిక విప్లవం
3. పారిశ్రామిక వినాశనం

### అధ్యాయం VI : భారతదేశంలో నూతన సామ్రాజ్యవాదం

1. ఫైనాన్సుపెట్టుబడికి మార్పు
2. భారతదేశంలో ఫైనాన్సు పెట్టుబడి
3. పారిశ్రామికం చేసే సమస్య
4. పారిశ్రామికం చేయడంలో లోపాలు
5. యుద్ధపూర్వం 20 ఏళ్ళ జమాఖర్చుపట్టీ
6. ఫైనాన్సు పెట్టుబడి బలపడింది
7. ,, —రెండోయుద్ధం
8. ,, కొత్త బ్రిటిష్ ప్రణాళిక
9. భారతదేశంలో సామ్రాజ్యవాదంవల్ల కలిగిన - పరిణామం

# నాలుగో అధ్యాయము

# భారతదేశ దరిద్ర రహస్యం

"మరొక తరగతి వారున్నారు
వారే సామాన్య ప్రజలు
వారికే పాండిత్యం లేదు.
ఉన్నట్టు వారు నటించరు కూడ
హాయిగా జీవితం గడుపుతారు వీరు
చేపలు చేపలని మాత్రమే వీరికి తెలుసు
చర్మం వొలిస్తే ఎలా వుంటుందని
ఆలోచించనే ఆలోచించరు
కాని చర్మం వొలవడానికే
చేపలున్నాయని సంతృప్తిపడతారు
భారతీయులు దబ్బిచ్చుకొనేందుకే
పుట్టారని విధినిర్ణయమనుకుంటారు
కాబట్టే వారు గొప్పవారూ ఉన్నతులూ
అయినప్పుడు,
"ఎందుకు?" అని ప్రశ్నిస్తే
విపరీతంగా అసహ్యించుకుంటారు"

(ఇండియా II. మూడాశ్వాసాల కావ్యం. బెంగాల్ సివిల్ సర్వీస్ ఉద్యోగి విరచితం లండన్ 1834.)

భారతదేశంలో సామ్రాజ్యవాద పాత్రను అర్థం చేసుకునేందుకు, కొంత చరిత్రను పరిశీలించడం అవసరమవుతుంది.

అధికారు అల్లిన ముసుగులలోనుండి భారతదేశంలోని బ్రిటిష్ పాలన సత్య చరిత్రను ఇటీవల బయటికిలాగేందుకు మొదలుపెట్టారు. కాని నేటికికూడ, 'ఇంపీరియల్ గజెటీర్' సంపాదకుడు సర్ విలియం హంటర్ చెప్పిన మాటలు వాస్తవంగా ఉన్నవి:

"బ్రిటిష్ పాలనలోని. భారతప్రజల వాస్తవచరిత్రను, ఎక్కడెక్కడో దూరదూరంగా ఉన్న వందలకొలది రికార్డు గదులనుండి ఒక చోటికి చేర్చవలసి ఉన్నది. ఆ పని ఇంకా జరగలేదు ఇది ఎలాంటి వాడైనా ఒక మనిషి శక్తికిమించిన పని. ఇందుకయ్యే ఖర్చు ఏ సామాన్య వ్యక్తిగత ద్రవ్యం కాని భరించలేదు." ·

లార్డు రోస్‌బరీ ఐరిష్ సమస్యనుగూర్చి,"ఈ సమస్య రాజకీయాలను దాటిపో లేదు గనక చరిత్రలోనికికూడ ఎక్కలేదు" అన్నాడు. ఆ మాటలు భారతదేశ సమస్యకుకూడ వర్తిస్తాయి భారతీయులు స్వతంత్రాన్ని సాధించినప్పుడు భారత దేశ చరిత్రను సునిశితంగా, దురాక్రమణదారుల దృష్టికన్న భిన్నమైన దృష్టితో పరిశీలించడం సాధ్యమవుతుంది.

19 వ శతాబ్దిలోని ఇంగ్లీషు కన్సర్వేటివ్ నాయకుడు ఇంగ్లీషు చరిత్రను గూర్చి ఈ ప్రఖ్యాత వాక్యాలు చెప్పాడు :

"పరిజ్ఞానమూ, ధైర్యమూ వున్న ఎవరైనా - ఇవిరెండూ ఈ పనికి అవసరం - ఇంగ్లాండు చరిత్రను ఎప్పటికైనా వ్రాయగలిగితే నీబూర్ * పురాతన చరిత్రను చదివినప్పటికైనా ఎక్కువగ ప్రపంచం ఆశ్చర్యపడ గలదు మొత్తంమీదచెపితే అన్ని పెద్ద సంఘటనలను ఇప్పుడు అతుకుల బొంతలుచేశారు ప్రధాన కారణాలన్నీ దాచారు. కొందరు ముఖ్య వ్యక్తులు కనిపించనే కనిపించరు. ఇక కనిపించే వ్యక్తులనుగూడ సరిగా అర్థం చేసుకోలేదు అందువల్ల అపవ్యాఖ్యానాలు జరిగాయి. వీటన్నిటి ఫలితంగా చరిత్రంతా అయోమయంగా తయారయింది."

(డిస్రెలి, "సైబిల్" అధ్యాయం iii)

ధనికయుగ ప్రారంభంనుంచీ, ముఖ్యంగా "మహావిప్లవం" నుంచీ ఇంగ్లీషు చరిత్ర ఇలా అయోమయం చేయడం జరిగింది. ఇందుకు కారణం, సంకుచిత ధనిక కుటుంబాల పాలనలోని సత్యాన్ని, అగోచర వాతావరణంలో కప్పిపుచ్చడం అవసరమయింది

ఇంగ్లీషు చరిత్ర సంగతి ఇలా ఉంది. ఇక ఇంగ్లీషు పాలకవర్గ శక్తికి పునాదిగా ఉన్నట్టి ఏ ప్రతిపక్షిపైనైనా ఉపయోగించేందుకు పాలకుల శక్తికి విధిప్రాయమైనట్టి, మున్ముందేళ్ళగా తమ విధానాలన్నిటికీ నిర్ణాయకమైనట్టి బ్రిటిష్ సామ్రాజ్య చరిత్ర-అంటే ముఖ్యంగా భారతదేశంలోని బ్రిటిష్‌పాలన చరిత్ర విషయంలో పై అంశం మరింత నిజమని వేరే చెప్పనక్కరలేదు.

ఇక్కడే ప్రధానమైన ఇంగ్లీషు విధాన పునాదులు కనిపిస్తాయి. ఇంగ్లాండులో 18 వ శతాబ్ద ఉత్తరార్ధంలోను, 19 వ, 20 వ శతాబ్దాలలోను హఠాత్తుగా

---

* జార్జి బార్థోల్డు నీబూర్ (1776 - 1831) జర్మన్ చరిత్రకారుడు. ఈయన రోమన్ చరిత్రను, పాత పద్ధతిలోకాక పరిశోధించి, చాల సంగతులను బయటపెట్టాడు.

ధనికతత్వం ప్రాబల్యం చెందడంలో ఉన్న రహస్యం ఇక్కడే ఉంది. అప్పటి నుండి ఇప్పటివరకూ బ్రిటన్ వేస్తున్న ఎత్తులకు మూలకారణాలు ఇక్కడే గోచరిస్తాయి.

ఈ చరిత్ర ఘట్టంలోనే పాలకవర్గాలు కట్టుకథలల్లడం, ఏదో సమర్థించుకోవడం ప్రారంభించారు. బూర్జువా (ధనికవర్గం) నాగరికత స్వభావాన్ని సగ్నంగా చిత్రించే యదార్థాంశాలు చిన్నచిన్నవికూడ రికార్డులలో అణిగిద్రొక్కి పూర్తిగా కప్పిపుచ్చారు. ఇంగ్లీషు ప్రజలకు తెలియకుండా దాచివేశారు ఈ చరిత్రంతా కేవలం ఐర్లాండు, భారతదేశ ప్రజల భయంకర స్మృతిపీఠుల్లో మాత్రమే విలిచి ఉన్నది. వాస్తవ చరిత్ర పరిశీలనంపోయి, బడిపిల్లల కిప్లింగు సాహస కథలే పత్రికలను, సభా వేదికలను ఆక్రమించివేశాయి. సామ్రాజ్యసంపాదనరాక్‌ఫెల్లర్ ఆస్తిని కూడబెట్టడంలాంటి ఘోరదారుణ ప్రయత్న ఫలితమే అయినప్పటికీ, ఇదేదో కాకతాళీయంగా జరిగినట్టూ, అనుకోకనే దానంతటదిజరిగిపోయినట్టూ అనుశ్రుతంగా చరిత్ర చెప్పడం అలవాటయి పోయింది - పాలించే ఏ ప్రభుత్వానైనా, ముద్దాయిగా న్యాయస్థానం తీర్పు చెప్పవలసిన భారత ప్రజల అధ్వాన్న పరిస్థితిని పరిశీలించకుండా, 'బ్రిటిష్ సామ్రాజ్య కిరీటంలో మహోజ్వల రత్నం' అనే మాటను ప్రచారం చేయడంతో సరిపుచ్చారు.

ఇలా చరిత్రను అయోమయం, అగోచరం చేసివెయ్యడం, ఇంగ్లాండు - ఇండియాల చరిత్రలో తప్ప మరెక్కడా ఇంత అన్యాయం జరగలేదు.

ఈ ధోరణి ఆధునిక యుగంలో మరింత ఎక్కువయింది పూర్వమైనా ఏ విల్లింగ్టనో, బర్కో, క్లయివో, హేస్టింగ్సో, ఆడమ్‌స్మిత్తో దాపరికంలేకుండా దోపిడీని, వినాశాన్ని పొగడుతూ మాట్లాడారు. 'రక్తప్లావిత' భారతదేశాన్ని గూర్చి సాలిస్‌బరీ కూడ ఆనాడు చెప్పాడు. కాని యీ రోజున బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటనల్లో ఏదో భూతదయ ఒలికిపోతున్నట్లు కపట వాక్యాలు కనిపిస్తాయి. వాని వెనకనేమో యధాప్రకారం పీడన, అతి విస్తృతమైన నిర్బంధవిధానాలు గోచరిస్తాయి.

ఇలా బాహాటంగా చెప్పడం పోయి, మౌనంగా వాస్తవాన్ని కప్పిపుచ్చే కొత్తపద్ధతి గత ఏభై ఏళ్ళుగా చరిత్రలో కనబడుతున్నదని ఆధునిక చరిత్రకారు లొకరు వ్రాశారు. అందులో గ్రహించవలసిందెంతో ఉన్నది.

"గత యాభై ఏళ్ళలో వ్రాసినవానికన్నా, ఒక శతాబ్దికన్నా ముందు వ్రాసిన బ్రిటిష్ ఇండియా చరిత్రలు అన్నీ దాపరికం లేకుండా, సమగ్రంగా ఉన్నవి. ఆరోజుల్లో ఎవడైనా ప్రధానప్రశ్నలను ('అసలు మీరు భారత దేశంలోఉండే హక్కేముంది' అనే లాంటి ప్రశ్నలు) అడిగేంత రాజద్రోహి ఉంటాడని కలలోగూడ అనుకునే వారుకారు. తమ మాటలు వింటున్నవారు బ్రిటిష్‌వారు తప్ప వేరేఉండరు. అందువల్ల ఆరోజుల్లో విమర్శలు విషయజ్ఞానంతో హృదయంగమంగా ఉండేవి. రాజకీయంగా

ఏమి చెప్పడం అవసరమనేది లేకుండా, స్వేచ్ఛగా అప్పటివారు అభిప్రాయాలను వెలిబుచ్చేవారు. ఇటీవల అది మారింది. ప్రతి భారతసమస్యను పాలనాదృష్టితో చూడడం. 'ఇలాప్రచురిస్తే ప్రభుత్వ పాలన సుఖంగా శాంతంగాసాగుతుందా?' అనుకోవడం అలవడింది. ఇప్పటి చరిత్రకారుడు తన ప్రజలలాగే అన్నిటినీ తెలుసుకునే, తన మాటలు వింటూండే ఇతర దేశప్రజలున్నారని, వారు త్వరగా ఇలాచేయడం తప్పంటారని ఎరుగును. 'మనకు పనికిరానివాడు, మనకు విద్వేషి' తామేం చెప్పినా ఇతరులు వింటారేమో, ప్రజలు నిక్కబెట్టుకొని ఉన్నారేమో, తాము కాఫర్లమవుతామేమో, అన్న భయంవల్ల ఈ కొత్తచరిత్రకారులు మౌనంగా చాల అంశాలను వదిలివేశారు. అందువల్ల బ్రిటిష్ ఇండియన్ చరిత్ర నేటి విజ్ఞానంలో పాడు గతుకులుగా తయారయింది."

(ఇ. థాంప్సన్ — జ. గేగారట్, "భారతదేశంలో బ్రిటిష్ పాలన ప్రారంభం విజయం" 1934, పుట 665 )

భారతదేశంలో బ్రిటిష్ రాజ్యచరిత్రను వివరంగా, క్రమంగా ఇవ్వడం ప్రస్తుతం మనకు అవసరంకాదు. అది సరిగా వివరించాలంటే ప్రత్యేక పుస్తకమే అవసరం. సామాన్య సంఘటనలన్నిటినీ గూర్చిన చాలపుస్తకాలలో చూడవచ్చును. మనకు అవసరమైనదంతా ప్రస్తుత సమస్యలకు, పరిస్థితికి మూలకారణమైన ముఖ్యశక్తుల అభివృద్ధిని తెలియజేయడమే.

గతించినదేదో గతించింది. వాస్తవంగా చెబితే బ్రిటిష్‌పాలన చరిత్ర అభినందించదగిన దేమీకాదు. ఆ చరిత్రపుటల్లోని కొన్ని వాస్తవాంశాలను (సామాన్యంగా వీనిని బడిపుస్తకాలనుండి తొలగించారు) తప్పక ఇంగ్లీషువారు తెలుసుకోవాలి. అలాఅయినప్పుడే ఇప్పుడున్న సామ్రాజ్యవాద భావసంకెళ్ళను తొలగించుకో వీలవుతుంది. భారతీయులు, స్వతంత్రపోరాటంలో రాజీలేని వీర శిఖామణులుగా తయారయ్యేందుకుగాను ఈ అంశాలను తెలుసుకోవడం అవసరం. కాని గతకథనంలో మునిగిపోయిన గతఅక్రమాలను, అన్యాయాలనుగూర్చి జాతీయ ప్రచారాన్ని కేంద్రీకరించినా ప్రయోజనమేమీలేదు. గత పీడకపీడితులిద్దరూ కాలగర్భంలో కలిసిపొయ్యారు; ఒక గవర్నర్ జనరల్ ప్రఖ్యాత వాక్యాల్లో భారతదేశపు నేతగాండ్ర ఎముకలు భారతదేశపు మైదానాలను 1834 లో తెల్లబరుస్తుంటేనేడు ఆగవర్నర్ జనరల్‌ఎముకలుకూడ వారికుటుంబ సమాధిలో అంతకన్నా మంచిస్థితిలో ఏమీలేవు. ప్రస్తుత దీనస్థితి, స్వతంత్రమార్గం - ఇవీ నేటి ప్రప్రథమ సమస్యలు. ఇప్పటికీ పాతుకొనివున్న దుష్టశక్తులను బయటపెట్టడంవరకే మనకు పాత చరిత్రతో సంబంధం.

భారతదేశ చరిత్రను అభ్యుదయ ప్రగతిశీలదృష్టితో చూచి, బ్రిటిషు పాలనకు ముందూ, తర్వాతకూడ ఉన్న సాంఘిక శక్తులపై శాస్త్రీయపద్ధతి వెలుగులను

ప్రసారింపజేసి, భారతదేశంలో బ్రిటిష్ పాలన విధ్వంసక పాత్రను, పునర్నిర్మాణ పాత్రను, దాని విప్లవకరభవిష్యత్తును తెలియజెప్పిన మేధాశాలి - ఆధునికసోషలిజా నికి పునాదివేసిన కారల్‌మార్క్స్. భావి మానవ చరిత్రకు అతిముఖ్యమైన ఇతర కార్యక్రమంతోపాటు ఈ కార్యక్రమాన్నికూడా ఆయన 19 వ శతాబ్ది మధ్యభాగంలో చేబట్టాడు. ఆయన ప్రధాన కార్యక్రమమంతా యావత్ ప్రపంచంలోను ప్రఖ్యాత మైనప్పటికి, ఈ భారత సమస్యకు సంబంధించినంతవరకు యాభైఏళ్ళకు పైగా ఎవరికీ తెలియకుండా ఉండిపోయింది. గత పాతికేళ్ళనుండి ఆయన చెప్పిన అంశాలు ప్రచురంగా వెల్లడవుతూ, భారత సమస్యనుగూర్చిన ప్రస్తుత పరిశీలన లను చాల మార్చివేస్తున్నవి. నేటి ఆధునిక చరిత్ర పరిశోధన, మార్క్స్ తీసు కున్న దృక్పథంలోని ప్రధాన సూత్రాలను మరింత రుజావుచేస్తున్నది.

## 1. భారతదేశంపై మార్క్స్

ఇంగ్లీషు సోషలిస్టు రచయితల్లో ముఖ్యుడు పదమూడేళ్ళక్రితంకూడ ఇలా అనగలిగాడు : "మార్క్స్ చెప్పిన సూత్రాలమీదే భారత సమస్యను పరిశీ లించ బూనుకోవడం తమ ప్రతిభాశక్తిని కసనత్తుచేయించడం తప్పితే, సోషలిజం పురోగమనానికి తోడ్పడే సిద్ధాంతాల కదేమీ ఉపయోగకరంకాదు."

(హెచ్. లాస్కీ, "కమ్యూనిజం", 1927, పుట 194)

మార్క్స్ ఎడతెగకుండా భారతదేశ విషయమై తన ఆలోచన నెంతో వినియోగించాడన్న సంగతిని గుర్తించకపోవడం పశ్చిమయూరపు సోషలిస్టు పరిమితజ్ఞానానికి చక్కటి నిదర్శనం. వాస్తవంలో, 1853 లో వరుసగా మార్క్స్ భారతదేశంపై వ్రాసిన ప్రఖ్యాత వ్యాసాలు, మహత్తర సారవంతములైనవి. ఆ సమస్యపై ఆధునిక విజ్ఞానాని కవి ప్రాతిపదికలు. ఆయన రచనలను సమగ్రంగా పరిశీలిస్తే ఈ క్రింది అంశాలు బోధపడతాయి : ఆశియా ఆర్థిక వ్యవస్థలోని - ముఖ్యంగా భారతదేశం, చైనాలోని - విశిష్టసమస్యలను ఆయనెంతో తీవ్రంగా ఆలోచించాడు. ఆర్థికస్థితిపై యూరపియన్ పెట్టుబడిదారీ విధాన మెలా పెరిగిందో వానివల్ల ప్రపంచాభివృద్ధి భవిష్యత్తునుగూర్చి ఎలా కొన్ని నిర్ణయాలుచేయ వీలున్నదో, భారతీయ,చైనాప్రజల విముక్తినిగూర్చి ఎలా నిర్ణయించ సాధ్యమో వీనిపై ఆయన ఆలోచనంతా కేంద్రీకరించాడు ఆయన ఈ సమస్యను జాగ్రత్తగా పరిశీలిస్తూ వచ్చాడనేందుకు 'కాపిటల్'లో 50 సార్లు ఇండియానుగూర్చి ప్రస్తావించడం. మార్క్స్-ఎంగిల్సు ఉత్తరప్రత్యుత్తరాలలో ఈప్రస్తావన మరింత ఎక్కువగా ఉండడం నిదర్శనం.

మార్క్స్-ఎంగిల్సులు 'కమ్యూనిస్టు మానిఫెస్టో'లోఇండియా, చైనామార్కెట్టులు ఆరంభంకావడం పెట్టుబడిదారీ ఉత్పత్తి అభివృద్ధికి ప్రధానమన్న సంగతిని గుర్తుకు తెచ్చారు. ఆ తర్వాత, 1848 నాటి విప్లవ పరంపర విజితంకావడంతో, ఆఅపజయానికి కారణాలేవో పరిశీలించేందుకు మార్క్స్ పూనుకున్నాడు. మిగతా

వావికన్నా, యూరోపున కావల ఆసియా, ఆస్ట్రేలియా, కాలిఫోర్నియాలలో పెట్టుబడిదారీ విధానం నూతనంగా విజృంభించడం విప్లవ పతనానికి కారణమని కనుక్కున్నాడు. ఈ దృక్పథం ఏంగెల్సు 1852 లేఖలోనే సూచితమైంది. (మార్క్సు ఏంగిల్సుకు ఆగస్టు 21, 1852 లో వ్రాసిన లేఖ). తర్వాత 1858వ నాటిమార్క్సు ఉత్తరాలలో మరింత స్పష్టరూపం దాల్చింది.

"రెండోపెట్టుబడిదారీ సమాజం 16 వ శతాబ్ది జీవితం గడుపుతోంది. మొదటి 16 వ శతాబ్ది దీని పుట్టుకకు కారణమైతే ఈ రెండోది దాని మరణానికి కారణం కాగలదని ఆశిస్తున్నాను. తన ప్రధానసూత్రాలపై ప్రపంచ వాణిజ్యరంగాలన్నీ ఏర్పరచడం, తదనుగుణంగా ఉత్పత్తిని స్థాపించడం- ఇవీ బూర్జువాసమాజపు ప్రత్యేకకర్తవ్యాలు. ప్రపంచం గుండ్రంగా ఉంది గనుక, ఈ కార్యక్రమం ఆస్ట్రేలియా, కాలిఫోర్నియాలను వలసలుగా మార్చడం, చైనా, జపానులలో ప్రవేశించడం - వీనితో పని పూర్తి అయినట్టు కనిపిస్తుంది. నేటి మన ప్రధానసమస్య, యూరోపుఖండంలో విప్లవంతప్పదు. తొలినుంచీ అది సోషలిస్టు లక్షణాలతోనే నడుస్తున్నది. కాని ఇంతకన్నా విశాలభూభాగంలో ధనికవర్గ సమాజగతి ఉచ్ఛస్థితిలో ఉంటున్నది గనుక, ఈ చిన్నరంగంలో ఆ విప్లవం అణచివేయబడడం తప్పనిసరికాదా?" (మార్క్సు, ఏంగిల్సుకు జాబు అక్టోబరు 8, 1858.)

పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధినీ, యూరోపులోని సోషలిస్టు విప్లవాన్ని స్పష్టరూపంలో గమనించేందుకు, యూరపును దాటి ధనికతత్వం విస్తరించుకోవలసిన అంశమని మార్క్సు 1850 లోనే కనిపెట్టాడు. కాని ఆ అంశాన్ని యూరపియన్ సోషలిస్టులు యిటీవలనే మెల్లమెల్లగా గ్రహింపసాగారు.

ఈస్టు ఇండియా కంపెనీ చార్టరుకు ఆఖరితూరి పార్లమెంటులో మరి కొన్నాళ్ళు జీవంపోయాలన్న విషయం చర్చకువచ్చినప్పుడు 1853 లో మార్క్సు న్యూయార్కు 'డైలీ ట్రిబ్యూన్' పత్రికలో వరుసగా ఎనిమిది వ్యాసాలు వ్రాశాడు. ఈ వ్యాసాలను "కాపిటల్"లోను, ఉత్తరాల్లోను ఉన్న ప్రస్తావనలను కలిపి తీసుకున్నట్టయితే భారతదేశ విషయంలో మార్క్సు దృక్పథం తెలుస్తుంది.

## 2. భారత గ్రామీణ వ్యవస్థా విధ్వంసనం

మొట్టమొదటిసారిధనికతత్వపు ధాటి నిర్మూలించిన 'ఆశియా ఆర్థికవ్యవస్థ' యొక్క లక్షణాలతో మార్క్సు పరిశీలనం ప్రారంభమవుతుంది. "భూమి విషయంలో వ్యక్తిగత ఆస్తి లేకపోవడమే ప్రాచ్యదేశాలన్నిటికీ కీలకం" అని ఎంగిల్సు మార్క్సుకు 1853 జూన్‌లో వ్రాశాడు. కాని ఇలా భూమి ఉమ్మడిగా ఉండడం, యూరోపు ఆర్థిక వ్యవస్థ ప్రారంభదశలో ఉన్నదానికంటె భిన్నం కాదు, తర్వాత అభివృద్ధిలోనే విభేదం ఏర్పడింది.

"ప్రాచీనరూపంలో ఉన్న ఉమ్మడిఆస్తి ప్రత్యేకించి స్లావ్ దేశాలదని, అందులో ఒక్క రష్యాకు సంబంధించిందని ఇటీవల ఒక అర్థంలేని ఊహ వ్యాపించింది. ఈ ప్రాచీనరూపం, రోమనుల్లో, ట్యూటన్లలో, కెల్టులలోకూడ ఉన్నట్లు మనం రుజువుచేయగలం. కొంత శిథిలదశలో ఉన్నప్పటికీ, ఆ ఉమ్మడి ఆస్తికి అనేక నిదర్శనాలు ఇప్పటికీ భారతదేశంలో కనిపిస్తున్నాయి. ఈ ఆసియాకుచెందిన-ముఖ్యంగా భారతదేశంలో ఉమ్మడి ఆస్తిరూపాలను సూక్ష్మంగా పరిశీలించినట్లయితే, ఆదిమ కమ్యూనిజం యొక్క వివిధ స్వరూపాలనుండి ఏ విధంగా వివిధ శిథిలరూపాలు మొలకెత్తాయో కనిపిస్తుంది. ఉదాహరణకు, రోమన్ల, ట్యూటన్ల స్వంతఆస్తి మూలస్వరూపాలను, భారతదేశపు ఆదిమ కమ్యూనిస్టు సమాజంయొక్క వివిధ రూపాలతో పోల్చవచ్చును"

(మార్క్స్, "రాజ్యాంగ శాస్త్ర విమర్శ" అధ్యాయం 1)

అయితే మరి ప్రాచ్యదేశాల ఆదిమ కమ్యూనిజం, పశ్చిమదేశాల్లోలాగే భూస్వామ్యపద్ధతికి, ఫ్యూడలిజానికి ఎందుకు దారితీయలేదు ? అందుకు కారణం, వాతావరణ భూగోళ పరిస్థితులని ఏంగిల్సు సూచిస్తున్నాడు.

"ప్రాచ్యదేశీయులు, భూస్వామ్యం, ఫ్యూడలిజంల నెందుకు అందుకోలేదు ? ఇందుకు ముఖ్యంగా వాతావరణం, భూసారపరిస్థితిన్నీ, సహారా నుండి అరేబియా, పర్షియా, ఇండియా, తార్తారీలద్వారా అత్యున్నత ఆశియా ఎగువ భూములవరకు వ్యాపించిన మైదానాలు కారణ మనుకుంటాను. ఇక్కడి వ్యవసాయానికి కృత్రిమ జలాధార నిర్మాణం ప్రధానావసరం ఇది గ్రామపంచాయితీలు కాని, రాష్ట్రాలుకాని, కేంద్ర ప్రభుత్వం కాని చేయవలసిన పని."

(ఏంగిల్సు, మార్క్సుకు 1853 జూన్ 6 న వ్రాసిన ఉత్తరం )

వ్యవసాయపరిస్థితులు భూమిపై స్వంతఆస్తి ఏర్పరుచుకునేందుకు తగినవిగా లేవు అందువల్ల ఆదిమ కమ్యూనిజం శిథిలాల్లో విశిష్టమైన 'ఆశియా ఆర్థిక వ్యవస్థ' ఉదయించింది; క్రింద గ్రామపంచాయితీ పైన నిరంకుశ కేంద్ర ప్రభుత్వం. ఆ కేంద్ర ప్రభుత్వం క్రిందనే నీటివనరులు (ఇరిగేషన్), రహదార్లు, యుద్ధాలు, దోపిడీలు ఉండేవి.

కాబట్టి, గ్రామ వ్యవస్థను అర్థంచేసుకోవడంలోనే భారతదేశాన్ని అర్థం చేసుకునేందుకు కీలకముంది. గ్రామ వ్యవస్థ స్వరూపాన్ని "కాపిటల్"లో చక్కగా వివరించాడు :

"ఈ దినంవరకుకూడ ఉంటున్న ఆ చిన్న చిన్న అతి ప్రాచిన భారతదేశ గ్రామ సమితులు భూమిని ఉమ్మడి ఆస్తిగా పెట్టుకొని వ్యవసాయం, చేతిపనులు ఎప్పటికీ మారని విభిన్న వృత్తులు (శ్రమ విభజన)

అనే ప్రాతిపదికమీద అవి పనిచేసేవి. ఈ ప్రణాళిక ఖచ్చితంగా ఏ కొత్త సంఘానికైనా అలాగే అమలుజరిపేవారు ఒక్కొక్క గ్రామంలో నూరునుంచి వేల ఎకరాల భూమిలో తమకు కావలసినవన్నీ పండించుకొనేవారు. పంటలో ఎక్కువభాగం గ్రామోపయోగానికి మాత్రమే కావడంవల్ల అవి అమ్మకపు వస్తువులుగా తయారుకావడం లేదు మొత్తం భారత సమాజంలో వస్తు వినిమయంద్వారా శ్రమ విభజనతో నిమిత్తంలేకుండా ఉత్పత్తి జరిగేది. ఉపయోగానికి కాగా మిగిలినపంటలే అమ్మకపు సరుకుగా మారేవి. అందులోనూ కొంతభాగం ప్రభుత్వంచేతికి వెళ్ళేది అనాదిగా పంటలో కొంతభాగం పన్నుగా వస్తురూపేణా ప్రభుత్వానికి వెళ్ళుతుండేది

"ఈ గ్రామసంఘాల నిబంధనలు భారతదేశంలోని ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రకంగా ఉండేవి. అందులో సులభమైన పద్ధతి: ఉమ్మడిగా సేద్యం చేసుకునేవారు. ఈ పంటను అందరూ పంచుకునేవారు ఇందుతోపాటు ఉపవృత్తిగా వడకడం, నేయడం ప్రతి కుటుంబంలోనూ జరుగుతుండేది. ఈ ఒకే పనిచేసే ప్రజలతోపాటు, ఊరికోపెద్ద ఉండేవాడు. అతనే న్యాయాధిపతి. పోలీసు పన్ను వసూలు చేసేవాడు కూడా. ఇక కరణం సేద్యం లెక్కలు, వానికి సంబంధించినవన్నీ వ్రాస్తాడు. ఇంకో ఉద్యోగి నేరస్తులను పట్టుకోవడం. యాత్రికులకు రక్షణ నిచ్చి వారిని ఇంకో గ్రామానికి భద్రంగా చేర్చేవాడు; ఇంకొక ఉద్యోగి గ్రామ పొలిమేరలకు కాపలా కాసేవాడు; ఓవర్సీర్ ఉమ్మడిచెరువుల్లోనుంచి నీటిపంపకంచేసేవాడు పురోహితుడు పూజలు, పెళ్ళిళ్ళు, పేరంటాలు చేసేవాడు; ఉపాధ్యాయుడు ఇసకమీద పిల్లలకు చదువు నేర్పేవాడు; ఇక పంచాంగం బ్రాహ్మణుడు విత్తనానికి, కోతలకు, మిగతా వ్యవసాయపు పనులకు మంచిదినాలూ, అవీ చెబుతుంటాడు; కమ్మరి, వడ్రంగి వ్యవసాయపు పనిముట్లన్నీ చేయడం, చెడిపోతే బాగుపరచడం చేసేవారు; కుమ్మరి గ్రామానికి కావలసిన కుండలన్నీ చేసేవాడు; మంగలి, చాకలి, కంసాలి, అప్పుటప్పుటా ఒకకవి, ఈయనే కొన్ని సంఘాల్లో కవిగాను; కొన్నిచోట్ల అయ్యవారుగాను ఉండేవాడు. ఈ పన్నెండుగురిని గ్రామ సమిష్టిమీద పోషించేవాడు. జనసంఖ్య పెరిగితే, ఇలాంటి పద్ధతులమీదనే, ఇంకో మైదానంలో ఇంకొక క్రొత్త గ్రామం ఏర్పడేది.

"ఈ స్వయం సంపూర్ణ గ్రామసంఘాల చిక్కులులేని నిర్మాణం (వ్యవస్థ) వరుసగా అలాంటిసంఘాలనే సృజించేది. ఒకప్పుడు ఇవి నశిస్తే, అదేచోట, అదేపేర మరొకటి పుట్టేది — ఈ సులభపద్ధతే, ఆశియా సమాజం మారకుండా ఉండడానికి మూలమయింది. ఎల్లప్పుడూ ఒకవేపు

ఆశియా రాజ్యాలు విచ్ఛిన్నమవుతూ, పునర్నిర్మితమవుతూఉన్నప్పటికీ, రాజవంశాలు ఒకటిపోయి మరొకటివస్తూనే ఉన్నప్పటికీ గ్రామసంఘాలు మాత్రం మారకుండా ఉండేందుకు అదేకారణం రాజకీయాకాశంలోని మేఘాడంబరాలు సంఘంలోని ఆర్థికసూత్ర నిర్మాణాన్ని తాకేవికావు "
(మార్క్స్, "కాపిటల్" వాల్యూం 1, అధ్యా 14, సెక్షన్ 4)

ఈ సంప్రదాయానుగతమైన భారతఆర్థిక వ్యవస్థను, బ్రిటిష్‌పాలన రూపంలో వచ్చిన విదేశ పెట్టుబడిదారీ విధానం నిర్మూలించింది. ఈవిషయంలోనే అంతకు ముందువచ్చిన దండయాత్రీకులకు, బ్రిటిష్ ఆక్రమణకు భేదమున్నది.

పూర్వం విదేశ దండయాత్రలు వచ్చినా వారు యీ ఆర్థిక పునాదిని కదిలించకుండా ఆ వ్యవస్థలోనే ఇమిడిపోయ్యారు. బ్రిటిష్‌వారు మాత్రం ఆ పునాదిని పెకలించి, విదేశ పేనగానే బయటనుండి పాలిస్తూ, ధనాన్ని పీల్చివేయసాగారు. యూరపులోని ధనికతత్వ విజయానికి భిన్నమైన, విజయాన్ని భారతదేశంలో విదేశ పెట్టుబడిదారీవిధానం సాధించింది. యూరపులోలాగ విధ్వంసన కార్యక్రమంతోపాటు భారతదేశంలో నూతన శక్తులను సృజించలేదు. ఇందులో భారత ప్రజలు బ్రిటిషురాజ్యంలో అనుభవిస్తున్న ఇబ్బందులలోవున్న 'ప్రత్యేక విషాద గాధ' నిబిడితమైంది. భారతీయులు తమ పాత ప్రపంచాన్ని పోగొట్టుకున్నారు. కాని కొత్త ప్రపంచంమాత్రం రాలేదు.

"హిందూస్థానంపై బ్రిటిషువారు విధించిన దుస్థితి, పూర్వము హిందూస్థానం పడిన బాధలన్నిటికన్నా పూర్తిగా విభిన్నమైనది; తీవ్రమైనదీకూడ ఇందులో అనుమాన మేమాత్రంలేదు. ఆసియా నిరంకుశ విధానంపై బ్రిటిషు ఈస్టు ఇండియా కంపెనీ స్థాపించిన యూరపియన్ దోపిడీవిధానం సాల్‌సిటీ దేవాలయంలో తన రాక్షసత్వంతో ప్రత్యక్షమవుతుంది నేను దీనినిగురించి చెప్పడంలేదు

"హిందూదేశంలో ఎన్ని అంతర్యుద్ధాలు, దండయాత్రలు, తిరుగుబాటులు; అక్రమాలు, కరువుకాటకాలు ఎంత క్లిష్టరూపంలో, ఎంత విధ్వంసక రూపంలో కన్పించినప్పటికీ అవన్నీ సమాజం పైపొరను దాటిపోలేదు. ఇంగ్లాండు మొత్తం భారత సమాజ వ్యవస్థనే శిథిలంచేసివేసింది. ఇప్పటికి కూడా పునర్నిర్మాణసూచనలేవీ కన్పించడంలేదు, ఇలా భారతీయుడు పాత ప్రపంచాన్ని గోల్పోయి, కొత్త ప్రపంచాన్ని సాధించలేకపోవడం నేటి దుస్థితిలో ఒక ప్రత్యేక విషాదపరిస్థితిని వెల్లడిస్తోంది. ఇందువల్లనే అనుశ్రుతంగావచ్చినప్రాచీన సాంప్రదాయాలనుండి భారతదేశ గతచరిత్రనుండి, నేటి బ్రిటిష్ పాలిత భారతదేశం పూర్తిగ వేరుపడిపోయింది."

(మార్క్స్, "భారతదేశంలో బ్రిటిష్ పాలన" న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్ జూన్ 25, 1853).

## 3. బ్రిటిషు పాలన - దాని విధ్వంసపాత్ర

ఈ విధ్వంస పాత్ర ఎలానడిచింది. మార్క్సు చాల జాగ్రత్తగా పరిశీలించాడు 1813 వరకున్న ఈస్టు ఇండియా కంపెనీ ఆక్రమణ కాలానికీ, తర్వాత ఆ గుత్తాధికారం పోయి పరిశ్రమాధికారులు తయారుచేసిన వస్తువులదాడి భారత దేశంలో ప్రవేశించి ఆ విధ్వంసనను పూర్తిచేసినకాలానికీ ఉన్నభేదాన్ని స్పష్టంగా చూపించాడు.

మొదటి యుద్ధంలో విధ్వంస కార్యక్రమం (1) కంపెనీ ప్రత్యక్షంగాచేసిన దోపిడీలమూలంగా జరిగింది ("18 వ శతాబ్దంలో పూర్తిగా ఇండియానుండి ఇంగ్లాండుకు ఎగుమతిచేసిన ఖజానాఅంతా ప్రత్యక్షదోపిడీ మూలంగా వచ్చినదే వ్యాపారంద్వారా వచ్చినడబ్బు చాలతక్కువ. విపరీత ధనాన్ని దోచి ఇంగ్లాండుకు పంపారు."); (2) గత ప్రభుత్వాలన్నీ కాపాడుతూవచ్చిన నీటిపనరులను రోడ్లు మొదలైన వానిని ఉదాసీనభావంతో చూచి. పాడుచేశారు; (3) ఇంగ్లీషు భూస్వామ్య పద్ధతిలో పొలాన్ని అమ్ముకునేందుకు, మార్చేందుకు వీలైన స్వంత ఆస్తిని ఏర్పరచారు. ఇంగ్లీషు నేరస్తుల చట్టాన్ని పూర్తిగా ప్రవేశపెట్టారు, (4) భారతదేశంలో తయారైన వస్తువులను తొలుత ఇంగ్లాండుకు రాకూడదని, తర్వాత యూరోపుకే రాకూడదనీ నిషేధించారు. లేదా విపరీతమైన సుంకాలు వేశారు.

ఇవన్నీకూడ 'ఆఖరు దెబ్బ' తీయలేదు. ఆ దెబ్బ 19 వ శతాబ్దపు పెట్టుబడివారీ యుగంతోపాటు వచ్చింది. బూర్జువా విప్లవం (విగ్‌విప్లవం) తో అధికారాన్ని స్థాపించుకున్న ధనికవర్గంతో ఈస్టు ఇండియా కంపెనీ గుత్తవ్యాపారం చాల సన్నిహితంగా ముడిబడివుంది.

"ఈస్టు ఇండియా కంపెనీ నిజమైన ఆరంభం 1702 కన్నా చాలా ముందుకు పోదు. అప్పుడే తూర్పు భారత వ్యాపారాన్ని గుత్తకు పుచ్చుకోవాలంటూ వివిధ సంఘాలూ ఒకే ఒక కంపెనీగా చేరాయి. అంతవరకూ అసలు ఈస్టు ఇండియాకంపెనీ అస్తిత్వానికే భంగం వాటిల్లుతూవచ్చింది. క్రామ్‌వెల్‌కింద కొన్నేళ్ళు ఒకతూరి ఈ కంపెనీ తాత్కాలికంగా రద్దు చేయబడింది. మూడవ విలియం పాలనలో ఒకతూరి పార్లమెంటు కలుగజేసుకొని అసలే రద్దుచేసివేస్తామని భయపెట్టారు.

"ఆ డచ్చిరాజు సింహాసనం ఎక్కినప్పుడు బూర్జువావర్గం (విగ్సు) బ్రిటిషు సామ్రాజ్యానికి పన్నులుకట్టేవారైనారు. ఇంగ్లాండు బ్యాంకు పుట్టింది. ఈ కాలంలోనే ఇంగ్లాండులో ప్రొటెక్టివ్ పద్ధతి అమలులోకి వచ్చింది. యూరపులో ఆ యా రాజ్యాల అధికార వివక్షలు తేలిపోయాయి. అప్పుడే ఈస్టు ఇండియా కంపెనీ అస్తిత్వాన్ని పార్లమెంటు గుర్తించింది. పైకి స్వేచ్ఛాయుగంగా కనబడే ఆ యుగం నిజానికి గుత్తవ్యాపారాల యుగం.

ఎలిజబెత్తు, మొదటి ఛార్లెస్ కాలాల్లోలాగా రాజానుగ్రహంతో కాకుండా ఈ గుత్తవ్యాపారం పార్లమెంటు ఆమోదంతో జాతీయం చేయబడింది."

(మార్క్సు, "ఈస్టు ఇండియా కంపెనీ - దాని చరిత్ర - పరిణామం" న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్, జులై 11, 1853.)

బ్రిటిష్ పారిశ్రామిక యజమానులు తమ గుత్తవ్యాపారం (మొనాపలీ) కోసమనే, భారతదేశ వస్తువులను బహిష్కరించాలని కోరి చరితార్థులయ్యారు. లాభసాటి భారతదేశపు వర్తకంనుంచి తమ్ము వెలివేశారని, యితర వర్తకులూ వీరూ ఎడతెగకుండా ఆందోళన చేశారు ఈ ఆందోళనద్వారానే, కంపెనీ యజమానులను, డైరెక్టర్ల కోర్టును రద్దుచేయాలని తెచ్చిన ఇండియా బిల్లుతో ఫాక్సు ప్రభుత్వం 1783 లో పడిపోయింది. తర్వాత చాలరోజులవరకు 1786 నుండి 1795 వరకూ హేస్టింగ్సుపై వచ్చిన నేర విచారణ, ప్రభువుల సభముందు జరగడానికి యిదే మూలం. కాని పారిశ్రామిక విప్లవం పూర్తయ్యేవరకు, ఇంగ్లీషు పరిశ్రమల పెట్టుబడిదారీ విధానం ప్రధాన స్థాన మాక్రమించలేదు. ఆ తర్వాతనే 1813 లో ఆ గుత్త వ్యాపారం రద్దు అయింది. దాని సంపూర్ణ నిర్మూలనం 1833 లో పూర్తయింది.

1813 తర్వాత ఇంగ్లీషు పారిశ్రామికుల దోపిడీద్వారానే భారతదేశ ఆర్థిక వ్యవస్థ సమగ్ర విధ్వంసనం జరిగింది ఈ విధ్వంసనంవల్ల జరిగిన ఫలితాలను గూర్చి 19 వ శతాబ్ది పూర్వార్ధంలోని కావలసిన అంశాలను మార్క్సు బయటికి తీశాడు. 1780—1850 మధ్య భారతదేశానికి బ్రిటిషు ఎగుమతులు 386,152 పౌన్లనుండి, 8,024,000 పౌన్లకు హెచ్చాయి. భారతదేశానికి ఎగుమతులు బ్రిటిష్ మొత్తం ఎగుమతుల్లో 32 వ వంతునుంచి 8 వ వంతుకు పెరిగాయి 1850 లో దూదిపరిశ్రమలకు విదేశమార్కెట్టులో నాలుగోవంతు అయిన ఇండియామార్కెట్టు లభించింది. బ్రిటిష్ జనాభాలో 8 వ వంతు ఇందులోపనిచేశారు మొత్తం ఇంగ్లాండు జాతీయాదాయంలో 12 వ వంతు ఇందువల్లనే వచ్చింది.

"1818 నుండి 1836 వరకు భారతదేశానికి బ్రిటిష్ ఎగుమతులు ఒకటికి 5,200 వంతున పెరిగాయి. 1824 లో భారతదేశానికి బ్రిటన్ ఎగుమతి చేసిన గుడ్డలు కేవలం 60 లక్షల గజాలుమాత్రమే మరి 1837 లో 6 కోట్ల 40 లక్షల గజాలకు పెరిగాయి. కాని అదే సమయంలో ఢక్కా జనసంఖ్య 1,50,000 నుండి 20,000 కు తరిగిపోయింది. మజ్లిన్లకు ప్రసిద్ధమైన భారతపట్టణాలకు యీ వినాశం మాత్రమేకాదు కలిగిన నష్టం; బ్రిటిష్ యంత్రాలు, విజ్ఞానం హిందూస్థాన్‌లోని వ్యవసాయానికి, చేతి పరిశ్రమలకు మధ్యవున్న ఐక్యతను పూర్తిగా నిర్మూలించివేశాయి."

(మార్క్సు, "భారతదేశంలో బ్రిటిష్ పాలన" న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్, జూన్ 10, 1853).

"ఇంగ్లీషు బట్టల యంత్రాలు భారతదేశంలో తీవ్ర పరిణామానికి కారణమయ్యాయి గవర్నర్ జనరల్ 1834-5 లలో ఇలా వ్రాశాడు: 'వాణిజ్య చరిత్రలో ఇంతటి దారుణబాధ బింకెక్కడా కలిగివుండదు. నేత పనివారి ఎముకలు భారతదేశ మైదానాలను చలవజేస్తున్నవి."

(మార్క్స్, "కాపిటల్" వాల్యూం 1, అధ్యాయం 15, సెక్షన్ 5)

ఆ గ్రామ వ్యవస్థ 'వ్యవసాయ పరిశ్రమల సమ్మేళనం' మీద నిర్మితమైంది. "ప్రాచీన భారత సమాజనిర్మాణానికి చేతిమగ్గము, రాట్నము ఆధార స్తంభాలు" అందువల్ల "ఆశియాలో మహత్తరమైన - ఎప్పటికీ వినని ఒకే ఒక సాంఘిక విప్లవాన్ని బ్రిటన్ తెచ్చింది. ఈ విప్లవం పాత గృహ పరిశ్రమల పట్టణాలను విధ్వంసంచేసి పట్టణ ప్రజలను గ్రామాలకు తరమడమేకాక, గ్రామ ఆర్థిక జీవనాన్ని తల్లక్రిందులు చేసింది. ఇందువల్లనే వ్యవసాయంపై జనం ఎగబ్రాకి ఒత్తిడి కలిగించడం నాటినుండి నేటివరకుకూడ దినదిన ప్రవర్ధమానంగా కనిపిస్తున్నది. అంతేకాక అందుతోపాటు అతిక్రూరంగా రైతులనుండి విపరీతమైన పన్నులు లాగుతూ నీటివసరులకు తగిన డబ్బు వెచ్చించకపోవడంవల్ల (1850-51 లో 193 లక్షల పౌన్ల భూమిపన్ను వసూలుచేసి, అందులో కేవలం 1,66,390 పౌన్లు నూటికి 1 కంటే తక్కువ మాత్రమే అన్నివిధాల నీటివసరులకు ఖర్చుపెట్టారు.) వ్యవసాయాభివృద్ధి అరికట్టబడింది.

"ఈ పన్నులు శ్రామికులను, ఉత్పత్తి సాధనాలను పునర్నిర్మించేందుకు కూడ సాధ్యపడని రీతిగా విపరీతంగా పెరిగిపోవచ్చు. ఉత్పత్తిని విస్తారం చేయడం అసలే అసాధ్యంగా చేయవచ్చు రైతులకు పొట్టకు తగినంత తిండికూడ లేకుండా చేయవచ్చు. అందులోను - ఇండియాలోను ఇంగ్లాండులాంటి పారిశ్రామిక దేశం ఒకటి, ఈ వ్యవసాయ పద్ధతిలోఉన్న దేశాన్ని ఆక్రమించి పీడించడం మొదలుపెట్టినప్పుడు ఇది తప్పనిసరిగా జరుగుతుంది."

(మార్క్స్, "కాపిటల్" వాల్యూం 3, అధ్యాయం xlvii, సెక్షన్ 3)

భారతదేశంనుండి బ్రిటన్ తీసిన లాభాలు (ట్రిబ్యూట్) మార్క్స్ ఈక్రింది విధంగా అంచనా వేశాడు:

"ఉద్యోగులు తమ జీతాల్లో మిగిల్చామని ఏటా ఇంగ్లాండుకు పంపేడబ్బును మినహాయించి, ఇంగ్లీషు వర్తకులు తమలాభాలలోని భాగమంటూ ఇంగ్లాండులో పెట్టుబడిపెట్టేందుకు పంపే డబ్బును మినహాయించి, కేవలం బ్రిటిష్ పెట్టుబడికి వడ్డీలు, డివిడెండ్లు వగైరాలద్వారా 'మంచి ప్రభుత్వం' కోసమని భారతదేశ మొక్కటే 50 లక్షల పౌనులు అచ్చుకోవలసి వస్తున్నది"

(మార్క్స్ "క్యాపిటల్" వాల్యూం 3, 35 అధ్యాయం సెక్షన్ 4)

ఆ గ్రామ వ్యవస్థ పతనానికి, భారత సమాజ ప్రాచీన ప్రాతిపదిక విధ్వంసమైనందుకు మార్క్స్ కన్నీరు కార్చాడా? అన్ని దేశాలలోలాగే, అందులో ముఖ్యంగా అలాంటి దుర్భర పరిస్థితులను అనుభవింపవలసి వచ్చింది గనుక భారతదేశంలో బూర్జువా సమాజం విప్లవంవల్ల కలిగిన అపారబాధలను మార్క్స్ గమనించాడు. కాని అందుతోపాటు, ఆ గ్రామ వ్యవస్థలోని తీవ్ర అభివృద్ధినిరోధక లక్షణాలనుకూడ చూచాడు. మానవజాతి పురోగమించాలంటే ఆ వ్యవస్థ విధ్వంసనం తప్పనిసరి అవుతుందనికూడ గ్రాహ్యం చేసుకున్నాడు "ఆ చలనంలేని (Idyllic) గ్రామ సంఘాల"లోని ప్రజాకోటి అధోగతిని ఆయన అభివర్ణించాడు. యూరోపులోలాగే, ఇండియాలోకూడ ముందువైపుకాక వెనకచూపు మరల్చేవారికీ, బ్రిటిష్ రాక ముందటి రాట్నం, చేతిమగ్గాల భారతదేశాన్ని పునరుద్ధరించాలంటూ బ్రిటిష్‌పాలనను ఎదిరించాలనే భారతీయులకూ ఆనాడు మార్క్స్‌చెప్పిన మాటల్లోని శక్తి ఇప్పటికికూడ గోల్పోలేదు:

"ఎంతో శ్రమించి ఏర్పరచినట్టి, పైతృకమైనట్టి, నిరుపద్రవకరమైనట్టి ఆసమాజవ్యవస్థల శిఖరాలు విచ్ఛిన్నమైపోయి మట్టిలోకలిసిపోవడం, కష్ట సముద్రాల్లోకి త్రోసివేయబడడం, ఆసంస్థలలోని వ్యక్తులు సాంప్రదాయానుగతమైన నాగరికతను, వృత్తులను పోగొట్టుకోవడం చూస్తుంటే మానవ హృదయమెంతో బాధపడుతుంది. అయినప్పటికీ ఇదిమాత్రం మనం మరచిపోరాదు. ఈ స్థావర గ్రామసంస్థలు పైకి ఎంత నిరుపద్రవంగా కనిపించినప్పటికీ, ప్రాచ్య నిరంకుశ దౌర్జన్యాలకు గట్టిపునాదులుగా ఉంటూ వచ్చాయి. సంకుచిత ఆవరణలో మానవ మేధస్సును కదలనివ్వకుండా కట్టివేశాయి. మేధస్సును మూఢనమ్మకాలకు ఎదురాడని సాధనంగా చేసివేసి, సాంప్రదాయ ఆచారాలతో బానిసను చేసివేశాయి, ఆమేధస్సులోని మహాత్వాన్ని, చారిత్రక అపారశక్తి సామర్థ్యాలను నాశనం చేశాయి ఈ సంగతినిమాత్రం మనం మరచిపోగూడదు

"ఏ కాస్త పాడు పొలం ముక్కమీదనో కేంద్రీకరింపబడిన ఆ అనాగరక అహంకారం, ఏమాత్రం చలించకుండా, సామ్రాజ్యాలు శిథిలమౌతుంటే చూస్తూ కూచుండి; చెప్పరాని క్రూరకార్యాలు జరుగుతుంటే నోరు మెదపలేదు పెద్ద పెద్ద పట్టణాల ప్రజానీకాన్ని పరాపరా కోసిపారవేస్తుంటే కాలు కదల్చలేదు దానికివేమీ లెక్కలేకపోయింది. ప్రకృతిలోని సహజ సంఘటనల్లాగానే వీటినీ జూచింది. చివరకు తనమీద కన్నుపడిన ప్రతి దండయాత్రీకునికి అనాథయై బలియయింది. ఈ సంగతిని మనం మరచిపోరాదు.

"స్తబ్ధము, ఆత్మగౌరవవిహీనము, స్థావరరూపముఅయిన ఈజీవితం ఈ చైతన్య రహితమైన బ్రదుకు, మరొకవైపు ఇందుకు విరుద్ధమైన పాశవ లక్ష్యరహిత అనంత వినాశకశక్తులను రెచ్చగొట్టింది; ఖూనీలనే హిందూ

స్థానంలో మత కర్మగా చేసివేసింది ఈసంగతినికూడా మనం మరచి పోకూడదు.

"ఈచిన్న గ్రామసంఘాలు, కుల విభేదాల మయమైపోయా, బానిస లను కొందరిని సృజించి, మానవుని పరిస్థితులకు సర్వాధికారినిగా చేయటంపోయి బాహ్యపరిస్థితులకు దాసుణ్ణిచేశాయి స్వయంగా అభివృద్ధి పొందుతూరావలసిన సమాజవ్యవస్థను చలనంలేని సహజకర్మగా మార్చి వేశాయి, ఏతన్మూలంగా అమానుషమైన ప్రకృతిపూజ ఏర్పడింది. ప్రకృతికి పరమాధిపతిఅయిన మానవుడు కోతి అయిన హనుమంతునికి, కామధేను వనే ఆవుకు మోకరిల్లి ప్రణమిల్లే స్థితికి ఆ నీచస్థితే కొనివచ్చింది. ఈసంగ తిని మనం మరచిపోరాదు."

(మార్క్సు," భారతదేశంలో బ్రిటిష్ పాలన")

కాబట్టి భారతదేశంలోని బ్రిటిష్ ఆర్థిక పద్ధతి "వంచక"మని (ఏంగిల్సుకు జూన్ 14, 1853 న వ్రాసిన ఉత్తరంలో) వర్ణించినప్పటికీ ఆ బ్రిటిష్ ఆక్రమణ "తనకు తెలీకనే చరిత్రకు సాధనంగా" పనిచేస్తోందని గుర్తించాడు.

"హిందూస్తాన్ సమాజంలో విప్లవం రావడానికి కారణమైన ఇంగ్లాండు అతి నీచ స్వార్థంతో, పరమ మూర్ఖ పద్ధతి అవలంబించినమాట వాస్తవమే. సమస్యేమిటంటే; ఆశియా సమాజ వ్యవస్థలో ప్రధాన విప్లవం రాకపోతే మానవజాతి తన భవిష్యత్తును పరిపూర్తి చేసుకోగలదా ? అది చేసుకోలేనప్పుడు ఇంగ్లాండుచేసిన ఎన్ని నేరాలున్నప్పటికీ అది ఆ విప్లవం కొనిరావడంలో తనకు తెలీకనే చరిత్ర చేతికీలుబొమ్మగా పనిచేసింది."

(పై దానిలోనిదే)

## 4. బ్రిటిషు పాలన-దాని 'పునరుజ్జీవన' పాత్ర

మార్క్సుదృష్టిలో ఇంగ్లాండు "భారతదేశంలో రెండుపాత్రలు నిర్వహించ వలసిఉంది. ఒకటి విధ్వంసనపాత్ర-రెండు పునర్నిర్మాణ పాత్ర-పాతఆశియాలో పాశ్చాత్య సమాజానికి తగిన పరిస్థితులకు పునాదివేయడం." ఇంతవరకు విధ్వం సనమే ముఖ్యంగా కనిపిస్తూంది; అయినప్పటికీ పునరుజ్జీవన పాత్రకూడ మొదలైంది.

"హిందూ నాగరికతకంటె ఉన్నతనాగరికత గల్గిన దండయాత్రి కుల్లో మొదటివారు బ్రిటిషువారు. కాబట్టి హిందూనాగరికతకు అందుబాటులో లేదు దేశీయ గ్రామసంస్థలను కూలద్రోసి, దేశీయ పరిశ్రమలను విచ్ఛిన్నం చేసింది. దేశీయసమాజంలోని ఉన్నత ఉత్తమ పద్ధతులన్నిటినీ చదరంచేసి హిందూదేశ నాగరికతను విధ్వంసంచేసింది. దేశంలోని బ్రిటిష్‌పాలన చరిత్రలో ఆ విధ్వంసనంతప్ప ఇంకేమీ చూపెట్టలేదు. ఆమహత్తర శిధి

లాల్లోంచి పునర్నిర్మాణదశ కనిపించడంలేదు. అయినప్పటికీ ఆ కార్య క్రమం ప్రారంభమయింది."

(మార్క్స్, భారతదేశంలో బ్రిటిష్‌పాలన-దాని భావిఫలితాలు" న్యూయార్క్ డైలీట్రిబ్యూన్, ఆగస్టు 8, 1853)

ఆ పునర్నిర్మాణం మార్క్స్‌వేనిలో చూచాడు; ఆయన ఎన్నో సూచన లను వివరించాడు.

(1) "రాజకీయ ఐక్యత-మొగల్ సామ్రాజ్యంక్రింద ఎప్పుడూ లేనంతగా విస్తరింపబడి పాదుకున్నది." ఇంకా ఇది "ఎలిక్ట్రిగ్రాముతీగెల ఏర్పాటుతో మరింత బలపడుతుంది;"

(2) "దేశీయసేన" (1857 తిరుగుబాటులో దీనివి రద్దుచేశారు. అంతకు ముందువ్రాసిన మాటఇది. తర్వాత బ్రిటన్ బాహాటంగా మొత్తం సేనలో మూడో వంతు బ్రిటిష్ సేనలనుపెంచి బ్రిటిష్ మిలిటరీకంట్రోలును ఎక్కువచేసింది;)

(3) "ఆసియా సమాజంలో తొలిసారిగా ప్రవేశపెట్టబడిన పత్రికా స్వాతంత్ర్యములు" (1835 లో పత్రికల స్వతంత్రచట్టం ప్రకటించినప్పటి మాట ఇది. తర్వాత చాల పత్రికల చట్టాలు 1873 లో వచ్చి, సామ్రాజ్యవాద వినాశదశ అయిన నేటి యుగంలో రాను రాను ఈ చట్టాలు మరింత బిగుసుకపోయ్యాయి);

(4) "ఆసియాలో అతివాంఛనీయమైన పొలంపై స్వంత ఆస్తిహక్కు" ఏర్పాటు;

(5) ఇష్టంలేకపోయినా, ఎంత తక్కువగానైనాసరే భారతదేశంలోని విద్యావంతులను "ప్రభుత్వావసరాలకు తగిన, యూరపియన్ శాస్త్ర విజ్ఞానంతో" తయారుచెయ్యడం;

(6) "ఆవిరి యంత్రాలద్వారా" యూరోపులో ప్రయాణ సౌకర్యాలు.

వీటన్నిటికన్నా ముఖ్యమయంది. పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం, భారత దేశాన్ని పీల్చడంవల్ల తప్పనిసరిగా వచ్చే ఫలితాలు భారతదేశ మార్కెట్టును అభివృద్ధి పరచేందుకు, "ఆ దేశాన్ని ఉత్పత్తి చేసేట్టు మార్చడం" అవసరమవుతుంది - తాము పంపే వస్తువులకు బదులుగా ఆ దేశ ముడిసరుకులు ఎగుమతి చేసేట్టు చేయవలసివస్తుంది అందుకోసం రైల్వేలు, రోడ్లు, ఇరిగేషన్ (నీటి వనరులు) ఏర్పరచక తప్పదు. ఈ నూతన దశ మార్క్స్ రాసిన కాలానికి అప్పుడప్పుడే ఆరంభమయింది. ఈ అభివృద్ధిని గమనించి మార్క్స్ భవిష్యత్తును చెప్పాడు ఆయన భారతదేశంమీద చేసిన ప్రకటనల్లోకల్లా ఇది ప్రఖ్యాతమైనది.

"ఇంగ్లీషు మిల్లు యజమానులు కేవలం భారతదేశ ఉత్పత్తిదారుల నుండి పత్తి మొదలైన ముడిసరుకును తక్కువ ధరలకు బాగాలనే ఉద్దేశంతోనే రైల్వేలను ఆ దేశంలో ఏర్పాటు చేయాలనుకుంటున్నారు.

కాని ఇనుము, బొగ్గువున్న దేశంలోనికి యంత్రాలను ఒకతూరి ప్రవేశ పెట్టింతర్వాత వాని అభివృద్ధిని మీరు అరికట్టలేరు. అంత విశాలదేశంలో రైల్వేలనుమాత్రం ఏర్పరచి ఊరుకోలేరు. తాత్కాలికావసరాలకు, రైల్వే యంత్రాలకు ఎప్పటికప్పుడు అవసరమయ్యే కొన్నిపరిశ్రమలను ఏర్పరచక తప్పదు. తద్వారా రైల్వేలకుమాత్రమే చెందని ఇతర పరిశ్రమలుకూడ పెంపొందుతాయి కాబట్టి భారతదేశంలో రైళ్ళ ఏర్పాటు ఆధునిక పరిశ్రమలకు అగ్రగామి అవుతుంది.... ఆధునిక పరిశ్రమలు, రైల్వే ఏర్పాటు ద్వారా ఏర్పడి, వంశపారంపర్యంగా వస్తున్న భారతదేశపు శ్రమవిభజనను నాశనంచేస్తాయి. ఈ శ్రమవిభజనమీదనే ఏర్పడి భారతదేశ అభ్యుదయానికి, శక్తికి ఆటంకాలుగా వున్న కుల విభేదాలుకూడ పోతాయి"

(మార్క్స్, "భారతదేశంలో బ్రిటిష్ పాలన - దాని ఫలితాలు")

అంటే, భారతదేశంలో సామ్రాజ్యవాదం, భారతప్రజలను విముక్తులను చేసి లోకకళ్యాణపథంలో తీసుకొనిపోతుందని మార్క్స్ భావించాడనా? కాదు. అందుకు వ్యతిరేకంగా ఆయన భావించాడు. బ్రిటిష్ పునర్నిర్మాణ పాత్రనుగూర్చి చెప్పడంలో కొత్త అభ్యుదయానికి తగిన భౌతిక పరిస్థితులు కల్గించడం గురించి మాత్రమే ప్రస్తావించాడు. ఈసంగతిని స్పష్టపరచాడు. కాని ఆ నూతనాభ్యుదయం మట్టుకు భారత ప్రజలే సాధించాలి వారు సామ్రాజ్యవాదాన్నుండి విముక్తులు కావాలనే షరతుమీదనే ఇది ఆధారపడుతుంది. ఆ స్వతంత్రం భారతప్రజల తిరుగుబాటువల్లకాని, లేదా బ్రిటిష్ కార్మికవర్గం విజయంసాధించి భారతప్రజలను స్వతంత్రులను చేయడంద్వారాగాని జరగవచ్చు అంతవరకూ, భారతదేశంలో సామ్రాజ్యవాదం ఏర్పరచిన భౌతికపరిస్థితులన్నీ భారతప్రజల దుస్థితిని ఏమాత్రం మార్చలేవు; వారికేమీ లాభం చేకూర్చలేవు.

"ఇంగ్లీషు పెట్టుబడిదారీవర్గం విధిలేకచేసిన పనులన్నింటివల్ల, ప్రజలు విముక్తులు కావడంకాని, వారిస్థితి బాగుపడడంకాని జరగదు అభ్యుదయం, ఉత్పత్తిశక్తి అభివృద్ధిమీదనేకాక, ఆశక్తిని ప్రజలు స్వాధీనము చేసుకోవడంమీదనే ఆధారపడిఉంటుంది. బ్రిటిష్ పెట్టుబడిదారులు చేసేదల్లా ఆరెంటికీ తగినపరిస్థితులకు పునాదులువేస్తారు. అంతకంటే ఎక్కువ బూర్జువావర్గం ఎన్నడైనా చేసిందా? ప్రజలను, వ్యక్తులను రక్త ప్రవాహాల్లో, బాధల్లో, కల్మషంలో అధమస్థితిలో ముంచివేయకుండా బూర్జువావర్గం ఏకార్యక్రమాన్నైనా ఎన్నడైనా ముందుకు నడపగలిగిందా?

"గ్రేట్‌బ్రిటన్‌లోనే ఇప్పటి పాలకవర్గంస్థానే కార్మికవర్గం రానైనా రావాలి. లేదా భారతీయులే తమంతటతామే ఇంగ్లీషు శృంఖలాలనుపూర్తిగా త్రెంపివేయగల శక్తిసామర్ధ్యాలను సంపాదించుకోనన్నా సంపాదించు

కోవాలి అంతవరకూ బ్రిటిష్ బూర్జువావర్గం అక్కడక్కడా వెదరజల్లిన నూతన సమాజసూత్రాల ఫలితాన్ని భారతీయులు అనుభవించలేరు.

(పై దానిలోవే)

భారతదేశ విప్లవ సూచనలగూర్చి, వాస్యవలసదేశప్రజల స్వతంత్రాన్ని గూర్చి ఎంగిల్సు 1882లో చేసిన ప్రకటనను ఇందుతో పోల్చి చూడవచ్చును.

"బహుశా భారతదేశంలో-చాలమట్టుకు విప్లవం రావచ్చు కార్మిక వర్గం తన విమోచనకోసం పనిచేస్తున్నదిగనక ఏ వలసదేశ యుద్ధాలనూ నడపలేదు ఈ విప్లవానికి పూర్తి అవకాశమివ్వాలి. ఇది వివిధరకాల విధ్వంసనాలులేనిది సాగదనేమాట వాస్తవమే. కాని అన్నివిప్లవాలలోను అలాంటిది తప్పదు. అలాంటి విప్లవమే మరికొన్నిచోట్లకూడ రావచ్చు-అల్జీర్సు, ఈజిప్టులలో-అది మనకు చాల మంచిది."

(ఎంగిల్సు, కాట్స్కీకి జాబు సెప్టెంబరు 12, 1882)

19 శతాబ్ది మధ్యభాగంవరకు భారతదేశ పరిస్థితినిగూర్చి మార్క్సు చేసిన పరిశీలన మూడు ముఖ్యాంశాలను తెలుపుతుంది. ఒకటి: బ్రిటిష్ పాలనలో ఉన్న విధ్వంసనపాత్ర – పాతసమాజాన్ని కూలద్రోస్తారు. రెండు: బ్రిటిష్‌పాలనలోని పునర్నిర్మాణపాత్ర – స్వేచ్ఛావ్యాపార ధనికతత్వయుగంలో భావి నూతన సమాజవ్యవస్థకు తగిన భౌతికపరిస్థితులకు పునాదివేశారు. మూడు: ఇకతర్వాత రాజకీయమార్పు అత్యవసరం గనుక భారతప్రజలు ఆ నూతన సమాజాన్ని నిర్మించడంకోసం తమ స్వతంత్రాన్ని సాధించుకోవాలి

నేడు. భారతదేశంలోని సామ్రాజ్యతత్వం, ప్రపంచమంతటా ధనికతత్వం లాగానే అభ్యుదయశక్తిగా పనిచేసే దశను దాటిపోయి చాలరోజులయింది. ఆస్వేచ్ఛావ్యాపార పెట్టుబడిదారీవిధాన కాలం గతించింది. ఇప్పుడు భారతదేశంలో సామ్రాజ్యతత్వం అతిశక్తివంతమైన అభ్యుదయ నిరోధకశక్తిగా తయారయింది. భారతదేశంలోని వివిధరూపాల అభివృద్ధినిరోధకశక్తులను దువ్వుతూ కాస్తున్నది. అందువల్ల, మార్క్సు సూచించిన రాజకీయాధికారం మార్చేందుకు కర్తవ్యం నిర్వహించవలసిన దశ వచ్చింది. ఇదేనేటి విధి.

## అయిదో అధ్యాయం

# భారతదేశంలో బ్రిటిష్ పాలన - పాత పునాది

"భారతదేశంలో బ్రిటిష్ పాలన అసలదే హింసాకాండకు, దోపిడీకి అంతం లేదు" — లెనిన్, "ప్రపంచ రాజకీయాల్లో చిచ్చురేపుతున్న పదార్థాలు" 1908,

మార్క్స్ భారతతేశాన్నిగూర్చి వ్రాసి తొంభై యేళ్ళకు పైబడింది చాలా తీవ్రమైన మార్పులు జరిగాయి. కాని ఆయన చారిత్రక పరిశీలనలోని స్థూలరేఖలు ఇంకా అలాగే వున్నాయి. భారతదేశ భవిష్యత్తును గూర్చి మార్క్స్ పరిశీలనా దృష్టిని (19వ శతాబ్దంలో భారతదేశంపై వ్రాసిన ఏ రచయితలోనూ ఇంత విస్పష్ట దృష్టి కవ్పించదు) అప్పటినుండీ జరిగిన అనుభవాలు మరింత రుజువుపరచాయి. అంతేగాక ఆయన ఆ పరిశీలన మూలంగా తేల్చిన రాజకీయ నిర్ణయం ఇప్పుడు రుజువవుతున్నది.

అయినప్పటికీ మనమీనాడు ఆయన పరిశీలనను, తర్వాత బ్రిటిష్ సామ్రాజ్యవాద శక్తుల్లోను, భారత ప్రజాశక్తుల్లోను కలిగిన అభివృద్ధినిబట్టి మరింత ముందుకు తీసుకొనిపోవచ్చును.

భారతదేశంలోని సామ్రాజ్యవాద పాలన చరిత్రలో ప్రధానంగా మూడు దశలున్నవి. మొదటిది ; వర్తక పెట్టుబడి దశ; దీనికి ప్రతినిధి ఈస్టు ఇండియా కంపెనీ. 18 శతాబ్ది ఆఖరుదశదాకా ఈ దశలోని సామాన్య పద్ధతి వ్యాపిస్తుంది. రెండోది ; పరిశ్రమల పెట్టుబడిదశ ; ఈ పెట్టుబడిదారీవిధానం 19వ శతాబ్దంలో భారత పీడనకు మరో కొత్త ప్రాతిపదికను ఏర్పరచింది. మూడవది ; బ్యాంకుల పెట్టుబడిదశ; ఇదే ఆధునికయుగం ఈ పద్ధతి పాతపునాదులపై పీడనను ఒక విశిష్ట (ప్రత్యేక) పద్ధతిలో ఏర్పాటుచేసింది. ఈ దశ తొలుత 19 శతాబ్ది ఆఖరి రోజులలో ఆరంభమై ఇటీవల సమగ్ర స్వరూపాన్ని తాల్చింది.

భారతదేశాన్నిగూర్చిన పరిశీలనలో మార్క్స్ వర్తకపెట్టుబడి, పరిశ్రమల పెట్టుబడి దశలను విమర్శించాడు. ఈ పరిశీలనను మనం అధునికి బ్యాంకుల పెట్టుబడిదశవరకు తీసుకొనిపోవాలి. ఆ పెట్టుబడి విధానాన్ని విమర్శించుకోవాలి.

కాబట్టి నేటి దశకు పునాదులుగా ఉన్న మొదటి రెండుదశలను సంగ్రహంగా మనం పరిశీలించుకోవాలి. ఇప్పటి స్థితి ఎలా ఏర్పడిందో తెలుసుకొని, తర్వాత ఆధునిక పద్ధతిపై ముఖ్యంగా మన పరిశీలనను కేంద్రీకరించుదాము *

## 1. భారతదేశం దోపిడీ

సామాన్యంగా ఈస్టుఇండియా కంపెనీ యుగాన్ని 1600 లో మొదటి చార్టర్ నాటినుండి 1858 లో అధికార ప్రభుత్వంలో కలిపివేసుకొనేవరకు లెక్కవేయడం ఆచారం. వాస్తవంగా భారతదేశంలో ఈ కంపెనీ ఆధిపత్యం 18 వ శతాబ్ది ఉత్తరార్ధంలోనే ప్రారంభమయింది.

17 వ శతాబ్దికోనే వర్తక కేంద్రాలు స్థాపింపబడినప్పటికీ (సూరత్‌లో 1612; సెంటుజార్జికోట మద్రాసు 1639; బొంబాయి కంపెనీ కౌలుకు ఇవ్వడం 1668; కలకత్తా ఫోర్టువిలియం 1693 లో), తర్వాత భారతదేశాన్ని జయించిన కొత్త ఈస్ట్ ఇండియా కంపెనీ తొలి హరి చార్టరును (ప్రభుత్వ అధికారపత్రాన్ని) 1698 లో మాత్రమే తీసుకుంది. అది పూర్తి స్వరూపాన్ని 1708 వరకు పొందలేదు. అందువల్ల భారతదేశాన్ని జయించిన ఈస్టు ఇండియా కంపెనీ, పారిశ్రామిక విప్లవంతో ఇంగ్లాండును గుప్పిటపెట్టుకున్న పాలకవర్గపు గుత్తవ్యాపార సంస్థ అని బోధపడుతుంది.

18 వ శతాబ్దిమధ్యభాగంలో కంపెనీ భారతదేశంలో ప్రదేశరాజ్యాధిపత్యాన్ని స్థాపించుకోనారంభించింది. మొగల్ సామ్రాజ్య పతనం తర్వాత 18వ శతాబ్దిలో భారతదేశంలో అంతర్యుద్ధాలు చెలరేగాయి. ఈ యుద్ధాలు (కొన్ని విషయాల్లో వీటిని ఇంగ్లాండులో రోజెస్ యుద్ధాలతోను, జర్మనీలోని 30 ఏళ్ళ యుద్ధంతోను పోల్చవచ్చును) ఆంతరంగిక సంక్షోభాన్ని తెలియజేసే యుగాన్ని ప్రతిబింబిస్తున్నవి. పాతవ్యవస్థ విచ్ఛిన్నానికి కాలగతి ననుసరించి, పురోగమిస్తున్న వర్తకం, నౌకా పరిశ్రమల ప్రాతిపదికపై బూర్జువావర్గ అధికారస్థాపనకు ఆ సంక్షోభం అవసరమైంది. ఈ విషమసమయంలో పరిపూర్ణంగా అభివృద్ధి పొందిన యూరపియన్ ధనికవర్గం దాడివచ్చింది. వారికి ఉత్తమమైన శాస్త్రీయ సైనిక సాధనసంపత్తి ఉంది. అందువల్ల ఆనాటి, సహజంగా జరగవలసిన, చరిత్ర పరిణామాన్ని విచ్ఛిన్నంచేసింది. అందువల్ల పాతవ్యవస్థ విచ్ఛిన్నమైంది, ఆ స్థానంలో పాతవ్యవస్థ నిర్మాణంలోనే తయారైన భారతధనికవర్గం పాలనకాక విదేశ ధనికపాలనం వచ్చింది. పాతవ్యవస్థపైపడి బలాత్కారంగా, అప్పుడప్పుడే పైకి వస్తున్న భారతదేశ ధనికవర్గపు మొలకలను మొదలంటా నాశనం

---

* ఈ అధ్యాయంలోని ఎక్కువ భాగం ఆర్. సి. దత్తు "బ్రిటిష్‌పాలన ప్రారంభంలో భారతదేశ ఆర్థిక చరిత్ర" (1901) "విక్టోరియా యుగంలో భారతదేశ ఆర్థిక చరిత్ర" (1903) అనే పుస్తకాలలో నుంచి గ్రహించాను. ఆయనకు కృతజ్ఞుడను. ఈ పుస్తకాలే 19 వ శతాబ్ది ఆఖరువరకూ ఉన్న పరిస్థితిపై ప్రామాణికంగా ఇప్పటికీ ఉన్నవి.

చేసింది. ఇక్కడే భారతదేశ అభివృద్ధిలో విషాదగాధ ఇమిడిఉంది. ఆ తర్వాత విదేశ ధనికవర్గ స్వార్థానికని సామాజిక అభివృద్ధి విచ్ఛిన్నం చేయబడింది లేదా ప్రక్కకు లాగబడింది.

ఈ కల్లోలాలతో, మార్పులతో నిండిన విషమయుగంలో 18 వ శతాబ్ది భారతదేశం తగులొన్నప్పుడు. విదేశ దురాక్రమణదారులు కొన్ని ప్రాంతాలను కుట్రలద్వారా, యుద్ధంద్వారా ఆక్రమించుకోవడానికి వీలు చిక్కింది. ఈ యుద్ధంలో బ్రిటిష్ బూర్జువావర్గం, చాల అభివృద్ధిచెందిన ధనికవర్గానికి ప్రాతినిధ్యం వహించడంవల్ల విజయవంతమైంది. 18 వ శతాబ్ది ఉత్తరార్ధప్రారంభంలో బెంగాలును జయించడంతో పాతపద్ధతులలోనే నామకః రాజ్యం ఏర్పరిచారు. అది క్రమ క్రమంగా విస్తరిల్లి 19 వ శతాబ్ది ప్రారంభానికి భారతదేశంలో బలవత్తరమైన ప్రభుత్వంగా పరిణమించింది

కంపెనీ 1858 వరకు నామకః ఆధిపత్యం వహించింది వాస్తవానికి కొత్తగా గెల్చుకున్న ప్రాంతాలలో బ్రిటిష్‌ప్రభుత్వ అధికారం అప్పటికే స్థాపితమైంది లార్డునార్తు 1773 రెగ్యులేషన్ చట్టంతో అది ఆరంభమైంది ఆచట్టం గవర్నర్ జనరల్‌ను, అతని కార్యవర్గాన్ని ఒక సుప్రీం కోర్టును నియమించింది.

1784 నాటి పిట్‌చట్టం లండన్‌లో భారత రాజ్యాంగ కార్యదర్శిని, కంట్రోలుబోర్డును నియమించింది. 1813 లో కంపెనీ గుత్తవ్యాపారం అంతం అయింది. దానితో కంపెనీ ప్రత్యేక ఆర్థిక పాత్ర ఆఖరయింది (చైనావ్యాపారం మాత్రం కంపెనీచేతిలో ఉండినది అదికూడా 1833 తో ఆఖరయింది.) ఈ ద్వంద్వపరిపాలనా పద్ధతి 19 శతాబ్ది పూర్వార్ధమంతా సాగింది. 1857 తిరుగుబాటుతో ఈపద్ధతి అసమర్థమని బూజుపట్టిన పద్ధతిఅని తేలిపోయింది ఆ మరుసటి సంవత్సరం కంపెనీని రద్దుచేసివేశారు.

ఇందువల్ల ఈస్టు ఇండియా కంపెనీ ఆధిపత్యం ప్రత్యేక పీడన ముఖ్యంగా 18 వ శతాబ్ది ఉత్తరార్ధమని బోధపడుతుంది ఆ కాలము ఆధునిక పెట్టుబడిదారీ విధానానికి ప్రారంభయుగం. తర్వాతి 19వ శతాబ్దపు పారిశ్రామిక పెట్టుబడిదారీ విధాన పాలన వేరు వానిని వేరుగా పరిశీలించవలసి ఉంటుంది.

ఈస్టు ఇండియా కంపెనీ భారతదేశ వర్తకంలో మొదటి ఉద్దేశం వర్తక పెట్టుబడిదారుల కంపెనీలకున్న ఉద్దేశమే-విదేశాల వస్తువులపై పంటలపైన గుత్త వ్యాపారంచేసి లాభం సంపాదించాలి అన్నదే. ప్రధానోద్దేశం బ్రిటిష్ వస్తువులకు మార్కెట్టును ఏర్పరచుకోవడం కాదు; మరి భారతదేశంలో ఈస్టు ఇండీస్‌లోను పండే వస్తువుల సరఫరాను (మిరియాలు, లవంగాలు మొదలైన మసాలావస్తువులు నూలు, పట్టుబట్టలు ముఖ్యంగా) తాము గుత్తకు తీసుకోవాలనే వారి ఆశయం ఆ వస్తువులకు యూరోపులోను, ఇంగ్లాండులోను మార్కెట్టు సిద్ధంగావుంది. కాబట్టి వస్తువులను ఆ దేశంనుండి తెస్తే ఇంగ్లాండులో కావలసినంత లాభం సంపాదించవచ్చు.

ఇలా భారతదేశంలోని వస్తువులు సంపాదించేందుకు, వ్యాపారరీత్యా భారత దేశానికికూడ బదులు ఏదైనా తీసుకెళ్ళాలి అనేసమస్య ప్రారంభంనుండీ కంపెనీని బాధిస్తున్నది. 17వ శతాబ్ది ప్రారంభంలో ఇంగ్లాండున్నస్థితిలో, భారతదేశంలో తయారయ్యేవస్తువులకన్న ఉత్తమమైనవేవీ సరఫరాచేయడానికి లేవు. అప్పటికి ముఖ్యమైన పరిశ్రమ ఉన్ని పరిశ్రమ ఒక్కటే ఆ ఉన్ని వస్తువులేవీ భారత దేశానికి పనికిరావు. కాబట్టి భారతదేశ వస్తువులను కొనడానికి బంగారు, వెండి తీసుకొనిపోవలసి వచ్చింది.

"ప్రాచ్యదేశ వర్తకంలోఉన్న చిక్కేమిటంటే వారికి కావలసిన వానిలో యూరోపు పంపగలవి చాల తక్కువ వెండి మినహాయిస్తే-రాజ సభలకు పనికివచ్చే కొన్ని విలాస వస్తువులు. సీసం, రాగి తగరం, సత్తు, పాదరసం పగడం కొద్దిగా బంగారం. దంతం మాత్రమే భారతదేశం తీసుకోగలవి కాబట్టి ముఖ్యంగా వెండిమాత్రమే తీసుకొనిపోబడింది."

(ఎల్ సి ఎ నోలెస్, "సముద్రాంతర సామ్రాజ్యం - ఆర్థిక అభివృద్ధి" పుట 73.)

దాని ననుసరించి, ఈస్టిండియా కంపెనీ ప్రారంభంలో, ఏటా 30 వేల పౌనుల వెలగల వెండి, బంగారం, విదేశ నాణ్యాలు ఎగుమతి చేసేందుకు ఆ కంపెనీకి అధికారం ఇచ్చారు కాని ఈ స్థితి వర్తక పెట్టుబడివారీ విధానాని కంతటికీ కష్టంగా, దుర్భరంగా కనిపించింది. వెండి బంగారమే దేశానికున్న నిజమైన ధనమనీ ఆ ధనం కావలసినంత రావాలనీ, వర్తకానికి ముఖ్యాదర్శం అదేననీ వారు భావించారు.

తొలినుంచే ఈస్టుఇండియా కంపెనీ వర్తక "సాహసికులు" ఈసమస్యను పరిష్కరించాలని తహతహ పడ్డారు, భారతదేశ వస్తువులను చౌకగానో, అసలే ఏమీ ప్రతిఫలం ఇవ్వకుండానో సంపాదించాలని ఉపాయాలు వెతికారు. అందు కోసం డొంకతిరుగుడు వ్యాపార పద్ధతిని అవలంబించారు మిగతా తమకింద ఉన్న ఆఫ్రికా, అమెరికా వలసదేశాలలో దోపిడీని భారతదేశంలో అమ్ముకోవలసిన ధనానికై ఉపయోగించారు భారతదేశంలో నరాసరి దోపిడీకి తమ కింకా శక్తి చాలలేదు.

"భారతదేశంలో ఇంగ్లీషు వర్తకం, భారతదేశం తీసుకునేందుకై ఇష్టపడే వస్తువుకోసం వేటగా వాస్తవస్థితిలో పరిణమించింది. వెస్టు ఇండీసులోను, స్పానిష్ అమెరికాలోను బానిసలను అమ్మగా వచ్చిన వెండి ఈ విషయంలోచాల ముఖ్యమైనది."

(నోలెస్ 1 పుట 74.)

భారతదేశంలో పదునెనిమిదవ శతాబ్ది మధ్యలో రాజ్యాధికారం ఏర్పడింది. మారకం వెలను ఎక్కువచేసి, సాధ్యమైనన్ని ఎక్కువ వస్తువులు, సాధ్యమైనంత తక్కువ ధరలకు లాగేందుకు అధికారపద్ధతులను ఉపయోగించ వీలుకలి

గించి. తొలినుంచీ వ్యాపారానికీ, దోపిడీకీ అట్టే భేదం చూపెట్టలేదు (అసలు తొలుత వెళ్ళిన వర్తకులు సామాన్యంగా వర్తకాన్ని సముద్రాల దోపిడీని కలిపి వేస్తూ వచ్చారు.) ఆ వున్న భేదం కూడా రానురాను మరీ పలచబడింది. నేతగాడు కాని, రైతుగాని ఏ ఉత్పత్తిదారైనా, వర్తకునికే బేరంలో మంచి స్థానం ఎప్పుడూ ఉంటుంది అతనే షరతులను విధించేవాడు. కాని ఇప్పుడు కొలతబద్దల స్థానంలో కత్తినుపయోగించి సర్వసమాన మారకమనే నటనను కూడ వదలివేశారు 1762 కల్లా బెంగాలు నవాబు చేతులు నలుపుకుంటూ, కంపెనీ ఏజంట్లను గూర్చి ఈస్టిండియా కంపెనీకి ఫిర్యాదుచేసే స్థితికి వచ్చాడు.

"నాలుగోవంతు వెలలుమాత్రంయిచ్చి రైతులవద్ద, వర్తకులవద్ద ఉన్న సరుకును వస్తువులను వారు బలాత్కారంగా తీసుకొని పోతున్నారు. హింసను, నిర్బంధవిధానాన్ని ఉపయోగిస్తూ, రైతులు మొదలైనవారి నుండి ఒకరూపాయి వెలగల వస్తువుకు అయిదురూపాయలు లాక్కుంటున్నారు."

(ఇంగ్లీషు గవర్నరుకు బెంగాలు నవాబు నివేదిక మే, 1762)

ఇలానే విలియంబోల్ట్సు అనే ఇంగ్లీషువర్తకుడు "భారతదేశ వ్యవహారాల పరిశీలన" అనే పుస్తకంలో (1772లో ప్రకటితం) ఇలా వర్ణించాడు.

"ఇంగ్లీషువారు తమ గుమాస్తాల, వర్తకులద్వారా నిరంకుశంగా ఏఏ ఉత్పత్తిదారు ఎన్నెన్ని వస్తువులు ఇవ్వాలో, వాటికి ఎంత ఖరీదివ్వాలో కూడ తామే నిర్ణయించేవారు.... పేదసాలివాని అంగీకారం సామాన్యంగా అవసరమనికూడ భావించడంలేదు; కంపెనీ పెట్టుబడిపై ఉద్యోగానికి కుదిరిన గుమాస్తాలపని తమకిష్టంవచ్చిందిరాసి వారితో సంతకాలు పెట్టించే వారు. ఇచ్చినడబ్బును సాలివారు నిరాకరిస్తే వారిని ముక్కోడానికికట్టి కొరడాలతోకొట్టి పంపించేవారిని తెలియువస్తున్నది.... ఈసాలీలలో చాల మందిని కంపెనీగుమాస్తాల పుస్తకాలలో నమోదుచేసుకొనేవారు ఇక ఆ జాబితాలోనివారిని ఇంకొకరికి పనిచెయ్యనీకుండా తమలో ఒకరినుండి ఒక రికి బానిసల్లాగా ఆసాలీలను మార్చుకుంటూంటారు.... ఈ శాఖలోవున్న వంచకత్వం, మోసం ఊహాతీతం. ఇవన్నీ పేదసాలీని మోసచేసేందుకే, గుడ్డల పరిశీలకులతోచేరి ఈకంపెనీ గుమాస్తాలు నిర్ణయించే వెలలు అన్ని చోట్లా నూటికి 15 వంతులు, కొన్నిచోట్ల నూటికి 40 వంతులు స్వయంగా ఆసాలీలు బజారులో అమ్ముకుంటేవచ్చే ధరలకన్నా తక్కువగా ఉండేవి."

(విలియంబోల్ట్సు, "భారతదేశ వ్యవహారాల పరిశీలన" 1772 పుట 191-4)

కాబట్టి "వర్తకం" అని నామకః ఉన్నా, ఇది వర్తకంకన్నా దోపిడీగా అప్పటికే తయారయింది.

కాని 1765 లో బెంగాలు, బీహారు, ఒరిస్సాల పాలనాధికారం దొరకడంతో పన్నుల వసూలు అధికారం కంపెనీ చేతుల్లోకి వచ్చింది. ఇది రావడంతో అప్పటికి వ్యాపారంపేర లాగుతున్న లాభాలకుతోడు సరాసరి దోపిడీకే అపారమైన అవకాశం దొరికింది. ఆతర్వాత ఏమాత్రం సిగ్గూ ఎగ్గూ లేని మొత్తం దోపిడీ ప్రారంభమయింది. దీనితో 18వ శతాబ్ది ఆఖరున కంపెనీ పాలన చరిత్రలో సామెతగా (సర్వసామాన్యంగా) మారిపోయింది. 1784 లో కామన్సు సభలో వచ్చిన తీర్మానం మాటలలో చెప్పాలంటే ;

"ఈస్టు ఇండియా కంపెనీ తమ ఉద్దేశాలనే - రాజకీయంగా, వర్తక రీత్యా కూడ పూర్తిగా తల్లక్రిందులుచేసి కల్మషపూరితమైపోయిందని పార్లమెంటు విచారణవల్ల తేలింది. చార్టరుద్వారా ఇచ్చిన యుద్ధ - శాంతి అధికారాలను కంపెనీ దుర్వినియోగం చేసింది దోపిడీలకోసం ప్రతి వర్గంలోను ద్వేషాన్ని శత్రుత్వాన్ని రెచ్చగొట్టింది. వారుచేసిన సంధులన్నీ దాదాపు కేవలం ప్రజా విశ్వాసాన్ని విచ్ఛిన్నం చేసేందుకే కారణమైనవి. ఒకప్పుడు సర్వ సౌభాగ్యవంతమైన దేశాలు అసమర్థ, శిథిల, జన విహీన దేశాలుగా అధమస్థితికి వచ్చాయి."

దీనితో కంపెనీయే తనపాత్రనుగూర్చి చెప్పిన అభిప్రాయాన్ని పోల్చిచూడవచ్చు. 1858 లో పార్లమెంటుకు కంపెనీ పెట్టుకున్న దరఖాస్తులో ఇలావుంది : (డాంబిక మహర్షి జాన్ స్టువర్టుమిల్ వ్రాసినదిది.)

"మాలో ఒక భాగంగా ఉన్న ప్రభుత్వం - ఉద్దేశాలు అతి పవిత్రమైనవి మాత్రమేకాక, మానవ చరిత్రలో కనివినియెరుగని మహత్తర ప్రజాక్షేమ కార్యాలు చేస్తున్నది."

ఈ ఆత్మస్తోత్రంపై సర్ జార్జి కార్నివాల్ లెవిస్ 1858 లో పార్లమెంటు సభలో ఇలా ప్రకటించాడు :

"1765 నుండి 1784 వరకున్న ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం కంటే, అతి ఘోరమైనది, కుళ్ళి కంపుగొడుతున్నది, నీచమైనది, క్రూరమైనది ఇంకే నాగరిక ప్రభుత్వంగాని ఈ ప్రపంచంలో ఏ కాలంలోనూ ఉండలేదు. ఈ సంగతిని నేను పరిపూర్ణ విశ్వాసంతో చెబుతున్నాను."

(సర్ జార్జి కార్నివాల్ లెవిస్ కామన్సుసభలో ప్రసంగం, ఫిబ్రవరి 12, 1858).

ఈస్టిండియా కంపెనీ ఏ ఉద్దేశంతో పనిచేస్తున్నదో (కంపెనీ ఉద్యోగులు స్వయంగా దోచుకునే దోపిడీలు మాత్రమే కాదు) క్లయివ్ పార్లమెంటులో 1772 లో ఇలా తన అభిప్రాయం వెల్లడించాడు :

"రష్యా ఫ్రాన్సులు తప్ప, యూరోపులోని ఏ రాజ్యానికీ లేనంత విశాల సామ్రాజ్యాన్ని కంపెనీ జయించింది. 40 లక్షల బంగారు నాణాల పన్నులు వసూలు చేస్తున్నారు. అందుకు తగినట్టు వ్యాపారంకూడ చేస్తు

న్నారు. అలాంటి పరిస్థితిలో కంపెనీపాలనపైన దృష్టిపెట్టాలని ఆశించడం సహజమే.... ...కాని ఆ విషయం వారు ఆలోచించారా? వారా సంగతి ఆలోచించనేలేదు వారు పాలనను దివాళాతీసిన దక్షిణ సముద్రంలో వ్యాపారంలా భావించారేకాని, అది స్థిరంగా దృఢంగా ఉండాలని తలంచనే లేదు. వారు ఎప్పటికీ వర్తమాన కాలాన్నే గమనించారుకాని భవిష్యత్తును లెక్కించనేలేదు ఈ దినం వచ్చేదేదో రాబట్టుకుందాం. రేపటి సంగతేదో రేపు అని వారనుకున్నారు; వారు దొరికినదాన్ని వెంటనే పంచుకోవడం తప్పితే మరో సంగతినే ఆలోచించలేదు."

(కామన్సుసభలో క్లైవ్ ప్రసంగం, మార్చి 30, 1772)

బెంగాలులోను, ఇతర ఆక్రమిత ప్రాంతాలలోను కంపెనీ పరిపాలనాధికారం సంపాదించుకున్నప్పుడు ఈస్టిండియా కంపెనీ స్థాపించిన ప్రభుత్వవిధాన మెలాంటిది? ఈ ప్రభుత్వం అధీనంచేసుకోవడంలో ముఖ్యంగా వారు చూచింది ఎంతలాభం సంపాదించి ఇంగ్లాండుకు పంపాలనేది మాత్రమే. ఈఅభిప్రాయాన్ని 1765 లో డైరెక్టర్లకు వ్రాసిన జాబులో క్లయివు అతిస్పష్టంగా, సులభంగా వ్రాశాడు. ఈ మాటలకు, తర్వాత పెద్దభూతదయాళవులాగా చెప్పినమాటలకు సంబంధమేలేదు.

"ఈ ఆక్రమణద్వారా మీ పన్నులు వచ్చే సంవత్సరం 250 లక్షల సిక్కా రూపాయలకు తగ్గదని నాకుతోచినంతవరకు అభిప్రాయపడుతున్నాను. ఇకమీద ఆ పన్నుల మొత్తం కనీసం 20 లేక 30 లక్షలు పూర్వంకన్నా ఎక్కువవుతుంది. యుద్ధాలు లేనప్పుడు మీ మిలిటరీ, ప్రభుత్వ ఖర్చులు 60 లక్షలకంటే మించవు. నవాబుకిచ్చే అలవెన్సులు ఇప్పటికే 42 లక్షలకు తగ్గించారు. రాజుకిచ్చే కప్పం (మొగల్‌చక్రవర్తికి) 26 లక్షలకు తగ్గింది; కాబట్టి కంపెనీకి నికరాదాయం 122 లక్షల సిక్కా రూపాయలు లేక 1,650 900 పౌన్లు (బంగారు రూపంలో) ఉంటుంది."

(క్లయివు, ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్‌లకు వ్రాసిన జాబు, సెప్టెంబరు 30,1765.)

ఇందులో ఏ మాత్రం దాపరికంలేకుండా వర్తకుని అవర్జాలోలాగా వ్యాపార ధోరణిలో కనబడుతున్నది. భారత ప్రజలనుండి వసూలుచేస్తున్న పన్నుల మొత్తంలో, నాలుగోవంతు పాలన వ్యవహారాలకు చాలునని లెక్కవేశారు; మరో నాలుగోవంతు స్థానిక నవాబులకు, మొగల్‌రాజుకు ఇవ్వవలసిఉంది; మిగిలిన సగం మొత్తం 15 లక్షల పౌన్లు "నికరాదాయం". బాటమ్లీ పాతకాలంనాడు కలలుగన్న "వర్తకుల ప్రభుత్వం" ఇక్కడ సమగ్రంగా అమలులోకి వచ్చింది, ఇంతకుముందుగాని. తర్వాతగాని దీనితో సామ్యంగల ప్రభుత్వం నాస్తి.

ఈ ఉద్దేశాలు ఆచరణలో ఎంతవరకు ఫలించాయన్న సంగతి బెంగాలు కంపెనీయొక్క ప్రభుత్వపు మొదటి ఆరేళ్ళ జమా ఖర్చులు చూపుతున్నవి.

ఈ లెక్కలను 1773 లో పార్లమెంటుకు నివేదించారు. పన్నులవల్ల నికరాదాయం 13,066,761 పౌన్లు; మొత్తం ఖర్చు 9,027,609 పౌన్లు; నిల్వ 4,037,152 పౌన్లు ఇంగ్లాండుకు పంపినది. అంటే దాదాపు బెంగాలు పన్నుల మొత్తంలో మూడోవంతు ఆ దేశంనుండి ఇంగ్లాండుకు "నికరాదాయం" పేర పంపివేయబడింది.

కాని మొత్తం ఇంగ్లాండుకు వచ్చిన 'కప్పం' ఇంతమాత్రమేనని ఏవిధంగానూ భావించరాదు. కంపెనీ ఉద్యోగులు వ్యక్తిగతంగా విపరీతంగా ధనం సంపాదించారు. ఏమీలేకుండా బయలుదేరి ఇండియాకు వెళ్ళిన క్లయివు 2½ లక్షల పౌన్ల ఆస్తితో (అంచనా) తిరిగి వచ్చాడు. ఇంతేకాక ఏటా 27000 పౌన్ల ఆదాయంవచ్చే ఎస్టేటును (భారతదేశంలో) సంపాదించాడు; "రెండేళ్ళలో లక్ష పౌనుల ఆస్తి సంపాదించి"నట్లు అయనే చెప్పాడు. ఇక ఎగుమతి దిగుమతి లెక్కలను చూస్తే మొత్తం ఇంగ్లాండుకు ముడుతున్న దెంతో దాదాపుగా తెలుస్తుంది. 1766-68 మూడు సంవత్సరాలలో గవర్నర్ వెరెల్స్టు నివేదికప్రకారం ఎగుమతులు 6,311,250 పౌన్లు, దిగుమతులు మట్టుకు 624,375 పౌన్లు మాత్రం దేశాన్ని పరిపాలిస్తున్న ఈ కొత్త రకపు వర్తకులు కంపెనీ చల్లని పరిపాలనలో భారత దేశానికి దిగుమతి చేస్తున్నంతకన్నా పదిరెట్లు ఎక్కువగా ఆదేశం నుండి ధనం లాగడం జరిగింది.

ఇలా ఈస్టిండియా కంపెనీ వర్తకుల మధురస్వప్నం నిజమయింది. బదులు ధనమేమీ పంపకుండా, భారతసౌభాగ్యాన్ని కొల్లగొట్టగలిగారు. 1763 లోనే పైకి వచ్చిన క్లయివు కౌన్సిల్‌లో సభ్యుడు స్క్రాఫ్టన్, ప్లాసీ తర్వాత జరిగిన దోపిడీ పునాదిమీద, భారత వర్తకాన్నంతటినీ "ఒక ఔన్సు బంగారంకూడా పంపకుండా" మూడేళ్ళు నడపగలిగాడు.

> "ఈ మహత్తర విజయాలు మన దేశానికి ముప్ఫైలక్షల ధనాన్ని చేకూర్చినవి. సరిగాచెబితే రాష్ట్రగవర్నర్లు తీసుకొనే పెద్దపెద్ద మొత్తాలన్నీ ఆఖరుకు ఇంగ్లాండులోనే కేంద్రీకృతమౌతున్నవి. తమభాగం మూలంగా గాని, కలకత్తా ఖజానాలోని బిల్లుల రసీదుల ద్వారాగాని అపరిమితమైనధనం కంపెనీచేతుల్లోపడేది. కాబట్టి, భారత దేశ వర్తకాన్నంతటినీ (చైనామినహా) మూడేళ్ళు, ఒకఔన్సు బంగారం పంపకుండా కంపెనీ నడపగలిగింది. వ్యాపారంలో మనతో కలిసే విదేశ కంపెనీలద్వారాకూడా చాలధనాన్ని పంపుతూ వచ్చింది."
>
> (యల్ స్క్రాఫ్టన్, "హిందూస్తాన్ ప్రభుత్వంపై భావాలు" 1763)

బెంగాలు పన్నులనుండి ఇంగ్లాండుకు పంపే భాగాన్ని చట్టరీత్యా తల్లకిందులుచేసి వేరుపెట్టారు. అదబ్బుకు "పెట్టుబడి" అని వారిచ్చినపేరు. ఈ విధానంపై కామన్సుసభ సెలెక్టుకమిటీ 1783 లో ఇలా నివేదికనిచ్చింది.

"బెంగాలు పన్నులలోకొంత భాగాన్ని చాలాపేండ్లుగా ఇంగ్లాండుకు ఎగుమతిచేసేవస్తువులు కొనేందుకు తీసిపెట్టారు దీనినే పెట్టుబడిఅంటారు. పెట్టుబడి ఆధిక్యంపైదనే కంపెనీ ఉద్యోగుల తెలివితేటలను సామాన్యంగా అంచనా వేసేవారు. భారతదేశ దరిద్రానికి మూలకారణమైన ఈ పెట్టుబడిని కంపెనీ సౌభాగ్యంక్రింద లెక్క-వేశారు. కాని కప్పం చెల్లించడం, ఆదేశానికి లాభకారి - కాని వ్యాపారం - ఇవి అపారమైన భ్రమకు కారణ మవుతున్నవి....

"బెంగాలుకు ఇంగ్లాండుకు మధ్య సాగుతున్న కలయిక—ఇది వ్యాపారం కానేకాదు అని గుర్తిస్తే. పన్నులలోనుండి పెట్టుబడి పెట్టడ మనేది ఘోరంగా కనిపిస్తుంది. ఆదృష్టితో చూచినప్పుడు, కంపెనీకి సంబంధించినంతవరకు భారతదేశంనుండి ఎగుమతిచేసేసరుకులు ఏమాత్రం ప్రతిఫలం ఇవ్వకుండా, ఊరికే తీసుకొని పంపుతున్నారు"

("కామన్సు సభ సెలెక్టుకమిటీ తొమ్మిదో నివేదిక" 1783 పుట 54-5 )

ఈపద్ధతివల్ల బెంగాలు ప్రజలకు కలిగిన నష్టాన్ని మనం ఊహించుకోవచ్చు. ఈ దోపిడీని ఎడతెగకుండా ఎక్కు-వగా లాగాలన్న కోరికవల్ల, భూమి పన్నులను ఆకాశానికి పెంచివేశారు. కడకు రైతుకున్న విత్తనాల గింజలు, ఎద్దులుకూడ ఈ పన్నుకోసం తీసుకొనేంతవరకు వచ్చింది. ఆఖరు బెంగాలు భారతీయ రాజు (సురాజుద్దౌలా) తన పాలన ఆఖరు సంవత్సరంలో వసూలుచేసిన భూమిపన్ను (1764-5) 817,000 పౌన్లు కంపెనీ ప్రభుత్వంలో తొట్టతొలి సంవత్సరం వసూలుచేసిన భూమిపన్ను మొత్తం (1765-6) 1,470,000 పౌన్లు. ఈమొత్తం 1771-2 కు 2 341,000 పౌన్లకు, 1775-6 లో 2 818,000 కు పెరిగింది. లార్డు కారన్‌వాలిస్ 1793 లో చేసిన పర్మనెంటు సెటిల్‌మెంటులో ఈ పన్నును 3,400,000 కు ఖాయపరచాడు.

ఈ కార్యక్రమంతో కొన్నేళ్ళలోనే దేశం నాశనం కావడం, కరువుకాటకాల మూలంగా ప్రజల సంఖ్య మూడోవంతు నశించడం, మూడోవంతుదేశం "కేవలం క్రూరమృగాలుండే అడవులైపోవడం" జరిగినదని సమకాలీనులు సాక్ష్యమిచ్చారు.

1769 లో ముర్షిదాబాద్‌లోని కంపెనీ రెసిడెంటు బేచెర్ కంపెనీకి ఇలా రిపోర్టు పంపాడు :

"కంపెనీ ప్రభుత్వాధికారం తీసుకున్నప్పటినుండి, ఈదేశ ప్రజల పరిస్థితి, మునుపటికన్నా అధ్వాన్నమైపోయింది. ఈ అంశాన్నిగూర్చి అనుకునేందుకు, ఏ ఇంగ్లీషువానికైనా బాధాకరంగా కనిపించవచ్చు. అయినప్పటికీ అందులో ఏమాత్రం సందేహంలేదని నా భావం.... ఈఉత్తమ దేశం, అతి నిరంకుశమైన క్రూరులక్రిందకూడ సుఖసౌభాగ్యాలతో తుల తూగింది. మరి, దేశపాలనలో ఇంగ్లీషువారి కెక్కు-వ భాగమున్న ఇప్పుడు నిజంగా శిథిలావస్థకు వస్తున్నది.........

"వ్యాపారం స్వేచ్ఛగా సాగుతూన్న రోజుల్లో యీ దేశ మెంత సౌభాగ్యవంతంగా ఉండేదో నాకు బాగా జ్ఞాపకమున్నది. ఇప్పటి యీ దేశ శిథిలావస్థ నాకు ఆందోళన కలిగిస్తున్నది. ఇందుకు ముఖ్యమైన కారణం దేశంలో తయారయిన వస్తు సముదాయాన్నంతా కంపెనీపేర గుత్తకు తీసుకోవడమేనని నేను నిశ్చయానికి వచ్చాను."

1770 లో ఈ "శిథిలావస్థ"తో పాటు బెంగాలులో క్షామం వచ్చింది. కంపెనీ రికార్డుల ప్రకారమే ఆ కరువు "వర్ణనాతీతమయింది. ఒకప్పుడు వస్తు సంపూర్ణమైన పూర్ణియారాష్ట్రంలో మూడోవంతుకుపైగా ప్రజలు నేలపాలయ్యారు మిగతా ప్రాంతాల్లోకూడ ప్రజానాశనం ఇలాగేవుంది." ఈ క్షామంలో కోటిమంది ప్రజలు మరణించినట్లు అంచనా వేయబడింది. అయినప్పటికీ భూమి పన్ను ఖచ్చితంగా వసూలుచెయ్యడమేకాక అసలు ఎక్కువచేశారు. కంపెనీ కలకత్తా కౌన్సిల్ ఫిబ్రవరి 12 1771 న ఇలా నివేదికనిచ్చింది. "గడచిన క్షామ తీవ్రతా, దానివల్ల జరిగిన నష్టమూ ఉన్నప్పటికీ ఈ సంవత్సరం బెంగాలు, బీహారు రాష్ట్రాల రెండింటి పన్నువసూలు కొంత ఎక్కువగా చేయబడింది." ఇదెలా సాధించారో వారన్ హేస్టింగ్సు 1772 రికార్డులలో ఇలా వ్రాశారు :

"రాష్ట్రంలో కనీసం మూడోవంతు జనసంఖ్య నశించిపోయినప్పటికీ, అందువల్ల వ్యవసాయం తగ్గిపోయినప్పటికీ 1771 సంవత్సరం వసూలైన పన్ను 1768 కన్నా మించిపోయింది.... అంత దారుణమైన యీతి బాధలు వచ్చినప్పుడు వాటితోపాటు పన్నులు తగ్గిపోవలసింది. కాని వాటిని, ఏమాత్రం తగ్గకుండా తీవ్రంగా పనిచేయడంవల్ల అలా తగ్గలేదు."

(వారన్ హేస్టింగ్సు, "డైరెక్టర్ల సభకు రిపోర్టు" నవంబరు 3, 1772 )

కంపెనీ రాజ్యం 20 ఏళ్ళు జరిగింతర్వాత బెంగాలెలా మారిపోయిందో ఆ తర్వాత పదేళ్ళకు విలియమ్ ఫ్లర్టన్ అనే కామన్సు సభ్యుడు ఇలా ప్రకటించాడు ;

పూర్వకాలంలో, బెంగాలు ప్రాంతాలు దేశాల ధాన్యాగారాలుగా ఉండేవి. ప్రాచ్యదేశ వస్తుసంపత్తికి వాణిజ్య వీధులుగా వెలసేవి....

"కాని మన దుష్పరిపాలనకున్న అఖండ శక్తిమూలంగా ఇరవై ఏళ్ళ లోపుగానే, ఆ ప్రాంతాలన్నీ ఎడారులయిపోయినవి పొలాలు సాగు కావడంలేదు; విశాల భూములలో అప్పుడే గడ్డి గాదం మొలచిపోయింది. రైతులు కొల్లగొట్టబడ్డారు; చేతి పరిశ్రమలు చేసుకునేవారు అణచివేయబడినారు; క్షామం పదే పదే తలచూపింది; జన క్షీణం ప్రారంభమయింది."

("విలియమ్ ఫ్లర్టన్ - కామన్సు సభ్యుడు" "భారతదేశంలో ఇంగ్లీషు వ్యాపారుల ధోరణి" 1787.)

"మనలను భారతదేశంనుండి నేడు తరిమివేస్తే, మనపాలనం అక్కడ సాగినట్టు గుర్తేమీ మిగలదు. ఈ మన పాడు పాలనలో అడవిమనుషులో, పులులో

పాలించినదానికన్నా ఉత్తమమైన దేదీలేదు" అని బర్కు తన ధోరణిలో ఖండించాడు.

ఈ అలంకారికంగాఉన్న వాక్యాన్ని గవర్నర్ జనరల్ లార్డు కారన్ వాలిస్ 1789 లో యదార్థ వర్ణనగా ఇలా తెలిపాడు:

"హిందూస్థానంలో కంపెనీ ప్రభుత్వంక్రిందఉన్న ప్రాంతంలో మూడోవంతు,నేడు కేవలం క్రూరమృగాలు మాత్రం నివసించే కీకారణ్యమై పోయిందని నిస్సందేహంగా చెప్పొచ్చు"

(లార్డు కారన్‌వాలిస్, సెప్టెం 18, 1789 మినిట్సు)

## 2. భారతదేశం - పారిశ్రామిక విప్లవం

భారతదేశంలో జరిగిన దోపిడీ పునాదిపైనే 18 వ శతాబ్ద ఉత్తరార్ధంలో ఆధునిక ఇంగ్లాండు నిర్మాణమైంది.

18 వ శతాబ్ది మధ్యభాగంలో ఇంగ్లాండు అప్పటికింకా ముఖ్యంగా వ్యావసాయకదేశంగానే వుంది. 1750 లో ఉత్తరప్రాంతాలలో కేవలం మూడోవంతు జనాభాకన్నా తక్కువేవున్నారు. లాంకషైరుకన్నా గ్లౌషస్టర్‌షైర్‌లోనే జనం కిక్కిరిసిఉన్నారు. (ఎ. టాయిన్‌బీ, "పారిశ్రామిక విప్లవం" పుట 9-10) ఉన్ని పరిశ్రమే ముఖ్యపరిశ్రమగాఉంది; బైన్స్‌వ్రాసిన "బట్టలపరిశ్రమ చరిత్ర" (పుట 112) ననుసరించి 1770 లో దేశంనుండి అయ్యే ఎగుమతుల్లో దాదాపు మూడోవంతు-నాల్గువంతులదాక ఉన్నిబట్టలేఉన్నాయి. "బట్టలనిర్మాణంలో ఉపయోగించే యంత్రాలు 1760 వరకు భారతదేశంలో వాడుతున్నలాంటి చిన్నచిన్నవే"నని బైన్సు వ్రాశాడు. (115 పు)

సాంఘికంగాచూస్తే, వర్గవిభజన విషయంలోను, కార్మికవర్గ ప్రారంభ విషయంలోను, దిట్టమైన బూర్జువాపాలన స్థాపనవిషయంలోను పారిశ్రామిక విప్లవానికి పరిస్థితులు సిద్ధంగా తయారై ఉన్నవి. కాని పారిశ్రామిక పెట్టుబడిదారీదశకు 18 వ శతాబ్ది మధ్యభాగంలో, ఇంగ్లాండులో ఉన్నంతకన్నా ఎక్కువపెట్టుబడి కేంద్రీకరింపబడడం అవసరం.

1757 లో ప్లాసీయుద్ధం జరిగింది. తర్వాత భారతదేశంనుండి ధన ప్రవాహం ఎడతెగకుండా ఇంగ్లాండుకు ప్రవహించింది. వెంటనే అనేకయంత్రాలు కనిపెట్టడంతో పారిశ్రామిక విప్లవానికి బీజస్థాపనం జరిగింది. 1764 లో హార్‌గ్రీవ్స్ జెన్నీరాట్నం కనిపెట్టాడు. 1765 లో వాట్సు ఆవిరి యంత్రం కనిపెట్టి 1769 లో దానికి పేటెంట్ చేశాడు; 1769 లో ఆర్క్‌రైట్ సీటిచక్రం, తరువాత 1775 లో ఆయనే ఏకులు చేయడం, వడకడం మొదలైన వాటికి యంత్రాలు కనిపెట్టాడు. 1779 లో క్రాంప్టన్ మూల్ యంత్రం, 1785 లో కార్టు రైట్ కనిపెట్టిన మరమగ్గం వచ్చాయి. 1788 లో ఆవిరియంత్రాలను కొలిములకు

ఉపయోగించడం జరిగింది. ఇలా ఒకటివెనుక నొకటి యంత్రాలు రావడం, ఈవేళలో వాని ఉపయోగానికి సామాజిక పరిస్థితులు పరిపక్వదశకు వచ్చాయని సూచిస్తున్నది ఇంతకుపూర్వం కనిపెట్టిన యంత్రాలు లాభకారిగా ఉపయోగించుకోవడం జరగలేదు.

> "1733 లో 'కే' ఫ్లైయింగ్ షటిల్ ను కనిపెట్టాడు, 1738 లో వైట్ రోలర్ వడుకుయంత్రం — నీటిశక్తితో పనిచేసేది తయారుచేశాడు కాని ఈ రెండు యంత్రాలుకూడ ఉపయోగానికి వచ్చినట్టులేదు."
>
> (జి. హెచ్. పెర్రిస్, "ఆధునిక ఇంగ్లాండు పారిశ్రామిక చరిత్ర" పుట 18.)

ఇంగ్లీషు పారిశ్రామిక చరిత్రలో ముఖ్య ప్రామాణికుడుగా ఎన్నబడే డాక్టర్ కన్నింగ్‌హామ్ తన "ఆధునికయుగంలో ఇంగ్లీషు పరిశ్రమ, వ్యాపారాల అభివృద్ధి" అనే పుస్తకంలో, కొత్త యంత్రాలు కనిపెట్టే దశ అభివృద్ధి కేవలం "ఏ అపార మేధశ్శక్తో నూతన సృష్టి చేయడంతో" మాత్రమే జరగదు, మరి, ఆ యంత్రాల ఉపయోగానికి అవకాశం కల్పించే అత్యవసర పరిస్థితి - తగినంత పెట్టుబడి కేంద్రీకృతం కావడమే అంటూ ఇలా గుర్తుకు తెస్తున్నారు:

> "కొత్త యంత్రాలు కనిపెట్టడం కేవలం యాదృచ్ఛికంగా (Fortuitous) జరుగుతాయని అనిపిస్తుంది; ఈ కొత్తయంత్రాలకు, 18వ శతాబ్దిలో ఏఅపార మేధశ్శక్తి విజృంభణో కారణమని చాలమంది అనుకొంటారు. కాని ఆర్క్‌రైట్, వాట్‌లు అప్పటికి పరిస్థితులు పరిపక్వదశకు వచ్చి ఉండడంవల్లనే అదృష్టవంతులయ్యారంటే, వారిమేధశ్శక్తిని కొంచెపరచినట్టుకాదు. విలియం లీ, డోడోడుడ్లీ కాలంనుండి చాలమంది మేధశ్శాలురు కొత్తవి కనిపెడుతూనే వచ్చారు; కాని ఆ కాలంలో పరిస్థితులు అనుకూలంగాలేవు. అందువల్లనే వారు కృతార్థులు కాలేకపోయారు.
>
> "ఎక్కువ ఖర్చుయ్యే యంత్రాలను, పద్ధతులను అవలంబించాలంటే విశాలమైన పెట్టుబడి కావాలి; ఎంత శక్తిసామర్థ్యాలున్నవాడైనా తన చేతిలో తగినంత పెట్టుబడి, పెద్ద మార్కెట్టులకు దారి ఉంటేనేతప్ప ఆ పనికి పూనుకోవడంలో ప్రయోజనం లేదు. 18 వ శతాబ్దిలో ఈ పరిస్థితులు చాల సమకూరాయి ఇంగ్లాండు బ్యాంకు, ఇతర బ్యాంకులు ఏర్పడడంతో పెట్టుబడికూర్చేందుకు పెద్ద అవకాశం ఏర్పడింది; పూర్వంకన్నా ఇప్పుడు ఏ సమర్థుడైనా తన వ్యాపార వ్యవహారాల్లోనికి ఎక్కువ డబ్బు ఖర్చుయ్యే పద్ధతులను ప్రవేశపెట్టడానికి చాల వీలు ఏర్పడింది."
>
> (డబ్ల్యు. కన్నింగ్‌హామ్, "ఆధునికయుగంలో ఇంగ్లీషు పరిశ్రమ - వ్యాపార అభివృద్ధి" పుట 610 )

1694 లో ఇంగ్లాండు బ్యాంకు ఏర్పడినంతమాత్రాన, ప్రాథమికమైన పెట్టుబడి కేంద్రీకరణం జరగదు. 18 వ శతాబ్ది మధ్యభాగంవరకు బ్యాంకు పెట్టు

బడి, వ్యాపారంమీద నడిచే పెట్టుబడి చాల తక్కువగావుంది. మరి 18 వ శతాబ్ది ఆఖరుభాగంలో పెట్టుబడి కేంద్రీకరణకు హఠాత్తుగా అవకాశమెలా దొరికింది? ఈ ప్రాథమిక పెట్టుబడి కేంద్రీకరణం ఆధునికయుగంలో ఎలా జరుగుతుందో మార్క్సు చూపించాడు. బూర్జువా ప్రాథమికదశల్లో, తర్వాత అభివృద్ధిదశల్లోను వచ్చినట్టే ఈపెట్టుబడి కేంద్రీకరణం వలసదేశాలలో కొల్లగొట్టిన డబ్బువల్లా, మెక్సికో దక్షిణఅమెరికాల్లోని వెండివల్లా, బానిసవ్యాపారంవల్లా, భారతదేశాన్ని దోచుటవల్లా చేకూరిందని ఆయన చెప్పాడు. ("అగీర్ చెప్పినట్టు ధనం 'ప్రపంచంలోనికి ఒకవేపు రక్తపు మరకలతో వస్తే' పెట్టుబడి, రక్తమూ, కల్మషమూ ఎల్లెడలా కార్చుకుంటూ బయలుదేరింది" కాపిటల్, వాల్యూం 1, అధ్యాయం 31.) 18 వ శతాబ్దిలో హఠాత్తుగా ఇంగ్లాండులో పెట్టుబడి కేంద్రీకరణ ముఖ్యంగా భారతదేశంలో దోచిన డబ్బుమీదనే ఏర్పడింది.

"ఇంగ్లాండు బాంకుస్థాపించినతర్వాత అరవయేళ్ళదాకా వారువిడుదల చేసిన చిన్న కరెన్సీనోటు 20 పౌనులది. ఇంతమొత్తంనోటు గనుక సులభంగా ఎక్కువ చలామణికి రాలేదు, లంబర్టువీధిదాటి దూరంవెళ్ళలేదు." 1790లో బర్కు రాస్తూ ఇలా అన్నాడు."నేను ఇంగ్లాండుకు 1750 లో వచ్చినప్పుడు రాష్ట్రాలలో 12 బాంకులు, అంగళ్ళుకూడలేవు. కాని ఇప్పుడు (1790 లో) వ్యాపారం జరిగే ప్రతిపట్టణంలోనూ ఉన్నవి. ఇప్పుడు బెంగాలువెండి రావడంవల్ల, డబ్బును ఎక్కువచెయ్యడమేకాక చలామణిని కూడ ఎక్కువచేసింది. వెంటనే 1759 లో ఇంగ్లాండుబాంకు 10 పౌన్ల, 15 పౌన్ల నోట్లనుకూడ జారీచేసింది, గ్రామప్రాంతాలలో వ్యాపారసంస్థలు నోట్లకాగితాలు కుప్పలుగా కురిపించాయి."

(బ్రూక్సు ఆడమ్సు "నాగరికత సూత్రాలు - దాని వినాశం" పుట 263.

"భారతదేశపుడబ్బు రావడం, దేశంలోని నగదు పెట్టుబడిని ఎక్కువ చేసింది. అందువల్ల పెట్టుబడి బలం ఎక్కువ కావడమేకాక, మారకం చకచకా జరిగేందుకుకూడా కారణమయింది. ప్లాసీ యుద్ధం అయిన వెంటనే బెంగాలులో కొల్లగొట్టిన డబ్బు లండనుకు రాదొడగింది. దాని ఫలితం తక్షణమే కనబడింది; 19 వ శతాబ్దాన్ని గడచిన శతాబ్దాలనుండి ప్రత్యేకపరిచే 'పారిశ్రామిక విప్లవం' 1760 లో ప్రారంభమయిందని ప్రామాణిక గ్రంథకర్తలందరూ అంగీకరిస్తారు బైన్సు వ్రాతలనుబట్టి 1760కి ముందు లంకాషైర్‌లోని బట్టల నేతకు ఉపయోగించే యంత్రాలు భారతదేశంలో ఉపయోగిస్తున్నట్టి చిన్న చిన్న యంత్రాలే కట్టెలకోసం అడవులన్నీ కొట్టివేయడంవల్ల 1750 ప్రాంతాల్లో ఇంగ్లాండు ఇనుప పరిశ్రమ పూర్తిగా జీర్ణావస్థకు వచ్చింది. ఆసమయంలో దేశంలో ఉపయోగిస్తున్న ఇనుములో 4/5 వంతు స్వీడన్‌నుంచి వచ్చేది.

"ప్లాసీయుద్ధం 1757 లో జరిగింది. ఆతర్వాత జరిగినంతతీవ్రమైన మార్పు ముందెన్నడూ బహుశా రాలేదు. 1760 లో పొగబండి (Flying Shuttle) వచ్చింది. ఇనుము కరగడానికి కట్టెలకు బదులు బొగ్గు ఉప యోగించసాగారు. 1764 లో హార్ గ్రీవ్స్ వడుకుయంత్రం (స్పిన్నింగ్ జెన్నీ) కనిపెట్టాడు. 1776 లో క్రాంప్టన్, వడికే యంత్రా (mule) న్ని తయారుచేశాడు. 1785 లో కార్ట్ రైట్ మరమగ్గం తయారుచేశాడు. వీటన్నిటికన్నా ముఖ్యంగా 1768 లో వాట్ ఆవిరియంత్రాన్ని శుద్ధంగా తయారుచేశాడు, — శక్తిని (పవర్) కేంద్రీకరించడంలో యిది అన్నిటి కన్నా మించింది. కాని యీ యంత్రాలన్నీ, కాలగతిని ముందుకు నడిపే సాధనాలయినప్పటికీ, ఆకాలగతికి కారణం యివికావు. వట్టి యంత్రాలు కనిపెట్టడంలోనే అయితే ఏమీలేదు. ఇలాంటి ముఖ్యమైనవెన్నో శతా బ్దులుగా మూలబడి వున్నవి. అవి నడిపేందుకు తగిన బలవచ్ఛక్తికోసం అవివేచి వున్నాయి ఆ బలవచ్ఛక్తి డబ్బు. ఆ డబ్బుకూడ దాచినదికాక మారకంలో ఉండాలి. భారతదేశ ధనప్రవాహం రాకముందు, తద్వారా పరపతి పెరగకముందు, అలాంటి బలవత్తరమైన సమగ్రశక్తిలేదు; అందువల్ల వాట్ 50 ఏళ్ళకుముందు జీవించిఉంటే, ఆయనా, ఆయన కని పెట్టిన యంత్రమూకూడా నశించిపోయి వుండేవి. ప్రపంచం పుట్టినప్పటి నుండి, ఏ పెట్టుబడికూడ, భారతదేశ దోపిడీవల్ల వచ్చినంత లాభాన్ని ఎక్కడా సంపాదించి వుండదు. దాదాపు 50 ఏళ్ళు బ్రిటన్ పోటీలేకుండా నిలవగలిగింది. 1694 నుండి ప్లాసీ (1757) వరకు తక్కువే. కాని తర్వాత ధనాభివృద్ధి 1760—1815 ల మధ్య అతివేగంగా అఖండంగా సాగింది "

(అదే పుట 259—60.)

ఇలాగా భారతదేశంలో కొల్లగొట్టినడబ్బు పెట్టుబడికేంద్రీకరణకు ప్రచ్ఛన్న మైన కారణం, ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవం సాధ్యమయ్యేందుకు యిది చాల ప్రధానపాత్రను నిర్వహించింది

భారతదేశపు దోపిడీతో సాధింపబడిన పారిశ్రామిక విప్లవం ఇంగ్లాండులో రాగానే,తండోపతండాలుగా తయారవుతున్న యంత్రవస్తువులకు తగినమార్కెట్లులు చూడవలసిన నూతన కర్తవ్యం అవసరమయింది. ఇందుకు ఆర్థికవ్యవస్థలో విప్లవం రావలసివచ్చింది-వర్తక పెట్టుబడిదారీ విధానసూత్రాలనుండి స్వేచ్ఛావ్యాపార పెట్టు బడిదారీ విధానసూత్రాలను అనుసరించవలసిన అవసరమేర్పడింది. ఇందుతోపాటు వలసపాలనా విధానంలోకూడ పూర్తిగా మార్పు అవసరమైంది.

కొత్తవ్యవహారాలకోసం పూర్వపు గుత్తవ్యాపారంస్థానే భారతదేశంలో స్వేచ్ఛావ్యాపారాన్ని ఏర్పరచవలసి వచ్చింది. ప్రపంచానికంతకూ బట్టలను ఎగు మతిచేస్తూ వచ్చిన భారతదేశాన్ని, బట్టలు దిగుమతిచేసుకునే దేశంగా మార్చవలసి

వచ్చింది, అంటే భారతదేశ ఆర్థిక వ్యవస్థలో ఒక విప్లవమన్నమాట అంతేకాక ఈస్టిండియాకంపెనీ పాతపద్ధతినంతవి పూర్తిగా మార్చివేయడమన్నమాట. భారతదేశ పీడనాపద్ధతిలో మార్పు కొనిరావాలి. ఆమార్పును కంపెనీ గుత్తవ్యాపారస్తుల తీవ్రఆక్షేపణలను ఎదుర్కొని నడిపించాలి.

ఇందుకు అవసరమైన చర్యలు 19 వ శతాబ్ది ఆఖరుపడిలో తీసుకోబడినవి.

పీడన మరింత సమర్థంగా నిర్వహించాలంటే ఈస్టిండియా కంపెనీ దాని ఉద్యోగులు అనుసరించిన పరమఅరాజక విధ్వంసక పద్ధతులు మారకుండా సాగడానికి వీల్లేదు. కంపెనీయొక్క దాని ఉద్యోగుల ఒళ్ళుతెలీని మూర్ఖమైన దోపిడీ పద్ధతి అసలు భారతదేశ పీడనకే భంగకారిగా పరిణమించింది. తర్వాత కొన్నేండ్లకు లాంకషైర్ పారిశ్రామికుల స్వలాభపరాయణత యిలాగే 9 మన్వంతరాల జనాభాను ఒక్క మన్వంతరంలో తినివేసింది. ఆ పారిశ్రామిక స్వార్థపరతను, ధనికవర్గం అంతటి పక్షంగా ప్రభుత్వం అణచివేయవలసివచ్చింది. (ఆ దాడిని ధనికవర్గానికి ఆర్థిక ప్రతిపక్షులైన భూస్వాములు నడిపారు) భావిపీడనకు స్వస్థత చేకూర్చేందుకే అలా చేశారు అట్లే 18 వ శతాబ్ది ఆఖరు పాదంలో ప్రభుత్వ కేంద్రసంస్థలు భారతదేశంలోని కంపెనీ చర్యలను అరికట్టడానికి పూనుకొన్నాయి. ఈ దాడినికూడ ప్రతిపక్ష ఆర్థికశక్తులే నడిపాయి ఈస్టిండియా కంపెనీ చేతిలో ఇంత విశాలమైన గుత్తవ్యాపారం ఉండడానికి వ్యతిరేకించిన వివిధ ధనికులు అందుకు వ్యతిరేకంగా అతిసమర్థంగా పోరాటాన్ని నడిపించారు. ఈ దాడినుండే ఆ యుగంలో ఈస్టిండియా కంపెనీ దుష్పరిపాలననుగూర్చి, విపరీతంగా సాహిత్యం బయలుదేరింది. ఇంత సమగ్రంగా వివరంగా, ప్రామాణికంగా, ఇంకే సమయంలోను సామ్రాజ్యవాదాన్ని తూర్పారబట్టే సాహిత్యం రాలేదు.

ఇంగ్లీషు పారిశ్రామికులు 18 వ శతాబ్ది ప్రారంభదశలో ఈస్టు ఇండియా కంపెనీపై దాడి మొదలుపెట్టారు. ఉత్తమమైన భారతదేశ వస్త్రాలను దిగుమతి చేయడంవల్ల తమకు పోటీ యెక్కువైందని ఆ దాడి మొదలెట్టారు. 1720 కల్లా భారతదేశంనుండి పట్టుబట్టలు, అద్దకంవేసిన కాలికోలు (చీటీగుడ్డలు) ఇంగ్లాండుకు రాకుండా నిషేధించేట్టు చేసుకోగలిగారు. ఇక మిగతా భారతదేశంలో తయారయిన బట్టల రకాలన్నిటిమీద విపరీతమైన సుంకాలువేస్తూ క్రమంగా పెంచుతూవచ్చారు. అందువల్ల భారతదేశపు వస్తువుల కంపెనీ వర్తకానికి ఇంగ్లాండు రేవులు కేవలం యూరపు ఎగుమతులకు ప్రవేశమార్గాలు మాత్రంగా అయ్యాయి.

కాని 18 వ శతాబ్ది ఆఖరులో బయలుదేరిన ఆందోళన, భారతదేశంలోని ఈస్టు ఇండియా కంపెనీ పాడుపాలనను మొత్తంగా విమర్శించ, ఖండించ సాగింది. ఈ దాడికి ఇంగ్లాండులో విజృంభిస్తున్న పారిశ్రామికులేకాక, కంపెనీలో చేరని యితర వర్తకుల తోడ్పాటుకూడ వుంది. నూతనంగా విజృంభిస్తున్న పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానానికి యీ దాడి ప్రథమపాఠం అయింది. వారి

కోరికలివి ; భారతదేశం మార్కెట్టులోకి స్వేచ్ఛగా ప్రవేశించే హక్కుండాలి. లంచగొండితనం, దోపిడీలమూలంగా ఏర్పడిన ఆటంకాల నన్నిటిని తొలగించాలి. ఆ మార్కెట్టును సమర్ధనీయంగా దోయడానికి అవకాశాలు కావాలి.

ఈ దాడిని 1776 లో స్వేచ్ఛా వ్యాపార పారిశ్రామిక ధనికతత్వ - అర్ధ శాస్త్ర నిర్మాతా, నూతన యుగానికి ప్రారంభకుడూ అయిన ఆడమ్‌స్మిత్ ప్రారంభించడం చాల గమనించవలసిన విషయం. 1776 లో ప్రకటితమైన ఆయన "దేశాల సంపద" అనే పుస్తకం పిట్ నాయకత్వంక్రింద వున్న యువక రాజకీయవేత్తలకు వేదమయింది. ఆ పుస్తకంలో ఒక భాగాన్ని, ఈస్టు ఇండియా కంపెనీ అసలు పునాదిని కఠోరంగా ఖండించిపారవేసేందుకు స్మిత్తు వినియోగించాడు. ఆయన పుస్తకంలో జంకూ గొంకులేని ధోరణిలో ఇలా వ్రాశాడు :

"ఏ దృష్టితో చూచినా అలాంటి ప్రత్యేక కంపెనీలు సంఘోపద్రవకారులే. అవి ఏర్పడిన స్వదేశాలలో అసౌకర్యం కలిగిస్తాయి. వాని పరిపాలన క్రిందపడిన దురదృష్ట దేశాలను విధ్వంసం చేస్తాయి.

"పాలకదృష్ట్యా ఈస్టిండియా కంపెనీ కోరేదేమిటంటే తాము భారత దేశ రాజ్యంలోకి కొనిపోయే యూరపియన్‌వస్తువులు సాధ్యమైనంత చౌకగా అమ్ముడుపోవాలి; భారత దేశనుండి ఇంగ్లాండుకుతెచ్చిన వస్తువులకు సాధ్యమైనంత ఎక్కువ ధరలకమ్మాలి. కాని వర్తకులుగా వారి దృష్టి అందుకు వ్యతిరేకమైనది, పాలకులుగా వారుకోరేది వారు పాలించేదేశం కోరికలాంటిదే. మరి వర్తకులుగా వారికి కావలసింది అందుకు పూర్తిగా వ్యతిరేకమైన వాంఛ—

"ఇదో విచిత్రమైన ప్రభుత్వం. ఇలాంటిది ఇంకొకటిఉండదు. పాలన చేసే ఉద్యోగుల్లో ప్రతిఒక్కడూ, ఆదేశం వదిలి రావాలని కోరుతుంటాడు. సాధ్యమైనంత త్వరలో ఆ ప్రభుత్వంతో సంబంధం వదలుకోవాలనుకుంటాడు; ఆ ఉద్యోగంవదిలి, తాను సంపాదించుకున్న ఆస్తియావత్తూ తెచ్చుకున్న మరుసటి రోజునుండే ఆ దేశమంతా భూకంపంలో పాతాళంలో కలసి పోయినా సరే అతని కిరవంతైనా బట్టదు."

(ఆడమ్‌స్మిత్, "దేశాల ధనసంపద" భాగం, iv అధ్యాయం vii)

"శ్రీమంతులున్నూ అక్కడక్కడా సామాన్యులున్నూ ఇండియాకంపెనీలో ఒక వెయ్యిపౌనుల షేరును కొనాలనుకుంటారు ఇలా అనుకోవడం ప్రొప్రయిటర్ల కోర్టులో ఒక ఓటు సంపాదించడంవల్ల వచ్చే పలుకుబడి కోసమే. అందువల్ల దోపిడీ సొత్తులోకాకున్న భారత దేశంలోని దోపిడీదారుల నియామకంలో అతనికి భాగస్వామ్యం ఏర్పడుతుంది ....ఆ పలుకుబడి కొన్నేళ్ళవరకుంటేసరి దానితో తనస్నేహితులు కొందరికి ఉద్యోగాలు ఇప్పించవచ్చు. ఇక అతనికి డివిడెండుమీదకాని, తనఓటుకు మూలమైన

పెట్టుబడిమీదగాని ఆకాంక్ష చాలతక్కువ. ఏప్రభుత్వంలో అయితే తనకు ఓటుద్వారా భాగస్వామ్యం ఏర్పడిందో ఆ సామ్రాజ్యంయొక్క సౌభాగ్య సంపత్తులగూర్చి అతను బొత్తిగా తలవనేతలవడు. అలా పాలితప్రజల సుఖదుఃఖాలనుగాని, ఆదేశ నష్టలాభాలనుగాని, తమప్రభుత్వ మానావమానాలనుగాని బొత్తిగా ఔదాసీన్యం వహించే ఇలాంటి సామ్రాజ్యాధిపతులు ఇంకెక్కడాలేరు. పరిస్థితులనుబట్టి అదింకెక్కడా అలా ఉండడం సాధ్యమూకాదు. అలాంటి వర్తకకంపెనీల యజమానులలో పెక్కుమంది దాటరాని నైతికకారణాలవల్ల అలాఉన్నారు-ఉండకతప్పదు."

(అదే భాగం 5, అధ్యా 1)

వర్తక పద్ధతిమీద ఏర్పడిన ఈస్టిండియా కంపెనీకి విజృంభిస్తున్న పారిశ్రామికుల వ్యతిరేక నినాదం ఇందులో వినబడుతుంది. పాత వ్యవస్థపై పారిశ్రామిక పెట్టుబడిదారుల విజయానికి నాందీ వచనం కనబడుతుంది.

ఈస్టిండియా కంపెనీ పాతపద్ధతిపై ఖండనా, దానిని మార్చాలనే వాంఛా, కామన్సుసభ సెలెక్టుకమిటీ కార్యక్రమంలో (1782-83) ముందుకు వచ్చింది. 1783 లో ఫాక్సు ఇండియా బిల్లు తెచ్చాడు. డైరెక్టర్ల, యజమానుల కోర్టులను రద్దుచేసి, ఆస్థానే పార్లమెంటు కమిషనర్లను నియమించాలని ఆ బిల్లు కోరుతున్నది. దీనిని కంపెనీ పక్షంవారు ఓడించారు. ఈ ఓటమితో ఫాక్సు ప్రభుత్వం పతనమైంది, పిట్ ప్రభుత్వం వచ్చింది. ఇది తర్వాత ఇరవైయేళ్ళు అధికారంలో ఉంది. ఈ విషమ సమయంలో, ఈ తీవ్ర సంధి యుగంలో ఇంగ్లీషు రాజకీయాలలో భారత సమస్య అతిప్రధానమైనదని బయటపడింది. 1784 లో పిట్ ఇండియా చట్టం వచ్చింది ఈ చట్టంలో ద్వంద్వవిధాన సూత్రాలున్నప్పటికీ ఫాక్సు సూత్రాలను కొంతవరకు అంగీకరించింది ప్రధానమైనది,ప్రభుత్వం సరాసరి యాజమాన్యమనే సూత్రంపైనే ఇది ఆధారపడింది. హేస్టింగ్సు. కంపెనీ ప్రతిఘటించినా ఆ చట్టం ఆమోదితమయింది. 1786 లో లార్డు కారన్‌వాలిస్‌ను గవర్నర్ జనరల్‌గా పాలనాపద్ధతిలో తీవ్రమైన మార్పులు చేసేందుకని ఇండియాకు పంపారు. 1772 నుండి 1785 వరకు గవర్నర్‌గాను, గవర్నర్ జనరల్‌గాను ఉండిన వారన్ హేస్టింగ్సుపైన 1788 లో లంచగొండితనానికి, దుష్పరిపాలనకు కేసు నడిచింది. (ఇంపీచ్‌మెంటుపార్లమెంటు ఉద్యోగులపై కేసు నడుపుతుంది) ఈ విచారణ వాస్తవంలో ప్రభుత్వ చట్టం. దీనికి పిట్ స్వయంగా నిర్ణయంచేసి అధికార మిచ్చాడు. ప్రధాన పార్లమెంటు వర్గాలు - ఫాక్సు, బర్కు, షెరిడన్‌ల అసరాకూడ దీనికుంది. ఇది కేవలం ఒక వ్యక్తిమీదకాక, ఒక పద్ధతిమీద జరిగిన దాడికి ప్రతిబింబం.

ఈ దాడి పరిపూర్తికి అటంకాలు వచ్చాయి. ఫ్రెంచి విప్లవమనే ప్రపంచ సమస్య దీనిని మూలకుత్రోసింది. ఆ విప్లవంతో పిట్ పరిపాలనలోని సంస్కరణ దశ అంతమయింది. ప్రపంచ విప్లవప్రతీఘాతకులకు నాయకత్వం వహి

స్తున్న ఇంగ్లీషు బూర్జువావర్గ పాత్ర వ్యక్తీకృతమయింది. భారతదేశంలో క్రూర చర్యలను దుష్పరిపాలనను ఖండిస్తున్న దశనుండి బర్కు తప్పుకున్నాడు.— ఆ దశలో అతను ఉదారవాదుల (లిబరల్) మన్ననలను గన్నాడు—ఫ్రాన్సులో జరుగుతున్న స్వతంత్ర పోరాటాన్ని మరింత తీవ్రంగా ఖండించాడు. ఇందుకు యూరోపులోని రాజులందరూ సెబాసని అభివందనల నందించారు. ఇండియాలోని గవర్నర్ కార్యవర్గసభ్యుడు, కార్యవర్గంలో హేస్టింగ్సును ఎదిరించినవాడూ, హేస్టింగ్సుపై కేసుకు కావలసిన సాధనసంపత్తిని బర్కుకు, ఇతరులకు సరఫరా చేసినవాడూ అయిన ఫిలిప్‌ఫ్రాన్సిస్ బర్కుకు జాబు వ్రాశాడు. ఇది గమనింపదగిన అంశం ఆ లేఖలో ఫ్రెంచి విప్లవం విషయంలో బర్కు అభివృద్ధినిరోధక పాత్రకు మండిపడుతూ ఫిలిప్సు దూషించాడు. హేస్టింగ్సుపై కేసు ఏడు సంవత్సరాల వరకు సాగనిచ్చారు, కడకు 1795 లో అతన్ని పూర్తిగా నిర్దోషి అని వదలివేయడం జరిగింది. పిట్ తన తొలిస్వేచ్ఛావ్యాపార వాంఛలనుండి, ఫ్రెంచి యుద్ధంలో బయలుదేరిన రక్షణపద్ధతికి (ప్రొటెక్షనిస్టు సిస్టం) మారాడు. 1813లో ఫ్రెంచి యుద్ధాలు ముగిసి, పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం సుస్థిరంగా స్థాపితమయ్యేదాకా, సరికొత్తగా భారతసమస్య తీసుకొని, నూతన దశకు తగినచర్యలు తీసుకోబడలేదు.

గవర్నర్ జనరల్ కారన్ వాలిస్ ప్రభుత్వంలో మార్పులు తెచ్చాడు. అరాచక, వ్యక్తిగత కల్మషం, దోపిడీల పద్ధతిని మార్చి చవుకగా దబ్బిచ్చి సివిల్ సర్వీసును ఏర్పరచేందుకు ప్రయత్నించాడు. దేశాన్ని కీకారణ్యంగా మారుస్తూ, పీడనకు పునాదినే విచ్ఛిన్నంచేస్తున్న భూమిపన్నులు ఒకేమోయిన పెరుగుతుండడం తొలగించదలచి బెంగాలులో పర్మనెంటు లాండు సెటిల్మెంటును (శాశ్వతంగా భూమిపన్నును నిర్ణయించడం) ఏర్పరచాడు. అందులో బ్రిటిష్ పాలనకు పునాదిగా కొత్త భూస్వామివర్గం నెలకొల్పబడింది. వారు ప్రభుత్వానికి యింత యివ్వాలని ఒకేతూరి నిర్ణయించివేశారు.

ఈ కార్యక్రమమంతా సంస్కరణలుగా ఉద్దేశింపబడింది. వాస్తవంలో యావత్ ధనికవర్గంకోసం, భారతదేశాన్ని మరింత శాస్త్రీయమైన పద్ధతిలో పీల్చివేసేందుకు ఉన్న ఆటంకాలను తొలగించడం అవసరం, అందుకే పై చర్యలు తీసుకోవలసివచ్చింది. తద్వారా పారిశ్రామిక పెట్టుబడిదారీవిధాన పీడనలోని నూతన దశకు దారి ఏర్పడింది. ఈ దశ ఎటుబడితే అటు దోచుకునే పాతపాలన కన్నా భారత ఆర్థిక వ్యవస్థలో మరింత తీవ్రమైన భీభత్సానికి పనిచేసింది.

## 3. పారిశ్రామిక విధ్వంసనం

పారిశ్రామికుల, ఇతర వర్తక సంస్థల ఆందోళన కడకు 1813 లో ఫలించింది. భారతదేశంలో జరిపే వ్యాపారంలో ఈస్టు ఇండియా కంపెనీకున్న గుత్త

అధికారం ఆఖరయింది. కాబట్టి భారతదేశ పీడనలో పారిశ్రామిక పెట్టుబడి నూతన దశ 1813 లో ప్రారంభమయినట్లు లెక్కించవచ్చును.

1813 కు ముందు భారతదేశంతో చేస్తున్న వర్తకం చాలా తక్కువ వుండేది. 1883 లో ప్రకటితమైన "ఇంగ్లాండు విస్తరణ" అనే పుస్తకంలో 'సలే' 19 వ శతాబ్దములో జరిగిన మార్పును గుర్తించాడు.

ఆడమ్‌స్మిత్ పుస్తకం ప్రకటిస్తూ మాకు లాక్ (Macculloch) భారత దేశంపై రాస్తూ 1811 లో—గుత్త వర్తకం రోజుల్లో—ఇంగ్లాండుకు ఇండియాకు జరుగుతున్న వర్తకం అతి స్వల్పమైనదని, ఇంగ్లాండుకు జెర్సీకి; ఇంగ్లాండుకు మనుష్య ద్వీపం—ఐల్ ఆఫ్ మాన్—కు (చాల చిన్నది) మధ్య జరిగే వర్తకానికన్నా కాస్త ఎక్కువో తక్కువో. అంతే.

"ఇప్పుడో - అమెరికాతో, ఫ్రాన్సుతో, జరుపుతున్న వర్తకంతో భారతదేశ వర్తకాన్ని పోల్చవచ్చు.... ఇంగ్లాండునుండి దిగుమతి చేసుకోవడంలో ఫ్రాన్సుకంటే భారతదేశమే ఎక్కువ. అమెరికాకంటే కొంత తక్కువయే".

(జె. ఆర్. సీలే, "ఇంగ్లాండు విస్తరణ" 1883, పుట 299.)

అలాగే కంపెనీ 1812 వ నాటి రికార్డుల్లో భారతదేశ ప్రాముఖ్యం, దోచుకొని వచ్చేవాటినిబట్టి, కప్పంగా తెచ్చుకొనే వాటినిబట్టేగాని, వర్తకాన్ని బట్టి కాదని వుంది.

"ఇంగ్లాండుకు ఆ విశాల ప్రాముఖ్యత ధనసంపత్తికి ఆదేశంనుండి వస్తున్న సాలుసరి ఆదాయాన్నిబట్టే. ఈదేశంలోని పారిశ్రామికులు భారత ప్రజలు వస్తువులు కొనుక్కోవడంవల్ల పొందేఆదాయం అంత ప్రధానం కాదు."

(ఈస్టిండియా కంపెనీ 1812 రిపోర్టు, "భారతదేశ విదేశ వ్యాపారంలోని కొన్ని విషయాలు" పరసాద్ పుట 49 లో ఉదహరించబడినది.)

చార్టర్ పునరుద్ధరణకు గుత్తవ్యాపారం రద్దుకుముందు 1813 లో జరిగిన పార్లమెంటు విచారణ చర్చలను పరికిస్తే కొత్తగావస్తున్న బ్రిటిష్ యంత్రపరిశ్రమలకు ఇండియాను మార్కెట్‌గా ఎలాచేయడమన్న విషయంపై వారి ఆలోచనలు కేంద్రీకరించబడినాయని స్పష్టమవుతుంది పాతపద్ధతికి చెందిన వారన్ హేస్టింగ్సు వగైరాలు భారతదేశాన్ని మార్కెటుగా పెంపొందించడానికి అవకాశం లేదని వాదించడంకూడ గమనించదగినవిషయం.

ఆ విచారణ జరుగుతున్న సమయంలో భారతదేశంనుండి దిగుమతిఅయ్యే బట్టలపై బ్రిటన్‌లో రు. 78% లు సుంకంవేసేవారు. ఈనిషేధసుంకాలు లేకపోతే బ్రిటిష్ బట్టల పరిశ్రమ ఆతొలిరోజుల్లో అభివృద్ధిచెంది ఉండేదికాదు.

భారతదేశంనుండి వచ్చే నూలుబట్టలు పట్టుబట్టలు, ఇప్పుడు బ్రిటిష్ మార్కెట్‌లో అమ్ముతున్న ధరల్లో నూటికి 50 నుంచి 60 వరకూ లాభంతో అమ్మ వీలున్నదని సాక్ష్యంలో తెలిపారు (1813 లో) కాబట్టి ఆ వస్తువులపై వాని వెలలో 70 వంతులు 80 వంతులు పన్నువేయడమో లేదా ఆ వస్తువుల దిగుమతిని నిషేధించడమో అవసరమైంది. అలా నిషేధ సుంకాలు, ఉత్తర్వులు లేకపోయివుంటే, పైస్లే, మాంచెస్టర్లలోవి మిల్లులు ప్రారంభంలోనే ఆగిపోయివుండేవి. తిరిగి వానివి నడపడం ఆవిరి యంత్రాలతోనైనాసరే సాధ్యమైవుండేదికాదు. భారతదేశంలో పరిశ్రమలను నాశనంచేయడంద్వారానే ఆ మిల్లులు నిర్మింపబడ్డాయి."

(హెచ్. హెచ్. విల్సన్, "బ్రిటిష్ ఇండియా చరిత్ర" వాల్యూం 1, పుట 385.)

ఇలా బ్రిటిష్ బట్టల పరిశ్రమను నిర్మించడంకోసమని భారతదేశపు సరుకులపై సుంకాలువేయడం 19 వ శతాబ్ది పూర్వార్ధంలో సాగింది 1840 లోని పార్లమెంటు విచారణలో ఈ క్రింది అంశాలు బయటపడ్డాయి. భారతదేశానికి బ్రిటన్‌నుండి దిగుమతయ్యే వస్తువులపైన నూటికి మూడున్నర, రెండు మాత్రమే సుంకాలు వేస్తుండగా, బ్రిటన్‌కు భారతదేశంనుండి వచ్చే సరుకులలో నూలు బట్టలపై నూటికి 10 వంతులు, పట్టుబట్టలపై నూటికి 20 వంతులు, ఉన్నిబట్టలపై నూటికి 30 వంతులు సుంకాలు వేస్తూ వచ్చారు.

ఇందువల్ల మనకు బోధపడుతున్న విషయాలివి: కేవలం ఉత్తమమైన యంత్రాలుండడంవల్లనేకాక ప్రత్యక్షంగా ప్రభుత్వం తన స్వార్ధ స్వేచ్ఛావ్యాపారానికి అవకాశం కల్పించడం (భారతదేశంలో బ్రిటిష్ వస్తువులు స్వేచ్ఛగా వెళ్లొచ్చు. కాని బ్రిటన్‌కు భారతదేశ వస్తువులు వస్తే సుంకాలువేశారు. ఇండియామటుకు యూరపుదేశాలతోగాని, ఇంకేదేశంతోగాని ప్రత్యక్ష వర్తకం నడపకుండా నౌకా నిర్బంధ చట్టాలు ఉపయోగించారు.) వీటివల్లనే భారతదేశంలోని బ్రిటిష్‌వస్తువుల మార్కెట్టును బలపరచుకొని భారత పరిశ్రమలను విధ్వంసం చేయగలిగారు.

ఈ కార్యక్రమాన్ని 19 శతాబ్ది తొలిభాగంలో అమలుపరిచారు. కాని దీని ఫలితాలు 19వ శతాబ్ది పూర్తిగా, 20 శతాబ్దిలోకూడ సాగినవి ఒకవేపు బ్రిటిష్ పరిశ్రమలు పెరిగిపోతుంటే, మరొకవైపు భారత పరిశ్రమలు తరిగిపోయినవి.

1814 లో బ్రిటిష్ బట్టలు భారతదేశానికి పది లక్షల గజాలకంటే తక్కువే దిగుమతయ్యేవి, అలాంటిది 1835 కు 5 కోట్ల 10 లక్షల గజాల గుడ్డ బ్రిటను నుండి భారతదేశానికి దిగుమతయింది. అదే సమయంలో భారతదేశంనుండి బ్రిటన్‌కు వెళ్ళే బట్టలు 306,000 ముక్కలనుండి (పీసెస్) 1844 కు 63,000 ముక్కలకు దిగిపోయాయి.

వెలలోవున్న వ్యత్యాసం ఇంతకంటే తక్కువకాదు. 1815 కు 1832 కు మధ్య భారతదేశ వస్తువుల ఎగుమతి 13 లక్షల పౌన్లనుండి లక్ష పౌన్లకు పడి

పోయింది. 17 ఏళ్ళలో ¾ భాగాలు తగ్గిపోయింది ఇక అదే సమయంలో ఇండియాకు దిగుమతి అవుతున్న బ్రిటిష్ వస్తువుల వెల 26 వేల పౌన్లనుండి 4 లక్షల పౌన్లకు పెరిగింది. అంటే 16 యింతలు పెరిగింది. ప్రపంచానికంతటికీ గుడ్డలను సరఫరాచేస్తూ వచ్చిన భారతదేశం 1850 సంవత్సరం వచ్చేప్పటికి బ్రిటిష్‌గుడ్డల ఎగుమతుల్లో నాల్గోవంతు తానే దిగుమతి చేసుకునే స్థితికి వచ్చింది.

యంత్రాలతో తయారయినగుడ్డలు నేసేవారిని నాశనంచేస్తే, మిల్లు, నూలువడికేవారినిపాడుజేసింది. 1818—1836 ల మధ్య ఇంగ్లాండునుండి ఇండియాకు దిగుమతి అవుతున్న మిల్లు నూలు 5200 రెట్లు పెరిగింది.

ఇదే పద్ధతిని పట్టు బట్టలు, ఉన్ని బట్టలు, ఇనుము, కుండలు, గాజు సామాను, కాగితాలు వీనిలోకూడా సాగింది.

ఇలా భారతదేశం చేతి పరిశ్రమలన్నీ సర్వనాశనం కావడంవల్ల ఆదేశ ఆర్థిక వ్యవస్థ ఎంత దెబ్బతినిందో మనం ఊహించుకోవచ్చును. ఇంగ్లాండులో పాత చేనేత పరిశ్రమ నశించినా, దాని స్థానంలో నూతన యంత్ర పరిశ్రమ అభివృద్ధి చెందింది. కాని భారతదేశంలో కోట్లకొలది చేతిపనులు చేసేవారు నశించినప్పటికీ ఏ నూతన పరిశ్రమలూ పెంపొందలేదు. ప్రజలు క్రిక్కిరిసి ఉన్న పారిశ్రామిక పట్టణాలైన ఢక్కా, మూర్షిదాబాద్ (ఈ పట్టణం 1757 లో లండన్‌తో సమానమైన వైశాల్యం, జనాభా, ధనం, సంపత్తి కలదని క్లయివు వర్ణించాడు.), సూరత్‌లాంటివి, కొన్నేళ్ళలోనే "పాక్సు బ్రిటానికా" (బ్రిటన్ మహాధికంలో) నిర్మానుష్యమయిపోయాయి. ఇంత వినాశాన్ని, ఎంత ఘోరయుద్ధమైనా ఎలాంటి విదేశ దండయాత్రైనా చేసి ఉండదు "ఢక్కా, జనసంఖ్య లక్షా యాభై వేలనుండి ముప్పై, నలభై వేలకు తగ్గిపోయింది. పట్టణంలోనికి అడవి మలేరియాలు చొచ్చుకుని వస్తున్నవి.... భారత దేశపు మాంచెస్టరు అయిన ఢక్కా సర్వ సౌభాగ్యంతో తులతూగడంపోయి చిన్న పల్లెగా మారిపోయింది; అక్కడ పరిస్థితి మహాదారుణంగా ఉన్నది" అని సర్ ఛార్లెస్ ట్రెవెల్యన్ పార్లమెంటరీ విచారణ కమిటీ ముందు 1840 లో సాక్ష్యమిచ్చాడు. బ్రిటిష్ సామ్రాజ్య ప్రథమ చరిత్రకారుడు మాంట్‌గోమరి మార్టిన్ అదే కమిటీ ముందు ఇలా సాక్ష్యమిచ్చాడు:

> "దేశీయపరిశ్రమలు సాగుతుండిన సూరత్, ఢక్కా, మూర్షిదాబాద్ మొదలైన తావుల విధ్వంసనం, ఆలోచించడానికూడ వీలులేనంత విషాదకరమైనది. ఇది న్యాయపద్ధతిలో జరిగిన వర్తకంవల్ల అయిన వినాశమని నేను భావించను; దుర్బలులపై బలవంతులు ఉపయోగించిన శక్తి ఇందుకు కారణమనుకుంటాను."

1890 లో సర్ హెన్రీ కాటన్ ఇలా వ్రాశాడు :

> "నూరేండ్లక్రిందటివరకూ ఢక్కావర్తకం మొత్తం కోటిరూపాయల దాకా సాగేదని అంచనావేయబడింది. ఆ పట్టణం జనాభా 2 లక్షలుండేది.

1787 లో ఢకా్కా మస్లిన్లు 30 లక్షల వెలగలవి ఇంగ్లాండుకు దిగుమ తయ్యేవి; 1817 కు అవి పూర్తిగా ఆగిపోయాయి. చిరకాలంనుంచి పారిశ్రామికులకు వేలకొలదిగా జీవనం కల్పిస్తూవచ్చిన వడుకు, నేత వృత్తులు పేసలేకుండా పోయ్యాయి. పూర్వం బాగున్న కుటుంబాలు కుటుంబాలే పట్టణాలను వదిలివేసి బ్రతుకుదెరువుకోసం పల్లెలకు వెళ్ళిపోవలసి వచ్చింది.... ఈ క్షీణదశ ఒక్క ఢకా్కాలోనేకాక అన్ని జిల్లాలలోను యిలాగేజరిగింది. దేశంలోని అన్నిప్రాంతాలలోని పారిశ్రామికులు దరిద్రులై పోతున్నారని జిల్లాఉద్యోగులూ, కమిషనర్లూ ప్రభుత్వానికి రిపోర్టులు పంపని సంవత్సరం లేదు."

1911 జనాభా నివేదికకూడ పైవిధానం జరుగుతూనే ఉన్నదని స్పష్ట పరిచింది. నేతపరిశ్రమలో ఉదాహరణకు చూదాం. 1910 లో భారతదేశంలో నేతపరిశ్రమను క్రమంగా పెంచుతున్నప్పటికీ్కూడ 1901 కన్నా నూటికి 6 గురు కార్మికులు తగ్గిపోయారని ఆ లెక్కలలో కూడా ఉన్నది. "చేతితో నూలుతీయడం పూర్తిగా రూపుమాసిపోవడం" దీనికికారణమని రిపోర్టు చెబుతున్నది.

లోహవ్యాపారులు ముందుసంవత్సరంకన్నా ఆరింతలు పెరిగినప్పటికీ ఈ పదేళ్ళలో చర్మ, లోహ పరిశ్రమలలోని కార్మికులు నూటికి ఆరుగురు తగ్గి పోయారని ఆ 1911 జనాభాలెక్కలలో ఉన్నది. తిరిగి ఇందుకు కారణం స్పష్టంగా యిలా వ్రాశారు.

"లోహవ్యాపారులసంఖ్య ఎక్కువయినప్పటికీ లోహకారుల సంఖ్య తగ్గిపోయింది. ఇందుకుకారణం దేశవాళీ కంచు, రాగి పాత్రలకు బదులు యూరోపునుండి దిగుమతయిన ఎనామల్ (పింగాణీ), అల్యూమినియమ్ (ఉక్కుసిల్వర్) పాత్రలు రావడమే"

("భారతదేశ జనాభా నివేదిక 1911)

ఇదేస్థితినే ఇనుము ఉక్కు పరిశ్రమలుకూడ చూపుతున్నవి.

"దేశీయమైన ఇనుపపోత పరిశ్రమ బయటనుండి చౌకగా దిగుమతయ్యే ఇనప ఉక్కు వస్తువులమూలంగా రైళ్ళకుదగ్గరగా వున్న ప్రాంతాల్లో పూర్తిగా నిర్మూలితమైంది దేశంలోని మారుమూలలోమాత్రం ఇంకా వుంది"

(ఇంపీరియల్ గజెటీర్ ఆఫ్ ఇండియా, 1907, వాల్యూం 111, పుట 145.)

"భారతదేశంలో ఉక్కును- ఆయుధాలకు, అలంకార వస్తువులకు, పనిముట్లకు ఉపయోగించేవారు చాల ఉన్నతశ్రేణికిచెందిన ఉక్కు వస్తువులు తయారవుతుండేవి. ఆ పాతకాలపు ఆయుధాలకు సమానమైనవి లేవు. ప్రఖ్యాతమైన డమాస్కస్ కత్తులు హైదరాబాదునుండి వచ్చిన ఉక్కుతో తయారుచేసేవారని చెబుతారు కుతుబ్ మినార్ అనే ఇనుప

స్తంభం 6 టన్నులకుపైగా బరువుంది. దానిపై 415 క్రీ. శ. నాడు రచించిన పద్యముంది. అంత పెద్దదానిని ఆకాలంలో ఎలా పోతపోశారో ఎవరికీ ఇంకా అర్థంకావడంలేదు భారతదేశమంతటా కనిపించే ఇనప పరిశ్రమ శిథిలాలు, ఆధునిక యుగానికి ముందు యూరపులో వున్నవానితో ముఖ్యంగా పోలికగలిగి ఉన్నవి........

"కమ్మరిపనివారు దేశమంతటా వ్యాపించివుండేవారు. ఇనపచూరు ఉత్పత్తయ్యే చాల జిల్లాలకు 'లోహార' అనే పేరుపెట్టారు. కాని యూరపు చౌక ఇనుము రావడంతో, వారి వ్యాపారమంతా దాదాపు పోయింది. చాలమంది కమ్మరులు ఇతర వృత్తుల్లో కాయకష్టం చేసుకోవలసివచ్చింది. ఒక శతాబ్ది క్రిందట డాక్టర్ ఫ్రాన్సిస్ బుఛానన్ ఇలాంటి పనివారి నెందరినో చూచాడు."

(డి. హెచ్. బుఛానన్, "భారతదేశము - ధనిక వ్యాపారాభివృద్ధి" 1934, పుట 274)

పాత పారిశ్రామిక పట్టణాలు, కేంద్రాలు శిథిలమై, అందలి జనాభా పల్లెల నిండా క్రిక్కిరిసిపోవటం మాత్రమేకాదు; వ్యవసాయానికీ, గృహపరిశ్రమలకూ ఉన్న ఐక్యత - ఆ ప్రధాన గ్రామ ఆర్థిక వ్యవస్థ పునాదికే చావుదెబ్బ తగిలింది. కోట్లకొలదివృత్తులనశించిపోయిన చేతిపనివారు, వడికేవారు, నేసేవారు, కుమ్మరులు, చర్మ వస్తువులుచేసేవారు, కమ్మరులు, వెండి బంగారం పనిచేసేవారు పట్టణాలలోను, పల్లెలలోనుకూడ వ్యవసాయంమీద పడ్డారు. అంతకన్నావారికి గత్యంతరంలేక పోయింది. ఇలాగా, వ్యవసాయపారిశ్రామికసంయుక్త దేశంగావుండిన భారతదేశం, బ్రిటిష్ పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానానికి వ్యవసాయ వలసదేశంగా బలాత్కారంగా చేయబడింది. ఈ కాలపు బ్రిటిష్ పాలనలో, ఆ పరిపాలనకు ప్రత్యక్ష ఫలితంగా భారతదేశపువ్యవసాయంలో ఒత్తిడి ప్రారంభమయింది దానిని ఇప్పటికీ అధికారుల పుస్తకాల్లో, రిపోర్టుల్లో పెద్దగా వ్రాస్తూ, అదేదో భారతదేశ సమాజంలోని సహజలక్షణమైనట్టు చిత్రిస్తుంటారు. పైపైన చూచేవారూ అజ్ఞానులూ ఆ వ్యవసాయంపై ఒత్తిడి "జనాభాఆధిక్యం" సూచనగా భావిస్తుంటారు వాస్తవస్థితిలో, బ్రిటిష్‌పాలనలోనే వ్యవసాయంమీద ఆధారపడినవారి సంఖ్య పెరిగిపోయింది. 19వ శతాబ్దిలోనేకాక, 20 వ శతాబ్దిలోకూడ వారి సంఖ్య దినదినాభివృద్ధి చెందుతున్నదని జనాభా లెక్కలు వెల్లడిచేస్తున్నవి. (1891 నుండి 1921 వరకు, వ్యవసాయం మీద ఆధారపడినవారి సంఖ్య దామాషాలో నూటికి 61 నుండి నూటికి 73 కు పెరిగింది; ఈ లెక్కల సంపూర్ణ పరిశీలనకు 7 వ అధ్యాయం చూడండి).

"భారతదేశాన్ని ఇంగ్లాండు యొక్క వ్యవసాయక్షేత్రంగా" మార్చడమనే ప్రమాదకర పరిస్థితి ఏర్పడుతున్నదని మాంటొగొమార్టిన్ 1840 లోనే పార్లమెంటరీ విచారణకమిటీ సాక్ష్యంలో చెప్పాడు. ఇది ముందే ఉదహరించబడింది.

"భారతదేశం వ్యవసాయ దేశమంటే నే నంగీకరించను; భారత

దేశం ఎంత వ్యవసాయ దేశమో. అంత పారిశ్రామిక దేశంకూడ; ఆ దేశాన్ని కేవలం వ్యవసాయ దేశంగా మార్చాలని చూచేవారు. నాగరిక దశలో ఆ దేశాన్ని హీనస్థితికి తేవాలని చూస్తున్నారన్నమాట భారతదేశం ఇంగ్లాండుయొక్క వ్యవసాయక్షేత్రంగా మారాలని నేను తలంచను అది పారిశ్రామిక దేశం. ఆ దేశంలో తయారైన వివిధరకాల వస్తువులు ఎన్నో యుగాలుగా ఉంటున్నవి. నిష్పక్షపాతదృష్టితో చూస్తే ఏ దేశంలో తయారయిన వస్తువులుగాని భారతదేశవస్తువులతో సరిపోలేస్థితికిరాలేదు.... ఇప్పుడా దేశాన్ని వ్యవసాయ దేశంగా మార్చడం భారతదేశానికి అన్యాయం చెయ్యడమే అవుతుంది "

తనగుత్త వ్యాపారం పోయింతర్వాత 1829 లో ఈస్టిండియా కంపెనీ, వ్యాపారం మీదకన్నా, పన్నులమీద దృష్టి ఎక్కువచేసుకుంది గనుక, దేశంలో జరుగుతున్న "వ్యాపార విప్లవం" గూర్చి విషాదచిత్రం ప్రదర్శించింది డైరెక్టర్ల కోర్టు భావాలను వివరిస్తూ మే 30, 1829 న గవర్నర్ జనరల్ లార్డువిలియం కావండిష్ బెంటిక్ ఇలా వ్రాశాడు.

"దేశంలో వివిధ వర్గాలకు నానాబాధలు కల్గిస్తూ, వాణిజ్యచరిత్రలో అసమానమైన నేటివ్యాపారవిప్లవం విషాదస్థితిని వాణిజ్యమండలి నివేదికలో వర్ణించింది. దానినిచూచి, డైరెక్టర్లసభవారి ఆందోళన అత్యధికమైంది."

కాని ఈపారిశ్రామికుల ప్రయోజనాలు పురోగమనం సాగించాయి 1840 పార్లమెంటరీ విచారణముందు మక్లెన్‌ఫీల్డు పరిశ్రమల యజమాని కోపే ఇలా అన్నాడు: "భారతదేశపు కార్మికుని విషయమై నేనెంతో చింతిస్తున్నాను. కాని భారతదేశ కార్మికుని కుటుంబంకంటె నాకుటుంబాన్నిగూర్చి నాకెక్కువ చింత, అతని పరిస్థితి నాపరిస్థితికంటే అధ్వాన్నంగా ఉందనిచెప్పి. భారతదేశ కార్మికుని కోసమని నాకుటుంబ సౌఖ్యాలను త్యాగంచెయ్యడం తప్పని నేను భావిస్తున్నాను."

పారిశ్రామిక పెట్టుబడి దారులు తమ భారతదేశ విధానాన్ని స్పష్టంగా నిర్వచించారు. బ్రిటిష్ పెట్టుబడిదారీవిధానానికి భారతదేశాన్ని వ్యవసాయ వలస దేశంగాచేయడం తమ వస్తువులనుకొంటూ తమకు ముడిసరుకులు సరఫరాచేసే దేశంగా మార్పించడం— యిదీ వారివిధానం, ఈవిధానాన్ని తమ ఆదర్శమని, మాంచెస్టర్ వాణిజ్యమండలి అధ్యక్షుడైన థామస్‌బాజ్లీ 1840 పార్లమెంటరీ విచారణలో యిలా స్పష్టపరిచాడు :

"భారతదేశం విశాలమైన ప్రాంతం. అందులోని ప్రజలు బ్రిటిష్ వస్తువులను చాల ఎక్కువగా వుపయోగించగలరు, ఇపుడున్న భారత వర్తకంలోని సమస్యంతా ఏమిటంటే మనం తయారుచేసి పంపగలవస్తువులకు భారతీయులు తమ భూమిలోని పంటలద్వారా డబ్బివ్వగలరాఅనేదే."

దెబ్బయి అయిదేళ్ళక్రితం క్లయివు చెప్పిన పాతఅంచనాలాగే (మునుపే ఉదహరించాము.) భారతదేశ నూతనపీడనాదశనుగూర్చిన పైఅంచనా అతి స్పష్టంగా కనబడుతున్నది.

భారతదేశాన్ని మార్కెట్టుగా అభివృద్ధిపరచాలంటే ఉత్పత్తిని, భారతదేశం నుండి ముడిసరుకుల ఎగుమతిని అభివృద్ధిపరచాలి. ఈ ఆశయంకోసమే బ్రిటిష్ విధానం ఇప్పుడు పనిచేయసాగింది.

> “భారతదేశం ముఖ్యమైన ముడి సరుకులను - చర్మాలు, నూనె, రంగులు, జనుము, పత్తి - ఇంగ్లాండు పారిశ్రామిక విప్లవానికి అవసరమైనవానిని సరఫరాచేసింది అందుతోపాటు ఇంగ్లీషు పరిశ్రమల యజమానుల ఇనుము, పత్తివస్తువులకు మార్కెట్టును విశాలపరిచింది ఇందులోనే ఇంగ్లాండుకు భారతదేశంయొక్క ప్రాధాన్యత ఈ శతాబ్ది ప్రథమ భాగంలో యిమిడివుంది.”
>
> (ఎల్. సి. ఎ. నోల్లెస్, “విదేశ సామ్రాజ్య ఆర్థికాభివృద్ధి” పుట 305.)

1833 లో ఇంగ్లీషువారు వెళ్ళి భారతదేశంలో భూమిని తీసుకొని తేయాకు కాఫీతోటల యజమానులుగా చేరడానికి అంగీకరించడంతో ఈ నూతన దశకు సూచన కనబడుతున్నది. అదే సంవత్సరంలోనే వెస్టుఇండీసులో బానిసతనం రద్దు చేయబడింది. వెంటనే ముసుగుకప్పి బానిసతనం నూతన ప్లాంటేషన్‌విధానం పేర భారతదేశంలో స్థాపితమైంది. చాలమందివెస్టుఇండీస్‌నుండి తొలుతవచ్చిన తోటల యజమానులు బానిసలను తోలేవారన్న విషయం గమనింప తగ్గది. (వెస్టు ఇండీస్‌నుండి అనుభవంగల బానిసలను నడిపేవారిని తేయాకు తోటల యజమానులుగా కొనివచ్చారు......... మోటు యజమానులు వచ్చారు. వీరిలో కొందరు అమెరికాలో బానిసలతో పనిచేయించినవారు, వీరు తమతోపాటు దుర దృష్టకర భావాలను, అలవాట్లను తీసుకొనివాచ్చారు.” బుచానన్, “భారతదేశంలో ధనిక వ్యాపారాభివృద్ధి” పుటలు 36 37). వారుచేసిన ఘాతుకకృత్యాలు 1860 నాటి ఇండిగో కమిషన్ విచారణలో బయటపడ్డాయి నేడు ఈ తేయాకు, రబ్బరు కాఫీ తోటలలో పదిలక్షలమందికి పైగా కార్మికులు బంధితులైవున్నారు. అంటే నేత, బొగ్గుగనులు, ఇంజనీరింగు, ఉక్కు పరిశ్రమలలో పనిచేసే మొత్తం కార్మికుల సంఖ్యకన్నా వీరి సంఖ్య పెద్దది. 1833 తర్వాత ముఖ్యంగా ముడిసరుకుల ఎగుమతి చాల పెరిగిపోయింది. ముడి పత్తి ఎగుమతి 1813 లో 90 లక్షల పౌన్లనుండి 1833 కు 320 లక్షల పౌన్లయింది. 1844 కు 8 కోట్ల 80 లక్షల పౌన్లకు పెరిగింది. ఉన్ని ఎగుమతి 1833 లో 3700 పౌనులుంటే 1844 నాటికి 27 లక్షల పౌన్లకు పెరిగింది అవిసెనూనె 1833 లో 2100 బుషెల్సునుండి 1844 కు 237 000 బుషెల్సుకు పెరిగింది.”

(పోర్టర్, “దేశ అభివృద్ధి” 1847, పుట 750).

1849-1914 మధ్యలో ముడిపత్తి ఎగుమతి 17 లక్షల పౌన్ల వెలగల దానినుండి 2 కోట్ల 20 లక్షల పౌన్ల దాక పెరిగింది. ఈ ఎగుమతైన పత్తితూకం 1833 లో 3 కోట్ల 20 లక్షల పౌన్లు, అది 1914 కు 96 కోట్ల 30 లక్షల పౌన్ల తూకానికి పెరిగింది - అంటే 30 రెట్లు హెచ్చింది. జనుము ఎగుమతులు 68,000 పౌన్లు 1849 లో ఉంటే 1914లో 86 లక్షల పౌన్లకు పెరిగింది - అంటే 126 ఇంతలు హెచ్చింది.

ఇంతకన్నా మరింత గమనింపదగిన విషయమేమిటంటే, ఆకలితో మాడుతున్న భారతదేశంనుండి ఆహారధాన్యాల ఎగుమతులు హెచ్చటం - ఆహారధాన్యాలు - ముఖ్యంగా గోధుమలు. బియ్యం ఎగుమతి 1849 లో 858 000 పౌన్లు; 1858 లో 38 లక్షల పౌన్లు; 1877 లో 79 లక్షల పౌన్లు; 1901 లో 93 లక్షల పౌన్లు; 1914 లో 1 కోటి 93 లక్షల పౌన్లు - అంటే 22 రెట్లు ఎక్కువ - ఇలాగా వడిసగా పెరిగిపోయింది.

ఇందుతోపాటు 19 వ శతాబ్ది ఉత్తరార్థంలో క్షామాల సంఖ్య, తీవ్రత కూడ చాల హెచ్చింది. 19 వ శతాబ్ది మొదటి యాభైయేళ్ళలో ఏడుతూర్లు క్షామం వచ్చింది. ఆ క్షామంలో మొత్తం 15 లక్షలమంది చనిపోయారు. రెండో యాభైయేళ్ళలో 24 తూర్లు క్షామం వచ్చింది. (1851 - 1875 వరకు 6 తూర్లు క్షామం వచ్చింది; 1876 నుండి 1900 వరకు 54 తూర్లు కరువువచ్చింది.) అధికారుల అంచనా ప్రకారం ఆ కరువుల్లో మొత్త 2 కోట్లమంది చనిపోయారు.

"దాదాపుగా ఒకశతాబ్దిక్రితంకంటే, 19 వ శతాబ్దిలోని ఆఖరు ముప్పై ఏళ్ళలో నాలుగురెట్లు కరువుకాటకాలు ఎక్కువయ్యాయి అప్పటికన్నా నాలుగు రెట్లు ఎక్కువ ప్రాంతాలకు వ్యాపించాయి." (డబ్ల్యు డిగ్బీ, "సౌభాగ్యవంతమైన బ్రిటిష్ ఇండియా" 1901) "భారతదేశం—దాని సమస్యలు" అన్న తనపుస్తకంలో డబ్ల్యు యస్ లిల్లీ, ప్రభుత్వపులెక్కలను అనుసరించి ఈక్రింది లెక్కలు తయారుచేశాడు.

| సంవత్సరం. | క్షామంలో చావులు. |
|---|---|
| 1800—25 | 10,00 000 |
| 1825—50 | 4 00,000 |
| 1850—75 | 50,00,000 |
| 1875—1900 | 1,50,00,000 |

తీవ్రమవుతున్న కరువు సమస్యను పరిశీలించేందుకు 1878 లో ఫామిన్‌కమీషన్ నియమింపబడింది. 1880లో ఆకమిషన్ రిపోర్టును ప్రచురించారు. అందులో ఇలాఉంది. "భారత క్షామాలవల్ల ఏర్పడిన వినాశకర ఫలితాలకూ, తగిన సహాయంచేయ వీలులేకుండా పోవడానికి ముఖ్యమైన కారణం, ఎక్కువమంది ప్రజలు వ్యవసాయంమీదనే పూర్తిగా ఆధారపడి ఉండడమూ, జనసంఖ్యలో ఎక్కువ

భాగం సహాయంపొందగల యే ఇతర పరిశ్రమలుకూడా లేకపోవడమున్న" అని వారు కనిపెట్టారు.

"ప్రజాసామాన్యానికంతటికీ ముఖ్యవృత్తి వ్యవసాయం కావడమనే దురదృష్టకర పరిస్థితే, భారతదేశ ప్రజల దరిద్రానికి, క్షామకాలంలో వారెదుర్కొ-వలసిన దారుణ ప్రమాదాలకు మూలకారణం. వివిధవృత్తులను ఏర్పరచనిది, నేటి ఈతిబాధలకు నివారణకల్పించడం సాధ్యంకాదు ఆ వృత్తులలోనికి జనసామాన్యంలో ఎక్కు-వగా ఉన్నవారిని వ్యవసాయం నుండి ఏ పరిశ్రమల్లోనో, ఏ ఇతర వృత్తుల్లోనో అప్పుడు ప్రవేశపెట్టడానికి వీలుంటుంది."

(ఇండియన్ ఫామిన్ కమిషన్ రిపోర్టు 1880.)

ఈ మాటలతో, పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం, భారతదేశంలో తాను చేసిన పనిపై తానే తీర్పును చెప్పుకొన్నది.

# ఆరో అధ్యాయము

# భారతదేశ నూతన సామ్రాజ్యవాదం

"పరిపాలనా, పీడనా జెట్టపట్టాలు వేసుకొని నడుస్తాయి"

లార్డ్ కర్జన్, 1905 లో.

భారతదేశంలో సామ్రాజ్యవాదం 1914-18 నాటి యుద్ధంతర్వాత పాత యుగంతో బొత్తిగా సంబంధంలేని ఒక నూతనదశలో ప్రవేశించిందని చాలమంది భావిస్తుంటారు.

రాజకీయ రంగంలో పాతనిరంకుశపాలన, 1917 నాటి ప్రకటనతో అంత మైనదని వారు నిర్ధరిస్తారు. 1917 ప్రకటనలో "సామ్రాజ్యంలో విడదీయరాని భాగంగా, భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని త్వరలో సాధించడం" నూతన లక్ష్యమనే వాగ్దానంఉంది; తర్వాతి చరిత్రంతా క్రమక్రమంగా పరిణామాన్ని సూచించేదిగా (మధ్య ప్రజావైరుధ్యం, సహాయనిరాకరణలతో నిరోధింప బడుతూ వచ్చింది) కనిపిస్తుంది. వరుసగా రాజ్యాంగ సంస్కరణలద్వారా ఆఖరుకు ఈ ఆశయం 1946 మే 16 నాటి బ్రిటిష్ రాయబారవర్గ ప్రకటనద్వారా గ్రాహ్యమై నట్టు కనిపిస్తుంది.

ఆర్థికరంగంలో పాత స్వేచ్ఛా వ్యాపారవాదులు (Laissez - faire) భారత దేశ పరిశ్రమాభివృద్ధిపైనున్న పాత వైముఖ్యాన్ని వదలివేసి నూతన దృక్పథాన్ని అవలంబించారని, బ్రిటిష్‌ప్రభుత్వ పోషణతో, బ్రిటిష్ పెట్టుబడితో భారతదేశాన్ని ఆధునిక పారిశ్రామిక దేశంగా మారుస్తున్నారని, అంటుంటారు.

1918 నుండి ఈ యుగంలోని అంశాలను సూక్ష్మంగా పరిశీలించినట్టయితే తన అవసానదశలో సామ్రాజ్యవాదం పైవిధమైన అభివృద్ధికర దృక్పథాన్ని అవలంబించడంలేదని స్పష్టపడుతుంది.

పాతకాలపు పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానంయొక్క పీడనలో ఒక మార్పు వచ్చిందనడంలో సందేహంలేదు. కాని ఈ మార్పు వాస్తవంగా 1914 యుద్ధంతో వచ్చిందికాదు. పైపైనచూచేందుకు పాతకొత్తలకు మధ్య అఖాతాన్ని

ఆ యుద్ధం కల్పించివుంటుందని కనిపించొచ్చుగాని అది వాస్తవంకాదు 20 వ శతాబ్ది తొలి పదిహేను సంవత్సరాల్లోనే ఈ మార్పు దశ ప్రారంభమైంది. అనేక పరిణామాలకు కారణమైన మొదటి ప్రపంచయుద్ధం ఆ దశలోనే కలుసుకుంది. స్వేచ్ఛా వ్యాపార పారిశ్రామిక పెట్టుబడి దశనుండి బ్యాంకుల పెట్టుబడిదశ రావడం - దాని పాలన భారతదేశంలో ఏర్పడడం మూలంగానే ఆ మార్పునకు ప్రారంభం జరిగింది. ఈ మార్పునకు పునాదులు ముందుగానే ఏర్పడినవి.

1914 నాటి యుద్ధం ఆ మార్పును మరింత వేగపరిచి అభివృద్ధిని ముందుకు నెట్టింది. అందుతోపాటు పెట్టుబడిదారీ విధానంయొక్క ఆర్థిక సంకటాలు విరుచుకొని పైన బడటంతో అంతకుముందెన్నడూలేని రాజకీయ ప్రజాపోరాటాలు భారతదేశంలో బయలుదేరాయి. ఈ రెండిటిమూలంగానే భారతదేశపు నూతన దశయొక్క ప్రత్యేక లక్షణం యిమిడివుంది. ఈదశలో భారతదేశంలో అసమగ్ర స్వరూపంతో ఉన్న బ్యాంకులపెట్టుబడిదారీ పాలనయొక్క సంపూర్ణలక్షణాలు ఒకవేపు బయటపడినవి. మరోవేపు ప్రజాపోరాటాల వెల్లువ సామ్రాజ్యవాద ఔన్నత్యపు పునాదులను కదిపివేసింది. ఈరెండు ప్రధానశక్తులూ నేటి నూతన భారతదేశానికొక రూపమిచ్చాయి.

భారతదేశంలో రాజ్యాంగ సంస్కరణలు అమలు జరపడమనేది కొత్తగా కనిపెట్టిన సంగతికాదు. ఈ సంస్కరణలు 1861 నాటి కౌన్సిల్సు చట్టం మొదలుకొని (ఈ చట్టం "బ్రిటిష్ ఇండియాలో ప్రజాప్రతినిధి సంస్థలకు విత్తనం వేశాయి" అని ఇ. ఎ హోర్నిస్ తన "బ్రిటిష్ ఇండియా రాజ్యాంగ వ్యవస్థ" అనే పుస్తకంలో వ్రాశాడు.) 1865-1882 లలో మునిసిపల్, డిస్ట్రిక్టుబోర్డుల ఏర్పాటు, 1892 కౌన్సిల్ చట్టం, తర్వాత 1909 లో మాంటేగూ-ఛెమ్సుఫర్డు సంస్కరణలు ఇలా వస్తూనే ఉన్నాయి. 1917 బ్రిటిష్ ప్రకటనతో ప్రారంభమైందని సామాన్యంగా చెప్పబడే ఈ నూతన దశ, 1914 కు ముందటి సంవత్సరమే మోర్లే-మింటో సంస్కరణలతో అసలు ప్రారంభమైంది. ఆ సంస్కరణలతో అసలు అధికారం మాత్రం చేతనుంచుకొని, ఉదార సంస్కరణలు, భారతీయుల కెన్నో సౌకర్యాలు చేశామని (ఒకవేపు నిర్బంధవిధానం ఉపయోగిస్తూనే) పెద్దగా చెప్పుకున్నారు. మాంటేగూ-చెమ్స్‌ఫర్డురిపోర్టు మోర్లే-మింటోసంస్కరణలను తక్కువపరచి తాను అంతకన్నా ముందుకు పోయినట్టు చూపాలనిప్రయత్నించినమాట వాస్తవమే. ("అప్పుడున్న ఉత్సాహంలో వారేదో పెద్దపనిచేస్తున్నట్లు చెప్పుకున్నారు") కాని అందులోనేఉన్న ద్వంద్వపరిపాలనా పద్ధతిని ఖండించడానికి తగిన అవకాశముంది. అంతకు ముందటి సంస్కరణలు స్వపరిపాలనం ఇవ్వలేదన్నమాట అందరూ ఒప్పుకుంటారు; కాని ఈవిమర్శతర్వాత సంస్కరణల కన్నింటికికూడ వర్తిస్తుంది. 1918 తర్వాతదశలో బ్రిటిష్‌ప్రభుత్వం అధికారాన్ని అప్పగించివేస్తున్నట్టు తమ ప్రజాపత్యాన్ని సడలించినట్టు బ్రిటిష్ ప్రజలను మభ్యపెట్టి ఉండవచ్చు. కాని భారతీయులకుమాత్రం ఈదశ మరోవిధంగా కనిపించింది. ఈ

దశలో సంస్కరణలతోపాటు విపరీతమైన నిర్బంధవిధానం, మునుపెన్నడూ లేనన్ని అరెస్టులు, శిక్షలు, దారుణంగా ప్రజలను హింసించడం, కాల్పులు, అనేకనిర్బంధచట్టాలు-ఇవీ భారతీయులకు ఈదశలో కన్పించేవి.

ఇలాగే ఆర్థికరంగంలోకూడ నూతనదశకు ప్రథమసూచనలు, 20 వ శతాబ్దితొలి సంవత్సరాల్లోనే చూడవచ్చు 1905 లో లార్డు కర్జన్ కొత్తగా వ్యాపారపరిశ్రమల శాఖను నెలకొల్పాడు. 1907 లో ప్రథమ పరిశ్రమల మహాసభ జరిగింది, భారతదేశంలోని బట్టమిల్లుల పరిశ్రమ 1914 కు ముందటి 20 సంవత్సరాలకన్నా, తర్వాత ఇరవై ఏళ్ళలో అత్యధికంగా పెంపొందింది. పారిశ్రామికంచేసేవిషయంలో బ్రిటిష్ విధానం మార్పును గూర్చిన ప్రకటనలు తర్వాతనే మరీ బాహాటంగా చేస్తూవచ్చారు 1918 తర్వాతనే కొత్తసుంకాల విధానం ఏర్పడింది. కాని ఈ ఫలితాలన్నీకూడ దేశావసరాలను, అభివృద్ధికి గల సహజసంపత్తినిబట్టి చూస్తే బొత్తిగా అల్పమైనవని అందరూ అంగీకరిస్తారు. ఉత్పత్తి అభివృద్ధిని అరికట్టే వైరుధ్యాలు, వ్యత్యాసాలు మాత్రం మునుపటిలాగే ఇంకా తీవ్రంగా కొత్తరూపాలతో సాగించడం జరిగింది.

ఈ ఆధునికదశలో వచ్చిన ప్రధానమైన మార్పేమిటంటే, తమ స్వతంత్ర పోరాటంలో ఒక నూతనదశకు భారతదేశ ప్రజలు వచ్చారు. తద్వారా రాజకీయమైన మార్పు వచ్చింది. ఈ అభివృద్ధి, సామ్రాజ్యవాదం వ్యతిరేకించినప్పటికీ జరిగినది.

భారతదేశ సామ్రాజ్యవాద పాలనలోని ఈ నూతనదశతో ప్రధానశక్తులను పరిశీలించవలెనంటే, పారిశ్రామిక పెట్టుబడి దశనుండి బ్యాంకుల పెట్టుబడి దశకు మార్పు జరిగిందని గమనించాలి. ఈ యుగాన్ని అర్థంచేసుకోడానికి, ఈ మార్పు ఎలా జరిగిందో, దానివల్ల ఎలాంటి ఫలితాలు ఏర్పడ్డాయో తెలుసుకోవడం ప్రప్రథమ అవసరం.

## 1. బ్యాంకుల పెట్టుబడి దశకు మార్పు

పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానంయొక్క 19 శతాబ్దపు భారతదేశ పీడనలో కొన్ని ప్రత్యేక లక్షణాలున్నప్పటికీ, పాతకాలపు దోపిడీ మాత్రం తరగలేదు. అది కొత్తపద్ధతులతో కొనసాగింపబడుతూవచ్చింది.

"కప్పం" అనేపేర (ట్రిబ్యూట్) ప్రతిఏటా భారతదేశంనుండి కోట్ల పౌనులు ఇంగ్లాండుకు ప్రవహించేవి. "హోమ్‌చార్జెస్" అనీ, వ్యక్తిగతంగా పంపే డబ్బనీ, బదులువస్తువులేవీ ఇవ్వకుండా లాగేధనం 19 వ శతాబ్ది అంతానడిచింది. ఈ ధనప్రవాహాన్ని "ట్రిబ్యూట్" (కప్పం) అని 19 శతాబ్దిమధ్యవరకు ప్రభుత్వోద్యోగులు పిలిచేవారు. 20 వ శతాబ్దిలో వ్యాపారం తక్కువైపోయినప్పటికీ ఈ కప్పం మాత్రం బాగా త్వరగా పెరుగుతూవచ్చింది.

1848 లో, కామన్సు సభవారు నియమించిన ఈస్టువెస్టు ఇండీస్‌లలోని చక్కెర, కాఫీ తోటల సెలక్టుకమిటీముందు, ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్ కర్నల్ సైక్సు సాక్ష్యమిచ్చాడు. అతను ఈ కప్పం ఏటా 35 లక్షల పౌను లుంటుందని అంచనా వేశాడు ; "దిగుమతులకన్న ఎగుమతులను ఎక్కువచేయడం వల్లనే ఈ కప్పాన్ని భారతదేశం భరించగలదు." అలాగే ఈస్టిండియా వర్తకుడు యన్. అలెగ్జాండర్ ఆ కమిటీముందు యిలా చెప్పాడు :

"1847 దాకా భారతదేశంయొక్క దిగుమతులు దాదాపు 60 లక్షల పౌన్లు, మరి ఎగుమతులేమో 90 లక్షల పౌన్లు ఈ రెండిటితేడా మొత్తం 40 లక్షలు దాదాపు ఈస్టు ఇండియా కంపెనీ ఇండియానుండి లాగి ది"

1851 నుండి 1901 వరకు ఇంగ్లాండుకు "స్వదేశ ఖర్చులు" (హోమ్ చార్జెస్) అనేపేర ఇండియానుండి ప్రభుత్వం పంపే ధనం ఏడింతలు; 25 లక్షల నుండి 173 లక్షల పౌన్లకు పెరిగిపోయింది. ఇదికాక వ్యక్తిగతంగా ఉద్యోగులు ఇంగ్లాండుకు చాల డబ్బు పంపేవారు. ఆ మొత్తం ఇందులో చేరలేదు.

పై మొత్తంలో 20 లక్షలుమాత్రం స్టోర్సును కొనడానికి ఉపయోగించే వారు. 1913 - 14 సంవత్సరానికి ఆ ధనప్రవాహం కోటీ తొంభైనాలుగు లక్షలకు పెరిగింది. అందులో 15 లక్షలుమాత్రమే స్టోర్సుకు ఖర్చుపెట్టారు. 1933 - 34 సంవత్సరం ఇండియా ప్రభుత్వం ఇంగ్లాండుకు పంపిన మొత్తం 2 కోట్ల 75 లక్షల పౌన్లని లెక్కలు చూపుతున్నవి. అందులో స్టోర్సు కొనడానికి 15 లక్షల పౌన్లు మాత్రమే ఖర్చుపెట్టారు (1914 లో రూపాయ మారకం 1 షి. 4 పెన్నీలుగా ఉండేది దానిని 1933 లో 1 షి 6 పెన్నీలకు మార్చారు, ఇలా చేయడంవల్ల ఇండియా రూపాయలసంఖ్య తగ్గిపోయింది. కాని 1914 లో ధరలస్థాయి 147 నుండి 1933 లో 121 కి తగ్గిపోయింది. అందువల్ల 1914 వెలల దృష్టితో చూస్తే భారతదేశంపై 3 కోట్ల పౌనుల భారం పడింది.)

1851-1901 మధ్య భారతదేశంనుండి ఎగుమతులు (సరుకులు, ఖజానా కలిసి) మూడింతలు-33 లక్షలపౌన్లనుండి 1 కోటి పదిలక్షల పౌన్లకు పెరిగింది. (సరుకురూపంలో 72 లక్షల పౌన్లనుండి 2 కోట్ల 74 లక్షలకు ఎగుమతులు పెరిగాయి). ఇరవైశతాబ్దిలో ఈ పెరుగుదల మరింతవేగంగా అభివృద్ధిచెందింది. 1901 కి 1913-14 కు మధ్య 1 కోటి 10 లక్షలనుండి 1 కోటి 42 లక్షలపౌన్లకు పెరిగింది. (సరుకు ఒక్కటే 3 కోట్ల 84 లక్షలపౌన్లు) 1913-14 సంవత్సరం మాత్రం సగటున తక్కువ : 1909-10 నుండి 1913-14 అయిదు యుద్ధపూర్వ సంవత్సరాలు సగటున ఎగుమతులు లెక్కవేస్తే 1901 కన్న రెండురెట్లు పెరిగింది. ఏటా పెరుగుదలసంఖ్య 2 కోట్ల 25 లక్షలకు పెరిగిపోయింది.

("ఇండియన్ ఫిషల్‌కమిషన్ రిపోర్టు" 11 1922, పుట 20.)

1933-34 లో భారతదేశంనుండి అదనపు ఎగుమతులు 6 కోట్ల 97

లక్షల పౌనులకు పెరిగాయి. అందులో సరుకులు 2 కోట్ల 68 లక్షలు, ధనం 4 కోట్ల 29 లక్షలు. ఈసంఖ్య ఇంత అధికంకావడానికి కారణం, ఆర్థికసంక్షోభం ఏర్పడినప్పుడు సాయపడుతుందన్న ఉద్దేశంతో భారతదేశంనుండి ఇంగ్లాండు బంగారం రాబట్టడమే. తారతమ్యం పరిశీలించేందుకు తగినట్టుగా మనం 1931-2 నుండి 1935-6 వరకున్న అయిదేళ్ళ సగటునచూస్తే ఇండియానుండి ఇంగ్లాండుకు వెళ్ళినధనం 5 కోట్ల 92 లక్షలు-అంటే యుద్ధానికిపూర్వం అయిదేళ్ళ సగటున తీసుకున్న (1910-14 వరకు) డబ్బుకంటే మూడురెట్లెక్కువ. 1901 లో తీసుకున్న డబ్బుకంటె అయిదింత లెక్కువ.

ఇలా భారతదేశంనుండి ఇంగ్లాండుకు వెళ్ళిన కప్పంమాత్రం (ఇకభారతదేశం నుండి ఎగుమతయ్యే వాటికి, భారతదేశంలోనికి దిగుమతయ్యేవాటికి ధరలలో వ్యత్యాసం కల్పించి లాగే దోపిడీ ఇందులో చేరలేదు) 19 వ శతాబ్దిమధ్య భాగంనుండి మనమొక పట్టిక తయారుచేదాం, దానివి ఒక్కమాటుచూస్తే, ఇంగ్లాండు భారతదేశాన్ని దోచుకోవడం అతిస్పష్టంగా కనిపిస్తుంది. అయినా ఇది ఆదోపిడీలో ఒకభాగం మాత్రమే. ఇదికాక మిగతారూపాలలో ఉన్న దోపిడీ వేరేఉండనేఉంది.

## ఇండియానుండి, ఇంగ్లాండుకు వెళ్ళే కప్పంలో పెరుగుదల

(లక్షల పౌన్లలో)

| | 1851 | 1901 | 1913-14 | 1933-34 |
|---|---|---|---|---|
| స్వదేశ ప్రభుత్వానికి (హోమ్ ఛార్జెస్) | 25 | 173 | 194 | 275 |
| భారతదేశపు అదనపు ఎగుమతులు | 33 | 110 | 142 | 697 |

లేక ప్రతి అయిదేళ్ళ సగటు మొత్తంవేసి వ్యాపార సంబంధాలను చక్కగా చూడవచ్చును.

## ప్రతి అయిదేళ్ళకు సగటు సాలుసరి

(లక్షల పౌన్లలో)

| | 1851-55 | 1897-1901 | 1909-10 నుండి 1913-14 వరకు | 1931-32 నుండి 1935-36వరకు |
|---|---|---|---|---|
| అదనపు భారతదేశపు ఎగుమతులు | 43 | 153 | 225 | 592 |

ఇలా వరుసగా దోపిడీ పెరిగిపోవడం గమనిస్తే, కేవలం పీడనలోని సంఖ్యాధిక్యమేకాదు మనకు కనిపించేది. అసలాదోపిడీ విధానంలోనే ఒకమార్పును పైపట్టిక వ్యక్తంచేస్తున్నది

ఇలా 19 శతాబ్ది మధ్యభాగంలో ఇండియానుండి ఇంగ్లాండుకు వెళ్ళేధనం త్వరితంగా అధికంకావడం, 20 వ శతాబ్దిలో ఆ ఆధిక్యం మరింత వేగంతో

ముందుకు పరిగెత్తడం, కొత్తరూపంతో వస్తున్న పీడనావిధానాన్ని మనకు కనపడనీకుండాచేస్తున్నది. ఈ కొత్తపీడనా పద్ధతులు 19 శతాబ్దిలోని స్వేచ్ఛా వ్యాపార పెట్టుబడిదారీ విధానదశలోనుండి 20 శతాబ్దిలోని బ్యాంకులపెట్టుబడిదశ లోని పీడనాపద్ధతులుగా మారుతున్నవి.

19 శతాబ్దిలోని స్వేచ్ఛా వ్యాపార పెట్టుబడి దశయొక్క అవసరాలు, భారతదేశంలో బ్రిటిష్ విధానంలో కొత్తమార్పులను బలవంతంగా తెచ్చాయి.

మొదటిది: కంపెనీని శాశ్వతంగా రద్దుచేసివేసి, ఆ స్థానంలో బ్రిటిష్ ధనికవర్గానికంతటికీ ప్రాతినిధ్యంవహించే బ్రిటిష్ ప్రభుత్వం ప్రత్యక్ష పాలనను ఏర్పాటు చేయవలసివచ్చింది. ఇది 1833 కొత్త చార్టరుతో కొంతవరకు అమలుకు వచ్చినా 1858 లోనే ఈ పని పూర్తి అయింది.

రెండోది: భారతదేశంలో పూర్తిగా వర్తకంలో చొచ్చుకొనిపోయేందుకు వీలుకల్గించడం అవసరమయింది. ఇందుకుగాను కొత్త రైలుబాటలు, రోడ్లు వేయ వలసివచ్చింది. బ్రిటిష్ పాలనలో పూర్తిగా పడిపోయిన నీటివనరులపై దృష్టి పెట్టవలసివచ్చింది. టెలిగ్రాములను దేశవ్యాపితంగా, తపాలా పద్ధతిని ఏర్పాటు చేయవలసి వచ్చింది. తమకు కావలసిన గుమాస్తాలను, క్రింది ఏజెంట్లను సరఫరా చేయడంకోసం ఆంగ్లేయ పద్ధతిలో విద్యావిధానం పరిమితంగా ప్రారంభించవలసి వచ్చింది. యూరపియన్ పద్ధతిలో బ్యాంకులను స్థాపించడం అవసరమైంది.

అంటే అర్థమేమిటి? ప్రజాహిత కార్యాల విషయంలో అతిప్రాథమిక ప్రభుత్వ ధర్మాలనుకూడ ఆసియాలో ఒక శతాబ్దివరకూ గమనించనేలేదు తర్వాత ఆ దేశాన్ని దోపిడీ చేసేందుకు ఆ ప్రాథమిక కార్యాలు అవసరమైనందువల్ల కొద్దిగా ప్రారంభించక తప్పలేదు. అదికూడ అసమగ్రంగా జరిగింది. (ఒకవేపు పారి శ్రామికాభివృద్ధిని అరికడుతూ వచ్చారు.) కేవలం వర్తకానికి విదేశాక్రమణకు కీలకస్థానాలకు అవసరమయ్యే వాటిపై మాత్రమే దృష్టినిసారించారు. అదికూడ విపరీతమైన వడ్డీ వ్యాపారదృష్టితో ప్రజలకు ఈ సౌకర్యాలు కలిగించబడినవి.

తొట్టతొలుత రైల్వే నిర్మాణాన్ని పెద్దఎత్తున ఏర్పరిచేందుకు ఉత్సాహ మిచ్చిన లార్డు డల్హౌసీ 1853 లో ప్రఖ్యాతమైన నోటు ఒకటి వ్రాశాడు. అందులో బ్రిటిష్ వస్తువులకు భారతదేశాన్ని మార్కెట్టుగా అభివృద్ధిపరచాలని, ఆ దేశాన్ని ముడిసరుకులకు మూలంగా చేయాలని బ్రిటన్ లక్ష్యమైనట్టు అతిస్పష్టంగా యిలా విశదీకరింపబడినది:

> "ఈ రైళ్ళస్థాపనవల్ల భారతదేశానికి కలిగే వాణిజ్య, సాంఘిక సౌకర్యాలు ఇప్పటి అంచనాలకన్నా మించిపోతాయని నిజంగా నేను విశ్వసిస్తున్నాను. ఇంగ్లాండు కావాలోఅని గోలపెడుతున్న పత్తిని భారత దేశం యిప్పటికే కొంతవరకు ఉత్పత్తి చేస్తూఉంది. దూరంలో ఉన్న మైదానాలనుండి నౌకలకందివ్వగల వివిధ రేవులకు ఆ పత్తినిచేర్చే రవాణా

సౌకర్యాలే ఏర్పడితే, ఆ పత్తిని సంఖ్యలోను, గుణంలోను కూడ అధికంగా, ఉత్తమంగా ఉత్పత్తిచేయ వీలవుతుంది. వాణిజ్యవసతులను మనం ఎంతయెక్కువచేస్తుంటే భారతదేశంలోని మారుమూలలనుండి యూరపి యన్ సరుకులకు గిరాకు అంతఎక్కువవుతున్నది ఈ ప్రాచ్యభూగోళంలో మనకుకొత్తమార్కెట్లు ప్రత్యేకపరిస్థితులలో దొరుకుతున్నవి. ఈ మార్కెట్లుఎంత అమూల్యమైనవో, అవిఎంత విస్తారం కానున్నవో ఏ తెలివి కలవాడూ—ఎంత దూరదృష్టికలవాడైనా—అంచనావేయడం సాధ్యపడదు."

(లార్డు డల్హౌసీ, 1848—53 లలో గవర్నర్ జనరల్. 1853 లో రైల్వేలపై వ్రాసిన మినిట్సు.)

పారిశ్రామిక పెట్టుబడిదారులకు, భారతదేశంలో తమ వర్తకంచొరుచుకొని పోయేందుకై అవసరమైన రైల్వేలనిర్మాణం (అందుతోపాటు తమ ఇనుమూ, ఉక్కూ, ఇంజనీరింగు పరిశ్రమలకు మార్కెట్లకుకూడ రైల్వేనిర్మాణం అవసర మైంది) వల్ల మరొక ఫలితంకూడ కలిగింది. ఆ రైల్వేల నిర్మాణం ఒక కొత్తదశకు పునాదులు వేసింది. భారతదేశంలో బ్రిటిష్ పెట్టుబడి పెట్టడంతో ఈ నూతనదశఆరంభమైంది.

సామ్రాజ్యవాదుల దురాక్రమణ విస్తరణపద్ధతిలో దీనిని పెట్టుబడి ఎగు మతి అంటారు. కాని భారతదేశంలో జరిగిన యదార్థవిషయాలు పరికిస్తే, దీనిని పెట్టుబడిఎగుమతి అనడం సత్యవిరుద్ధం అవుతుంది. అసలు బ్రిటన్‌నుండి ఎగుమతిచేసిన పెట్టుబడి చాల తక్కువ 1914 వరకు ఒక్క 1856-62 సంవత్స రాల మధ్యలో మాత్రమే బ్రిటన్‌నుండి ఎగుమతులు, దిగుమతులకన్నా కొంత ఎక్కువ ఆ ఏడేళ్ళలోను 225 లక్షల పౌన్లు ఎగుమతులున్నవి. 1914 లో 5 కోట్ల పౌనుల పెట్టుబడి ఉన్నట్టు అంచనా వేశారు. అందులో ఈ మొత్తం చాల తక్కువ ఆ కాలంలో బ్రిటన్‌నుండి ఇండియాకు ఎగుమతులు ఎక్కు వయినా వానితోబాటు బ్రిటన్‌కు భారతదేశంనుండి వెళ్ళేకప్పం చాల ఎక్కు వయింది. కాబట్టి, అసలు భారతదేశంలో బ్రిటిష్ పెట్టుబడి అనబడే మొత్తమంతా మొదట, భారతదేశంలో దోపిడీవల్ల కూడబెట్టిందే. తర్వాత దానిని బ్రిటన్‌కు భారతదేశం ఇవ్వవలసిన అప్పుగా లెక్కల్లో వ్రాశారు. అప్పటినుండీ ఆ అప్పుకు వడ్డీలు, డివిడెండులు భారతదేశం అచ్చుకో వలసివచ్చింది.

భారతదేశంలోని బ్రిటిష్ పెట్టుబడికి మూలధనం ప్రభుత్వ ఋణం - తమ అధికారం స్థిరంగా పాదుకొనచేయడానికి బ్రిటన్‌లో ఈ పాడుపద్ధతిని పాలకవర్గం అంతకుముందే అవలంబించింది. బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని ఈస్టిం డియా కంపెనీనుండి తీసుకున్నప్పుడు 7 కోట్ల పౌనుల అప్పునుకూడఆకంపెనీ నుండి తనపేరతీసుకుంది. నిజస్థితేమంటే, భారతదేశంనుండి ఈస్టిండియా కంపెనీ

కప్పంపేర 15 కోట్ల పౌనులకుపైగా దోచుకున్నారు. అవికాక బ్రిటన్ ఇతరదేశాలలో- ఆఫ్ఘనిస్తాన్, చైనా మొదలైనచోట్ల చేసిన యుద్ధపు ఖర్చులు వేరే భారతీయులనుండి వసూలుచేశారు. భారతదేశ రచయితలు పై లెక్కలను అంచనా వేశారు. వీనిని బట్టి లెక్క సరిగా తయారుచేస్తే భారతదేశానికి ఇవ్వవలసిన ఋణమే తేలుతుంది; కాని భారతదేశమే బాకీగా తేల్చి దానిని బ్రిటన్‌పేర వ్రాసుకొని అతిత్వరితంగా పెంచింది పై లెక్కలు ఇందుకు ఏమాత్రం అడ్డుపడలేదు.

బ్రిటిష్ ప్రభుత్వం ఈ భారత ప్రజా ఋణాన్ని 18 ఏళ్ళలో 7 కోట్లనుండి 14 కోట్లకు పెంచివేసింది; 1900 కల్లా ఇది 22 కోట్ల 40 లక్షల పౌనులకు పెరిగింది; 1913 కు ఈ అప్పు 27 కోట్ల 40 లక్షలకు వచ్చింది; 1939 లో రెండవయుద్ధ ప్రారంభ సమయానికి, ఆ భారతదేశ ఋణంరూ. 1179 000,0000 (వెయ్యి నూట డెబ్భై తొమ్మిది కోట్లు) లకు పెరిగింది. ఇందులో 709 కోట్ల 90 లక్షల రూపాయలు భారతదేశ ఋణం, 469 కోట్లా 10 లక్షల రూపాయలు స్టెర్లింగు అప్పు (ఇంగ్లాండులోని అప్పు) చేరిఉంది అంటే 75 ఏళ్ళ బ్రిటిష్ ప్రభుత్వ ప్రత్యక్ష పాలనలో భారతదేశ ఋణం 12 రెట్లకుపైగా పెరిగిపోయింది

ముఖ్యంగా ఇంగ్లాండులోని స్టెర్లింగు బాకీల పెరుగుదల పరిశీలించదగింది. కంపెనీ పాలన అంతమయ్యేటప్పటికి 1856 నాటికికూడ కేవలం అప్పు 40 లక్షల పౌన్లు మాత్రమే ఉంది. దీని పెరుగుదల చూడండి: 1860 కి 3 కోట్ల పౌన్లు; 1883 కి 7 కోట్ల 10 లక్షల పౌన్లు; 1900 కి 13 కోట్ల 30 లక్షల పౌన్లు; 1913 కి 17 కోట్ల 70 లక్షల పౌన్లు; 1939 కి 35 కోట్ల 18 లక్షల పౌనులు,

ఈఅప్పు యుద్ధఖర్చులు ఇండియాపేర ఖర్చురాయడంతో మొదట ఏర్పడింది. తర్వాత ప్రభుత్వం ప్రారంభించిన రైల్వే, రోడ్లు మొదలైన ప్రజాహిత కార్యాలకు (పబ్లిక్‌వర్కుల్సు) మొదలైన వానికైన ఖర్చులు ఇందులో కలిపారు. మొట్టమొదటి ఏడుకోట్లూ లార్డువెల్లస్లీ నడిపిన యుద్ధాలకు ఆఫ్ఘన్, సిక్కు యుద్ధాలకు 1857 నాటి సైనికుల తిరుగుబాటును అణచేందుకు అయినఖర్చులతోనే ఎక్కువగా ఏర్పడింది. దానిని 17 ఏళ్ళలో బ్రిటిష్‌ప్రభుత్వం రెట్టింపుచేసింది. ఆరెండో 7 కోట్ల పౌనుల్లో కేవలం 2 కోట్ల 40 లక్షలపౌనులు మాత్రమే ప్రభుత్వ రైల్వేలకు, నీటి పారుదలవసతులకు అయినఖర్చు. మిగతా మొత్తమంతా ఏదోఒక సాకుమీద మరీఅర్థంలేని బాదరాయణసంబంధంకూడ కల్పించి ఇండియా పేర ఖర్చు వ్రాయడంతో ఏర్పడింది. లండన్‌లో టర్కీ సుల్తానుకు సన్మానసభ చేస్తే అందుకైనఖర్చులు చైనా, పర్షియాలలో బ్రిటిష్ రాయబారులను వారికార్యాలయాలను పోషించడానికయ్యేఖర్చులు, అబిసీనియా యుద్ధానికైన ఖర్చులూ, కడకు మధ్యధరాసముద్ర నౌకాబలానికయ్యే ఖర్చులలో కొంత భాగంకూడ ఇండియాపేర ఖర్చురాయడం జరిగింది.

"భారతదేశం నెత్తిన వేయడానికి ఏదోసాకు కల్పించి తోశారు. ఇది ఊహించ వీలులేనంత విచిత్రంగా ఉంది. సైనికుల కుట్రకైన

ఖర్చులు, కంపెనీ తనహక్కులను బ్రిటిషు ప్రభుత్వానికి అప్పగించేందుకు అయిన ఖర్చులు, చైనా, అబిసీనియాలలో ఒకేసారి జరిగిన యుద్ధ ఖర్చులు, ఇలా భారతదేశంతో ఏకించిత్ అతిమాత్రసంబంధమున్నా లండన్ ఖర్చుల్లో ప్రతిష్ఠా మొదలుకొని ఇండియా ఆఫీసులోని పనిమనిషి ఖర్చు వరకూ ఇండియాపేరనే ఖర్చువ్రాశారు. యుద్ధంలో పాల్గొనకున్నా అసలు వెళ్ళితేచాలు అనేకలక్షయిన ఖర్చు అలా వెళ్ళేందుకుముందు ఇంగ్లాండులో భారతసేనలకు ఆరునెలలు శిక్షణ నివ్వడానికైన ఖర్చు—ఇవన్నీ వీనితో ఏమాత్రం సంబంధంలేని భారతదేశపు రైతునెత్తిన వేశారు.

టర్కీసుల్తాను 1868 లో ప్రభుత్వ పక్షంగా లండనుకు వచ్చాడు. ఆయనకు సన్మానం ఇండియా ఆఫీసులో ఏర్పరచారు అందుకయ్యే ఖర్చులు భారతదేశం ఇచ్చుకోవలసి వచ్చింది. ఈలింగులో ఉన్న పిచ్చాసుపత్రికి, జాంజిబారు రాయబారవర్గసభ్యులకిచ్చిన బహుమతులకు, చైనా, పర్షియాలలోని బ్రిటిష్ రాయబారిసిబ్బందికీ, మధ్యధరా సముద్ర నౌకాబలం శాశ్వత ఖర్చులలో కొంత భాగానికీ ఇంగ్లాండునుండి ఇండియాకు వేసిన టెలిగ్రాఫ్‌దారికి, 1870 కు ముందు భారతదేశం ఖజానాపేర ఖర్చువ్రాశారు భారతదేశపు పన్నులు, బ్రిటిషు ప్రభుత్వ పాలనలోని మొదటి 13 సంవత్సరాల్లో 3 కోట్ల 30 లక్షల పౌనులనుండి 5 కోట్ల 20 లక్షలకు పెరిగాయి. కాని అదేసమయంలోనే 1866 నుండి 1870 వరకు పేరుకుపోయిన (deficits) కొరత 1 కోటి15 లక్షలు. 1857—60 లలో ఇంగ్లాండు అప్పు 3కోట్లు ఏర్పడింది. అది-వరుసగా పెరుగుతూ వచ్చింది. భారతదేశపు లెక్కలలో, చట్టపు తంతులలో చూపిన చలాకీకి, బ్రిటిషు రాజ్యాంగవేత్తలు ఆర్థికశాస్త్ర నిపుణులని, లెక్కలలో మేధావులని పేరు వచ్చింది."

(యల్. హెచ్ జెంకిన్స్, "బ్రిటిషు పెట్టుబడి ఎగుమతి" పుట 223—24)

ప్రభుత్వసహాయంతో, ప్రయివేటుకంపెనీలకు హామీ ఇవ్వడంతో రైల్వే నిర్మాణం తొలుత ప్రారంభమైంది. తర్వాత ప్రభుత్వమే సరాసరి కట్టడం ఆరంభించింది వీనిద్వారా అప్పు విపరీతంగా పెరిగింది. అప్పుడవలంబించిన పద్ధతి ఇది రైల్వేకట్టడాలకు బ్రిటిష్ పెట్టుబడిదారులు ఎంత డబ్బైనా పెట్టుబడి పెట్టనీ, ఆ మొత్తాని కంతటికీ నూటికి 5 రూపాయల వడ్డీకి ప్రభుత్వం హామీ నిచ్చింది. ఖర్చులు మరీ దుబారాగా ఇష్టంవచ్చినట్టు చేయడానికి ఈపద్ధతి దోహదమిచ్చిందనేది స్పష్టమే 1872లోవేసిన 6 వేలమైళ్ళ రైలు బాటలకు, 10 కోట్ల పౌనులు ఖర్చయింది అంటే మైలుకు 16000 పౌనులు ఖర్చయింది రైల్వేలెక్కల ప్రభుత్వపు ఆడిటర్, పార్లమెంటువేసిన భారతదేశపు రైల్వే లెక్కల విచారణకమిటీముందు (1872) ఇలాసాక్ష్యమిచ్చాడు. "వారి ఖర్చును ఎక్కువ కంట్రోలు చేయవలసిన పనిలేదని ఒక పెద్దమనిషి ఒడంబడిక ఉండినది....లెక్కలు తయారుచేసే వరకు, ఖర్చుపెట్టిన డబ్బుగూర్చి ఏమీతెలీదు.

అదే విచారణలోనే భారతదేశంలోని మాజీ ఆర్థికమంత్రి డబ్ల్యు. యస్. మాసే ఇలా చెప్పాడు.

"విపరీతంగా డబ్బును వెదజల్లారు. కంట్రాక్టర్లకు డబ్బు పొదుపుగా ఖర్చుపెట్టాలనే ఉద్దేశమేలేదు. చాలవరకు ఈడబ్బు ఇంగ్లీషు పెట్టుబడిదారులనుండి వచ్చేది. ఆమొత్తానికి నూటికి అయిదురూపాయిల వడ్డీని భారతదేశపు పన్నులలోనుండి ఇస్తామన్న ప్రభుత్వం హామీ వున్నంతవరకు తనడబ్బును హూగ్లీలో పడవేసినా ఇటుకరాళ్ళు కంకరగా మార్చివేసినా ఆ పెట్టుబడిదారులకు అవసరంలేదు....ఇంత విపరీతంగా దుబారా ఖర్చులతో జరిగినపనులు ఇంకెప్పుడూ జరిగివుండవనుకుంటాను."

19 వ శతాబ్ది ఆఖరువరకు రైల్వేలమీద పెట్టిన ఖర్చు 22 కోట్ల 60 లక్షల పౌనులు. ఈఖర్చువల్ల లాభమేమీరాలేదు. పైగా 4 కోట్ల పౌనులునష్టం భారతదేశపు బడ్జెట్‌పై పడింది. ఆశతాబ్ది తర్వాత రైల్వేలనుండి లాభం రాసాగింది. 1943-4 వరకు రైల్వేల స్టెర్లింగుఋణం మార్చినప్పుడు దాదాపు 1 కోటి పౌనులు ఏటా డబ్బు (1933-4 లో 97 లక్షల పౌనులు) ఇండియానుండి ఇంగ్లాండుకు రైల్వే ఋణానికిగాను తీసుకున్నారు.

రైల్వే నిర్మాణంవల్ల తేయాకు, కాఫీ, రబ్బరుతోటల పెరుగుదలవల్ల మరికొన్ని చిన్నవ్యాపారాలవల్ల బ్రిటన్ పెట్టుబడిదారుల వ్యక్తిగత పెట్టుబడి 19 శతాబ్ది చివరిభాగంలో భారతదేశంలో పెరుగజొచ్చింది.

కంపెనీ గుత్తవ్యాపారం అడ్డంకి తొలగగానే, అదే సమయంలో బ్రిటిష్ ప్రైవేటు బ్యాంకులుకూడ భారతదేశంలో పెరిగాయి 1876 నాటి ప్రెసిడెన్సీ బ్యాంకుల చట్టం ప్రభుత్వ రక్షణక్రింద మూడుప్రెసిడెన్సీ బ్యాంకులను ఏర్పరచింది. 1921 లో ఇవన్నీ కలిసి ఒకబలిష్టమైన 'ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా'గా ఏర్పడింది. భారతదేశం వెలుపల ఏర్పడిన బ్యాంక్ ఆఫ్ ఇండియా, చైనా, ఆస్ట్రేలియా అనే మారకపు బ్యాంకులు 1853 లో ప్రభుత్వ అనుమతి పొందాయి. అదే సంవత్సరం అనుమతిపొందిన ఒక బ్యాంకులోనుండి ఏర్పడిన మర్కెంటైల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా. 1854 లో ఏర్పడిన నేషనల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, హాంకాంగ్ అండ్ షాంగై బ్యాంకింగ్ కార్పొరేషన్ (1867 లో స్థాపితం.) ఇవన్నీ భారతదేశంలో ప్రెసిడెన్సీ బ్యాంకులతోపాటు దేశీయ ఆర్థిక, వాణిజ్య పరిశ్రమలపై బ్రిటిష్ కంట్రోలుతో అధికారం చలాయిస్తూ పనిచేయసాగాయి. ఇండియన్ జాయింట్ స్టాక్ బ్యాంకులు, పై బ్యాంకుల ఆధిపత్యాన్ని ఎదుర్కోవాలని ముందుకు వచ్చాయి. కాని, విదేశబ్యాంకులకున్న సౌకర్యాల మూలంగా భారత బ్యాంకులు పురోగమించలేకపోయాయి. 1913 నాటికి ఈ విదేశ బ్యాంకులు (ప్రెసిడెన్సీ బ్యాంకులు, మారకపు బ్యాంకులు కలిసి) మొత్తం బ్యాంకు డిపాజిట్లలో నాలుగింట మూడోవంతును తమచేత నుంచుకున్నాయి భారతదేశపు జాయింట్

స్వాకు బ్యాంకులు డిపాజిట్ల మొత్తంలో భాగోపంతుకన్నా తక్కువ మాత్రమే ఆకర్షించగల్గాయి.

1911 లో రాయల్ స్టాటిస్టికల్ సొసైటీముందు సర్ జార్జిపైష్ ఒకవ్యాసం చదివాడు. దాని ప్రకారం 1909—10 నాటికి భారతదేశం, సిలోనులలో బ్రిటిషు వారు పెట్టిన పెట్టుబడి మొత్తం 36 కోట్ల 50 లక్షల పౌనులని ఆయన అంచనా వేశాడు. (ఇందులో కంపెనీలుగాక. లిఖిత సాక్ష్యం దొరకని ఇతర వ్యక్తిగత పెట్టుబడి చేరలేదు ) ఈపెట్టుబడి క్రిందిరీతిగా పెట్టబడింది.

(రాయల్ స్టాటిస్టికల్ సొసయిటీ జర్నల్, వాల్యూం 74, భాగం 1, 1911, జనవరి 2, 186 పుట)

| | పౌనులు |
|---|---|
| ప్రభుత్వం, మునిసిపాలిటీలు | 1825 లక్షలు |
| రైల్వేలు | 1365 లక్షలు |
| తోటలు (తేయాకు, కాఫీ రబ్బరు) | 242 లక్షలు |
| ట్రాములు | 41 లక్షలు |
| గనులు | 35 లక్షలు |
| బ్యాంకులు | 34 లక్షలు |
| నూనె | 32 లక్షలు |
| వ్యాపారం, పరిశ్రమలు | 25 లక్షలు |
| బ్యాంకులు, భూములు, పెట్టుబడి | 18 లక్షలు |
| ఇతరం | 33 లక్షలు |
| | 36 500 లక్షలు |

ఈపట్టీ చాల సంగతులను మనకు బోధిస్తుంది. భారతదేశంలోని బ్రిటిషు పెట్టుబడి లేదా "పెట్టుబడి ఎగుమతి" అని పిలవబడే ఈ మొత్తం, ఆదేశంలో ఆధునిక పరిశ్రమల అభివృద్ధికి ఏమాత్రం పెట్టలేదని పైపట్టీవల్ల మనం తెలుసుకోవచ్చు. 1914 ముందు పెట్టిన నూటికి 92 పాళ్ళు బ్రిటిష్ పెట్టుబడి, రవాణా దారులు, తోటలు, బ్యాంకులు వీనికేపెట్టారు-అంటే భారతదేశంలో బ్రిటిష్ వర్తక వ్యాప్తికి, ఆదేశాన్ని ముడిసరుకులకు ఆధారంగా, బ్రిటిష్ వస్తువులకు మార్కెట్టుగా ఉపయోగించుకొనేందుకు సహాయకారిగా మాత్రమే ఉపయోగించారు కాని, ఆపెట్టుబడికి పరిశ్రమాభివృద్ధితో ఏమాత్రం సంబంధంలేదు.

సర్ జార్జిపైష్ వేసినఅంచనా చాల తక్కువే. తెలియనివెన్నో ఆయన వదిలివేశాడు. ఇంకొకరిఅంచనా ప్రకారం 1914 కు ముందు ఇండియాలో బ్రిటిష్ పెట్టుబడి 45 కోట్లు పౌనులు ("హెచ్ ఇ. హోవార్డు, భారతదేశం-బంగారుస్థాయి" 1911) మరొకరు 47 కోట్ల 50 లక్షలని అంచనావేశారు. (ఎకనామిస్టు పత్రిక ఫిబ్రవరి 20, 1909 లో "విదేశాలలో మన పెట్టుబడి" అనే వ్యాసం.)

## 2. భారతదేశము - బ్యాంకుల పెట్టుబడి

ఇలాగా బ్యాంకులపెట్టుబడి పీడనకు భారతదేశంలో పునాది, మొదటి ప్రపంచయుద్ధానికిముందే వేయబడింది. కాని ఆ పీడన తర్వాతి కాలంలోనే సమగ్రస్వరూపాన్ని పొందింది.

అంతకుముందే ఉన్న పారిశ్రామిక పెట్టుబడి వ్యాపారపరిస్థితులలోనుండి జనించిన బ్రిటిష్‌బ్యాంకులపెట్టుబడి నూతన పీడన, తొలినుంచీవ్యాపారానికి ఈ పెట్టుబడిని సహాయకంగా మాత్రమే, పెట్టారే గాని వ్యాపారాన్ని వదిలివేసి ఆ స్థానంలో ఈ పెట్టుబడిని పెట్టలేదు. ఈ అంశం పెట్టుబడి ఎక్కడెక్కడ ఉంచారో సర్ జార్జి పైష్ వివరణనుబట్టి స్పష్టపడుతుంది. అయినప్పటికీ ఈ పెట్టుబడి దామాషాలో జరిగిన అభివృద్ధి నూతనదశకు స్పష్టమైన సూచనగా కనిపిస్తుంది.

బ్రిటిష్ 19 వ శతాబ్ది పారిశ్రామిక ప్రాబల్యం, ప్రపంచ మార్కెట్టుపై ఉన్న ఆధిపత్యం 19 వ శతాబ్ది నాలుగోపాదంలో దుర్బల పడజొచ్చింది ప్రపంచంలోని ఇతరభాగాల్లో నూతనయూరోపు అమెరికా పోటీదార్లవల్ల ఈ శిధిలదశ స్పష్టంగా కనిపించింది, భారతదేశంలోమట్టుకు నిదానంగా ఈవ్యాపార ప్రాబల్యం తగ్గజొచ్చింది. ఎందుకంటే రాజకీయాధికారం చేతిలోఉండడంవల్ల భారతదేశంలో గట్టిగా బ్రిటన్ గుప్పిలివదలకుండా పట్టుకుంది. 1914 వరకుకూడ భారతదేశంలోని మార్కెట్టులో మూడులో రెండువంతులు మిగతా ప్రపంచానికంతకూ వ్యతిరేకంగా బ్రిటన్ తనచేత ఉంచుకోగలిగింది. అయినా భారతదేశంలోకూడ బ్రిటిష్ వ్యాపార ప్రాబల్యం మెల్లమెల్లగానే 19 వ శతాబ్ది మూడో పాదంనుండీ క్షీణించ నారంభించింది.

1874 నుండి 1879 వరకూ భారతదేశపు దిగుమతులలో నూటికి 82 వంతులు బ్రిటనుసే. ఇదికాక 11 వంతులు మిగతా తన సామ్రాజ్యదేశాలకు పంపేది. భారతదేశపు మార్కెట్టులో ఒకటిలో 14 వ వంతుమాత్రం బయట ప్రపంచంచేతిలో నుండేది. 1884-89 లలో ఈబ్రిటన్ చేతిలోనున్న 82 వంతులు 79 వంతులకు తగ్గిపోయింది. 1899-1904 లకు 66 వంతులకు, 1909-14 లకు 63 వంతులకు పడిపోయింది.

అదేసమయంలో పెట్టుబడికి వచ్చేవడ్డీలు, స్వదేశఖర్చులకని ఇంగ్లాండుకు పంపేడబ్బు క్రమంగా పెరగజొచ్చింది. బ్రిటన్‌కూ ఇండియాకూ మధ్య 1913-14 లలో జరిగిన మొత్తం వ్యాపారం 11 కోట్ల 70 లక్షల పౌన్లు; సరుకులన్నిటిమీద- అవి బ్రిటన్‌నుండి ఎగుమతయినా, ఇండియానుండి ఎగుమతయినాసరే-నూటికి పది వంతులు వర్తకలాభం వేసుకుంటే అది 120 లక్షలపౌన్లు అవుతుంది. ఇందుతో పాటు. బ్రిటన్‌నుండి ఎగుమతైన వస్తువులపై పారిశ్రామికుల లాభం నూటికి 10 వంతులు వేసుకుంటే (780 లక్షల పౌన్లమీద 80 లక్షలపౌన్లు) నౌకలవల్ల లాభం 80 లక్షలు వేసుకుంటే (బోర్డుఆఫ్ ట్రేడ్ విచారణనుబట్టి బ్రిటన్ మొత్తం

నౌకల లాభంలో 1913 లో 140 లక్షల పౌన్లు. అందులో భారతదేశానికి 39 వంతులు వచ్చింది ) బ్రిటిష్ వర్తకంవల్ల, పరిశ్రమలు నడపడంవల్ల, నౌకలవల్ల 1913 లో భారతదేశంనుండి సంపాదించిన లాభం 2 కోట్ల 80 లక్షలు ఉంటుంది.

కాని భారతదేశంలోని బ్రిటిష్ పెట్టుబడి 1911 కు హెచ్. ఇ. హోవార్డు "భారతదేశం, బంగారు స్థాయి" అన్న పుస్తకంలో వేసిన అంచనా ప్రకారం 45 కోట్లు. అది 1914 లో యుద్ధప్రారంభసమయానికి 50 కోట్లు అయిఉంటుందని నమ్మబడుతున్నది. ఈ మొత్తంపై సగటున నూటికి 5 వంతులు ఎంత తక్కువనుకున్నా వడ్డీ అవుతుంది. అదే 2 కోట్ల 50 లక్షలు అవుతుంది ఇందుతోపాటు భారతదేశంలోని వర్తకేతర కంపెనీల లాభాలు (తేయాకు, రబ్బరు, కాఫీతోటలు, బొగ్గుగనులు, జనుము మొదలగునవి సామాన్యంగా నూటికి 50 కూడ డివిడెండులు పంచుతూవచ్చాయి ) దామాషాప్రకారం కలపాలి. అదిగాక బ్యాంకుల కమిషన్లు, మారకం లాభాలు, మిగత బ్యాంకు ఆదాయాలు, భీమాలు ఇవన్నీ చేర్చాలి ఇవన్నీ ఎంత తక్కువగా వేసినా 1 కోటి 50 లక్షలు; ఇవన్నీ కలిపితే నికరంగా 4 కోట్లు వస్తుంది. అదేసమయంలో అప్పుమీద వడ్డీకాక స్వదేశఖర్చులు (హోమ్‌ఛార్జెస్) మాత్రమే 1913-14 కు 90 లక్షల పౌన్లకు పెరిగింది. ఈ మొత్తం పెట్టుబడి మీద వచ్చేలాభాలు, సరాసరి లాగే కప్పమూ కలసి దాదాపు 5 కోట్లవుతుంది.

ఈ అంచనాలన్నీ పరిమితమైన ఉపయోగం కలవి, ఊరికే తారతమ్య పరిశీలనకు మాత్రమే పనికివస్తాయి. కాని 1914 కల్లా పెట్టుబడిపై లాభాలూ కప్పమూ కలిసి, వర్తకం, మిల్లులు, నౌకా లాభాలకన్నా భారతదేశంనుండి ఎక్కువ వచ్చిందని మాత్రం స్పష్టం. ఇలా భారతదేశంలో బ్యాంకుల పెట్టుబడి దోపిడీ, 20 వ శతాబ్దిలో ప్రధాన లక్షణంగా ఏర్పడింది

1914-18 యుద్ధమూ, తర్వాతి కాలమూ ఈ దోపిడీని మరింత త్వర త్వరగా పెంచింది. భారతదేశపు మార్కెట్టులో బ్రిటన్ భాగం మూడోవంతుకు ($\frac{1}{3}$) పడిపోయింది. సుంకాలు, సామ్రాజ్యదేశాలకున్న సౌకర్యాలూ ఎన్ని ఉన్నా జపాను, అమెరికా, కోలుకున్న జర్మనీల పోటీ పెరిగింది. ఎన్నో ఇబ్బందులు, డబ్బు కష్టాలూ ప్రభుత్వ ఆటంకాలూ ఎన్ని ఉన్నప్పటికీ ముఖ్యంగా చిన్న పరిశ్రమలలో భారతదేశ పారిశ్రామికోత్పత్తి పురోగమించింది. ముఖ్యంగా 1914 కు ముందు బహిరంగంగా ప్రభుత్వం పెడుతున్న ఆటంకాలు యుద్ధానంతరం కూడ మరింత ప్రచ్ఛన్నరూపంగా కొనసాగాయి అయినా భారత పరిశ్రమల ఉత్పత్తి పెరిగింది.

1913-1931-32 ల మధ్య భారతదేశపు దిగుమతులలో బ్రిటిష్ భాగం 64 వంతులనుండి 35 వంతులకు పడిపోయాయి. తర్వాత భారతీయు లెంత అసమ్మతి తెల్పినా ఒటావా పక్షపాత నిబంధనలు రుద్దడంతో, 1934-35 కు ఈ భాగం 40.6 కు పెరిగింది; కాని తర్వాత 1935-36 లో 38.8% కు, 1936-

37 లలో నూటికి 38.5 కు పడిపోయింది. జపాను భాగం 1913-14 లో నూటికి 2 6 వంతులున్నది. 1935-36 లకు నూటికి 16.3 వంతులకు హెచ్చింది; జర్మనీ భాగం అదే సమయంలో నూటికి 6.9 నుండి 9.6 వంతులకు పెరిగింది; అమెరికా భాగం నూటికి 2.6 నుండి 6.7 కు పెరిగింది.

(ఎకనమిస్టు, ఫిబ్రవరి 13, 1937)

తర్వాతి లెక్కలు తీసేందుకు 1937 లో బర్మాను భారతదేశంనుండి వేరుపరచడంవల్ల కొంత ఇబ్బంది ఏర్పడింది భారతప్రభుత్వపు ఆర్థికసలహాదారు ఏటా ప్రకటించే "భారతదేశ వర్తకపరామర్శ"లో భారతదేశపు మార్కెట్టులో (బర్మావదలి) ఎవరెవరికి ఎంతెంత భాగముందో వివరింపబడింది:

## భారతదేశపు దిగుమతుల్లో భాగాలు

(నూటికి)

| | 1935-36 | 1937-38 | 1939-40 |
|---|---|---|---|
| బ్రిటన్ | 31.7 | 29.9 | 25.2 |
| బర్మా | 17.5 | 14.9 | 19 0 |
| జపాన్ | 13.0 | 12 8 | 11 7 |
| జర్మనీ | 7.9 | 8.8 | 4 0 |
| అమెరికా | 5.6 | 7.4 | 9 0 |

రెండోయుద్ధసమయంలో భారతదేశ వర్తకంలో పెద్దమార్పువచ్చింది. శత్రుదేశాలలో వ్యాపారం నిలచిపోవడంవల్ల, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, మధ్యప్రాచ్యదేశాల—ఇరాన్, అరేబియా, ఇరాక్, టర్కీ, ఈజిప్టు వగైరాల—వ్యాపారం బాగాపెరిగింది. "1942-43 లో భారతదేశ వ్యాపారపరామర్శ" ఈక్రింది లెక్కలు ఇచ్చింది. భారతదేశపు దిగుమతుల్లో బ్రిటన్ భాగం 1942-43 లో నూటికి 26.8 వంతులు (1939-40 లో నూటికి 25 2 వంతులు); అమెరికా భాగం 17.3 వంతులు (1939-40 లో 9.0 వంతులు); కనడా 5 0 వంతులు (1939-40 లో నూటికి 0 8 వంతులు); ఆస్ట్రేలియా 2.9 వంతులు (1939-40లో 1.4 వంతులు) మధ్యప్రాచ్యదేశాలు (ఈజిప్టు తప్ప) 20.2 వంతులు (1939-40లో 2 9 వంతులు) ఈజిప్టు భాగం 1942-43 లో నూటికి 7 4 వంతులు.

ఇప్పటికీ బ్రిటన్ సింహభాగమే అనుభవిస్తూంది—తన పోటీ దారులందరి భాగం కలిపినా తనంతలేదు. కాని ఈసింహభాగం చాలపరిమితమైపోతూ ఉంది. ఈసింహం విదేశ-భారతీయ పోటీల నెదుర్కొని కోరలను మరీ కదిలించ వలసి వస్తున్నది లేకపోతే తన భాగం ఉండేట్లులేదు. 1936 నుండి భారత దేశం (బర్మాతో కలిపినా) శతాబ్దినుండీవున్నట్లు బ్రిటను మొదటి ఖాతాదారుగా ఇప్పుడు లేదు. 1937 లో రెండోస్థానానికి, 1938 లో మూడోస్థానానికి పడిపోయింది.

1918 తర్వాత భారత దేశపు మార్కెట్టులో బ్రిటను భాగమిలా తగ్గిపోవ

దానికి, ముఖ్యంగా 19 వ శతాబ్ది పారిశ్రామిక పెట్టుబడి పీడనకు కారణమైన బట్టల ఎగుమతి పడిపోవడమే కారణం. పరిశ్రమలు, వ్యాపార విషయంలో విచారణ జరిపిన బల్ఫోర్ కమిటీ ఈ సంగతిని కనుక్కొన్నది. 1913–23 ల మధ్య బ్రిటనునుండి భారతదేశానికి వస్తున్న బట్టలు నూటికి 57 వంతులు తగ్గిపోయాయి. 1913 లో ఈ ఎగుమతులు 30570 లక్షల గజాలు—లాంకషైర్ మొత్తం ఎగుమతులు 70750 గజాలలో దాదాపు సగం—అది 1928 కి 1,45,20 లక్షల గజాలయింది. 1939–40 ల నాటికి 1440 లక్షల గజాలయింది. 1942-43 నాటికి బ్రిటన్‌నుండి భారతదేశానికి దిగుమతయిన గుడ్డలు కేవలం 110 లక్షల గజాలు మాత్రమే.

కాని ఇలా పాతపునాది కూలిపోతుంటే, మరోవైపు బ్యాంకుల పెట్టుబడి పీడనద్వారా లాభాలు పెరుగుతూ వచ్చాయి. 1929 నాటికి భారత దేశంలోని బ్రిటిషు పెట్టుబడి మొత్తాన్ని బొంబాయి వాణిజ్యమండలి మాజీకార్యదర్శి శాయేర్ "ఫైనాన్షియల్ టైమ్సు" పత్రికలో అంచనా వేశాడు. ఎంత తక్కువనుకున్నా 57.30 లక్షల పౌనులుంటుందని, బహుశా 70 కోట్లు ఉండవచ్చునని ఆయనన్నాడు. ఆయన ఆ పెట్టుబడి ఇలా ఉందని చెప్పాడు:

| | |
|---|---|
| ప్రభుత్వం స్టెర్లింగు అప్పులు | 2610 లక్షలు |
| గ్యారంటీ ఇచ్చిన రైల్వే అప్పు | 1200 లక్షలు |
| 5% యుద్ధఋణం | 170 లక్షలు |
| ఇండియాలో రిజిస్టరయిన కంపెనీల పెట్టుబడి | 750 లక్షలు |
| ఇండియా వెలుపల రిజిస్టరయిన కంపెనీల పెట్టుబడి | 1000 లక్షలు |

భారతదేశంలో పనిచేస్తున్న కంపెనీలకు 1750 లక్షలని వేయడం చాల తక్కువఅంచనా. పెట్టుబడులన్నిటి మొత్తం 70 కోట్ల పౌనులనడంలో బహుశా చాలతేడాఉండదు. ఇంకా ఆయనిలా అన్నాడు:

"భారత దేశంలో మన పెట్టుబడి ప్రాముఖ్యాన్ని ఏకొందరో విజ్ఞులుమాత్రం పూర్తిగా గ్రహించారనవచ్చును. ఆ పెట్టుబడివ్యాప్తిని గూర్చిగాని, ఆధిక్యాన్నిగూర్చిగాని చాలమందికి తెలియదు. వ్యాపారంతో ప్రత్యక్షసంబంధంగల చాలమంది వర్తకులు, బ్యాంకర్లు, పరిశ్రమల యజమానులు ఏదో సరాసరిగా పెట్టుబడి ఇంతవుంటుందని లెక్కవేయడానికి కూడ ఇబ్బంది పడుతున్నారు. భారతదేశంలోనికి అనేక రూపాలతో విదేశ పెట్టుబడి ప్రవేశిస్తుండడంవల్ల ఏఅంచనావేసినా వట్టి ఊహామాత్రంగానే ఉంటుంది."

("ఫైనాన్షియల్ టైమ్సు" జనవరి 9, 1930.)

ఇటీవల వేసిన అంచనాలలో, సరికొత్త అంచనా 1933 లో భారతదేశంలోని బ్రిటిష్ సంయుక్త వాణిజ్యమండలివారు వేశారు. వారి అంచనా ప్రకారం మొత్తం పెట్టుబడి పౌ. 100 కోట్లు. అందులోని విభాగాలివి: ప్రభుత్వం

స్టెర్లింగు ఋణం 37 కోట్ల 90 లక్షలు; భారతదేశం వెలుపల రిజిస్టరై భారతదేశంలో వ్యాపారం చేస్తున్నట్టి కంపెనీల పెట్టుబడి, ఇండియాలోనే రిజస్టరైన కంపెనీలలో పెట్టుబడిరిల్వులు, మిగతా చిల్లరపెట్టుబడులు కలిసి పౌ 50 కోట్లు *

ఈ 100 కోట్ల పౌనులు, ప్రపంచమంతటా బ్రిటన్ పెట్టిన పెట్టుబడిలో నాలుగోవంతు ఉన్నది. మొత్తం బ్రిటిష్ విదేశపెట్టుబడులు-ప్రపంచమంతటా చేరి-400 కోట్లని అంచనా వేయబడింది. 1911 లో సర్ జార్జిపైష్ అంచనా వేసినప్పుడు, బ్రిటిష్ విదేశ పెట్టుబడి మొత్తంలో భారతదేశంలో నూటికి 11 వంతులున్న దన్నాడు.

ఇలా 11 వంతులనుండి 25 వంతులకు, 1 లో 9 వ భాగంనుండి నాలుగోభాగానికి పెరగడంచూస్తే, బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడిదారీ విధానానికి భారతదేశ ప్రాముఖ్యత నేడెంత హెచ్చిందో బోధపడుతుంది భారతదేశంలోని బ్రిటిష్ పెట్టుబడి రక్షణకు తగిన బందోబస్తు చేసుకోవడమే నేటి సామ్రాజ్యవాద విధానానికి పరమావధిం

నూతన సామ్రాజ్యవాద పీడనా పద్ధతులతో భారతదేశంనుండి ఇంగ్లాండు గుంజుతూన్న మొత్తం ధనమెంత వుంటుందని భారతదేశ ఆర్థిక శాస్త్రజ్ఞులైన కె. టి. షా, కె, జె. ఖంబతాగారలు "భారతదేశ సంపత్తి-పన్నులు మోసేశక్తి" అన్నపుస్తకం 1924 లో ప్రకటించారు. అందులో పై మొత్తాన్ని వారు అంచనా వేసేందుకు ప్రయత్నించారు. 1921-22 సంవత్సరం లెక్కలలో దొరికినవాటిమీద ఆధారపడి ఈక్రింది నిశ్చయానికి వచ్చారు. (స్టెర్లింగుమారకం అప్పటి 1921-22 రూపాయకు 1 షి. 4 పెన్నీలనే ప్రకారం ఈక్రింది లెక్కలు తయారుచేశారు )

**భారతదేశంనుండి, బ్రిటనుకూ విదేశాలకూ ఏటా వెడుతున్న ధనం**

| | 1921—22 | |
|---|---|---|
| | లక్షరూ లు | లక్షపౌ.లు |
| రాజకీయ తీపివేతలు లేదా ఇంగ్లాండు వ్యయం | 5000 | 333 |

* ఇంతవరకు భారతదేశంలోని విదేశపెట్టుబడికి సరియైన లెక్కలు దొరకడంలేదు. "స్టాటిస్టికల్ ఆబ్‌స్ట్రాక్టుఫార్ బ్రిటిష్ ఇండియా" (బ్రిటిష్ ఇండియా లెక్కలపత్రి) ప్రకారం: భారతదేశం వెలుపల రిజిస్టరై బ్రిటిష్ ఇండియాలో పనిచేస్తున్న జాయంట్ స్టాక్ కంపెనీల paidup పెట్టుబడి 1938-39 లో పౌ 74,11 లక్షలు, ఇందులో భారతప్రభుత్వపు స్టెర్లింగు ఋణం, ఇండియాలో రిజస్టరైన విదేశ కంపెనీల రూపాయల పెట్టుబడి చేరలేదు. అయినప్పటికీ, 1912 సంవత్సరంతో పోల్చిచూస్తే, 26 ఏళ్ళలోను భారతదేశంలోని స్టెర్లింగు పెట్టుబడి 66 కోట్ల 76 లక్షల పౌనలు హెచ్చింది 1918-19 తర్వాత 26 కోట్ల 80 లక్షల పౌన్లు హెచ్చింది. బాంకింగు లోన్ కంపెనీల పెట్టుబడి 1918-19 లలో 2 కోట్ల 85 లక్షల పౌనులనుండి, 1938-39 నాటికి 9 కోట్ల 62 లక్షల పౌనులకు హెచ్చింది. వర్తక, పరిశ్రమల కంపెనీల పెట్టుబడి 20 కోట్ల 54 లక్షల పౌనులనుండి ఆ కేకాలంలో పౌ. 34 కోట్ల 49 లక్షలకు పెరిగిపోయింది.

| | | |
|---|---|---|
| భారతదేశంలో రుణస్థిరయిన విదేశపెట్టుబడికి వడ్డీలు | 600 | 400 |
| విదేశకంపెనీల వస్తువుల, మనుష్యుల చార్జీలకిచ్చినడబ్బు | 4163 | 277 |
| బ్యాంకింగు కమీషన్లకు ఇచ్చింది | 1500 | 100 |
| భారతదేశంలోని విదేశ వ్యాపార లాభాలు, ఉద్యోగుల లాభాలు | 5325 | 355 |
| మొత్తం | 219,68 | 1465 |

ఇలా కూడిన మొత్తం దాదాపు 220 కోట్ల రూపాయలు లేక 1500 లక్షల పౌన్లు. బ్రిటనులోని ప్రతి పౌరునికి సగటున దామాషా 3 పౌన్ల చొప్పున పడుతుంది. ఆ అంచనావేసిన సంవత్సరంలో బ్రిటనులోని ప్రతి అధిక లాభాలపన్ను కట్టేవారికి దాదాపు 1,700 పౌనులు దామాషా పడుతుంది

1921-22 లలో ధరలు పూర్తిగా పడిపోయింతర్వాత, సర్ యమ్ విశ్వేశ్వరయ్య 1934 లో ప్రకటించిన "భారతదేశానికి ప్లానింగు" అన్న పుస్తకంలో బ్రిటన్‌కు భారతదేశం పంపుతున్న డబ్బును అంచనా వేశాడు ఆయన అంచనాఫలితమిది. (ఇప్పటి మారకపు రేటు రూపాయకు 1 షి 6 పెన్నీల ప్రకారం లెక్కవేయబడింది.)

| | లక్షల రూ. | లక్షల పౌ. |
|---|---|---|
| బ్రిటన్ ఇతర విదేశ నౌకారవాణా | 3500 | 260 |
| విదేశబ్యాంకులకువచ్చే మారకం, ఇతరకమిషన్లు | 2100 | 160 |
| భారత పరిశ్రమల్లో పనిచేస్తున్న బ్రిటిష్‌వారి లాభాలు, జీతాలు వగైరా | 4000 | 300 |
| ఇండియాలోని బ్రిటిష్ పెట్టుబడి వడ్డీలు | 6500 | 490 |
| మొత్తం | 16100 | 1210 |

ఈ అంచనాలో "పెన్షన్లు మొదలైన 'హోమ్‌ఛార్జెస్' భారత దేశంతో వర్తకంచేసే బ్రిటిషేతరులకు ఇవ్వవలసినవి చేరలేదు." అప్పుమీద వడ్డీగాక ఇతర హోమ్‌ఛార్జెస్ 1933-4 లో 1350 లక్షల పౌనులు కలిపితే మొత్తం 13 కోట్ల 50 లక్షల పౌన్లవుతుంది మరి భారతదేశంలో ధరలసూచిక (ఇండెక్సు) 1921 లో 238 నుండి 1933 కు 121 కి దిగిపోయింది. కాబట్టి ఈదృష్టితో సరిగా అంచనా వేస్తే ముందటి పదేళ్ళలోకన్నా ఇదెంత హెచ్చిందో అర్థమవుతుంది. ఏమైనా మిగతా చాలపద్దులకు సరైన లెక్కలులేవు. గనక ఈఅంచనా కేవలం సరాసరి సూచికమాత్రమే అవుతుంది.

సరికొత్తగా బ్రిటన్‌కువెళ్ళే భారతదేశధనంగూర్చి లారెన్సుకి రోసింగర్ తన నివేదికలో వ్రాశాడు దీనికి అమెరికా విదేశాంగవిధాన సమితివారు 1945 లో

"వలసఆశియా స్వతంత్రం-పశ్చిమ దేశాలకు వాయి అమ్ముకొంటున్నది." అన్న కరపత్రంగా ప్రకటించారు. రోసింగర్ లెక్కలనుబట్టి ఏటా పోయేధనం 13 కోట్ల 50 లక్షల పౌనులు. అందులో ఈ క్రింది పద్దులున్నవి.

| | |
|---|---|
| 67 కోట్ల పెట్టుబడికి పై బ్రిటిషు రేటు నూటికి 6,7,8 ప్రకారం వడ్డీ | పౌ॥ 460 లక్షలు |
| హోం చార్జెస్ | పౌ॥ 330 లక్షలు |
| వర్తకం | పౌ॥ 300 లక్షలు |
| నౌకలు | పౌ॥ 200 లక్షలు |
| ఇండియాలో పనిచేసే బ్రిటిషుఉద్యోగులుపంపేడబ్బు | పౌ॥ 60 లక్షలు |
| మొత్తం | పౌ॥ 1350 లక్షలు |

('హిందూస్తాన్ స్టాండర్డ్' కలకత్తా, జూలై 5, 1945)

ఖచ్చితంగా లెక్కవేయవీలులేని వివాదాస్పదమైన అంశాలను వదిలివేసినా, స్థూలంగా మన మింతమాత్రం తప్పకుండా నిర్ణయించవచ్చు. పాతకాలంలో కన్నా, ఆధునిక యుగంలో భారతదేశపు దోపిడీ చాలతీవ్రమయింది. ప్రభుత్వం ప్రత్యక్షంగా తీసుకొనేందుకు ముందు 75 ఏళ్ళలోనూ బ్రిటిష్ పాలనక్రింద భారత దేశంనుండి ఇంగ్లాండుకు వెళ్ళిన మొత్తం 15 కోట్ల పౌన్లు యుద్ధానికి పూర్వం 40 ఏళ్ళలోనూ మొత్తం ఏటా ఇంగ్లాండుకు ఇండియానుండి వెళ్ళే మొత్తం పౌ॥ 13 కోట్ల 50 లక్షలనుండి 15 కోట్ల పౌనుల వరకుండవచ్చునని అంచనా తేలింది. ఇలా బ్యాంకుల పెట్టుబడిదశలో భారతదేశపు దోపిడీ తీవ్రతరం కావడంవల్లనే నేటి సంక్షోభవిజృంభణ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా భారత దేశం తిరుగుబాటు కట్టలు తెగగొట్టుకొని ఉరకలు వేస్తున్నది

## 3. పరిశ్రమాభివృద్ధి సమస్య

ఈ బ్యాంకుల పెట్టుబడిదశలో ముఖ్యంగా 1914-18 లలో దోపిడీ తీవ్రమయినప్పటికి, పూర్వం స్వేచ్ఛా వ్యాపార పారిశ్రామిక పెట్టుబడిదశక్రింద పరిశ్రమల క్షీణదశ తొలగించి పారిశ్రామికాభివృద్ధికి బ్రిటిష్‌పాలన పనిచేసిందని అప్పుడప్పుడు కొందరు వాదించడం కద్దు. ఈ దృక్పథాన్ని సామ్రాజ్యవాదులు ప్రోత్సహిస్తుంటారు. భారతదేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేయడంలో తామేదో మహోదారభావంతో ప్రవర్తిస్తునట్లు నటిస్తారు. ఆధునిక సామ్రాజ్య వాదుల ప్రచారం భారతదేశాన్ని "ప్రపంచ పారిశ్రామిక ముఖ్యదేశాల్లో ఒకట"ని చాటడానికి ప్రయత్నిస్తున్నది. (జెనీవాలో 1922 లో పూర్తిగా తప్పుడు లెక్కలు

చూపి * బ్రిటిష్ ప్రభుత్వం ఇలా డంబాలు కొట్టింది. ఇదంతా అంతర్జాతీయ లేబర్ ఆఫీసు పాలకవర్గంలో మరొక స్థానం సంపాదించుకొనేందుకే)

కాస్తవివరంగా పరామర్శ చేసినట్లయితే ఈ దృక్పథం ఏమాత్రం సరికాదని అవగతమవుతుంది. ఆధునిక యుగంలో భారతదేశంలో కొంత పరిశ్రమల అభివృద్ధి జరిగినమాట వాస్తవమే. ఇది 1914 కు ముందూ తర్వాతాగూడా జరిగింది. కాని అదే సమయంలో ఇతర యూరోపుదేశాలలో జరిగిన పరిశ్రమాభివృద్ధితో ఏ మాత్రం సరిపోల్చగల స్థితిలో జరగలేదు ఆ జరిగిన అభివృద్ధికూడ ఆర్థిక—రాజకీయరంగాలలో బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడిదారీ విధానంతో పోరాడి ముందుకువచ్చినదే. అదికూడ అసమానపద్ధతిలో పెరిగింది. భారీపరిశ్రమల్లో తగిన అభివృద్ధిలేకుండా కేవలం మిగతా పరిశ్రమల్లోనే ఆ అభివృద్ధికాస్తా జరిగింది భారతదేశంలో ఇంకా సమగ్రపారిశ్రామికాభివృద్ధికి ప్రారంభం జరిగినట్లు చెప్పడానికేమీ సాధ్యం కాదని ఒకటో అధ్యాయంలో మనం చేసిన ప్రాథమికపరిశీలన వ్యక్తీకరించింది

1914 వరకు భారతదేశంలో పరిశ్రమలు పెంపొందించేందుకు సామ్రాజ్యవాదం బహిరంగంగా వ్యతిరేకించింది స్వాతంత్ర్యయుద్ధానికి ముందు అమెరికా వలసప్రాంతాల్లో బ్రిటన్ ఎలా ఉక్కు పరిశ్రమలు పెట్టకుండా పూర్తిగా నిషేధించిందో, అలాంటి విధానాన్నే 1914 యుద్ధసమయంవరకు భారతదేశంలోకూడ అవలంబించింది. 1914 యుద్ధంవరకు సర్ వాలంటైన్‌చిరల్ 1922 లో వ్రాసినట్లుగా "స్వదేశీ భారత పరిశ్రమలంటే ప్రభుత్వం మహాఅసూయ" చూపెట్టేది.

> "భారత ప్రరిశ్రమాభివృద్ధినిగూర్చి పూర్వం మనమనుసరిస్తూవచ్చిన విధానం అంత అభినందనార్హంకాదు. కేవలం యుద్ధావసరాల ఒత్తిడి మూలకంగానే స్వదేశ భారత పరిశ్రమలయెడల అవలంబిస్తూవచ్చిన అసూయాభావం కాకున్నా ఔదాసీన్యాన్ని ప్రభుత్వం వదులుకోవలసి వచ్చింది."
>
> (సర్ వాలెంటైన్‌చిరల్ 'అబ్జర్వర్' లో ఏప్రిల్ 2, 1922)

---

* భారత ప్రభుత్వ పక్షంగా లార్డు చెమ్స్‌ఫర్డు, 1922 అక్టోబర్‌లో నానాజాతి సమితిలో ఇలా ప్రకటించాడు:

ముఖ్య పారిశ్రామిక దేశాలు ఎనిమిదింటిలో తన్ను చేర్చమన్న భారతదేశ వాంఛ సమర్థనీయమైనది స్థూలంగా ఆ దేశం చెబుతున్నది. వివరంగా లెక్కలిచ్చి సమర్థించుకోనవసరంలేదు. ఆ దేశంలో పరిశ్రమల్లో జీవనం సంపాదించుకొనే జనసంఖ్య దాదాపు 2 కోట్లు ఉన్నట్లు అంచనా వేయవచ్చు" ఈ సంఖ్యలో ఎక్కువమంది చేతిపనులు, గృహపరిశ్రమల్లోనివారని అతను చెప్పలేదు. పదిమందికిపైగా పనిచేసే పరిశ్రమ వ్యవస్థల్లోని కార్మికులు 28 లక్షలున్నట్లు 1921 జనాభా లెక్కలు చెబుతున్నాయి. అందులో 10 లక్షలు తేయాకు, కాఫీ, రబ్బరు తోటల్లో పనిచేసేవారే కాని పరిశ్రమల కార్మికులు కారు. ఫ్యాక్టరీ చట్టంకింద వచ్చే కార్మికుల సంఖ్య కేవలం 18 లక్షలు మాత్రమే.

ఇలాగే 1921 లో ప్రభుత్వం సాలుసరి రిపోర్టు ఇలా వ్రాసింది :

"యుద్ధానికి కొన్నాళ్ళముందు భారత పరిశ్రమలను అగ్రగామి కర్మాగారాలద్వారా (Pioneer Factories) ప్రభుత్వ ధనసహాయంద్వారా ప్రోత్సహించే పద్ధతిని బ్రిటిష్ప్రభుత్వం విజయవంతంగా నిరుత్సాహపరిచింది."

("భారతదేశ నైతిక భౌతిక అభివృద్ధి" 1921, పుట 144.)

సర్ జాన్ హెవట్ 1907 లో యిలా ప్రకటించాడు :

"శాస్త్రీయ, పరిశ్రమలవిద్య గఱపాలనే సమస్య ఇరవయ్యేళ్ళుగా ప్రభుత్వం ముందర ప్రజలముందరవున్నది. ఈవిషయంమీద చేసిన ఉపన్యాసాలు, వ్యాసాలు, ఇంకావేటిమీదా చూడలేనంత ఎక్కువ జరిగాయి, కాని అవెంతఎక్కువో ఆచరణలో అంతతక్కువపని జరిగింది."

(సర్ జాన్ హెవట్, యు. పి. లెఫ్టినెంట్ గవర్నర్-భారత పరిశ్రమల మహాసభలో, 1907.)

1921 వ ప్రభుత్వపు సాలుసరి రిపోర్టులో భారత పరిశ్రమల అభివృద్ధిని "విజయవంతంగా నిరుత్సాహపరచడం" గూర్చి చెప్పిన సంఘటన ఎలా జరిగిందంటే 1905 లో లార్డు కర్జన్ తానే స్వయంగా వాణిజ్య పరిశ్రమల శాఖను నెలకొల్పాడు 1908 లో పరిశ్రమల డైరెక్టరును మదరాసు ప్రభుత్వం నియమించింది మద్రాసు పరిశ్రమల శాఖ చర్యలు "స్థానిక యూరపియన్ వర్తకుల్లో అసంతృప్తిని రేపింది ఆచర్యలు వ్యక్తిగత వ్యాపారానికి తీవ్రప్రమాద హేతువులని తనకు సంబంధించని విషయాల్లో ప్రభుత్వం అనవసరంగా జోక్యం తీసుకోవడమే ఇదనీ ఆవర్తకులు వ్యాఖ్యానం చేశారు." (భారత పరిశ్రమల కమీషన్ రిపోర్టు 1 పుట 70) 1910 లో పైశాఖ ప్రయత్నాలపై బ్రిటిష్ ప్రభుత్వం ఒకవ్రాతద్వారా విరుచుకపడింది ఆ పాడు రిపోర్టు వ్రాసినతను భారతరాజ్యాంగ కార్యదర్శి లార్డుమోర్లీ.

"రాష్ట్రంలో కొత్తపరిశ్రమలను స్థాపించేందుకు మదరాసు ప్రభుత్వం చేసిన ప్రయత్నాల సంగతులను పరిశీలించాను ఆ ప్రయత్నాలకు కావలసిన పనీ స్వదేశీ సరుకు తత్ఫలితంగా ఏర్పడవచ్చు కాని నా అనుమానాలను అవి పోగొట్టేటట్టులేవు. కేవలం పారిశ్రామిక విద్యాబోధనా హద్దులను దాటకుండా, వ్యాపారవ్యవస్థానాలుగా తయారుకాకుండా ఉంటే తప్ప, ఈ ప్రభుత్వ ప్రయత్నాలవల్ల ఉపయోగం ఉంటుందా అని నా సందేహం....వ్యక్తిగత వ్యాపారంతో జోక్యం కల్పించుకోకుండా ఉన్నంతవరకు కొత్తపరిశ్రమలగూర్చి, విధానాలగూర్చి సలహాలిచ్చే కేంద్రాలు పరిశ్రమల విషయపరిజ్ఞానశాఖలూ ఏర్పరచడానికి నేను ఆక్షేపించడంలేదు."

(లార్డు మోర్లీ, జూలై 29, 1910 వ్రాసిన జాబు)

ఈ లేఖవల్ల కలిగిన "దారుణ ఫలితాన్ని" ఇండియన్ ఇండస్ట్రియల్ కమిషన్ రిపోర్టు రికార్డు చేసింది. (పుట 4)

భారత పరిశ్రమాభివృద్ధిని నిరుత్సాహపరచేందుకు, ప్రభుత్వం ఏదో సాయపడ్డమో లేదా అన్నదికాదు, అసలు వాటిని అరికట్టేందుకు సుంకాల విధానం (టారిఫ్ పాలసీ) అమలు జరిపింది అతి దుర్బలంగా ఉన్న ఇండియా బట్టల పరిశ్రమ 1860-70 సంవత్సరాలలో అభివృద్ధి కానారంభించింది. వెంటనే ఇంగ్లాండులో ఆందోళన ప్రారంభమయింది దిగుమతి సుంకాలు గుడ్డలమీద కూడా ఉండేవి. ఆ సుంకాలను భారతదేశంలో తొలగించాలని ఆందోళన చేశారు. ఈ విషయంలో 1874 లో మాంచెస్టర్ వాణిజ్యమండలి ఒక పిటిషన్ను ప్రభుత్వానికి సమర్పించింది, 1871 లో కామన్స్ సభ ఒక తీర్మానం కూడా చేసింది ఈతీర్మానాన్ని భారత ప్రభుత్వానికి చర్య తీసుకోడానికి పంపుతూ లార్డు సాలిస్బరీ ఒక జాబు వ్రాశాడు అందులో అతను: "మరొక అయిదు మిల్లులు పనిచేయనున్నవి: అంటే 1877 మార్చి నాటికి భారతదేశంలో 12,31 284 మరమగ్గాలు పనిచేయనారంభిస్తాయి" అని ఈ అంశాన్ని తత్తరపడుతూ ప్రస్తావించాడు అంటే పై కామన్సు తీర్మానం ఎందుకు ఉద్దేశింపబడిందో తేటతెల్లమవుతున్నది. (పై వాక్యాలు లార్డు సాలిస్బరీ 1877 ఆగష్టు 30 వ తేదీని గవర్నర్ జనరల్కు వ్రాసిన జాబులోనివి) ఆ లేఖ ప్రకారం 1879 లో పోటీలు ఉన్నచోట్ల ఇండియాలో దిగుమతిఅయే మోటుబట్టలపై సుంకాలను తీసివేశారు. 1882 లో ఒక్క ఉప్పు. సారా పదార్థాలపై తప్ప మిగతా వస్తువులన్నిటిమీద దిగుమతి సుంకాలు రద్దు చేశారు. 1894 లో భారత ప్రభుత్వానికి ఆర్థికావసరాలేర్పడి దిగుమతులపై సుంకాలు వేయవలసిరాగా మరో కొత్తఎత్తు కనిపెట్టారు. భారతదేశపు మిల్లు గుడ్డలన్నింటిమీద ప్రత్యేకపు సుంకాలు విధించారు. ఇలాంటి పన్నుల విధింపు ఏ దేశపు ఆర్థిక చరిత్రలోనూ కనబడదు. ఈ ప్రత్యేకపు సుంకం 1896 లో నూటికి 3½ రూపాయలవంతున ఏర్పరచారు ఇది 1917 వరకు పూర్తిగా అమలు జరిగింది దిగుమతి సుంకాలు 3½ నుండి 7½ కు పెరిగిన తర్వాత ఈ ప్రత్యేకపు సుంకంతో పని తీరిపోవడంవల్ల 1925 లో ఆఖరుకు దీనిని రద్దుచేశారు. (ఈరద్దు వాస్తవంలో మిల్లు కార్మికుల సమ్మె ఒత్తిడిద్వారా జరిగింది.)

ఈ పరిస్థితులక్రింద 1914 వరకు పారిశ్రామికాభివృద్ధి అత్యల్పంగా తాబేలు నడకతో సాగింది. 1914 నాటికి ఫ్యాక్టరీచట్టంక్రిందికి వచ్చే పరిశ్రమల, కార్మికులు కేవలం 9, 51 000 మాత్రమే. జరిగిన అభివృద్ధి కేవలం బట్టల పరిశ్రమలో మాత్రమే జరిగింది. ఇందులో మాత్రమే భారతీయుల పెట్టుబడి తల చూపింది. మరి జనపనార పరిశ్రమల్లో బ్రిటిష్ పెట్టుబడి భారతీయ కార్మికులను చౌకగా ఉపయోగించాలన్న ఉద్దేశంతో పెరిగింది బ్రిటిష్ కార్మికుల ఈ పరిశ్రమలో గిరాకీ యెక్కువ కావడమే ఇందుకు కారణం ఇంజనీరింగు పరిశ్రమలు కేవలం రైల్వేశాఖ మరమ్మతు కర్మాగారాల రూపంలోనే ఉండిపోయాయి: 1914

యుద్ధ ప్రారంభ సమయంలో. ఉక్కు, ఇనుప పరిశ్రమ అతి అల్ప ప్రారంభం రూపంలో అప్పుడప్పుడే మొలకెత్తింది. యంత్రాలను ఉత్పత్తిచేయడం అసలేలేదు.

ప్రథమ ప్రపంచయుద్ధంతో పైవిధానాన్ని పూర్తిగా మారుస్తామని ప్రభుత్వం ప్రకటించింది. రాజకీయరంగంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఆశయమని ప్రకటించినట్టే, ఆర్థికరంగంలో దేశాన్ని పారిశ్రామికం చేయడం తమఆశయంగా బ్రిటిష్‌ప్రభుత్వం ప్రకటించింది. ఈనూతన విధానాన్ని వైస్రాయి లార్డుహార్డింగు 1915 లో తొలుత ఇలా ప్రకటించాడు:

> "భారతదేశపు పారిశ్రామిక సంపదను అభివృద్ధిపరచాలి అందుకు తగిన నిర్ణీతవిధానాన్ని బుద్ధిపూర్వకంగా అవలంబించాలి. ఈఅంశం యుద్ధానంతరం అతిస్పష్టంగా కనిపిస్తుంది అలాకాకపోతే ఈదేశంలో విదేశవస్తువులు ముమ్మరంగా వచ్చిపడతాయి. అవిదేశాలు మార్కెట్టు కోసం తీవ్రంగా పోటీచేసేకొద్దీ ఏపెద్దదేశం భవిష్యత్తుకూడ దాని ఆర్థిక స్థాయిమీదనే ఆధారపడి వుంటుందని స్పష్టమవుతున్నది. ఈవిషయంలో భారత ప్రజాభిప్రాయం ఏకగ్రీవంగాఉంది. దీనిని త్రోసిపుచ్చడం వీలు కాదు....
>
> "యుద్ధానంతరం తానుపారిశ్రామికంకావడానికియీపరిస్థితుల్లోవీలయినంతవరకు తమ ప్రభుత్వం పూర్తిగా సహాయపడాలని భారతదేశం కోరుతున్నది. అందుకు తాను అర్హురాలనని ఆదేశం అభిప్రాయ పడుచున్నది."
>
> (లార్డు హార్డింగ్, భారతకార్యదర్శికి 1915 నవంబర్ 26 తేదీ వ్రాసినలేఖ)

దీనిప్రకారం 1916 లో భారత పరిశ్రమల కమిషన్ నియమింపబడింది మైనింగు ఇంజనీయర్ల ఇన్‌స్టిట్యూట్ అధ్యక్షుడైన సర్ థామస్ హాలండ్ ఈ కమిషన్‌కు ఛైర్మన్‌గా పనిచేశాడు 1918లో వీరొక నివేదిక ఇచ్చారు. మాంటేగూ - ఛెంస్‌ఫర్డు నివేదికకూడ 1918 లో భారత రాజ్యాంగ సంస్కరణల గూర్చి చెబుతూ ఇలాగే తన ఆశయాన్ని ప్రకటించింది.

> "అన్నివిధాలా పరిశ్రమాభివృద్ధిని పురోగమింపజేసే విధానం అత్యవసరం. ఇదికేవలం భారతదేశ ఆర్థిక స్థిరత్వానికేకాక, ఆ ప్రజా వాంఛలను సంతృప్తి పరచడానిక్కూడ అవసరం....
>
> "ఆర్థిక, సైనిక కారణాలవల్లకూడ భారతదేశంలోని సహజ సంపత్తిని వెంటనే అభివృద్ధిపరచి ఉపయోగించడం బ్రిటిష్ ప్రభుత్వానిక్కూడ అవసరం. పారిశ్రామిక భారతదేశశక్తి సామ్రాజ్యశక్తికి ఎంతో బలంచేకూర్చగలదు. దాని పరిమాణాన్ని మనం ఊహించనుగూడలేము."
>
> (మాంటేగూ చెంస్‌ఫర్డు రిపోర్టు పుట 267)

ఈ మార్పుకు యుద్ధపరిస్థితులుకారణం. ప్రభుత్వ ప్రకటనల్లోనే కారణాలను మనం స్పష్టంగా తెలుసుకోవచ్చును.

మొదటిది : యుద్ధతంత్ర కారణాలు. యుద్ధపరిస్థితులవల్ల, రవాణా సరఫరాలు తగ్గిపోవడంవల్ల, మెసపటోమియా స్కాండల్సు వల్ల పాతరకం భారతసామ్రాజ్యంలోని దౌర్బల్యం అతిస్పష్టంగా కనిపించింది. భారత దేశంలో అతి ప్రాథమికమైన ఆధునిక పరిశ్రమలనుకూడా అభివృద్ధిపరచక పోవడంవల్ల, ముఖ్యమైన సైనికావసరాలకుకూడ దూరంలోని విదేశాలపై ఆధారపడవలసి వచ్చింది. అందుతో ప్రాచ్యదేశాలలోని బ్రిటిష్ కీలకస్థానాల దౌర్బల్యం బట్టబయలయింది. ఈ అంశం బ్రిటిష్ పాలకులకు చాల ప్రముఖంగా తోచిందనే సంగతి, మాంటెగూ-ఛెమ్స్‌ఫర్డు రిపోర్టు ప్రకటిస్తుంది. భారతదేశాన్ని "ప్రాచ్యరంగంలోని యుద్ధాలకు కేంద్రస్థానంగా పారిశ్రామికం చేయవలసిన అవసరం" మీదనే ఆ రిపోర్టు ఆలోచించింది.

> "తాత్కాలికంగా సముద్రయాన మార్గాలు ఆటంకపరుపబడవచ్చును గనక, మనం ప్రాచ్య రంగంలోని యుద్ధాల రక్షణ చర్యలకు భారతదేశంపైనే ఆయుధ నిర్మాణానికి ఆధారపడవలసి వస్తున్నది. గుణంలో కాకున్నా పరిమాణంలో సమానంగా పారిశ్రామిక అభివృద్ధిచెందిన దేశాల్లో ఉత్పత్తి అయిన యుద్ధపరికరాలుంటాయి. కాబట్టి భారత దేశపు సహజ సంపత్తిని పెంపొందించడం దాదాపు యుద్ధతంత్రానికి అవసరం"

రెండోది : ఆర్థిక పోటీ కారణాలు. విదేశీ పోటీదారులు భారతదేశపు మార్కెట్టులోని బ్రిటిష్ సర్వాధిపత్యాన్ని పడగొట్ట మొదలెట్టారు. బ్రిటిషు పారిశ్రామిక స్థితి యుద్ధావసరాలవల్ల దుర్బలపడింది. యుద్ధానంతరం విదేశ వ్యాపారం మరింత హెచ్చి, అసలు భారతదేశపు మార్కెట్టే పోతుందేమో అన్న ప్రమాదం ఏర్పడింది. "విదేశ వస్తువులకు కేంద్రంగా" భారతదేశం అవుతుందేమో అని లార్డు హార్డింగ్ ప్రమాదాన్ని సూచించాడు. దీనిని ఆటంకపరిచేందుకు సుంకాల పద్ధతిని పెడితే అది రెండు విధాల ఉపకరిస్తుంది. మొదటిది, విదేశ పారిశ్రామికుల ఆక్రమణనుఆపి భారత పరిశ్రమలను పెంపొందించవచ్చు అందువల్ల బ్రిటిష్ ఆర్థిక రాజకీయ అధికారంమూలంగా బ్రిటిష్‌పెట్టుబడిమీద ఎక్కువ లాభాలు లాగవచ్చును. అసలే ఏ విదేశ స్వతంత్ర ధనికవర్గానికో మార్కెట్టు వదిలివేయడంకంటే ఇదెంతో నయం. మరొకటేమంటే, సుంకాల విధానం ఏర్పరచడంవల్ల సామ్రాజ్య దేశాలకు సౌకర్యాలు కల్పించ వీలవుతుంది; తద్వారా బ్రిటన్ భారతదేశపు మార్కెట్టును తిరిగి సంపాదించుకొన వీలవుతుంది.

మూడు : ఆంతరంగిక రాజకీయ కారణాలు: యుద్ధసమయంలోను, యుద్ధం ముగుస్తూనే వచ్చే సంక్షోభ సమయంలోను, భారత ధనికవర్గ సహకారం సంపాదించడం అవసరం. వారిసాయం సంపాదించేందుకుగాను రాజకీయ ఆర్థిక సౌకర్యాలను కొన్ని కల్పించడం, కొన్నిటికి వాగ్దానాలుచెయ్యడం అవసరం. లార్డు హార్డింగు ఖచ్చితంగా చెప్పినట్టు "భారత ప్రజాభిప్రాయాన్ని గమనించకపోవడానికి వీలులేదు."

ఈ కొత్త విధానాన్ని అమలు జరిపేందుకు రక్షణ సుంకాలు విధించాలన్న పద్ధతిని అమలుజరిపారు. ఇందుకు ప్రభుత్వం మొదట చేసిందేమంటే, బయట నుండి వచ్చే గుడ్డలపై సుంకాన్ని 1917 లో నూటికి 7½ వంతులకు ఎక్కించారు. 1921 లో దీనిని 11 వంతులు పెంచారు. మరి భారత పరిశ్రమలపై ఉన్న ప్రత్యేక సుంకం నూటికి 3½ ను అలాగే 1925 వరకు ఉంచారు. అన్ని వస్తువుల దిగుమతిపైనా 1921 లో నూటికి 11, 1922 లో 15 వంతులు సుంకం విధించారు, 1921 లో ఫిషల్ కమిషన్ (సుంకాలు మొదలైనవి విచారించే కమిటీ) నియమితమైంది. వారు 1921 లో "మినహాయింపులతోటి రక్షణ" సుంకాలకు అనుకూలంగా నివేదికను 1922 లో తయారుచేశారు. ఆ కమిటీలోని భారత సభ్యులు సంపూర్ణ రక్షణ ఉండాలని పై నివేదికకు అసమ్మతి తెల్పారు. ఆరిపోర్టు సలహా మేరకు 1923 లో 'టారిఫ్‌బోర్డు' (సుంకాల కమిటీ) నియమింపబడింది. వారు ఎదుర్కోవలసిన ప్రధాన సమస్య ఇనుము-ఉక్కు పరిశ్రమలకు చెందింది. 1924 లో ఈ పరిశ్రమకు మూడేండ్లు పేటునరక్షణ నిచ్చారు. పరిశ్రమలకు నిరాశాలిచ్చేపద్ధతి (బౌంటీస్) ని కూడ ఏర్పరచారు.

ఈ సమయంలో, ప్రభుత్వం పురోగమనానికి తోడ్పడే విధానం అవలంబిస్తుందన్న భారత పారిశ్రామిక ధనికుల ఆశలు ప్రబలాయి. ఇది స్వరాజ్యపార్టీ లేదా అభివృద్ధికర పెట్టుబడిదారీ పార్టీ-యుగం ఈ పార్టీ 1923 కాంగ్రెస్ మహాసభలో గాంధీ నాయకత్వం అనుసరిస్తున్న సహాయ నిరాకరణ విధానాన్ని ఓడించింది. లోపలనుండి పోరాడేందుకు-అంటే ఆచరణలో "గౌరవప్రదమైన సహకారం చేసేందుకు" కౌన్సిళ్ళలో ప్రవేశించాలన్న స్వరాజ్యపార్టీ విధానం 1923-26 సంవత్సరాలలో కాంగ్రెస్‌లో ప్రాబల్యం వహించింది.

కాని తర్వాత సంవత్సరాలలో వీరి ఆశలకు గట్టిదెబ్బ తగిలింది.

## 4. పారిశ్రామికం చేయడంలో లోపాలు

1924 లో ఉక్కు-ఇనుము పరిశ్రమలకు రక్షణ, సహాయం ఇవ్వడమనేదే 1914-18 యుద్ధంతర్వాత పరిశ్రమాభివృద్ధికై ప్రభుత్వంచేసిన సహాయంలో అత్యుచ్ఛదశ. తర్వాత అసాయం తిరుగుముఖం పట్టిందని మనం పరిశీలిస్తే కనబడుతుంది.

కేంద్ర పారిశ్రామిక శాఖను నిర్మించాలని, దానికి రాష్ట్రశాఖలను ప్రతి రాష్ట్రంలోను విస్తారంగా నిర్మించాలని, భారతపరిశ్రమల కమిషన్ వేసిన ప్రణాళికలన్నీ ఏమీకాలేదు. కేంద్రశాఖలు అసలే ఏర్పరచలేదు. ఇక రాష్ట్రశాఖలుకూడ విద్యలాగే రాష్ట్రప్రభుత్వాలకు "మార్చిన" అంశాలలోకి చేర్చబడినవి అంటే డబ్బు తగినంత లేకుండాచేసి, తర్వాత అదేమీ పనిచేయలేకపోతే ఆ బాధ్యతను భారతీయమంత్రులపై తోశారన్నమాట: 1934 వరకు సాధించినదేదో, ఒక బయటి పరిశీలకుడు ఈ క్రిందివిధంగా అభివర్ణించాడు.

"దురదృష్టవశాత్తు కేంద్రసంస్థను ఇంకా ఏర్పరచలేదు; 1919 రాజ్యాంగ సంస్కరణల ననుసరించి. విద్యతోపాటు ఈ రాష్ట్ర శాఖలను రాష్ట్రాలలోని మంత్రివర్గాలకు అప్పగించారు ఆ మంత్రివర్గాలు శాసనసభ్యులకు బాధ్యతకల్గిఉంటాయి దురదృష్టవశాత్తు ఉన్న డబ్బు పొత్తిగా చాలనందువల్ల ఏ ముఖ్యవిధానాన్నీ వీరు అనుసరించలేకపోయారు. అదీగాక పరిశ్రమలను ప్రోత్సహించాలంటే, ముడిసరుకులు, ఉత్పత్తివిధానంగురించి మాత్రమేకాక మార్కెట్టును గురించికూడ సంయుక్త తీవ్రప్రభుత్వ విధానం అవసరం. వాస్తవస్థితిలో ఇది విద్యావిధానంతోను ఇతర ప్రతి ప్రముఖజాతీయ ప్రయోజనంతోను సన్నిహితంగా ఉండాలి భారతదేశంలో ఏర్పరచిన కేవలం రాష్ట్రకార్యాలయాలే ఏమైనా ఫలవంతమవుతాయా అన్నది అనుమానమే."

(డి. హెచ్. బుచానన్, "భారతదేశంలో పరిశ్రమాభివృద్ధి", 1934, పుట 643)

ఒక "కేంద్ర పారిశ్రామిక విజ్ఞాన పరిశోధన సమితి"ని ఇటీవల స్థాపించారు. దీనికి మూడేళ్ళకు చాలకుండా కేవలం 5 లక్షలరూపాయలు మాత్రమే నిధిని ఏర్పరిచారు. ఈ సంస్థ ప్రధానోద్దేశం—పట్టుపరిశ్రమ, చేనేతపరిశ్రమలపై దృష్టిని కేంద్రీకరించడమని ప్రకటించారు:

"ఇంతవరకు ప్రకటించిన ఫలితాలేవంటే, కేంద్రపరిశ్రమ విజ్ఞాన పరిశోధన సంస్థ స్థాపింపబడనున్నది; వచ్చే మూడేళ్ళలోను ఈ సంస్థపై అయిదు లక్షల రూపాయలు (37,500 పౌ) ఖర్చు పెడతారు; ఈ కొత్త సంస్థ పట్టు, చేనేత పరిశ్రమలపై దృష్టిని కేంద్రీకరిస్తుంది తక్షణం అత్యంతావసరమైన భారీ పరిశ్రమలు పూర్తిగా వదిలివేశారు. దేశ ఆర్థికాభివృద్ధిని గూర్చి ఏమైనా దీర్ఘకాల ప్రణాళికలు వుండనే వుంటే వాటిని నిర్వచించకుండా అయోమయ స్థితిలో వదిలివేశారు."

(సర్ యమ్ విశ్వేశ్వరయ్య, "భారతదేశానికి ప్లానింగు" 1934. పు 246)

1924 లో ఉక్కు, యినుము పరిశ్రమలకురక్షణ ఇచ్చినతర్వాత, మిగతా పరిశ్రమలుకూడా టారిఫ్ బోర్డుకు దరఖాస్తు లంపుకొన్నవి. ఎక్కువ భాగం - ముఖ్యంగా సిమెంటు, కాగితపు పరిశ్రమలు పెట్టిన దరఖాస్తులకు సమాధాన మివ్వలేదు. ఒక్క అగ్గిపెట్టెల పరిశ్రమకు మాత్రమే రక్షణ సుంకాలద్వారా సాయమివ్వడం గమనింప దగ్గది. ఆ అగ్గిపెట్టెల పరిశ్రమ భారతదేశంలో విదేశ పెట్టుబడితో నడుస్తున్నది.

మరింత గమనార్హ విషయమేమంటే 1927లో తిరిగి ఉక్కుపరిశ్రమల రక్షణను కొనసాగించవలసివచ్చింది. వెంటనే ముఖ్యమైనసుంకాలను తగ్గించివేశారు. సహాయంగా ఇస్తున్న డబ్బును రద్దుచేశారు. అంతకన్నా ముఖ్యంగా సామ్రాజ్య

దేశ విచక్షణ' అనే సూత్రాన్ని ప్రవేశపెట్టారు - ఈ సూత్రానికి అర్థం బ్రిటిష్ సరకుల ప్రవేశంపై తక్కువ సుంకాలువేసి సౌకర్యం ఇవ్వాలన్నమాట.

ఇప్పుడు సుంకాల విధానానికి సామ్రాజ్యదేశ విచక్షణ (ఇంపీరియల్ ప్రిఫరెన్సు) మూలమంత్రమైంది. 1930 కల్లా ఈ సూత్రం బట్టల దిగుమతికూడ వ్యాపించింది. 1932 లో ఒటావాసంధి కుదిరింది. భారతదేశంపై అన్నిటిమీద సామ్రాజ్యదేశ విచక్షణసూత్రం బలవంతంగా భారతీయులందరు ఆక్షేపిస్తున్నా, రుద్దబడింది. భారత కేంద్ర శాసనసభ యిందుకు వ్యతిరేకంగా ఓటుచేసింది. భారతదేశపు దిగుమతులలో బ్రిటన్‌భాగం 1931-32 లో నూటికి 35.5 వంతులున్నది. 1934-35 నాటికి 40.6 వంతులకు హెచ్చింది. జపాను మొదలైన బ్రిటన్‌తప్ప యితరదేశాల బట్టలపై సుంకం నూటికి 50 వంతులదాకా వేశారు. (తీవ్రవ్యాపార యుద్ధకాలం 1933 లో 75 వంతులదాక యీ సుంకాలు పెరిగాయి) మరి బ్రిటిష్ బట్టల దిగుమతులమీద కేవలం 20%కు తగ్గింపు జరిగింది. గుడ్డల పరిశ్రమలో సామ్రాజ్య దేశానికి విచక్షణ చూపాలన్న సూత్రాన్ని వ్యతిరేకిస్తూ టారిఫ్‌బోర్డు 1933లో ఇచ్చిన రిపోర్టునుగూడా ధిక్కరించింది ప్రభుత్వం.

భారతీయ పరిశ్రమాభివృద్ధిని అరికట్టి బ్రిటిష్ పరిశ్రమల పోటీశక్తిని పెంపొందించడమేకాక భారతప్రభుత్వపు సుంకాలవిధానం విదేశ పెట్టుబడిదారులకు, ముఖ్యంగా బ్రిటిష్ ధనికవర్గానికి తోడ్పడింది. పరిశ్రమల రక్షణపద్ధతిని బాగా వుపయోగించుకొని విదేశాల పెద్ద గుత్తవ్యాపారసంస్థలు భారతదేశంలో తను శాఖలను ఏర్పరచాయి. ఇవి భారత పరిశ్రమలకు విఘాతం కలగజేశాయి

1920 ప్రాంతంలో తొలుత భారత పరిశ్రమలకు సహాయం చేసేందుకని ప్రకటించిన సుంకాల పద్ధతి యిలాగా బ్రిటిష్ పరిశ్రమలకు తోడ్పడేదిగా తయారయింది. (ఇందుకు బదులు భారతదేశాన్నుండి ఎగుమతయ్యే ముడిసరుకులను, సగం తయారైన వస్తువులకు కొంత వెలలో తక్కువ చేశారు - అంటే 1914 కు ముందున్న పాతస్థితికి పోవడానికి ప్రయత్నం జరిగింది ) ఇందుతో సుంకాల పద్ధతి ప్రయోజనమే మారిపోయి దనేది స్పష్టపడింది. 1914 యుద్ధానికిముందున్న అభివృద్ధినిరోధకమైన కర్జన్ ప్రభుత్వంకూడ, బ్రిటన్‌కు ప్రత్యేక పక్షపాతం చూపడం భారతదేశానికి నష్టదాయకమని అసమ్మతి తెలిపింది. భారతదేశపు మార్కెట్టులో పెద్ద గుత్తదారైన బ్రిటిష్ పారిశ్రామిక వర్గంనుండే భారత పారిశ్రామికుల రక్షణను కోరారు - మిగత విదేశపారిశ్రామికులకన్నా బ్రిటిష్ ధనికతత్వం అలాకాక, విదేశపెట్టుబడిదారులు భారతదేశపు మార్కెట్టులో జొరబడకుండా సుంకాలను ఉపయోగించుకోదలచారు. ఈ వైరుధ్యం భారత కేంద్ర శాసనసభలో స్పష్టంగా కనిపించింది. 1935 జనవరిలో, ఒటావా ఒడంబడికను మరింత విశాలపరుస్తూ ఖాయపరచే వ్యాపార ఒడంబడిక చర్చకు వచ్చింది. ఆ ఒడంబడిక కేంద్రశాసనసభలో 66-58 ఓట్లతో ఓడిపోయింది. ఈ ఓటింగును త్రోసిపుచ్చి బ్రిటిష్ ప్రభుత్వం వ్యాపార ఒడంబడికను అమలుపరచింది. ఈ విరుద్ధ

భాగం బహిరంగంగా ప్రదర్శితమైంది: 1916-18 నాటి "అపారఉదార" (Benevolent) వాతావరణం ఎంతో వెనకబడిపోయింది. *

ఇదే యింకా విశాలమైన ఆర్థికరంగలో మనం చూడవచ్చును 1914-18 యుద్ధం ముగిసినవెంటనే తాత్కాలికంగా వచ్చినవ్యాపార ఉచ్చస్థితి మిగతాచోట్ల కన్న భారతదేశంలో అధికంగా కనిపించింది. నూలు, జనపనారమిల్లులు అత్యధికంగా లాభాలు గడించాయి. బొంబాయిలోని ముఖ్యమైన నూలుమిల్లులు 1920 లో డివిడెండు నూటికి 120 వరకు పంచిపెట్టాయి; ఒకేతూరి ఆమొత్తం 200, 250 కడకు 365 వరకు కూడా పోయింది. (ఆర్నోపియర్సీ: "భారతదేశంలో వత్తి పరిశ్రమ.") జనపనారమిల్లులు సగటున నూటికి 140 వంతులు డివిడెండు పంచాయి బోనస్‌తోపాటు ఒకొక్కప్పుడిది 400 వరకుకూడ పోయింది. బ్రిటన్ చేతిక్రిందవున్న 41 జనపనారమిల్లుల మొత్తం పెట్టుబడి 61 లక్షలపౌన్లు. ఈమిల్లులు 1916-21 సంవత్సరాలమధ్య 2 కోట్ల 29 లక్షలపౌన్ల ఆదాయం గడించాయి. ఇవికాక రిజర్వుక్రింద ఒక కోటి 90 లక్షలుంచాయి. లేదా మొత్తం ఆదాయం నాలుగేళ్ళలో 60 లక్షల పెట్టుబడితో 4 కోట్ల 20 లక్షలపౌన్లు గడించాయన్నమాట.

ఈ విపరీత లాభాల్లో భాగం తీసుకోవాలన్న ఆశతో, యుద్ధానంతర కాలంలో భారత దేశంలోకి బ్రిటిష్ పెట్టుబడి విపరీతంగా దిగుమతయింది. బ్రిటన్ నుండి భారత దేశానికీ సిలోనుకూ దిగుమతయ్యే బ్రిటిష్ పెట్టుబడి సగటున 1908–10 లో 140,నుండి 150 లక్షల పౌన్లవరకు ఉంటుందని సర్ జార్జి పైష్ అంచనా వేశాడు. 1921 కి ఈ మొత్తం 290 లక్షల పౌన్లకు మొత్తం బ్రిటిష్ విదేశ పెట్టుబడిలో నాలుగోవంతుకు హెచ్చింది; 1922 లో 360 లక్షల పౌన్లకు, 1923 లో 250 లక్షల పౌన్లకు - అంటే అయిదోవంతు బ్రిటిష్ మొత్తం విదేశ పెట్టుబడిలో - పెరిగింది 1920-21—1921-22 మధ్యనే ఈపెట్టుబడి దిగుమతి 1856-62 ల మధ్య రైల్వే పెట్టుబడిపెట్టినరోజులకన్న కొంతమాత్రమే హెచ్చింది దానికి కారణం, బ్రిటిష్‌ప్రభుత్వం రూపాయవిలువను 2 షిల్లింగులకు కృత్రిమంగా హెచ్చిందమే. ఇందువల్ల భారతదేశంలోనికి దిగుమతయ్యే వస్తువులపై డబ్బు భారత దేశంలోని ఎగుమతిదారుల వినాశం జరిగింది. ఈ మారకపు రేటును నిలపాలన్న వ్యర్థ ప్రయత్నంలో ప్రభుత్వం 5 కోట్ల 50 లక్షల పౌనులు ఖర్చుపెట్టింది.

---

* బ్రిటన్‌కూ భారతదేశానికీ ఏర్పడిన తగాదా 1939 మార్చిలో జరిగిన వ్యాపార ఒడంబడిక రాయబారాల్లో మరింత స్పష్టపడింది. ఈ ఒడంబడికను కేంద్రశాసనసభ 1939 మార్చిలో 59-47 ఓట్లతో నిరాకరించింది; భారత వాణిజ్యమండలిసమాఖ్య అసమ్మతి తెలిపింది. ఈతూరికూడ ప్రభుత్వం శాసనసభ ఓటింగును దిక్కరించి భారత ప్రతినిధులు ఆక్షేపిస్తున్నప్పటికీ, ఆ ఒడంబడికను అమలుపరిచింది.

కాని, ఇలా 1920-1921 అంతంలో ప్రారంభమైన క్షీణదశ, ప్రభుత్వం తన మారకపు విధానాన్ని మార్చి, రూపాయి విలువ 2 షిల్లింగులనుండి హఠాత్తుగా 1 షి 4 పెన్నీలకు తగ్గించివేయడంతో మరింత తీవ్రమయింది. 3 కోట్లపౌనుల దాక దివాలాలకు కారణమయింది యుద్ధానంతర ఉచ్ఛదశలో స్థాపింపబడిన చాల భారతపరిశ్రమలు తర్వాతి సంవత్సరాలలో దివాలాతీశాయి ఇక యుద్ధానంతర ఉచ్ఛదశలోలాగా అధికలాభాలు వస్తాయని ఆశించడానికి వీలులేదని తెలిసిపోతూనే బ్రిటిష్ పెట్టుబడి ఎగుమతి తగ్గిపోయింది. భారతదేశానికి వచ్చే బ్రిటిషు పెట్టుబడి 1924 లో 26 లక్షల పౌన్లకు తగ్గిపోయింది—ఆ యేడు ఇతర దేశాలకు ఎగుమతయిన బ్రిటిషు పెట్టుబడి మొత్తంలో ఇది 15 వ భాగం మాత్రమే; ఈ మొత్తం, 1925 లో 34 లక్షలపౌన్లకు, 1926 లో 20 లక్షల పౌన్లకు, 1927 లో 10 లక్షల పౌన్లకు—అంటే బ్రిటిషు మొత్తం పెట్టుబడి ఎగుమతులలో నూటికొకటోవంతుకు పడిపోయింది.

భారతదేశానికి సిలోనుకు యుద్ధానికిముందు, యుద్ధంతర్వాత వచ్చిన బ్రిటిష్ పెట్టుబడి ఎగుమతులను తెలిపే ఈ క్రిందిలెక్కలు మనకు పరిస్థితిని వివరిస్తాయి

## భారతదేశానికి, సిలోనుకు బ్రిటిషుపెట్టుబడి ఎగుమతులు

| సాలుసరి సగటు. | భారతదేశానికి సిలోనుకు (లక్షల పౌన్లు) | మొత్తం విదేశాలకు (లక్షలు) | ఇండియాకు నూటికి. |
|---|---|---|---|
| 1908-10 | 147 | 1723 | 8 5 |
| 1921—23 | 302 | 1290 | 23.7 |
| 1925—27 | 21 | 1209 | 1 7 |
| 1932—34 | 42 | 1351 | 3.1 |
| 1934—36 | 10 | 302 | 3 3 |

యుద్ధానంతరం కొన్నిరోజుల ఉచ్ఛదశ దాటితే తర్వాత యుద్ధం పూర్వం కన్నా దామాషా పడిపోయిందని అధికారుల లెక్కలవల్ల తెలుస్తుంది.

అలాగే ప్రభుత్వపు లెక్కలనుబట్టి, ఇండియాలో రిజిస్టరయిన కంపెనీల పెట్టుబడి మొత్తం తెలుసుకోవడంకూడ అవసరం.

## బ్రిటిషు ఇండియాలో రిజిస్టరయిన కంపెనీల 'పైడప్' పెట్టుబడి

(బర్మాను వదిలి)

| | (లక్షల రూపాయలలో) |
|---|---|
| 1914-15 | 7440 |
| 1924-25 | 23980 |
| 1934-35 | 26660 |
| 1939-40 | 28850 |

1914 నుంచి 1921 వరకు-పదేళ్ళలోను హెచ్చుదల నూటికి 222 వంతులు-లేక సాలుసరి సగటు నూటికి 22 వంతులు కాని తర్వాతి పదేళ్ళు 1921-1931 లలో ఈ హెచ్చుదల కేవలం నూటికి 11 వంతులు మాత్రమే లేదా సాలుసరి సగటు నూటికి ఒకటిపావు జరిగింది 1931-39 ల మధ్యకూడ సాలుసరి సగటు నూటికి 1.5 మాత్రం ఫలిత స్థాయిమారడం ఎంతఫలితం ఏర్పడినా యీవ్యత్యాసం నిజంగా గమనించదగిన విషయం. యుద్ధానంతర క్షణిక ఉచ్ఛదశ తర్వాత వచ్చిన తగ్గుదల ఇప్పుడిసరిగా కనిపిస్తుంది

స్టాటిస్టు పత్రిక ఇండియాలో రిజిస్టరైన కొత్తకంపెనీల పెట్టుబడి సూచికను 1914 లో 100 అన్న ప్రాతిపదికపై 1927 లో లెక్కలు తయారుచేసింది.

## బ్రిటిష్ ఇండియాలో కొత్తపెట్టుబడి విలువలు

ఏటా రిజిస్టరయిన కంపెనీల పెట్టుబడి సూచిక :

| 1914 | 1921 | 1922 | 1923 | 1924 | 1925 | 1926 | 1927 |
|---|---|---|---|---|---|---|---|
| 100 | 221 | 12[illegible] | 51 | 40 | 31 | 45 | 29 |

1914 స్థాయికన్న చాల తక్కువకు ఈపెట్టుబడి పడిపోవడంగూర్చి ఒకపత్రిక ఇలా వ్యాఖ్యానించింది:

"ఈ లెక్కలు దేశంయొక్క ఆర్థిక అభివృద్ధిలో కలిగిన క్షీణదశకు స్పష్టంగా ప్రతిబింబిస్తున్నాయనడంలో సందేహముండదు. ఈ క్షీణదశకు, భారత ప్రభుత్వం అనుసరించిన మారకపు విధానం బొత్తిగా బాధ్యంకాదని చెప్పలేము."

('స్టాటిస్టు' ఆగస్టు 6, 1927)

ఇలాగా భారతదేశ పారిశ్రామిక అభివృద్ధిలో క్షీణదశ, ప్రపంచ ఆర్థిక సంక్షోభానికి ముందే బాగా ఏర్పడివుంది. 1920 పడిలోనే భారత పరిశ్రమలు తీవ్రసంకటావస్థలో పడినవి. బట్టల పరిశ్రమకాక మిగతా భారత పరిశ్రమాభివృద్ధికి భారతదేశపు పెట్టుబడిదారీ వర్గానికి నాయకత్వం వహించిన తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ (ఉక్కుపరిశ్రమ) 100 రూ. షేర్లు 1926 లో 10 రూపాయలకు పడిపోయ్యాయి, ఆ షేర్లు లండన్ మార్కెట్టుకు 20 లక్షల పౌన్లు డిబెంచర్లకై రాకతప్పలేదు. యుద్ధానంతరం కొన్నిసంవత్సరాల్లో తాత్కాలికంగా సడలిన గుప్పెటితో బాంకుల పెట్టుబడి తిరిగి భారత పరిశ్రమలపై దిట్టపరచుకున్నది.

యుద్ధానికి పూర్వమున్న 1 షి 4 పెన్నీల రూపాయి మారకం తీసివేసి 1 షి. 6 పెన్నీలకు రేటు పెంచడంతో 1927 లో భారత పరిశ్రమలకు మరొక గట్టిదెబ్బతగిలింది 1926 లో ఇండియా ఫైనాన్సు కరెన్సీల విచారణకై వేసిన హిల్టన్‌యంగ్ కమిషన్‌రిపోర్టు ననుసరించి పై మారకంరేటు హెచ్చింపు జరిగింది భారతదేశపు పెట్టుబడిదారు లందరు అసమ్మతి చూపుతున్నప్పటికి ధనాన్ని

తగ్గించేదుకు (Diflation) యీ విధానాన్ని బ్రిటిష్‌ప్రభుత్వం అనుసరించింది. కరెన్సీ కమీషన్ రిపోర్టుపై తన అసమ్మతిని వ్రాస్తూ భారత ధనికవర్గ నాయకుడు సర్ పురుషోత్తమదాస్ ఠాకూర్‌దాస్ ఇలా వ్రాశాడు "ఈవిధానం భారత పారిశ్రామికులపై దెబ్బతీస్తుంది. దీనిని అతను భరించలేడు. అంతేకాక వ్యవసాయంపై బ్రతుకుతున్న అయిదోవంతు భారత ప్రజలపై ఇది గట్టిదెబ్బ తీస్తూంది." ఈ విధానంతోపాటు, భారతీయుల వలుకుబడికి మరీదూరంగా ఆర్థికాధికారాన్ని కొనిపోయేందుకు ప్రభుత్వం చర్యతీసుకొన్నది. ఇంపీరియల్ బ్యాంకుతోపాటు మరొక ఇండియన్ రిజర్వుబ్యాంకును స్థాపించాలని 1921 లో ప్రభుత్వం హిల్టన్‌యంగ్ కమిషన్ సలహామేరకు నిశ్చయించింది; దీనిపై భారతీయులు తీవ్రంగా నిరసన తెలిపారు. కడకు వారి అభిప్రాయాలను లెక్కించక 1934 కు ఆ బ్యాంకును స్థాపించారు.

ప్రపంచ ఆర్థిక సంకటావస్థ ఫలితాలు భారతదేశం యిప్పటికీ క్లిష్టావస్థలో పడివున్నదశలో పైనపడినవి. భారతదేశం పూర్తిగా ముడిసరుకు ఉత్పత్తిమీదనే ఆధారపడి ఉండడంవల్ల ప్రపంచ ఆర్థిక సంకటదశ ఫలితం యితరదేశాలకన్న యీ దేశంపై ఎక్కువగా పడింది. అయిదోవంతు భారతీయులు పూర్తిగా ఏఉత్పత్తిపై ఆధారపడ్డారో ఆ ప్రధాన వస్తువుల వెలలు (ఈవెలలు మర్చలంగాఉన్న పరిశ్రమల మార్కెట్టునుగూడ చేతబట్టుకొన్నవి ) సగానికిసగం పడిపోయ్యాయి. 1928-29 నుండి 1932-33 లోపల్లె భారతదేశంనుండి ఎగుమతయ్యే సరుకులవెల 339 కోట్ల రూపాయలనుండి 135 కోట్ల రూపాయలకు పడిపోయింది. అయినప్పటికి విపరీతంగా ఇంగ్లాండుకుపెళ్ళే కప్పము, అప్పులకివ్వవలసిన వడ్డీలు, ఇంగ్లాడు ప్రభుత్వఖర్చులు (హోమ్‌ఛార్జెస్) కట్టక తప్పలేదు. ఈడబ్బును ఖచ్చితంగా బ్రిటిష్‌ప్రభుత్వం వసూలుచేసింది యూరోపులో పెట్టినట్టుగా హోవర్‌మారుటోరియం (అప్పులను వాయిదావేసే చట్టం) భారతదేశంలో పెట్టలేదు; జర్మనీలోలాగా అప్పులనివారణ ప్రణాళిక ఏదీలేదు; అమెరికాకు ఇవ్వవలసిన అప్పును బ్రిటన్ ఇవ్వకుండా పోయినట్టు భారతదేశంలో జరగలేదు. కడకు బంగారంపంపి ఇంగ్లాండుకు డబ్బిచ్చుకోవలసివచ్చింది 1931-35 ల మధ్య భారతదేశంనుండి బ్రిటన్‌కు 320 లక్షల పౌన్సులకుపైగా బంగారం-20 కోట్ల 30 లక్షల పౌనుల వెలగలది, లాగివేయబడింది (ఎకానమిస్టు డిసెంబర్ 12, 1936). అంటే ఈ బంగారం ఆర్థికసంకటావస్థ రకపూర్వం బ్రిటన్‌కున్న మొత్తం బంగారంకన్నా ఎక్కువ. 1936-37 లమధ్య భారతదేశంనుండి మరొక 380 లక్షల పౌనుల వెలగల బంగారం ఇంగ్లాండుకు వెళ్ళింది (ఎకానమిస్టు, ఏప్రిల్ 2, 1938) మొత్తం 1931-నుండి 37 వరకు ఏడేళ్ళలో 24 కోట్ల 10 లక్షల పౌనుల వెలగలబంగారం భారతదేశంనుండి ఇంగ్లాండుచేరింది. ఇలాగా, ఎంతో కష్టపడి చెమటోడ్చి కూడబెట్టుకొన్న నిరుపేద భారత రైతులధనం శాస్త్రీయంగా బ్రిటిష్ పెట్టుబడిదారీ విధానము పీల్చి పిప్పిచేసి తమ బంగారపు నిల్వలను అధికం చేసుకున్నది. బ్రిటన్

బంగారు నిల్వ 1932 లో 312 కోట్ల 10 లక్షల బంగారం స్విస్ ఫ్రాంకులు ఉన్నది. 1938 ఆఖరుకు 791 కోటి 10 లక్షల ఫ్రాంకులకు పెరిగింది. అంటే మూటికి 161 వంతులు హెచ్చింది. ఈ లెక్కలు ఇంటర్నేషనల్ సెటిల్మెంట్సు బ్యాంకు రిపోర్టుద్వారా తెలుస్తున్నవి పారిశ్రామిక విప్లవకాలంలోలాగే మరొకతూరి 1933-37 లలో భారతదేశపు దోపిడీమూలంగా కొత్తపద్ధతిలో బ్రిటిష్ పెట్టుబడి దారీ విధానం తన క్షీణదశనుదాటి తనపొట్ట పెంచుకోగలిగింది.

1936 ఆఖరున ఎకానమిస్టు పత్రిక, భారతదేశానుబంధంలో "భారత పరిశ్రమాభివృద్ధి" గూర్చి విషణ్ణంగా ఇలా చెప్పింది ;

> "మొత్తంమీద పరిశ్రమలపై బ్రతికే ప్రజల సంఖ్య తగ్గిపోయింది; కొన్ని పరిశ్రమలలో—ముఖ్యంగా జనపనార బట్టల పరిశ్రమలలో—కొన్నేళ్ళ నుండి కార్మికుల సంఖ్య చాల తగ్గిపోయింది ...
>
> "భారతదేశంలో పరిశ్రమలను ఆధునికంగా చేయడం ఆరంభమైనప్పటికీ, ఇంకా ఆ దేశంలో "పరిశ్రమాభివృద్ధి" జరుగుతున్నది అని చెప్పడం సాధ్యంకాదు."

(ఎకానమిస్టు, ఇండియన్ సప్లిమెంటు, "నేటి ఇండియా సర్వే" డిసెంబరు 12, 1936)

## 5. యుద్ధానికి ముందు యిరవైయేళ్ళ జమాఖర్చు పట్టీ

ఇప్పుడు మనం రెండుయుద్ధాలకు మధ్యనున్న ఇరవైఏళ్ళలో - ఇండియన్ పరిశ్రమ కమిషన్ ఏర్పరచిన తర్వాత ఇరవైఏళ్ళలో భారతదేశ ఆర్థికాభివృద్ధి ఏ మాత్రం జరిగిందో పరిశీలించుదాము. పరిశ్రమాభివృద్ధికి ఉన్న సహజావకాశాలను మనసులో ఉంచుకొని మనమే పరిశీలన గావించాలి.

ఈ ఇరవైఏళ్ళలో సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు పరిశ్రమాభివృద్ధి యూరోపు - ఆశియా దేశాలలో ఎక్కడా జరగనంత బ్రహ్మాండంగా జరిగింది. భారతదేశంలో ఈ కాలంలో 1914 ముందు ప్రారంభమైన పరిశ్రమల పెంపుదల, బ్రిటిష్ ప్రభుత్వం ఆటంకపరుస్తున్నప్పటికి మరికొంత ముందుకు సాగింది. తమ దేశంలోని మార్కెట్టుకు తగినంత ఉత్పత్తి చేసేందుకు కొన్ని పరిశ్రమలు త్వరితంగా నడవసాగాయి. 1914 లో దేశానికక్కావలసిన బట్టలలో నాలుగోవంతు ఉత్పత్తి చేస్తూ ఉండిన బట్టలమిల్లులు, 1934-35 సంవత్సరానికి మూడు వంతులు వుత్పత్తిచేస్తున్నవి 1934 లో ప్రకటితమైన సుంకాలబోర్డు రిపోర్టు ప్రకారం. యుద్ధానికిపూర్వం అప్పుడప్పుడే ప్రారంభమైన భారతదేశ ఉక్కు పరిశ్రమ, 1932—33 నాటికి దేశంలో అమ్మకమయే ఉక్కులో మూడువంతులు సరఫరా చేస్తున్నది. పరిశ్రమాభివృద్ధి చాలా హీన స్థితిలో ఉండడంవల్ల ఉక్కు మార్కెట్ చాలా పరిమితంగాఉంది. అందువల్లనే అంతకన్నా ఎక్కువఉత్పత్తి కాలేదు; 1935—36 లో 879,000 టన్నుల ఉక్కు భారతదేశంలో ఉత్పత్తి

అయింది ఇది పోలెండులో ఆ సంవత్సరంలోనే జరిగిన ఉత్పత్తికన్నా తక్కువ (పోలెండు జనాభా, భారత జనసంఖ్యలో పదోవంతు మాత్రమే); ఇది 1936 జపాన్ ఉక్కు ఉత్పత్తిలో ఆరోవంతు; సోవియట్ యూనియన్ ఉత్పత్తిలో ఇది 1/19 భాగం. ఏమైనా బట్టలమిల్లు అభివృద్ధి మాత్రమే పరిశ్రమల పెంపుదలకు నిర్ణాయకంకాదు. బట్టల మిల్లులకు 1914 కంటే ముందే భారతదేశంలో పునాది ఏర్పడింది. ఉక్కు, ఇనుము, యంత్రాల నుత్పత్తిచేసేవి మొదలైన భారీ పరిశ్రమలుకూడ పెరగాలి. ఈ విషయంలోనే యుద్ధానికి ముందు భారత హీనస్థితి కనిపించింది ఇప్పటికూడ యంత్రాలకు భారతదేశం పూర్తిగా పరాయి దేశాల మీదనే ఆధారపడి ఉంది.

"యంత్రాలునడిపే కర్మాగారాల్లోకి ప్రజలు మూగుతున్నప్పటికి, ఇంజనీరింగు, బట్టలపరిశ్రమలు కేవలం గృహపరిశ్రమలలో భాగమే - బట్టలమిల్లులలో మగ్గానికి ఇంకొక మగ్గం. కదురుకు మరొకదురు చేర్చడమనేదే సమస్య ఇక మరమ్మతు షాపుల్లోని ఇంజనీరింగు కేవలం వ్యక్తిగత పరిశ్రమ. ఏదేశంలోగాని ఉక్కు, ఇనుపపరిశ్రమలు జయప్రదంగా నడవడంమీదనే నిజమైన మార్పువస్తుంది....లోహ పరిశ్రమాభివృద్ధి జరిగితేనే నిజమైన పారిశ్రామిక విప్లవం వస్తుంది. ఇంగ్లాండు, జర్మనీ, అమెరికా మొదలైన దేశాలన్నీ బట్టలమిల్లులు స్థాపించేముందు ఆధునిక పద్ధతులలో ఉక్కు, ఇనుపపరిశ్రమలను ప్రారంభించారు."

(యల్. సి ఏ. నోల్లెస్ "విదేశసామ్రాజ్య ఆర్థికాభివృద్ధి" పుట 443 )

ఈ సక్రమపద్ధతి మరింత మహత్తరంగా, సోవియట్ యూనియన్‌లో జరిగిన బ్రహ్మాండమైన సోషలిస్టు పారిశ్రామిక విప్లవం కనబరిచింది. వారు మొదటి పంచవర్ష ప్రణాళికలో భారీపరిశ్రమలు స్థాపించి, రెండో పంచవర్షప్రణాళికలో చిన్నపరిశ్రమల స్థాపనకు ముందుకుసాగారు భారతదేశంలో పరాధీన వలసదేశంలో జరిగే తల్లకిందులు ఆర్థికాభివృద్ధి కనిపిస్తుంది.

ఈ కాలంలో పరిశ్రమల్లోను, వ్యవసాయంలోను వున్న ప్రజల దామాషాను, 1914 కు ముందటి సంఖ్యలతో పోల్చిచూస్తే, జరిగిన పరిశ్రమాభివృద్ధి ఎంత అల్పమో మరింత స్పష్టంగా గోచరమవుతుంది. జనాభాలెక్కలనుబట్టి 1911-31 లకు మధ్య పరిశ్రమలమీద ఆధారపడిన జనసంఖ్య నిజంగాతగ్గి, వ్యవసాయం మీద ఆధారపడినవారి సంఖ్య హెచ్చింది 1911 లో పరిశ్రమలపై ఆధారపడిన జనాభా నూటికి 11.2; 1921 లో 10.49 కి తగ్గింది; 1931 లో 10 38 కి మరింత తగ్గింది.

ఇక పరిశ్రమలలో పనిచేసే కార్మికుల సంఖ్యనుతెలిపే ప్రభుత్వపు లెక్కలు మరింత దారుణంగా వున్నవి. వీనినిబట్టి సంపూర్ణక్షీణదశ కనిపిస్తుంది. ఈ దామాషానుబట్టి అసలు ఉద్యోగంలో ఉన్న కార్మికులసంఖ్య ఎంత తగ్గిందో ఊహించవచ్చు.

## పరిశ్రమల్లో ఉన్న కార్మికుల దామాషా (1911-31)

| | 1911 | 1921 | 1931 | దామాషాను మారుతున్న సంఖ్య నూటికి |
|---|---|---|---|---|
| జనసంఖ్య (లక్షలలో) | 3150 | 3190 | 3530 | 12 1 |
| పనిచేసేవారు (లక్షలలో) | 1490 | 1460 | 1540 | 4 0 |
| పరిశ్రమల్లో పనినిసేవారు (లక్షలలో) | 175 | 157 | 153 | 12 6 |
| మొత్తం పనిచేసేవారిలో పరిశ్రమల కార్మికుల (దామాషా) | 11 7 | 11.0 | 10 0 | 9 1 |
| మొత్తం జనాభాతో కార్మికుల దామాషా(నూటికి) | 5 5 | 4 9 | 4 3 | 21.8 |

అంటే ఇరవై యేళ్ళలో పరిశ్రమల్లో పనిచేసే కార్మికులసంఖ్య 20 లక్షలకు పైగా తగ్గిపోయింది. మరి అదేసమయంలో జనసంఖ్య నూటికి 12 వంతులు హెచ్చింది. కాని కార్మికుల సంఖ్య నూటికి 12 వంతులు తగ్గిపోయింది. మొత్తం జనాభాలో కార్మికులు దామాషా అయిదోభాగం తగ్గిపోయింది.

అలాగే ప్రధాన పరిశ్రముల లెక్కలుకూడ 1911 నుండి అలాగే క్షీణదశను సూచిస్తాయి.

## ప్రధాన పరిశ్రమలలో కార్మిక సంఖ్య క్షీణదశ

| | 1911 | 1921 | 1931 |
|---|---|---|---|
| బట్టల పరిశ్రమ | 4,449,449 | 40,30,674 | 41,02,136 |
| దుస్తుల, అలంకారాల పరిశ్రమలు | 37,47,755 | 34,03,842 | 33,80,824 |
| కట్టెలు | 17,30,920 | 15,81,006 | 16,31,723 |
| ఆహారపరిశ్రమలు | 21 34,045 | 16 53,464 | 14,76,995 |
| పింగాణీ, మట్టి, పరిశ్రమలు | 11,59,168 | 10,85,335 | 10,24,830 |

ఇలాగు యుద్ధారంభంలో భారతదేశంలో "పరిశ్రమవినాశం" జరుగుతున్నదని చెప్పొచ్చు—ఆధునిక పరిశ్రమలు పెంచకుండా పాతగృహపరిశ్రమలు క్షీణించడం మాత్రమే జరిగింది. చేతి పరిశ్రమలు నశిస్తుంటే, యంత్ర పరిశ్రమలు వాని స్థానం ఆక్రమించలేదు 19వ శతాబ్దిలోని క్షీణదశే 20 వ శతాబ్దిలోను 1918 తర్వాతి కాలంలోనుకూడ కొనసాగించబడింది.

దీనివల్ల మనం ఈ క్రింది నిర్ణయానికి రాకతప్పదు: సామ్రాజ్యవాద పాం

నలో భారతదేశంలో "పరిశ్రమాభివృద్ధి" అనే మాట వట్టి భ్రమ సామ్రాజ్యవాద పాలనలో ఇటీవలకూడ వ్యవసాయంలో ప్రజల ఒత్తిడి మరింత ఎక్కువయింది

"ఉన్న కొన్ని పరిశ్రమల కేంద్రాలు పెద్దగా కనిపించినా, మిల్లులు రాకముందు చేతి పరిశ్రమలు ఎంతమంది జనాన్ని పోషిస్తూ ఉండెనో అంత మందిని ఈ పరిశ్రమలు పోషించడంలేదు. ఇప్పటికీ ఎగుమతులకన్నా యీ దేశములో దిగుమతులే ఎక్కువ. దామాషా క్రమంగా మారుతున్నా, ఇప్పటికీ ఎగుమతులన్నీ ముడిసరుకులు; దిగుమతులన్నీ యంత్రవస్తువులు అనే లక్షణము భారత ఆర్థిక జీవనానికి లక్షణంగాఉంది. ఈ దేశంలో కర్మాగారాలు ఉన్నప్పటికీ, జీవిత ప్రమాణం చాల హీనస్థితిలో ఉన్నప్పటికికూడ, నూరేండ్లకు ముందటికన్నా ఇప్పుడే ఈ దేశంలో వస్తూత్పత్తి స్వయం సంపూర్ణంగా లేదు"

(డి. హెచ్. బుచానన్ "భారత దేశంలో పరిశ్రమల అభివృద్ధి," 1934, పు 451)

1931లో ఫ్యాక్టరీ చట్టంక్రింద పనిచేసే కార్మికుల మొత్తం సంఖ్య 15 లక్షలు అంటే అసలు కాయకష్టం చేసుకునే జనసంఖ్యలో నూటికి ఒక్కరు పరిశ్రమల్లో కార్మికులన్న మాట; వీరితోపాటు 2,60,000 గనికార్మికులను, 820,000 రైల్వే కార్మికులను చేర్చుకున్నప్పటికీ ఆధునిక పరిశ్రమల్లో పనిచేసే కార్మికుల సంఖ్య, మొత్తం దేశంలో కష్టంచేసుకొనే జనాభాలో నూటికి 1½ వంతు మాత్రమే.

అదీగాక, 1914 ముందటికన్నా; 1914 తర్వాతనే ఈ అభివృద్ధి మరింత విదానంగా జరిగింది. ఈ క్రింద ఫ్యాక్టరీ చట్టంక్రింద వచ్చే కార్మికుల సంఖ్యాభివృద్ధి ఇస్తున్నాము. (1922లో ఈ చట్టం 50 మందికిపైగా పనిచేసే సంస్థలకే అనువర్తించేది. ఆతర్వాత 20 మందికన్నా ఎక్కువ, కొన్నిచోట్ల 10 మంది కన్నా ఎక్కువ పనిచేసే సంస్థలకుకూడ ఈ చట్టం అనువర్తిస్తున్నది. కాబట్టి ఇది కూడ యుద్ధానంతర కార్మికసంఖ్య కొంత ఎక్కువ కనిపించేట్టు చేస్తుంది. కాబట్టి మనవాదం మరింత బలపడుతున్నది.)

## కర్మాగారాల్లో కార్మికుల రోజువారీ సగటు సంఖ్య

| | |
|---|---|
| 1897 | 4,21,000 |
| 1907 | 7,29,000 |
| 1914 | 9,51,000 |
| 1922 | 13,61,000 |
| 1931 | 14,31,000 |

1897 కు 1914 కు మధ్య 17 ఏళ్ళల్లో కార్మికుల సంఖ్య 5,30,000లకు పెరిగింది.

1914 కు 1931కి మధ్య17 ఏళ్ళల్లోకార్మికులసంఖ్య4,80,000లకు పెరిగింది. కాబట్టి 1914 కు ముందుటి యుగంలోకన్నా 1914 తర్వాత కాలంలో జరిగిన అభివృద్ధి నిదానంగా సాగడమేకాదు, అసలు హెచ్చిన సంఖ్యే తక్కువ.

బాగా కనపడే బట్టల పరిశ్రమల అభివృద్ధికూడ, జపాను, చైనాలతో పోలిస్తే చాలతక్కువ. ఈ క్రింద 1914 కు 1930 కి మధ్య ఇండియా, చైనా, జపానులలో కదుళ్ళసంఖ్య ఎంతపెరిగిందో చూపుతున్నాము.

| | 1914 | 1930 | హెచ్చినసంఖ్య. |
|---|---|---|---|
| ఇండియా | 63,97,000 | 88,07,000 | 24,10,000 |
| జపాను | 24,14,000 | 68 37,000 | 44,23,000 |
| చైనా | 3,00,000 | 36,99,000 | 33,99,000 |

భారతదేశంలో అభివృద్ధి నూటికి 37 వంతులు. జపాను, చైనాలలో అదేకాలంలో నూటికి 188 వంతులు. 1914 లో భారతదేశంలో కదుళ్ళసంఖ్య జపాను, చైనాలు రెండు కలపినా అంతకు రెట్టింపు ఉండేది. మరి 1930 వచ్చేటప్పటికి జపాను చైనాలు రెండూ (చైనాఅభివృద్ధి ఎక్కువభాగం జపాను యాజమాన్యంలో) భారతదేశాన్ని దాటివేసి ముందుకు వెళ్ళాయి

ఇలా సామ్రాజ్యవాద పాలనలో పరిశ్రమాభివృద్ధి ఇంత మెల్లగా ముందుకు వెళ్ళడానికి కారణమేమి? భారతదేశ సమాజవ్యవస్థలోనే ఉన్న కారణాలు ఎన్ని అయినప్పటికి ఈ అభివృద్ధి రాహిత్యానికి ప్రధానకారణం సామ్రాజ్యవాద పద్ధతిలోనే ఉంది. సామ్రాజ్యవాద పాలనే అసలు స్వతంత్ర పరిశ్రమాభివృద్ధికి వ్యతిరేకం. కాబట్టి ఇతర ఆటంకాలను దాటివేయగలిగిన భారతప్రజల శక్తినంతటినీ సామ్రాజ్య తత్వం సర్వవిధాలా అణచివేస్తుంది. అందువల్ల పారిశ్రామికం చేస్తామనే వాగ్దానాలూ, కలలూ ఈ విరుద్ధశక్తులకు వ్యతిరేకంగా వరుసగా తలసూపుతూనే వచ్చాయి. సామ్రాజ్యవాదుల వలసదేశవిధానం, ప్రజలఆర్థికాభివృద్ధిని తనగుప్పిట వుంచుకొని నులిమిపారవేస్తుంది. ఒకవేపు భారతపరిశ్రమల అభివృద్ధికావాలనే వాంఛ, మరొకవేపు జారిపోతున్న బ్రిటిష్‌భాగాన్ని భారతమార్కెట్టులో ఎలాగైనా నిలుపుకోవాలనే కోర్కెతో ఉన్న పరస్పర వైరుధ్యం మాత్రమేకాదు. సామ్రాజ్యవాద దోపిడీవిధానంలో భారతీయుల స్వదేశవర్తకంయొక్క సమస్యలు తీర్చరానివవుతాయి. ఎందుకంటే రైతులు విపరీతమైన దరిద్రంతో బాధపడుతున్నారు గనక. ఇందులోకూడ పై వైరుధ్యం కనపడుతుంది. ఇక ఈ విరుద్ధ సమస్యలను సుంకాలపద్ధతి తగ్గించకపోగా పైన కాయకష్టంచేసుకొనే ప్రజలపై మరింతభారంవేసి పై వైరుధ్యాన్ని పెంచడమే జరుగుతుంది. భారతదేశ పారిశ్రామిక సమస్యను, వ్యవసాయ సమస్యను వేరుగావుంచి పరిష్కరించడం సాధ్యంకాదు. అది సామ్రాజ్యవాదపు పునాదులకు చెందినది.

మరొకటేమంటే బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడి విధానం కీలకస్థానంలో ఉంది. తన ఆదేశంలో మిగతా ఆయువుపట్టుల నన్నిటినీ ఉంచుకొంది కాబట్టి భారత పరిశ్రమలు దాని దయాధర్మం మీద పూర్తిగా ఆధారపడవలసి వస్తున్నది. ఇందువల్ల పరిశ్రమాభివృద్ధి సామ్రాజ్యవాద పాలనలో కాదు. అది పరస్పర విరుద్ధ విషయం.

## 6. బ్యాంకుల పెట్టుబడి

బయటి దేశాలలో పరిశ్రమల అభివృద్ధిని గురించి టారిఫ్ సౌకర్యాలగూర్చి ఇండియా మార్కెట్టుపై బ్రిటిష్ ప్రాబల్యం తగ్గిపోవడాన్ని గూర్చి మాట్లాడే వారు. కాని అసలు బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడి భారత దేశ ఆర్థిక విధానంపై అధికారాన్ని మరింత బిగించిందని, ఆ అధికారాన్ని రక్షించుకొని భారత దేశాన్ని ముందుకు పోనీకుండా బ్రిటన్ తీవ్రచర్యలు తీసుకుంటున్నదని బయటి దేశాలవారెరుగరు

భారతదేశ పెట్టుబడి కొంత పెరిగి నప్పటికీ బ్యాంకులలో, వాణిజ్యంలో, మారకంలో, భీమా కంపెనీలలో, నౌకారవాణాల్లో రైల్వేలలో, తేయాకు-కాఫీ-రబ్బరు తోటలలో, జనపనార మిల్లులలో బ్రిటిష్ పెట్టుబడి యొక్క గుత్త ప్రాజాపత్యం యధాప్రకారం స్థిరంగానే ఉన్నది (ఇప్పుడు మునుపటికన్నా భారత పెట్టుబడి ఎక్కువ భాగం బ్రిటిష్ అధికారంలో ఉంది.) ఈఅధికారాన్ని నిలబెట్టుకునేందుకు యావత్ ప్రభుత్వ వ్యవస్థా పనిచేస్తున్నది. ఇనుము ఉక్కు పరిశ్రమలలో భారత దేశ పెట్టుబడిదారులు బ్రిటన్‌తో రాజీకి రాక తప్పలేదు భారత దేశపు పెట్టుబడికి నిలయంగా ఉన్న బట్టల పరిశ్రమలో కూడ 'మానేజింగు ఏజన్సీ పద్ధతి' ద్వారా బ్రిటిష్ పెట్టుబడి దారుల పెత్తనం ఇతరులు అనుకునేంతకన్నా చాల ఎక్కువ గానే ఉంది.

ఈ మానేజింగు ఏజన్సీ పద్ధతి భారత దేశంలోను ఇతర ఆశియా వర్తక స్థానాలలోను ఉన్న ప్రత్యేక లక్షణం. భారత పరిశ్రమలపై బ్రిటన్ పెత్తనం నిలుపుకునేందుకు ఇది ప్రధాన ఆయుధం. ఈ పద్ధతివల్ల కొన్ని మానేజింగు ఏజన్సీ సంస్థలు వివిధ పరిశ్రమల కంపెనీలను, వ్యవస్థలను తమచేత నుంచుకొని చాలవరకు వానికి డబ్బు పెడతాయి ఆకంపెనీల పనిని ఉత్పత్తిని ఆ సరుకుల మార్కెట్టును ఈ మానేజింగు ఏజన్సీలే నడుపుతాయి. ఆయా పరిశ్రమల కంపెనీ డైరెక్టర్లు కేవలం నామకః పనిచేస్తుంటారు. లాభాలలోని సారమంతా వాటాదార్లకు కాక మానేజింగు ఏజన్సీకే వెడుతుంది 1927 లో టారిఫ్‌బోర్డు బట్టలమిల్లుల విచారణముందు వచ్చిన సాక్ష్యం ప్రకారం 1905-25 ల మధ్య ఇరవైఏళ్ళలో బొంబాయి బట్టలమిల్లులు మానేజింగు ఏజంట్లకు యిచ్చిన కమిషన్లు సగటున ఏటా 'పెయిడప్ క్యాపిటల్' లో నూటికి 5 2 ఉంటుంది. ఇదికాక మానేజింగు ఏజంట్లకు కంపెనీలలో వాటాలుంటే వానికి డివిడెండ్లు. అమ్మకంలో కమిషన్లు వేరేవస్తాయి బట్టలమిల్లులు నష్టంమీద పనిచేస్తున్నట్లు చెప్పే సమయంలోకూడా మిల్లుకువచ్చే నష్టంకన్నా ఎక్కువమొత్తం మానేజింగు ఏజన్సీకి కమిషన్‌గా

పోతూనే వుంటుంది. ఉదాహరణకు చూడండి: 1927 లో బొంబాయిలోని 75 బట్టలమిల్లులకు నికరంగా నష్టం రూ. 7,36,309 అయితే అదేసంవత్సరం మానేజింగు ఏజంట్లు ఆ మిల్లులలో తీసిన కమిషన్లు రూ. 30,87,477 (పి. యస్. లోకనాధన్, "భారతదేశంలో పరిశ్రమల సంస్థలు" 1935, పుట 168 )

మానేజింగు ఏజన్సీ సంస్థలు భారతీయులవి, యూరపియన్లవికూడా ఉన్నవి; కాని సమర్థమై బాగా పాదుకొన్నవి, ప్రభుత్వంతోను లండన్‌తోను ఎక్కువ సంబంధం కలవి ఇంగ్లీషు వారివే ఆండ్రూయులే అండ్ కంపెనీ, జార్డెన్ అండ్ స్కిన్నర్ కంపెనీలవంటివి భారతదేశంలోను, బ్రిటిష్ పాలనచరిత్రలోను భాగాలుగా ఉన్నవి 1927 లోని "టారిఫ్‌బోర్డు బట్టల పరిశ్రమల విచారణ కమిటీ నివేదిక" బొంబాయి మిల్లులు నూటికి 99 ని పరిశీలించి లెక్కలద్వారా ఇందులో పని చేస్తున్న శక్తులనుగూర్చిచాల అంశాలను తెలియజేశారు. (వాల్యూం 1, పుట 258, అనుబంధం X 11, ఈ అనుబంధంలోని అంశాలను చేర్చి తయారుచేసిన ఈ క్రింది పట్టిక, 'లేబర్ రిసెర్చి అనే పత్రికలో 1928 జూన్‌లో ప్రచురితమైనది):

## బొంబాయి బట్టల మిల్లులు

| | మిల్లులు | కదుళ్ళు | మగ్గాలు | పెట్టుబడి (లక్షల రూ.) |
|---|---|---|---|---|
| ఇంగ్లీషు మానేజింగు ఏజంట్లుగల కంపెనీలు (9) | 27 | 11,12,114 | 22,121 | 989 |
| భారతీయ మానేజింగు ఏజంట్లున్న కంపెనీలు (32) | 56 | 23,60,528 | 51,580 | 977 |

అంటే ఇంగ్లీషు మానేజింగు ఏజంట్లు కంపెనీలలో నూటికి 22 వంతులే తమ చేత నుంచుకొన్నప్పటికీ, మిల్లులలో నూటికి 33ను, కదుళ్ళలో నూటికి 32 ను, మగ్గాలలో 30 వంతులను, అధిక పెట్టుబడిలో నూటికి 50.3 వంతులు తమ గుప్పిటనుంచుకొన్నారు. భారతీయుల పెట్టుబడి బాగా అభివృద్ధి చెందిన పరిశ్ర మల్లో ఇదీ స్థితి.

తర్వాత వచ్చిన ఆర్థిక సంకటదశలో మానేజింగుఏజంట్లు మిల్లులపై తమ పెత్తనం మరింత ఎక్కువచేసుకున్నారు. ఇండియన్ సెంట్రల్ బ్యాంకింగు విచారణ కమిటీ 1931 లో వ్రాసినట్లుగా కొన్నిచోట్ల ఈఏజంట్లు కంపెనీ భార తీయ వాటాదార్లను తుడిచి పారవేశారు.

"బొంబాయి నేడనుభవిస్తున్న లాంటి ఆర్థికసంక్షోభపురోజుల్లో మిల్లు లకు పెట్టుబడిపెట్టిన ప్రత్యక్ష ఫలితంగా మానేజింగుఏజంట్లు ఎక్కువనష్టం పొందినమాట వాస్తవమే అయినప్పటికి, కొన్నిచోట్ల ఈఏజంట్లు మిల్లులకు తామిచ్చిన అప్పులను డిబెంచర్లుగా మార్చుకోవడం జరిగింది. అందువల్ల

ఆ మిల్లులు వీరిపెత్తనంక్రిందికే వచ్చాయి ఆ మిల్లులలో పెట్టుబడిపెట్టిన వాటాదార్లు తమ పెట్టుబడిని పోగొట్టుకొన్నారు."

(సెంట్రల్ బ్యాంకింగ్ విచారణకమిటీ రిపోర్టు, 1931, వాల్యూం 1, పు 279.)

భారత పరిశ్రమలపై బ్రిటిష్‌పెట్టుబడి పెత్తనం ఇంకా సాగుతూనే ఉన్నది. బ్రిటిష్ పెట్టుబడి రద్దుచేసిన విషయంలో సరైనలెక్కలు లేవు. గాని, హౌస్‌ఆఫ్ కామన్సుసభలో 1946 జులై నెలలో. మాట్లాడుతూ భారతీయుల క్రిందికి ఎక్కువ మార్పుబడలేదని ప్రకటించాడు. అసలంతేకాదు ఇంకా బ్రిటిష్ పెట్టుబడి ఎక్కువగా భారతదేశంలోకి ప్రవహించడమే జరిగింది. విదేశ కంపెనీలు తమ శాఖలను ఇండియాలో రిజిష్టరుచేసి ఇండియాలో యేర్పాటు చేశారు. పెద్ద కంపెనీలైన లివర్ బ్రదర్సు, డన్‌లప్, ఇంపీరియల్ కెమికల్సు భారత శాఖలను ఏర్పరచు కొన్నాయి. ఈ 'ఇండియన్ లిమిటెడ్' కంపెనీల సంఖ్య దినదినాభివృద్ధి చెందుతున్నది. 1942-43 ల మధ్య నాలుగేళ్ళలో బ్రిటిష్ ఇండియాకు వెలుపల రిజిష్టరై 'ఇండియా లిమిటెడ్, అని తోకతగిలించు కొన్న కంపెనీలు 5 ఏర్పడ్డాయి ఈ సంగతిని 1945 కేంద్ర శాసన సభ బడ్జెట్ సమావేశంలో భారత ప్రభుత్వ వాణిజ్య సభ్యుడు తెలియ చేశాడు. అంతే కాక 1943-44ల మధ్య ప్రతి పరిశ్రమలకు సంబంధించి 108 'ఇండియా లిమిటెడ్' కంపెనీలు ఇండియాలో రిజిష్టరయ్యాయి. ప్రొఫెసర్ వాడియా, మర్చెంటు అన్నట్లుగా "పెద్ద పెట్టుబడి సాయంతో భారతీయేతర ఫ్యాక్టరీలు బ్రహ్మాండంగా అగ్గిపెట్టెలను, సిగరెట్లను. సబ్బులను, బూటులు, చెప్పులను, రబ్బర్, మందులు మొదలైనవి ఉత్పత్తి చేస్తున్నారు ఇందుతో భారత పరిశ్రమలను మూలకునెట్టి వేస్తున్నారు." (వాడియా, మర్చెంట్ "మన ఆర్థిక సమస్య" 1945, పు 466.)

ఈ 'ఇండియా లిమిటెడ్లు' భారత పరిశ్రమలకు తీవ్రప్రమాదకారులుగా పరిణమిస్తున్న అంశాన్ని, బొంబాయి పారిశ్రామిక - ఆర్థిక విచారణకమిటీ 1940 ప్రకటించిన తమ నివేదికలో యిలా వ్రాసింది.

"మన పారిశ్రామిక విధానలక్ష్యం చిన్నపరిశ్రమ వ్యవస్థలను స్థాపించడమే అయితే.. .ఈ పెద్దపెద్ద విదేశకంపెనీలు ఏమాత్రం తగినంత పరిమితిలేకుండా స్థాపించనిచ్చామంటే పైలక్ష్యం పరాజితమైనట్లే."

(రిపోర్టు 1940 పుట :68 )

బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడికి యింత పెత్తనం రావడానికి ముఖ్యకారణమేమంటే ప్రభుత్వ ద్రవ్యమారక విధానంతో కలిసి విదేశబ్యాంకింగు విధానం నడుపుతున్న పాత్రే ద్రవ్యశక్తి యావత్తూ బ్రిటిష్‌వారి చేతుల్లో గుత్తగా వున్నంత వరకు భారతదేశస్వతంత్ర పరిశ్రమాభివృద్ధినిగూర్చి మాట్లాడడం కేవలం వెఱ్ఱి భ్రమమాత్రమే అవుతుంది.

భారతదేశంలో ఆధునిక బ్యాంకింగు విధానం, నాలుగురకాల సంస్థలద్వారా నేడు సాగుతున్నది.

(1) రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా. ఇది 1934 చట్టంక్రింద ఏర్పడి 1935 నుండి పనిచేస్తున్నది. ఇదే హిమాలయశిఖరంలావుంది. ఇంగ్లాండు బ్యాంకు లాగా ఇదికూడ వ్యక్తులదే వారిదే పెత్తనంకూడ. కాని కరెన్సీ విడుదల, మారకం నిర్ణయం. ప్రభుత్వ బ్యాకింగు ఖాతా దీని చేతిలోనే ఉండడంవల్ల ఇంగ్లాండు బ్యాంకులాగే పరపతిని కంట్రోలు చేస్తున్నది ఈ బ్యాంకుకు ఒక గవర్నరును, ఇద్దరు డిప్యూటీ గవర్నర్లను 5 గురు డైరెక్టర్లను ప్రభుత్వం నియమిస్తుంది. కాని వారిలో 6 గురికి మాత్రమే ఓటింగు హక్కుంది; ఈ ఓటున్న ఆరుగురు డైరెక్టర్లకుతోడు 8 మంది వ్యక్తిగతంగా ఎన్నుకొనబడే డైరెక్టర్లుంటారు వారికి ఎనిమిదిమందికీ ఓట్లుంటాయి. అలాగా దీనిని రాజకీయ కంట్రోలులేకుండా చట్టం కాపాడుతున్నది. 1935 ఇండియా చట్టం చేస్తున్నప్పుడే ఈ కొత్త కేంద్ర బ్యాంగును ఏర్పాటుచేయడంలో ఉద్దేశమేమంటే ఒకవేళ ఈ రాజ్యాంగ సంస్కరణలవల్ల కేంద్రప్రభుత్వంలో కొంతకుకొంత భారతప్రజాభిప్రాయం ప్రతిబింబించినప్పటికీ; ద్రవ్యశక్తి ప్రధానం కనక అందులోమట్టుకు పెత్తనం ఏ మాత్రం భారతీయులకు అందుబాటులో ఉండకూడదనే. లండను టైమ్సుమాటల్లో చెప్పాలంటే ఇది (ఫిబ్రవరి 11, 1928) "కరెన్సీ పరపతి స్వతంత్రంగా ఉండి తీరాలి గనక దానిని రాజకీయ వత్తిడినుండి" రక్షించడమన్నమాట. ఈబ్యాంకులో డైరెక్టర్లబోర్డు ఎన్నిక అనేది బూటకం. అసలు పెత్తనం ప్రభుత్వం చేతిలోనే ఉంటుందని 'రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా' యుద్ధసమయంలో సామ్రాజ్యవాద పాలసీకి లొంగిపోయి ప్రభుత్వశాఖగా మాత్రమే పనిచేయడంతో తేలిపోయింది. రిజర్వుబ్యాంకు పదేళ్ళ వ్యవహారాన్ని సమీక్షచేస్తూ 'ఈస్టరన్ ఎకానమిస్టు' పత్రిక ఇలా వ్రాసింది :

> "ప్రభుత్వం చేసిన నిర్ణయాలను అమలుజరిపే సంస్థగా తన పనిని రిజర్వుబ్యాంకు అభినందనీయంగా పనిచేసింది.... దొరికినసాక్ష్యమంతటిని, బ్యాంకుచేసిన కార్యక్రమాన్ని పరిశీలించినట్టయితే, రిజర్వుబ్యాంకు కేంద్ర సమితికి బ్యాంకుపై సంపూర్ణబాధ్యత లేదని చెప్పకతప్పదు.... అసలు యదార్థమేమంటే, బ్యాంకుపై రాజకీయ యాజమాన్యం ఉండరాదనేది కాక, ప్రజల యాజమాన్యం ఉండకూడదనేదే ప్రభుత్వ ఉద్దేశం."
>
> (ఈస్టరన్ ఎకానమిస్టు, మే 25, 1945.)

(2) మూడు ప్రెసిడెన్సీ బ్యాంకులను కలిపివేసి 1920 చట్టంలో ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ ఇండియాను ఏర్పాటుచేశారు. ఇది 1921 నుండి పని చేస్తున్నది. ఈ బ్యాంకును ప్రభుత్వ నిబంధనలతో 90 లక్షల పౌనుల ఆధరైజ్డు పెట్టుబడితో స్థాపించినప్పటికీ, ఇదికూడ వ్యక్తుల పెత్తనం పెట్టుబడితో ఏర్పడిందే. తొలుత దీనిని కరెన్సీ విడుదల, ప్రభుత్వం బ్యాంకరుపాత్ర, వ్యాపార

వ్యవహారాలు నడపాలనే ఉద్దేశంతో ఏర్పరచారు కాని 1934 సవరణచట్టం ద్వారా ఇప్పుడీ బ్యాంకు రిజర్వుబ్యాంకుతో కలిసి పనిచేస్తున్నది. వ్యాపార వ్యవహారాలుకూడ చూసుకుంటున్నది. దాదాపు నాలుగువందల శాఖలు ఉపశాఖలతో, దేశంలోని బ్యాంకుల డిపాజిట్లలో దాదాపు మూడోవంతు డిపాజిట్లతో భారతదేశంలోవి బ్యాంకింగులో ఈబ్యాంకు ప్రధానస్థానమాక్రమిస్తున్నది 1936 లో దీని డైరెక్టర్లలో 11 మంది ఇంగ్లీషువారు, నలుగురు భారతీయులు ఉన్నారు. *

(3) ఇక మూరకం బ్యాంకులు - అంటే భారతదేశంలోని బ్రిటిష్ - విదేశ బ్యాంకులు. ఈ బ్యాంకుల ప్రధాన కార్యాలయాలు విదేశాలలోనే ఉంటాయి. ఇవి పూర్తిగా విదేశపు బ్యాంకులు. ఈ కంపెనీలు ఎగుమతి దిగుమతి వర్తకానికి సంబంధించిన ద్రవ్య వ్యవహారమంతా తమ చేతనుంచుకొన్నవి 1943 లో ఇలాంటి బ్యాంకులు పదహారున్నవి. అందులో ప్రధానమైనవి: చార్టర్డ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా; ఆస్ట్రేలియా అండ్ చైనా; మర్కెంటైల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా; ది నేషనల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా; ది హాంకాంగ్ అండ్ షాంగై బ్యాంకింగ్ కార్పొరేషన్; లాయడ్సు అనేవి. భారతదేశంలోని మొత్తం డిపాజిట్లలో దాదాపు $\frac{1}{5}$ అయిదోభాగం ఈ బ్యాంకులక్రింనే ఉన్నవి.

(4) ఇండియన్ జాయింట్ స్టాక్‌బ్యాంకులు: ఇవి ఇండియాలో రిజిష్టరైన వ్యక్తిగత బ్యాంకులు. ఇవి బ్యాంకుల పర్వతంలో అట్టడుగున ఉన్నవి. వీనిలో మాత్రమే భారతదేశపు పెట్టుబడికొంత నడుస్తున్నది; కాని, ఈ బ్యాంకులలో పెద్దదైన అలహాబాద్ బ్యాంకులాంటివి కొన్ని వీనిలోకూడ విదేశ బ్యాంకులక్రిందికి పోతున్నవి. అలహాబాద్‌బ్యాంకు 'చార్టర్డ్ బ్యాంక్‌ఆఫ్ ఇండియా ఆస్ట్రేలియా అండ్ చైనా'కు శాఖగా ఉన్నది కాబట్టి ఈబ్యాంకులబలం భారతబ్యాంకులకు బలమని చెప్పడంకష్టం. ఈబ్యాంకులు చాల ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తున్నది ఎన్నో భంగపాట్లు పడవలసి వస్తున్నది 'పీపుల్సుబ్యాంక్‌ఆఫ్. ఇండియా'; 'ది ఇండియన్ స్పీష్‌బ్యాంకు;' 'సిమ్లా అలయెన్సుబ్యాంకు' కూడ ఈఅవస్థే పడాలి 1922-1928 లమధ్య ఒకవంద భారతదేశపు బ్యాంకులు దివాలాతీశాయి. (ఎకానమిస్టు ఏప్రిల్ 12, 1930.)

---

* ఈ బ్యాంకు 'షైరు' వాటాపెట్టుబడి మొత్తం 1930 లో 5 కోట్ల 62 లక్షల 50 వేల రూపాయలు. అందులో "భారతీయేతరుల" పెట్టుబడి 2 కోట్ల 84 లక్షలు; "భారతీయుల" చేతనున్నది. 2 కోట్ల 78 లక్షలు. ఈ లెక్కలను బ్యాంకు మానేజి గు డైరెక్టరు సెంట్రల్ బ్యాంకు విచారణ కమిటీకి తెలిపాడు. అంటే పెట్టుబడి విదేశీయులదే ఎక్కువ; పెద్దపెట్టుబడిగలం స్థానాల్లో ఉన్న కొందరు ఇంగ్లీషు ధనికుల చేతుల్లో వీ కొంపెం ఎక్కువున్నా దాన్ని పెత్తనమంతా వారిదిగానే చేసవేసుకోవడానికి వీలైంది.

సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా 1936 లో సెంట్రల్ ఎక్ఛేంజి బ్యాంకును స్థాపించింది. ఈ రంగంలోనికి ఇండియా బ్యాంకింగు ప్రవేశ చేందుకు ఇదే ప్రథమ ప్రయత్నం.

పై మూడురకాల బ్యాంకులక్రింద-ఇంపీరియల్‌బ్యాంకు (1921 కి ముందు మూడు ప్రెసిడెన్సీబ్యాంకులు), మారకపు బ్యాంకులు, ఇండియన్ జాయింట్‌స్టాక్ బ్యాంకులు-ఉన్న డిపాజిట్ దామాషా 1913, 1920, 1934 లో ఎంతో ఈక్రింద చూడవచ్చును.

## బ్యాంకు డిపాజిట్లు
(లక్షల రూపాయలలో)

| | ఇంపీరియల్ బ్యాంకు (లేక ప్రెసిడెన్సీ బ్యాంకులు) | | మారకపు బ్యాంకులు | | ఇండియన్ జాయింట్ స్టాక్ బ్యాంకులు | |
|---|---|---|---|---|---|---|
| | మొత్తం | నూటికి | మొత్తం | నూటికి | మొత్తం | నూటికి |
| 1913 | 4240 | 43 5 | 3 00 | 31.8 | 2410 | 24.7 |
| 1920 | 8700 | 36 9 | 7480 | 31.6 | 7350 | 31 6 |
| 1934 | 7490 | 33 6 | 7140 | 32 0 | 7680 | 34 4 |

ఇందులో ఇంగ్లీషు —విదేశ బ్యాంకులు ఇంపీరియల్—మారకపు బ్యాంకులు ప్రాబల్యం వహిస్తున్నాయని స్పష్టపడుతుంది ముఖ్యంగా 1913—1920 ల మధ్య ఇండియన్ బ్యాంకుల డిపాజిట్లు నాలుగోభాగంనుండి ముప్పాతిక భాగం ఆక్రమించాయి. ఆ అభివృద్ధి తర్వాత చాల మెల్లగా నడిచింది; వీనిలో విదేశ పెత్తనం కిందికి వెళ్ళిన బ్యాంకులను తీసివేస్తే అసలు భారత పెట్టుబడి వెనక బట్టిందనే చెప్పవలసివస్తుంది యుద్ధకాలంలోకూడ పరిస్థితి ఎక్కువగా మారలేదు. 1938 తర్వాత పైమూడుగ్రూపుల బ్యాంకులకింద ఉన్న డిపాజిట్లను పోల్చిచూద్దాం.

## డిపాజిట్లు (లక్షల రూ.)

| | 1938 | 1941 | 1942 | 1943 |
|---|---|---|---|---|
| 1. ఇంపీరియల్ బ్యాంకు | 8151 | 10892 | 16343 | 21453 |
| 2. మారకపు బ్యాంకులు | 6720 | 10673 | 11685 | 14919 |
| మొత్తం విదేశబ్యాంకులు | 14871 | 21565 | 28031 | 35472 |
| 3 షెడ్యూల్డు బ్యాంకులు | 9187 | 12904 | 18934 | 31965 |
| 4. నాన్‌షెడ్యూల్డు బ్యాంకులు | 1494 | 2005 | 291 | 4023 |
| మొత్తంఇండియన్‌బ్యాంకులు | 10681 | 14909 | 21836 | 36987 |

పై పట్టికనుచూస్తే, 1943 వరకు ఇండియన్ జాయింట్ స్టాక్ కంపెనీ లన్నింటికన్నా ఇంపీరియల్ బ్యాంకు, మారకపు బ్యాంకులదే ప్రాబల్యం ఎక్కువ కనిపిస్తుంది. 1943 లో మాత్రమే ఇండియన్ బ్యాంకులు కాస్త నిలదొక్కుకున్నవి విదేశ బ్యాంకులకన్నా నూటికి 1½ వంతులు డిపాజిట్లను యెక్కువ ఆకర్షించాయి

భారతదేశంలోని బ్యాంకింగును బ్రిటన్ చేతనుంచుకొని, భారత పరిశ్రమల, స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి ఆటంకంగా బ్రిటిష్ స్వప్రయోజనంకోసం దీనిని ఉపయోగిస్తున్నారని భారత పారిశ్రామికులు తీవ్రంగా ఆక్షేపిస్తున్నారు. విదేశపెట్టుబడి కమిటీ రిపోర్టుతో జతపరచిన టి సి. గోస్వామి ప్రకటన ఇక్కడ సరిగా సరిపోతుంది :

"అప్పులివ్వడంలో రంగు, రాజకీయ పక్షపాతం ఉన్నదనే సర్వసామాన్యభావాన్ని ప్రకటించదలచాను - ఇందుకు తగిన లెక్కలుకూడ ఉన్నవని నే నెరుగుదును. వారికున్న ఖాతాకు తగినంత అప్పులను భారతీయులకు ఇవ్వడంలేదు మరొక వేపేమో సామాన్య వర్తక ధర్మప్రకారం ఇవ్వగూడనంత పెద్ద అప్పులను బ్రిటిష్ వ్యాపారస్థులకు ఇస్తున్నారు.

(టి సి. గోస్వామి-విదేశపెట్టుబడి కమిటీ రిపోర్టు అనుబంధం, పుట 24)

ఈ భావాన్ని ఇండియన్ సెంట్రల్ బ్యాంకింగు విచారణ కమిటీ మైనారిటీ సభ్యుల నివేదిక ఖాయపరచింది. మౌనంగా మెజారిటీ సభ్యుల నివేదిక ఈ భావం ఉన్నదని మాత్రం వ్రాసి "సమగ్రమైన అంశాలు తెలియ"వంటూ దీనిమీద తమ అభిప్రాయం వెల్లడించకుండా వదలారు.

"అప్పులకు పెట్టే దరఖాస్తులను చూడడంలో ఇంపీరియల్ బ్యాంకు ఉద్యోగులు రంగు పక్షపాతం చూపుతున్నట్లు కొన్ని ఫిర్యాదులు వచ్చాయి. బ్యాంకులోని యురోపియన్ మానేజర్లు వారి ప్రత్యేక జీవితవిధానం సాంఘిక అలవాట్లవల్ల, యురోపియన్ ఖాతాదార్లతో భారతీయులకన్నా సన్నిహిత మైత్రి ఏర్పరచుకో వీలున్నదని కొందరు సూచించారు. ఈ పరిచయం, స్వంత పరిజ్ఞానమూ యూరోపియన్ సంస్థలకు అప్పు లివ్వడంలో ఎక్కువ ఉదారతకూ, భారతీయులకన్నా-కారణమవుతున్నదని ఆ ఫిర్యాదుల వాదం.

"యూరోపియన్ వ్యాపారసంస్థలకు బ్యాంకు ఎక్కువ ఉదారంగా-భారతీయ వ్యాపారసంస్థలకన్న అప్పులిస్తున్నదని బ్యాంకు సాయంపొందిన చాల భారత వ్యాపారసంస్థలు నానాఅవస్థలు పడవలసివచ్చిందని మరొక సర్వ సామాన్యభావం ప్రబలివుంది, భారతీయేతర సంస్థలకు బ్యాంకు సంపూర్ణసాయం ఇస్తున్నదని, భారతీయసంస్థల అవసరాలకు ఏమాత్రం చాలని ఏకొద్దిసాయమో చేస్తున్నదని కొందరు సూచిస్తున్నారు. ఇంపీరియల్ బ్యాంకువారు మాకు, ఇండియన్, భారతీయేతర సంస్థలకు ఇచ్చిన అప్పుల లెక్కలను సమర్పించారు; కాని సమగ్రమైన విషయసామగ్రి వ్యక్తిగత సంస్థలగూర్చి లేనందువల్ల ఈ ఫిర్యాదును పరిశీలించేందుకు మాకు వీలు లేకపోతున్నది."

(మెజారిటీరిపోర్టు, ఇండియన్ సెంట్రల్ బ్యాంకింగు విచారణ కమిటీ-వాల్యూం 1, పుటలు 271-272.)

ఇలాగే ప్రభుత్వం 1925 లో నియమించిన భారత ఆర్థిక విచారణ సమితి అధ్యక్షుడు సర్ యమ్. విశ్వేశ్వరయ్య గారిలా వ్రాశారు.

"భారతదేశంలో పరిశ్రమలు ప్రారంభించేందుకున్న ప్రధానమైన ఆటంకం ద్రవ్యం ఇదెందుకు ఏర్పడిందంటే దేశంలోని ద్రవ్యశక్తి ప్రభుత్వం పెత్తనంక్రింద ఉన్నది. ఆ ప్రభుత్వం పరిశ్రమ విధానవిషయంలో భారత నాయకులతో ఏకీభవించడం లేదని మనం చూశాము. భారతవర్తకుల క్రింద ఉన్న బ్యాంకులు చాలతక్కువ. పెద్దబ్యాంకులు చాలమట్టుకు ప్రభుత్వం పలుకుబడికిందివో లేక బ్రిటిష్ విదేశ బ్యాంకుల చాయలో ఆణుచున్నవి."

(సర్ యం. విశ్వేశ్వరయ్య "భారతదేశానికి ప్రాణాళిక" 1934, పుట 95 )

## 7. బ్యాంకుల పెట్టుబడి - రెండో ప్రపంచ యుద్ధం

పైపరిశీలనవల్ల క్రిందివిషయం తేలుతుంది. ఆధునికయుగంలో స్వతంత్ర భారతీయ ఆర్థికాభివృద్ధిని వదిలివేసి బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడి పెత్తనాన్ని ధృడతరంగా సమర్థంగా నిలబెట్టుకుంటూ వచ్చారనేది స్పష్టమవుతున్నది. రెండో ప్రపంచయుద్ధమూ, అందుకై భారతదేశాన్ని ప్రాచ్యరంగానికి ప్రధాన సరఫరా కేంద్రంగా చేయవలసిన అవసరమూ ఉన్నా సామ్రాజ్యవాదుల దృక్పథంలో ఏ మాత్రం మార్పురాలేదు. యుద్ధకాలమంతటా, భారతదేశంలో ఏ మాత్రం పరిశ్రమలు పెరక్కుండా ఆటంకపరచడమే బ్రిటన్ అనుసరించిన విధానం. ఈస్టరన్ ఎకానమిస్టు 1945 ఆగస్టు 31 తేదీ యిలా వ్రాసింది.

"మనమేదైనా చేయగలం, కాని ఏమీచెయ్యలేము మనం కేవలం ప్రతి వస్తువునూ— సరఫరా చేసేవారం మాత్రమే. ప్రపంచంలోని అన్ని వస్తువులను (మొందర్పు) మరామత్తుచేయగలం. కాని ఒక వస్తువునుకూడ చేయడంలేదు. మనకొక పద్ధతిలేదు, ప్రణాళికలేదు అంతే క ఇంకా ఈ దేశాన్ని యుద్ధానంతర యుగంలోకూడా పారిశ్రామికం కాకుండా అరికట్టేందుకు తగిన ఖచ్చితమైన, సమగ్రమైన ప్రణాళికమట్టుకు ఉంది మనకు."

ఏమైనప్పటికి తప్పనిసరిగా యుద్ధసమయంలో కొంతవరకు పరిశ్రమల కార్యక్రమం పురోగమించింది 'భారత కర్మాగారాల్లోని కార్మికుల సంఖ్య (అన్ని ప్రభుత్వ ఆయుధ కర్మాగారాలలోని సంఖ్యా కలిసి) 1939లో 17,51,137 నుండి 1944 వరకి 25,20 000 కు పెరిగింది. బ్రిటిష్ ఇండియాలోని జాయంట్ స్టాక్ కంపెనీల 'పైడప్' పెట్టుబడి 1939—40 లలో 288 కోట్ల 50 లక్షల రూ. నుండి 1943—44 వరకి 329 కోట్ల 20 లక్షల రూపాయలకు పెరిగింది. పరిశ్రమల కార్యక్రమ సూచిక (బ్రిటిష్ పెట్టుబడిదారుల వారపత్రిక 'కాపిటల్' నెలసరి లెక్కల ప్రకారం) 1939—40లో 114.0 ఉంటే మే 1945 కు 120.5కు పెరుగుదలను సూచించింది. దీని అత్యధిక సంఖ్య 1945 జనవరిలో మట్టుకే 132.1 కి

హెచ్చింది. కొన్ని రకాల వస్తువుల ఉత్పత్తికూడ హెచ్చింది. కాగితాల ఉత్పత్తి పెరిగింది; యుద్ధానికి పూర్వం 59000 టన్నుల కాగితం మాత్రం తయారయ్యేది; 1943—44 నాటికి 90,000 టన్నులకు హెచ్చింది. (తర్వాత 1944—45 లో ఈ ఉత్పత్తి 75,000 టన్నులకు తగ్గిపోయింది. యుద్ధసమయంలో మిల్లు బట్టల ఉత్పత్తి 38,00,000,000 (380 కోట్లు) గజాలనుండి 470 కోట్ల గజాలకు పెరిగింది. (ఈస్టరన్ ఎకానమిస్టు 1946 జనవరి 4) యుద్ధం మూలంగా రసాయన వస్తువులు మొదలైన వాని ఉత్పత్తికూడ హెచ్చింది; సాలు సరి ఉక్కు ఉత్పత్తి 1939 లో 7,50,000 టన్నులనుండి 1943—44 కు 11,25,000 టన్నులకు హెచ్చింది. కొత్త రకాల ఉక్కు—అలాయ్ అసిడ్ ఉక్కు మొదలైనవి తొలి సారిగా తయారైనవి. కొంతవరకు విమానాలు, నౌకలు మొదలైన వాని మరమ్మతు పనులు ప్రారంభింపబడినవి.

కాని, భారతవాణిజ్య - పరిశ్రమ మండలి సమాఖ్య అధ్యక్షుడు సర్ బదరీనాథ్ గోయెంకా చెప్పినట్టుగా యుద్ధకాలంలో భారతదేశపు ఉత్పత్తిలో జరిగిన హెచ్చింపల్లా "ఉన్నయంత్రాలు కర్మాగారాలు అధికంగా పనిచేయడం మూలంగానూ, ఎక్కువమంది కార్మికులను వరుసలుమార్చి పనిచేయించడం మూలంగాను జరిగిందేకాని, అదనపు ఉత్పత్తియంత్రాలను ఇతర యుద్ధబాధిత దేశాల్లోలాగా ఏర్పరచడం మూలంగా జరిగిన హెచ్చింపుకాదు."

(ఈస్టరన్ ఎకానమిస్టు, మార్చి 5, 1946)

యుద్ధానికి పూర్వం, భారత పరిశ్రమలు తమ ఉన్నశక్తిని ఉపయోగించలేక బాధపడుతుండేవి. ఉదాహరణకు జనపనారమిల్లుల శక్తి ఉపయోగింప బడుతున్న శక్తికన్నా మూడువంతులకుపైగా ఉండేది. బొంబాయిమిల్లు యజమానుల సంఘం లెక్కలప్రకారం ఉన్న 389 బట్టలమిల్లులలో 22 మిల్లులు 1939 ఆఖరుదాక మూలబడో, ఏకాద్దిగా పనిచేస్తూనోమాత్రమే ఉండేవి. (పి సి జైన్, "భారతదేశపు యుద్ధ ఆర్థిక వ్యవస్థ నిర్మాణం" 1943, పుట 4) యుద్ధకాలంలో తొలుత ఈ అదనపుశక్తిని ఉపయోగించారు. తర్వాత క్రమేణా ఉన్నయంత్రాలనే ఎక్కువ పనిచేయించారు. కొత్త పరిశ్రమలను స్థాపించేందుకేకాక, ఉన్న పరిశ్రమలకు కొత్త సామాన్లతో సన్నద్ధంచేయడానికికూడ యంత్రాలు దిగుమతి కాకుండా ప్రభుత్వం చూచింది. కొన్ని ఉదాహరణలు చూచినట్టయితే ఇందుకు ఫలితంగా ఎంత ఎక్కువ భారం పరిశ్రమలపై పడిందో తెలుస్తుంది. ఉదాహరణకు రైల్వే రవాణా పద్ధతిని చూదాం, యుద్ధానికి పూర్వంతో పోల్చిచూస్తే యుద్ధసమయంలో పాసెంజర్లు (ప్రయాణీకుల బండ్లు) నూటికి 32 వంతులు ఎక్కువమందిని, గూడ్సులు 8½ వంతులు ఎక్కువబరువును మోస్తున్నవి; రైల్వే ఇంజన్లు తమ షెడ్‌కుపోయేలోగా పూర్వంకన్నా రెట్టింపు దూరంప్రయాణం చేయవలసివచ్చేది; దాదాపు నూటికి 29 పాతఇంజన్లు, అసంఖ్యాకమైన పాతవాగన్లు మార్చకుండా పనిలో ఉంచారు. (ఈస్టరన్ ఎకానమిస్టు, ఫిబ్రవరి 15.1946). నూలు బట్టల

మిల్లుల పరిశ్రమ చూడండి. ఇప్పుడు నేతమిల్లుల యంత్రాలలో సగం మార్చి వేయవలసిఉన్నవి. బ్లోరూమ్ యంత్రాలలో ఇప్పుడున్నవాటిలో 11 5 వంతులు 1890 కి ముందు స్థాపించినవి; 11 1 వంతులు 1906-10 ల మధ్య ఏర్పరచినవి; 18 6 వంతులు 1921-25 లో; 11.4 వంతులు 1936-40 లో ఏర్పరచినవి. ఇక డ్రా-స్పీడ్ చట్టాలు నూటికి 35.5 1910 కన్నా ముందు స్థాపించినవి. (ప్రైడే జులై 7, 1944) ఈ పాతపడిపోయిన యంత్రాలే యుద్ధంలో ఎక్కువైన గిరాకీకి తగినట్లు పనిచేయవలసివచ్చింది. నౌకల్లో స్థలంలేదనే దొంగసాకుతోనూ, యంత్రాల విడుదలను నియమించీ ఏదోవిధంగా ఏమాత్రం యంత్రాలు యుద్ధసమయంలో భారతదేశానికి రాకుండా ప్రభుత్వం చూచింది.

యుద్ధప్రయత్నాలకు విధ్వంసనం కలుగుతున్నాసరే, దేశంలోని విశాల సహజావకాశాలను * సమీకరించేందుకు ఏ తీవ్ర ప్రయత్నాలనూ చెయ్యలేదు. యంత్రాల దిగుమతి చేసేందుకు వసతి. మిలిటరీకి కొనుక్కుంటామనే హామీ ఇవ్వకుండా ప్రభుత్వం మోటారుకారుల పరిశ్రమను, నౌకా నిర్మాణ పరిశ్రమను అరికట్టింది; అంతేకాక అమెరికన్ టెక్నికల్ కమిషన్ సిఫారసులనుకూడ భారత ప్రభుత్వం అంగీకరించలేదు. (అమెరికన్ మిషన్ స్పష్టంగా, ఖచ్చితంగా ఏ భారీ పరిశ్రమను కూడ - హైడ్రో ఎలెక్ట్రిక్ కేంద్రాలు, విమాన నౌకానిర్మాణ కేంద్రాలు, పెద్ద ఇంజన్లు ఇలాంటివి - ఏర్పరచకూడదని చెప్పివేసింది.)

"ఒకవేపు 100 నౌకలు హార్బరులో పెద్ద చిన్న మరమ్మతులకోసం కాచుకునిఉంటే, బొంబాయి నౌకల మరమ్మతు కర్మాగారంలో గుర్రాల నాడాలు, సైనికుల బూట్సులకు ఇనప చీలలు, రైలు రోడ్డు స్విచ్ గేరులు తయారు చేస్తుండడం" అమెరికన్ టెక్నికల్ మిషన్ చూచింది. (రిపోర్టు పుట 3.) ప్రతి పరిశ్రమలోను ఏవో మార్పులు సూచించడమేకాక ఆకమిషన్ భారతదేశంలో నౌకలను, విమానాలను సరిగా మరమ్మతుచేయాలని కోరింది; "మీటర్‌గేజి ఇంజన్లను, లారీలను, ముఖ్య రవాణా యంత్రాలను" ఉత్పత్తిచేయాలని సలహా ఇచ్చింది. ఇందుకు కావలసిన యంత్ర సామగ్రిని, నిపుణులను అమెరికానుండి పంపుతామని అమెరికన్ టెక్నికల్ మిషన్ వాగ్దానం చేసింది. వారు ఇలా వ్రాశారు:

> "భారతదేశంలోని పారిశ్రామిక ఉత్పత్తి అభివృద్ధి కొంతవరకైనా అమెరికా అరువుకవులు వస్తువులమీద ఈ దేశపు నిపుణుల సలహా మీద ఆధారపడాలి." (అమెరికన్ టెక్నికల్ మిషన్ రిపోర్టు పుట, 6.)

---

* ఈ విషయంలో అమెరికన్ టెక్నికల్ మిషన్ వ్రాసిన మాటలు గమనింపదగ్గవి వారు నివేదికను ముగిస్తూ ఇలా వ్రాశారు: "విశాలమైన సహజ, మానవసంపదనుబట్టి భారతదేశంలో గర్వించదగిన పారిశ్రామికోత్పత్తి అవకాశాలను జ్ఞప్తి చేస్తున్నాము. తగిన సాధనాలను సమకూర్చితే ఈ సహజసంపత్తి ఉపయోగాన్ని చాల అభివృద్ధిచేయవీలున్నది. భారత కార్మికుల యంత్రాలపై అభిలాషచూస్తే, వారికి తగిన ప్రతిఫలమూ, సౌకర్యాలు ఇస్తే, కొన్నాళ్ళ శిక్షణతో వారు సమర్థులైన నిపుణ కార్మికులు కాగలరు."

కమీషన్‌సభ్యుల ప్రధానమైన సిఫారసులను అమెరికా యంత్రనిపుణ సాయంతోనైనా అమలు జరిపేందుకూడ బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించింది. అంతేకాక అసలు వారి రిపోర్టునే రహస్యమని త్రొక్కిపెట్టింది.

అధినివేశ దేశాలైన కనడా, ఆస్ట్రేలియాలు భారీపరిశ్రమలు స్థాపించుకొనేందుకు తమ ఆర్థికాభివృద్ధి స్థాయిని హెచ్చించుకొనేందుకు బ్రిటన్ సాయపడింది. కాని భారతదేశ ఆర్థికస్థితి పూర్వంలాగా ఏమీ మారకుండా నిలిచింది: ప్రధానపరిశ్రమలు ఏర్పడలేదు.

భారతదేశాభివృద్ధిని అరికట్టే ఈ విధానానికి తూర్పురాజ్యాల సరఫరా కౌన్సిలును బ్రిటన్ బాగా ఉపయోగించుకున్నది. ఈ కౌన్సిలులో భారతదేశ సభ్యుడు కూడ వున్నాడు. సామ్రాజ్యదేశాలన్నిటినుండి యుద్ధసరఫరాలను చేర్చడం, పంపకం చేయడం దీనిపని. ఈ కౌన్సిలుద్వారానే, సామ్రాజ్యదేశాలమధ్య పోటీ రాకుండా—ఒకచోట ఉత్పత్తి మరొకచోటకూడ ఉండకుండ చేయాలన్న సాకుతో ప్రభుత్వం భారత పరిశ్రమలు పెంపొందకుండా చూచింది. భారత ప్రతినిధి అంటే ప్రభుత్వోద్యోగే ఆ కౌన్సిలులో ఉన్నాడు. వారు యుద్ధసరఫరాలకు వివిధ దేశాలకు (ఆర్డర్లు) దరఖాస్తులివ్వడంలో బుద్ధిపూర్వకంగా పక్షపాతంచూపారు. అఖిలభారత పారిశ్రామికులసంస్థ అధ్యక్షుడు సర్ యం. విశ్వేశ్వరయ్య యిలా వ్రాశాడు.

> "నేటి యుద్ధానికి కావలసిన ఉత్పత్తులలో వివిధ సామ్రాజ్యదేశాలకు యిచ్చే 'ఆర్డర్లు' రోగర్ మిషన్, తూర్పుదేశాల సరఫరా కౌన్సిల్ సిఫారసుల ననుసరించి చేస్తున్నట్లున్నది. ఇప్పుడున్న ఏర్పాట్లనుబట్టి, ఏమాత్రం ఉత్తమ నైపుణ్యంగాని, అభ్యాసంగాని లేని ఏ కొలదివస్తువులకు మాత్రమే భారత పరిశ్రమలను పారిశ్రామికులకు వేరుపరుస్తున్నారు. భారీపరిశ్రమలు, ఉత్తమనైపుణి కావలసిన వస్తువులను మట్టుకు, ఏ అమెరికాకో, కనడా, ఆస్ట్రేలియా అధినివేశరాజ్యాలకో ఏర్పరుస్తున్నారు."
>
> (సర్ యం. విశ్వేశ్వరయ్య "పరిశ్రమలద్వారా సౌభాగ్యం" 1943 పుట 15.)

తూర్పు దేశాల సరఫరా కౌన్సిల్ అనుసరిస్తున్న ఈ తిరోగమన లక్ష్యం, కార్యక్రమం చూచి బ్రిటిష్ ధనికవర్గం 1940 డిసెంబరులోనే ఎంతో బాధ వదిలిపోయిందని సంతృప్తితో గమనించారు. తూర్పు దేశాల సరఫరా కౌన్సిల్ సమావేశానికి బ్రిటిష్ వాణిజ్యమండలి ప్రతినిధిగానే లోకాక్ 1940 అక్టోబరులో వెళ్లాడు.

అందుపై 'రైల్వే గజెట్' (లండన్) ఇలా వ్రాసింది :

> యుద్ధోత్పత్తులను విశాలపరచడానికి జరుగుతున్న ప్రయత్నాలవల్ల, బ్రిటిష్ పరిశ్రమలపై ఎలాంటి ఫలితాలు రానున్నవో—యుద్ధావసరాలకు ప్రాముఖ్యతనివ్వాలనేది దృష్టిలో ఉంచుకొని—తెలియజేయడం కోసం ఆయన్ను (లోకాక్‌ను) బోర్డు ప్రతినిధిగా పంపారు....రాయబార వర్గం

భారతదేశానికి వెళ్ళినందువల్ల యుద్ధావసరంకాని ఉత్పత్తిని విస్తృత పరిచేందుకు ఎలాటి కార్యక్రమమూ అవలంబింపబడలేదని లోకాక్ అభిప్రాయపడుతున్నాడు. మొత్తంమీద యుద్ధానంతరం భారత దేశంలో బ్రిటిష్ పరిశ్రమల ప్రయోజనాలు పూర్వమనుకున్నట్టు ఏమంత నష్టపడేటట్లు కన్పించడం లేదు.

(విశ్వేశ్వరయ్యగారి "ఇండియాలో యుద్ధానంతర పునర్నిర్మాణం" 1944, పుట 15 లో ఉదహరింపబడినది.)

యుద్ధపరిస్థితిలో మార్పువచ్చిందిగనుక, "విదేశాల సేనానివేశాలు, భారత ప్రభుత్వంనుండి కొనేవస్తువులు కౌన్సిలుద్వారా చేయడం. ఇక ప్రయోజనకారిగా కనిపించ"దని అమెరికన్ టెక్నికల్ మిషన్ కూడా భావించింది. కాబట్టి "బయటినుంచి వచ్చే అర్డర్లు సరాసరి భారతప్రభుత్వ సరఫరాశాఖే చూడాలని తూర్పుదేశాల సరాఫరా కౌన్సిల్ద్వారా నడపవలసిన అవసరం లే"దని అమెరికన్ మిషన్ సిఫారసుచేసింది. "ఉత్పత్తి సరఫరాలగూర్చి కేవలం విషయసంగ్రహాణంచేసే సంస్థగా" కౌన్సిల్ పనిచేయవచ్చునని వారు సూచించారు. (రిపోర్టుపుట 7.)

ఇందుకు భారతప్రభుత్వం అంగీకరించలేదు. ముందుగా వివరించిన కారణాలవల్ల ఇదిసహజంగానే కనిపిస్తుంది. తూర్పుదేశాల సరఫరా కౌన్సిలు నియమావళినిబట్టి "ఆర్డర్లను కౌన్సిలే చూడవలసి ఉందని, ఈకర్తవ్యాన్ని వదలివేయదని" భారతప్రభుత్వం అమెరికన్ మిషన్ నివేదికపై వ్రాశారు.

భారత ప్రభుత్వం దేశంలో భారీ పరిశ్రమల స్థాపనను ఆటంకపరచడమే కాక, ప్రత్యక్షంగా వివిధ కార్యక్రమాల్లో విదేశ సంస్థలకు సాయంచేసింది. యుద్ధసమయంలో 50 లక్షల పౌన్లు పెట్టుబడితో ఏర్పడిన "యునైటెడ్ కింగ్డం కమర్షియల్ కార్పోరేషన్కు" ఇతర దేశాల వ్యాపారమంతా గుత్తకిచ్చారు అంతేకాక మోటర్ల భాగాలను కలిపే పనికూడ మొత్తంగా—రెండు అమెరికా కంపెనీలకు—జనరల్ మోటార్సు, ఫోర్డు—అప్పజెప్పారు.

పరిశ్రమాభివృద్ధి జరగవలసిన ఈ సమయంలో—బ్రిటిష్ రాజ్య చరిత్రలో మున్నెన్నడులేనంత తీవ్రంగా దోపిడీ బాధలు భారతదేశం అనుభవించింది. మునుపు యుద్ధాలన్నిటికన్నా ఎక్కువ భారాన్ని భారత ప్రజలపై వేశారు. 1939 నవంబరులో బ్రిటిష్ ప్రభుత్వం, తమ ఏజెంట్లను భారత ప్రభుత్వంతో యుద్ధ వ్యయం పంచుకోవాలని ఒడంబడి చేసుకుంది. ఈ ఒడంబడిక ప్రకారం మొత్తం రక్షణ ఖర్చులలో భారతదేశం ఈ క్రింది వానిని భరించాలి.

(1) భారతదేశం శాంతిసమయంలో చేస్తున్న ఏటా ఇంత అని నియమితమైన మొత్తం; దీనికి 36 కోట్ల 77 లక్షల రూపాయలని నిర్ణయించారు.

(2) పై మొత్తంలో ధరలు పెరగడంవల్ల ఎక్కువయ్యే మొత్తమూ—

(3) భారతదేశం తన క్షేమంకోసమని తానే ప్రారంభించిన యుద్ధ ప్రయత్నాలకయ్యే ఖర్చులు;

(4) సామ్రాజ్య రక్షణకై విదేశాలలో యుద్ధంచేస్తున్న సేనల వ్యయం కోసం మొత్తంగా కోటిరూపాయలు ఇవ్వాలి.

భారతదేశంలో 'రిక్రూట్' చేసిన సేనలు భారతదేశంలో ఉన్నన్నాళ్ళు వారిని సమీకరించేందుకు, శిక్షణ నివ్వడానికి, ఆయుధాలివ్వడానికి అయ్యే ఖర్చులన్నీ భారతదేశమే భరించాలి - ఈ సేనలను స్థానిక రక్షణకు ఉపయోగించవచ్చును ఆ సేనలు భారత దేశంవిడిచి బయటికి వెడుతూనే వాటిశిక్షణకు, ఆయుధాలకు అయ్యే ఖర్చులు బ్రిటిష్ ప్రభుత్వం పెట్టుకోవాలి ఆసేనలకు తర్వాత ఖర్చులన్నీ బ్రిటనే భరిస్తుంది.

ఇదికాక, భారతదేశంలో ఉన్న విదేశసేనలకు చేసే సరఫరాలు వగైరాలకయ్యే ఖర్చులన్నీ భరించేందుకు బ్రిటన్ అంగీకరించింది. జపాన్ యుద్ధంలో దిగడంతో ఈఖర్చు చాలఎక్కువయింది.

పైకిచూస్తే, సామ్రాజ్య రక్షణకయ్యే ఖర్చులు భారతదేశంపై తోయడం ఇష్టంలేక చేశారని అనిపిస్తుంది. కాని యదార్థంలో ఈ ఒడంబడిక-పై భాగాన్ని పైకి కనిపించకుండా ఇండియాపై త్రోయడానికే ఒకఎత్తు.

ఒకే కుటుంబానికి చెందిన బ్రిటిష్‌ప్రభుత్వం, భారతప్రభుత్వం, రిజర్వు బ్యాంకు మూడూకలసి ఒక ఒడంబడికకు వచ్చాయి పైనచెప్పినలాంటి బ్రిటిష్ ప్రభుత్వం అచ్చుకోవలసిన ఖర్చులన్నింటికి అప్పుగా రిజర్వుబ్యాంకు కాగితపు నోట్లను ఎక్కువగా విడుదలచేయడానికి అంగీకరించింది. ఈమొత్తానికి సరిగా బ్రిటిష్‌ప్రభుత్వం ఇంగ్లాండుబ్యాంకు లెక్కల పుస్తకాల్లో స్టెర్లింగులు భారతదేశం పేర జమవ్రాస్తూ ఉంటుంది. ఇందు మూలంగా యుద్ధఖర్చులు భరిస్తామనే ఒడంబడిక-కేవలం డబ్బిస్తామని ప్రామిసరీనోటు మాత్రమే అయిపోయింది. అసలయ్యే విపరీత వ్యయభారమంతా భారతదేశంపైనే పడింది.

ఆ ఒడంబడిక ప్రకారం భారతదేశం పెట్టుకోవాలన్న ఖర్చు ఆకాశమంటింది. కొన్ని ఏండ్లలో యుద్ధానికి మొత్తం జాతీయాదాయం మొత్తంకన్నా మూడో వంతుపైగా హెచ్చిందికూడా.

## భారతదేశ రక్షణ వ్యయం
(లక్షల రూపాయలలో)

| సంవత్సరం. | పెట్టుబడి ఖాతా. | రెవిన్యూ ఖాతా. | మొత్తం. |
|---|---|---|---|
| 1939—40 | — | 4954 | 4954 |
| 1940—41 | — | 7361 | 7361 |
| 1941—42 | — | 10393 | 10393 |
| 1942—43 | 5251 | 21462 | 26713 |
| 1943—44 | 3746 | 35840 | 39586 |
| 1944—45 | 6283 | 39549 | 45832 |
| 1945—46 * | 1493 | 37642 | 39135 |
| మొత్తం | 16773 | 157201 | 173974 |

(రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా : "కరెన్సీ ఫైనాన్సు రిపోర్టు 1945–46.")

ఇలాగే బ్రిటిష్ ప్రభుత్వంతో రాబట్టుకోవలసింది అనబడే యుద్ధవ్యయం కూడ మిన్ను ముట్టింది.

* రివైజ్‌డ్ అంచనా.

## బ్రిటన్ నుండి రాబట్టుకోవలసిన యుద్ధవ్యయం *

| సంవత్సరం. | ఖర్చు లక్షల రూపాయలు. |
|---|---|
| 1939—40 | 400 |
| 1940—41 | 5300 |
| 1941—42 | 19400 |
| 1942—43 | 32540 |
| 1943—44 | 37787 |
| 1944—45 | 41084 |
| 1945—46 · | 34707 |
| మొత్తం | 17,12,26 |

రివైజ్‌డ్ అంచనా. (పైరిపోర్టే, పుట 48.)

భారతదేశానికి బాకీపడిన స్టెర్లింగు నిల్వలు ఇంగ్లాండు బ్యాంకు పుస్తకాల్లో జూన్ 1946 నాటికి 21,29,25 లక్షల రూపాయలు ఉన్నవి. ఈ నిల్వలు యింకా పెరుగుతూనే ఉన్నవి.

---

* యుద్ధఖర్చు ఇంత విపరీతంగా పెరిగిపోవడానికి కారణం, బ్రిటిష్ సామ్రాజ్య తత్వవిధానం పతనావస్థే; వలసరాజ్య ప్రజలకు రాజకీయాధికారం ఇవ్వక, ఆ దేశాల సహజశక్తులను ఆ ప్రజల సహకార స్వభావాలద్వారా సమీకరించలేక పోవడమే.

ఈ మొత్తమంతా, యుద్ధసమయంలో భారతప్రజలకు అందకుండా ఉంచబడింది. వస్తురూపంలోగాని, బంగారు రూపంలోగాని ఈ మొత్తాన్ని భారత దేశం వ్యాపార వ్యవహారాల్లో ఉపయోగించుకో వీలులేకపోయింది స్టెర్లింగు నిల్వలేమో పెరిగిపోతూ వచ్చాయిగాని, అత్యవసరమైన యంత్రాల దిగుమతి వగైరాలకు అందులోనుండి అణుమాత్రంకూడ భారతదేశానికి దొరకలేదు.

భారతదేశానికి తాను యజమానిగా ఉన్న స్థాయిని బ్రిటన్ పూర్తిగా వినియోగించుకున్నది. విదేశాలలోని బ్రిటిష్ పెట్టుబడి సంగతి ఏమైనప్పటికి, ఈ స్టెర్లింగు నిల్వలకుగాను ఇండియాలోని బ్రిటిష్ విదేశపెట్టుబడిని స్వాధీన పరచుకోవడంకూడ ప్రభుత్వం జరగనీలేదు భారతదేశం ఇవ్వవలసిన ప్రభుత్వ ఋణం (స్టెర్లింగు)లో 3234 పౌనులు మాత్రం తొలగించేందుకు ఒప్పుకున్నారు. మిగిలిన 127135 లక్షల పౌనులు - దాదాపు ఈ తరతరాల బాకీకి నాలుగురెట్లు ఇంకా ఇంగ్లాండు బ్యాంకు లెక్కల్లో మూలుగుతున్నది. యుద్ధం ముగుస్తూనే ఏవేవో సాకులుచెప్పి ఈ మొత్తం ఎగవేయడానికి లేదా తగ్గించడానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిపాదనలు చేసింది. ఇందుకై. 1946 లో జరిగిన ఆంగ్లో-అమెరికన్ ఆర్థిక ఒడంబడికలో ఒక షరతుగా బ్రిటన్-అమెరికాలు రాజీ పడ్డాయి.

దీనికితోడు ఇండియాకున్న డాలరు నిధినికూడ సామ్రాజ్యవాద పాలకులు కాజేశారు. యుద్ధకాలంలో "డాలరునిధి ఏర్పాటు" అన్నది జరిగింది. దానిమేరకు వివిధదేశాలు అమెరికాకు తమ వస్తువుల నమ్మి చేర్చిన డాలర్లన్నీ ఒకచోట చేర్చితీరాలి. ఈ డాలర్ నిధిని ఉపయోగించుకొని భారతదేశము, మిగత దేశాలు అమెరికానుండి సరాసరి ఏవీ కొనడానికి వీలులేదు. యుద్ధవస్తువులు కొనేందుకు బ్రిటిష్ ప్రభుత్వం మట్టుకే ఈ డాలర్ నిధిని ఉపయోగించగలదు ఆఖరుకు ఈ నిధి మొత్తమెంతోకూడ బయటపెట్టలేదు. భారతదేశపు డాలరు నిల్వలను గూర్చి ఒకరి అంచనాకు మరొకరి అంచనాకు చాల భేదం కనిపిస్తుంది.

1942—45 నాలుగేళ్ళలోను అమెరికాతో భారతదేశం జరిపిన వ్యాపారములో భారతదేశానికి రావలసిన మొత్తం 42 కోట్ల 10 లక్షల డాలర్లదాక ఉన్నట్లు అమెరికా ప్రభుత్వ వాణిజ్యశాఖ వెల్లడించింది. ఇంకా ఇప్పటికీ భారతదేశానికి రావలసిన డాలర్లు 114 కోట్ల రూపాయలున్నవని మనూసుబేదార్ ప్రకటించాడు. 'ఈస్టరన్ ఎకానమిస్టు' మార్చి 8 వ తేదీ 1946 న వేసిన అంచనాప్రకారం 1945 అక్టోబరునాటికి సామ్రాజ్య డాలర్ నిధిలోకి భారతదేశం కనీసం 90 కోట్ల డాలర్లు జమకట్టి ఉంటుంది. భారత ప్రభుత్వ ఆర్థిక సభ్యుడు 1945 మార్చివరకు డాలర్ నిధికి భారతదేశంఇచ్చిన మొత్తం 49 కోట్ల 20 లక్షల రూపాయలని ప్రకటించాడు.

ఇందువల్ల 1945 మార్చివరకు ఈమొత్తం రూ. 100 కోట్లనుండి రూ. 200 కోట్లవరకు ఈ మధ్య ఎక్కడైనా కావచ్చు. అప్పటినుంచి ఈ మొత్తం పెరుగుతూనే ఉన్నది. ఈ డబ్బును పరిశ్రమాభివృద్ధికై యంత్రాలు దిగుమతి చేసుకునేందుకు

ఉపయోగించకుండా దూరంగా ఉంచారు 1946 బడ్జెట్ ఉపన్యాసంలోకూడ, ఈ డాలర్ నిధిని అలా ఉంచడంవల్ల భారతీయులకేదో లాభమున్నట్లు చూపించేందుకు భారత ప్రభుత్వ ఆర్థిక సభ్యుడు ప్రయత్నించాడు:

ఊరికే మరిన్ని నోట్లను అచ్చుపేస్తూ రావడమనే ఈ సామ్రాజ్యవాదుల యుద్ధ ద్రవ్య విధానం భారతాదేశ ఆర్థిక స్థితిని చాల గగ్గోలు పరచింది. యుద్ధం నుండి భారతదేశం ధనమంతాపోయి ఆర్థిక దౌర్బల్యంతో బయటపడింది అప్పటికే ఆకలితో మాడుతున్న భారత సామాన్య ప్రజలపై అసలీ యుద్ధభారంపడింది.

మొట్టమొదలు అసలీ నోట్లముమ్మరం (ఇన్ఫ్లేషన్) ఎంతవరకుపోయిందో పరిశీలింతాము.

## మారకంలో ఉన్న నోట్లు (లక్షల రూపాయలు)

| | |
|---|---|
| అగస్టు 1939 | 17889 |
| 1939-40 | 20922 |
| 1940-41 | 24141 |
| 1941-42 | 30768 |
| 1942-43 | 51344 |
| 1943-44 | 77717 |
| 1944-45 | 96869 |
| 1945-46 | 116264 |
| 28 జూన్ 1946 | 123784 |

పైలెక్కలు 'రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా' నివేదికలనుండి తీసుకున్నాను. వీనివల్ల, నోట్లు యుద్ధసమయంలో (ఇది ఇప్పటికీ సాగుతునే ఉన్నది) దాదాపు 600 రెట్లు పెరిగిపోయాయని తెలుస్తుంది. మరి పరిశ్రమల కార్యక్రమసూచిక 1939-40 లో 114.0 గా ఉన్నది. అత్యధిక మనుకున్నప్పుడుకూడ (1945 జనవరిలో) కేవలం 132.5 సంఖ్యలోనేఉంది,

ఈనోట్ల ముమ్మరంమూలంగా యుద్ధపుపనుల కంట్రాక్టర్లు, పరిశ్రమల యజమానులు విపరీతమైన లాభాలు గడించారు.

ఉదాహరణకు నూలుపరిశ్రమ లాభాలనే తీసుకుందాం. మొత్తం దేశమంతటా ఈ పరిశ్రమకో ఎంతలాభం వచ్చిందో లెక్కలు చిక్కడంలేదు కాని బొంబాయి మిల్లులలెక్కలు చక్కని సూచికగా ఉపయోగపడగలవు. బొంబాయి నూలు మిల్లుల యజమానులు 1941 లో సంపాదించిన లాభాలు 6 కోట్ల 94 లక్షల రూపాయలు. ఈ మొత్తం 1940 తో పోల్చిచూస్తే నూటికి 1288 రెట్లు ఎక్కువ.

ఇక కొన్ని ప్రత్యేకమిల్లులను మాత్రం తీసుకుంటే అవి 1940 లో సంపాదించిన లాభాలకన్నా 1941 లో నూటికి 2250 రెట్లు ఎక్కువ గడించాయి. (వాడియా-మర్చెంటు "మన ఆర్థికసమస్య" 1945, పుట 270). బొంబాయిలోని ప్రధానమైన 15 నూలుమిల్లులు మొత్తం 90 లక్షల రూపాయలను. 1940 లో, రు 2 కోట్ల 95 లక్షలు 1941 లో, 8 కోట్ల 5 లక్షలు 1942 లో, 17 కోట్ల 52లక్షలు 1943 లో, 13 కోట్ల 6 లక్షలు 1944 లో లాభం గడించాయి: * (హెచ్. టి.పారేఖ్ 'కామర్సు' పత్రికలో జులై 7, 1945).

ప్రేమసాగరగుప్త లెక్కలప్రకారం బొంబాయి దీవిలోని 61 నూలుమిల్లులు మొత్తం 13 కోట్ల 93 లక్షల రూపాయల పెట్టుబడితో యుద్ధం అయిదేళ్ళలోను అంతకు ఆరున్నర రెట్లు నిఖరం లాభం గడించినట్టుతెలుస్తున్నది. ఈఅయిదేళ్ళలో సాలుసరి ఆదాయం 1939 లో సంపాదించినంతకన్నా 26 రెట్లు సంపాదించారు.

ఇదే వివిధ పరిశ్రమల లాభాల సూచిక తెలియజేస్తుంది.

## సగటు లాభాల సూచీసంఖ్య

1939 లో 100 అని ప్రాతిపదిక

| | 1939 | 1940 | 1941 | 1942 | 1943 |
|---|---|---|---|---|---|
| జనుము పరిశ్రమ | 100 | 590 | 617 | 896 | 926 |
| ప్రత్తి | 100 | 73 | 105 | 313 | 645 |
| తేయాకు | 100 | 118 | 214 | 252 | 392 |
| పంచదార | 100 | 143 | 122 | 160 | 218 |
| బొగ్గు | 100 | 88 | 107 | 95 | 124 |
| ఇంజనీరింగు | 100 | 115 | 180 | 36 | 225 |
| చిల్లర పరిశ్రమలు | 100 | 104 | 326 | 394 | 401 |
| అన్నిరకాల పరిశ్రమలు | 100 | 127 | 282 | 259 | 327 |

(యమ్. హెచ్. గోపాల్, "1939 నుంచి పరిశ్రమల లాభాలు" ఈస్టరన్ ఎకానమిస్టు పత్రికలో, మే 12, 1944. పుట 730.)

ప్రభుత్వపులెక్కలుగూడా (భారతప్రభుత్వపు ఆర్థికసలహాదారు ఇచ్చినవి.) చాలతక్కువ అంచనా వేస్తున్నవి. అవికూడ కేవలం 1942 వరకే ఉన్నవి. అసలు పూర్తిగా నోట్లముమ్మరం — అందుతోపాటు లాభాలు అత్యుచ్చస్థితికి వెళ్ళిన సంవత్సరం 1943 కాబట్టి యథార్థస్థితిని ఈ లెక్కలు సూచించవు.

* ఇవి నిఖరం లాభాలు. పరిశ్రమలు నడిపే ఖర్చులు, ఏజంట్లు, కమిషన్లు, పరిహారాలు, యంత్రం వాడకం ఖర్చులు అన్నీతీసివేసిన తర్వాత తేలినవి.

## లాభాల సూచీసంఖ్య
(ప్రాతిపదిక : 1928—100)

| | 1939 | 1942 |
|---|---|---|
| ప్రత్తి | 154.6 | 760.7 |
| జనుము | 13 6 | 49.2 |
| తేయాకు | 96 2 | 219.5 |
| బొగ్గు | 139 1 | 110.3 |
| చక్కెర | 179.4 | 219 8 |
| ఇనుము, ఉక్కు | 289 3 | 403.3 |
| కాగితం | 151 8 | 488.4 |
| అన్ని పరిశ్రమల మొత్తం | 72 4 | 169.4 |

ఈ పద్ధతి యావత్తూ భారత ప్రజానీకాన్ని అష్టకష్టాలపాలు జేసింది. ఆరేళ్ళపొడుగునా భారతప్రజలు, అనేకరకాలైన జీతాలకోతలను, అన్నం, గుడ్డ కరువు, దేశం పొడవునా క్షామం, వినాశనం వీటినన్నిటినీ భరించవలసి వచ్చింది.

భారత ప్రభుత్వం ప్రకటించి—ఆహారపదార్థాల టోకుధర సూచీసంఖ్య, 1939 ఆగస్టులో 100 నుండి, 1941 ఆగస్టు 122 9; 1942 ఆగస్టు 163.2; 1943 జులై 300 2 కు పెరిగిపోయింది. 1944 జనవరిలో ఈ సంఖ్య 233.0 కు పడిపోయింది. కాని, ఇందుకు కారణం ధరలు ఉన్నవానికన్నా తక్కువ కాగితం మీద కంట్రోలు చేయడమే కారణం. ఆతర్వాత ఈసంఖ్యకాస్త చలించింది. 1945 డిసెంబరులో 238.8 గా ఉంది. కాని అసలు ధరలు ఈ సంఖ్యకన్నా చాలా ఎక్కువయ్యాయి. కంట్రోలుధరలకు ఏ వస్తువులూ చిక్కడం కష్టమయి పోయింది. దొంగవర్తకం ఎక్కడచూచినా సర్వసామాన్య మయిపోయింది.

ఇక చిల్లరధరలు మరింత ఎక్కువయ్యాయి ఉదాహరణకు బొంబాయిలో పాల ధర పౌను రెండణాలనుండి ఒకరూపాయి రెండురూపాయలదాక పెరిగింది; రామములగ ధర (టొమెటోలు) పౌను రెండణాలనుండి 10 అణాలకు పెరిగింది; ఉర్లగడ్డల ధర (బంగాళాదుంప) పౌను ఒకణానుండి నాలుగణాలకు పెరిగింది. ప్రధాన గోధుమ ఉత్పత్తి ప్రాంతమైన యు. పి. లో గోధుమల ధర యుద్ధానికి పూర్వం మణుగు రూ. 4 నుంచి 1946 జులైకి మణుగు రూ. 18 కి పెరిగింది. నానురొట్టె ధర 8 ఔన్సుల ముక్క యుద్ధానికి పూర్వం ఒకణా అయితే, 6 ఔన్సుల ముక్క రెండున్నరణాలయింది.

యుద్ధానికి పూర్వం పౌను ధర 7 అణాలున్న 'డ్రిల్' గుడ్డ 1943 జూన్‌కు 42 అణాలకు పెరిగింది. ఆహారధాన్యాల ధర 1939 లో 93 అనుకుంటే 1943 సెప్టెంబరులో 530 కి హెచ్చింది *

* పి. యస్. లోకనాథన్, "భారతదేశపు యుద్ధానంతర పునర్నిర్మాణం - అంతర్జాతీయ అంశాలు" 1946, పుట 31.

కార్మికుల జీవన ప్రమాణ సూచీ సంఖ్య (కంట్రోలు ధరలమీద అంచనా వేయబడింది.) బొంబాయిలో 1939 ఆగస్టు 100 నుండి 1944–238; 1945 మార్చిలో 214; తిరిగి 1946 జులైలో 255 కు పెరిగింది అలహాబాదులో 1943 అక్టోబరులో 329 వరకు ఎగబ్రాకింది; 1946 జూన్‌లో 297.

ఇందుతోపాటు కార్మికుల జీతాలుమాత్రం చాల తక్కువ పెరిగాయి. జీవిత ప్రమాణంలో హెచ్చుదలకు దామాషాగా అధికభత్యం ఇవ్వడానికి ప్రతిపరిశ్రమ యజమానీ నిరాకరించాడు. నమ్మడానికి పూరా వీలులేకున్నా 'ఇండియన్ గజెట్' అనే ప్రభుత్వ మాసిక ప్రచురణప్రకారం 1944 లో కార్మికుల సాలుసరి ఆదాయం హెచ్చింపు కేవలం నూలుపరిశ్రమల్లో నూటికి 100 వంతులు, ఇంజనీరింగులో 100 వంతులకన్నా తక్కువ, ప్రభుత్వపు ఆయుధ కర్మాగారాల్లో కేవలం 50 వంతులు, గనుల్లో మరీతక్కువ 24 వంతులు మాత్రమే పెరిగినట్లు తెలుస్తుంది. అసలే చాలీచాలని జీతాలతో కోతలు మరీదారుణంగా కనిపిస్తాయి.

ఇక గ్రామప్రజల పరిస్థితి ఇంతకంటే బాగున్నదేమీలేదు. ఈసంగతి తర్వాత వివరిస్తాను.

పై వివరణవల్ల ముఖ్యంగా భారత ఆర్థికస్థితిపై సామ్రాజ్య వాదులు అవలంబిస్తున్న వైఖరివల్ల-ఇతరమిత్ర-అధినివేశ దేశాలవలెకాక భారతదేశాన్ని వెనుకబడిన వలసదేశంగా ఉంచుకోవాలనే దృక్పథంవల్ల-యుద్ధంనుండి భారతదేశం పూర్వంకన్నా మరింత దరిద్రమై బయటపడింది. పరిశ్రమాభివృద్ధి అవకాశంఒకటి జారవిడువడమేకాదు. యుద్ధకాలపు శ్రమాధిక్యంవల్ల నేడు భారతదేశం తీవ్రరూపంలో పారిశ్రామిక క్లిష్టస్థితిని ఎదుర్కొంటున్నది.

## 8. బ్యాంకుల పెట్టుబడి-నూతన బ్రిటిష్‌ప్రణాళిక

బ్రిటిష్ పాలకులు చేసిన రాజ్యాంగ సంస్కరణలన్నిటికి ఇంతవరకూ భారతదేశంలో బ్రిటిష్‌పెట్టుబడిదారీ విధానాన్ని బలపరచుకోవడం, రక్షణవసతులు కాపాడుకోవడం ఇవే పునాదులుగా ఉంటూవచ్చాయి. మొన్నమొన్ననే 1946 బ్రిటిష్ రాయబారవర్గం ఇచ్చిన అవార్డును పరిశీలించినట్లయితే భారత స్వతంత్రమనే ప్రకటనవెనక ఇప్పటికీ బ్రిటిష్ సామ్రాజ్యవాదం తన ఆర్థిక యాజమాన్యాన్ని కాపాడుకొనేందుకే చూస్తున్నదని స్పష్టపడుతుంది. బ్రిటిష్ పెట్టుబడికోసమని భారత పరిశ్రమాభివృద్ధిని అరికట్టే సాంప్రదాయం యుద్ధానంతర యుగంలోనికి కూడ పురోగమింపజేశారు-కాని ఈతూరి కొత్తపద్ధతు లవలంబించారు. బ్రిటిష్ ఇండియాలోను, సంస్థానాలలోను భారతీయ పెట్టుబడిదారులతో ఒడంబడికలు చేసుకొని ఇండో-బ్రిటిష్ కంపెనీలను కలసి పెడుతున్నారు.

1935 ఇండియా చట్టం 3 వ భాగంనుండి 121 వరకు, భారతదేశంలోని బ్రిటిష్ పెట్టుబడిదారీ ప్రయోజనాలకు "రక్షణలను" స్పష్టంగా ప్రకటించడం జరిగింది. ఆర్థిక వాణిజ్య "పక్షపాతాన్ని" అరికట్టేమిషతో, బ్రిటిష్ సౌకర్యాలను

పోద్రోలి, భారత పరిశ్రమలకు, వ్యాపారానికి దోహదమిచ్చే భారతీయ మంత్రుల ఏ చర్యనైనా ఆటంకపరచేందుకు బ్రిటిష్ గవర్నర్‌కు నిరంకుశాధికారాలు ఇవ్వబడినవి

అలా బహిరంగంగా బ్రిటిష్ పెట్టుబడికి దోహదమివ్వడం ఇక సాధ్యపడలేదు ఈ "రక్షణలు" రద్దుపరచాలన్న ప్రజావాంఛ అపరానివేగంతో బలవత్తరంగా పరిణమించింది. 1945 ఏప్రెల్ 4వ తేదీ భారత కేంద్రశాసనసభలో మనూసుబేదార్ ఒక తీర్మానం తెచ్చాడు. ఆ తీర్మానంలో పై సెక్షన్లను తొలగించాలని కోరాడు. ఈ తీర్మానం ఓట్లు తీసుకొనవలసిన అవసరం లేకుండానే ఆమోదింపబడింది. ఈ తీర్మానాన్ని 1945 మార్చి 2వ తేదీ అసెంబ్లీలో ప్రవేశపెడుతూ సుబేదార్ ఇలా ఉపన్యసించాడు :

> "యూరపియన్ కంపెనీలు ఈ దేశంలో కల్పించుకొన్న ప్రాదేశిక విదేశ ప్రత్యేక హక్కులు లాంటివి ((ఎక్‌స్ట్రాటెరిటోరియల్ రైట్సు) మరే కామన్వెల్తు దేశంలోనూ లేవు."

అంతేగాక యుద్ధంవల్ల ఒక నూతన పరిస్థితి ఏర్పడింది. యుద్ధభారమంతా భారతదేశంపై తోయాలనే పరమ లక్ష్యంతో ఏర్పడిన యుద్ధ ద్రవ్య విధానమే కొత్త పరిస్థితిని ఏర్పరిచింది. ఇప్పుడు సామ్రాజ్యవాదం బహిరంగంగా పారిశ్రామికాభివృద్ధి వాంఛను నిరాకరించే స్థితిలో లేదు

పూర్వంకన్నా భారత పారిశ్రామికులు నేడు అతి శక్తి సంపన్నులయ్యారు. విపరీతంగా దోచిన యుద్ధ లాభాల ఫలితంగా కావలసినంత పెట్టుబడి వారి దగ్గరుంది. వెంటనే అది పెట్టేందుకు అవకాశమేర్పడాలి. ఇందువల్ల పరిశ్రమాభివృద్ధి వాంఛ నేడు తీవ్రతరంగా పరిణమించింది.

ఈ పెట్టుబడి మూలంగా భారత పారిశ్రామికులు తాము గట్టిగా నిలబడ్డామన్న విశ్వాసంతో ఉన్నారు. వారప్పుడే భారతదేశానికి స్వతంత్రమైన ఆర్థిక ప్రణాళికను గూర్చి ఆలోచించసాగారు. యుద్ధానంతర దశకు ఎన్నో ప్రణాళికలు తయారయ్యాయి. ఇవన్నీగాక ప్రధాన భారత పారిశ్రామికులు స్వయంగా ఒక ప్రణాళికను—"భారత ఆర్థికాభివృద్ధికి ప్రణాళిక"—సామాన్యంగా దీనిని బొంబాయి ప్రణాళిక అంటారు—తయారుచేశారు. ఈ ప్రణాళికను అమలుపరచి 15 ఏళ్ళలో జాతీయాదాయం రెండింతలుచేయాలని వారు చూస్తున్నారు. ఇదెంత అభివృద్ధినిరోధకంగా ఉన్నప్పటికీ దేశమంతటా దీనిపై ఆకర్షణకలిగింది. అందుకు కారణం ఈ ప్రణాళికలో పరిశ్రమాభివృద్ధికైన బలవత్తర వాంఛ ప్రతిబింబించి ఉండడమే, పైగా తగిన పెట్టుబడి చేతిలోఉన్నందువల్ల భారత పారిశ్రామికులు రాను రాను బ్రిటన్‌ను వదలి అమెరికావేపు సహాయార్థం చూస్తున్నారు.

ఈ మార్పులను బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గమనించకుండా ఉండవీలులేదు.

కామన్సుసభ చర్చలో ప్రొఫెసర్ ఎ. వి. హిల్ (కన్సర్వేటివ్ రాయల్ సొసైటీ కార్యదర్శి) ఇలా అన్నాడు:

"మనం ధైర్యం, ఔదార్యం, దూరదృష్టి కనబరచినట్లయితే భారత పరిశ్రమలతో సహకరించే అవకాశమున్నది. ఒకవేళ ఆ గుణాలను మనం చూపకపోతే భారత పరిశ్రమలు అభివృద్ధి చెందవనుకోరాదు పైగా భారతీయుల సహాయార్థం మనవైపు చూడక అమెరికావేపు మరలడం జరుగుతుంది."

(ఇండియన్ యాన్యుయల్ రిజిష్టర్ 1944, వాల్యూం 2, పుట 302,)

కాబట్టి, ఈ నూతన పరిస్థితులన్నిటినీ గమనించి, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతపరిశ్రమాభివృద్ధికి పెట్టేఆటంకాల స్వరూపంలో మార్పుచేయక తప్పిందికాదు. రాజకీయ రంగంలో యే పాతిపద్ధతి సాధ్యపడలేదో ఆర్థిక రంగంలోకూడా అంతే అయింది. భారతదేశంలో బ్రిటిష్ పెట్టుబడిని భారతదేశపు పెట్టుబడిదారీవర్గంతో రాజీ చేసుకోవడం మూలంగానే సాధ్యమవుతుంది బయటి నుండి కాక, లోనుండీ భారత పరిశ్రమాభివృద్ధిపై దెబ్బతీసే ఎత్తులువేయడం సాధ్యమవుతుంది; భారతదేశపు గుత్తవ్యాపారస్తుల సాయంతో మాత్రమే బ్రిటిష్ వస్తువులకు మార్కెట్టుగా భారతదేశాన్ని ఉపయోగించుకో వీలవుతుంది. అందువల్ల అత్యవసరమైన శాస్త్రీయనిపుణుల సాయంపేర, సామ్రాజ్యవాదం తన ఆర్థిక ప్రయోజనరక్షణకు కొత్తఎత్తుగడలు వేస్తున్నది. భారత పారిశ్రామికులతో భాగస్వామిగా చేరుతున్నది. అందుకనే పరస్పర ఆశ్రయత, ఇద్దరి ఆశయం ఒకటే నంటూ సామ్రాజ్యవాదులు కొత్తసిద్ధాంత మొకటి లేవదీశారు. కాని వ్యాపారంలో భాగస్వామిగా చేరడంద్వారా భారతదేశంపై బ్రిటన్ తన ఆర్థికద్రవ్య యాజమాన్యం దిట్టం చేసుకుంటున్నదేకాని, దేశాన్ని వదలివెళ్ళడంలేదనే సంగతి తర్వాత వివరంగా చేసేపరిశీలనవల్ల మనం తెలుసుకో వచ్చును. ఈ ఒడంబడిక లన్నిటి మూలంగా, భారత ఆర్థికాభివృద్ధిని స్వేచ్ఛగా పెరగనీయడానిక్కాక, లోనచేరి విధ్వంసచర్యలు నడపడానికే బ్రిటన్ ఎత్తు వేసింది.

ఈ నూతన సామ్రాజ్య విధానంగూర్చి భారత ప్రభుత్వ మాజీ ఆర్థికసభ్యుడు సర్ ఆర్చిబాల్డు రౌలాండ్సు తాను భారతదేశం వదలివెడుతూ ఇలా ప్రకటించాడు. రెండుదేశాల రాజకీయ సంబంధాల భవిష్యత్తెలా ఉన్నప్పటికి, "పూర్వంకన్నా మరింత గాఢంగా పరిశ్రమలు వాణిజ్యం, సభ్యతా రంగాల్లో సన్నిహితంకావడం" రెండుదేశాలకు పరస్పర లాభకారి అని అన్నాడు.

(కామర్సు, బొంబాయి, జూన్ 8, 1946)

ఇంతకన్నా విస్పష్టమైన ప్రకటనను లార్డు వేవెల్ చేశాడు. 1935 ఇండియా చట్టంలోని "వ్యాపార రక్షణలు" రద్దుకావని బ్రిటిష్ పెట్టుబడిదారులకు హామీ యిస్తూ భారత బ్రిటిష్ భావిసుస్థితికి భారత బ్రిటిష భాగస్వామ్యం చక్కని మార్గ

మని అతను సూచించాడు. కలకత్తాలోని అసోసియేటెడ్ వాణిజ్యమండలిలో 1945 డిసెంబరు 10 తేదీన ఉపన్యసిస్తూ లార్డు వేవెల్ ఇలా అన్నాడు:

"రాజ్యాంగ చట్టం పూర్తిగా మారిపోయి, బ్రిటన్‌కు భారతదేశానికి ఒక వాణిజ్య ఒడంబడిక ఏర్పడేవరకు, రక్షణలు పూర్తిగా తొలగించే అవకాశమున్నట్లు నేను భావించను; కాని భారతీయులు భారీ పరిశ్రమలను తమ నూతన పెట్టుబడి యాజమాన్యాలతో అభివృద్ధిపరచుకోవాలని సహజంగా వాంఛిస్తున్నారన్న సంగతిని భారతప్రభుత్వం గమనించింది; దానిని గుర్తించకుండా తోసిపారవేయదుకూడా. కాని చట్టంలోని షరతులకన్నా సద్భావం, స్నేహం బ్రిటన్ భారత పెట్టుబడిదారు లిద్దరికీ ముఖ్యమని నాకు తోస్తుంది; అలాంటి సంబంధా లేర్పడడం, వర్తమానంలోనేకాక భవిష్యత్తులోకూడ ఇరువురికి నిజమైన రక్షణ చేకూరుస్తుంది. స్నేహపూర్వక వాతావరణంలో బ్రిటిష్‌వ్యాపార సంస్థలూ భారత వ్యాపార సంస్థలూ సహకారంతో పని చేస్తే, భారతదేశ పారిశ్రామికాభివృద్ధి అతి త్వరగా, జయప్రదముగా కొనసాగ వీలవుతుందని నా దృఢ విశ్వాసం."

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెంబర్ 11, 1945)

ఇది కేవలం పరస్పర సహకారంకోసం చేసిన విజ్ఞప్తి అనుకోకుండా మరింత స్పష్టంగా బ్రిటిష్ పెట్టుబడిదారుల వాంఛలేమిటో ఇతరులు చెప్పారు.

భారతదేశంలో బ్రిటిష్ పెట్టుబడిదారుల పత్రిక 'కాపిటల్' 1945 నవంబరు 15 తేదీ యిలా వ్రాసింది.

"ఇప్పుడుగాని, యికమీదటగాని బ్రిటిష్ వ్యాపారులకు ఈ దేశాన్ని వదిలిపోవాలనే ఉద్దేశంలేదు....కొందరిదృష్టిలో బ్రిటిష్ వ్యాపారం అప్రధాన పాత్రను భావిలో వహిస్తున్నదని కనిపించినా, తానేదేశ సౌభాగ్యానికై ప్రముఖంగా పనిచేసిందో అలాంటి దేశాన్నుండి తరిమివేయబడడానికి బ్రిటిష్‌వర్తకం అంగీకరించదు"

అసోసియేటెడ్ ఛేంబర్సు ఆఫ్ కామర్సు అధ్యక్షుడు సర్ రేన్విక్‌హాడో 1945 డిసెంబర్ 10 తేదీ ఇలా ప్రకటించాడు;

"న్యాయమైన బేరం కుదిరితే, దేశానికి శాశ్వతంగా లాభంచేకూర్చే కర్మాగారాలు నిర్మించేందుకు బ్రిటన్‌లోని చాలమంది పారిశ్రామికులు సిద్ధంగా ఉన్నారు; కాని కేవలం ఎవరో స్వాధీనపరచుకొనేందుకు ఎవరో ఖర్చుపెట్టేందుకుగా డబ్బువరఫరా చేసేందుకు వారు ఇష్టపడకపోవడం సహజమే. బ్రిటన్ యంత్రాలను. నిపుణులను పంపాలని, మరి బ్రిటిష్‌వారిని కొత్త పాత పరిశ్రమలను నడిపేందుకు భారతదేశానికి కొనిరాకూడదని పాక్షికమైన ఏర్పాటు పనికిరాదు"

(టైమ్సు ఆఫ్ ఇండియా, 1945 డిసెం. 11)

రాయల్ సొసయిటీ కార్యదర్శి ప్రొఫెసర్ ఎ. వి. హిల్ బ్రిటిష్ వాంఛలను మరింత స్పష్టంగా ఇలా ప్రకటించాడు :

"ఈ పరిశ్రమాభివృద్ధి నంతటినీ కేవలం ప్రేమకోసమే బ్రిటిషు పారిశ్రామికులు చేయరని భారతీయులు గ్రహించుకోవాలి. బ్రిటిషు పారిశ్రామికులు తగినంతభాగం లేకుండా తమ పెట్టుబడిని, నిపుణతను ఉపయోగించి పరిశ్రమలు స్థాపిస్తారని భారతీయులు భావించిరు అనుకుంటాను. భారతీయులు తమ పరిశ్రమలు పెంపొందాలనుకుంటే, బ్రిటిష్‌వారికి సమాన భాగం ఇవ్వాలి. వారికిసగం బ్రిటిష్‌పెట్టుబడిదార్లకు సగం వాటాలనడం న్యాయమైన బేరమే"

(భారత జ్యోతి 1945 ఏప్రిల్ 1)

ఇలా తమతో భాగం చేరేందుకు తమ పాలక స్థానాన్ని బ్రిటన్ భారతీయులపై పూర్తిగా ఉపయోగిస్తున్నది. భారత పారిశ్రామికులు యుద్ధ సమయంలో విపరీతంగా లాభాలు సంపాదించి బలపడినప్పటికి పైచేయిమాత్రం ఇప్పటికీ బ్రిటిష్ పెట్టుబడిదారులదే. వారిచేతిలోనే అధికారం ఉన్నందువల్ల యంత్రాల దిగుమతిని అరికట్టగలరు భారతదేశపు స్టెర్లింగు నిల్వలన్నీ వారి చేతిలోనే ఉన్నవి; ఇప్పుడు చేస్తున్నట్లే దేశాన్నంతా వారు తమ సరుకులతో నింపివేయగలరు. * ఇలాంటి తమ ప్రత్యేక స్థితిని బాగా వినియోగించుకొని. భారత పారిశ్రామికులు తమతో రాజీకి వచ్చేట్టు ఒత్తిడి తెస్తున్నారు.

ఇండియా, బర్మా, సిలోన్ల మాజీ బ్రిటిష్ ట్రేడ్ కమీషనర్ సర్ టి. ఐన్‌స్కాఫ్, బ్రిటిష్ పెట్టుబడిదారుల సభలో మాట్లాడుతూ అతి స్పష్టంగా, భారత పారిశ్రామికులకన్నా బ్రిటిష్ పెట్టుబడిదారులకున్న సదవకాశాలేవో చెప్పాడు,

"....మాకు భారతవర్తకంతో వున్న అప్రతిమాన అనుభవం, దేశం యొక్క విశిష్టలక్షణావసరాలూ, మార్కెట్టులో మాకున్న పెట్టుబడి, పోటీలేని లావాదేవీలు ఇవన్నీ సరిగా గమనించాలి. ఇందుతోపాటు మేము బాకీపడిన దేశం గనక మరో మారు అవకాశం ఏర్పడింది. ఇవన్నీ చూస్తే భారతదేశం మరోతూరి మా వస్తువుల దిగుమతికి ప్రధాన కేంద్రం కావచ్చునని ఆశించడం ఏమాత్రం అత్యాశకాదు."

(టౌ బాయి క్రానికల్, మార్చి 5, 1945)

---

* ఈ విషయంలో ప్రభుత్వ ప్రధమ చర్య ఏమిటంటే, యుద్ధం ముగియవస్తూనే ముందుగావే భారత పరిశ్రమలతో చేసుకున్న కంట్రాక్టులను రద్దుచేసి బ్రిటిష్ కర్మాగారాలకిచ్చారు. హైదరీ మిషన్ 1945 మార్చిలో ఇంగ్లాండు వెళ్ళింది. అక్కడ 45 లో 20 కోట్ల 60 లక్షల రూపాయల వెలగలవి, 1946 లో 48 కోట్ల రూపాయల వెలగలవి బ్రిటిష్ వస్తువులు ఇండియాకు దిగుమతి చేసేందుకు ఆ మిషన్ 'ఆర్డర్లు' ఇచ్చివచ్చింది. ఆ వస్తువులన్నీ ఎక్కువ ఉపయోగించుకొనేవేగాని యంత్రాలు కావు.

బ్రిటిష్ భారత పెట్టుబడిదారుల మధ్య చాల ఒడంబడికలు అప్పుడే జరిగాయి కూడ.

1945 జూన్‌లో భారత గుత్తవ్యాపారాల్లో ప్రముఖమైన బిర్లా బ్రదర్సు లిమిటెడ్ కంపెనీకి, ఇంగ్లాండులోని నఫీల్డు కంపెనీకీ మధ్య, భారతదేశంలో మోటారుకార్ల ఉత్పత్తి విషయంలో ఒక ఒడంబడిక కుదిరింది. పత్రికలలో పడిన భాగాలనుబట్టి బిర్లా-నఫీల్డు ఒడంబడిక (పూర్తి షరతులు ప్రకటితం కాలేదు) ప్రకారం ఇండియాలో ఒక జాయింట్ కంపెనీ ఏర్పడుతుంది. అందులో నఫీల్డు కంపెనీ నూటకి 25-30 వంతులు పెట్టుబడి పెడుతుంది అందుతోపాటు లాభాలలో తగినభాగం, పేటెంట్లకు రాయల్టీలు వగైరా ఉంటాయి అంతేకాక నఫీల్డు కంపెనీ "భారతదేశంలో చౌకగా తయారుచేయ వీలులేని భాగాలను సరఫరా చేస్తుంది. ఏభాగాలు బ్రిటన్‌లో తయారుకావాలి, ఏవి భారతదేశంలో తయారు కావాలి అనేవిషయం సామాన్యంగా నఫీల్డు కంపెనీ నిపుణులే నిర్ణయిస్తారు."

("కాపిటల్" పత్రిక 1946 జనవరి 5)

భారతదేశంలోని టాటా పెద్ద గుత్త కంపెనీకి బ్రిటిష్ పెద్ద గుత్త వ్యాపార సంస్థ ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్‌కూ (ఐ. సి. ఐ) మధ్య ఇండియాలో భారీ రసాయన పరిశ్రమ స్థాపన విషయంలో ఒక ఒడంబడిక కుదిరింది. పెట్టుబడిలో నూటికి 24 వంతులు ఐ. సి. ఐ. పెడుతుందని మిగతాదంతా టాటా కంపెనీదని వార్తలు చెబుతున్నవి. "స్వదేశోత్పత్తి దేశానికి పూర్తిగా తగినంత సరఫరా చేయగల స్థితికి వచ్చేవరకు ఐ. సి. ఐ. దిగుమతి చేసి దేశీయం అని ముద్రవేసిన సరకులను భాగంగా అమ్మకం చేస్తారు. (అ. ప్రె. వార్త డిసెంబర్ 22, 1945) ఈ కాలపరిమితి దాదాపు 15 నుండి 20 ఏళ్ళదాకానని సూచించారు. ఇలాంటివే ఎన్నో బ్రిటిష్ భారతీయ పెట్టుబడిదారుల మధ్య ఒడంబడికలు జరుగుతున్నవి.

ఇలా భారతదేశ పెద్దవ్యాపారస్తులతోను మధ్యస్థితిలోని వ్యాపారస్తులతోను ఒడంబడికలు చేసుకోవడమేకాక బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, నిరంకుశ స్వదేశ సంస్థానాలను ఆర్థికంగా తమకు బావి కేంద్రస్థానాలుగా చేసుకొనేందుకు ఎత్తులు వేస్తున్నారు. సంస్థానప్రభువుల భాగంతోనో లేకనో మరింత బ్రిటిష్ పెట్టుబడిని స్వదేశ సంస్థానాల్లోనికి ప్రవహింపచేయచూస్తున్నారు. 1945 ఏప్రిల్‌లో పారిశ్రామిక విధానంగూర్చి ప్రకటించిన తమ ప్రకటనలో భారతదేశ ప్రభుత్వం సంస్థానాల పరిశ్రమాభివృద్ధికి ప్రత్యేకం ఏర్పాట్లుచేసింది. ఆప్రకటనలో ఇలావుంది.

"పరిశ్రమాభివృద్ధికి తమ న్యాయమైన కోర్కెను ఉదాసీనంగా జూడడంలేదని భారత సంస్థానాలకు హామీ ఇవ్వగలిగిందిగాని లైసెన్సుపద్ధతి పరిపాలింప బడాలనడంకూడ సుస్పష్టమే."

(హిందూస్థాన్ టైమ్సు ఏప్రిల్ 23, 1945)

పరిశ్రమాభివృద్ధిని అరికట్టడానికై ఏర్పడిన లైసెన్సింగు పద్ధతి అభివృద్ధి ఎలా సాగాలనే పద్ధతిపైకూడ పెత్తనం చేయడానికి ఉద్దేశింపబడింది. బహుశా యంత్రాలదిగుమతిని ఎక్కువగా స్వదేశ సంస్థానాలకు ఇస్తూరావచ్చు అక్కడైతే బ్రిటిష్ పెట్టుబడి క్షేమంగా సంస్థానాధిపతుల అభివృద్ధి విరోధక పాలనకింద ఉంటుంది.

బ్రిటిష్ పెట్టుబడిదారుల పత్రిక 'కాపిటల్' 1946 జనవరి 24 వ తేదీ సంపాదకీయంలో బ్రిటన్ ఉద్దేశాలను అతిస్పష్టంగా వివరించింది.

> "అన్ని సంస్థానాలూ పరిశ్రమలను తమ సరిహద్దుల్లోకి రప్పించుకోవాలని ఆతురత చూపుతున్నాని. బ్రిటిష్ ఇండియాలోని దృక్పథం కొన్నిసార్లు బొత్తిగా అనుకూలంగా ఉండడంలేదు కాబట్టి ఒకేతూరి, నూతన పరిశ్రమలు స్థాపించేవారు, ఈ యూనియన్‌ల పార్టీల వాంఛలను, రాజకీయ అశాంతిని తప్పించుకొనేందుకై అంతకన్నా శాంతంగా ఉన్న స్వదేశసంస్థానాలవైపు ఆకర్షింపబడవచ్చు. సంస్థానాలలో సాంప్రదాయం పరిస్థితులను బట్టి పాలకులు కొత్తపారిశ్రామికుల పరిశ్రమలను తమ అనవసర జోక్యం లేకుండా జరుపుకొన వచ్చును.

ఈ హామీని ఇప్పటికే సంస్థానాధిపతులు ఇచ్చారు. పాటియాలా ప్రధాని బ్రిటన్‌కు సంస్థానాల పక్షంగావచ్చిన పరిశ్రమ రాయబారనాయకుడు అయిన హెచ్. ఎస్ మాలిక్ బహిరంగంగానే చెప్పాడు; విదేశ పారిశ్రామికులు భాగస్వాములుగా వ్యాపారం సాగించవచ్చునని.

> "ఇంగ్లాండు నుండో, అమెరికానుండో వచ్చిన పారిశ్రామికుడు ఇక్కడ పరిశ్రమల్లో భాగస్థుడుగా ఉంటే - అది నూటికి 30 కాని, 40 కాని - తప్పకుండా అతనికి ఆ పరిశ్రమ విజయం పొందాలనే అపేక్ష ఉంటుంది - అదీ మాకుతోస్తున్నది. అనుభవమూ, శాస్త్ర జ్ఞానమూ ఉన్న అభివృద్ధిపొందిన పారిశ్రామికులు, ఆ మాత్రం వారిపై నమ్మకం ఉంచక పోతే అతను హృదయపూర్వకంగా పని చేస్తాడని ఎలా ఆశిచగలమో నా కర్థం కావడంలేదు.
>
> (టైమ్సు ఆఫ్ ఇండియా జనవరి 17, 1946)

నరేంద్రమండలి కార్యదర్శి మక్బూల్ అహమద్‌కూడ ఏషియాటిక్ రివ్యూలో ఇలా ప్రకటించాడు.

> "సంస్థానాల పరిశ్రమాభివృద్ధిలో భారత - బ్రిటిష్ భాగస్వామ్యానికి అవకాశం చాలా ఉంది."

పైవన్నీ పరిశీలిస్తే భారత. దేశంలో బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడి భవిష్యత్తుకు రక్షణ కల్పించి మరింత లోతుగా పాదుకొనడానికే బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారని స్పష్టమవుతుంది. భారత పారిశ్రామికులతో ఒడంబడికలద్వారా

బ్రిటిష్ పెట్టుబడి ఎల్లప్పుడు సురక్షితంగా ఉండేట్టు వారు జాగ్రత్త పడుతున్నారు. అప్పుడే ఇందుకు బ్రిటన్ కోరిన ఫలితం కనిపిస్తున్నది భారతదేశంలోని బ్రిటిష్ పెట్టుబడినిగూర్చి నఫీల్డుతో సంధిచేసుకున్న ప్రధాన గుత్త వ్యాపారస్తుడు జి. డి. బిర్లా ఇలా అన్నాడు.

"ఇదెప్పటికైనా నిర్మూలిత మవుతుందని నాకు నమ్మకంలేదు. బ్రిటిష్ కర్మాగారాలు పని చేస్తూనే ఉంటాయి"

(హిందూస్థాన్ టైమ్సు, ఏప్రియల్ 11, 1946)

ఇప్పుడున్న పెట్టుబడి రక్షణ మాత్రమేకాదు బ్రిటన్ కోరుతున్నది. భారత సంస్థానాల్లో నిరంకుశ ప్రభువులను అలాగే వుంచి, అక్కడి కొత్తపెట్టుబడిని దాటవేయాలని వారికోరిక.

ఇప్పటి ఒడంబడికలేవీ భారతదేశాన్ని పారిశ్రామికం చెయ్యవు. బిర్లా నఫీల్డు, టాటా—ఐ సి ఐ ఒడంబడికలు చూస్తే ఈ భాగవ్యాపారం ఫలితంగా ఎప్పటికీ భారీపరిశ్రమలు ఏర్పడవని తెలుస్తుంది. కాలపరిమితిలేకుండా ఇంగ్లాండులో రసాయన వస్తువులు తయారుచేసి, ఇండియన్ ట్రేడ్‌మార్కుతో సరుకులు భారతీయులకు అమ్మతారు. అలాగే బ్రిటన్‌లో తయారైన యంత్రభాగాలను ఒకచోటకూర్చే వర్కుషాపుగానే భారతదేశం తయారవుతుంది. బిర్లా-నఫీల్డు ఒడంబడిక క్రింద తయారయ్యే "భారతదేశపు సరుకు" ఎలాంటిదో అప్పుడే తేలింది. వారు తయారుచేసిన 'హిందూస్తాన్ నెంబరు 10' స్వదేశీ అంటున్నారు. కాని దాని భాగాలన్నీ మోరిస్ ముద్రపడ్డవే. భారతదేశంలో అవన్నీ దిగ్గొట్టడం మాత్రమే జరిగింది.

కాబట్టి యివన్నీ సాధ్యమైనంతవరకు ప్రధానపరిశ్రమలు, పెద్ద రసాయన శాలలు, ఇంజనీరింగు యివన్నీ ఏర్పడకుండా చేసేందుకే, బ్రిటిష్ వస్తువులకు భారత దేశాన్ని మార్కెటుగా అట్టిపెట్టుకునేందుకే, ఈ ఒడంబడికల ఫలితాన్ని బొంబాయి క్రానికల్ 1945 డిసెంబరు 27 న సంపాదకీయంలో తెలిపింది. "కొత్తరకపు పెట్టుబడిదారీవర్గం సృష్టి అవుతుంది. అది దేశాన్ని బాగా పారిశ్రామికంగా చేసేందుకు ఆటంకంగా పరిణమిస్తుంది. దీన్ని ఎప్పటికైనా వచ్చే జాతీయ ప్రభుత్వం చాల పెద్దయిబ్బందిగా భావిస్తుంది."

1945 లో వరుసగా జరిగిన ఈ బ్రిటిష్ భారతీయ పెట్టుబడిదారీ ఒడంబడి కలు, 1946 లో రాజకీయ పరిష్కారానికై చేసిన రాయబారాలకు తగిన ప్రాతిపది కలుగా భావించాలి.

## 9. భారతదేశంలో సామ్రాజ్యవాద ఫలితం

బ్రిటిష్ పాలన భారతదేశంలో "సాంఘిక విప్లవం తెస్తుంద"ని, "ఆవిప్లవం తెచ్చే చారిత్రిక సాధనంగా ఇంగ్లాండు తనకు తెలియకనే తయారవుతుంద"ని

మార్క్సు చెప్పడంలో ఆయన రెండు కార్యక్రమాలను ఆలోచించాడు. అది వివరణలో స్పష్టపరిచాడు.

ఒకటి : పాత సామాజికవ్యవస్థ విధ్వంసనం. రెండు. నూతన వ్యవస్థకు తగిన భౌతిక ప్రాతిపదికను ఏర్పరచడం.

ఈ రెండూ ఇప్పటికీ నడుస్తున్నవి ఆధునిక సామ్రాజ్యవాద నూతన దశలలో అవి అంత స్పష్టంగా కనిపించకపోవచ్చు. పాత దశల్లోనుంచీ వచ్చినదే ఈ కొత్త దశకూడ.

పూర్వం చేతిపనులను నాశనం చేసినట్టే కార్మికుల సంఖ్య తగ్గిపోవడంలో కనిపిస్తుంది నేటికీ. (యుద్ధ సమయంలో మట్టుకు ఈ పని కొంత ఆటంకపడింది.) అందుతోపాటు నూతన పరిశ్రమలూ పెరగలేదు. పూర్వపు గ్రామ ఆర్థిక వ్యవస్థ విధ్వంసనం - ఇప్పుడు విరుద్ధ శక్తులు పెరిగి తీవ్ర వ్యవసాయ సంక్షోభానికి దారి తీసే దశకు వచ్చింది.

కాని నేడు పై కార్యక్రమం ఫలితంగానే ఒక పరిస్థితి ఏర్పడింది. మార్క్సు వ్రాసిన కాలంలో లేని కొత్త శక్తులు పైకి వచ్చాయి, నేడు ఆధునిక స్థాయిలో ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందేందుకు తగిన పరిస్థితులు పరిపక్వమయ్యాయి; ఈ అవసరం ఏటేటా అత్యావశ్యకం, తప్పనిసరి అవుతోంది. అంతేకాక ఆధునిక సామ్రాజ్యవాదం తొలుతటి పెట్టుబడిదారీ పాలనయొక్క విప్లవ పాత్ర - ఆ విప్లవానికి తగిన భౌతిక పరిస్థితులను ప్రవేశ పెట్టే పాత్రను ఇక నిర్వహించడంలేదు - తన విచ్ఛిన్న శక్తులతో దారిని సరిచేసి నూతన శక్తులకు దారి కల్పించడంలేదు. పైగా పురోగమిస్తున్న ఉత్పత్తి శక్తులకు ప్రధాన ఆటంకంగా తయారై వాని అభివృద్ధిని ఆర్థిక రాజకీయ అధికారంతో అన్ని సాధనాలద్వారా విచ్ఛిన్నపరుస్తున్నది. భౌతికంగా విప్లవపాత్రను భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం నిర్వహిస్తుందని ఇక చెప్పడం సాధ్యంకాదు. నేటి ఆధునిక సామ్రాజ్యవాద పాత్ర పరిపూర్తిగా సమగ్రంగా అభివృద్ధినిరోధక పాత్రగా మారింది.

19వ శతాబ్ది మొదటిభాగంలో ముందుకు నడుస్తున్న పెట్టుబడిదారీ విధానం, భారతదేశంలోని ప్రాచీన సమాజవ్యవస్థతో తలపడి, బుద్ధిపూర్వకంగా కూడ కొన్ని అభివృద్ధినిరోధక, మతసాంఘిక కట్టుబాట్లపై దాడి సాగించింది. రాజులను ఒకరి తర్వాత ఒకరిని తొలగించి తన ఏకాండ పరిపాలనలో కల్పుకొన్నది. పశ్చిమ విద్యావిధానాన్ని, భావాలను వ్యాపింపజేసి కొన్నాళ్ళవరకు పత్రికా స్వాతంత్ర్యాన్నికూడ స్థాపించింది. ఇలాంటి దశలో భారతదేశంలో అప్పుడప్పుడే విజృంభిస్తున్న మధ్యతరగతులు తమ ప్రతినిధి రామమోహనరాయ్‌ద్వారా బ్రిటిష్ పాలనను బలపరచి, దాని కార్యక్రమం పూర్తిఅయ్యేందుకు తోడ్పడ్డాయి; విచ్ఛిన్నదశలోవున్న అభివృద్ధినిరోధక శక్తులు, అతృప్తులైన రాజులు, భూస్వాములు మాత్రమే ఎదురుదాడి సాగించారు - వారి నాయకత్వం 1857 విప్ల

సంలో కలిసిపోయింది. అప్పటికి ఏ శక్తీ పీడిత కర్షకవాణిని వినిపించే సమర్థత గలదిలేదు: అందువల్ల ఆ తిరుగుబాటు కేవలం పరాజయంతోనే ముగిసింది.

1857 వ తిరుగుబాటు తర్వాత భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం తన విధానం మార్చుకోసాగింది. నేటి సామ్రాజ్యవాదం తన దాసులుగా సంస్థానాధిపతులను రక్షించుకోజూస్తున్నది. వారి రాజకీయ పాత్రను పెద్ద చేసేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నది ఇది బ్రిటిష్ ప్రణాళికలో (1946) ఇటీవలనే ప్రకటితమైంది. ఎంతో అభిమానంతో అభివృద్ధినిరోధక మత కుల కట్టుబాట్లను, అభ్యుదయ భారతీయవర్గాలు సంస్కరించమన్నా వినక నిలబెట్టజూస్తున్నది. (వివాహవయస్సు, అస్పృశ్య నివారణ మొదలైన విషయాల్లో); విపరీత దమననీతి నిర్బంధాలతో భావ వాక్ స్వాతంత్ర్యాలను అణచివేస్తున్నది: సాంఘిక, విద్యా, పారిశ్రామిక అభ్యున్నతిని వాంఛించే బహుజనాభిప్రాయాన్ని ఆటంకపరుస్తున్నది. వీటన్నిటివల్ల భారతదేశంలో నేటి సామ్రాజ్యవాదం ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలన్నింటిలోను అభివృద్ధినిరోధక శక్తులకు నాయకత్వం వహిస్తున్నది.

కాబట్టి, భారతదేశంలోని అభ్యుదయ శక్తులన్నీ నేడు ఏకమై మునుపెన్నడూ లేనంత మహత్తరమైన తిరుగుబాటుకై, సామ్రాజ్యవాదాన్నే ప్రధానశత్రువుగా, అభివృద్ధి నిరోధక శక్తిగాయెంచి, దానికి వ్యతిరేకంగా జాతీయోద్యమం నడుపుచున్నది; ఇప్పుడు కేవలం క్షీణదశలోని నిరోధక శక్తులుమాత్రమే సామ్రాజ్యవాద పాలనకు అండగా నున్నవి దినదినాభివృద్ధి నందుతున్న ఉత్పత్తిశక్తులు సామ్రాజ్యవాద శృంఖలాలను విచ్ఛిన్నంచేసేందుకు సామ్రాజ్యవాదం రక్షిస్తూవస్తున్న పాడు ఆర్థికవ్యవస్థ నియమాలను విఘాతంచేసేందుకు సర్వవిధాలా ప్రయత్నిస్తున్నవి. ఈ సంఘర్షణ వ్యవసాయసంక్షోభంలో కనిపిస్తుంది. ఆ సంక్షోభం సామ్రాజ్యవాద ఆర్థికవిధానం ఎంత శక్తివిహీనమైనదో సూచిస్తున్నది. ఆ సంక్షోభమే పెద్దమార్పుకు కారణభూతమవుతున్నది. జారునాటి రష్యాలోని ఆఖరురోజుల్లోను, 18 వ శతాబ్ది ఫ్రాన్సులోను కనిపించినట్టే, భారతదేశంలో రానున్న వ్యవసాయ విప్లవచిహ్నాలు మనం చూడవీలవుతుంది. భారతదేశంలో వ్యావసాయక విప్లవం, సామ్రాజ్యతత్వ వ్యతిరేకంగా అభివృద్ధి పొందుతున్న జాతీయ ప్రజాతంత్ర స్వతంత్రోద్యమంతో సమ్మిళితమైఉంది; ఈ రెండిటి సంయోగమే ఇప్పుడారంభమవుతూన్న భారతచరిత్రలోని నేటి నూతనదశకు కీలకం.

కాబట్టి, భారతదేశంలోని ఆధునిక రాజకీయ పరిస్థితి పరిశీలన, జాతీయ పోరాట సమస్యల సమాలోచన వ్యావసాయిక సమస్య పరిశీలనతో ప్రారంభం కావలసివుంటుంది.

# మూడో భాగం

# భారతదేశ ప్రధాన సమస్య - రైతు సమస్య

## అధ్యాయం VII : వ్యవసాయంలో సంక్షోభం

1. వ్యవసాయంలో ఒత్తిడి
2. వ్యవసాయం ఒత్తిడివల్ల ఏర్పడిన ఫలితాలు
3. వ్యవసాయంలో స్తబ్ధత, క్షీణదశ

## అధ్యాయం VIII : రైతులపైబడిన భారాలు

1. భూస్వామ్య పద్ధతి
2. భూ విధానంలో మార్పు
3. జమీందారీల స్థాపన
4. రైతుల దరిద్రావస్థ
5. రైతు ఋణభారం
6. మూడు భారాలు

## అధ్యాయం IX : వ్యవసాయ విప్లవం వేపుకు

1. వ్యవసాయ సంక్షోభం విజృంభించింది.
2. వ్యవసాయ విప్లవం అవసరం
3. ప్రభుత్వ సంస్కరణల విధానవైఫల్యం
4. రైతుఉద్యమ విజృంభణ

# ఏడో అధ్యాయం

# వ్యవసాయంలో సంక్షోభం.

"నేటి రైతు పరిస్థితి అతి క్షీణావస్థలో ఉంది. ఈ స్థితి వ్యవసాయ విప్లవాన్ని సూచిస్తున్నది." ఆచార్య రాధాకమల్ ముఖర్జీ, "భారత దేశంలో భూ సమస్య", 1933.

భారతదేశంలోని రైతులబాధలూ, పేదరికమూ ప్రపంచంలో ఎక్కడా లేనంత ఘోరంగాఉన్నవి. ఇటీవల వ్యవసాయసమస్యపై వెలువడిన రచనలలో ప్రసిద్ధమైన "భారతదేశంలో భూసమస్య" అనే పుస్తకంలో ఆచార్య రాధాకమల ముఖర్జీ ఈపరిస్థితిని ఇలా వర్ణించారు.

"భారతదేశంలో వ్యవసాయం చేసుకొనే ప్రజలు అత్యల్పమైన సాధనాలతో పనిచేస్తున్నారు. రైతుల క్షేమాన్ని మనం గమనించినట్టయితే భూమిపంపకం అధ్వాన్నంగాఉంది. గత యాభై ఏళ్ళలో భూస్వాముల లోను, కౌలుదార్లలోను జరిగిన మార్పును పరిశీలించినట్టయితే ఈ అనర్థ కరమైన భూమిపంపకం మరింత అధ్వాన్నంగా మారుతున్నట్టు బోధపడు తుంది. చిన్నరైతులస్థితి క్షీణించిపోయింది. భూస్వాములకూ, వారి పీడ నకు లోనైన రైతులకూ మధ్య విభేదం పెరిగిపోతున్నది. కేవలం గుత్త పన్ను వసూలుచేసే భూస్వాములవర్గం పెరిగిపోయి వారికీ అసలు సేద్యం చేసే రైతులకూ మధ్య అంతరం ఎక్కువయింది. వీనిమూలంగా మన వ్యవసాయచరిత్రలో విషమఘట్టం ఏర్పడింది....రైతుల వర్గచైతన్యం ఇప్పుడే పొడసూపుతున్నది. కొన్ని ప్రాంతాలలో ఇది బహిరంగంగా బయలుపడింది. ఈ చైతన్యం నేటి వ్యవసాయపద్ధతిని సవాలు చేస్తు న్నది."

(పుట 4.)

ఆయన ఈ క్రింది నిర్ణయానికి వచ్చాడు:

"రాజకీయ ఆర్థిక దూరదృష్టిగల వివిధ వ్యక్తులు, భారతదేశపు భూమి విధానంలో మార్పులు తప్పవని గుర్తిస్తున్నారు. ఈ అభిప్రాయం, సమాజంలోని అన్ని వర్గాలలో వ్యాపిస్తున్నది. ఎక్కువమంది ప్రజలు భూమి పైనే ఆధారపడడంవల్ల ఒకొక్కరికి ఉన్న పొలం చిన్న చిన్న ముక్కలై పోయింది. ఈ ముక్కలు, తమ కుటుంబంలోని మనుష్యులందరి శ్రమను

వినియోగించేందుకు చాలక, తమ అందరి పోషణకూ చాలక పేద రైతులు అవస్థపడుతున్నారు. అందుతోపాటు భూస్వామి కేవలం గుత్తను వసూలు చేసుకోవడం మాత్రమే చేస్తూ పూర్వంలాగా వ్యవసాయంలో తన పాత్రను ఏమీ నిర్వహించడంలేదు. అతను వ్యవసాయానికి పెట్టుబడి పెట్టడంలేదు. సేద్యనాద్యాలు చూచుకోవడంలేదు. ఇంక ఇతనికీ రైతులకూ మధ్య ఒక దళారీవర్గ మేర్పడి నేటి చిక్కులలోటి భూవిధానంలో బాగా లాభం తింటూ అసలు నేల దున్నే రైతు స్థితిని మరీ అధ్వాన్నంచేస్తున్నారు. ఇది విమర్శ కాదు. కేవలం యదార్థకథనం మాత్రమే. పాత పద్ధతి విచ్ఛిన్నమైపోయింది. ఆ స్థానంలో నేటి వ్యవసాయ సమాజ జీవితావసరాలకు అనుగుణమైన నూతన పద్ధతి అత్యవసరం."

(పుట 361—2)

నేటి భారత వ్యవసాయ పరిస్థితిని పరిశీలించే వారందరికీ ఇదే అభిప్రాయం కలుగుతుంది; ఎలాంటి మార్పులు జరగాలి, అవెలా తీసుకురావాలి అనే విషయం సామ్రాజ్యవాద పాలనలోని ఆర్థిక, సాంఘిక సమస్య లన్నింటినీ లేవదీస్తుంది, రైతుకు భూమికి ఉన్న నేటి సంబంధ బాంధవ్యాలమీదనే, సామ్రాజ్యవాదం నిల బెట్టిన నేటి సమాజ వ్యవస్థకు ప్రజల దురవస్థకు ప్రాతిపదిక ఇమిడి ఉన్నది. తీవ్రమైన మార్పును తేగల మహత్తర శక్తులు ఇందులోనే అంతర్గతమై ఉన్నవి. ఆ శక్తులు సమీకరింపబడి నేటి సమాజ వ్యవస్థను నిర్మూలించగలవు. నూతన వ్యవస్థకు దారితీయగలవు

సామ్రాజ్యవాదం క్రిందనున్న దేశ సాధారణ ఆర్థిక వ్యవస్థను సామ్రాజ్య వాద పాలన రక్షిస్తున్న నేటి వర్గ సంబంధాల వ్యవస్థను, తడవకుండా భారత వ్యవ సాయ సమస్యను ప్రత్యేకంగా పరిశీంచలేము.

1926 లో రాయల్‌కమిషను వ్యవసాయ పరిస్థితి విచారణకు ప్రభుత్వం నియమించింది. ఆ కమిషన్ 1928 లో దాదాపు 800 పుటల పెద్ద నివేదికను తయారుచేసింది. ఇదికాక తీసుకున్న సాక్ష్యం 16 పుస్తకాలయింది. కాని ఈ కమిషన్ ఎలాంటి అంశాలు పరిశీలించాలి అనే విషయంలో ప్రభుత్వ మిలా నిర్దేశించింది : "వ్యవసాయాన్ని బాగుపరిచేందుకు, గ్రామవాసుల సుఖసౌభాగ్యా లను పెంచేందుకు సిఫారసులు చెయ్యాలి." కాని అందుతోపాటు ఇలా హెచ్చ రించింది .

"ఇప్పుడున్న భూస్వామ్యపద్ధతి, పన్నుల విధానం, జలాధార వసతులు వీటినిగూర్చి సిఫారసులు చేయడం ఈ కమిషన్ కార్యక్రమంలోకి రాదు."

ఇది నిజంగా రాముడులేని రామాయణమే. భూమి విధానంతో సంబంధం లేకుండా భారతదేశ వ్యవసాయ సమస్యను పరిశీలించడం సాధ్యంకాదు

నేటి వ్యవసాయ సంక్షోభానికి మూలమైన ప్రాథమిక సమస్య లివి:

1. మిగత ఆర్థిక మార్గాలన్నీ మూతపడడంవల్ల, వ్యవసాయంపై ప్రజల ఒత్తిడి ఎక్కువయింది;

2. భూమిపై గుత్తపెత్తనం, రైతుపైబడిన భారాలవల్ల కొన్ని ఫలితాలు ఏర్పడినవి;

3 వ్యవసాయం చేసే పద్ధతి చాల హీనస్థితిలో ఉంది. దాన్ని బాగుచేసేందుకు ఆటంకాలున్నవి.

4. బ్రిటిష్ పాలనలో వ్యవసాయం పాతకాలపు స్థితిలోనే నిల్చిపోయి క్షీణదశకు వచ్చింది.

5 రైతులు నానాటికి నిరుపేదలవుతున్నారు. ఉన్న పొలం క్రమంగా ముక్కలుముక్కలై చీలికలవుతున్నది. చాలమందికి పొలమనేది లేకుండా పోయింది.

6. తత్ఫలితంగా వర్గవిభజన ఎక్కువై, రైతుల సంఖ్యలో మూడోవంతు నుండి సగంవరకు, పొలంలేని పాటకజనం క్రింద తయారయ్యారు. ఇది నానాటికి పెరిగిపోతున్నది.

ఈ అంశాలను పరిశీలించే పునాదిపైనే పరిష్కారమార్గం ఆలోచించవలసివుంటుంది.

## 1. వ్యవసాయంలో ఒత్తిడి

భారతదేశం "గ్రామఖండం" అని పదేపదే మనకు కొందరు జ్ఞాపకం చేస్తుంటారు. ముఖ్యంగా, ఈ లక్షణం ప్రజాతంత్ర అభివృద్ధికి ఆటంకమని ఆశించేవారు మరీమరీ చెబుతుంటారు.

భారతదేశంలో అత్యధికసంఖ్యాకులు వ్యవసాయంపై ఆధారపడి ఉడండం బాగా అభివృద్ధిపొంది పారిశ్రామికమైన పశ్చిమ యూరోపు దేశాలకూ దీనికి తారతమ్యం ఉండడం సహజలక్షణమని సామాన్యంగా చెబుతారు. భారతసమాజ ప్రాచీనలక్షణాలను వివరిస్తూ, అందువల్ల చేయబోయే మార్పుల్లో అతిజాగర్త అవసరమంటారు.

ఇలాంటి దానికి చక్కని ఉదాహరణ,1918 నాటి మాంటేగూఛెమ్స్ఫర్డు నివేదికలోని "భారతదేశ పరిస్థితులు" అనే తొలిభాగంలో కనిపిస్తుంది:

> "వ్యవసాయం ప్రజల ప్రధానవృత్తి. బాగా పారిశ్రామికమైన ఇంగ్లాండువంటి దేశాల్లో సామాన్యపరిస్థితుల్లో, జనాభాలో పరిశ్రమలలో నూరుమంది ఉంటే వ్యవసాయంలో 8 మందే ఉంటారు. కాని భారతదేశంలో ప్రతి నూరుమందికి 71 మంది వ్యవసాయం, పశుపోషణమీద పనిచేస్తారు......భారతదేశం మొత్తంమీద 31 కోటి 50 లక్షల ప్రజల్లో 22

కోట్ల 60 లక్షలమందిని పొలం పోషిస్తుంది. 20 కోట్ల 80 లక్షలమంది తమ సొంతపొలంమీద లేక ఇతరుల పొలాల్లోనో సేద్యంచేయడంమీద సరాసరి ఆధారపడివున్నారు. లేదా దానిమీదే జీవిస్తున్నారు."

ఇలాగే ఇంగ్లాండులో విపరీతంగా పంచిపెట్టిన 1930 నాటి సైమన్ కమిషన్ నివేదిక "వ్యవసాయ ప్రాబల్యం" అన్న మొదటిభాగంలో పైవాక్యాన్ని ఉదహరించారు. అందువల్ల మార్పు "చాల ఆలస్యంగా నడవక" తప్పదని ఎంతో ఆశతో సంతృప్తిపడ్డారు.

"ఏవిధమైన రాజకీయ నిర్ణయంకూడ ఆలస్యంగా నడవక తప్పదు. సాంప్రదాయంగా వస్తున్న వాతావరణం, పంటలు, పశువులు, జలాధారాలు పండుగలు పబ్బాలు, కరువులు, ఆహారం ఇవన్నిటినిదాటి గ్రామీణసరి హద్దులను విశాలపరచాలంటే ఈ అనాదిగ్రామప్రజ జీవనవిధానం మార్చాలంటే-ఆమార్పు చాల ఆలస్యంగా నడవక తప్పదు."

భారతీయులు పరిశ్రమలు పెరిగిన దేశాల్లోలాగకాక వ్యవసాయంమీదనే ఎక్కువ ఆధారపడి ఉన్నారని పైనయిచ్చిన అంశాలన్నీ నిజమే. కాని ఈస్థితికి మూలమైన సామ్రాజ్యవాద వలసదేశ పీడనవిధానంగూర్చి ఏమీ గమనించకుండా ఈ అంశాలు చెప్పడంతో యదార్థస్థితి గోచరంకాదు అదీగాక సైమన్ కమిషన్ తేల్చిన నిర్ణయంకూడ పూర్తిగా సరైనదికాదు. వ్యవసాయ సంక్షోభం తీవ్రతరం అవుతోంది. అదే భారతదేశంలో అతిత్వరలో పెద్దమార్పు వచ్చేట్టు చేస్తున్నది.

భారతదేశ ప్రజల్లో మూడువంతులమంది, వ్యవసాయంమీద ఆధారపడి ఉన్నారనే అంశాన్ని మరింత అతిశయోక్తి చేర్చి సామ్రాజ్యవాదులు దురుపయోగం చేస్తున్నారు. ఇలాంటి ఎగుడుదిగుడుగా నష్టకారిగా ఉన్న వ్యవసాయంమీద ఆధారపడిన వారిసంఖ్య భారతదేశానికేమీ సహజలక్షణంకాదు. ప్రాచీన సాంఘిక లక్షణం ఇంకా మిగిలిఉండి ఏర్పడిందీకాదు. ఇది కొత్తగా బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పరిపాలనకు ప్రత్యక్ష ఫలితంగా ఏర్పడిన స్థితేగాని వేరుకాదు. వ్యవసాయంమీద ఆధారపడిన వారిసంఖ్య బ్రిటిష్ పాలనక్రిందనే ఎక్కువయింది. పాతకాలంలో వృత్తులకూ, వ్యవసాయానికీ సమానత ఉండేది. దానిని విచ్ఛిన్నంచేసి సామ్రాజ్యవాదానికి భారతదేశాన్ని వ్యవసాయ అనుబంధ దేశంగా చేయడంవల్లనే ఈ స్థితి ఏర్పడింది.

గత యాభైయేళ్ళ జనాభా లెక్కలు యదార్థస్థితిని వెల్లడిచేస్తున్నవి. అంతకుముందు లెక్కలుకూడ దొరికితే ఈ అంశం మరింత దారుణంగా కనబడేది. 19 వ శతాబ్ది మొదటి మూడుపాదాల్లోనే భారత పరిశ్రమల ప్రధాన విధ్వంసనం జరిగింది. పూర్వం జనాభాతో క్రిక్కిరిసివున్న పరిశ్రమ కేంద్రాలను విచ్ఛిన్నం చేయడం, ప్రజలను గ్రామాలవేపు తరమడం, గ్రామాలలోని కోట్లకొలది చేతిపని వారి కడుపుగొట్టడం అప్పుడే జరిగింది. ఈ కాలంలోని లెక్కలు దొరకడంలేదు;

కాని ఇలాంటి విధ్వంసనం క్రమంగా తర్వాతగూడ జరుగుతూ వచ్చిందని, మన కాలంలో మరింత ముందుకు పాగిందని గత యాభైయేళ్ళ లెక్కలు వెల్లడి చేస్తున్నవి.

మొట్టమొదట జనాభా లెక్కలను 1881 లో ప్రభుత్వం తయారుచేసింది; కాని ఇవి పూర్తిగా అసమగ్రమైనవి కావడంమూలాన మన తారతమ్య పరిశీలనకు పనికిరావు వృత్తులవల్ల జీవించే పురుష కార్మికులు 11 కోట్ల 59 లక్షల మందిలో 5 కోట్ల పది లక్షలు రైతులని వ్రాశారు. ఈ దామాషా సగంకన్నా తక్కువ కాబట్టి తప్పకుండా చాల హీనస్థితిలో ఉన్నదే

1891 నుండి 1921 వరకు పోల్చి చూచేందుకు వీలయిన లెక్కలు దొరుకు తున్నవి; ఈ లెక్కలివి.

వ్యవసాయాలపై ఆధారపడినవారు నూటికి

| | |
|---|---|
| 1891 | 61 1 |
| 1901 | 66 5 |
| 1911 | 72.2 |
| 1921 | 73.0 |

1931 లెక్కల్లో జనాభా వర్గీకరణం మార్చి వ్యవసాయంమీద ఆధారపడిన వారి సంఖ్య తగ్గేట్టు చూచారు? ఏమైనా పరిస్థితి కాగితంమీద మారిందేగాని, ఆచరణలో ఏమీ మారలేదు. "1921 కి 1931 కి మధ్య వ్యవసాయం, పశు పోషణల మీద ఆధారపడిన వారి సంఖ్య తగ్గడం కేవలం భ్రమ మాత్రమే ...వర్గీకరణంలో మార్పేగాని వృత్తుల్లో మార్పు జరుగలేదు" వ్యవసాయంమీద ఆధారపడినవారి దామాషా 1921—31 ల మధ్యయేమీ మారలేదు. (ఆన్‌స్టే "భారతదేశ ఆర్థికాభివృద్ధి" పుట 61) ఇండియన్ సెంట్రల్ బాంకింగు విచారణ కమిటీ రిపోర్టు 1931లో ఇలా వ్రాసింది. (పుట 39.)

> "భారతదేశంలో వ్యవసాయంమీద ఆధారపడినవార దామాషా చాలా ఎక్కువ. అదింకా పెరుగుతూనే ఉంది. 1891 లో వీరి సంఖ్య నూటికి 61. ఈ సంఖ్య 1901 లో 66 కు, 1921 లో 73 కు పెరిగింది. 1931 లెక్కలు మాకు దొరకలేదు. కాని అంతకన్నా పెరిగిందని నిస్సందేహంగా ఊహించ వచ్చును.

ప్రొఫెసర్ వాడియా, మర్చెంటులు ఇలా అన్నారు. "పాత వర్గీకరణాన్నే అవలంబించి 1931 లో కూడ వ్యవసాయంలో పని చేసే వారినే కాక, దానిమీద ఆధారపడిన వారినికూడా లెక్కవేసి ఉంటే - అంతకన్నా ఎక్కువ కాకున్నా నూటికి 75 మంది తప్పక ఉంటారనే నిర్ధారణకు రాకతప్పదు." ("మన ఆర్థిక సమస్య" పుట 86) కొత్త వర్గీకరణ ప్రకారంకూడ 1931 లో రైతుల సంఖ్య నూటికి 66 6 ఉంది. ఈ సంఖ్య 1891 లో నూటికి 61.1 కన్నా ఎక్కువే.

బ్రిటిష్ ధనికవర్గ విధానం మూలంగా, వ్యవసాయంమీద ఆధారపడిన వారిసంఖ్య పెరగడానికి కారణాలేవో ఈ పుస్తకం మూడో అధ్యాయంలో వివరించాను. 1911 జనాభాలెక్కల కమిషన్ ఆ కారణాలను గుర్తించే ఇలా వ్రాశాడు.

"చౌకగా యూరపియన్ గుడ్డలు. పాత్రలు ఎక్కువగా దిగుమతి చేయడం, ఇండియాలోనే పాశ్చాత్య పద్ధతిలో ఎన్నో కర్మాగారాలు పెట్టడం మూలంగా గృహపరిశ్రమలు దాదాపు విధ్వంసమయ్యాయి వ్యవసాయ వస్తువుల ధరలు పెరగడం మూలంగా కూడ, చాలమంది చేతిపనివారు, తమక్రమానుగతవృత్తులను వదిలి సేద్యానికి దిగడానికి కారణమైంది.... పాతగ్రామవ్యవస్థ ఇలా నిర్మూలనం కావడం ఒకొక ప్రాంతంలో ఒకో విధంగా ఉంది. బాగా అభివృద్ధిచెందిన రాష్ట్రాల్లో మార్పు మరీస్పష్టంగా కనిపిస్తుంది "

(ఇండియా జనాభా రిపోర్టు 1911, వాల్యూం 1. పుట 408 )

1911 నుండి ఇలా పరిశ్రమలు క్షీణించి, వ్యవసాయంపైపే జనమంతా మూగడం చాల ఎక్కువయింది. 1911-31 ల మధ్య పరిశ్రమల్లో పనిచేసేవారి సంఖ్య 20 లక్షలు తగ్గిపోయింది. జనాభాఏమో 3 కోట్ల 8 లక్షలు పెరిగింది.

## పరిశ్రమలపై ఆధారపడినవారు నూటికి

| | |
|---|---|
| 1911 | 5.5 |
| 1921 | 4.9 |
| 1931 | 4.3 |

ఈ ఇరవైయేళ్ళలో జనాభా నూటికి 12 పెరిగితే, పరిశ్రమల్లో పనిచేసేవారి సంఖ్య నూటికి 12 తగ్గిపోయింది. మొత్తం జనాభాలోని పారిశ్రామిక కార్మికుల జనాభా అయిదోభాగానికి పైగా తగ్గిపోయింది. 1941 లో ఈ కార్మికుల సంఖ్య 4.2 కు మరీ తగ్గిపోయింది. ఇది పారిశ్రామిక విధ్వంసనాన్ని సూచిస్తుంది - పాత చేతిపనులేమో వినాశనం చేయబడినవి. కొత్త ఆధునిక పరిశ్రమలేమో స్థాపింపబడలేదు. అందువల్ల ఒకే ప్రవాహంగా ప్రజలు వ్యవసాయంపై పడినారు.

ఇందుతోపాటు, ఆహారానికి పనికిరాని వస్తువుల ఉత్పత్తి ఎక్కువయింది. 1892-93 కు 1919-20 కి మధ్య ఆహారపు పంటలు పెట్టే భూవైశాల్యం 18,70 లక్షల ఎకరాలనుండి 21 కోటి ఎకరాలకు పెరిగింది, అంటే నూటికి 7 వంతులు; మరి ఆహారేతర పంటలు పెట్టే భూవైశాల్యం మూడుకోట్ల ఎకరాలనుండి 4 కోట్ల 10 లక్షల ఎకరాలకు పెరిగింది-అంటే నూటికి 43 వంతులు. (వాడియా జోషి "భారతదేశ సంపద") ఇటీవల ఈ సంఖ్య మరీ ఎక్కువయింది. 1910-11 కు 1914-15 కు మధ్య ఆహార పంటలు వేసే పొలం నూటికి 12.4 వంతులు

మాత్రమే పెరిగింది; ఆహారేతరమైన పంటలు వేసే పొలం నూటికి 54 వంతులు పెరిగింది. (ఆర్. ముఖర్జీగారి "నలభైకోట్లమందికి ఆహార ప్రణాళిక"లోని పట్టిక - పుట 16 ను చూడండి) 1934-35 కు 1939-40 కు మధ్య ఆహారపు పంటల పొలం 15 లక్షల ఎకరాలు అసలు తగ్గిపోయింది; మరి ఆహారేతరమైన పంటలు వేసే పొలం 16 లక్షల ఎకరాలకు పెరిగింది. ముడిపత్తి ఎగుమతి 1900-1 లో 178 000 టన్నులనుండి 1936-37 కు 762,133 టన్నులకు పెరిగింది - అంటే నూటికి 328 వంతులు పెరిగిందన్నమాట. (ఈ ఎగుమతులు 1939-40 లో 526,411 టన్నులు). తేయాకు ఎగుమతి 1900-1 లో 19 కోట్ల పౌనులనుండి 1939-40 లో 35 కోట్ల 90 లక్షల పౌనులకు పెరిగింది; నూనె గింజల ఎగుమతి 1900-1 లో 549 000 టన్నులనుండి 1938-9 కి 1,172,802 టన్నులకు అధికమైంది.

ఇలా రానురాను వ్యవసాయంపై ప్రజల ఒత్తిడిఎక్కువకావడం, ఎగుమతులకు వ్యాపారపుపంటలు పెరగడం-మరోవైపు భారతప్రజలు ఆకలితో మాడడం-అనేపరిస్థితి బ్రిటిష్ ధనికులనుసరించే విధానానికి ప్రత్యక్షఫలితమే భారతదేశం తమ వస్తువులకు బజారుగా తమకు కావలసిన ముడిసరుకులకు ఆధారంగా చేసుకోవడమే బ్రిటిష్ పెట్టుబడిదారుల విధానం.

కాని ఇలా వ్యవసాయంపై ప్రజలఒత్తిడి రైతులపీడన భారతదేశ దారిద్ర్యానికి మూలం, బ్రిటిష్ ధనికవర్గ విధానఫలితంగా పాతకాలపు సేద్యంపై ప్రజల ఒత్తిడి భారతదేశ దరిద్రానికి ప్రధానకారణం. ఈఅంశాన్ని 1880 నాటి క్షామవిచారణసంఘం గుర్తించింది.

> "భారతప్రజల దరిద్రానికి, వారు కరువుకాటకాల్లో నానాబాధలకు లోను కావడానికి మూలకారణం ప్రజాకోటికంతకి ప్రధానవృత్తి వ్యవసాయం కావడమే" ఈ వాక్యాలను పూర్వమే ఉదహరించాను.

ఒక శతాబ్దంక్రిందట సర్ ఛార్లెస్ ట్రెవిల్యాన్ కామన్సుసభ సెలెక్టుకమిటీకి 1840 లో ఇలా నివేదించాడు:

> "వారి (భారతీయుల) పరిశ్రమలను మనం నిర్మూలించాము; తమ పొలాల పంటలమీదతప్ప వేరే ఆధారపడేందుకు వారికింకేమీలేదు."

ఒకశతాబ్ది తర్వాత వ్యవసాయం గూర్చివేసిన రాయల్ కమిషన్ ఇదే విషాదగాధనే 1928 లో తెలిపింది. (వారినివేదిక, పుట 433),

> "పొలాల్లో పనిచేసేవారి ఒత్తిడిఎక్కువయింది. బ్రతకడానికి ఇంక వేరే వృత్తిలేదు తప్పించుకొనేందుకు వేరే దారిలేదు; పసితనంలోనే తమపైన ఆధారపడిన వారున్నారు. ఈ కారణాలన్నిటివల్ల రైతు ఎక్కడ వీలయితే అక్కడ ఎలాంటి షరతులతోనైనా సరే సేద్యం. చేయవలసి వస్తున్నది."

## 2. సేద్యంలో ఒత్తిడివల్ల కలిగిన ఫలితాలు

వ్యవసాయంపై ఒత్తిడి అధికమైంది. అంటే ఇప్పుడున్న పాతకాలపునాటి సేద్యంతో మునుపటికన్నా ఎక్కువవుతున్న జనాభాకు తిండి సరఫరా చేసుకోవడమన్నమాట.

ఇప్పుడున్న పరిమిత పద్ధతుల్లో వ్యవసాయాభివృద్ధి ముందుకు సాగకపోతున్నది - భూస్వామ్య పద్ధతి, రైతులపై దోపిడీ భారం మోయలేనంత పడడం, వీని మూలంగా ఇప్పటి వ్యవసాయం పైలాగా సరఫరాచేయడం సాధ్యం కావడంలేదు.

ఈ విరుద్ధ సంఘటనే భారత వ్యవసాయాన్ని కలచి పారవేస్తూ సంక్షోభం క్రమ క్రమంగా విజృంభించడానికి కారణమవుతున్నది. ఇందువల్ల వ్యవసాయం గడ్డుబారిపోవడం, విపరీతంగాపడిన భారాలవల్ల ఉత్పత్తి తగ్గిపోవడం, రైతుల దుస్థితి అతి అధ్వాన్నంగా తయారుకావడం జరిగింది.

వ్యవసాయంమీద ఒత్తిడి ఎక్కువకావడమంటే, ప్రతిరైతుకు దొరికే పొలం క్రమంగా తగ్గిపోతుందన్నమాట.

1911 లో సర్ థామస్ హోల్డర్నెస్ ఇలా వ్రాశాడు :

"భారతదేశంలో స్వదేశ సంస్థానాలుకూడ కలుపుకుంటే జనసంఖ్య 31 కోటి 50 లక్షలు, ఇందులో మూడు భాగాలు వ్యవసాయంమీదనే జీవిస్తున్నారు. సంస్థానాల్లోని లెక్కలు సమగ్రంగా లేవు గనక, ఎన్ని ఎకరాల పొలం సాగుచేయబడుతున్నదో నిఖరంగా తెలియదు. కాని, ప్రత్యక్షంగా వ్యవసాయంమీద బ్రదికే జనాభాలో ప్రతిఒకరికి ఒకటింబాతిక ఎకరాకన్నా ఎక్కువ పొలం లేదని మనం అంచనా వేయడంలో పొరబాటుండదు....

"భారతదేశపు భూములు ఇంతపెద్ద జనాభాకు ఆహారం పండించడమే కాదు. ఈ భూమిలో చాలభాగం ఎగుమతిచేసే పంటలకు వేరుచేసిపెట్టారు....దిగుమతి చేసుకునే వస్తువులకయ్యే మొత్తాన్ని, మిగత విదేశ ఋణాలను ఈ పంటల అమ్మకంవల్లనే భారతదేశం తీర్చవలసివస్తున్నది. ఇలా విదేశాలకు దిగుమతయ్యే పంటలకుగాను కొంత సాగయ్యే పొలాన్ని వదిలితే, మిగిలేభూమి భారతదేశ జనాభాకు తలకు సగటున 2/3 ఎకరాలు మాత్రమే వస్తుంది. అంటే ఈ కాస్త పొలంలో తిండీ బట్టాకూడ కావాలి, ఇంత పోషణ భారం పొలంమీద వేయడమనేది ఇంకే దేశంలోనూ బహుశా లేదనవచ్చును."

(సర్ థామస్ హోల్డెర్నెస్, "భారతదేశం ప్రజలు - సమస్యలు" 1911, పుట 139)

పూనాదగ్గిర ఒక గ్రామంలో విచారణజరిపి ఆఫలితాలను బొంబాయి వ్యవసాయశాఖా డైరెక్టర్ డాక్టర్. హెరాల్డు హెచ్. మాన్ 1917 లో ప్రకటించాడు.

1771లో సగటున ఒక్కొక్కరికున్న పొలం 40 ఎకరాలు-1818లో ఈసంఖ్య 17½ ఎకరాలకు తగ్గింది. 1820-40 ల మధ్య 14 ఎకరాలకు దిగింది. 1914-15 లో ఈసంఖ్య 7 ఎకరాలు. బాగా అన్నిపరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పటికి తమ యజమానుల పోషణకు "ఈపొలంలో నూటికి 81 వంతులు చాలవని" ఆయన నిర్ణయించాడు ఇలా ఆయన నిర్ధారణకు వచ్చాడు:

> "పై అంశాలుచూస్తే గత 60, 70 ఏళ్ళుగా పొలాల వైశాల్యం మారుతూ వచ్చిందని స్పష్టమవుతుంది బ్రిటిష్ పరిపాలనకు పూర్వమూ, బ్రిటిష్‌వారు వచ్చినకొత్తలోనూ ఒక్కొకరైతుకున్న పొలం కొంతవిశాలంగా దాదాపు 9-10 ఎకరాల కెక్కువగా ఉండేది .2 ఎకరాలకంటె తక్కువవున్న పొలాలు లేనేలేవు ఇప్పుడు పట్టాల సంఖ్యేమో పెరిగింది పెట్టింపుగా. ఇందులో నూటికి 81 వంతులు పదిఎకరాలలోపువే నూటికి 60 వంతులు ఎకరాలకన్నా లోపుగానే ఏర్పడ్డాయి.

(డాక్టర్ హెచ్. హెచ్. మాన్, "దక్కన్ గ్రామంలోని పొలమూ-పని" వాల్యూం 1, 1917, పుట 46.)

మిగతా రాష్ట్రాల్లోను ఇలాంటి ఫలితాలే దొరుకుతాయి. "మిస్టర్ కీటింజి" ఇలా అన్నాడు: "బొంబాయి రాష్ట్రంలోని రైతుల పొలాలు ఎక్కువ భాగం చక్కగా సేద్యంచేయడానికూడ పనికిరాని స్థితిలోకి వచ్చాయి. మదరాసు రాష్ట్రంలోను ఇలాంటి పరిస్థితే ఉందని డాక్టర్ స్లాటర్ కనిపెట్టాడు మిగత రాష్ట్రాల పరిస్థితిగూడ చాలభాగం ఇంతే" (వ్యవసాయ కమిషన్ రిపోర్టు, పుట 132.)

1921 జనాభా లెక్కలలో ఒక్కొక రైతుకున్న సాగుబడి అయ్యే భూమి వైశాల్యం ఇలా తేల్చారు:

| | | |
|---|---|---|
| మదరాసు | 4.9 | ఎకరాలు |
| బెంగాలు | 3.1 | .. |
| బీహారు, ఒరిస్సా | 3.1 | .. |
| అస్సాం | 3.0 | .. |
| యు. పి. | 2.5 | .. |
| బర్మా | 5.6 | .. |
| పంజాబు | 9.2 | .. |
| సి. పి. బేరార్ | 8 5 | .. |
| బొంబాయి | 12.2 | .. |

ఇవన్నీ సగటు లెక్కలు. చాల తక్కువ మందికి మరీ ఎక్కువ ఎకరాల భూమి ఉంటుంది. కాబట్టి అధికసంఖ్యాకులకు పొలం ఎంతతక్కువగా ఉంటుందో ఇందులో కనిపించదు.

"ఒక కొంకణ గ్రామం ఆర్థిక సాంఘిక సర్వే" (బొంబాయి రాష్ట్ర సహకార విద్యాలయ ప్రచురణ గ్రామార్థికమాల, 3 వది) ఫలితా లిలా ఉన్నవి: 192 ఎకరాల భూమి ఉన్న గ్రామంలో 24 గురు వ్యవసాయం చేయనివారి క్రింద 113 ఎకరాల భూమి ఉంది. అంటే సగటున వీరికి 4.71 ఎకరాల భూమి ఉంది. మరి అసలు రైతులు 28 గురికి మొత్తం 78 ఎకరాలుంది - సగటున ఒకొక్కరికి 2.85 ఎకరాలు మాత్రం.

'మలబారు గ్రామంలోని ఆర్థిక జీవితం' (మదరాసు ఆర్థిక గ్రంధావళి ప్రచురణ 2) పరిశీలించగా గ్రామంలోని నూటికి 35 మంది పొలాలు 1 ఎకరాకు లోపుగా ఉన్నవి.

శాశ్వత పట్టాలు లేని రైతులగూర్చి - వీరే రైతులలో ఎక్కువమంది వ్యవసాయ విచారణసంఘ నివేదికలో ఇలాఉంది:

> "ఒకసారి మాత్రం దొరికిన పంజాబు లెక్కల ప్రకారం రైతులలో నూటికి 22.5 మంది 2 ఎకరాలకంటె తక్కువపొలాన్ని సాగుచేస్తున్నారు; మరి 15.4 మంది 1 నుండి 2½ ఎకరాల వరకు సాగుచేస్తారు; నూటికి 17.9 మంది 2½ నుండి 5 ఎకరాలు సాగుచేస్తారు; మిగత 20.5 మంది 5నుండి 10 ఎకరాల వరకు సాగుచేసేవారు. బొంబాయి రాష్ట్రంలో కూడ ఇంతే. బర్మా మాత్రం కొంత సగటు ఎకరాల సంఖ్య ఎక్కువుంటోంది. మిగత రాష్ట్రాలన్నిటా ఒకొక రైతుకు ఇంతకన్నా తక్కువ పొలమే ఉంది."

ఎక్కువ సౌభాగ్యవంతంగా ఉందనుకునే పంజాబులోకూడ (ఈ రాష్ట్రం బ్రిటిష్‌పాలన క్రింద మిగతావానికన్నా తక్కువ కాలముంది.) మూడోవంతు రైతులు 2½ ఎకరాల పొలంతోనే ఉన్నారు. ఇకే సగంమంది రైతుల పొలం 5 ఎకరాలకన్నా తక్కువ ఉంటుంది.

1921 బెంగాలు జనాభా లెక్కలప్రకారం సాగుచేసే భూమి మొత్తంలో ఒకొక రైతుకు 2.2 ఎకరాలు మాత్రమే వస్తుందని లెక్కవేశారు. "ఇలాంటి లెక్కలలోనే రైతుల దరిద్రకారణం బయలుపడుతుంది." అని 1921 బెంగాలు జనాభా నివేదిక వ్రాసింది.

ఈ యధార్థాంశాల ప్రాముఖ్యతను కాదనడం వీలుకాదు. వీనిమూలంగా దీర్ఘకాలంనుంచి పొలంకోసం జనమెంత తీవ్రంగా ఆకాంక్షిస్తున్నారో తెలుస్తుంది. ఇలాంటి లెక్కలు రష్యావ్యవసాయ చరిత్రలో చూపినట్టు ఒకేఒక దిక్కువేపు చూపుతున్నది.

## 3. వ్యవసాయంలో స్తబ్ధత, క్షీణత

ఈ చిరకాలానుగతమైన భూమిపై ఆకాంక్ష ప్రకృతిసిద్ధమైనదా ? జనాభాకు తగిన పొలంలేక ఏర్పడిన సమస్యా ఇది ?

కానేకాదు. అందుకు పూర్తిగా వ్యతిరేకమైన సమస్య ఇది. ఇప్పుడు చాలావ్యాప్తిలో ఉన్న సిద్ధాంతాలెన్ని ఉన్నా, లెక్కలను పరిశీలించినట్టయితే ఇది నిజం కాదని స్పష్టపడుతుంది (రెండో అధ్యాయం 3 చూడండి)

పొలం లేకపోవడం సమస్యకాదు. నిర్బంధాలు, ఔదాసీన్యం మూలంగా సాగుక్రిందికివచ్చిన పొలం తక్కువగా ఉండడం; ఆ సాగుచేసే భూమిలోకూడ ఇప్పుడున్న సాంఘిక వ్యవస్థ వేసిన అతిభారం, పరికరాలు శాస్త్రీయంగా అభివృద్ధి చెందకపోవడం, భారీవ్యవసాయానికి వీలులేకపోవడం - వీనిమూలంగా పంటచాల తక్కువగా ఉంది.

ఇప్పుడున్న పరికరాలు, సాధనాలతోనే ఇప్పుడున్న సాగుదలభూమికి నీటివసతులు ఏర్పరచినట్టయితే 44 కోట్ల 70 లక్షల జనసంఖ్యను పోషించవచ్చును-అంటే ఇప్పుడున్న జనాభాకాక 7 కోట్లు ఎక్కువమందిని పోషించవచ్చునని అంచనావేయబడింది (రాధాకమల్ ముఖర్జీ, "నలభై కోట్లమందికి ఆహార ప్రణాళిక" పుట 26).

సాగుకు వీలైన భూమిలో 70 వంతులు బీడు పెడుతున్నారనీ కేవలం 30 వంతులు మాత్రమే సాగుచేస్తున్నారనీ భారత ఆర్థిక శాస్త్రవేత్త ఆర్ కె. దాస్ అంచనా వేశాడు.

> "అసలు సాగుచేసే భూవైశాల్యం 22 కోట్ల 80 లక్షల ఎకరాలు-లేక మొత్తం భూమిలో 53 వంతులు ఇక రెండుతూర్లు పంటపెట్టే ప్రదేశాన్ని వేరుగా తీసుకున్నట్టయితే అది 26 కోట్ల 20 లక్షల ఎకరాలవుతుంది వాతావరణ పరిస్థితి మంచిదిగనుక భూమిలో చాలభాగం ఏటా రెండుకార్లకు పైగా పండుతుంది; కాని ఇందులో కొంతభాగం ఒకతూరి పంట పెట్టింతరవాత రెండోపంట పెట్టవీలులేదు; ఒకతూరికూడ కొంత కాలంవరకు పెట్టవీలులేని పొలమూ కొంతవుంది. వీటన్నిటిని సగటున లెక్కవేస్తే ఏటా రెండుపంటలు వస్తాయనుకోవచ్చును. ఇందువల్ల సాగుచేయవీలైన భూమివైశాల్యం 86 కోట్ల 40 లక్షల ఎకరాలు మొత్తం ఉంటుంది. ఇందులో 30 వంతులు, 26 కోట్ల 20 లక్షల ఎకరాలుమాత్రమే ఇప్పుడు సాగవుతున్నది. మిగత 60 కోట్ల 20 లక్షల ఎకరాలభూమి-70 వంతులు-బీడుపడివుంది."

(ఆర్ కె దాస్, "భారతదేశంలో పారిశ్రామిక శక్తిసామర్థ్యాలు" 1930, పుట 13)

యధార్థానికి ఉన్న సాగుబడయ్యే భూమికూడ గత 25 ఏళ్ళవరకు ఎక్కువవుతూనే వచ్చింది - నేటి సంక్షోభం దానిని అరికట్టిందిగాని, ముందు జనాభా పెరుగుదలకంటే ఎక్కువగానే సాగుచేసే భూమి పెరిగింది.

## జనాభాకు, సాగయ్యేభూమికి సంఖ్యా సూచి

| | జనాభా | మొత్తం సాగయ్యేపొలం | ధాన్యం పండే పొలం |
|---|---|---|---|
| మొదటి యుద్ధానికిపూర్వం సగటు (1910-11 నుండి 1915) | 100 | 100 | 100 |
| 1930-31 | 107 | 118 6 | 113.9 |
| 1934-35 | 120 | 117.2 | 112.4 |

(ఆర్. ముకర్జీ, "నలభైకోట్లమందికి ఆహార ప్రణాళిక" పుట 16 17)

1910-14 నుండి 1930-31 ల మధ్య జనాభా నూటికి 7 పెరిగింది. కాని సాగయ్యే భూమి నూటికి 18.6 వంతులు పెరిగింది ఇటీవలి సంవత్సరాల లోనే సంక్షోభం తర్వాత, సాగయ్యేభూమి, అందులోను ఆహార ధాన్యాలు పండే భూమి మరింత తక్కువై పోవడం జరిగింది.

అన్నిటికన్నా ముఖ్యమైన అంశం ఏమంటే, సాగుకు వీలయ్యే భూమిలో చాలభాగం నేడు బీడుపడేవుంది. ఇప్పటి లెక్కలు ఈక్రింది విధంగా ఉన్నవి:

## బ్రిటిష్ ఇండియాలో సాగయ్యే భూమి 1939-40

(బర్మాకాక)

| | లక్షల ఎకరాలలో |
|---|---|
| సర్వేచేసిన మొత్తం భూమి | 5127 |
| అడవులున్న భూమి | 681 |
| సాగుకు వీలుకాని భూమి | 893 |
| సాగుకు వీలైన బీడు భూమి | 972 |
| బీడుభూమి (సాగుకు వీలుకానిది) | 473 |
| పంటలుపెట్టే భూమి | 2099 |

(బ్రిటిష్ ఇండియా స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు)

అంటే మొత్తం సాగుకు వీలయ్యే 35 కోట్ల 50 లక్షల ఎకరాలభూమిలో నూటికి 59 వంతులు మాత్రమే పంటపెడుతున్నారు. 13.2 వంతులు మైదానం. ఇక 27.3 వంతులదాక సాగుకు వీలయ్యే బీడుగా ఉన్న భూమి ఇంతేకాక "సాగుకు వీలుకాని భూమి" అనేదానిని గూర్చి "ఇంతవిశాలమైన భూమి ఇప్పుడు 'సాగుకు వీలుకానిది' అని వ్రాశారు. ఇదంతా సాగుకు రాదనికాని, తగనిదని కాని నమ్మడం కష్టం" అని వ్యవసాయ విచారణసంఘ నివేదిక (పుట 605) ఒప్పుకోక తప్పలేదు. కాబట్టి యిప్పుడు సాగుకు వీలయ్యేభూమిలో బీడుగా ఉన్నది అని ప్రభుత్వపు లెక్కల్లో కనబడే భూమి 27.3 వంతులకన్నా ఎక్కువే—దాదాపు మూడోవంతు మొత్తం భూమి ఉంటుంది.

"సాగుకు వీలయ్యే బీడుగా ఉన్న" ఇంత విశాలభూమి లక్షణ మేమిటి? ఎందుకు దీనిని సాగుచేయడంలేదు? ఇదికూడ ఒకొక రాష్ట్రంలో ఒకోవిధంగా ఉంది. బాగా జనసంఖ్యగల బెంగాలు, మదరాసు, యు. పి. మొదలైన రాష్ట్రాలలో కూడ ఇలాంటి భూమి దామాషా ఎక్కువే ఉంది. బెంగాలులో 18 వంతులు, మదరాసులో 21 వంతులు, యు. పి లో 20.3 వంతులు.

పై ప్రశ్నకు సమాధానం సర్ జేమ్సుకాయిర్డు నివేదికలోనే ఉంది. (క్షామ విచారణ) ఆ నివేదిక ఇండియా మంత్రికి సమర్పింపబడింది. అందులో ఇలా ఉంది:

> "భారతదేశంలో దొరికే మంచిభూమిఅంతా ఇప్పటికే ఆక్రమితమైంది. దేశంలోని వివిధప్రాంతాల్లో అడవులు పెరిగిన మంచి బీడుభూమి చాల విశాలంగా ఉంది, దీనినితీసి సాగుకు తగినట్లే చేయవచ్చును. కాని అందుకు తగిన పెట్టుబడిపెట్టాలి ప్రజలకు పెట్టగలిగిన పెట్టుబడిలేదు."

(భారత రాజ్యాంగ కార్యదర్శికి, 1879 అక్టోబర్ 31 తేదీ, సర్ జేమ్స్ కాయిర్డు యిచ్చిన నివేదిక.)

ఈ భూమంతా సాగుచేయ వీలులేదనికాదు. రైతులు విపరీత దరిద్రంలో ఉన్నారు. వారికి కాగా మిగిలిందేకాక ఇంకా ఎక్కువగా వారినుండి పిండటం జరుగుతున్నది. అత్యధిక సంఖ్యాకులైన రైతులు జీవనానికే లేకుండావున్నారు. ఇలాంటివారు ఆభూమినంతా సాగుతెచ్చుకొనే స్థితిలోలేరు. ఇలాంటిపని సమిష్టి సంఘాలు, ప్రభుత్వసహాయంతో ఈ అత్యవసరఉత్పత్తి కార్యక్రమానికి దేశంలో నిలవున్నడబ్బునుపెట్టి చేయవలసినపని. కాని ఈ బాధ్యతను ప్రభుత్వమెన్నడూ గుర్తించలేదు; ఇక్కడే నేటి ప్రభుత్వంయొక్క, సాంఘికవ్యవస్థయొక్క శక్తిహీనత కనిపిస్తుంది. బ్రిటిష్‌ప్రభుత్వం తనకంటే ముందున్న ప్రభుత్వాలు ఏర్పరచిన జలాధారవసతులు, చెరువులు మొదలైనవాని విషయంలో పూర్తిగా తొలిరోజుల్లోనే నశించిపోయేట్లు ఉపేక్షవహించింది. పైగా ప్రభుత్వంలాగే డబ్బు చాల భూమిని సేద్యంచేయనీకుండా చేసింది. ఇటీవల మొదలుపెట్టిన జలాధారవసతుల మీద అవకాశాలను బట్టిచూస్తే చాల స్వల్పంగా కనిపిస్తాయి.

తొట్టతొలుత బ్రిటన్ ఉపేక్షాభావం లోకవిదితమైంది. దీనిని చాలకాలం క్రిందటే మార్క్సు గ్రహించి ఇలా అన్నాడు:

> "సామాన్యంగా అనాదికాలంనుండి ఆశియాలో ప్రభుత్వశాఖలు మూడు ఉండేవి; ఆర్థికశాఖ-దేశంలో దోపిడి; యుద్ధశాఖ: విదేశాల దోపిడి; ఆఖరున ప్రజాక్షేమ కార్యాలశాఖ....బ్రిటిష్‌వారు భారతదేశంలో తమ పూర్వ ప్రభుత్వాలనుండి తొలి రెండుశాఖలను యుద్ధ-ఆర్థిక శాఖలను మాత్రం తీసుకొన్నారుగాని ఆఖరు ప్రజాక్షేమ కార్యాలశాఖనుమాత్రం బొత్తిగా నిర్లక్ష్యం చేశారు. కాబట్టే వ్యవసాయం క్షీణించిపోయింది.

అది బ్రిటిష్ సూత్రమైన స్వేచ్ఛావ్యాపారం, పోటీ వీనితో సడపడానికి వీలయ్యేదికాదు."

(మార్క్స్, "భారతదేశంలో బ్రిటిష్‌పాలన" న్యూయార్క్ ట్రిబ్యూన్, జూన్ 25, 1853)

1838 లో ఒక పరిశీలకుడు ("జి. థాంప్సన్ "భారతదేశం-వలసదేశాలు" 1838) ఇలా వ్రాశాడు: "బాటలు, చెరువులు కాలువలు ప్రజలకోసం, దేశ సౌభాగ్యంకోసం పూర్వపు హిందూ-ముస్లింరాజులు నిర్మించారు. అవన్నీ ఇప్పుడు పాడుబడిపోయినవి; జలాధార వసతులు లేకపోవటంబట్టి ఇప్పుడు క్షామాలు ఏర్పడుతున్నవి."'

భారతదేశంలో ఆధునిక జలాధార వసతులు మొదలుపెట్టిన సర్ ఆర్థర్ కాటన్ 1854 లో "భారతదేశంలో జలవసతులు, బాటలు" అనే పుస్తకంలో మార్క్స్‌కన్నా మరింత ఎక్కువగా వ్రాశాడు;

"భారతదేశమంతటా జలవసతులు-బాటలు మొదలైనవి పూర్తిగా నిర్లక్ష్యం చేయబడినవి....ఇంతవరకు ప్రభుత్వలక్ష్యం ఏమంటే; ఏమీ చేయవద్దు, ఏమీచేయనీయవద్దు, ఎవరూ ఏమీ చేయరాదు,ఏనష్టమైనా భరించు, ప్రజలు కరువుతో చస్తేచావనీ. నీళ్ళు, బాటలులేక కోట్లపన్ను నష్టమైనాసరే ఏమీ చేయకూడదు."

(ఆ. కాటన్, "ఇండియాలో పబ్లిక్‌వర్క్స్" 1854, పు. 272)

మాంటుగోమరి మార్టిన్ "భారత సామ్రాజ్యం" అనే పుస్తకంలో 1858 లో ఇలా వ్రాశాడు : "తూర్పు ఇండియా కంపెనీ క్రొత్తగా పనులేవీ చేయకపోవడమే కాక, అసలు పన్నుల ఆదాయానికి మూలమైన కాలువలు, చెరువులు మొదలైనవాని మరమ్మతు చేయడంకూడ మానుకున్నారు." ఈ నిర్లక్ష్యభావం, బ్రిటన్‌లోని స్వేచ్ఛా వ్యాపార పద్ధతికంటె చాల ముందుకుపోయింది; జాన్ బ్రైట్ కామన్సు సభలో 1858 జూన్ 24 న ఇలా అన్నాడు ; "ఒక్క మాంచెస్టర్ పట్టణంలో, ఒక్క నీటి సరఫరాకు మాత్రమే, ఈస్టిండియా కంపెనీ 1834 నుండి 1848 వరకు పద్నాలుగేళ్ళలో ఆ విశాల దేశమంతటా అన్ని ప్రజా కార్యాలకూ - (కాలువలు, రోడ్లు, చెరువులు మొదలైనవి) పెట్టిన డబ్బుకన్నా ఎక్కువ ఖర్చు చేయబడింది."

1900 సంవత్సరానికూడా ప్రభుత్వపు పన్నులలోనుంచి రైల్వేలకు పెట్టిన మొత్తం 22 కోట్ల 50 లక్షల పౌన్లు, ఇదికూడ బ్రిటిష్ వ్యాపార సౌకర్యాలకోసమే, మరి వ్యవసాయానికి అత్యంత ప్రాముఖ్యమైన కాలువలపైన కేవలం 2 కోట్ల 50 లక్షలు మాత్రమే ఖర్చు పెట్టారు - రైల్వేలకు పెట్టిన డబ్బులో 9 వ భాగం మాత్రమే.

కాని ఈ నిర్లక్ష్యభావం కేవలం పాతకాలపునాటిదేనని, ఇటీవల లేదని అనుకోరాదు. ఇటీవల బెంగాల్ ఇరిగేషన్ కమిటీ రిపోర్టు 1930 లో ఇలా వ్రాసింది.

"ప్రతి జిల్లాలోను పడవలు పెళ్ళే కాలువలన్నీ బురదమట్టితో నిండి పారడంలేదు. తూర్పు బెంగాలులో రహదార్లు, బాటలుకూడ ఈకాల్వలే. ఈ కాల్వలు పడవలు వెళ్ళేందుకు తగిన స్థితిలో ఉంచడం, ఈ ప్రాంతంలోని ఆర్థిక జీవితానికి ఎంతో ముఖ్యం." (పుట 6)

"మధ్య బెంగాలు నేడు క్షీణస్థితిలో ఉన్న ప్రాంతం; ఇక్కడ మలేరియా విపరీతం. క్రమంగా జనసంఖ్య నశించిపోతున్నది. భూములు సేద్యం చేయకుండా బీడుపడుతున్నవి. ఈ క్షీణదశ ఇప్పటికే అసలు ఆపే స్థితిని దాటిపోయింది. ఈ ప్రాంతమంతా కీకారణ్యంగా పరిణమించి పోతున్నది." (పుట 11)

"చిన్నదారులను పునరుద్ధరించి కాపాడే విషయంలో....ఏమీ ఇంత వరకు జరుగలేదు ఇందువల్ల రాష్ట్రంలో కొన్ని భాగాల్లో, కాలవలు పూడిపోయ్యాయి సంవత్సరంలో ఏకొన్ని నెలలోమటుకే పడవలు వెళ్ళ వీలవుతున్నది. వానకాలంలో కాలువలు బాగా నిండి ఉన్నప్పుడుమటుకే పంటలనుబజారుకు తీసుకొని పోవడం సాధ్యమవుతున్నది." (పుట 11)

(బెంగాలు ఇరిగేషన్‌శాఖ కమిటీ రిపోర్టు 1930)

ప్రఖ్యాత హైడ్రాలిక్ ఇంజనీయర్ సర్ విలియం విల్‌కాక్సు బెంగాలులోని జలాధారాలు క్షీణించిపోవడంగూర్చి చెప్పిన మాటలు గమనింపదగినవి:

"ఈజిప్టులోను, మెసపటోమియాలోను బ్రహ్మాండమైన ఆనకట్టలు కట్టిన ప్రఖ్యాత హైడ్రాలిక్ ఇంజనీయర్ సర్ విలియం విల్‌కాక్సు ఇటీవల బెంగాలు పరిస్థితులను పరిశీలించాడు ఇప్పుడు సముద్రతీరంలో పంటలు పాడుచేసే నదులన్నీ తొలుత ఇంగ్లీషుపాలనలో కాలవలనుండి చీలిపోవిచ్చినందువల్ల తయారయి, అడ్డీ ఆగూలేక పారుతున్నవి అని ఆయన కనిపెట్టాడు. పూర్వం ఈ కాలవలు గంగా ప్రవాహాన్ని ఆ ప్రాంతానికి సరఫరా చేసేవి. ఈస్టిండియా కంపెనీ వర్తకుల కనులు మిరుమిట్లుకొల్పిన తూర్పుబెంగాల్ సౌభాగ్యానికి ఈ కాలవలే కారణం .... ఆ పాతకాలవలను ఉపయోగించుకొని అభివృద్ధిపరచకపోవడమేకాక, బొత్తిగా వదిలివేసి రైళ్ళువేసి కట్టలువేయడంతో అవి పూర్తిగా పాడయిపొయ్యాయి. గంగానది ఒండుసీటి సరఫరా ఆగిపోవడంతో కొన్ని ప్రాంతాల పొలాలు సత్తువలేక పంటల పండించలేక పోతున్నవి; మిగతచోట్ల నీరు సరిగా పోక నీరు నిల్వడంతో మలేరియా తప్పనిసరిగా వ్యాపిస్తున్నది. గంగానది

ఒడ్డులు మరీ పల్చగా ఉన్నచోట కట్టలు వేయకపోవడంవల్ల, ప్రతి ఏటా చుట్టూఉన్న గ్రామాలు, తోటలు, పంటచేలు ప్రవాహంలో కొట్టుకొని పోతున్నవి.

"ఇప్పుడు ప్రతిదానికి నిష్ఫలం: సలహాను సహాయాన్ని కోరుతున్న నేటి ఉద్యోగులు, ప్రభుత్వాధికారులు ఇంతవరకు ఈ వినాశకర స్థితిని నివారించేందుకు ఏమీ చేయలేదని, రాను రాను క్రమంగా ఈ స్థితి అధ్వాన్నమైపోయిందని సర్ విలియం, విల్‌కాక్సు విమర్శించాడు."

(జి. ఎమర్సన్, "నోరులేని కోట్ల ప్రజలు" 1931, పుట 240-41)

సర్ విలియమ్ విల్‌కాక్సు అభిప్రాయాలు పూర్తిగా తెలుసుకోవాలంటే, ఆయన పుస్తకం "బెంగాలులోని ప్రాచీన జలాధారవసతులు, వానిని నేటిసమస్యలకు ఎలా అనువర్తింపజేయాలి అనే విషయంపై ఉపన్యాసాలు" చూడాలి. (కలకత్తా విశ్వవిద్యాలయం ఆచార్య ఉపన్యాసాలు, 1930) అందుతోపాటు ఈ క్రింది పుస్తకంకూడ చూడాలి. "సర్ విలియం విల్‌కాక్సు కె సి. యం జి బెంగాలు నీటివనరులగూర్చిన ఉపన్యాసాలపై బెంగాలు ఇరిగేషన్ శాఖ చీఫ్ ఇంజనీయర్ జి ఆడమ్సు విలియమ్సు నోటు, దానికి విల్కాక్సు జవాబు" (బెంగాలు ప్రభుత్వ పుస్తకశాఖ 1931.)

కాబట్టి ఇలా నీటివనరులను క్షీణింపజేయడం, పాతకాలంలోనే కాక ఇంతవరకు కూడ సాగుతునేఉన్నది. 1930 లోని ఒకప్రభుత్వ నివేదిక మాటల్లో "భూమి సేద్యం చేయక బీడుపడుతోంది"—మరొకవేపు పొలం లేక తన్నుకుంటూఉన్న సాగుబడి భూమిపైనే జనం క్రిక్కిరిసిపోతున్నారు 1789 లో లార్డు కారన్‌వాలిస్, కంపెనీ ప్రాంతంలో చాలభాగం "కేవలం క్రూరమృగాలు ఉండవలసిన అరణ్యంగా మారుతున్నది" అన్నాడు 1930 లో ప్రభుత్వ నివేదిక కేంద్ర బెంగాలునుగూర్చి "ఈ క్షీణదశ ఇప్పటికే అపవీలైనస్థితిని దాటిపోయింది. ఈ ప్రాంతమంతా కీకారణ్యంగా మారిపోతున్నది" అని వ్రాసింది.

కాని క్రిక్కిరిసి చేరిన రైతులు సాగుచేయవీలైన భూమిలో 59 వంతులు మాత్రమే పంటలు పెట్టవీలవుతున్నది; ఇందులోను సామాజిక పరిస్థితులు, రైతులను కదలనీకుండా వారిపైబడిన భారాలు, దరిద్రం, పాతకాలపు వ్యవసాయ పద్ధతి-ఇవన్నీ ఎన్నో ఇబ్బందులున్నవి వ్యవసాయపద్ధతిని అభివృద్ధి చేదామంటే రైతులవద్ద డబ్బులేదు వీటన్నిటివల్ల ఆర్థికవ్యవస్థ ఎగుడుదిగుడుగా ఉన్నందువల్ల ఇక్కడ ఉత్పత్తి అన్నిదేశాలకన్నా తక్కువగా ఉన్నది.

భారతదేశంలో బియ్యం. గోధుమ ఎంత పండుతుందో చైనా, జపాన్, అమెరికాలతో పోల్చిచూస్తే వీని తారతమ్యం మనకుబాగా కనిపిస్తుంది.

## ఎకరాకు పండేపంట క్వింటాళ్ళలో

| | ఇండియా | చైనా | జపాను | అమెరికా |
|---|---|---|---|---|
| గోధుమ | 8.1 | 9.7 | 13.5 | 9.9 |
| బియ్యం | 16.5 | 25.6 | 30.7 | 16 8 |

("పాసిఫిక్ సమస్యలు" 1931 పుట 70.)

నానాజాతి సమితి లెక్కలబట్టి మరో సాదృశ్యంకూడ చూడవచ్చును :

## ఎకరాకు పండేపంట (పౌనులలో)

| | గోధుమ | బియ్యం |
|---|---|---|
| భారతదేశం | 1357 | 652 |
| జపాన్ | 2767 | 1508 |
| ఈజిప్టు | 2356 | 1688 |
| అమెరికా | 2112 | 973 |
| ఇటలీ | 4601 | 1241 |
| జర్మనీ | — | 1740 |
| బ్రిటన్ | — | 1812 |

("నానాజాతి సమితి స్టాటిస్టికల్ ఇయర్‌బుక్" 1932-33)

భూమిపై పనిచేసేవారి సంఖ్యనుబట్టిచూస్తే ఈ వ్యత్యాసం మరింత స్పష్టంగా కనిపిస్తుంది. భారతదేశంలో ప్రతి 2½ ఎకరాల సేద్యానికి ఒక మనిషి పనిచేయాలి-మరి బ్రిటన్‌లో ఒకడు 17.3ఎకరాలు, జర్మనీలో 5 4ఎకరాలు సేద్యం చేస్తారు. ఇంత కాయకష్టం దండుగవడానికి సేద్యంమీద ఎక్కువమంది ఆధార పడడం, వ్యవసాయ పద్ధతి మరీ వెనబడిఉండడం కారణం

ఇలా తక్కువపంట పండడం పొలం మంచిదికాక కాదు.

"భారతదేశంలోని భూమి ప్రకృతిసిద్ధంగా మంచిదికాదని అంటుంటారు. ఇది సరికాదు. భూమి చెడిపోయింది. ప్రెద్దనదులలోయలన్నీ ఒకప్పుడు ప్రపంచంలో కల్లా సారవంతమైనవి. డెన్మార్కు, జర్మనీలలో భూమి చాలవరకు పూర్వం బీడు మైదానాలుగా ఉండేవి. కేవలం గడ్డీ గాదం తప్ప ఇంకొకటి అక్కడ పెరిగేదికాదు."

(ఇండియన్ సెంట్రల్ బ్యాంకింగు విచారణకమిటీ రిపోర్టు అనుబంధం 13, పుట 700 : ఎ. పి. మాక్‌డాగల్ మెమొరాండం, మార్చి 19, 1931.)

అదే మెమొరాండంలోనే ఈ క్రింది విధంగా ఉంది:

"ఎకరాలో పండేపంటను ఫ్రాన్సు స్థాయికి తెచ్చినట్టయితే భారత దేశ సంపదను పౌ 66,90 00,000 కు పెంచవచ్చును ఇంగ్లాండులో అయినంత మాత్రం ఉత్పత్తి జరిగితే ఏటా నూరుకోట్ల పౌనులకు పెంచ వచ్చును. అయినా ఇంగ్లాండు ఎక్కువ సేద్యం చేయడంలేదు. భారత

దేశంలో ఏటా రెండు పంటలు వచ్చే భూములున్నవి కాబట్టి పై దేశాలతో సరిపోల్చ వీలులేదు. ఇతర దేశాలలో ఒక పంట మాత్రమే వస్తుంది. ఈ అవకాశం మూలంగా కరువువల్ల వచ్చే నష్టం పూర్తి అవుతున్నది..... డెన్మార్కులో ఎంత గోధుమఉత్పత్తో అంత ఇండియాలో పంటవస్తే ఏటా పొ 150 కోట్లు ఎక్కువ వస్తుంది. కాబట్టి భారతగ్రామాల దరిద్రానికి భూమి సారవంతం కాకపోవడం కారణంకాదు"

ఇప్పుడున్న పంట తక్కువగా ఉండడం మాత్రమేకాక, ఉత్పాదన శక్తి కూడతగ్గిపోతున్నది. "వరుసగా ఏమాత్రం ఎరువులు వేయకుండా పంట పెట్టడం కావలసినంత ఎరువును పంటకు ఉపయోగించడం" (ఇందుకు అటవీ నిర్బంధ శాసనాలు కారణం) మూలంగా భూమి బలహీనమయి పోతున్నదని మాక్‌డాగల్ మెమోరాండంలోనే సూచించారు. ఇంకా అందులో ఇలాఉంది: "పశ్చిమదేశాలలో గడ్డిని, పంటలో కంకులుపోగా మిగతా భాగాన్ని పొలానికి వేసి సారవంతంగా చేస్తుంటారు. ఇండియాలో గడ్డి అంతటినీ పశువుల మేతగా ఉపయోగిస్తారు" (ఇందుకు కారణం పశువుల మేపడానికి అడవుల్లో అవకాశామివ్వక పోవడం) పేడను నుగ్గులుపిడకలుచేసి ఉపయోగించడం ఏదో రైతులదురభ్యాసమని నష్టకారి అనిసామాన్యంగా అంటుంటారు ఈ విషయంలో వ్యవసాయ కమిషన్ రిపోర్టు మాటలు గమనించదగినవి, అడవి కట్టెలను బొగ్గును ఉపయోగించుకునేందుకు ఉన్న నిర్బంధాలు, రైలులో తెప్పించుకునేందుకయ్యే విపరీతమైనఖర్చులు కారణ మని, "అంతకన్నా చాలమంది రైతులకు అందుబాటులో వున్నది 'పేడ" గనక దానినే వారు పంటకు ఉపయోగిస్తున్నారు. (పుట 264) ఇలా భూమి సారవిహీన మయ్యే పరిస్థితిని నివారించేందుకు ప్రభుత్వమేమీ మార్గం చూపడంలేదు.

బెంగాలులో పరిస్థితిఇది;

"ఎరువులు లేకపోవడంవల్ల పొలంలో సారమంతా క్రమంగా క్షీణించిపోతున్నది. అన్ని పంటలూ రానురాను తక్కువగా పండు తున్నవి;" (బెంగాల్ రాష్ట్ర బ్యాంకింగు విచారణ సంఘనివేదిక, 9930 పుట 21.)

ఈ నిర్ణయాన్ని బలపరచే లెక్కలిలా ఉన్నవి:

## బెంగాలులో ఎకరానికి వచ్చే సగటుపంట పౌనులలో

చలికాలం పంట

| సంవత్సరం | గోధుమ | బియ్యం | పప్పులు | ఆవాలు |
|---|---|---|---|---|
| 1906-07 | 801 | 1234 | 881 | 492 |
| 1911-12 | 861 | 983 | 881 | 492 |
| 1916-17 | 698 | 1036 | 867 | 460 |
| 1921-22 | 688 | 1029 | 826 | 485 |
| 1926-27 | 721 | 1022 | 811 | 483 |
| ఇరవయ్యేళ్ళలో తక్కువైంది | 80 | 212 | 70 | 9 |

ప్రత్యేకంగా నియుక్తుడైన భారత ప్రభుత్వ ఉద్యోగి డబ్ల్యు. బరన్స్ సి. ఐ. ఇ భారతదేశం మొత్తంమీద ఇలాంటి లెక్కలనే ఇచ్చాడు.

### బియ్యం సగటు పంట

(ఎకరాకు పౌనులలో)

| | |
|---|---|
| 9914—15 నుండి 1918—19 వరకు సగటున | 982 |
| 1926—27 నుండి 1930—31 వరకు సగటున | 851 |
| 1931—32 నుండి 1935—36 వరకుసగటున | 829 |
| 1938—39 | 728 |

("భారత దేశంలో వ్యవసాయ అభివృద్ధికున్న అవకాశాలు" 1944, పుట 55

గోధుమపంట విషయంలోకూడ ఇలాగే క్షీణత కనిపిస్తుంది. ఎకరాకు పండే పంట 724 పౌనులు 1909-13 ల్లో ఉంటే, 1924-33 లలో 636 పౌనులకు దిగిపోయింది. (అదే-పుట 57.)

ఇలాగా నేటిపరిస్థితులు, వ్యవసాయ ఉత్పత్తిదృష్ట్యా దేశఆర్థికస్థితిని చూచినట్లయితే—విపరీతంగా పెరిగిపోతున్న సాంఘిక వ్యత్యాసాలవరకు పోకుండానే—అన్నివిధాలా, భారతదేశ వ్యవసాయంలో సంక్షోభం నానాటికి హెచ్చుతున్నదనేది స్పష్టమవుతుంది.

ఇందుకు కారణం ప్రకృతి సిద్ధపరిస్థితికాదు. సాంఘిక సంబంధాలే వీనికి మూలం. ఇటీవలి అనుభవం మనకొకసంగతిని స్పష్టం చేస్తున్నది. రైతులకు మీరు వెనకబడి ఉన్నారని. ఊరికే దూరదృష్టిలేకుండా ఉపదేశాలుచేసి మేము సద్భావంతో చెబుతున్నామంటే చాలదు. వారి పీడనను తొలగించకుండా ఉపదేశాలు లాభంలేదు; ఇప్పుడున్న పన్నుల విధానంలో రైతులకు తగిన పెట్టుబడిగాని, అవకాశంకాని లేకుండా ఉంటే ఆధునిక శాస్త్రీయ పద్ధతులను అవలంబించమని వారికి చెప్పినా ప్రయోజనంలేదు.

ఇప్పుడున్న అవకాశాలు, నిర్బంధాలలో భారతదేశపు రైతు, ఎంతో చాకచక్యంతోనూ, ప్రావీణ్యంతోనూ పనిచేస్తున్నాడని చాలమందివ్యవసాయశాస్త్రవేత్తలు అంగీకరించారు. 1889 లో రాయల్ అగ్రికల్చరల్ సొసైటీ రసాయనశాస్త్ర-సలహాదారైన డాక్టర్ జె. ఎ వోల్కెర్‌ను భారత వ్యవసాయ పద్ధతిని విచారించి, అభివృద్ధికి సూచనలివ్వమని ప్రభుత్వం పంపింది. తర్వాత రెండేళ్ళకు ఆయన నివేదిక ప్రకటితమైంది. ఆ నివేదిక భారత వ్యవసాయంపై ప్రమాణ గ్రంథంగా ఉంది. అందులో ఆయనిలా వ్రాశాడు:

> "భారతదేశ వ్యవసాయం మొత్తంమీద పాతకాలపునాటిదని, వెనకబడిఉన్నదని, దాన్ని అభివృద్ధిపరచేందుకు ఏమీచేయలేదని, సామాన్యంగా ఇంగ్లాండులోను భారతదేశంలోకూడ పదే పదే చెబుతుంటారు. ఇది అబద్ధమనేదిమాత్రం నిజం. అందులో సందేహంలేదు....తనకున్న అవకాశాల్లో భారతదేశపు రైతు, బ్రిటిష్ రైతుకన్నా ఏమీ తీసిపోడు - కొన్నిట్లో

ఇంకా మెరుగే. అతనికున్న పెద్ద ఇబ్బంది, ఏమాత్రం అవకాశాలు లేక పోవడమే. ఇంత నిస్సహాయస్థితి ఇంకే దేశంలోనులేదు. ఈ ఇబ్బందులనుగూర్చి ఏ మాత్రం చెప్పుకోకుండా ఓకిమితో ఏదో తంటాలుపడుతూ గడుపుకుంటూ ఉంటాడు. ఇలా ఇంకెవరూ చేయలేరు ఇదే భారతదేశపు రైతులోపం.

"ఇలా నేనంటే బ్రిటిష్ రైతులేమి కలతపడవలసిన పనిలేదు. మన ఇంగ్లాండులో గోధుమ పండించడానికి ఎన్నో శతాబ్దాలకు ముందే భారత దేశపు రైతు పండిస్తున్నాడు. కాబట్టి వారి పద్ధతి ఎంతో మార్చాలి అనుకో వలసిన పనిలేదు. అయినప్పటికి ఇండియాలో ఎక్కువ పంట ఎందుకు పండించలేక పోతున్నారంటే. రైతుకు అందుబాటులో నీటిసరఫరా. ఎరువు మొదలైన వసతులు చాల తక్కువగా ఉండటమే కారణం

"కేవలం సామాన్య రైతు కార్యక్రమం చూచినా ఇంత చక్కని ఉదాహరణలు ఇంకెక్కడా కనిపించవు. పొలాన్ని ఏమాత్రం గడ్డీ గాదం మొలవకుండా రైతు అద్దంలా ఉంచుతాడు; నీళ్ళు తోడేందుకు ప్రత్యేక విలక్షణ సాధనాలను రైతు కనిపెట్టాడు. ఇతనికి ఏనేల ఎలాంటిదో, ఏ రకమైనదో బాగా తెలుసు; ఎప్పుడు విత్తాలో, ఎప్పుడు పంట కోయాలో సరిగ్గా తెలుసు; ఇలాంటి శక్తి ఎవరికో ఒకరికికాదు. భారతదేశ రైతులందరికీ సామాన్యమైన విషయం. ఒక పంట తర్వాత మరో పంట మార్చడం, రెండుమూడు రకాల పంటలు కలిపివెయ్యడం, చక్కగాదున్నడం- ఇవన్నీ చూస్తే ఆశ్చర్యమవుతుంది. నా సంచారంలో మకాం చేసిన స్థలాల్లో చూచినంత చక్కని సేద్యం. బాగా కాయకష్టం చెయ్యడం, ఉన్న అవకాశాలు చెడకుండా, భూసారం తగ్గిపోకుండా చూచుకోవడం - వీనిలో ఇంకెక్కడా ఇంత నైపుణ్యం నేను చూడలేదనేది నిజం;"

(డాక్టర్ జె. ఎ. వోల్కర్ "భారత వ్యవసాయ అభివృద్ధిపై నివేదిక" 1891)

భారత దేశంలోని వ్యవసాయ సంక్షోభం, సహజమైన అవకాశాలు లేకా కాదు, తగిన సమర్థత లేకనూ కాదు. వాళ్ళకున్న అవకాశాల్లో రైతులు బాగా పని చేస్తున్నారు. రైతులు అజ్ఞానంలో పడి ఉండడమూ సంక్షోభానికి కారణంకాదు వారి అభివృద్ధి కుంటుపడినదంటే అందుకుకారణం సామ్రాజ్యవాదపాలన ఫలితం. అది నిలబెట్టిన సాంఘిక సంబంధాల ఫలితం మాత్రమే. వీని మూలంగా రైతు మీద మోయలేని భారం పడింది. వ్యవసాయం స్తబ్దతతో ఏమాత్రం అభివృద్ధి చెందకుండా పడిఉంది. ఇందుతో రైతుల జీవితమంతా లేనిపోని బాధలకు గురై అర్థాకలితో అవస్థపడుతున్నారు ఇందుమూలంగా ఇందుకు ఒకే పరిణామమూ. నివారణమార్గమూ అయిన తీవ్ర విప్లవానికి పరిస్థితులు తయారవుతున్నవి. వ్యవసాయ సంక్షోభానికి మూలశక్తులను స్పష్టీకరించడంకోసం మనమిప్పుడు వ్యవసాయంలోని సాంఘిక సంబంధాలనుగూర్చి పరిశీలించడం అవసరం.

# ఎనిమిదో అధ్యాయం

# రైతు పైపడిన భారాలు

"వ్యవసాయవ్యవస్థ ఇప్పటికే శిథిలమైపోయింది, నూతన సామాజికవ్యవస్థ తప్పని సరి అని ఇప్పటికే తేలిపోయింది." జవహర్‌లాల్ నెహ్రూ 1933 లో.

వ్యవసాయ ఉత్పత్తిలో సంకటావస్థ ఏర్పడింది. ఇది వ్యవసాయంమీదనే అత్యధిక సఖ్యాకులు ఆధారపడడం తక్కువ జీవితప్రమాణం, సేద్యం స్తంభించి పోయి క్షీణదశకురావడం, వీనిలో కనిపిస్తూంది. వ్యవసాయంలోని సామాజిక సంబంధాలలో ఏర్పడిన ప్రతిష్టంభనే పైకి ఉత్పత్తిలో సంక్షోభరూపంగా కనబడు తున్నది. సామ్రాజ్యవాద పాలనలో, మరే దేశంలోను లేనిరీతిగా రైతులను దోచి వేయడం తీవ్రంగా ప్రారంభమైంది సామ్రాజ్యవాద పాలన అనే ఆవరణలోనే మరికొందరు పరాన్నభుక్కులు బయలుదేరారు. వీరంతా సామ్రాజ్యవాదంలో ఒక భాగంగా దానిమీదే ఆధారపడివున్నారు. ఇందుమూలంగా రైతులపై భారం ఎక్కువయింది; వారు నిరుపేదలై అప్పులపాలయ్యారు. ఇంతేగాక వర్గవిభేదం ఏర్పడింది. రైతుసామాన్యం తమ పొలాలకు దూరమయిపోయ్యారు. భూమిలేని రైతులు దాదాపు పూర్వకాలపు బానిసస్థితికి-లేదా పొలంలేని కార్మికసేనగా మారి పోయ్యారు. ఈస్థితి రానున్నతుపానును సూచిస్తున్నది.

## 1. భూస్వామ్యం

ప్రాచీన భారతదేశ భూవిధానంలో బ్రిటిష్ పరిపాలన ఏర్పడక పూర్వం భూమి రైతుకు చెందినది. పంటలో కొంతభాగాన్ని ప్రభుత్వం తీసుకొనేది. "భారతదేశంలో భూమి యేతెగకో దానిలోని భాగాలకో—గ్రామపంచాయితీకి లేదా గ్రామంలో స్థావరమేర్పరచుకున్న ప్రజలకో చెందిఉండేది. రాజుగారి ఆస్తిగా ఎప్పుడూ భావింపబడేదికాదు." (ఆర్. ముఖర్జీ. "భారతదేశపు భూమిసమస్యలు" 1933, పుట 16) "సామంత ప్రభువుల ప్రణాళికలోకాని, సామ్రాజ్యప్రణాళికల్లో గాని భూమి రైతుకు చెందినదనేదితప్ప వేరేభావమేలేదు," (అదే పుట 36).

హిందూ రాజులకాలంలో పంటలో ఆరోభాగం మొదలు 12 వ వంతు వరకు రాజభాగం ఉండేది. యుద్ధసమయంలో ఈభాగాన్ని నాలుగోవంతుగా ఎక్కువచేయడానికిమాత్రం వీలుండేది. మనుస్మృతి ఇలా విధించింది:

"జలగ, దూడ, తుమ్మెద తమ ఆహారాన్ని తీసుకున్నట్టుగా రాజు తన రాజ్యంలోనుండి తక్కువగా పన్నులను రాబట్టాలి. కొత్తగా హెచ్చిన ఆవులలోను, బంగారంలోను అయిదోవంతు రాజు తీసుకోవాలి; పంటలో ఆరోవంతుగాని, ఎనిమిదోవంతుగాని లేక పన్నెండోవంతుగాని తీసు

కోవాలి. కాని యుద్ధసమయంలో తన ప్రజలను శక్తివంచనలేకుండా రక్షించినట్టయితే రాజన్యుడు పంటలో నాలుగోవంతు తీసుకున్నా తప్పు లేదు."

మొగల్ నవాబులు తమ రాజ్యం స్థాపించినప్పుడు ఈభాగాన్ని మూడో వంతుకు హెచ్చించారు. అక్బర్ ఫర్మానా యిలాఉంది:

"పూర్వపురోజుల్లో, హిందూస్థానంలోని రాజులు, భూమిపంటలో ఆరోవంతు పన్నుగాను, కప్పంగాను తీసుకునేవారు సామాన్యమైన సాగు చేసిన భూమిపంటలో మూడోవంతు పన్నుగా నవాబు విధిస్తున్నాడు"

మొగల్ సామ్రాజ్య విచ్ఛిన్నదశలో, పన్ను వసూలుచేసేవారు దాదాపు సామంత ప్రభువులుగా, పాళెగాళ్ళుగా తయారై ఈ పన్నును సగపాలువరకు హెచ్చించివేశారు.

మొగల్ సామ్రాజ్య శిధిలాల్లో తమ పాలనను స్థాపించిన బ్రిటిష్‌వారు భూమిమీద పన్ను వసూలుచేసే పద్ధతిని తామూ అవలంబించారు. కాని దాని స్వరూపం మార్చివేశారు. అందుతో భూమి విధానమే మారిపోయింది.

వారు రాజ్యానికి వచ్చేప్పటికి ప్రభుత్వమంతా శిధిలావస్థలో అస్తవ్యస్తంగా ఉంది; రైతులను దోచుకోవడం మరీ అంతూపొంతూ లేకుండాఉంది; కాని గ్రామపంచాయతీ పద్ధతి, భూమిపై పంచాయతీకున్న సంబంధం విచ్ఛిన్నం కాలేదు. పన్ను అప్పటికింకా ఆయేడు పండిన పంటలో ఒకభాగంగానే ఉండేది. (సామాన్యంగా యిది ధాన్యరూపంలోనే ఉండేది—ఇష్టముంటే ధనరూపంలో యివ్వ వీలుండేది ) కాని పండినా ఎండినా సరే పొలముంటే పన్ను యివ్వాలన్న పద్ధతి అప్పటికి లేదు.

అశాంతిదశలో విపరీతంగా ఉన్న కప్పమే కొత్తప్రభువులకు సాంప్రదాయ సిద్ధంగా ఉన్న పన్ను పరిమాణంగా తోచింది. కొత్త పరిపాలకులు వేసిన పన్నులు అధికం చేయబడినవని, లేదా ఖచ్చితంగా వసూలు చెయ్యడంవల్ల అమలులో అతిభారంగా పరిణమించాయని ఆ కాలంనాటి రచయితల వ్రాతలవల్ల మనకు తెలుస్తున్నది. 19వ శతాబ్ది ప్రారంభంలో, కంపెనీ పక్షంగా జరిపిన 'స్టాటిస్టికల్ సర్వే'లో బుఛానన్, కొత్తపన్నులు చాల ఎక్కువయ్యాయని నిర్బంధంగా వసూలు చేస్తున్నారని కనిపెట్టాడు. ఇదే తొలిసారి జాగర్తగా ప్రభుత్వం జరిపిన విచారణ. ఈ సర్వే దక్షిణ భారతదేశంలో 1800 ప్రాంతంలోను, ఉత్తర హిందూస్థానంలో 1807-14 ప్రాంతంలోను జరిగింది. దినాజ్‌పూర్ జిల్లా (బెంగాల్)నుగూర్చి ఆయన ఇలా వ్రాశాడు:

"మొగల్ ఉద్యోగులుకూడ తమ్ము పీల్చిపిప్పిజేస్తూ, ఎల్లప్పుడు నీచంగా తమ్ము చూస్తుండేవారు. కాని ఇప్పటిలాగా పన్నులకు అప్పులు పడి భూము లమ్ముకోవడంకన్న అదే మేలనిపించింది అని భారత ప్రజలంటున్నారు, ఈ పొలాలమ్ముకోవడం తాము భరించలేకుంటున్నారు.

ఇదికాక లంచాలు పీకడం అధికమైంది. ఆ లంచాలతో కలిపితే పూర్వం వారుచెల్లిస్తున్నది ఇప్పటిదానిలో సగంకూడకాదని భారతీయులంటున్నారు."

(డాక్టర్ ఫ్రాన్సిస్ బుకానన్, "స్టాటిస్టికల్ సర్వే" వాల్యూం 4, అధ్యాయం 7
1872 లో వి కామన్సు సెలెక్టు కమిటీ అయిదో రిపోర్టులో ఉదహరింపబడినది.)

1826 లో బిషప్ హెబ్బర్ యిలా వ్రాశాడు :

"ఇప్పటిస్థాయిలో పన్నులంటే, దేశీయ రైతుకాని, యూరపియన్ రైతుకాని జీవించలేడని నాకుతోస్తుంది. పంటమొత్తంలో సగం ప్రభుత్వమే కావాలంటున్నది....ఉత్తర హిందూస్థానంలోని కంపెనీక్రిందఉన్న రాష్ట్రాల లోని రైతులు, స్వదేశప్రభువుల క్రిందఉన్న రైతులకంటె దరిద్రులుగా, నిరుత్సాహులుగా ఉన్నారని ఉద్యోగులంతా అభిప్రాయపడుతున్నారు—నేనుకూడ కొన్నిపరిస్థితులలో వారితో ఏకీభవించవలసివచ్చింది. ఇక ఈ మద్రాసురాష్ట్రంలో మొత్తంమీద భూమి సారహీనమైనది. అందువల్ల ఈ వ్యత్యాసం మరింత స్పష్టంగా కనిపిస్తున్నదని అంటున్నారు. యధార్ధ విషయమేమంటే, మనం వేసేంత పన్ను ఏ దేశీయ ప్రభువూ వేయడం లేదు."

(బిషప్ హెబ్బర్, "స్మృతులు, జాబులు" 1830, వాల్యూం 2, పుట 413)

చారిత్రకులైన థాంప్సన్, గారెట్టులు యిలా వ్రాశారు :

"సిపాయి పితూరీకి ముందు పన్నుల చరిత్రను చూస్తే, నికరపు పంటలో సమానమైన డబ్బురూపంలో పన్ను వేయాలన్న ప్రయత్నాలు వరుసగా విఫలంకావడం కనిపిస్తుంది. నికరపు పంటలో సాధ్యమైనంత ఎక్కువ రాబట్టాలనే ఉద్దేశ్యంతోనే బెంగాల్ రెవెన్యూ ప్రాంతాలను వేలం వేయడం జరిగింది. ఈ పద్ధతి విఫలం కావడంవల్లనే శాశ్వత పన్నుల నిర్ణయం (పర్మినెంటు సెటిల్మెంటు) ఏర్పడింది. మదరాసు, బొంబాయి రాష్ట్రాలలో, పన్నుల నిర్ణయం ఎలావేశారంటే, అంచనావేసిన 'నికరపు పంట'లో అయిదింట నాలుగోవంతు అన్న ప్రాతిపదికమీద పన్ను నిర్ణయించారు. ఇది చాలఎక్కువని రుజువయింది. సరిహద్దు రాష్ట్రంలో పన్నుల నిర్ణయానికి చేసిన ప్రథమప్రయత్నంకూడ యిలాగే భగ్నమయింది అందువల్ల దానిని 1842 లో వదిలివేశారు ...19 శతాబ్ది ప్రథమ పాదంలో వేసిన అధికపన్నుల మూలంగా మద్రాసు, బొంబాయి రాష్ట్రాలలో ప్రజలు చాల బాధపడ్డారనడంలో సందేహంలేదు....పాత సిక్కు రాజులకన్నా తక్కువగా బ్రిటిష్‌వారు పన్నులు వేసిన పంజాబులోకూడ 'రొక్కరూపంలో, ఖచ్చితంగా వసూలు చేయడం మూలంగా రైతుకున్న సదుపాయం కాస్తాపోయింది.'(హెచ్. కాల్వర్టు, "పంజాబు సిరిసంపదలు" పుట 122.")

(థాంపసన్-గారెట్‌లు,"భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వస్థాపన, విజయమూ" పుట 427.)

1921 లో డాక్టర్ హెరాల్డు మాన్ దక్కన్ గ్రామాన్ని రెండోతూరి సర్వేచేశాడు. అందులో బ్రిటిష్ పూర్వపురోజులకు బ్రిటిష్ రాజ్య కాలానికి పన్నులలో వ్యత్యాసం చాల ఉన్నదని ఆయన కనుగొన్నాడు.

"బ్రిటిష్ ఆక్రమణ తర్వాత పూర్తిగా మార్పు వచ్చింది. 1823 లో మును పెన్నడూ లేని పన్ను రూ. 2,121 ఈ ఊరిపై వేసి వసూలుచేశారు. ఇక గ్రామ ఖర్చులు 1817 లో కన్నా సగం తగ్గిపొయ్యాయి."

(మాన్ అండ్ కానిట్కర్, "దక్కన్ గ్రామంలో పొలమూ, పనీ" వాల్యూం 2, 1921, పుట 38)

1844—74 ల మధ్య 30 ఏళ్ళవరకు ఆ గ్రామం మొత్తంపన్ను రూ. 1161 అంటే ఎకరా 1కి 0-9-8; 1874—1904 లలో రూ. 1467 లేక ఎకరాకు 0-11-4; 1915 లో కొత్త పన్ను రేటు ప్రకారము మొత్తం రూ. 1581 లేక ఎకరం 1కి 0-12-2. * 1917 లో తొలిసారి సర్వేచేసి డాక్టర్ మాన్ ఇలా తెలిపాడు. మొత్తం పన్ను 1829—30 కి రూ. 1,115 కు 1914—15 లకు రూ. 1,660 కి పెరిగింది

బెంగాలు మొగల్ ఉద్యోగుల పాలన అంతరించిన సంవత్సరం 1764—65 మొత్తం పౌ. 818,000. తూర్పు ఇండియా కంపెనీ అధికారం తీసుకున్న తొలి ఏడు 1765-66 లో ఈ మొత్తం పౌ. 1,470,000 కు హెచ్చించారు. 1793 లో బెంగాలు పర్మనెంటు సెటిల్మెంటులో ఈ సంఖ్య పౌ. 3,091,000 కు పెరిగింది.

* ఈ రచయితలు పన్ను ఆ గ్రామానికి 17 వ శతాబ్దినుండి ఎంతవేశారో ఒక పట్టిక తయారుచేశారు.

## ఒక గ్రామంలో భూమి పన్ను హెచ్చింపు

| సంవత్సరం | భూమిపన్ను రూ. | పన్నువేసిన భూమి ఎకరాలు |
|---|---|---|
| 1698 | 301 | 1963 |
| 1727 | 620 | 2000 |
| 1730 | 1173 | 2000 |
| 1770 | 1632 | 2008 |
| 1785 | 552 | 1954 |
| 1790 | 66 | 1954 |
| 1803 | 1009 | 1981 |
| 1808 | 818 | 1954 |
| 1817 | 792 | 1954 |
| 1823(బ్రిటిష్‌పాలన) | 2121 | 2089 |
| 1844-74 | 1161 | 2089 |
| 1874-1904 | 1467 | 2271 |
| 1915 | 1951 | 2271 |

మొత్తం కంపెనీ వసూలుచేసినపన్ను 1800-1 లో పౌ. 42 లక్షలు. 1857-58 లో (ముఖ్యంగా కొత్తప్రాంతాలవల్లనే పన్నులు ఎక్కువచేయడం వల్లకూడ) ఈమొత్తం పౌ. 153 లక్షలకు పెరిగింది. ఇదే సంవత్సరంలోనే బ్రిటిష్‌ప్రభుత్వం పరిపాలనను చేతిలోకి తీసుకున్నది. బ్రిటిష్ ప్రభుత్వంక్రింద ఈ పన్ను 1900-1 కంతా పౌ. 175 లక్షలకు. 1911-12 కంతా పౌ. 200 లక్షలకు పెరిగింది. 1936-37 లలో ఈభూమిపన్ను మొత్తం పౌ. 239 లక్షలు.

బ్రిటిష్‌ప్రభుత్వం పరిపాలనకు పూర్వమున్న హింసాయుతమైన దోపిడీ తర్వాత సాధ్యంకాలేదు అందువల్ల బ్రిటిష్ ప్రభుత్వ పాలన తొలిరోజుల్లో వేసిన పన్నులకన్నా, ఇటీవల పన్నులు నికరం పంటలో తక్కువ భాగమే (సామాన్యంగా నికరంపంటలో లేదా గుత్తలో సగం వంతున పన్నులు లెక్కవేస్తారని ముఖర్జీ. "భూమిసమస్యలు." పుట 202) వేస్తున్నారు. అయినప్పటికీ ఈసమయంలో అనేక ఇతర పీడనలు ముఖ్యపాత్ర వహించాయి. భూస్వామ్య పద్ధతి పెరగడం, గుత్తకౌలురేటు హెచ్చించడం, వ్యాపారం, కొనవలసిన వస్తువులపై అదనపుపన్నులు, బాకీలు ఇవన్నీ ఎక్కువయాయి. పూర్వం కేవలం భూమిపన్ను ద్వారానే ముఖ్యంగా వసూలుచేస్తున్న కప్పం, తర్వాత ఆధునిక పెట్టుబడిదారీ విధానపు పీడన అనేకరూపాలు ధరించి రైతులను కమ్ముకున్నది. పెట్టుబడిదారీ విధానంలో అంతర్గతంగా పరాన్నభుక్కుల వర్గాలు తయారయ్యాయి.

అయినప్పటికి, భూమిపన్నురేటు ఇటీవలకూడ ప్రతి సెటిల్మెంటులోను పెరుగుతూనే వచ్చింది. అందువల్ల సెటిల్మెంటు తర్వాత రైతుల భారమెక్కువై వారు తిరుగుబాటు చేసేవారు. బార్డోలీలో 1928 లో కాంగ్రెసు నాయకత్వంతో 87000 రైతులు సంయుక్త ఉద్యమంతో, ఎక్కువ పన్నురేటును ప్రతిఘటించారు. అందువల్ల అలా హెచ్చించడం అన్యాయమని ప్రభుత్వం చచ్చినట్టు ఒప్పుకొని తగ్గించివేయవలసివచ్చింది. * "మదరాసు, బొంబాయి, యు. పి. రాష్ట్రాలలో ప్రత్యేకించి పన్నులు అడ్డూ ఆగిలేకుండా పెరిగాయి" అని రాధా కమల్‌ముఖర్జీ

---

* బార్డోలీ సత్యాగ్రహంపై ఉద్యోగులు కోపంతో వ్రాసిన మాటలు గుర్తుంచుకోదగినవి: రైతుల కోర్కె న్యాయంకాదని చెప్పలేదు; కాని ఇందుమూలంగా పన్ను వేసినప్పుడు అది న్యాయంకాదని ఎవరైనా ప్రశ్నించవచ్చును అనేందుకు ఇది దారిచూపుతున్నదే అని వారి ఫిర్యాదు:

"ఈ ప్రాంతపు (బార్డోలీ) పన్నుల నిర్ణయాన్ని సహజంగానే పునఃపరిశీలించారు; రాజకీయవాదులు ఈ పన్ను కొత్తరేటు సరికాదన్నారు; అందుపై బొంబాయి ప్రభుత్వం తృప్తికోసం విచారణ జరిపించింది. కొత్తపన్నురేటు ఎక్కువ అని తేలింది. ఇందువల్లి ఫలితాన్నిబట్టి ఆందోళన న్యాయమని తేలింది. కాని కొత్త మామూలు ఏర్పడింది. ఇకమీద ఎప్పుడు పన్ను రేట్లను కొత్తగా వేసినా రాజకీయ వాదోపవాదాలకు కారణం కావచ్చును."

(డబ్ల్యు హెచ్ మూర్లాండు, సి. యస్ ఐ, సి. ఐ. ఇ., "రైతులు భూస్వాములు ప్రభుత్వము - ఆధునిక భారతదేశంలో" 1932 పుట 166.)

"భారతదేశపు భూమి సమస్యలు" (పుట 206) లో వ్రాశాను. 1890-91 కి 1918-19 కి మధ్య భూమిపన్ను 24 కోట్ల రూపాయలనుండి 33 కోట్ల రూ కు పెరిగిందంటూ ఆయనింకా ఇలా వ్రాశాడు

"వ్యవసాయంపై ఆదాయం ఈ ముప్పైయేళ్ళలోను పెరిగింది. మొదటి పదేళ్ళలో నూటికి 30; రెండోపదిలో 60. మూడోపదిలో 23 వంతు ఈ ఆదాయం హెచ్చింది. మరి భూమిపన్నేమో ఈ ముప్పైఏళ్ళలోను, నూటికి 57 వంతులు యు. పి. రాష్ట్రంలోను, నూటికి 22.6 వంతులు మదరాసులోను, నూటికి 15.5 వంతులు బొంబాయిరాష్ట్రంలోను హెచ్చించారు. అంత ఎక్కువగా భూమిపన్ను పెరగడం, ఆ పన్ను ధనరూపంలో మార్చి, దానిని పంట కోతకాలంలో వసూలుచేయడం - వీనిమూలంగా చిన్నచిన్న పొలాలుగల రైతుల ఆర్థికస్థితికి బాగ దెబ్బతగిలింది. ఈరాష్ట్రాలలో ఇలాంటి చిన్న రైతులే అధికసంఖ్యాకులుగా ఉన్నారు." (పుట 345)

## 2. భూవిధానంలో మార్పు

తొలిరోజుల్లో పన్నులను హెచ్చించినంతకంటే ముఖ్యమైనది: బ్రిటిష్ ఆక్రమణతో భూవిధానంలో జరిగిన పెద్దమార్పు. ఈమార్పులో మొదటిదిశ పన్నురేటు నిర్ణయించడంలో అనుసరించిన విధానం; ఇందుతోపాటు అంతకు ముందు భారతదేశంలో సాంప్రదాయసిద్ధంగా వస్తున్న ఆచారాలుమాని భూమికి పట్టాలను రిజిష్టర్ చేయడం ఇంగ్లీషుచట్టరీత్యా భారతదేశంపై రుద్దారు. ఇవి భారతదేశపు ఆర్థికవ్యవస్థకు పూర్తిగా విభిన్నమైన భావాలు. పూర్వం రాజభాగమనేదాన్ని ఆయేడుపండిన పంటలో - పంటకొద్దీ ఇదీమారేది - కొంతభాగాన్ని పన్ను - లేదా కప్పం రూపంగా సమిష్టి సంఘం లేదా గ్రామ పంచాయితీ ప్రభువుకు చెల్లించేది; ఈ పద్ధతిని బ్రిటన్ మార్చివేసింది. భూమినిబట్టి పన్ను రేటు విధించారు - ఆ యేడు పండిందా లేదా, పంట బాగుందా పాడైపోయిందా అనేది లేదు. అసలాభూమిని సాగుచేసినా చేయకపోయినా పన్ను చెల్లించాలి. ఎక్కువభాగం ఈ పన్నులు వ్యక్తిగతంగా భూమి ఖామందులపై వేశారు—వారు సొంతంగా సేద్యం చేసేవారైనా ప్రభుత్వం నియమించిన జమీందారులైనా సరే ఈపన్నును మొదటిలోఉద్యోగులు, ప్రభుత్వపు రికార్డులు 'శిస్తు' అనేవారు. అంటే రైతులు కేవలం కౌలుదారులని సూచించారు, రైతు ప్రభుత్వంక్రింద ప్రత్యక్షంగాగాని, ప్రభుత్వం నియమించిన జమీందారులక్రింద గాని కౌలుదారులయ్యారు—కాని కొన్ని పట్టాదారుల క్రమానుగతమైన హక్కులు మాత్రం ఉంటాయి. ఇంగ్లీషు భూస్వామ్యపద్ధతిని బ్రిటన్ ప్రవేశపెట్టింది. (ఇంతకు పూర్వం ఇండియాలో ఇలాంటి జమీందారీవర్గం లేదు పూర్వం గుత్తచెల్లించేవారి స్థానే వీరిని ప్రభుత్వం ఏర్పరచింది) స్వంతభూమి పట్టాలు ఏర్పరచింది—భూమిని అమ్మడం, అడుమానం (కుదువ)పెట్టడం, మొదలైన ఇంగ్లీషు ధనిక

పన్ను చట్టాలన్నీ—భారత అర్థశాస్త్రానికి కొత్తభావాలు—సివిల్ ఉద్యోగులు ప్రవేశపెట్టారు. ఈ విదేశపాలకులూ, ఉద్యోగులే చట్టాలు చేసేవారు, దాన్ని అమలు జరిపేవారు దానిపై తీర్పు చెప్పేవారుగాకూడ తయారయ్యారు. ఇందుతో భూమివిధానంలో మార్పు పూర్తిఅయింది. ఇలా బ్రిటిష్ ఆక్రమణదారుల ప్రభుత్వం భూమికి యజమాని అయింది. రైతులు కౌలుదార్లయ్యారు శిస్తుచెల్లించకపోతే వారిని భూమినుండి తొలిగించవచ్చు. ఆ భూములను తాము నియమించిన జమీందారులకు అన్యాక్రాంతం చెయ్యవచ్చును. వారుకూడ పన్ను చెల్లించకపోతే తొలగించేందుకు ప్రభుత్వానికి అధికారముంచుకున్నారు ఇలాగా గ్రామ పంచాయతీలనే స్వపరిపాలక సంస్థల ఆర్థిక, రాజ్యాంగ కర్తవ్యాలన్నీ ప్రభుత్వంతానే ఆక్రమించుకొంది; సమిష్టిగా భూములు చాలభాగం ప్రత్యేక వ్యక్తులకు పట్టాలు చేయించింది.

ఇలాగ వలస విధానపు ప్రత్యేక కార్యక్రమం సమగ్రంగా నిరాఘాటంగా ఇండియాలో సాగింది - భారత ప్రజలనుండి వారి భూములను లాక్కున్నారు. క్రమంగా మరింత చిక్కులతో నిండుకున్న చట్టాలకు మసగున ఈ లాక్కోవడం కొంత మరుగుపడేట్టుచేశారు; నూటయాభై యేళ్ళ తర్వాత ఈ చట్టాల వల్లనైతేనేమి కారణ్యమైతేనేమి పద్ధతులు, ఆచారాలు, హక్కులు అనే వానితో క్రిక్కిరిసిపోయింది. భూమి యజమానులుగా ఉండిన రైతులు కేవలం పాలేరు - కౌలుదార్లు అయినారు. కాని మరీ ఆ యజమానికున్న కష్టాలు - ఆటంకాలు, అప్పులు మొదలైనవి - తప్పలేదు. ఈ బాధలిప్పుడు చాలమంది రైతులపై పడినవి ఈ కార్యక్రమం మరింత కొనసాగేటప్పటికి, గత శతాబ్దిలో - ముఖ్యంగా గత అర్ధ శతాబ్దిలో రైతులలో అత్యధిక సంఖ్యాకులు భూమిలేని వ్యవసాయకూలీలుగా, వ్యావసాయిక నూతన కార్మికవర్గంగా తయారయ్యారు ఇప్పుడు వీరి సంఖ్య వ్యవసాయ జనాభాలో మూడోభాగంనుండి రెండో భాగానికి పెరిగింది.

ఈ మార్పులోని ప్రథమదశనుగూర్చే మార్క్స్ ప్రస్తావించాడు, బూర్జువా వ్యాపారం వ్యాపించడం, యంత్రోత్పన్న వస్తువులు రావడంవల్ల పరోక్షంగా ప్రాచీన గ్రామవ్యవస్థ నిర్మూలితం కావడమేకాదు; "పాలకులుగా భూస్వాములుగా" ఇంగ్లీషు విజేతలు "ప్రత్యక్షంగా రాజకీయ, ఆర్థిక అధికారం వహించడంతో జరిగింద"ని ఆయన నొక్కిచెప్పాడు, ఇలా ప్రాచీనవ్యవస్థ నిర్మూలనం చైనాలో ఆలస్యంగా జరిగిందని వ్యత్యాసంచూపి "చైనాలో ఇంగ్లీషువారు ప్రత్యక్ష రాజకీయాధికారం వహించి ఈ కార్యక్రమాన్ని నడపలేదు"అని ఆయన తెలిపి ఇలా అన్నాడు;

"వ్యాపారవ్యాప్తికి ధనికపద్ధతికి ముందుకాలపు దేశీయ ఉత్పత్తి విధానంలోని ఐక్యత, సామరస్యంఎంత ఆటంకం కలిగిస్తాయో ఇండియా చైనాలతో ఇంగ్లీషువారి కేర్పడిన సంబంధం తెలియపరిచింది. ఈదేశాల్లో ఉత్పత్తి విధానానికి స్థూలమైన ప్రాతిపదిక చిన్నసేద్యానికీ చేతిపనులకూ ఉన్న ఐక్యతమీద ఆధారపడిఉంది. ఇందుతోపాటు భారత దేశంలో భూమిపై గ్రామసంఘాలకు సమిష్టి యాజమాన్యం ఉండేది; ఇదే చైనాలోకూడ పూర్వంఉన్న పద్ధతి. ఈచిన్న ఆర్థికవ్యవస్థలను విచ్ఛిన్నం చేయడంకోసం తామే పాలకులుగా భూస్వాములుగా ఏర్పడి తమ రాజకీయ ఆర్థిక ప్రత్యక్ష అధికారాన్ని ఇంగ్లీషువారు ఒకేతూరి ఏర్పరిచారు."

దీనికి మార్క్సు ఈ క్రింది వివరణంకూడ చేర్చాడు:

"ఆర్థికశాస్త్ర ప్రయోగంలో విజయవంతం కాని, నిజానికి అర్థంలేని దేదైనా ఉందీ అంటే అది అన్ని దేశచరిత్రలలోకీ భారతదేశంపై ఇంగ్లీషు పెత్తనంయొక్క చరిత్రలోనే కనిపిస్తుంది (ఆచరణలో ఇది అపఖ్యాతికరమైనదికూడ) బెంగాలులో వారు ఇంగ్లీషు భూస్వామ్యపద్ధతిని విశాల ప్రదేశాలలో ఏర్పరచారు ఇది ఇంగ్లీషు పద్ధతికి వికారమైన అనుకరణం మాత్రమే! ఈశాన్యప్రాంతంలో వారు చిన్నచిన్న ఆస్తివిభాగాల వికారరూపాలను ఏర్పరచారు; వాయువ్యంలో తమశక్తినంతా వినియోగించి సమిష్టి భూమియాజమాన్యంతో బాటు భారతగ్రామ వ్యవస్థను కేవలం ఛాయామాత్రంగా ఏర్పరచారు."

(మార్క్సు, "కాపిటల్ II వాల్యూం 3, అధ్యా. 20, పుట 392")

## 3. జమీందారీల నిర్మాణం

పశ్చిమ దురాక్రమణదారులు భూవిధానంలో తొలుత ఏర్పరచిన పద్ధతేదంటే ఇంగ్లీషు భూస్వామ్యపద్ధతిని కొన్నిమార్పులతో ప్రవేశపెట్టడమే 1793 లో లార్డు కారన్ వాలిస్ బెంగాలు, బీహారు, ఒరిస్సాలలో ఏర్పరచిన (పర్మనెంట్ లాండ్ సెటిల్మెంటు) ప్రఖ్యాత భూవిధానంయొక్క లక్షణమది. ఇది తర్వాత ఉత్తర మదరాసు ప్రాంతానికికూడ వ్యాపించింది. వాస్తవానికి ఇప్పుడున్న జమీందారులు కేవలం పన్ను వసూలుచేసేవారు—లేక, పూర్వరాజులు భూమిపన్నును కమిషన్‌పై వసూలు చేయడానికి ఏర్పరచినవారు (ఈ కమిషన్ నూటికి 2½ గా ఉండేది. కాని అంతకన్నా ఎక్కువగా వీరు లాగేవారు) ఇలాంటి జమీందారులను శాశ్వతంగా భూస్వాములుగా ఏర్పరచారు వీరు ప్రభుత్వానికి శాశ్వతంగా నిర్ణయించిన కొంత మొత్తం కట్టవలసి ఉంటుంది. ఈ మొత్తాన్ని, అప్పటి రైతులు ఇస్తున్న మొత్తాన్నంతా కలిపి అందులో 11 లో 10 వంతుగా నిర్ణయించారు. ఆ 11 లో ఒకటో వంతు భూస్వామిభాగమని నిర్ణయించారు.

ఆకాలంలో ఈ పద్ధతి జమీందారులకు, రైతులకు చాల ఇబ్బందిగా ఉంది. ప్రభుత్వానికి ఎక్కువ లాభదాయకంగా ఉండేది. బెంగాలులో ప్రభుత్వానికి ఈ జమీందారులు ఇవ్వవలసిన మొత్తాన్ని పౌ. 30 లక్షలకు హెచ్చించారు. పూర్వం రాజులు వసూలుచేస్తున్న దానికంటే ఈమొత్తం విపరీతంగా పెరిగిపోయింది. ఏవో కష్టపరిస్థితులు ఏర్పడినప్పుడు, రైతులపై ఏకాంతో విచక్షణచూపుతూ, మొత్తాన్ని కొంత వదలివేస్తూ పాతపద్ధతులను అవలంబిస్తూవచ్చిన సంప్రదాయానుగతులైన జమీందారీలు ఈభారంతో చాలా విచ్ఛిన్నమయిపోయాయి. వెంటనే ఈజమీందారులను వేలంవేసి ప్రభుత్వం అమ్మివేసింది. తమక్రిందఉన్న రైతులకు తాము కొంత ఆదరణ చూపాలనుకునే ఈ పాతకాలపు జమీందారులు వినాశం కావడంగూర్చి చాల విషాదగాథలు చెబుతారు తమ కోటాను ఇవ్వలేదని ఈ జమీందారులను కొత్తపాలకులు నిర్దాక్షిణ్యంగా తరిమివేశారు. ఇందుతో దోపిడీకి సిద్ధమైన వర్తకులు, కొత్తరకపు జమీందారులు, జమీందారీలను తీసుకునేందుకు ముందుకువచ్చారు. వీరు రైతులవద్దనున్న ఆఖరు అణాదాక తమకప్పం చెల్లించేందుకు, తమజేబులు నింపుకొనేందుకు పీల్చేందుకు, సర్వసిద్ధమయ్యారు. ఇదే నూతన "భూస్వామివర్గ" లక్షణం. ఆకాలపు అభిప్రాయాలప్రకారం ఇలాంటి వర్గాన్ని సృజించడమే పర్మనెంటు సెటిల్‌మెంటు ఆశయం 1802 లో మిడ్నపూర్ కలెక్టర్ మాటలలో:

"అమ్మకాలు స్వాధీనం చేసుకోవడం మొదలైనవానితో కొన్నేళ్ళలో బెంగాలులోని ఎక్కువమంది పెద్ద జమీందారులు దరిద్రులయిపోయ్యారు. అడుక్కునే స్థితికి వచ్చారు. కేవలం ఆంతరంగిక చట్టాల మార్పులతో ఏకాలంలోను, ఏదేశంలోను జరగనంత త్వరగా పెద్దమార్పు బెంగాలు భూస్వామ్య విధానంలో వచ్చింది."

క్రమంగా, ఈ పద్ధతి ప్రభుత్వం తొలుత అనుకోని రీతిగా నడిచింది. డబ్బు వెల పడిపోవడం, రైతులనుండి వసూలుచేసే పన్నులు ఎక్కువకావడం, వీనివల్ల ఇక ఈ దోపిడీలో ప్రభుత్వభాగం కేవలం 30 లక్షలు పౌనులుగానే శాశ్వతంగా నిర్ణయించడం చాలతక్కువయిపోయింది. మరి జమీందారుల భాగమేమో పెరుగుతూ వచ్చింది. ఇప్పుడు బెంగాలులో పర్మనెంటు సెటిల్మెంటు ప్రకారం, మొత్తం పన్నులు 120 లక్షల పౌనులని అంచనావేశారు. ఇందులో నాలుగోవంతు ప్రభుత్వానికి వెడుతుంది. మిగత మూడువంతులూ జమీందారులకు పోతున్నది. *

---

* ఈ వసూలుచేసే పన్నుల మొత్తం చట్టబద్ధం కాని పద్ధతులద్వారా మరింత ఎక్కువ చేస్తున్నారు. 1937 లో బెంగాల్ అసెంబ్లీ రెండో సమావేశంలో టెనెన్సీ చట్టం చర్చకు వచ్చింది. అప్పుడు ముగ్గురు ఉపన్యాసకులు బెంగాలు మొత్తం పన్నులను ఇలా వరుసగా అంచనా వేశారు. 29 కోట్లు (ఇందులో 17 కోట్లు చట్టబద్ధం 12 కోట్లు లంచాలు) 30 కోటు

ఇందువల్ల నేడు పర్మనెంటు సెటిల్మెంటును రైతులు జమీందారులు తప్ప ఇతర ప్రజలు ఖండిస్తున్నారు. అంతేకాక సామ్రాజ్యవాదులుకూడ దీనిని ఖండిస్తున్నారు. ఈ సెటిల్మెంటును పునః పరిశీలించాలని పెద్ద ఉద్యమం నడుస్తున్నది. (పర్మనెంటు సెటిల్మెంటును నేడు సామ్రాజ్యవాదులెంత తీవ్రంగా ఖండిస్తున్నారో ఉదాహరణకు "ఆక్సుఫర్డు ఇండియా చరిత్రలో" (పు. 561-570 చూడవచ్చును) ఇటీవల సామ్రాజ్యవాదాన్ని సమర్థించేవారు ఈ సెటిల్మెంటు కేవలం తెలియక చేసిన తప్పనీ, జమీందారులు, భూస్వాములు కాదన్న అంశాన్ని తెలుసుకోక పోవడమే ఇందుకు కారణమని, కారణం చెప్ప ప్రయత్నిస్తున్నారు. ఇలాగే అన్స్టే "భారతదేశ ఆర్థికాభివృద్ధి" అనే పెద్ద పుస్తకంలో (పుట 98) రాశాడు.

> "తొట్టతొలుత అతిచిక్కుగావున్న భారతదేశ పద్ధతి, కంపెనీ ఉద్యోగులకు దురవగాహంగా ఉంది. వారు 'భూస్వామికోసం వెతికారు'.... తర్వాత తర్వాత ఈ జమీందారులు పూర్వం భూమికి యజమానులుకాదని, చాలమంది విషయంలో ఇంతేనని తోచింది.....ఆ కాలంలో వీరిని ఇంగ్లీషు దేశంలోలాంటి 'భూస్వాములు' అని ప్రభుత్వం పొరబడింది."

ఈ పిట్టకథ కేవలం అర్థంలేనిది ఆ కాలపు రికార్డులను పరికించినట్లయితే, లార్డు కారన్వాలిస్ మొదలైన ఆ కాలపు ప్రభుత్వోద్యోగులకు, తామొక కొత్త భూస్వామ్యవర్గాన్ని సృష్టిస్తున్నట్లు స్పష్టంగా తెలుసు. బుద్ధిపూర్వకంగా వారొక ఉద్దేశంతోనే ఈపని చేశారు, అని మనకు స్పష్టమవుతుంది.

శాశ్వతంగా ఈ జమీందారులను సృష్టించడంలో ఉద్దేశమేమంటే, ఇంగ్లీషు నమూనాలో భూస్వాములను సృజించి, బ్రిటిష్ పాలనకు మద్దతుగా ఈ వర్గాన్ని ఉంచుకోవడమే. బ్రహ్మాండమైన జనాభాలో, ఏ కొందరు ఇంగ్లీషు భూస్వాములో మాత్రం ఉంటే చాలదు. తమ పాలనకు నమాజంలో పునాదిని ఏర్పరుచుకొనడం అత్యవసరం. అందుకని ఈ కొత్తవర్గాన్ని సృష్టించారు. ఈ జమీందారులు దోపిడీలో కొంతభాగాన్ని (మొదట 11 లో 1 వ వంతు వీరిదని ఉద్దేశించారు) తీసుకుంటారు. కాబట్టి ఇంగ్లీషు పాలన రక్షణకు వీరు పూనుకుంటారు. లార్డు కారన్వాలిస్ తన విధానాన్ని సమర్థించుకుంటూ తయారుచేసిన నివేదికలో తానొక నూతన వర్గాన్ని సృష్టిస్తున్నట్లు తనకు బాగా తెలుసునని స్పష్టపరిచినాడు పూర్వం జమీందారులకున్న హక్కులకు ఇప్పుడు తాను ఏర్పరుస్తున్న హక్కులకు సంబంధంలేదనికూడ తెలిపినాడు ; "జమీందారులు తమ హక్కులకై చేసే ప్రతిపాదనలను త్రోసిపుచ్చినా ప్రజలకోసం వారికి భూమిపై హక్కు నివ్వడం అవసరమనే నిశ్చయానికి వచ్చాను." అని ఆయన వ్రాశాడు. సర్ రిచర్డు టెంపుల్

---

(20 చట్ట ప్రకారం, 10 వేలుగా) 26 కోట్లు (20 చట్ట ప్రకారం 6 వేలుగా) ఈ అంచనాలన్నిటిని చేర్చి మొత్తం చూస్తే చట్ట వ్యతిరేక వసూళ్ళతోపాటు 2 కోట్ల పౌనులు ఎక్కువయినట్టు కనిపిస్తుంది.

తన "నేను భారతదేశంలో ఉండగా జరిగిన సంఘటనలు. అప్పటి వ్యక్తులు" (పుట 30) అన్న పుస్తకంలో కారిన్ వాలిస్ పర్మనెంటు సెటిల్‌మెంటును గూర్చి ఇలా అన్నాడు: "బెంగాలు ప్రజల్లో ఇంగ్లాండు భూస్వామ్య విధానంతో సమానమైన వ్యవస్థను తయారుచేసింది" 1828 నుండి 1835 వరకు ఇండియా వైస్రాయిగా ఉండిన లార్డు విలియం బెంటిక్, తాను వైస్రాయిగా ఉన్న రోజుల్లో, ఒక అధికారోపన్యాసంలో, 'ఈపర్మనెంటు సెటిల్‌మెంటు, దేశంలోని విప్లవాన్ని ప్రతిఘటించే అగ్రగామి' అన్నాడు;

"విరీతంగా వస్తున్న ప్రజాందోళనకు-లేదా విప్లవానికి వ్యతిరేకంగా సంరక్షణ కావాలంటే. అందుకు పర్మనెంటు సెటిల్‌మెంటు పనికివస్తుంది. ఇది మిగతా విషయాల్లో విఫలమయినప్పటికి ముఖ్యంగా ఇందులో ఒక పెద్ద అవకాశముంది బ్రిటిష్ రాజ్యం కొనసాగడంమీద అత్యాదరం కలిగి, ప్రజలపై సమగ్రమైన పెత్తనంగల భూస్వాములను కావలసినంతమందిని ఈ పర్మనెంటు సెటిల్‌మెంటు సృష్టించింది."

లార్డు విలియం బెంటిక్, 1829 నవంబర్ 8న చేసిన ఉపన్యాసం, ఎ బి. కీత్‌గారి "భారత విధానంపై 1750-1921 లోని ఉపన్యాసాలు, పత్రాలు" అనే పుస్తకంలో వాల్యూం 1, పుట 215 లో ఉదహరింపబడినది.)

ఇలా భారతదేశంలోని భూస్వామివర్గం — బ్రిటిష్ ప్రభుత్వాల కలయిక, తమ కార్యకలాపంతో నేటికికూడ పెద్దసమాజంలోని పునాదిగా పనిచేస్తున్నది నేడు బ్రిటిష్‌పాలన, దాటరాని వ్యతిరేక శక్తులలో చిక్కుకొన్నది. ఆభూస్వామివర్గంతోపాటు బ్రిటిషు పాలనకుకూడ ఈ వ్యతిరేక శక్తుల సంఘటనలో వినాశదశ తయారవుతున్నది. ఒకవేపు భారతప్రజలు తమ స్వతంత్రంకోసం ముందుకు పురోగమిస్తుంటే, ప్రతిరాష్ట్రంలోని ఈ భూస్వాముల సంఘాలు, సమాఖ్యాలు సమావేశమై బ్రిటిష్ రాజ్యంపై సంపూర్ణ భక్తివిశ్వాసాలను ప్రకటిస్తున్నవి. వీనిలో మచ్చుకు బెంగాల్ భూస్వామి సంఘం అధ్యక్షుడు 1925 లో వైస్రాయికి ఇచ్చిన సన్మానపత్రం చూడవచ్చు

"అర కొరలేని భూస్వాముల హృదయపూర్వక సహకార సద్భావాలపై ప్రభువులవారు నమ్మకముంచవచ్చును."

1938 లో ప్రథమ అఖిలభారత భూస్వామి మహాసభ సమగ్రసంస్థను తయారుచేసేందుకని ఏర్పడింది; అధ్యక్షతవహించిన మైమన్‌సింగు మహారాజా యిచ్చిన ఉపన్యాసంలోని ముఖ్యభావం యిలా వుంది. "మనమొక వర్గంగా నిల్వాలంటే ప్రభుత్వాన్ని బలపరచడం మన కర్తవ్యం" 1935 ఇండియాచట్టంలో, రాష్ట్రశాసనసభలలోను, ఫెడరల్ శాసనసభలోనుకూడ ఈ భూస్వాములకు ప్రత్యేక స్థానాలు ఏర్పరచబడినవి.

కాని పర్మనెంటు సెటిల్మెంటునాటి పొరబాటును తిరిగి ప్రభుత్వంచేయలేదు. తర్వాత జరిగిన జమీందారీ సెటిల్మెంటులన్నీ 'తాత్కాలిక' మైనవే—అంటే ప్రభుత్వం తనకివ్వవలసిన డబ్బును అప్పుడప్పుడు పెంచడానికి వీలున్నది.

పర్మనెం టు సెటిల్మెంటు తర్వాత, మరొకపద్ధతి చాల జిల్లాలలో, మద్రాసులో మొదలుపెట్టి ప్రయత్నించిచూచారు. ప్రభుత్వం రైతులతో ప్రత్యక్షంగా పన్నుల నిర్ణయంచేసుకోవాలని. అదికూడా తాత్కాలికంగా ఉండి. అప్పుడప్పుడు రేట్లు మార్చడానికి వీలుండాలని ఒకపద్ధతిని ఆరంభించారు. ఇలా అయితే రైతులనుండి దోచిందంతా, మధ్యలో వారికి భాగంలేకుండా అంతా ప్రభుత్వమే కాజేయవచ్చు నని అనుకున్నారు. దీనినే రైతువారీ పద్ధతి అంటారు. దీనిని మదరాసులోని సర్ థామస్‌మన్రో ఆరంభించాడు. ఈ పద్ధతి భారతీయ పద్ధతికి సన్నిహితంగా ఉన్నదని మన్రో భావించాడు. 1807 లోనే అప్పటికున్న జమీందారీ పద్ధతికి వ్యతిరేకంగా మన్రో ఈపద్ధతిని ప్రకటించాడు. అతడు మదరాసు గవర్నరుగా ఉండి 1820 లో దీనిని మదరాసు రాష్ట్రంలో ఎక్కువభాగానికి అనువర్తింప జేశాడు. ఈ మాదిరిని మిగతా రాష్ట్రాలు చాల అనుసరించాయి. ఇప్పుడీ రైతు వారీ పద్ధతి బ్రిటిష్ ఇండియాలో సగభాగంలో అమలు జరుగుతున్నది.

భారతదేశ పద్ధతులకు సన్నిహితంగా ఉందనిచెప్పినప్పటిక రైతువారీ పద్ధతి జమీందారీ పద్ధతిలాగే భారత వ్యవస్థను ఖండించివేసింది: సెటిల్మెంటును వ్యక్తి గతంగా రైతులతో చేసుకోవడం, పన్నును నిఖరంపంటమీదకాక, భూమిని ప్రాతి పదికగా చేసుకొని నిర్ణయించడం భారతీయ పద్ధతికాదు ఇందుకు వ్యతిరేకంగా, మదరాసు రెవిన్యూబోర్డు పోరాడి ఓడిపోయింది. ఈ పద్ధతిని విడిచిపెట్టి, గ్రామ పంచాయితీలతో సెటిల్మెంటు చేసుకోవాలని కోరింది. దీనిని మౌజవారీ సెటి ల్మెంటుఅంటారు. 1818 లో రైతువారీ పద్ధతిని విమర్శిస్తూ, రివెన్యూబోర్డువారి చ్చిన నివేదకనిక్కడ ఉదహరిస్తున్నాను

"కొత్తగా సంపాదించుకున్న దేశాల సహజసంపదను, ఆదేశాల భూమిపన్ను విధానాన్ని సరిగా తెలియని కొందరు విదేశ విజేతలు త్వరలో విశాల భూభాగాలను తమక్రిందికి తెచ్చుకున్నారు. ఆ ప్రాంతాలలో భాష, సంస్కృతి, ఆచారాలు విభిన్నంగాగల అనేక ప్రజలు నివసిస్తున్నారు. విదేశీయులు అలాంటి ప్రాంతాలలో ఏవో తమ ఊహాకల్పిత పద్ధతులు నెలకొల్పాలని చూస్తున్నారు. బాగా అభివృద్ధిపొందిన యూరోపుదేశాలలో కావలసినన్ని లెక్కలుండి, ప్రజలతో సన్నిహితమైన ప్రభుత్వమున్నప్ప టికి అక్కడే వీలుకానిపనులిక్కడ చేయాలంటున్నారు. భూమిపన్నును రాష్ట్రంమీద, జిల్లామీద, ప్రాంతంమీద, ఒక ఎస్టేటుమీద కాకుండా ఒక్కొక్క వ్యక్తి పొలంమీద ప్రత్యేకించి తమ రాజ్యమంతటా పన్ను వేయాలంటు న్నారు.

"ఇదేదో అభివృద్ధి అంటూ దీనిని ఏర్పరచడంలో, తమకు ఉద్దేశం లేకున్నప్పటికి, ప్రాచీన సంబంధాలను, ప్రాచీన పద్ధతులను నిర్మూలిస్తున్నారు ఆ ప్రాచీన పద్ధతులే హిందూ గ్రామ రాజ్యాలను ఐక్యపరచేవి. చిరకాలం నుంచి గ్రామ పంచాయితీకి సమిష్టిగా చెందిన భూములను చిందరవందరచేసి వేరువేరుగా పన్నులు వేసి కొత్త వ్యవసాయ చట్టం తెచ్చారు. ....ప్రతి పొలానికి తమ పన్నును వేరుగా చేస్తామంటూ ఏదో ఎప్పుడూరాని అధికాదాయాన్ని లెక్కించి పన్నువేస్తున్నారు తమ కిష్టంవచ్చిన రైతుకు భూమినంటగడుతున్నారు. వీరికి ముందున్న ముసల్మాన్ ప్రభుత్వంలాగే రైతును నాగలికి బలవంతంగా కడుతున్నారు. ఎక్కువ పన్నువేసిన భూమిలోనికి రైతును తోస్తు, పంటపండి వచ్చేవరకు అతను ఇవ్వవలసిన పన్నును అలాగేఉంచి, దొరికినంతా అతనినుండి లాక్కొంటున్నారు ఎద్దులు, విత్తనాల గింజలు తప్ప అతనివన్నీ లాక్కొని-వీలయితే అవికూడా అతనికిచ్చి తిరిగి అతనిని సేద్యానికి, ఇష్టం లేకున్నా తోలుతున్నారు ఆ సేద్యంకూడ తనకోసంకాక విదేశీయుల కోసం రైతు చేయవలసి వస్తున్నది"

(మదరాసు రెవిన్యూబోర్డు మినిట్, 1818 జనవరి 5)

ఇలా అక్కడున్న ఉద్యోగులు సమిష్టి సెటిల్మెంటులు కావాలని "అనాదిగా గ్రామ పంచాయితీలకు సమిష్టిగా చెందిన భూమిని" గుర్తించాలని కోరడం ఫలించలేదు లండన్ డైరెక్టర్లసభ రైత్వారీ పద్ధతినే నిర్ణయించింది. ఆకాలపు ప్రభుత్వ పత్రం మాటలలో "స్వంత ఆస్తి భాగ్యాన్ని" రైతుకు ప్రసాదించ నిశ్చయించింది: ఆ సభ ఆజ్ఞలతో సన్నద్ధుడై సర్ థామస్ మన్రో ఇంగ్లాండునుండి, ఈ పద్ధతిని దేశంపై రుద్దడానికి తిరిగి వచ్చాడు.

నేడు బ్రిటిష్ ఇండియాలో భూమి విధానం మూడువర్గాలక్రింద సంప్రదాయ సిద్ధంగా విభజింపబడిఉన్నది. ఈ మూడుపద్ధతులలోనుకూడ బ్రిటిష్ ప్రభుత్వం నుండే సర్వహక్కులు సంక్రమిస్తాయి సార్వభౌమాధిపత్యం భూమిపై ప్రభుత్వానిదే.

ఒకటి, శాశ్వత జమీందారీపద్ధతి-ఇది బెంగాలు, బీహారు, ఉత్తరమదరాసు ప్రాంతాలలో ఉన్నది. బ్రిటిష్ ఇండియాలోని మొత్తం భూమిలో నూటికి 19 వంతులు దీనిక్రిందికి వస్తుంది.

రెండు, తాత్కాలిక జమీందారీపద్ధతి-ఇది సంయుక్త పరగణాలలో చాల భాగం, మధ్యపరగణాలు, బెంగాలు, బొంబాయి, పంజాబులలోని కొన్ని ప్రాంతాలలో ఉన్నది. (వ్యక్తి లేక సముదాయ యాజమాన్యంక్రింద సంయుక్తగ్రామ సెటిల్మెంటులు అనబడేవానిక్రింద పంజాబులో ప్రయత్నించారు) ఈ పద్ధతిక్రింద భూమిలో 30 వంతులు ఉన్నది.

మూడు. రైతువారీపద్ధతి- ఇది బొంబాయిలోను మదరాసులో ఎక్కువ భాగంలోను, బీరారు, సింధు అస్సాం మొదలైన ప్రాంతాలలోనుఉంది. ఈ పద్ధతి క్రింద మొత్తం భూమిలో నూటికి 51 వంతుఉన్నది

దీనినిబట్టి బ్రిటిష్ ఇండియాలో జమీందారీ పద్ధతిక్రిందఉన్న 49 వంతుల భూమిలో మాత్రమే భూస్వామ్యం ప్రబలిఉన్నది అనుకోరాదు భూములను కౌలు కివ్వడం మూలంగా, వడ్డీవ్యాపారస్తులు అసలు రైతులను తొలగించివేయడం మూలంగాను, ఇతరులభూముని సంపాదించడం మూలంగాను ఆచరణలో, రైతువారీ ప్రాంతాల్లోకూడ విపరీతంగా భూస్వామిపద్ధతి వ్యాపించింది; అసలు ఉద్దేశం సేద్యంచేసే రైతులోనే ప్రభుత్వం ఒడంబడిక చేసుకోవాలనుకున్నప్పటికీ, ఆ సంబంధాలిప్పుడు చాలభాగం మారిపోయ్యాయి "మదరాసు, బొంబాయి రాష్ట్రాలలో నూటికి 30 వంతులపైగాభూమి రైతులు స్వయంగా సేద్యంచేయడంలేదు" అని అంచనా వేయబడింది. (ముఖర్జీ, "భారతభూమి సమస్యలు" పుట 29) మదరాసు రాష్ట్రంలో 1901 నుండి 1921 నాటికి సేద్యంచేయని భూఖామందులు వెయ్యికి 19 మందినుండి49కి పెరిగారు; సేద్యంచేసే భూఖామందులు వెయ్యికి 484 నుండి 381 కి దిగిపోయ్యారు; కౌలుకు సేద్యంచేసుకొనే రైతులు వెయ్యికి 151 నుండి 225 మందికి పెరిగారు. భూమిపైవచ్చే గుత్తలమీద బతికేవారిసంఖ్య 1911 లో 6 26,000 నుండి 1921 కి 1 008 000 లకు పెరిగిందని పంజాబు 1921 జనాభాలెక్కల నివేదిక తెలిపింది. సంయుక్త పరగణాలలో 1891 నుండి 1921 లోపల భూమిగుత్తలనుండి ముఖ్యంగా ఆదాయంవచ్చేవారి సంఖ్య నూటికి 46 ఎక్కువయింది. మధ్య పరగణాలు - బీరార్లలో అదేకాలపరిమితిలో గుత్తలతో బ్రతికేవారి సంఖ్య నూటికి 52 హెచ్చింది.

ఇలా భారతదేశంలో భూస్వామ్య పద్ధతి విరివిగా వ్యాపిస్తూ ఆధునిక యుగంలో అతిత్వరగా విశాలమయింది ఇది రైతులు రాను రాను భూమినుండి వైదొలగడం, చిన్న పెద్ద ధనికులు భూమినీ ఆక్రమించడం వల్ల ఏర్పడింది. ధనికులు ఇతర ఉత్పత్తి పరిశ్రమలలో పెట్టుబడిపెట్ట వీలులేక భూమివైపు తిరిగారు విశాల భూ భాగాలలో కౌలుకివ్వడం చాల విస్తరించింది. దాదాపు సగంభూమి కౌలుదార్లు చేస్తున్నారు

("కొన్ని జిల్లాలలో భూమి చాలభాగం - దాదాపు సగంపైగా కౌలుదార్లు మరీ కౌలుకివ్వడం జరుగుతున్నది జమీందారు పైన, అడుగు అసలు రైతు, మధ్యలో మరో దళారీ వర్గం ఏర్పడింది."—సైమన్ రిపోర్టు, సంపుటం 1, పుట 340.)

ఇందుమూలంగా, రైతుచట్టాలన్నీ రైతులకు రక్షణ కల్పించాలని ఏర్పడినప్పటికీ, తక్కువ రకపు భూస్వాములకే చెందుతున్నవి. అసలు రైతులలో చాలమంది-అసలే పొలంలేని కార్మికులుగా అప్పటికే తయారు కాకపోయిఉంటే వీరికి రక్షణలేదు. ఏ పనీపాటా చేయని దళారీ వర్గాలకోసం రైతులను పీల్చి

పిప్పిచేస్తున్నారు. వీరుకాక పైన పరాన్నభుక్కులు, ప్రభుత్వ పన్నులు ఉండనే ఉన్నవి ఈ కార్యక్రమంతో భూస్వామి విధానం యావత్తూ, అసహ్యాకర స్థితికి నేడు వచ్చింది భారతదేశంలో పెరుగుతున్న వ్యవసాయ సంక్షోభం ఈరూపంలో అతి నిశితంగా కనిపిస్తున్నది.

## 4. రైతు: దరిద్రావస్థ

కాబట్టి భారతదేశంలోని వ్యవసాయ సంబంధాలలో వర్గాలు తీవ్రంగా వేరుపడిపోయాయి.

1931 జనాభాలెక్కలప్రకారం, వ్యవసాయంలో ఈ క్రింది వర్గవిభజన కనిపిస్తుంది :

| | |
|---|---|
| సేద్యం చేయకుండా గుత్తతీసుకునే భూ ఖామందులు | 41,50,000 |
| సేద్యంచేసే పట్టాదార్లు, కౌలుదార్లు | 6,54,95,000 |
| వ్యవసాయ కూలీలు | 3,35,23,000 |

ఈ వర్గీకరణంకూడ నామమాత్రమే. ఇందులో 'సేద్యంచేసే పట్టాదార్లు, కౌలుదార్లు' అనేవర్గంలో ఆ రైతులకు ఎంతెంత పొలముందో తెలియదు. పెద్ద రైతులకు, మధ్యతరగతి రైతులకు, పేదరైతులకు భేదంతెలియదు. ముఖ్యంగా అధికసంఖ్యాకులైన రైతులకు ఆర్థికంగా పనికిరాని చిన్నచిన్న ముక్కలుగా భూమి ఉంటుంది వారిస్థితి దాదాపు భూమిలేని కార్మికులలాంటిదే. వీరు కూలిచేసుకునే జీవించుటకు సంపాదించుకోవలసిఉంటుంది వీరినిగూర్చి పైలెక్కలలో ఏమీతెలీదు. చిన్నరైతుకూ, కార్మికునికీ వున్న వ్యత్యాసం ఆచరణలో చాలతక్కువ. కాబట్టి వాస్తవస్థితిని గ్రహించుకోవాలంటే, పైలెక్కలకుతోడు ఆయా ప్రాంతాలలో జరిపిన అధికార, అనధికార విచారణల ఫలితాలను మనం చేర్చాలి.

ఈ వర్గీకరణంమీద మార్పు చేసినందువల్ల, అంతకుముందుకాలపు జనాభా లెక్కలతో పోల్చి చూడడానికికూడ వీల్లేదు. 1921 జనాభా లెక్కలలో వ్యవసాయంమీద ఆధారపడిన వారితో కలిపి, మొత్తం వ్యవసాయంలో బ్రతికేవారి సంఖ్య 22 కోట్ల 10 లక్షలని ఉంది మరి 1931 లో 10 కోట్ల 30 లక్షలే ఉన్నారు. కాబట్టి పాత లెక్కలలో ప్రత్యక్షంగా పొలాల్లో పనిచేసేవారి సంఖ్య 10 కోట్లతో 1931 లెక్కలలోని 10 కోట్ల 30 లక్షల సంఖ్యను పోల్చి చూడవచ్చును. అది కూడ నికరమైందికాదు. ఈ పోలికకూడ వర్గీకరణంలో జరిగిన మార్పువల్లను, వ్యవసాయం రెండోవృత్తి అనుకొన్న వారందరినీ తొలగించేయడంవల్ల - ముఖ్యముగా సేద్యములో పనిచేసే 70 లక్షల స్త్రీలను రైతులబంధువులను 'ఇంటిపనులు చేసుకునేవారు' అనే వర్గం క్రింద వేరుపరచడంవల్ల సేద్యంలో పనిచేసేవారి సంఖ్య ఏదో తగ్గినట్టు భ్రమ కలిగిస్తున్నారు. (ఈ సంగతిని ముందుగానే వివరిం

చాను.) ఈ మార్పు మన నిర్ణయాల నేమీ ఆటంకపరచలేదు. దీని ప్రాతిపదికపై పోల్చి చూస్తే ఈ క్రింది ఫలితాలు వస్తాయి.

| | 1921 (లక్షలలో) | 1931 (లక్షలలో) |
|---|---|---|
| సేద్యంచేయని భూస్వాములు | 37 | 41 |
| రైతులు (పట్టాదారులు కౌలుదార్లు) | 746 | 655 |
| వ్యవసాయ కూలీలు | 217 | 335 |

ఈ లెక్కలను పైన వివరించినకారణాలవల్ల వివరంగాపోల్చి చూడలేము. ప్రత్యేకించి రెండోవర్గముతో పోలికకుదరదు, కాని సేద్యం చేయని భూస్వాముల సంఖ్య (1911 లో 28 లక్షలు) పెరుగుతున్నదని కనిపిస్తుంది. అలాగే భూమి లేని కార్మికులసంఖ్య విపరీతంగా పెరిగిపోతున్నదన్న ధోరణికూడ కనిపిస్తుంది.

మదరాసు రాష్ట్రానికి మరికొంత వివరమైన లెక్కలున్నవి.

## మదరాసు వ్యవసాయంలో వర్గవిభజన

(ప్రతి వెయ్యిమంది వ్యవసాయదారులలో)

| | 1901 | 1911 | 1921 | 1931 |
|---|---|---|---|---|
| పనిచేయని భూస్వాములు | 19 | 23 | 49 | 34 |
| పనిచేయని కౌలుదార్లు | 1 | 4 | 28 | 16 |
| పనిచేసే పట్టాదార్లు | 481 | 426 | 381 | 390 |
| పనిచేసే కౌలుదార్లు | 151 | 207 | 225 | 120 |
| కూలీలు | 345 | 340 | 317 | 429 |

(ఈ లెక్కలు 1901-21 వి. జనాభా లెక్కలనుబట్టి పి. పి. పిళ్ళేగారి "భారతదేశంలో ఆర్థిక పరిస్థితి" పుట 114 లో ఇవ్వబడినవి. 1931 లెక్కలు మదరాసు జనాభా లెక్కల నివేదికనుండి తీసుకోబడినవి.)

ఈ ముప్పయి యేళ్ళలోను పనిచేయకుండా గుత్తో కూలో తీసుకునేవారి సంఖ్య2½ రెట్లు పెరిగింది - (వెయ్యికి 20 మంది నుండి 50 మందికి) పనిచేసే రైతులు-కౌలుదార్ల సంఖ్య నాలుగోవంతు తగ్గింది (వెయ్యికి 635 నుండి 510 కి). భూమిలేని కూలీల సంఖ్య మూడో భాగంనుండి సగానికి పెరిగింది. (వెయ్యిలో 345 నుండి 429 కి)

బెంగాలు రాష్ట్రం లెక్కలు క్రింది విధంగా ఉన్నవి.(జనాభా లెక్కలనుబట్టివేసినవి)

| | 1921 | 1931 | మార్పు నూటికి |
|---|---|---|---|
| పనిచేయని భూస్వాములు, గుత్తతీసుకొనేవారు | 390562 | 633834 | + 61 |
| పనిచేసే పట్టాదార్లు కౌలుదార్లు | 9274924 | 6079717 | — 50 |
| కార్మికులు | 1805502 | 2718939 | + 34 |

ఇక్కడకూడ వివరంగా పోలిక కుదరదు. ఎందుకంటే వర్గీకరణం మార్పు డంలో మొత్తం వ్యవసాయదారుల సంఖ్య 20 లక్షలు తగ్గినట్లు భ్రమకలుగుతుంది. కాని సేద్యం చేయకుండా గుత్తతీసుకొనే భూస్వాముల సంఖ్య, పొలంలేని కార్మికుల సంఖ్య ఎక్కువ కావడంవల్లనే మన నిర్ధారణ మరింత బాగా రుజువవు తుంది.

ముందు భాగాలలో తెలిపిన ఈ పనిచేయని భూస్వాముల సంఖ్య అడ్డు లేకుండా పెరగడం, అన్ని ప్రాంతాలలో దొరికిన సాక్ష్యంవల్లను ధ్రువపడింది. రైతుల ఆస్తులు పూర్తిగా దోచుకోవడం ఇందులో ప్రతిబింబిస్తున్నది.

ఇందుతోపాటు ఆవలివేపు వ్యవసాయకూలీల సంఖ్య పెరగడం మరింత స్పష్టంగా కనిపిస్తున్నది. 1842 లో సెన్సస్ కమిషనర్‌గా సర్ థామస్‌మన్రో, భారతదేశంలో పొలంలేని రైతులు లేరని వ్రాశాడు. (ఇది సరైనదో కాదనడంలో సందేహంలేదు-కాని వారిసంఖ్య లెక్కలలో చేర్చవలసినంత ఎక్కువగా లేదని ఇది సూచిస్తుంది....) 1882 జనాభా లెక్కల ప్రకారం, వ్యవసాయంలో "పొలం లేని దిన కూలీలు" 75 లక్షలున్నట్లు అంచనా వేశారు. 1921 లెక్కలలో వీరి సంఖ్య 2 కోట్ల 10 లక్షలు లేక వ్యవసాయదారులలో ⅕ వంతుగా వ్రాశారు. అప్పటినుండి ఇప్పటి అంచనాల ప్రకారం (1938 లో కౌలుదార్ల చట్టంపై సవరణల చర్చ సందర్భంలో బెంగాలు శాసనసభలో; పై నిచ్చిన మదరాసు లెక్కలుకూడ అలాగే ఉన్నవి.) పొలంలేని కార్మికుల సంఖ్య మొత్తం వ్యవ సాయదారులలో సగముందని తేలుతుంది. *

ఈ వ్యవసాయకూలీల జీతాలగూర్చి ఈక్రింది పట్టికమనకెంతో వివరిస్తుంది:

| | 1842 | 1852 | 1862 | 1872 | 1911 | 1922 |
|---|---|---|---|---|---|---|
| పొలంలో కూలీ అన్నంలేకుండా (దినకూలి అణాలలో) | 1 | 1½ | 2 | 3 | 4 | 4-6 |
| రూపాయకుశేర్లు, బియ్యం | 40 | 30 | 27 | 23 | 15 | 5 |

(ఆర్. ముఖర్జీ, "భారతదేశ భూమి సమస్యలు" పుట 222)

ఇలాగా ఈ కాలంలో డబ్బుకూలీ నాలుగునుండి ఆరురెట్లు పెరిగింది. కాని అదేసమయంలో బియ్యం ధర ఎనిమిదంతలు పెరిగింది—అంటే ఈ 80 ఏళ్ళ "అభివృద్ధి" లో కూలి నాలుగోవంతునుండి సగంవరకు పడిపోయింది. సంయుక్త పరగణాల 1934 క్వింకానియల్ కూలిలెక్కల నివేదికనుబట్టి సగటు కూలి 3 అణాలు దినానికి. 326 గ్రామాలలో ఆకూలి దినానికి ఒకటిన్నర అణాగా ఉంది.

---

* ఉత్తర బీహారులోని కిర్‌హార్ గ్రామపరిస్థితులనుగూర్చి జరిగిన విచారణలో (1939) ఇలా తెలిపింది. "ఎక్కువమంది జనసంఖ్యగల వర్గం భూమిలేని కూలీలు. వీరివి 760 కుటుంబాలు, జనం 5,023 మంది ఉన్నారు. మొత్తం గ్రామజనాభాలో నూటికి 72 మంది వీరే. (యస్ సర్కార్, "ఉత్తరబీహారులోని ఒకగ్రామంలో ఆర్థికస్థితి" ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎకనమిక్సు జూలై 1939.)

ఈ పట్టీలో మరికొంత క్రిందికిపోయిచూస్తే - అదిపేలయితే, దారుణస్థితిలో ఉన్న బానిసతనం, వెట్టిచాకిరీ, బాకీబానిసతనం మొదలైన కూలిలేకుండా పనిచేసే వ్యవసాయ కూలీల స్థితులు భారతదేశమంతటా మనకు కనిపిస్తాయి ఇందును గూర్చి లెక్కలన్నీ మౌనంవహించాయి.

"భారతదేశంలోని ఆర్థిక నిశ్రేణిలో (నిచ్చెన) అట్టడుగున శాశ్వత వ్యవసాయ కార్మికులు నిల్చున్నారు. వీరికెప్పుడో అరుదుగా నగదుకూలి చిక్కుతుంది. వీరిస్థితి బానిసలస్థితిలాంటిదే. భారతదేశం చాల భాగాలలో జమీందారో, మాల్గుజారో లేక సామాన్యరైతో సామాన్యంగా తనజీతగాణ్ణి తనకు అప్పుపడేట్టు చేసుకుంటాడు అందుతో వానిపై అధికారం సంపాయించుకుంటాడు. పెత్తనం వాని సంతానానికికూడ వ్యాపిస్తుంది

"మదరాసుకు నైఋతిభాగంలో ఇషణ, చెరుమ, పులీయ, హోలియ అనే కులాలు పూర్తిగా బానిసల్లాంటివారున్నారు తూర్పు సముద్రతీరంలో భూమిపై బ్రాహ్మల పెత్తనం చాల దృఢతరమైనది. ఇక్కడ చాలభాగం వ్యవసాయ కూలీలు పడియాలు-అస్పృశ్యులు. ఈ కులమంతా ఒక ప్రత్యేక బానిసజాతి అప్పులు తీసుకొని తరతరాలుగా భూస్వామిపై వీరు ఆధారపడి ఉన్నారు....ఆ అప్పు ఎప్పుడూ తీరదు కాని ఒకతరంనుండి మరొక తరానికి మారుతూవస్తుంది ఈ బానిసలు ఋణదాత భూమి నెవరికైన అమ్మితేగాని, అతను చనిపోతేగాని మరొకరికి వీరు మారుతుంటారు

"బానిసతనంలో మరీ అధమస్థితిలో ఉన్నవారు బీహారులోని కామియాలు. వీరు తీసుకున్న అప్పుకోసం యజమానులు చెప్పిన ఏ నీచపు పనినైనా వడ్డీకిగా చేయవలసివస్తున్నది"

(ఆర్ ముకర్జీ, "భారతదేశపు భూమి సమస్యలు" పుట 225-9)

చాలా ప్రాంతాలలో ఈ వ్యవసాయ బానిసలు, ఋణదాసులు ఆదిమజాతులకు చెందినవారు కాని అంతకుముందు స్వతంత్రరైతుగానే ఉండి తర్వాత భూమిని పోగొట్టుకొని అప్పుమూలంగా దాసుడైపోయినవాడూ, లేక కేవలం పని చేసి కోరుతో (కౌలుచెల్లించగా మిగిలే ధాన్యంతో) బతికేవాడూకూడ దాదాపు బానిసతనాన్ని చట్టరీత్యా దాటిపోలేదు.

ఇలాంటి పరిస్థితుల్లోనే తోటల బానిసలుకూడ ఉన్నారు పెద్ద పెద్ద డివిడెండులు ఇచ్చే యూరోపియన్ కంపెనీల క్రిందే నూటికి 90 వరకున్న పెద్ద తేయాకు, కాఫీ రబ్బరు తోటల్లో పదిలక్షలకుపైగా కూలీలు పనిచేస్తున్నారు. ఈ తోటల్లోకి భారతదేశం అన్ని ప్రాంతాలనుండి కూలీలను కొనివస్తారు; ఈ కూలీలు కుటుంబాలతోపాటు తోటలలోనే, యజమానుల సంపూర్ణ అధికారం క్రింద, ఏ మాత్రం ప్రాథమిక పౌరహక్కులుకూడ లేకుండ నివసిస్తుంటారు; తక్కువ కూలికి మగ, ఆడ, పిల్లలతో పనిచేయిస్తారు; పూర్వమున్న నేరాల

ఒడంబడికలు రద్దుచేసినప్పటికి, 1930 లో 'విట్లీ' రిపోర్టు తర్వాత కొన్ని కొత్త చట్టాలు చేసినప్పటికి కార్మికులు మాత్రం చాలకాలంవరకు ఒకొకతూరి జీవితాంతం వరకు తమ యజమానులకు బద్ధులై ఉండవలసివస్తున్నది.

వ్యవసాయ జనసంఖ్యలో మూడోవంతు - దాదాపు సగంవరకుకూడ పొలం లేని రైతుల సంఖ్య పెరగడంతో రైతు లెలా దివాళా తీస్తున్నారో అవగతమవుతుంది కాని వాస్తవ పరిస్థితిలో, అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న చిన్న రైతులు, కౌలుదార్లు, కింద కౌలు చేసేవాళ్ళు, సిరి రక్షణలేని కౌలుదార్లు మొదలైనవారి స్థితి ఆ వ్యవసాయ కూలీల స్థితికంటే భిన్నంగాలేదు. ఈ రెండువర్గాలకు మధ్య ఉన్న హద్దు చాల సున్నితమై నీడలా ఉంటుంది. ఇలాగే మద్రాసు బ్యాంకింగు విచారణ కమిటీ 1930 లో ఇలా వ్రాసింది:

"వ్యవసాయకూలీలతో సేద్యంచేయించేందుకు, కౌలుకు ఇవ్వడానికి భేదం చూపడం చాలాకష్టం. డబ్బుకు కౌలుకివ్వడం అరుదుగాజరుగుతుంది. సామాన్యంగా కౌలు పంటకోరుకేచేస్తారు. పంటలో 40 వంతుల నుండి 60వంతులవరకు; ఒకొకతూరి 30వంతులుకూడ భూమియజమానికి మిగతాది కౌలుదారుకు వెడుతుంది. కౌలుదారు సామాన్యంగా ఏడేటా ఆభాగంతో చాలీ చాలని జీవనం గడుపుతూ, భూస్వామివద్ద అప్పుతీసుకుంటూ, విత్తనాలు, పశువులు, పరికరాలుకూడ అతనివద్దనే తీసుకుంటూ పనిచేస్తుంటాడు. మరి పాలికాడు (కూలీ), భూస్వామియొక్క విత్తనాలు, పశువులు పనిముట్లనే వాడుతూ, తనకుకావలసిన అవసరాలకు డబ్బునుతీసుకుంటూ పనిచేస్తాడు. ఇతనికి పంటలో కొంత వంతో లేదా ఏవో కొన్ని గింజలో ఇస్తారు. ఏదో ఏర్పాటు ప్రకారం ధాన్యమేకాక, కొంత డబ్బుకూడ పాలెకానికి ఇవ్వడం కద్దు కౌలు చేసే రైతు తన సొంత పనిముట్లతోనూ విత్తనాలతోనూ కూడ పనిచేయవచ్చు. కాని వీరిద్దరికీ భేదం చెప్పడం కష్టం; భూస్వామి సేద్యం చేయునప్పుడు సేద్యం కూలీలతో జరుగుతున్నదా, కౌలుదారుద్వారా జరుగుతున్నదా అనేది తెలీదు"

1927 లో అఖిలభారత కార్మికసంఘం (ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్) ముందు యన్. యమ్. జోషి వేసిన అంచనా ప్రకారం, వ్యవసాయ కూలీలసంఖ్య 2 కోట్ల 50 లక్షలు. వీరుకాక భూమిపై అప్పుడప్పుడూ కూలిచేసేవారి సంఖ్య 5 కోట్లు కాబట్టి అత్యధికసంఖ్యాకులైన భారత రైతులు దాదాపు గ్రామాలలోని కార్మికులయిపోయ్యారు గాని చిన్నరైతులుగా లేరు.

సామ్రాజ్యవాదులతో సంతృప్తి మూర్తీభవించిన సైమన్ నివేదిక 1930లో ఇలా ప్రకటించింది. (రెండేళ్ళకుముందు తయారయిన వ్యవసాయ విచారణ సంఘ నివేదిక మాటలనే పలుకుతున్నది.)

"సామాన్యరైతు, నేటికీ ఒక జత ఎద్దులతో, కొన్ని ఎకరాల పొలాన్ని, తన కుటుంబంయొక్క, ఒకొకసారి కూలీల సాయంతో సాగు చేస్తుంటాడు."

(సైమన్ రిపోర్టు, వాల్యూం 1, పు 18.)

వాస్తవపరిస్థితికీ ఈ మాటలకూ ఎంతవిభేదమున్నదో లెక్కలద్వారా ముందే తెలుసుకున్నాము 1927 వ్యవసాయ కమిషన్ ముందువచ్చిన సాక్ష్యంలో బొంబాయి రాష్ట్రంలోని ఒకజిల్లాను వివరించడం జరిగింది. ఆ జిల్లా "మిగత జిల్లాలన్నిటికన్న చాల సౌభాగ్యవంతమైన"దని అందులో అన్నారు ఆ జిల్లాలోని భూమి 10 లక్షల ఎకరాల వైశాల్యం గలది. ఆ జిల్లాలో 1917 నుండి 1922 వరకు అయిదేళ్ళలోనే ఒకొకరికున్న పొలం ఎలామారిందో క్రింద ఇస్తున్నాము.

(వాల్యూం 11, భాగం 1, సాక్ష్యం—పుట 292.)

## వేరువేరు పొలాల సంఖ్య

| ఒకొకపొలం వైశాల్యం | 1917 | 1922 | తరుగుదల లేదా పెరుగుదల నూటికి |
|---|---|---|---|
| 5 ఎకరాలలోపువి | 6,272 | 6,446 | + 2 6 |
| 5 నుండి- 15 | 17,909 | 19,130 | + 6 8 |
| 15 నుండి- 25 | 11,908 | 12,018 | + 0.9 |
| 25 నుండి-100 | 15,532 | 15,020 | — 3.3 |
| 100 నుండి-500 | 1,234 | 1,117 | — 9 5 |
| 500 ఎకరాలుపైని | 20 | 19 | — 5.0 |

దీనిని వ్యాఖ్యానిస్తూ ఒక ప్రభుత్వఉద్యోగి ఇలా అన్నాడు:

"అయిదేళ్ళకుమాత్రమే చెందిన ఈ లెక్కలు, 15 ఎకరాలలోపు పొలం చేసే రైతుల సంఖ్య చాల ఎక్కువయినట్లు సూచిస్తున్నవి సామాన్యంగా ఇంత తక్కువ భూమి ఏ కొన్ని రకాల నేలలకో అరుదుగా తప్ప ఒక జత ఎద్దులకుకూడ చాలదు ....ఇక 25-100 ఎకరాల రైతుల సంఖ్య తగ్గిపోయింది అంటే ఏ కొంత పెట్టుబడో అదృష్టవశాత్తు ఉంటే వాదావు బాగా ఉండవలసిన రైతుకూడ పడిపోయాడన్నమాట"

కాబట్టి 1922 నాటికంతా భూమిగల రైతులలో సగంమందికి (పొలంలేని కూలీల సేనను అలా వదిలివేసిన) ఒక జత ఎద్దులతో సాగుచేసేందుకు తగిన భూమికూడా లేకుండాపోయింది ఈ దామాషా ఇంకా ఎక్కువవుతున్నది

ఇందువల్ల రైతుల స్థితి పరిశీలన, వారికున్న పొలమెంత అన్న తీవ్ర సమస్యవైపు వెడుతుంది. దీనికి సంబంధించిన వివరాలు ఈ అధ్యాయంలోని రెండోసర్గలో చెప్పాను పాత జనాభా లెక్కల పరిభాషలో "సామాన్య రైతులకు

- వారు పట్టాదారులు కాని, కౌలుదారులు కాని—వ్యవసాయ కూలీలకు మధ్య విభేదం అసలు పరిస్థితిని వివరించదు. అలాగే అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న పొలంలేని కూలీలకు, చాలీచాలని పొలంగల రైతులకు ఉన్న విభేదంకూడ ఎక్కువ కనిపించదు. ఇక మరీ తక్కువ సంఖ్యలో ఉన్న "సుమారుగా బాగున్న రైతులకు" పనిచేయకుండా గుత్తలు తీసుకునే వారికి మధ్య ఉన్న విభేదం అలా వదిలేసినప్పటికిన్నీ బెంగాలు భూమిపన్ను విచారణసంఘం (ఫ్లౌడ్‌కమిషన్) ఎదుట వచ్చిన సాక్ష్యం, సామాన్యంగా ఒక సామాన్యకుటుంబానికి అన్ని ఖర్చులు తీరాలంటే కనీసం 5 ఎకరాల భూమి ఉండాలని అభిప్రాయపడుతున్నది. కాని ఈ కమిటీవిచారణలో తేలినదానిని బట్టి, బెంగాలు రైతుకుటుంబాలలో మూడు భాగాలు అయిదు ఎకరాల లోపు భూమిగలవారే—మరి నూటికి 57.2 మందికి 3 ఎకరాలకన్నా తక్కువ పొలమే ఉంది.

డాక్టర్ హెరాల్డు హెచ్. మాన్ "దక్కన్ గ్రామంలోని జీవితమూ శ్రమా" పైజరిపిన ప్రామాణిక విచారణ, పరిస్థితిని కొంత విశదీకరిస్తున్నది 1914-15 లలో బొంబాయి వ్యవసాయశాఖకు డైరెక్టర్‌గా ఉన్న డాక్టర్ మాన్, దక్కన్ లోని ఒక గ్రామం పరిస్థితులను సమగ్రంగా విచారణ జరిపాడు. నిజపరిస్థితులు, వ్యవసాయం, పంట, పొలాలవైశాల్యం, అప్పులు, కుటుంబం ఆదాయం, ఖర్చు వగైరాలగూర్చి ఒక 'కుష్కీ' గ్రామంలో శాస్త్రీయంగా జరిపిన విచారణ ఇది; ఇలాంటి సమగ్రమైన విచారణ జరగడానికిదే తొలిసారి ఈ విచారణ ఫలితాలు గుండె తరుక్కుని పోయేట్టు చేశాయి. (విచారణకర్త మాటల్లోనే "అనుకోనివి" "విచారకరమైనవి") కాబట్టి దీనిని విమర్శిస్తూ—ఇందలి అంశాలు శాస్త్రీయంగా ఖచ్చితంగా తేలినవిగనక మరోరకమైన విమర్శ సాధ్యంకాలేదు—ఈ విచారణ జరిపిన గ్రామం సామాన్యంగా రాష్ట్రగ్రామాలవంటిది కాదన్నారు. అందుపై డాక్టర్ మాన్ మరొక గ్రామంలో విచారణజరిపాడు ఈ విచారణ 1921 లో ప్రకటితమైంది. ఈ విచారణలోకూడ ముందువిచారణలో తేలిన ఫలితాలే మరింత ధృవపడ్డాయి తర్వాత ఇలాంటి విచారణలు దేశంలోని చాలప్రాంతాలలో జరిగాయి అవికూడ ఈ ఫలితాలు నిఖరమైనవని దృఢపరిచాయి. అతను విచారించిన తొలిగ్రామంలో 81 మంది పట్టాదారులకున్న పొలాలు "మంచి పరిస్థితులలోకూడ యజమానుల పోషణకుచాలవు" అని ఆయన వ్రాశాడు. అడుణ్ణో ఉన్న 156 పొలాలలో (156 వ్యక్తులకిందఉన్న పొలాలలో) ఈ క్రింది తరగతులున్నవి.

| | | |
|---|---|---|
| 30 | ఎకరాలపైగా | 2 |
| 20-30 | వరకు | 9 |
| 10-20 | ,, | 18 |
| 5-10 | ,, | 34 |
| 1- 5 | ,, | 71 |
| 1 | ఎకరాకు తక్కువవున్న పొలాలు | 22 |

కీటింగు అంచనానుబట్టి. "ఈ పశ్చిమ డక్కన్‌లోని గ్రామంలో చాలభాగం ఉన్నలాంటి చక్కని కుష్కి భూమి ఆర్థికంగా సరిపడాలంటే 10 నుండి 15 ఎకరాల వరకుండాలి..... ఒకొకరికి ఉన్న పొలమంతా ఒకేచోట ఉన్నదనుకున్నప్పటికీ చాల భాగం పొలాలు (నూటికి 81) ఈవైశాల్యానికంటే తక్కువ వున్నవి" అని డాక్టర్ మాన్ తేల్చాడు. బొత్తిగా చాలని తిండి గుడ్డకు దీపానికీకూడా ఖర్చువేయకుండా - ఎంతవుతుందో అతి తక్కువగా రైతు జీవిత ప్రమాణం లెక్కవేసి, దానిమీద పై నిర్ణయం చేయబడింది ఊరిలోని 103 కుటుంబాలలో మంచి ఆర్థికస్థితిలో ఉన్న రైతులు వారి భూమి వైశాల్యాన్నిబట్టి 8 మంది ఉన్నారు; తమ పొలంతో పాటు బయటకూడ పనిచేసి జీవితం గడిపేవారి సంఖ్య 28; ఇక తన పొలంలోను బయటకూడ పనిచేసినా తగినఆర్థికస్థితి లేనివారి సంఖ్య 67, లేక నూటికి 65 ఏమైనా ఈగ్రామానికి దగ్గరలో ఒక ఆయుధ కర్మాగారముంది. అందులో ఇక్కడి రైతులలో నూటికి 30 మందికి పని దొరుకుతూంటుంది; ఇలాంటి వసతి అన్ని గ్రామాలకు ఉండదు. కాబట్టి ఈ విషయంలో ఈ గ్రామం అన్నిగ్రామాల లాంటిది కాదు.

ఇక రెండో విచారణ జరపినగ్రామం దగ్గర ఏ పరిశ్రమకేంద్రంగాని లేదు. ఈ గ్రామంలో నూటికి 85 కుటుంబాలు ఆర్థికంగా హీనస్థితిలో ఉన్నవి. ఈగ్రామంలో కనీసం పోషణకు తగిన భూమి అంటే దాదాపు 20 ఎకరాలుండాలి. కాని ఈ ఊరిపొలాలలో నూటికి 77 ఈ స్థాయికంటే తక్కువున్నాయి ఉన్న మొత్తం 147 కుటుంబాలలో 10 కుటుంబాలు తమ పొలంపై "చక్కని ఆర్థిక స్థితిలో" బతకవీలున్నది ఇది మొదటి వర్గం; ఇక రెండవవర్గానికి చెంది, తమ పొలంలోను బయటకూడ పనిచేస్తే పోషణజరిగేవారు 12 కుటుంబాలు; ఇక 125 కుటుంబాలు లేక నూటికి 85 మంది బొత్తిగా పేదతనంలో ఉన్నవారు. తమ పొలంలోను, బయటా పనిచేసినా వీరికి భుక్తిగడవదు ఈ ఆఖరువర్గంలో— మొత్తం గ్రామ జనాభా 732 లో 664 మంది ఉన్నారు. అంటే గ్రామ జనసంఖ్యలో నూటికి 91 మంది భుక్తికి గడవనివారున్నారన్నమాట

అతిహీనస్థాయిలోకూడా పోషణ గడవని ఈ అత్యధిక సంఖ్యాకులెలా బతుకుతారు? ఉన్నదానిలో బతకలేరు గనక రానురాను అప్పులలో మునిగి పోతారు; పొలం కాస్తా పోగొట్టుకుంటారు; పొలంలేని కూలీలలో కలసిపోతారు. ఈ విచారణలో గ్రామంపై ఋణభారం తీవ్రతరమవుతున్నట్టు తేలింది. మొదటి గ్రామంలో నికరంగా వచ్చే ఆదాయం 8,338 రూపాయలు. అందులో ఏటా అప్పులకు కడుతున్నది 2,515 రూపాయలు. "ఇప్పుడు అప్పు దాదాపు గ్రామం మొత్తం ఆదాయంలో నూటికి 12 వంతులుండి మోయరాని బరువైంది. ఆ అప్పులకై ఏటా ఇచ్చుకోవలసిన మొత్తం, యావత్తు గ్రామం పొలంమీద వచ్చే లాభంలో నూటికి 24.5 వంతులవున్నది." (పుట 152) రెండోగ్రామంలో, మొత్తం గ్రామంపై వచ్చే నికరాదాయం 15,807 రూపాయలలో అప్పులకు

ఇచ్చుకోవలసింది 6,755 రూ అంటే భూమిలో వచ్చే మొత్తంలో అయిదులో రెండోవంతుకుపైగా వడ్డీవ్యాపారస్తునికి వెడుతున్నది.

తన విచారణ ఆఖరున డాక్టర్ ఈ క్రింది సామాన్యనిర్ణయం తేల్చాడు.

"నగటున ప్రతిసంవత్సరం (మా విచారణ, లెక్కలు గ్రామజీవితం నిజస్థితిని తెలిపేటట్టుంటే) గ్రామాన్ని మరింత అల్పాహారంతో, మరింత అప్పులభారంతో క్రుంగతీస్తుంది. ఉన్న జనాభాకు, ఇప్పుడున్న వ్యవసాయ పద్ధతులతో నిజమైన ఆర్థికస్వతంత్రాన్ని పొందేందుకు ప్రతిఏటా మరింత గ్రామీణులు అసమర్థులవుతున్నారు"

## 5. రైతు ఋణభారం

రైతుల కష్టాలు ఎక్కువయ్యేకొద్దీ, రాను రాను ఋణభారం మరింత అతనిపైబడి, ఇబ్బందులు మరింత పెరుగుతున్నవి ఇది ఆఖరు అన్యోన్యాశ్రయ స్థితి - (బాగుపడితే అప్పులు తీరుతాయి, అప్పులు తీరితే బాగుపడతారు) ఈభూమి పూర్తిగా పోవడంతో మాత్రమే తీరగలదు. ఇలా అప్పులు పెరగడం, అందుతో పాటు భూమి ఆయికం పెట్టడం! అమ్మడం, రైతులు కానివారికి భూమి మారడం జరుగుతున్నది. వ్యవసాయ సంక్షోభ తీవ్రతకు ఇదొక నిదర్శనం.

"రైతులలో అత్యధికసంఖ్యాకులు, వడ్డీవ్యాపారికి బాకీపడి ఉన్నా"రని సైమన్ రిపోర్టు (వాల్యూం 1, పుట 16) వ్రాసింది.

ఈ ఋణభారం బ్రిటిష్ పాలనతోపాటు పెరుగుతూ వచ్చిందని, ఆధునిక యుగంలో ఇది మరింత వ్యాపించి తీవ్ర సమస్యగా మారిందని ప్రతివారూ అంగీకరించారు. 1911 లో సర్. ఎడ్వర్డు మాక్‌లాగన్ ఇలా రాశాడు.

"అప్పులు ఇండియాలో కొత్తగాదని గ్రహించి చాలరోజులయింది. మన్రో, ఎల్‌ఫిన్‌స్టన్ మొదలైనవారి వ్రాతలనుబట్టి, మన పరిపాలన ప్రారంభంలోకూడ చాల అప్పులుండేవని స్పష్టమే. కాని మన పరిపాలన కాలంలో ఈ అప్పు చాల పెరిగిపోయిందని - ముఖ్యంగా గత యాభై యేళ్ళలో, గుర్తింపబడింది. అప్పుడప్పుడు వస్తున్న నివేదికలనుబట్టి, అమ్మకం, ఆయికం, సాలుసరి లెక్కలనుబట్టి గతయాభైయేళ్ళలో అప్పులు చాల పెరిగాయని తెలుస్తున్నది."

(1911 లో సర్ ఎడ్వర్డు మాక్‌లాగన్. సెంట్రల్ బ్యాంకింగ్ విచారణ కమిటీ 1931, పుట 55 లో ఉదహరింపబడింది.)

1880 లోనే క్షామనివారణ నివేదిక ఇలావ్రాసింది:

"రైతులలో మూడోవంతు పూర్తిగా అప్పులలో మునిగిపోయి ఉన్నారు. మరో మూడోవంతుమంది తిరిగి కోలుకోవడానికి వీలైన స్థితిలో అప్పుల్లో పడిఉన్నారు."

అప్పటినుండి ఈ ఋణభారం బాగా పెరిగింది. 1928 లో వ్యవసాయ విచారణ కమిషన్ ఇలా వ్రాసింది:

"మొత్తం గ్రామీయులఅప్పు ఈ శతాబ్దిలోనే పెరిగిందన్నా నిజమే అవుతుంది; ప్రజల ఆస్తిపాస్తులకు, అప్పులకు ఉన్నదామాషా పూర్వ మున్నంతేఉందో లేక పాతకాలంకన్న మోతుబరి రైతులపై అప్పులభారం తక్కువగా పండిందో లేక ఎక్కువయిందో ఈప్రశ్నలకు మాకు వచ్చిన సాక్ష్యం సమాధానమివ్వడంలేదు."

(అగ్రికల్చరల్ కమిషన్ రిపోర్టు 1928, పుట 441)

ఇలా అప్పులు పెరిగాయన్న అంశాన్ని ధ్రువపరుస్తూ సెంట్రల్ బాంకింగు విచారణకమిటీ 1931 లో ఇలావ్రాసింది :

"రైతులఅప్పులు పెరిగాయా, తరిగాయాఅన్న విషయంలో అప్పుల మొత్తం గత శతాబ్దిలో పెరిగింది అన్నవిషయంలో సామాన్యంగా అందరి అభిప్రాయం ఏకీభవిస్తున్నది."

(సెంట్రల్ బ్యాంకింగు విచారణ కమిటీరిపోర్టు 1931, పుట 55.)

ఆ సమయంలో (1931) మొత్తం రైతుల అప్పు 900 కోట్ల రూపాయలని కమిటీ అంచనా వేసింది. ఆ తర్వాత అర్థికసంక్షోభం, ధాన్యం ధరలు పడిపోవడం మూలంగా ఈఅప్పులు మరింత ఎక్కువయ్యాయి. ఇటీవల అంచనా ఆ మొత్తాన్ని రెట్టింపు చేస్తున్నది. (చూడు పుట 7)

బ్రిటిష్ పాలనలో ముఖ్యంగా ఇటీవల ఈ అప్పు ఇంత పెరగడానికి కారణ మేమిటి ? ఏదో తేలిక వ్రాతలు వ్రాసేవారు ఉన్నదేదో ఒక సాకుతో సరిదిద్దాలను కొనేవారు ఇప్పటికికూడా ఈ అప్పుకు కారణం "పొదుపరితనం లేకపోవటం" "దుబారా ఖర్చులు" అని చెబుతున్నారు, తమకున్నవానికన్నా మించి పెళ్ళిళ్ళకు. పేరంటాలకు వ్యవహారాలకు ఎక్కువ ఖర్చుపెట్టడం రైతుల సమాజ ఆచారాలు కారణమని చూప ప్రయత్నిస్తున్నారు. కాని నగ్నంగా కనబడే లెక్కలు ఈ వివ రణకు అనుకూలంగా లేవు. 1875 నాటికే దక్కన్ రైతు విచారణ కమిటీ ఇలా వ్రాసింది.

"పెళ్ళిళ్ళకు, పేరంటాలకు అయ్యేఖర్చులకు అనవసరంగా ప్రాముఖ్య మిచ్చారు....ఈ ఖర్చు రైతు ఖర్చులో కొంత ముఖ్యభాగం ఆక్రమించి నప్పటికీ, ఇదే అతనిఅప్పుకు మూలమని మాత్రం అరుదుగా కనిపిస్తుంది."

బెంగాల్ రాష్ట్రం బ్యాంకింగు కమిటీ "గ్రామాలలో బాగా విచారణ" జరిపిం తర్వాత పైవిధంగా పెళ్ళిళ్ళ ఖర్చులే అప్పులకు కారణమనేది సరికాదని నిర్ణయిం చింది ఉదాహరణకు బోగ్రా జిల్లాలోని కరీంపురం గ్రామంలో 52 కుటుంబాలు అప్పుల్లో మునిగి ఉన్నాయి. 1928-29 సంవత్సరంలో వారు అప్పులు ఎందుకు చేశారో క్రింద ఇవ్వబడినది:

| | | |
|---|---|---|
| 1. | పాతఅప్పులు తీర్చేందుకు | 389 |
| 2. | సేద్యంపెట్టుబడికి, కట్టడాలు మొదలైనవాటికి-పశువులుకొనడానికి | 1 087 |
| 3. | భూమిపన్నుకు గుత్తకు | 573 |
| 4. | సేద్యం ఖర్చులకు | 435 |
| 5. | పెళ్ళిళ్ళు, పండుగలు వగయిరాలకు | 150 |
| 6. | కోర్టు వ్యవహారాలకు | 15 |
| 7. | మిగతవానికి | 66 |
| | మొత్తం | రు. 2715 |

ఇందువల్ల పెళ్ళిళ్లకు, పండుగలకు, కోర్టువ్యవహారాలకు చేసినఅప్పులు మొత్తం అప్పులో 18 వ భాగంమాత్రమే. ఇందులో ఏదైనా తిరిగి ఆదాయానికి కారణమయ్యే అప్పు రెండోదిమాత్రమే. అది రైతుకు పెట్టుబడిలేదనేది సూచిస్తుంది. మిగతవన్నీ దాదాపు సగంమొత్తం, అత్యవసరమైన పన్ను, గుత్త, అప్పులు తీర్చడం. అప్పటిసేద్యం ఖర్చులు వీనికి చెందినవే.

ఇలాంటి ఫలితాలే బెంగాలులోని నైఋతి వీరభూమిలో జరిపిన విచారణలోకూడ 1933-34లో వచ్చాయి. ఇక్కడ 6 గ్రామాలలో 426 కుటుంబాలుంటే, అందులో 234 కుటుంబాలు లేక నూటికి 55 వంతులు అప్పుల్లోఉన్నారు. వీరందరి అప్పుమొత్తం రూ. 53,799—అంటే సగటున కుటుంబానికి రు. 230 అప్పుంది. ఈ అప్పులకు కారణాలు క్రింది దామాషాలో ఉన్నవి:

| | రూపాయలు | నూరు 1కి |
|---|---|---|
| గుత్తలకుగాను | 13,007 | 24.2 |
| సేద్యం, పెట్టుబడి శాశ్వత రిపేరీలకు | 12,736 | 23.7 |
| పెళ్ళిళ్ళు పేరంటాలకు | 12,021 | 22 3 |
| పాతఅప్పులు తీర్చేందుకు | 4,503 | 8.4 |
| సేద్యం ఖర్చులకు | 2,423 | 4.5 |
| కోర్టువ్యవహారాలకు | 708 | 1 3 |
| చిల్లర ఖర్చులకు | 8,401 | 15.6 |

(యప్ బోస్. "నైఋతి వీరభూమి—బెంగాలులోని గ్రామ ఋణవిషయమై విచారణ 1933-34", ఇండియన్ జర్నల్ ఆఫ్ స్టాటిస్టిక్స్, సెప్టెంబరు 1937 )

అప్పులో పెద్దపద్దు—దాదాపు నాలుగోవంతు—గుత్తలు చెల్లించడానికే; గుత్త, అప్పు కలిపితే మూడోవంతు అప్పు; నాలుగోవంతుకన్నా తక్కువే శాశ్వత మరామతులకు పెట్టారు; పెళ్ళిళ్ళు మొదలైనవానికయ్యే ఖర్చు ముందు యిచ్చిన ఉదాహరణకన్నా ఎక్కువే, అయినప్పటికీ అయిదోవంతుకన్నా కాస్తే ఎక్కువ. ముఖ్యమైన అప్పు ఆర్థికఅవసరాలకోసమే చేయబడింది—ఇందులో పెట్టుబడిగా పనికివచ్చేది చాలాతక్కువ.

కాబట్టి భారత రైతుల అప్పుకు కారణం ఆర్థికం. అదికూడ భూమి పన్ను

గుత్తలకోసం ఎక్కువవుతున్నది గనక రైతుల పీడనకు చాల సన్నిహితంగా ఉంది. పైవిచారణకమిటీ వాక్యాల్లో "అప్పులకు ముఖ్యకారణం రైతుల సామాన్య దరిద్రస్థితే". బొంబాయి రెవెన్యూశాఖ ఉద్యోగి సర్ టి హోప్ 1879లో దక్కన్ రైతుసహాయక బిల్లును ప్రవేశపెడుతూ ఇలా అన్నాడు. "రైతుల అప్పులకు మన రెవిన్యూ పద్ధతి కొంత కారణం." ఈ దక్కన్ రైతు సహాయక చట్టం ఎలా పని చేస్తున్నదో చూచేందుకు వేసిన విచారణ కమిటీ 1892 ఇలా వ్రాసింది. "నేటి రెవిన్యూ పద్ధతిలోని సంకుచితత్వం, దక్కన్ రైతుల కొత్త అప్పులకు ప్రధాన కారణం." ఈ పద్ధతే నగదులో పన్ను చెల్లించాలని పంటలో మార్పులు, ధరల్లో మార్పులు ఏమైనా సరే గుర్తించకుండా ఒకే తూరి 35 ఏళ్ళకు ఆ పన్ను మొత్తాన్ని నిర్ణయించింది. ఈ పద్ధతి కలెక్టరుకు, ప్రభుత్వం బడ్జెటును తయారుచేసే రాజకీయ వేత్తకు సౌకర్యముగా కనిపించవచ్చు: కాని విపరీతంగా అటూ యిటూ మారే ఆదాయంగల రైతుకు కష్టకాలంలో వినాశానికి కారణమై, వడ్డీ వ్యాపారస్తుని చేతుల్లోకి రైతును త్రోస్తున్నది అప్పుడప్పుడూ పన్నుల వసూలు ఆపడం, కొంత శిస్తుమాఫీ చేయడం రైతును కొంత ఆపవచ్చును కాని, అసలు పడిపోవడమేమో జరుగుతూనే ఉంటుంది: పైన ఉదహరించిన కమిటీయే, పూనా జిల్లాలోని చాల గ్రామాలలో భూమి పన్ను ఎలా చెల్లిస్తున్నారు, అని సాక్ష్యం సంపాదించింది, ఆ గ్రామాలనుండి వచ్చిన సమాధానాన్ని సంగ్రహించిన ఈ క్రింది పట్టిక ఎంతో వివరిస్తుంది,

| గ్రామం | భూమి పన్ను ఎలాచెల్లిస్తున్నారు |
|---|---|
| వైవాండు | రైతులు అప్పుచేయవలసి వస్తోంది. |
| పింపల్‌గోవన్ | బాగాపండిన ఏడుకూడ కొంత అప్పుచెయ్యాలి. |
| దేవుల్గోవన్ | కొందరు అప్పుచేయాలి. |
| కనగోవన్ | శిస్తువసూలప్పటికి మాసూలుకాదుకాబట్టి అప్పుచెయ్యాలి. |
| నందగోవన్ | వాన పడకపోతే చేలోఉన్న జొన్నపై అప్పుచెయ్యాలి. |
| ధోండ్ | చేలో పంటమీద అప్పుచెయ్యాలి. |
| గిరిమ్ | అప్పుచెయ్యాలి. పుట్టకపోతేఉన్నపంటనుచేలోనేఅమ్మాలి. |
| సోన్‌వారీ | ఉన్నడబ్బు, లేక పశువుల అమ్మకం, చాలకపోతే అప్పు చెయ్యాలి, |
| వధానా | మొదటికిస్తే చేలో పంటమీద, లేకపోతే భూమి అయికం పెట్టో, అమ్మో పన్నుకట్టాలి. |
| మోరగోవన్ | |
| అంబి | |
| తార్డోలీ | మొదటికిస్తే చేలోపంట మీదనో, పంటలేకుంటే వడ్డీకో తేవాలి. |
| కుసిగోవన్ | |

1900 లో ప్రకటితమైన "ది గ్రేట్ ఫామిన్" (పెద్దకరువు)లో రాస్తూ వాఘన్ నాష్, పై ఇచ్చిన పట్టికను కమిషన్ నివేదికనుండి సంగ్రహీకరించి ఇలా అన్నాడు "ఉద్యోగులు తమ పన్ను వసూలుకు వడ్డీవ్యాపారస్తుడే ముఖ్యమని తలంచుతున్నట్లు, బొంబాయికి వెళ్ళినప్పుడు నేను నిర్ధారణకు వచ్చాను."

వడ్డీవ్యాపారస్తుడూ, అప్పూ భారతసమాజానికి క్రొత్తకాదు. కాని వడ్డీ వ్యాపారస్తుని పాత్ర పెట్టుబడిదారీ దోపిడీలో ముఖ్యంగా సామ్రాజ్యవాద యుగంలో ఎక్కువ ప్రాముఖ్యతకు వచ్చింది. పూర్వం వడ్డీవ్యాపారస్తునినుండి రైతుకేవలం స్వంత పూచీమీదనే అప్పు తీసుకొనేవాడు. మరి వడ్డీవ్యాపారి వ్యాపారం అరాచకంగా, అపనమ్మకంగా ఉండేది; అతని లావాదేవీ అంతా గ్రామస్థుల తీర్పుకు లోబడే ఆచరణలో జరిగేవి. పాతకాలపు చట్టరీత్యా ఋణదాత ఋణస్తుని భూమిని లాక్కోవీలులేదు. ఇదంతా బ్రిటిష్‌పాలనలో మారిపోయింది. ఋణగ్రస్తునిపైని ఇచ్చే దాఖ్యత, భూమిమారకం మొదలైనవి బ్రిటిష్ చట్టం ఏర్పరచింది. ఇందువల్ల వడ్డీవ్యాపారస్తునికి చక్కని వేటమైదానం దొరికింది అతని వెనుక పోలీసు, కోర్టులు మద్దతునివ్వసాగాయి అతనిని పెట్టుబడిదారీ దోపిడీకి మూలస్తంభంగా వ్యాపారిని బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచింది. వడ్డీవ్యాపారి, శిస్తువసూలుకు దళారీగా ఉన్నాడు; అంతేకాక ధాన్యవ్యాపారీ అతనే. దానిని స్వాధీనపరుచుకునేవాడూ అతనే. మాసూలు సమయంలో పంటలుకొనే గుత్తవ్యాపారిగా తయారవుతాడు; అతనే సామాన్యంగా విత్తనాలు, పనిముట్లు అప్పుగాఇస్తాడు. వీనికి ఎంత ఇచ్చారో, ఇంకెంత ఇవ్వాలోకూడ లెక్కలను సరిగాచూచుకొనే శక్తి సామాన్యంగా రైతుల కుండదు. ఇందువల్ల రానురాను పూర్తిగా అతని గుప్పిటిలో తగుల్కొంటారు. భూమి వడ్డీవ్యాపారి చేతిలో పడుతూనే ఈ కార్యక్రమం మరింతముందుకు సాగుతుంది. రైతులు కూలికో, కౌలుకో పూర్తిగా అతనికిందనే పనిచేస్తూ, గుత్తను వడ్డీనికలిపి, తమ పంటలో ఎక్కువభాగం అతనికి ఇస్తూవస్తారు; రానురాను భారత గ్రామ ఆర్థికవ్యవస్థలో ఈ వడ్డీవ్యాపారి చిన్నపెట్టుబడిదారుగా తయారై రైతులను తన కార్మికులుగా పనిచేయిస్తాడు. రైతులకోపం తొట్టతొలుత వడ్డీ వ్యాపారిపై పడవచ్చును. తమకష్టాలకు కారణమూ, ప్రత్యక్ష హింసాకృతీ ఇతనేనని వారు భావిస్తారు; శాంతస్వరూపులూ, చిరకాలం బాధలకు ఓర్చినవారూ అయిన రైతులుకూడ వడ్డీవ్యాపారులను ఖూనీచేసినట్లుకూడ తెలుస్తున్నది; కాని వడ్డీవ్యాపారుల వెనక బ్రిటిష్ రాజ్యశక్తియావత్తూ నిలిచి ఉన్నదని రైతులు వెంటనే తెలుసుకొన్నారు. బ్యాంకులపెట్టుబడి దోపిడీయావత్తువ్యవస్థలో ఉత్పత్తి విషయంలో విడువరాని మూలపీఠంగా వడ్డీవ్యాపారి ఉన్నాడు.

వడ్డీవ్యాపారి దోపిడీ విస్తరిల్లేకొద్దీ మొత్తం దోపిడీ సరిగా జరగడం కోసమని బంగారుగుడ్లుపెట్టే బాతును అసలే చంపకుండా ఆపడంకోసం ప్రభుత్వం వెంటనే కొంత ప్రయత్నం చేసింది. రైతు ఆస్థిని దోచుకోవడానికి, భూమిని ఆక్రమించు కోవడానికి వ్యతిరేకంగా ఎన్నో ప్రత్యేక చట్టాలు చేయబడినవి. కాని

ఈచట్టాలు విఫల మయ్యాయని ఒప్పుకోక తప్పదు (చూ. అగ్రికల్చరల్ కమిషన్ రిపోర్టులో "చట్టాల వైఫల్యం" పైని అధ్యాయం పుట 436-7 ఋణనివారణ చట్టాల అనుభవం గూర్చిన విషయం.) తర్వాతకూడ నిరాటకంగా ఋణభారం పెరగడం కూడ కనబడుతుంది.

ఈ ఋణ సమస్యకు చెందిన వివరాలన్నీ-బ్రిటిష్ రాజ్యంలో అప్పులెలా పెరిగాయి వగైరా క్రిందివానిలో చూడవచ్చు. యమ్ యల్. డార్లింగు వ్రాసిన "పంజాబు రైతు ఆస్తీ అప్పులు" (మొదటి ప్రచురణ 1925) తర్వాత ఆయనే వ్రాసిన "రుస్టికస్‌లాకిటర్" (1930) "పంజాబు గ్రామంలో పొదుపు దుబారా" (1934)అనేవి ఆరచయిత ఈపరిస్థితంతా తప్పదన్నట్టు ఏదోసర్దుబాటుగారాసేవాడే అయినా, యదార్థాంశాలు మనకు వానిలో కనిపిస్తాయి ఆయన మొదటిపుస్తకంలో బ్రిటిష్ ఆక్రమణ తర్వాత పంజాబులో అప్పులు ఎలా పెరిగాయోచూపించాడు.

> "సిక్కుల రోజుల్లో అరుదుగా ఉన్న ఆయికాలు(అడుమానం) ప్రతి గ్రామంలోను తలసూపాయి. 1878 కంతా, రాష్ట్రంలోవి 7% భూమి ఆయి కంలో పడి పోయింది........
>
> "1880 కంతా, రైతు పట్టాదారుకూ వడ్డీవ్యాపారికీ జరిగిన అస మానుల పోరాటంలో వడ్డీవ్యాపారి అఖండవిజయం పొందాడు ...తర్వాత ముప్పయిఏళ్ళలో వడ్డీవ్యాపారి పరాకాష్ఠచెందాడు. అతను ఊరకే పెరిగి పోయి విపరీతంగా ధనం సంపాదించాడు. అందుమూలంగా బ్యాంకర్లు, వడ్డీవ్యాపారులసంఖ్య (వారిమీద ఆధారపడిన వారితోబాటు) 1868 లో 53263 నుండి 1911 కు 193,890 కి పెరిగింది."
>
> (యమ్, యల్. డార్లింగు, "పంజాబు రైతు ఆస్తీఅప్పు" పుట 208.)

డార్లింగుప్రకారం. వడ్డీవ్యాపారి 1911 కు అత్యుచ్చస్థితికి వచ్చాడు. 1927 లో వ్యవసాయ విచారణసంఘంముందు సాక్ష్యమిస్తూ ఆశాపూర్వకంగా ఇలా సూచించాడు. "పంజాబులో గ్రామ వడ్డీవ్యాపారి అన్నిచోట్లా క్రమంగా తన వ్యాపారం తగ్గిస్తున్నాడు. రెండుజిల్లాలలో మాత్రమే ఇప్పటికీవుంది. ఈతగ్గిం పుకు ప్రధానకారణం సహకారోద్యమం బాగా పెంపొందడం, రైతుకు రక్షణలు చట్టం కల్పించడం, వ్యవసాయదారే వడ్డీవ్యాపారిగా బయలుదేరడమున్నూ." (రిపోర్టు, పుట 442.) కాని అతని రెండోపుస్తకం "రుస్టికస్‌లాకిటర్" 1930లో ప్రకటితమైన దానిలో సాధారణంగా ఆశను కనబరిచినా తిరిగి అతను కొంత ప్రమాదముందని సూచించాడు.

> "భూమి అన్యాక్రాంత చట్టం(లాండు అలియనేషన్ ఆక్టు) ఉన్నప్ప టికీ తిరిగి రైతును పెద్దఎత్తున దోచుకొనే ప్రమాదముంది. పశ్చిమ పంజా బులో ఇందుకు అవకాశమున్నట్టు అప్పుడే సూచనలు కనబడుతూన్నవి. అక్కడ పెద్ద భూస్వామి ఈ చట్టాన్ని అవకాశంగా తీసుకొని రైతులను దోచి తన భూమిని మరింత విశాలం చేసుకుంటున్నాడు." (పుట 326)

1935 కల్లా పంజాబు భూమి పన్ను ఉద్యోగులు ఇలా వ్రాశారు.

"భూస్వామి, వడ్డీవ్యాపారి, గ్రామ ప్రాంతాల్లో బలం సంపాదించుకున్నట్టుకనిపిస్తున్నది." (పంజాబు లాండ్ రెవెన్యూశాఖ రిపోర్టు1935, పుట 6)

1919 లో డార్లింగు విచారణజరిపి, కేవలం నూటికి 17 మంది పట్టాదార్లు మాత్రమే అప్పులు లేకుండా ఉన్నారని సగటున అప్పు రూ463 కంటె తక్కువ లేవని-అంటే భూమి పన్నుకు 12 రెట్లెక్కువ అప్పున్నదని ఆయన కనిపెట్టాడు.

రైతు ఋణం విపరీతంగా పెరిగిపోయిందన్నందుకు బెంగాలులోని ఫరీదుపురం జిల్లాలో మంచి ఉదాహరణ కనిపించింది. ఈజిల్లాలో కలకత్తా హైకోర్టుజడ్జిగా తర్వాత వచ్చిన జె. సి. జాక్ 1906 లో విచారణ జరిపాడు. తర్వాత విచారణ ఫలితాలను "బెంగాలు జిల్లాలో ఆర్థిక జీవనం" (1916) అనే పుస్తంలో ప్రకటించాడు; వాని ప్రకారం అప్పుడు ఆ జిల్లాలో నూటికి 55 మంది అప్పులు లేకుండా ఉన్నారు. పాతికేండ్ల తర్వాత 1933-34 లో అదే జిల్లాలో బెంగాల్ ఆర్థిక విచారణ సమితి కొత్త విచారణ జరిపింది. ఇప్పటికి కేవలం నూటికి 16.9 కుటుంబాలు మాత్రమే అప్పులు లేనివారుగా తేలింది.

## 6. మూడు భారాలు

రైతు భూమిలేని కార్మికవర్గంలోని కింకా చేరకపోయినట్లయితే, నేడతను మూడుభారాలక్రింద పడినలిగిపోతున్నాడు. చాలీచాలని పనిముట్లతో, ఆ ఇంత పొలంముక్కను సాగుచేసి ఏ కొంచెమో అతను పండిస్తున్నాడు. ఆ పంట తన, తన కుటుంబపు అత్యవసరమైన హీనజీవిత ప్రమాణానికికూడ చాలదు. అయినప్పటికి ఆ యింతలోను తమభాగం లాక్కోవడానికి మూడుశక్తులు ప్రయత్నిస్తున్నవి.

వీటన్నిటిలోను ప్రభుత్వపు భూమిపన్ను తాఖీదు అతనిపైపడుతుంది. అందుతోపాటు రైతు కొనుక్కొనే ఆ కాస్త సరుకులపైపడే పరోక్షపుపన్ను చేరుతుంది. ("భారత గ్రామం స్వయంసంపూర్ణంగా ఉండడంవల్ల, వారువాడే వస్తువులపైపన్నులు కేవలం ఉప్పు, కిరోసిన్, మత్తు పదార్థాలపైన మాత్రమే పడుతున్నవి. వీటికి మాత్రమే గ్రామాలు బయటి సరఫరాపై ఆధారపడతారు; అని సైమన్ రిపోర్టు వాపోతున్నది; అయినప్పటికి, నిరుపేదలకుకూడ అత్యవసరమైన ఉప్పుపై పన్నులేని 1939-40 లో 81 లక్షల పౌనులద్వారా ప్రభుత్వం వసూలుచేసింది - అంటే భూమిపన్నులో $\frac{5}{2}$ వంతు అన్నమాట )

ప్రభుత్వ పన్నుకాక, చాలమంది రైతులపై భూస్వామి కివ్వవలసిన గుత్తో కటి పడుతుంది; ఎందుకంటే, బ్రిటిష్ ఇండియాలోని మొత్తం భూమిలో సగం జమీందారీ పద్ధతిక్రింద ఉండడంకాక, రైత్వారీ ప్రాంతంలోని మూడువంతుల భాగం కనీసం కౌలుకు ఇస్తున్నారు.

పైనిచ్చిన డార్లింగు లెక్కలు, ఫరీద్‌పూర్ విచారణను సూచనగా తీసుకుంటే, వడ్డీ వ్యాపారి కోరే వడ్డీ 5/4 వంతులవరకు ఉంటుంది.

అయితే రైతునుండి ఎంతపంటను పైవిధంగా లాక్కుంటున్నారు? రైతు జీవనానికి మిగిలేదెంత? భారతవ్యవసాయంలో అతిప్రధానమైన ఈ సమస్యను గూర్చి లెక్కలేమీ దొరకడంలేదు. అప్పుల కివ్వవలసిన వడ్డీయెంతో అలావుంచి భూమిపన్నుకాక రైతివ్వవలసిన మిగతా గుత్తలెంతో తెలుసుకోవడానికూడ ఏ ప్రయత్నమూ జరగలేదు. నిఖరమైనలెక్కలు లేకపోవడంవల్ల సెంట్రల్ బ్యాకింగు విచారణకమిటీలోని కొందరు సభ్యులు వేరుగా ఇచ్చిన నివేదికలో ఈ విషయమై మొత్తంపై అంచనావేశారు (పుట 38-7). భూమిపన్ను ప్రాతిపదికపై వారు లెక్కవేస్తూ, భూమిపన్ను 35 కోట్లరూపాయలని, అప్పులవడ్డీ ఎంతతక్కువ వేసినా ఇంతకు మూడింతలు అంటే 100 కోట్ల రూపాయలని. భూమిపన్నుకాక మిగత గుత్తలు భూమిపన్నుకు 1½ రెట్లెక్కువని వారు అంచనావేశారు. అంటే రైతుపైపడేభారం మొత్తం భూమిపన్నుకాక అంతకు అయిదింతలుంటుంది. అయినప్పటికి ఈ అంచనా చాల తక్కువని ఆరిపోర్టు సూచించింది. గుత్తలు భూమిపన్నుకన్న ఒకటిన్నర రెట్లుంటుందన్న అంచనా, మదరాసులో పెట్టిన ఒకబిల్లు మీద ఆధారపడి వేశారు. ఆ బిల్లులో ఇంతకన్న గుత్తఎక్కువ వుండరాదనిఉంది. కాని ఆబిల్లు అమలుకురాలేదు; కాని భూమిపన్నుకు గుత్తకువున్న దామాషా బెంగాలులో తప్పకుండాను, మిగతాప్రాంతాల్లో బెంగాలులో ఉన్నంతఎక్కువ కాకున్నా సామాన్యంగా ఇంతకన్నా ఎక్కువవుంటుంది. (బెంగాలులో భూమిపన్నుకన్న గుత్త కనీసం 4 రెట్లు, దాదాపు 6 రెట్లవరకు ఎక్కువగాఉంది) ఆ రిపోర్టు ఇలా వ్రాసింది: "అక్కడక్కడి పరిస్థితులు, తావులనుబట్టి మనుష్యులను బట్టి, భూమిపన్ను పంటలనుబట్టి విభిన్నమైనప్పటికి, దళారీలు ఉన్నచోట్లల్లా రైతులు భూమిపన్నుకన్న గుత్త 1½ రెట్లుకన్నా ఎక్కువేచెల్లిస్తారు." ఇక అప్పులకు వడ్డీ అని మొత్తం 900 కోట్లపై 100 కోట్ల రూపాయలని వేసినఅంచనా (నూటికి 11) కూడ చాలతక్కువ; సామాన్యంగా గ్రామంలోని వ్యాపారి, రైతుకు వేసేవడ్డీ నెల 1కి రూపాయకు ఒకఅణా (ఒకొకతూరి 1½ అణా) అంటే నూటికి 75 వంతులు. అప్పులుకూడ అప్పటినుండి రెండింతలు పెరగడంతో ఈ భారాన్ని మరింత ఎక్కువచేసి ఉంటుంది. కాబట్టి రైతుభారం ఈరిపోర్టులో సూచించినంతకన్నా ఎక్కువేఉంటుంది. కాని ఇందుతోపాటు ఉప్పుపన్నుగూడచేరిస్తే ఏటా 200 కోట్ల రూపాయలు లేక రైతుకు రు. 20 లు భారం పడుతుంది. ఇందుకు సెంట్రల్ బ్యాంకింగు విచారణకమిటీ మెజారిటీ రిపోర్టులో ఇలాఉంది. "బ్రిటిష్ ఇండియాలోని సగటు రైతుఆదాయం, ఏటా 42 రూపాయలకంటే లేక 3 పౌనులకంటె ఎక్కువ ఉండదు." (పుట 39.)

రైతు పీడన ఎంతో ఇంతకన్నా వివరమైన రీతిగా యన్ యస్. సుబ్రహ్మణ్యం "ఒక దక్షిణభారత గ్రామ పరిశీలన" (కాంగ్రెస్ పొలిటికల్ అండ్ ఎకనామిక్ సర్వీస్ నెం. 2,1936)లో ఉంది. తిరుచునాపల్లి జిల్లాలో నేరూరు అనే ఊరుంది. దాని జనాభా 6,200 ఈ పరిశీలనలో జనాభాను అన్ని విధాలా

వచ్చే ఆదాయం, మొత్తం పోయే ఖర్చులు రైతు పోషణకు మిగిలే మొత్తము నికరమైన బడ్జెట్ ఇవ్వబడింది. ఇందులో దోపిడీ ఎంతఉందో అతి స్పష్టంగా చూడ వీలున్నది. ఎందుకంటే ఈఊళ్ళోని భూములు ముఖ్యంగా గ్రామంలో లేని వారివే. ఇవ్వవలసిన అప్పులో బయటవారికే. కాబట్టి వడ్డీలు, గుత్తలు పూర్తిగా ఊరినుండి వెళ్ళిపోయి మొత్తం గ్రామం ఆదాయంలో ఎంత తక్కువో స్పష్టంగా తెలుస్తుంది. ఈ పరిశీలనవల్ల తేలిన ఫలితాలేమిటి? వ్యవసాయం వల్ల వచ్చే మొత్తం ఆదాయం, పదార్థాలకు బజారులోఉన్న ధరలనుబట్టి రూ. 344 000. ఇందులో వ్యవసాయ ఖర్చులు పోను (రైతు కష్టము, ఊళ్ళోని కూలీలకిచ్చే కూలి విడిచిపెట్టి) నికరాదాయం రూ. 212.000 వ్యవసాయేతరమైన ఆదాయం (బయట పనికి పోవడంవల్లవచ్చేకూలి, ప్రభుత్వోద్యోగుల జీతాలూ, పెన్షన్లూ,బయటకు అప్పిచ్చినమొత్తం పైవడ్డీ కలిసి) రూ. 24000, ఇవన్నీ కలిసి మొత్తం గ్రామాదాయం రూ. 236,000.

ఇక ఊరినుండి పోయే ఖర్చులు ఈక్రింది విధంగా ఉన్నవి ; భూమిపన్ను నీటి తీరువా మొదలైన పన్నులు రూ. 80,000; గ్రామంలోని భూస్వాములకు ఇచ్చే గుత్తలు రూ. 70,000; అప్పులకు వడ్డీ (నూటికి 8 రూ చొప్పున తక్కువగా వేస్తే) రూ. 40,000; కల్లు. సారాయి అంగళ్ళకుగా ప్రభుత్వానికిచ్చే గుత్త, చెట్ల పన్నులు, చెట్ల ఖామందులకు ఇచ్చే గుత్తలు రూ. 12.000. ఇలాగా ప్రభుత్వం పన్ను, సుంకాలు. గుత్తలు, వడ్డీలు కలిసి రూ. 152,000 అవుతుంది. మిగత చిల్లరగా బయటికి వెళ్ళే రూ 4000 తో కలిపి మొత్తం గ్రామంనుండి బయటికి వెళ్ళే ఖర్చులు రూ. 156,000. ఆదాయంలో ఈ ఖర్చు పోతే గ్రామానికి మిగిలే నిల్వ రూ. 80.000 లేక తల 1కి 13 రూ.

ఈ గ్రామంలోని ప్రతిమనిషీ ఏటా సగటున 38 రూ. సంపాదిస్తున్నాడు. కలెక్టరు, భూస్వామి, వడ్డీవ్యాపారి తమ భాగాలు తాము తీసుకున్న తర్వాత, ఆ మనిషికి సంవత్సరంపొడుగునా బ్రతకడానికి రూ. 13 మిగులుతున్నవి అతనికి మూడోవంతు వదిలి, మూడులో రెండువంతులు లాగివేస్తున్నారు

"మొత్తం గ్రామ నికరాదాయంలో మూడులో రెండువంతులు, భూమిపన్ను, ఎక్సైజ్ పన్ను. వడ్డీలు, ఊళ్ళోలేని భూస్వాములకు గుత్తలు వీనిద్వారా బయటికి వెళ్ళిపోతున్నది." ఈ వివరమైన పరిశీలనలో తేలిన సారాంశమిది. ఈ పరిశీలన నంతటిని పైన మొత్తం రూపాయలలో సంగ్రహీకరించాను.

ఫ్రెంచి మహావిప్లవం రానున్న సమయంలో ఫ్రెంచి రైతుల పరిస్థితిని కార్లయిల్ ఈ క్రింది ప్రఖ్యాత వాక్యాల్లో వర్ణించాడు.

"వితంతువు తన పిల్లల అన్నంకోసం కట్టెపుల్లలను ఏరుకుంటూంది. అత్తరువుల వాసనతో గుబాళిస్తున్న ప్రభువు గవాక్షంలో విశ్రమించి ఉన్నాడు. ఆ వితంతువు ఏరుతున్న కట్టెపుల్లలలో ప్రతి మూడోదానినీ తాను స్వాహాచేసేందుకు తగిన రసవాదం ఆ ప్రభువుచేతిలో ఉంది. దానినే అతను మగతా, చట్టం అని పేరుపెట్టాడు"

నేడు బ్రిటిష్ ఇండియాలో అంతకన్న అగోచరశక్తిగల రసవాదం సాధించారు; దీనిప్రకారం ఆరైతు వితంతువు ఏరే ప్రతి మూడు కట్టెపుల్లలలోను రెండు ప్రభువు స్వాధీనం అవుతున్నాయి.

# గమనిక

(ప్రక్క పుటలో అధ్యాయం ప్రారంభంలో దీనిని చేర్చి చదువుకోవాలి)

"మేల్కొనండి రైతులార మేల్కొనండి, కృష్ణుని ఉద్బోధం స్మరించండి
దొంగలు దోపిడిగాళ్ళు, దూరినారు మనఇళ్లో - మేల్కొనండి.
మేల్కొనండి రైతులార మేల్కొనండి. కృష్ణుని ఉద్బోధం స్మరించండి

వైశాఖంలో రైతులు
పంటలు పండించేస్తే
షావుకార్లు మనభూమిని
స్వాహా చేస్తున్నారూ
భూస్వాములు మన పంటను
పొట్ట బెట్టుకుంటున్నారూ
ఒక్కనాడు కూడ మనకు
ఉండబోదు విశ్రాంతి.
పట్టపగలు ఎట్టఎదుట
రెట్టల కష్టం వారలు పొట్ట బెట్టుకుంటున్నారూ
చిట్టచివర ఒకగింజా అట్టె విలువబోదు మీకు-
మేల్కొనండి రైతులార, మేల్కొనండి"

(పతోకిశర్మ. రైతకవి - ముర్షిదాబాదు జిల్లా మే 1938 ఫరీదాబాదులో జరిగిన గ్రామ కవి సమ్మేళనానికి అధ్యక్షుడు)

వెనుక మనం పరిశీలించిన అంశాలనుబట్టి, వ్యవసాయ సంక్షోభం పెరుగుదలలోని ప్రధాన లక్షణాలను సంగ్రహీకరించవచ్చు. ఈ లక్షణా లేర్పడేందుకు కారణాలూ, పరిస్థితులూ బ్రిటిష్‌పాలన ఏర్పడిందగ్గరినుంచీ పెరుగుతూ వస్తున్నాయి. అవి నేడు చరమావస్థను పొందుతున్నవి.

# అధ్యాయం 9

# వ్యవసాయ విప్లవం వైపుకు

## 1. వ్యవసాయ సంక్షోభం విజృంభించింది

మొదటిలక్షణం; దేశ ఆర్థిక వ్యవస్థలో హెచ్చుతగ్గులుగా అసమానంగా ఉన్న వ్యవసాయ పరిస్థితి. ఇందుతోపాటు ఎక్కువమంది ప్రజలు వ్యవసాయంలో చేరడం, వ్యవసాయం అభివృద్ధిచెందకపోవడం, ఇప్పటికీ 'పరిశ్రమలు తగ్గించే విధానమే' కొనసాగడం. ఇవి భారతదేశం వలసగా ఉన్నందువల్ల ఏర్పడినవి. ఈ సాధారణ పరిస్థితి, మిగతా అంశాలన్నింటినీ మరింత తీవ్రపరుస్తున్నది.

రెండు; వ్యవసాయం స్తబ్దస్థితిలో ఉంది. క్షీణిస్తున్నది. పంటలు చాల తక్కువ. శ్రమ ఎక్కువగా నష్టమవుతున్నది. సాగుకు వీలయిన భూమినంతటిని సేద్యంక్రిందికి తేలేకపోతున్నారు. ఇప్పుడు సాగవుతున్న భూమినికూడ అభివృద్ధి పరచడంలేదు, ఇప్పుడున్న పంటకూడ తగ్గే సూచనలున్నవి. మరికొంత భూమి బీడుపడి. మొత్తం సాగవుతున్న వైశాల్యం తక్కువవుతున్నది.

మూడు; రైతులకు భూమిపై తహతహ ఎక్కువవుతున్నది. ఒకొక రైతుకున్న పొలం వైశాల్యం తగ్గి, భూమి చిన్నచిన్న ముక్కలుగా తయారవుతున్నది. చాలభాగం ఆర్థికంగా సరిపోని చిన్న పొలాలే అధికంగా నేడున్నవి.

నాలుగు; భూస్వామి విధానం వ్యాపిస్తున్నది. కౌలుకివ్వడం, కౌలుదార్లు మలర కౌలుకివ్వడం ఎక్కువవుతోంది. ఏ పనీచెయ్యని, రైతులుకాని గుత్తలు వసూలుచేసేవారి సంఖ్య గబగబా పెరిగిపోతున్నది. ఈ సాగుచేయని యజమానుల చేతికే భూమి ఎక్కువగా సంక్రమిస్తున్నది.

అయిదు ; ఇంకా పొలమున్న రైతుల అప్పులు ఎక్కువవుతున్నవి. ఇటీవల గ్రామంలోని అప్పులమొత్తం ఆకాశానికి పెరిగింది.

ఆరు ; రైతుల ఆస్తులు అప్పుల మూలంగా పరాక్రాంతం కాసాగినవి. భూమి వడ్డీవ్యాపారస్తులకు మారుతున్నది. దీనిఫలితం భూస్వాములు ఎక్కువ కావడంలోను, భూమిలేని కార్మికుల సంఖ్యపెరగడంలోను కనిపిస్తుంది.

ఏడు ; వ్యవసాయకూలీల సంఖ్య పూర్వంకన్నా చాలఎక్కువకావడం, 1921-31 లలో మాత్రమే రైతులలో అయిదోవంతునుండి మూడోవంతుకు వీరి సంఖ్య పెరిగింది. అప్పటినుండి పెరుగుతూ రైతులలో సగం పొలంలేనివారే అయ్యేస్థితి వస్తున్నది.

అప్పుల మూలంగా భూమి అన్యాక్రాంతమవుతున్నదని అందరూ అంగీక

రిస్తున్నారు. 1892 నాటికే రైతుసహాయచట్టం ఎలా పనిచేస్తున్నదో విచారించిన దక్కన్ కమిషన్ కటువుగా "వ్యవసాయ దేశంలో భూమిని అభివృద్ధి పరచ దానికి ఏమీ చేయక గుత్తకోసం ప్రాకులాడే పరులకిందికి భూమి పోతున్నది." అని గమనించి, ఈ కొత్తభూఖామందు "బాధ్యతలేని భూస్వామి అధికారాలను ఉపయోగించేందుకు బొత్తిగా పనికిరానివాడు... భూమి అధిపతిగా దోచుకోవాలని చూస్తాడు. కౌలుదారుతో ఎక్కువ లాభం వచ్చేట్టు ఒడంబడికచేసుకొంటాడు. ఆ కౌలుదారు తనకు అప్పు పడిఉండడంవల్ల దాదాపు బానిసగా తయారవుతాడు" అని ఆ కమిషన్ వ్రాసింది. "అప్పులు తప్పనిసరి అవుతున్నవి గనక వడ్డీవ్యాపారికి విపరీతమైన పెత్తనం లభిస్తున్నది. ఇందుమూలంగా క్రమంగా భూమి ఇతవి. కిందికి వచ్చే ప్రమాదపరిస్థితి తప్పకపోతున్నది. అందువల్ల వడ్డీవ్యాపారి సర్వ తంత్రస్వతంత్రుడవుతున్నాడు." అని 1928 లో వ్యవసాయ విచారణకమిటీ (పుట 435) గుర్తించింది. ఈ ప్రభుత్వవిచారణ కమిటీలన్నీ, వడ్డీవ్యాపారి భూమిని తన వాతవేసుకోవడంపై తీవ్రంగా అసమ్మతిని కనబరుస్తున్నవి. కాని, అధికారానికి మూలం ప్రభుత్వం యిస్తున్న మద్దతేనని, భూమి రైతునుండి వ్యాపారికి మారడం ప్రభుత్వం చట్టబద్ధంగా న్యాయమని చెప్పడం, తమపన్ను వసూలు మూలంగానే రైతును ప్రభుత్వం వడ్డీవ్యాపారి వాత పడవేస్తున్నదని మట్టుకు ఈ విచారణకమిటీలు చెప్పడం మానివేశాయి. 1931 లో సెంట్రల్ బ్యాంకింగు విచారణకమిటీ తన అభిప్రాయాన్నిలా తెలిపింది.

> "రైతు ఋణ బాధల మూలంగా, ఆఖరుకు భూమి రైతునుండి, వ్యవసాయం చేయని వడ్డీవ్యాపారికి మారుతున్నది ఇందువల్ల భూమిలేని కార్మికవర్గం అతి హీనమైన ఆర్థిక స్థాయితో సృజింప బడుతున్నది. దీనికి ఫలితంగా వ్యవసాయం సమర్థంగా నిర్వహింప బడదు. ఈ వడ్డీ వ్యాపారి రైతుకు ఏమీమిగలని విధంగా కౌలుకిస్తాడు. కాబట్టి చక్కనిపంట పండిస్తామన్న అభిప్రాయం రైతుకు కల్గదు"
>
> (సెంట్రల్ బ్యాంకింగు ఎంక్వయిరీ కమిటీ రిపోర్టు, పుట 59)

1931 జనాభా లెక్కలనివేదిక ఈవిధంగా తేల్చింది. "భూమంతా సేద్యం చేయని యజమానులక్రింద కేంద్రీకృత మవుతున్నట్టు కనిపిస్తుపిస్తున్నది."

(సెన్సస్ ఆఫ్ ఇండియా 1931 వాల్యుం 1 భాగం 1 పుట 288)

కాని ఈ వినాశ కార్యక్రమం రైతు భూమిని దోచుకొనే కార్యక్రమం మరీ త్వరత్వరగా ముందుకు సాగుతున్నది. ఇందుకు తోడు ప్రపంచ ఆర్థిక సంకటాలు, పంటల ధరలు పడిపోవడం తర్వాత రెండో ప్రపంచ యుద్ధం రావడం, దేశమంతటా క్షామం రావడం పై వినాశ పరిస్థితి మరింత తీవ్రతర మవుతున్నది.

వ్యవసాయమెంత వినాశస్థితికి వచ్చిందో, 'కమ్మర్షియల్ ఇంటలిజెన్సు అండ్ స్టాటిస్టిక్సు డైరెక్టర్ జనరల్ ప్రకటించిన లెక్కలద్వారా మనం తెలుసుకోవచ్చును. ఆర్థిక సంకటావస్థ వచ్చే ముందటిసంవత్సరం 1928-29 లో మొత్తం

వ్యవసాయపు పంటలవెల సగటున కోతకాలం ధరలప్రకారం రు. 10,34 కోట్లు. 1933-34 లో ఈవెల రు. 4730 కోట్లు—నూటికి 55 వంతులు పడిపోయింది.

అప్పటికే దరిద్రస్థితిలోఉన్న రైతుఆదాయం, ఇలా సగంతగ్గిపోవడంతో ఎంత అధ్వాన్నస్థితి ఏర్పడుతుందో మనం ఊహించుకోవచ్చును. మరి అతను ఇవ్వవలసిన నగదేమో తక్కువకాలేదు. అంతేకాక 1928-29 లో 33 కోట్లు 10 లక్షల రూపాయలుగావున్న భూమిపన్ను 1931-32 లో కూడ రు. 33 కోట్ల గానే ఉంది. ఇకబొత్తిగా ఇవ్వలేక భూములు ప్రభుత్వానికి అప్పగించడంతో 1933-34 లో మట్టుకు భూమిపన్ను రు. 30 కోట్లకు తగ్గింది. అంటే నూటికి 9 మాత్రం తగ్గింది.

బెంగాల్ జూట్ విచారణ కమిటీరిపోర్టు 1934 అంచనాలనుబట్టి 1920-21 కి 1932-33 కు కొనుగోలు శక్తిలో జరిగిన మార్పులనుచూస్తే, బెంగాలు రైతుల హీనస్థితి మనకు బోధపడుతుంది. బెంగాలురాష్ట్రంలో మొత్తం అమ్మకానికి తగిన పంటలవెల 1920-21 రు. 82 కోట్ల 70 లక్షలు. ఆమొత్తం నుండి 1929-30 నాటికి 1932-33 నాటికి 72 కోట్ల 40 లక్షల రూపాయలకు తగ్గిపోయింది. మరి రైతు ఇవ్వవలసిన ఖర్చులేమో 27 కోట్ల 90 లక్షలనుండి రు. 28 కోట్ల 30 లక్షలకు పెరిగినవి. అంటే రైతుల 'స్వంత కొనగోలుశక్తి' రు. 44 కోట్ల 50 లక్షల నుండి రు 4 కోట్ల 40 లక్షలకు పడిపోయింది. కలకత్తాధరల సూచీసంఖ్య సగటున అదేసమయంలో 223 నుండి 126 కు పడిపోయింది-అంటే నూటికి 44 వంతులు, మరి 'కొనుగోలుశక్తే'మో నూటికి 90 వంతులు పడిపోయింది.

ఈ కాలంలోనే సంప్రదాయసిద్ధంగా దాపరికంగా ఉంటూ వచ్చిన బంగారు సొత్తులన్నీ రైతులనుండి; దివాలాతీయకుండా ఉండేందుకు ఇంగ్లాండుకు వెళ్లాయి. వస్తువుల ఎగుమతులద్వారా ఇంగ్లాండుకు చెల్లించే కప్పంచాలక, ఈ బంగారం ఆ కప్పాన్ని చెల్లించవలసివచ్చింది. 1931-37 ల మధ్య ఇండియానుండి 2410 లక్షల పౌనుల బంగారం బయటికి ప్రవహించింది. కాని "సంక్షోభ దినాల" బంగారు ఏ కొంతకాలమో చాలింది, కొంతకాలానికి మించి వినాశదశను రాకుండా ఆపలేకపోయింది,

సంయుక్త పరగణాలలో, పన్ను లివ్వలేక భూమిని వదిలివేసిన కౌలుదార్ల సంఖ్య 1931 లో 71,430 దాకా పెరిగింది; బలవంతంగా భూమిపన్ను వసూలు చెయ్యమని ఇచ్చిన ఉత్తరువుల సంఖ్య 256,284. 1930 లో ఇరిగేషన్ కమిటీ బెంగాలులో "భూమి సాగునుండి తొలగిపోతున్నది" అని వ్రాసిన సంగతిని ముందే పరికించాము.

1934-35 లో వ్యవసాయపులెక్కలు సాగవుతున్న భూమిలో పూర్తిగా 50 లక్షల ఎకరాల భూమి బీడుపడిపోయింది. 1933-34 లో విత్తనంవేసిన మొత్తం భూమి 23 కోట్ల 32 లక్షల ఎకరాలు. 1934 — 35 లో ఇది 22కోట్లు

69 లక్షల ఎకరాలు, అంటే 5,266,000 ఎకరాలు తగ్గిపోయింది. ఆహారధాన్యాలు పంటబెట్టే భూమి సాగు తగ్గుదల 55,89,000 ఎకరాలు.

1934 లో కొంత ధరలు పెరిగినా, సంక్షోభం తగ్గించేందుకుగాని, వినాశ దశ రాకుండా ఆపడానికిగాని వీలుకాలేదు. "1934 నుండి ప్రజల బాధలు మరింత తీవ్రతరం కావచ్చును." అని ఆన్‌స్టే ("భారతదేశ ఆర్థికాభివృద్ధి", 488, xxvii) వ్రాశాడు.

రైతుఆదాయం సగం తగ్గిపోవడంవల్ల ఋణం రెట్టింపయింది. అంటే అప్పుపెరగక తప్పలేదు. 1931 లో అప్పుమొత్తంకన్నా ఇప్పుడది రెండింత లయిందని అంచనా వేశారు.

1921 లో రైతులఋణం మొత్తం 4000 లక్షల పౌనులని అంచనా వేశారు. (చూడు: యం. యల్. డార్లింగు "పంజాబు రైతు ఆస్తి అప్పు")

1931 లో సెంట్రల్ బాంకింగు విచారణకమిటి రైతుల అప్పును 675 మిలియన్ల పౌనులని-లేక 900 కోట్ల రూపాయలని అంచనా వేసింది.

1937 లో రిజర్వు బాంకు రైతు అప్పులశాఖ నివేదిక ఈ అప్పును రూ. 1,800 కోట్లు లేక 1,350 మిలియన్‌ల పౌనులు, లని అంచనా వేసింది.

1921-నుండి 31 లోగా పదేళ్ళలో అప్పు 4000 లక్షల పౌనులనుండి పౌ 6750 లక్షల పౌనులకు పెరిగింది. 1931 — 37 వరకు 6 ఏండ్లలో 6 750 లక్షల పౌన్లనుండి పౌ. 1,3500 లక్షలకు హెచ్చింది. ఇలా రైతు ఋణం మొత్తం కొండలుగా పెరగడం వ్యవసాయ సంక్షోభం ఎంత తీవ్రస్థితికి పెరుగుతున్నదో స్పష్టంగా చూపుతున్నది.

భారత వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ ఎంత అసమర్థమైందో, జపాను యుద్ధంలో దిగి, బర్మా బియ్యం దిగుమతి నిల్చిపోతూనే అతినగ్నంగా ప్రదర్శితమయింది వెంటనే ఇండియాలో ఆహారధాన్యం కరువు ఏర్పడింది; ధరలు పెరిగిపొయ్యాయి. దీనిని ఆపాలంటే తొలుత రైతు భారాన్ని తగ్గించి, అతనికి కావలసిన నీటి పారుదల మొదలైన వసతులను ఏర్పరచి అధికోత్పత్తి ఏర్పాట్లు చేయ వలసింది; రెండోది ధరలను నిర్ణయించి పూర్తిగా అన్నివస్తువులకు రేషనింగు పెట్టవలసింది. ఆఖరున, భూస్వాములు, వ్యాపారులు దొంగతనంగా నిల్వ చేయకుండా దొంగ వ్యాపారం చేయకుండా బాగా నిరోధించ వలసింది. ఇలా చేయకుండా సామ్రాజ్య వాద ప్రభుత్వం, ప్రజాసామాన్యాన్ని దోచి యుద్ధానికి డబ్బు సంపాదించడానికే పూనుకొని, నోట్లముమ్మరం (ఇన్‌ఫ్లేషన్) మీదా, అధికధరలమీదా ఆధారపడింది; ప్రజలకు సమానంగా ఆహారపంపకం చేయడానికి ప్రయత్నించకుండా, సైన్యానికి అవసరమైన ధాన్యం సరఫరాకు దొంగనిల్వలు చేసినవారినే తాను ఉపయోగించుకో సాగింది. ఇందుకు ఫలితమేమంటే 1943 లో ఆహారధాన్యం కొలత కేవలం 14,00,000 టన్నులు మాత్రమే అయినప్పటికీ—ఇది భారతదేశ అవసరాల్లో

వాల తక్కువ—దేశంలోని విశాలభూభాగాలు, తీవ్రక్షామంలో మునిగిపోయ్యాయి. తన్మూలంగా లక్షలాది ప్రజలు చనిపోయారు.

బెంగాలులో మాత్రమే క్షామంమూలంగా 35 లక్షలమంది చనిపోయినట్లు ప్రొఫెసర్ కె. పి. చటోపాధ్యాయ విచారణ ప్రకారం తేలింది. ప్రభుత్వమే నియమించిన క్షామవిచారణ కమిటీకూడ ప్రజల మరణసంఖ్య 15 లక్షలని వ్రాసింది.

క్షామంతోపాటు అంటురోగాలు వ్యాపించాయి. 1944 సెప్టెంబరునాటికి బెంగాలులో వివిధరోగాలవల్ల 12 లక్షలమంది చనిపోయ్యారు (భవానీసేన్, "బెంగాలు గ్రామాల వినాశదశ" పుట 18)

ఈ క్షామం "మానవకృతమైన క్షామం" బెంగాలులో ధాన్యంకొంత ఆరువారాల సరఫరామాత్రమే. ఆ కొంచెం, దిగుమతులద్వారా, న్యాయమైన పంపకం ద్వారా ఏర్పాటుచేసి ఉండవచ్చును. కాని బెంగాలు జనాభాలో మూడోభాగం కరువుకు బలయింది. ఉన్న ధాన్యం నిలవంతా, పెద్దజమీందారులు, వ్యాపారస్తులు దాచారు. లంచాలకు మరిగిన నిరంకుశ ఉద్యోగులు, ఆ నిల్వలను వారి నుండి బలవంతంగా బయటికి లాగడంమాని, ధరలు పెంచేందుకే తోడ్పడ్డారు. అందుతో కోట్లప్రజల జీవితాలతో చెలగాటమాడారు. కలకత్తాలో 1942 జనవరిలో బియ్యం మణుగు 1 కి రు. 6 ఉంటే 1942 నవంబరు కి రు. 11 అయింది; 1943 ఫిబ్రవరి, ఏప్రిల్‌లలో రు. 24; మే లో రు 30; జులైలో రు. 35; ఆగస్టులో రు. 38; అక్టోబరులో రు: 40 కి పెరిగిపోయింది. గ్రామప్రాంతాలలో బియ్యం మణుగుధర రు. 50 నుండి రు. 100 దాకా కూడ పెరిగిపోయింది. క్షామపురోజుల్లో అపరిమితంగా బియ్యం దొరికేవికాని మణుగు 1కి వెల రు. 100 ఇవ్వాలి.

ఇందుమూలంగా పెద్దపెద్దషావుకార్లు దొంగవర్తకంతో ఈక్షామపురోజుల్లో రు 1,500,000,000, లాభం గడించారు. (పైపుస్తకం పుట 1)

మొట్టమొదట క్షామపిశాచికి బలయినవారు, అయిదెకరాలకన్న తక్కువ పొలంగల నూటికి 75 వంతులున్న బెంగాలు రైతుకుటుంబాలు. పొలంతక్కువ గనక తమకు కావలసినన్ని గింజలు వీరు పండించలేరు. 1943 మే నెలనాటికి, ఈ 75 వంతుల రైతులకు బియ్యం నిల్వలేదు. "ధాన్యంనిలవంతా జోతేదార్లు, వర్తకులు, ప్రభుత్వ ఏజంట్లు, మిల్లుయజమానులక్రింద ఉంది" (అదేపుట 4) క్షామం తొలుత నిరుపేద రైతులను నమిలిమ్రింగి తర్వాత మధ్యతరగతి రైతులపై దెబ్బతీసింది. ఎంత పేదవాడైతే రైతు అంత త్వరగా తన ఆస్తిపాస్తు లమ్ముకొని, దిక్కులేనివాడై చావవలసివచ్చేది. ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూటుకు చెందిన ఇతరులూ, ప్రొఫెసర్ పి. సి. మహలనోబిస్ జరిపిన విచారణ ఇలా తెలుపుతున్నది:

"వాస్తవస్థితిలో క్షామానికిముందు వరిపంట నిల్వలనుబట్టి చేసిన రైతువర్గీకరణం దాదాపు క్షామపరిస్థితులు అప్పటికేవున్నట్టు సూచించింది."
(1943 బెంగాల్ క్షామంవల్ల కలిగిన ఫలితాలగూర్చి మాదిరీవిచారణ "పుట iii, సంఖ్య 1. వాల్యూం 7, భాగం 4, 1946.)

ఈ క్షామం ఫలితంగా, రైతులు మరింత పేదవారయ్యారు. మరికొంత భూమి పెద్దభూస్వాముల క్రింద, వడ్డీవ్యాపారస్తులక్రింద కేంద్రీకృతమయింది.

ఈ విచారణను బట్టి 1943 ఏప్రిల్‌నుండి 1944 ఏప్రిల్‌వరకు ఒక సంవత్సరంలోగా దాదాపు 15,90,000 కుటుంబాలు (క్షామానికిముందు మాగాణిగల రైతులలో నాలుగో భాగం) తమకున్న భూమిని పూర్తిగానో కొంతో అమ్మివేశారు, లేదా తనఖా పెట్టారు. ఇందులో 2 60,000 కుటుంబాలు పూర్తిగా తమ భూమిని అమ్మివేసి, పొలంలేని కార్మికులలోకి చేరిపొయ్యారు; మరి 6.60,000 కుటుంబాలు తమ భూమిలో కొంతభాగం అమ్మివేశారు; మిగతా 6,70,000 కుటుంబాలు తమ మాగాణిని తనఖా పెట్టారు.

ఇలా తమ భూమిని కోల్పోయిన రైతులలో నూటికి ఒక్కరికి పైగా కూడ తమ భూమిని తిరిగి సంపాదించు కోలేదు. చట్టప్రకారం వారి భూమి వారిదే అన్నప్పటికి కూడ ("బెంగాలు గ్రామాల వినాశస్థితి" పుట 6)

క్షామకాలంలో అమ్మివేసిన మాగాణి 7,10,000 ఎకరాలలో కేవలం 20,000 ఎకరాలు మాత్రమే గ్రామాలలో తిరిగి కొన్నారు. దాదాపు 4,20,000 ఎకరాల మాగాణి ఇలాగా రైతులు కానివారికి, బహుశా సేద్యంచేయని పట్టణాలలో నివసించే షావుకార్ల క్రిందికి ఈభూమి వెళ్ళిఉంటుంది. (మాదిరి విచారణ పుట iv,

ఈతూరి అమ్మకం భూమితోనే ఆగిపోలేదు. ప్రజల జీవితం యావత్తూ విచ్ఛిన్నమయింది. తలిదండ్రులు ఎవరో ఒకరు తీసుకొని పోషిస్తారన్న ఆశతో) తమ పిల్లలను చంటిబిడ్డలను బాటల ప్రక్కన వదిలియవేయవలసి వచ్చింది. భర్తలు తమ భార్యలను, కుటుంబాలను సంఘటనలకు వదిలివేయక తప్పలేదు, స్త్రీలు తమను తాము అమ్ముకొని పడుపు వృత్తికి దిగవలసి వచ్చింది. కలకత్తాకు వచ్చిన దిక్కులేని 1,25.000 మందిలో దాదాపు 30.000మంది యువతులు ఊపిరి నిలుపు కునేందుకై బోగమిళ్ళలో చేరారని అంచనా వేశారు.

లక్షలకొలదిమంది అనాధులయ్యారు. "మాదిరీసర్వే" ప్రకారం, 1944 మే నాటికి బెంగాలులో 10,80,000 మంది అనాధులున్నారు. అందులో 4.80.000 మంది ప్రత్యేకించి యుద్ధమూలంగా. క్షామమూలంగా అనాధులయ్యారు. (అదే, పుట v). ఇక పూర్తిగా అనాధులైపోకుండా, నిరుపేదలైనవారిసంఖ్య 60 లక్షల వరకు పెరిగింది. ("బెంగాలు గ్రామాల వినాశస్థితి" పుట 16).

గ్రామ ఆర్థిక వ్యవస్థంతా భీభత్సమయిపోయింది. గ్రామంలోని చేతిపని వారు - బెస్త, మాదిగ, కమ్మరి, కుమ్మరి, నేతపనివారు క్షామంలో అతిదుర్గతికి

లోనయ్యారు. క్షామపిశాచికి ప్రథమ కబళం వీరే. ఆఖరుకు కేవలం పాపర్లుగా తయారయ్యారు.

ఈ కష్టకాలంలో ఎలాగో బ్రతికి బయటపడినవారుకూడ అనాథస్థితికి పోతున్నారు. చేతిపనులవారు తిరిగి నివాసాలేర్పరుచుకోవడం అసాధ్యమవుతున్నది. వారి అవసరమైన వస్తువులన్నీ - నూలు, ఇనుము, వలలు, చర్మం మొదలైనవి దొంగబజారులోకి వెళ్ళిపోయినవి రైతులకు సాగుచేసేందుకు పశువులులేవు. క్షామానికిపూర్వం పశువులున్న బెంగాలు రైతు కుటుంబాలలో 3,00,000 కుటుంబాలు-నూటికి 8 5 కుటుంబాలు తమకున్న పశువులన్నీ పోగొట్టుకున్నారు. ఈ ఒక్క సంవత్సరంలోను, నూటికి 20 ఎద్దులు నాశనమయ్యాయి, లేదా రైతులు కానివారి చేతుల్లోకి పొయ్యాయి.

అప్పులలో మునిగిపోయిన కుటుంబాలసంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. ఈ క్రిందఇచ్చిన లెక్కలను కిసాన్‌సభవారు తయారుచేశారు. ఇందువల్ల ఇప్పటికీ క్షామతీవ్రతకు గురిఅయిన ప్రాంతాలలోని రైతులఅప్పులు చాల పెరిగిపోతున్నవి.

| | అప్పులున్న కుటుంబాలు నూటికి | |
|---|---|---|
| | 1943 | 1944 |
| రైతుకుటుంబాలు | 43 | 66 |
| వివిధ వృత్తులవారు | 27 | 58 |
| చిల్లర కుటుంబాలు | 17 | 46 |

(అదే, పుట 12)

నేడు రైతు సామాన్యానికి భూమిలేదు, విత్తనాల్లేవు, పశువుల్లేవు. కావలసినవి కొనడానికి తగినడబ్బులేదు; మంచి దేహపుష్టిగలవారెందరో వరసగా రోగాలు తగిలి పూర్తిగా పనికిరానిస్థితికి వచ్చారు. వాస్తవస్థితిలో "ఆస్తిగలరైతు, గ్రామంలోని మోతుబరి రైతుపై-జోతేదారుపై తనభూమికి, పశువులకు, గానుగపిండికి, కడకు విత్తనాల గింజలకుకూడ ఆధారపడవలసి వస్తున్నది. లేకపోతే రైతు దినకూలిగా మారవలసివస్తుంది." (అదే, పుట 10)

బెంగాలు సంఘటనలు, దేశంమొత్తంమీద వ్యాపించిన సంక్షోభంయొక్క తీవ్రస్వరూపం. ఏదేశంలోకూడ ఎక్కువ యుద్ధధరలమూలంగా రైతులు లాభపడరు. ఏకొందరో మధ్యతరగతి రైతులుమాత్రమే తమఅప్పులలో కొంత తీర్చివేయగలిగారు-అధికసంఖ్యాకులు అప్పుల్లో మరింత లోతుకు దిగబడిపోయి తమ భూమిని పోగొట్టుకున్నారు. యుద్ధసమయంలోని రైతు అప్పునుగూర్చి మదరాసు ప్రభుత్వం. డాక్టర్ బి. వి నాయుడు యాజమాన్యంక్రింద ఇటీవల విచారణ నడిపింది. ఈవిచారణలో ఇచ్చిన లెక్కలన్నీ సరయినపరిస్థితిని తెలియజేయడమే లేదు; అవి చాల పక్షపాతయుతమైనవి; ఉదాహరణలు ఇవ్వడంలో ఆదేపనిగా భూస్వాములను చాలవరకు తీసుకున్నారు. కాని ఇలాంటి విచారణకూడ పరిస్థితి ఏవైపుకు వెడుతున్నదో దాచలేకపోయింది, చిన్నరైతులు, కౌలుదార్లు, వ్యవసాయ

కూలీల అప్పులు, యుద్ధఫలితంగా ఎక్కువగా పెరిగిపోయ్యాయన్న అంశాన్ని దాచలేకపోయింది.

యుద్ధకాలం పొడుగునా, అతివేగగమనంతో రైతుల భూమి అన్యాక్రాంతం కావడం జరిగింది. ఇందుతో భారతదేశం శాశ్వత క్షామాలకు, ఆకలిమంటలకు, కాటకాలకు నిలయమయ్యేపరిస్థితికి పోతున్నది. 1946 లో పెద్దక్షామం వెళ్ళిన మూడేళ్ళలోగానే, తిరిగి భారతదేశం క్షామాన్ని ఎదుర్కోవలసి వస్తున్నది ఆహారధాన్యాలు 60 లక్షల టన్నుల కొఱత ఉందని అంచనావేయబడింది. ఇందుతో భారతజనసంఖ్యలోని నాలుగోవంతు ప్రజలు నశించిపోయే ప్రమాదముంది

## 2. వ్యవసాయ విప్లవం అవసరం

కాబట్టి రైతులు అత్యవసర జీవితసమస్యలను ఎదుర్కొంటున్నారు ఆ సమస్యలకు తప్పకుండా వారు పరిష్కారాన్ని కనిపెట్టుకోవాలి.

ఇప్పుడున్న పరిస్థితులలోనే, ఇప్పుడున్న భూమివిధానంలోనే, దానిపై ఆధారపడిన సామ్రాజ్యవాద ప్రభుత్వం క్రిందనే పరిష్కారం దొరుకుతుందా ?

వ్యవసాయ ఉత్పత్తివిధానంలోనే కాక, ఇప్పుడున్న భూమిపంపకం భూమి పన్నుల విధానం పునాదులవరకు తీవ్రమైన మార్పులు జరగాలనేది స్పష్టమే, దానిని అందరు అంగీకరిస్తున్నారుకూడ.

బెంగాలురాష్ట్ర కిసాన్‌సభ, ఫ్లౌడ్ కమిషన్‌కు ఇచ్చిన నివేదికలో ఇలా తెలిపింది.

> "పర్మనెంటు సెటిల్మెంటు, జమీందారులకు అపరిమితమైన హక్కుల నిచ్చింది. ఇందుతో జమీందారీ విధానం గుత్త అధికారంగా, నిరంకుశ రాక్షసపాలనగా రైతులను నలిపివేస్తున్నది.........పర్మనెంటు సెటిల్మెంటౌక ఇనుప చట్టాన్ని నిర్మించింది; అందులో సంస్కరణ అమలు జరపడం సాధ్యంకాదని మా అనుభవం తెలుపుతున్నది. సంస్కరణలు చట్టరీత్యా చేయవచ్చు. కాని ఆ చట్టం కేవలం ప్రభుత్వపు పుస్తకాల్లో ఉంటుందికాని, భూస్వాములకున్న అధికారం మూలంగా అది అమలులోకిరాదు.........తన వివిధరకాల ఏజంట్లయిన భూస్వామి, వడ్డీ వ్యాపారి, పోలీసు మొదలైన వారిద్వారా శాశ్వతంగా ఈ జమీందారీ పద్ధతే తమ్ము భూమినుండి తరిమి వేస్తున్నదని రైతులు భావిస్తున్నారు. ఈ పరిస్థితుల్లో పర్మనెంటు సెటిల్మెంటును రద్దుచేయమనే వాంఛ కేవలం గందరగోళపడి తెలుపుతున్నదికాదు; నేటిభూమి విధానంతో గడపడం అసాధ్యమన్న దృఢపరిజ్ఞానంతోనే ఈవాంఛ బయలుదేరింది."
>
> (మెమొరాండం, పుట 4-5).

భూస్వామి విధానం తప్పక రద్దుకావాలి. మనం ముందు పరిశీలించినట్టుగా భారతదేశంలో భూస్వామ్య విధానాన్ని విదేశ ప్రభుత్వం కృత్రిమంగా స్థాపించింది.

పశ్చిమదేశ వ్యవస్థను ఇండియాలో విదేశ ప్రభుత్వం నిర్మించవలసుకొంది. భారతీయుల సాంప్రదాయంలో దీనికి మూలం లేనేలేదు. ఇందువల్ల, మిగత అన్ని దేశాలకన్న ఈ దేశంలో భూస్వామివిధానం పరిపూర్తిగా పనికిమాలినది. భూమిని నిలపడం, అభివృద్ధి పరచడమనే అవసరపాత్రను తాను నిర్వహిస్తున్నట్టు నటించ డంకూడలేదు. పైగా సంకుచితదృష్టితో ఎక్కువ ఉనకు రావాలని కోరుతూ, భూమిని దురుపయోగంచేసి క్షీణస్థితికి తెస్తున్నది. ఇది కేవలం రైతులపైబడిన పరాన్నభుక్కులవర్గం. పెద్ద ఎస్టేట్ల విషయంలో సేద్యంచేయని భూస్వామి పద్ధతిగాను, ఉపభూస్వాములక్రింద, మరికొందరు పరాన్నభుక్కులైన ఒకారీ వర్గాలతోను ఈ పద్ధతి ఉంటున్నది. ఇప్పటికే అత్యల్పం పండిస్తున్న రైతులపై ఈపరకష్ట జీవస్కులకు స్థానంలేదు. పండిన పంటంతా, మొదట రైతు జీవనానికి, రెండోది సమాజ అవసరాలకు, మూడోది వ్యవసాయాభివృద్ధికి అత్యవసరమై ఉన్నది.

ఇదే వడ్డీ వ్యాపారికీ కొండలుగా పెరిగిన అప్పులకూ వర్తిస్తుంది. వాగా తగ్గించి వేయడం ఆఖరుకు రద్దు చేయడం తప్పదు. కాని ఇవి మాత్రమే చేస్తే ప్రయోజనంలేదు ఒకవేళ ఉన్నా తాత్కాలిక ఉపయోగం మాత్రమే. ఇంమతో పాటు అసలు అప్పులకు కారణమైన పరిస్థితులను నిరోధించే మరొక రకమైన వ్యవస్థ ఏర్పడాలి; వడ్డీ వ్యాపారిపాత్రను నిర్వహించే మరో సంస్థ ఏర్పడాలి. అంటే మొదట రైతునుండి లాగే పెద్దపెద్ద మొత్తాలను తొలగించాలి. ఆర్థిక సౌష్ట వంగల పొలాలను ఏర్పరచాలి రెండోది చౌకగా అప్పుపుట్టాలి. అసలీ అప్పు అవసరాన్నే తొలగించే సమిష్టి వ్యవసాయం ఏర్పడేవరకు ఈ అవకాశం ఉండాలి.

తాత్కాలిక సదుపాయం కోసం పన్నులు, తగ్గించడం గుత్తలు తగ్గించడం, అప్పులు తగ్గించడం వడ్డీ రేటును తగ్గించటం మొదలైన అసంపూర్ణ కార్యక్రమం వెంటనే చేయ వీలున్నదని గుర్తించాలి. ఇలాంటివి రకరకాలుగా రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రివర్గాలు ప్రయత్నించాయి. ఇంకా సమగ్రమైన ప్రయత్నం చేయా లంటే భూమి విధానం యావత్తూ పూర్తిగా పునర్నిర్మితం కావాలి. 30 లక్షల మంది చిన్న భూస్వాములు లేదా ఉప భూస్వాములు అనే పెద్ద వర్గమొకటుంది. వీరు తామే పేదవారు; ఏకొద్దో పట్నవాసాల్లో బ్రతుకుతూ సంపాదించిన "ముసలి తనం పెన్షన్ల" ద్వారా కూర్చిన ధనంతో సామాన్యంగా వీరీ ఆస్తి కూడబెట్టారు. వీరి ద్వారా భూస్వామి విధాన సమస్యంతా మరీ చిక్కుగా పరిణమించింది. ఇందుమూలంగా గుత్తను తగ్గించే తాత్కాలిక చట్టాలన్నీ ముఖ్యంగా పెద్ద భూస్వాములపై పడేట్టు చూడవలసి ఉంటుంది. ఈవిషయంలో శ్రేణీల వారీగా వ్యవసాయ-ఆదాయప్పన్ను వేసే పద్ధతి ప్రయోజనకారి అని సూచింపబడింది. (ఇప్పుడున్న ఆదాయప్పన్ను వ్యవసాయాదాయానికి చెందదు. ఇందువల్ల భూస్వా ములపై ఏ భారమూ పడదు. మరి పరిశ్రమల మీదేమో ఎక్కువ భారం పడుతుంది) పెద్ద భూస్వాముల ఆదాయంపై పెద్దరేటు పన్నువేసి, చిన్న భూస్వాములను ఈ

పన్ను బాధించకుండా చేయవచ్చును. ఇలా చేస్తే ప్రభుత్వాదాయము హెచ్చుతుంది. అందుతో కాంగ్రెస్ ప్రభుత్వమో ప్రజా ప్రభుత్వమో అధికారంలో ఉంటే వ్యవసాయాభివృద్ధికి నిధిని సమకూరుస్తుంది. కాని ఈధనాన్ని ఈపన్నుతోపాటు భూమిపన్ను తగ్గించేందుకు, అందుకు సమానంగా గుత్తను తగ్గించేందుకు ఉపయోగించాలి ఇలా చేయకపోతే రైతు భారాన్ని వెంటనే కొంత తేలిక పరచడం జరగదు. ఇంతకన్నా శాస్త్రీయంగా ఈ భూస్వామి విధానంవల్ల కలిగిన దుష్ఫలితాలను తొలగించాలంటే, ఆర్థిక పునర్నిర్మాణంలో అది భాగంగా జరగాలి. ఆ పునర్నిర్మాణం చిన్న భూస్వాములకు వేరే జీవనోపాధి కల్పించాలి. ఇప్పుడు వ్యవసాయంలో క్రిక్కిరిసిఉన్న ప్రజలకుకూడ తప్పక వేరే జీవనోపాయాలు కల్పించాలి. కాబట్టి వ్యవసాయ-పరిశ్రమల అభివృద్ధి కలిసే జరగవలసి వుంటుంది

ప్రధానసమస్య కేవలం జమీందారీ సమస్యమాత్రమేకాదు. ఇప్పుడున్న భూవిధానంయావత్తు మార్పుచెంది ఒకొకరైతుకున్న పొలాన్ని పునర్విభజించాలి. పోషణకుచాలని పొలాలు ముక్కముక్కలైన భూములవల్ల ఏర్పడిన దుష్ఫలితాలను తొలగించేందుకు పొలాలను పునర్విభజించడం ఎన్నడో జరిగిఉండవలసింది. ఉదాహరణకు బొంబాయిరాష్ట్రంలో నూటికి 48 పొలాలు, అయిదుఎకరాలకన్న తక్కువున్నాయి. అయినా ఇలాంటి చిన్నపొలాల వైశాల్యం మొత్తంరాష్ట్రంలోని భూమిలో 2.4 వంతులుమాత్రమే ఉంది-(అగ్రికల్చరల్ కమిషన్ సాక్ష్యం, వాల్యూం 2, భాగం 1, పుట 76). ఇందుతో భూమిపంపకం ఎంతఅత్యవసరమో బోధపడుతుంది వ్యక్తిగతఆస్తి స్వత్వమనే కీకారణ్యాన్ని ఛేదించి అధిక సంఖ్యాకుల పక్షంగా ఇలా విభజించాలంటే ఆపని విదేశప్రభుత్వం నిరంకుశంగా చట్టంచేస్తే జరిగేపనికాదు-ఒకవేళ ఆప్రభుత్వం చేయదలచుకొన్నప్పటికి ఈపని తమకోసం పోరాడుతూ తమ ప్రతినిధిగాఉన్న ప్రభుత్వం నాయకత్వంక్రింద రైతు సామాన్యమే చొరవతీసుకొని ఈపనికి పూనుకోవలసిఉంటుంది.

ఈ విభజనమాత్రమే అయితే, అది కేవలం వ్యవసాయాభివృద్ధి సమస్యను పరిష్కరించడంలో ప్రాథమిక కార్యక్రమం మాత్రమే అవుతుంది ఆధునిక పద్ధతుల్లో వ్యవసాయ విధానాన్ని పెంపొందించాలి, వ్యవసాయ యంత్రాలను ఉపయోగించాలి. సాగులోలేని విశాలభూభాగాన్ని సాగుకిందికి తేవాలి. అప్పుడే సేద్యం అభివృద్ధి చెందుతుంది. ఈ విషయంలో సెంట్రల్ బ్యాంకింగు విచారణ కమిటీ (అనుబంధం XIII, పుట 700) అంచనా జ్ఞాపకంచేసుకోదగింది. ఇంగ్లీషు ఉత్పత్తి స్థాయికి ఎకరాలో వచ్చేపంట పెరిగితే, జాతీయాదాయం 100 కోట్ల పౌనులు ఏటా ఎక్కువవుతుంది; డెన్మార్కు గోధుమ ఉత్పత్తి స్థాయికి పంట పెరిగితే పౌ. 150 కోట్లు ఏటా హెచ్చుతుంది. (అంటే 1933-34 వ్యవసాయపు పంటల మొత్తం వెలకు అయిదంతలు హెచ్చుతుంది. భారత ప్రజల సగటు నికరాదాయం రెట్టింపవుతుంది.) అలాంటి అభ్యుదయం కావాలంటే, చిన్నచిన్న

పనిముట్లను ఉపయోగించడం పోవాలి, ప్రభుత్వ ఉపేక్ష తగ్గాలి, సమిష్టిగా భారీసేద్యం ఏర్పడాలి.

పెద్దపెద్ద యంత్రాలను ఉపయోగించేందుకు. సేద్యాన్ని భారీగా ఏర్పాటుచడం అవసరమని, సామ్రాజ్యవాద నిపుణులుకూడ 'సిద్ధాంతరీత్యా' అంగీకరించారు.

"మొదట దున్నే యంత్రాలవిషయంలో—అందులో పెద్దవి ఆవిరిమదక, (ఆవిరితో నడిచే మరనాగలి) రోటోటిల్లర్—పరిస్థితిస్పష్టమే. ఆయంత్రాలను విశాలమైన భూముల్లో—అప్పటికి తగినంత పెట్టుబడి ఉన్నచోటనే ఉపయోగించ వీలవుతుంది. అవి ఒకేతీరుగా చక్కగా పనిచేస్తాయి కాని పైకారణాలవల్ల వానిఉపయోగం కొన్నిటికేపనికివస్తుంది. వాని ఉపయోగం పెరగాలంటే, సహకారక్షేత్రాలు ఏర్పడడమొక్కటే మార్గం—అది నేడు చాల దూరంలోని మాట."

(వెన్ నేయర్, ఇంపీరియల్ అగ్రికల్చరల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, న్యూఢిల్లీ, "వ్యవసాయంలో యంత్రాల ఉపయోగం" పైనప్ప వత్రిక, ట్రేడ్ అండ్ ఇంజనీరింగ్ సప్లిమెంటు, ఏప్రిల్ 1938.)

సామ్రాజ్యవాదుల నిపుణుల అభిప్రాయంలో ఆ అభివృద్ధి అందని ద్రాక్షపండు. కాని, శిథిలమైపోయిన రైతులోకంయొక్క భూమిలేని వ్యవసాయ కార్మికవర్గంయొక్క, సాంఘికశక్తులు, అలాంటి అభివృద్ధి భవిష్యత్తులో ఈ నిపుణులనుకున్నట్టు అందని ద్రాక్షపండు కాదని మనకు తెలుపుతున్నవి. ఇక్కడ సోవియట్‌యూనియన్ ఉదాహరణ భారత దేశానికి ప్రత్యేకప్రాముఖ్యమైనది. జారుకాలపు దరిద్రనారాయణులైన రైతులు ఇరవైయేళ్ళల్లో, భూస్వామివిధానం రద్దుచేయడం ద్వారా ప్రాథమికమైన భూమి పంపకంచేసి, రష్యాలో నేడు సౌభాగ్యవంతములైన సమిష్టి క్షేత్రాల నేర్పరుచుకున్నారు.

## 3. ప్రభుత్వసంస్కరణ విధానాల వైఫల్యం

సామ్రాజ్యవాద ప్రభుత్వంక్రింద అలాంటి అభివృద్ధికి ప్రధానవ్యవసాయ సమస్యల పరిష్కారానికి ఏమైనా అవకాశం ఉందా? ఆప్రశ్న అడగడమంటే దానికి సమాధానం చెప్పడమే, అలాఊహించడం పూర్తిగా ఊహాప్రాయమే సామ్రాజ్యవాద ప్రభుత్వంలో బాధ్యులైనవారికి ఇలాంటి సంకల్పం ఉందాఅనేది అలావుంచిన అసలు సామ్రాజ్యవాద ప్రయోజనాలకు నేటి భూస్వామివిధానరక్షణ మధ్యయుగపు వ్యవస్థల రక్షణ అత్యవసరం. ప్రజాకోటికి వ్యతిరేకంగా తమపాలనకు భూస్వాములే సాంఘిక పునాది. అదీకాక భారతదేశాన్ని వెనకబడిన వ్యవసాయ వలసదేశంగా బ్యాంకుల పెట్టుబడిదారులు దోపిడీ చేసేందుకు అటంకంకాబట్టి వ్యవసాయ సమస్యను నేటి ప్రభుత్వం పరిష్కరించబోదు.

అత్యవసరమైన వ్యవసాయ సమస్యను పరిష్కరించేందుకు సామ్రాజ్యవాదం అసమర్థమని సామ్రాజ్యవాదులే ఒప్పుకున్నారు. దీనికి సూచనా మాత్రంగా

వ్యవసాయంపై వేసిన రాయల్‌కమిషన్ విచారింపదగిన అంశాలే తెలియజేస్తాయి. ఈకమిషన్‌ను 170 ఏళ్ళు బ్రిటిష్‌ప్రభుత్వం రాజ్యంచేసింతర్వాత 1927 లో "బ్రిటిష్ ఇండియాలోని వ్యవసాయాన్ని, గ్రామ ఆర్థికస్థితిని" గూర్చి పరిశీలించేందుకు నియమించారు. కాని ఈకమిటీ భూమివిధానాన్ని తగలడానికి వీలులేదని నిషేధించారు. ఇందువల్ల 17 భాగాల నివేదిక, సాక్ష్యాలలోని చిన్నచిన్న సిఫారసులు పరిమితంకావడం తప్పలేదు. ఇదంతా ఆచరణలో నిష్ప్రయోజనం కాకనూ తప్పలేదు. ఈపెద్దపెద్ద పుస్తకాలన్నీ బీరువాల్లో వ్యవసాయపరిస్థితిపై ప్రజలిచ్చిన సాక్ష్యాలకు గనులుగా నిలిచిపోయ్యాయి ఆ నివేదికతర్వాత అతితీవ్రరూపందాల్చిన వ్యవసాయ సంక్షోభాన్ని ఆ నివేదిక ఏ మాత్రం ఆపలేకపోయింది.

ఇలా అసమర్థతను ఋజువుచేసే ఈ రికార్డు, వ్యవసాయ సమస్య విషయంలో సామ్రాజ్యతత్వం ఏమీ చేయలేదని స్పష్టపరిచింది. ఇటీవల అతి పరిమితమైన కార్యక్రమంతో వ్యవసాయ పరిశోధనాలయాలు, కేంద్రాలు స్వల్పమైన డబ్బుతో ఏర్పడ్డాయి. (ఒక చికాగో కోటీశ్వరుడు విరాళమివ్వడంవల్లనే ఇంపీరియల్ అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూటు స్థాపన సాధ్యమయింది; వ్యవసాయశాఖకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలన్నీ కలిసి 1936-37 లో చేసిన మొత్తం ఖర్చు 25లక్షల పౌన్లు- లేదా మొత్తం బడ్జెటులో 1.4% మాత్రమే.) వ్యవసాయ విధానం పెంపొందించుకొనేందుకు తగిన అవకాశాలు రైతులకు లేనంతకాలం, మరీ ఘోరంగా అర్ధాకలితో, బానిసతనం అజ్ఞానాలతో పాతపరిస్థితుల్లో ఉన్న రైతులను పీడనా విధానం అణచివేస్తున్నంతకాలం ఇలాంటి వేవీ రైతులకు ఆచరణలో సహాయం చేయలేవు.

రైతు ఋణం పెరిగిపోవడాన్ని అరికట్టేందుకు చేసిన రైతు సహాయ చట్టాలన్నీ విఫలమయ్యాయని వ్యవసాయ విచారణ కమిటీ నివేదికే చెప్పింది. (పుట 136-7): ఇలాగే కౌలుదార్ల రక్షణకని చేసిన చట్టాలన్నీ భూస్వామి విధాన వ్యాప్తిని అరికట్టలేకపోయినవి; కౌలుదార్లు మరీ కౌలు కివ్వడం, దిక్కులేనంత గుత్తలు వసూలుచేయడం ఆపలేకపోయినవి. "రక్షణపొందిన కౌలుదారు" తామే సామాన్యంగా చిన్న భూస్వాములవుతూ రక్షణలేని కౌలుదార్లను పీడించసాగారు.

పాతకాలపు నీటి వసతులను ఉపేక్షతో శిధిల మయ్యేట్టు చేసిన సంగతి ముందే గమనించాము (చూడు పుట 176-8) ఆతర్వాత 19 శతాబ్ద మధ్యభాగంనుండి ఏర్పరచిన జలాధార వసతులు పెద్ద లాభకారులని చెబుతుంటారు. కాని ఇప్పటికీ మొత్తం నీటిపారుదలగల భూమి-మొత్తం సాగుబడి అయిన బ్రిటిష్ ఇండియా భూమిలో నూటికి 23 వంతులు మాత్రమే (1939-40లో 24,50 లక్షల ఎకరాలలో 550 లక్షల ఎకరాలు మాత్రమే) ఇందులో ప్రభుత్వం ఇరిగేషన్ వసతులు నూటికి 10వంతుల భూమికిమాత్రమే ఉన్నవి (1939-40లో 250 లక్షల ఎకరాలు) ఇవికాక సంస్థానాలలో నీటి పారుదలగల భూమి దాదాపు కోటి అయిదు లక్షల ఎకరాలు. మొత్తం ఇవన్నీ చేరితే 6 కోట్ల 55 లక్షల ఎకరాలభూమి నీటి వసరులు

గరిగిఉన్నది. ఈ సిటికివేసే పన్ను (సామాన్యంగా సిటికివేరుగా పన్ను వేస్తారు) పేదరైతుకు అందుబాటులో ఉండక రైతుకున్న భారాన్ని మరింతఎక్కువ చేస్తుంది; ప్రభుత్వం ఇరిగేషన్‌వల్ల 1918-21లో వితరాదాయం 7-8% 1935-36లో కూడ 5.7%వచ్చింది.

ఒక ప్రభుత్వ శాఖక్రింద ఏర్పడిన సహకార. అప్పుసంఘాల ప్రాతిపదిక పైననే వ్యవసాయ సహకార విధానాన్ని వ్యవసాయంలోని లోపాల నివారణకు ప్రభుత్వం అధిక ప్రయత్నంగా చేసింది. సహకార విధానంపై ప్రభుత్వానికున్న ప్రత్యేకశ్రద్ధకు కారణం, భూమిపని గుత్త తగ్గింపుకిది బాగాఉపయోగపడుతుందనేదే. ఈ అంశాన్ని డార్లింగు తన కొత్త పుస్తకంలో వివరించాడు. పన్నులు గుత్తలు కట్టవద్దన్న కాంగ్రెస్ ఉద్యమాన్ని గూర్చి చెబుతూ డార్లింగు ఇలా అన్నాడు. పంజాబులోని ఒక జిల్లాకు "ఈ తెలివిలేని ప్రచారం వ్యాపించింది." అని "ఈ గ్రామాలలో ఒకే ఒక ఊళ్ళో సహకార సంబంధం ఉన్నదనేది గుర్తుంచుకో వలసిన విషయం" అని వ్యాఖ్యానించాడు. ఇంకా ఇలా వ్రాశాడు.

> "ఇలాంటి ఉద్యమాలకు సహకార విధానం చక్కని విరుగుడు మందు; గత సంవత్సరం 20,000 సహకార సంఘాలు రాష్ట్రంలోని గ్రామాలపై మంచి ఫలితం కల్గించాయి. ఎన్నో పట్టణాలలో అశాంతి రేపిన చట్ట విరుద్ధ ఆందోళన ఈ గ్రామాలకు వ్యాపించకుండా తోడ్పడ్డాయనేందుకు సందేహంలేదు."

(యమ్ యల్, డార్లింగు "పంజాబు గ్రామంలో ధనమూ దరిద్రమూ" 1934 పుటలు 83-4)

కాని పాపం ఈ ఆశలెంతున్నా, రైతులకు అప్పులిచ్చే సహకార సంఘాలు, పేద రైతులవరకు వెళ్ళలేవు. వారికి ఇందులో సభ్యత్వానికి అవసరమైన వసతులు లేవు. ఇవి కేవలం ఇప్పటికే కాస్త బాగున్న మధ్యతరగతి రైతులకే పనికి వస్తాయి. ఆ రైతులకు ప్రజాందోళన ప్రాకకుండా చేయవలసిన అవసరం చాల తక్కువ.

> "ప్రజలలో ఒకవేపు మోతుబరిరైతులున్నారు. వీరు సభ్యులుగా చేరి, అనవసరంగా పరిమితంకాని బాధ్యత (అన్ లిమిటెడ్ లయబిలిటీ) ఎందుకు కల్పించుకోవాలి అనుకుంటారు. మరొకవేపున ఉన్నవారు మరీ నిరుపేదలు. వారికి సభ్యత్వం దొరకదు. కాబట్టి సహకారసంఘాల్లోని జనాభా మధ్యతరగతి రైతులని చెప్పడం అక్రమంకాదు,

(బెంగాల్ రాష్ట్ర బ్యాంకింగ్ విచారణకమిటీ నివేదిక, పుట 69.)

> "మరొక పెద్దఇబ్బంది ఏమంటే, ఎక్కువ సహాయం అవసరమైన రైతులుండే పేద జిల్లాలకు ఈ అప్పుల సంఘాలు ప్రయోజనం లేదు. చిన్నచిన్న ముక్కలైన పొలాలున్నట్టి, వాతావరణం మొదలైన ఇబ్బందుల

వల్ల తమ పొలంతో అప్పులు ఎన్నటికీ తీర్చలేనట్టి రైతులకు, అప్పు లివ్వడం బొత్తిగా లాభంలేదు. ఇందువల్ల బాగాఉన్న ప్రాంతాలలోనే ముఖ్యంగా ఈ అప్పులసంఘాలు జయప్రదమవుతున్నవి."

(అన్‌స్టే, "భారతదేశ ఆర్థికాభివృద్ధి" పుట 202.)

ఇప్పుడున్న పరిస్థితుల్లో, వ్యవసాయ సహకారసంఘాల పరిమితకార్యక్రమం వల్లనే ఈ స్థితి ఏర్పడింది. ఈ వ్యవసాయ సహకారసంఘాలలో 1939-40 లో బ్రిటిష్ ఇండియాలో ఉన్న మొత్తం సభ్యులసంఖ్య 40,98,426 లేదా గ్రామ జనాభాలో నూటికి 1 6 వంతుమాత్రం గ్రామాలలోని కుటుంబాల దామాషాను అగ్రికల్చరల్ కమిషన్ రిపోర్టులో ఈ క్రిందివిధంగా ఉంది (పుట 447.)

## గ్రామ ప్రాంతాల్లోని కుటుంబాలలో వ్యవసాయ సహకారసంఘాల్లో ఉన్న సభ్యుల దామాషా

| | నూటికి |
|---|---|
| బెంగాల్ | 3.8 |
| బొంబాయి | 8 7 |
| మధ్యపరగణాలు | 2 3 |
| మదరాసు | 7 9 |
| పంజాబు | 10 2 |
| సంయుక్త పరగణాలు | 1.8 |

"పంజాబు, బొంబాయి, మదరాసులలో తప్ప, ఈ ఉద్యమం ప్రధాన రాష్ట్రాల్లో చాలతక్కువమంది గ్రామప్రజలకు వ్యాపించిందని తెలుసుకోవచ్చును." అని ఆ నివేదిక వ్యాఖ్యానించింది ఈ దామాషా చూస్తే ఏస్థితిలోని రైతులకు ఇది వ్యాపించిందో తెలుస్తుంది. (బాగా పేదతనం గల బెంగాలు, సంయుక్తపరగణాలలో చాలతక్కువసంఖ్య కనబడడం గమనించాలి.) ఇందువల్ల ఇప్పుడున్న ఇబ్బందులు, బారాలు సాగుతున్నంతకాలం, వ్యవసాయ సహకారసంఘాలు, రైతు సామాన్యంయొక్క సమస్యలను తీరుస్తాయని ఆశించడం సాధ్యంకాదు.

భారత వ్యవసాయ సమస్యల పరిష్కారానికి - ఆ పరిష్కారం భారత ప్రజాకోటి జీవిత సమస్య - భూమి విధానం పునాదులనుంచి పునర్నిర్మాణం కావాలి; అలాంటి పునర్నిర్మాణం సామ్రాజ్యవాదం ప్రయత్నించడం సాధ్యంకాదు: కేవలం భారత ప్రజలే, తమ బాధ్యతాయుత ప్రభుత్వం క్రిందనే ఆ ప్రయత్నం చేయాలి. ఈ అంశాన్ని అందరూ గుర్తించారు. కడకు సామ్రాజ్యవాదాన్ని సమర్థించేవారి వ్రాతల్లోకూడ ఈ భావం వ్యాపించింది

"గ్రామ జీవితాన్ని పునర్నిర్మించడం అత్యవసరమని, రాజకీయ వేత్తలూ, ఉద్యోగులుకూడ అంగీకరించారు. కాని ప్రత్యేకంగా చేసే నివారణోపాయాలు పదేపదే చాలవని రుజువయింది. ఇక విప్లవకరమైన

మార్పులు రావాలి. అందుకు భారతదేశంలో స్వపరిపాలన ఏర్పడేవరకు ఆగక తప్పదు."

(థాంప్సన్, గారెట్ "భారతదేశంలో బ్రిటీష్ రాజ్యస్థాపన, దాని విజయం" 1934 పుట 618.)

"ఒకొకటిగా తీసుకొని, ప్రత్యేక ప్రాంతాలలో విధానాన్నంతటిని, కుటుంబాలకు చెందిన హక్కులను, చట్టరీత్యా వచ్చిన హక్కులనుకూడ 'పూర్తిగా నిర్మూలించివేయడం' ఒక్కటే సరైనమార్గమని కొందరు సూచించారు. ('సంయుక్త పరగణాలలో పొలాల నిర్మాణం' హెచ్. స్టాన్లీ జెవోన్సు రచన 1918. బులెటిన్ 9, అలహాబాదు యూనివర్సిటీ ఆర్థికశాఖ). ఏమైనప్పటికి ఈపని, పూర్తిగా బాధ్యతాయుత ప్రభుత్వం వచ్చేవరకు బొత్తిగా ఆచరణసాధ్యం కాదనిపిస్తుంది."

(అన్ స్టే, "భారతదేశ ఆర్థికాభివృద్ధి" 1936, పుట 101.)

"ఎక్కువగా ఇప్పటికి తెలిసిన అభివృద్ధికర మార్గాలను అమలు జరిపినట్టయితే వ్యవసాయ ఉత్పత్తిలో పెద్ద మార్పు తేవచ్చునన్నది వాస్తవమే. కాని త్వరగా అభివృద్ధిజరిగేందుకు అడ్డగడవున్న ప్రధాన ఆటంకాలన్నీ ఇంతలో తొలగించడం సాధ్యమా అనేది అనుమానమే. ఎందుకంటే ఇందు కవసరమైన సంస్కారణలు, సాంఘిక మత ఆచారాలతో జోక్యం కలిగించుకోవలసి వుంటుంది. అలాంటి పని పాలిత ప్రజల హృదయపూర్వక సహకారమూ, విశ్వాసమూ చూరగొనని యే ప్రభుత్వానికీ సాధ్యంకాదు."

(అదే పుట, 177)

ఈ రకమైన వైఖరికి వెనకాలనున్న ప్రధానసూత్రం సరైనదే. కాని ఇందువల్ల అభివృద్ధి జరగదని, త్వరగా సాగదని వీరుచెప్పే సాకులకు యీ వాదాన్ని ఉపయోగించుకోవడంమాత్రం సరికాదు. ("ఇంకా కొన్నాళ్ళు ఆగకతప్పదు", "అంతవరకు బొత్తిగా ఆచరణసాధ్యంకాదు", "ఇంతలో జరుగుతుందనేది.... అనుమానమే")

ఇప్పుడు అత్యావశ్యకమైన తీవ్రమైన మార్పులు అవసరమేనని అన్నిపక్షాలవారూ అంగీకరించారు. వ్యవసాయంలో, భారత దేశ ఆర్థిక వ్యవస్థలో, జీవితంలో ఈ తీవ్రమైన మార్పులు తామెన్నుకున్న ప్రభుత్వ నాయకత్వంక్రింద ప్రజాసామాన్యమే చేసుకోగలరు. ఆ ప్రభుత్వంలో ప్రజలకు విశ్వాసముండాలి. ప్రజలందరి సహకారాన్ని, స్వేచ్ఛా కార్యక్రమాన్ని ఆ ప్రభుత్వం సంపాదించగలిగి ఉండాలి.*

* అగ్రికల్చరల్ కమిషన్ రిపోర్టులో ఒక ప్రధానమైన ప్రకటన కనిపిస్తుంది. దాని ప్రాధాన్యత, రచయితలు ఉద్దేశించినంతకన్నా ఎక్కువయిందనడంలో సందేహంలేదు:

"అయిదు లక్షల గ్రామాలకు చెందిన సమస్య ఇది. కాబట్టి ఏ ప్రభుత్వమైనాసరే, అన్నిగ్రామాలలోని ప్రతివ్యక్తినీ సమీకరించాలని ఆశించలేదనేది స్పష్టమే. ఇందు కోసం

కాబట్టి ఇప్పుడు అత్యవసరమైన వ్యవసాయ పునర్నిర్మాణం, జాతీయ స్వతంత్రం, ప్రజాతంత్ర స్వతంత్రం సాధించడంతో సంబద్ధమైవున్నది.

## 4. రైతు ఉద్యమ విజృంభణ

ఈ పరిస్థితిలోనే ఇటీవలి సంవత్సరాల్లో రైతుపుద్యమ విజృంభణ భారత దేశంలో ప్రధానమైన అభివృద్ధిని సూచిస్తున్నది.

రైతుల్లో అశాంతి, రైతు తిరుగుబాటులు, భారతదేశంలో బ్రిటిష్‌పాలన క్రింద పదే పదే వస్తున్నవని తెలుసుకోవచ్చును. ఆ ఉద్యమం అనాగరక హాతాల్ పద్ధతుల్లో, రైతుల కోపము, అశాంతి, మొదట్లో వ్యక్తిగతంగా వడ్డీవ్యాపారులపై, భూస్వాములపై కసితీర్చుకోవడంలో, హింసకు పూనుకోవడంలో బయలుపడింది. బొంబాయి ప్రభుత్వపు 1852 నాటి నివేదిక ఇలా వ్రాసింది:

> "మనరాష్ట్రంలోని ఆకొసనా, ఈకొసనా గ్రామంలోని వడ్డీ వ్యాపారులను వాకిపడినవారు ఖూనీచేశారు. ఈ రెండు కేసులూ ఏవో ప్రత్యేకించి అప్పులవారి దౌర్జన్యంవల్ల కలిగిన ఫలితాలుగా చూడరాదు. వడ్డీ వ్యాపారులకు మన రైతులకు మధ్య ఉన్న సంబంధాలు చెడినందుకు ఉదాహరణగా వీనిని తీసుకోవాలని నా అభిప్రాయం. అలాఅయితే, ఒకవేపు తీవ్రపీడన, మరోవైపు దారుణ బాధలు, మనకేం తెలియచేస్తూన్నవి. అనాదిగా ఎన్నో బాధలకు లోనైన ప్రఖ్యాతమైన ఓరిమి, ఇంతకన్నా అక్రమాలకూ, అన్యాయాలకూ అలవాటుపడిన రైతులు, తమకు జరుగుతున్న అన్యాయాన్ని ఖూనీచేసి - తద్వారా తమకు నీచమైన చావువచ్చినా లెక్క-చేయక - తీర్చుకోజూస్తున్నారంటే ఎలాంటి పరిస్థితి ఏర్పడిఉండాలి? వారి న్యాయదృష్టి ఎంతదెబ్బ తినివుండాలి. అలాంటి కార్యానికి పూనుకోవాలంటే వారి శాంత స్వభావం ఎంత ఉద్దీపితమై ఉండాలి? ప్రభుత్వమూ, చట్టమూ తమకు జరిగే అన్యాయాలను తొలగించలేవని వారెంతగా అన్ని ఆశలను వదలుకొని ఉండాలి?"
>
> (సర్ జార్జి విన్గేట్, బొంబాయి ప్రభుత్వ నివేదిక, 1852.)

19వ శతాబ్ది రెండోభాగంలో వచ్చిన రైతు తిరుగుబాట్లలో ప్రధానమైనవి 1855 నాటి సంతాల్ తిరుగుబాటు, 1875 నాటి దక్కన్ కొట్లాటలున్నూ.

కాని 1914-18 ప్రపంచ యుద్ధం తర్వాత యిరవైఏళ్ళలోనూ, ముఖ్యంగా

---

ప్రజలే తమ్ముతాము, సమీకరించుకొనేట్టు చూడాలి ఆ స్థానిక వంఘాలు పెద్దసముదాయాలుగా ఏర్పడాలి. వేరే నిర్మాణం ఏర్పడి, ప్రతిగ్రామానికీ, ఆయాశాఖల నిపుణులు తెలిపే ప్రతి వంగతిని వంపేస్థితి ఏర్పడే వరకు ఇది పనిచెయ్యాలి." (పు. 468)

ఈ తెలివైన మాటల్లో-రచయితలు ఉద్దేశించకనే కేవలం యదార్థ పరిస్థితులనుబట్టి అన్నారు. కాబట్టి మరీముఖ్యం-భావి గ్రామసోవియట్ల నిర్మాణంగూర్చిన ప్రధానసూత్రం ప్రచ్ఛన్నంగా ఇమిడి ఉన్నది.

ప్రపంచ ఆర్థిక సంకటావస్థ, తద్వాతి పదేళ్ళలోనూ రైతు ఆందోళన, పూర్వ మెన్నడూలేనంత వేగంతో, రానురాను తీవ్రతర స్వరూపంతో పురోగమిస్తున్నది. అప్పటికే అలసిపోయిఉన్న భారత వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ, ప్రపంచ ఆర్థిక సంక్షోభంలో మూలమట్టంగా కదలిపోయింది. అందుకు ఫలితంగా ఏర్పడిన విపరీతమైన గుత్తలు, బాకీలకు బానిసలుకావడం, భూములు అన్యాక్రాంతం కావడం ఇవన్నీ దేశమంతటా బయలుదేరిన రైతుఉద్యమాలలో ప్రతిబింబించాయి. రైతులు తమంతటే హఠాత్తుగా — భూమినుండి తమ్ము తరిమివేయడాన్ని విరోధించేందుకు, పన్నివ్వలేనందువల్ల భూమి వేలంవేస్తే బహిష్కరించేందుకు, ఐక్యతతో వడ్డీవ్యాపారులను ఎదుర్కొనేందుకు గ్రామసంఘాలను నెలకొల్పు కున్నారు.

తమవాంఛల ప్రాతిపదిక మీదనే రైతులు కాంగ్రెస్ రాజకీయ పోరాటంలో నికి చేరారు, కాని రాజకీయ పోరాటమెన్నడూ కిసాన్ సంఘాలతో ప్రత్యక్షంగా సంబంధం పెట్టుకోలేదు ఈ సంఘాలను బలపరుచుకొని, తమ మహాసభనొక దానినినిర్మించుకోవడం అవసరమని రైతులు భావించసాగారు. ఈ గ్రామసంఘాలు క్రమంగా జిల్లా సంఘాలతో పరస్పరం సంబంధమేర్పరచుకున్నాయి. జిల్లాసంఘాలు రాష్ట్రసంఘాలను ఏర్పాటు చేసుకున్నవి. కాని ఇవి నిర్మాణయుతంగా పూర్తిగా సంఘటితం కాలేదు.

1936 లో ప్రథమంగా అఖిలభారత రైతు సంస్థ-అఖిలభారత కిసాన్ సభ స్థాపితమైంది-దీని మొదట మహాసభ 1936 లో ఫైజ్‌పూరులో కాంగ్రెస్ మహాసభ జరిగినప్పుడే జరిగింది. సభలో 20,000 రైతులు పాల్గొన్నారు, ఈ సభలో పాల్గొనేందుకు ఎంతోమంది వందల మైళ్ళనుండి వచ్చారు. అందుతో పాటే ఫైజ్ పూర్ కాంగ్రెస్ మహాసభ వ్యవసాయ కార్యక్రమం ప్రకటించింది. ఈరెండుసంస్థల రాజకీయైక్యత ప్రదర్శితమైంది.

అఖిల భారత కిసాన్ సభ, 1938 మే లో కొమిల్లాలో మూడో మహాసభ జరిగే నాటికి ఇందులో 5,50,000 మంది సభ్యులు చేరారు. 20 భాషా ప్రయుక్త రాష్ట్రాలలో ఇప్పటికి 19 ఇంట రాష్ట్ర సంఘాలు ఏర్పడినవి. ఈ మహాసభలో భూస్వామి విధానానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిపే పోరాటం యొక్క ఉద్దేశాలకు తమ తక్షణ వాంఛలకు అనుగుణమైన స్పష్ట కార్యక్రమం ఆమోదించ బడింది.

1937లో కాంగ్రెస్ మంత్రులు ఏర్పడడం రైతు సంఘానికి బలవత్తరమైన ప్రోత్సాహ మిచ్చింది. 1938 సంవత్సరం పొడుగునా భారతదేశంలోని రాష్ట్రాలన్నిటా పెద్దపెద్ద రైతు పోరాటాలు నడిచాయి, చాల వాటిలో గుత్తలు పెంచేందుకు వ్యతిరేకంగా, భూములనుండి రైతులను తొలగించేందుకు వ్యతిరేకంగా వెట్టి చాకిరికి - లంచాలకు వ్యతిరేకంగా గుత్తలు తగ్గించేందుకుగా జరిగిన పోరాటాలు పాక్షికంగా విజయాలు సాధించాయి. అదే సమయంలో 30 000

మొదలు 40 000 వరకు రైతులు పాల్గొన్న యాత్రలు ప్రదర్శనాలు జరిగాయి. వార పత్రికలు, పాటల పుస్తకాలు, కరపత్రాలు వెలువడినవి; రైతుల పాఠశాలలు ఏర్పడినవి. ఇవన్నీ రైతుఉద్యమం విస్మృతమై దృఢతర మవుతున్నదని రుజువు చేశాయి. మంత్రులపై భూస్వాముల పలుకుబడిని విరోధించి. సంస్కరణల కోసం కాంగ్రెస్ మంత్రులపై పెద్ద ఒత్తిడి తేబడింది.

నాలుగో అఖిలభారత కిసాన్ మహాసభ గయలో 1939 ఏప్రిల్‌లో సమావేశమైంది. అప్పటికి కిసాన్ సభలో 8 లక్షల మంది సభ్యులు చేరారు. ఈ మహాసభ రాజకీయ తీర్మానం క్రింది విధంగా ప్రకటించింది.

"భారతదేశపు రైతు నిర్మాణబలం, సంస్థల అభివృద్ధి చైతన్యము గత సంవత్సరం బ్రహ్మాండంగా పెంపొందింది. పూర్వంకన్నా దేశంలోని ప్రజాతంత్ర ఉద్యమంలో రైతులు ఎక్కువగా పాల్గొనడమేగాక, నిరంకుశ సామ్రాజ్యవాద, జమీందారీ పీడనకు వ్యతిరేకంగా తమ అస్తిత్వం కోసం పోరాటం నడుపుతున్న వర్గం తామని రైతులు గ్రహించుకున్నారు. కాబట్టి వారి వర్గసంస్థ చిలువలు పలువలుగా అభివృద్ధిచెందింది. పీడనకు వ్యతిరేకంగా రైతులు నడిపే పోరాటం ఉన్నతస్థాయి నందుకొన్నది. వారెన్నో పాక్షిక పోరాటాలను నడిపారు. వీనితో రైతులలో నూతన రాజకీయ చైతన్యం వెల్లివిరిసింది. తాము పోరాడుతున్న వ్యతిరేకశక్తుల స్వభావాన్ని వారు గ్రహించారు. తమ దరిద్రానికి, పీడనకు నివారణోపాయాలను తెలుసుకున్నారు. ఇతర సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తుల మైత్రితో వారి పోరాటం సాగుతున్నందువల్ల రైతుల దృక్పథం సంకుచితంగాలేదు. కాబట్టి తమ దైనందిన పోరాటం సామ్రాజ్యవాద నిర్మూలనకై పెద్దదెబ్బగా పనిచేయాలన్న నిర్ధారణకు రైతువచ్చాడు తమకు భూములను ఇచ్చేట్టి, తమకూ ప్రభుత్వానికీ మధ్యనున్న దళారీ పీడకులందరినీ నిర్మూలించేట్టి, తమ్ము ఋణబాధనుండి తప్పించి, తమ కష్టాన్ని తాము పూర్తిగా అనుభవించేట్టు చేయగల వ్యవసాయ విప్లవంకోసం తమ పోరాటం సాగాలని రైతు గ్రహించాడు.

"రెండవది, గత సంవత్సరం రాష్ట్ర ప్రభుత్వాలద్వారా రైతులకు చిన్న చిన్న సహాయక కార్యాలు జరిగాయి. ఈ సహాయక కార్యాలు యేమాత్రం చాలలేదు. జమీందారీ ధనికవర్గాలు సృష్టించిన పెద్ద ఆటంకాలను తొలగించుకోవాలి. ఏ ప్రధాన రైతు సమస్యనూ పరిష్కరించేందుకు రాష్ట్ర స్వపరిపాలనం చాలలేదు. అంతటో రాష్ట్రప్రభుత్వంలోని శూరత్వం వెల్లడయ్యింది. జమీందారీ - సామ్రాజ్యవాద పీడననుండి తమ్ము స్వేచ్ఛాస్వతంత్రులుగా చేసుకోవాలని భారతీయ రైతులు నిశ్చయించుకున్నారని ప్రకటించేందుకు కిసాన్‌సభ గర్విస్తున్నది. అందుకు ముందెన్నటికన్నా రైతులు నేడు సర్వ సంసిద్ధులై వున్నారు.

"....నేడు దేశంలోని శక్తులన్నీ సంయుక్తమై — కాంగ్రెస్, స్వదేశసంస్థానప్రజలు, రైతులు, కార్మికులు మిగతా ప్రజాసంస్థలు మొత్తం భారత ప్రజలందరూ ఏకమై ముందడుగు వేయాలి; సామ్రాజ్యవాదప్రభుత్వం ఏర్పరచిన బానిసచట్టంమీదనే పోరాటం సాగించాలి; సంపూర్ణస్వతంత్రం కోసం, భారతప్రజల ప్రజాతంత్ర ప్రభుత్వంకోసం, తద్వారా ఆఖరుకు కిసాన్ మజ్దూర్ రాజ్యం కోసం పోరాటం సాగించేందుకు సమయమేతెంచినదని ఈ కిసాన్ మహాసభ ప్రకటిస్తున్నది"

ఈ గయాసమావేశం జరిగిన కొన్ని నెలల్లోనే యుద్ధం ప్రారంభమయింది. ఇండియా రక్షణచట్టం' క్రింద భారతప్రజలపై నిర్బంధవిధాన పరంపర అమలు జరిగింది కార్మిక కర్షకనాయకులను దేశం మొత్తంమీద నిర్బంధించి, విచారణ లేకనే బందిఖానాలలో త్రోసినారు కాని ఈ నిర్బంధవిధానమెంత ఉన్నా, దేశం పొడుగునా రైతులు, సామ్రాజ్యవాద జమీందారీ విధానాలపై తమ నిశ్చితపోరాటాన్ని సాగించారు. పంజాబులో, లాహోరు; అమృతసర్ రైతులు బ్రహ్మాండమైన యాత్రలు. ప్రదర్శనలు ఏర్పరచి, భూమిపన్ను తగ్గించాలని వాంఛించారు. 5000 మందికి పైగా రైతులు - స్త్రీలతోసహా జైళ్ళలో పడినారు; వారి వాంఛలలో కొన్ని నెరవేరిన తర్వాత ఆరునెలలకు ఈ ఉద్యమం ఆగేలోగా నలుగురు జైళ్ళలోనే మరణించారు. నిరంకుశ పన్నులవిధానానికి, భూములనుండి రైతులను తొలగించేందుకు వ్యతిరేకంగా బీహారు, ఆంధ్ర, బెంగాలు, మధ్యపరగణాలు, సంయుక్తపరగణాలు, మలబారు, సింధు, సుర్మావాలీ మొదలైన ప్రాంతాల రైతులు తీవ్రంగా పోరాటాలు సాగించారు. పలాసాలో 1940 మార్చిలో జరిగిన అయిదవ అఖిలభారత కిసాన్ సభ సమావేశంలో ఈ క్రింది తీర్మానం ఆమోదితమైనది.

....లోకగతిలో మహత్తర కష్టపాత్రులైన రైతులు కార్మికులతోపాటు స్వతంత్ర పోరాటానికి ప్రథమశ్రేణిలో నిలిచి, విదేశ ప్రభుత్వ అధికారాన్ని సవాలుచేస్తారని, దేశ సంపద విదేశాలకు వెళ్ళనీక అడ్డుపడతారని కూడ ఈ సభ విశ్వసిస్తున్నది. అందుకై, బ్రిటిష్ ప్రభుత్వానికి, ఆ ప్రభుత్వానికి ఈ దేశంలో ఆధార స్తంభాలుగా ఉన్న సంస్థానాధిపతులకు, జమీందారులకు, షావుకార్లకు వ్యతిరేకంగా తమ సంస్థల నాయకత్వంక్రింద రైతులు తమ దైనందిన పోరాటాలను వెంటనే ప్రారంభించి, తీవ్రతరం చేయాలి. ఈ పోరాటాలు పెరిగి తీవ్రరూపం దాల్చి, విశాల ప్రాంతాలకు వ్యాపించేకొలది త్వరలో దేశం మొత్తంమీద పన్నుల గుత్తల నిరాకరణ ఉద్యమ రూపం వహిస్తాయి. ఆ ఉద్యమం సామ్రాజ్యవాదంమీద ఆధారపడిన పరశ్రమ భోజనుల ఆర్థికశక్తిని నిర్మూలించి, దేశంలోని బ్రిటిష్ ప్రభుత్వ రాజకీయశక్తినే నిర్మూలించగలదు....".

1942-45 సంవత్సరాలు సమస్త రైతుఉద్యమానికి మహత్ పరీక్షాకాలం. 1942 ఆగస్టులో సామ్రాజ్యవాదం యావత్తు జాతీయ ఉద్యమంపై రాక్షస దమన నీతిని ఉపయోగించింది - కాంగ్రెస్‌నాయకుల అరెస్టుతోపాటు దారుణ నిర్బంధ విధానం కొనసాగింది. ఇందుతోపాటు దేశ ఆర్థికవ్యవస్థ పూర్తిగా విచ్ఛిన్నమై పోయింది భూస్వామి, వ్యాపారులు, నిల్వవ్యాపారస్థులు, దొంగవ్యాపారులు, లంచగొండులైన నిరంకుశోద్యోగులతో చేరుకొని దేశంలోని లక్షలకొలది ప్రజల జీవితాలను విచ్ఛిన్నంచేశారు. రైతు సామాన్యమంతా క్షామంతో వినష్టమయ్యారు. నిరుపేదలైన రైతులు బెంగాలులోను, ఇతర రాష్ట్రాలు కొన్నింటిలోను మలమల మాడి ఈగల్లా చనిపోయారు.

ఇందుతో సంఘటిత రైతు ఉద్యమంపై బ్రహ్మాండమైన బాధ్యతపడింది. ఈ బాధ్యతను నిర్వర్తించడంలో అఖిలభారత కిసాన్ సభ, దాని శాఖలు ఎడతెరిపి లేకుండా జాతీయ నాయకుల విడుదలకు, జాతీయ ప్రభుత్వ స్థాపనకు తీవ్రంగా ఆందోళనచేశారు: ప్రభుత్వనిర్బంధవిధానాన్ని వీరోచితంగా ఎదుర్కొన్నారు: బలవంతంగా యుద్ధనిధి వసూలుచేయడాన్ని ఎదిరించారు: ప్రతి గ్రామంలోను, నిరంకుశోద్యోగిని, దొంగవ్యాపారిని, దొంగనిల్వలు దాచినవారిని ఓడించేందుకు స్వకృషి మీదనే ఆధారపడి అధికాహారోత్పత్తి ఉద్యమాన్ని లేవదీశారు.

ఈ యుగమంతా భారత రైతుల మహత్తర విజయాలతో ఉజ్వలమైంది. ఆంధ్రదేశంలో వేలాది ఎకరాల బీడు భూమి సాగుకు తెచ్చారు. రైతులు తామే ఏకమై పెద్ద ఆనకట్టలు నిర్మించారు. ఉప్పెనలతో ప్రవాహాలతో నాశనంకాకుండా విశాలభూములనురక్షించారు. బెంగాలులో క్షామం తీవ్రతరంగా ఉన్నగడ్డురోజుల్లోనే, మిగులు ప్రాంతాల్లోని రైతులందరూచేరి, తమకున్ననిల్వ ధాన్యాన్నంతా సమీకరించి తరుగుప్రాంతాల్లో ఆకలితో మాడుతూన్న తమసోదరులకు పంపారు. బెంగాలు ప్రజలను క్షామ మృత్యుపిశాచి కోరలనుండి రక్షించేందుకు అఖిలభారత కిసాన్‌సభ దేశవ్యాప్త ఉద్యమాన్ని నడిపింది. దేశంలోని రైతులందరు సమకూడి బెంగాలు సహాయార్థం నిధిని వసూలుచేశారు బెంగాలులోని రైతులు ఆహార సమితులను ఏర్పరచి, దొంగవర్తకులను బయటపెట్టి, దాచిన ధాన్యాన్ని బయిటికిలాగి అఖరుకు అవసరమున్నవారికి దానిని పంచేట్టుచేశారు. స్థానిక ప్రభుత్వోద్యోగులు పెట్టే అటంకాలను, నిర్బంధాలను అన్నిటిని అత్యున్నత ధైర్యసాహసాలతో, విశ్వాసంతో ఎదుర్కొన్నారు.

ఇలా దేశస్వతంత్రం కోసం సామాన్య ప్రజల హక్కులకోసం, ప్రజలకు అందుబాటులో ఆహార ధాన్యాన్ని చేర్పించడంకోసం ఎడతెరిపి లేకుండా పోరాటం సాగించడం వల్లనే అఖిలభారత కిసాన్ సభ అతి ప్రయోజనకారి అయిన ప్రజా సంస్థగాతయారయినది. ఆసభ సభ్యత్వం 1942లో 2,25 781లోనుండి 1944లో 553,427కు 1945లో 8,29,686కు పెరిగింది. యుద్ధానంతరం దరిద్ర భారత రైతు

లోకంలో ఒక నూతన చైతన్యం సంచలించింది. తీవ్రతర మవుతున్న ఆహార
సంక్షోభం, అవసరవస్తువుల కొఱత, విపరీత ధరలు, ప్రభుత్వ దౌర్జన్యాలు, గ్రామా
లలో భూస్వాముల పీడన ఇవన్నీ భారత రైతులను క్రమక్రమంగా మరింత తీవ్ర
కార్యక్రమానికి తమ హక్కుల రక్షణకు పురికొల్పుతున్నవి. వెంటనే జమీందారీ
విధానాన్ని రద్దుచేస్తూ చట్టాలు చేయవలెనని వాంఛిస్తూ రైతులిప్పటికే కిసాన్ సభ
నాయకత్వం క్రింద తామే చొరవ తీసుకొని, జమీందారుల బీడు భూములను
ఆక్రమిస్తున్నారు తమ్ము భూములనుండి తొలగించేందుకు గుత్తలను పెంచేం
దుకు చేసే ప్రయత్నాలన్నింటినీ ఎదిరించి నిలబడి పోరాడుతున్నారు

# నాలుగో భాగం

# భారత ప్రజల ఉద్యమం

# పదవ అధ్యాయం

# భారత జాతీయత ప్రారంభం

"ఈ ప్రతివస్తుందనే ప్రమాదం కాక జనులు రానేవస్తే, అప్పుడది కేవలం కుట్ర కాదు; తామొకజాతి అని ప్రజలందరూ ఆరూపంలో ప్రకటిస్తున్నారన్నమాట. అప్పుడు మన సామ్రాజ్యాన్ని నిలబెట్టుకోవాలనే కోరికలన్నీ సమాప్తిచెందవలసినట్టే. మన ఆశయాలన్నీకూడ అంతమవుతాయి."

జె. ఆర్. సీలీ, "ఇంగ్లాండువిస్తరణ" 1883.

వెనకటి అధ్యాయాల్లో చరిత్రపరిస్థితులలో భారతప్రజలగూర్చి వారి దురవస్థలను ముఖ్యంగా పరిశీలించాము. ఇప్పుడు మరికొంత ఆనందదాయకమైన భాగం మనముందు కనబడుతున్నది —— భారత ప్రజలను చరిత్రకర్తలనుగా మన మిప్పుడు పరిశీలింతాము

ఇంతకుముందు మనంచేసిన పరిశీలన పరిస్థితిని స్పష్టంగా తెలియబరిచేందుకు ప్రయత్నించింది. భారతప్రజల స్వతంత్ర ఉద్యమ పురోగమనానికి సన్నద్ధమై దానిని నడిపేశక్తులను స్పష్టీకరించింది. ఈ ఉద్యమం ప్రథమదశలో విదేశపాలననుండి స్వతంత్రాన్ని సాధించే జాతీయ ప్రజాతంత్ర పోరాటరూపాన్ని తప్పనిసరిగా వహిస్తుంది. భూస్వాములు, వడ్డీవ్యాపారుల కంచుకౌగిలినుండి స్వతంత్రానికై రైతులునడిపే పోరాటంలో ఇది సమ్మిళితమై అందుతోపాటు ముందుకు నడుస్తుంది

భారత జాతీయోద్యమ చరిత్ర అభివృద్ధిచెందుతున్న ప్రజాచైతన్యచరిత్రే. ప్రప్రథమంలో అప్పుడప్పుడే బయలుదేరుతున్న ధనికవర్గంయొక్క, డాక్టర్లు లాయర్లు మొదలైనవారియొక్క సంకుచిత వాతావరణంలో చాలపరిమిత ఆశయాలతో ప్రారంభమైన ఈ జాతీయ స్వతంత్రోద్యమ సమాజప్రాతిపదిక, నేడు చరిత్ర నడుస్తున్నకొద్దీ సమగ్రస్వరూపాన్ని పొందుతున్నది; ఇంతకన్నా తీవ్రమైన సాంఘికస్వతంత్రానికి మార్గాన్ని సరిచేస్తున్నది.

## 1. ఐక్యత - విభిన్నత

మొట్టమొదటనే మనకొక ప్రత్యేక ప్రశ్న ఎదురుపడుతున్నది. ఈప్రశ్నను ఆయా దశల్లో దాని రూపం కొంత మారుతున్నప్పటికి, నేటికి కూడ సామ్రాజ్యవాదాన్ని సమర్థించేవారు పదేపదే అడుగుతున్నారు.

భారత ప్రజలు అనే వారున్నారా ? కులమత విభజనలతోను, భాషా విభేదాల తోను, చాల అసమానమైన సాంఘిక సంస్కృతి స్థాయిలతోను విశాల భారత ఉపఖండ భూముల్లో నివసిస్తున్న విభిన్న వివిధజాతుల, మతాల సముదాయాన్ని "జాతి" అనగలమా, వీరెన్నటికైనా ఒక 'జాతి' కాగలరా ? వీరిని జాతిఅనడం పూర్తిగా భిన్నమైన పరిస్థితుల్లో పశ్చిమ భావాలను కృత్రిమంగా వీరిపై పెట్టడం కాదా ? భారతదేశంలోని ఏకత్వం కేవలం బ్రిటిష్ ప్రభుత్వం బలవంతంగా రుద్దినదేకాదా?

ఈ ప్రధాన సమస్య పరిశీలన అనేక దశలను దాటింది. పాత పద్ధతికి చెందిన సామ్రాజ్యవాదులు భారతజాతి అనేది కేవలం భ్రమ అంటూ జుగుప్సతో త్రోసి పారవేశారు: 20వ శతాబ్దిలో జాతీయోద్యమ శక్తి పెరగడంవల్ల, ఉదార సామ్రాజ్యవాదులు భారతజాతి అస్తిత్వాన్ని గుర్తించవలసి వచ్చింది: ఇది బ్రిటిష్ ప్రభుత్వం సాధించిన విజయమనీ, బ్రిటిష్ ఉదార ఆశయాల వ్యాపనం ఇందుకు దారితీసిందనీ మరో కొత్త వాదాన్ని వీరు చేపట్టారు. మరీ ఇటీవల భారత ప్రజల లోని ప్రజా సామాన్య రాజకీయ చైతన్యం పెల్లుబకడంతో వారి వివిధ జాతి లక్ష ణం సూచితం కావడంతో ఈ సమస్యకు మరో నూతన రూపం ఏర్పడింది. ఈ నూతన రూపాన్ని చక్కగా సరిగా అర్థం చేసుకున్నట్టయితే భారత ఏకత్వానికి ఇది ఏమాత్రం వ్యతిరేకం కాదు. కాని దీనికి హిందువులు ముస్లిములు "రెండు జాతులు"అనే సిద్ధాంతంతో "పాకిస్తాన్" ప్రత్యేకప్రచారకులు అపార్థం కల్పించారు. ఈ వాదాన్ని సామ్రాజ్యవాద సమర్థకులు పరిపూర్తిగా ఉపయోగించుకున్నారు.

జాతీయోద్యమ శక్తి అభివృద్ధి కాకముందు, పై ప్రశ్నకు పాత సామ్రాజ్య వాదులు అనుమానమున్నా ప్రత్యేక ఆత్మవిశ్వాసంతో గట్టిగా నిస్సంకోచంగా సమా ధాన మిచ్చారు.

"భారతదేశ మనేది ఇప్పుడూలేదు. ఎప్పుడూలేదు" అని 1889లో సర్ జాన్‌స్ట్రాచే దృఢంగా చెప్పాడు. జంతు ప్రదర్శన శాలలో జిరాఫీకిబదులుగా నిల బడిన రైతు చెప్పిన ధోరణిలో ఉందిది.

> "భారతదేశాన్ని గూర్చి మొదట ఈ సంగతిని ముఖ్యంగా తెలుసు కోవాలి భారతదేశమనేది ఇప్పుడూలేదు, ఎప్పుడూలేదు భారతదేశం లోని ఏ దేశంలోకూడ యూరపియన్ భావాల ప్రకారం ఏరకమైన - భౌతికం కాని, రాజకీయంకాని, సాంఘికంకాని, మత విషయంకాని ఐక్యతలేదు భారత జాతి అనేది లేదు, 'భారత ప్రజలు' అనేవారు లేరు. మన మీ మాట లూరికే చాలా వింటుంటాము."
>
> (సర్ జాన్ స్ట్రాచే: "ఇండియా: దాని పాలన అభివృద్ధి" 1888, పుట 5,)

సర్ జాన్‌సీలే కూడ తన అభిప్రాయాన్ని స్పష్టంగానే చెప్పాడు.

"రాజ్యాంగశాస్త్రం ముఖ్యంగా తొలగించాలనుకునే ఆ సామాన్య మైన పొరపాటుమీదనే, భారతదేశం ఒక జాతి అనే భావం బయలు

దేరింది. భారతదేశం అనేది రాజకీయ నామధేయంకాదు, అది కేవలం భూగోళనామం మాత్రమే. ఆఫ్రికా, యూరపులాంటిది ఆ ప్రదేశం ఒక జాతికి, భాషకు చెందిందికాదు - చాల జాతులకు చాల భాషలకు చెందిన ప్రదేశమిది."

(సర్ జాన్ సీలే, "ఇంగ్లాండు విస్తరణ" 1883, పుట. 254—7)

సర్ జాన్‌ఫాల్ స్టాఫ్ "గౌరవమంటే ఏమి?" అని ఇలా జవాబిచ్చుకున్నాడు: "ఒకపదం అగౌరవమనే పదంలో ఏముంది; గౌరవమంటే ఏమి? గాలి" అదే ధోరణిలోనే వచ్చి వాస్తవిక ధోరణిలో విదేశపాలననుండి తమ్ము స్వతంత్రులను చేసుకోవాలని కోటానుకోట్ల భారత ప్రజలు చేస్తున్న పోరాటాన్ని మన ఆధునిక సర్ జాన్ "సామాన్యమైన పొరపాటు" అంటున్నాడు ఇలాగే ఆస్ట్రియా సామ్రాజ్యవాదులు కూడ, ఆత్మసంతృప్తికోసం ఇటలీ "ఒక భూగోళ నామం" మాత్రమేనని రుజువు చేసుకున్నారు.

ఇలా గట్టిగా త్రోసిపుచ్చడం పాతకాలంనాడు జరిగేది. అందువల్ల జాతీయోద్యమ ప్రవాహం ఆగలేదు. కాబట్టి కానుటీరాజు సభాసదులు తమ ఎత్తుగడలను మార్చుకున్నారు; మొదట భారతజాతి లేదని నిరాకరించడం, తర్వాత ఆ జాతీయతను అణచడానికి చేసిన సామ్రాజ్యవాద ప్రయత్నాలన్నీ విఫలమయినందువల్ల, భారతజాతి అనేది ఒకటుంటే, ఆ అస్తిత్వం బ్రిటిష్ ప్రభుత్వమే దానిని నిర్మించిందని, అది ఆ ప్రభుత్వానికి విజయమని మరో కొత్తవాదం మొదలు పెట్టారు. ఈ దంబాలు చారిత్రికంగా ఎంతవరకు సమర్థనీయమో వచ్చే సర్గలో విచారింతాము.

భారతదేశంలో ఏకత్వంకాక విభిన్నత్వం ఉంది అని తద్వారా భారతజాతి అనేది లేదనేందుకో, లేక దానిని గుర్తించడానికి ఇంత ఆలస్యంకావడానికీ అదే కారణమని చెప్పడానికే చేసే వాదం ఇప్పటికీకూడ ఇంకా వ్యాప్తిలోనే వుంది. ఈ వాదం మహోజ్జ్వలరూపంలో నేటి ఆధునిక సామ్రాజ్య వాదులు భారత దేశం గూర్చిచేసే ప్రచార పుస్తకం సైమన్ నివేదిక "సర్వే వాల్యూం"లో కనిపిస్తుంది. భారత సమస్యలపై సామాన్య ప్రజలకు విషయ పరిజ్ఞానం కలిగించే పుస్తకమంటూ దీనిని 1930లో ప్రకటించి విరివిగా ప్రచారం చేశారు జ్ఞాపకముంచుకోదగిన ఈ ప్రభుత్వ పత్రం చల్లగా ఇలా ప్రారంభమవుతున్నది "భారత జాతీయోద్యమం అనబడే ఈ ఉద్యమం వాస్తవానికి భారతదేశపు పాటకజనంలోని అత్యల్ప సంఖ్యాకుల ఆశలను ప్రకటిస్తున్నది." ఈ సిద్ధాంతంలో ఏ మాత్రం సూక్ష్మదృష్టి ఉన్నదీ, తర్వాత వచ్చిన 1930-34నాటి శాసనధిక్కారోద్యమ స్వభావమూ, 1937 ఎన్నికల ఫలితాలూ రుజువు చేశాయి. తర్వాత అసైమన్ నివేదిక కేవలం శాస్త్రీయంగా, నిష్పాక్షికంగా పరిజ్ఞానానికై నిజపరిస్థితులను తెల్పడం మాత్రమే తమ ఉద్దేశమని చెబుతూ- పాఠకుని గాబరా ఎత్తించేందుకు ప్రయత్నించింది "భారత సమస్య విశాలమైంది. కష్టతరమైంది" "ఆదేశం

విశాలమైంది - ప్రజలు అసంఖ్యాకులు." "భాషా సమస్య చాల చిక్కుగా ఉంది. అక్కడ 222 దేశభాషలున్నవి." "మరీసంకుచితమైన దిక్కులేనన్ని కులాలున్నవి" "ఆ దేశపు మతాల వైఖరి అనంత విభేదాలతో నిండివుంది" అని వర్ణించింది సైమన్ నివేదిక, అంతేకాదు హిందూ ముస్లిములకు "బొత్తిగా అసలే పడదు", భారతదేశం "దిక్కులేనన్ని జాతుల, మతాల సముదాయం", "వివిధ రకాల ప్రజలు బీరకాయ చిక్కులా కలిసి ఉన్నారు." ఇలాంటి మృదువైన వాక్యాలు ఆ నివేదికలో కుప్పలు తెప్పలుగా ఉన్నవి.

ఇలా ఎందుకు అంటున్నారో వారి ఉద్దేశం స్పష్టమే. సామాన్య పాఠకునికి భారతదేశంలో త్వరగా స్వపరిపాలన ఏర్పరచే ప్రణాళికేదీ సాధ్యంకాదన్న భావం కలిగించాలి. ఆ పాఠకుడు ఈ క్రింది ప్రధానమైన నిర్ణయానికి వచ్చేట్టు ఒప్పించాలి (ఆ సమయంలో సైమన్ రిపోర్టును ఒక సోషలిస్టు పత్రికలో సద్భావంతో విమర్శిస్తూ హెచ్ డబ్ల్యు. నేవిన్సన్ వ్రాసిన మాటలివి )

> "560 స్వదేశ సంస్థానాలు (నామకః స్వతంత్రమైనవి) 222 ప్రత్యేక భాషలుగల జాతులు, రెండు విరుద్ధమతాలకు చెందిన ప్రజలు (బ్రిటిష్ ఇండియాలోనే 16,80,00,000 హిందువులు, 8,00,00,000 ముస్లిములు ఉన్నారు), అస్పృశ్యులనికూడ అనబడే 4,00,00 000 నిమ్నజాతులు ఉన్న ఒక భూఖండానికి ప్రభుత్వ పద్ధతినిగాని, ఒక రాజ్యాంగాన్నిగాని నిర్మించడంలో (విమర్శించడంలోకాదు) తప్పించుకోలేని పెద్ద ఇబ్బంది ఉన్నది....భారతదేశాన్నిగురించి ఆలోచించేవారందరూ మొదట ఈ నగ్న సత్యాలను తెలుసుకొని తీరాలి. ఆయనకు తెలియకపోతే (సైమన్) నివేదిక మొదటి సంపుటి చదవాలి, తనకు తెలీనూ తెలియక, చదవనూ చదవకపోయేవారుంటే తనంతట తను శాంతిగా ఉండొచ్చు-"
>
> (హెచ్. డబ్ల్యు నేవిన్సన్, న్యూ లీడర్ (జూన్ 27, 1930) లో సైమన్ నివేదిక సమీక్ష.)

అతివాదపక్షానికి చెందిన సానుభూతిగల నేవిన్సన్, ఒక 'సోషలిస్టు' పత్రికలో ఇలాంటి నిర్ధారణకు వచ్చాడంటే, ఇలానే కేవలం ప్రభుత్వపత్రికలే కాక ఆకాలపు అతివాదపత్రికలన్నీ — లిబరల్, లేబర్, 'సోషలిస్టు' — ఇలాంటి నిర్ధారణకే వచ్చి ప్రభుత్వప్రచారాన్ని ఉన్నదున్నట్టు అంగీకరించారంటే — ఈ ప్రచార పద్ధతి విజయవంతమైన దనేందుకు వేరే నిదర్శనం అక్కరలేదు. ఎంత నిష్పాక్షికదృష్టి అని, రాజ్యాంగవేత్తలుగా తమ కిష్టంలేని అంశాలనుకూడ గుర్తించవలసి వస్తున్నదని ఎంత నటించినా, ఇందులో సత్యం ఏమీలేదని, ఇది ప్రచారం. పచ్చిప్రచారం. ప్రతివారు భారతదేశాన్నిగూర్చి 'తప్పక తెలుసుకోవాలని' యదార్థ అంశాలు ప్రకటించడం ఇందులో ఏమాత్రం జరగలేదు ; బుద్ధిపూర్వకంగా నిస్సంకోచంగా ఒక ఉద్దేశంతో ఈ అంశాలను ఏరుకొని, ఆ అంశాల వెనకనున్న పరిస్థితికి అపవ్యాఖ్యానాలు చేయడమే ఈ నివేదికలో జరిగింది. నేటి భారతదేశాన్ని

గూర్చి ఆ పరిస్థితులగూర్చిన ఈ ప్రభుత్వప్రకటనలో నేటి భారతదేశ పరిస్థితిని అర్థంచేసుకొనేందుకు ప్రాధాన్యమైనదంతా మాటుపడిపోయినది భారతదేశాన్ని సామ్రాజ్యవాదులు పీడించడం, ఇండియాలో బ్రిటిష్ బాంకుల పెట్టుబడిదారీవిధాన పాత్ర, బ్రిటిష్ పాలకవర్గాలు గడించిన లాభాలు, ప్రజల దురవస్థకు కారణమైన పీడనాపద్ధతులు, విజృంభిస్తున్న ప్రజా పోరాటం (మతకులవిభేదాలను లెక్కచేయకుండా) ఆ పోరాటాన్ని అణచేందుకు సామ్రాజ్యం అవలంబిస్తున్న దారుణ దమన నీతి — వీనికి సంబంధించిన అంశాలన్నీ ఇందులో దాచిపెట్టారు, ఏ విజాయితీగల సోషలిస్టుపత్రికగాని, ప్రజాతంత్ర పత్రికగాని ఈ అంశాలనే ప్రతివారు తప్పక తెలుసుకోవాలి అని వ్రాయవలసింది అలాగా ఈ నివేదిక చేయలేదు. ("సైమన్ కమిషన్....ధైర్యంతో సమగ్రంగా తన పనిని నెరవేర్చింది.... ఈ తొలి నివేదికకు సంబంధించినంతవరకు సర్ జాన్ సైమన్ అతని సహచరులూ ఈ విషయంలో చూపిన జాగరూకతను అభినందించాలి ఎంత జాతీయ అతివాదిగాని, ఇందలి ముఖ్యాంశాలలో చాల పొరపాట్లున్నవని చూపించగలుగుతాడా అని నా అనుమానం"—ఫెన్నర్ బ్రాక్వే - న్యూలీడర్, జూన్ 13, 1930) పైగా భారత ప్రజలకు ఏయేఅంశాలు ప్రతికూలంగా కనిపిస్తాయో వానినే ఎంతో ఆదరంతో ఈ నివేదిక ప్రకటించింది: "విభజించి పరిపాలించు" సూత్రాన్నే అంటిపెట్టుకుంది

బ్రిటిష్ ప్రభుత్వనివేదికలో, తన దేశాన్నిగూర్చిన నిష్పాక్షిక పరిశీలన అనబడే ఈ క్రిందివాక్యాలను అమెరికా పౌరులెవరైనా చదివితే నిజంగా ఆశ్చర్యపడతారు

"అమెరికా భూఖండం విభిన్నవాతావరణంతో, భిన్నభిన్న భూగోళ పరిస్థితులతో, అలాగే వివిధ జాతిమతాలతో నిండివుంది, సామాన్యంగా అమెరికా అని ఒక ఏక ఖండంక్రింద అనే అలవాటు, ఏదో యాదా లాభంగా చూచే బ్రిటిష్ పరిశీలకునికి, ఈదేశంలో విభిన్నజాతులు మతాలు కలగాపులగంగా ఉన్నవన్న అంశం కనిపించదు. ఒక్క న్యూయార్కులోనే వేరువేరు వందజాతులు దాదాపు చూడొచ్చు. ఆ జాతులు అధికసంఖ్యాకులుగా ఉన్నారు. ప్రపంచంలోకల్లా న్యూయార్కు ఒకేసారి పెద్ద ఇటాలియన్ పట్టణం, పెద్ద యూదులపట్టణం, పెద్ద నీగ్రోపట్టణం కూడా అవుతుంది. అలాంటి విభిన్నప్రజలు కలసిఉండడంవల్లనే అతి ఘోరమైన మతకలహాలు జరుగుతున్నవి. ముఖ్యంగా దక్షిణరాష్ట్రాలలో ఇందువల్ల జాతి కలహాలు, ఖూనీలు జరుగుతున్నవి. అవి జరక్కుండా—శాంతిభద్రతల నెలకొల్పగల విదేశ నిష్పాక్షిక ప్రభుత్వం అక్కడ ఉండడంవల్లనే ఆపగలుగుతున్నది. ఉత్తాలోని మార్మన్లువల్ల, మిన్నిసోటాలోని ఫిన్నులవల్ల, మిస్సిసిపిలో దిగిన మెక్సికన్లవల్ల, పశ్చిమతీరంలోని జపానువారివల్ల ఏర్పడని తీవ్రసమస్యలు చికాగో సైనికులలోని విరుద్ధ దళాలవల్ల,

న్యూయార్కులోని చైనా హాంగులవల్ల సామ్రాజ్యప్రభుత్వాన్ని యెదు ర్కొంటున్నవి. ఇక వీరుకాక అమెరికాలో మిగిలివున్న అదిమ నివాసుల సంగతి చెప్పనక్కరలేదు " (1)

అయినప్పటికి ఇదే ధోరణిలోనే సైమన్ నివేదికకూడ భారత పరిస్థితుల పరిశీలనను చేసింది.

ఇంతేకాదు. అమెరికా ప్రజల్లో ఐక్యతసాధ్యం కాదనేందుకు ఇలాంటి వివ రాలు, రుజువులు అమెరికా విప్లవం జరిగేముందు ఇంగ్లీషు వారు చాలమంది ప్రకటించారు. లేకే తన చరిత్రలో ఇలా వ్రాశాడు.

"ఇంగ్లీషు సంతానమైన ప్రజల మధ్య చెదరిపోయి ఉన్న అధిక సంఖ్యాకులైన డచ్చి, జర్మన్, ఫ్రెంచి, స్వీడిష్, స్కాట్, ఐరిష్ ప్రజలు వలసలకు వివిధ ప్రజల సముదాయాలుగా చేసివేశారు. వారిలో ఎన్నో ప్రభు త్వాలు, మత విశ్వాసాలు, వ్యాపార ప్రయోజనాలు, సంఘ వ్యవస్థలు ఉన్నాయి. ఇందువల్ల వీరందరి ఐక్యతా అసాధ్యమని విప్లవం వచ్చేముందు చాలమంది భావించారు."

(W.E.H. లేకే, "18వ శతాబ్దిలో ఇంగ్లాండు చరిత్ర, సంపుటి 4, పుట 12)

ఇంకా అతనిలా వ్రాశాడు.

"ఇక్కడ (అమెరికాలో) చాలమంది ప్రజలు ఇటీవల ఎన్నో దేశాలనుండి వచ్చిచేరారు. వీరు వివిధ మతాలకు చెందినవారు. ఈ దేశం విశాలమైంది. గనక, యాన సౌకర్యాలు బాగా అభివృద్ధి చెందలేదు గనకా, ఈ ప్రజలకు పరస్పర సాంగత్యం చాల తక్కువ. ఇక్కడ ధనార్జనాశ చాల తీవ్రంగా ఉంది గనక, దేశభక్తిగాని, అందరూ ఒక సంఘం అనే భావంగాని, కలిగే అవకాశం బహుశాలేదు "

1759 — 1960 లలో ఉత్తర అమెరికా వలస దేశాల్లోసంచారం చేసిన బర్నబీ ఇలా వ్రాశాడు

(అదే పు. 34)

"ఉత్తర అమెరికాలోని వేరువేరు వలసలకన్నా నిప్పునీరుకూ కొంత ద్వేషం తక్కువన వచ్చును ... ఈ వలసల మర్యాదలు, స్వభావం, మతం, ఆశయాలు చాల విభిన్నమైనవి కాబట్టి, నాకు మానవ స్వభావం ఏ మాత్ర మైనా తెలిసివుంటే నేనిలా అనుకుంటున్నాను: ఈ వలసలను వారంతట వారిని వదలివేస్తే త్వరలో ఈ కొసనుండి ఆ కొసవరకు దేశమంతటా అంతర్యుద్ధంలో మునిగిపోతుంది; మరి ఇండియన్లు, నీగ్రోలు కాస్త ఆలో చనలో వీరినందరినీ నిర్మూలించి వేసేందుకు సమయంకోసం అందోళనతో కాచుకొని ఉంటారు."

---

(1) ఈ పోలికను అక్. షేజ్ అర్నాట్ "సైమన్ కమీషన్ రిపోర్టు" అనే లేబరు మంత్లీజూలై 1930 వ్యాసంలో చూపించాడు. ఆ వ్యాసం చదవదగినది.

ప్రఖ్యాత అమెరికా దేశభక్తుడు ఓటిస్ 1765లో ఇలా వ్రాశాడు.

"ఈ ప్రజలందరు తమ మాతృదేశానికి ద్రోహులు కాకుండా భగవంతుడు చూడాలి. అలాంటి రోజేవస్తే ఘోరదృశ్యం ఆరోజు ప్రారంభమవుతుంది. ఈ వలసలను రేపు స్వతంత్రులనుగా వదిలివేస్తే అమెరికా పూర్తిగా రక్త ప్రవాహంలో అరాజక - గందర గోళంలో మునిగి పోతుంది." (1)

కాబట్టి, భారత దేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వం వదిలిపెడితే "దారుణ బాధా క్రందనాలు అరాజకం" ప్రబలుతుందని (చర్చిల్) చెప్పే ఆధునిక అభివృద్ధి నిరోధకుల జోస్యాలన్నీ పాతకాలపు పాటలను తిరిగి వేదికపై వల్లెవేయడమేనని స్పష్టమౌతుంది.

జాతీయ స్వతంత్ర పోరాటం విజయాన్ని సాధిస్తున్న సమయంలో, సామ్రాజ్య పాలకులు ప్రకటించే యధార్థాంశాలు, స్వార్థయుతమైన జోస్యాలను నమ్మకుండా ప్రతి ప్రజాస్వామ్యవాదులు జాగ్రత్తపడాలి.

ప్రాచీన కాలంలో భారత దేశైక్యత చారిత్రకంగా ఎంతవరకున్నది అన్న సమస్యను చరిత్రకారులకు వదిలివేయవచ్చును. సామ్రాజ్యవాదుల పక్షంగానే జరిగిన ఆధునిక చరిత్ర పరిశోధన యీ యాభైయేళ్ళక్రితం ఏకాస్తో దొరికిన విషయాలనుబట్టి భారతదేశం జాతే కాదనే సీలే, స్ట్రాచేల నిరాకరణలను బలపరచడంలేదు.

"భారత దేశం యావత్తూ రాజకీయంగా ఏకం కావడమనేది ఎప్పటికి సమగ్రంగా లభించకపోయినా, ఆ ఆదర్శంకోసమే ఎన్నో శతాబ్దాలుగా ప్రజలందరూ పాటుపడ్డారు. దేశానికంతకీ ఒకే ప్రభుత్వ ముండాలన్న భావం చక్రవర్తి, రాజు అనే పదాలద్వారా సంస్కృత సాహిత్యమంతటా కన్పిస్తుంది. ఎన్నో శాసనాలలో నొక్కి చెప్పబడింది. మహా భారతంలో వర్ణించినట్టు కురుక్షేత్ర యుద్ధంలో వివిధ జాతులు చేరడంలో, అంతర్గతమైన విశ్వాసమంటే - భారత ప్రజలందరు - పూర్తిగా దక్షిణాదివారుకూడ నిజమైన బంధనాలతో ఏకీభవించి ఉన్నారని, అందరికీ సమానమైన ప్రయోజనాల కోసం వారందరూ ఆందోళన చెందుతున్నారని తేట పడుతుంది. యూరపియన్ రచయితలు విధిగా భారతదేశ ఐక్యతకన్నా, విభిన్నతనే ఎక్కువగా గుర్తిస్తూవచ్చారు - అసాధారణ స్వతంత్ర భావాలుగల రచయిత జోసఫ్ కన్నింగ్‌హాం ఒక్కడే ఈ తెగలో చేరనివాడు. 1845 లో బ్రిటిష్ దండయాత్రను గూర్చి భయపడుతున్న సిక్కులను గూర్చి వర్ణిస్తూ ఆయన (కన్నింగ్‌హాం) ఈ సత్యాంశాన్ని తెలియజేశాడు: "అంతేకాక, కాబూలు

(1) ఇలాంటి ఇతర ఉదాహరణలు చూడాలంటే మేజర్ బి. డి. బాసుగారి "భారత వ్యాపార పరిశ్రమల వినాశం" కలకత్తా, 1935, పు. 254-67లోని "స్వతంత్రమయ్యే సమయంలో భారత దేశమూ, అమెరికా"ను గూర్చిన అనుబంధం చూడండి.

నుండి అస్సాం లోయవరకు, సిలోన్ దీవంవరకు ఉన్న హిందూస్థాన్ ఒక దేశమని, ఒక రాజ్యమని, ఒకే రాజో, ఒకే జాతో ప్రాధాన్యం వహించాలని ప్రజల మనసులలో సహజమైన భావం ఉన్నది;" కాబట్టి భారత దేశం మొదటి నుంచీ కూడ రెండు వేల యేండ్లకు పైబడి ఆదర్శ ప్రాయమైన రాజకీ యైక్యతతో అలరారుచున్నది.

"భారతదేశంలో, భూగోళరీత్యా ఒకచోట ఉండడంవల్ల, రాజకీయ ప్రభుత్వం ఒకటి కావడంవల్ల ఏర్పడేంతకన్నా పేరుల్లుపారిన ప్రధాన ఐక్య తొకటిఉంది. ఇందులో ఏమాత్రమూ సందేహంలేదు. రక్తంలో, వర్ణంలో భాషలో, వేషంలో, ఆచారాల్లో, మతంలో ఎన్నివందల విభేదాలున్నప్పటికి వీటన్నిటికీ అతీతంగా ఈ ఐక్యత ఉన్నది."

(విన్సెంట్ ఎ. స్మిత్, "ది ఆక్స్‌ఫర్డ్ హిస్టరీ ఆఫ్ ఇండియా" 1919 ఉపో ద్ఘాతం పుటలు. ix—x)

ఇప్పుడున్న ఐక్యతస్థాయి మరింత ప్రాముఖ్యమైనది; భారత దేశంలో బ్రిటిష్‌పాలన కొనసాగేందుకు అవసరమని సమర్థించుకొనేందుకై స్వతంత్ర ప్రభు త్వానికి ఆటంకాలంటూ సామ్రాజ్యవాద ప్రచారకులు గొప్పగా ప్రకటించి, నొక్కి చెబుతూ వచ్చిన ఆ విభిన్నతలగూర్చి ఇక్కడ కొంత చెప్పడం అవసరం

## 2. కుల, మత, భాషాసమస్యలు

ప్రతిదేశ ప్రజలకు తమ సాంప్రదాయాలు, ప్రత్యేక సమస్యలు ఉన్నట్టుగానే, భారత ప్రజలపైకూడ పాతకాలపు సాంప్రదాయాల భారం పడివున్నది. ఇంకా మిగిలి ఉన్న మూఢాచారాలూ, విభేదాలూ, అసమానతలూ వీరు తొలగించుకోవలసి ఉన్నది. ఈ సమస్యలను పరిష్కరించి, భారత ప్రజల అభ్యుదయవర్గ నాయకులు భారత ప్రజానీకాన్ని ప్రజాతంత్ర పద్ధతుల్లో అభివృద్ధికరమార్గంవైపు నడిపించేం దుకు వీలవుతుందన్నదే స్వపరిపాలన అవసరమనేందుకు ప్రధాన కారణాలలో ఒకటి. గత యాభైయేళ్ళుగా నడిచిన సంగతులు మనకొక అంశాన్ని స్పష్టపరిచాయి: పై మూఢాచారాలను - అంటరానితనం, కులభేదాలు, మతభేదాలు, అవిద్య మొద లైనవానిని తొలగించేందుకై భారత జాతీయ ప్రతినిధులు ఆందోళన లేవదీశారు. సామ్రాజ్యతత్వం క్షీణదశలో ఉన్న ఇటీవలిరోజుల్లో పై సంస్కరణలన్నిటికి సామ్రాజ్యవాద ప్రభుత్వం వ్యతిరేకిస్తున్నది; ఈ మూఢాచారాలను నిలిపి, మరింత గట్టిపరిచేందుకే ప్రయత్నించింది.

అస్వతంత్రులైన ప్రజల విభేదాలను, అజ్ఞానాన్ని ఆలాగే ఉంచేందుకు తగిన విధానాన్ని అవలంబిస్తూ ఈ ఆచారాలను తీవ్రపరచే పాలనాపద్ధతులను అనుసరిస్తూ బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం బయటికిమాత్రం ప్రజల ఐక్యతకు, స్వపరి పాలనకు ఈ మూఢాచారాలే ఆటంకంగా ఉన్నవని చెబుతూంది. ఇంతకన్నా ఈ ప్రభుత్వానికి వేరే ఖండనం అవసరంలేదు.

నేడు భారతప్రజల ముందున్న తీవ్ర సమస్య మత విభేదాలకు చెందినది. ఈ అత్యవసర సమస్యనుగూర్చి ఈ పుస్తకం 13 వ అధ్యాయంలో (2, 3) సమగ్రంగా చర్చిస్తాను. అధికారులు, ఉద్యోగులు ఎంత కాదన్నప్పటికి, ఈ విభేదాలను రెచ్చగొట్టేందుకే బ్రిటన్ బుద్ధిపూర్వకంగా ఒక విధానాన్ని అవలంభిస్తూ వచ్చిందనేందుకు ఋజువు చూపెడతాను. సైమన్ నివేదికకూడ హిందూ-ముస్లిం ద్వేషం బ్రిటిష్ ఇండియాలోనే ఉన్న ప్రత్యేక లక్షణమని ("నేడు భారత సంస్థానాల్లో ఇందుతో పోలిస్తే మతద్వేషాలు తక్కువ ఉన్నవి." పుట 29) ఈ ద్వేషం బ్రిటిష్ పాలన కాలంలో అభివృద్ధి చెందిందని ఒప్పుకోక తప్పలేదు ("బ్రిటిష్ ఇండియాలో ఒక తరంక్రిందట .... మతద్వేషం పౌరశాంతి భంగకరంగా ఉండేది కాదు. ఉన్నా చాల తక్కువ. కాని సంస్కరణలు, అందువల్ల ఎవరికెంత వస్తుంది అన్న పోటీ హిందూ-ముస్లిం విభేదాలకు ప్రోత్సాహమిచ్చింది" పుట 29) సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని పూర్తిగా నిర్మూలించేవరకు మత సమస్య ఎన్నటికి పరిష్కారం కాదు.

స్వదేశ సంస్థానాల సంగతికూడా ఇంతే, ఈ సంస్థానాధిపతుల అస్తిత్వం, రక్షణ పూర్తిగా బ్రిటిష్ ఆశ్రయం మీదనే ఆధారపడినవి.

ఇక కుల నిబంధనలు, అంటరానితనం గూర్చి, కారటన్ క్లబ్బు సభ్యులు, రంగుజాతుల ప్రతినిధులు తీవ్రంగా కోపోద్దీపితులై చేసే ఖండనలను బ్రిటన్‌లో తోటీలు(పాకీపనివారు) అభిమానంతో చూడడం సహజమే. బ్రిటన్‌లోని పాకీపనివారి స్థితిచాల భిన్నమైనది. వారు మేఫెర్‌లో జరిగే విందులలో కూడ పాల్గొనవచ్చును. భారతదేశంలోని నిమ్నజాతుల, అస్పృశ్యుల సంఖ్యను మరింత రెట్టింపు చేయాలనే సామ్రాజ్యవాద ప్రతినిధులు చూస్తుంటారు. రాజకీయ పరిస్థితి తీవ్రతరం కాని రోజుల్లో ఒక తరం క్రిందట నిమ్నజాతుల సంఖ్య 3 కోట్లు అని సామాన్యంగా చెప్పేవారు. 1910లో వ్రాసిన "భారత సంక్షోభం" అనే పుస్తకంలో వాలెంటైన్ చిరోల్ పై సంఖ్యను 5 కోట్లు అన్నాడు. 1929లో ప్రకటితమైన అన్‌స్టేగారి "భారతదేశ ఆర్థికాభివృద్ధి అనే పుస్తకంలో ఏమీ సాక్ష్యంలేకనే ఈ సంఖ్యను 6 కోట్లు అని ఉంది. ఈ సంఖ్యనే సామాన్యంగా ఉపన్యాసాలలోను పార్లమెంటులోను ఉపయోగిస్తుంటారు. "ఆధునిక భారతదేశం" అనే వ్యాససంపుటిని 1931లో సర్ జాన్ కన్నింగ్ సంపాదకత్వం కింద ప్రకటించారు. ఇది దాదాపు ప్రభుత్వ ప్రకటనగా భావించొచ్చు. ఇందులో "3 కోట్లకు 6 కోట్లకు మధ్య ఈ సంఖ్య" ఉంటుందన్నారు. సైమన్ నివేదిక నిమ్నజాతుల సంఖ్యను 4 కోట్ల 3 లక్షలుగా నిర్ణయించదలచింది. కాని అందుతోపాటు, బెంగాలు, యు. పి. బీహార్, ఒరిస్సాలలో 2 కోట్ల 80 లక్షల మంది ఉన్నారని చూపి "సిద్ధాంతరీత్యా అంటరానివారు అనబడే వారికి, ఆచరణలో అంటరానివారుగా పరిగణింపబడే వారికి సంబంధం సన్నిహితంగాలేదు. ప్రత్యేక విచారణ జరిపినట్టయితే, బళ్ళు, నీళ్ళు, మొదలైన వానిలో సమాన హక్కులు అవకాశాలులేనివారి సంఖ్య, సామాన్యంగా, ఆప్రాంతాల

నిమ్నజాతుల సంఖ్యకంటే ఎక్కువ" (పుట 41) అని వ్రాసింది. ఇందువల్ల సంఖ్య వివాదాస్పదంగా నిలిచింది.

అంటరానితనం పోవాలన్న ఆందోళనను, బ్రిటిష్ ప్రభుత్వంకాక . అభ్యుదయవంతమైన జాతీయోద్యమం ప్రారంభించింది సంప్రదాయసిద్ధంగా అస్పృశ్యులను రానీకుండా ఉన్న దాక్షిణాదిలోని కొన్ని ప్రఖ్యాత దేవాలయాలు. గాంధీజీ ఉద్యమ ప్రోత్సాహంతో అస్పృశ్యులను రానిచ్చాయి. అప్పుడు జనాభా, మతభావాలకు వెగటుగలుగుతుందని; అలా కలక్కుండా చూడడం ప్రభుత్వ పవిత్రకర్తవ్యమని చెప్పి, పోలీసులను అంటరానివారు దేవాలయాల్లో ప్రవేశించకుండా ఆటంక పరిచేందుకు ప్రభుత్వం పంపిన సంఘటనను మనం జ్ఞాపకం చేసుకోవాలి.

అస్పృశ్యుల లేక, నిమ్నజాతులకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఇచ్చి. ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పరచాలని బ్రిటిష్ ప్రభుత్వం ఆదుర్దా. అలా కొత్తవిభేదాలు ప్రవేశపెట్టి జాతీయ కాంగ్రెసును దుర్బలపరచాలని ప్రభుత్వం ఉద్దేశించింది. ఇలా నిమ్నజాతులకు కూడ ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పరిచారు (కాని ఆచరణలో మటుకు, ఈ ప్రత్యేక ఎన్నికలు చాలవరకు పూనా ఒడంబడిక చెడగొట్టింది.) ఇక నిమ్నజాతులపై ప్రభుత్వం చూపే ప్రేమ విషయంలో అస్పృశ్యుల భావాల విషయంలో ప్రభుత్వంకూడ నిమ్నజాతుల నాయకుడుగా, ప్రతినిధిగా అంగీకరించిన నిమ్నజాతి సమాఖ్య నాయకుడు డాక్టర్ అంబేద్కర్ చెప్పిన మాటలను మనం సాక్ష్యంగా తీసుకోవచ్చు. ఆయన అఖిల భారత నిమ్నజాతి మహాసభకు 1930లో అధ్యక్షత వహిస్తూ ఇలా ఉపన్యసించాడు

"బ్రిటిష్ ప్రభుత్వం మన దురదృష్టపరిస్థితులను ప్రచురపరచడం, వానిని నిర్మూలించే ఉద్దేశంతో కాదేమో అనిపిస్తున్నది, అలా వానిని ప్రచారంచేసి, దానిని భారత దేశ రాజకీయాభివృద్ధికి ఆటంకమని సాకుగా చెప్పడంకోసమే బ్రిటన్ చూస్తున్నది."

(డాక్టర్ అంబేద్కర్ అఖిల భారత నిమ్నజాతి కాంగ్రెస్ ఆగస్టు, 1930)

డాక్టర్ అంబేద్కర్ ఇంకా ఇలా అన్నారు:

"బ్రిటన్ రాకముందు అంటరానితనంతో మీరు అధ్వాన్నస్థితిలో ఉన్నారు. మీ అంటరానితనం పోగొట్టేందుకు బ్రిటిష్‌ప్రభుత్వం ఏమైనా చేసిందా? బ్రిటన్ రాకముందు గ్రామంలో మీరు నీళ్ళు తెచ్చుకోవీలులేదు. ఇప్పుడు ఆ బావిలో మీకు హక్కును ప్రభుత్వం ఏర్పరిచిందా? బ్రిటన్ రాకముందు మీరు దేవాలయాలలోనికి వెళ్ళ వీలులేదు. ఇప్పుడు మీరు వెళ్ళ వీలున్నదా? బ్రిటన్ రాకముందు మీరు పోలీసులో చేరవీల్లేదు. ఇప్పుడు బ్రిటన్ మిమ్మి పోలీసులో చేర్చుకుంటున్నదా? సేనలో పూర్వం మీరు చేరవీల్లేదు. ఇప్పుడది మీకు వీలవుతున్నదా? వీనిలో ఏప్రశ్నకు మీరు ఔను అని జవాబివ్వలేరు. ఎన్నోఏండ్లుగా ఎంతో అధికారప్రాబల్యం

గలవారు ఏకొంతో మేలు చేసిఉండవచ్చు. కాని మీ స్థితిలో ఏపెద్దమార్పు జరగలేదు. మీ విషయంలోమట్టుకు బ్రిటన్ పాతపరిస్థితినే చెక్కుచెదర కుండా నిలబెట్టింది. ఒక చైనా దర్జీకి కుట్టునమూనాకని పాతకోటొకటి ఇవ్వగా, కొత్తకోటునుకూడ ఆ నమూనాలాగే కంతలు, కుట్లు అన్నీపెట్టి సరిగ్గా అలాగే తయారుచేశాట్ట. అలాగే ఉంది బ్రిటన్ చేసినపని. మీకున్న బాధలన్నీ అలాగే ఉన్నవి. వానిని బాగుపరిచేందుకు ప్రభుత్వం ఏమీ చెయ్యలేదు. ........

"మీ కష్టాలను మీరుతప్ప ఎవరూ తొలగించలేరు. మీకు రాజకీయ అధికారం చేతికిరానిదే మీరూ వానిని తొలగించలేరు. ఇప్పటిలాగే బ్రిటిష్ అధికారం ఉన్నంతవరకు రాజకీయ అధికారం మీకురాదు. స్వరాజ్య రాజ్యాంగ శాసనంలోనే అధికారం మీ చేతులలోకివచ్చే అవకాశం ఏదైనా ఉండాలి. ఆ అధికారం రానిది మీ ప్రజలను విముక్తులను చేయడం పొసగదు."

నిమ్నజాతుల వాంఛలు, వారి విముక్తి, సర్వసమాన స్వతంత్ర జాతీయోద్యమంతో పైన వేసుకున్నది.

ఈ కుల నిర్బంధాలన్నీ ఉపదేశాలవల్ల, ఖండనవల్లకాక, ఆధునిక పరిశ్రమలు పెరగడంద్వారా, ప్రజాతంత్ర ప్రభుత్వం ఏర్పడడంద్వారా తొలగిపోగలవు. అప్పుడు పాత సాంఘిక సంబంధాలస్థానే నూతన బాంధవ్యాలు ఏర్పడుతాయి. మార్క్సు ఇలా వ్రాశాడు.

"భారతదేశ అభివృద్ధికీ, అధికారానికీ గట్టి ఆటంకాలుగా భారతదేశ వర్ణవ్యవస్థ ఉన్నది. ఈ వ్యవస్థ సంప్రదాయానుగతంగా వస్తున్న శ్రమ విభజనపై ఆధారపడి ఉంది. నూతన పరిశ్రమలు ఈ శ్రమ విభజనను నిర్మూలించివేస్తాయి."

(మార్క్సు, "ఇండియాలో బ్రిటన్ పాలన-దాని ఫలితాలు." ట్రిబ్యూన్, ఆగస్టు 8, 1853)

70 ఏళ్ళక్రిందట మార్క్సు చెప్పిన ఈజోస్యం, అప్పుడే నిజమవుతున్నట్టు జనాభాలెక్కల నివేదిక అప్పుడే సాక్ష్యమిస్తున్నది :

"ఆధునిక పరిశ్రమలు పనిచేస్తున్న జంషెడ్‌పూర్‌వంటి తావుల్లో, అన్నికులాల, మతాల మనుష్యులు ఒకరిప్రక్క నొకరుచేరి, ప్రక్కవారి కులవివక్షత లేకుండా మిల్లుల్లో పనిచేస్తున్నారు."

(బీహార్, ఒరిస్సా జనాభా నివేదిక, 1921)

అస్పృశ్యులను, కులహీనులను - "నిమ్నజాతులను" — ఈ మాటే అధికారులు వీరికి ఉపయోగిస్తున్నారు - అణచి ఉంచిన ప్రత్యేక నిర్బంధాలవల్ల చాల పెద్ద సమస్యలు బయలుదేరుతున్నమాట వాస్తవం. ఈ ప్రత్యేక నిర్బంధాలు, కష్టాలవల్లనే, షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషన్ కొన్ని ప్రాంతాల్లో, కొంతవరకు

నిర్మాణయుతమైన బలాన్ని పొందగలిగింది. కాని ఈ సమస్యలు, కార్మిక ప్రజా తంత్ర ఉద్యమాలు అభివృద్ధి చెందడంద్వారా, ప్రజాతంత్ర జాతీయోద్యమం ఈ నిర్బంధాలకు వ్యతిరేకంగా పోరాడడంద్వారానే పరిష్కారం కాగలవు. అంతే కాని ప్రత్యేక ఆర్థిక రాజకీయ ఉద్యమాన్ని ఈగ్రూపులు ప్రత్యేకించి నడిపేసంస్థల వల్ల సమస్యలు పరిష్కారంకావు.

ఇక భాషా విభేదాల సంగతి "222 ప్రత్యేక భాషలున్నవి " అనేదీ అంతే ఇందులో కూడ ఈ ఇబ్బందిని మహాపెద్దగా అతిశయోక్తులుగా సామ్రాజ్యవాదులు ప్రచారం చేస్తూ, అమాయకులను తప్పుడుదారి పట్టించే విధంగా లెక్కలు చూపు తున్నారు. ఒక్కొకరు ఒకోవిధంగా లెక్కలు చూపి 16 నుండి 300 భాషలవరకు ఉన్నాయని అంచనావేస్తున్నారు ఈ అంచనాల వెనకఉన్న రాజకీయ ఉద్దేశాలు పై లెక్కలు ఒకొకటి ఒకొక విధంగా ఉండడం వల్లనే బయటపడుతున్నవి. 1901 జనాభా లెక్కలలో 147 భాషలున్నట్లు తేలింది. ఇక సైమన్ నివేదిక ఉపయోగిం చిన 1921 జనాభా లెక్కలలో, జనాభా 29 కోట్ల 20 లక్షలనుండి 31 కోట్ల 60 లక్షలకు పెరిగింది. (కొత్త విదేశ జనాభా ఏమీరాలేదు.) మరి భాషలు మాత్రం 1901లో 147 ఉన్నయి. 1921 లెక్కల్లో 222కు పెరిగాయి (ఏ కొత్త ప్రాంతం కూడ కొత్తగా చేరలేదు) భారత ప్రజలు ఒకేఒక తరంలో ఇన్ని కొత్త భాషలను ఎలాసృజించ గలిగారో! నిజంగా వారిశక్తి ఆశ్చర్యం కలిగిస్తుంది.

కాని ఈ "222 భాషల" పురాణగాధను మరింత సూక్ష్మంగా పరిశీలించి నట్టయితే ఇందులో సంగతి మరింత స్పష్టమవుతుంది. ఈ భాషావైవిధ్యం భారతీయే తర ప్రజలను బాగా సమ్మోహింప జేసింది. *

ఈ ప్రత్యేక భాషలు 222లో దాదాపు 124 భాషలు "టిబటో-బర్మన్ ఉప కుటుంబా"నికి చెందినవి ఈ 'భాషల' లక్షణమేమిటి? ఇండోచైనా భాషలు 103 పూర్తిజాబితా చూస్తే మనకు బోధపడుతుంది. ఈ జాబితా 1909 "ఇంపీరియల్ గజెట్ ఆఫ్ ఇండియా" వాల్యూం 1, పుట 390-394 లలో ప్రకటితమయింది. ఈ జాబితాలోని 103 భాషలు ఎంతెంతమంది ప్రజలు మాట్లాడుతారో ఇచ్చారు. ఉదాహరణకు ఈ క్రింది లెక్కలు కనిపిస్తాయి

| భాష | మాట్లాడేవారి సంఖ్య |
|---|---|
| కాబూయీ | 4 |
| ఆంద్రో | 1 |
| కాసూయీ | 11 |
| ట్రానూ | 15 |

* "భారతదేశపు తప్పుడులెక్కలు — సామ్రాజ్యవాద ప్రచారం" అనే వ్యాసం లేబర్‌మంత్లీ సెప్టెంబరు 1930 లో ప్రకటితమైంది అందులో ఈ లెక్కలను సమగ్రంగా పరిశీలించడం జరిగింది. వివరాలకు ఆ వ్యాసం చూడాలి

| | |
|---|---|
| ఆకా | 26 |
| తైరాంగు | 12 |
| నోరా | 2 |

భాష అంటే మనుష్యులు పరస్పరం భావ వినిమయానికి ఉపయోగించుకొనే సాధనమనే తాత్విక నిర్వచనాన్ని ఒకడే ఉపయోగించే ఆంగ్రో భాషనుబట్టి మార్చ వలసి ఉంటుంది అనేది స్పష్టమే; నోరా భాష మొత్తంమీద ఇద్దరు మాట్లాడుతారు గనక ఎలాగో భాష అయిపోయింది.

ఈ సామ్రాజ్యవాదుల ప్రచారాన్ని బట్టబయలు చేసేందుకు వివరంగా పై భాషలను పరిశీలిస్తే ఈ అంశాలు తేలుచున్నవి:

(1) ఇండో-చైనా భాషా కుటుంబానికి చెందిన చాల "భాషలు" 1901 లో 92 నుండి 1921 కల్లా 145 భాషలైనవి; (2) ఈ భాషలన్నీ భారతదేశంలో మాట్లాడేవి కానేకాదు హిమాలయాలలోని బర్మా, చైనా సరిహద్దులలోనూ ఇవి ఉన్నవి; (3) ఇందులో అత్యధికసంఖ్య భాషలు కానేకావు. కొన్ని మరీ అల్ప మైన ప్రాంత భాషాభేదాలు లేదా కొన్ని అడవిజాతి గుంపుల పేర్లు; (4) ఈ గ్రూపులోని 103 భాషలలో 17 భాషలను మాట్లాడేవారి మొత్తంసంఖ్య 100—39 భాషలు మాట్లాడేవారు 1000 లోపు 65 భాషలు మాట్లాడేవారు 10,000 లోపు; 3 భాషలు మాట్లాడేవారు 50,000 లోపు—97 భాషలు మాట్లాడేవారు 200000 లోపు. ఈ గ్రూపులోని భాష అసలు బర్మీస్ ఒక్కటే.

అయినప్పటికి యిలాంటి లెక్కలనే తీసుకొని "222 ప్రత్యేక భాషలు భారతదేశంలో ఉన్నవి"అన్న పెద్ద లెక్కను ప్రకటించారు. ఈ సంఖ్యను, ఉప న్యాసాలలో, పత్రికల్లో, పార్లమెంటు చర్చల్లో స్వేచ్ఛగా ఉపయోగిస్తున్నారు.

ఆ తర్వాత 1931 జనాభా లెక్కలలో ఈ భాషలసంఖ్య 203 కు దిగి పోయింది; ఒకరు, ఇద్దరు, నల్గురు మాట్లాడేభాషల ప్రజలు ఈమధ్యే దురదృష్టవ శాత్తు చనిపోయారు. ఆబుద్ధిలేని పనిమూలంగా పాపం సామ్రాజ్యవాదుల వాదబలం తగ్గించారు; స్వరాజ్యానికి తగరనేందుకు సాధ్యమైనన్ని ఎక్కువ భాషలున్నాయని చూపే సామ్రాజ్యవాదులకు కొన్ని భాషలసంఖ్య తగ్గిపోయింది. 1937 లో ఇండియా నుండి బర్మాను వేరుపరచడంలో ఈ భాషలు మరికొన్ని అంతమయ్యాయి. భారత ప్రజలలోని విభేధాలను రుజువుచేసేందుకు ప్రభుత్వం ఉపయోగించే ఈ ప్రత్యేక భాషలలో ఎక్కువభాగం (128) బర్మాకు చెందినవే. మరి బర్మాను వేరుపరచా లనుకునేటప్పటికి, వివిధభాషలున్నవనే ఆటంకం అకస్మాత్తుగా తొలగిపోయింది. బర్మాభాషలన్నింటిలో ఏకత్వం ప్రభుత్వానికి కనిపించింది. "ఈ రాష్ట్రంలో 128 దేశీయభాషలు ఉన్నప్పటికి దాదాపు జనాభాలో 10 లో 7 వ వంతు ప్రజలు — ఈ దామాషా ఇంకా పెరుగుతున్నది —బర్మీస్‌భాషను లేదా అందుకు అతి సన్నిహితమైన భాషను మాట్లాడుతున్నారు" అని సైమన్ నివేదికలో వ్రాశారు.

(పుట 79). తమ విధానాన్నిబట్టి ఎటుబడితే అటు మార్చుకొనేందుకు ఎంత వీలుగా సామ్రాజ్యవాదుల లెక్కలుంటాయో చూడండి.

భారతదేశానికి సామాన్యభాషగా హిందూస్థానీని ఏర్పరచడానికి అప్పుడే ప్రయత్నం జరుగుతున్నది. (లిపినిబట్టి హిందీ, లేక ఉరుదూ.) ఇదే కాంగ్రెస్ దేశభాషగా అంగీకరించింది. భారతప్రజలలో ఎక్కువమంది ఈభాషను మాట్లాడు తారు, లేదా అర్థంచేసుకుంటారు. "హిందూ మతగురువులు, ముస్లిం మౌల్వీలు తమ మతబోధనలను భారతదేశమంతటా హిందీలోను, ఉర్దూలోను చేస్తుంటారు. చదువురాని ప్రజలు వానిని అర్థం చేసుకుంటారు" అని గాంధీజీ వ్రాశాడు. ("ఉపన్యాసాలు - వ్రాతలు" పుట 398). ఇలాగే '222 ప్రత్యేకభాషల' అర్థం లేని వాదాలు మిలటరీలో లేవు. సైనికులకు ఉత్తర్వులు హిందూస్థానీలో ఇస్తారు. ఇంగ్లీషే భారతదేశానికి సామాన్యభాషగా పనికివస్తుందనే భావం అర్థంలేనిది : ఒక శతాబ్దం ఇంగ్లీషుచదువు చెప్పింతర్వాత నేడు ఇంగ్లీషు వ్రాయడానికి, చదువ డానికి వచ్చినవారు కేవలం నూటికి ఒక్కరే ఉన్నారు. (35 లక్షలు - 1931 జనాభాలెక్కలు.) ఇందుకు వ్యతిరేకంగా వివిధప్రాంత భేదాలతో దాదాపు 12 కోట్ల ప్రజలు మాట్లాడే హిందూస్థానీ క్రమంగా వ్యాపిస్తున్నది." (జవహర్లాల్ నెహ్రూ "భారతదేశము - ప్రపంచము" పుట 188). భారతదేశంలోని భాషల సమస్య కేవలం 12 లేక 13 భాషలకు మాత్రమే సంబంధించింది. ("భారత దేశంలో 12 ప్రధానభాషలున్నవి" సర్ హెన్రీకోర్టు బట్లర్ "మోడరన్ ఇండియా" లో 1932, పుట 8). అందులో 9 ఉత్తర హిందూస్థాన్ భాషలు చాల సన్నిహిత మైనవి. కాబట్టే జనాభాలెక్కల నివేదికకూడ ఇలా అంగీకరించక తప్పలేదు.

> "ఉత్తర-మధ్యహిందుస్థానంలోని ప్రధానభాషల్లో ఒక సామాన్యత ఉన్నమాట వాస్తవం. ఎక్కువభాగం బుద్ధిపూర్వకంగా మార్చకనే ఈ భాషలు ఒకరికొకరికి అర్థమయ్యేస్థితిలో ఉన్నవి. ఈ సామాన్య ప్రాతి పదికమూలంగా భారతదేశంలోని ఎక్కువభాగంలో దేశభాష అప్పుడే ఏర్పడుతున్నవి."
>
> (సెన్సస్ ఆఫ్ ఇండియా 1921, వాల్యూం 1, భాగం 1, పుట 99)

సైమన్ కమిటీ నివేదికలో ఈ వాక్యాలను ఉదహరించే ఉంటే ఎక్కువ విజాయితీగలది అని అనిపించుకునేది. తమకు తెలిసే అపార్థాలు కల్పించేలాగా వ్రాయకుండా వదిలివేయ వలసింది.

భారత ప్రజల ఐక్యతకు, స్వరాజ్యం వైపు త్వరగా అభివృద్ధి చెందటానికి తప్పని ఆటంకాలుగా చిత్రించబడే ఈ ప్రత్యేక సమస్యలు జాతీయ రాజకీయ వేత్తలు పరిష్కరించ వలసినవి; పరిష్కరింప వీలైనవికూడ. వీనిని మన మిక్కడ సామ్రాజ్యవాదుల బూటకపు ప్రచారం బట్టబయలు చేసేందుకే వివరంగా పరిశీలిం చాలి. ఇలాంటి ప్రచారానికి గురి కావద్దని భారతదేశం వెలుపలనున్న ప్రజాతంత్ర వాదులను హెచ్చరించడానికి పరిశీలన పనికి వస్తుంది.

భారత జాతి అనేది ఒకటి ఉన్నదని. సామ్రాజ్యానికి వ్యతిరేకంగా, స్వతంత్రం కోసం, తమ రాజకీయ భవిష్యత్తును తామే నిర్ణయించుకునే హక్కు కోసం పోరాటం సాగించడంలో భారత ప్రజలలో నిజమైన ఏకీభావం ఉన్నదనే అంశాలు, లెక్కలు పండితుల గదుల్లోగాని, పార్లమెంటు చర్చల్లోగాని, నిర్ణయించడం సాధ్యంకాదు. ఈ లెక్కలూ, చర్చలూ పై అంశాలను. రుజువు చెయ్యనూలేవు, త్రోసిపుచ్చనూలేవు. గత పాతికేళ్ళ అనుభవంతో కార్యరంగంలో యీ అంశాలు రుజువయినవి, అవుతున్నవి అని మనం చెప్పవచ్చును వైవిధ్య సమస్యలులేక భారత ప్రజలలోని వివిధ జాతుల లక్షణాలు ఈ ప్రధాన ఐక్యతను వ్యతిరేకించవు. ఈ జాతి సమస్యలను భారత ప్రజలు స్వయంగా పరిష్కరించుకోదగినవి, వారే పరిష్కరించుకుంటారు కూడ.

## 3. భారత జాతీయతకు ప్రారంభం

భారతదేశం జాతికాదన్న పాతవాదపు ప్రతిధ్వనులు ఇంకా వినబడుతున్నప్పటికీ, ఇప్పుడు ఆచరణలో భారతజాతి యదార్థత్వాన్ని ఖండించడం సాధ్యంకాదు. ఇందుమూలంగా ఒకతరంక్రింద భారతదేశం జాతిగా ఉండ వీలు లేదని, ఇండియా కేవలం "భూగోళప్రాంతానికి పేరు" మాత్రమేనని గట్టిగా వాదిస్తూవచ్చిన తమ మాటలన్నిటిని మరచిపోయి, సామ్రాజ్యవాదులు మరో క్రొత్తవాదం లేవదీశారు. భారతజాతి అనేది ఒకటుంటే, అది బలవంతంగా తన్ను గుర్తింపజేసుకుంటే, ఈ జాతి అస్థిత్వానికి సామ్రాజ్యవాదమే మూలమంటున్నారు సామ్రాజ్యవాదం భారత జాతీయచైతన్యాన్ని ప్రభవింపజేసి, ఇండియాలో ప్రజాతంత్ర భావాలకు బీజం వేసింది అని వారి వాదం. పైగా ఇలా జాతీయతను సృష్టించడమే బ్రిటిష్ పరిపాలన ఆదర్శమని, తొలినుంచీ ఇందుకే బ్రిటన్ పనిచేస్తున్నదని, అదోమాదిరి పరస్పర విరుద్ధభావాన్ని వీరు ప్రచారం చేస్తున్నారు.

> "రాజకీయ భావాలు గల భారత ప్రజలు మన భావాలతో పుట్టిన సంతానమే. మనం వారి ముందుంచిన అభిప్రాయాలను వారు ఆకళించుకున్నారు. ఇందుకు వారిని అభినందిస్తున్నాము. నేడు భారత దేశంలో బయలుదేరిన భావనైతిక ఆందోళనను మనం దూషించ పనిలేదు అది మన కార్యక్రమానికి అదొక అభినందనమే."
>
> (మాంటేగూ - చెమ్సుఫర్డు రిపోర్టు, 1918, పుట 115)

ఇందువల్ల వీరు చెబుతున్నదేమిటి? సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా విజృంభిస్తున్న భారత ప్రజా పోరాటంకాదు. సామ్రాజ్యవాదుల భూతదయాపర కార్యక్రమమే భారత ప్రజలను స్వరాజ్యం వైపు నడుపుతున్నదట! ఇలాంటి చిత్రాన్నే, నేడు సభ్యతగల సామ్రాజ్యవాది, బయట ప్రజలను మభ్య పెట్టడానికి తన ఉపన్యాసాల్లో చెబుతుంటాడు. పాతకాలపు మాటలు ఇప్పుడు చాల అరుదుగా

కనిపిస్తాయి. (పాతమాటలకు ఉదాహరణలు, జైన్‌సన్‌హిక్స్ ప్రకటన ; "మనం భారతీయుల కోసమని ఇండియాను జయించలేదు, భారతీయుల స్థాయిని హెచ్చించేందుకు ఇండియాను గెలిచామని మిషనరీల సభల్లో చెబుతుంటారని నేనెరుగుదును. అది కాదు; మనం ఇండియాను కత్తితో గెలిచాము-కత్తితోనే పాలిస్తాము. దానిని బ్రిటిష్ వస్తువులకు ఉత్తమమైన బజారుగా కాపాడుకుంటాము." లేక లార్డు రోథర్మీర్ ప్రకటన చూడండి. "బ్రిటన్‌కు ముఖ్యమైన వ్యాపారం, బ్యాంకింగు, నౌకావ్యాపారం ఇండియామీదనే నూటికి 20 వంతులు ఆధారపడిఉన్నదని చాలమంది అంచనా వేస్తున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యానికి ఇండియా ఆధార స్తంభం. మనం ఇండియాను పోగొట్టుకుంటే సామ్రాజ్యం - తొలుత ఆర్థికంగా తర్వాత రాజకీయంగా కూలిపోతుంది") ఇలాంటి పాతకాలపు ప్రకటనలు ప్రజలకు రుచించవని, ఇలామాట్లాడడం రాజకీయఎత్తుగడలకు తగినదికాదని, పాలకవర్గాలు అభిప్రాయపడుతున్నారు. ఇప్పుడీ విషమించిన పరిస్థితులలో ఇలా మాట్లాడితే మరింత కష్టమని వారనుకుంటున్నారు

ఇటీవలిరోజుల్లో బ్రిటిష్‌పాలకుల ప్రకటనల్లో ధోరణి మారడమనే ప్రశ్న లేదు. కాని ఈ మార్పు విజృంభిస్తున్న జాతీయోద్యమానికి ప్రతిబింబమేకాని కారణం కాదుగదాఅని ఏసందేహగ్రస్తుడైనా అడిగితే అతనిని మన్నించవచ్చును.

పాలకుల ఈ కొత్తమాటల ధోరణిచూచి, యదార్థస్థితిలో కనిపించే సామ్రాజ్యవాదుల విధానాన్ని మరచిపోయి ఏదైనా భ్రమలకు దారితీస్తే, అంతకంటే ప్రమాదకరమైనది ఇంకొకటిలేదు. తమ చేతనైన మార్గంతో, తమకున్న అన్ని సాధనాలను ఉపయోగించి తమ పెత్తనాన్ని నిలుపుకోవడమే సామ్రాజ్యవాదుల ఆశయం. ఈ యదార్థ పరిస్థితులను, ఇటీవల బ్రిటిష్‌ప్రణాళికను గూర్చి చర్చించేప్పుడు మరింత విపులంగా పరిశీలించడం అవసరమవుతుంది.

ఈరకంగా సామ్రాజ్యవాదులు తమవాదం మార్చుకోవడంలో ఉన్న ప్రాముఖ్యత సుస్పష్టమే. భారతజాతీయత తమ సంతానమని చెప్పే ఆధునిక సామ్రాజ్యవాదుల ఇచ్చకపుమాటలు కేవలం పడిపోతున్న ప్రభుత్వపు గగనసౌధాలు, ఆత్మతృప్తికి పలికే పలుకులుఅనీ, ప్రమాదకరంకావనీ అనుకోరాదు. సామ్రాజ్యవాదం ఉపయోగకరమైన సభ్యతావిధానమని, వెనకబడిన ప్రజలకు శిక్షణనిచ్చి వారికి తోడ్పడి ప్రజలలో జాతీయతను ప్రజ్వలింపజేసి, ఆఖరుకు స్వపరిపాలనకు నడిపిస్తుందని చెప్పే ఈ సిద్ధాంతం (దీనినే "డీకాలనైజేషన్" సిద్ధాంతమంటారు) తొలుత సోషలిస్టు విద్రోహులు సామ్రాజ్యవాద సేవకులైన మాక్డొనాల్డువంటి వారు కొందరు ప్రారంభించారు. భారతదేశంలో రాక్షసపాలనను కొనసాగించి, ప్రజాతంత్ర హక్కులు కావాలని కోరిన నేరానికి 60 వేలమంది భారతీయులను జైళ్ళలో త్రోసింతర్వాత మాక్డొనాల్డు సామ్రాజ్యవాదం "సభ్యతను వ్యాపింపజేస్తున్న"దని కనిపెట్టాడు. ఈ వాదాన్ని నేటి సామ్రాజ్యవాద ప్రతినిధులు తాత్కాలిక ప్రయోజనంకోసం అంగీకరించారు. వారిందువల్ల తేల్చే నిర్ణయమేమంటే

"తెలివిగల" "నిర్మాణాత్మకమైన" భారత జాతీయవాదం సామ్రాజ్యవాదాన్ని తనకు శత్రువుగా భావించరాదు: స్వతంత్రపోరాటాన్ని వదిలి, సామ్రాజ్యవాదంతో రాజీకి, సహకారానికి దిగాలి; భారతప్రజలను తిన్నగా ఏదో అస్పష్టమైన స్వపరిపాలనంవైపు, ఊహామాత్రమైన భావికాలంలో నడపగలిగే గురువుగా, మార్గదర్శకంగా సామ్రాజ్యవాదాన్ని అంగీకరించాలి. ఆ స్వపరిపాలనవైపు నడవడంలో ఎంత త్వరగా నడవాలన్నది సామ్రాజ్యవాదులే నిర్ణయించాలి.

భారత జాతీయత బ్రిటిష్ పాలన ఫలితమని, దాని సంతానమని చెప్పడం సబబా?

ఇందులో ఆ వాదం ముందుకు తెచ్చేవారు అనుకోనటువంటి అంశమొకటి ఉంది. అది మాత్రం నిజం.

చైనాలో తమ దురాక్రమణ దండయాత్రల ద్వారా చైనా ప్రజల్లో జాతీయైక్యతను కల్పిస్తున్నాము అని జపాను వారు చెప్పాలంటే చెప్పవచ్చును. భౌతిక పరిస్థితులను బట్టిచూస్తే ఇది సరైనదే అవుతుంది.

ఇలాగే సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాడి పెరిగిపోయిన జాతీయతకు, నేను లేకపోతే ఇదెలా వస్తుందని సామ్రాజ్యవాదం అనవచ్చు. రష్యాలో కార్మికవర్గ విజయానికి జారిజం మూలమైనట్టుగా, క్రామ్‌వెల్‌కు ఛార్లెస్ కారణమైనట్టుగా,భారత జాతీయోద్యమానికి సామ్రాజ్య తత్త్వం ప్రారంభ కారణం కావచ్చు.

కాని ఈ అర్థంలోకాదు నేటి సామ్రాజ్యవాదులు మాట్లాడుతున్నది; భారత దేశంలో రాజకీయ ఐక్యతను, ఆధునిక నాగరిక పరిపాలనను తాము ఏర్పరచడమే కాక (ఇక్కడ వీరికి మంచి బలముంది) బ్రిటిష్ న్యాయచట్టం, సభ్యతా సంస్థలు ఆంగ్ల విద్యా విధానం తామే పెట్టామని, కొందరికి ఏ కొద్దో ఆంగ్ల విధానంలో శిక్షణ నిచ్చి తద్వారా భారత జాతీయతకు తామే పునాది వేశామని వారంటారు. విద్యావంతులలో ఇంగ్లీషు పార్లమెంటరీ ప్రభుత్వం- ప్రజాతంత్ర స్వతంత్రం మొదలైన భావాలను తాము నాటామని వీరు చెప్పుకుంటారు. "క్రమంగా ప్రజా స్వతంత్ర హక్కులు వస్తాయని ఇంగ్లీషు చరిత్ర పాఠం నేర్పింది. బర్క్, మిల్లు చెప్పిన ఇంగ్లీషు రాజకీయ భావాలు ఆ పాఠాన్ని గట్టి బరచినవి. విద్యావంతులైన భారతీయులు, ముఖ్యంగా సూక్ష్మబుద్ధులైనవారు ఉత్సాహంతో పొంగిపోయి నూతన జ్ఞానాన్ని గ్రహించుకున్నారు" (యల్. యఫ్. రుష్‌బ్రూక్ విలియమ్సు "భారతదేశం సంగతేమిటి?" 1938, పుట 105).

ఇందులో ఎంతవరకు సత్యముంధి?

ఆధునికయుగంలో జరిగిన ప్రజాతంత్రభావ పరిణామం చాలదేశాల్లో — ఇంగ్లాండులోకూడ అభివృద్ధిచెందింది. ఇది కేవలం ఇంగ్లాండుకు ప్రత్యేకలక్షణం కాదు. ఈ ప్రజాతంత్రభావాలు నాటడానికి విదేశపాలన అవసరమనేదీ సరైనది కాదు. అప్పటికీ పార్లమెంటరీ పద్ధతికీ రాచరికానికీ ముడిపెట్టి రాజీపడిన

ఇంగ్లీషుపద్ధతికన్నా, అమెరికా స్వతంత్రప్రకటన, అంతకన్నా ఎక్కువగా సమానత, స్వతంత్రం, సహోదరత్వం అన్న మహానినాదమిచ్చిన ఫ్రెంచి విప్లవమూ 19 శతాబ్ది ప్రజాతంత్ర భావపరిణతికి దోహదమిచ్చాయి. ఇలాగే 20 శతాబ్దిలో 1905, 1917 రష్యన్ విప్లవాలు ప్రజాచైతన్యానికి ప్రారంభదశలుగా, నాందీవచనాలుగా పనిచేశాయి. ముఖ్యంగా ఈ విప్లవాలు ఆసియా వలసదేశ ప్రజలలో చైతన్యాన్ని, జాతీయ స్వాంత్రవాంఛను పురికొల్పాయి.

ఈ ప్రపంచ సంఘటనలతోపాటు భారతీయచైతన్యం అభివృద్ధిచెందినదని అందలి దశలను ఉదహరించి రుజువు చేయవచ్చును. 19 శతాబ్ది ప్రథమంలో భారతజాతీయతకు తండ్రియైన రామమోహన్‌రాయి 1830 లో ఇంగ్లాండుకు ప్రయాణిస్తున్నాడు, తనకు కావలసినంత ఇబ్బంది కలిగినప్పటికి ఫ్రెంచినౌకలోనే ప్రయాణం చేస్తానని పట్టుపట్టాడు. ఫ్రెంచి విప్లవసిద్ధాంతాలపై తనకున్న అభిమానాదరాలను అలా ప్రదర్శించాడు. ఈ సంఘటన జ్ఞాపకం చేసుకోతగినది. తెరలుతెరలుగా పైకొని వస్తున్న ప్రజాఉద్యమాన్ని ఆటంకపరచాలన్న ఉద్దేశంతో బ్రిటిష్‌పాలనకు రక్షణగా ప్రభుత్వమే తొలుత ప్రారంభించిన కాంగ్రెస్, ఇరవై ఏళ్ళు నిద్ర పోతుండినది. తొట్టతొలుత 1905 తర్వాత బయలుదేరిన మహాప్రజా విజృంభణలో నిదురమేల్కొన్నది. ఆ సంక్షోభం తగ్గిపోగానే, రాజభక్తితో మితవాద ధోరణిలో మునిగిపోయి తిరిగి, మహోన్నతరూపంలో 1917 తర్వాత బయలుదేరిన ప్రపంచోద్యమంతోపాటు విజృంభించింది.

ఇంగ్లాండే పెత్తనం సాగించకపోతే, భారతదేశం ఈ ప్రపంచ సంఘటనల్లో పాల్గొని ఉండేదికాదని, ప్రజాతంత్ర జాతీయ స్వతంత్రానికై పోరాటం సాగించి ఉండదని, అనడం అర్థంలేని ఆత్మసంతృప్తికి చెప్పేమాటమాత్రమే. ఇందుకు విరుద్ధంగా చైనా ఉదాహరణ కనిపిస్తున్నది. ఆ దేశంలో (చైనా) పూర్తిగా సామ్రాజ్యవాద ప్రభుత్వం పెత్తనం ఏర్పడకపోయినా, జాతీయ ప్రజాతంత్ర భావాలు ఎంత శక్తివంతంగా ముందుకు పోగలిగాయో మనం చూడవచ్చు. ఈ జాతీయ ప్రజాతంత్ర స్వతంత్రోద్యమం, సామ్రాజ్యవాద దురాక్రమణ, దాడుల వల్ల ఏర్పడిన ఆటంకాలను ఎదిరించి పోరాడుతూ రావలసివచ్చింది.

భారతదేశంలోని విద్యావంతులకు, వారి అయ్యవార్లు బర్కును మిల్లును, మెకాలేను చదవమని, గ్లాడ్‌స్టన్ బ్రైట్‌ల చర్చాచణోక్తులను విని సంతసించమని చెప్పడంవల్లనే జాతీయోద్యమం ప్రారంభమైందా: ఔనని పాతగాధలు చెబుతున్నవి. ఇలాంటి కథలు, నేటి ఆధునిక ఫ్రాన్సు నెపోలియన్ సంకల్పంతో పుట్టిందని, లూథర్ బుద్ధితక్కువవల్ల ప్రొటెస్టాంటిజం పుట్టిందని చెబుతూనే ఉంటాయి. అలాంటిదే ఇదీనూ. భారత జాతీయోద్యమం సంఘ పరిస్థితులవల్ల బయలుదేరింది. సామ్రాజ్యవాదం ఏర్పరచిన పరిస్థితులు, దాని పీడనా విధానంమూలంగాను, ఆ పీడనక్రింద భారతసమాజంలో ఏర్పడిన సాంఘిక ఆర్థికశక్తుల మూలంగాను

ఈ ఉద్యమం బయలుదేరింది: విద్యావిధానం ఎలాంటిదైనప్పటికి, బ్రిటిష్ ధనిక వర్గానికి వ్యతిరేకంగా ఉదయిస్తున్న భారత ధనికవర్గం. వారిమధ్య పోటీ తప్పని సరి అవుతుంది; భారత ధనికవర్గం కేవలం సంస్కృతమూ, వేదాలూ మాత్రమే చదువుకొని ఉన్నప్పటికి, ప్రపంచ అభిప్రాయాలు లేని తాను సంబంధం లేకుండా ప్రత్యేక జీవనం గడుపుతున్నప్పటికి, వారి పోరాటానికి తగిన వినాదాలు, ప్రోత్సాహము సంస్కృతవేదాల్లోనే దొరికిఉండేవి.

ప్రాచ్యవిద్యావాదులను ఓడించి మెకాలే సామ్రాజ్యవాదపక్షంగా ఆంగ్లేయ విద్యావిధానం ప్రవేశపెట్టాడు. అప్పుడు అతని ఉద్దేశం భారత జాతీయచైతన్యం సృజించడంకాదు దానిని విచ్ఛిన్నంచేసి మూలమట్టంగా తుడిచిపారవెయ్యాలనేదే అతని ఉద్దేశం. పాత రష్యాసామ్రాజ్యంలోని ఇతరజాతులపై జారుప్రభుత్వం రష్యావారినిగా వారందరినీ తయారుచేయాలని చూచినలాంటిదే ఇదిగూడా. తమ ప్రజలతో సంబంధాలన్నింటినీ త్రెంచివేసి, ఇంగ్లీషువారి భావాలను ఆచరణలో పెట్టేచాకిరీ (పెంపుడు) మనుషులను తయారుచేయాలనే మెకాలే చూచాడు. ప్రజాతంత్రబీజాలు నాటడం అతని ఆలోచనల్లో లేనేలేదు. ఆ విషయంలో అతని అభిప్రాయాలు స్పష్టంగాఉన్నవి మెకాలేఇలా అన్నాడు: "భారతీయులు స్వతంత్ర ప్రభుత్వం పెట్టుకోలేరని మనకు తెలుసును. కాని అంతకన్నా తర్వాతిదైన దృఢతర నిష్పాక్షిక నిరంకుశోద్యోగవర్గాన్ని (Despotism) ఇండియా ఏర్పరచుకో వచ్చును." చక్కగా సామ్రాజ్యతత్వ పాలన సాగేందుకోసం, పైనరుద్దిన ఈ విద్యావిధానం, అందుతోపాటు ఇంగ్లీషు ప్రజాతంత్ర భావప్రవాహానికి మార్గాలు సరిజేసింది. తామెదుర్కొంటూవున్నట్టి హింసా పద్ధతులతోను, ఒక్కొక్కప్పుడు తామెదుర్కొంటూవున్న పాలకవర్గ ఉద్యోగులూ, పిట్స్, హేస్టింగ్స్‌వెలింగ్టన్లతోనే పోరాటం సాగిస్తున్న మిల్టన్ల, షెల్లీల, బైరన్ల పోరాటాలు ఉత్సాహానికి దారిచూపినవి ఇది సామ్రాజ్యతత్వంలోని పరస్పరవిరుద్ధ లక్షణమే. ఎందుకంటే ఏదేశంలోని పాలకవర్గం సామ్రాజ్యవిధానాన్ని అమలు జరుపుతున్నారో, అదే దేశంలోనే మరొకవైపు ప్రజలు స్వతంత్రంవైపు పురోగమనం సాగిస్తున్నారు కాని ఈ పరస్పరవైరుధ్యాన్ని మొదట సామ్రాజ్య వాదులు ఊహించలేదు. అప్పటినుండి దీనిని తర్వాత సామ్రాజ్యవాదులు ఖండిస్తూనే ఉన్నారుకూడ. * ఈ సామ్రాజ్యవాదులు భారతదేశానికి వెళ్ళే పుస్తకాలపై తీవ్రనిర్బంధవిధానాన్ని సాగిస్తూ, ప్రజాస్వామిక భావాలు ఆదేశానికి వెళ్ళకుండా ఆటంకపరచాలని శాయ శక్తులా ప్రయత్నిస్తున్నారు.

---

* భారతదేశంలో పశ్చిమ విద్యావ్యాప్తికి బ్రిటిష్ ప్రభుత్వం తీసుకున్న చర్యలను, అందువల్ల ఏర్పడిన ఫలితాలను ఈ పుస్తకంలో రచయిత సూక్ష్మంగా పరిశీలించాడు. రాజకీయపు అంచనాలు ప్రమాదకరంగా పరిణమించిన గాథ ఇది"

(సర్ ఆల్ఫ్రెడ్ లియాల్ జి. సి. ఐ. ఇ. వాలెంటైన్ చిరోల్ వ్రాసిన "భారత దేశంలో సంక్షోభం" అనే పుస్తకానికి పీఠికలో, 1910 పుట 13)

కాని, భారతదేశంలోని బ్రిటిష్‌పాలన మంచికీ చెడుకూకూడ ఎంత చారిత్రకప్రాముఖ్యత గలదో కించపరచవలసిన పనిలేదు ఆ పాలన, ఎంత యిష్టం లేకపోయినా, ఎంత తెలియకపోయినాసరే భారతజాతిని నిర్మించే శక్తులకు ఎంత తోడ్పడిందో దానిని తక్కువపరచవలసిన అగత్యమూలేదు. ఇంతకుముందే నేను ఉదహరించిన వాక్యాలలో (4 అధ్యాయం. 4 వర్గం) బ్రిటిష్‌పాలన సాధించిన రెండు ప్రధానాంశాలను మార్క్సు వివరించాడు. "పాడుతలపులతో" ప్రారంభమైనప్పటికి బ్రిటిష్‌పాలన ఇండియా అభివృద్ధిలో "చరిత్ర తనకు తెలియకనే ఒక సాధనంగా" తన పాత్రను నిర్వహించిందని ఆయన వివరించాడు.

భారతదేశంలో బ్రిటిష్ దండయాత్ర, దోపిడీవిధానం సాధించిన మొదటి ముఖ్యమైన అంశం వినాశకరపాత్ర నిర్వహణ-భారతదేశంలోని ప్రాచీన సమాజ వ్యవస్థ పునాదులను పూర్తిగా నాశనంచేయడం - అలాంటివిధ్వంసనం ఏ కొత్తఅభివృద్ధికైనా మొదట జరగవలసినపని. ఇలా వున్నందువల్ల, బ్రిటిష్‌దండయాత్రలేకపోతే ఈవిధ్వంసనం అసాధ్యమైఉండేదని అర్థంకాదు. ఇందుకువ్యతిరేకంకూడ. సంప్రదాయసిద్ధంగావచ్చిన భారతసమాజం బ్రిటిష్ దండయాత్ర జరిగినసమయంలో విచ్ఛిన్నమైపోతూ, తనకున్నసహజావకాశాలలోనే బూర్జువా విప్లవ ప్రథమదశలో సంచలితమవుతున్నది. అలాంటిసమయంలో, అప్పటికే పరిణతమైన బ్రిటిష్ బూర్జువావిప్లవం భారతదేశంలో, అరాజక సంధిదశను దాటి, తనరాజ్యాన్ని స్థాపించుకోగలిగింది. ఇలా నిర్ణయించడానికి తగినఆధారంఉంది అయినప్పటికి వాస్తవచరిత్రపుటంలోమట్టుకు ఈ ప్రాచీనసమాజ విధ్వంసనం బ్రిటిష్‌ప్రభుత్వం వల్ల జరిగినదే.

బ్రిటన్ సాధించిన రెండోఅంశం సమగ్రంకాలేదు. అదేదంటే: దేశరాజకీయ ఐక్యతద్వారా నూతనవ్యవస్థకు భౌతికపరిస్థితులను ఏర్పరచింది; ప్రపంచవాణిజ్యం భారతదేశానికి లంకెపెట్టడం ; ఆధునిక ప్రయాణ వార్తావినిమయ సౌకర్యాలను-ఏర్పరచడం—ఇందులో ముఖ్యంగా రైళ్ళను తంతిపద్ధతిని ఏర్పరచడం; అందువల్లఏర్పడిన ఆధునిక పరిశ్రమలు శిక్షణ, పాలన శాస్త్రీయజ్ఞానంగల వ్యక్తులను తయారుచెయ్యడం—వీనిద్వారా నూతన వ్యవస్థకు భౌతిక పరిస్థితులను బ్రిటన్ కల్పించింది, కాని ఈ కార్యక్రమం కడవరకు సాగలేదు.

ఈ రెండు అంశాలు తమంతటస్వతంత్రాన్నిగాని భారతప్రజల పరిస్థితిలో అభివృద్ధినిగాని తేలేవు. ఆరెండిటికి భౌతికప్రాతిపదికను మాత్రమే ఇవి ఏర్పరచగలవు. "కాని ధనికవర్గం ఇంతకన్నా ఎక్కువ ఎప్పుడైనా చేసిందా ? ప్రజలను వ్యక్తులను రక్తప్రవాహాల్లో, బాధల్లో, కల్మషంలో, అధమస్థితిలోముంచి వేయకుండా బూర్జువావర్గం ఏకార్యక్రమాన్నైనా, ఎన్నడైనా ముందుకు నడపగలిగిందా ?"

మూడో అంశం ఇంకాసాధింపబడవలసిఉన్నది. ఇందులో, నూతనశక్తులను భారతప్రజలే తమ ప్రయోజనాలకు అనుగుణంగా సమీకరించుకొని వారే దీనిని

సాధించాలి. సామ్రాజ్య వ్యతిరేకపోరాటంలో భారతప్రజల కార్యాచరణద్వారా, వారుతమశక్తిని "సంపూర్తిగా ఇంగ్లీషు శృంఖలాలను త్రెంపుకొనేందుకై" అభివృద్ధిపరచుకొనడంద్వారా ఈ పనినెరవేరాలని మార్క్సు నొక్కిచెప్పాడు. ఇది భారతజాతీయ స్వతంత్రోద్యమం నిర్వహించవలసిన చారిత్రక కర్తవ్యం. స్వతంత్రోద్యమ ఆవశ్యమైన దేశస్వతంత్రం, భారతసామాజిక స్వతంత్రానికి ప్రథమ సోపానం.

బ్రిటిష్‌పాలన ప్రారంభపురోజుల్లో, 19 వ శతాబ్ది ప్రథమార్ధంలో, బ్రిటిష్ పాలకులు - దారుణవినాశం, బాధలు, పరిశ్రమల విధ్వంసన వీనిమధ్యలో - అభ్యుదయకరపాత్రను చకచకా నిర్వహిస్తూ, చాలరంగాలలో భారతసమాజంలోని అభివృద్ధినిరోధక - భూస్వామివర్గ శత్రువులను ప్రతిఘటిస్తూ వచ్చారు. నిరాఘాటంగా దేశాన్ని ఆక్రమించడంలో రాజులను నిర్మూలించివేస్తూ, మిగిలిన రాజులను భయభ్రాంతులను చేస్తూవచ్చారు. ఈ యుగంలోనే ధైర్యంగా కొన్ని సంస్కరణలను, సహగమనపద్ధతిని రద్దుపరచడం (ఈపని భారతసమాజంలోని అభ్యుదయ శక్తుల హృదయపూర్వక సానుభూతిలో జరిపారు), బానిసతనాన్ని రద్దుచేయడం (ఇది నామకఃమాత్రమే జరిగింది) శిశుహత్య, దారిదోపిడీలపై పోరాటంసాగించడం, పాశ్చాత్యవిద్యా విధానాన్ని ప్రవేశపెట్టడం, పత్రికలకు స్వతంత్ర మేర్పరచడం మొదలైన కార్యక్రమాన్ని సాగించినారు. తమ దృక్పథాన్ని ఖచ్చితంగా ఉంచుకొని, భారతసాంప్రదాయాల్లో వెనకబడిఉన్నవానినెల్లా ద్వేషంతోచూస్తూ, 19 వ శతాబ్ది బూర్జువా, క్రైస్తవభావాలుమాత్రమే మానవత్వానికి ప్రాణమని భావిస్తూ ఆతొలిరోజులలోని బ్రిటిష్‌ఉద్యోగులు, ఏమైనప్పటికి అభివృద్ధిచెందుతున్న బూర్జువా యుగశక్తికి ప్రాతినిధ్యంవహించి శక్తివంతమైన కార్యక్రమంతో నడిపారు; అందులో ఉత్తములైన సర్ హెన్రీలారెన్సు వంటివారు భారతీయుల మన్ననను, ఆదరాన్ని చూరగొన్నారు. ఆయుగంలో బ్రిటిష్—భారతీయ సన్నిహితసంబంధం బాగాప్రదర్శితమైంది.అప్పుడు బ్రిటిష్‌వారిని తీవ్రంగా ద్వేషిస్తున్నది పాతఅభివృద్ధి నిరోధకరాజులే. వారు బ్రిటిష్‌వారు తమస్థానాల నాక్రమిస్తారని ద్వేషించారు. ఆ కాలంలో భారతదేశంలోని అభివృద్ధికరశక్తులకు ప్రతినిధిఅయిన రామమోహన్ రాయి, బ్రహ్మసమాజ సంస్కరణోద్యమం, దాపరికంలేని అభిమానంతో, అభ్యుదయకారులని బ్రిటిష్‌వారివైపు చూచారు. బ్రిటిష్‌వారి సంస్కరణలను జంకుగొంకు లేకుండా బలపరచి, నూతనసభ్యతకు ఆసంస్కరణలు అగ్రగాములని భావించారు.

ప్రధాన నాయకత్వంలోను, మూల స్వభావంలోను 1857 నాటి తిరుగుబాటు, వినాశమైపోతున్న తమహక్కులు, సౌకర్యాలకోసం పాత అభివృద్ధి నిరోధక, రాచరికశక్తులు, స్థానభ్రష్టులైన సామంతులు కలిసినడపిన తిరుగుబాటు. ఈ అభివృద్ధి నిరోధకలక్షణాలుగల తిరుగుబాటు విస్తృత ప్రజాబలాన్ని పోగొట్టుకొని విఫలమైపోయింది. అయినప్పటికి ఆ తిరుగుబాటు, లోలోనరగుల్కొంటున్న ప్రజాసామాన్యపు అసంతృప్తి తీవ్రతను వ్యక్తపరచింది: బ్రిటిష్ పాలకులలో

బెదురును కల్పించింది-ఆబెదురు సంప్రదాయమే ఇంకా నిలిచిఉంది. 1835-36 లో గవర్నర్ జనరల్‌గాఉన్న లార్డుమెట్కాఫ్ తిరుగుబాటు తర్వాతయుగంలోఇలా రాసేడు, (" పత్రికలు - జాబులు " పుట 116, జె. యల్. మారిసన్ లక్నో లారెన్సు, అనే పుస్తకం పుట 55 లో ఉదహరించినది :) "భారత దేశమంతా ఎల్లప్పుడూ మన పతనంకోసం ఎదురు చూస్తున్నది. మన వినాశంతో ప్రజలు అన్నిచోట్లా సంతోషిస్తారు, లేదా సంతోషిస్తామని భావిస్తున్నారు. తమశక్తి సామర్థ్యాలన్నిటిని ఉపయోగించి, ఆవిధ్వంసనానికై ప్రయత్నించే వారిసంఖ్యకు లోపమేమీలేదు."

1857 సంవత్సరంతర్వాత బ్రిటిష్‌విధానంలోను, బ్రిటిష్ పాలనలక్షణాల్లోను మార్పు వచ్చింది. ఇప్పటినుండి ప్రజలకు వ్యతిరేకంగా భారతదేశంలోని అభివృద్ధినిరోధకుల బలాన్ని సంపాదించుకొనేవైపుకు బ్రిటిష్‌విధానంమ్రొగ్గింది: భారతీయబూర్జువావర్గప్రారంభానికి ప్రతినిధులైన నూతనఅభ్యుదయశక్తులు బ్రిటిష్ వారిపై పూర్వంకనబరుస్తున్న స్నేహాన్ని వదిలివేసి అనుమానంతో చూడసాగారు. ఒకోతూరి ప్రతికూలాన్నికూడ చూపించారు. తాత్కాలికంగా ప్రజలకు వ్యతిరేకంగా వీరితోగూడ అవసరమైన మైత్రికి జరిగినప్రయత్నాలలో ఈ ప్రతికూలత కొంత తగ్గింది బ్రిటిష్ ఇండియాలోనికి స్వదేశసంస్థానాలను కలుపుకునేపద్ధతి హఠాత్తుగా ఆగిపోయింది. మిగిలిన సంస్థానాధిపతులను మిత్ర"స్వతంత్ర" రాజులంటూ అధికారంలో ఒదేపనిగావుంచారు బూజుపట్టిన వారి మధ్యయుగపు పీడనను, దుష్పరిపాలనను రక్షించారు ఆపాడుపాలనతో తామిప్పుడు పూర్తిగా పరాశ్రయంతో బ్రతికేవారయ్యారు. గనక సంస్థానాధిపతులు మరింత పాడుచేశారు. ఆతర్వాత భారత దేశపటం, అర్థంలేని అతుకులబొంతగా, చిన్నచిన్నజాగీర్లతో, రకరకాలైన పాలనాపద్ధతితో నిండిపోయింది. ఈ సంస్థానాధిపతులు ఇప్పుడు పూర్తిగా తమ సామ్రాజ్యవాదయజమానిచేతి నీచమైన కీలుబొమ్మలయ్యారు. ఇటీవల వీరిని జాతీయ స్వతంత్రశక్తులకు పోటీగా, రాజ్యాంగ సంస్కరణల్లో ప్రథమశ్రేణిలోనికి బ్రిటన్ కొనివస్తున్నది. సంఘసంస్కరణమార్గం పూర్తిగావదలివేసి, ప్రతిఅభివృద్ధి నిరోధక మతఆచారాలను కట్టుబాట్లను పోనీకుండా గట్టిగా కాపాడడం మొదలయింది (1891 నాటి అంగీకార వయోనిర్ణయశాసనంఒక్కటే ఈ యుగంలో ఇందుకు విరుద్ధమైనది). భారతీయులకు ఇంగ్లీషువారికి సమానతను ప్రసాదిస్తున్నట్టు నటిస్తూ 1858 నాటి రాణిగారి ప్రకటన (ఈ ప్రకటననుగూర్చి తర్వాతి వైస్రాయి లార్డులిట్టన్‌నిర్మొగమాటంగా ఇలాప్రకటించాడు: "ఈ ప్రకటనలు అసలు యెన్నటికి ఫలించలేవు, ఫలించవు"-చూడు 14 అధ్యాయం 2 వర్గం,) "మతవిశ్వాస ప్రార్థనాదివిషయాల్లో జోక్యం కలిగించుకోము" అన్నప్రభుత్వ నిశ్చయాన్ని వెల్లడించింది; "పాతహక్కులకు, ఆచారాలకు, మర్యాదలకు తగిన గౌరవం ఇవ్వబడుతుంది" అని భారతసమాజంలోని అభివృద్ధినిరోధకవర్గాలకు వాగ్దానమిచ్చింది. 1876 చక్రవర్తిబిరుదశాసనంతో రాణీనిభారతసామ్రాజ్ఞిగా ప్రకటించారు. ఈచట్టాన్ని

గూర్చి వైస్రాయి లార్డులిట్టన్ నూతనవిధానానికిది ప్రతిబింబమని "ఈ నూతన పద్ధతిద్వారా ఇంగ్లీషు రాజు, శక్తివంతమైన స్వదేశభూస్వాముల ప్రయోజనాలకు, ఆశలకు, వాంఛలకు, సానుభూతికి ఇకమీద చిహ్నప్రాయుడుగా ఉంటాడు" అన్నాడు ఈ కాలంనుండి హిందువులను ముస్లిములను ఒకరిమీది కొకరిని ఎక్కించడం, మిగతారకాలవిభజనలను ఉపయోగించడం—అదేపద్ధతులను బ్రిటిష్‌పాలకులు చాలజాగ్రత్తగా పరిశీలిస్తూవచ్చారు. ఆధునికపద్ధతులలో మతనియోజకవర్గాలద్వారా ఇది విజయవంతముగా భారతరాజకీయాల్లో ప్రాముఖ్యతకు వచ్చింది, ఇందుతోపాటు 1857 నుండి బ్రిటిష్ పాలకులకు, భారత సమాజంలోని అభ్యుదయకర వర్గాలకు మధ్య అఖాతం రానురాను హెచ్చింది: ఇరువేషుల సంప్రదాయంమీద, తమ మైత్రిలో వచ్చిన మార్పును అంగీకరించారు.

బ్రిటన్‌లోని పెట్టుబడిదారీవిధాన సామాన్యలక్షణంలో మార్పు వచ్చింది. ప్రపంచం మొత్తంమీద తన అభ్యుదయకర శుక్లపక్ష దినాలనుండి, క్రమక్రమంగా వినాశస్థితికి, అభివృద్ధి నిరోధకదశకు పెట్టుబడిదారీ విధానంవచ్చి ఆఖరుకు సామ్రాజ్య వాదయుగంలో అంతిమ శిధిలావస్థకు వచ్చింది. ఈ మార్పే భారత దేశంలోని బ్రిటిష్‌పాలన స్వభావంలోకూడ అనుగమించింది. ఆధునిక సామ్రాజ్య వాద - లేక శిధిల ధనికవాద - అంతిమదశలోకి పెట్టుబడిదారీ విధానంపోయేకొద్దీ, ఈ అభివృద్ధి నిరోధకపాత్ర మరింత స్పష్టరూపాన్ని ధరించింది.

భారతదేశంలోని బ్రిటిష్ పాలనలోని భౌతిక అభ్యుదయకర పాత్రదశ, 19 శతాబ్ది ఆఖరుభాగంలో ముగియవచ్చినకొద్దీ మరోవైపు భారతసమాజంలోనే నూతన శక్తులు తలచూపసాగాయి. 19వ శతాబ్ది ఉత్తరార్థంలో భారత ధనికవర్గం ముందుకు వస్తున్నది. 1853 లో తొట్టతొలుత విజయవంతంగా బొంబాయిలో బట్టలమిల్లు స్థాపింపబడింది. 1880 నాటికి 44,000 మంది కార్మికులతో 156 మిల్లులు ఏర్పడ్డాయి. 1900 నాటికి 1,61,000 కార్మికులు పనిచేసే 193 మిల్లులు ఏర్పడినవి. ప్రారంభంనుండి ఈ కొత్త పత్తి బట్టలపరిశ్రమలపై ధనము, పెత్తనం కూడ భారతీయులదే; ఎన్నో ఇబ్బందులపై ఈ పరిశ్రమ నడపవలసి వచ్చింది. ఆదే సమయంలో కొత్త విద్యావంతులైన మధ్యతరగతులవర్గం, పాశ్చాత్య విద్యా విధానంతో శిక్షణపొంది వకీళ్ళుగా, డాక్టర్లుగా, ఉపాధ్యాయులుగా, ఉద్యోగులుగా తయారవుతూ 19 వ శతాబ్ద ప్రజాతంత్ర భావాలతో పౌరులు కావాలని ముందుకు నడవసాగారు. ఈ ప్రారంభరోజుల్లో ధనికవర్గ పరిశ్రమరంగంలోను, నూతన పాశ్చాత్యమేధావి వర్గంలోనుకూడ జరిగిన ప్రారంభం చాల స్వల్పమే. కాని నూతనవర్గమొకటి ఉదయిస్తున్నది. బ్రిటిష్ ధనికవర్గం తన్ను మూలకు నెట్టివేసే పోటీదారనీ, అభివృద్ధికి ఆటంకమని ఈ నూతనవర్గం సహజంగానే కనుగొన్నది. కాబట్టి భారత జాతీయవాంఛను, నాయకత్వాన్ని, ప్రాతినిధ్యాన్ని ఈ వర్గం వహించ గలిగింది. ఇది సహజమే.

బ్రిటిష్ ధనికవర్గానికి భారత నూతన ధనికవర్గానికి ప్రత్యక్షమైన ఆర్థిక తగాదా 1882 నాటికే వ్యక్తమయింది. అప్పుడు లాంకషైర్ పారిశ్రామికుల వాంఛలను అనుసరించి, భారత పరిశ్రమలకు వ్యతిరేకంగా భారతదేశానికి దిగుమతయ్యే గుడ్డలపై సుంకాలన్నింటిని ప్రభుత్వం రద్దుచేసింది. అందుతో ఆతగాదా తీవ్రమయింది. మూడేళ్ళతర్వాత భారతజాతీయ మహాసభ (కాంగ్రెస్ స్థాపితమైంది.

ఆఖరుకు, బ్రిటిష్ ధనికవర్గ ఆక్రమణఫలితంగా రైతులు దరిద్రులై దుర్భర పరిస్థితికి రాసాగారు. ఈ దుస్థితి 19 శతాబ్ది ఉత్తరార్థంలో-ముఖ్యంగా ఆఖరు ముప్పైఏళ్ళలో తీవ్రస్వరూపాన్ని తాల్చింది. ఈ దుస్థితిలో ప్రజలలో అశాంతి చెలరేగింది. 19 వ శతాబ్ది ప్రథమ భాగంలో 15 లక్షలమంది చావులతో ఏడు క్షామాలువస్తే, 19 శతాబ్ది ఉత్తరార్థంలో 24 క్షామాలు వచ్చాయి. అందులో మొత్తం 2కోట్ల 85 లక్షలమంది చనిపోయినట్లు అంచనావేశారు, ఈ 24 క్షామాలు లోను, 18 సార్లు 19 శతాబ్ది ఆఖరుపాదంలో క్షామంవచ్చింది. (చూడు-అధ్యాయం5) క్రమాభివృద్ధిచెందుతున్న ఈ అశాంతికి 1875 నాటి దక్కన్ రైతు తిరుగుబాటులు పొలికేక పెట్టాయి, 1875 లో దక్కన్ కొట్లాటల విచారణ కమిటీని నియమించడంతో ప్రభుత్వంయొక్క ఆందోళన వ్యక్తమయింది. ఈ విచారణ సంఘం యావత్తు రైతు సమస్యను, ఈ అశాంతికి కారణాలను, సమగ్రంగా విచారించింది, తర్వాత 1878 లో క్షామవిచారణ సంఘాన్ని ప్రభుత్వం నియమించింది.

ఇలాగ 19 శతాబ్ది ఆఖరు పాదంలో, తొలి 75 ఏళ్ళలో లేని భారతజాతీయ ఉద్యమప్రారంభానికి అనువైన కొత్త పరిస్థితులు ఏర్పడిఉన్నవి.

## 4. భారత జాతీయ మహాసభ (కాంగ్రెసు) ప్రారంభం

భారతజాతీయోద్యమం ప్రధానసంస్థ, ఇప్పటికీ నాయకసంస్థఅయిన భారత జాతీయ కాంగ్రెసు 1885 లో స్థాపితమయింది.

కాంగ్రెసు ప్రారంభకథను, భారత జాతీయతకు తాను పోషక పిత ననే బ్రిటిష్సామ్రాజ్యతత్త్వం మాటలకు రుజువుగా పదే పదే ఉపయోగిస్తుంటారు. వాస్తవస్థితిలో ఈప్రారంభకథా, తర్వాత కాంగ్రెసుచరిత్రలోని విరుద్ధతా, భారత జాతీయశక్తుల బలానికి చక్కని నిదర్శనలుగా ఉన్నవి. తప్పనిసరిగా సామ్రాజ్య తత్త్వ వ్యతిరేక పోరాటం పెంపొందుతోందనికూడ అవి తెలియజేస్తున్నవి.

భారతదేశపు మధ్యతరగతి అభివృద్ధితోను, కార్యాచరణ ప్రారంభంతోను ఉదయించిన కాంగ్రెస్, ఒక ఇంగ్లీషువాని చొరవతోను, పర్యవేక్షణతోను ఒక సంస్థగా ప్రారంభమైనదని అందరికీ తెలుసు. అంతకంటే ఎక్కువేమంటే - చాల మందికిది తెలియదు-వాస్తవస్థితిలో ఈకాంగ్రెస్సు, బ్రిటిష్ప్రభుత్వవిధానం ప్రత్యక్ష పర్యవేక్షణక్రింద వారిచొరవతోనే ప్రారంభింపబడింది. క్రమంగా విజృంభిస్తున్న ప్రజాందోళన శక్తులకు, బ్రిటిష్విరుద్ధభావాలకు వ్యతిరేకంగా బ్రిటిష్ప్రభుత్వాన్ని

రక్షించుకొనేందుకు కాంగ్రెసును సాధనంగా ఉద్దేశించి బ్రిటిష్‌ప్రభుత్వం వైస్రాయితో ముందుగనే ఏర్పరుచబడిన ప్రణాళికప్రకారం ఇది జరిగింది.

అయినప్పటికీ ఎంత పరిమితనియమాలతో మొదట ఉద్దేశింపబడినప్పటికీ, ఈ జాతీయసంస్థ చట్టరీత్యా ఏర్పడినతోడనే, జాతీయ భావప్రకటన సాధనగా కాంగ్రెస్ వ్యవహరించసాగింది. ఇది తప్పనిసరిగా కాంగ్రెస్‌లో ఏర్పడిన వైఖరి, ప్రారంభపు రోజులనుండి, తొలుత పరిమితమైన అతిజాగ్రత్తరూపంలోనే అయినప్పటికీ జాతీయలక్షణం, రాజభక్తిలక్షణాన్ని మూలకు నెట్టింది. కొన్ని ఏండ్లలోనే "రాజద్రోహ" కేంద్రమని కాంగ్రెస్‌ను ప్రభుత్వం అనుమానంతో, ద్వేషంతో, చూడసాగింది. తర్వాత జాతీయపోరాటపు ప్రజాఉద్యమం 1914 యుద్ధానికి పూర్వపు ప్రాథమికదశలోనే ముందుకు ఉరకలుపెట్టింది. ఆ తర్వాత మరింత నిశ్చితరూపంతో తీవ్ర ప్రజాపోరాటస్థాయిలో సంపూర్ణస్వతంత్రమే ఆశయంగా కాంగ్రెస్ పురోగమించింది. ప్రభుత్వం దీనిని చట్టవిరుద్ధసంస్థగా ప్రకటించి, అణచివేయజూచింది. నేడు జాతీయోద్యమంలోని సంఘటిత ప్రజాకోటిగా ఉన్న కాంగ్రెస్, బ్రిటిష్‌పాలన తర్వాత అధికారానికి రానున్నసంస్థగా చూడబడుతున్నది.

సామ్రాజ్యవాదుల అసలు ఉద్దేశాలన్నింటిని పరాభవించిన ఈ చరిత్ర, అభివృద్ధీ జాతీయోద్యమశక్తుల నిరాఘాట పురోగమనాన్నీ నిరూపిస్తున్నది; ఆ శక్తులను తామనుకున్నట్లు సామ్రాజ్యవాదులు సంకుచితమార్గాల్లోనే నడిపించడం అసాధ్యమని రుజువు చేస్తున్నవి.

భారతజాతీయత పుట్టుకను సామాన్యంగా 1885 లో కాంగ్రెస్ స్థాపననుండి గమనించడం మామూలు. ఏమైనప్పటికి వాస్తవపరిస్థితిలో ఈ ఉద్యమానికి ప్రారంభసూచనలు అంతకుముందు యాభైయేళ్ళనాడే తలసూపిన వని పరిశీలిస్తే కనబడుతుంది. * 1828 లో బ్రహ్మసమాజం స్థాపితమైంది. ఇందులో సంస్కరణోద్యమం ప్రతిబింబించింది. దీనినిగూర్చి ముందేప్రస్తావించాము. 1843 లో బెంగాలులో బ్రిటిష్ ఇండియా సొసయిటీ స్థాపితమైంది. "సోదరప్రజలలోని అన్నివర్గాల అభివృద్ధికి న్యాయమైనహక్కులను విస్తరింపజేయడం, వారి సౌభాగ్యానికై పనిచేయడం" ఈ సమితి ఉద్దేశము, 1851 లో ఈ సమితి బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్‌లో కలిసిపోయింది. తరువాతి సంవత్సరం వీరు బ్రిటిష్ పార్లమెంటుకు ఒకటి విజ్ఞాపనపత్రమిస్తూ ఇలాతెలిపారు : "మేమెంతవరకు ఆశించహక్కున్నదో, అంతగా బ్రిటన్ సహచర్యంద్వారా, మేము లాభపడలేదని భావించక తప్పడంలేదు." ఇందులోనే, రెవిన్యూపద్ధతినిగూర్చి పరిశ్రమలపై ప్రభుత్వం చన్నీళ్ళు పోస్తుండడంగూర్చి తెలియజేశారు. విద్య పెంచాలని,

* ఈ ప్రారంభ సూచనలగూర్చి, జాతీయోద్యమం ప్రథమదశలగూర్చి పూర్తివివరాలు సి. యఫ్. ఆండ్రూస్-ముఖర్జీల "భారతదేశంలో కాంగ్రెస్ ప్రారంభమూ, అభివృద్ధీ" 1938, అనే పుస్తకంలో చూడవచ్చును.

పాలకసంస్థలలోని ఉన్నతోద్యోగాలకు భారతీయులను తీసుకోవాలని. శాసన సభను ఏర్పరచాలని కోరారు. ఆ శాసనసభ "ప్రజాప్రాతినిధ్య లక్షణాలతో ఏర్పడాలి. కొన్నివిధాల ప్రజాభిప్రాయానికి ప్రాతినిధ్యత వహించగలుగుతుంది." ఈతొలికాలపు సంఘాలు ముఖ్యంగా భూస్వాములతో సంబంధం కలిగిఉండేవి ఈ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్‌లో బెంగాలు భూస్వామి సంఘంకూడ మిళితమైపోయింది. పెద్దభూస్వాముల పెత్తనానికి వ్యతిరేకంగా తొట్టతొలుత విద్యావంతులైన మధ్యతరగతివారి ప్రతినిధిసంస్థను 1875 లో ఇండియన్ అసోసియేషన్ అనేపేర సురేంద్రనాధ బెనర్జీ స్థాపించాడు. ఎక్కువగా అభివృద్ధి నిరోధకమైన బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్‌కూ, ఎక్కువ అభ్యుదయకరమైన ఇండియన్ అసోసియేషన్‌కూ కూడ భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో శాఖలేర్పడినవి. 1883 లో కలకత్తాలో ఇండియన్ అసోసియేషన్ ప్రధమ అఖిల భారత జాతీయ మహాసభను సమావేశపరిచింది. ఈ సభకు బెంగాలు, మద్రాసు, బొంబాయి, సంయుక్తపరగణాలనుండి ప్రతినిధులు వచ్చారు. ఈ 1883 జాతీయమహాసభ ఆనందమోహన్ బోసు అధ్యక్షతక్రింద జరిగింది. ఈయనే 1898 లో కాంగ్రెసుకు అధ్యక్షుడయ్యాడు; సభలో ఉపన్యసిస్తూ ఈ సభ జాతీయశాసనసభకు ప్రధమదశ అని అధ్యక్షు డుపన్యసించాడు. బాగా జాతీయ కాంగ్రెసుభావం అప్పటికే భారతప్రతినిధులచొరవతో కార్యాచరణతో ఏర్పడిఉంది - మధ్యలో ప్రభుత్వం ఇందులో కల్పించుకున్నది. అంతకుముందు అస్తిత్వమూ, ప్రాతిపదికాలేని ఉద్యమాన్ని ప్రభుత్వం స్థాపించలేదు. ఎటూ ఏర్పడుతూ ఉన్న ఉద్యమాన్ని తమచేతికి తీసుకోవాలని ప్రభుత్వం ముందుకువచ్చింది. ఆ వుద్యమ పురోభివృద్ధి తప్పదని ప్రభుత్వం గ్రహించింది.

ప్రభుత్వ దృష్టిలో జాతీయ కాంగ్రెస్‌స్థాపన, రానున్నవిప్లవాన్ని పరాజితం చేయడానికి, లేదా అరికట్టేందుకు చేసిన ప్రయత్నం. ఇప్పుడు దొరుకుతున్న ప్రభుత్వపత్రాలు, జ్ఞాపికలు ఈ విషయాన్ని రుజువుచేస్తున్నవి. ఇంకా ఇప్పటికీ రహస్యంగా ఉంచిన రికార్డులు బయటపడేవరకు పరిపూర్తిగా వివరాలు దొరకవు-ప్రభుత్వం మారేవరకు అవన్నీ రహస్యంగానే ఉంటాయి.

కాంగ్రెస్ స్థాపకుడు అధికారరీత్యా ఎ. ఒ. హ్యూమ్, ఇతనొక ఇంగ్లీషు ఉద్యోగి, 1882 వరకు ప్రభుత్వోద్యోగంలోఉండి, విశ్రాంతి పుచ్చుకొని కాంగ్రెస్ స్థాపనకు పూనుకున్నాడు. హ్యూం తన ఉద్యోగహోదాలో చాలరహస్య పోలీసు నివేదికలు తీసుకున్నాడు. ప్రజలఅసంతృప్తిపెరిగి పోతున్నదని, రహస్యంగా కుట్రలు పన్నే సంస్థవ్యాపిస్తున్నదని ఆ నివేదికలు తెలిపాయి. 1870 వ పడిలో భయంకరక్షామాలు, బాధలు వ్యాపించాయి. అశాంతి ఎంత పెరిగిపోతున్నదో దక్కన్ రైతుల తిరుగుబాటు ప్రదర్శించింది. 1877 వినాశకరక్షామంరోజుల్లోనే పెద్ద రాజసభ జరిగింది. దానికి విపరీతంగా ధనంవ్యయమయింది ఆ సభలోనే విక్టోరియారాణి భారతదేశచక్రవర్తినిగా ప్రకటితమైనది. అప్పుడే రెండవ ఆఫ్ఘన్

యుద్ధముకూడ జరుగుచున్నది. ప్రజలఅశాంతిని నిర్బంధవిధానంతో అణచ జూచారు. పత్రికలస్వేచ్ఛను 1878 నాటి దేశభాషా పత్రికల చట్టంతో రద్దుపర చారు. తర్వాతి సంవత్సరంలో ఆయుధచట్టంవచ్చి, గ్రామవాసులు అడవిమృగాల నుండి తమ్ము కాపాడుకొనేందుకూ్కడ ఆయుధాలు లేకుండాచేసింది. సభా స్వాతంత్ర్యంకూడ తొలిగింపబడింది. హ్యూమ్ జీవితం వ్రాసిన రచయిత ఇలా అన్నాడు.

"ఈ దురదృష్టకరమైన అభివృద్ధినిరోధక కార్యక్రమం రష్యాలో లాగా పోలీసు నిర్బంధవిధానంతో జతపడి భారత దేశాన్ని, లార్డు లిట్టన్ క్రింద విప్లవంవెల్లివిరిసే స్థితికి తెచ్చిపెట్టాయి. సమయంమించిపోకముందే జోక్యం తీసుకోవాలని హ్యూం, అతనిభారతీయ సలహాదారులూ ఉబలాట పడినారు"

(సర్ విలియమ్ వెడర్బరన్: "అలన్ అక్టేవియన్ హ్యూమ్ - ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ జనకుడు", 1913, పుట 101)

హ్యూం జోక్యాన్నిగూర్చి వెడర్బరన్ ఇంకాఇలావ్రాశాడు:

"లార్డులిట్టన్ వైస్రాయి పదవిముగిసేనాటికి అంటే 1878-79 ఆమధ్య విపరీతంగా పెరుగుతున్న అశాంతిని ఆపేందుకు ఏదో ఒకనిశ్చిత కార్యక్రమం అవసరమని హ్యూం నిర్ధారణకువచ్చాడు. దేశంలోని వివిధ భాగాలనుండి శ్రేయోభిలాషులు హ్యూంగారిని హెచ్చరించారు. ప్రభుత్వా నికి భారత భావియోగక్షేమాలకు ప్రమాదంవాటిల్లనున్నదని, ప్రజలు ఆర్థిక బాధలకులోనుగాకుండా, మేధావివర్గాన్ని దూరంచేసుకోకుండా చూచుకో వాలని వారుకోరారు " (అదే, పుట 50)

నిర్బంధవిధానానికి ముందుగా ప్రభుత్వ ఆశీర్వాదంతో కాంగ్రెస్ స్థాపన జరిగింది. ఇవి రెండు పరస్పర విరుద్ధమైనవి కాక అన్యోన్య సహాయకమైనవి. మహోన్నతమైన విప్లవోద్యమం చెలరేగేటప్పటికి ఈ "అశాంతిని ఎదుర్కొనేం దుకు" తర్వాతిదశ మితవాదనాయకత్వం క్రింద చట్టబద్ధమైన ఉద్యమస్థాపనకు దారి ఏర్పడిందని భావించారు. ఇలా నిర్బంధవిధానం, కొన్ని సౌకర్యాలివ్వడం అనే ద్వివిధకార్యక్రమం ఒకటి మార్చి ఒకటిగా తొలినుండీ సామ్రాజ్యవాదులు అనుసరిస్తూవచ్చిన గతి తర్కం. ఇలా ఏమాత్రం వెనుదీయకుండా పోరాడేవారిపై దెబ్బతీయడం, "రాజభక్తి" గల మితవాదులతో రాజీచేసుకోవడం తర్వాత చాల సారులు అమలుజరిగింది.

"అప్పుడు దారుణ విప్లవ ప్రమాదపరిస్థితిలో నిజంగా మనమున్నా మనేందుకు నాకేమాత్రం సందేహం అప్పుడూలేదు - ఇప్పుడూలేదు అని హ్యూం వ్రాశాడు. ఈ నిర్ధారణకు వచ్చేందుకు ఆయన దగ్గరున్న సాక్ష్య మెలాంటిది? ఈ సాక్ష్యాన్ని ఆయన మాటలలోనే ఇవ్వడం ఉపయోగ కరం. ఇవి ఆయన కాగితాల్లో దొరికిన ఒక నివేదికలో ఉన్నవి.(ఆనివేదిక

లోని భాగాలు, హ్యూం జీవితరచయిత సర్ విలియమ్ వెడర్ బర్న్ ఉపహరించినట్లు ఇస్తున్నాము. మిగత వాక్యాలు సర్ విలియమ్ సంగ్రహించినవే ఇస్తున్నాము.)

"ఆ సమయంలోవచ్చిన సాక్ష్యాన్నిబట్టి- లార్డు లిట్టన్ వెళ్ళిపోయేందుకు - పదిహేనునెలల ముందనుకుంటాను — ఘోరమైన తిరుగుబాటు తప్పదని నాకునమ్మకం కలిగింది. లెక్కలేనన్ని నివేదికలతోనిండిన ఏడు పెద్దసంపుటాలను (బర్మా, అస్సాం, మరికొన్ని చిన్నప్రాంతాలు వదలి దేశాన్ని ఏడుగావిభజించి ఈసంపుటాలు తయారుచేశారు) నాకు చూపారు: ఇంగ్లీషులో ఉన్నభాగాలు - లేదా అనువాదాలు - చిన్నవో పెద్దవో - ఏదో ఒకరకమైన దేశభాషల్లోని రిపోర్టులు, జాబులు అందులోఉన్నవి. వాటి నన్నిటినీ జిల్లాలు, డివిజన్లు, సబ్ డివిజన్లు, పట్టణాలు, నగరాలు గ్రామాల వారీగా ఈరిపోర్టులను వేరుపరచినారు. ఈరిపోర్టులసంఖ్య అనంతంగా ఉంది; ఆసమయంలో 30 వేల మంది వేరురిపోర్టర్లతో ఉత్తర ప్రత్యుత్తరాలున్నట్లు నాకు చెప్పారు: ఇందులో చాలభాగం, అట్టడుగున నున్నవర్గాల మనుష్యులమధ్య జరిగిన సంభాషణలను తెలుపుతున్నవి. 'ఈ పేదప్రజల పరిస్థితి పూర్తిగా నిరాశాపూరితంగా ఉన్నదనుకొంటున్నారు. ఇకఆకలితోమాడి చావవలసివస్తుందని, తామేదో చేయాలని వారు వాంఛిస్తున్నారు. పరస్పరం ఏకంగా వారేదో చేయాలనుకుంటున్నారు. ఆ యేదో అంటే హింసాకార్యాలే'. పాతకత్తులను, బల్లాలను, ఉరులను (mach locks) సమయంవచ్చినప్పుడు సిద్ధంగాఉండేటట్టు దాచిపెడుతున్నారని ఆ రిపోర్టుల్లో చాలాభాగం చెబుతున్నవి. వెంటనే ఇందువలన కలిగే ఫలితం ప్రథమదశలో మనప్రభుత్వంపై తిరుగుబాటు వస్తుందనికాని, అది సరైన అర్థంలో 'తిరుగుబాటు' గా ఉంటుందనికాని తలంచలేదు. ఏంజరుగుతుందనుకున్నారంటే హఠాత్తుగా నేరాలు, సరిపడనివారి ఖూనీలు, బాంకర్లను దోచడం, అంగళ్ళను కొల్లగొట్టడం లాంటివి జరుగుతాయనుకున్నారు. అర్థాకలితోమాడే అతి అధమవర్గాలుండటంవల్ల, తొలుత కొన్నినేరాలు జరిగినా, అవి అలాంటి వందలకొలది నేరాలకు దారితీస్తాయని, అది కడకు ఉద్యోగులను, మర్యాదస్తులను స్తంభింపజేసే సర్వవ్యాప్త అరాచకంగా మారవచ్చునీ భావించాము. ఆకుమీద నీటిబొట్లవలె ప్రతిచోటా ఈ చిన్నగుంపులు పెద్దగుంపులుగాకూడ చేరవచ్చుననికూడ భావించాము: దేశంలోని దుర్మార్గులంతా అందులోచేరుతారు. ఈ నేరస్తుల గుంపులు తగినంత సంఖ్యతో బయలుదేరేటప్పటికి, అప్పుడు అకారణంగా ప్రభుత్వానికి తీవ్రవ్యతిరేకులుగాఉన్న విద్యావంతులు కొంతమందికూడ వెంటనే ఉద్యమంలో చేరుతారు; కొన్నిచోట్ల నాయకత్వంవహించి, ఈ అశాంతికి ఒకస్వరూపాన్నిచ్చి జాతీయమైన తిరుగుబాటుగా మారుస్తారు:

(సర్ విలియమ్, వెడర్‌బరన్, అదేపుస్తకం, పుట 80 - 81)

మంచి అనుభవంగల రాజకీయవేత్తఅయిన వైస్రాయి డఫరిన్‌తో సంబంధ మేర్పరచుకొని, ఈ పరిస్థితినంతటినీ 1885 మొదట్లో హ్యూం ఆయనకు తెలియ బరచాడు. భారతదేశంలో సామ్రాజ్యవాదానికి కేంద్రమైన సిమ్లాలో జరిగిన ఈ వైస్రాయి డఫరిన్ సమావేశంలోనే ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అనే ప్రణాళిక తయారయింది. ఈ పుట్టు పూర్వోత్తరాలగూర్చి కాంగ్రెస్ మొదట అధ్యక్షుడు W. C. బెనర్జీ ఇలా తెలియజేశాడు.

"కాంగ్రెస్ తొలుత ప్రారంభమైనదీ, తర్వాత నడుస్తున్నదీ వాస్తవ స్థితిలో ఇండియా వైస్రాయిగా ఉన్నప్పుడు మార్క్వెస్ ఆఫ్ డఫరిన్ పనేనని చెబితే చాలమందికి బహుశా ఇది కొత్తగా ఉంటుంది. 1884 లో ఎ. వి. హ్యూమ్ సి. బి. కి ఒక అభిప్రాయం కలిగింది. దేశంలోని ప్రధాన రాజకీయ వేత్తలు సంవత్సరానికి ఒకతూరి సమావేశమై, సాంఘిక విషయాలను చర్చిస్తూ పరస్పరస్నేహంతో ఉండడం దేశానికి చాల మంచిదని అతను భావించాడు. ఆ చర్చలలో రాజకీయాలు కలవాలని అతను కోరలేదు.

"ఈ విషయంలో లార్డు డఫరిన్ ఎక్కువ ఆసక్తి కనబరచాడు కొంతకాలం ఆలోచించిన తర్వాత హ్యూమును పిలిపించి ఈ ప్రణాళిక ఎక్కువ ఉపయోగకారి కాదనిచెప్పాడు ఇంగ్లాండులో పార్లమెంటు ప్రతిపక్షంచేసే కార్యక్రమాన్ని సాగించేలాంటి సంస్థ ఈ దేశంలో లేదన్నాడు. ....ఏ విషయాల్లో ప్రభుత్వంలో లోపాలున్నవో, వానినెలా సరిజేయవచ్చునో తెలపడానికి భారత రాజకీయ వేత్తలు ఏటా సమావేశం కావడం, తమకూ పాలితులకూ కూడ లాభకారి అని ఆయన తెలియజేశాడు. అలాంటి సభకు స్థానిక గవర్నర్ అధ్యక్షతవహించరాదని, గవర్నర్ ఎదుట ప్రజలు తమ అభిప్రాయం వెల్లడించరని అతను చెప్పాడు. డఫరిన్ వాదం హ్యూమ్‌కు నచ్చింది తన ప్రణాళికనూ, డఫరిన్ ప్రణాళికనూ కలకత్తా, బొంబాయి, మదరాసులలోని ప్రముఖ రాజకీయ వేత్తలకు చూపాడు. వీరందరూ డఫరిన్ ప్రణాళికనే అంగీకరించి దానిని అమలుజరుప బూనుకున్నారు. తాను ఈ దేశంలో ఉన్నంతవరకు తన పేరును బయటపెట్టకూడదని లార్డు డఫరిన్, హ్యూంగారికి ఒక షరతు పెట్టాడు."

(డబ్ల్యు సి బెనర్జీ, "భారత రాజకీయాలకు ప్రవేశిక" 1898)

ఇందులో అనుశ్రుతంగావస్తున్న ఉదార సామ్రాజ్యవాదవిధానం స్పష్టంగా ప్రకటితమైనది. ఇలాగే, ప్రారంభజాతీయోద్యమ చరిత్రలు వ్రాసిన ఇటీవల రచయితలు కూడ ఈగాథను వర్ణించారు :

"కాంగ్రెస్ స్థాపనకు ముందటి సంవత్సరాలు 1857 తర్వాత చాల ప్రమాదభరితమైనవి. రానున్న వినాశాన్ని గమనించి, దానిని అరికట్టాలని ప్రయత్నించినవాడు ఇంగ్లీషు ఉద్యోగులలో హ్యూమ్.... ఇతను, పరిస్థి

తెంత విషమదశకువచ్చిందో అధికారులకు తెలియజేసేందుకు సిమ్లాకు వెళ్లాడు పరిస్థితిని ఆకళింపుచేసుకోగల ప్రతిభాశాలి కొత్తవైస్రాయి. పరిస్థితి తీవ్రతను గుర్తించేందుకు హ్యూం ప్రయాణం కారణమయిఉంటుంది. ఆ వైస్రాయి కాంగ్రెసు నిర్మాణకార్యక్రమాన్ని కొనసాగించమని హ్యూమును ప్రోత్సహించాడు ఇలాంటి అఖిలభారతఉద్యమానికి కాలం బాగా పరిపక్వమై ఉన్నది మేధావి వర్గాలసానుభూతి, సహకారాలందుకునే, రైతువిప్లవం స్థానే, కాంగ్రెస్‌నిర్మాణంతో కొత్తగా ముందుకువస్తున్న వర్గాలకు ఒక జాతీయవేదిక ఏర్పడింది దానినుండి నూతనభారతాన్ని సృష్టించ వీల యినది. హింసామూలకమైన విప్లవకరపరిస్థితి మరొకతూరి ఏర్పడకుండా చూడడం, దూరదృష్టితో చూస్తే అన్నివిధాలా మంచిదే అయింది."

(ఆంధ్రూస్, ముఖర్జీలు, "భారతదేశంలో కాంగ్రెస్ ప్రారంభమూ, అభివృద్ధీ" పుట. 128-9)

"హింసామూలకమైన విప్లవపరిస్థితి" కి వ్యతిరేకంగా కాంగ్రెస్ నిర్వహిస్తున్న అధికారపాత్ర గాంధీజీనుండి వచ్చిందికాదని బోధపడు తుంది; ఈ సూత్రాన్ని ప్రారంభంలోనే సామ్రాజ్యవాదం కాంగ్రెస్‌లో నాటింది.

కాంగ్రెస్ పాత్రనుగూర్చి హ్యూం ఎలా భావించాడో ఇక్కడ ఉదహ రించవచ్చును.

"మన చర్యలవల్లనే ఏర్పడి అభివృద్ధిచెందుతున్న మహత్తర శక్తులనుండి తప్పించుకొనేందుకు ఒక రక్షణకవచం కావాలి. అది అత్య వసరం. మన కాంగ్రెస్ ఉద్యమంకన్నా వేరే రక్షణకవచం ఏర్పరచడం బహుశా సాధ్యంకాదు."

(వెడర్‌బర్న్ ఇచ్చిన ఉదాహరణ, పుట 77)

'అతివాదుల'నుండి 'రాజభక్తి' వరులను వేరుచేయడంతో, కాంగ్రెస్‌ద్వారా ప్రభుత్వానికి బలాన్ని చేకూర్చాలని లార్డు డఫరిన్ ఆశయం. అతడు కాంగ్రెసు స్థాపన జరిగిన మరుసటి సంవత్సరం 1886 లో విద్యావంతుల వాంఛలపై ఇచ్చిన ఉపన్యాసంలో చాల తెలివిగా పైఆశయాన్ని ప్రకటించాడు.

"యూరోపులోని ప్రజాతంత్ర ఉద్యమసంస్థలను తలబిరుసుతో అనుసరించవలసిన దేశంకాదిది. నా అభిప్రాయమేమంటే - ఈ వివిధ ఉద్యమాలవల్ల ఏర్పడిన వాంఛలను తీవ్రంగా, జాగ్రత్తగా ఆలోచించాలి. అది సాధ్యమో, వాని నెంతవరకు ఆమోదించ వచ్చో అంతా త్వరగా, ఏమీ తగాదా పడకుండా ఇచ్చివేయాలి. ఈ సౌకర్యాలు భారత సమస్యకు మరొక పది పదిహేనేళ్ళ వరకు ఆఖరు పరిష్కారంగా ఒప్పుకొని తీరాలి; బహిరంగ సభలను రెచ్చగొట్టే ఉపన్యాసాలను నిరోధించాలి.

"అతివాదుల వాంఛలను అలా ఉంచితే.... బాగా అభివృద్ధిపొందిన పార్టీ ఆశయాలుకూడ, పెద్దగా ప్రమాద కరమైనవికావు. అత్యాశగానూలేవు .... నేను కలుసుకున్న దేశీయులలో చాలమంది తెలివి, సమర్థతా రెండూకలవారున్నారు. వారి రాజభక్తియుతమైన సహకార మీద నిస్సందేహంగా ఆధారపడవచ్చును వారుప్రభుత్వాన్ని బలపరుస్తున్నారంటే ఇప్పుడు బలవంతాగా శాసనసభలనుండి బయటికి లాగుతున్నట్లు కనిపించే ప్రభుత్వ చర్యలెన్నో ప్రజామోదాన్ని పొందగలవు; వారు తమవెనుక ఒక భారతీయ పార్టీని ఏర్పరచుకున్నట్టయితే. ఇప్పటిస్థితిలో భారతప్రభుత్వం ఉండదు తుపాను చెలరేగిన సముద్రములో ఏకాకిగాఉన్న కొండరాయిలా నేడు ప్రభుత్వం నిలిచివున్నది. ఈరాయి మూలమట్టంచుట్టూ ఒకేతూరిగా నలువైపులనుండి అలలువచ్చి తగిలి విరిగిపడుతున్నవి"

(సర్ ఆల్ఫ్రెడ్ లియాల్, "డఫరిన్ జీవితం" సంపుటి 2, పుటలు 151-2)

ఇక్కడ వీరి యెత్తు స్పష్టంగా కనిపిస్తున్నది. ఈయెత్తు పూర్తిగా నెరవేసుతుందనే మొదట కనిపించింది మొదటి కాంగ్రెస్ సామ్రాజ్యవాదంతో చాల అణకువతో ప్రవర్తించింది; అందులో చేసిన తొమ్మిది తీర్మానాలూ వివరంగా పరిపాలన సంస్కరణకు సలహాలను మాత్రమే సూచించాయి; శాసన సభల్లోకి కొందరు ఎన్నుకొనబడిన సభ్యులను చేర్చుకోవాలన్న ప్రార్థన ఒక్కటే, కాస్త జాతీయ ప్రజాతంత్ర వాంఛగా ఉన్నది. ఆ మొదటి కాంగ్రెస్ అధికార నివేదికలో వ్రాయబడిన సమాపన గాథలో హ్యూం ఎంత విజయవంతంగా తన మందను నడిపాడో ప్రదర్శితమైంది.

"తనకు జరిగిన గౌరవానికి కృతజ్ఞత తెలిపింతర్వాత హ్యూం దొర అభివందన సమర్పణకు నియంత్రితుడై ఇలా అన్నాడు. ఎవరి పాదుకా ముద్రికను పోగొట్టు కొనేందుకు నేను అనర్హుడనో, ఎవరికి మనమందరము ప్రేమపాత్రులమో, ఎవరికి మనమందరము పుత్రులవంటి వారమో, ఆమెకు-అసలే వదిలివేయడము కన్న అలస్యముగా చేయుటయే మంచిదన్న న్యాయాన్ని పాటించి-వందనసమర్పణకు మీరు నాకు అనుమతి నివ్వవలెనని కోరుచున్నాను. ఆ వందనములు మూడుకాదు; అంతకు మూడింతలు - సాధ్యమైతే మరీ మూడింతలు సమర్పింతాము-ఆమెగారు మహా ఘనత వహించిన చక్రవర్తిని అని నేను వేరే చెప్పవలెనా!

"ఈమాటలన్న వెంటనే బయలువెడలిన కరతాళధ్వనుల తుపానుతో ఉపన్యాసకుని మిగతామాటలు మునిగిపోయినవి, ఆయన కోరినట్లు జయ జయ ధ్వనులు పునః పునః సభ్యులు ఉచ్చరించారు."

ఇంత దాస్యభావంతో మొదలైన (ఎంతైనా ఈ నీచస్థితి భారతీయులనుంచి కాక, ఇంగ్లీషువానినుండి వెలువడడం గుర్తుంచుకోవాలి) ప్రారంభదశనుండి,

కాంగ్రెస్ నిషేధింపబడి ప్రభుత్వంచే వేటాడబడుతూ, భారతస్వతంత్ర సంగ్రామ వీరకోటి భక్తి ప్రతిపత్తులందుకున్న కాలానికి చెందినది.

కాంగ్రెస్ పుట్టుకలో ఉన్న ఈ ద్వివిధ స్వభావం, తర్వాత దానిచరిత్ర కంతటికీ చాల ముఖ్యమైనది. కాంగ్రెస్‌పాత్రలోని ఈ ద్విముఖత్వం దానిచరిత్ర పొడవునా అంతర్గతమై ఉన్నది: ఒకముఖం ప్రజాఉద్యమ "ప్రత్యేకంగా" వ్యతిరేకంగా సామ్రాజ్యవాదంతో సహకరించడం: మరొకముఖం జాతీయ పోరాటంలో ప్రజానాయకత్వం వహించడం; ఇవి కాంగ్రెస్‌పాత్రలోని రెండుముఖాలు ఈ రెండు దశాల స్వభావం, గోఖలేనుండి ఆయన శిష్యుడైన గాంధీవరకు ఉన్న కాంగ్రెస్ నాయకత్వంయొక్క అన్ని వైరుధ్యాలలోనూ మనం కనుగొనవచ్చును. (గోఖలేకూ గాంధీజీకీ ఉన్న భేదం ముఖ్యంగా, ప్రజాఉద్యమదశలోని భేదం మూలంగా అందుకు తగినట్టు ఎత్తుగడలలోను విభిన్నత అవసరమైంది కాబట్టి) ఈ వైరుధ్యానికిమూలం భారత ధనికవర్గంయొక్క రెండు రకాల లేక అటూ ఇటూ మారే పాత్ర కిది ప్రతిబింబమే. భారత ధనికవర్గం బ్రిటిష్ ధనికవర్గంతో తగాదా పడుతున్నది గనక. భారతప్రజలకు నాయకత్వం వహించడానికి అశక్తమై ఉన్నది; అయినప్పటికి "అతివేగంగా" పురోగమనం సాగితే సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు, సౌకర్యాలతోపాటు తమహక్కులుకూడ విధ్వంసమయి పోతాయేమోనని భారత ధనికవర్గం భయపడుతున్నది. జాతీయోద్యమం సమగ్రంగా, సంపూర్తిగా ప్రజలపైనా. సామ్రాజ్యవాదానికీ, దానితో సహకరించాలనే జమీందారీ. పెట్టుబడిదారీ వర్గాలకు వ్యతిరేకమైన ఆ ప్రజల ప్రయోజనాలపైనా, ఎంతవరకు నిర్మితమవుతుందో దానినిబట్టే ఈ వైరుధ్యం ఆఖరున పరిష్కారం కాగలదు.

# పదకొండవ అధ్యాయం

# జాతీయ పోరాటంలో మూడు దశలు

"హింసను ద్వేషించడం, శాంతిని కోరడం, ఓర్పుని వహించడం, జ్ఞాపకముంచుకోమ్మని మాత్రమే చెప్పి రాజకీయ సంక్షోభ సమయంలో ఈ దేశ ప్రజలకింకేమీ బోధించకపోయే ఉంటే, ఈ దేశంలో స్వతంత్రం ఎన్నటికీ చేకూరి ఉండదు".

— విలియం ఇవార్టు గ్లాడ్‌స్టన్

ఏభై యేళ్ళ భారత జాతీయత అభివృద్ధిని తగినంతగా పరిశీలించాలంటే అందుకు ప్రత్యేక గ్రంథం అవసరమవుతుంది. ఎందుకంటే, జాతీయ ఐక్యత, స్వతంత్ర పోరాటంలోని అతి విషమ ఘట్టాలద్వారా నడుస్తున్న ప్రజల రాజకీయ చరిత్ర యావత్తూ అందులో ఇమిడి ఉంది. తాత్కాలికంగా మన ఉపయోగంకోసం ప్రస్తుత రాజకీయ పరిస్థితిని అర్థంచేసుకునేందుకు ఆ అభివృద్ధిలోని ప్రధాన ఘట్టాలను సూక్ష్మంగా పరికించాలి. నేటి ఉద్యమ స్వభావాన్ని నిర్మించడంలో సాయపడిన - తమ పాత్రను నిర్వహించిన ముఖ్య వైఖరులను గమనించాలి. ఇదే ప్రధానం. మనమింతకు ముందనుకున్నట్టుగా భారత జాతీయోద్యమం, ప్రారంభ దశలో పెద్ద ధనిక వర్గానికి - భూస్వాములలోని అభ్యుదయకర శక్తులకు, కొత్తగా వస్తున్న పారిశ్రామిక ధనిక వర్గానికి, కడుపునిండా తిని కూర్చున్న మేధావి వర్గాలకు. ప్రతిబింబంగా పనిచేసింది. నిలచిన నీటిని కలతపరచిన 1914 కు ముందటి యుగంలో ప్రథమ అశాంతి పరంపర పట్టణాలలోని చిన్న ధనిక వర్గం (పెట్టీ బూర్జువాయిజీ) లో ఉన్న అసంతృప్తిని ప్రతిబింబించింది. కాని ఆ అసంతృప్తి ప్రజలవరకు పోలేదు. జాతీయోద్యమంలో ప్రజల పాత్ర, అలాగే రైతుల, పారిశ్రామిక కార్మిక నూతన శక్తుల పాత్ర 1914-18 యుద్ధం తర్వాతనే ముందుకు వచ్చింది. రెండు పెద్ద ప్రజాఉద్యమ వెల్లువలు వచ్చాయి ఒకటి యుద్ధం ముగిసిన తర్వాతి సంవత్సరాల్లోను, రెండోది ప్రపంచ ఆర్థిక సంక్షోభం తర్వాతి సంవత్సరాల్లోనూ విజృంభించింది. ఈ పోరాటాల ప్రాతిపదికపై భారత జాతీయోద్యమం నేడు దాని ప్రారంభంనుండీ బలవత్తర స్థితిని చేరుకున్నది 1946 ఎన్నికలలో కాంగ్రెసు అఖండ విజయం సంపాదించింది ఎక్కువ రాష్ట్రాలలో మంత్రివర్గాలను ఏర్పరచింది. ఇందుమూలంగా నిశ్చితమైన ప్రాతినిధ్య స్థితిని సంపాదించింది. నాయకత్వ బాధ్యతల చిక్కులన్నీ నేడు కాంగ్రెసును ఎదుర్కొంటున్నవి. నేడు కూడ తిరిగి, జాతీయోద్యమం ఏదో ఒక దారిని నిర్ణయించుకోవలసిన స్థితిలో

రెండు దారుల నడుమ నిలబడి ఉన్నది. ఈనాడు ఒక నూతన యుగం ఆరంభ మవుతున్నదని పరిశీలకులందరికీ స్పష్టమవుతున్నది. ఆ పోరాటం భారతదేశంలోని బ్రిటిష్ అదృష్టాన్ని భారత ప్రజల భవిష్యత్తును నిశ్చితంగా నిర్ణయించి వేయ గలదు. ఈనాటి సమస్యలను దృష్టిలో వుంచుకొని జరిగిపోయిన పోరాటదశలను అవి నేర్పిన పాఠాలను సంగ్రహంగా సమీక్ష చేదాము.

## 1. ప్రథమ మహాపోరాటం వెల్లువ 1905-10

ఇరవై ఏళ్ళవరకు, దాని స్థాపకులు నిర్ణయించిన మార్గంలోనే కాంగ్రెస్ ముందుకుసాగింది. ఏవిధమైన స్వపరిపాలనకుగాని ప్రధానవాంఛితాన్ని - అది ప్రధాన జాతీయవాంఛకాదు - కాంగ్రెస్ తీర్మానాలలో నిరూపించలేదు కేవలం బ్రిటిష్పాలనా సంస్థలో భారతప్రాతినిధ్యాన్ని ఎక్కువ చేయాలని మాత్రమే కోరారు ప్రతినిధిసంస్థలు ఏర్పరచాలన్నదే నాటి పెద్దకోరిక. అప్పటికి స్వపరిపాలన వరకూ రాలేదు. పాతకాలపు మితవాదనాయకుల దృక్పథం, ఆ మితవాదులలో ఎక్కువ మితవాదసమర్థుడు అయిన రమేశచంద్ర దత్తు ప్రకటనలో కనిపిస్తుంది. 1890 లో కాంగ్రెస్ అధ్యక్షుడైన ఈదత్తు "భారతప్రజల" వాంఛను 1901 లో ఈక్రిందివిధంగా తెలిపాడు :

> "హఠాత్తుగా వచ్చేమార్పులపైన, విప్లవాలపైన భారతప్రజలకు ఉబలాటంలేదు. శాసనాలుచేసే జూపిటర్ల కలలలోనుండి వెలువడే మినర్వాల లాగా కొత్తరాజ్యాంగచట్టాలను వారు కోరడంలేదు ఇప్పటికే ఉన్నమార్గా లలో పనిచేయడమే మంచిదని వారిఅభిప్రాయం ఇప్పుడున్న ప్రభుత్వాన్ని దృఢతరం చేయాలని, ప్రజలతో మరింతసన్నిహితంగా చెయ్యాలని, వారు అభిలషిస్తున్నారు. భారతవ్యవసాయ - పరిశ్రమలపక్షంగా, భారతమంత్రి సభలోను, వైస్రాయి కార్యవర్గంలోను కొందరు భారతసభ్యులుండాలని వారి యాశ. ప్రతిరాష్ట్రం కార్యనిర్వాహకవర్గంలోనూ భారతసభ్యులను చూడా లని వారు ఆశిస్తున్నారు. పాలనకు సంబంధించిన ప్రతి ముఖ్య సమస్యాచర్చలోను భారతప్రజల ప్రయోజనాలకు ప్రాతినిధ్యముండాలని వారికోరిక సామ్రాజ్యంయొక్క, అందలి పెద్దరాష్ట్రాలయొక్క పాలన ప్రజా సహకారంతో జరగాలని వారు చూస్తున్నారు.
>
> ప్రతి పెద్ద రాష్ట్రంలోను శాసనసభ ఒకటి ఉన్నది. ఈ సభలోని కొందరు సభ్యులను 1892 చట్టం మేఱకు ఎన్ను కుంటున్నారు. ఈ పద్ధతి సఫల మవుతుందని రుజువయింది. ఈ శాసన సభలను కొంత విస్తృత పరచి నట్టయితే పరిపాలన బలపడుతుంది, ప్రజలతోను సన్నిహిత సంబం ధం మరింత ఏర్పడుతుంది.... ముప్పై జిల్లాలు, మూడుకోట్ల ప్రజలు గల ఒక రాష్ట్రానికి దాని లెజిస్లేటివ్ కౌన్సిలులో ముప్పైమంది ఎన్నుకొనబడిన

సభ్యులుండడం న్యాయం. రాష్ట్ర పరిపాలనలో తమకు కొంత భాగమున్న దని ప్రతి జిల్లా కూడ భావించాలి."

(రమేశచంద్ర దత్తు 1901, ఉపోద్ఘాతం "భారతదేశ ఆర్థిక చరిత్ర" సంపుటి 1 "తొలితటి బ్రిటిష్ పాలన క్రింద ఇండియా", పుట xviii)

ఈ వాంఛలలోని మితవాదం తొలినాటి దశలోని భారత ధనికవర్గస్థితిని చక్కగా ప్రతిబింబిస్తున్నది. ఆనాటి కాంగ్రెస్ ప్రత్యేకించి ఉన్నత ధనిక వర్గానికి ప్రతినిధి. ముఖ్యంగా ఆవర్గ ఆశయాలకు ప్రతినిధులైన మధ్యతరగతి విద్యావంతులకు ప్రతినిధి. ఈవర్గంలో ప్రారంభంనుండి కాంగ్రెస్‌కు మంచి ప్రోత్సాహం వచ్చింది. అందువల్ల ప్రారంభంనుండే ప్రతినిధుల సంఖ్యను పరిమితం చేయడానికి పూనుకోవలసివచ్చింది. దీనికి వచ్చే ప్రాతినిధ్యం పూర్తిగా మధ్యతరగతుల లోనే నిలచి పోయింది.

1899 కాంగ్రెస్ మహాసభకు వచ్చిన ఇంగ్లీషు పార్లమెంటు సభ్యుడు డబ్లియు. సి. కైనీ ఇలా వ్రాశాడు. "నాచుట్టూ కూర్చున్న నాలుగువేల పెద్దలు న్యాయ, వైద్య, విద్యా, ఇంజనీరింగు వృత్తులనుండి భారతదేశం మొత్తం మీద ప్రత్యేకించి కొని తేబడిన వారు." ఆతొలి రోజులలోని మితవాద నాయకులు తాము ప్రజా ప్రతినిధులు కామని ఎరుగుదురు. ప్రజలపేర వ్యాఖ్యాతలుగా తాము మాట్లాడ ప్రయత్నించ వలసిందే కాని, ఆ ప్రజల భావాలనే తాము మాట్లాడు తున్నట్టు చెప్పడం వీలు కాదనుకున్నారు. మొదటి రోజులలో కాంగ్రెస్‌కు మార్గ దర్శి, నాయకుడు అయిన సర్ ఫిరోజిషా మెహతా ఇలా ప్రకటించాడు. "నిజమే కాంగ్రెస్ ప్రజా ప్రతినిధి కాదు. కాని ఆ ప్రజల కోరికలను కష్టాలను వ్యాఖ్యానించ డమూ, వాని నివారణకు సలహాల నివ్వడమూ వారి సోదర దేశభక్తులైన విద్యా వంతుల విధి."

ఆకాలపు భారత ధనికవర్గం, తాము బ్రిటిష్ ప్రభుత్వాన్ని సవాలు చేసే స్థితిలో లేమని బాగా గ్రహించు కున్నారు. పైగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఒక మిత్రంగా చూసుకున్నారు, వారికి ప్రధాన శత్రువు బ్రిటిష్ ప్రభుత్వం కాదు, మరి ప్రజల అధోగతి, దేశంలో ఆధునిక అభివృద్ధి శూన్యత బలవత్తరంగా అజ్ఞానం, మూఢ విశ్వాసాలు. "నిరంకుశ ఉద్యోగుల" పాలనలోని లోపాలు- ఇవీ ఈ పరిస్థి తికి కారణమని వారి అభిప్రాయం. ఈ లోపాలను ఎదుర్కొవడంలో ఎంతో ఆశతో వారు సహకారం కోసం బ్రిటిష్ పాలకులవైపు చూచారు 1898 కాంగ్రెస్ అధ్యక్షుడు ఆనందమోహన్ బోస్ ఇలా అన్నాడు. "విద్యావంతుల వర్గం ఇంగ్లాం డుకు మిత్రులేకాని. శత్రువులు కారు- ఇంగ్లాండు ముందున్న మహత్కార్యాన్ని సాధించడంలో వారు సహజ స్నేహితులు, వారి మైత్రి అవసరం కూడ" 1890లో సర్ ఫిరోజిషా మెహతా ఇలా ప్రకటించాడు. "బ్రిటిష్ రాజనీతిజ్ఞులు ఆఖరుకు మన మొర వింటారనడంలో నాకు అనుమానం లేదు." కాంగ్రెస్ జనకుడైన దాదా భాయ్ నౌరోజీ రెండో కాంగ్రెస్‌కు అధ్యక్షత వహిస్తూ, "ఈశక్తులను

(విద్యావంతులను) ప్రతి పక్షంలోనికి త్రోయకండి. మీ పక్షంవైపు తీసుకొనండి" అని బ్రిటిష్ పాలకులకు విజ్ఞప్తి చేశాడు. పాత కాంగ్రెస్ నాయకులలో "మధురో పన్యాసకుడు" సురేంద్రనాధ బెనర్జీ ఈ ఆదర్శాన్ని ప్రకటించాడు: "బ్రిటిష్ సంపర్కం యెడ అచంచల భక్తి విశ్వాసాలతో పనిచెయ్యాలి-ఎందుకంటే, బ్రిటిష్ పాలనను భారతదేశంలో తొలగించడం మన ఆశయంకాదు. దాని పునాదిని మరింత విశాల పరచడం, దాని వైఖరిని ఉదారవంతం చేయడం, దాని స్వభావాన్ని మహోన్నతం కావించడం, ఆ బ్రిటిష్ ప్రభుత్వాన్ని చెక్కుచెదరని దేశీయ ప్రేమ పునాదులపై నిలపడం మన ఆశయం" (1)

ఈ ప్రకటనల ధోరణినిబట్టి, ఈ పాతకాంగ్రెస్ నాయకులందరు, అభివృద్ధి నిరోధకులని, జాతీయ విరోధులైన విదేశప్రభుత్వ సేవకులని ఊహించరాదు. అంతేకాదు, ఆకాలంలో, భారతసమాజంలోని మంచి అభ్యుదయశక్తులకు వారు ప్రాతినిధ్యం వహించారు. అప్పుడప్పుడే మొలకెత్తుతున్న కార్మిక వర్గంఇంకా సంస్థా నిర్మాణంగాని, భావ ప్రకటనగాని లేక పడిఉంది, అలాగే రైతులు నోరులేని జీవాలుగా ఉన్నారు. అలాంటిదశలో భారత ధనికవర్గం ఉన్నతమైన అభ్యుదయ శక్తిగా, భౌతికంగా భారతదేశంలో విప్లవశక్తిగా ఉండినది. భారత దేశంలోని అధమస్థితికి వ్యతిరేకంగా, సంఘ సంస్కారానికి, విజ్ఞానవికాసాలకు, చదువుకు, ఆధునికభావాలకుగా వారు పనిచేశారు. పారిశ్రామిక, వైజ్ఞానిక ఆర్థిక అభివృద్ధికై వారు ఆక్రోశించారు.

కాని, ఈ కార్యక్రమంలో తమకు సహచారిగా పనిచేస్తుందనుకొన్న బ్రిటిష్సామ్రాజ్య తత్త్వంపై వారికున్న విశ్వాసము, ఆశ, నిరాశలయ్యాయి వీరి అభ్యుదయకరపాత్రను వీరికన్నా బ్రిటిష్సామ్రాజ్యతత్త్వం స్పష్టంగా గ్రహించింది ఇందువల్ల సామ్రాజ్యపాలనకు, దోపిడీకి తప్పనిసరిగా తగాదా ఏర్పడుతుందని బ్రిటిష్పాలకులు గ్రహించారు. కాబట్టి ప్రారంభదశనుండే, అసలు కాంగ్రెస్ పైనున్న ఆదరభావం, సందేహానికి వ్యతిరేకతకు దారితీసింది. మొదట ప్రోత్స హించిన వైస్రాయి లార్డు డఫరిన్ కాంగ్రెస్ ఏర్పడింతర్వాత మూడేళ్ళకు, అన హ్యంతో కాంగ్రెస్ "ఏలెక్కకురాని కొందరికో" ప్రాతినిధ్యం వహిస్తున్నదని అనసాగాడు. "భారతదేశం స్వతంత్రంకోసం బాధలు పడింది." అన్నపుస్త కంలో అనిబిసెంటు ఒకసంగతిని తెలియజేసింది. 1887 లో ఒక ప్రతినిధి కాంగ్రెసుకు వెళ్లాడు - ఆ జిల్లాకలెక్టరు మాట అతనువినలేదు -

---

(1) బ్రిటిష్ ప్రజాస్వామిక సంస్థలను అభినందించటంలో కూడ ఈపాత కాంగ్రెస్ నాయకులు కనబరిచే భక్తిశ్రద్ధలు మనం గమనించకుండా విడిచిపెట్టరాదు. 1882 కాంగ్రెస్లో సురేంద్రనాధ బెనర్జీ ఇలా అన్నాడు : "మనం మహోన్నతమైన స్వతంత్ర సామ్రాజ్యంలో వి పౌరులం. ప్రపంచంలో అపురూపమైన ఔదార్యపూరిత రాజ్యాంగచట్టం యొక్క ఛాయల్లో మనం రక్షింపబడు తున్నాము. ఇంగ్లీషువారి హక్కులు మనవే. వారి సౌకర్యాలు మనవే. వారి సంస్థలు మనవే. కాని ఆ హక్కులు, సౌకర్యాలుమాత్రం మనకు నిరాకరిస్తున్నారు."

ఆప్రతినిధిని పిలిచి, శాంతిని కాపాడతానని రూ. 20,000 లకు — హామీ నివ్వవలసిందని అధికారులు అతనినికోరారు "1890 లో కాంగ్రెసుకు ప్రేక్షకులుగా కూడ ప్రభుత్వోద్యోగులు వెళ్ళగూడదని ప్రభుత్వం శాఖీదువిచ్చింది. 1900 లో లార్డు కర్జన్ ఇండియామంత్రికి ఇలా వ్రాశాడు: "కాంగ్రెస్ పతనంచెందుతోంది. దానిని శాంతంగా సమాధిచెయ్యడంలో తోడ్పడాలనేదే, భారతదేశంలో ఉన్నంత వరకు నా గొప్పఅభిలాష."

(రోనాల్డుషే, "లార్డు కర్జన్ జీవితం", సంపు. 11. పుట. 151.)

బ్రిటిష్ సామ్రాజ్యవాదంపైన తమకున్న ఆశలు నిరాశలు కావడమే తత్ఫలితంగా భారత జాతీయోద్యమంలోని పాతనాయకులకు గతిఅయింది. మితవాదులకు తొలినుంచి నాయకుడైన గోఖలే తన చివరిరోజుల్లో, చాల కటువుగా ఇలా ఆక్షేపించాడు. "విద్యాధికోద్యోగవర్గం బాహాటంగా స్వార్థపర మవుతున్నది. బహిరంగంగా వారు జాతీయవాంఛలను వ్యతిరేకిస్తున్నారు. పూర్వం ఇలా గా లేదు." (అధికార "కాంగ్రెస్‌చరిత్ర" 1935, పుట 151)

పాతవిధానం విఫలమవుతుందని స్పష్టంకాగానే, కొత్తవర్గమొకటి బయలు దేరటం తప్పనిసరి. ఈ వర్గం "పాత నాయకత్వాన్ని" విమర్శిస్తూ, సామ్రాజ్య వాదంతో ఉన్న బంధనాలను తెగత్రెంపులు చేసుకునే ఒక నిశ్చిత కార్యక్రమాన్ని, విధానాన్ని ఏర్పరచుకోవాలని కోరడంకూడ తప్పదు. ఈ కొత్తవర్గం ముఖ్యంగా బి. జి. తిలక్ నాయకత్వంతో 19 వ శతాబ్ది ఆఖరుపదిలో వచ్చింది. కాని తర్వాత పదేళ్ళలో, పరిస్థితి పక్వస్థితికి వచ్చేవరకు వీరు ప్రముఖపాత్రను నిర్వహించలేక పోయ్యారు. 1870 లో తీవ్రమైన రైతుతిరుగుబాట్లు వచ్చిన మహారాష్ట్రంలో పలుకుబడిగల తిలక్‌తోపాటు, ప్రఖ్యాతులైన కొత్తనాయకులు, బెంగాలులోని అరవిందఘోషు, పంజాబులోని లజపతిరాయిగారున్నూ.

ఈ కొత్తనాయకులు తాము "జాతీయవాదులు" అనే "నిజాయితీగల కాంగ్రెస్‌వాదులు" అనీ "సనాతన జాతీయవాదులు" అనీ చెప్పుకున్నారు. కాని సామాన్యంగా "మితవాదు"లకు వ్యతిరేకులైన "అతివాదుల"గా వీరిని పిలుస్తుంటారు. ఈ పేళ్ళను కేవలం తీవ్రవాదులైన వామ పక్షంవారికీ, పాతభావాలుగల కుడిపక్షానికీ ఉన్న చిన్న విభేదాన్ని మాత్రమే ఈ పేర్లు తెలియజేస్తాయనుకోవడం పొరపాటు. నిజానికి ఆపరిస్థితిలో పరస్పర వైరుధ్యస్వభావం ఉన్నది. అందుకు కారణం ఇంకా అప్పటికి జాతీయోద్యమం పరిణతం కాకపోవడమే

మితవాద నాయకులపై ప్రతిపక్షనాయకుల వ్యతిరేకతకు మొదలు, సామ్రాజ్యవాదంతో రాజీ సహకారవిధానం వదులుకోవాలి, సామ్రాజ్యవాద వ్యతిరేకంగా స్పష్టమైన పోరాటమార్గంలో ప్రవేశించాలి అన్న కోరికే. అందులో సందేహంలేదు. ఇంతవరకు వారు అభ్యుదయశక్తులకు ప్రాతినిధ్యం వహించారు. కాని ఈకోరిక ఇంకా వ్యక్తిగతవాంఛగా మాత్రమే అతివాదులలో ఉంది. అలాంటి

స్పష్టమైనపోరాటం సాధ్యమయ్యేట్లు చేసేందుకు ఇంకా తగిన ప్రజాఉద్యమ ప్రాతిపదిక ఏర్పడలేదు. అసంతృప్తులైఉన్న మధ్యతరగతిలోని తక్కువదర్జావారికీ, విద్యావంతులైన యువకులకు, అందులో ముఖ్యంగా పేదవిద్యార్థులకు, నిరుద్యోగులుగానో తక్కువ జీతాలు తీసుకొంటూనో ఉన్న బుద్ధిజీవులకుమాత్రమే ఈ అతివాదనాయకుల విజ్ఞప్తి ఆకర్షకమైనది. ఈమధ్యతరగతి ప్రజల పరిస్థితి ఇరవయ్యో శతాబ్దిప్రారంభంలో ఎక్కువ ఆందోళనజనకమైంది. అప్పటికి సామ్రాజ్యవాద పాలనలో తమస్థితి బాగుపడేవారి లేదని స్పష్టపడింది. స్థిరజీవనం ఏర్పరుచుకున్న ఉన్నతవర్గనాయకులు, ఉపదేశించే క్రమాభివృద్ధినిగూర్చిన సుఖసిద్ధాంతాలతో ఓర్చుకొని వీరు ఉండలేక పొయ్యారు. ఇలాంటివారు, సాంఘిక సంధియుగాలలోను, పాతవ్యవస్థ విచ్ఛిన్నంకానున్న సమయంలోను పోరాటానికి తగినశక్తిచైతన్యాలకు చాల ఉద్దీపకులుగా పనికి వస్తారు. కాని, వీరు తమసహజస్థితివల్లనే, ప్రజాఉద్యమ సంబంధం తమ కార్యాచరణకు ఏర్పడేవరకు తమవాంఛలను సాధించుకోలేరు. కేవలం తీవ్రఅసమ్మతిని తెలిపే మాటలతోనో, లేక అరాచకమైన వ్యక్తిగతమైన, ఆఖరుకు రాజకీయం, ఫలితంలేని కార్యాలతో మాత్రమే సంతృప్తి పడగలుగుతారు.

ఈ నూతననాయకులకు, ఆధునికసాంఘిక రాజకీయ దృక్పథమున్నట్లయితే తమయొక్క, తమ్మనుబలపర్చేవారియొక్క ప్రధానకర్తవ్యం సాంఘిక ఆర్థిక రాజకీయ స్వతంత్రపోరాటపు పునాదిపై రైతుల, కార్మికుల సంస్థలను అభివృద్ధి పరచడమేనని అర్థంచేసుకొని ఉందురు. కాని 20 వ శతాబ్ది ప్రథమసంవత్సరాల్లో అలా అర్థంచేసుకొని ఉండవలసింది అని కోరడం, అప్పుడున్న సాంఘిక అభివృద్ధి దశను ముందుగానే అర్థంచేసుకొమ్మని కోరినట్లవుతుంది.

ఏ శాస్త్రీయమైన సాంఘిక రాజకీయ దృక్పథమూ లేక ఈ నూతన నాయకులు మితవాద నాయకులు రాజీధోరణితో అసమర్థులుగా ఉండడానికి కారణం, వారి 'విజాతీయ భావాలు' పాశ్చాత్య దృక్పథాలేనని ఊహించారు. అందువల్ల మితవాదులలోని ఈ వైఖరి మీదనే తమ దండయాత్రను కేంద్రీకరించారు. ఏవిషయంలో పాతమితవాద నాయకులు అభ్యుదయ కారులుగా ఉండిరో, సరిగా అదే వైఖరులపై వీరు తమ దాడిని గురిపెట్టారు ఈ వైఖరులకు వ్యతిరేకంగా, ఇంకా విపరీతంగా ఉన్న సాంఘిక ప్రతిరోధక శక్తుల పునాది మీద, సనాతన హిందూ ధర్మం మీద ఆధారపడి ఆధునిక పాశ్చాత్య నాగరికతకన్నా ఆధ్యాత్మికంగా ఉత్తమమంటూ హిందూ లేక "ఆర్య" నాగరికతను బలపరస్తూ జాతీయోద్యమాన్ని వీరు నిర్మించపూనుకున్నారు. భారతదేశంలోని చాల అభ్యుదయ ఉద్యమమైన జాతీయోద్యమాన్ని మరీ ప్రాచీనమైన, మతంపైన మత మూఢాచారాలపైన నిర్మించదలచారు. ఈ యుగంనుండి రాజకీయ అతివాదమూ, సాంఘిక అభివృద్ధి నిరోధక భావమూ వినాశకరంగా సమ్మేళింప బడింది. జాతీయోద్యమ భవిష్యత్తును ఈ సమ్మేళనం పలుకుబడి పాడుచేసింది. ఈధోరణిని ఇంకా దాట వలసిన స్థితిలోనే ఉద్యమం అవస్థపడుతున్నది.

వివాహంలో కన్యవయసు 10 నుండి 12 సంవత్సరాలకు పెంచాలని 'యుక్తవయస్సు బిల్లు' పై, 1890 లో తిలక్ ఆందోళన లేవదీశాడు. అతివాద జాతీయతా, అభివృద్ధి నిరోధక సనాతన హిందూమతశక్తులకూ మైత్రి ఇందులో ప్రస్ఫుటమయింది. ఈ బిల్లును అభ్యుదయకాములైన పాతమితవాదనాయకులు రనడే మొదలైనవారు బలపరచారు. దీనికి వ్యతిరేకంగా హిందూమతంలోని గడ్డు కట్టిన ఛాందసభావాలను వ్యక్తీకరిస్తూ, తిలక్ అతితీవ్రమైన ఆందోళన నడిపాడు. తర్వాత ఈయన "గోసంరక్షణ సంఘం" స్థాపించాడు (అన్ని మతాల్లోలాగే హిందూమత సూత్రాలప్రకారంకూడ ఆవు ఎందుకు పూజ్యమో ఆకాలాన్నిబట్టి వివరించ వీలున్నది. ఆ ప్రాచీనయుగంలోని సాంఘిక అవసరాలనుబట్టి అది ఏర్పడింది, అదే నేడు అనవసరపశుపోషణలను బలపరుస్తుంది కాబట్టి, ఆర్థికంగా అభివృద్ధి నిరోధకంగా పరిణమించి పశువుల శిథిలదశకే తోడ్పడుతుంది. అంతే కాక ఆవుమాంసమతినే ముస్లిములతో ప్రమాదకరమైన తగాదాకు మూలమవుతుంది). మహారాష్ట్ర జాతీయవీరుడైన శివాజీగౌరవార్థమేకాక, అందుతో సమానంగా మతపద్ధతిలో గణేశపూజకూడ జాతీయపర్వోత్సవాలుగా జరిపారు. విధ్వంసన దేవత కాళీపూజ బెంగాలులో, మరికొందరు అదేపనిగా అతిప్రాముఖ్యానికి తెచ్చారు.

ఈ మతపద్ధతుల్లో అంతర్గతమైన జాతీయదేశభక్తి ఉద్దేశాన్ని గుర్తించడం అవసరం. ఈమతాచ్ఛాదన రక్షణక్రింద, జాతీయోద్యమ ఆందోళన విరివిగా సాగింది. వార్షికోత్సవాలు, బహిరంగ సభలు వీనిద్వారా ఒక సంస్థా నిర్మాణం కూడ జరిగింది - మత నామధేయాలతో సంఘాలను యువకుల తాలింఖానాలను ఏర్పరచారు. జాతీయోద్యమం ప్రజా పునాదులపై ఏర్పడని రోజుల్లో, ఏవిధమైన రాజకీయ ఆందోళనను సంస్థలను సామ్రాజ్యవాదులు తీవ్రంగా నిరోధిస్తున్న ఆరోజుల్లో అలాంటి పద్ధతులు అవలంబించడం సమర్థనీయమే. కాని సనాతన ధర్మమే జాతీయోద్యమానికి హృదయమనీ, 'పాశ్చాత్య' ఆధునిక నాగరికతకన్నా ప్రాచీన హిందూ సభ్యతలో ఏదో అధ్యాత్మిక ఔన్నత్యం ఉన్నదని నొక్కి చెప్పడం* జరిగింది; ఇందుమూలంగా జాతీయోద్యమం, రాజకీయ చైతన్యం నిజమైన పురోగమనం చెందడం, ఇందుతో తప్పనిసరిగా కుంటుపడింది, దుర్బలమయింది. హిందూమతం గూర్చి నొక్కి చెప్పడం జాతీయోద్యమం నుండి అధిక సంఖ్యాక ముస్లిం జనాభిప్రాయాన్ని వేరు చేసేందుకు బాధ్యమయింది కూడ.

ఈ భావాలు తర్వాత భారత జాతీయోద్యమంలో చాల ప్రాముఖ్యమైనవి. ఎందుకంటే ఇవే భావాలే ఆధునిక యుగంలో మరింత సున్నితమైన రూపంలో గాంధీజం ద్వారా బయటికి వచ్చాయి కాబట్టి వీనిని మరింత జాగర్తగా పరిశీలించడం మనకు ఉపయోగపడుతుంది భారత దేశ అభ్యుదయమూ, స్వతంత్రమూ,

* (దీనినే ఆధునిక మనస్తత్వజ్ఞులు "నష్టపరిపూర్తికై ఏర్పడిన భ్రమ" అంటారు. Compensatory delusion.)

సాంఘికాభివృద్ధి మార్గంలోను, పాత లోపాలను విభేదాలను, ప్రమాదకరమైన ఆచారాలను తప్పించుకోవడంలోను ఉన్నదని కాక, సాంఘికంగా తిరోగమించడంలోను, పాతకాలపు దృక్పథాలను పునరుద్ధరించ ప్రోత్సహించడంలోనే ఉన్నదన్న విశ్వాసమే ఈ భావాలకు మూలం.

ఈ దృక్పథం ఎలా కలిగిందో మనం చూచాము. ఉన్నత వర్గానికి చెందిన మితవాద నాయకులు "విజాతీయ" దృష్టిలో పద్ధతుల్లో చదువుకోవడం, జీవితం గడపడం బ్రిటిష్ ధనికవర్గాల రాజకీయాలలో పూర్తిగా కలిసి పోయారని సనాతన జాతీయ వాదులు చూచారు. ఈ "విజాతీయత" లేక బ్రిటిష్ నాగరికతకు లొంగిపోవడం అనేదానిపై వీరు తిరుగుబాటు లేవదీయాలనుకున్నారు. కాని ఏ పునాది మీద తిరుగుబాటును వారు నడప గలరు ?

తామే వాస్తవస్థితిలో బూర్జువా దృక్పథపు సంకుచిత వాతావరణంలోనే బంధితులై యున్నారు (సోషలిజం, ఆచరణలో ఇంకా అప్పటికి, భారత రాజకీయ జీవితంతో సంబద్ధంగా లేదు ) కాబట్టి పెట్టుబడిదారీ విధాన కార్యక్రమంలోని ఇరుప్రక్కలను - ఒకటి పురోగమనమార్గం, మరొకటి విధ్వంసనమార్గం - వారు సూక్ష్మంగా అర్థంచేసుకోలేకపొయ్యారు. అందువల్ల, "బ్రిటిష్" సభ్యతఅంటూ వారు ఖండిస్తున్నది వాస్తవంలో పెట్టుబడిదారుల సభ్యతేనని వారు చూడలేకపొయ్యారు; జాతీయోద్యమం బూర్జువా నాయకత్వంక్రింద నడపబడుతున్నంత వరకు ఆపునాదిని దాటి పోలేదు; అసభ్యతకు అభ్యుదయవంతమైన అంతిమ వ్యతిరేకత కార్మికవర్గమునుండి మాత్రమే రాగలదు అప్పటికి భారతదేశంలోని అనుభవాన్నిబట్టి, ఏ కార్మికవర్గసభ్యతా, దృక్పథమూ మొలకెత్తడం ఎలాఉంటుందో వారు చూడలేరు. ఆ కార్మికవర్గ దృక్పథమొక్కటే బూర్జువా సభ్యతను తొలగించి, ఆస్థానాన్ని ఆక్రమించి, దానిని దాటిపోయి బూర్జువా సభ్యతలోని మంచిని గ్రహించి చెడుగునంతటినీ వదిలివేయగలదు. దీనిని వారు గుర్తించలేకపొయ్యారు కాబట్టి, దురాక్రమణ దారులసభ్యతకు వ్యతిరేకమైన గట్టిపునాదికై వారు వెతికారు. కాని బ్రిటిష్ ఆక్రమణకుపూర్వం భారతదేశంలోఉన్న పెట్టుబడిదారీ విధానం రాకముందటి సభ్యత మాత్రమే వారికి దొరికింది.

ఇందువల్ల, శిధిలావస్థలో అస్తవ్యస్తమైఉన్న శుష్కతర్కవాదపు మురికినీటి నుండి, విధ్వంసమైన గ్రామవ్యవస్థలో మిగిలిన ముక్కలనుండి, కాలగర్భంలో కలిసిపోయిన సభ్యతయొక్క కూలిపోయిన రాజాస్థానాల ఉజ్వలతనుండి, ఒక హిందూసభ్యత అనే స్వర్ణస్వప్నాన్ని ఊహించి, నిర్మించదలచారు. ఆ "పరిశుద్ధీకృత" హిందూసభ్యతను తమ ఆదర్శంగా, మార్గదర్శకమైన కాగడాగా తమ ముందుంచుకోవాలనుకున్నారు

మహాప్రవాహంగా వస్తున్న బ్రిటిష్ బూర్జువా సభ్యత, సిద్ధాంతాలు భారత ధనికవర్గాన్ని, మేధావివర్గాని ముంచేస్తున్నట్లు చూచి, అందుకు వ్యతిరేకంగా,

అప్పటి వాస్తవజీవిత పరిస్థితులలో ఏమాత్రం పునాదిలేని పునర్నిర్మిత దుర్బల హిందూమతాన్ని ఆ బ్రిటిష్‌బూర్జువా సభ్యతకు విరోధకంగా ఉంచాలనుకున్నారు. ఈబోధనను అనుసరించి అతివాదులు, సాంఘికశాస్త్రీయ అభివృద్ధి నంతటినీ దురాక్రమణదారుల సభ్యతగా ఖండించారు. ప్రాచీనసంప్రదాయలోని దూషణలు హక్కులు, సంస్కారవిహీనతలనుగూడ గౌరవభక్తి ప్రతిపత్తులతో మన్నించారు.

ఇలాగా దేశభక్తి ధైర్యస్థైర్యాలు గల ఈ తీవ్ర జాతీయవాద ప్రజానాయకులు ప్రజలను పాతకాలపు మూఢాచారాలనుండి వదిలించి, విమోచన మార్గంలో, విజ్ఞాన వికాసాల మార్గంలో నడిపించ వలసింది మానివేశారు-అందుకు బదులు కులమత వర్గ ప్రత్యేక మర్యాదలను, సాంఘిక అభివృద్ధి నిరోధకతను, మూఢాచారాలను బలపరిచేవారుగా కనిపించారు. అన్ని "కల్మష" శక్తులకు మిత్రులై 'జాతీయ' మత ప్రబోధక వాక్య ప్రభంజనంతో బ్రిటిష్ వారికి ముందున్న సాంఘిక సిద్ధాంత శృంఖలాలతో ప్రజలను బంధించాలని చూచారు.

ఆ సనాతన జాతీయవాదులు. ఈ విధంగా తాము సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజా జాతీయఉద్యమాన్ని నిర్మిస్తున్నట్లు విశ్వసించారు. తిలక్ వంటి మేధాశాలి, బాలికావివాహాలను సమర్థిస్తూ ఆందోళనచేశాడన్నా, గోరక్షణసంఘాన్ని లేవదీశాడన్నా ఈ విధంగానే మనం వివరించగలుగుతాము.

కాని ఈ విధానం, నిజానికి, సిద్ధాంతరీత్యా దోష భూయిష్ఠమేకాక, ఎత్తుగడగాకూడ. ఇది పొరబాటే ఇందుతో రాజకీయచైతన్యం, ఉద్యమ స్పష్టతల పురోగమనం తప్పనిసరిగా దుర్బలపడింది (దాదాపు అతివాదులలోని ప్రఖ్యాత నాయకులందరు, తర్వాత అంతో ఇంతో రకరకాలుగా సామ్రాజ్యవాదంతో సహకరించే స్థితికి వెళ్లారు; లేదా రాజకీయాలనుండి ఊహాజనిత పిచ్చివేదాంతంలో పడిపోయ్యారు; తర్వాతి ఉద్యమ పురోగతిపై సానుభూతిని గోల్పోయారు). అంతేకాక ఇందుతో పురోగమనశక్తులు విభజింపబడిపోయ్యాయి. ఈ సాంఘిక అభివృద్ధి నిరోధక కార్యక్రమంద్వారా, తీవ్రజాతీయవాదాన్ని బలపరచేందుకు సిద్ధంగా ఉన్నవారుకూడ ఇందులో కలవలేకపోయ్యారు — అలాంటివారు అతివాద కార్యక్రమం స్థానే, అభివృద్ధి నిరోధికమైన చెత్తవేదాంతాన్ని గ్రహించలేకపోయ్యారు - దీనిని వారు స్పష్టంగా అర్థంచేసుకున్నారు ఈవిభజన ఎందరో యోగ్యులను చీల్చివేసింది, మోతీలాలు విషయంలో దీనికి ఉదాహరణ దొరుకుతుంది. మోతీలాలు నిశ్చలచరిత్ర గలవాడు. అతివాదులకు వ్యతిరేకంగా పోరాడిన మితవాద నాయకులలో మోతీలాల్‌నెహ్రూకూడ ఒకడు. ఈయననుగూర్చి ఈయన కుమారుడు జవహర్‌లాల్‌నెహ్రూ ఇలా వివరించాడు :

> "దృఢతరమైన భావాలూ, ఉద్రేకాలూ, అద్భుతమైన ఆత్మగౌరవం, గొప్పసంకల్పశక్తిగల ఈయన మితవాదులరకానికి చాలదూరమైనవాడు. అయినప్పటికీ, 1907-1908 ఆ తర్వాత కొన్నిసంవత్సరాల వరకు యీయన

మితవాదులలో మితవాదిగా ఉన్నాడు — అందులో సందేహంలేదు. ఆయన తిలక్‌పై అభిమానమున్నట్లు నేను విశ్వసిస్తున్నప్పటికి ఆయన అతివాదులను తీవ్రంగా వ్యతిరేకించాడు.

"ఎందుకలా జరిగింది ? భాషకు అనుకూలమైన కార్యాచరణ ఉంటే తప్ప, ఘాటుగా తీవ్రపదజాలం వాడినంతమాత్రాన ముందుకు పోలేమని, ఆయన యోచనాపరుడు గనుక గ్రహించాడు. ఏ ఉపయుక్తమైన కార్యక్రమమూ వచ్చేట్టు లేదని కనుగొన్నాడు.... అదీకాక, అప్పుడు ఈ ఉద్యమాలలో అంతర్గతంగా మత సంబంధమైన జాతీయవాదం ఉంది; అది ఆయన స్వభావానికి గిట్టనిది. భారత దేశంలో ప్రాచీనకాలాన్ని తిరిగి ఉద్ధరించాలనే వెనకచూపువాడు కాదాయన. పాత సాంఘికాచారాలు, కులాలు మొదలైనవి అభివృద్ధి నిరోధికాలని ఆయన భావం. వానిపై సానుభూతిగాని స్నేహంగాని ఆయనకు లేదు ఆయన పశ్చిమదేశాలవైపు చూచాడు పాశ్చాత్య అభివృద్ధి ఆయన్నెంతో ఆకర్షించింది. ఈ అభివృద్ధి ఇంగ్లాండు సాహచర్యంద్వారా వస్తుందని ఆయన అనుకున్నాడు.

"సాంఘికంగా చెబితే, 1907 నాటి భారత జాతీయవాద పునరుజ్జీవనం, స్పష్టంగా అభివృద్ధి నిరోధికమైనది."

(జవహర్లాల్ నెహ్రూ, "ఆత్మకథ" ii పుట 23.24)

ఇక అసలుపోరాటం అపలుజరపడంలో, ఈ సనాతన జాతీయవాదులు, తమవాదాన్ని ఈ మతపునాది నిర్మించుకొన్నందువల్ల, అందునుండి ఏ సాధనాన్నిగాని కార్యక్రమాన్నిగాని తయారు చేసుకోలేక పోయ్యారు. కేవలం వీరికి దొరికిందల్లా వ్యక్తిగత హింసావాదం - సాహసమున్నా అసమర్థులైన పెట్టి బూర్జువా (మధ్యతరగతులు) శక్తులు, ఏ ప్రజాఉద్యమంతోను సంబంధం లేకుండాపోయి ప్రపంచమంతటా ఈ పద్ధతినే అవలంబిస్తాయి. ఇందులోను సర్వసాధారణమైన మతావేశాన్ని అస్పష్టంగా ప్రోత్సహించడం మూలంగా, రహస్యసంఘాల నిర్మాణం, ప్రచారం అతిస్వల్పంగా జరిగింది. (భయభ్రాంతులైన సామ్రాజ్యవాద పాలకులు పెద్దగా ఆక్రోశిస్తూ ఈ కార్యాలకు అధిక ప్రచురణ ఇచ్చారు. ఇంతకన్నా సామ్రాజ్యవాదులు అవలంబించిన ప్రజాసమిష్టి విధ్వంసనచర్యలు మరీ ఘోరమైనవి - ఇవి తర్వాత అమృతసర్‌లో (జలియన్ వాలాబాగ్) చక్కగా ప్రదర్శితమైనవి.) తర్వాత పోరాటంలో నూతనదశకు తగినపరిస్థితి పరిపక్వమయ్యేదాకా ఈ వ్యక్తి హింసావాదం ఏ మంత ప్రముఖపాత్రనూ నిర్వహించలేదు. తర్వాతమటుకు ముందుకువచ్చి పోరాటంలో ఒక సహాయభాగంగా ఇది పనిచేసింది.

1905 లో పోరాటంలో నూతనదశకు పరిస్థితులు పరిపక్వమయ్యాయి. ఇప్పుడు, పాతకాలపు మత, వేదాంత ఊహాగానాలకు పూర్తిగా దూరమైనట్టి ప్రధానాయుధం — ముఖ్యంగా ఆధునిక ఆర్థికలక్షణాలుగల ఆర్థిక బహిష్కారం

ముందుకువచ్చింది. ఆకాలంలో ఉపయోగకరమైన ఈ ఒక్కసాధనాన్ని ఏదుకో వరంలోనే ఆఉద్యమంలోని బూర్జువాలక్షణం వ్యక్తమయింది; తప్పకుండా ఈ ఆయుధానికి మితవాదనాయకుల బలంకూడ దొరికింది. 1905 నాటి పోరాటపు నూతన దశలో చేరిన శక్తులు ఆనాటి ప్రపంచ అభ్యుదయ తరంగాన్ని ప్రతిబింబిస్తున్నవి - జారుప్రభుత్వాన్ని జపానుజయించడం (ఆధునికయుగంలో ఆశియాదేశం యూరపియన్ రాజ్యాన్ని జయించడానికి ఇదే ప్రథమం — ఇందువల్ల భారతదేశంలో తీవ్రమైన ఫలితాలు కనిపించాయి) ప్రథమరష్యన్‌విప్లవ ప్రాథమికవిజయాలూ ఆనాటి ప్రపంచాభ్యుదయగతిని సూచిస్తున్నవి అప్పుడు భారతదేశంలో పోరాటాన్ని ముందుకుతెచ్చిన తక్షణసమస్య బెంగాలువిభజన. అప్పుడు భారతదేశంలో రాజకీయ అభివృద్ధికి కేంద్రంగాఉన్న బెంగాలును విభజించాలని లార్డు కర్జన్ ఒక ప్రణాళిక తయారుచేశాడు అతని తర్వాత వచ్చిన వైస్రాయి దానిని అమలు జరిపాడు. విశ్వజనీనంగా ఆవేశాన్ని రెచ్చగొట్టిన ఈవిభజనకు వ్యతిరేకంగా 1905, ఆగస్టు 7 వ తేదీ విదేశవస్తువులను బహిష్కరించాలని ప్రకటించబడింది.

జాతీయోద్యమం తర్వాత అతివేగంగా పురోగమించింది. 1905 కాంగ్రెస్ మహాసభ అప్పటికికూడ బహిష్కరణోద్యమాన్ని కొన్ని షరతులమీదనే బలపరచింది. కాని 1906 లో జరిగిన కలకత్తా కాంగ్రెస్ అతివాదుల పలుకుబడి బలంతో, పూర్తిగా కొత్త కార్యక్రమాన్ని ఆమోదించింది. కాంగ్రెస్ పాతనాయకుడు దాదాభాయి నౌరోజీయే ఈ కార్యక్రమాన్ని తయారుచేశాడు. ఈ కార్యక్రమమే ప్రప్రథమంగా స్వరాజ్యమనే ఆశయాన్ని ప్రకటించింది; ఈ స్వరాజ్యాన్ని, సామ్రాజ్యంలో వలస స్వపరిపాలన ప్రభుత్వమని నిర్వచించారు ("స్వపరిపాలితమైన బిటిష్ వలసదేశాలలోఉన్న ప్రభుత్వపద్ధతి ") బహిష్కరణోద్యమాన్ని బలపరచడం, స్వదేశీపరిశ్రమలను ప్రోత్సహించడం, జాతీయవిద్య అనేవి అందులో ఉన్నవి. ఇప్పుడు కాంగ్రెస్ కార్యక్రమంలో స్వరాజ్యం, బహిష్కరణ, స్వదేశీ, జాతీయవిద్యఅనేవి నాలుగు ప్రధానాంశాలైనవి.

ఒక సంవత్సరం తర్వాత గోఖలే నాయకత్వంలోఉన్న మితవాదులకు, తిలక్ నాయకత్వంక్రిందఉన్న అతివాదులకు మధ్య 1907 సూరత్ కాంగ్రెస్‌లో చీలికవచ్చింది. అతివాదుల పలుకుబడి విపరీతంగా పెరిగిపోతుండడం చూచి, మితవాదులు దబాయింపుపద్ధతి నవలంబించి చీలికను తెచ్చిపెట్టారని ఒకగాధ ఉన్నమాటలో సందేహంలేదు. ఇది చాలనాళ్ళు వివాదాంశంగా ఉండినది. ఆ తర్వాత ఈ రెండుతెగలూ ప్రత్యేకంగానే పెరిగాయి. 1916 లో ఇవిరెండూ ఏకమయ్యాయి; 1918 లో మితవాదులు, ఆఖరితూరి కాంగ్రెస్‌ను వదిలివేసి లిబరల్ ఫెడరేషన్ ఏర్పరచుకోవాలని వెళ్ళారు

ఉద్యమంలో నూతన చైతన్యంతోపాటు, ప్రభుత్వనిర్బంధవిధానం వెంటనే ఆరంభమయింది. 1907 లో రాజద్రోహసభలచట్టము, 1910 లో తీవ్రమైన

పత్రికానిరోధచట్టమూ వచ్చాయి. (1878 పత్రికలచట్టాన్ని 1882 లోని లార్డు రిప్పన్ లిబరల్ పాలనక్రింద రద్దయింది) 1818 రెగ్యులేషన్ పునాదిమీద, విచారణ జరపకుండా ప్రవాసంపంపడమనే పద్ధతిని అమలుజరిపి. అతివాదనాయకులపై ఉపయోగించసాగారు. ఇదంతా "లిబరల్" లార్డు మోర్లీ భారతరాజ్యాంగ కార్యదర్శిగా ఉన్న కాలంలోనే జరిగింది 1908 లో, ప్రభుత్వాన్ని పూర్తిగాభయపెట్టిన తిలక్, తన వార్తాపత్రికలో ఒక వ్యాసంవ్రాసినందుకు కేసుపెట్టి ప్రభుత్వం ఆయనకు ఆరేళ్ళు శిక్షవేసింది 1914 లో యుద్ధం ప్రారంభమయ్యే నెలక్రిందటివరకు తిలకును మాండలే జైలులో ఉంచారు. తిలకును అరెస్టుచేసినందుకు అసమ్మతిగా, బొంబాయి బట్టలమిల్లుకార్మికులు సర్వవ్యాప్తసమ్మె చేశారు — భారతకార్మికవర్గం జరిపిన ప్రథమరాజకీయ కార్యక్రమం ఇదే. దీనిలో భవిష్యత్తెంతో ఇమిడిఉన్నదని అప్పుడు లెనిన్ ఈసమ్మెను అభినందించాడు మిగత ప్రముఖనాయకులందరూ. శిక్షింపబడినారు; లేదా ప్రవాసం పంపారు; లేదా శిక్ష తప్పించుకొనేందుకు విదేశాలకు వెళ్ళిపోయారు 1906 నుండి 1909 లోపల, బెంగాలులో మాత్రమే 550 రాజకీయ కేసులు కోర్టులలో నడుస్తున్నవి. పోలీసులు ఎదతెరిపిలేకుండా పని చేశారు; సభలు విచ్ఛిన్నం చేశారు వ్యవసాయ కలహాలను పంజాబులో క్రూరంగా అణచివేశారు; జాతీయ గీతాలు పాడినందుకు బడిపిల్లలను అరెస్టుచేశారు.

మునుపటియుగంలో లాగే ఈ దమనీతి తర్వాత, "మితవాదులను కూడగట్టుకొని వచ్చేందుకు ప్రభుత్వం కొన్ని సౌకర్యాలిచ్చింది 1892 ఇండియన్ కౌన్సిల్స్ చట్టంలోని ప్రాతినిధ్యపద్ధతిని విధిలేక విస్తృతపరుస్తూ 1909 మింటో సంస్కరణలు వచ్చాయి వీనిప్రకారం కేంద్రశాసనసభలో పరోక్షంగా ఎన్నుకోబడిన సభ్యులను కొందరిని (మైనారిటీ) చేర్చుకుంటారు; రాష్ట్రశాసనసభల్లో పరోక్షంగా ఎన్నుకోబడిన సభ్యులు అధికసంఖ్యగా (మెజారిటీ) ఉంటారు; ఈ శాసనసభలన్నీ సలహాసంఘాలే, వీనికి అసలు అధికారాల్లేవు అప్పుడు కాంగ్రెస్‌పై సంపూర్ణ అధికారంగల మితవాదనాయకులు, తాము ప్రభుత్వంతో ఏకీభవిస్తున్నామని ప్రకటించేందుకు, ఈ సంస్కరణలను అవకాశంగా ఉపయోగించుకున్నారు; 1910 లో దిగిన కొత్తవైస్రాయికి, రాజభక్తి ఉట్టిపడే సన్మాన పత్రంతో స్వాగతమిచ్చారు; 1911 లో బెంగాలు విభజనను పునరాలోచిస్తామని చక్రవర్తి ప్రకటించేప్పటికి, కాంగ్రెస్‌నాయకులిలా ప్రకటించారు: "బ్రిటిష్ రాజనీతిజ్ఞత యెడల కృతజ్ఞత, పునర్విశ్వాసం వెల్లివిరుస్తున్నవి. ప్రతిహృదయమూ. బ్రిటిష్ ప్రభువుపై గౌరవభక్తి ప్రతిపత్తులతో ఏకంగా మ్రోగుతున్నది."

1911 లో బెంగాలువిభజనను పునరాలోచించడం, బహిష్కరణోద్యమానికి ఖండవిజయాన్ని చేకూర్చింది. 1906-11 సంవత్సరాల మధ్య పెరిగిన పోరాట వెల్లువ. ఆ తర్వాతి తొలిసంవత్సరాల్లో తనబలాన్ని నిల్పుకోలేకపోయింది; కాని జాతీయోద్యమస్థాయిలో సాధించిన శాశ్వత పురోగమనం ఎన్నటికీ నష్టం కాలేదు 1914 కు ముందుకాలపు అతివాదనాయకులు. ఎన్నిలోపాలున్నప్పటికి

శాశ్వతమైన మహత్తర ఫలితాన్ని సాధించారు: ఆ సంవత్సరంలోనే తొలిసారిగా భారత స్వాతంత్ర్యవాంఛను ప్రపంచ రాజకీయ సన్నివేశంలో ప్రాధాన్యతకు తెచ్చారు; సంపూర్ణ జాతీయ స్వతంత్ర ఆశయ బీజం, దాన్ని సాధించేందుకు పోరాటం సడపాలన్న నిశ్చయం రాజకీయోద్యమంలో నాటబడింది. ఈ బీజం పన్నెండు సంవత్సరాలలో ప్రజాసామాన్యంలో వేళ్ళుపారింది.

## 2 పోరాటపు రెండో వెల్లువ 1919—1922

ప్రథమ మహాయుద్ధం దెబ్బ సామ్రాజ్యవాద వ్యవస్థమొత్తంపై శాశ్వతమైన దెబ్బతీసింది; 1917 నుండి తర్వాతను చెలరేగిన ప్రపంచ విప్లవ తరంగాలు ముంచుకొని వచ్చాయి: వీటితో భారతదేశంలో ప్రథమ మహాప్రతిఘటనోద్యమం విజృంభించింది.

1905 నాటిఉద్యమం పపంచోద్యమాన్ని ప్రతిబింబించినట్టే 1917 విప్లవ సంవత్సరాల్లో భారతదేశంలోని బ్రిటిష్‌రాజ్యం కూకటివ్రేళ్ళను కదిపివేసిన ఈ ఉద్యమంకూడా అంతకంటే ఎక్కువగాకూడా ప్రపంచోద్యమానికి ప్రతిబింబమయినది. ఈ భారత పోరాటాభివృద్ధికీ ప్రపంచపోరాటానికీ మధ్యనున్న ఈ ఐక్యతను గుర్తించడంలో ప్రత్యేకప్రాముఖ్యమున్నది ఎందుకంటే కొందరు భావవాద రాజకీయవేత్తల్లో పదేపదే వయక్తికవైఖరి ప్రకటితమవుతూంటుంది. వీరు తీవ్ర పోరాటాలన్నిటిని, అంతో ఇంతో ఆపోరాటాలకు నాయకత్వం వహించో, వహించకనో పోయినవ్యక్తులనుబట్టి, గ్రూపులనుబట్టి మాత్రమే వ్యాఖ్యానిస్తుంటారు. భారతదేశంలోని రాజకీయోద్యమంలో, ఇంతకన్నా పరిమితమైన వర్గాలలోనే ఉన్నదిపోయి, 1917 సంవత్సరం తర్వాతనే ప్రజాసామాన్యానికి వ్యాపించేమార్పు వచ్చినదనడంలో సందేహంలేదు. కాని ఈమార్పు కేవలం భారతదేశంలోమాత్రమే జరగలేదు

అంతకు పదేళ్ళక్రితం రష్యాజారుప్రభుత్వాన్ని జపాన్ జయించడంలో నేర్చుకొన్నపాఠం తర్వాతవచ్చిన 1914 యుద్ధం, పాశ్చాత్యసామ్రాజ్యతత్త్వం అభేద్యమన్న భ్రమను ఆశియాప్రజల కళ్ళముందు పూర్తిగా తుత్తునియలు చేసివేసింది. సామ్రాజ్యవాద ప్రభుత్వాల ఆత్మవినాశకరమైన తగాదా, కోటానుకోట్ల బానిసప్రజల హృదయాలలో నేటిసామ్రాజ్యాల వినాశసమయం దాపురించినదన్న ఆశలు మొలకెత్తించినది.

పరిస్థితిని అదుపులో ఉంచుకొనేందుకు, సామ్రాజ్యవాదం తీవ్రచర్యలకు పూనుకుంది. ప్రత్యేకచట్టాలు అధికారాలు కల్పించుకొన్నారు – ఇందులో ముఖ్యమైనది ఇండియా రక్షణ చట్టం! అచంచల వీరులైనవారిని లేదా విప్లవవర్గాలలోని సభ్యులను, గ్రామాలలోనో, జైళ్ళలోనో నిర్బంధించారు. రాజకీయోద్యమంలోని పైతరగతులవారు బుద్ధిపూర్వకంగా యుద్ధప్రారంభదినాల్లో సహకారం చేయడం వల్ల ఈచర్యలకు తోడ్పాటుదొరికింది. మితవాదనాయకుల చేతిలోఉన్న కాంగ్రెస్

యుద్ధాన్ని బలపరిచి తన రాజభక్తిని వెల్లడించింది: యుద్ధసమయంలో జరిగిన నాలుగవ వార్షిక సమావేశంలో అలా తీర్మానాలు చేసింది; యుద్ధం ముగిసిన తర్వాత 1918 లో జరిగిన ఢిల్లీ కాంగ్రెసులో కూడ, రాజభక్తిని తెలిపి, "యుద్ధం విజయవంతంగా ముగిసినందుకు" అభినందిస్తూ తీర్మానం చేశారు. దీనికి బదులుగా కాంగ్రెసును ఉద్యోగులు అభిమానంతో చూచారు: 1914 కాంగ్రెస్ సభకు, మదరాసు గవర్నర్ లార్డ్ పెంట్లాండు వచ్చారు; 1915 కాంగ్రెసుకు బొంబాయి గవర్నర్ లార్డ్ విల్లింగ్టన్, 1916 కాంగ్రెస్‌కు యు. పి గవర్నర్ సర్ జేమ్సు మెస్టన్ వచ్చారు: ఈ ప్రభుత్వ ప్రతినిధులకు జేజేలతో సభ్యులు స్వాగతమిచ్చారు. యుద్ధ ప్రారంభసమయంలో లండనులో ఉన్న భారతనాయకుల ప్రతినిధులు, ప్రభుత్వానికి తమ సహకారాన్ని అందించేందుకు ఆతురతపడినారు. ఆసమయంలో లండన్‌లో ఉన్న లజపతిరాయ్, జిన్నా, సిన్హా మొదలైనవారితో కూడిన కాంగ్రెస్ రాయబారవర్గం భారతమంత్రికి ఇలా తమ నిశ్చయాన్ని ఒక జాబులో తెలిపారు: "సామ్రాజ్యానికి త్వరగా విజయం" చేకూరేందుకై, "సంస్థానాధిపతులు భారత ప్రజలు తమ శాయశక్తులా స్వేచ్ఛాపూర్వకంగా సహకారం చేసేందుకు సిద్ధంగా ఉన్నారు; స్వదేశ సహజ సంపదను చక్రవర్తి అధీనంలో ఉంచి తద్వారా ఆశయసిద్ధికి అవకాశం కలిగించవలెనని ఉన్నారు" దక్షిణాఫ్రికానుండి లండనుకు కొత్తగా వచ్చిన గాంధీజీ సిసిల్ హోటలులో జరిగిన సన్మానసభలో, "సామ్రాజ్య" దృష్టితో ఆలోచించి "తమ ధర్మం నెరవేర్చవలెనని" తన యువభారత మిత్రులను కోరాడు. తానూ మరి కొందరూ కలిసి భారతమంత్రికి వ్రాసిన జాబులో తానే యుద్ధంలో పనిచేస్తానని చెప్పాడు:

> "సామ్రాజ్యాన్నెదుర్కొన్న ఈ క్లిష్టసమయంలో, మాలో చాల మంది ఇలా అభిప్రాయపడుతున్నాము.... బ్రిటన్‌లో ఉన్న భారతీయులు, ఇష్టమున్నవారల్లా, బేషరతుగా అధికారుల పిలుపునకు సిద్ధపడాలి. మా పక్షంగాను, ఇందుతో జతపరచిన జాబితాలోని వారి పక్షంగాను, అధికారులకు విన్నవిస్తున్నదేమంటే మమ్ములను ఉపయోగించుకొనండి"

ఆయన తర్వాత లండన్‌లోని భారతీయులతో స్వచ్ఛంద సేవకదళాన్ని ఏర్పాటుచేసిన సంగతి అందరికీ తెలిసినదే. ఆయన ఇండియాకు తిరిగివచ్చినతర్వాత వైస్రాయికి తాను యుద్ధానికై పనిచేస్తానని వ్రాశాడు; మెసపటోమియా యుద్ధంలో జబ్బుపడిన - గాయపడిన వారిని మోసుకొనివెళ్ళే దళాన్ని ఏర్పరచమని కోరాడు; ఆరోగ్యకారణాలవల్ల గాంధీజీని అక్కరలేదంటూ వైస్రాయి "ఆ విషమసమయంలో, ఇతర దేశాలలో ఆయనచేసే సేవకన్న, భారతదేశంలో ఆయన ఉండడమే ఎక్కువ ఉపయోగకరం" అని జవాబిచ్చాడు. 1917 లో వైస్రాయి పిలిచిన ఢిల్లీయుద్ధ మహాసభకు గాంధీజీ వెళ్ళాడు. 1918 జూలై వరకుకూడ, ఆయన సైనికులనుచేర్చే ప్రచారంచేస్తూ, గుజరాతీ రైతులను సేనలోచేరి స్వరాజ్యం సాధించమని ఉద్బోధించాడు.

మితవాదులు కనబరచిన ఈ 'రాజభక్తి' ప్రదర్శనను, బ్రిటిష్ ఉద్యోగులు బ్రిటిష్ పరిపాలనచేసిన సౌకర్యాలకై కృతజ్ఞతాప్రకటన అనుకున్నారు. ఏమైనా నిజానికేమో, ఈ నాయకుల అంచనా ఏమంటే, ఇలా యుద్ధంలో సామ్రాజ్యవాదానికి సేవచెయ్యడంవల్ల త్వరగా భారత స్వతంత్రద్వారాలను తెరవవచ్చునని తర్వాత ఈ అభిప్రాయాన్ని ఆ నాయకులే వివరించారు. 1922 లో తన్ను విచారిస్తుండగా, గాంధీజీ ఇలా తెలిపాడు :

"ఇలాంటి సేవనంవల్ల నా దేశీయులకు సంపూర్ణ సమానస్థాయిని సంపాదించ వీలవుతుందన్న విశ్వాసమే ఈ పనులకు నన్ను ప్రోత్సహించింది"

తర్వాత ఈ నాయకులు ఆశాభంగాన్ని వెలిబుచ్చారు.

ఉన్నతవర్గ రాజకీయ నాయకుల విధేయత, యుద్ధపరిస్థితులవల్ల రేగిన ప్రజా వేదనను అణచలేకపోయింది యుద్ధంకోసం దరిద్రులైన భారత ప్రజలనుండి విపరీతంగా డబ్బు విరాళాలుగా లాగారు; ధరలు పెరిగిపోయి, లాభాలగుంజడం అధికమై ప్రజలు నానాబాధలకు, పేదరికానికి గురయ్యారు. ఈ స్థితి యుద్ధం ముగిసినతర్వాత పెద్దజ్వరాలలో (ఇన్‌ఫ్లూయెంజా) మున్నెన్నడు కనీవినని సంభవించింది 1 కోటి 40 లక్షలమంది ప్రజలు చనిపోయారు. ఇందులో ఆ ప్రజల దరిద్రస్థితి, బాధలు ద్యోతకమవుతాయి. ఈ అశాంతి విజృంభణ, పంజాబులోని గదర్ ఉద్యమంలోను, సేనలోని కుట్రలలోను ప్రతిఫలించింది; దీనిని క్రూరంగా శిరచ్ఛేదనాలతో, శిక్షలతో ప్రభుత్వం అణచివేసింది 1917 లో రౌలట్ కమిటీ నియమింపబడింది; దీనికి రాజస్థానలోని ఒక న్యాయాధిపతి అధ్యక్షుడుగా నియమితుడైనాడు; "భారతదేశంలోని విప్లవోద్యమానికి సంబంధించిన కుట్ర నేరాలను" ఈ కమిటీ విచారించాలన్నారు; కడకీకమిటీ నూతన నిర్బంధశాసనాన్ని సూచించింది.

ఈ అశాంతి విజృంభణ, రాజకీయోద్యమంలో ప్రతిబింబించ సాగింది. 1916 తర్వాత ఆ ఉద్యమంలో నూతన సంచలనం కలిగింది. 1916 లో తిలక్ భారత స్వపరిపాలనసంఘాన్ని (హోమ్‌రూల్ ఫర్ ఇండియాలీగు) స్థాపించాడు; ఈయన ఉద్యమంలో ఇగ్లీషు దివ్యజ్ఞానసమాజికురాలు బిసెంటమ్మ చేరింది ఈమె జాతీయోద్యమాన్ని "రాజభక్తి" మార్గంలో నడపాలని చూచింది; తర్వాత సహాయ-నిరాకరణోద్యమానికి వ్యతిరేకంగా గట్టిగా పోరాడింది. 1916 లో కన్నా కాంగ్రెస్‌లో అతివాద మితవాదనాయకుల మధ్య తిరిగి సామరస్యం ఏర్పడింది. ఇంకా ముఖ్యమైనవిషయ మేమంటే కాంగ్రెస్‌కూ ముస్లింలీగుకూ (1905 లో స్థాపితం) మధ్య మైత్రికి ప్రణాళికలు వేయబడినవి. 1913 లో అసలు తయారైన ఈ ప్రణాళిక 1916 లో ఫలించింది. ఈ సన్నిహితమైత్రికి, టర్కీపై బ్రిటన్ యుద్ధంచేయడంతో ముస్లిములలో చెలరేగిన ఆవేశం ఒక కారణం; ఈ అసంతృప్తిని 1915 నాటి ముస్లింలీగ్ మహాసభ అప్పటికే వ్యక్తపరిచింది. 1916 లో కాంగ్రెస్ లీగులకు మధ్య లక్నో ఒడంబడిక జరిగింది సామ్రాజ్యా

చేసే కొంతవరకు స్వపరిపాలనగల సంస్కరణలకు [illegible] చేసిన ప్రణాళికను అంగీకరించారు. (కౌన్సిళ్ళలో ఎన్నుకోబడిన సభ్యుల అధిక సంఖ్యాకులు ఉండాలి; కౌన్సిళ్ళ అధికారాలు హెచ్చించాలి; వైస్రాయి కార్యవర్గంలో సగంమంది భారతీయులుండాలి. ఇదీ ఆ సంస్కరణల్లోని కోరిక ) ఈ ఒడంబడిక తర్వాత కాంగ్రెస్ లీగ్‌స్కీమ్ అనేపేర లోకవిదితమయింది అందులోనే "సామ్రాజ్యం లోని స్వపరిపాలనంగల అధినివేశాలతో సమాన భాగస్వామిగా" భారతదేశం కావాలన్న ఆశయం వ్యక్తీకృతమయింది.

1917 లో ప్రపంచపరిస్థితి అతివేగంగా మారుతున్నప్పటి స్థితియిది. రష్యన్ విప్లవం తర్వాత, సంఘటనల గమనాన్ని యావత్తునూ కదిపివేసిన ఈ స్థితి వెంటనే బ్రిటిష్ — ఇండియాల సాంబంధ్యంలో ప్రతిబింబించింది. రష్యావిప్లవంతో ప్రాధాన్యతకు వచ్చిన జాతీయస్వయంనిర్ణయసూత్రం, ఇకపై పూర్వ సామ్రాజ్య వాదప్రభుత్వాలకు చాలకంటకంగా తోచింది. జారుప్రభుత్వం పడిపోయిన అయిదు నెలలలోగానే, బ్రిటిష్‌ప్రభుత్వం గబగబా ఒక ప్రకటనను చేసింది. (ఆ కాలంలో భారతమంత్రిపేర దీనిని మాంటేగూ ప్రకటన అంటారు కాని వాస్తవస్థితిలో కర్జన్, ఆస్టిన్, ఛేంబర్లెన్లు దీనిని తయారుచేశారు). అందులో " బ్రిటిష్‌సామ్రాజ్యంనుండి విడివడని భాగంగా భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని త్వరగా సాధించే ఉద్దేశ్యంతో, స్వపరిపాలనసంస్థల క్రమాభివృద్ధి" బ్రిటిష్‌ప్రభుత్వ ఆశయమని, "ఈదారిలో తగినన్నిచర్యలు సాధ్యమైనంత త్వరలో" తీసుకుంటామని వాగ్దానం చేశారు. ఈ ప్రకటన గబగబా చేశారనేందుకు నిదర్శనం, ఈప్రకటన చేసింతర్వాత అందులో ఏంచేయదల్చుకున్నారో తెలుసుకునేప్రయత్నం ప్రారంభం కావడమే; దీనికి ఫలితంగా మాంటేగూ చెమ్స్‌ఫర్డు నివేదిక సంవత్సరం తర్వాత వెలువడింది; ఈసంస్కరణలు (రాష్ట్రాలలో ద్వంద్వపరిపాలనాపద్ధతి — అంటే బ్రిటిష్ భారతమంత్రుల మధ్య శాఖా విభజనం) 1919 వరకు చట్టరూపం తాల్చలేదు. ఆచట్టం 1920 లోనే అమలులోకివచ్చింది. ఆసమయానికి, భారతదేశంలోని పరిస్థితంతా మారిపోయింది.

సంస్కరణలు కొంతవరకు విజయవంతమైనాయి: పదేళ్ళకు ముందటి మింటోమార్లే సంస్కరణలులాగే ఇవీ పైతరగతుల జాతీయనాయకత్వంలో చీలిక కల్గించాయి; కాని ఇలా సాధించిన మితవాదుల సహాయం, బాగా అభివృద్ధిచెందిన ఈదశలో రాజకీయపరిస్థితిపై చాలతక్కువ గణనకువచ్చింది. 1917 ఆఖరున జరిగిన కలకత్తా కాంగ్రెస్‌కు అధ్యక్షతవహించిన బిసెంటమ్మ ఈ క్రింది తీర్మానం ఆమోదింపజేయగల్గింది : భారత ప్రజలందరి పక్షంగా ఈకాంగ్రెస్, తమ దృఢ రాజభక్తిని, ప్రేమను చక్రవర్తికి తెలియజేయవలసిందిగా గౌరవంతో ప్రార్థిస్తున్నది; బ్రిటిష్‌సంబంధంపై భక్తిని, అన్నికష్టాలలోను ఏమైనాసరే—బ్రిటిష్‌సామ్రాజ్యంతో నిలవాలన్న దృఢనిశ్చయాన్ని తెలుపుతున్నది". ఇలా తీర్మానించినప్పటికీ, 1918 వేసవిలో సంస్కరణలు ప్రకటింపబడుతూనే, బొంబాయిలో కాంగ్రెసు, ప్రత్యేక

సమావేశంలో ఈ ప్రతిపాదన .. "నిరాశాజనకంగా, అసంతృప్తికరంగా" ఉన్నా వని ఖండించింది. ఈ ప్రత్యేక కాంగ్రెస్ తర్వాతనే, గాంధీజీ తప్ప మిగత ప్రధాన మితవాద నాయకులు కాంగ్రెస్ ను వదిలిపెట్టిపోయారు. తర్వాత, సామ్రాజ్యవాదంతో సహకరించాలని కోరే ఉద్దేశ్య వాదులకు సంబంధించిన భారత లిబరల్ ఫెడరేషన్ ను వీరు స్థాపించారు. 1919 డిసెంబరులో కూడా, సంస్కరణలను అంగీకరించాలంటూ కాంగ్రెస్ నిర్ణయించింది; కాని ఈనాటి విభేదం తర్వాతనే జరిగింది. ఆ విభేదంలో, గాంధీజీ మాంటెగుతో సహకరించాలని పోరాడారు. మరి సి. ఆర్. దాస్ ప్రతిపక్షానికి నాయకత్వం వహించారు. ఆఖరు తీర్మానం సంస్కరణలు ఏమన్నప్పటికీ ఉద్ఘాటించి, స్వయం నిర్ణయ సూత్రాన్ని అనుసరించి సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకు త్వరలో తగిన కార్యక్రమం జరపాలి." అని ప్రకటించింది

కాని, గాంధీజీ ప్రవేశపెటిన సవరణమూలంగా ఈమాటలుకూడ చేర్చారు: "అలాంటి ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టేలోగా, సాధ్యమైనంతవరకు సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వస్థాపన త్వరలో సాధించేలాగా, ఈ సంస్కరణలను ప్రజలు అమలు జరుపుతారని కాంగ్రెస్ విశ్వసిస్తున్నది."

1919 ఆఖరు వరకుకూడ, సంస్కరణలను అమలుజరిపి సహకారం చెయ్యాలనే గాంధీజీ దృక్పథం. ఆ సంవత్సరం ఆఖరున ఆయన వారపత్రికలోని ఒక వ్యాసం ఇలా తెలుపుతున్నది :

> "ప్రభుత్వప్రకటనలో జతపరచబడిన సంస్కరణల చట్టం, భారత ప్రజలకు న్యాయం కలిగించాలన్న బ్రిటీషు హృదయపూర్వక ఉద్దేశాన్ని తెలుపుతున్నది. ఆవిషయంలో అనుమానాలను అది తొలగించి తీరుతుంది.... కాబట్టి మనకర్తవ్యం, సంస్కరణలను తీవ్రంగా విమర్శించడం కాదు, వానిని విజయవంతమయ్యేలాగా శాంతంగా కూర్చొని మనంపని చెయ్యాలి."
>
> (ఎమ్. కె. గాంధీ, 'యంగ్ ఇండియా'లో డిసెంబర్ 31- 1919.)

ఈ ప్రకటన చాల ముఖ్యమైనది. ఎందుకంటే రౌలట్ చట్టాలు, అమృతసర్ హత్యలు, పంజాబులో సైనికపాలన (మార్షల్‌లా) మొదలైన సంఘటనల తర్వాతనే ఈ ప్రకటన జరిగింది. కాబట్టి సహాయ నిరాకరణోద్యమానికి ఈ ఘటనలు కారణమని చెప్పినప్పటికీ, తర్వాతిసంవత్సరం సహాయ నిరాకణోద్యమం ప్రారంభించేందుకు వేరు అంచనా కారణమని ఈ ప్రకటనవల్ల తెలుసుకోవచ్చును.

కాంగ్రెస్ ఇంకా సహకారం చేస్తున్నప్పటికీ, నిజస్థితిలో 1919 లో భారత పరిస్థితంతా మారింది. కాంగ్రెస్ అడుగులక్రింద సహకార పునాదులు మాయమవుతున్నాయి. 1919 లో భారత దేశమంతటా ప్రజల్లో అశాంతి వ్యాపించింది. 1918 ఆఖరునెలలు, 1919 మొదటినెలల్లోనే, ఇంతకుముందెన్నడూ భారత

దేశంలో జరగనంత విరివిగా సమ్మెఉద్యమం ప్రారంభమయింది. 1918 డిసెంబరులో బొంబాయిమిల్లుసమ్మె ప్రారంభమై 1919 జనవరికంతా 1,25 000 కార్మికులకు వ్యాపించింది. 1919 తొలిరోజుల్లో ప్రవేశపెట్టబడి, 1919 మార్చిలో రౌలట్ చట్టం అమలుకు వచ్చింది. యుద్ధకాలపు చట్టాలు రద్దుకావడంవల్ల, ఆ విపరీత నిర్బంధవిధానానికి తగిన ప్రభుత్వాధికారాలకోసం, కేసులను సామాన్య న్యాయస్థానాల్లో విచారించవలసిన అగత్యం లేకుండా చేసుకోవడంకోసం, విచారణ లేకుండా జైల్లో పెట్టడంకోసం, ఈ చట్టం చేయబడింది. ఇందుతో సంస్కరణలనే మఖ్మల్ తొడుగు వెనకనున్న సామ్రాజ్యతత్త్వపు కఠోరహస్తం కనిపించింది. దీనికి ప్రజలందరూ ఆవేశపూరితులయ్యారు. గాంధీజీ దక్షిణాఫ్రికా అనుభవాన్ని ఉపయోగించుకొని రౌలట్ చట్టాలకు వ్యతిరేకంగా సత్యాగ్రహాన్ని నడపదలచాడు; ఇందుకోసం ఆయన ఫిబ్రవరిలో సత్యాగ్రహ సమితిని స్థాపించాడు. ఏప్రిల్ 6 వ తేదీని సర్వవ్యాప్తంగా హర్తాల్ చేయాలని నిశ్చయించారు. అందులో ప్రజలుచూపిన తోడ్పాటు ఉద్యమ ప్రారంభకులను ఆశ్చర్యానందాలలో ముంచివేసింది. మార్చి ఏప్రిల్ నెలలంతా దేశంలోని వివిధ భాగములలోను మహత్తరమైన ప్రజాప్రదర్శనాలు, సమ్మెలు, అశాంతి. కొన్నిచోట్ల సంఘర్షణలు జరిగాయి; ప్రజలు ధైర్యస్థైర్యాలతో తీవ్రదమననీతిని ఎదుర్కొని, ఎందరో మరణాలకు గురయ్యారు. ఆసంవత్సరం ప్రభుత్వపు సాలుసరి నివేదిక, ప్రజల్లో కొత్తగా ఏర్పడిన ఐక్యతకు ఆశ్చర్యాన్ని భయాన్ని వెలిబుచ్చింది. హిందూముస్లిం ద్వేషాన్ని గూర్చిన ఉద్యోగులభావాలన్నీ భగ్నమయినందుకు ఆ నివేదిక విస్తుపోయింది.

> “ఈ సర్వవ్యాప్తసంచలనంలో గమనించదగిన అంశమేమంటే, హిందువులకు ముస్లిములకు మధ్య ఎన్నడూ లేనంత సహోదరభావం ఏర్పడింది. హిందూముస్లిం సామరస్యాన్ని, జాతీయవేదికలో ఖచ్చితమైన ప్రణాళికగా చాలారోజులనుండి హిందూముస్లిం నాయకులిరువురూ అనుసరిస్తున్నారు. ఈసారి ప్రజల సంచలనంలో, దిగువతరగతులవారుకూడ తమవిభేదాలను మరచిపోనిశ్చయించుకున్నారు. అద్భుతమైన సోదరభావం సూచించేసంఘటనలు జరిగాయి. బహిరంగంగా హిందువులు ముస్లిములు ఒకరినీరొకరు పుచ్చుకున్నారు. ఏ ఊరేగింపులోను నినాదాలద్వారా, పతాకాలలో వ్రాసిన మాటలద్వారా ఒకే ఒక ప్రధాన ఆశయం - హిందూముస్లిం ఐక్యత అనేదే-కనిపిస్తుంది, ఒక మసీదులోని వేదికమీదనుండి, హిందూనాయకులు వుద్బోధించేందుకు ప్రత్యక్షంగా ముస్లిములు అనుమతించారు! (“ఇండియా 1919 లో”)

దారుణంగా నిర్బంధ విధానం చెలరేగింది. ఈ సమయంలోనే జలియన్‌వాలాబాగ్ రాక్షస హత్యలు జరిగాయి. జనరల్ డయ్యర్ బయటికిపోవీలులేని ఒక ఆవరణలో నిరాయుధులైన ప్రజలపై 1,600 సార్లు కాల్పులు

సాగించారు. ఇందులో (ప్రభుత్వ లెక్కలను అనుసరించి) 379 మంది చనిపోయారు. 1200 మంది గాయపడి దిక్కుమొక్కు లేకుండా వదలివేయ బడినారు. ఈ హత్యలకు కారణం జనరల్ డయ్యర్ తర్వాతి ప్రకటన ప్రకారం "సైనిక దృష్ట్యా, అక్కడున్న వారిలోనేకాక ముఖ్యంగా పంజాబు అంతటా నైతిక ఫలితం" కల్పించడమే - అంటే ప్రజలను భయభ్రాంతులను చేయడమే నన్న మాట. ఈ ఘోర దురంతాలను ఏ మాత్రం బయటికి పొక్కనీకుండా ఉంచారు. ఈ హత్యల వివరాలు కాంగ్రెసు కమిటీ నాయకులకుకూడ నాలుగు నెలల తర్వాత గాని చేరలేదు. దాదాపు ఎనిమిది నెలలవరకు దీనికి సంబంధించిన వార్తలన్నిటినీ ప్రభుత్వం తొక్కిపెట్టింది పార్లమెంటుకు కాని బ్రిటిష్ ప్రజలకుకాని తెలియనీయ లేదు. రాజనీతి కారణాలవల్ల, తీవ్రమైన ఆందోళనవల్ల, కాంగ్రెసుకమిటీ విచారణ జరపడంవల్ల, ప్రభుత్వం ఒక విచారణ జరపవలసి వచ్చింది. ఈ దురంతాలను ఖండింపవలసి వచ్చింది. కాని జనరల్ డయ్యర్‌కు అతని ధీరకార్యానికిగాను సామ్రాజ్యవాదులు వీరఖడ్గాన్ని (20,000 పౌనులనిధిని) బహూకరించారు. అతని చర్యలకు ప్రభువుల సభ అధికార రీత్యా ఆమోదాన్ని తెలిపింది. మార్షల్ లా పంజాబులో అమలుపరచబడింది. అప్పుడు ప్రజలను గుంపులు గుంపులుగా కాల్చారు ఉరితీశారు, విమానాలనుండి బాంబులు కురిపించారు పెద్ద పెద్ద శిక్షలు వేశారు. ఈ వార్తల వివరాలు నేటికికూడ, తర్వాత జరిగిన విచారణలద్వారా కొద్ది కొద్దిగానే తెలియవస్తున్నవి

బ్రిటిష్ అధికారుల అభిప్రాయప్రకారం "ఉద్యమం, నిర్మాణయుతమైన బ్రిటిష్‌ప్రభుత్వ వ్యతిరేక తిరుగుబాటు స్వరూపాన్ని నిస్సందేహంగా పొందింది" (సర్ వాలెంటైన్ చిరోల్, "ఇండియా 11 1926 పు 207). ఇలా పురోగమిస్తున్న పరిస్థితిని గాంధీజీ సంభ్రమంతో చూచాడు. కలకత్తా, బొంబాయి అహమ్మదాబాదు వగైరాచోట్ల పాలకులపై ప్రజలు అక్కడక్కడా జరిపిన హింసా కృత్యాలనుబట్టి గాంధీజీ ఇలా ప్రకటించాడు : "నేనొక హిమాలయమంత పెద్ద తప్పిదం చేశాను. అందువల్ల అనర్హులైన వ్యక్తులు, నిజమైన సత్యాగ్రహులు కానివారు అల్లరులను లేపవీలయింది." దీని ననుసరించి, ఏప్రిల్ మధ్యలోనే హర్తాళ్ జరిగిన వారంలోగా సత్యాగ్రహోద్యమాన్ని గాంధీజీ తాత్కాలికంగా ఆపివేశాడు. ఇలాగా సమగ్ర మహత్ స్వరూపాన్ని అందుకొన ప్రారంభించిన సమయంలో ఉద్యమాన్ని ఆపివేశాడు : ఇందుకు కారణాన్ని జులై 21 పత్రికలకు వ్రాసిన లేఖలో వివరించినట్టుగా "సత్యాగ్రహి ప్రభుత్వాన్ని బాధపెట్టవలెనని ఎన్నడూ కోరడు" అనేదే ఈ "సత్యాగ్రహం" ప్రారంభ అనుభవం, తర్వాత ఇంతకన్న పెద్దస్థాయిలో పదేపదే అమలు జరిగింది.

1919 డిసెంబరులో మనం ముందుచూచినట్టుగా, కాంగ్రెస్ సంస్కరణలను అమలుజరప నిశ్చయిస్తున్నది, గాంధీజీ "శాంతంగా కూర్చొని అసంస్కరణ విజయవంతమయ్యేలా పనిచేయడం" జాతీయోద్యమ కర్తవ్యమని చెబుతున్నాడు.

కాని పరిస్థితి అలాంటి విజయావకాశానికి అవకాశమియలేదు. 1919 లో ముందుకురికిన ప్రజాఉద్యమ ప్రవాహం, 1920 లోను 1921 లోను కూడ పురోగమిస్తూనే ఉన్నది. 1920 ఆఖరున ఏర్పడిన ఆర్థికసంక్షోభంలో మరింత తీవ్రతర మయింది. 1920 లోని మొదటి ఆరునెలల్లో మహా ప్రమాణంలో సమ్మె ఉద్యమం వ్యాపించింది 200 సమ్మెలు జరిగాయి. అందులో 15 లక్షల కార్మికులు పాల్గొన్నారు అలాంటి ఉద్యమం "శాంతంగా సహించాలి" అనే వేదాంత బోధనలను అపహాస్యభాజనం చేశాయి. 1920 లో జరిగిన కాంగ్రెస్ ప్రత్యేక సమావేశంలో కాంగ్రెస్ అధ్యక్షుడు ఇలా ప్రకటించాడు:

"మన మాతృభూమి విప్లవయుగంలో ప్రవేశిస్తున్నదన్న సత్యాన్ని కప్పిపుచ్చజూడడం ప్రయోజనంలేదు....సంప్రదాయాన్నిబట్టి స్వతస్సిద్ధం గానుకూడ మనం విప్లవాలకు విముఖులం. అనుశ్రుతంగా మనం మెల్లగా నడిచే ప్రజలం; కాని పురోగమించాలని ఒకతూరి నిశ్చయించామా, ఇక త్వరగా పెద్దపెద్ద అంగలతో మనం ముందుకు సాగుతాము. జీవితంలో ఏ ప్రాణమున్న జీవికూడ పూర్తిగా విప్లవాలనుండి తప్పించుకోవడం సాధ్యంకాదు."

"(లజపతిరాయ్, కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసం, 1920 సెప్టెంబర్)

కాంగ్రెస్ అధ్యక్షుని వివరణం ప్రధానాంశంలో సరైనది. కాంగ్రెసునాయకుని ఆ ప్రకటన వాస్తవంలో ఏంతెలుపుతున్నదంటే: "విప్లవయుగం" మధ్యలో "సంప్రదాయాన్నిబట్టీ,స్వతస్సిద్ధంగానుకూడ విప్లవానికి విముఖమైన" నాయకత్వం, విజృంభించి వస్తున్న ఉద్యమానికి నాయకత్వం వహించవలసిన సమస్యను ఎదుర్కొనవలసి వచ్చింది. మిగత చాలదేశాల్లోవలెనే, భారతదేశంలో ఏర్పడిన యుద్ధానంతర పరిస్థితిలోని పరస్పరవైరుధ్యం పై సంగతిలో ఇమిడిఉంది. ఆ సమయంలో యుద్ధంమూలంగా కలిగిన అవకాశాలకు తగినరీతిగా రాజకీయోద్యమం పరిపక్వదశకు రాలేదు.

ఇలాంటిస్థితిలోనే 1920 లో గాంధీజీ, మరి ఇతర ప్రధానకాంగ్రెస్ నాయకులు (పాతమితవాదులప్పటికి విడిపోయారు) యుద్ధరంగాన్ని పెద్దగామార్చారు సంస్కరణల సహకారాన్ని త్రోసివేసి, అనంతంగా పెరిగివస్తున్న ప్రజా ఉద్యమానికి నాయకత్వం వహింప నిశ్చయించారు. ఇందుకుగా వారొక "అహింసాత్మకమైన సహాయనిరాకరణ" అనే ప్రణాళికను తయారుచేశారు. ఇకనుండి ప్రజా ఉద్యమాన్ని కాంగ్రెస్ నడుపుతుంది; కాని నాయకత్వానికి అచ్చుకో వలసిందేమంటే పోరాటం "అహింసాయుతంగా"నే ఉండితీరాలి.

అహింసాయుతమైన సహాయనిరాకరణోద్యమ నూతనప్రణాళికను 1920 సెప్టెంబరులో జరిగిన కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్ ఆమోదించింది దీనికి వ్యతిరేకత లేకపోలేదు. కాని గాంధీజీ, మోతీలాల్ నెహ్రూలు, అప్పటికి బలవత్తరంగా ఉన్న ఖిలాఫత్ ఉద్యమనాయకులైన తీవ్రముస్లింనాయకులు, అలీ సోదరులు

పరిసి చేసిన అమోదించివేశారు. (ఖిలాఫత్ ఉద్యమం స్వభావంలోనేమో, పెద్ద ముస్లింరాజ్యమైన టర్కీ కి వ్యతిరేకంగా ఒడంబడికలో జరిగిన అన్యాయాలకు అసమ్మతి తెలపడం. కాని ఆచరణలో ముస్లిం ప్రజానీకంలో నిజాంతంలిని సమీకరించే కేంద్రమిది) అతిత్వరలో ... ఒక సంవత్సరంలో స్వరాజ్యాన్ని స్థాపించేటందుకు, ... గాంధీ రూపొందించిన "అహింసాత్మక సహాయనిరాకరణోద్యమ కార్యక్రమాన్ని ఆమోదించారు. ఈ కార్యక్రమంలో కొన్ని పదవులు ... ప్రభుత్వం ప్రదానించిన బిరుదులను ... ప్రభుత్వ ... (శాసనసభలను, కోర్టులను, విద్యాసంస్థలను బహిష్కరించడం). "... పన్నులు కట్టకపోవడం, వాటింటివాటిని ..." అనే వాటితోపాటు అవసరమైతే ఎప్పుడో భావి కాలంలో ... ఈ కార్యక్రమ దశలు వెనకాయి. ఇందులోని బాతృత్విక కార్యక్రమం బహిష్కరణ. అది కేవలం మధ్యతరగతులవారు, ఉద్యోగులు, వకీళ్ళు, విద్యార్థులు మాత్రమే అనుసరించవలసింది. ఇక ప్రజా సామాన్యపాత్ర కేవలం "వడకటం, నేయడం" అనే నిర్మాణ కార్యక్రమం మాత్రమేనని ఇందులో బోధపడుతుంది. ప్రజాకోటి కలిసిపనిచేసే పన్నులనిరాకరణను (అంటే అవశ్యంగా జమీందారులకు గుత్తలనిరాకరణకూడ) ఏదో భావికాలానికి అట్టిపెట్టారు.

కొత్తశాసనసభల ఎన్నికల బహిష్కరణ సవంబరులో విజయవంతంగా సాగింది. మూడింట రెండువంతుల ఓటర్లు పాల్గొనలేదు. విద్యాలయాల బహిష్కరణ బాగా విజయవంతమైంది - విద్యార్థి సామాన్యం ఉత్సాహపూరితులై సహాయ నిరాకరణోద్యమంలోకి వచ్చారు. కోర్టులను వకీళ్ళు బహిష్కరించడం మటుకు అంతవిజయవంతంగా సాగలేదు కొందరు ప్రఖ్యాతులు మోతీలాల్ నెహ్రూ, సి. ఆర్. దాస్ లాంటివారు వదిలివేశారు.

1920 డిసెంబరులో నాగపూరులో జరిగిన కాంగ్రెస్ వార్షిక మహాసభలో ఈ నూతన కార్యక్రమం దాదాపు ఏకగ్రీవంగా ఆఖరుకు ఆమోదించబడింది. కాంగ్రెస్ ఆశయం మారింది: పూర్వం సామ్రాజ్యంలోనే వలసదేశపు స్వపరిపాలనం తమ ఆశయమన్నది తొలగించి "స్వరాజ్యాన్ని శాంతియుతమైన న్యాయపద్ధతులతో సాధించుట" ఆశయమని ప్రకటించారు. కాంగ్రెస్ సంస్థానిర్మాణముకూడ, పూర్వంలాగా లేకుండా, ఆధునిక పార్టీసంస్థగా మారింది. దానిశాఖలు గ్రామాలవరకు వ్యాపించాయి, పదిహేనుమందితో ఒక కార్యవర్గాన్ని ఏర్పరచారు ("వర్కింగ్ కమిటీ")

గాంధీజీ తయారుచేసిన నూతనకార్యక్రమం కాంగ్రెస్‌కు బ్రహ్మాండమైన అభివృద్ధిని సూచించింది ఇప్పుడు జాతీయ స్వతంత్ర సాధనకై ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాపోరాటాన్ని నడిపే రాజకీయపార్టీగా కాంగ్రెస్ నిలబడింది ఈఘట్టం నుండి కాంగ్రెస్, జాతీయోద్యమ కేంద్రసంస్థగా స్థానం సంపాదించుకుంది.

(ఈ స్థానాన్ని చూచి, అంతకు క్రిందటికాలపు అతివాద జాతీయవాదులు చెవి గోక్కొని ఉండేవారు.)

కాని ఈ నూతన కార్యక్రమంలోను, విధానంలోను మరొక అంశం కూడా ఉంది. ఇది ప్రజాపోరాటానికి విభిన్నమైనది. పెట్టీ బూర్జువా ధర్మబోధన ఊహాగానం, సంస్కరణవాదుల శాంతివాదం ఇందులో కనిపిస్తుంది. ఈ అంశం "అహింసా యుతం" అనే అమాయకంగా కనిపించే పదంలో గర్భితమైంది. ఈ పదాన్ని బాగా ఏరివేశారు. తాను భక్తి ప్రతిపత్తులతో, ఆవేశంతో బోధించే మత వేదాంత భావమంతా అందులో ఉండేట్టు గాంధీజీ ఆ పదాన్ని ఉద్దేశించాడు భారతీయ వేదాంతుల ప్రాచీన ఊహాగానానికి కొన్నివిధాల ఇది దగ్గరగా ఉన్నది కాని తర్వాతి పాశ్చాత్య భావాలవల్ల జనించినదే ఇది. టాల్‌స్టాయ్. థొరే. ఎమర్సన్‌లకు మరీ సన్నిహితంగా ఉంటుంది. పశ్చిమ దేశాలలో తొలుత గాంధీ ఉన్నప్పుడు వీరి పలుకుబడి అస్పష్టంగా ఆయన మీదపడి ఆయన అభిప్రాయ నిర్మాణంలో పనిచేసింది. అదే పదాన్నే గాంధీ సహచరులెందరో ఆయన వేదాంత భావాలను అనుసరించ కున్నప్పటికి ఏదో పరిస్థితులకు అనుకూలంగా కనిపించే సామాన్య సూత్రంగా అంగీకరించారు. ఏమైనా బలవంతుడు ఆయుధ పరిపూర్ణుడైన సామ్రాజ్య శత్రువుతో నిరాయుధులైన ప్రజలు చేసే పోరాటపు ప్రథమదశల్లో ఇది తప్పదని వారు భావించారు. కాని నిజస్థితిలో తర్వాతి సంఘటనల అనుభవాన్ని బట్టి దాని వ్యాఖ్యానం దినదినం పెరిగిపోతున్నందువల్ల మనకు బోధ పడేదేమిటి? చూడ్డానికి అమాయకమైన జీవకారుణ్య దృష్టిని, లేదా అవసరాన్ని. సూచించే ఆ పదంలో అంతిమ పోరాట నిరాకరణమే కాక, పెద్ద ధనికుల, భూస్వాముల ప్రయోజనాలతో ప్రజా సామాన్య ప్రయోజనాలను సమాధాన పరచ జూడడంవల్ల, ధనిక భూస్వామి ప్రయోజనాలు తప్పకుండా ప్రజా పోరాటానికి వ్యతిరేక మైనందువల్ల. తాత్కాలిక పోరాటాన్నికూడ ఆపడం అపదంలో అంతర్గర్భితమై ఉన్నది. ఎన్నో పెద్ద విజయాలను సాధించినా ఉద్యమం శిథిలం కావడానికి ఈ తొలుతటి పరీక్షాసమయంలోనే కాక తర్వాత పదేళ్ళకు జరిగిన పోరాట దశలో కూడ-కారణమైన పరస్పర వైరుధ్యం ఇక్కడే (ఈ పదంలోనే) ఉంది. ఈనూతన విధానంతో త్వరగా తప్పకుండా వస్తుందని స్వేచ్ఛగా వాగ్దానం చేసిన స్వరాజ్య సాధన విఫలం కావడానికి కారణం కూడ ఈపరస్పర వైరుధ్యమే.

ప్రజాఉద్యమం ముందుకు దూసుకొనిపోవడంతో స్వరాజ్య సత్వరసాధనకై ప్రభుత్వానికి వ్యతిరేకంగా నూతన తీవ్రకార్యక్రమాన్ని కాంగ్రెస్ అవలంబించింది. గాంధీజీ స్వేచ్ఛగా. దృఢంగా. నిశ్చయంగా ఒక జోస్యం చెప్పాడు. (ఇదెంత అస్పష్టంగా కనిపించినా ఆరోజుల్లోని ఉత్సాహంలో ఆయన అనుగాములు ఘట్టిగా నమ్మారు.) అందులో ఒక్క సంవత్సరంలో - తేదీకూడ నిర్ణయించారు. 1921 డిశంబరు 31 నాటికి స్వరాజ్యం వస్తుందని ముందువెనుక చూడకుండా వాగ్దానం చేశాడు. 1921 సెప్టెంబరులో జరిగిన మహాసభలో గాంధీజీ ఈ క్రింది

ప్రకటన చేసేదాక వెళ్ళాడు. "ఈ సంవత్సరాంతంలోగా స్వరాజ్యం సాధిస్తామనే నమ్మకం గట్టిగా ఆయనకు (గాంధికి) ఉందిగనుక స్వరాజ్యం సాధించకుండా డిశంబరు 31 తర్వాత తాను జీవిస్తానని భావించడంలేదు" (సుభాస్‌చంద్రబోస్ "భారతదేశ పోరాటం" పుట 81) ఏమైనప్పటికి స్వరాజ్యసాధనను చూచే అదృష్టం యిప్పటికి లేకున్నా, ఆయన ఇంకా ఎన్నేండ్లో రాజకీయ కార్యక్రమం నడపవలసి ఉంది.

విజయం ఫలానా అప్పుడు వస్తుందనే తేదీకంటె ఆ ఉద్యమంలోని గాంధీజీ ప్రణాళిక అస్పష్టంగా ఉంది. అధికార "కాంగ్రెస్ చరిత్ర" లో ఇలా వ్రాశారు :

"ప్రజల సమిష్టి సత్యాగ్రహం ప్రజలను ఉత్సాహత లూగిస్తున్నది. అదేమిటి? అదెలా ఉంటుంది? గాంధీజీయే దాని నెప్పుడూ నిర్వచించ లేదు, దాన్ని వివరించనూలేదు. తనమట్టుకైనా అవగాహన చేసుకోనూ లేదు. ఒకొక అడుగు ముందుకు పోతున్నకొలదీ జిజ్ఞాసాదృష్టికి, పరిశుద్ధ హృదయానికి అది తనంతటే గోచరం కావాలి. కీకారణ్యంలో పోతున్న పధికునికి, ఆ కష్టమార్గంలో అతను వెదుక్కుంటూ పోతుంటే అతని అడుగులకు దారి కనిపిస్తూంటుంది. ఆ నిరాశాహత యాత్రికునికి తప్ప మిగతావారందరిలో ఆశాకిరణం గోచరించేవరకు అతనేమో పోతుంటాడు"

(కాంగ్రెస్ చరిత్ర 1935, పుట 376)

1921 లో అదృష్ట నిర్ణాయకమైన ఆరోజుల్లో మహాత్మునితో తొలిసారి జిజ్ఞాసువైన యువశిష్యుడు బోసు కలుసుకున్నాడు. "క్రమక్రమంగా పోయి ఆఖరున విదేశ నిరంకుశాధికార వర్గంనుండి అధికారాన్ని లాక్కునేందుకు దారితీసే ఆయన (గాంధి) కార్యక్రమాన్ని, అందులోని తర్వాతి దశలను వివరంగా తెలుసుకోవాలని" బోసు వాంఛించాడు. కాని అందుకు సమాధానం రాలేదు. అప్పుడు తనకుకలిగిన ఆశాభంగాన్ని సుభాస్‌బోస్ ఇలా వర్ణించాడు :

"ఆయన నిజంగా ఏమిజరుగుతుం దనుకుంటున్నాడో నేను అర్థం చేసుకోలేక పొయ్యాను. ముందుగానే తన రహస్యాలను తెలిపేందుకు ఆయనకు ఇష్టంలేకనన్నా పోవాలి, లేదా ప్రభుత్వం చేతులనుకట్టివేసే యెత్తుగడలనుగూర్చి స్పష్టమైనభావం ఆయనకు లేకుండానన్నా ఉండాలి."

(సుభాస్‌బోస్, "భారతపోరాటం 1920-1934" పుట 68.)

గాంధీజీ ఆ "అస్పష్టతలోనే ఆనందపడుతున్నాడని" జవహర్లాల్‌నెహ్రూ ఇలా వ్రాశాడు.

మననాయకులలో చాలమందికి, స్వరాజ్యమంటే స్వతంత్రంకన్నా చాలతక్కువైనదేదోనని స్పష్టమే. ఈ విషయంలో గాంధీజీ స్పష్టపరచడు. ఆ అస్పష్టతలోనే ఆనందిస్తాడు. దాన్నిగూర్చి స్పష్టంగా ఆలోచించేందుకూడ, ఆయన ఇతరులను ప్రోత్సహించడు"

(జవహర్లాల్ నెహ్రూ, "ఆత్మకధ" పుట 76)

ఏమైనా ఆయనిలా వివరించాడు :

"ఆయనొక (గాంధి) మహాపురుషుడని, దివ్యవ్యక్తి అని, మహోజ్వల నాయకుడని మేమందరము భావించాము. ఆయనయందు మేము విశ్వాసముంచి, తాత్కాలికంగానైనా కనీసం దాదాపు [illegible] ను ఆయన కిచ్చాము."

(అదే, పు 73)

1921 లో ఉద్యమం ముందుకు సాగింది. ఒక్క సహాయనిరాకరణోద్యమం ఉత్సాహభరితంగా అభివృద్ధి చెందడమే కాదు; అందుతోపాటు దేశంలోని అన్ని భాగాలలోని ప్రజాపోరాటాలలో ఎన్నో రూపాలు విజృంభించాయి. అస్సాం, బెంగాల్ రైల్వేకార్మికులు సమ్మెచేశారు; మిడ్నపూర్‌లో పన్నుల నిరాకరణోద్యమం మొదలైంది. దక్షిణాదిని మలబారులో మాప్లా తిరుగుబాటు చెలరేగింది; పంజాబులో, ప్రభుత్వం బలపరుస్తున్న ధనికమహంతులకు వ్యతిరేకంగా తీవ్రమైన అకాలీఉద్యమం రేగింది

1921 ఆఖరు నెలనాటికి పోరాటం నూతన ఉన్నతస్థాయికి పోయింది. ప్రభుత్వం భయభ్రాంతమై పోయింది. పరిస్థితినంతటినీ చూచి వారికి ఆందోళన ఎక్కువయింది. ఒక గాంధీజీకి వ్యతిరేకంగా వారు తురుపు ఆసును ఆడాలనుకున్నారు. ఆసంవత్సరం తొలుత కానాటి డ్యూకును కొనిరావడమే కాక అసలు వేల్సు యువరాజునే భారత దేశయాత్రకు ప్రభుత్వం కొనివచ్చింది. ప్రజలను సమాధాన పరుస్తామనే ఆశతో ఈ పని చేయలేదు. కాని ఈ రాకుమారునిపై ప్రజల భావాన్ని పరీక్షించదలచారు. ఎందుకంటే నిగూఢ ప్రాచ్యదేశ పరిశీలనలో పండితులైన ఆంగ్లోశాక్సన్ నిపుణులందరూ రాకుమారుడంటే ప్రాచ్య ప్రజాహృదయం భక్తి పులకితమవుతుందని భావించేవారు. కాని దీనిఫలితం ప్రభుత్వమనుకున్నందుకు వ్యతిరేకంగా జరిగింది. వారనుకున్నంతకన్నా ఎక్కువగా వ్యతిరేకత ప్రజ్వరిల్లింది భారతదేశం యావత్తూ, వేల్సు యువరాజురాకను నవంబరు 17న హర్తాళ్‌తో ఎదుర్కొన్నారు. ప్రజల అసంతృప్తి ఆహర్తాళులో అతిస్పష్టంగా, విజయవంతంగా ప్రదర్శితమైంది. అలాంటిది భారతదేశ మంతకు ముందెన్నడూ చూచియుండలేదు. ప్రజలద్వేషం, ప్రభుత్వ క్రూర నిర్బంధవిధానం చిన్నచిన్న (Sanguinary) పోరాటాలకు దారితీసింది. వీనిని ఆపాలని గాంధీజీ ప్రయత్నించి విఫలుడై స్వరాజ్యం తనకు దుర్వాసన వేస్తున్నది అని ప్రకటించాడు.

ఈ సమయంనుండి జాతీయ స్వచ్ఛంద సేవకుల ఉద్యమం తనఅనుచరులను సమీకరించుకొన్నది. వారు మరింత సంఘటిత పరచబడ్డారు, వారిప్పటికి "అహింసాత్మక సహాయ నిరాకరణం" పునాదిపైనే కాంగ్రెస్ ఖిలాఫత్ సంస్థలలో అంతర్గర్భితులయ్యే ఉన్నారు; కాని వారు ప్రత్యేకమైన దుస్తులు వేసుకొని కవాతుచేస్తూ బారులు తీరి నడుస్తూ పికెటింగుద్వారా, సత్యాగ్రహంద్వారా విదేశ వస్తు బహిష్కారాన్ని, హర్తాళలను ఏర్పాటు చేసేవారు.

ప్రభుత్వ నిర్బంధ విధానం ప్రధానంగా జాతీయ స్వచ్ఛంద సేవకులపై (వాలంటీర్లు) విరుచుకుపడింది. ప్రభుత్వ పత్రికలు 'స్టేట్స్‌మన్' 'ఇంగ్లీష్‌మన్' లాంటివి, జాతీయ స్వచ్ఛంద సేవకులు కలకత్తాను ఆక్రమించుకున్నారని, ప్రభుత్వం పదవీ త్యాగం చేయాలని వెంటనే చర్య తీసుకోవాలని గోలపెట్టినాయి. ఈ వాలంటీర్లను చట్ట విరుద్ధ సంస్థ సభ్యులని ప్రభుత్వం నిషేధించింది. వేలకు వేల మందిని అరెస్టు చేసింది. వేలకువేల విద్యార్థులు, కార్మికులు స్వచ్ఛంద సేవకులుగా చేరి భర్తీ చేశారు.

డిసెంబరు ఆఖరునాటికి గాంధీజీని తప్ప మిగతా ప్రఖ్యాత కాంగ్రెసు నాయకులందరినీ జైళ్ళలో తోశారు ఇరవై వేలమంది రాజకీయ ఖైదీలు జైళ్ళలో నిండిపోయ్యారు ఉద్యమం అత్యున్నతస్థితిలో ఉన్న మరుసటి సంవత్సర ప్రారంభంలో జైళ్ళలో 30,000 మంది ఉన్నారు ఉత్సాహం పొంగి పొరలుతోన్న సమయమది.

ప్రభుత్వం ఆందోళనతో, ఏమి చేయనూ తోచక ధైర్యం గోల్పో సాగింది. ఈ విశ్వజనీన ప్రభుత్వ ధిక్కారం పట్టణాలనుండి పల్లెలలోని రైతు కోటికి వ్యాపిస్తే ఇక బ్రిటిష్ ప్రభుత్వానికి దిక్కూమొక్కూ ఉండదు. ముప్పై కోట్ల ప్రజల తిరుగుబాటును అణచేందుకు వారికున్న తుపాకులు విమానాలు చాలలేదు. వైస్రాయి పండిత మాలవ్యా మధ్యవర్తిత్వంతో జైళ్ళలోని నాయకులతో రాయబారాలకు దిగాడు. తాను వాలంటీర్లను చట్టబద్ధంగా చేసి ఖైదీలను వదులుతానని, అందుకు బదులుగా సత్యాగ్రహాన్ని రద్దు చేయాలని వైస్రాయి కోరాడు. రాయబారాలు చెడిపోయినట్లు రుజువయింది.

ఇలాంటి పరిస్థితిలో ఈసంవత్సరాంతంలో అహమ్మదాబాదు కాంగ్రెస్ జరిగింది. నాయకత్వంలో గాంధీజీ ఒక్కడే మిగిలాడు. ఈ సమావేశానికి బెంగాలు వీరనాయకుడు సి ఆర్. దాస్ అధ్యక్షత వహించవలసింది. కాని ఆయన జైల్లో ఉన్నందువల్ల వీలుకాలేదు గాంధీజీ సమావేశ ప్రారంభంలో కాంగ్రెస్‌కు మతసందేశ మిచ్చేందుకు ఒక ఇంగ్లీషు మతబోధకుని ప్రవేశపెట్టాడు. ఆ అవకాశాన్ని తీసుకొని ఆ మతబోధకుడు విదేశవస్త్ర దహనాన్ని వ్యతిరేకిస్తూ నీతులు బోధించాడు.

ఉత్సాహంతో పొంగిపోతూ, అహమ్మదాబాదు కాంగ్రెస్ తీర్మానాలుచేసింది; "స్వరాజ్యం స్థాపించబడేవరకు, భారతప్రభుత్వాధికారం ప్రజలకు హస్తగతమయ్యే వరకు.... తీవ్రోత్సాహంతో అహింసాయుత సహాయ నిరాకరణోద్యమాన్ని సాగించేందుకు కాంగ్రెసు దృఢనిశ్చయంతో ఉన్నది" అని ప్రకటించింది. చట్ట విరుద్ధంగా ప్రకటింపబడిన జాతీయస్వచ్ఛందసేనలో 18 ఏళ్ళకు పైబడిన వారందరూ చేరవలెనని కోరింది; "సమిష్టిగాగాని, వ్యక్తిగతంగాగాని, ఆత్మరక్షణకుగాని పురోగమనదృష్ట్యాగాని శాసనధిక్కారంపైనే దృష్టిని కేంద్రీకరించాలి" అని తమ

ఆశయాన్ని ప్రకటించింది: ఇందుకు సంపూర్ణ నియంతృత్వాధికారాలను "గాంధీజీకి అప్పగించి "మహాత్మాగాంధీ కాంగ్రెస్ ఏకైక కార్యకర్తగా" ప్రకటించింది.

గాంధీజీ ఇప్పుడు కాంగ్రెసుకు నియంత అయినాడు. ఉద్యమం అత్యుచ్ఛదశలో ఉంది ఈ ఉద్యమాన్ని విజయవంతమగువరకు కొనసాగించేందుకు సంపూర్ణాధికారాలు ఆయనకు అప్పగించారు. ఏదో అటోయిటో తేల్చుకోవలసిన సమయం వచ్చింది. ప్రజా శాసనధిక్కారాన్ని ప్రారంభించేందుకు సమయమే తెంచింది. దేశం యావత్తూ గాంధీజీవైపు చూస్తున్నది. ఆయనేంచేస్తాడు?

ఈ జాతీయోత్సాహ సముద్రం మధ్య, జాతీయాశయాప్రవాహం నడుమ సంఘటనల గతిని చూచి కష్టపడుతూన్న, విస్తుపోతున్న వ్యక్తి కాంగ్రెస్ పక్షంగా ఒక్కడే కనిపిస్తున్నాడు. ఆ వ్యక్తి గాంధీజీయే. తాను తయారుచేసిన ఉద్యమం తాననుకున్నట్టుగా ఆ పద్ధతిలో సాగడంలేదు. ఏదో లోపమున్నది. తాను భావించినట్టి శక్తిచైతన్యమూ, వేదాంతపూరితమూ అయిన "అహింసా" ఉద్యమంగా లేదిది తానొక బ్రహ్మరాక్షసిని గొలుసులు విప్పి వదిలివేశాడు దుష్టశక్తులు ప్రవేశిస్తున్నవి ఏమైనాసరే అనేవారు. ముఖ్యంగా తన ముస్లిం సహచరులలో కొందరు "అహింస" సూత్రాన్నే వదలివేయమని కోరేవరకూ వచ్చారు. 1921 ఆఖరువారాలలో, వేలకొలది స్వతంత్రవీరులు తనపేరును ఉచ్చరిస్తూ జైళ్ళకు వెడుతున్న సమయంలోనే, ఈయన రానురాను మరింత బహిరంగంగా భయభ్రాంతిని, విసుగును ప్రకటించసాగాడు. స్వరాజ్యం దుర్వాసనవేస్తున్నదన్న ఆక్రోశంలో ఆభావం ప్రకటితమైంది.

అహ్మదాబాదులో వెనుకంజవేయడం ప్రారంభమైంది. పోరాటం తప్పదన్న ఆ సమయంలో, వేలకొలది పాల్గొనాలని ఆశిస్తున్న ఆరోజుల్లో, ఆ తీవ్ర వాతావరణంమధ్య ఇంకా బహిరంగంగా చాటబడలేదు. కాని అప్పటికే చిన్న చిన్న సూచనలు కనిపించాయి. సమిష్టి సత్యాగ్రహంగా దేశమంతటా జరపాలని; ఆఖరుపోరాటం జరపాలని పిలుపుఇచ్చేందుకు అహ్మదాబాద్ కాంగ్రెస్ తగిన చారిత్రకసమయం. ఆ పిలుపుకోసం ప్రజలందరూ వేచిఉన్నారు. ఈ అహ్మదాబాదు కాంగ్రెస్‌కు ఇంకా చిన్నవయసులోఉన్న భారత కమ్యూనిస్టు పార్టీ తనప్రణాళికలో ఇలా ప్రకటించింది:

"భారతదేశాన్ని నేడు పునాదులవరకు సంచలింపజేస్తున్న విప్లవాన్ని కాంగ్రెస్ నడపదలచుకుంటే, కేవలం ప్రదర్శనాలలోను, తాత్కాలిక తీవ్ర ఉత్సాహ ప్రకటనల్లోను మాత్రమే విశ్వాసం పెట్టుకోరాదు. కార్మికసంఘాల తక్షణ వాంఛలను తన వాంఛలుగా ప్రకటించనీండి; కిసాన్‌సభ కార్యక్రమాన్ని తన కార్యక్రమంగా ప్రకటించనీండి; ఏ ఆటంకంవచ్చినా కాంగ్రెస్‌ను ఆపలేని సమయం త్వరలో రానున్నది; తమ ప్రయోజనాల

కోసం బుద్ధిపూర్వకంగా యావత్ ప్రజాకోటి పోరాడుతుంది; ఆ ప్రజల నిరాఘాట శక్తి కాంగ్రెస్‌ను బలపరుస్తుంది."

(1921 అహమ్మదాబాదు కాంగ్రెస్‌కు, "భారతకమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక."

పోరాట ప్రారంభానికి అహ్మదాబాదులో పిలుపునివ్వలేదు. అంతేకాక, పన్నులనిరాకరణనుగూర్చిన ప్రస్తావనే అహమ్మదాబాదు తీర్మానంలో కనిపించకుండా పోయిందని సూక్ష్మపరిశీలకులు కనిపెట్టారు. సమిష్టి సత్యాగ్రహాన్నిగూర్చిన మాట లన్నీ ఎన్నో అపవాదాలతో, నిషేధాలతో నిండిపోయినవి: "తగిన రక్షణలతో", "ఇవ్వబోయే ఆదేశాలను అనుసరించి", "ప్రజాసామాన్యం అహింసావద్ధతులలో తగినంత శిక్షణపొందినప్పుడు" ఇలాంటి షరతులెన్నో ఉన్నవి. తర్వాత ఈ ఘటన జరిగింది. ముస్లింప్రజాస్వామిక నాయకుడు హజరత్ మొహానీ స్వరాజ్యం అంటే "అన్నివిధాల విదేశపెత్తనములేని సంపూర్ణస్వతంత్రం" అని నిర్వచిస్తూ ఒక తీర్మానం ప్రవేశ పెట్టదలచాడు. గాంధీజీ దీన్నితీవ్రంగాఎదిరించాడు. ("ఇందులో బాధ్యత కనిపించడంలేదని నేను బాధపడుతున్నాను" —గాంధీజీ). ఆ తీర్మానాన్ని ఓడించగలిగాడు.

కళ్ళు రెప్పవాల్చకుండా పరిశీలిస్తున్న భారత ప్రభుత్వం అహ్మదాబాదులో చిన్న చిన్న సూచనలను చూచి కాస్త కుదుటబడి ఊపిరి పీల్చుకుంది. లండన్‌లోని భారత మంత్రికి వైస్రాయి ఇలా తంతి విచ్చాడు:

"క్రిస్మసు వారంలో అహ్మదాబాదులో కాంగ్రెస్ వార్షిక సమావేశం జరిగింది. బొంబాయి కొట్లాటలతో గాంధీజీ చాల నొచ్చుకున్నాడు. అప్పు డాయన చేసిన ప్రకటనలు ఈబాధను సూచిస్తున్నవి. ఆ కొట్లాటలు సమష్టి సత్యాగ్రహంలోని ప్రమాదాలను ఆయనకు బాగా చూపెట్టినవి; ఈ సంగతికి కాంగ్రెస్ తీర్మానాలు సాక్ష్య మిస్తున్నవి. ఖిలాఫత్ పార్టీలోని అతివాద వర్గం అహింసా విధానం వదిలివేయాలని తెచ్చిన తీర్మానం త్రోసివేయ బడింది ఢిల్లీ షరతుల నిర్వహణ పూర్తిఅయి సత్యాగ్రహ విషయం చర్చకురాగా అందులోని పన్నుల నిరాకరణ గూర్చిన ప్రస్తావనే వదలి వేయ బడింది."

("భారత దేశం పరిస్థితి విషయమై జరిగిన తంతి ఉత్తర ప్రత్యుత్తరాలు" Cmd. 1586,1922)

గాంధీజీ ఏంచేస్తాడు? అహ్మదాబాద్ కాంగ్రెస్ ఏ కార్యక్రమమూ వెయ్యకనే అంతమయింది. అన్నీ గాంధీజీ చేతిలో పెట్టారు. పారిస్‌ను పట్టుకున్నప్పుడు, పారిస్ ప్రజలు "జనరల్ ట్రాచూ కార్యక్రమం ఇస్తాడు" అనుకున్నట్టుగా భారత ప్రజలు సామ్రాజ్యవాదపు ఇనప సమ్మెట పోటులు తింటూ ఆశతో గాంధీవైపు, ఆయన ఎత్తుగడ లేవో ప్రకటిస్తాడని మోరలెత్తి చూస్తున్నారు.

గాంధీజీ కార్యక్రమం విచిత్రమైంది ఆయనో నెల కాచుకున్నాడు, ఈ నెలలో పన్నులనిరాకరణ ప్రారంభించాలని ఎన్నో జిల్లాలవారు ఆయ

నను కోరారు. ఒక్క గుంటూరు జిల్లా ఆయన అనుమతిలేకనే ప్రారంభించింది. వెంటనే గాంధీజీ కాంగ్రెస్ కమిటీ నాయకులకు ఒక జాబు రాశాడు వ్యవధిలోగా పన్నులన్నీ చెల్లించమని ఆదేశించాడు. తర్వాత పరిపూర్తిగా "అహింస" వాతావరణం ఉండేట్లు తాను జాగ్రత్తపడిన ఒక్క చిన్నజిల్లా బార్డోలీలో — 87 000 జనాభా మాత్రం ఈ జిల్లాలో ఉంది - తన నాయకత్వం కోసం నిరీక్షిస్తున్న భారత ప్రజలలో $\frac{1}{4000}$ అంశంలో ఈయన పన్నుల నిరాకరణ ఆరంభించాలని నిశ్చయించాడు ఫిబ్రవరి 1 వ తేదీ వైస్రాయికి అంత్యసందేశం పంపాడు. ఖైదీలను విడుదలచేసి నిర్బంధవిధానం రద్దుచేయకపోతే తాను 'సమిష్టి సత్యాగ్రహాన్ని' బార్డోలీలోమట్టుకే ఆరంభిస్తానని అందులో తెలియజేశాడు. ఈ పని ఆయన చేశాడో, లేదో, అంతలోనే ఒకవార్త వచ్చింది. యు. పి. రాష్ట్రంలోని చౌరీచౌరా అనే చిన్న గ్రామంలోని క్రోధోద్రేకులైన రైతులు, గ్రామ పోలీసుస్టేషన్ను దాడిచేసి కాల్చివేశారని, అందులో 22 మంది పోలీసులు చనిపోయారని తెలిసింది. రైతులలో పెరిగిపోతున్న ఈ అశాంతిని చూచి, గాంధీ ఇంక ఆలస్యం చేయకూడదనుకున్నాడు. గబగబా వర్కింగుకమిటీని బార్డోలీలో ఫిబ్రవరి 12 వ సమావేశ పరచాడు "చౌరీచౌరాలోని ప్రజాసమూహపు అమానుష ప్రవర్తననుబట్టి సమిష్టిసత్యాగ్రహాన్నే కాక, సత్యాగ్రహాన్నంతటినీ, వాలంటీర్ల ఊరేగింపులు, నిషేధించకపోయినాసరే సభలు పెట్టడం మొదలైనవన్నీ ఆపివేయాలని ఆ కమిటీ నిర్ణయించింది. అస్థానే వడకడం, మద్యమితపానం, విద్యావ్యాప్తి మొదలైన "నిర్మాణకార్యక్రమం" అనుసరించాలని వారు నిర్ణయించారు. యుద్ధం ముగిసింది. ఉద్యమమంతా ఆఖరయింది. కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్టయింది.

బార్డోలీ నిర్ణయం కాంగ్రెసువాదులకు ఆవేశాన్ని కల్గించిందని చెప్పడం, అప్పటివారి భావాలను వర్ణించేందుకు ఏ భాషా పటిమా చాలకపోవడమే కారణం. ఇంగ్లీషు పాఠకులకు ఇందుకు దాదాపు సరిపోయే ఉదాహరణ ఇవ్వాలంటే 1926 లో సర్వవ్యాప్తసమ్మెను ఉపసంహరించడంవల్ల ఎలాంటి భావావేశం కల్గిందో, అలాంటిదే భారతదేశంలో 1922 బార్డోలీ నిర్ణయంతో ఏర్పడింది.

> "ప్రజల ఉత్సాహం అత్యుచ్చస్థితిలో ఉన్నప్పుడు, తిరోగమించమని ఆజ్ఞఇవ్వడం జాతీయ మహాపదకన్న తక్కువైందికాదు. మహాత్ముని ప్రధాన సహచరులు దేశబంధుదాసు, పండిత మోతీలాల్ నెహ్రూ, లాలా లజపత్‌రాయ్—(అందరూ జైల్లో ఉన్నారు)—గారలు ప్రజల అసంతృప్తినే వెలిబుచ్చారు - నేనప్పుడు దేశబంధునితోకూడ ఉన్నాను. విషాదావేశాలతో ఆయన పరవశుడైనట్టు కనుగొన్నాను."
>
> (సుభాష్‌బోసు, "భారతదేశపోరాటం" పుట. 90.)

మోతీలాల్ నెహ్రూ, లజపత్‌రాయి మొదలైనవారలు జైలునుండి, ఈ నిర్ణయానికి అసమ్మతి తెలుపుతూ గాంధీకి జాబులు వ్రాశారు. జైల్లో ఉన్నవారు "పౌర

కార్యాలలో మృతులక్రింద లెక్క" అనీ, వారు విధానాన్నిగూర్చి ఏమీ చెప్పవిల్లేదనీ వైముఖ్యంతో జవాబిచ్చాడు.

ఏరకమైన ప్రజాకార్యాచరణనూ పూర్తిగావద్దంటూ, ఒక్కవ్యక్తి ఇష్టానికి యంత్రప్రాయంగా విధేయమైన ఈ ఉద్యమం యావత్తూ, బార్డోలీ నిర్ణయంతో దిక్కుతోచక గందరగోళ పడింది నిస్పృహపడిపోయింది. ఈ నిర్ణయమే చేయకపోయిఉంటే, ఉద్యమం అదుపాజ్ఞలు మీరిపోయి, ప్రభుత్వంతో రక్తపాతం, హింసతోకూడిన పోరాటానికి దిగేదనీ, అప్పుడు ప్రభుత్వమే జయించిఉండేది అనేకారణాలలో ఈనిర్ణయాన్ని సమర్థింపజూచిన నెహ్రూకూడ ఈ విషయం అంగీకరించక తప్పలేదు. ఈ నిర్ణయధోరణి :

> "కొంతనిస్పృహను కొనివచ్చింది. ఈ మహోద్యమాన్ని హఠాత్తుగా నిరోధించడంలో, దేశంలో విచారకరధోరణికి కారణమయిం దన టానికి అవకాశముంది. రాజకీయపోరాటం అక్కడక్కడా బయలుదేరిన వ్యర్థ హింసలవైపు పోకుండా ఆపబడింది. కాని, అణచివేయబడిన హింసకు ఏదో బయటపడేమార్గం కావలసివచ్చింది. తర్వాతి సంవత్సరాలలో ఇవే మతకలహాలను రెచ్చగొట్టిందేమో బహూశా."
>
> ("జవహర్‌లాల్ నెహ్రూ," "ఆత్మకథ" పుట 86)

అలా లోపలనుండే ఉద్యమం స్తబ్ధం చేయబడి, నిరాశా నిస్పృహల పాలయింది. ఇప్పుడు ప్రభుత్వం ధైర్యంతో దెబ్బతీసింది. మార్చి 10వ తేదీన గాంధీని అరెస్టుచేసి, ఆరేళ్ళు శిక్షవేశారు. ప్రజాఉద్యమంలో ఒక బుడగగూడ లేవలేదు రెండేళ్ళ లోపలనే గాంధీజీ విడుదలయ్యాడు. ప్రతిష్టంభన ముగిసింది.

తర్వాత ఆరేళ్ళ స్తబ్ధయుగంలోను బార్డోలీ నిర్ణయాన్ని గూర్చి, దాని విషాదకర ఫలితాలనుగూర్చి వాదోపవాదాలు చెలరేగాయి. ఈ నిర్ణయానికి కారణమని తీర్మానంలో తెలిపిన చౌరీ చౌరా సంఘటనకన్నా, ఇంకా నిజమైనకారణం మరింతలోతుగా చూడాలని సమర్థనలు బయలుదేరాయి. "మా ఉద్యమంబయటికి శక్తివంతంగా, ఉత్సాహ పూరితంగా, కనిపించి నప్పటికీ ముక్కలు ముక్కలై పోతున్నది" (నెహ్రూ "ఆత్మకథ" పు. 85) కాబట్టి ఉద్యమాన్ని తప్పక ఆపవలసి వచ్చిందన్నారు. ఏదృష్టిలో ఉద్యమం "ముక్కలై పోతున్నది" అని అడగవలసి వస్తుంది. సంస్కరణ వాదుల శాంతివాదపు పెత్తనం దుర్బల పడుతున్నది అనేదే అయితే, అది నిస్సందేహంగా నిజమైన సంగతే. కాని ఈ అభివృద్ధి ఉద్యమం పెరిగే కొద్దీ అందులో గర్భిత మయ్యే ఉంటుంది. విజయానికిది తప్పని సరి కూడ (భారత దేశం మొత్తంమీద ప్రజలు తిరుగుబాటు చేస్తే ప్రభుత్వమే జయింపక తప్పదన్న నెహ్రూ లాగా అంత సంతోషంగా ప్రభుత్వం ఊహించ లేదు)-అలాకాక ప్రజాపోరాట బలం నిజానికి ఉచ్చదశకు వెళ్ళి మరీ పడిపోతున్నది అని చెప్పేట్టయితే అది ఏమాత్రం నిజంకాదు. ఆ నిర్ణయాన్ని సమర్థించే వారు

కూడ యిలా సూచించ దలచలేము. బార్డోలీ విధ్వంసనానికి మూడురోజులు ముందు పరిస్థితిలోని వాస్తవ శక్తులను గూర్చి ప్రభుత్వం వేసిన అంచనాయే దీనికి చక్కని సాక్ష్యం ఇస్తున్నది. 1922 ఫిబ్రవరి 9వ తేదీని వైస్రాయి లండనుకు ఇలా తంతి నిచ్చారు

> "పట్టణాలలోని తక్కువ తరగతి వారిలో సహాయ నిరాకరణోద్యమం చాల వ్యాపించింది....కొన్ని ప్రాంతాల్లో రైతులకు కూడ వ్యాపించింది. ముఖ్యంగా అస్సాంలోను, సంయుక్త పరగణాలు, బీహారు, ఒరిస్సా, బెంగాలు రాష్ట్రాల్లో ఇక పంజాబు విషయంలో అకాలీ ఉద్యమం....గ్రామాల లోని సిక్కులకు వ్యాపించింది. దేశం మొత్తంమీద మహమ్మదీయ జనాభా లోని అధిక భాగం ద్వేషంతో తీవ్రంగా ఉన్నారు....ప్రమాద పరిస్థితు లున్నవి....ఇంతకుముందు జరిగినంత కన్నా మరింత పెద్ద అశాంతికి భారత ప్రభుత్వం సిద్ధపడి ఉన్నది. ఈ పరిస్థితి చాల ఆందోళన కరంగా ఉన్నది అనే అంశాన్ని కొంచెపరచ దలచుకోలేము."

భారత మంత్రికి వైస్రాయి 1922 ఫిబ్రవరి 9 తేదీని పంపినది. "భారత దేశ పరిస్థితి విషయంపై జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు" Cmd 1586,1922

బార్డోలీ నిర్ణయం ఫిబ్రవరి 12 తేదీ ఉద్యమాన్ని యావత్తూ రద్దు పరచేం దుకు మూడురోజుల క్రిందట పరిస్థితిని గూర్చిన ప్రభుత్వాభి ప్రాయ మిది.

ప్రజాఉద్యమంలోని క్రమశిక్షణ అంతిమపోరాట సంసిద్ధతలను గుంటూరు ఉదాహరణ వెల్లడించింది. ఏ అపార్థంవల్లనో గాంధీ ఉత్తరువులేకనే పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభమయింది. పన్నులు కట్టవలసిందని తిరిగి గాంధి ఉత్తరువు వచ్చేవరకు నూటి కయిదువంతులుకూడ శిస్తులు కట్టలేదు. కాంగ్రెసు కేంద్రం ఒక్కమాటు కానిమ్మని చెబితే ఈ కార్యక్రమం దేశమంతటా నిస్సందే హంగా అల్లుకొనిపోయేది. విశ్వజనీనంగా పన్నులను, జమీందారు గుత్తలను

---

* 1922 సంక్షోభంపై ప్రభుత్వభారాన్ని, గాంధీజీ ఉద్యమం ఆపడమే తమ్ము రక్షిం చిందన్న తర్వాత బొంబాయి గవర్నర్ లార్డు లాయిడ్ ఇలా తెలిపారు :

"ఆయన మాకు భయం పుట్టించాడు! ఆయన కార్యక్రమం మా జైళ్ళు నింపి వేసింది. ఊరికే ప్రజలను అరెస్టుచేస్తూపోలేము. అందులో 31,90,00,000 మందున్నారు. ఆయన తర్వాతి కార్యక్రమం మొదలుపెట్టి వారు పన్నులు నిరాకరించివుంటే; దేవుడికే తెలుసు మేం ఎక్కడ ఉండేవారమో.

"ప్రపంచ చరిత్రలో గాంధీ దొక పెద్ద ప్రయోగం. అది దాదాపు విజయంవరకు వచ్చింది. కాని మనుష్యుల ఆవేశాన్ని ఆయన అదుపులో పెట్టలేకపోయాడు. వారు హింసకు దిగారు. గాంధీజీ ఉద్యమాన్ని ఆపివేశాడు. తర్వాత సంగతి మీకు తెలుసు. ఆయన్ను మేము జైల్లో పెట్టాము."

(లార్డు లాయిడ్, డ్రూపియర్సన్‌తో జరిపిన ఇంటర్వ్యూలో దీనిని వి. యఫ్. ఆండ్రూస్ ఉదహరించాడు. 'న్యూ రిపబ్లిక్' ఏప్రిల్ 8, 1939)

నిరాకరింపబడి ఉండేవి. కాని ఈ కార్యక్రమమంటే ఒక్క సామ్రాజ్యవాదమే కాక, భూస్వామివిధానం కూడ తుడిచిపారవేయడమే అవుతుంది.

ఇందుమూలంగానే బార్డోలీ నిర్ణయం జరిగిందని ఆ తీర్మానమే రుజువు చేస్తూంది. ఫిబ్రవరి 12 వ తేదీన బార్డోలీలో వర్కింగుకమిటీ చేసిన తీర్మానవారం చాల ముఖ్యమైనది కాబట్టి ఉదహరించవలసి ఉంది. భారత జాతీయోద్యమంలోని శక్తులగూర్చి, పరస్పర భారత విరుద్ధతలగూర్చి చాల సంగతులను సూక్ష్మంగా పరిశీలించి తెలుసుకోవచ్చును. అందులోని ముఖ్యసూత్రాలివి :

"సూత్రం 1. పోలీసులను అమానుషంగా ఖూనీచేసి స్వేచ్ఛగా పోలీసుఠాణాను కాల్చివేసిన, చౌరీచౌరాలోని గుంపుల అమానుషచర్యను వర్కింగుకమిటీ తీవ్రంగా ఖండిస్తున్నది."

"సూత్రం 2. ప్రతిసారీ సమిష్టి శాసనోల్లంఘనం ప్రారంభించినప్పుడుకూడ హింసాకార్యాలు రేగుతున్నవి. ఇవిదేశం తగినంతఅహింసాయుతంగా లేదని సూచిస్తున్నది ఇందువల్ల కాంగ్రెస్ వర్కింగుకమిటీ, సమిష్టి శాసనోల్లంఘనం.... తాత్కాలికంగా ఆపివేయబడాలని నిర్ణయిస్తున్నది. భూమిపన్ను మొదలైన ప్రభుత్వానికివ్వవలసిన పన్నులను ఇవ్వాలని రైతులకు సలహా ఇవ్వవలసినదని స్థానిక కాంగ్రెస్ సంఘాలను ఆదేశిస్తున్నది. ఎదురుదెబ్బతీసే ధోరణిగల అన్ని ఇతరకార్యక్రమాలను తాత్కాలికంగా ఆపివేస్తున్నది.

సూత్రం 3. దేశంలో వాతావరణం అహింసాయుతంగా ఏర్పడే వరకు సమిష్టి శాసనోల్లంఘనం ఆపివేయబడాలి; గోరఖ్‌పూరు హత్యలవంటివి, బొంబాయిలోను మదరాసులోను 17 నవంబరు, 13 జనవరి జరిగినట్టి రౌడీతనంలాంటివి తిరిగి జరగవన్న నమ్మకం ఏర్పరిచే వాతావరణం ఏర్పడాలి"...........

"సూత్రం 5. ప్రభుత్వాన్ని ధిక్కరించడానికి జరిపే అన్నిస్వచ్ఛంద సేవకుల ఊరేగింపులూ, బహిరంగ సభలూ ఆపివేయాలి."

"సూత్రం 6: రైతులకు ఈ క్రిందివిధంగా తెలియజేయవలసిందని కాంగ్రెస్ సేవకులకు, సంస్థలకు వర్కింగుకమిటీ సలహా యిస్తున్నది ; జమీందారులకు 'గుత్తలుకట్టకుండా ఆపడం కాంగ్రెస్ తీర్మానాలకు విరుద్ధమైనది. దేశయోగక్షేమాలకు నష్టకరమైనది.

"సూత్రం 7. వర్కింగు కమిటీ జమీందారులకు ఈ విధంగా హామీనిస్తున్నది : కాంగ్రెసు ఉద్యమం వారి చట్టబద్ధమైన

హక్కులపై దెబ్బతీయడానికి ఏవిధంగాను ఉద్దేశించలేదు. రైతులకు కష్టాలున్నట్టి చోట్లకూడ, పరస్పర సంప్రతింపులద్వారా, మధ్యవర్తి పరిష్కారంద్వారా నివారింప జూడాలని కాంగ్రెసు వాంఛిస్తున్నది."

ఈ తీర్మానప్రతిపాదనలను ప్రోత్సహించినది ఏదో తాత్త్వికమైన అహింసా సమస్యకాదని ఈతీర్మానం స్పష్టపరుస్తున్నది. మూడు సూత్రాలదాక, (పెద్ద అక్షరాలలో వేసినవి) ప్రత్యేకించి, గట్టిగా, త్వరగాకూడ రైతులు భూస్వాములకు, లేదా ప్రభుత్వానికి శిస్తు చెల్లించాలి అనే అవసరాన్నికూర్చి చెబుతున్నవి. ఇందులో హింస, అహింస అనేదేదీలేదు. ఇందులో కేవలం పీడకుల, పీడితుల వర్గప్రయోజనాల సమస్య మాత్రమే ఉంది. శిస్తు చెల్లించకపోవడం "హింసా" కార్యమని ఎవరూ సూచించలేరు; అంతేకాక ఇది అతిశాంతియుతమైన అసమ్మతి కార్యక్రమం (లేక విప్లవాత్మకమైనది అయినప్పటికి). ఇలాంటప్పుడు ఈతీర్మానం మాటవరుసకు "హింసను" ఖండించి, అంత గట్టిగా శిస్తునిరాకరణ సమస్యమీదా. జమీందార్ల "చట్టబద్ధ హక్కుల" మీదా కేంద్రీకరించడ మెందుకు? దీనికి ఒకే ఒక సమాధానమే సాధ్యమవుతుంది ఈ"అహింసా" పదజాలమంతా, విజస్థితిలో వర్గప్రయోజనాలకు, వర్గపీడనను కొనసాగించేందుకు - బుద్ధిపూర్వకమో కాదోగాని కేవలం ఆచ్ఛాదనం మాత్రమేనని బయలుపడుతున్నది.

గాంధీ పేరమన్న కాంగ్రెస్ ప్రధాననాయకత్వం చైతన్యవంత మవుతున్న ప్రజాకార్యక్రమానికి భయపడుతున్నారు. కాబట్టి ఉద్యమాన్ని ఆపివేశారు; వాస్తవ స్థితిలో తమకిప్పటికి సన్నిహిత సంబంధంగల ఆస్తివంతుల వర్గప్రయోజనాలను కదిపివేయ ప్రారంభిస్తున్నది. కాబట్టి ఆ ప్రజాకార్యాచరణకు వీరు భయపడుతున్నారు.

1922 లో జాతీయ పోరాటం భగ్నం కావడానికి, "హింస" లేక "అహింస" సమస్యకాదు. మరి ప్రజా ఉద్యమానికి వ్యతిరేకమైన వర్గ ప్రయోజన సమస్యే కారణం. ఈవర్గ ప్రయోజన పర్వతానికి తగిలి ఉద్యమం ముక్కలై పోయింది. "అహింస" అనే పదానికి ఇదే నిజమైన అర్థం.

## 3. పోరాటంలోని మూడో మహాతరంగం 1930-1934

బార్డోలీ దెబ్బతగిలిం తర్వాత అయిదేండ్లవరకు, జాతీయోద్యమం తలక్రిందులయింది. కాంగ్రెస్ సన్నగిలి పోయింది. కోటిమంది సభ్యులను చేయాలన్న ఆశయం ప్రకటించగా కేవలం 2 00,000 మందిని మాత్రమే చేర్చ గలిగామని 1924 లో గాంధీ ప్రకటిస్తూ "మనం ప్రభుత్వానికి వ్యతిరేకతలో తప్ప ప్రజలకు ప్రాతినిధ్యం వహించడం లేదు." అన్నాడు. ఆ సంవత్సరంలో గాంధీజీ ప్రవేశపెట్టిన "నూలు చందా" (కాంగ్రెస్ సంస్థలోని కమిటీల సభ్యులు ప్రతినెలా

తాము వడికిన నూలు 2000 గజాలు పంపాలి. కేవలం 1925 ఆగస్టు నాటికి 10,000 సభ్యులనే చేర్చ గలిగింది. అప్పుడు ఆ చందాను విధిగా కాక ఐచ్ఛికంగా మార్చారు. 1925 లో బొంబాయి క్రానికల్ పత్రిక "దేశమంతా స్తబ్ధత జడత్వం" నెల కొన్నదని వ్రాసింది. అదే సంవత్సరమే లాలా లజపతిరాయ్ "గందరగోళం అరాచకత" ఏర్పడిందని ఇలా ప్రకటించాడు. "రాజకీయ పరిస్థితి ఏమాత్రం ఆశా జనకంగా, ప్రోత్సాహకరంగా లేదు, ప్రజలు విచారంతో కూలిపోయారు. ప్రతిదీ సిద్ధాంతాలు, కార్యక్రమం, పార్టీలు-రాజకీయాలు-అన్నీ ఒక ఛిన్నభిన్న శిధిలదశలో ఉన్నట్టు కనిపిస్తున్నవి. "ఇలా జాతీయోద్యమ హీనస్థితిలో మతకలహ దుష్ట సూచనలు దేశంలో వ్యాపించ గలిగాయి. తిరిగి ముస్లింలీగు కాంగ్రెసు నుండి వేరుపడింది. దీనికి వ్యతిరేకంగా హిందూ మహాసభ సంకుచితమైన అభివృద్ధి నిరోధకమైన ప్రచారం కొనసాగించింది.

కాంగ్రెస్‌లోని సి. ఆర్. దాస్, మోతీలాల్ నెహ్రూల నాయకత్వంక్రింద ఉన్న ఒకభాగం బార్డోలీ తర్వాత వేరుపడ దలచారు. తమ అభిప్రాయంలో ఆచరణ సాధ్యంకాని నిస్సారమైన గాంధీవిధానంనుండి, ఒక కొత్తపార్టీని నిర్మించి స్పష్టంగా వేరుపడాలనుకున్నారు. వీరు కాంగ్రెస్‌లోనేఉండి ఎన్నికలలో పోటీచేయాలని, కొత్త శాసనసభలోపల పార్లమెంటరీ పద్ధతిలో పోరాటం కొన సాగించాలని తీర్మానించుకున్నారు. ఈ కొత్తపార్టీకి స్వరాజ్యపార్టీ అని పేరు పెట్టారు.

ప్రజాఉద్యమం దుర్బలత దృష్ట్యా ఎన్నికల, శాసనసభల బహిష్కరణాన్ని రద్దుచేసి ఈ నిర్ణయం ఒకడుగు ముందుకువేసింది. దీనిని కాంగ్రెసులోని అసమర్థులు, కన్సర్వేటివ్‌లు వ్యతిరేకించారు. గాంధీ నిర్మాణకార్యక్రమం - వడకడం, మితపానం, అస్పృశ్యతా నివారణ మొదలైన సాంఘిక సంస్కరణలు - మాత్రమే విమోచనమార్గమని పట్టుకొని వీరు వేలాడారు; కాని అంతకన్న ఆచరణయోగ్యమైన కార్యక్రమాన్ని అపేక్షించే కాంగ్రెస్‌లోని స్వరాజ్యపార్టీవారు అవలంబించే పద్ధతిని వీరు అరికట్టలేక పొయ్యారు. 1925 నాటికంతా కాంగ్రెస్ పూర్తిగా స్వరాజ్య పార్టీకి లొంగిపోయింది. వారే అధికసంఖ్యాకులై ఆ పార్టీనాయకులు పూర్తిగా పెత్తనం వహించారు. మరి తాత్కాలికంగా గాంధీజీ వెనుకకు పోయాడు.

అయినప్పటికీ, స్వరాజ్యపార్టీ నాయకులు, ఉద్యమాన్ని ప్రతిష్టంభనలోకి దింపిన గాంధీ విధానంనుండి వేరుపడాలని చూస్తూ, ప్రజలనుండి మరింతదూరం వెళ్ళిపోయారు. గాంధీజీ విధానంకంటె నిజంగా పురోగమనం. అంటే, ఉన్నతవర్గాల ప్రయోజనాల పెత్తనంనుండి దేశంలోని ప్రధానభాగమయిన కార్మిక కర్షకుల ప్రయోజనాలకు పెత్తనం రావలసింది. పై ఉన్నతవర్గ ప్రయోజనాలే జాతీయ పోరాటానికి విఘాతం కల్గించాయి. సామ్రాజ్య వాదంతో రాజీపడేందుకు ఏమాత్రం ప్రాతిపదికలేనివారు కార్మిక కర్షకులు మాత్రమే. సిద్ధాంతప్రాయంగా దీనిని గుర్తించేందుకు కొత్త స్వరాజ్యపార్టీ ఒకడుగు ముందుకు వేసింది;

సి. ఆర్. దాస్ "నూటికి 98 కి స్వరాజ్యంగూర్చి మాట్లాడాడు. ఈ వాక్యం చాలచోట్ల ప్రతిధ్వనించింది: వీరి కొత్త కార్యక్రమంలో కార్మిక కర్షక సంస్థల అవసరంగూర్చి సాధారణంగా కొంత చెప్పారు. కాని ఆచరణలోమటుకు స్వరాజ్యపార్టీ అభ్యుదయకర ఉన్నత ధనికవర్గ పక్షం: దీని అస్థిత్వం వీరి బలం మీదనే ఆధారపడింది. దీని నాయకులు అందులోనుండి వచ్చినవారే; వారు ఎంత జీవకారుణ్యంతో కార్మికులను, కర్షకులనుగూర్చి మాట్లాడినా, ఉన్నతవర్గాల బలం సాధించుకునేందుకు, తమపార్టీ జమీందారీ పెట్టుబడిదారీ వర్గాల పునాదివిషయంలో "సరీగా ఉన్నది" అని వారు స్పష్టపరచితీరాలి. కాబట్టి వారి ఆశయప్రణాళిక ఈ సూత్రాన్ని ప్రత్యేకించి చెప్పింది. "సొంత, వ్యక్తిగత ఆస్తి గుర్తింపబడి రక్షించబడుతుంది వ్యక్తి స్థిర చర ఆస్తి పెరిగేందుకు అనుమతింపబడుతుంది": ఈ కార్యక్రమంతో జతపరిచిన కార్యక్రమ వివరణ ప్రకటనలో, స్వరాజ్యపార్టీ భూస్వాములకు వ్యతిరేకమైనదనే అపవాదానికి బదులుచెబుతూ ఇలా అన్నారు. "మా పార్టీ కౌలుదారుకు న్యాయంకోసం నిలబడుతుందన్నమాట నిజమే, కాని ఆ న్యాయంలో భూస్వామి కేదైనా అన్యాయం జరిగేట్టయితే, అది పూర్తి న్యాయంకాదు."

కాబట్టి ఆచరణలో స్వరాజ్యపార్టీ, ఒకడుగు ముందుకు వేయాలన్న ఉద్దేశంలో వెలువడినప్పటికీ, ప్రజాపోరాటప్రవాహం నిలిచిపోయిన దశకు ప్రతిబింబం కన్నా ఎక్కువేమీకాదు. పార్లమెంటరీ పద్ధతిలో సామ్రాజ్యవాదంతో సహకరించాలనుకునే అభ్యుదయకర ధనికవర్గపక్షమే స్వరాజ్యపార్టీ. ప్రారంభంనుండే, ఇది శత్రువనబడే సామ్రాజ్యంవైపు మరింత దగ్గరకు చేరసాగింది. ప్రారంభంలో కౌన్సిళ్ళలో ప్రవేశించడంలో "ఒకేవిధంగా ఎల్లప్పుడూ విరోధించడం" ఆశయమని ప్రకటించారు. ఆ పునాదిమీదనే 1923 ఎన్నికలలో చెప్పతగినంత విజయం చేకూరింది. ప్రత్యేకపార్టీగాచూస్తే అతిబలవత్తరంగాను, స్వతంత్రులు లేక లిబరల్స్ (పాతమితవాదులు) తో చేరితే అధికసంఖ్యాక పక్షంగాను కౌన్సిళ్ళలో ఈ స్వరాజ్యపార్టీ ప్రవేశించింది. ప్రవేశిస్తూనే ఆ పార్టీనాయకుడు సి. ఆర్. దాస్ ఇలా ప్రకటించాడు: "మాపార్టీ ఇక్కడికి తమసహకారాన్ని ఇవ్వడానికి వచ్చింది మా సహకారాన్ని ప్రభుత్వంతీసుకుంటే, మేము తమవారిమని వారు గ్రహించగలరు" 1925 నాటికి సి ఆర్. దాస్ ప్రఖ్యాతమైన ఫరీద్‌పూర్ ప్రకటనలో ప్రభుత్వ "హృదయం మారిన" సూచనలు తనకు కనబడుతున్నవన్నాడు (అప్పటిఇండియా మంత్రి లార్డు బర్కెన్ హెడ్ దృక్పథంచూస్తే ఈ ప్రకటన జరగవలసి ఉండినదే కాదు. అతను ఏమాత్రం దాపరికంలేని, అసహ్యాభావంతో, ఒక బహిరంగసభలో "భారతజాతీయత అనే సారవిహీనమైన దయ్యం" గూర్చి ప్రస్తావించాడు). కొన్ని షరతులపై సహకారం చేస్తామని ప్రకటించాడు - ఆషరతులలో విప్లవోద్యమానికి వ్యతిరేకంగా కలిసిపోరాడడమనేదికూడ ఒకటి. ఇప్పుడు మితవాదనాయకులు, తమకూ స్వరాజ్యవాదులకు మధ్య పెద్ద విభేదంలేదని ప్రకటించారు. 1926 వసంతంలో సబర్మతి ఒడంబడిక పదవీస్వీకారానికి తలొడ్డాలనుకున్నా, కాంగ్రెస్

వాదుల వ్యతిరేకతవల్ల నిరాకరించింది. 1926 ఆకురాలేకాలంలో జరిగిన కొత్త ఎన్నికలలో స్వరాజ్యపార్టీ- మదరాసులోతప్ప - బాగా దెబ్బతినింది.

కాని సామ్రాజ్యవాదంతో సౌమనస్యంగా సహకరించాలనుకున్న బూర్జువా ఆశలు భగ్నం కావలసిఉన్నవి. జాతీయ పోరాటశక్తులు దుర్బలపడ్డాయని తెలిసీ తెలియడంతోనే, స్వరాజ్యపార్టీవారు ప్రజాఉద్యమాన్ని విడనాడి బేరానికి దిగగానే, సామ్రాజ్యవాదం ఇఃజెన్‌ను వెనుకకు మళ్ళించింది ముందటి సంవత్సరాలలో భారత ధనికవర్గానికి ఇచ్చిన ఆ కొన్ని ఆర్థికసౌకర్యాలుకూడ లాక్కున్నది. 1927 కరెన్సీబిల్లుద్వారా రూపాయమారకాన్ని 1 6 పెన్నీలకు నిర్ణయించింది. (భారతీయులందరూ వ్యతిరేకించినప్పటికీ) 1927 ఉక్కుచట్టంద్వారా 1924 నాటి రక్షణచట్టాన్ని రద్దుచేసి బ్రిటిష్ ఉక్కుకు ప్రత్యేకధరలను ఉంచింది. ఇలాగా ఆర్థికంగా దండయాత్ర సాగించి తమఅధికారాన్ని పూర్తిగా పునస్థాపించు కొనేందుకు బ్రిటిష్‌ప్రభుత్వం ప్రయత్నించింది. 1927 ఆఖరున సైమన్ విచారణ కమిటీని ప్రకటించారు. పూర్తిగా భారతదేశ ప్రాతినిధ్యమే లేకుండా భారత రాజ్యాంగ భవిష్యత్తును నిర్ణయించేందుకు ఆ కమిటీని వేశారు.

ఇలా భారత పెట్టుబడిదారీ వర్గం ఎంత తమకిష్టం లేకున్నా సహకారదశల నుండి మరొకతూరి వెనుదిరగ వలసి వచ్చింది: తామేమాత్రం లాభసాటి బేరం కుదుర్చుకోవాలన్నా తమకు బలంగా మరొకతూరి ప్రజాశక్తులను సమీకరించే అవకాశం వైపు చూడవలసి వచ్చింది. కాని పరిస్థితులు పదేళ్ళ ముందటి కన్నా చాల చిక్కుగా కష్టతరంగా ఉన్నవి. ఎందుకంటే ఈలోగా ప్రజాశక్తులు ఒక నూతన జీవితాన్ని సాధించాయి చైతన్యవంతం కాసాగాయి. స్వతంత్ర రాజకీయ భావాలతో, ఆదర్శాలతో, వుద్దీపితులైన ప్రజలు సామ్రాజ్య తత్వానికి వ్యతిరేకంగా మాత్రమే కాక భారత పీడకులకు వ్యతిరేకంగా కూడ పోరాటం నడపసాగారు. ఈ ముక్కోణంవంటి పోటీ లేక సామ్రాజ్య వాదానికి భారత ప్రజా సామాన్యానికి మధ్య ఉన్న అగాధ వ్యతిరేకత-భారత ధనికవర్గం వెనకాడుతూ అటూ ఇటూ ఊగిసలాడుతూంటుంది గనక-ఇప్పుడు మరింత స్పష్టంగా రంగంలోనికి వస్తున్నది. ఇందువల్ల ఇప్పుడు బయలుదేరిన నూతన పోరాటదశ ప్రత్యేకలక్షణం 1927 ఆఖరు భాగంలో ప్రారంభమై 1930-34 నాటికి సమగ్రత్వాన్ని పొందింది. ఒకవైపు మరింత వ్యాప్తమైన తీవ్రమైన పోరాటపు దీర్ఘకాల లక్షణం, మరొకవైపు హఠాత్తుగా గతి తీవ్రతను ఆటంక పరచే అభివృద్ధి, డొంక తిరుగుడుగా ఊగిసలాడే ఆశయాలు, పదేపదే రాయబారాలు, ఒడంబడిక కుదరని తాత్కాలిక పోరాటం రద్దులు, ఆఖరున సంపూర్ణ పతనం.

తొట్టతొలిసారిగా 1920 పది మధ్యభాగంలో ఒక నూతనశక్తి అభివృద్ధి చెంది, పోరాటపు నూతనతరంగానికి నాయకత్వం అప్పటికి యివ్వలేకున్నా మంచి ప్రోత్సాహంఇచ్చి ముందుకు త్రోసింది. అశక్తేవంటే, ఒక స్వతంత్రశక్తిగా పరిశ్రమ

ల్లోని కార్మికవర్గం తయారై ముందుకు వచ్చింది. అనుపమ ధైర్యస్థైర్యాలతో తన పోరాటాలను నడుపుకుంటూ, తన నాయకత్వాన్ని తాను అభివృద్ధి చేసుకునేందుకు ఆరంభించింది. ఇందుతో కార్మికవర్గ నూతనసిద్ధాంతం - సోషలిజం- తొలిసారిగా భారత దేశంలో ఒక రాజకీయశక్తిగా అభివృద్ధి చెందసాగింది దాని భావాలు భారత జాతీయోద్యమంలోని యువ అతివాదవర్గాలలోనికి చొచ్చుకొనిపోసాగాయి. దీనితో నూతనజీవితం, శక్తి, హద్దులు, మరింత విశాలమైనవి. 1924 కాన్పూరు కుట్రకేసు విచారణలో, విప్లవాత్మక కార్మికవర్గ రాజకీయాల ప్రధమ సూచనలను నిర్మూలించాలన్న సామ్రాజ్యవాద నిశితదృష్టి కన్పిస్తుంది. 1926, 1927 లో ముందుకువచ్చిన కార్మిక కర్షకపార్టీ అభివృద్ధితో 1928 లో కార్మికోద్యమం పురోగమించింది పెద్ద సమ్మెఉద్యమం సాగింది. 1928 బ్రహ్మాండమైన సమ్మెఉద్యమం సాగినప్పుడు మొత్తం 3,16 47,000 పనిరోజులు నష్టమయ్యాయి - అంటే గత అయిదేళ్ళ మొత్తం పనిరోజుల నష్టం ఇంతకన్నా తక్కువే. పోరాటశక్తిగల గిర్నీకాంగార్ యూనియన్‌లో—బొంబాయి బట్టలమిల్లు కార్మికులసం—ఘంఒక సంవత్సరంలోనే 65,000 సభ్యులు చేరారు ఇందుతో కార్మిక సంఘ సభ్యత్వం నూటికి 70 వంతులు పెరిగింది. ఆయేడు సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా జరిపిన ప్రదర్శనల్లో కార్మికవర్గం ప్రధానరాజకీయ పాత్రను నిర్వహించింది. ట్రేడ్‌యూనియన్‌లలో నూతనచైతన్యం పొంగి పొరలుతున్నది; 1929 లో ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌లో అతివాదపక్షం విజయవంతమయింది - ఇవి భారతప్రజల పోరాటంలో క్రొత్త వెల్లువకు కారణమైన మహత్తరమైన శక్తిగా పనిచేశాయి.

జాతీయోద్యమంలోను, కాంగ్రెస్‌లోను నూతన అతివాదపక్ష ప్రాదుర్భావంలో ఈ పురోగమనం ప్రతిబింబించింది. 1927 ఆఖరుకు జవహర్లాల్ నెహ్రూ, యూరోపులో ఒకటిన్నర సంవత్సరంపైగా సంచారంచేసి తిరిగివచ్చాడు. ఆ సంచారంలో ఆయన సోషలిస్టు వర్గాలతోను, అభిప్రాయాలతోను పరిచయం కల్పించుకున్నాడు. 1927 ఆఖరున జరిగిన మదరాసు కాంగ్రెస్‌లో ముఖ్యంగా యువకుల్లో అతివాదవైఖరులవైపు పురోగమనం కనిపించింది. జాతీయోద్యమ ఆదర్శం సంపూర్ణ స్వతంత్రమని (దీనిని పూర్వం నాయకత్వం ఎప్పుడూ యెదిరిస్తూ ఉండేది) - తెలిపే తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడింది (గాంధీజీ అప్పు డక్కడలేడు. తర్వాత ఆ తీర్మానాన్ని "తొందరపడి చేసినదీ, ఆలోచన లేకుండా ఆమోదించబడిందీ" నని ఆయన ఖండించాడు.) సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని నిశ్చయించారు ; మరొక రాజ్యాంగప్రణాళికను తయారుచేసేందుకు, ఒక అఖిలపక్ష మహాసభలో పాల్గొనేందుకు అంగీకరించారు. క్రొత్తగా స్థాపితమైన సామ్రాజ్య వ్యతిరేక అంతర్జాతీయ సమితికి కాంగ్రెసును అంగంగా చేర్చారు. యువకులను కాంగ్రెసులో పెరుగుతున్న అతివాదభావాలకు ప్రధాన

నాయకులైన జవహర్లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్‌లను ప్రధాన కార్యదర్శులుగ ఎన్నుకున్నారు.

1927 కాంగ్రెస్‌లో బయటికి కనిపించే అతివాదుల విజయం పైపైన వ్యతిరేకత లేనందువల్ల జరిగింది మాత్రమే. కాని 1928 లో జరిగిన సంఘటనలు సైమన్ కమీషన్ వ్యతిరేక ప్రదర్శనల విజయం, సమ్మె ఉద్యమ పురోగమనం కొత్తగా ఏర్పరచిన స్వతంత్ర సమితి (ఇండిపెండెన్సు లీగు) పెరుగుదల, యువ విద్యార్థి సంఘాల పెరుగుదల ఇవన్నిటితో అతివాదులు ఒకశక్తిగా పరిణమిస్తున్నారని త్వరలో కాంగ్రెస్‌ను తుడిచివేయ గలరని పాత నాయకులకు స్పష్టమయింది. అఖిలపక్ష మహాసభలో కాంగ్రెస్ వెలుపల నున్న మితవాద-అభివృద్ధి నిరోధక వర్గాలతో కలిసి పాతనాయకులు ఒక ప్రణాళికను (ఈసభ అధ్యక్షుడు మోతీలాల్ నెహ్రూ పేర దీనిని నెహ్రూ నివేదిక అంటారు.) తయారుచేశారు. ఈ నివేదిక బ్రిటిష్ సామ్రాజ్యంలో బాధ్యతాయుత ప్రభుత్వం అనే ప్రాతిపదికపై రాజ్యాంగ శాసనాన్ని తయారుచేసి, స్వతంత్ర వాంఛను మూలకు నెట్టింది. కాని వ్యతిరేక భావ పరంపర చెలరేగు తున్నందువల్ల ఈ ప్రణాళికను కాంగ్రెస్ అంగీకరిస్తుందా అన్న అనుమానం తలసూపింది.

ఇలా విషమస్థితిలో ఉన్న బలపరీక్షలో, పదేళ్ళ క్రిందటికన్నా తీవ్రతరమైన పరిస్థితిరానున్నదని, అందులో పెద్ద కొత్తపోరాటాలు తప్పవని తోచిన యీ సమయంలో మితవాద నాయకత్వం మరొకతూరి గాంధీవేపు తిరిగింది. పూర్వం ఈయనను వెనుకకు నెట్టారు. కాని తిరిగి ఆయననక్షత్రం అంబరవీధి కెక్కింది. 1928 ఆఖరున జరిగిన కలకత్తా కాంగ్రెస్‌లో గాంధీజీ తిరిగి కాంగ్రెస్ నాయకత్వానికి వచ్చాడు. మితవాదనాయకులు ఆయన వ్యక్తిగత తలతిక్క వ్యవహారాలనెలా చూచినా, ఆయన పాతనాయకులలో మంచిసూక్ష్మదృష్టి అనుభవంగల రాజకీయవేత్త అనడంలో వారికి సందేహంలేదు; అదీగాక ఆయనకు ప్రజల్లో అనుపమాన గౌరవ ముంది - దానిని ప్రపంచప్రచారం భారతమహావ్యక్తిగా విస్తృతపరిచింది; తీవ్ర మత ఆదర్శవాద సూత్రాలైన వినయం, దరిద్రప్రేమ అనే వానిపేర ఆస్తిని సమర్థించే ఋషిఆయన; అభేద్యవేదాంత మతతార్కికుడైన ఈయన, దేనినైనాసరే అద్భుతవివరణ వాదోపవాద పరంపరల్తోపి సమర్థించగలడు. ఈ వాదాలే ఏ సామాన్యవ్యక్తోచేస్తే నిజాయితీలేని వాచాలత్వం అంటారు. గాని ప్రపంచంలోని మహాపురుషులైన మాక్డనాల్డు, గాంధీజీల విషయంలో ఇదంతా అధ్యాత్మికవాద స్థాయిగా గుర్తిస్తారు; తన మౌనిత్వం, స్వార్థత్యాగంమూలంగా ఈయన, ఇతర మితవాద బూర్జువానాయకుల మాటలు వెళ్ళలేని ప్రజాహృదయ కవాటాలను తెరువ గలడు; ఈయన సాహచర్యసౌభాగ్యం కలిగిన ఏ ప్రజాఉద్యమమైనా మధ్యలో మునిగిపోతుందనేందుకు హామీఉంది. ఈ విప్లవజోనా, ఈతిరుగులేని విధ్వంసన సేనాని, ప్రతిభారతసంగ్రామ తరంగంలోను ధనికవర్గానికి మాస్కాట్ అయినా డీయన. కాబట్టి మరొకతూరి ఆధునిక భారత రాజకీయాలలో విలక్షణమైనఅంశం

ప్రతిపదా భారతరాజ్యాంగచట్టంలోను లిఖితపూర్వకంకాని సూత్రం - గాంధీజీని యెదబాయలేము అన్నది తిరిగికనిపించింది. (నిజానికి వర్గశక్తులబలం విషమ ఘట్టంలో ఉన్నదనేందుకు నిదర్శనమే ఇది). ధనికవర్గంయొక్క ఆశలన్నీ (వ్యతిరేకుల సామ్రాజ్యవాదుల ఆశలన్నీ అంటారు కావచ్చు) గాంధీజీమీద కేంద్రీకృత మయినవి. ఆయనేతరంగాలపై ముందుకునడిచి, లాభసాటి బేరానికి తగినంతమట్టుకే ప్రజాఉద్యమాన్ని ముందుకుపోనిస్తూ, ఆదేసమయంలో భారత దేశాన్ని విప్లవంనుండి రక్షించగలవాడని వారివిశ్వాసం

1928 డిశంబరులో జరిగిన కలకత్తా కాంగ్రెస్‌లో నెహ్రూ నివేదికను ఆమోదింపజేసేందుకు గాంధీజీకి కష్టమైంది. ఈ నివేదికను ఏవిధంగానూ సంపూర్ణస్వతంత్రాదర్శాన్ని ఉపసంహరించేదిగా భావించరాదని గాంధీజీ వ్రాసిన తీర్మానంలో వాగ్దానం చేశాడు: 1929 డిశంబరు 31 నాటికి ఈ నివేదికను ప్రభుత్వం అంగీకరించకపోతే (గాంధీజీ దీనిని 1930 డిసెంబరు అని అసలు రెండేళ్ళ వాయిదా యిచ్చినాడు. కాని, 1929 డిసెంబరు అనేది ఆమోదితమైనది) అప్పుడు కాంగ్రెసు అహింసాత్మక సహాయనిరాకరణోద్యమాన్ని పునరుజ్జీవింపజేస్తుందని, పన్నులనిరాకరణకూడ ఆరంభిస్తుందని ఆయన వాగ్దానం చేశాడు. ఈ తీర్మానంకూడ చాల కొద్ది మెజారిటీతోనే నెగ్గింది. ఈ తీర్మానానికి అనుకూలంగా 1,350 ఓట్లు వస్తే, నెహ్రూ నివేదికకు వ్యతిరేకంగా సంపూర్ణ స్వతంత్రాన్నే తక్షణాదర్శంగా ప్రకటించాలని బోసు, జవహర్లాల్ నెహ్రూలు తెచ్చిన సవరణకు 973 ఓట్లు వచ్చాయి. 1928 నాటి సంఘటనలు ప్రజల్లో అశాంతి అత్యుచ్ఛదశలో ఉన్నట్లు సూచిస్తున్న ఆసమయంలో కార్యాచరణకు ఒక సంవత్సరం వాయిదా వేయడం జరిగింది. సిద్ధపడడానికి సామ్రాజ్యవాదానికి ఒక సంవత్సరం వ్యవధి ఇవ్వబడింది. "కలకత్తా కాంగ్రెస్ చేసిన చన్నీళ్ళుపోసే తీర్మానం, కేవలం అమూల్యసమయాన్ని హరించేందుకు మాత్రమే ఉపయోగపడింది" అని సుభాషచంద్రబోసు ("ఇండియా పోరాటం" పుట 181) వ్రాశాడు. ఈలోగా పరిస్థితి తీవ్రతను సూచించే సంఘటన ఒకటి జరిగింది. కలకత్తా కార్మికులు 20.000 (అధికార కాంగ్రెసు చరిత్ర ప్రకారం 50,000) ఒక ప్రదర్శనం జరిపారు. జాతీయ స్వతంత్రం కావాలని "స్వతంత్ర సోషలిస్టు భారత రిపబ్లిక్ ఏర్పడాలని నినాదాలతో వారు కలకత్తా కాంగ్రెసు సమావేశములోనికి వచ్చి రెండు గంటలసేపు కాంగ్రెస్ పందిటిని స్వాధీనపరుచుకున్నారు. సంస్కరణవాద జాతీయ నాయకులు వారికి దారిచ్చి జాతీయ స్వతంత్రానికి రాజీలేని పోరాటం కోరే కార్మికవర్గ వాంఛితాన్ని వినవలసివచ్చింది.

ఒకసంవత్సరం వాయిదా వేయడంతో సామ్రాజ్యవాద చర్యలకు అవకాశం దొరికింది. ఈసమయాన్ని సామ్రాజ్య తత్త్వం పోగొట్టుకోలేదు. 1929 మార్చిలో అభివృద్ధి చెందుతున్న కార్మికవర్గ ఉద్యమ ప్రముఖ నాయకు లందరిని, భారత దేశంలోని అన్ని భాగాలలోను అరెస్టు చేశారు. ఎక్కడో మారుమూలలో ఉన్న

మీరట్ కోర్టుకు వీరిని విచారణకు కొనిపోయారు. (అక్కడ వారిని జూరీలు లేకుండ విచారించ దలచారు): ఈ విచారణ నాలుగేళ్ళు సాగదీశారు. తర్వాత వచ్చిన పోరాట వెల్లువ దేశాన్నలముకొన్న రోజులన్నీ వారిని జైల్లోనే శిక్షకూడ చెప్పకుండానే ఉంచారు. ట్రేడ్ యూనియన్లు కార్మిక కర్షకపార్టీ నాయకత్వంలోని వారందరినే కాక, అరెస్టయిన వారిలో ముగ్గురు నాయకులు అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులు కూడ ఉన్నారు. ఇలా కార్మికవర్గాన్ని నాయక విహీనంచేసి స్పష్ట భావాలు, స్థిరసంకల్పంగల దృఢ అతివాద పక్ష నాయకులను - ప్రజల్లో నిజమైన ప్రాతి పదికకల వారిని వేరుపరచి, కాంగ్రెస్ నాయకత్వం పెత్తనంతో ఉద్యమాన్ని ఆరంభించ నిచ్చారు. ఇందుతో పాటు వైస్రాయి డిక్రీతో తీవ్రవాద శక్తులపై గురిపెట్టి ప్రజారక్షణ అవసర శాసనం (పబ్లిక్ సేఫ్టీ ఆర్డినెన్సు) అమలు జరిపారు.

కాంగ్రెసు క్లిష్టసమయంలో పడనున్న పోరాట సంవత్సరం గాంధీజీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. అయినప్పటికీ, ఆయన ఉన్నపరిస్థితిని, శక్తుల బలాబలాలను అతి జాగరూకతతో గమనించి, తాను అధ్యక్షతకు నిలవకుండా, తన స్థానానికి యువనాయకుడు, స్వతంత్ర సమితి నాయకుడు, సోషలిస్టు సాను భూతిని ప్రకటిస్తున్న వాడు అయిన జవహర్లాల్ నెహ్రూను నియమించాడు. నెహ్రూను తాను నియమించడాన్ని సమర్థిస్తూ గాంధీ నెహ్రూను ఇలా వర్ణించాడు.

> "ఆయన దేశభక్తిలో ఎవ్వరూ ఆయన్ను అతిక్రమించలేరు; ఆయన సాహసి, తీవ్ర భావోద్వేగం కలవాడు, ఇప్పుడా గుణాలు చాల ముఖ్యమైనవి కావి, పోరాటంలో ఎంత ఆవేశమూ, స్థిరనిశ్చయమూ ఉన్నప్పటికి, ఆయన రాజ్యాంగవేత్తల హేతువాదాన్ని గోల్పోలేదు. ఆయన క్రమశిక్షణను ఆమోదిస్తాడు; తాను ఏకీభవించని నిర్ణయాలకు కూడ అనువర్తించేశక్తి ఆయనకున్నట్లు కార్యరూపేణా రుజావుచేశాడు. ఆయన వినయసంపన్నుడు; అతిగా పరుగులెత్తేవాడుకాదు. ఆయన చేతులలో దేశం సురక్షితంగా ఉంటుంది."

సామ్రాజ్య తత్వంతో రాజీ పడేందుకు మితవాద నాయకులు మరో ఆఖరు ప్రయత్నం చేశారు. 1929 అక్టోబరు 31 తేదీన వైస్రాయి ఒక అస్పష్ట ప్రకటన చేస్తూ, ఏదో భావి కాలంలో అనిర్ణీతమైన రోజున "అధినివేశ స్వతంత్రం అవశ్యం" అని ప్రస్తావించిన మాటను పట్టుకొన్నారు. (ఈ ప్రకటనలో "ఏ వాగ్దానం గాని, విధానంలో మార్పుగాని లేదు" అని మరుసటి రోజే టైమ్సుపత్రిక ప్రకటించింది) ఆ ప్రకటనకు బదులుగా భారత దేశంలోని పార్టీ నాయకులు ఒక సంయుక్త ప్రకటన చేస్తూ, హృదయ పూర్వక సహకారం చేస్తామన్నారు. ఈ ప్రకటననే ఢిల్లీ మానిఫెస్టో అంటారు. అందులో ఇలా ఉంది: "ఈ ప్రకటనలో అంతర్గతమై ఉన్న నిజాయితీని మేము అభినందిస్తున్నాము....భారత దేశ అవసరాలకు అనుకూలమైన అధినివేశ రాజ్యాంగ చట్టాన్ని తయారు చేయడానికై ప్రభుత్వం చేసే

ప్రయత్నాలలో మాసహకారం ఇచ్చేందుకు పిలవుతుందని ఆశిస్తున్నాము." ఈ ప్రకటనలో గాంధీజీ, బిసెంటు, మోతీలాల్ నెహ్రూ, సర్ తేజ్‌బహదూర్ సప్రూ, జవహర్‌లాల్ నెహ్రూ మొదలైన వారు సంతకాలు చేశారు జవహర్లాలు దానిని అంగీకరించలేదు. తర్వాత "పొరపాటు ప్రమాదము"అని నిర్ణయించాడు. ఆ సమయంలో అతను ఎన్నుకొనబడ్డ కాంగ్రెస్ అధ్యక్షుడు గనక సంతకం చేయకపోతే ఐక్యతను విచ్ఛిన్నం చేసినట్టవుతుందని "సంతకం చేసేట్టు చేశారు" అని నెహ్రూయే తర్వాత వ్రాశాడు. "గాంధీజీ వ్రాసిన అనునయ లేఖ" జవహర్లాలు అనుమానాలను తీర్చేందుకు సాయపడింది ఈ ఢిల్లీ మాని ఫెస్టోను దుర్బల సూచకంగా సామ్రాజ్యవాదులు సంతోషంతో స్వీకరించారు. ("నిన్నటి రాత్రి ప్రకటనకు అర్థమేమంటే, లాహోరులో కాంగ్రెస్ ఏ కార్యక్ర మంమీద సమావేశం కావలసి ఉండెనో ఆకార్యక్రమాన్ని చించి పారవెయ్యడమే" లండన్ టైమ్సు నవంబర్ 4.1929) కాంగ్రెసు అనుచరులను గందరగోళ పరచడం తప్ప ఇందువల్ల ఏ ఫలితమూ కలుగలేదు. కాంగ్రెస్ సమావేశానికి ముందు వైస్రాయితో జరిపిన సమావేశం నిష్ఫల మయి పోయింది.

యధాప్రకారం 1929 ఆఖరున లాహోరు కాంగ్రెసులో ఆ కార్యాచర ణకు నిర్ణయం తీసుకున్నారు అధినివేశస్థాయిని చెప్పే నెహ్రూ నివేదిక రద్దయి పోయిందని, పూర్ణస్వరాజ్యం ఇకమీద కాంగ్రెసు ఆశయమనీ, ప్రకటించారు. "ఎప్పుడు అర్హమని తలంచితే అప్పుడు శాసనోల్లంఘన కార్యక్రమం ప్రారం భించేందుకూ, అందుతోపాటు పన్నుల నిరాకరణకూడ ప్రారంభించేందుకు" కాంగ్రెసు అఖిలభారత కాంగ్రెసుసంఘానికి అధికారమిస్తూ తీర్మానించింది. 1930 వ సంవత్సరం ప్రారంభమవుతుండగా అర్ధరాత్రిలో భారత స్వతంత్రపతాకం (యెరుపు, తెలుపు ఆకుపచ్చ - తర్వాత ఇందులో యెరుపును తీసివేసి నారింజ చేర్చారు) ఎగురవేశారు 1930 జనవరి 26 వ తేదీ ప్రథమ స్వతంత్ర దినోత్సవం, భారత దేశమంతటా మహత్తర ప్రదర్శనాలద్వారా జరపబడింది. ఆ సభలో సంపూర్ణ స్వతంత్రపోరాట ప్రతిజ్ఞను చదివి ఆమోదించారు. అందులో బ్రిటిష్ ప్రభుత్వా నికి "ఇంకమీదట లొంగిఉండడం మానవునికి, దైవానికికూడ వ్యతిరేకమైన అపరాధం" అని తెలిపి, యీక్రింది విశ్వాసాన్ని వెల్లడించారు. "మనం స్వచ్ఛంద సహాయాన్ని ఉపసంహరించుకొని, పన్నులివ్వడం మానివేస్తే, ఎంత రెచ్చగొట్టినా హింసకు దిగకపోతే, ఈ అమానుషపాలన సమాప్తి చెందడం తప్పదు."

ఇప్పుడు ఆరంభమైన పోరాటానికి ఆదర్శ మేమిటి? పోరాటకార్యక్రమ మేమిటి? పరిష్కారానికి తగినవని భావించే కనీస షరతులేమిటి? "ఈఅమానుష పాలనసమాప్తి"ని కొనివచ్చేటట్టు బ్రిటిష్‌ప్రభుత్వంపై అంతటి అప్రతిమానమైన ఒత్తిడిని ఏవిధంగా కొనిరావాలి? ఈప్రశ్నలన్నిటినిగూర్చి తొలినుంచిగూడ స్పష్ట భావాలులేవు.

సంపూర్ణస్వతంత్రమే, ఉద్యమఆశయంగా కనిపించవచ్చు దిహాలశా అలాగే కాంగ్రెస్ సభ్యులలోని అత్యధిక సంఖ్యాకులూ, కాంగ్రెస్ పిలుపును అనుగమించిన ప్రజలూ, భావిస్తూ ఉంటారు. ఔను, మోతీలాల్ నెహ్రూ చనిపోతూ చెప్పిన మాటలలో ఇదే సూచితమవుతున్నది ఆయన గాంధీ - ఇర్విన్ ఒడంబడిక ముందు చనిపోతూ పోరాట ఆదర్శం స్వతంత్రమేనని తాను భావించినట్లు ఇలా అన్నాడు: "నేను చావడమే తప్పకపోతే, నేను స్వతంత్ర భారతవర్యంక పాళిలో చనిపోదునుగాక. నాఆఖరునిద్ర దాస్యదేశంలోకాక, స్వతంత్ర దేశంలో విద్రింతునుగాక."

కాని ఏమైనా గాంధీజీ నిర్వచనం మాత్రం ఇదికాదు. లాహోరు సమావేశమయిన వెంటనే గాంధిజీ న్యూయార్కు వరల్డ్, పత్రికద్వారా జనవరి 9 తేదీని ఒక ప్రకటన చేశాడు: "స్వతంత్ర తీర్మానం ఎవ్వరిని భయపెట్ట పనిలేదు" (మార్చిలో పై ప్రాయి వ్రాసిన జాబులో దీనిని తిరిగిచెప్పాడు); జనవరి 30 వ తేదీ తనపత్రిక 'యంగ్ ఇండియా' లో 11 అంశాల ప్రణాళికను ప్రకటించాడు ఇందులో ఎన్నో సంస్కరణలను సూచించాడు (రూపాయ మారకం 1 షిల్లింగు 4 పెన్నీలకు చెయ్యాలి, పూర్తిగా మద్యనిషేధం పెట్టాలి, భూమిపన్నును సైనిక వ్యయాన్ని తగ్గించాలి, విదేశవస్త్రాలపై రక్షణసుంకాలు విధించాలి వగైరాలు.) ఇవన్నీ అంగీకరిస్తే శాసనోల్లంఘనం నిలిపివేస్తామని వ్రాశాడు. పోరాటం ప్రారంభించనున్న సమయంలో ఈ పదకొండు షరతులు ప్రకటించడం, స్వతంత్రవాంఛ కేవలం బేరంగామాత్రమే భావించమని, సాంప్రదాయ సిద్ధమైన బజారుసవాలులో మొదటపెట్టే మామూలు పాటేనని, తగినన్ని సౌకర్యాలిస్తే దీనిని ఒకప్రక్కకు నెట్టవచ్చునని ప్రతిపక్షులకు సూచించేందుకే జరిగింది.

ఉద్యమ విషాదస్థితికూడ అలాగే అస్పష్టంగానే ఉంది. సబర్మతీలో 1930 ఫిబ్రవరిలో సమావేశమైన కాంగ్రెస్ కమిటీ, మరొకతూరి అధికారాన్నంతటినీ "మహాత్మా గాంధీ అతనితో పనిచేసేవారి" చేతులలో ఉంచింది - (ఏ కాంగ్రెసు కమిటీ చేతిలోను పెట్టలేదు) ఆయనే ఉద్యమాన్ని నడపాలని, చేత నుంచుకోవాలని తీర్మానించింది; "శాసనోల్లంఘనాన్ని, ఎవరు అహింసను.........సిద్ధాంత ప్రాయంగా విశ్వసిస్తారో వారే నడపాలి" అనే కారణంమీద ఈ నిర్ణయం చేశామన్నారు. ఎన్నుకొనబడిన కాంగ్రెసు నాయకత్వం ఏ కార్యక్రమం సూచించకుండా అలా అప్పగించిన ఉద్యమం ఏవిధంగా ఉంటుంది? లాహోరు కాంగ్రెసును గూర్చి సుభాష్‌బోసు ఇలా వ్రాశాడు:

"కాంగ్రెస్ దేశంలో ఒకప్రతికక్షిప్రభుత్వం ఏర్పరచాలని, అందుకై కార్మికులను, రైతులను, యువకులను సంఘటితపరిచే కార్యక్రమానికి పూనుకోవాలని, అతివాదుల పక్షంగా నేనొక తీర్మానాన్ని ప్రవేశపెట్టాను. ఆ తీర్మానం ఓడిపోయింది దానికి ఫలితంగా, కాంగ్రెసు సంపూర్ణ స్వతంత్రమే తమ ఆశయమని అంగీకరించినప్పటికి, ఆ ఆశయసిద్ధికి

ఒక కార్యక్రమంకూడ సిద్ధపరచలేదు — వచ్చే సంవత్సరానికి ఏ కార్యక్రమాన్ని నిర్ణయించనూలేదు. ఇంతకంటే అవ్వాన్నపరిస్థితిని ఊహించలేము."

(సుభాస్ బోస్ "భారత పోరాటం" పుట 200)

జవహర్‌లాల్ నెహ్రూ ఇలా రాశాడు :

"మేమింకా భావినిగూర్చి అస్పష్టంగానే ఉన్నాము. కాంగ్రెసు సమావేశంలో ఉత్సాహం ప్రదర్శితమైనప్పటికి, కార్యాచరణకు దేశ మెలా పూనుకుంటుంది అనే విషయం ఎవ్వరికీ తెలీదు. మేము మా పడవలను కాల్చివేశాం గనక వెనక్కు తిరిగి పోలేము. కాని మా ముందున్న దేశం దాదాపు మాకు తెలియని, మాది కాని, భూమిగా ఉన్నది "

(జవహర్లాల్ నెహ్రూ "ఆత్మకథ" పుట. 202)

ఉద్యమ ప్రణాళికను తెలుసుకోవాలని కోరిన వారిని అధికార కాంగ్రెస్ చరిత్ర ఇలా మందలించింది :

"సబర్మతీలో చేరినవారు, గాంధీజీని ఆయన కార్య ప్రణాళికను గూర్చి అడిగారు. వారలా అడగడం న్యాయమే. ప్రథమ మహాయుద్ధ ప్రారంభ సమయంలో లార్డు కిచనర్‌ను గాని, మార్షల్ ఫోచ్‌ను గాని, ఫాన్ హిండన్‌బర్గును గాని వారి ప్రణాళికలేవో తెల్పమని ఎవరూ అడిగి ఉండరు. వారు ప్రణాళికను తయారు చేసుకొని ఉన్నా, వారు చూపక పోవచ్చును. సత్యాగ్రహ విషయంలో అలాంటిది లేదు. మా ప్రణాళికలలో రహస్య మేదీలేదు. కాని అవి స్పష్టంగామా లేవు. హిమాచ్ఛన్న ఉషోదయంలో త్వరత్వరగా నడచి వస్తున్న కాంతి కిరణానికి గజానికి గజం దారి దొరుకునట్లుగా ఆ కార్యక్రమము దానంతట అదే బయట పడుతూ వస్తూంది. సత్యాగ్రహి తన కాగడాను నుదుట పెట్టుకొని ఉంటాడు, అది తర్వాతి సోపానాన్ని మాత్రమే చూపుతోంది."

(అధికార "జాతీయకాంగ్రెస్ చరిత్ర" పుట 628)

ఇందువల్ల ఉద్యమమంతా గాంధీజీ భావంమీద పూర్తిగా ఆధారపడింది. దేశాన్ని,దాని భవిష్యత్తును, ఆయన మార్గదర్శిత్వానికి అప్పగించారు.

ఆశయ నిర్వచనాన్నిబట్టి రెండు వ్యతిరేకఉద్యమ స్వరూపాలను నిర్వచింప వీలవుతుందని స్పష్టమే అది బ్రిటన్ పాలన నిర్మూలనకు, సంపూర్ణ స్వతంత్రస్థాపనకు భారతప్రజల యావచ్ఛక్తుల అంతిమపోరాటమూ కావచ్చు,* లేక బ్రిటీష్‌ప్రభుత్వంనుండి ఇంతకన్న మంచిబేరాలను సౌకర్యాలను సంపాదించుకొనేందుకై పరిమితమైన, నిర్ణీతమైన, ప్రజలఒత్తిడి ప్రదర్శనమూ కావచ్చును.

* కాంగ్రెస్‌చరిత్రలోని ఈ పోరాటంగూర్చిన అధ్యాయానికి శీర్షికనుబట్టి "అంతిమ పోరాటం" ఇది.

ఇందులో మొదటిదే లాహోర్ కాంగ్రెసు అనుకున్నది. భారత ప్రజాసామాన్యం ఎదురుచూస్తున్నదీకూడ. కాని ఇదే ఆశయమయితే, అలాంటి బ్రహ్మాండ కర్తవ్యాన్ని నిర్వహించేందుకు పెద్దశత్రువును అసమర్థంగా చేసేందుకు ఏంచెయ్యాలి? ఇదేమాత్రం ఫలించాలన్నా త్వరత్వరగా దాడిలోనికి పీల్చేసంత అధిక సంఖ్యాకశక్తులను తిరుగుదాడికి తగిన కార్యక్రమాన్ని శత్రువు ఏర్పరుచుకునేలోగా ప్రతిపక్షశక్తులను ముంచివేసే దృష్టితో ఉద్యమంలోనికి కొనిరావలసిఉంటుంది కాంగ్రెస్, కార్మికోద్యమాల, యావచ్ఛక్తికీ అందగాఉంచి సర్వవ్యాప్తసమ్మెను జరపవలసిఉంటుంది; రైతులందరినీ, ప్రభుత్వ జమీందారీల పన్నులను నిరాకరించమని ఉద్బోధించవలసి ఉంటుంది; కోర్టులు, స్వచ్ఛందసేవకులు, శాసనసభలు మొదలైన వాటితో దేశమంతటా ప్రతిపక్ష జాతీయప్రభుత్వాన్ని స్థాపించవలసి ఉంటుంది అప్పుడున్న జాతీయప్రజావేశం పరాకాష్ఠచెందినస్థితిలో ఉద్యమాన్ని తీవ్రవేగంతో, దృఢనిశ్చయంతో జరిపేఉంటే, ప్రజాసామాన్యాన్నంతటినీ సంఘటితపరచి, సామ్రాజ్యతత్త్వాన్ని ఏకాకిగా వేరుచేసి, స్వతంత్రాన్ని సాధించే అవకాశం చాలవరకు ఉండినది (గార్వాలీ తిరుగుబాటు, పెషావర్-షోలాపూర్ అనుభవాలు ఇందుకు పెద్ద అవకాశమున్నట్టు సూచిస్తున్నవి)

గాంధీజీ భావం ఇదికాదు. అంతేకాదు, ఆ సమయంలోనూ, తర్వాతా ఆయన చేసిన ప్రకటనలనుబట్టీ ఆయన ప్రధానసమస్య అంతా, ఎలాగున పోరాటం ఇలా మారకుండా చేయాలి అన్నదే. 1931 మేలో వ్రాసిన ఒక వ్యాసంలో, విజయం రావడానికి తన అహింసా సిద్ధాంతంనుండి "వెంట్రుకవాసి" తొలగవలసి వచ్చినాసరే, నేను పరాజయాన్నే మంచిదని భావిస్తాను అని ఆయన వివరించాడు :

> "అహింస చెడకుండా సంపూర్ణ పరాజయమైనా సరే స్వాగతమిస్తాను కాని, సందిగ్ధమైన విజయం సాధించేందుకై అహింసనుండి వెంట్రుకవాసి తొలగడానికి సమ్మతించను."

(గాంధీ. 1931 మేలో. లండను హెరాల్డు. మే 8, 1931 లో ఉదాహరింపబడినది.)

గాంధీజీ 1930 మార్చిలో వైస్రాయికి జాబురాస్తూ పోరాటంలోఉన్న శక్తులను వివరించి. తా నెందుకు నాయకత్వం వహించాడో అందులో స్పష్టపరిచాడు.

> "హింసాపక్షం స్థానం సంపాదించుకుంటూ, అర్హతను గడించుకొంటూంది.........ఆ శక్తిని (అహింసను) బ్రిటిష్ ప్రభుత్వపు సంఘటిత హింసాశక్తికి, పెరుగుతున్న హింసాపక్షంయొక్క అసంఘటిత హింసాశక్తికి వ్యతిరేకంగా పనిచేయించాలని నా కర్తవ్యం. ఊరకే కూర్చోవడమంటే, పై రెండుశక్తులను స్వేచ్ఛగా వదిలివేయడమే అవుతుంది."

(గాంధీ, వైస్రాయికి మార్చి 2, 1930 లో వ్రాసిన జాబు.)

ఇలాగా అభివృద్ధిచెందుతున్న ప్రజాపోరాటం ప్రారంభదశలో రెండు శక్తుల మీదా గాంధీజీ పోరాటాన్ని ప్రకటించాడు. బ్రిటిష్‌ప్రభుత్వానికి వ్యతిరేకంగామాత్రమే కాక, భారతదేశంలోని అంతశ్శత్రువుమీదకూడా పోరాడుతానన్నాడు. రెండు రంగాలలో పోరాటమనే ఈ సిద్ధాంతం. భారత ధనికవర్గపాత్రతో సరిపోతుంది ఆ ధనికవర్గం, సామ్రాజ్యవాదంతో ప్రజాఉద్యమానికి తగాదా పెరిగేకొద్దీ, తమ అడుగులక్రింద నేల కూలిపోతున్నట్టు చూచి భయభ్రాంతమవుతుంది: "వెట్టివాని సాహసమే" అయినప్పటికీ (వైస్రాయికి వ్రాసిన జాబులో గాంధీజీ ఉపయోగించిన మాట) దాని కళ్ళాలను చేతపట్టుకొని అదుపులో ఉంచుకొనేందుకు ("ఊరికే కూర్చోవడమంటే, పై రెండుశక్తులను స్వేచ్ఛగా వదిలివేయడమే అవుతుంది") పోరాటానికి నాయకత్వం విధిలేక వహిస్తుంది; ఈ రెంటిని "అహింస" అనే ఇంద్రజాల బంధనంతో సమాధానపరిచేందుకు ప్రయత్నిస్తుంది. ఏమైనప్పటికీ స్పెయిన్ విషయంలో ఆఖరురోజుల్లో ప్రజాతంత్ర రాజ్యాలు అవలంబించిన "తటస్థవిధానం" లాంటిదే ఈ "అహింస," "ఇది ఒకవేపు అహింస." భారత ప్రజల పక్షంగానేమో "అహింస", గాని సామ్రాజ్యతత్వమేమో తృప్తితీరేవరకు హింసను ప్రయోగించి పోరాటంలో విజయం సాధించింది. *

పోరాటాన్ని గూర్చిన ఈ భావానికి అనుకూలంగానే గాంధీజీ ఎత్తుగడ కూడ ఉంది. ఈ ఎత్తుగడ స్వతంత్రసాధనకు నడిపేదికాక, బ్రహ్మాండమైనవిప్లవ తరంగంమధ్య ప్రజాఉద్యమానికి నాయకత్వము చేతపెట్టుకుంటూ, అయినప్పటికీ దానిపై కావలసినన్ని నిర్బంధాలను, నియమాలను విధిస్తూఉండడానికే-అయితే ఈ ఎత్తుగడ మంచిప్రావీణ్యమూ శక్తిగలట్టిదే. ఉద్యమానికి ప్రథమాదర్శాన్ని అతి తెలివిగా ఎన్నుకోవడంలోను, దాన్ని నడిపేపద్ధతిని నిర్ణయించడంలోను ఈ అంశం అప్పుడే కనిపిస్తుంది. ఉప్పుపైనున్న ప్రభుత్వ గుత్త అధికారానికి వ్యతిరేకంగా పోరాటంసాగించడానికి ఆయన నిశ్చయించాడు. ఇందువల్ల కార్మికవర్గం చేరడానికి వీలులేకుండా పోరాటాన్ని వేరుచేయడం జరిగింది. గాంధీజీ ప్రతిప్రకటనలోనూ, భారతదేశంలోని కార్మికవర్గ శక్తికే, తాను భయపడుతున్నట్టు ప్రకటిస్తూవచ్చాడు; అంతేగాక ఈ పోరాటపద్ధతిద్వారా రైతుల ఆదరాన్ని, బలాన్ని సంపాదించ

---

* 1930 సహాయనిరాకరణోద్యమం ప్రారంభించడంలో తన ఉద్దేశాన్ని గాంధీజీ ఉత్తర ప్రత్యుత్తరాల్లోను, ప్రకటనల్లోను వివరించాడు. ఆయన శిష్యుడు సి. యఫ్. అండ్రూస్ ఇలా రాస్తున్నాడు:

"నాకాయన రాసినజాబుల్లో తన కారణాలను తెలిపాడు. తెగింపుచర్యగా కనబడేపనికి దిగడంలోని కారణాలను ఆయన పత్రికలద్వారాకూడా ప్రకటించాడు. ఉదాహరణకు నాకాయన ఇలా వ్రాశాడు: భారతప్రభుత్వ తీవ్రనిర్బంధవిధానం దినదినం పెరిగిపోతున్నది — దీనికి ముఖ్యంగా యువభారతంలో హింసారూపమైన ప్రతీకారచర్య వస్తున్నది. ఇలాంటి స్థితిలో ఒకే ఒక మార్గముంది: అహింసా ఉద్యమాన్ని ముందే నడపడం ఎంతప్రమాదమైనా ఆయనే నాయకత్వం వహించడం"

(సి. యఫ్. అండ్రూస్, స్పెక్టేటర్‌పత్రిక 27 సెప్టెంబర్, 1930.)

పిలవబడుతుంది. మరి ఆ రైతుల ఘోషాన్వాయులపై పోరాటమేదీ నడుపకుండానూ చేయ సాధ్యపడుతుంది. ఈ విశ్వాసాన్ని మరీ స్పష్టపరచంగా చేసుకోనేందుకు, తొలుత ఉద్యమాన్ని తానూ, తానేరుకున్న కొద్దిమంది తనశిష్యులూ మాత్రమే నడపాలని గాంధీజీ ఉద్దేశించాడు.

"నాపట్టుకు నేను ఉద్దేశిస్తున్న దేమంటే, ఉద్యమాన్ని ఆశ్రమంలో నివసిస్తూ, దాని క్రమశిక్షణకులోనై ఆ పద్ధతులను జీర్ణంచేసుకున్నవారి ద్వారానే ప్రారంభించాలని."

(గాంధీ, యంగ్ ఇండియా, ఫిబ్రవరి 27, 1930)

సరే సముద్రతీరంలో దండయాత్రను గాంధీజీ, ఆయన ఏరుకున్న డెబ్బైఎనిమిది సహచరులు ప్రారంభించారు. ఆయాత్ర మూడు అమూల్య వారాలుసాగింది. ప్రపంచ వార్తా చిత్రాల కెమెరాలు టకటకలాడుతున్నాయి. ప్రజలనేమో వేడిఉంచమన్నారు. ఈ ఉప్పుయాత్రకు పత్రికలద్వారా, సినిమాలద్వారా, ఇతరపద్ధతులద్వారా ఇచ్చిన ప్రచురణ ప్రజాసమీకరణకు, చైతన్యానికీతగిన సమర్థమైన ఎత్తుగడ అని కాంగ్రెస్‌నాయకులు భావించారు. బాగా వెనకబడిఉన్న ప్రజల్లో ఇది చాలాచక్కగా తన పనిని నిర్వర్తించింది. ఈ ప్రచారానికి ప్రభుత్వం ఏమాత్రం అడ్డుకోకుండా అవకాశమిచ్చింది. తర్వాత వారిదృష్టికీ దీనికీ వ్యత్యాసముంది (స్వాతంత్ర్యదినోత్సవానికి. అసలు పోరాటం ప్రారంభంకావడానికి ముందుగానే సుభాస్‌బోసును వారు జాగ్రత్తగా అరెస్టుచేశారు) ఇవన్నీచూస్తే ఇదికేవలం ఆ యాత్రలోని ప్రాముఖ్యతను గ్రహించకపోవడంవల్ల చేసినపనికాదు. మరిపైగా అందులోని ప్రాముఖ్యాన్ని అతిసూక్ష్మంగా అర్థంచేసుకొని, ప్రజాఉద్యమాన్ని గాంధీజీ తయారుచేసిన మార్గాలవైపు త్రిప్పేందుకు అవి ప్రత్యక్ష సహాయకారులని ప్రభుత్వం అర్థంచేసుకోవడంవల్లనే తగిన ప్రచురణను ఇచ్చింది.

అయినప్పటికీ, ఏప్రిల్ 6 వ తేదీ (అరెస్టు జరగకుండా) మత వాతావరణంలో, గాంధీజీ ఉప్పు చేయడంతో మూడువారాలు ముగిసిన క్షణంలోనే, దేశంపొడుగునా విజృంభించిన విపరీత ప్రజాఉద్యమం రెండువేపుల నాయకత్వానికి సంభ్రమాన్ని కల్గించింది. అధికారరీత్యా చాల పరిమితమైన, ప్రమాదకరం కాని, శాసనోల్లంఘన పద్ధతుల్లోనే ఉద్యమం నడవాలని ఆదేశించారు: ఉప్పు చట్టాన్ని ధిక్కరించడం, విదేశవస్తు బహిష్కరణ, విదేశీబట్టల అంగళ్ళవద్ద, ప్రభుత్వపు కల్లు, సారా అంగళ్లవద్దా పికెటింగు చేయాలన్నారు. ఏప్రిల్ 9 వ తేదీ ఇచ్చిన ఆజ్ఞలలో ఉద్యమాన్ని గూర్చిన గాంధీజీ అభిప్రాయం వెల్లడి అవుతున్నది:

"మన మార్గం అప్పుడే మనకోసం నిర్ణీతమైఉన్నది ప్రతి గ్రామమూ చట్టవిరుద్ధమైన ఉప్పును కొనిరావాలి లేదా తయారుచెయ్యాలి. సోదరీమణులు కల్లు, సారా అంగళ్ళవద్ద, నల్లమందు కొట్లవద్ద, విదేశీ

> గుడ్డల అంగళ్ళవద్ద పికెట్ చేయాలి. ప్రతి ఇంటిలోని యువతులూ, ముసలి వారూ తక్లీని ఆడించి వడికి ప్రతిరోజూ రాసులురాసులు నూలు తయారు చెయ్యాలి. విదేశవస్త్రాలను కాల్చివేయాలి. హిందువులు అస్పృశ్యతను పాటించరాదు. హిందువులు, ముస్లిములు, సిక్కులు, పార్సీలు, క్రైస్తవులు అందరూ హృదయపూర్వక ఐక్యం సాధించాలి. అల్పసంఖ్యాకవర్గాలు, సంతృప్తులయినంతర్వాత ఏది మిగిలితే దానితో అధికసంఖ్యాకులు సంతృప్తి పడాలి. విద్యార్థులు ప్రభుత్వ పాఠశాలలను కళాశాలలను వదలి వేయాలి. ప్రభుత్వోద్యోగులు తమ పనులకు రాజీనామాల నిచ్చి, ప్రజా సేవకై పనిచేయాలి. అప్పుడు మన తలుపుతట్టుతూ పూర్ణస్వరాజ్యం వచ్చి నట్టు మనం గ్రహించగలుగుతాము."

ఏప్రిల్ లోనే అభివృద్ధిచెందిన ప్రజాఉద్యమం ఈ చిన్న సరిహద్దులను దాటి పోయింది. సమ్మెలు ప్రారంభమయ్యాయి. శక్తివంతమైన ప్రదర్శనలు ప్రారంభ మయ్యాయి. బెంగాలులో చిటగాంగు ఆయుధాగారాన్ని కొల్లగొట్టడం జరిగింది. పెషావర్ పదిరోజులపాటు ప్రజలచేతిలో ఉండినది. దేశమంతటా చాలా ప్రాంతాలలో - ముఖ్యంగా సంయుక్తపరగణాలలో రైతులు పన్నులనిరాకరణో ద్యమం మొదలుపెట్టారు. సంయుక్తపరగణాలలో జమీందారీ గుత్తలు సగం చెల్లించే పద్ధతిపై కాంగ్రెస్ రాయబారాలు నడిపి విఫలమయింది.

భవిష్యత్తంతటికి అత్యంత ప్రాముఖ్యమైన సంఘటన ఏదంటే, గార్వాల్ సైనికులు పెషావరులో ప్రజలపై కాల్చేందుకు నిరాకరించారు. స్థానికనాయకులను అరెస్టుచేసినవెంటనే, కోపోద్రిక్తులైన ప్రజలను అణచివేసేందుకని సాయుధశకటాలను ప్రభుత్వం పంపింది; ఒక సాయుధశకటాన్ని కాల్చివేశారు. అందులోనివారు పారిపోయి తప్పించుకున్నారు; అందుపై ప్రజలసముదాయంపై కాల్పులు సాగింప బడినవి; వందలకొలదిమంది చనిపోవడం, గాయపడడం జరిగింది. 18వ రాయల్ గార్వాలీ రైఫిల్సు రెండోదళంలోని రెండు ప్లాటూన్లు — హిందూసైనికులు ముస్లిం జనసముదాయంమధ్య కాల్పులకు సేనాని ఆజ్ఞ ఇవ్వగా నిరాకరించారు. తాము సేననుండి చీలివచ్చి ప్రజలతో సోదరభావాన్ని వెల్లడించి కొన్ని తమ ఆయుధాలను ప్రజలకు స్వాధీనంచేశారు. ఈ సంఘటనజరిగిన వెంటనే పెషావరు నుండి సైనికులను పోలీసులను పూర్తిగా ప్రభుత్వం ఉపసంహరించుకొంది. ఏప్రిల్ 25 నుండి మే 4 వరకు పట్టణం ప్రజలచేతులలో ఉన్నది. తర్వాత శక్తివంతమైన బ్రిటిష్ సేనలు విమానాలతో పెషావరును "తిరిగి ఆక్రమించు కొనేందుకు" కేంద్రీకృతమైనవి: ప్రతిఘటనేమీలేకపోయింది. తర్వాత ప్రభుత్వం ఈ సంఘటనవిషయమై విచారణ జరగాలన్న వాంఛలన్నిటిని నిరాకరించింది. గార్వాలీ రైఫిల్సులోని 17 మంది సైనికులను మిలిటరీ కోర్టులో విచారించి, క్రూరంగా శిక్షించారు. ఒకరికి ద్వీపాంతరవాసశిక్ష యావజ్జీవనం వేశారు; ఒకరికి

15 ఏండ్లు కఠినశిక్ష వేశారు: మరి 15 మందికి మూడేళ్ళనుండి పదేళ్ళవరకూ రకరకాల శిక్షలు వేశారు.

తమ సోదరప్రజలపై కాల్పులు జరిపేందుకు నిరాకరించిన గర్వాల్ సైనికుల ఆదర్శ కృత్యం ఎంతతక్కువగా అనుకున్నా, కనీసం ఇది "అహింస"కు విజయవంతమైన ప్రదర్శనమని, గాంధీజీ హృదయానికెంతో ప్రీతికరమైన సంఘటన కావచ్చునని, అనుకొనవచ్చును. కాని గాంధీజీ అభిప్రాయం మాత్రం ఇదికాదు. నిజంగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని పునాదులతో కదిలించివేయగల అహింస ఇది. గాంధీ ఇర్విన్ ఒడంబడికలోని రాజకీయఖైదీల విడుదల షరతులో ప్రత్యేకించి గర్వాల్ సైనికుల సంగతి వదిలివేశారు. అధికారయుతమైన కాంగ్రెస్ పత్రం చిన్న చిన్న వ్యక్తి హింసాచర్యలెన్నో వివరంగా, వాటివల్ల ఉద్భూతమైన జాతీయభావాలను చిత్రించింది. కాని ఆ అధికార పత్రాలలో గర్వాలీ సంఘటనకు స్థానం ఇవ్వలేదు. ఎన్నోయేండ్లు గర్వాలీసైనికులు తమ శిక్షలను అనుభవించవలసి వచ్చింది; కడకు వారు 1937 ఆఖరుభాగంలో కాంగ్రెసు మంత్రులు పట్టుబట్టడంద్వారా విడుదలయ్యేవరకు జైళ్ళలోనే కుళ్ళవలసి వచ్చింది. ఆ సైనికుల సంస్మరణ ప్రజాహృదయాలలో శాశ్వతంగా ముద్రితమైనది. స్వతంత్ర భారతజాతి చరిత్రలో అందులో ఎందరో రాజకీయవేత్తలు విస్మరించబడినా గర్వాలీ సైనికుల గాథ సువర్ణాంకితం కాగలదు. గర్వాలీ సైనికులచర్యను తాను ఎందుకు ఆమోదింపలేదో గాంధీజీ లండన్‌కు రౌండ్‌టేబిల్ సమావేశానికి వచ్చినప్పుడు ఒక ఫ్రెంచివానికిలా వివరించాడు:

> "కాల్చమన్న ఆజ్ఞను ధిక్కరించే సైనికుడు, తాను ముందు తీసుకున్న ప్రమాణాన్ని భంగపరచి అవిధేయత అనే నేరం మేరకు దోషి అవుతున్నాడు. ఉద్యోగులను, సైనికులను అవిధేయులు కమ్మని నేను అడగలేను; ఎందుకంటే, నేను అధికారానికి వచ్చినప్పుడు అదే ఉద్యోగులను, అదే సైనికులను ఉపయోగించుకోవలసి వస్తుంది. అన్నివిధాలా ఇది జరగవచ్చునని పిస్తుంది. ఇప్పుడు నేను వారికి అవిధేయతను నేర్పితే, నేను అధికారంలో ఉన్నప్పుడు వారదేపని చేయవచ్చునని నేను అనుమానించాలి."

(గాంధీ, ఫ్రెంచి పత్రికా విలేఖరి చార్లెస్ పెట్రాష్‌కు, గర్వాలీ సైనికుల సమస్యపై ఇచ్చిన సమాధానం, 'మండే' ఫిబ్రవరి 20, 1932.)

ఈ వాక్యం (దీనిని, గాంధీజీని అభినందించే ప్రతి శాంతివాదిపీ పరిశీలించమని సిఫారసు చెయ్యవచ్చును). బార్డోలీ తీర్మానంలాగే స్పష్టంగా "అహింస" నిజమైన అర్థం ఏదో విశదీకరిస్తున్నది.

నిర్ణయించిన పరిహద్దులను ప్రజా ఉద్యమ బలం అతిక్రమిస్తున్నదని, ఊరకే వదలివేసిన గాంధీజీ అధికారం మాయమయ్యే ప్రమాదం కనిపిస్తున్నదని

స్పష్టపడగానే, మే 5 వ తేదీ ప్రభుత్వం గాంధీజీని అరెస్టుచేసింది. ఈ అరెస్టును ప్రభుత్వ మెలా సమర్థిస్తుందో ప్రభుత్వ ప్రకటనలో ఉంది ;

"ఈ హింసా చర్యలను గాంధీగారు ఖండిస్తుండగనే, మా అవినని సహచరులపై ఆయన అసమ్మతి ప్రకటనలు రాను రాను దుర్బలమవుతున్నవి. వారిని ఆయన అదుపులో పెట్టుకొనలేకపోతున్నాడని స్పష్టమయింది. .... ఆయన ఆరోగ్యానికి, సౌకర్యాలకు ఆయన నిర్బంధకాలంలో అన్ని అవకాశాలు ఏర్పరుచబడుతాయి"

అరెస్టయిన వెంటనే హర్తాళ్లు, ప్రజా సమ్మెలు భారతదేశమంతటా ఉవ్వెత్తున లేచాయి. పారిశ్రామిక పట్టణమైన షోలాపూరులో (బొంబాయిరాష్ట్రం) 1,40,000 జనాభాలో 50,000 ఉన్న కార్మికులు ఒకవారం పట్టణాన్ని స్వాధీన పరచుకున్నారు. పోలీసులను మార్చి, తమ పరిపాలనను, మే 12వ తేదీ మార్షల్‌లా ప్రకటితమయ్యేవరకు స్థాపించుకున్నారు. "తమ రాజ్యాన్ని స్థాపించుకోవాలని చూస్తున్న కాంగ్రెస్‌నాయకులు కూడ. ప్రజలపై అధికారం గోల్పోయారు" అని లండన్ టైమ్సు విలేఖరి మే 14 1930 న వ్రాశాడు. పూనాలోని 'స్టార్' పత్రిక ఇలా వ్రాసింది: "వారు పరిపాలనను స్వాధీనంచేసుకొని తమ చట్టాలను, నియమాలను స్థాపించుకొనే ప్రయత్నించారు". సంపూర్ణంగా పట్టణంలో శాంతి భద్రతలు కాపాడినట్టు అప్పటివారు సాక్ష్యమిస్తున్నారు.

సామ్రాజ్యవాదుల నిర్బంధవిధానం అపరిమితమై పోయింది. ఒకటి వెనుక ఒకటిగా ఆర్డినెన్సులు బయలుదేరి మార్షల్‌లా వంటి పరిస్థితిని ఏర్పరచాయి. జూన్ నెలలో కాంగ్రెస్సును దానికి అనుబంధసంస్థలన్నిటిని చట్టవిరుద్ధ సంస్థలుగా ప్రభుత్వం ప్రకటించింది 1931 వసంతంలో గాంధీ ఇర్విన్ ఒడంబడిక నాటికి ఒక సంవత్సరంలోగానే 60,000 మందిని శిక్షించినట్టు ప్రభుత్వ రికార్డులే తెలుపుతున్నవి ఈ లెక్కలు చాల తక్కువగా అంచనా వేయబడినవి. ఎందుకంటే ఉద్యోగులను బాధించినందుకు కొట్టినందుకు శిక్షితులైన ప్రజలను అందులో చేర్చరు. పైగా కేవలం రాజకీయఖైదీలుగా ప్రభుత్వం గుర్తించిన వారి సంఖ్యే అందులో ఉంటుంది. అతివివరంగా ఇచ్చిన జాతీయవాదుల లెక్కలు శిక్షితులైనవారిసంఖ్యను, 90,000 అని తెలుపుతున్నవి; "1930–31 లో పదినెలల లోగానే తొంభై వేలమంది స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ శిక్షితులైనారు." (కాంగ్రెస్ చరిత్ర" పుట 876 ) ఇదంతా "లేబర్" ప్రభుత్వంక్రిందనే నడిచింది. అభివృద్ధినిరోధకపత్రిక 'అబ్జర్వర్' 1930 ఏప్రెల్ 27 తేదీని ఇలా వ్రాయగలిగింది. లేబర్ ప్రభుత్వం అధికారంలో ఉండడం అదృష్టమే. భారతదేశాన్ని గమనించితే లేబర్ మంత్రులను అధికారంలో ఉంచడం అత్యధిక ప్రజావసరకార్యం."

నిర్బంధ విధానంలో అతిస్వల్పమైనది జైలులో నిర్బంధించడం. జైళ్ళు కిటకిటలాడిపోయినవి. మొత్తం మొత్తంగా ప్రజలను నిర్బంధించడం ఉద్యమాన్ని

ఆపడానికి సమర్థంకాదని స్పష్టమయింది. కాబట్టి ప్రధానంగా ఉపయోగించిన ఆయుధం దారుణ హింసా విధానం. పిల్లా పెద్దా, ముసలీ ముద్దా అనకుండా లాఠీ ఛార్జీచేయడం, కొట్టడం, నిరాయుధులైన ప్రజలను కాల్చడం స్త్రీలను పురుషులను చంపడం గాయపరచడం, శిక్షారూపమైన సామూహిక జరిమానాలు* కఠోరత్వరూపాన్ని దాల్చాయి. ఈ కార్యక్రమ మంతటిపైన సెన్సార్షిప్ ఆచ్ఛాదనం కప్పేందుకు కఠిన చర్యలు గైకొనబడినవి. కాని జాగ్రత్తగా కాంగ్రెస్ తయారుచేసిన వివరాలు, ఎన్నో సంస్థల అంశాలు, సంఘటనల సమగ్రంగా, సకారణంగా తెలియ జేస్తున్నవి. అప్పుడు ప్రభుత్వం ఉపయోగించిన పాశవికపద్ధతులను కొంతవరకివి తెలియజేస్తున్నవి.

ఏమైనప్పటికి 1930 లో ఉద్యమబలం ప్రభుత్వం అంచనాలన్నిటిని మించి పోయింది. ఎంత దమననీతి అవలంబించినా. సామ్రాజ్యవాదుల పీఠికల్లో తత్తరపాటు కల్గించింది. బహిష్కారణంవలన గట్టి దెబ్బతిన్న బ్రిటిష్ వర్తక వర్గం ముఖ్యంగా. 1930 వేసవికే తమ సంభ్రమాన్ని వెల్లడించసాగారు. పారిశ్రామిక కార్మిక బలానికి కేంద్రమూ విప్లవ విధానానికి లక్ష్యమూ అయిన బొంబాయిలో ఉద్యమంకూడ తీవ్రతరరూపం దాల్చింది. ఎన్నిసార్లు పోలీసులు కొట్టినా ఎన్నోతూర్లు ప్రజలు వీధులను స్వాధీనపరుచుకున్నారు. బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శనాలను కాంగ్రెస్ నాయకులు వెళ్ళిపొమ్మని ఎంతచెప్పుకున్నా వినడం లేదు. ఆ ప్రదర్శనాల్లో కాంగ్రెస్ పతాకాలతోపాటు ఎర్రజండాలు బాగా కనిపిస్తున్నవి ఒకొకచోట అవే ఎక్కువగా ఉన్నవికూడ. "కలకత్తానుండి ఇతర పెద్దపట్టణాలనుండి వచ్చిన యాత్రికులు, బొంబాయికి పట్టిన స్థితినిచూచి ఆశ్చర్యపడుచున్నారు" అని 'అబ్జర్వర్' విలేఖరి జూన్ 29 న వ్రాశాడు, 'స్పెక్టేటర్'లో జులై 5 వ తేదీని ప్రకటితమైన "బొంబాయిలేఖ"లో ఇలాఉంది: "సేనలు, సాయుధ పోలీసులు ఉండకపోతే బొంబాయిప్రభుత్వం ఒక్కరోజులో పడిపోతుంది. పరిపాలనను కాంగ్రెస్ సర్వజనసమ్మతితో స్వాధీనం చేసుకుంటుంది" బ్రిటిష్ వర్తకులు భారత వర్తకులతోపాటు మిల్లుయజమానుల సంఘంలో (ఇందులో మూడవవంతు) యూరపియన్లు వాణిజ్యమండలిలో చేరి అధినివేశ ప్రాతిపదికపై భారతదేశానికి వెంటనే స్వపరిపాలన కావాలన్నారు కేంద్రంలో బాధ్యతాయుతమైన పార్లమెంటరీ ప్రభుత్వం కావాలని టైమ్సుఆఫ్ఇండియా (బొంబాయి) ఆక్రోశించడంచూస్తే అబ్బురపాటు కలుగుతుంది. జులై 6 కంతా 'అబ్జర్వర్' యురపియన్ల నిస్పృహనుగూర్చి ఇలా వ్రాసింది:

> "కలకత్తా స్టేట్సుమన్ పత్రికలో తప్ప అన్నిపత్రికలలోను ఓడిపోయా మనేభావం బయలుదేరింది. కలకత్తా, బొంబాయిలలోని బ్రిటిష్వ్యాపారులకు కాంగ్రెస్వారికి మధ్య సంప్రతింపులు జరుగుతున్నట్లు నమ్మకమైన వార్తలు

---

* కేంద్ర శాసనసభలో జులై 14 న ఇచ్చిన ప్రభుత్వ సమాధానాన్ని అనుసరించి.

> వస్తున్నవి. రాజకీయాధికారం పూర్తిగా అప్పగించాలని, అందుకుబదులుగా తాత్కాలిక కష్టమైన బహిష్కరణలను భారతీయులు వెంటనే రద్దుచేయాలని ఈసంప్రదింపులు నడుస్తున్నవి... యూరపియన్లు సిరాశా హతులైనారు.... కాని ఈనిరాశ సర్వసామాన్యమైంది కాదు కలకత్తాలో ఇందుకు వ్యతిరేకమైన అభిప్రాయం ఉంది.
>
> (అబ్జర్వర్, జూలై 6, 1930.)

ఆగస్టునాటికి 'అబ్జర్వర్' కలకత్తా విలేఖరి "బొంబాయిలోని దుర్బలత" అనే శీర్షిక క్రింద ఇలా వ్రాశాడు.

> "బ్రిటిష్‌వారు నడిపే పత్రికలు కొన్ని కాంగ్రెస్ షరతులకు ఒప్పుకో వలసి వచ్చిందని, కాబట్టి ఒక ప్రముఖ పౌరుడు బొంబాయి లైట్‌హౌస్ నుండి రాజీనామా ఇస్తున్నాడని, బొంబాయినుండి వచ్చిన వార్త ఇక్కడి వారికి మర్మాఘాతమయింది. అలాగే యూరపియన్ అసోసియేషన్ బొంబాయి శాఖ భారతీయులకు ఇష్టంలేదనే కారణంవల్ల సైమన్ నివేదికకు అంగీకారం తెలపలేమని మెజారిటీతో తీర్మానించింది ఈ బొంబాయి శాఖ రౌండ్ టేబిల్ సమావేశానికి తాను పంపనున్న అభ్యర్థినికూడ ఉపసంహరించుకున్నది."
>
> (అబ్జర్వర్, ఆగస్టు 24, 1930)

ఇలాగా ఎన్నినిర్బంధాలు ఉపయోగించినా, ఏంచేసినా, దాదాపు తత్తరపాటు వంటి "పరాజిత భావం" "నిస్పృహ నిరాశలు" సామ్రాజ్యవాదుల పతంలో కనిపి చసాగాయి: కాబట్టి ఏమైనాసరే ఒక పరిష్కారానికై రాయబారాలు జరపడం సామ్రాజ్య తత్వానికి ప్రాముఖ్య మయింది భారత ప్రజల పోరాటం, త్యాగాల మూలంగా కాంగ్రెస్ నాయకత్వం అధికారం మెక్కువగా ఉన్నది. ఇక సామ్రాజ్యవాదులకు కనిపించే విముక్తిమార్గపు ఆశలన్నీ మితవాద జాతీయ నాయకులమీదనే ఉన్నవి ఆ మితవాద నాయకులు ప్రజా ఉద్యమం విశాలమయి పోతున్నదని, ఇంకేమి కానున్నదో అని, చూపే సంభ్రమం నిజమైనదని వీరు ఎరుగుదురు. బర్మింగ్‌హాంలోని సెల్లీఓక్ కాలేజీలో అంతర్జాతీయ సంబంధాల ప్రొఫెసర్ హెచ్. జి అలెగ్జాండర్ సెప్టెంబరులో గాంధీజీని దర్శించి ఆయన దృక్పథాన్ని ఇలా తెలిపాడు.

> "ఆయన జైల్లో ఏకాకిగా ఉండికూడ ద్వేషభావం పెరిగిపోతున్నదని తీవ్రంగా గమనిస్తున్నాడు అందువల్ల గౌరవంతో సాధించ వీలైనంత త్వరలో శాంతి సహకారస్థితిని ఆయన ఆహ్వానిస్తాడు....ఆయన పలుకుబడి ఇంకా అపారంగా ఉంది కాని అంతకన్నా ప్రమాదకరమైన, అపరాని శక్తులు దిన దినమూ బలపడుతున్నవి"
>
> (ప్రొఫెసర్ హెచ్. జి. అలెగ్జాండర్, "నేటి గాంధీజీ దృక్పథం" స్పెక్టేటర్ పత్రిక జనవరి 3, 1931.)

ఇలాగా తన్నిరిపాటు ఇరుపక్షాలలోను పెరుగుతున్నది; ఈ పరస్పర భయం మీదనే పరిష్కారానికి అవకాశముంది - భారత ప్రజలకు వ్యతిరేకంగా.

1930 ఆకురాలు కాలంలో రాయబారాలు ప్రారంభమయ్యాయి గాని ఫలితం కలగలేదు. జనవరి 20, 1931 నాడు ప్రధాని మాక్డొనాల్డు రౌండు టేబిల్ సమావేశంలో ఇలా ప్రకటించాడు.

"బ్రిటిష్ కామన్వెల్తులో అధినివేశహోదా పొందడానికి లేని ఒక్క అంశమూ - బాధ్యతలు, ఖారావు కషాలే గాక బాధ్యతాయుత స్వపరిపాలన గౌరవ మర్యాదలు కూడ భారతదేశానికి మన ప్రయత్నాలవల్ల లభిస్తాయని నేను కోరుచున్నాను"

ఇలా ఒక డొంకతిరుగుడు వాక్యంతో యెరను అందించారు. ఇందు మూలంగా ప్రభుత్వం అవరణలో ఏమీ వాగ్దానం చేయలేదని తర్వాత సంఘటనలు స్పష్టపరచాయి. తర్వాత కాంగ్రెస్ పాల్గొనేందుకు అవకాశమివ్వాలని రౌండ్ టేబిల్ సమావేశాన్ని వాయిదా వేశాడు.

జనవరి 26 వ తేదీ గాంధీజీని, కాంగ్రెస్ వర్కింగుకమిటీని బేషరతుగా విడుదలచేసి, వారు సమావేశమయ్యేందుకు స్వేచ్ఛనిచ్చారు. "పూర్తిగా ఏ నిశ్చయమూలేని స్వచ్ఛమనస్సుతో" జైలునుండి వచ్చానని గాంధీజీ చెప్పాడు. తర్వాత దీర్ఘ రాయబారాలు సాగాయి. మార్చి 4 వ తేదీ ఇర్విన్ గాంధీ ఒడంబడిక జరిగింది. "పోరాటాన్ని తాత్కాలికంగా ఆపివేసినట్లు ప్రకటన జరిగింది.

ఇర్విన్ గాంధీ ఒడంబడికలో కాంగ్రెస్ పోరాటంలోని ఉద్దేశం ఒక్కటి కూడా (ఉప్పుపన్ను తీసివేయడం కూడ) నెరవేరలేదు. శాసనోల్లంఘనం ఉపసంహరింపబడాలి. కాంగ్రెస్ తాను బహిష్కరించిన ప్రతిజ్ఞ తీసుకున్న రౌండ్ టేబిల్ సమావేశంలో పాల్గొనాలి. స్వపరిపాలనకు ఒక్క స్పష్టకార్యక్రమం కూడ అనుమతించలేదు. రౌండ్ టేబిల్ సమావేశంలో చర్చల ప్రాతిపదిక "భారత బాధ్యతతో" కూడిన ఫెడరల్ రాజ్యాంగం—కాని "భారత ప్రయోజనాలకోసం రిజర్వేషన్లు, రక్షణలు" ఉంటాయి. ఆర్డినెన్సులు ఉపసంహరించుకుంటారు. రాజకీయఖైదీలు విడుదలచేయబడుతారు - కాని "హింస"కు పాల్పడినట్టి లేదా "హింసని ప్రోత్సహించినట్టి" నేరాలుచేసిన ఖైదీలు, ఆజ్ఞలను ఉల్లంఘించిన సైనికులు, విడుదలకారు. విదేశవస్తు బహిష్కరణకు స్వతంత్రం ఉంటుంది - కాని "కేవలం బ్రిటిష్ వస్తువులకు వ్యతిరేకంగా మాత్రమే కాదు" అది "రాజకీయ ఉద్దేశాల కోసం" కాకూడదు. అదికూడ ఏ విధమైన "బలవంతం, వేధింపు, నియమం, వ్యతిరేకప్రదర్శనం, ప్రజలను ఆటంకపరచడం" వీనిని రేపేలాంటి పికెటింగు ద్వారా జరక్కూడదు. ఇలాంటి షరతులవల్ల ఒకచేత ఇచ్చి మరొకచేత పుచ్చుకోవడం జరిగింది. ఇందులో మహావచ్చిన లాభమల్లా, శాంతియుతంగా విదేశ వస్త్రాలను బహిష్కరించే హక్కు ఒక్కటే—ఈ ఒడంబడిక వెనకాల ఉన్న భారత పక్ష ప్రయోజనం ఇదొక్కటే స్పష్టంగా ఉన్నది.

తామే చట్టవిరుద్ధ సంస్థగా ప్రకటించి, నిర్మూలించ ప్రయత్నించిన కాంగ్రెస్ నాయకునితో బ్రిటిష్‌ప్రభుత్వం బహిరంగ సంధి చేసుకోవలసిన స్థితిరావడం నిస్సందేహంగా జాతీయోద్యమ బలానికి బ్రహ్మాండమైన ప్రదర్శనమే జరిగిన సంగతులను అర్థంచేసుకొని, పోరాటం, త్యాగం అన్నీ రాయబారాల బల్లపై పడవేయబడడం, చూడగలిగిన రాజకీయజ్ఞానంగల్గిన వర్గాలలోతప్ప, పైకారణంవల్ల విజయోత్సవం ఆనందం విశాలంగా తొలుత వెల్లివెరిసింది క్రమక్రమంగా ఆ షరతుల అర్థం గ్రహించుకునేకొద్దీ ఏమీ సాధించలేదనేది బోధపడింది. లాహోరులో అంత గట్టిగా ప్రకటించిన సంపూర్ణస్వతంత్రం, సామ్రాజ్యవాదంతో రాజీపడకూడదు మొదలైన ఆశయాలన్నీ గాలిలో కలిసిపోయ్యాయి. కాంగ్రెస్ వెనకాతల రాజీలొంగుబాటుకు, గాంధీజీసూచించిన పదకొండు షరతులుకూడ ఇప్పుడు మాయమైనవి: ఒక్కటికూడ అందులో ప్రభుత్వం ఒప్పుకోలేదు ఇంతకుముందు తాను నిరాకరించిన రౌండ్‌టేబిల్ సమావేశాన్ని అంగీకరించవలసిన గతిపట్టింది. ఆ రౌండ్‌టేబిల్ సభలో ఈ పోరాటం లేకుండాకూడా పాల్గొని ఉండవచ్చును. (మొదటనే కోరివుంటే ఇంతకన్నా ఎక్కువ ప్రాతినిధ్యం దొరికిఉండేది. అదొకటీ పోయిందిప్పుడు.)

ఇలాగా గాంధీ ఇర్విన్ ఒడంబడిక, బార్డోలీ అనుభవాన్ని మరింత పెద్ద ఎత్తున పునశ్చరణ చేసింది. ఉద్యమం అత్యుచ్ఛదశను పొందుతున్న సమయంలో మరొకతూరి హఠాత్తుగా అయోమయంగా ఆపివేయడం జరిగింది ("మా ఉద్యమం పతనావస్థలో ఉందన్న సూచన పూర్తిగా అబద్ధం; ఉద్యమం ఏ విధమైన శైథిల్యాన్ని సూచించడంలేదు"—గాంధీ ఒడంబడిక జరిగినప్పటి పరిస్థితినిగూర్చి మండేతో ఇంటర్వ్యూలో ఫిబ్రవరి 20, 1932 ). "ఇలాంటి విజయాన్ని ఏ విజయంగానూ చెప్పలేదు" అని లండన్ టైమ్సు పత్రిక మార్చి 5 వ తేదీ సంబరపడింది ఆశ్చర్యపడుతున్న విలేఖరులకు మార్చి 5 వ తేదీ ఒడంబడికను సమర్థిస్తూ గాంధీజీ "కాంగ్రెస్ విజయానికై ఎన్నడూ పోరాడలేదు" అని వివరించాడు. (గాంధీ "ప్రసంగాలు, రచనలు" పుట 778) ఇందులో నిజంగా ఆయన ఎత్తుగడలోని సత్యాన్ని వివరించాడు. తర్వాత తన భావాన్ని మరింత వివరించాడు. "ప్రస్తుతసమయంలో స్వరాజ్య రాజ్యాంగాన్ని సాధించే ప్రయత్నాన్ని మనం మానుకోవాలి" అని 'యంగ్ ఇండియా' లో జూన్ 1931 న వ్రాశాడు; "మన ఆశయాన్ని రాజ్యాధికారం లేకుండానే మనం సాధించుకోగలం" అన్నాడు. మరొకతూరి మార్చి 6 వ తేదీన విలేఖరులతో పూర్ణ స్వరాజ్యమంటే నిజానికి "లోపలనుండివచ్చే క్రమశిక్షణా బద్ధమైన స్వపరిపాలన" అనీ, ఏ విధంగానూ "ఇంగ్లాండుతో సంపర్కం" ఉండకూడదనే అర్థంకాదనీ గాంధీజీ అన్నాడు. ("సంపర్కం" చాలా క్లేశదాయకమైనది—ముఖ్యంగా సన్నీ పదునైన మొనతో "సంపర్కం" మరీనూ.) ఇలా ఒకవేపు గాంధీజీ, మరొకవైపు మాక్‌డొనాల్డు ఊరికే పదజాలాన్ని క్రుమ్మరిస్తున్నారు. అతి స్పష్టంగా ఉన్న లాహోర్

కాంగ్రెస్‌లో ప్రకటించిన ఆశయాన్ని ("బ్రిటిష్ ప్రభుత్వంనుండి, బ్రిటిష్ సామ్రాజ్యంనుండి సంపూర్ణ స్వతంత్రం") న్యాయశాస్త్ర వ్యాఖ్యానాలు, ధర్మశాస్త్ర తర్క వచనాల పరంపరలో గందరగోళ పరచివేశారు. ఇదెంతవరకు పోయిందంటే, ఇందులో గాంధీజీని అభినందించాలో, లేక మాక్‌డొనాల్డును అభినందించాలో నిర్ణయించుకోవడం కష్టమయిపోయింది. సంభ్రాంతిని కల్గించే పదప్రయోగ చాతుర్యంలో ఆరితేరిన ఈ ఇద్దరు కళాప్రపూర్ణులూ ఉన్నతస్థాయిలో ఆధ్యాత్మిక బోధనలతో లొంగుబాటు, దాస్యం అనే సత్యాలను ప్రచ్ఛన్నపరచగలిగారు.

అదేనెలలోనే గబగబా సమావేశపరిచిన కరాచీ కాంగ్రెస్ ఏకగ్రీవంగా ఒడంబడికను ఆమోదించింది. జవహర్లాలునెహ్రూ "విపరీత మానసిక సందిగ్ధతతో, విషాదంతో "ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టవలసి వచ్చింది. "ఇందుకోసమేనా, మన ప్రజలు ఒక్క సంవత్సరం అంత వీరోచితంగా పోరాడింది? మన ధైర్యవచనాలూ, కార్యాలూ ఇంటితోనేనా ముగియవలసింది" అని ఆయన ఆలోచించాడు. ఏమైనా తాను దీనికి అసమ్మతి తెల్పడం "అహంభావం" మాత్రమే అవుతుందని భావించాడు; చాల విమర్శించిన సుభాష్‌బోస్, కాంగ్రెసులో దీనిని వ్యతిరేకించడం సాధ్యంకాదని, అలాచేస్తే జాతీయ ఐక్యతకు భంగంగా కనబడవచ్చునని అనుకున్నాడు. జవహర్లాలునెహ్రూ చెప్పినదాన్నిబట్టి ఈ ఒడంబడిక "ప్రజాసమ్మతమైంది కాదు"; అయినా కాంగ్రెస్ సమావేశంలో కొందరు ప్రతిఘటించారు ఒక ప్రతినిధి మాట్లాడుతూ, గాంధీజీ కాకుండా ఇలాంటి ఒడంబడికను ఇంకెవడైనా చేసుకొనివుంటే వానిని సముద్రంలో పడవేసిఉందురు అన్నాడు! ఇలాంటి ప్రకటన బహిరంగసమావేశంలో చాల అరుదైనది సంకుచిత కాంగ్రెస్ యంత్రానికీ, విశాల ప్రజాఉద్యమానికీ మధ్యనున్న వినాశకర అఘాతం కరాచీలో తేటతెల్లమయింది. ఈ ఒడంబడికను ప్రతిఘటించినవారిని "ఎన్నుకొనబడిన ప్రతినిధులలో ఎక్కువమంది బలపరచకపోవచ్చు. వారే కాంగ్రెస్ సభలో ఓటుచేయగలవారు. అయినప్పటికి ప్రజాసామాన్యంలో ముఖ్యంగా యువకులలో వారికి చాల బలమున్నది" ("ఇండియా పోరాటం" పుట233) అని సుభాష్‌బోస్ వ్రాశాడు; ఈ యువకుల భావాలను కాంగ్రెస్‌లో ప్రకటించేవారెవ్వరూ లేకపోయారు. ఇలా కరాచీ కాంగ్రెసులో అతివాద జాతీయవాదుల పతనం గాంధీజీ స్థానానికి మరింత బలం చేకూర్చింది.

ఇందుకుబదులుగా అతివాద జాతీయవాదుల కొక సౌకర్యం ఇచ్చారు. అభ్యుదయవంతమైన సాంఘిక ఆర్థిక కార్యక్రమాన్ని "ప్రధానహక్కుల" తీర్మానంలో వ్రాసి ఆమోదించారు. ఇందులో అభివృద్ధికరమైన ప్రజాతంత్ర మూల ప్రణాళిక, ప్రధాన పరిశ్రమలను రవాణాసౌకర్యాలను ప్రభుత్వపరం చేయడం, కార్మికహక్కులు, వ్యవసాయసంస్కరణ మొదలైనవి ఉన్నవి. ఇంకా చెల్లుబడిలోనేఉన్న ఈ కార్యక్రమం కాంగ్రెస్ ఒకడుగు ముందుకువేసినట్లు తెలుపుతున్నది.

ఏమైనా గాంధీ ఇర్విన్ ఒడంబడికలో ఉన్న లొంగుబాటుకుమాత్రల ఇది నష్ట పరిహారం కాదు.

కాంగ్రెస్ వెలుపల యువజన, కార్మికవర్గ ఉద్యమాలు ఈ ఒడంబడికను తీవ్రంగా విమర్శించాయి. ఇది, ఎన్నో యువజనసంఘాలు, మహాసభలు చేసిన అసంఖ్యాక తీర్మానాలలోను, గాంధీజీ రౌండ్ టేబిల్ సమావేశానికి బయలుదేరు తుండగా బొంబాయికార్మికులు జరిపిన వ్యతిరేక ప్రదర్శనంలోను వెల్లడయింది. ఇలాంటి ప్రదర్శనాలు పదేళ్ళక్రితం ఊహించడానికూడా వీలుండేవికావు అని టైమ్సుపత్రిక వ్రాసింది.

ఆశాభంగం అతివేగంగా విశాలవర్గాలకు వ్యాపించింది. 1931 లో లండన్ రౌండ్ టేబిల్ సమావేశంలో గాంధీజీపాత్ర ఒక విచారకర నాటకం. దానిపై తెర దించడం మంచిది. (ఇంగ్లాండులో గాంధీజీఉన్నప్పుడు, అక్కడి ఉన్నత ఆధ్యాత్మికవాద శిష్యులు, మధ్యే మధ్యేజరిగిన సన్మానాలలోను, సభలలోను ఆజగద్గురువు సందేశాన్ని వినడానికి చేరడంకూడ ఒకప్రహసనమే) రోమురాజధానికి బందీలుగా కొనివచ్చిన వారిలాంటి ప్రభుత్వపుచేతి కీలుబొమ్మలతో నిండిన ఈ సభలో ఒక భాగంగా చేరడంవల్ల కాంగ్రెస్ గౌరవం తగ్గిపోయింది ఈ కీలుబొమ్మలందరూ పార్లమెంటు సభ్యులకు వింతగొలుపుతూ తమ గందరగోళాన్ని, విభేదాలను మాత్రమే ప్రకటించగలిగారు దారిలో ముసోలినీని కలుసుకొని గాంధీజీ తిరిగి వచ్చాడు, రౌండ్ టేబిల్ సమావేశంనుండి గాంధీజీ ఏఫలితాన్నీ కొనిరాలేదు.

గాంధీజీ తిరిగివస్తూ దారిలో.. పోరాటం తిరిగినడిపే అవసరముండదన్న ఆశను వెల్లడించాడు శాంతికై తాను శక్తున్నంతవరకూ పనిచేస్తానని ఇండియా ఆఫీసుకు పోర్టుసెడ్నుండి తంతిపంపాడు ఇందుకై తిరిగివచ్చిన తక్షణమే ఒక తీర్మానం తయారుచేశాడు. కాని—

సామ్రాజ్యవాదం ఒకతూరి తనకు సందుదొరకుతూనే, దానిని సంపూర్తిగా తనకై వినియోగించ నిశ్చయించుకున్నది "యుద్ధవిరామణ" మొదటినుండీ ఒక వేపే అమలుజరిగింది; నిర్బంధవిధానం కొనసాగింది. 1931 ఆఖరు రోజుల్లో గాంధీజీ తిరిగివచ్చి తన సహచరులు చెప్పిన కరుణాగాధ విన్నాడు. ఇంటర్వ్యూ ఇవ్వమని గాంధీజీ ప్రార్థిస్తూ వైస్రాయికి వెంటనే తంతిపంపాడు. వైస్రాయి అందుకు నిరాకరించాడు. ఆ యుద్ధవిరమణ కాలంలోని తొమ్మిది నెలల్లోనూ (ఒకవేపు లండన్లో ప్రహసనం జరుగుతుండగానే) ప్రతిరోజూనూ, ఆఖరుదెబ్బ తీయడానికి కఠోరచర్యలకు సిద్ధపడి పూర్తిచేయజూచారు. ఐర్లాండులో "బ్లాక్ అండ్ టాన్" రాజ్యం అనుభవంగల సర్ జాన్ ఆండర్సన్ను బెంగాలు గవర్నరుగా వేసి, ఏర్పాట్లన్నీ చూచుకొమ్మన్నారు. ఈతూరి ఆశ్చర్యచకితులు కా బని లేదు కాంగ్రెస్కు పాఠం నేర్పాలనుకున్నారు. ఈసారి ఆఖరుదాకా పోరాడాలి, ఇందులో బేషరతుగా లొంగేవరకు విడువరాదనుకున్నారు.

1932 జనవరి 5 వతేదీని సామ్రాజ్యవాదులు గాఢాలునగట్టి దెబ్బతీశారు. అదే రోజున సంప్రదింపులు భగ్నమయ్యాయి. వైస్రాయి తన మానిఫెస్టోను ప్రకటించాడు; గాంధీజీ అరెస్టయ్యాడు; తామరతంపరగా ఆర్డినెన్సులు వచ్చాయి. (1930 లో లాగా ఒకటితర్వాత ఒకటిగా గాక తొలిరోజే అన్నిటినీ బయటికి విడిచారు) యావత్ భారతదేశమంతటా ప్రధాన కాంగ్రెసు నాయకులను, కార్యకర్తలను అందరినీ అరెస్టుచేశారు; కాంగ్రెస్‌నూ, దాని అనుబంధసంస్థ లన్నిటినీ చట్టవిరుద్ధసంస్థలుగా ప్రకటించారు; కాంగ్రెసుపత్రికలను నిషేధించారు; కాంగ్రెసు కార్యాలయాలను, నిధిని, ఆస్తిని స్వాధీనపరుచుకున్నారు. చకాచకా విజయవంతంగా ఈ ఏర్పాట్లను నడిపారు.

నిర్మూలనమే తమ ఆశయమని ప్రభుత్వం స్పష్టపరిచింది సర్ సామ్యూల్ హోర్ కామన్సుసభలో ఆర్డినెన్సులు "చాల తీవ్రమైనవీ, కఠినమైనవీ" అని చెప్పి ఈసారి "దీర్ఘకాలయుద్ధం" కాదన్నాడు భారతప్రభుత్వ ఆంతరంగికశాఖ సభ్యుడు సర్ హారీ హేగ్ "కృత్రిమమైన చట్టాలతో మేము ఆట ఆడ్డంలేదు" అని చెప్పి ప్రభుత్వానికి సంబంధించినంతవరకు కాలపరిమితేమీ లేదన్నాడు. బొంబాయి ప్రభుత్వసభ్యులు శాసనసభలో "యుద్ధాన్ని చేతులకు తొడుగులు వేసికొని నడపలేము" అని చెప్పారు

కాంగ్రెస్‌నాయకులు ఆశ్చర్యచకితులయ్యారు రౌండ్ టేబిల్ సమావేశపు వాతావరణం హఠాత్తుగా ఇలా మారిపోయింది వీరేమీ సిద్ధపడలేదు. 1930 లో కాంగ్రెస్ దెబ్బతీసింది ఇప్పుడు పైనుండివచ్చే దెబ్బను కాచుకోవలసి వచ్చింది. గాంధీ ఇర్విన్ ఒడంబడిక ఎంత ఖరీదైనదో వారు గ్రహించుకోలేదు. కాంగ్రెస్ వర్కింగుకమిటీ సభ్యుడు డాక్టర్ సయ్యద్ మహ్మద్, ఇండియా లీగుప్రతినిధి వర్గానికి ఇలా తెలియజేశాడు.

> "మహాత్మాగాంధీ తయారుచేసి వర్కింగుకమిటీ ముందుంచిన తీర్మానాన్నిగూర్చి ప్రపంచానికి ఏమీ తెలీదు .... మహాత్ముడు సహకారం చేయాలని పట్టుదలతో ఉన్నాడు ప్రభుత్వం సహకారాన్ని కోరడంలేదు. నాకు లోపలసంగతులు తెలిసినంతవరకు, ఈతగాదాకు కాంగ్రెసు సిద్ధపడలేదని చెప్పగలను. ఎలాగో లండన్‌నుండి మహాత్ముడు శాంతిని కొని వస్తాడని మేము ఆశించాము"
>
> ("భారతపరిస్థితి" ఇండియా లీగ్ ప్రతినిధివర్గ నివేదిక, 1933, పుట 27.)

ఆయనింకా ఇలాచెప్పాడు. "గాంధీ ఇంకా లండన్‌లో ఉండగానే, నవంబరులో నిర్బంధవిధానానికి ప్రభుత్వ ప్రణాళికంతా తయారుగాఉన్నదని నాకూ, నా సహచరులకు రూఢిగాతెలిసినది. ప్రభుత్వం హఠాత్తుగా తీసినదెబ్బకు, కాంగ్రెస్ తొలుత విభ్రాంతమయింది."

1932-33 లో ఈ సారి నిర్బంధవిధానం, 1930-31 లోని స్థాయికన్నా

చాలు మించిపోయింది. పండితమాలవ్యా మే 2-1932 న చేసిన బహిరంగ ప్రకటనను బట్టి మొదటి నాలుగునెలలలోను 80,000 అరెస్టులు జరిగాయి. పదిహేను నెలలతర్వాత మార్చి 1933 ఆఖరున, కలకత్తాలో ఏప్రెల్ 1933 లో జరిగిన రహస్య కాంగ్రెసు సమావేశ నివేదికప్రకారం అరెస్టులసంఖ్య 1,20,000 కు పెరిగింది. ఇందుతోపాటు భారీయెత్తున జరిగిన హింస, కొట్టడం, తన్నడం, కాల్చడం, చిత్రవధలు, మిలిటరీదాడులు, గ్రామాలపై సమిష్టిజరిమానాలు, గ్రామస్తులఆస్తిని భూములను స్వాధీనపరచుకోవడం మొదలైన దారుణచర్యలను గూర్చి ఇండియా లీగు ప్రతినిధివర్గ నివేదిక "భారతపరిస్థితి" అనే దానిలో కనిపిస్తుంది. ఈ నివేదిక 1933 లో ప్రకటితమైంది.

ప్రభుత్వం ఆరు వారాల్లో యుద్ధం ముగించాలనుకున్నది. జాతీయోద్యమ శక్తి దృఢతరమైంది కాబట్టే ఎన్ని ప్రతికూల పరిస్థితు లున్నప్పటికి ఆఖరు లొంగుబాటునాటికి ఇరవైతొమ్మిది నెలలవరకూ కొనసాగింది. కాని ఇది కీలక నాయకత్వంలేని సైనికుల యుద్ధంలాంటిది చట్ట విరుద్ధంగా పనిచేయవలసి రావడం, తీవ్ర నిర్బంధవిధానం - వీనివల్ల ఎంతైనా నాయకత్వ కర్తవ్యం బాగా కష్టతరంగా ఉంది. కాని గాంధీజీ వర్కింగుకమిటీల చర్యలు ఈ కర్తవ్యాన్నేమీ సులభం చేయలేదు. వారు తాము పదవీత్యాగం చేయడంమాత్రమేకాక ఉన్న నాయకత్వాన్నికూడ ఖండించివేశారు. కాంగ్రెస్ సూత్రాలకు విరుద్ధమంటూ రహస్యంగా పనిచేయడానికి వ్యతిరేకంగా ఉత్తరువులనే పంపారు.(చట్టబద్ధంగా ప్రకటించినసంస్థ రహస్యంగా పనిచేస్తున్నప్పుడు) వారి ప్రయోజనాలకు వ్యతిరేకంగా జరిగే ఏఉద్యమాన్నీ అనుమతించమనిజమీందార్లకు హామీ ఇస్తూ ఒకతీర్మానంచేశారు. 1932 వేసవికాలానికంతా గాంధీజీ జాతీయ పోరాటంపై ప్రజాభిమానాన్నంతటిని వదలివేసి హరిజనులకోసం పనిచేయసాగాడు. సెప్టెంబరులో ఆయన అకస్మాత్తుగా ఆరంభించిన "ఆమరణ నిరశనదీక్ష" నిర్బంధ విధానానికి వ్యతిరేకంగాగాని, జాతీయోద్యమం నడుపుతున్న చావుబ్రతుకుల పోరాటంయొక్క ఏ ఆశయంకోసం గాని కాదు కేవలం "నిమ్నజాతులకు" ప్రత్యేకనియోజకవర్గాలుపెట్టే ప్రణాళికను ఆటంక పరిచేందుకే ఉపవసించాడు ఆ ఉపవాసం ఆశయాన్ని సాధించలేదు. ఆయన మరణానికి కారణం కాలేదు పూనా ఒడంబడికకు మాత్రం కారణమయింది ఆ ఒడంబడిక ప్రకారం నిమ్నజాతులకున్న ప్రత్యేకస్థానాల సంఖ్య రెటింపయింది ఈ ఘటన, ఈయన బాధ్యతాయుత నాయకుడని చెప్పబడే జాతీయ పోరాటంనుండి ప్రజలదృష్టిని త్రిప్పడానికిమాత్రం పనికివచ్చింది.

1933 మేలో గాంధీజీ మరొక కొత్త ఉపవాసం మొదలుపెట్టాడు. ఇది ప్రభుత్వానికి వ్యతిరేకంగా కాక దేశీయుల హృదయాలు మార్చడానికై ఆరంభించాడు "హరిజనులకోసం మరింత జాగర్తా, ఆసక్తికోసం నాయొక్కా, నా సహచరులయొక్కా పరిశుద్ధతకై చేసే హృదయప్రార్థన" గా ఈ ఉపవాసాన్ని గాంధీజీ అభివర్ణించాడు. ఆనందపడి ప్రభుత్వం ఆయనను విడుదల చేసింది.

గాంధీజీ సిఫారసుపై కాంగ్రెసు తాత్కాలిక అధ్యక్షుడు ఆరువారాలపాటు శాసనోల్లంఘనాన్ని వాయిదావేశాడు ఇది ప్రభుత్వంతో ఒప్పందమైన కుదిరికాదు; ఏవో కొన్ని షరతులకు ప్రభుత్వం అనుమతిస్తుందన్న ఆశతోనూకాదు. గాంధీ అన్నట్లు "ఆయన ఉపవాససమయంలో దేశం "తీవ్రసంఘర్షణావస్థ" లో ఉంటుంది కాబట్టి, అందుకై ఉద్యమాన్ని ఆపడం మంచిది అన్న కారణంవల్లనే ఈ ఆపుదల జరిగింది. (ప్రభుత్వం తన నిర్బంధవిధానాన్ని ఆపకపోయినప్పటికి) *

1933 జులైలో గాంధీజీ వైస్రాయిని దర్శింపగోరగా, తొట్టతొలుత సత్యాగ్రహాన్ని ఆపితేగాని చూడనని వైస్రాయి నిరాకరించాడు. అందుపై కాంగ్రెస్ నాయకత్వం సమిష్టిసత్యాగ్రహాన్ని విరమించి వ్యక్తి సత్యాగ్రహం నడపాలని నిశ్చయించింది. అదేసమయంలో తాత్కాలిక అధ్యక్షుడు అన్ని కాంగ్రెస్ సంస్థలను రద్దుచేస్తూ ఉత్తరువులు ఇచ్చాడు వ్యక్తిసత్యాగ్రహం చేసేవారిపై నిర్బంధ విధానాన్ని తీవ్రతరంచేయడం తప్పితే ప్రభుత్వ మింకేమీ సౌమనస్యంచూపలేదు. ఆగస్టులో మరల గాంధీజీని అరెస్టుచేశారు గాని, ఉపవాసం మొదలుపెట్టిన తర్వాత తిరిగి ఆనెలలోగానే విడుదల చేశారు. ఆకురాలుకాలంలో, మానసికకారణాలవల్ల కొన్నాళ్ళు రాజకీయ కార్యాలనుండి గాంధీజీ విరమించుకొన నిశ్చయించుకొని, హరిజనయాత్రను ఆరంభించాడు. ఈలోగా పోరాటం సాగుతూనేఉంది. అది ముగియనూలేదు, దానినెవరూ కదపనూలేదు.

1930 లో అంతటి బ్రహ్మాండశక్తితో ఆరంభమైన ఉద్యమం 1934 మే వరకు సాంతంకాలేదు ఉద్యమ విఫలతకు కారణాలను తన దృష్టితో వివరిస్తూ, గాంధీజీ ఏప్రెల్‌నెలలో ఒక ప్రకటన చేశాడు. తప్పంతా ప్రజలపైనే మోపింది: "ప్రజలవద్దకు చేరేలోగా కలుషిత మవుతున్నందువల్ల, సత్యాగ్రహ సందేశాన్ని ప్రజలంతా గ్రహించలేదని భావిస్తున్నాను ఆధ్యాత్మికసాధనాలు, భౌతికమార్గంలో ఉపదేశిస్తే వానిశక్తి తగ్గిపోతుందని నాకుబోధపడింది.... చాలమంది దాని మీద గురిలేనివారు చేసిన సత్యాగ్రహం.... పాలకుల హృదయాలను స్పృశించలేకపోయింది." సమిష్టి సత్యాగ్రహాన్ని, వ్యష్టిసత్యాగ్రహంగా మార్చడంకూడ, ప్రజాఉద్యమం అదుపులో పెట్టుకోవడం కష్టం అనే కాంగ్రెస్‌నాయకుల సమస్యను పరిష్కరించలేదు. దీనికి ఏమాత్రం లోపంలేని తర్కవాదంతో నిర్ణయంచేశాడు: "ఒకసమయంలో ఒకేయోగ్యుడైన వానియందు సత్యాగ్రహాన్ని పరిమితంచేయాలి" "ఈపరిస్థితులలో ఒకే ఒకరు — ఆ ఒక్కవ్యక్తి నేనే — తాత్కాలికంగా సత్యాగ్రహ బాధ్యతను వహించాలి," అని గాంధీజీ ప్రకటించాడు. ఇలాగా గాంధిగారి

---

* ఈ ఆఖరుదెబ్బకో, అప్పుడు విదేశాలలో ఉన్న సుభాషచంద్రబోస్ వి.జె పటేల్ గారలొక ప్రకటనచేశారు. "సత్యాగ్రహాన్ని ఆపివేస్తూ చేసిన ఇటీవలి గాంధీచర్య ఓటమిని ఒప్పుకోవడమే అవుతుంది....రాజకీయనాయకుడుగా గాంధీజీ పనికిరాడని మా స్పష్టమైన అభిప్రాయం. కొత్తసిద్ధాంతంపై క్రొత్తపద్ధతిపై కాంగ్రెసును పూర్తిగా పునర్నిర్మించవలసిన సమయం వచ్చింది, అందుకొక కొత్తనాయకు డవసరం."

"అహింసాయుత సహాయనిరాకరణ" సిద్ధాంతం భారతప్రజల స్వాతంత్రమార్గంగా పనికిరానిదని ఆఖరుకు పర్యవసానం తేలిపోయింది.

1934 మే లో అఖిలభారత కాంగ్రెసుసంఘం, సత్యాగ్రహాన్ని బేషరతుగా * ఆపివేసేందుకై, పాట్నాలో సమావేశం కావడానికి ప్రభుత్వం అనుమతించింది ప్రభుత్వం ఏ సౌకర్యాలను షరతులను ఇవ్వలేదు అందులోనే కొన్ని నిర్ణయాలు చేశారు. వానికి తగిన ప్రాథమిక కార్యక్రమం అప్పటికే జరిగింది వచ్చే ఎన్నికలలో కాంగ్రెసుపేర ప్రత్యక్షంగా పోటీచేయాలని తీర్మానించుకున్నారు

1934 జూన్‌లో ప్రభుత్వం కాంగ్రెస్‌పై నిషేధాన్ని తొలగించింది కాని ఇంకా కాంగ్రెస్ అనుబంధసంస్థలైన యువజనసంఘాలపైన, రైతుసంఘాలపైన, సరిహద్దురాష్ట్రంలోని రెడ్‌షర్టులపైనా నిషేధం అలానేఉంది. 1934 జూలైలో భారత కమ్యూనిస్టుపార్టీని ప్రభుత్వం నిషేధించింది. నూతనదశ ప్రారంభమవుతున్నది.

1934 ఆకురాలే కాలంలో, గాంధీజీ కాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చాడు. తాత్కాలికంగా ఆయనకర్తవ్యం పరిపూర్తి చెందింది వదిలిపెడుతూ ఆయన ఇలా వివరించాడు "చాలమంది కాంగ్రెసువాదులకూ నాకూ మధ్య దృక్పథంలో ముఖ్యమైన విభేదం పెరిగిపోతున్నది" "కాంగ్రెసులోని అత్యధిక సంఖ్యాకులకు" అహింస "ఒక ప్రధానసిద్ధాంతంకాదు" కాని కేవలం "విధానం" మాత్రమే. కాంగ్రెసులో సోషలిస్టు గ్రూపులు సంఖ్యలోను పలుకుబడిలోను ఎక్కువవుతూ వచ్చినవి. "వారు కాంగ్రెస్‌లో పైచేయి అయితే, - అలావారు కావచ్చుకూడ—నేను కాంగ్రెస్‌లో ఉండలేను" ఆ నూతనదశ అప్పుడే కనిపిస్తున్నది; పాత భావాలకు అది గిట్టలేదు.

గాంధీజీ కాంగ్రెసును వదలివేశాడు. కాని కాంగ్రెస్ నియమావళిని, సంస్థా నిర్మాణాన్ని అభివృద్ధినిరోధకంగా పునర్నిర్మితంచేసిగాని ఆయన వదిలిపెట్టలేదు. ఇలాచేయడంవల్ల తర్వాత అభివృద్ధికి చాల ఆటంకం ఏర్పడింది. అంతేకాక ఆయన తెరవెనుక అతిశక్తివంతుడైన నాయకుడుగా నిల్చాడు అవసరమైనప్పుడు ప్రత్యక్షనాయకత్వాన్ని కొత్తగా అంగీకరించడానికి సిద్ధంగాఉన్నాడు. 1939-40 ప్రతిష్టంభనలోను తిరిగి 1942 లోను ఆయన ప్రత్యక్ష నాయకత్వం చేకొన్నాడు.

1930 - 34 పోరాటంలోని మహత్తరరంగం ఇలా విషాదకరంగా ముగిసినందువల్ల, ఆ ఉద్యమం సాధించిన మహద్విజయం, దానివల్ల నేర్చుకున్న గుణపాఠాలు, దానివల్ల వచ్చిన శాశ్వత లాభాలు మనం ఏమీ లేవని భావించరాదు. అపరిమితమైన ప్రజాసహాయం, ఉత్సాహం, భక్తిశ్రద్ధలూ, త్యాగమూ తనకు చేత కావలసినంత ఉన్న ఆ ఉద్యమం విజయాన్ని సాధించే స్థితికివచ్చి, తాత్కాలికంగా

* గాంధీజీ సలహా ఇచ్చిన ఒక్క మినహాయింపుతో

విఫలం కావడం ఒక గుణపాఠం నేర్పింది. ఆ పాఠాన్ని తెలుసుకొని భవిష్యత్తు కోసం మరీమరీ అవగాహన చేసుకోవాలి. ఈ కథలోనే ఆ కారణాలు అంతర్గర్భితమై ఉన్నవి కాని ఆ సంవత్సరాల సంఘటనలజూచి జాతీయోద్యమం గర్వించవచ్చును. ఆ రోజులలో ఆధునిక విజ్ఞానపు ఆయుధాగారంలోని ప్రతి ఆయుధాన్నీ సామ్రాజ్యతత్వం ఉపయోగించి, భారత ప్రజలను పడగొట్టి తమ ఇష్టానిష్టాలకు విధేయులనుగా చేసుకోవాలని, స్వతంత్ర పోరాటాన్ని నిర్మూలించాలనీ కలలుగన్నది. ఆ ఆశ భగ్నమైపోయింది. ఆ పెద్ద దెబ్బలన్నీ తిన్నతర్వాత రెండేళ్ళలోనే జాతీయోద్యమం మునుపటికన్నా బలవత్తరమై పురోగమించ సాగింది. పోరాటం వ్యర్థంకాలేదు. ఆ రోజులు సంగ్రామ అగ్నికుండం. మహత్తరమైన నూతన జాతీయైక్యతను ఆత్మవిశ్వాసాన్ని గర్వాన్ని, దృఢ నిశ్చయాన్ని కల్పించి ఉత్తేజితం చేసేందుకు సాయపడింది. దాని ఫలితాలు ఈ రోజు ఉపయోగానికి వస్తున్నవి అంతిమ పోరాటం ఇంకా ముందున్నది. కాని మున్నెన్నడూ లేనంత మహత్తర సంసిద్ధత నేడు కనబడుతున్నది.

## పన్నెండో అధ్యాయం

# కార్మికోద్యమం, సోషలిజం ప్రారంభం

"భారతదేశ కార్మికవర్గం ఇప్పుడే వర్గ చైతన్యయుతమైన రాజకీయ ప్రజా పోరాటాన్ని నడిపేందుకు తగినంత అనుభవం సాధించుకున్నారు — అందువల్ల భారతదేశంలో ఆంగ్లో - రష్యన్ పద్ధతులు పనికిరావు"

(లెనిన్ 1908 లో)

బ్రిటిష్ కార్మికవర్గంలో నిర్మాణ దృష్టిలోను, సోషలిస్టు చైతన్యం పెంపొందించుటలోను అగ్రగామిగా సేవచేసిన బ్రిటిష్ సోషలిస్టు నాయకుడొకాయన భారతీయులకు మిత్రుడుగానూ, బ్రిటిష్‌ప్రభుత్వాన్ని విమర్శించడానికిన్నీ భారత దేశానికి వెళ్లాడు. ఆయన తిరిగివచ్చి భారత దేశాన్నిగూర్చి ఒక పుస్తకం రాశాడు అందులో భారత కార్మికవర్గాన్నిగూర్చి ప్రస్తావించకుండా భవిష్యత్తులో భారత కార్మికవర్గం ఏర్పడే అవకాశ ముందనికూడ ఊహించనైనాలేదు. అది ముప్పై ఏడేళ్ళ క్రితం సాధ్యమయింది. (కీర్‌హార్డి వ్రాసిన "భారత దేశం: భావాలు, సూచనలు" 1909లో ప్రకటితం.) అలాగే 1910లో ప్రకటితమైన మాక్డనాల్డు "భారతదేశ చైతన్యం"లో కూడ ఒక్కవట్టి ఊహమాత్రమే కనిపిస్తుంది: ఎప్పుడో, భారత కార్మికులు ఏదో ఒక రకమైన "కార్మిక సంఘాలు" ఏర్పరచుకోవచ్చునని, "అవి భారతదేశంలోని కులాలకూ, బ్రిటన్‌లోని ట్రేడ్‌యూనియన్లకూ ఒక విధమైన మధ్యే మార్గంలో ఉండవచ్చు"నని (పుట 179) ఆయన ఊహించాడు.

భారత దేశంలోని నిర్ణాయక భావిశక్తులనుగూర్చిన ఈ దృష్టిరాహిత్యం అదే పనిగా తెచ్చుకున్నది కాదు ఆ సమయంలో అంతర్గర్భితమై సంఘటిత మౌతున్న వాస్తవిక శక్తులను, భావి కాలానికి వాని ప్రాముఖ్యాన్ని మార్క్సిస్టు దృక్పథం మాత్రమే గుర్తించగలదు 1908 లో తిలక్‌ను శిక్షించినందుకు అసమ్మతిగా బొంబాయి బట్టలమిల్లు కార్మికులు చేసిన రాజకీయ సమ్మె ప్రాతిపదికపై ఆ సంవత్సరమే లెనిన్ "వర్గ చైతన్య యుతమైన రాజకీయ పోరాటాన్ని నడిపేందుకు తగినంత అనుభవం గడించిం"దని భారత కార్మికవర్గాన్ని అభినందించాడు.

అందునుండే ఆయన ఇందుతో బ్రిటిష్ ప్రభుత్వ వినాశం రానున్నదనే సిద్ధాంతానికి వచ్చాడు

నేడు ఈ సూక్ష్మదృష్టికి ఆ సమస్త సంఘటనల ప్రాముఖ్యాలుగా స్పష్టపడుతున్నవి. పాత గుడ్డితనమిప్పుడిక సాధ్యంకాదు. భారతజాతీయ పోరాటచరిత్ర, ప్రతి దశవశతూ కార్మికవర్గపాత్ర ఎలా బలాన్ని, ప్రాముఖ్యాన్ని పొందుతున్నదో చూపించినవి: మరి సోషలిజం కమ్యూనిజం సమస్యలు నేడు భారత రాజకీయ చర్చలలో ప్రథమశ్రేణిని చేరుకున్నవి.

1914 కు పూర్వయుగంలో కార్మికవర్గ పాత్ర ఇంకా వెనుకబడియున్నది; జాతీయోద్యమానికి అగ్రగామిగా కాక అనుచరంగా ఉండినది: ఉత్తమ రాజకీయ చర్య ఒక్కటీ, తిలక్ ఆరేండ్లశిక్షకు అసమ్మతిగా బొంబాయి సర్వవ్యాప్త సమ్మె మాత్రమే

ప్రథమయుద్ధం ముగిసినతర్వాత నూతన చైతన్యయుగంలో 1918-21 మధ్యవచ్చిన సమ్మెల మహోద్యమం, జాతీయోత్తేజనానికి ముక్తుదాడై, ఆఖరుకు 1920—22 సహాయ నిరాకరణోద్యమంలో కాంగ్రెసును పురోగమింప జేసినది.

తర్వాత పదేండ్లకంతా, కార్మికవర్గం ఒక స్వతంత్రనిర్మాణయుత శక్తిగా తయారైంది. తన సిద్ధాంతాన్ని తాను అవలంబించి, ప్రత్యక్షపాత్రను నిర్వహిస్తున్నది — అప్పటికింకా అగ్రగామిపాత్రను నిర్వహించలేకున్నా వీర్యవంతమూ వర్గచైతన్యయుతమూ అయిన కార్మికవర్గంలోని ఒకభాగం 1928 లో నడిపిన గొప్పసమ్మెఉద్యమం యువకుల, మధ్యతరగతుల చైతన్యాన్ని తోడుచేసుకొని, నూతన జాతీయపోరాట వెల్లువకు దారితీసింది; 1930-34 లో వచ్చిన పోరాటపు కొత్తవెల్లువలో, బూర్జువానాయకత్వం బహిరంగంగా తమపోరాటం రెండురంగాలలో నడుస్తుందని, సామ్రాజ్యతత్త్వంపైనేగాక, క్రిందినుండి పొంగివచ్చే ప్రజా విప్లవానికికూడ వ్యతిరేకంగా ఉంటుందని చెప్పారు.

రెండోయుద్ధం ప్రారంభమైనప్పటినుండి, మరింతస్పష్టంగా భారత కార్మికవర్గం, భారతరాజకీయాలలో భావినిర్ణాయకశక్తిగా నిలబడివున్నది.

## 1. పారిశ్రామిక కార్మికవర్గం అభివృద్ధి

ఆధునికఅర్థంలో పారిశ్రామిక కార్మికు లనేవారిసంఖ్య. భారతదేశంలోని జనసంఖ్యనుబట్టి చూస్తే పెద్దదికాదు; కాని ఆకార్మికవర్గం మంచి కీలకస్థానాలలో కేంద్రీకృతమై ఉన్నది; ఎగుడు దిగుడులేని, అభివృద్ధికరమైన, దృఢనిశ్చయంగల అసలు విప్లవకారకమైన జనాభాలోని భాగం ఆ వర్గమే.

బ్రిటిష్‌ప్రభుత్వ పక్షంగా లార్డు చెమ్స్‌ఫర్డు, 1922 అక్టోబరులో నానాజాతి సమితి సమావేశంలో మాట్లాడుతూ భారతదేశంలో "పారిశ్రామిక కార్మికులు" 2 కోట్లమంది ఉన్నారన్నాడు :

"పారిశ్రామిక ప్రాముఖ్యంగల యెనిమిది ప్రధాన దేశాలలో భారత దేశాన్ని చేర్చవలెనన్న వాంఛను బలపరచవలసిఉన్నది. ఆ వాంఛ సాధారణకారణాలమీద ఆధారపడిఉన్నది. దానికి విశాలంగా లెక్కలువేసి సమర్థించుకోవలసిన పనిలేదు. ఆ దేశంలో పారిశ్రామిక కార్మికులు దాదాపు రెండు కోట్లున్నట్లు అంచనా వేయవచ్చును. అంతేకాక వ్యవసాయంలో పనిచేసే కార్మికవర్గం ఎక్కువగా ఉన్నది."

ఇలా భారతదేశాన్ని ప్రపంచంలోని ప్రధాన పారిశ్రామికదేశాల్లో చేర్చాలన్న ఈ వాంఛ అత్యాశాపూరితమైంది. జానాభాలో బ్రిటిష్ ప్రభుత్వానికి మరో వోటు సంపాదించుకోవడానికి చేసిన బుకాయింపుమాత్రమే ఇది. ఈ రెండు కోట్లమంది అనేవారిలో ఎక్కువగా చేతిపనులు చేసేవారు. ఇ టిపనులు చేసేవారు. కాబట్టి ఇవన్నీ ఆధునిక పరిశ్రమల క్రిమీ సంబంధించినవి కాదు

1927-28 లో ఇండియాకు వచ్చిన బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ప్రతినిధివర్గం ఇలాగే భారతదేశంలో "సంఘటితపరచ వీలైన కార్మికులు" రెండు కోట్ల 50 లక్షలమంది ఉన్నారని తమ నివేదికలో అంచనావేశారు కాని ఈ 2 50 లక్షలమందిలో 2 కోట్ల 15 లక్షలమందికి తక్కువగాకుండా వ్యవసాయకూలీలున్నారు. వీరుభారీ పెట్టుబడిదారీ క్షేత్రాల పరిస్థితుల్లో కాకుండా (తోటలలో పనిచేసే 10 లక్షలమంది మినహా) ఎగుడుదిగుడు ఉద్యోగంలో, ఎక్కువమంది రైతులకింద నిరుపేదలుగా ఉన్నారు; సామాన్యంగా కార్మికసంఘాలలో వీరిని సమీకరించడానికి వీలు తక్కువ (కాని వీరు రైతుఉద్యమంలో చాల ముఖ్యమైనపాత్ర నిర్వహించగలరు, వారి వివరణలో పరిశ్రమలలో "సమీకరించ వీలైన కార్మికులు" కేవలం 35 లక్షలమంది మాత్రమే.

భారతకార్మికుల బలాన్ని అంచనావేయడంలో, చాలమందిగా ఉన్న ఆస్తిలేని కార్మికులకూ, ఆధునికపరిశ్రమలలో జీతాలుతీసే కార్మికుల పరిమితభాగానికీ విభేదంకల్పించి చూడడం అవసరం. ఈ పరిశ్రమల్లోని కార్మికులుమాత్రమే నిర్ణాయకమైన సంఘటితమైన. చైతన్యవంతమైన భారతకార్మికవర్గ నాయకత్వశక్తిగా పనిచేయగలరు

భారత కార్మికవర్గసంఖ్య ఎంతఉందో తెలిపే లెక్కలు దొరకవు. 1931 జనాభా నివేదిక ఇలా వ్రాసింది.

"భారతదేశ జనాభానుబట్టిచూస్తే, పరిశ్రమలలో పనిచేసే కార్మికుల సంఖ్య చాల తక్కువ. ఫ్యాక్టరీచట్టం అనువర్తించి, బ్రిటిష్ ఇండియాలోని పరిశ్రమలలో పనిచేసేవారిసంఖ్య రోజూ సగటున కేవలం 15,53,169....

"1921 లో తోటలలోను, గనులలోను, పరిశ్రమలలోను, రవాణా శాఖల్లోను పనిచేసేవారి మొత్తంసంఖ్య భారతదేశంలో 2,42,39,555. ఇందులో 26,85 909 మంది మాత్రమే 10 లేక పైగా కార్మికులు పనిచేసే కర్మాగారాలలోని వారు."

"1931 లో అన్ని పనులలోని వారి సంఖ్య 2,61 87 689. ఇక ఇప్పుడు కర్మాగారాలలో పనిచేసేవారి సంఖ్య 29,01,776 రోజూ పనిచేసే వారి సగటు సంఖ్య ఈ పదేళ్ళలోను నూటికి 30 చొప్పున పెరిగింది. దీనిని బట్టి ఇప్పుడు 35,00 000 ఉంటుంది. 1931 లో పరిశ్రమల్లోని కార్మికుల సంఖ్య 50 లక్షలుంటుందని సామాన్యంగా చెప్పవచ్చును

(భారతదేశ జనాభా లెక్కలు, 1931, వాల్యూం 1 భాగం 1 పుట 258)

స్థూలంగా భారతదేశంలో కూలి—కార్మికులు 6 కోట్లున్నారని అంచనా వేయవచ్చును. భారతదేశపు ఓటింగు హక్కుల కమిటీ లెక్కల ప్రకారం 1931 లో 5,65 లక్షలున్నారు.

"1921 లో 2,15 లక్షలని చూపిన వ్యవసాయకూలీల మొత్తం 1931 లో 3,15 లక్షలు. అందులో 2,30 లక్షలమంది 'భూమిలేని' వారని, 1931 లో భారతదేశపు ఓటింగుహక్కులకమిటీ అంచనావేసింది: ఇక వీరి అంచనా ప్రకారం వ్యవసాయేతర కార్మికులసంఖ్య 2,50లక్షలు. కాబట్టి భారతదేశంలో అన్నివృత్తులలో పనిచేసే 15,40 లక్షలమందిలో 5 65 లక్షలమంది కూలీ కార్మికులున్నారు. మరొకవిధంగా చెబితే, అన్ని వృత్తులలో పనిచేసే వారిలో నూటికి 36 మంది కూలిపని జీవనంగా కలవారున్నారు."

(ఐ. యల్ ఓ రిపోర్టు, 1938, "భారతదేశంలో పరిశ్రమలు కార్మికులు" పుట 30.)

ఆధునిక—చిన్నవికాని పరిశ్రమలలోని పరిశ్రమల కార్మికులు అనే సంకుచితార్థంలో చూస్తే, 1921 జనాభాలెక్కలు, పదిమందికిపైగా పనిచేసే కర్మాగారాల్లోని కార్మికుల సంఖ్య 26 లక్షలని చెబుతున్నది. తర్వాతి పారిశ్రామిక జనాభాలెక్కలు తీయలేదు; కాని పైనఇచ్చిన 1931 జనాభాలెక్కల అంచనా, వారిసంఖ్యను 35 లక్షలంటున్నది. ఖచ్చితమైనలెక్కలు ఫాక్టరీచట్టం శాఖకుచెందినవి మాత్రమే; 1934 కొత్తఫ్యాక్టరీచట్టం, 20 లేక పైగా కొన్నిచోట్ల 10 లేక పైగా కార్మికులు పని చేసే యంత్రశక్తితో పనిచేసే కర్మాగారాలకు అనువర్తిస్తుంది; 1938లో మొత్తం కార్మికులసంఖ్య 17,37,755 ఇందుతో స్వదేశసంస్థానాలలోని "భారీపరిశ్రమల్లో" పనిచేసేవారి 2,99 003 ను చేరిస్తే మొత్తం భారతదేశంలో ఆధునిక భారీపరిశ్రమల్లోని కార్మికులసంఖ్య 20,36,758.

దీనిని ప్రాతిపదికగా తీసుకొని ఈ క్రింది నిర్ధారణకు వస్తాము.

మధ్యరకపు భారీ కర్మాగారాల్లోని కార్మికుల సంఖ్య

| | | |
|---|---|---|
| (పై ప్రాతిపదికమీద) | .... | 20,36,758 |
| గనులు | .... | 4,13,458 |
| రైల్వే కార్మికులు | .... | 7,01,307 |
| నీటిరవాణా (డాకు, నౌకా కార్మికులు) * | .... | 3,61,000 |
| | వీటన్నిటి మొత్తం | 35,12,523 |

* 1935 లెక్కలు.

ఈ 35 లక్షలమంది, నేటి భారతదేశంలోని, ఆధునిక భారీపరిశ్రమలలోని, కార్మికవర్గానికి బీజంగా ఉన్నారు. ఇందులో చేర్చనివారు అన్ని చిన్న పరిశ్రమలలోని కార్మికులు (పదిమందికి తక్కువ పనిచేసే మిల్లులు) యంత్రశక్తితో పనిచేయని భారీపరిశ్రమల కార్మికులున్నూ (అంటే సిగరెట్టు పాకల్లో కొన్నిచోట్ల 50 మందికి పైగాకూడ వుంటారు) సంఘటిత కార్మికోద్యమ శక్తి దృష్టితో, ఇందులో తోటలలో పనిచేసే 10 లక్షల కార్మికులను చేర్చాలి. వారు పూర్తి భారీపరిశ్రమల్లో శాస్త్రీయమైన బానిసలపని పరిస్థితుల్లో ఉన్నారు. ఇంతవరకు అన్ని నిర్మాణాలనుంచి వేరుపడి పూర్తిగా ఏకాకులుగా, దాస్యంలో ఉన్నప్పటికీ వీరు ఉద్యమయుగాలలో, ఉన్నతస్థాయిలో తీవ్రచర్యలకు పూను కున్నారు వీరుకాక చిన్నపరిశ్రమల్లోనివారిని, అనిశ్చితమైన (ఇర్రెగ్యులర్) పెద్ద పరిశ్రమలలోనివారిని చేర్చాలి కాబట్టి ఇప్పుడు సంఘటితపరచ వీలైన భారత కార్మికవర్గబలం తప్పకుండా 50 లక్షల కార్మికులుంటారు

పరిశ్రమల్లోని కార్మికుల పెరుగుదల ఫ్యాక్టరీ చట్టపు లెక్కలలో చూప బడింది. (ఈ చట్టం అనువర్తించే ఆవరణ విశాల పరచబడడంకూడ చూప బడింది :)

| | ఫ్యాక్టరీల సంఖ్య | సగటు దినం పనిచేసేవారు |
|---|---|---|
| 1894 | 815 | 3,49,810 |
| 1902 | 1533 | 5,41,634 |
| 1914 | 2.936 | 9,50,973 |
| 1918 | 3,436 | 11,22,922 |
| 1922 | 5 144 | 13,61.002 |
| 1926 | 7 251 | 15,18,391 |
| 1930 | 8 148 | 15,28 302 |
| 1935 | 8,831 | 16,10,932 |
| 1936 | 9,323 | 16,52,147 |
| 1938 | 9,743 | 17,37.755 |
| 1939 | 10,466 | 17,51,137 |
| 1943 | 13,209 | 24,36,310 |
| 1944 | 14 071 | 25,22,753 |

## 2. కార్మికవర్గ పరిస్థితులు

భారతదేశంలోని కార్మికవర్గ పరిస్థితులు ఎలా ఉన్నాయో స్థూలంగా రెండో అధ్యాయంలో వివరించాను. 1928 లో నివేదికను ప్రకటించిన బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ ప్రతినిధివర్గం తేల్చుకున్న సారాంశం తిరిగి జ్ఞాపకం చేసుకోవడం ఉపయోగకరంగా వుంటుంది :

"భారతదేశంలోని కార్మికులలో అధిక సంఖ్యాకులు దినానికి 1 షిల్లింగు (12 అణాలు) కంటె ఎక్కువ సంపాదించడం లేదని అన్ని విచారణలు తెలుపుతున్నవి. పరిశ్రమ కార్మికులు అత్యధికంగా ఉన్న బెంగాలు రాష్ట్రంలో కార్మికులలో నూటికి 60 మందికి, చాలా ఎక్కువ ఇచ్చేచోట్ల దినానికి 1 షి. 2 పెన్నీలు ముడుతున్నవి: ఆ కూలి మరీ తక్కువ, 7 పెన్నీల నుండి 9 పె. వరకు కూడ దిగిపోతున్నది మరి 3 పెన్నీల నుండి 7 వరకు, ఆడవాళ్ళకు, పిల్లలకు ఇస్తున్నారు. తమకు తెలిసినంత వరకు ఇలా జీతాలున్నవని విచారణకర్తలు ప్రకటించారు.... మేము స్వయంగా చేసిన విచారణ కూడ ఈ లెక్కలనే బలపరుస్తున్నది. ఇంకా నిజం చెబితే మగవాళ్ళకు 7 అణాలు అంతకన్నా తక్కువా, ఆడవాళ్ళకు 0-3-6 కూడ కూలి ఇస్తారని ఎన్నో ఉదాహరణలు మాకు చిక్కినవి."

(ఎ. ఎ. పార్సెల్-హార్స్‌వర్త్, భారతదేశంలోని కార్మికపరిస్థితులపై నివేదిక; ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, 1928, పుట 10)

ఆ ప్రతినిధివర్గమే కార్మికుల గృహవసతిని గూర్చి వ్రాసింది.

"మేము నిలిచిన చోటల్లా కార్మిక నివాసాలకు వెళ్ళి చూచాము. మేము చూడకనే ఉంటే అలాంటి కల్మష ప్రాంతాలున్నాయని నమ్మి ఉండే వారం కాదు.... ఇక్కడొక ఇళ్ళవరుస ఉంది. దీని యజమాని, ప్రతి ఇంటికీ నెలకు రూ 3-6-0 అద్దె తీసుకుంటాడు. ఒకొక ఇల్లు అంటే ఒక చీకటి గది. అదే ఉండేదుకు, వండుకునేందుకు, పడుకునేందుకూ. కూడ మట్టిగోడలు, పెంకుటి మిద్దె, ముందు చిన్న ఆవరణా, అందులో ఒక మూల కక్కసు వుంటుంది. ఉండే గదిలో వెలుతురుండదు పైకప్పు పడిపోయిన చోటనుంచో, తలవాకిలి తీసినప్పుడో వెలుతురు వస్తుంది. ఇంటి ముందు చిన్న పొడుగాటి కాలవ ఉంటుంది. అందులో నానాకసుమాలమూ కొట్టుకొనివస్తూ ఈగలు, దోమలు వగైరా జుమ్మంటూ ఉంటాయి.... అన్ని యిళ్ళకు ఆఖరున రెండువరుసలకు మధ్య సందులుంటాయి. చాలచోట్ల అడ్డంగా కసువు, చెత్తకుప్పలు కుప్పలుపడి విపరీతమైన కంపుగొడుతుంటుంది ఈ సందులు సామాన్యంగా పాయిఖానాలుగా ముఖ్యంగా పిల్లవాళ్ళు ఉపయోగిస్తుంటారనేది స్పష్టమే.

"ప్రతిచోటా ఉన్న జనం తొక్కిడి, అపరిశుభ్రత చూస్తే. దానికి సంబంధించిన ఉద్యోగులు తమ విద్యుక్త కర్తవ్యాలను అదే పనిగా ఉపేక్షిస్తున్నారని. అని బయట పెడుతున్నవి."

(అదే, పుటలు 8, 9)

ఈ నివేదిక పదకొండేళ్ళ క్రితం ప్రకటింపబడింది. ట్రేడ్స్ యూనియన్ కాంగ్రెస్ భారతదేశానికి తర్వాత ఏ ప్రతినిధివర్గాన్నీ పంపలేదు.

ఈ పరిస్థితులేమీ మారలేదని, ఇంకా అధ్వాన్నమై పోయినవనీ ఇటీవల

సంగతినిగూర్చి తెలుసుకొనేందుకు, 1938 జినీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మికమహాసభలో భారత కార్మికప్రతినిధి ఇచ్చిన నివేదికను చూదాము.

"అతిహీనమైన జీవితావసరాలకుకూడ చాలని జీతాలు భారతదేశం లోని అత్యధిక సంఖ్యాకులైన కార్మికులకు ఇస్తున్నారు. 1921 లో ఫిండ్లే, షిర్రాస్, బొంబాయిలోని కార్మికుల ఇంటిఖర్చుల విషయమై విచారణ జరిపారు. దానిప్రకారం, కార్మికుడు ఫామిన్‌కోడ్ అనుమతించేంత ధాన్యం ఉపయోగిస్తున్నాడు, కాని ఇది బొంబాయి జైలుకోడ్ క్రింద జైలులోని నేరస్థులకిచ్చే భోజనంకన్నా తక్కువే. ఆ నివేదిక ప్రకటనతర్వాత పరిస్థితి మరింత అధ్వాన్నమైనది. ఇప్పుడు 1921 లో కన్నా కార్మికుల సంపాదన చాల తక్కువ.

బొంబాయిప్రభుత్వం 1935లో జీతాలలెక్కలు తీయించింది. ప్రధానమైన బాగా నిర్మితమైఉన్న బట్టలమిల్లులలో నెల జీతాలిలా ఉన్నవి. గోకాక్‌లోని నూటికి 18 మంది కార్మికులకు 3 షి కు 9 షి. కు మధ్య. షోలాపూర్‌లోని నూటికి 32 మందికి 7 షి 6 పె కు 15 షి. కు మధ్య, నూటికి 20 కార్మికులకు 22 షి 6 పెన్నీలు, బొంబాయి పట్టణంలో నూటికి 32 మంది కార్మికులు 22 షి. 6 పెన్నీలకు 30 షి. కు మధ్య జీతాలు తీసుకుంటున్నారు.

"భారతదేశంలో అత్యధికంగాఉన్న సమీకృతంకాని పరిశ్రమలలోని కార్మికులస్థాయి వర్ణించడంకన్నా ఊహించడం సులభం, పొలాలను పోగొట్టుకొన్న రైతులసంఖ్య విపరీతంగా పెరిగిపోతుండటం అవకాశంగా తీసుకొని- జీతాలను బతకడానికికూడ చాలనంత తక్కువయిస్తూ యజమానులు. పరిశ్రమల పరిస్థితిని ఎంతఎక్కువ చేయవీలుందో అంతఎక్కువ చేయకుండా చేస్తున్నారు....

"జబ్బులు, నిరుద్యోగం, ముసలితనం, మరణం ఇలాంటి ప్రమాదాలనుంచి భారతకార్మికులకు రక్షణలేదు.... నిరుద్యోగ సహాయానికి ఏ మార్గమూ భారతప్రభుత్వం చూడ నిరాకరిస్తున్నది... నిరుద్యోగంనుండి తమను రక్షించుకోవడానికి కార్మికులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. బొంబాయి పట్టణంలోని మునిసిపల్ లెక్కలు ఆకలి చావులను తెలుపుతున్నవి.

"భారతదేశంలో ఎక్కువ పారిశ్రామికమైన బొంబాయిలో ఇళ్ళవసతి ఏసభ్యదేశానికీ అవమానకారణమని 1931 జనాభాలెక్కల నివేదిక తెలుపుతున్నది బొంబాయి పట్టణంలోని నూటికి 95 కార్మిక కుటుంబాలు ఒక గదిగలయిళ్ళల్లో ఉంటున్నారు — ఆగది సామాన్యంగా 110 చ. అడుగుల వైశాల్యముంటుంది ఇక కాలిబాటలే కొంపలుగా బతుకుతున్న వేలకొలది కార్మికులు బొంబాయిలో ఉన్నారు

"బొంబాయిలో 1933-34 లో వేయిమందికి ఎన్ని శిశుమరణాలు ఉన్నాయో తెలిపే క్రిందిపట్టిక, కార్మికవర్గంలోను ఇతరులలోను శిశు మరణాల తారతమ్యం దారుణంగా చూపుతున్నది.

| | | |
|---|---|---|
| 1 గది అంతకు తక్కువ | .... | 524.0 |
| 2 గదులు | .... | 394.5 |
| 3 గదులు | .... | 255.4 |
| 4 గదులకు పైగా | .... | 246.5 |

అప్పటినుండి పరిస్థితులేమీ బాగుపడలేదు. తామివ్వలేనంతటి అద్దెలు లేకుండా కార్మికులు ఆరోగ్యవంతమైన ఇళ్ళల్లో నివసించ వీలయేట్టు చేసి, శిశుమరణ సంఖ్యను తగ్గించడానికి ప్రభుత్వమేమీ చేయడంలేదు ఆ మరణ సంఖ్యకు కటువైనా సరైనపదం దారుణహత్య."

(భారత కార్మిక ప్రతినిధి ఎస్. వి. పరుళేకర్ అంతర్జాతీయ కార్మికసభలో చేసిన ప్రసంగం, జినీవా, జులై 1938.)

విట్లీ కమిషన్ రిపోర్టుకాక భారతదేశంలోని పరిశ్రమలలో జీతాల గమనం జీతాలరేట్లు పూర్తిగా డి. హెచ్. బుచానన్ వ్రాసిన "భారతదేశంలో పెట్టుబడిదారీ పరిశ్రమల అభివృద్ధి" (1934 అధ్యాయం 15, పుట 317-60 లలో కనిపిస్తాయి. ఆ రచయిత ఈ నిర్ణయానికి వచ్చాడు. "1860 కి 1890 కి మధ్య భారత కార్మికుల నిజమైన ఆదాయంలో చాల తక్కువమార్పు కనిపిస్తుంది"; 1890 కి 1914 కు మధ్య "ధరలు బాగా పెరిగాయి. అంతకాకున్నా జీతాలు కొద్దిగా పెరిగాయి"; "యుద్ధసమయంలో చాలచోట్ల జీతాలు పెరగలేదు. తర్వాత కొద్దిగా పెరిగాయి. కాని అన్నిచోట్ల సమానంగా కాక, కొన్నిచోట్ల ధర లెంత పెరిగాయో అంత పెరగలేదు" కాబట్టి 1914-18 యుద్ధం ముగిసేవరకూ జీతాలు పెరగలేదు. ఇంకా తగ్గాయికూడ. తర్వాతనే మార్పువచ్చింది. "యుద్ధకాలంనుండి, చాల జీతాల తగాదాలు వచ్చాయి. కొన్ని చోట్లకొద్దిగా సౌకర్యాలిచ్చారు, కొన్ని చోట్ల చెప్పదగినంత ఎక్కువ చేశారు."కొన్ని పరిశ్రమలలో ముఖ్యంగా బొంబాయి బట్టలపరిశ్రమల్లో జీవితప్రమాణంకన్నా జీతాలు హెచ్చాయి; ఇటీవల ధరలు బాగా పడిపోయినా జీతాలలాగే ఉంచారు కార్మికులు తగినంత చైతన్యవంతులై, జీతాలతగ్గింపు చాల కష్టమయ్యేట్టు చేస్తున్నారు." ఆర్థికమాంద్యంమూలంగా చాల నష్టాలు - జీతాలకోత, తక్కువ యంత్రాలతో ఎక్కువ ఉత్పత్తి చేయడం, నిరుద్యోగం, తక్కువ కాలం ఉద్యోగం వీనివల్ల ఏర్పడ్డాయి; అయినప్పటికీ, అసలు జీతాలు యెక్కువయ్యాయి, కొన్ని నూతనంగా అభివృద్ధులు జరిగాయి, 1938 కాన్పూరుసమ్మెలోలాగే విజయాలు వచ్చాయి. ఇందువల్ల భారతకార్మికుల జీతాల హెచ్చింపు, కార్మికసంఘాల అభివృద్ధి, ఉద్యమబలము ఎక్కడున్నదో అక్కడే జరిగిందనిబోధపడుతుంది. కాని బాగా వెనుకబడివున్న కార్మికుల పరిస్థితి కొంచెంకూడా బాగుపడలేదు.

భారతదేశంలో జీతాల లెక్కలు లేవు. ఒకే పరిశ్రమకేంద్రంలో, ఒకే రకమైనపనికే ఒకరకమైన జీతాలుండవు. మోటుపనివారు కాని (సెమి-స్కిల్డ్) కార్మికుల సగటు జీతాలను, కార్మికపరిహారచట్టంలో క్రి.ది కేసులలో తెలిపిన లెక్కలనుబట్టి 1925—26 కు విట్లే కమిషన్ రిపోర్టు వివరించింది ఇందులో మోటుపనివారు (అన్‌స్కిల్డ్) అసలే ఊచబడలేదని కూడ తెలిక నిస్సహాయ స్థితిలో ఉన్నారు. వారింక పరిహారం కోరడమనేదేలేదు. అధికారులు "సంఘటిత కర్మాగారాల్లోని అర్ధనిపుణ (సెమిస్కిల్డ్) కార్మికుల జీతాలు సామాన్యంగా తెలియ జేస్తా"యని చెప్పే ఈ అనుకూలమైన లెక్కలుకూడ (పిల్లలు, మోటుపని వారు, సంఘటితంకాని పరిశ్రమల్లో పనిచేసే తక్కువ జీతాలవారు ఇందులోచేరరు) దారుణమైన హీనస్థితిని చాటుతున్నవి. భారతీయేతర పాఠకులకు వీని ప్రాముఖ్యం తెలియడం కోసం రూపాయలు అణాల లెక్కలను ఇంగ్లీషు ద్రవ్యమానంలో మార్చాను. (రూపాయకు 1 షి. 6 పెన్నీల లెక్కతో) నెలజీతాలను వారాల క్రింద — 3 వారాలు ¾ వారం నెలకు అనే లెక్కన మార్చాను అలా లెక్క వేస్తే ఈక్రింది పట్టిక వస్తుంది.

సంఘటిత పరిశ్రమల్లో కొంతనిపుణులైన కార్మికుల సగటు ఆదాయం

ఈక్రింది ఆదాయం నూటికి ఎంతమందికి

| | 4 షి 6 పె తక్కువ | 4 షి 6 పె— 6 షి | 6 షి— 7 షి 9 పె | 7 షి 9 పె— 9 షి 6 పె | 9.6— 11.3 | 11.3— పైగా |
|---|---|---|---|---|---|---|
| యు పి. | 26 | 27 | 15 | 9 | 7 | 16 |
| మద్రాసు | 22 | 25 | 19 | 15 | 4 | 15 |
| సి. పి | 18 | 38 | 17 | 8 | 4 | 15 |
| బీహారు ఒరిస్సా | 21 | 24 | 21 | 12 | 8 | 14 |
| బెంగాల్ | 13 | 18 | 18 | 15 | 10 | 26 |
| బొంబాయి | 3 | 10 | 19 | 23 | 13 | 32 |

అంటే సంయుక్తపరగణాలలోని కొంత నైపుణ్యంగల కార్మికులలో నాలుగోవంతుమంది వారానికి 4 షి, 6 పెన్నీలు, సగంపైగా వారానికి 6 షి. సంపాదిస్తున్నారు; మధ్యపరగణాలలో సగంమందికి పైగా. మదరాసు బీహారు ఒరిస్సాలలో దాదాపు సగంమంది వారానికి 6 షిల్లింగులు, బెంగాలులో సగంమంది వారానికి 7 షి 9 పెన్నీలు; బొంబాయిలోను - విపరీతంగా ఎక్కువ జీవితప్రమాణమున్నా సగంమందికి పైగా వారానికి 9 షి. 6 పెన్నీలకు తక్కువగాను సంపాదిస్తున్నారు.

ఇవికొంత మంచిస్థితిలోఉన్న కార్మికుల లెక్కలేకాని అందరు కార్మికులకు చెందినవికావు. ఇటీవల కార్మికకుటుంబాల ఇంటిఖర్చు లెక్కలగూర్చి, రాష్ట్ర కార్మికశాఖలు చాల విచారణలు సాగించాయి. ఆ విచారణఫలితాలు బొంబాయి

1935 లో (విచారణ 1932—33 కు చెందింది) అహ్మదాబాదుకు 1937 లో, మదరాసుకు 1938 లో ప్రకటించారు; 1925 విచారణ ఫలితాలు షోలాపూరుకు 1928 లో అలానే ప్రకటించారు.

ఆ ఫలితాల ప్రకారం, బొంబాయిలోని సగటు కుటుంబం ఆదాయం (మనిషి ఆదాయం కాదు) నెలకు రూ 50 లేక వారానికి 17 షి 4 పెన్నీలు; అహమదాబాదులో నెలకు రూ. 40; షోలాపూరులో నెలకు 40; మదరాసులో సంఘటిత పరిశ్రమలలోని కార్మికులకు నెలకు రూ 37; మిగత పరిశ్రమలు వృత్తులలోనివారికి నెలకు రూ 20 నుండి 27 వరకు సగటుకుటుంబమంటే (బొంబాయి, షోలాపూరు, అహమ్మదాబాదు విచారణల ప్రకారం) నలుగురుంటారు. అందులో $1\frac{1}{2}$ నుండి 2 వరకు పనిచేసేవారుంటారు. కాబట్టి సగటుజీతం పైమొత్తంలో మూడోవంతునుండి సగంలోపుగా ఉంటుంది. అంటే బొంబాయిలో సగటుజీతం వారానికి 9 షి. 10 పెన్నీలు; అహ్మదాబాదులో 9 షి. 1 పె; షోలాపూరులో 7 షి. 11 పె; మదరాసులో సంఘటిత పరిశ్రమల్లోని వారికి 7 షి. 4 పె: మిగతవారికి 5 షి. 3 పెన్నీలు.

ఈ నామకః ఇచ్చిన జీతాలమొత్తం తిరిగి ఎన్నో కోతలుపడుతుంది. కమిషన్లు, జుల్మానాలు, ఫోర్‌మెన్ కిచ్చే మామూళ్ళు (లంచాలు) విపరీతమైన వడ్డీతో ఉన్న అప్పులభారం - ఇవన్నీ తీసివెయ్యవలసి ఉంటుంది (సామాన్యంగా నెలకు జీతాలిస్తారు. కొన్నిచోట్లమట్టుకు 15 రోజులకొకసారి ఇస్తారు. అందులోను సామాన్యంగా నెలదాటింతర్వాత పదినాళ్ళకో, పదిహేనురోజులకో జీతాలిస్తారు. ఇందువల్ల అప్పు తప్పనిసరి అవుతుంది కూలీలనుండి ఆరువారాల అప్పులాగుతారు.) "ఎక్కువభాగం పరిశ్రమకేంద్రాలలో అప్పులపడిన కుటుంబాలు, లేక వ్యక్తుల వామాషా మొత్తం కుటుంబాలలో మూడులో రెండు వంతులుంటారు. ....చాలమందికి ఉన్న అప్పు మూడునెల్ల జీతంకన్నా ఎక్కువవుంటుంది. ఇంతకన్నా సామాన్యంగా ఎక్కువే ఉంటుంది." అని విట్లీ కమిషన్‌రిపోర్టు అంచనా వేసింది. తర్వాత జరిగిన విచారణలు, పైనవేసిన అంచనా తక్కువని తేల్చాయి. పైన ఉదహరించిన బొంబాయి విచారణలో మూడువంతుల కుటుంబాలు అప్పుల్లో ఉన్నట్లు తేలింది. మదరాసు రిపోర్టుప్రకారం, సంఘటిత పరిశ్రమలలోని కార్మిక కుటుంబాలలో నూటికి 90 అప్పుల్లో ఉన్నవని, ఆ అప్పు సగటున ఆరునెలల జీతమంత ఉన్నదని తేలింది.

డాకుపనివారి జీతాలుకూడ చాలతక్కువగా ఉన్నాయి. రీగేకమిటీ (1946) విచారణప్రకారం కొచిన్‌డాక్‌యార్డులో మొత్తంకార్మికులలో నూటికి $30\frac{1}{2}$ మందికి రోజుకు రూ. 1 కన్నా తక్కువ వస్తున్నది. నూటికి 68 మంది రూ 1—2 లోపు సంపాదిస్తున్నారు. సింధియాషిప్‌యార్డులో నూటికి 82 మందికి రోజుకు రూపాయ కన్నా తక్కువ జీతం.

బొగ్గుగనుల కార్మికులజీతం మరీతక్కువ. ఇటీవల వారి జీతాలు మరీ తగ్గించారు. భారతదేశంగనుల్లో పనిచేసే కార్మికుల మొత్తంలో 5లో 4వంతులు రాణీగంజ్, ఝరియా బొగ్గుగనుల్లో పనిచేస్తున్నారు. రాణీగంజిగనుల్లో 1914 కు ముందు జీతం రోజుకు 6 అణాలు: యుద్ధంతర్వాత 1929 వరకు రోజుకు 13 అణాలు; 1936 నాటికి 0-7-3. కాలరీ మానేజర్ల నేషనల్ అసోసియేషన్ అధ్యక్షుడే 1937 ఫిబ్రవరిలో "కార్మికుల జీతాలు పూర్తిగా అధ్వాన్నంగా" ఉన్నాయన్నాడు ఇకగని కార్మికులు ఏటానగటున తీసేబొగ్గు - గనుల్లోను పైనా కలిపి- 131 టన్నులు; జపానులో 207 టన్నులు; బ్రిటనులో 208 టన్నులు; అమెరికాలో 671 టన్నులు.

తోటలలో పనిచేసేవారి స్థితి అధమాధమంగాఉంది. "అస్సాంలోయ తేయాకు తోటల్లో (అస్సాం బెంగాలు కలిపి భారతదేశపు తేయాకులో ఎక్కువభాగం పండిస్తాయి) సగటునెలజీతం, ఆ తోటల్లోనే నివసిస్తున్న మగకార్మికులకు రూ 7-13-0, ఆడవాళ్ళకు రూ. 5-14-0, పిల్లలకు రూ 4-4-0 దావాపు" (శివరావు, "భారత దేశంలో పరిశ్రమకార్మికులు" 1939 పుట 128.) ఇక మిగతా ఉచిత "గృహవసతి", వైద్యసౌకర్యాలు కేవలం బానిసపరిస్థితినే నొక్కిచెబుతాయి. సుర్మావాలీలో జీతం మరీతక్కువ. రీగేకమిటీప్రకారం అస్సాం లోయలోకన్నా సుర్మాలోయలో రూ. 2 తక్కువ. దక్షిణఇండియా తోటలలో రోజుకు మగవారికి — 5 అణాలు, ఆడవాళ్ళకు 3 అణాలు ఇస్తారు.

ఈ దోపిడీమీద గుంజిన విపరీతమైన లాభాలసంగతి లోకవిదితం. ప్రధమ యుద్ధానంతరం ఇది ఆకాశానికి తగిలింది ఇండియాలోని దండీ జూట్ ట్రేడ్ యూనియన్ల ప్రతినిధివర్గం 1925 లో జనపనార పరిశ్రమనుగూర్చి ఇలా నివేదికలో వ్రాసింది.

"రిజర్వునిధి లాభాలుకలిపితే. పదేళ్ళలో (1915-1924) వాటాదారులకు వచ్చినలాభం 30 కోట్ల పౌన్ల బంగారునాణాలు లేక పెట్టుబడిలో ఏటా నూటికి 90 వచ్చింది. ఈ పరిశ్రమలో 3 00,000 నుండి 3 27,000 వరకు కార్మికులు సగటు సంవత్సరానికి 12 పౌ. 10షి. జీతం చొప్పున పని చేస్తున్నారు. మూడులక్షల కార్మికులనుండి పదేళ్ళలో ముప్పైకోట్ల పౌనులు ఆదాయం వచ్చిందంటే ఒకొక కార్మికునివల్ల వెయ్యిపౌనులు వచ్చాయన్నమాట. అంటే ప్రతిఏటా ఒకొక కార్మికునినుండి పౌ 100 లాగారన్నమాట. ఇకవారి సగటుజీతం ఏటా 12 పౌ. 10 షిల్లింగులు కాబట్టి జీతాల బిల్లుకన్నా ఏటా ఆదాయం ఎనిమిదిరెట్లెక్కువ."

(టి. జాన్‌స్టన్-జె యఫ్. సైమ్, "ఇండియాలో దోపిడీపుట 5-6.)

బట్టలపరిశ్రమగూర్చి టారిఫ్‌బోర్డు విచారణకమిటీ 1927 లో ఇలావ్రాసింది

"1920 సంవత్సరం బొంబాయిమిల్లుల ఆదాయ వ్యయపట్టికను పరిశీలిస్తే, 42 మిల్లులుగల 35 కంపెనీలు నూటికి 40 కి పైగా డివిడెండ్లు

ఇచ్చారు. అందులో 14 మిల్లులుగల 10 కంపెనీలు నూటికి నూరు డివిడెంట్లు, రెండుమిల్లులు నూటికి ఇన్నూరు పంచాయి. 1921 లో 47 మిల్లులుగల 41 కంపెనీలున్నవి. అందులో 9 కంపెనీలు (11 మిల్లులు) నూటికి నూరు పైగా డివిడెండ్లు పంచాయి."

(ఇండియన్ టారిఫ్ బోర్డు నివేదిక, బట్టలపరిశ్రమ విచారణ, 1927, సంపుటి 1 పుట 83 )

కొన్నిమిల్లులు నూటికి 365 లాభాలు పంచడంకూడ జరిగింది. 1927 నాగపూరులో ఎంప్రెస్‌మిల్లుల సువర్ణోత్సవం సందర్భంలో వేసిన పుస్తకం ఇలా గొప్పచెప్పుతుంది.

"మొదటిఇరవైనక్క సంవత్సరాలు డివిడెండులు సగటున నూటికి16 వంతులు పంచాము. ప్రపంచయుద్ధం తర్వాత ఆర్థికోన్నత దశకుముందు సగటున నూటికి 23 వంతులు పంచాము. ఆర్థికోన్నత దశలో సగటున 100 కి 90 వంతులు డివిడెండుకు తగినంతలాభాలు వచ్చాయి. ఎంప్రెస్ మిల్లులు నూటికినూరు లాభం పంచగలగాలని తాతాగారిఅభిలాష ఈఅభిలాష తాతా మరణానికి ముందు గాకున్నా, తర్వాతనైనా తీర్చగలగడంవల్ల, ఈపరిశ్రమ స్థాపకుని ఆశయమెలా పరిపూర్తిచేసిందో తెలుస్తుంది 1919 లో ప్రతి రూ. 500 సామాన్యవాటాకు రూ 350 లాభంపంచాము; 1922 లో ఇబ్బందులెన్నోఉన్నా రూ. 525 పంచాము. 1923 లో బట్టలపరిశ్రమలో మాంద్యం, సమ్మెలు మొదలైనవన్నీ పంచిన లాభాలు ప్రతిసామాన్య షేరుకూ రూ. 280- వరకున్నవి.

"అసలు వాటాదార్లకు బోనస్ వాటాలిచ్చాం. ఆ బోనస్ వాటాలకూ అదే లాభంఇచ్చాం. కాబట్టి 1920 లో వారి ఆదాయం నూటికి 488 అని లెక్కించవచ్చును....

"మొత్తంమీద ఎంప్రెస్‌మిల్లుల లాభాలు 1926 జూన్ 30 వరకు, రూ. 9,22,14,527 - అంటే ఇదిఅసలు సామాన్యవాటాల పెట్టుబడికన్నా 61.47 అంతలెక్కువ; అదేతేదీవరకు ఈ కంపెనీ సామాన్యవాటాలపై లాభాన్ని రూ. 5,84 31,267 పంచింది. అంటే అసలు పెట్టినపెట్టుబడి నూరైతే దానిపై ఏటా 80.86 ఇచ్చామన్నమాట.... అసలు మొదటి వాటాదారు తొలుత రూ. 500 వాటాకొన్నాడు గనుక, అతనికి 2.05 వాటాలు బోనస్‌గా దొరికాయి — వీనివెల రూ. 7,838. ఇప్పటి మార్కెట్ ధరను బట్టి - వీనితో అతను డివిడెండ్లరూపంలో రూ. 19,810 సంపాదించాడు."

("ది ఎంప్రెస్‌మిల్స్, నాగపూర్, గోల్డెన్‌జూబిలీ,1877–1927,పు. 90-93.)

ఈలాభాల స్వర్ణమందిరం చిరకాలం కొనసాగలేక పోయింది. అయినా ఆర్థిక సంక్షోభకాలంవరకు పెద్దమొత్తాలే సంపాదించారు. ఇలా 1928, 1929, 1930 వరకు పైనుదహరించిన ఎంప్రెస్‌మిల్లులు నూటికి 28, 26, 24 వంతులు

డివిడెండులు పంచారు. జనపపరిశ్రమల్లో, ప్రధానమైన గౌరీపూర్ మిల్లు (1918 లో 250% డివిడెండిచ్చిన కంపెనీ) 1927 లో 100%, 1928 లో 60%, 1929 లో నూటికి 50 వంతులు యిస్తున్నది. బొగ్గుగనుల్లో, నాలుగు ప్రధానకంపెనీలు 1929 లో 70, 55, 36; 30 వంతులు లాభాలు తీస్తున్నవి తేయాకు పరిశ్రమలో 98 కంపెనీలు (ఇండియాలో రిజిస్టరైనవి) 1928 లో సగటున నూటికి 23 వంతులు, 1929 లో 20 వంతులు 74 కంపెనీలు డివిడెండులు పంచాయి.

ఆర్థికమాంద్యం, సంక్షోభం భారతపరిశ్రమలకు బాగాతగిలింది. ముఖ్యంగా బట్టలపరిశ్రమలో, లాభాలు బాగాపంచుకోవాలని, ఎక్కువ పనిచేయించడం, జీతాల కోతలు కఠోరంగా అమలుపరిచారు. పత్తిమిల్లులలో పత్తిఉపయోగం 1922 - 23 లో 47 లక్షల cwt ల నుండి 1934 - 35 లో 109 లక్షలకు పెరిగినప్పటికి కార్మికులసంఖ్య 3,56,000 నుండి 4 14,000 మాత్రమే పెరిగింది - అంటే పత్తిఉపయోగం నూటికి 60 వంతులు పెరిగితే, కార్మికులు నూటికి 16 గురే పెరిగారు జనప పరిశ్రమలో, మిల్లుపని 1922 - 23 లో 47 లక్షల బేళ్ళనుండి 1935 - 36 కు 60 లక్షలకు పెరిగింది — అంటే నూటికి 28 వంతులు పెరిగింది. మరి కార్మికులసంఖ్య 3 21,000 నుండి 2 78 000 కు అసలు తగ్గింది - అంటే నూటికి 13 వంతులు తగ్గింపు. రైల్వేలలో 1929 - 30 లో 8,17,000 నుండి 1936 - 37 నాటికి 7,10,060 కు కార్మికులసంఖ్య తగ్గింది. బొగ్గుగనుల్లో ఉత్పత్తి 1921 లో 193 లక్షలటన్నులనుండి 1935 లో 230 లక్షలటన్నులకు పెరిగింది కాని, కార్మికులసంఖ్యేమో 2 05,000నుండి 1,79,000కు తగ్గిపోయింది.

1914 - 18 తర్వాతి అధికలాభాలు కాకున్నా, యుద్ధపూర్వం స్థాయికి తీసిపోని లాభాలు దోపిడీవిధాన మెంతతీవ్రంగా ఉందో తెలుపుతున్నాయి. రిలయన్సు జూట్ కంపెనీ 1935 లో 50%, 1936 లో 42½% 1937 లో 30% డివిడెండులు పంచింది. మూర్ మిల్సు కంపెనీ. 1935 లో 35%, 1936లో 27½% 1937 లో 22½% డివిడెండ్లు పంచింది. తేయాకులో న్యూడూవార్సు టీ కంపెనీ 1935 - 36 లో కూడ నూటికి 50 వంతులు పంచింది; ఈస్టు హోప్ ఎస్టేట్సు కంపెనీ, 1935 లో 23%, 1936 లో 33%, 1937 లో 40% వంతులు పంచింది; నాగైసుకీ టీ కంపెనీ 1935 లో 60%, 1936 లో 50% వంతులు పంచింది. ఇక యుద్ధసమయంలో లాభాలపెరుగుదల విపరీతంగాపెరిగింది. (చూడు అధ్యాయం6.)

1914-18 యుద్ధంనాటినుండి ముప్పైయేళ్ళు సంపాదించిన కోట్లకొలది అపరిమిత లాభాల్లో ఏకొద్దిభాగమైనా, కార్మికులిప్పుడున్న ఘోరమైన గృహపరిస్థితి తొలగించి, అతి ప్రాథమికమైన సాంఘికరక్షణ, పరిశుభ్రత ఏర్పరచి ఉండవచ్చును ఇందుకు వీలుకలిగించే పనులు చేయవలసిన బాధ్యతను భారతదేశంలో నేడున్న ప్రభుత్వం గుర్తించనేలేదు. ఏ ప్రధానదేశంలోనూ, ఇండియాలోలాగా పన్నులభారమంతా నిరుపేదలపై మోపి షావుకార్లను చిన్నపన్నులతో పోనివ్వడం జరగదు రైతులేమో భూమిపన్నుకట్టాలి. మరి భూస్వాముల ఆదాయంపై

పన్నులేదు. కార్మికులు భరించవలసి పరోక్షపన్నులు కట్టాలి, మరి ధనికుల ఆదాయ
ప్పన్ను చాలతక్కువరేటులో ఉండి ప్రత్యక్షపుపన్నులకన్నా పరోక్షపుపన్నుభారం
ఏటా ఎనిమిదింతలు ఎక్కువవుందని, భారత ప్రభుత్వ ఆర్థికసభ్యుడు సర్ జేమ్సు
గ్రిగ్గు 1938 ఏప్రెల్‌లో చెప్పాడు. ఆయన మాటలప్రకారమే, 1936-37 లో
మొత్తం ఆదాయప్పన్ను 115 లక్షలపౌనులు - అంటే మొత్తం పన్నులో నాలుగో
వంతుంటుంది ఈ మొత్తం జాతీయాదాయంలో నూటికి 1 వంతుమాత్రమే.
మరి ఇదే బ్రిటన్‌లో ఆదాయపన్ను, అధికాదాయపన్ను, మరణసుంకాలు కలిపితే
జాతీయాదాయంలో 11 వంతులుంటుంది

ఇలాగే భారతదేశంలో కార్మిక, సామాజికశాసనాలు చాల వెనకబడిఉన్నవి;
మరి కాగితంమీద కనిపించేంతకన్నా యథార్థపరిస్థితి మరింత హీనంగాఉంది.
భారతదేశంలో కర్మాగారాలు పెరగడంచూచి గాభరాపడిన లాంక్‌షైర్ వర్తకుల
ప్రోద్బలంమీద ముఖ్యంగా 1881 లో కర్మాగారచట్టంలాంటివి అమలుకువచ్చాయి.
కొన్నిపదుల ఏండ్లవరకు ఇది కేవలం నామమాత్రంగా ఉండిపోయింది. అందు
లోని పరిమితసౌకర్యాలుకూడ, ఆచట్టం అమలుపరచేందు కేమి ఏర్పాట్లులేవుగనక
అమలుకే రాలేదు

"1905 ప్రారంభంలో భారతదేశంలో కర్మాగారాల పర్యవేక్షణ
పద్ధతే చాలవరకు పోయింది. ఫ్యాక్టరీలచట్టం ఉందిగాని అది అమలు
జరగలేదు...... బొంబాయిలో 79 పత్తిమిల్లులు, దినమూ సగటున
1,14,000 కార్మికులతో పనిచేయించేవి ఉన్నవి; ఈ ఫ్యాక్టరీలను చూడా
లన్న అధికారికి మరింకెన్నో పనులున్నాయి. 'చీఫ్ ఇన్‌స్పెక్టర్' అసిస్టెంట్
కలెక్టర్ - సామాన్యంగా అతనొక యువకుడైన సివిల్ సర్వెంటుగా
ఉంటాడు. 1905 లో ఈ ఉద్యోగంలో ఆరుమందిఉన్నారు - వారందరూ
ఒకపెద్దపనిగా వారు భావించడంలేదు. అందుకే ఉన్న ఇన్‌స్పెక్టరూ,
పత్తి ఎక్సైజ్ చట్టంక్రింద ఉత్పత్తి ఎంతయిందో చూసుకోవడమే ఇతనికి
సరిపోతుంది. ప్రభుత్వం తనకురావలసింది జాగర్తగా చూచుకుంటుంది
కాబట్టి ఇతనీపనే ఎక్కువచూస్తాడు....ఇలాంటి పరిస్థితులలో ఫ్యాక్టరీచట్టం
సక్రమంగా వదిలివేయబడడం సహజమే, కలకత్తాలో ఫ్యాక్టరీవిచారణ లేక
పోవడం, దానివల్ల కలిగిన దుష్ఫలితాలు చాల కనిపిస్తాయి. ఒక కలకత్తా
మిల్లు యజమాని, రెండోఫ్యాక్టరీ లేబర్‌కమిషన్ ముందు, నిర్భాగ
మాటంగా, తానెన్నడూ ఫాక్టరీచట్టాన్ని గమనించుకోనేలేదని చెప్పాడు.
దాదాపు 400 మందిపిల్లలతో పనిచేయించే మరొకమిల్లు యజమాని,
ఇంకొకచోట ఆ విచారణ కమిటీలో మాట్లాడుతూ, పిల్లలతో పనిచేయించ
రాదనే ఫ్యాక్టరీచట్టం అనేదాన్ని తాను వినవేలేదని పట్టుబట్టాడు."

(లోవట్ ఫ్రాజర్, "కర్జన్ క్రింద తర్వాత ఇండియా" పుట, 330-31.)

సాలుసరి ఫ్యాక్టరీల రిపోర్టు కలెక్టర్ పేరనే వస్తుంది. 1924 లో కూడ బొంబాయి కలెక్టర్ ఆ యేడు నివేదికలో (అనివేదిక "ప్రతి ఫ్యాక్టరీలోను క్రమ రాహిత్యం" ఉందని వ్రాసింది) అధికార దృక్పథమంటూ ఉపోద్ఘాతంలో ఇలా వ్రాశాడు :

"ఫ్యాక్టరీచట్టాన్ని బిగించడం ఇతర నిబంధనలు చాలనంకుచితంగా ఉన్నవని పరిశ్రమలను నిరోధిస్తున్నవని నా అభిప్రాయం. ప్రత్యేక కార్యాల్లో సెలవుదినాల్లోను పనిగంటల తర్వాతా పనిచేయ వీలులేకపోవడం యజమానులకు కార్మికులకు కూడ కష్టం.ఆలాంటిచోట్ల కార్మికులు పనిచేయు డానికి ఇష్టపడుతూ బాధగా భావించరు. పైగంటల పనికి జీతమూవస్తుంది కాబట్టి సకారణమైన మినహాయింపులను సిఫారసుచేయడమే ఈశాఖ విధా నంగా పెట్టుకుంది."

బొంబాయిరాష్ట్ర ఫ్యాక్టరీల సాలుసరి నివేదిక,1924 : ఉపోద్ఘాత —బొంబాయి కలెక్టర్.)

( నేడు అమలులోఉన్న 1934 ఫ్యాక్టరీచట్టప్రకారం : శాశ్వత కర్మాగారాల్లో రోజు పదిగంటలపని, యాభైనాలు గంటలవారం ఏర్పరిచింది; కొంతకాలమే (ఆరునెలలు) పనిచేసే ఫ్యాక్టరీలలో 11 గంటలపని, 64 గంటలవారం (ఆడవారికి దినం 10 గంటలపని); వరుసగా 13 గంటలలో పనిపూర్తిచేయించాలి; ఎక్కువ కాలం పనిచేసేందుకు ఏర్పాట్లుంటాయి రాత్రులు ఆడవాళ్ళపని నిషేధింపబడింది; పన్నెండేళ్ళకు లోబడిన పిల్లవాళ్ళతో పనిచేయించరాదు. 12 - 15 ఏళ్ళ మధ్య వారితో పగలు 5 గంటలమాత్రం పనిచేయించవచ్చును. వీరితో $7\frac{1}{2}$ గంటలలో ఆ పని పూర్తిచేయించాలి. ఈచట్టం కేవలం 25 లక్షలమంది కార్మికులకు మాత్రమే అనువర్తిస్తుంది (1944)

1935 గనులచట్టం ప్రకారం గనులపైన 10 గంటలు, లోపల 9 గంటలు మొత్తం 12 గంటలలో పనిచేయించాలి: 15 ఏళ్ళకు లోబడిన పిల్లవాళ్ళతో పని చేయించరాదు. ఈచట్టం $2\frac{1}{2}$ లక్షల కార్మికులకు మట్టుకే అనువర్తిస్తుంది. 1937లో గనుల్లో ఆడవాళ్ళపని నిషేధించారు. కాని 1943 లో యుద్ధంముగిసేవరకు ఈ నిషేధం తొలిగించారు

రైల్వేలో వారానికిపని గంటలు 60 గా నిర్ణయించారు.

రేవుపనివారికి 1931 ఇండియన్ పోర్ట్సుచట్టం కొన్ని రక్షణలిచ్చింది. 12 ఏళ్ళకు లోబడిన వారిపని నిషేధించింది.

1934 వర్కుమెన్స్ కంపెన్సేషన్ ఆక్టు (కార్మికుల పరిహారచట్టం) 60 లక్షల కార్మికులకు వర్తిస్తుంది: కాని పనినుండి తొలగిస్తారనే భయంతో, ఇందులోని అవకాశాలను కార్మికులు ఉపయోగించుకోవడం చాలతక్కువ,

1936 జీతాల బట్వాడా శాసనప్రకారం. జీతాలునెల కొకసారి యివ్వా లన్నారు. (వారం, 15 రోజులు నిరాకరించారు). ఈబట్వాడానెలదాటిన వారం

లోగా జరగాలి. జరిమానాలను, నిరంకుశమైన కోతలను ఈ చట్టం పరిమితం చేస్తున్నది.

పైవన్నీచూస్తే, భారతదేశంలో కార్మికశాసనాలెంత పరిమితమైనవో కనిపిస్తుంది.

> "ఫ్యాక్టరీలకు, గనులు, తోటలు, డాకులు, రైల్వేలు, హార్బర్లు వగైరాలన్నింటికీ చెందిన కార్మికశాసనాలన్నింటిని గణించినా, వెలుపల నున్న 70 లేక 80 లక్షల కార్మికులైనా దీనిరక్షణక్రిందికి వస్తారా అనేది అనుమానమే వీరుకాక మిగిలినవారే పరిశ్రమల కార్మికులలో అధిక సంఖ్యాకులు. వీరందరూ చిన్న పరిశ్రమల్లో పనిచేస్తున్నారు"
> (శివరావు, "ఇండియాలో కార్మికుడు" 1939, పు 210.)

1944 లో విశాలపరచిన ప్రధాన కార్మికశాసనం కేవలం 25 22,753 కార్మికులకే అనువర్తిస్తుంది - ఈ సంఖ్య భారతకార్మికవర్గంలో అత్యల్పసంఖ్య. ఇవికూడ అమలుజరిపే వ్యవస్థ సరిగాలేక ప్రయోజనం కుంటుపడుతున్నది. 1944 లో ఫ్యాక్టరీచట్టంక్రింద రిజిష్టరయిన 14,071 ఫ్యాక్టరీలలో కేవలం 11,713 లేక నూటికి 83.2 మాత్రమే అధికారులు పరిశీలించారు. ఆసంవత్సరం 2,358 ఫ్యాక్టరీలను అసలే చూడలేదు; చూచిన వానిలో ఎక్కువభాగం ఒకతూరి మాత్రమే. ఇందువల్ల ఈ చట్టాలెంతవరకు పనిచేస్తున్నాయో ఊహించవచ్చును. ఈ చట్ట ప్రకారం 1,775 కేసుల్లో శిక్షచెప్పారు. అందులోకూడ వేసిన జరిమానాలు చాల తక్కువగనుక చట్టం ఉల్లంఘించడానికి ప్రోత్సాహం ఇచ్చినట్టవుతున్నది. సంయుక్తపరగణాల నివేదిక (మరికొన్నిరాష్ట్రాలుకూడ) తమదృక్పథాన్నిలా వెల్లడించింది: "అలాంటి పన్నులువేయడం, నేరస్థులు తమధోరణి మార్చుకొనేందుకు ప్రోత్సహించవు. ఎందుకంటే ఇవ్వవలసిన జరిమానాకంటే చట్టాన్ని ధిక్కరించడం ఎక్కువ లాభకారి." (ఇండియన్ లేబర్ గజెట్, సెప్టెంబర్, 1946 పు75)

భారతసంస్థానాలలోని పరిశ్రమలు పూర్తిగా ఈ ఫ్యాక్టరీ చట్టానికి చెందినవి కావు.

ఇక్కడపరిశ్రమలల్లో ఎక్కువభాగం సంఘటితం కాలేదు. వీనిలో మరీ పసిపాపలు పనిచెయ్యడంకూడ చాల ఎక్కువ; గంటలకు పరిమితిలేదు; ఆరోగ్యానికి అతి ప్రాథమిక కార్యాలుకూడలేవు. పూర్వం ఉదహరించిన 1889 నాటి మదరాసు నివేదిక, ఈ చిన్నపరిశ్రమల్లో పసిపిల్లతో పనిచేయించడం ఎక్కువగా ఉన్నదనివ్రాసింది. తోళ్ళఫ్యాక్టరీలు (టానరీస్), కంబళ్ళ ఫ్యాక్టరీలు, సిగరెట్టు ఫ్యాక్టరీలలో పరిస్థితులు వర్ణింపనలవికాదు. సిగరట్టుఫ్యాక్టరీలలో సామాన్యంగా అయిదారేళ్ళ వయసులో బాలబాలికలు పనిమొదలు పెడతారు. దినమూ 10 నుండి 12 గంటలవరకు పనిచేస్తారు; వారాంతం సెలవురోజుఉండదు; ఈ పిల్లవాళ్ళు పన్నెండుగంటలు పనిచేస్తే రోజుకూలి రెండణాలుమాత్రమే.

ఆధునిక అర్థంలో సాంఘికశాసనాలు మొత్తం లేవు. ఆరోగ్యభీమా లేదు, వైద్యసౌకర్యంలేదు, జబ్బుపడితే సాయంలేదు, ముసలితనానికి పెన్షన్‌లేదు, నిరుద్యోగానికి సాయంలేదు, సామాన్య విద్యాపద్ధతి ఏదీలేదు ప్రజారోగ్యానికి అతి ప్రాథమికావసరాలైన వీథులు ఊడ్చడం, నీటిసరఫరా, దీపాలు, చెత్తతీసివేయడం మొదలైన పనులు కార్మికనివాస ప్రాంతాలలో పూర్తిగా ఉపేక్షిస్తున్నారు. మరి ధనికులున్న ప్రాంతాలలో యూరపియన్లు ఉన్నత భారతీయ వర్గాలు ఉన్నచోట్ల వీనికి చాల ప్రాముఖ్యమిస్తున్నారు. పన్నులన్నీ అక్కడే ఖర్చుపెడతారు. ఇక కుళ్ళిపోతున్న కార్మికప్రాంతాలు రోగాలకు అంటరానితనానికి నిలయమవుతూన్న యజమానులకు ఏటా వాటిపై నూటికి 30 నుండి 40 వరకు ఆదాయం వస్తూనే ఉంది. వీనిని ఉద్యోగులు పూర్తిగా వదిలివేశారు ప్రత్యేకవ్యక్తులు ట్రస్టుల క్రింద ఉన్న కార్మికనివాసాలవద్ద వీధులూడ్చేందుకు ఏర్పాట్లులేవు: ఇళ్ళవరుసలకు మధ్యనున్న సన్నసందులు నానాకసుమాలంతో నిండిఉంటాయి. జవహర్లాల్, అలహాబాదుకు తాను మేయరుగా ఉన్నప్పటి సంగతిని ఇలా వ్రాశాడు:

> "చాలవరకు భారతదేశపు పట్టణాలను రెండుగా విభజించవచ్చు: జనం క్రిక్కిరిసిఉన్న అసలుపట్టణం ఒకటి; పెద్దఆవరణతో లేక తోటలో ఉన్న బంగాళాలు, ఇళ్ళూ ఉన్నప్రాంతం మరొకటి. ఈరెండోభాగాన్ని ఇంగ్లీషు వారు సామాన్యంగా 'సివిల్ లైన్సు' అంటారు. ఇందులోనే ఇంగ్లీషు ఉద్యోగులూ, వ్యాపారస్తులూ, వారితోపాటు మధ్యతరగతుల్లోని ఉన్నత భారతీయులు, ఉద్యోగస్తులు, డాక్టర్లు, లాయర్లు వగైరా నివసిస్తారు. అసలు పట్టణంనుండి మునిసిపాలిటీకివచ్చే ఆదాయమే, 'సివిల్ లైన్సు' ఆదాయంకన్నా ఎక్కువ. కాని పట్టణంమీదకన్నా సివిల్ లైన్సుమీదనే ఎక్కువ ఖర్చుపెడతారు. ఎక్కువ విశాలభూమిలో సివిల్ లైన్సు ఉంటాయి గనుక, ఎక్కువ రోడ్లుండాలి, ఎక్కువ మరమ్మతు చెయ్యాలి, ఊడ్వాలి, నీళ్ళు చల్లాలి, దీపాలు వెలిగించాలి; మురుగుకాల్వలు, నీటిసరఫరా, పారిశుద్ధ్యవసతి ఎక్కువగా ఉండాలి పట్టణ భాగాన్నెప్పుడూ దాదాపు ఉపేక్షించివేస్తారు; అందులో మంచిబాటలు చాలతక్కువ. చిన్నసందుల్లో దీపాలుండవు, మురుగుకాల్వలు సరిగాఉండవు, పారిశుద్ధ్యం పాటించరు."
>
> (జవహర్లాల్ నెహ్రూ, "ఆత్మకథ," పుట. 143)

ఊరిని బాగుపరచవీలు కల్గించేందుకు, భూమివెలమీద పన్నులు వేయాలనినెహ్రూ ప్రయత్నించాడు వెంటనే జిల్లాకలెక్టరు అడ్డువచ్చాడు. అలాంటి ప్రతిపాదనచట్టాలకు, భూమిపన్నువిధాన పరిస్థితులకు విరుద్ధమన్నాడు. అలాంటిపన్నువేసి ఉంటే ఎక్కువపన్ను సివిల్ లైన్సులోని బంగళాల యజమానులపై పడేది.

ఇలా "సభ్యతగల" బ్రిటిష్ రాజ్యం నాగరిక రక్షణ క్రింద మురికి గుంటలు, కార్మికుల అపరిమిత దోపిడీ! బానిసత్వమూ, కచ్చుకు కాపాడబడుతున్నవి, జాగ్రత్తగా

రక్షణలు ఏర్పరచి పారిశుధ్య వంతములైన ప్రాసాదాలలో కూర్చుని యూరోపియన్ ప్రభువులు ఈ దుర్గంధ దురవస్థా సామ్రాజ్యాన్ని ఏలుతున్నారు.

> "హౌరాలోను, కలకత్తా ఉత్తర పరిసరాల్లోను ఉన్న కార్మిక నివాసాలలోని దుర్గంధానికి, కశ్మలానికీ, చెత్తకూ పోలికింకెక్కడా ఉండదు.... జనపనార మిల్లులలోని అత్యధిక సంఖ్యాకులైన కార్మికులు ప్రత్యేక వ్యక్తుల బస్తీలలో (కార్మిక నివాసాలు) విధిలేక ఉండవలసి వస్తున్నది. బెంగాలు మునిసిపాలిటీల చట్టాన్నిబట్టి ఆ బస్తీలను బాగుపరచేపని, అందలి పేదవారినుండి డబ్బెక్కువలాగే యజమానులపైన ఉన్నది. కాని ఈ చట్టం అనువర్తించకుండా పెట్టుబడిదారులు చూసుకుంటారు. ఈ బస్తీలస్థితి వివర్ణించడం సాధ్యంకాదు. రోగాల మురికికుప్పలైన వీనిలో కిటికీలుండవు; పొగ గొట్టాలుగాని పొయ్యిలుగాని (పొయ్యిలు) ఉండవు; తల వాకిండ్లు ఎంత తక్కువంటే. లోనికిపోవాలంటే మోకాళ్ళ మీదికి వంగిపోవాలి. దీపాలుగాని, కొళాయిలుగాని, ఉండవు. పారిశుధ్యం ఉండదనేది సరేసరి. ఈ బస్తీలలోకి పోవాలంటే సామాన్యంగా ఓ సన్నటి మురికి దారిగుండా పోవాలి, సంవత్సరం పొడుగునా, ముఖ్యంగా వానాకాలంలో ఈగలూ దోమలూ కుప్పలుకుప్పలుగా ఇందులో సృష్టిఅవుతుంటాయి....
>
> "బెంగాలులోని పెద్ద మునిసిపాలిటీలలో రెండోదయిన హౌరాలోని కొన్ని ప్రాంతాల పరిస్థితి ఇంతకన్నా ఘోరంగాఉంది. భూమి వెలమరీ ఎక్కువ గనక దొరికిన ప్రతి అంగుళమూ ఇల్లు కట్టారు. ఈ బస్తీలలోని సందులు మూడడుగులకన్నా వెడల్పుండవు. ఇతర మిల్లు ప్రాంతాలలో లాగే ఆ సందులగుండానే మూతలేని మురుగు కాల్వలుంటాయి
>
> (శివరావు, "ఇండియాలో కార్మికుడు", పు, 113-14)

యూరోపియన్లు నడిపే కంపెనీలు అసలు పెట్టుబడికన్నా మించిపోయిన లాభాలు, నూటికి కొన్నివందల డివిడెండ్లూ ఎవరినుండి లాగుతున్నారో. ఆ జనపనార కార్మికుల పరిస్థితి ఇది.

ఇదీ కార్మికోద్యమానికి పూర్వరంగం. ఈపరిస్థితులలో జీవిస్తున్న లక్షల కొలదిమందికి, సోషలిజం, ట్రేడ్‌యూనియనిజం తొలిసారిగా ఆశాకిరణాన్ని, విశ్వాసాన్నికొనివచ్చాయి. సంఘశక్తిని గ్రహింపజేశాయి. ఆ కార్మికుల నరక యాతనను నిర్మూలించే ఆదర్శాన్ని మొదటిసారి దర్శింపజేశాయి.

## 3. కార్మికోద్యమ స్థాపన

భారతదేశంలో కార్మికోద్యమం ప్రారంభమై యాభై ఏళ్ళయింది; కాని ఒక సంఘటిత ఉద్యమంగా దాని చరిత్ర మొదటి ప్రపంచయుద్ధ సమాప్తినుండే ఆరంభమయింది.

1870 లో కర్మాగారపరిస్థితులు ఏర్పడ్డంతోనే సమ్మెలు జరగడం తప్పని సరి - ఆ సమ్మెలు మొదట ప్రాథమికమైన, అసంఘటిత పద్ధతుల్లో జరగవచ్చు జీతాలరేటునుగూర్చి 1877 లో నాగపూరు ఎంప్రెస్ మిల్లులో సమ్మెజరిగింది. 1882 - 1890 ల మధ్య బొంబాయి, మదరాసు రాష్ట్రాలలో ఇరవై అయిదు సమ్మెలు రికార్డు చేయబడినవి.

సాంప్రదాయ సిద్ధంగా భారత కార్మికోద్యమ చరిత్ర ప్రారంభం, 1884 లో బొంబాయి మిల్లుకార్మికుల సమావేశంతో మొదలవుతుంది. ఆ సమావేశాన్ని స్థానిక పత్రికాసంపాదకుడు యన్. యమ్ లోఖండే ఏర్పరచాడు. ఆయన కార్మికుల వాంఛలప్రణాళికను తయారుచేశాడు అందులో ఇవిఉన్నవి పని గంటలు నిర్ణయించాలి, వారానికొకరోజు విశ్రాంతి ఉండాలి మధ్యాహ్నం విడుపు ఉండాలి, దెబ్బతగిలితే పరిహారమివ్వాలి. ఈ ప్రణాళికను ఫాక్టరీకమీషన్‌కు పంపాలని తయారు చేశారు. లోఖండే తాను "బొంబాయిమిల్లు పనివారి సంఘఅధ్యక్షుడ" నన్నాడు. ఈసంఘాన్నే భారతదేశంలోని మొదటికార్మికసంఘమని సామాన్యంగా చెబుతుంటారు లోఖండే తర్వాత 'దీనబంధు' అనేపత్రికను ఆరంభించాడు.

భారతకార్మిక చరిత్రలో ప్రముఖపాత్రగల ఈ లోఖండే కార్యక్రమాన్ని భారత కార్మికోద్యమానికి ప్రారంభఘట్టంగా చిత్రించడం సరికాదు; నిజమైన కార్మిక వర్గ పోరాటం సమకూర్చడం కష్టతరంకాబట్టి. ప్రాచీనభారత కార్మికోద్యమ చరిత్రలో పదేపదే మనం దీనిని గుర్తించవలసి ఉంటుంది బొంబాయిమిల్లు పనివారి సంఘం ఏఅర్థంలోను కార్మికసంస్థకాదు; దీనికి సభ్యత్వం లేదు, నిధిలేదు. నియమావళి లేదు. "బొంబాయి మిల్లుపనివారికి నిర్మాణయుతమైన సంస్థలేదు. గత ఫాక్టరీ కమీషన్‌లో పనిచేసిన లోఖండే బొంబాయి మిల్లువారి సంఘానికి తాను అధ్యక్షుడనని చెప్పుకున్నప్పటికి, ఆసంఘం ఒక సంఘటిత సంస్థకాదు -- అందులో సభ్యత్వజాబితానిధి, నియమావళి ఏవీలేవు తనవద్దకు వచ్చిన ఏ కార్మికునకైనా స్వచ్ఛంద సలహాదారుగా ఆయన ఊరకె పనిచేస్తుంటాడని తెలుస్తున్నది" (బొంబాయిలో ఫాక్టరీచట్టం పనిపై నివేదిక, 1892, పు 15) లోఖండే కార్మికచట్టాలు. సౌకర్యాలు కల్గించాలనే భూతదయాళువు. కాని కార్మికసంస్థకు గాని, కార్మిక పోరాటానికిగాని అగ్రగామికాదు.

ప్రాచీనభారత కార్మికోద్యమ చరిత్రకోసం, 1880 తర్వాత నడిచిన సమ్మె ఉద్యమ విషయాలను ఆకాలపు రికార్డులనుండి గ్రహించి ఒకచోట చేర్చవలసి ఉన్నది. అప్పటికి ఏసంస్థా లేకపోయినప్పటికి, కార్యాచరణలో ఐక్యత పెరగడం, భారతకార్మికుల ప్రాథమికవర్గచైతన్యం 1914 యుద్ధానికి ముందేవున్నది. దానిని మనం తక్కువగా అంచనావేయడం పొరపాటు బడ్జ్‌బడ్జ్ జూట్‌మిల్లు డైరెక్టర్ నివేదిక 1895 లో ఇలా వ్రాసింది: "కార్మికులు సమ్మెచేశారు. అందువల్లమిల్లులు ఆరువారాలు మూసివేయవలసి వచ్చింది ఈసంఘటన మొదట ఆరుమాసాల్లో జరిగింది. అందుకు విచారపడుతున్నాము." 1895 లో అహమ్మదాబాదులో యజమా

నుల సంఘానికి వ్యతిరేకంగా 8000 మంది నేతపనివారు సమ్మెచేశారు (బొంబాయి ఫ్యాక్టరీ రిపోర్టు, 1895).

"1880 కీ 1908 మధ్య నిజమైన సంఘాలేవీ లేవనే దాదాపు అందరూ కమిషన్ ముందు చెప్పారు. అయినప్పటికీ ఒకొక్క మిల్లులోని కార్మికులు సామాన్యంగా ఐకమత్యంతో పనిచేయ గల్గుతున్నారు. ఒక గుంపుగా పనిచేస్తున్నారు. వారు చాలా స్వతంత్రులు అని చాలమంది చెప్పారు. 1892 లో బాయిలర్ల ఇన్‌స్పెక్టర్ ప్రణాళికలోలేనిది, కార్మికుల మధ్య ఒకపేరు లేని, లిఖితపూర్వకంకాని ఐక్యతా బంధం ఉన్న" దన్నాడు; 'ఇది కేవలం ఏదో గాలిలోనే ఉన్నా శక్తివంతమైనది' అని బొంబాయి కలెక్టరు వ్రాశాడు. అతను ప్రభుత్వానికి ఇలా వ్రాశాడు. 'చాలకాలంనుంచి కాపాడుకుంటూ వస్తున్న గుత్తజీతాలకు ఇది చాలవరకు కారణమని నా విశ్వాసం'. కార్మికులకు 'తగిన సంస్థ లేకపోయినా, వారికి పరస్పరం ఒక ఒడంబడిక ఉన్నది' అని 1908లో సర్ శాసూన్ డేవిడ్ వ్రాశాడు. తర్వాత బొంబాయి రాష్ట్ర పరిశ్రమల డైరెక్టరయిన, బరూచా అన్నదేమంటే 'కార్మికులు యజమానులకు వ్యతిరేకంగా అతిబలవత్తరంగా ఉన్నారు. వారికి ట్రేడ్‌యూనియన్ లేకున్నా కలిసి పనిచేయ గలరు' ఈ ప్రకటనలలో అతిశయోక్తి కొంత ఉన్నదనుకుంటే, వార్ధాలో బ్రిటిష్ డిప్యూటీ కమిషనర్ చెప్పిన మాటలు దానినే దృఢపరుస్తున్నవి కార్మికులే పరిస్థితిని చేతనుంచుకున్నారు; కార్మికులకన్నా యజమానులకు నిజంగా రక్షణావసరముంది."

(డి. హెచ్. బుఛానన్, "ఇండియాలో పరిశ్రమాభివృద్ధి" పు 425)

ఈ మాటలు భారత కార్మికుల వర్గ చైతన్యాంకురం చూచి అప్పుడే యజమానులు భయపడుతున్నారని సూచిస్తున్నవి.

1905—9ల మధ్య తీవ్రజాతీయతా విజృంభణతోబాటు కార్మికోద్యమంలోను పురోభివృద్ధి కనిపిస్తుంది. పని గంటలు పెంచినందుకు బొంబాయి మిల్లులలో సమ్మె. రైల్వేలో తీవ్రమైన సమ్మెలు, ముఖ్యంగా ఈస్టరన్ బెంగాల్ స్టేట్ రైల్వేలో సమ్మె. రైల్వే షాపులలో సమ్మెలు, కలకత్తా ప్రభుత్వ ముద్రణాలయంలో సమ్మె యీ యుగంలో కనిపిస్తాయి 1908లో తిలక్‌కు ఆరేండ్లశిక్ష వేసినందుకు అసమ్మతి తెలుపుతూ బొంబాయిలో ఆరునాళ్ళు సమిష్టి సమ్మె జరిగింది. ఇందుతో అత్యుచ్ఛదశకు వెళ్ళింది.

ఇప్పటికింకా ఏ స్థిరసంస్థా నిర్మాణమూ సాధ్యంకాలేదు. ఇందుకు కార్మికుల అజ్ఞానం, కార్యశూరత్వరాహిత్యం కారణంకాదు. కార్మికుల నిరుపేదతనము, విద్యావిహీనత, సౌకర్యాలు లేకపోవడం మాత్రమే కారణం. సంస్థలుపెట్టే అవకాశాలు ఇంకా ఇతరులచేతనే ఉన్నవి, 1910 లో బొంబాయిలోని జీవకారుణ్యవాదులు 'కాంగార్ హితవర్ధకసభ'ను స్థాపించారు: ఈ సభఆశయాలు ప్రభుత్వా

వికి దరఖాస్తులు పంపడం - యజమానులకు కార్మికులకుమధ్యవర్తిగవు తీర్పడ మున్నూ. సామాన్యమైన ట్రేడ్‌యూనియనిజం, 1914 కు ముందు రైల్వేలలోని ఉన్నతవర్గములకు (యూరపియన్ - ఆంగ్లోఇండియన్), ప్రభుత్వ ఉద్యోగులకు మాత్రమే సంబంధించిఉండె ; అమాల్గమేటెడ్ సొసయిటీ ఆఫ్ రైల్వేసర్వెంట్సు-రైల్వేఉద్యోగుల సంయుక్తసంఘం - 1897 లో స్థాపితమై, కంపెనీచట్టంక్రింద రిజిస్టరైనది ఇదిముఖ్యంగా స్నేహంతో సౌకర్యాలను సాధించడమే ఇది యిప్పటి వరకు ఉన్నప్పటికీ (దీనిపేరును 1928 లో నేషనల్‌యూనియన్ ఆఫ్‌రైల్వేమెన్ అనిమార్చారు) కార్మికోద్యమంలో ఏ పాత్రా నిర్వహించలేదు

ప్రథమ ప్రపంచయుద్ధంముగియడం, రష్యావిప్లవం, ప్రపంచవిప్లవ తరంగాలు వీటివల్లఏర్పడిన పరిస్థితుల్లో భారతకార్మికవర్గం కార్యాచరణకుదిగి ఆధునిక భారత కార్మికోద్యమాన్ని ప్రారంభించారు. ఈ నూతనచైతన్యానికి ఆర్థిక రాజకీయపరిస్థితులు సమానంగా తోడ్పడినవి యుద్ధకాలంలో ధరలు రెట్టింప య్యాయి; అందుకుసమానంగా జీతాలు పెరగలేదు; యజమానులు అధికలాభాలను ఊరికే పోసుకుంటున్నారు. రాజకీయరంగంలో నూతనహంభులు బయలుదేరాయి; వెంటనే స్వపరిపాలన ప్రాతిపదికపై కాంగ్రెసులీగు ఐక్యత సాధింపబడింది ; విప్లవాత్మక ప్రథమతరంగాల వలుకుబడి భారతదేశాన్ని సమీపిస్తున్నది.

1908 లో ప్రారంభమైన సమ్మెఉద్యమం, 1919—1920 లలో దేశాన్ని ఉగ్రూతలూగించి తీవ్రరూపం దాల్చింది. 1918 ఆఖరున బొంబాయి పత్తిమిల్లుల ప్రధానకేంద్రంలో మొదటి గొప్పసమ్మె, ఆ వరిశ్రమనంతటినీ ఆపగలిగింది; 1919 జనవరికంతా, అన్నిమిల్లులలో నున్నవారూ 1,25,000 కార్మికులు పనినుండి బయటికి వచ్చారు. 1919 వసంతంలో రౌలట్‌చట్టవ్యతిరేక హర్తాళు సమాన జాతీయ పోరాటంలో కార్మికులు ప్రథమశ్రేణిలో నిలుస్తారని ప్రదర్శించింది. 1919 లో దేశమంతా సమ్మెలు వ్యాపించాయి. 1919 ఆఖరున 1920 తొలి ఆరుమాసాల్లోను ఈవెల్లువ అత్యుచ్ఛదశకు వెళ్ళింది.

"ఈ యుగంలోని సమ్మెలతీవ్రత, వైశాల్యం ఈ క్రింది అంశాల వల్ల కొంత గ్రహించవచ్చును. 1919 నవంబరు 4 నుండి డిసెంబర్ 2 వరకు కాన్పూరులో ఉలెన్‌మిల్సులోని 17000 మంది కార్మికులు సమ్మె చేశారు; 1919 డిసెంబర్ 7 నుండి 1920 జనవరి 9 వరకు, జమాల్పూరు రైల్వేకార్మికులు 16,000 మంది సమ్మెకట్టారు; 1920 జనవరి 9-18 లలో కలకత్తా జనపనారమిల్లు కార్మికులు 35000 మంది సమ్మె; జనవరి 2నుండి ఫిబ్రవరి 3 వరకు బొంబాయి సర్వవ్యాప్తిసమ్మె 2,00,000 కార్మికులు; జనవరి 20 - 31 రంగూన్ మిల్లుకార్మికులు 20,000 సమ్మె; జనవరి 31న బొంబాయిలోని బ్రిటిష్ ఇండియన్ నావిగేషన్ కంపెనీ కార్మికులు 10,000 సమ్మె; జనవరి 26 నుండి ఫిబ్రవరి 16 వరకు షోలాపూరులో 16,000 మిల్లుకార్మికుల సమ్మె; ఫిబ్రవరి 2 - 16 ఇండియన్ మారియన్ డాక్

వర్కర్లు 20,000 సమ్మె; ఫిబ్రవరి 24 నుండి మార్చి 29 వరకు టాటా ఐరన్ అండ్ స్టీల్ కార్మికులు 40,000 మంది సమ్మె; మార్చి 9, బొంబాయి మిల్లుకార్మికులు 60,000 సమ్మె; మార్చి 20 - 26 మదరాసు మిల్లుపనివారు 17 000 సమ్మె; 1920 మే అహమ్మదాబాదు మిల్లుకార్మికులు 25,000 మంది సమ్మెచేశారు "

(ఆర్. కె. దాస్. "ఇండియాలో కార్మికోద్యమం" 1923 పుట 36 - 37.)

1920 మొదటి ఆరునెలల్లోను 200 సమ్మెలు. అందులో పదిహేనులక్షల కార్మికులు పాల్గొన్నారు.

ఈ పరిస్థితులలో భారతకార్మికోద్యమం పుట్టింది. ప్రధానపరిశ్రమల్లో, కేంద్రాల లోని చాల ట్రేడ్‌యూనియన్లు ఈ సమయంలోనే ఆరంభమయ్యాయి. సహజ పరిస్థితులవల్ల ఆ సంస్థలు నిరాటంకముగా సాగలేదు ఈ తీవ్రకార్యాచరణయుగమే, ఆధునిక భారతకార్మికోద్యమానికి పురిటిల్లు.

ఈ యుగంలో చాల కార్మికసంఘాలు వెలిశాయి. ఇందులో చాలమటుకు పోరాటానికోసం పుట్టిన సమ్మెకమిటీలు ఇవి శాశ్వతంగా నిలవలేవు. కార్మికులు పోరాటానికి ఆయత్తపడుతుంటే, సంస్థానిర్మాణానికి సౌకర్యాలేమో ఇతరులచేత నున్నవి. ఇందువల్లనే ప్రాచీన భారతకార్మికోద్యమంలో పరస్పరవిరుద్ధత ఏర్పడింది. సోషలిజం, కార్మికవర్గఆశయాలు, వర్గకలహం వీనిమీద ఆధారపడిన ఏ రాజకీయోద్యమమూ అప్పటికింకారాలేదు దీనిఫలితంగా "బయటివారు" లేదా ఇతరవర్గాలకు సంబంధించినవారు వివిధకారణాలవల్ల ముందుకువచ్చి సంస్థా నిర్మాణంలో సాయపడసాగారు. వీరిసాయం ఈ ప్రారంభదశలో తప్పనిసరయింది. వీరు కార్మికోద్యమం ఆశయాలు, అవసరాలు తెలిసికొనివచ్చినవారుకాదు. కాబట్టి తమతోబాటు మధ్యతరగతుల రాజకీయాలను కొనివచ్చారు. కొందరు అందులో జీవకారుణ్యదృష్టితో వచ్చారు, మరికొందరు వ్యక్తిగతప్రాముఖ్యతకోసం వచ్చారు. కొందరేమో జాతీయ రాజకీయ పోరాటంమీద అభిమానంతోవచ్చారు వీరందరూ పరదృష్టిగలవారుగనక అప్పుడు కార్మికులుచేస్తున్నది వర్గపోరాటమైనా కార్మికోద్యమాన్ని ఆ పునాదిమీద నడపలేకపోయ్యారు. ఈ దురదృష్టస్థితి కార్మికోద్యమాన్ని చాలరోజులువదలక కార్మికుల అద్భుత కార్యశూరతను తీవ్రంగా ఆటంకపరుస్తూ వచ్చింది; ఆపలుకుబడి ఇంకాఉంది.

భారత కార్మికసంఘాల ప్రారంభం, మదరాసు లేబరు యూనియన్ స్థాపన నుండే అని సామాన్యంగా చెబుతారు. దీనిని దివ్యజ్ఞానసమాజం బిసెంటమ్మ సహచరుడు బి. పి. వాడియా 1918 లో స్థాపించాడు ఇలా చెప్పడం కొంతవరకు కార్మిక సజీవచరిత్రను అపార్థంచేసుకోవడమే ఈ సమయంలో భారతదేశం అంతటా కార్మికసంఘాల స్థాపనకు ప్రథమప్రయత్నాలు జరుగుతున్నవి; అహమ్మదాబాదు పత్తిమిల్లులలోని వార్పర్లు 1917 లో యూనియన్ స్థాపిస్తున్న సూచన కనిపిస్తుంది. కార్మికసంఘాన్ని నియమబద్ధంగా సభ్యత్వమూ, రుసుమూ మొద

లైనవాటితో. ఒక పరిశ్రమ కేంద్రంలో స్థాపించే ప్రయత్నంమట్టుకు తప్పకుండా మద్రాసు లేబరుయూనియన్‌తోనే ప్రారంభమైంది. ఈ చొరవకు దాని స్థాపకులే అభినందనీయులు. కాని ఈ చొరవ ముఖ్యమైన పరిశ్రమ కేంద్రంలో రావడం (1921-33 లో మద్రాసులో సమ్మె జరిగిన రోజులు 28 లక్షలు, బెంగాలులో 2 కోట్లు, బొంబాయిలో 6 కోట్లు) చూస్తే ఇది కేవలం కాకతాళీయంగా వ్యక్తిగత కారణాలతోఏర్పడిందని పొరబడుతున్నది. ఆస్థాపనవల్ల భారతకార్మికోద్యమసామాన్య అభివృద్ధిపై ఏర్పడినపలుకుబడిని అతిశయంగా చెప్పడం సరికాదు. ఆ యూనియన్ స్థాపకుడైన బి. పి వాడియా సంకుచితదృష్టి చూపారు. ఈయన అధ్యక్షతతో 1918 ఏప్రిల్‌లో మదరాసు కార్మికులు తమ యూనియన్ను ఏర్పరుచుకొని యజమానులకు తమ కోర్కెలను తెలిపారు; సంతృప్తికరమైన సమాధానం రాక పోవడంతో సమ్మె చేయాలన్నారు. బ్రిటిష్ సామ్రాజ్యతత్వ క్షేమంమీద ఆసక్తితో ఏ సమ్మె ఆయన పనికిరాదన్నాడు. 1918 జులై 3 ఆయన ఇచ్చిన ఉపన్యాసం ఇది :

"మీరు సమ్మెచేయడంవల్ల బిన్నీకంపెనీకి నష్టమయినా నాకు లెక్కలేదు, వారు కావలసినంత సంపాదించారు; కాని సమ్మెచేయడంతో మీరు మిత్రరాజ్యక్షేమాన్ని గాయపరుస్తున్నారు. గుడ్డలు కావలసిన మన సైనికులకు ఇబ్బంది ఏర్పడుతుంది. ఈమిల్లుకుచెందిన కొందరు యూరపియన్లు, ఈప్రభుత్వం సరిగాప్రవర్తించలేదని మనరాజుగారి యుద్ధంసాగిస్తున్నవారిని ఇబ్బంది పెట్టరాదు కాబట్టి మనం సమ్మెలు చేయరాదు."

ఆయన ఏసమ్మె రాకుండా చేయగలిగాడు; కాని వాడియా "దేశభక్తి" వాదాలను వినకుండా బిన్నీకంపెనీమిల్లు మూసివేసింది (లాకౌట్) కార్మికులు సమ్మెచేయకుండా బలవంతంతో వదులుకున్నారు. వారి లాకౌటుకు సిద్ధపడి ఉండలేదు అందువల్ల తమకోర్కెలను వదులుకోవలసివచ్చింది. 1921 లో సమ్మెచేస్తూవే యజమానులు లాకౌట్ చేశారు. ప్రధానిమైనతగాదా ఇప్పుడే మదరాసులో వచ్చింది; కంపెనీ ఇంజన్‌క్షన్ తీసుకొచ్చింది; హైకోర్టు కంపెనీపై 7 000 పౌనులు జరిమానా వేసింది. దానిని అమలుజరపకుండా కంపెనీ అంగీకరించినందుకు బదులుగా వాడియా కార్మికోద్యమంతో సంబంధం వదులుకోవలసివచ్చింది. ప్రారంభ కార్మికోద్యమాన్ని అణచివేసేందుకు ఎలాటిపద్ధతు లవలంబించేవారో ఇందుతో స్పష్టమవుతున్నది.

మిగతకేంద్రాలలో అనేకరకాల సహాయకులు, ఒకొకతూరి యజమానులతో సన్నిహితసంబంధంకలవారుకూడ కార్మికసంస్థలను నడిపేందుకు ముందుకు వచ్చారు. అహ్మదాబాదులో మిల్లుయజమానులతో సన్నిహిత సాహచర్యంతో గాంధీజీ పోటీపద్ధతిలో ఒకకార్మికసంఘాన్ని వర్గశాంతిపునాదిపై ఏర్పరచాడు: ఈ సంఘం నేటికికూడ భారతకార్మికోద్యమంనుండి వేరుపడి ప్రత్యేకంగాఉంది.

ఈ యుగంలోనే 1920 లో ఇండియన్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ స్థాపితమైంది. 1920 అక్టోబరులో ప్రారంభ సమావేశం జాతీయనాయకుడు లజపతిరాయ్ అధ్యక్షతక్రింద జరిగింది. జోసెఫ్‌బాప్టిస్టా ఉపాధ్యక్షుడుగా ఉన్నాడు. తొలిసంవత్సరాలలో ఈ సంస్థ "పై"సంస్థగా నేఉంది. దీనినాయకులు చాలమందికి కార్మికోద్యమంతో సంబంధంచాలతక్కువ. జనీవాలో జరగనున్న అంతర్జాతీయ కార్మికమహాసభకు ప్రతినిధినిపంపేసంస్థ కావలసిరావడం ఈ సంస్థ స్థాపనకు ప్రధానంగా ప్రోత్సాహకరమైంది. దాని పాతనాయకులలో ఒకడైన యన్. యమ్. జోషి "ఇండియాలో కార్మికోద్యమం" అనేకరపత్రంలోని (పుట 10) వాషింగన్ కార్మికమహాసభ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌స్థాపనకు దోహదంచేసిందని వ్రాశాడు. "ఇందుమూలంగా, కార్మికసంఘాలు స్థాపించడం అవసరమని బోధపడింది. అంతేకాక, వారిసిఫారసులు ఏకగ్రీవంగా ఉండడంకోసం, కార్మికులలో ఒకవిధమైన సమానకార్యక్రమం అవసరమనికూడ తేలింది." 1924 లో జరిగిన నాల్గవ మహాసభకు స్వరాజ్యపార్టీ నాయకుడు సి ఆర్. దాసు అధ్యక్షతవహించాడు అధికారోపన్యాసాలన్నీ, ముఖ్యంగా వర్గసామరస్యసిద్ధాంతాన్ని, కార్మికుల నైతిక సాంఘికాభివృద్ధిని, వారికి సహాయంచేయాలని వెల్లడి చాయి కార్మికరక్షణ చట్టాలను; కొన్నిసౌకర్యాలను ఏర్పరచాలని కోరాయి ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ తొలిరోజులలోని మధ్యతరగతినాయకుల దృక్పధానికి ఉదాహరణగా 1926 ఆరో ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసంనుండి, ఈ క్రింది భాగాన్ని గమనించవచ్చును

> "బొంబాయి సెంట్రల్‌లేబర్‌బోర్డు ప్రారంభించిన పరిశుద్ధ సేవా సమితి కార్యక్రమాన్ని మీకు హృదయపూర్వకంగా సిఫారసుచేస్తున్నాను. ...... కార్మికుడు దురభ్యాసాలనువదలి, నిజాయితీ, శాంతి, సంతృప్తిగల జీవితంగడిపేందుకు సాయపడడమే ఈ సమితిఆశయం... సమాజసేవకులు ఆయాప్రాంతాలకువెళ్ళి త్రాగుడు, జూదం, మొదలైన చెడ్డపనులలోని లోపాలను వివరిస్తారు ఈ లాంటివిద్యే కార్మికునికి అవసరం. ఇందువల్లనే కార్మికుడు సాంఘికంగా, ఆర్థికంగా ఉత్తమమానవుడు కాగలడు."
>
> (అధ్యక్షుడు వి వి గిరి ఉపన్యాస, ఆరో ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, మదరాసు, 1926)

సమ్మెల విషయంలో తమ దృక్పధాన్ని కాన్పూరులో 1927 లో జరిగిన 8 వ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులో ప్రధాన కార్యదర్శి నివేదిక తెలపుతున్నది:

> "ఈ నివేదిక వివరిస్తున్న కాలంలో ఏ సమ్మెనూ, కార్యవర్గం అనుమతించలేదు. కాని వివిధ ప్రాంతాల్లో, వివిధ పరిశ్రమల్లో ఉన్న విషమ పరిస్థితులమూలంగా కొన్ని సమ్మెలు, లాకౌట్లు జరిగాయి. వానిపై ఈ కాంగ్రెసు నాయకులు ఆసక్తి కనబరచవలసి వచ్చింది"
>
> (ప్రధాన కార్యదర్శి, యన్. యమ్ జోషి నివేదిక, 8 వ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, మదరాసు, 1927.)

1927 వరకు ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుకు కార్మికవర్గ పోరాటంతో సంబంధం చాలా తక్కువ. అయినప్పటికీ కొత్తగా ఏర్పడిన కార్మికసంఘ నాయకుల సమావేశం కావడానికిది రంగస్థలమయింది. కాబట్టి కార్మికవర్గ పోరాటం గాలి దీనికి తగలడానికి కొంత కాలవ్యవధి మాత్రమే అవసరమయింది. 1927లో కొత్తయుగం ప్రారంభమైంది. 1927లో ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ 57 అనుబంధ సంస్థలను ఏకీభవింపజేసింది. సభ్యత్వం 1,50,555 మందికి పెరిగింది:

## 4. రాజకీయ చైతన్యం

భారత కార్మికోద్యమ నాయకత్వం తొలితరోజుల్లో నామమాత్రంగా ఉన్నప్పటికీ, తర్వాత 20 ఏళ్ళలో కార్మికోద్యమాభివృద్ధిలోని ప్రాముఖ్యాన్ని ప్రభుత్వం అల్పమని భ్రమపడలేదు. వారి ఆసక్తి ఇలా కనిపించింది: 1921 లోని కార్మికుల అశాంతివిషయమై బెంగాలు ప్రభుత్వం ఒక కమిటీని నియమించారు. 1922 లో బొంబాయి పరిశ్రమల తగాదా కమిటీని వేశారు. 1919-20 మదరాసు లేబర్ శాఖ తర్వాత బొంబాయి లేబర్‌శాఖ ఏర్పరచారు. ఆఖరున 1926 లో అమలుకు వచ్చినప్పటికి 1921 లోనే ట్రేడ్‌యూనియన్ బిల్లు తయారుచేశారు. 1921 నుండి కార్మికతగాదాలను క్రమబద్ధంగా వ్రాసిఉంచారు. ఈ పట్టిక ఉద్యమ మెలా అభివృద్ధిచెందిందో తెలుపుతుంది (ఈ పట్టిక క్రింద ఇస్తున్నాము.) ఈ మొత్తం సమ్మెరోజులలో సగానికిపైగా ప్రత్తి బట్టలమిల్లులలోను, సగానికిపైగా బొంబాయిలోను జరిగినవే.

పోరాటంలో మూడు ప్రధానయుగాలు కనిపిస్తాయి. మొదటిది యుద్ధానంతరపు వెల్లువతో ఆరంభమై 1925 నాటి బొంబాయి మిల్లుల సమ్మెతో అంతమవుతుంది. మహత్తరమైన ఈ సమ్మె విజయవంతంగా సాగింది. జీతాలకోతకు వ్యతిరేకంగా ఈ సమ్మె చేశారు. మూడునెలల పోరాటం తర్వాత ఆ కోతను ఉపసంహరించుకోవలసి వచ్చింది. రెండోయుగం 1928-29 నాటి రాజకీయ పారిశ్రామిక సంయుక్త చైతన్యఘట్టం. మూడోది 1937 లో కాంగ్రెస్ ప్రభుత్వ నిర్మాణం తర్వాత ఆరంభమై ఇప్పటికీ ఇంకా పురోగమనం సాగిస్తున్నది.

పరిశ్రమల్లో తగాదాలు

| సంవత్సరం | సమ్మెలు లాకౌట్లు | పాల్గొన్న కార్మికులు | సమ్మె రోజులు |
|---|---|---|---|
| 1921 | 396 | 600351 | 6984426 |
| 1922 | 278 | 433434 | 3972727 |
| 1923 | 213 | 301044 | 5051704 |
| 1924 | 133 | 312462 | 8730918 |
| 1925 | 134 | 270423 | 12578129 |
| 1926 | 128 | 186811 | 1097478 |

| | | | |
|---|---|---|---|
| 1927 | 129 | 131655 | 2019970 |
| 1928 | 203 | 506851 | 31647404 |
| 1929 | 141 | 532016 | 12165691 |
| 1930 | 148 | 196301 | 2261731 |
| 1931 | 166 | 203008 | 2408123 |
| 1932 | 118 | 128099 | 1922437 |
| 1933 | 146 | 164938 | 2168961 |
| 1934 | 159 | 220808 | 4774559 |
| 1935 | 145 | 114217 | 973457 |
| 1936 | 157 | 169029 | 2358062 |
| 1937 | 379 | 647801 | 8982000 |
| 1938 | 399 | 401075 | 9198708 |
| 1939 | 406 | 409189 | 4992795 |
| 1940 | 322 | 452539 | 7577281 |
| 1941 | 359 | 291054 | 3330503 |
| 1942 | 694 | 772653 | 5779965 |
| 1943 | 716 | 525088 | 2344287 |
| 1944 | 658 | 550015 | 3447306 |
| 1945 | 848 | 782192 | 3340892 |

యుద్ధానంతర యుగంలో కార్మిక పోరాటశక్తి ప్రదర్శితమైంది. ఆలాంటి శక్తి గల కార్మికవర్గ ఉద్యమాంకురం రాజకీయ చైతన్య పూరితమై, వర్గ చైతన్యముగల నాయకత్వం క్రింద సుస్థిర నిర్మాణం ఏర్పరచుకుంటే, ఇక సామ్రాజ్యవాద మూలపీఠానికంతటికీ ప్రమాదకరంగా పరిణమిస్తుందని ప్రభుత్వం చక్కగా గ్రహించింది. ఈ కాలం పొడవునా ప్రభుత్వం నియమించిన విచారణ సంఘాలు దీనిని బయటపెడుతున్నవి. ఈ ఉద్యమాన్ని "సురక్షిత" మార్గంలో - వారి నివేదికల్లో ఒకరన్నట్టు "సరియైన పద్ధతిని" కార్మికోద్యమంగా మార్చాలనేదే ప్రభుత్వ సమస్య. కాని సామ్రాజ్యవాద దేశంలోకన్నా వలస దేశంలో ఇది చాల కష్టతరమైన పని. 1926 ట్రేడ్‌యూనియన్ చట్టం రాజకీయ కార్యక్రమాలపై నిషేధం పెట్టడంలో ఈ ఉద్దేశమే ఉంది. ఇలాగే ఏవిధంగా కార్మికులలో రాజకీయ చైతన్య సూచనలు కనబడినా జాగర్తగా కనిపెడుతూ వచ్చింది.

ఇలా ఎన్ని ఇబ్బందులున్నా, ప్రారంభంలో ఎంత గందరగోళమున్నా, కార్మికుల రాజకీయచైతన్యం, సోషలిజం, కమ్యూనిజం భావాలు యుద్ధానంతర కాలములో మెల్లగా భారత దేశానికి వ్యాపించాయి: అప్పటికింకా చాల దుర్బలంగా ఉన్న భారత కమ్యూనిస్టుపార్టీ సారస్వతం 1920 నుండి వెలువడ సాగింది. 1924 లో బొంబాయినుండి 'సోషలిస్టు' అనే పత్రిక వెలువడ సాగింది. దాని

స్థాపకుడు యస్ ఏ డాంగే. ఈయన తర్వాత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ సహాయ కార్యదర్శి అయ్యాడు. ప్రభుత్వం దెబ్బ తీయడానికి వెంటనే నిశ్చయించింది 1924 లో (ఇంగ్లాండులో లేబర్ ప్రభుత్వం ఉండగా) కాన్పూరు కుట్ర కేసు పెట్టి నలుగురు కమ్యూనిస్టు నాయకులపై విచారణ జరిపారు. వీరు డాంగే, షౌకత్ ఉస్మానీ, ముజఫర్ అహమ్మద్, దాస్‌గుప్త ఈ నలుగురికీ నాలుగేండ్లు శిక్షవేసినారు. భారతదేశంలోని రాజకీయ కార్మికోద్యమానికిది ప్రథమ సంస్కారం

నిర్బంధ విధానం చైతన్య పురోగమనాన్ని అటంకపరచలేకపోయింది. 1926-27 నాటికంతా సోషలిస్టు భావాలు బాగా వ్యాపిస్తున్నవి. రాజకీయ కార్మిక వర్గపు సోషలిస్టు సంస్థల నూతన ప్రాథమికస్వరూపం, వర్కర్స్ అండ్ పెజెంట్స్ పార్టీ కార్మిక కర్షక పక్షం - లో ప్రతిఫలించింది. ఈ పార్టీ కార్మికోద్యమము లోని తీవ్రవాదులనూ, కాంగ్రెస్‌లోని అతివాద వర్గాలను సమీకరించింది మొదట కార్మిక కర్షక పక్షం బెంగాలులో 1926 ఫిబ్రవరిలో స్థాపితమైంది; తర్వాత బొంబాయి, సంయుక్త పరగణాలు, పంజాబులలో ఏర్పడింది. ఇవన్నీ 1928 లో అఖిల భారత కార్మిక కర్షక పార్టీగా మేళవించాయి. ఈ పార్టీ మొదట కాంగ్రెస్ 1928 డిసెంబరులో జరిగింది ప్రారంభంలో ఉండే ఎన్నో గందరగోళాలతో ఇంకా బాధపడుతూన్న నూతన శక్తుల అభివృద్ధిని సూచించే ఈ రాజకీయ భావ ప్రకటనతో బాటు కార్మిక చైతన్య ప్రథమ తరంగం వెల్లివిరిసింది. దీని తొలి సూచనలు 1927 లో కనిపించసాగాయి.

1927వ సంవత్సరంలో జరిగిన ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ఢిల్లీ సమావేశం లోను (సమావేశానికి బ్రిటిష్ పార్లమెంటు కమ్యూనిస్టు సభ్యుడు షాపూర్జీ సక్లత్వాలా వచ్చాడు), మరింత స్పష్టంగా తర్వాత సంవత్సరం జరిగిన కాన్పూరు సమావేశంలోను కార్మికోద్యమ నాయకత్వంలోపల తీవ్రకార్యాసక్తశక్తుల వాణి ద్యోతకమయింది ఈ నూతన కార్మిక నాయకత్వానికి భారత కార్మిక నాయకులలో అధికసంఖ్యాకుల బలమున్నదని త్వరగానే తెలిసిపోయింది. కాని అసలు వోటింగు పద్ధతి చాల ఆలస్యంగా జరిగేట్టు ఏర్పరచారు గనక, 1929 వరకు ఆఖరు మెజారిటీ గుర్తింపు జరగలేదు 1927 మే 1 వ తేదీ బొంబాయిలో తొలిసారి లేబర్ దినోత్సవం జరిపారు. అంతర్జాతీయ కార్మికోద్యమంలో చైతన్య యుతమైన భాగంగా భారత కార్మికోద్యమ నూతనయుగ ప్రారంభానికిది చిహ్న ప్రాయమయింది.

యుద్ధానంతరం అన్ని సంవత్సరాలకన్నా 1928 లో కార్మికవర్గ కార్యక్రమ ప్రవాహం మహత్తరంగా కనబడింది. ఈ అభివృద్ధికి కేంద్రం బొంబాయి. తొట్ట తొలిసారిగా, ఫ్యాక్టరీలలోని కార్మికులకు సన్నిహితమైన కార్మికవర్గ నాయకత్వం వర్గ పోరాట సూత్రాలను అనుసరిస్తూ ఆర్థిక రాజకీయ రంగంలో ఏకైకశక్తిగా పనిచేయసాగింది. కార్మికులు సంపూర్ణంగా బలపరిచారు. ఫిబ్రవరిలో సైమన్

కమిషన్ రాకకు వ్యతిరేకంగా నడిచిన రాజకీయసమ్మెలు, ప్రదర్శనలు ఆ సమయంలో కార్మికవర్గాన్ని జాతీయపోరాటంలో అగ్రగామిగా చేశాయి; కాంగ్రెస్ నాయకత్వమూ, కార్మిక సంస్కారవాద నాయకత్వమూకూడ ఈ ఏర్పాటును చీదరించుకొన్నవి దాని విజయంతో తత్తరపాటు చెందినవి. ఇందులో పాల్గొన్నందుకు బొంబాయి మునిసిపల్ కార్మికులలో చాలామందిని పనినుండి తొలగించారు: కాని ఇంకొక సమ్మెతో అధికారులు వారిని పనులలో చేర్చుకొనక తప్పలేదు.

ట్రేడ్‌యూనియన్ సంస్థ పెరిగింది. ప్రభుత్వపు లెక్కలనుబట్టి బొంబాయి ట్రేడ్‌యూనియన్ సభ్యత్వం, 1923-26 మూడేళ్ళలోను కేవలం 48,669 నుండి 59,544- కు మాత్రమే పెరిగింది; మరి 1927 లో 75,602 కు పెరిగి 1928 మార్చికి 95,321 కి ముందు కురికింది ఈసంఖ్య 1929 మార్చికి 2,00,325 కు పెరిగింది. ఈ అభివృద్ధిలో ప్రఖ్యాత గిర్నీకాంగార్ యూనియన్ (బొంబాయిమిల్లు కార్మికుల సంఘం) ప్రథమశ్రేణిలో నిలిచింది 1928 లో ప్రారంభింపబడేటప్పుడు ఇందులో 324 మాత్రమే సభ్యులున్నారు ఈ సభ్యత్వం 1928 డిసెంబరుకు 54 000 కు పెరిగింది 1929 తొలిపాదంలో 65,000 అయినట్లు ప్రభుత్వం లేబర్ గజెట్ తెలుపుతున్నది ఈ సమయంలోనే, బొంబాయి టెక్స్టైల్ లేబర్ యూనియన్ (1926 లో స్థాపితం) ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ కార్యదర్శి యన్. యమ్. జోషి సంస్కారవాద నాయకత్వంకింద స్తబ్దమైపోయింది. ఈ యూనియన్‌కు ప్రభుత్వ ప్రోత్సాహమూ, యజమానుల సాయమూ కూడా ఉన్నది. దీని సభ్యత్వం 1928 అక్టోబరులో 8,436 నుండి 1928 డిసెంబరుకు 6,749 కి పడిపోయింది. కార్మికులు దేనిని ప్రేమిస్తున్నారో స్పష్టమే. కార్మికులకు సన్నిహితంగా వుండే మిల్లు కమిటీల పద్ధతిలోనే గిర్నీకాంగార్ యూనియన్ బలం స్థిరపడింది

1928 లోని సమ్మె ఉద్యమంలో 315 లక్షల రోజులు పని నిల్చిపోయింది. ఈ సంఖ్య పూర్వం అయిదేళ్ళ మొత్తం కలిపినా అంతకన్నా ఎక్కువగా ఉంది. ఈ ఉద్యమానికి కేంద్రం బొంబాయి బట్టలమిల్లు కార్మికులలోనే అయినప్పటికి దేశమంతా వ్యాపించింది. మొత్తం 203 సమ్మెలలో బొంబాయిలో 111. బెంగాలులో 60, బీహారు. ఒరిస్సాలలో 8, మదరాసులో 7. పంజాబులో 2 జరిగాయి; ఇవే 110 బట్టల. నూలు పరిశ్రమలలోను. 19 జనపనార పరిశ్రమలలో, 11 ఇంజనీరింగు వర్కుషాపులలోను, 9 రైల్వేలు - రైల్వే వర్కుషాపులలోను, 1 బొగ్గుగనుల్లోను జరిగాయి. వీటన్నిటికీ శిఖరప్రాయమైనది బొంబాయి మిల్లు పనివారి సమ్మె - ఇది భారత చరిత్రలో మహత్తరమైన సమ్మె. 1,50,000 కార్మికులందరూ ఏకంగా ఏప్రిల్‌నుండి అక్టోబరువరకు ఆరునెలలు అన్నిరకాల ఒత్తిడిని, ప్రభుత్వ హింసా విధానాన్ని ఎదుర్కొని నిలిచారు. యంత్రాలలో ఎక్కువ పనిచేయించడం. జీతాలలో నూటికి 7½ కోత వీనికి వ్యతిరేకంగా ఈ సమ్మె ప్రారంభమైంది. కాని, అది పెరిగేకొద్దీ చాల కోర్కెలు తెలియ

జేయబడినవి. తొలుత సంస్కరణవాద నాయకులు సమ్మెను వ్యతిరేకించారు. తాము "ప్రేక్షకులుగా ఉంటామని యన్. యమ్. జోషి తెలిపాడు, కాని ఉద్యమంలోకి రావలసివచ్చింది. సమ్మెను విచ్ఛిన్నంచేయాలన్న ప్రతి ప్రయత్నమూ భగ్నమయిం తర్వాత, ప్రభుత్వం ఫాసెట్ కమిటీని నియమించింది. ఈ కమిటీ జీతంకోత 7½% ను ఉపసంహరించుకోవాలని సిఫారసుచేసి కార్మికుల కొన్ని వాంఛలను ఆమోదించింది.

ఇలా 1929 ప్రారంభంనాటికి విషమ ఘట్టానికి వచ్చింది. కార్మికోద్యమం ఆర్థిక రాజకీయ రంగాలలో ప్రాముఖ్యానికి వచ్చింది. పాత సంస్కరణవాద నాయకులు వెనుకబడిపోయ్యారు. 1927-28 ంలో బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, ఇండియన్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌ను సంస్కరణవాద సంస్థఅయిన ట్రేడ్‌యూనియన్ ఇంటర్నేషనల్ (యూరపు)కు అనుబంధంగా చేర్చాలని ప్రయత్నించింది ("ఇటీవల ఇండియన్ కార్మికుల స్థితిగతుల విషయమై బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఆసక్తి కనబరుస్తున్నది. ఇందుమూలంగా భారత కార్మిక సంఘాల నిర్మాణం బాగుపడి, కమ్యూనిస్టులను వెళ్ళగొట్టడం సాధ్యమయితే ఎంతో లాభకారిగా ఉంటుంది" లండన్ టైమ్సు, జూన్ 14, 1928) కాని ఈ ప్రయత్నం విఫలమయింది. ప్రభుత్వం పడిన తత్తరపాటు దాగలేదు వైస్రాయి లార్డు ఇర్విన్, 1929 జనవరిలో కేంద్రశాసన సభలో మాట్లాడుతూ "అశాంతి కరమైన కమ్యూనిస్టు భావవ్యాప్తిఆందోళన కలిగిస్తున్నది"అని చెప్పి, ప్రభుత్వం తగిన చర్యలు తీసుకుంటుందన్నాడు "1928-29 లో ఇండియానుగూర్చిన ప్రభుత్వ నివేదిక "ముఖ్యంగా కొన్ని పెద్ద పట్టణాలలోని పాటక జనంలో కమ్యూనిస్టు ప్రచారం, పలుకుబడి వ్యాపించడం, అధికారులకు ఆందోళన కలిగిస్తున్నది" అని తెలిపింది. ఈ ఆందోళననే ఇంగ్లాండులోని లిబరల్ వర్గాలుకూడ వెలిబుచ్చారు. 1929 ఆగస్టులో మాంచెస్టర్ గార్డియన్ ఇలా అంది. "పెద్ద కేంద్రాలలోని కార్మికులు, ఏమైనా చేయగల కమ్యూనిస్టు కార్యకర్తలచేత బడి అశాంతికి కారణమవుతున్నారని ఈ రెండేళ్ళ అనుభవం తెలుపుతున్నది." ఈ ఆక్రోశంలో భారత జాతీయ పత్రికలుకూడ చేరాయి. 1929 మేలో బొంబాయి క్రానికల్ ఇలా ప్రకటించింది. "సోషలిజం వాతావరణంలో ప్రవేశించింది. కొన్ని నెలలుగా భారత దేశంలో సోషలిస్టు సిద్ధాంతాలు, అనేక సభలలో ముఖ్యంగా కార్మిక కర్షక సభలలో ఉపదేశింపబడుతున్నవి." సంస్కరణవాద నాయకులు తమ పునాది జారిపోతున్నదని తెలుసుకొని తీవ్ర చర్యలు తీసుకోవాలని కోరారు. ట్రేడ్‌యూనియన్ కార్యవర్గ అధ్యక్షుడు శివరావు 1928 మే నాటికి ఇలా అన్నాడు. "భారత దేశంలోని ట్రేడ్‌యూనియన్ ఉద్యమం తన సంస్థనుండి అశాంతి కారకులను తొలగించుకోవలసిన సమయం వచ్చింది. కొందరు వ్యక్తులు సమ్మె మతాన్ని ఉద్బోధిస్తూ తిరుగుతున్నారు. కాబట్టి హెచ్చరించడం మరింత అవసరమైంది."

1929 లో ప్రభుత్వం చర్యకు గడంగినది. అభివృద్ధి చెందుతున్న కార్మికవర్గ

ఉద్యమాన్ని ఎదుర్కొనేందుకు పూర్తిగా దాడి ఆరంభించింది. 1928 సెప్టెంబరులో పబ్లిక్ సేఫ్టీ బిల్లు(ప్రజారక్షణ చట్టం)- ప్రవేశ పెట్టింది- ప్రభుత్వ నివేదిక ప్రకారం ఈ బిల్లు ఉద్దేశం "ఇండియాలో కమ్యూనిస్టు కార్యకలాపాలను అణచివేయడం" అని తెలిపారు - కాని ఈ బిల్లును అసెంబ్లీ నిరాకరించింది. 1929 వసంతంలో దీనిని ప్రత్యేక ఆర్డినెన్సుగా వైస్రాయి అమలుపరిచాడు. కార్మిక విచారణకు విట్లే కమిషన్ నియమించబడింది, మధ్యవర్తిత్వాన్ని ఏర్పరచేందుకు, సానుభూతి సమ్మెలను నిషేధించేందుకు, ప్రజావసర శాఖల్లో సమ్మె హక్కును పరిమితం చేసేందుకు కార్మిక తగాదాల చట్టం చేశారు. బొంబాయి కొట్లాట విచారణ కమిటీ ఏర్పడి ఇలా సిఫారసు చేసింది: "ప్రభుత్వం బొంబాయిలో కమ్యూనిస్టు కార్యకలాపాలకు వ్యతిరేకంగా తీవ్ర చర్యలు తీసుకోవాలని: "రిజిష్టరైన ట్రేడ్‌యూనియన్లనుండి కమ్యూనిస్టులను తొలగించేట్టు" ట్రేడ్‌యూనియన్ చట్టాన్ని సవరించగూడదా అన్న సమస్యనుకూడ ఈ కమిటీ లేవదీసింది.

## 5. మీరట్ విచారణ

1929 మార్చిలో ప్రభుత్వ తీవ్రాఘాతం కార్మికోద్యమంపై పడింది. భారతదేశంలోని అన్నిప్రాంతాలనుండి ప్రధాన కార్మికోద్యమ నాయకుల నందరినీ అరెస్టుచేసి మీరట్ అనే ఒక చిన్న పట్టణానికి - ఏ పరిశ్రమ కేంద్రానికీ దగ్గర లేకుండా - కొనివచ్చారు. చరిత్రలోని ప్రభుత్వ విచారణలలోకన్నా అతి దీర్ఘమూ, అతి వివరమూ అయిన విచారణ ప్రారంభమయింది.

మొదట ముప్పై ఒక్కమంది నాయకులను అరెస్టుచేశారు. తర్వాత మరొకరినికూడ కలిపారు. వారి పేళ్ళను ఇక్కడ వ్రాయడం అవసరం; ఎందుకంటే తర్వాతి వారి పాత్రా, కార్యక్రమమూ ఎలాంటి రూపాలు ధరించినా భారత కార్మికోద్యమానికి వారగ్రగాములయ్యారు; అందులోని చాలమంది ఈనాటికీ కార్మికవర్గంలో ఉత్తమ నాయకత్వ శక్తిగా పనిచేస్తున్నారు. వారి జాబితా ఇది.

యస్. ఏ. డాంగే : ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ సహాయ కార్యదర్శి; కాన్పూరు కుట్ర కేసులో శిక్షితుడు; గిర్నీకాంగార్ యూనియన్ ప్రధాన కార్యదర్శి.

కిశోర్‌లాల్ ఘోష్ : ట్రేడ్‌యూనియన్ల బెంగాల్ రాష్ట్రసమాఖ్య కార్యదర్శి.

డి. ఆర్. తేంగ్డీ ; ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు కార్యవర్గ సభ్యుడు; అఖిల భారత కాంగ్రెస్ సంఘ సభ్యుడు.

యస్ వి. ఘాటే : ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ సహాయకార్యదర్శి (1927)- బొంబాయి మునిసిపల్ కార్మికసంఘ ఉపాధ్యక్షుడు.

కె. యన్. జోగ్లేకర్ : జి. ఐ. పి. రైల్వే కార్మికసంఘ కార్యదర్శి; అఖిలభారత కాంగ్రెస్ సంఘ సభ్యుడు.

యస్. హెచ్. జాబ్‌వాలా అఖిలభారత రైల్వేమెన్స్ ఫెడరేషన్ ఆర్గనైజింగు

[illegible] గిర్ని [illegible] [illegible]

షౌకత్ ఉస్మానీ: కమ్యూనిస్టు [illegible] బొంబాయిలోని ఉర్దూ కార్మిక పత్రిక [illegible]

ముజఫర్ అహమద్: [illegible] ఉపాధ్యక్షుడు బెంగాల్ కార్మిక కర్షక పార్టీ [illegible] [illegible]

ఫిలిప్ స్ప్రాట్: [illegible] కార్యవర్గసభ్యుడు.

డి. యస్. [illegible]: [illegible] యూనియన్ అంతర్ జిల్లా కమిటీ [illegible] రైల్వే కార్మిక సంఘం, [illegible] [illegible] అఖిలభారత రైల్వే ఫెడరేషన్ ఉపాధ్యక్షుడు; [illegible] సమ్మెలో సంయుక్త సమ్మెకమిటీ [illegible]

యస్. [illegible] యూనియన్ సహాయకార్యదర్శి

పి. సి. [illegible]

ఎ. ఎ. [illegible] అధ్యక్షుడు.

[illegible] గిర్ని [illegible] యూనియన్ కార్యకర్త.

గోపాల్ బసక్. 1928 [illegible] యువజన మహాసభ అధ్యక్షుడు

జి. యమ్. అధికారి: పి. హెచ్. డి., బొంబాయి సోషలిష్టు పత్రిక 'స్పార్క్'కు వ్యాసకర్త.

యమ్. ఎ. మజీద్: ఖిలాఫత్ ఉద్యమంలో 1920 లో ఇండియా వదిలివెళ్ళాడు. రష్యా వెళ్ళిరాగానే అరెస్టయ్యాడు. కీర్తికిసాన్ పార్టీ (పంజాబ్) కార్యదర్శి, పంజాబు యువజనసంఘ స్థాపకుడు.

ఆర్. యస్. నింబ్‌కర్: బొంబాయి ట్రేడ్‌యూనియన్ కౌన్సిల్‌కు, బొంబాయి రాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి కార్యదర్శి; అఖిలభారత కార్మిక కర్షకపార్టీ ప్రధాన కార్యదర్శి; అఖిలభారత కాంగ్రెస్ సంఘ సభ్యుడు.

విశ్వనాథముఖర్జీ: యు. పి. కార్మిక కర్షకపార్టీ అధ్యక్షుడు.

కేదార్‌నాథ షేగల్: పంజాబ్ కాంగ్రెస్‌కమిటీ అధ్యక్షుడు; రాష్ట్ర కాంగ్రెస్ ఆర్థిక కార్యదర్శి; అఖిలభారత యువజనసంఘ సభ్యుడు.

రాధారమణమిత్ర: బెంగాల్ జనపనార కార్మికసంఘ కార్యదర్శి.

ధరణి కె. గోస్వామి: బెంగాల్ కార్మిక కర్షక పార్టీ సహాయకార్యదర్శి, ప్రముఖ కార్మికనాయకుడు.

గౌరీశంకర్: యు. పి. కార్మిక కర్షకపార్టీ కార్యవర్గసభ్యుడు.

షంసూల్‌హుదా: బెంగాల్ రవాణా కార్మికసంఘ కార్యదర్శి

శివనాథబెనర్జీ: బెంగాల్ జనపనార కార్మికసంఘ అధ్యక్షుడు; ఖరగ్‌పూర్ రైల్వే సమ్మెలో ఒక సంవత్సరం శిక్షితుడు

సోహన్‌సింగ్ జోష్ : ప్రముఖ అకాలీదళ్ కార్యకర్త, కిసాన్ మహాసభ అధ్యక్షుడు
నుమ ఎ దేశాయ్ : బొంబాయి కేంద్రపు పత్రిక 'క్రాంతి' సంపాదకుడు,
అయోధ్యప్రసాద్ : బెంగాల్ కార్మిక సంఘాలలో ప్రముఖుడైన సభ్యుడు.
లక్ష్మణరావు కదం : ఝాన్సీ రైల్వే కార్మికసంఘ అధ్యక్షుడు
హెచ్. యల్. హచిన్సన్ . 'న్యూస్పార్క్' సంపాదకుడు.

ఈ ముప్ఫైరెండవవాడైన లెస్టర్ హచిన్సన్ ఒక ఇంగ్లీషు జర్నలిస్టు. పైవారు అరెస్టుకాగానే 'న్యూస్పార్క్' సంపాదకత్వాన్ని తర్వాత ఇతనిని అరెస్టుచేసి కుట్రకేసులో కలిపారు.

ఈ అరెస్టయిన వారిలో ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు, ఒక మాజీ అధ్యక్షుడు, ఇద్దరు సహాయ కార్యదర్శులూ ఉన్నారు. బొంబాయి, బెంగాలు రాష్ట్ర ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ కార్యదర్శులు: గిర్నికాంగార్ యూనియన్ కార్యకర్తలంతటా జి. ఐ. పి రైల్వేమెన్స్ యూనియన్ నాయకులలో చాల మంది, ఇతర యూనియన్లకు చెందినవారు కార్మిక కర్షక పార్టీకి చెందిన బొంబాయి, బెంగాలు, యు. పి శాఖల కార్యదర్శులు, మిగతా కార్యకర్తలు ఉన్నారు. ముగ్గురు అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులు, బొంబాయి రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శితోపాటు అరెస్టయ్యారు. కాన్పూరు కుట్ర కేసులో శిక్షితులైన నలుగురిలో ముగ్గురిని తిరిగి ఇందులో చేర్చారు. ముగ్గురు ఇంగ్లీషువారు కూడ ఉన్నారు. ఈ ముగ్గురు ఇంగ్లీషు కార్మికోద్యమ ప్రతినిధులు భారత కార్మిక నాయకులతోపాటు దోషిస్థానంలో నిలబడి తర్వాత వారిలో జైలుకు వెళ్ళారు. ఇందులో సజీవమైన అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యత చారిత్రకంగా ప్రవర్శితమైంది. పాత అడ్డంకులన్నింటినీ విచ్ఛిన్నంచేసి భావి బ్రిటిష్ భారత ప్రజా సహోదరత్వానికి అతి ప్రముఖ స్వర్ణఘట్టమయింది.

నిర్బంధితులయిన కార్మికోద్యమ నాయకులు దీని నంతటినీ సహించారు; భారత కార్మికోద్యమం ఇంకా ప్రాధమిక సంస్థా నిర్మాణ దశలోనే ఉన్నప్పటికీ తన పాత్రకు తగిన సమగ్ర చైతన్యాన్ని, తాహతును పొందిందని రుజువుచేశారు, ముద్దాయిల ప్రసంగాలు భారత కార్మికోద్యమ అమూల్య పత్రసంచయములో చిర స్థాయి కాగలవు. వానిలో నూతన భారతదేశం ప్రత్యక్షమయింది,

ఈ విచారణలో నిలబడి కార్మికోద్యమం అంతర్జాతీయ కార్మికోద్యమ ఉత్తమ స్థాయికి వెళ్ళింది. ఈ రోజు ఇండియాలో సోషలిజం, కార్మికోద్యమ పతాకాన్ని ముందుకు కొనిపోయే బాధ్యత వహించిన వారికి ఆదర్శప్రాయమై ఉత్సాహ ఉత్తేజనాల నందిస్తున్నది.

ప్రభుత్వం ఈ విచారణను మూడున్నరేండ్లు ఈడ్చింది — భారతచరిత్ర లోని విషమఘట్టమైన ఆనాలుగేండ్లు, కార్మికోద్యమంలోని అత్యుత్తమ నాయకు లను వేరుచేశారు. వీరిపై పెట్టిన నామమాత్రమైన నేరాన్ని రుజువు చేసేందుకు

[illegible] ప్రాముఖ్యతగలదిగా [illegible] ఆ కుట్ర [illegible] నకపైనేన [illegible]

"[illegible] 121 [illegible] బ్రిటిష్ [illegible] కార్మికుల [illegible] రాజును [illegible] ప్రాతినిధ్యమున్న [illegible] చేయాలి."

[illegible] కేసును [illegible] చెప్పుకున్నాడు ఇలా [illegible]

"[illegible] బహిరంగ చట్ట [illegible] అంగీకరింపబడింది. [illegible]"

"[illegible] ముద్దాయిలపై నేరమారోపింప [illegible] తొలగింప ప్రయత్నించారనే నేరం. ముద్దాయిలు నిజంగా ఏమైనా చేశారా [illegible] రుజువు చెయ్యడం ఈ కేసుకు అనవసరం. కుట్రపన్నారనేది రుజువు చెయ్యగలిగితే చాలును."

"కుట్ర" అన్నది [illegible] ఏమీలేదు ముద్దాయిల సోషలిస్టు భావాలు బహిరంగమైనవి, బహిరంగంగా ప్రకటించబడినవి, అలాగే కార్మికసంఘ కార్యాలు బహిరంగమైనవే. అందులో "రహస్యం" ఏమీలేదు. కేవలం కార్మికోద్యమ సంస్థా, నాయకత్వమూ మాత్రమే ఉన్నవి

నిజమైన నేరం ఆరోపణపత్రంలో బయటపెట్టారు. అని ముద్దాయిలు "కార్మికులకు యజమానులకు మధ్య ద్వేషం రగుల్కొల్పారు." "కార్మిక కర్షక పార్టీలను, యువజన సంఘాలను, యూనియన్లు వగైరాలను స్థాపించారు." "సమ్మెలను ప్రోత్సహించారు" అని అందులో ఉంది. సాక్ష్యమంతా ఈ కార్యాలపైనే, ముఖ్యంగా కార్మికోద్యమ కార్యాలపైనే కేంద్రీకృతమయింది. ముద్దాయిలలో ఒకరైన బెంగాలు జనపనార కార్మికసంఘ కార్యదర్శినిగూర్చి ప్రాసిక్యూటరు ఇలా అన్నాడు. "ఈయన కుట్రలో పాత్ర, కలకత్తా పాకీపనివారి సమ్మెలో తాను పాల్గొనడంతో ఆరంభమైంది." ఈ విచారణలోని ప్రధానఉద్దేశం న్యాయాధిపతి యొక్క ఈ క్రిందిమాటల్లో స్పష్టమవుతున్నది.

"అతిప్రమాదస్థితి బహుశా ఏదంటే, బొంబాయి బట్టలమిల్లు కార్మికులపై వీరికిదొరికిన ప్రాబల్యం. అది 1928 సమ్మెలోను, గిర్నీ కాంగార్ యూనియన్ విప్లవ విధానంలోను చూపబడింది."

అయినప్పటికీ బ్రిటిష్ కార్మికచరిత్రలో డోర్సెస్టర్ కార్మికులపైలాగే, పొంగి వస్తున్న కార్మికోద్యమాన్ని అణచేందుకై జరిపిన ఈ విచారణ లేబర్‌ప్రభుత్వం క్రింద జరిగింది. దీని "బాధ్యతను పూర్తిగా" ఆ ప్రభుత్వం అంగీకరించింది. ("మేము బాధ్యతను పూర్తిగా అంగీకరిస్తున్నాము ........ఇండియామంత్రి భారత ప్రభుత్వాన్ని అతిశక్తివంతంగా బలపరుస్తున్నాడు" — డాక్టర్ డమ్మండ్ షీల్సు లేబర్‌పార్టీ మహాసభ, బ్రైటన్ 1929). "న్యాయశాఖాయంత్రం పవిచేయాలి" అని డైలీహెరాల్డు 1929 జూన్ 25 న తీర్పు చెప్పింది. ఇండియన్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కు చేసినవిజ్ఞప్తికి సమాధానంగా సర్ వాల్టర్ సిట్రైన్ 1929 అక్టోబరు 1 న ఇలావ్రాశాడు. "ఈ విచారణ సాధ్యమైనంత త్వరలో ముగియాలి. ముద్దాయిలపై ఆరోపించిన నేరం రాజకీయమైనది. ఇది జనరల్‌కౌన్సిల్ దృష్టిలో భారతకార్మికోద్యమాన్ని ప్రత్యక్షంగా బాధించదు" తర్వాత విచారణముగిసి. లేబర్‌ప్రభుత్వం పదవీత్యాగం చేసినతర్వాత. 1933 లో ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, లేబర్‌పార్టీల జాతీయసంయుక్తసమితి ఒక కరపత్రం ప్రకటించింది. అందులో ఇలా చెప్పింది "ఈ విచారణ కార్యక్రమమంతా తొలి నుంచి కడవరకూ, సమర్థనీయమైందికాదు ఇదొక న్యాయశాస్త్ర ఘోరకథనం."

1933 జనవరిలో క్రూరశిక్షలు విధించారు. ముజఫర్ అహ్మద్‌కు యావజ్జీవ ద్వీపాంతరవాసం. డాంగే, ఘాటే. జోగ్లేకర్. నింబకర్, స్ప్రాట్‌లకు 12 ఏళ్ళ ద్వీపాంతరవాసం; బ్రాడ్లీ, మిరాజ్కర్. ఉస్మానీలకు 10 ఏండ్ల ద్వీపాంతరవాసం; ఇలా, చాలతక్కువదిగా మూడేండ్ల కఠినశిక్ష వరకూ వేశారు. దీనితర్వాత అంతర్జాతీయంగా జరిగిన ఆందోళన ఫలవంతమై అపీలులో ఈశిక్షలు బాగా తగ్గించబడినవి.

## 6. మీరట్ తర్వాత కార్మికవర్గ పునరుజ్జీవనం

మీరట్ అరెస్టులతర్వాత కొన్నిసంవత్సరాలు భారతకార్మికోద్యమానికి కష్టతరమైన యుగం. ఇలాంటి ఇతర కేసులలోలాగే మీరట్ విచారణ, భావిశక్తికీ విజయానికి బీజావాపనం చేసింది కాని, తాత్కాలికంగానేమో పెద్దదెబ్బతీసింది.

అంత ప్రాథమికదశలో ఉన్న కార్మికవర్గం. తొలగించబడిన నాయకత్వాన్ని వెంటనే పునస్థాపించడం సులభంకాదు. ఈ ఆర్థిక సంక్షోభకాలంలోని సమ్మెలు పెద్దపరాజయాలతో పడిపోయాయి. ఆవెంటనే వచ్చిన జాతీయపోరాట క్లిష్ట సమయంలో కార్మికవర్గపాత్ర దుర్బలపడింది — సామ్రాజ్యవాదుల ఉద్దేశం అదే.

ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో కూడ యిబ్బందులు ఏర్పడ్డాయి. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌లో అతివాదులే అత్యధిక సంఖ్యాకులయ్యారు. ఉత్తమ శక్తివల్లా, కార్యక్రమాచరణ ఉత్తమపథాల్లో నడవడంవల్లా రెండేండ్లలో చేసిన పనికిగాను 1929 ఆఖరున నాగపూర్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌లో వీరికి విజయం చేకూరింది. పాత సంస్కరవాద నాయకులు తాము అల్పసంఖ్యాకులవి

గ్రహించి, మెజారిటీ చేసిన ప్రజాతంత్ర నిర్ణయాన్ని అంగీకరించకుండా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను చీల్చారు. తమ్ము బలపరుస్తున్న యూనియన్లతో ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ను ఏర్పరచదలచారు. "అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానాన్ని చూస్తే, అందులో మెజారిటీసభ్యులు, మాకు పూర్తిగా అనంగీకారమైన విధానాన్ని కాంగ్రెస్‌తో ఒప్పించదలచారని నిస్సందేహంగా బయలుపరచారు. ఆ నిర్ణయాలు కాంగ్రెస్‌లో అత్యధికసంఖ్యాకులు తప్పకుండా అంగీకరిస్తారనడంలో మాకు సందేహంలేదు" అని ఎన్. ఎమ్. జోషీ, శివరావు, గిరి, దివాన్ చమన్‌లాల్ మొదలైనవారొక ప్రకటన చేశారు. అందులో వారింకా ఇలా వ్రాశారు: "ఈ పరిస్థితులలో కార్యవర్గసమితి తీర్మానాలతో మేము పూర్తిగా వేరుపడదలచాము. కాంగ్రెస్ చర్చలలో మేమింకా పాల్గొనడంవల్ల ప్రయోజనమేమీ ఉండదని భావిస్తున్నాము."

ఏమైనప్పటికి ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులో అధికారానికి వచ్చిన అతివాద నాయకత్వంలో సమానభావాలేవు. వివిధ విభిన్నదృక్పధాలు గలవారు అందులో ఉన్నారు. కాబట్టి మరొక చీలిక వచ్చింది. కార్మికవర్గ ప్రత్యేక రాజకీయపాత్ర సమస్యమీదనే ముఖ్యంగా ఈ చీలిక ఏర్పడింది. ఈ అభిప్రాయం గల కమ్యూనిస్టుభాగం వేరుపడి 'రెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్' ను ఏర్పరచింది

ఈ చీలికలు ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని చాల దుర్బల పరచాయి. కాని కార్మికులు ప్రత్యేక సమ్మె పోరాటాలు నడిపారు ఆర్థిక వాంఛల కోసమే గాక పనినుండి తొలగించినందుకు వ్యతిరేకంగా-అంటే సంఘం పెట్టుకోవచ్చు అనే ప్రజాతంత్ర హక్కుకోసంకూడ పోరాటాలు నడిపారు. ఇది ఈ క్రింది లెక్కలవల్ల తేలుతుంది. 1929లో సమ్మెల సంఖ్య 141, 1930లో 148. 1931 లో 166కు పెరిగింది. ప్రతి యేటా పదివేల మంది కార్మికులు ఈ సమ్మెలలో చేరారు. రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో కమ్యూనిస్టులు ఈ సమ్మెలు నడిపారు. 1933లో ప్రభుత్వం తీవ్ర ఆశాభంగంతో ఇలా అంగీకరించవలసి వచ్చింది. "మీరట్ నాయకులింకా జైలులోనే ఉన్నప్పటికి కమ్యూనిస్టు ప్రమాదం ఏమైనా అలాగే ఉంది. ఇంకా తీవ్ర మయింది కూడ" (ఇండియా, 1932-33)

ఈ ప్రత్యేక సమ్మెలన్నీ 1934 పెద్ద సమ్మె వెల్లువకు పునాది నేర్పరచాయి. ఈ సమ్మె "రేషన లైజేషన్"కు వ్యతిరేకంగా జరిగింది. కార్మికులతో పనిని ఎక్కువ చేయించడం, ఎక్కువ పీడించడం అనేపద్ధతినే రేషనలైజేషన్‌అంటారు. ఈ వెల్లువ తీవ్రతను చూడండి. 1933లో 146 సమ్మెలు. 1,64 938 కార్మికులతో 2.168,961 దినాలు నడిచాయి, మరి 1934లో 159 సమ్మెలు 2,20, 808 కార్మికులతో 47,75,559 రోజులు నడిచాయి. ముందటి సంవత్సరం కన్నా రెట్టింపు. ఏప్రెల్ నుండి జూన్ వరకు నడచిన బొంబాయి బట్టలమిల్లుల సర్వవ్యాప్త సమ్మె, ఫిబ్రవరి నుండి మే వరకు జరిగిన షోలాపూర్ సమ్మె ఎంత తీవ్ర

నిర్బంధ విధానాన్ని ప్రభుత్వం అవలంబించినా జరిగాయి. చెదరిపోయిన కార్మిక శక్తులన్నిటినీ సమీకరించ గలిగాయి; కార్మిక వర్గంలో ఐక్యత ఏర్పడింది; తీవ్ర కార్యా సక్తులైన కొత్త నాయకులను కొని వచ్చినవి.

ప్రభుత్వం మరొక దెబ్బతీసింది. అవసరాధికారాల ఆర్డినెన్సును అమలు జరిపింది. కమ్యూనిస్టులను. ట్రేడుయూనియన్ నాయకులను విచారణ లేకుండా జైల్లో పెట్టారు. కమ్యూనిస్టుపార్టీని నిషేధించారు. చట్టబద్ధంగా రిజిష్టరై ఉన్న ట్రేడుయూనియన్లను 12 కు పైగా అక్రమ సంఘాలుగా ప్రకటించారు. యూత్ వర్కర్సు లీగును నిషేధించారు. కార్మికవర్గ విప్లవాత్మక సంస్థలను అణచేందుకు కాల్పులు సాగించారు.

ఈ మహత్తర సమ్మెపోరాటంలోనుండి కార్మికవర్గ సంస్థలను తిరిగి ఏకీభవింపజేయడానికి ప్రయత్నాలు మొలకెత్తాయి. 1935 లో రెడ్ ట్రేడుయూనియన్ కాంగ్రెసు. అఖిల భారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు ఏకమయ్యాయి. అ. భా. ట్రేడుయూనియన్ కాంగ్రెసు సన్మానసంఘ అధ్యక్షుడు యస్. హెచ్. జాబ్వాలా ఇలా ప్రకటించారు :

> "కమ్యూనిస్టులతో (రెడ్స్) కలిసి పనిచేయడం నాకు సంతోష దాయకమైన విషయం వారిలో ఐక్యతకై అనవరతం పాటుబడేవారు. కార్మికవర్గ యోగక్షేమాలకై రోజు రోజూ పనిచేసేవారు ఉన్నారు నా స్వానుభవంవల్ల, ఈ సంగతులను ఏమాత్రం అతిశయోక్తి అవుతుందనే అనుమానం లేకుండా చెప్పగలను"

(15 వ అఖిల భారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు రిపోర్టు, బొంబాయి, మే 1936.)

ఈ సమావేశంలో నేషనల్ ట్రేడుయూనియన్ ఫెడరేషన్ సంస్కరవాద నాయకులకు విజ్ఞప్తిచేశారు. కార్మికుల కేంద్రనాయకత్వాన్ని ఏకంగా నిర్మించేందుకు అంగీకరించమని కోరారు. ప్రభుత్వమూ, యజమానులూ కలిసి చేస్తున్న దాడిని "కార్మికుల దేశవ్యాప్త పోరాటం ఒక్కటే ఎదుర్కొగలదన్నారు" ఐక్యతకోసం వారి (సంస్కరవాదుల) షరతులకు ఒప్పుకుంటాముగాని. ఈ రెండు సూత్రాలకు వారు అంగీకరించాలన్నారు : ఒకటి ట్రేడుయూనియన్ ఉద్యమానికి వర్గపోరాటాన్ని పునాదిగా గ్రహించాలి; రెండు. సంస్థలలో ట్రేడుయూనియన్ ప్రజాతంత్ర పద్ధతిని అంగీకరించాలి. వెంటనే రెండు సంస్థలు కలిసిపోవడానికిమాత్రం ఆ ఫెడరేషన్ నాయకులు అసమ్మతిచూపారు అందువల్ల 1936 లో ఒక సంయుక్తసమితి ఏర్పడింది 1938 లో మట్టుకే నాగపూరులో నేషనల్ ఫెడరేషన్ అ. భా. ట్రేడు యూనియన్ కాంగ్రెసుకు అనుబంధంగా చేరింది. కాంగ్రెసు పాలకసమితిలో రెండు సంస్థలకూ సమాన ప్రాతినిధ్యంమీద ఇలా జరిగింది. మరొకతూరి ట్రేడుయూనియన్ కాంగ్రెసు మొత్తం భారత కార్మికసంఘాలను కలిపే సంస్థగా తయారయింది. గాంధీజీవాద ప్రోద్బలంతో ఒక్క అహ్మదాబాదు బట్టలమిల్లు కార్మిక సంఘం మాత్రమే (టెక్స్టయిల్ లేబర్ అసోసియేషన్) వేరుగా ఉండిపోయింది.

రాజకీయ రంగంలోకూడ నూతన అభివృద్ధి జరిగింది. కార్మిక కర్షక పార్టీలు - ద్వివర్గ లక్షణం వానిలో ఉన్నందువల్ల కేవలం సంధిదశలో మాత్రమే పనికివస్తాయిగాని, శాశ్వత రాజకీయ కార్మికవర్గ సంస్థకు పునాది కాలేవు. కాబట్టి అవి మీరట్ విచారణ తర్వాత మాటువడినవి కమ్యూనిస్టుపార్టీ నిషేధింప బడి నప్పటికి. అలాంటి చర్యలతో సోషలిస్టు, కమ్యూనిస్టుల పలుకుబడి పెరగడాన్ని. మార్క్సిస్టు భావాలను అరికట్టలేవు. 1930 - 34 సత్యాగ్రహోద్యమం ముగిసిన తర్వాత కొత్తబలం చేకూరింది. ఎందుకంటే ఆ పోరాటంనుండి యువ జాతీయ శక్తులు కొన్నిపాఠాలు నేర్చుకున్నారు.

ఈ యుగంలో కొంతవరకు మార్క్సిస్టు భావాల పలుకుబడిక్రిందకు వచ్చిన అతివాద జాతీయ యువకులు కొందరు 1934 లో కాంగ్రెస్ సోషలిస్టుపార్టీని స్థాపించారు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ప్రత్యేక లక్షణ మేమంటే· దీనిలో సభ్యులు కావాలంటే కాంగ్రెసులో సభ్యులై తీరాలని షరతు పెట్టారు. ఇలాగా కాంగ్రెసు లోని ఒక భాగంగా తయారైన సమిష్టి సభ్యత్వాన్ని నిరుత్సాహపర్చారు ఈ కార్య క్రమంయొక్క, సంస్థా నిర్మాణ నియమాలయొక్క భౌతికఫలమేమంటే (ఆ పార్టీ స్థాపకులలోని అభ్యుదయశక్తుల ఉద్దేశ మేమైనప్పటికీ) కార్మికవర్గ ఉద్యమ స్వతంత్రాన్ని. జాతీయకాంగ్రెసులో ప్రస్తుతమున్న ప్రధాన నాయకత్వానికి-అంటే ఆచరణలో బూర్జువా వర్గానికి -క్రిలొంగి ఉండేట్టు చేసేందుకు ప్రయత్నం జరిగింది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ మూలంలోనే ఉన్న ఈ పరస్పర విరుద్ధత, కార్మికవర్గ పోరాటంలో వచ్చిన ప్రతి విషమ ఘట్టంలోను, పార్టీ అవలంబించిన పాత్రలోను, దాని చరిత్రలోను వరుసగా కనిపిస్తూవచ్చింది. ఈ విరుద్ధత ఇంకా పార్టీలోని అతి వాద మితవాద పక్షాలమధ్య తగాదాలోకూడ స్పష్టపడింది ఈ పార్టీలోని అతివాద పక్షం కమ్యూనిస్టుపార్టీతోను. కార్మికవర్గ శక్తులతోను సహకారాన్ని అపేక్షించింది. మరి అధికారంలో ఉన్న అభివృద్ధివిరోధక మితవాదపక్షం కమ్యూనిస్టు పార్టీకి స్వతంత్ర కార్మికవర్గ కార్యక్రమాని కంతటికి వైరుధ్యం వహించింది.

## 7. యుద్ధానికిముందు ఉత్తేజనం

కాంగ్రెసు ఎన్నికల విజయం, కాంగ్రెసు మంత్రివర్గ నిర్మాణంతోపాటు ట్రేడ్‌యూనియన్ కార్యక్రమంలో నూతన ఉత్తేజనం విజృంభించింది. దీనిఫలితమే 1937 - 38 నాటి సమ్మెల మహాతరంగం. ఆయుధాల నిర్మాణంలో పోటీ మూలంగా తాత్కాలికంగా పెట్టుబడిదారీ విధానం పునర్నిర్మితం కావడంతో వచ్చిన ప్రపంచ సమ్మెల వెల్లువలో ఇది భాగమే.

ట్రేడ్‌యూనియన్ ఉద్యమం వ్యాపించింది. ఎన్నో కొత్తసంఘాలస్థాపనకు కారణమైంది. కొంతకాలమే పనిచేసే ఫ్యాక్టరీలలోను, సంఘటితంకాని పరిశ్రమల లోను పనిచేసే కార్మికులపైకూడ దీని పలుకుబడి బాగా పడింది. రిజిస్టరైన యూనియన్లసంఖ్య 1928 లో కేవలం 29 మట్టుకే, 1929 లో 75, 1934 లో

191 కి పెరిగింది. 1938 లో ఈ సంఖ్య 2[illegible] కు హెచ్చింది. ఈ యూనియన్ల సభ్యత్వం 2,61,000. కాని ఈ ట్రేడ్‌యూనియన్లు నిజానికి కేంద్రాలవంటివి. వానిలోని సభ్యత్వానికి రెట్టింపు కార్మికులని సమీకరించగలవు.

1937 లో సమ్మెలసంఖ్య 379 కి హెచ్చింది. 1921 తరువాత ఇదే పెద్ద సంఖ్య 1921 సమ్మెలకన్నా 17 మాత్రమే తక్కువ; ఈ సమ్మెలలో 6,76,000 మంది కార్మికులు పాల్గొన్నారు - ఇది ఇంతవరకున్న లెక్కలలో కన్నా పెద్దది. కార్మికసంఘ సభ్యత్వ సంఖ్యకన్నా మూడింత లెక్కువ; ఈ సమ్మెలు జరిగిన పనిరోజులు 89,83,000 - అంటే 1929 తర్వాత ఇదే పెద్ద సంఖ్య.

ఈ సమ్మెలలో నూటికి 45 విజయవంతమై కార్మికులకు సౌకర్యాలు చేకూర్చాయి.

వీని అత్యుచ్ఛదశ బెంగాలు జనపనారమిల్లుల సమ్మెలో తీవ్ర నిర్బంధ విధాన మున్నప్పటికి. అది జనపనార మిల్లుల సర్వవ్యాప్త సమ్మెగా త్వరలోనే అభివృద్ధి చెందింది. మొత్తం 2,25,000 కార్మికులందులో చేరారు. 1929 ఆర్థికమాంద్యంనుండి అసంతృప్తి పెరుగుతూ వచ్చింది. 1,30,000 కార్మికులను పనులనుండి తొలగించారు. జీతాలు కోశారు. "రేషనలైజేషన్" పద్ధతులతో అతిత్వరగా పనిచేయించడం. దోపిడీ తీవ్రతరమైంది 1931-36 ల మధ్య మగ్గాలు కేవలం నూటికి 13 మాత్రమే పెరిగాయి కాని, గోనెల ఉత్పత్తి (గజాలలో) నూటికి 65 వంతు లెక్కువయింది. "ప్రపంచ ఆర్థికమాంద్యం వచ్చినా మేము సహేతుకమైన లాభాలు తీయగలుగుతున్నాము" అని బెంగాలు జనపనార పెట్టుబడిదారులలో ఒకడైన సర్. అలెగ్జాండర్ ముర్రే అన్నాడు జనప నార పరిశ్రమ 1936 నుండి పునరుజ్జీవనదశకువస్తున్నది. కార్మికులు, ఫిబ్రవరిలో జీతాలకోతలు తీసివేసి, తగినంత జీతాలివ్వాలని సమ్మె మొదలుపెట్టారు. అభి వృద్ధినిరోధకమైన ఫజ్లుల్‌హక్కు మంత్రివర్గం, ఈ సమ్మె ఆర్థికంగాదని. దీనిని కమ్యూనిస్టు నాయకులు, భారతదేశంలో విప్లవానికి మార్గంకోసమే" చేస్తున్నారనే సాకుతో అణచివేసేందుకు తీవ్రనిర్బంధవిధానం అవలంబించింది. కాని సమ్మె మేనెలవరకు సాగింది. కార్మికులు ఏకంగా నిలబడి బెంగాల్ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సద్భావంకూడ సాధించారు. ఆ కాంగ్రెస్ కమిటీ సమ్మెనిధికి విరాళాలివ్వమని ప్రజలకు విజ్ఞప్తిచేసింది ఆఖరుకు తమ యూనియన్‌నుగుర్తించి జీతాలకోత తొలగించాలన్న సూత్రాన్ని యజమానులు అంగీకరించారు.

ఈ సమ్మె వెల్లువలో గమనింప దగిన అంశ మొకటుంది. ఇంతవరకు గాంధి వాదంలోని వర్గశాంతి పద్ధతికి ప్రధాన కేంద్రమైన అహమ్మదాబాదుకుకూడ ఈ వెల్లువ వ్యాపించింది; బొంబాయి కాంగ్రెస్ ప్రభుత్వం ఇక్కడ ప్రజలందరు అసహ్యించుకొనే 144 సెక్షన్ను అమలు పరచి 5 మందిగాని అంతకు పైనగాని

సమావేశం కారాదని నిషేధించింది. ఈ సెక్షన్‌కు వ్యతిరేకంగానే కాంగ్రెస్ ఎడతెగకుండా అసమ్మతి తెలుపుతూ వచ్చింది ఇంతవరకూ

ఈ సమ్మె వెల్లువలో పరాకాష్ఠ కాన్పూరు బట్టలమిల్లు సమ్మె 1937 లో ప్రారంభమై. త్వరలోనే సర్వవ్యాప్త సమ్మెగా మారింది. 40,000 కార్మికులిందులో చేరారు మిగత పరిశ్రమలు మాచ్ ఫాక్టరీ, ఐరన్ ఫౌండ్రీ బర్మాషెల్ డిపోల కార్మికులు కూడ సానుభూతి తెల్పుతూ ఇందులో చేరారు. కాంగ్రెస్ విచారణ సమితి ఇచ్చిన 'అవార్డు'ను కార్మికులు అంగీకరించారు, కాని యజమానులు అమలుజరపడానికి నిరాకరించారు. యజమానులు దీని నమలు పరచేట్టు చేసేందుకై 1938లో సర్వవ్యాప్తసమ్మె మొదలైంది ఇందులో కాంగ్రెస్-కార్మిక ఐక్యతకు నిదర్శనం కనిపిస్తుంది. యు. పి. కాంగ్రెస్ కమిటీ తీర్మానం "కాన్పూరు కార్మికులు తమ కోసమేగాక, భారతకార్మికవర్గ మంతటికోసం పోరాడుతున్నారు.... మానవ హక్కులకోసం పోరాడు తున్నారు," అని ప్రకటించి, ప్రజలు "సమ్మెదారులకు వారారంభించిన గొప్ప పోరాటంలో అన్ని విధాల సాయ పడాలి," అని కోరింది యజమానుల ఏజంట్లు మత కలహాలు రేపాలని చేసిన ప్రయత్నా లన్నింటిని హిందూ ముస్లిం కార్మికులు ఏకమై భగ్నంచేసి. యాభైఅయిదు రోజులు సమ్మె పోరాటం నడిపింతర్వాత. గమనార్హమైన విజయం చేకూరింది. యూనియనును యజమానులు గుర్తించడం కూడ జరిగింది. సంయుక్త ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సంపూర్ణ బలంతో, 90,000 కార్మికులు ప్రమాదకరమైన కార్మిక తగాదా బిల్లుకు వ్యతిరేకంగా 1938 నవంబరులో బొంబాయి అసమ్మతి సమ్మెను నడిపారు (ఈ బిల్లు మధ్యవర్తిత్వం ఏర్పరచి సమ్మె హక్కును నాల్గు నెలలు ఆపేట్లు చేస్తుంది; యూనియన్‌ల రిజిస్ట్రేషన్ విషయంలో కొన్ని నిర్బంధాలను కంపెనీ యూనియన్లకు అనుకూలంగా ఏర్పరచింది ) ఈ సమ్మె కార్మికవర్గ చైతన్యాన్ని మహత్తరంగా ప్రదర్శించింది. ట్రేడ్ యూనియన్ హక్కుల విషయమై కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలోని వాగ్దానాలను అమలు పరచాలని బొంబాయి కాంగ్రెస్ ప్రభుత్వానికిది హెచ్చరికగా పనిచేసింది.

పైన సంస్కారవాద నాయకత్వం ఉన్నప్పటికి రైల్వే కార్మికులలో బలవత్తరమైన పునరుజ్జీవనం కనిపించింది, 40 000 కార్మికులతో నడిచిన బెంగాల్. నాగపూర్ రైల్వే సమ్మె ఒకనెల నడిచింది. ఫైజ్‌పూర్ కాంగ్రెసు సానుభూతిని సంపాదించింది. అఖిల భారత రైల్వేమెన్ ఫెడరేషన్ సంస్కారవాద నాయకుల పెత్తనంక్రింద ఉంది కార్మికులలో నూటికి 17 గురిని తొలగించడం, జీతాల కోతలు, పనిని మరీఎక్కువగా చేయించడంతో ప్రమాదాలలో నూటికి 50 ఎక్కువ కావడం, రైల్వే కంపెనీలకేమో లాభాలెక్కువరావడం వీటన్నిటిని చల్లగాచూస్తూ కూచుంది. కాని కార్మికసంఘ ఉద్యమతరగం జి ఐ. పి. రైల్వేలోని సంస్కారవాదుల ఎర్రజండావారి యూనియన్లన్నీ ఏకమయ్యేందుకు కారణమైంది. ఇందులో 20,000 పైగా సభ్యత్వం చేకూరింది. ఇలాంటి పునరుజ్జీవనమే బి బి. సి ఐ.

యమ్. యస్. యమ్; యస్ ఐ. ఆర్. లలో కూడ కనిపిస్తుంది. రైల్వే యజమానులు తీవ్ర కార్మికోద్యమాన్ని అణచేందుకు వేసిన యెత్తులకు ఒక ఉదాహరణ చూడండి. బి. బి సి. ఐ. రైల్వేలోని సంస్కారవాదుల యూనియన్ను "జమ్నాదాస్ మెహతా ఎంతవరకు అందులో ఉంటాడో, ఎంతవరకు కమ్యూనిస్టులు అందులో ఉండరో" అంతవరకు గుర్తిస్తామని చెప్పారు కాని అఖిల భారత ట్రేడుయూనియను కాంగ్రెసు నేషనల్ ట్రేడుయూనియన్ ఫెడరేషన్ కలిసిపోవడమూ, రైల్వేలోని పోటీసంఘాలను ఏకంచేయాలన్న కార్మికుల గాఢవాంఛా ఇలాంటి విచ్ఛిన్న చర్యలతో పోరాడేందుకు పునాది వేశాయి

ట్రేడుయూనియన్ కాంగ్రెసు స్థాపనదినోత్సవం 1938 అక్టోబరు 30 తేదీ నాటికి అందులో 3 25,000 సంఘటిత కార్మికసభ్యత్వం ఉంది. సామ్రాజ్యవాద దుశ్చర్యలకు వ్యతిరేకంగా, జాతీయవాంఛలకు ఉపబలంగా శక్తివంతమైన రాజకీయ అసమ్మతి కార్యాలద్వారా, సామ్రాజ్యవాద నిర్బంధ విధానంపై రోజువారీ పోరాటాలద్వారా కార్మికవర్గం సామ్రాజ్య వ్యతిరేకశక్తులలో దృఢతరమైన సంఘటిత భాగంగా ఇప్పటికే నిల్వగలిగింది.

ఈ అభివృద్ధితోపాటు వీని ఫలితంగా కార్మికోద్యమంయొక్క పాత్ర. పలుకుబడి జాతీయోద్యమంలో కనిపించసాగింది. అనేక కార్మికసంఘాల బలంతో కాంగ్రెసు అతివాదుల నాయకత్వంతో కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగించాలన్న బ్రహ్మాండమైన ఉద్యమం సాగింది. నిషేధమున్నప్పటికి కాంగ్రెసు మంత్రివర్గంక్రింద పౌరసత్వాలు విస్తృతం కావడంవల్ల కమ్యూనిస్టుపార్టీ ఇంగ్లీషులో 'నేషనల్ ఫ్రంటు', మరాఠీలో క్రాంతి అనే వారపత్రికలను ప్రకటించ వీలయింది- మరాఠీ బొంబాయిలోని కార్మికవర్గంలో అత్యధిక సంఖ్యాకులు మాట్లాడేభాష.... ఈ పత్రికలు సామ్రాజ్యవాద వ్యతిరేక సంయుక్త జాతీయ సంఘటననుగూర్చి, ఫాసిజం ప్రమాదాన్నిగూర్చిన అభిప్రాయాలను ప్రచారం చేశాయి. రైతుల, కార్మికుల, సంస్థానప్రజల పోరాటాలకు ప్రజలందరి తోడ్పాటును ఈ పత్రికలు సాధించ పనిచేశాయి. కమ్యూనిస్టులు వివిధ కాంగ్రెసు సంఘాలలోని ప్రధాన పదవులకు ఎన్నుకోబడినారు. కాంగ్రెసులో అత్యున్నత కార్యసంఘమైన అఖిల భారత కాంగ్రెసు కమిటీలో కమ్యూనిస్టులు 20 మందికి తక్కువ లేకుండా ఉన్నారు. కాంగ్రెసులో పెత్తనం వహిస్తున్న మితవాదనాయకత్వం రాజీవిధానాన్ని ఎదిరించి పోరాడేందుకై కమ్యూనిస్టులకు, సోషలిస్టులకుమధ్య అతివాద ఐక్యతను సాధించేందుకు పదే పదే ప్రయత్నం జరిగింది. కాని ఇందుకు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకత్వంలోని అభివృద్ధినిరోధక పక్షం తీవ్రంగా వ్యతిరేకించడంవల్ల ఈ ప్రయత్నాలు పరిమితమైన ఫలితాలనే సాధించగలిగాయి

## 8. రెండో ప్రపంచయుద్ధంలో కార్మికవర్గం

1939 సెప్టెంబరులో యుద్ధం ప్రారంభం కావడంతో, భారత జాతీయ స్వతంత్రోద్యమానికి భారత కార్మికవర్గానికి ప్రధాన యుగమొకటి ప్రారంభమైంది.

జాతీయ నాయకత్వం చల్లబడి ఉండగా కార్మికోద్యమమే దాడిని ఆరంభించింది. ఒకరోజు రాజకీయ అసమ్మతి సమ్మెను ప్రకటించింది. 1939 అక్టోబర్ 2వ తేదీన 90,000మంది బొంబాయికార్మికులు పని మానారు-ప్రపంచ కార్మికోద్యమంలో ఇదే మొదటి యుద్ధ వ్యతిరేకసమ్మె. దృఢతరమూ, సంఘటితమూ అయిన భాగంనుండి కార్మికవర్గం భారతదేశంలోని సామ్రాజ్య వ్యతిరేకశక్తులకు అగ్రగామిగా ముందుకు వస్తున్నది

యుద్ధం మూలంగా జీవిత ప్రమాణం బాగా పెరిగింది. కాని ఇందుకు తగినట్టు జీతాలు పెరగలేదు. ఈ సంగతిని భారతప్రభుత్వ ఆర్థిక సలహాదారు డాక్టరు టి. ఇ గ్రిగరీ అంగీకరించాడు. సెప్టెంబరులో ధరలు 100 అనుకున్నట్టయితే డిసెంబరు నాటికి "ప్రాథమిక వస్తువుల ధరల సూచీ సంఖ్య 137 కి పెరిగింది" అని ఆయన చెప్పాడు. దీనికి చిల్లరవర్తకుల లాభాలు చేర్చాలి. బొంబాయి క్రానికల్ ప్రత్యేక విలేఖరి ఇలా వ్రాశాడు: "బజ్రా, జొన్న, బియ్యం, గోధుమ వగైరా ఆహార దాన్యాలలో లాభాలు తీయడం సెప్టెంబరు ధరలలో సగటున నూటికి 28 ఉంటుంది. వీనికి చిల్లర వర్తకుల లాభాలు చేరిస్తే - అది 8 నుండి 14 వరకు నూటికి ఉంటుందని అంచనావేశారు పేదవాని కెంత వ్యయకారణమో తెలియవస్తుంది." (బాంబే క్రానికల్, డిసెంబర్ 6, 1939)

ఈ యుద్ధ ఆర్థికభారానికి వ్యతిరేకంగా కార్మికవర్గం పోరాటం మొదలు పెట్టింది 1940 మార్చి 5 వ తేదీ బొంబాయిలోని 1,75,000 బట్టలమిల్లు కార్మికులు అధికధరల భత్యం సమ్మెతో ఇది ప్రారంభమైంది. ఈ సమ్మె పూర్తిగా 40 రోజులు జరిగింది. సమ్మె నాయకులందరినీ అరెస్టుచేసి, పోలీసులు కార్మికవర్గ నివాసాలలో ప్రవేశించి ఇండ్లలో నున్నవారిని చావబాది భయభ్రాంతిని కలిగింప జూచినా సమ్మె సాగింది. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ పిలుపు ననుసరించి, మార్చి 10 వ తేదీ 3,50,000 మంది కార్మికులు ఒకరోజు సమ్మెచేసి కార్మికులలోని అన్ని పక్షాల ఏకీభావాన్ని వెల్లడించారు.

ఈ బొంబాయి సమ్మె దేశమంతటా సమ్మెల వెల్లువను ప్రవహింపజేసింది. కాన్పూరులోని 20,000 మిల్లుకార్మికులు, కలకత్తాలోని 20,000 మునిసిపల్ కార్మికులు, బెంగాలు బీహారులలోని జనపనారమిల్లు కార్మికులు, అస్సాం దిగ్బాయ్ నూనె కార్మికులు, ధనబాదు, ఝురియాలలోని బొగ్గుగని కార్మికులు, జంషెడ్పూర్ ఇనప పరిశ్రమ కార్మికులు, మిగతా ఎన్నో పరిశ్రమలలోని కార్మికులు అధికధరల భృతి కోరుతూ సమ్మె చేశారు. కార్మికవర్గమంతా సంచలించి పురోగమిస్తున్నదని స్పష్టపడిపోయింది

మరొకతూరి ప్రభుత్వం దెబ్బతీసింది. నేషనల్‌ఫ్రంట్, క్రాంతి పత్రికలను నిషేధించింది. ఇండియా రక్షణచట్టం అమలుపరిచింది. దేశమంతటా కమ్యూనిస్టులను, తీవ్రవాదులను అరెస్టుచేసింది. 1941 జనవరిలో భారతప్రభుత్వ సభ్యుడు రెజినాల్డు మాక్స్వెల్ ఇలా అన్నాడు. జైలులో విచారణ లేకుండా నిర్బంధింప

బడినవారు 700. "480 దాదాపు కమ్యూనిస్టులో లేక కమ్యూనిస్టుల హింసా ప్రజా విప్లవ కార్యక్రమాన్ని ఆమోదించినవారో అయిఉన్నారు." (కేంద్ర శాసనసభ చర్చలు, ఫిబ్రవరి 12, 1941) ఇక శిక్షలు పడినవారు 6,466 మంది. నిర్బంధ శాసనాలద్వారా ఒక వూరిలో నిర్బంధింబడినవారో, ఒక వూరును వదిలిపెట్టమని ఆదేశింపబడినవారో కలసి 1,664 మంది.

కమ్యూనిస్టుపార్టీపై ప్రభుత్వం దాడితోపాటు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీకూడ దాడి సాగించి-పార్టీలోనుండి కమ్యూనిస్టులని అనుమానింపబడినవారిని కమ్యూనిస్టు అభిమానులను గాంధీ అహింసా సిద్ధాంతం అంగీకరించలేదని వెళ్ళగొట్టింది. "బాధ్యతలేనివారు.... ....ఆలోచనలేక ఇచ్చవచ్చినట్టు హింసాభావాన్ని రెచ్చగొట్టే వారు కొందరున్నారు।.........మన (కాంగ్రెసు సోషలిస్టుల) పలుకుబడి శాంత యుతమైన ప్రజాపోరాటంవైపు ఉపయోగపడాలని ఆయన (గాంధీ) చూడగలి గాడు" (ప్రధాన కార్యదర్శి జయప్రకాశనారాయణ కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ సభ్యు లకు ఇచ్చిన సర్క్యులర్). ఈ తరుణంలో కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలోని కార్య వ్యగ్రులైన సభ్యులు, గాంధీజీ అహింసా సిద్ధాంతాలకు లొంగిపోయేందుకు వర్గ పోరాట పునాదిని వదిలివేసిన సోషలిస్టు నాయకత్వంపై అసంతృప్తి చెంది రహ స్యంగా పనిచేస్తున్న కమ్యూనిస్టుపార్టీలో చేరేందుకు వెళ్ళిపోయారు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ, ఏ ప్రజాసంస్థగాని, నిజమైన కార్మికవర్గ ప్రాతిపదికగాని లేని ప్రధా నంగా ఒక నాయకుల కూటమిగా నిలచిపోయింది.

ప్రభుత్వ దాడి కమ్యూనిస్టుపార్టీ నిర్మాణాన్నిగాని, కార్యక్రమాన్నిగాని విచ్ఛిన్నం చేయలేకపోయింది. ఆ పార్టీ నాయకత్వమంతా దాదాపు నిర్బంధింప బడినా పనిచేస్తూవచ్చింది. కొందరు విజయవంతంగా పోలీసువేటనుండి తప్పిం చుకోగల్గారు; రహస్య విప్లవాత్మక ప్రచారంతో పాటు బహిరంగ ప్రజాపోరాటం నడిచింది. సంఖ్యలో చిన్నదీ, తీవ్రనిర్బంధాలకు ఇబ్బందులకు గురైన పార్టీసంఘ టనలను పెద్దగా నడిపించలేకపోయినది: కాని కార్మికవర్గ ప్రధానపార్టీగాను, భారత రాజకీయాలలో ఒక ప్రధానశక్తిగాను నిస్సందేహంగా నిలబడింది.

ఇందుతోపాటు దేశ వ్యాప్తమైన కార్మికవర్గ సంయుక్త పోరాటం కేంద్ర ట్రేడ్ యూనియన్ నిర్మాణంలో ఐక్యతను పూర్తిగా నెలకొల్పింది. నేషనల్ ఫెడరేషన్ అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లో పూర్తిగా సమ్మిళితమై పోయింది. కాని "అన్ని రాజకీయ సమస్యలు, సమ్మెల సమస్యలు విదేశ సంస్థ దేనితోనైనా అనుబంధంగా చేరే అంశమూ మూడు వంతుల మెజారిటీతో నిర్ణ యించ బడాలి" అనే షరతును నియమావళిలో చేర్చే వరకు ఈ పని జరగలేదు. తర్వాత దశలో స్పష్టమైన రాజకీయ మార్గాన్ని చూపడానికి కార్మికోద్యమానికి వీలు లేకుండా తీవ్ర నిరోధక మైనప్పటికి, ఈ షరతును ఐకమత్యంకోసం తీవ్ర వాదులు అంగీకరించారు.

ఈ హద్దు పెట్టడంవల్ల ఏర్పడిన ఇబ్బందులు తర్వాత బయలు పడినవి. యుద్ధం మరింత అభివృద్ధి చెందడంతో కొత్త సమస్యలు ఉదయించినవి సోవియటు యూనియన్‌పై నాజీదండయాత్ర, ఆగ్నేయాశియాను ఆక్రమించి జపాన్ యుద్ధంలోచేరడమూ, సంయుక్త రాజ్యాలు మిత్రమండలిని ఏర్పరచడమూ, భారత దేశానికి జపాన్ ప్రమాదం హెచ్చడమూ నూతన సమస్యలను తెచ్చిపెట్టాయి.

1942 ఫిబ్రవరిలో అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కాన్పూరు సమావేశం ప్రారంభమయింది. ఈ మధ్యలో జీవిత పరిస్థితులు కార్మిక వర్గానికి చాల అధ్వాన్నంగా పరిణమించాయి. జపాను సేనలు మలయా, బర్మాలను ఆక్రమించి భారత దేశాన్ని మ్రింగ జూస్తున్నవి.

ఏమైనప్పటికీ ట్రేడుయూనియన్ ఉద్యమంలోని కేంద్రనాయకత్వం స్పష్టమైన రాజకీయమార్గాన్ని చూపలేకపోయింది. జాతీయ రక్షణకోసం యుద్ధాన్ని బేషరతుగా బలపరచాలని. జాతీయరక్షణను బలవత్తరంగా చేయడానికి జాతీయ వాంఛా ప్రణాళికకోసం కార్మికవర్గం పోరాడాలని కోరే కమ్యూనిస్టు తీర్మానాన్ని అధికసంఖ్యాకులు బలపరచారు. కాని ఈ తీర్మానం అధికసంఖ్యాకులు బలపరిచినా మూడువంతుల మెజారిటీ రాలేదు. అందువల్ల కార్మికోద్యమంలోని ఆయా రాజకీయవర్గాలు తమ తమ రాజకీయాలను ప్రచారం చేసుకునేందుకు స్వతంత్రం చిక్కింది.

1942—45 యుగం కార్మికవర్గానికి, యావత్ భారతదేశానికి కూడ మహా పరీక్షాసమయం. యుద్ధఖర్చులకై ప్రభుత్వం నియమరహితమైన ప్రజలను రెచ్చగొట్టే చర్యలకు పూనుకుంది; జీవితావసరవస్తువులను దాచడం, దొంగవర్తకం చేయడం ఎక్కువయింది; జీవితప్రమాణం రెట్టింపయింది. జాతీయనాయకులు అరెస్టయ్యారు, వెంటనే అతిరాక్షస దమననీతి అమలు జరిగింది; ప్రభుత్వ విధానంపై దేశమంతా మండ్లు కొరుకుతున్నది. ఇలాంటివన్నిటిలో ఏ ఒక్క కారణమైనా కార్మికవర్గాన్ని సమ్మె చేయించేందుకు తగినంతదే. కాని పరిస్థితి మారిన సంగతి గుర్తించి, జాతీయ రక్షణావశ్యకతను గ్రహించి సమ్మె చేయకుండా ఆగారంటే సమ్మెచేయించేందుకు ఎంతో రెచ్చగొట్టినారు, కార్మికులలో ఒక పక్షానికి లంచమిచ్చి ఉదాహరణలుకూడఉన్నవి. అందుకు కార్మికవర్గంయొక్క సమగ్ర వర్గచైతన్యమూ, అభివృద్ధిచెందిన జాతీయ చైతన్యమూ. వారిని నడిపిన కమ్యూనిస్టుపార్టీ అభినందనార్హాలు. ఏవైనా పెద్దయెత్తున జరిగాయంటే అవి గాంధీవాదుల యూనియన్‌కు కేంద్రమైన అహ్మదాబాదులో 3 నెలల సమ్మె, జంషెడ్‌పూరు ఐరన్ అండ్ స్టీల్ వర్కుల్లోని సమ్మెలు మాత్రమే. జంషెడ్‌పూర్ సమ్మెకు కార్మికులెంత కారణమో యజమానులూ అంతవరకైనా కారణమయ్యారనడం నిజం.

ఈ యుగంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రింద కార్మికవర్గం సామ్రాజ్యవాద నిర్బంధ విధానాన్ని తీవ్రంగా ఎదుర్కొంది. నిర్బంధ వ్యతిరేక దినోత్సవం

1942 సెప్టెంబరు 25 న జరపమని ట్రేడుయూనియన్ కాంగ్రెసు ఆదేశించింది. జాతీయ రక్షణభావాలను ప్రజల్లో వ్యాపింపజేసి. ధరల కంట్రోలు. రేషనింగు లాంటి జీవిత దినావసరాలకై తీవ్రంగా ఆందోళన చేసింది. దొంగవర్తకానికి. దొంగనిల్వలకు వ్యతిరేకంగా పోరాడింది. సామ్రాజ్యవాదులు రెచ్చగొట్టినా జపాను ఆశలు పెట్టినా. వానికి గురికాకండని ప్రజలను హెచ్చరించింది.

ఇందు మూలంగా కార్మికోద్యమము కార్మిక సంఘాలలో కమ్యూనిస్టు పార్టీ పలుకుబడీ పెరిగింది. ఎనిమిదేళ్ళు రహస్యంగా పనిచేసిన తర్వాత 1942లో కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగడం కార్మికవర్గ ఉద్యమానికి విజయం. కార్మిక సంఘాలెలా అభివృద్ధి చెందాయో. ఈ క్రింది ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సభ్యత్వపు లెక్కలను పరికిస్తే బోధపడుతుంది.

| సంవత్సరం | కార్మిక సంఘాల సంఖ్య | రిజిష్టరైన సభ్యుల సంఖ్య |
|---|---|---|
| 1938 | 188 | 3,63,450 |
| 1940 | 195 | 3,74,256 |
| 1941 | 182 | 3,37,695 |
| 1942 (ఫిబ్రవరి) | 191 | 2,69,803 |
| 1943 | 259 | 3,32,079 |
| 1944 | 515 | 5,09,084 |

1944-45 సంక్షోభ సమయంలో ఎన్నో ప్రతిరోధక శక్తులను ఎదుర్కొని కమ్యూనిస్టులు నిర్వహించిన వివిధ కార్య కలాపాలవల్ల పార్టీ సభ్యత్వంలో స్పష్టమైన అభివృద్ధి కనిపించింది: 1942 జులైలో కేవలం 4000తో ప్రారంభమైన సభ్యత్వం 1943 మే నాటికి 15,000కు పురోగమించింది; 1944 జనవరికి 30,000కు దాటి 1946 వేసవికి 53,000కు పోయింది.

బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రయోజనాలలో పూర్తిగా కలిసిపోయిన యమ్. యన్. రాయిసహచరులు ట్రేడ్‌యూనియన్ ఉద్యమ ఐక్యతను విచ్ఛిన్నం చేయాలని చేసిన ప్రయత్నాలు సఫలం కాలేదు. వారు 1941లో "ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్" అనబడే సంస్థను ఏర్పరచారు. ఈ సంస్థకు ప్రభుత్వం నెలకు రూ. 13,000 చొప్పున గ్రాంటు నిచ్చింది కాని ఎంత ప్రచురణ ఉన్నా కార్మిక వర్గంలో ఈసంస్థకు చెప్పుకోదగిన స్థానం దొరకలేదు. 1946 సెప్టెంబరులో జరిగిన ప్రభుత్వ విచారణ మూలంగా ఆఖరుకు 7,00 000 సభ్యత్వంగల అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌మాత్రమే భారత కార్మికఉద్యమానికి నిర్ణాయకమైన ప్రతినిధి సంస్థ అని తేలింది.

1940 తర్వాత ముఖ్యంగా ఒక నాయకులసంఘంగా తయారయిన కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ, కాంగ్రెస్ 1942 ఆగస్టు తీర్మానంచేసి కాంగ్రెసు నాయకులు అరెస్టయిన తర్వాత (చూ. అధ్యాయం 16) ఈ పునాదిపై తనంతట నాయ

కుల నిర్బంధంతో బయలుదేరిన ప్రజాందోళనను సంఘటితపరచాలని ప్రయత్నించింది. ఈ ప్రయత్నాలలో కార్మికవర్గ సహాయాన్ని వారు సాధించలేకపోయారు. ప్రజాందోళనస్థితి తగ్గడమూ, వారి ప్రయత్నాలు సఫలీకృతం కాకపోవడమూ మూలంగా వారు ఫాసిజం విషయంలో తటస్థతనుంచి క్రమక్రమంగా సుభాష్ చంద్రబోస్ అనుచరులకు సన్నిహితమైన స్థానానికి వెళ్ళారు. (బోసు ఫాసిస్టు సాయంతో భారత స్వతంత్రం సాధించాలనే ఆశతో జర్మన్, జపాన్ ఫాసిజంతో మైత్రి చేసుకున్నాడు.) ఈ అంశం ఇలా ఉన్నప్పటికి హఠాత్తుగా విజృంభించిన ప్రజల వీరకృత్యాలను మహోజ్వలంగా అభినందిస్తూ రహస్య సారస్వతాన్ని విపరీతంగా ప్రచురించడంవల్లా, కొంతవరకు విధ్వంసక కార్యాలు జరపడంవల్లా వారికి యువక కాంగ్రెస్‌వర్గాలలో, ముఖ్యంగా విద్యార్థులలో — కార్మికవర్గంలో కాకపోయినప్పటికీ — చెప్పదగినంత ఎక్కువ పలుకుబడి ఏర్పడింది. యుద్ధం ముగిసినతర్వాత కాంగ్రెస్ సోషలిస్టులు తీవ్రమైన కమ్యూనిస్టు సోవియట్ వ్యతిరేక ప్రచారమార్గాన్ని అనుసరించారు.

యుద్ధసమయంలో కార్మికవర్గఉద్యమం పురోగతి, విజయాలూ సంస్మరణీయమైన అభివృద్ధిదశను ప్రతిబింబిస్తున్నవి. యుద్ధం ముగిసి ఫాసిజం పరాజయం పొందడంతో, నిర్మాణం, క్రమశిక్షణ అత్యుత్తమస్థాయిలోగల, సామ్రాజ్య వ్యతిరేకంగా, అనవరతం పోరాడే శక్తిగా కార్మికోద్యమం తయారయినది ఈ సంగతిని యుద్ధానంతరం బయలుదేరిన ప్రజాపోరాటాలు మరింత విదితం చేశాయి. రాజకీయోద్యమంలోని పై నాయకులలో పరస్పరవిభేదాలు ఎంత తీవ్రమవుతున్నప్పటికి కార్మికోద్యమం తనలో హిందువులు, ముస్లిములు, అస్పృశ్యులు అందరిని ఐక్యపరచింది. వారందరూ ఏకంగా పనిచేసేట్టు చేసింది. రానున్న జాతీయ సాంఘిక, స్వతంత్ర పోరాటాలలో అగ్రేసరంగా కార్మికవర్గం తన స్థానాన్ని సంపాదించుకున్నది.

ప్రజల పలుకుబడిలో కాంగ్రెసుతోగాని, ముస్లింలీగుతోగాని పోల్చ వీలులేకున్నా భారత రాజకీయాలలో కమ్యూనిస్టుపార్టీ మూడవ స్థానానికి రావడం ఈ కార్మికవర్గ పురోగమన ప్రతిబింబమే.

యుద్ధసమాప్తి తర్వాత కల్లోల దశలోను, జాతీయ ప్రభంజనం, వెల్లివిరుస్తున్న సమ్మెల ఉద్యమాలలో ప్రజాపోరాటంలో అగ్రేసరంగా కార్మికవర్గపాత్ర పురోగతి ముందుకు సాగుతూనే పోతున్నది.

## పదమూడో అధ్యాయం

# భారత ప్రజాతంత్ర సమస్యలు

"విభజించి పాలించు అనేది పాత రోమన్ ఆదర్శం. అదే మనకు ఆదర్శం కావాలి"

— లార్డు ఎల్ఫిన్‌స్టన్, బొంబాయి గవర్నర్, 1859 మే రికార్డు.

దినదినాభివృద్ధి చెందుతున్న భారత జాతీయోద్యమమూ, రైతుల తిరుగుబాటూ, కార్మికోద్యమమూ భారత సమాజంలోని అభ్యుదయ శక్తులకు ప్రాతినిధ్యం వహిస్తున్నవి. కాని అవే భారత సమగ్ర సమాజచిత్రం కావు. వాటిలో అత్యధిక సంఖ్యాక భారతప్రజలు ఇమిడి ఉన్నప్పటికి వారే ప్రజలందరూ కారు. వారే అందరూ అయివుంటే తగాదా కేవలం ఒక విడిదిలో బాధపడుతున్న సంయుక్త భారత ప్రజానీకానికీ, మరొక విడిదిలో కొట్టుకుంటున్న కొలదిమంది బ్రిటిష్ పాలకులకూ మధ్యనే ఏర్పడివుంటే ఇప్పటి కెప్పుడో ముగిసి ఉండేది - లేదా అసలు ఈ పరాధికారమే ప్రారంభమై ఉండేదికాదు.

సామ్రాజ్యవాద పాలనక్రింద అభివృద్ధి కుంటువడిన భారత దేశంలాంటి సమాజంలో సాంఘిక అభివృద్ధివిరోధక శక్తులు తమలోవి బలంకన్నా ఎక్కువ ప్రాముఖ్యం వహించడం తప్పదు. ఈ శిథిలిత శక్తులే అసలు దురాక్రమణకు సాయపడినవి. జాతీయ చైతన్య ప్రవాహం ముందుకు చొరుచుకొని పోయేకొద్దీ ఈ కాలదోషం పట్టిన వర్గాల ప్రాముఖ్యం, ప్రాబల్యం హెచ్చినట్లు కనిపిస్తుంది. ఎందుకంటే ఇవే సామ్రాజ్యవాద పాలనకు మిగిలిన పట్టుగొమ్మలు.

భారతదేశంలోఉన్న బ్రిటిష్‌వారి సంఖ్య సైమన్ నివేదికప్రకారం 1,56,000 (వీరిని యూరపియన్లు అని లెక్కల్లో వ్రాసినా ఎక్కువమంది బ్రిటిష్‌వారే): 1931 జనాభా లెక్కల ప్రకారం వీరి సంఖ్య 1,68,000. వీరిలో 60 000 మంది సైన్యంలో ఉన్నారు, 21,000 వ్యాపారంలోనో, ప్రత్యేక వృత్తులలోనో ఉన్నారు. 12,000 మంది సివిల్ సర్వీసులో ఉన్నారు.

వీరంతా కలిసి, దేశంపై సామ్రాజ్యవాదపాలనకు ప్రత్యక్ష ప్రతినిధులుగా పనిచేసే యుక్తవయస్కులసంఖ్య 1 00,000 అవి తేలుతుంది. వీరు భారత జనసంఖ్యలో 4000 మందికి 1 చొప్పున ఉన్నారు. దీనినిబట్టి, భారత ప్రజలను పూర్తిగా నిరాయుధులను చేసేందుకు అన్ని జాగర్తలు తీసుకొన్నప్పటికీ, పెద్ద ఆయుధాలను, ఫిరంగులను, విమానాలను ఒక్క బ్రిటిష్‌వారిచేతనే ఉంచుకున్నప్పటికీ ఆ కొద్దిమంది వరుసగా 40 కోట్ల భారత ప్రజలపై పెత్తనం నిలుపుకోవడం కేవలం పశుబలంతో సాధ్యంకాదనేది స్పష్టమే. భారత ప్రజలలోనే సాంఘిక ప్రాతిపదిక తప్పక ఉండితీరవలసి వస్తుంది.

భారత ప్రజలలోనే, సామ్రాజ్యతత్వానికి సహచరమైన సాంఘిక ప్రాతిపదిక నిల్పుకోవడం సామ్రాజ్యవాదపాలన నిలుపుకొనేందుకుండవలసిన నిబంధన. ప్రతి అభివృద్ధినిరోధక పాలనకువలెనే, ముఖ్యంగా విదేశపాలనకు ప్రజల విభజన, పాలక రాజ్యాంగనీతికి అవసరమైన న్యాయసూత్రం. అలాంటి సాంఘిక ప్రాతిపదిక సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడే అభ్యుదయశక్తులలో దొరకదు ప్రజలకు వ్యతిరేకమైన ప్రయోజనాలుగల అభివృద్ధినిరోధక శక్తులలోనే అది దొరకాలి. బ్రిటిష్ ప్రభుత్వం బుద్ధిపూర్వకంగా భూస్వామివర్గ ప్రాతిపదికపై ఎలా నిర్మితమైందో, ప్రభుత్వ విధానంగా పెట్టుకొని తానే ఎలా ఆ వర్గాన్ని సృష్టిచేసిందో మనం పరిశీలించాము. వీరితోపాటు వివిధ వ్యాపార వర్గాలూ, వడ్డీ వ్యాపారాలూ తమ రక్షణకై సామ్రాజ్య తత్త్వం వైపు చూస్తున్నారు; వీరుకాక వారికింద పని చేసే ప్రభుత్వోద్యోగ వర్గ మొకటుంది. ఒక శతాబ్ది క్రింద అనుసరిస్తూ వచ్చిన సాంఘిక సంస్కార పాత్రను వదిలివేసి సామ్రాజ్య తత్త్వం నేడు, జాతీయ సంస్కార వాంఛలకు వ్యతిరేకంగా భారత ప్రజలలోని సభ్యతా హీన పద్ధతులను నిలబెడుతూ, రక్షిస్తూ ఉన్నదని కూడ మన యింతకుముందే తెలుసుకున్నాము (ఇదంతా ప్రజల ఆచారాలలోను, మత విశ్వాసాలలోను జోక్యం తీసుకోము అన్న పేరనే నడుపుతున్నది) మిగిలిఉన్న అభివృద్ధినిరోధక విభజనకు కులం మొదలైన వానిని వీలైనంత వరకు ఉపయోగించుకుంటున్నదని కూడ మనం కనుగొన్నాము (ఈ పునాది పైననే నిమ్నజాతులకు ప్రత్యేక నియోజక వర్గాలు దానిపై ఏర్పడిన పార్టీలను ప్రోత్సహించడమూ జరిగింది) కాని ఈ విధానం క్రింది రెండు రంగాలలో కన్నా మరెక్కడా ఇంత నగ్నంగా ప్రదర్శితంకాలేదు, ఈ రెండు రంగాలూ వర్తమాన యుగంలో అతి ప్రాముఖ్యానికి వచ్చాయి. అవి, భారత సంస్థానాధిపతుల సమస్య ఒకటి, మత విభేద సమస్య రెండవది. ఈ రెండవది ముఖ్యంగా హిందూ ముస్లిం ద్వేషరూపంలో ఉంది.

వాస్తవ స్థితిలో ఈ రెండు సమస్యలూ, అభివృద్ధి నిరోధక వర్గాల విషయంలో జాతీయోద్యమం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలోని భాగాలే. జాతీయ స్వతంత్రోద్యమం పురోగమించే కొద్దీ, ఈ అభివృద్ధి నిరోధక శక్తులను ఉపయోగించు కొనేందుకు అతి తీవ్ర ప్రయత్నాలు జరుగుతున్నవి. వర్తమాన యుగ

స్వభావంలోనే ఇది అంతర్గతమై ఉన్నది. ఆఖరు మూలబలగాన్ని, అన్నీ ముగిసినాక యుద్ధంలో ఉపయోగించినట్టుగా వీనిని సామ్రాజ్యవాదు లుపయోగిస్తున్నారు.

భారత దేశంలో ప్రజాతంత్ర విజయానికి ఈ సమస్యల పరిష్కారం ప్రాణప్రదమైనది.

## 1. సంస్థానాధిపతులు

సామ్రాజ్య తత్వం భారత దేశాన్ని అసమానమైన ముక్కలుగా చీల్చివేసింది. బ్రిటిష్ ఇండియా-"స్వదేశ సంస్థానాలు" అనబడే భాగం. ఇష్టం వచ్చినట్టు అశాస్త్రీయంగా జరిగిన ఈ విభజన పరిపాలనా సౌకర్యార్థం చేసింది కాదు. అంతకన్నా సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితులలో చాల లోతువరకు పోతున్నది. దీనిని దేశ పటాన్ని చూచినప్పుడే గ్రహించ వీలవుతుంది. బ్రిటిష్ రాజ్యంక్రింద భారత పటం అరాజకంగా, గందరగోళంగా ఏర్పడిన చిన్న "సంస్థానాల"తో నిండి ఉంది. దీనితో పోలిస్తే 19 శతాబ్దికి ముందటిజర్మనీ చాల సక్రమ పద్ధతిలో ఉన్నట్లు కనిపిస్తుంది.

పశ్చిమంనుండి తూర్పుకు, ఉత్తరంనుండి దక్షిణానికి, పడమరకున్న 200 కథియవార్ సంస్థానాలు, లేక రాజపుటానా 20 సంస్థానాలనుండి పూర్తిగా తూర్పున మణిపూర్ మిగత చిన్న ఖాసీ కొండజాతి ప్రాంతాలవరకు, ఉత్తరాన కాశ్మీర్ మరికొన్ని చిన్న సిమ్లా సంస్థానాలనుండి దక్షిణాన మైసూరు, మదరాసు సంస్థానాలవరకు దిక్కులేనన్ని వందలకొలది చిన్నవీ, పెద్దవీ — సంస్థానాలు $\frac{2}{5}$ నుండి భారతదేశంలో అర్థభాగం వరకు (బర్మాను ఇండియాను వేరుపరచారు కాబట్టి ఇప్పుడు 45%) ఆక్రమించిఉన్నాయి. వీని సరిహద్దులు దేశపటం గీసే వానిని ధిక్కరిస్తున్నవి. ఇండియాలో 563 సంస్థానాలున్నవి. వీని వైశాల్యం 7,12,000 చదరపు మైళ్ళు. జనాభా 8 కోట్ల పదిలక్షలు (1931 జనాభా) లేక దాదాపు భారతజనాభాలో నాల్గోవంతు (నూటికి 24 వంతులు.) వీనిలో ఇటలీ అంతవున్న 1 కోటి 40 లక్షల జనాభాగల హైదరాబాదు మొదలు, 19 చదరపు మైళ్ళ వైశాల్యంగల లావా వరకు మరికొన్ని ఒక్కొక్కరి పొలాల్లోఉన్న సిమ్లా హిల్సు సంస్థానాలవరకు ఉన్నాయి. వీని అధికారం, తాహతులు అనేక రకాలు గనుక అన్నిటికి కలిపిచెప్పడం వీలుకాదు. వీనిలో 108 పెద్ద సంస్థానాలు ప్రత్యక్షంగా నరేంద్రమండలిలో చేర్చబడినవి. 127 చిన్నసంస్థానాలు పరోక్షంగా 12 మంది ప్రతినిధులను నరేంద్రమండలికి పంపుతాయి మిగత 328 సంస్థానాలు ఆచరణలో ప్రత్యేకపద్ధతిలోని జమీందారీల వంటివి. వీరికి కొన్ని భూస్వామి హక్కులుంటాయి కాని వీరి అధికారం పరిమితమైనది. ఎక్కువ ప్రాముఖ్యంగల సంస్థానాలలో నిర్ణాయకుడు బ్రిటిష్ ప్రతినిధే (రెసిడెంటు.) చిన్నసంస్థానాలను బ్రిటిష్ ఏజంట్లక్రింద గుంపులుగా చేశారు. ఆ ఏజెంట్లు వేరువేరు ప్రాంతాలలో ఉన్న వీనిని గుదిగ్రుచ్చి పాలిస్తుంటారు.

వీటిని "సంస్థానాలు" అనడం పేరును దుర్వినియోగం చెయ్యడమే: ఎందుకంటే అవి పాతసంస్థానాల శిథిలాల్లో నిలచిన దయ్యాలు. కృత్రిమంగా వాటిని నిల్పారు. రాజకీయ కారణాలవల్ల మరో ప్రభుత్వంతో నిలబెట్టబడిన కీలుబొమ్మలు వీరు. పాలెగాళ్ల దౌర్జన్యం, ప్రజావేధ, నిరంకుశ అరాచకత్వం. స్వేచ్ఛగా ఉపయోగించనిస్తూ అసలు అధికారాన్నిమట్టుకు బ్రిటిష్‌వారి చేతుల్లో పెట్టుకున్నారు. 1853 నాటికే మార్క్స్ వ్రాసిన మాటలు నేటికీ సత్యంగానే ఉన్నవి.

> "ఇక స్వదేశ సంస్థానాల సంగతి. అవెప్పుడూ కంపెనీకి లోబడి దాని రక్షణలోకి వచ్చాయో అప్పుడే దాదాపు వాటికి అస్తిత్వం పోయింది. ....పైకి కన్పించే వాటి స్వతంత్రానికి ఆమోదించడంలోనే, వాటి శాశ్వత వినాశం ఇమిడివుంది. ఇంక వాటిని బాగుపరచడం బొత్తిగా సాధ్యపడదు. ఇతరంమీద ఆధారపడి బతికేవాటన్నిటి లాగానే వీటికీ అసలు అస్తిత్వం లోనే శారీరక దౌర్బల్యం ఉంది. కాబట్టి స్వదేశ సంస్థానాలు కాదు, స్వదేశ సంస్థానాధిపతులు వారి ఆస్థానాల రక్షణే నేటి సమస్య. ఈ సంస్థానాధిపతులు నేటి పైశాచిక ఇంగ్లీషు ప్రభుత్వానికి మూల స్తంభాలు. భారత అభ్యుదయానికి పెద్ద ఆటంకాలు."

(మార్క్స్ "స్వదేశ సంస్థానాలు" న్యూయార్క్ డైలీట్రిబ్యూన్ జులై 25, 1853)

అది 93 ఏళ్ళ నాటి సంగతి. స్వదేశ "సంస్థానాలు" లేక సంస్థానాధిపతులు "శాశ్వత శిథిలావస్థలో" యింకా వేలాడుతున్నారు. ఈ శవాలను కృత్రిమ రసాయన పదార్థాలతో శక్తినిచ్చి ఒక రాజ్యాంగం నడుస్తున్నట్టు తోలుబొమ్మలాట ఆడించేందుకు భయంకర ప్రయత్నాలు సాగుతున్నవి.

తామాక్రమిస్తున్న రోజుల్లో భారత దేశంలోని రకరకాలుగా ఒక క్రమం లేకుండా ఉన్న పద్ధతిని తొలగించాలని చూచిన బ్రిటన్, అలాగే ఒక విధమైన రాజకీయ పాలన పద్ధతిని ఏర్పరుస్తామని డంబాలు చెప్పుకునే బ్రిటన్ నేటికి కూడ ఈ శిథిల సంస్థానాల మయ సభను అదే పనిగా నిలపడానికి అంత ఉబలాట పడటమెందుకు? వీని మూలంగా పాలనలో ఏకతగాని, శాసనాల్లో ఏకత్వం గాని, సామాన్యపు కనీస పద్ధతులుగాని, లెక్కలలో ఒక పద్ధతిగాని బొత్తిగా సాధ్యపడడం లేదుకదా? ప్రత్యేకంగా ఆలోచిస్తే ఈపద్ధతి బూర్జువా పాలనా దృష్టికిగాని, వర్తకుని చిట్టా దృష్టితోగాని, పెట్టుబడిదారు పెట్టుబడి దృష్టితోగాని సక్రమమైంది గాదు. వీరందరకూ సమానమైన ఆర్థిక పాలనా పద్ధతుంటే దేశం మొత్తంమీద సుకరంగా వ్యాపించ వీలవుతుంది. వాస్తవంలో బూర్జువా ఇంగ్లాండులో రాచరికాన్ని భూస్వాములను (ఇలాంటి బొమ్మలుగానే) నిలుపుకోవడం కంటే అక్రమం కాదు. వీనికి కారణాలు "ప్రభుత్వ కారణాలు." ఇండియాలోని విదేశ బూర్జువా పాలనకు ఆధారంగా భూస్వాముల్లో ప్రాతిపదిక కావలసి వచ్చింది.

సంస్థానాధిపతులను కీలుబొమ్మలుగా విడవకుండా విల్వాలనుకునే ఈ విధానం వర్తమాన యుగంవరకు అనుసరించలేదు. 19 శతాబ్ది తొలిభాగంలో బ్రిటిష్ ఆక్రమణ తీవ్రంగా ఆత్మ విశ్వాసంతో ముందుకు పోతున్నవరకు శిధిలమవుతున్న సంస్థానాలను బ్రిటిష్ ప్రాంతంలోకి ఏదో ఒక సాకుతో చేర్చుకొనేవారు. కాని 1857 తిరుగుబాటుతో మార్పు వచ్చింది. శిధిలమవుతున్న భూస్వామి వర్గాలు పాతదేశ రాజులు విదేశాక్రమణ ప్రవాహాన్ని మరలించేందుకు చేసిన ఆఖరు ప్రయత్నమే 1857 తిరుగుబాటు ఆ కాలంలోని విద్యావంతుల వర్గానికి చెందిన అభ్యుదయ శక్తులు కొత్త బూర్జువా ప్రతినిధులు ఈ తిరుగుబాటుకు వ్యతిరేకంగా బ్రిటిష్ పాలనను సమర్థించాయని ఇంతకుముందే తెలిపాను తిరుగుబాటు అణచి వేయబడింది; కాని ఒక పాఠం నేర్చుకొన్నారు ఈదృష్టిలో ఈ నిరంకుశ ప్రభువర్గాలిక ప్రమాదకశక్తి కాదు; కేవలం ప్రజా చైతన్య పురోగతికి గట్టి ఆటంకాలు అంతకు ముందు ఆదరంతో చూచిన అభ్యుదయ శక్తులు చైతన్య మందుతున్న ప్రజలకుశక్తివంతమైన నాయకత్వం వహిస్తాయన్న అనుమానం బ్రిటన్‌కు కలిగింది కాబట్టి బ్రిటిష్ పాలనకు మూలాధారంగా జమీందారీ వర్గాలను, సంస్థానాధిపతులను వారి సంస్థానాలను ఏర్పరచు కోవాలన్న విధానం బుద్ధి పూర్వకంగా క్రమ క్రమంగా ఎక్కువగా అనుసరిస్తూ వచ్చారు.

తిరుగుబాటుకు ముందే సర్. విలియమ్ స్లీమాన్ అప్పుడు వైస్రాయి డల్హౌసీని హెచ్చరిస్తూ "ఔధ్‌ను కలుపుకోవడంవల్ల, అలాంటి రాజ్యాలకు పదింతలు ప్రభుత్వానికి ఖర్చవుతుంది. తప్పకుండా సిపాయీల తిరుగుబాటుకు కారణమవుతుంది." సంస్థానాలను "విలవ నీరుగా" మనం చూచుకోవాలి. "అవన్నిటినీ తొలగించివేస్తే మనం దేశీయసేన దయమీద ఆధారపడాలి. ఆసేన మనపెత్తనం క్రిందనే ఉండకపోవచ్చు" అన్నాడు కాని వీర్యవంతుడూ, కొత్తవి చేయాలనేవాడూ, రాజ్య విస్తరీకరణ విధానంలో తయారయినవాడూ అయిన డల్హౌసీ ఒప్పుకోలేదు; విధానంలో మార్పు తేవడానికి 1857 యుద్ధానుభవం అవసరమైంది.

నూతనవిధానాన్ని రాణిగారి 1858 ప్రకటనలో యిలా తెలిపారు: "సంస్థానాధిపతుల హక్కులను, దర్జాను, గౌరవాన్ని మావివలెనే గౌరవిస్తాము". డల్హౌసీ తర్వాత 1860 లో వైస్రాయిగా వచ్చిన లార్డు కానింగ్ ఈవిధాన ఉద్దేశాన్ని స్పష్టంగా చెప్పాడు

"భారతదేశాన్నంతటినీ జిల్లాలుగా విభజిస్తే మన సామ్రాజ్యం యాభై ఏళ్ళకంటే ఎక్కువకాలముండదు. అలాకాక రాజకీయాధికారం లేకుండా మనపని ముట్లుగా సంస్థానాల నెక్కువగా ఉంచినట్లయితే మన నౌకాబలాధిక్యత ఎన్నాళ్ళుంటుందో అన్నాళ్ళూ మనం ఇండియాలో ఉండొచ్చు. ఈభావాన్ని చాల ఏళ్ళ క్రిందట సర్ జాన్ మాల్కొమ్ వెలిబుచ్చాడు. ఇందులోని సత్యాన్నిగూర్చి నాకు సందేహంలేదు. ఇటీవలి సంఘటనలు పూర్వంకన్నా ఈవిషయం మనం ఎక్కువ గుర్తించుకొనేట్టు చేశాయి," (లార్డు కానింగు, ఏప్రిల్ 30, 1860)

అంటే వీరి అంచనా, బ్రిటిష్‌ప్రభుత్వ రక్షణకై "రాజకీయాధికారంలేకుండా బ్రిటిష్ పనిముట్లుగా" సంస్థానాధిపతులను నిల్పాలనేదే. పదిహేనేళ్ళ తర్వాత వైస్రాయి లిట్టన్, విక్టోరియారాణిని భారత సామ్రాజ్ఞిగా చేసిన 1877 రాయల్ బిరుదుల బిల్లు ప్రాముఖ్యాన్నిగూర్చి చెబుతూ, ఈబిల్లు "నూతన విధానానికి సూచకం. దీనిమూలంగా ఇంగ్లాండు రాణి ఇకమీద శక్తివంతమైన స్వదేశ భూస్వాముల ఆశలకు, అభిలాషలకు, సానుభూతులకు, ప్రయోజనాలకు చిహ్నంగా ఉంటుంది."

కాబట్టి ఎప్పుడోఒకప్పుడు విధ్వంసనంకావలసిన-అదేవానిగతి-ఈసంస్థానాల రక్షణ ఆధునిక బ్రిటిష్ విధాన సూత్రమేగాని. ఏ విధంగానూ భారతదేశపు ప్రాచీన సాంప్రదాయాలను, సంస్థలను నిలబెట్టే ఉద్దేశమందులో లేదు సంస్థానాల పక్షంగా పనిచేసే బ్రిటిష్ ప్రభుత్వ ప్రఖ్యాత ప్రచారకుడు ప్రొఫెసర్ రుష్‌బ్రూక్ విలియమ్సు (భారత సంస్థానాధిపతుల ప్రత్యేక సంస్థకు మాజీ జాయింట్ డైరెక్టర్, రౌండ్ టేబిల్‌సభలో సంస్థానాధిపతుల ప్రతినిధివర్గానికి సలహాదారుడు. 1925 వరకు భారత ప్రభుత్వానికి ప్రచురణశాఖా డైరెక్టర్): ఇలా 1930 లో ప్రకటించాడు :

> "స్వదేశ సంస్థానాల అధిపతులు బ్రిటిషు ప్రభుత్వంపై ఎక్కువ భక్తిశ్రద్ధలతో ఉన్నారు. అందులో చాలామంది సంస్థానాధిపతుల అస్తిత్వమే బ్రిటిషు సేనమీద, చట్టంమీద ఆధారపడిఉంది. 18 శతాబ్ది చివరి భాగంలోను, 19 శతాబ్ది ప్రారంభంలోను చాలా పోరాటాలు బయలుదేరాయి. ఆ రోజుల్లో బ్రిటిషు ప్రభుత్వం ఆ సంస్థానాధిపతులకు సాయపడకనేఉంటే-వారిలో చాలమంది ఈరోజున సంస్థానాధిపతులుగా ఉండడం సంభవించేదే కాదు. ఇప్పుడు ఇండియాలోఏర్పడుతున్న తగాదాల్లోను, తప్పకజరగబొయ్యే సంస్కరణల్లోను వీరి రాజభక్తి బ్రిటిష్ ప్రభుత్వానికి పెద్ద సహకారిగా పనిచేస్తుంది....
>
> "భారతదేశంఅంతటా ఏర్పడిన సంస్థానాలు గొప్ప రక్షణదుర్గాలుగా పనికివస్తాయి వివాదగ్రస్తమైన ప్రాంతంలో మిత్రదుర్గశ్రేణిని ఏర్పరచుకున్నట్టుగా మనకివి పనికివస్తాయి బలిష్టంగా రాజభక్తితోఉన్న ఈసంస్థానాలు దేశమంతటా ఉన్నందువల్ల బ్రిటిషుప్రభుత్వానికి వ్యతిరేకంగా యావద్భారతదేశం తిరుగుబాటు చేయడం సాధ్యంకాదు"
>
> (యల్. యఫ్ రుష్‌బ్రూక్ విలియమ్సు, 'ఈవ్నింగుస్టాండర్డు' మే 28, 1930.)

ఏమైనా ఈ "దుర్గాలు", అభివృద్ధినిరోధక బానిససంస్థానాల ఈప్రభుత్వ ప్రచారకుడు నటిస్తున్నంత బలమైనవికావు. ఈ సంస్థానాధిపతులలో అధికసంఖ్యాకులు ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా బ్రిటిషు ప్రభుత్వ రక్షణమీదనే ఆధారపడి ఉన్నారని అందరూ గుర్తించారు.

"ప్రజలలో ఈరోజు వోటు తీసుకున్నట్టయితే, సంస్థానాలను బ్రిటిష్ ఇండియాలో కలిపివేయమని ఆనందంగా వోటుచేస్తారు. సంస్థానాలు నేడున్నాయంటే బ్రిటిష్‌వారి దయమీద ఆధారపడే"

(యస్. వి రంగఅయ్యర్, "ఇండియా, యుద్ధమా? శాంతా?)

"ఏసంస్థానానికూ కూడ ఆధునికదేశ ప్రభుత్వానికవసరమైన లక్షణాలు లేవు. సరిహద్దులు సామాన్యంగా కృత్రిమమైనవి జాతి. భాష. సంస్కృతి విభేదాలతో వీటికి సంబంధంలేదు ఇక సంస్థానానికీ రాజ కుటుంబానికీ మధ్యవున్న సంబంధం సామాన్యంగా యాదృచ్ఛికమైనది. కృత్రిమమైనది ఈసంబంధ 190 ఏళ్ళనాటిది. ఇంతేకాక బ్రిటిష్ ఇండియాలో తమ సోదరులతో సంస్థాన ప్రజలకున్న సభ్యతా, సాంఘిక సంబంధాలు ప్రతిచోటా అత్యధికబలంతో ప్రాచీనకాలంనుంచి ఉన్నవి. సామాన్యంగా చెప్పేంతకంటే సంస్థానాధిపతులపై ప్రజలకున్నఆదరప్రేమలు బాల దుర్బలమైనవి"

(జె. టి గ్విన్, "కాంగ్రెస్-సంస్థానాలు," మాంచెస్టర్ గార్డియన్ మే 12, 1939 )

"తిరుగుబాటో. విప్లవమో" వస్తే వానినుండి సంస్థానాధిపతులను రక్షించవలసిన బ్రిటిష్ ప్రభుత్వ బాధ్యతలను బట్లర్‌కమిటీ 1929 లో మామూలు షరతుల్లో ఇలా తెల్పింది :

"ఒడంబడికలు, సన్నదులు. ఆచారాలబట్టిన్నీ, సంస్థానాధిపతుల సౌకర్యాలను హక్కులను దర్జాను అవిచ్ఛన్నంగా రక్షిస్తామన్న చక్రవర్తి వాగ్దానాన్నిబట్టిన్నీ. తిరుగుబాటో. విప్లవమో వస్తే వానినుండి సంస్థానాలను రక్షించడం సార్వభౌమ ప్రభుత్వ కర్తవ్యమని తేలుతున్నది....సంస్థానాధిపతుల సౌకర్యాలను. హక్కులను. దర్జాను అవిచ్ఛిన్నంగా రక్షిస్తామన్న చక్రవర్తి వాగ్దానంలోనే సంస్థానాధిపతిని తొలగించేందుక్కాని. అతనిని తీసివేసి వేరేవిధమైన ప్రభుత్వాన్ని ఏర్పరచేందుకొని చేసే ప్రయత్నాలకు వ్యతిరేకంగా వారిని కాపాడాలన్న కర్తవ్యం అంతర్గతమయ్యే ఉన్నది "

(భారత సంస్థానాలకమిటీ నివేదిక, 1929, సెక్షన్లు 49—50 )

ఇలాబ్రిటిష్ ప్రభుత్వం కాపాడుతున్న ఈ రాజ్యమెలాంటిది ? భారత సంస్థానాల సామాన్యవాతావరణంగూర్చి జవహర్లాల్ నెహ్రూ తన ఆత్మకథలో ఇలా వర్ణించాడు

"వాతావరణ మంతా నిర్బంధ విధానంతో నిండిఉంది. ఇచ్చటి గాలి పీల్చడమే కష్టంగా ఉన్నది. సమాజములోకి యింకా తొంగిచూస్తే అంతా మురుగు. కుళ్ళు కంపే. దేహమే కాకుండా మనస్సును కూడా నిర్బంధించి వేశారనిపిస్తుంది. ఒక వైపున రాజులు ఐశ్వర్యాలతో తులతూగుతుంటారు. రెండో వైపున ప్రజలు దుర్భర దారిద్ర్యంతో క్రుంగి పోతుంటారు. ప్రజలనుంచి వసూలు చేసిన దాంట్లో

ఎంతో ఎక్కువ భాగం రాజుగారి స్వంతానికి దుబారాలకు ఖర్చు అవుతున్నది. ప్రజావసరాలను చాలా కొద్దిగా మాత్రమే.....

సంస్థానాల్లో జరిగేదే బయటకు తెలియనీయరు. పత్రికలను ప్రకటించ నీయరు. సారస్వత పత్రిక లేక అధికారులకు సంబంధం ఉన్న వార పత్రిక కంటే పత్రికలు ఉండవు. బైటనుండి పత్రికలు రానీయరు. దక్షిణా పథంలో ఉన్న తిరు వాంకూరు, కొచిన్లలో మాత్రం బ్రిటిషు ఇండియాలో కంటే అక్షరాస్యులు ఎక్కు వగా ఉన్నారు. కాని మిగిలిన అన్ని సంస్థానాల్లోను అక్షరాస్యత చాలా తక్కువగా ఉంది. ఈ సంస్థానాలనుంచి వచ్చే ప్రముఖ వార్తలు ఏమిటి? వైస్రాయి ఎంత దాబు దర్పంతో సంస్థానానికి వచ్చింది, పరస్పరం పొగడుకుంటూ యిచ్చిన ఉప న్యాసాలూ, లేకపోతే రాజుగారి జన్మ దినోత్సవమో లేదా వివాహమో ఎంతదర్జాగా జరిగింది, లేదా రైతుల తిరుగుబాటులు - ఇవే ఇక్కడి నుంచి వచ్చే వార్తలు. బ్రిటిషు ఇండియాలో కూడా ఈ సంస్థానాధి పతులను విమర్శించ రాదని చట్టా లున్నాయి. ఇక సంస్థానాల్లో వీరిని గూర్చి పెల్లెత్తు మాటకూడా అనరాదు. బహి రంగ సభలు అనేవి ఎరుగరు. ప్రత్యేక సమస్యలపైన సమావేశాలు జరుపుకున్నా నిషేధిస్తారు ”

(జవహర్లాల నెహ్రూ ఆత్మకథ 631 పేజీ)

సంస్థానాల్లో పత్రికలపై నిషేధాన్ని ప్రత్యేకించి భారత ప్రభుత్వ ప్రకటన జూన్ 25, 1891 న ఇలా విధించింది : “బ్రిటిష్ ఇండియాలో భాగం కానట్టి, గవర్నర్ జనరల్ ఇన్‌కౌన్సిల్‌తో పాలింపబడే ఏ ప్రాంతంలోగాని, ఆగస్టు 1, 1891 తర్వాత పొలిటికల్ ఏజంటుయొక్క లిఖితపూర్వకమైన అనుమతిలేనిదే బహిరంగ వార్తలు, లేక బహిరంగవార్తలపై వ్యాఖ్యలుగల వార్తాపత్రిక, లేక ఇంకేదైనా అచ్చుపడినది — అది మాసపత్రికగాని ఏదైనాగాని-ప్రకటించడంగాని, అచ్చువేయడంగాని, సంపాదించడంకాని కూడదు.” ఇందుతోపాటు సంస్థానాల పరి స్థితిపై బ్రిటిష్ ఇండియాలో విమర్శించడాన్ని ప్రత్యేకంగా నిషేధిస్తూ 1934 సంస్థాన రక్షణచట్టమొకటి చేశారు.

బ్రిటిష్ రక్షణక్రింద ఉన్న ఈ కీలుబొమ్మరాజుల పాలనలాంటిది. చరిత్రలో ఏరాజ్యమైనా ఉండినదా అనేది సందేహం. కొన్ని సంస్థానాలు, బ్రిటిష్ ఇండియా లోని అతిహీన స్థాయికన్న కొంత పైస్థాయిలో ఉంది, కొంతవరకు నిర్బంధ విద్యా విధానాన్ని నడిపినవీ, పరిమిత సలహా ప్రతినిధిసంఘాల స్వరూపాల నేర్ప రిచినవీ ఉన్నవి. కాని ఇవి మినహాయింపులు మాత్రమే. అధికసంఖ్యాక సంస్థా నాల్లో దాస్యం, నిరంకుశత్వం, దోపిడీ వర్ణనాతీతంగా ఉన్నవి. ఆసియా నిరంకుశ రాజ్యాల చరిత్రలో లంచగొండితనం, వేధించడం బాగా పరిచితమైనవే. కాని బయట దండయాత్రలకో, ప్రజల తిరుగుబాటులకో భయపడి వీనిని తామే ఆరోజు ల్లోని రాజులు అదుపులో ఉంచుకొనేవారు. బ్రిటిష్ రక్షణవల్ల-ఆ రెండు భయాలూ

తొలగాయి; పరిపాలన సరిగాచేయకపోతే వీరిని తొలగించేందుకు, వీరిని అదుపులో పెట్టేందుకు ఉన్న అధికారాన్ని. పరిపాలన బాగుండకపోతే కాక తమకు భక్తులుగా ఉండకపోతే బ్రిటిష్ ప్రభుత్వం ఉపయోగిస్తున్నది. అతి నీచపాత్రను నడుపుతున్న పనిలేని కీలుబొమ్మలుగా సంస్థానాధిపతులున్నారు. కాబట్టే ప్రపంచమంతా వెల్లడయిన అతిహీనస్థితి బాధలతో సంస్థాన ప్రజలు ఇండియాలోకూడ అనంతంగా కనిపించే అజ్ఞానాంధకారంలో మునిగి ఉన్నారు

సంస్థానాలలో ప్రజాతంత్ర ఉద్యమ సంస్థ అయిన సంస్థాన ప్రజామహాసభ 1939 లో, సంస్థానాధిపతుల రాజ్య లక్షణాన్ని ఇలా సంగ్రహించి చెప్పింది :

"చిన్నవిగాని, పెద్దవిగాని ఈసంస్థానాలలో ఏ ఒకటి రెండు చోట్లతప్ప, నిరంకుశ వ్యక్తిగత రాజ్యం నడుస్తున్నది. చట్టయుతపాలనలేదు. పన్నులు చాల యెక్కువ. భరింపవీలులేని స్థితిలో ఉన్నవి. పౌరస్వతంత్రాలు అణచి వేశారు. సంస్థానాధిపతుల సొంతఖర్చు సామాన్యంగా ఇంత అనే నియమంలేదు. ఉన్న చోట్లకూడ దానిని అనుసరించడం జరగదు. ఒకవేపు రాజుల దుబారాఖర్చు, విలాసాలూ, మరొకప్రక్కన ప్రజల నిరుపేదతనం ఉంది.

"నిరుపేదలై నానాబాధలుపడుతున్న ప్రజలు కష్టించి సంపాదించినధనంతో ఈరాజులు విదేశాలలోను, ఇండియాలోను విలాసాల ననుభవిస్తున్నారు. ఇలాంటి పద్ధతి జరగవీల్లేదు. ఏసభ్య ప్రజలూ దీనిని సహించలేరు. చరిత్ర వాదమంతా దీనికి వ్యతిరేకమే; భారత ప్రజల ఆవేశం దీనికి తలఒగ్గదు "

(అఖిలభారత సంస్థాన ప్రజామహాసభ స్థాయిసంఘ ప్రకటన, జూన్ 1939)

సంస్థానాల పాలనకు చక్కని నిదర్శనం వాని బడ్జెటులలో కనిపిస్తుంది.

"ఇంగ్లాండు రాజు జాతీయాదాయంలో 1600 కు ఒకటి చొప్పున సొంతానికి తీసుకుంటాడు. బెల్జియంకింగు 1000 కి ఒకటి. ఇటలీ రాజు 500 కు ఒకటి. డెన్మార్కు రాజు 300 కి ఒకటి. జపాను చక్రవర్తి 400కి ఒకటి;....తిరువాంకూరు మహారాణిలాగా ఆదాయంలో 17 కు ఒకటి చొప్పున (ఇదే ఇండియాలో ఎక్కువ బాగున్న సంస్థానం) గాని, హైద్రాబాదు నైజాం, బరోడా మహారాజుల్లాగా 13 కు ఒకటి చొప్పునగాని, కాశ్మీర్ బికనీర్ రాజులలాగా 5 కు ఒకటి చొప్పునగాని ఏ రాజూ సొంతానికి తీసుకోవడంలేదు. ఇంక చాలమంది సంస్థాన ఆదాయంలో మూడిట ఒకటి, 2కు ఒకటి తీసుకుంటున్నారనే సంగతి తెలిస్తే ప్రపంచం దిగ్భ్రమచెందుతుంది "

(ఎ ఆర్ దేశాయ్, "భారత నిరంకుశ సంస్థానాలు జాతీయ స్వతంత్ర పోరాటం")

సామ్రాజ్య తత్వం ఎంతో ఆదరంతో చూస్తూ పొగడుతూ ఉండే బికనీర్ సంస్థానపు 1929-30 బడ్జెట్ ఇదే చూడండి

| | | |
|---|---|---|
| పాలన ఉద్యోగులకు | రూ. | 12,55,000 |
| రాకుమారుని పెండ్లికి | | 82,500 |
| బిల్డింగులకు రోడ్లకు | | 6,18,384 |
| రాజసౌధాల విస్తరణకు | | 4 26,614 |
| రాజ కుటుంబానికి | | 2 24,864 |
| విద్యకు | | 2,22,979 |
| వైద్యానికి | | 1,88,138 |
| ప్రజా సౌకర్యాలకు | | 30,761 |
| పారిశుధ్య శాఖకు | | 5 729 |

అంటే విద్యకు వైద్యశాఖకు ప్రజా సౌకర్యాలకు పారిశుధ్య శాఖకు కలిపి, రాజుకు, అతని కుటుంబానికి ఇళ్ళకు ఖర్చుపెట్టిన వానిలో నాలుగోవంతు కన్నా తక్కువ ఖర్చు పెడుతున్నారు. జామ్‌నగర్ సంస్థానంలో 1926-27లో మొత్తం ఆదాయం 10 లక్షల పౌన్లు వస్తే, అందులో 7 లక్షల పౌనులు తక్కువ కాకుండా రాజుగారి సొంత ఖర్చులకు పోయింది. ఇక విద్యకు నూటికి 1.5 వైద్యానికి నూటికి 0.9 ఖర్చయింది.

ఈ పాలన క్రింద ఉండే భాగ్య మబ్బిన ప్రజల స్థితిగతు లెలా ఉన్నవి? మధ్య యుగపు అధమ స్థితిలో వ్యవసాయ ఆర్థిక విధానముంది. ఏకొద్ది సంస్థానాల్లోనో పరిశ్రమలు పెరిగాయి. చాల సంస్థానాలలో బానిసతనం విపరీతం.

"రాజపుటానా సంస్థానాల్లోను, పశ్చిమ సంస్థాన ఏజన్సీ క్రిందవాని లోను కధియావార్ సంస్థానాల్లోను బానిసల గుంపులున్నారు 1921 జనాభా లెక్కల నివేదికనుబట్టి మధ్య భారత రాజపుటానా సంస్థానాల్లో మాత్రమే చాకర్, దరోగా కులాలకు చెందిన 1,60,735 గురు బానిస లున్నారు."

(సి. యల్. చుద్గర్, "బ్రిటిష్ రక్షణక్రింద సంస్థానాధి పతులు" 1929 పుట-33.)

అనేక రకాలుగా వెట్టిచాకిరీ - తిండి తప్ప వేరే ప్రతిఫలం లేకుండా - సర్వసహజంగా ఉంది.

"వెట్టిచాకిరీ అన్ని సంస్థానాల్లోను ఉంది; అన్నివర్గాల కార్మికులు, చేతిపనులు చేసేవారు, రాజుకు, అతని ఉద్యోగస్తులకు పనిచేసి తీరాలి, వారికి ముట్టేదల్లా కేవలం తిండిమాత్రమే. వీరితో తమ కిష్టంవచ్చినన్నాళ్లు, ఎప్పుడుపడితే అప్పుడు బలవంతంగా ఉద్యోగులు పనిచేయిస్తారు. యువతులుగాని, ముదుసళ్ళుకాని, పెండ్లయినా-వితంతువులయినా, ఆడవాళ్ళను కూడ విడిచిపెట్టరు. ఈ ప్రజల్లో ఎవరైనా మగవారుగాని, స్త్రీలుగాని శక్తిలేక సరిగా పనిచేయకపోతే కొరడాలతోకొట్టి చిత్రహింసలు పెడతారు.

"పేదముసలిస్త్రీలను - అరవై యేళ్ళవారిని - కఠోరంగా పోలీసులు కొరడాలతో కొట్టడం నే నెరుగుదును. బజార్లలో వెదురుకర్రలతో వీరిని

బాధుతారు వారు చేసిన నేరమేమంటే శక్తిలేవందువల్ల వెట్టిచాకిరీనుంచి తమ్ము తొలగించమని కోరడమే."

(అదే పుట 37)

పౌరహక్కులేవీ సంస్థానాల్లోలేవు.

"ఏ వ్యక్తిగాని తన హక్కులను రాజో, ప్రధానో, ప్రభుత్వమో అపహరిస్తే నివారణకోరే హక్కులేదు. ఏ పౌరుని ఆస్తినిగావి, హక్కులనుగాని రాజు. నిరంకుశంగా స్వాధీనపరుచుకోవచ్చు. లేదా తొలగించవచ్చును. అతను ఎంత మొత్తమైనా జుల్మానా వేయవచ్చు ఆ డబ్బు వసూలు చేసుకునేందుకు యే పద్ధతైనా అవలంబించవచ్చు. ఏ నేరమూ మోపకనే, ఏ విచారణ చెయ్యకనే ఎంతకాలమైనా ఎవరినైనా సంస్థానాధిపతి జైలులో త్రోయవచ్చును "

(అదే పుటలు 72-73)

రాజకుటుంబపు అపరిమిత వ్యయంకోసం పేదవారినికూడ పీల్చి పిప్పిచేసే పన్నులను తమ ఇష్టంవచ్చినట్లు వేస్తుంటారు.

"నవనగర్‌లోవేసేపన్నులు,అన్నిసంస్థానాలలోపన్నులెలాఉన్నాయో సరైనస్థితిని తెలుపుతాయి పన్నులలో మొదటిజాబితా వృత్తులమీద. కార్మికులు చేతిపనులు చేసేవారు వగయిరా వ్యక్తులమీద. పశువులమీద. భోగము వారి యిళ్ళమీద. పెళ్ళిళ్ళమీద. పుట్టుకలమీద, చావులమీద వేస్తారు పేద అడవారికి ఒకేఒక జీవనాధారంగాఉన్న చేతిపిండి మిల్లులునడిపే వితంతువులుమీదకూడ పన్ను విధిస్తారు....

"ఇక భూమిపన్ను....నగదురూపంలో అయితే ఎకరాకు నాలుగు షిల్లింగులలెక్కన (రూ 3.). ధాన్యరూపంలో అయితే పంటలో నాలుగోవంతు నివ్వాలి ఆచరణలో ఈరేటు పెరుగుతుంది. ప్రభుత్వభాగం దాదాపు నూటికి 40 వంతులకు పెరుగుతుంది. మిగతాపన్నులన్నీ చాల తక్కువగావేస్తే నూటికి 10 వంతులకు వస్తాయి. మొత్తంపోను రైతుకు సగమే మిగుల్తుంది....

"ఇవికాక....రైతు భూస్వామి పెళ్ళిఖర్చులకివ్వాలి, లేదా అతని కుటుంబంలో ఎవరిపెళ్ళయినా ఇవ్వాలి. అతనికి కొడుకుపుడితే సుంకం. రాజుపెండ్లామో, తల్లో చనిపోతే డబ్బివ్వాలి."

(అదే పు. 46-47.)

ఈ భారత సంస్థానపాలనలో ఆధునిక ప్రపంచంలో ఎక్కడా పోలికలేనంత దౌర్జన్యం, అధమస్థితి ఎందుకున్నాయంటే. ప్రాచీన నిరంకుశ ప్రభువుల దారుణపాలనము క్రింద పాతకాలపు బానిసతనమూ, పైనేమో మహత్తర సామ్రాజ్య ప్రభుత్వమూ, దారిపీడనా ఒకేచోటఉన్నాయికాబట్టే.

ఈ రాజ్యాలను, బ్రిటిష్ ప్రభుత్వం నిలబెట్టడమేకాక, అయిదులో రెండు వంతుల భారతదేశంపై కృత్రిమంగా నెలకొల్పింది. అంతేకాక ఆధునికయుగంలో యావత్ భారత వ్యవహారాల్లో ముందుకు తెచ్చి ఈరాజ్యాలకు బలాన్నీ, ప్రాముఖ్యతనూ చేకూర్చాలని చూస్తున్నది. జాతీయ స్వతంత్ర ఉద్యమం పురోగమించేకొద్దీ సామ్రాజ్యతత్వం సంస్థానాధిపతులవైపు మ్రొగ్గి వారికి బలమిస్తూ జాతీయోద్యమానికి పోటీగా తయారుచేస్తున్నది. 1921 లో నరేంద్రమండలి (ఛేంబర్ ఆఫ్ ప్రిన్సెస్)ని ఏర్పరచారు. 1935 ఇండియాచట్టంలో ఏర్పరచిన ఫెడరల్ రాజ్యాంగానికి సంస్థానాధిపతుల పాత్ర పునాదిరాయివంటిది. పై సభలో సంస్థానాధిపతులకు ⅖ వంతుల ప్రాతినిధ్యం, క్రిందిసభలో మూడోవంతు స్థానాలు ఏర్పరచారు. పార్లమెంటరీ చర్చలలో దీనిఉద్దేశాన్ని లార్డు రీడింగు స్పష్టంగా యిలాచెప్పాడు :

> "అఖిల భారత సమాఖ్య (ఫెడరేషన్) లోనికి సంస్థానాధిపతులు వస్తే .... ఆపగల శక్తి ఒకటుంటుంది .... మన మెక్కువగా భయపడేదెందుకు ? కొందరు భారతదేశం స్వతంత్రం కావాలని, సామ్రాజ్యంనుండి అసలే తొలగిపోయే హక్కుండాలని ఆందోళన చేసేవారున్నారు కాని ఇలాంటివారు అత్యల్పసంఖ్యాకులనే నా విశ్వాసం. కాని శక్తివంతమైన వర్గమది. దానివెనుక కాంగ్రెసుసంస్థ ఒకటుంది. కాబట్టి మనం తేగలిగినంత, ఈ అభిప్రాయాన్ని ఆపగల వారిని తెచ్చిపెట్టాలనేది స్పష్టమే.... సరాసరి క్రింది శాసనసభలో సంస్థానాధిపతులు నూటికి 33 గ్గురున్నా; ఉన్నత సభలో నూటికి 40 మంది ఉంటారు. మరి కాంగ్రెసు దృక్పథాన్ని అంగీకరించని చాలమంది భారతీయులూ ఉన్నారు. కాబట్టి కాంగ్రెస్ అత్యధికంగా వోట్లు సంపాదించినప్పటికీ పైవర్గాలు ఫెడరల్ శాసనసభలో ఉంటారు గనక ఏం జరుగుతుందో అనే భయమే నాకు ఆవంతైనాలేదు"

ఇటీవల, జాతీయ ప్రజాతంత్ర ఉద్యమ ప్రవాహం, కీలుబొమ్మ సంస్థానాల అడ్డంకులను దాటి ప్రవహిస్తున్నది సంస్థానాలలో ప్రజాఉద్యమాలను సంఘటితపరచే సంస్థాన ప్రజామహాసభ త్వరత్వరగా అభివృద్దిచెందింది. ప్రాథమిక పౌరహక్కులకోసం పోరాటాలు, సంస్థానాలన్నిటా బయలుదేరాయి

సంస్థానాలలో ప్రజాఉద్యమాలు పెరగడం, కాంగ్రెస్ విధాన లో వచ్చిన మార్పులో నూకనిపిస్తుంది పూర్వంసంస్థానాలలోని ఆందోళనలో, కార్యకలాపాలలో కాంగ్రెస్ ప్రత్యక్షంగా జోక్యం తీసుకోవడంలేదు. రాజులక్రింద మ్రగ్గి మసవుతున్న 8 కోట్ల ప్రజలతోకాక, కీలుబొమ్మ ప్రభువులతో ఏదో ఒకవిధమైన మైత్రిసాధించవచ్చునన్న భ్రమతో "తటస్థ విధానాన్ని" కాంగ్రెస్ అనుసరిస్తూవచ్చింది రౌండ్ టేబిల్ సమావేశంలో గాంధీజీ యిలా అన్నాడు "వారిగృహ, ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకోకుండా ఇంతవరకు కాంగ్రెస్ సంస్థానాధిపతులకు సాయపడాలని చూచింది." ఇంకా ఇలా అన్నాడు. "ఆ రాజులు తమ ప్రజల

క్షేమాన్ని మనసున ఉంచుకొన్నారని నేను భావిస్తాను. నాకూ వారికీ భేదమేమీ లేదు. మేము సామాన్యులం. వారు భగవంతుడు చేశాడు గనుక ప్రభువులు.రాజులు. వారికి శుభం చేకూరాలనీ వారికి సుఖసౌభాగ్యాలు కల్గాలని ఆశిస్తున్నాను."

ఈ వినాశకర విధానాన్ని సంఘటనలే పరాజితం చేశాయి. కాంగ్రెస్ తనంతటే తనరంగాన్ని బ్రిటిష్ ఇండియాకే పరివ్యాప్తం చేసుకున్నది. మరి తాను అఖిలభారత జాతీయ సంస్థ అంటున్నప్పటికీ తననాయకత్వం క్రింద సంస్థానాలలో ఏ ప్రతిసంస్థనూ ఏర్పాటుచేయబూనుకోలేదు-కాని తర్వాత సంస్థానాధిపతులు నడిపిన దారుణచర్య లెక్కువయ్యాయి. చాల "అభ్యుదయవంతము" లనబడే తిరువాన్కూరు, మైసూరులలోగూడ అప్పుడప్పుడే తలెత్తుతున్న ప్రజాఉద్యమాలపైన, జాతీయవాంఛకు సానుభూతిగా తెలిపినా నిర్బంధవిధానం ఎక్కువయినందువల్ల, కాంగ్రెస్ మేల్కొని పోరాటానికి దిగక తప్పలేదు 1938-39 లలో సంస్థానాలలో పౌరహక్కులకోసం అస్తిత్వహక్కుకోసం పోరాటాన్ని చేపట్టడానికి కాంగ్రెస్ ప్రథమంగా ప్రయత్నించింది. సంస్థానాలలోని శాసనోల్లంఘనోద్యమాన్ని బలపరచాలనే సమస్య కాంగ్రెస్‌లో ప్రధానసమస్య అయింది.

హరిపురా కాంగ్రెసు సమావేశం (1938) సంస్థానాలగూర్చి కాంగ్రెసు విధానంలోని ప్రధాన సూత్రాలను ఇలా ప్రకటించింది :

"మిగత భారతదేశంలోలాగే సంస్థానాలలోను, ఒకేరకమైన రాజకీయ, సాంఘిక, ఆర్థిక స్వతంత్రం ఏర్పడాలనే మా ఉద్దేశం. భారతదేశముతో విడదీయరాని భాగాలే సంస్థానాలు, వానిని విడదీయ వీలులేదు. కాంగ్రెసు ఆశయమైన పూర్ణస్వరాజ్యం సంస్థానాలతోపాటు భారతదేశమంతటికీ వర్తిస్తుంది దాస్యంలోలాగే స్వతంత్రదశలోను భారతదేశ ఐక్యతను ప్రాదేశికైక్యతను కాపాడాలి.

"మిగత భారతదేశంలో ఉన్న స్వతంత్ర, ప్రజాతంత్రాలను అనుభవించే స్వతంత్ర భాగాలుగా, సంస్థానాలు పాల్గొనే ఫెడరేషన్ ఒక్కదాన్నే కాంగ్రెసు అంగీకరించగలదు

"కాబట్టి సంస్థానాలలో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వం పౌరహక్కులరక్షణ కాంగ్రెసు ఆశయం. చాల సంస్థానాలలో పౌరహక్కులను అణచివేయడం, స్వేచ్ఛ బొత్తిగా కరువవడం, ఈవున్న అధ్వాన్న స్థితిని మేము ఖండిస్తున్నాము."

ఇందుతోపాటు, సంస్థానాలలోని కాంగ్రెసు కార్యక్రమంపై తానే కొన్ని హద్దులను. హరిపుర తీర్మానం విధించింది.

"సంస్థానాలలోని ప్రజల ఆంతరంగిక పోరాటం కాంగ్రెసుపేర నడవకూడదు. ఇందుకై స్వతంత్ర సంస్థలు సంస్థానాలలో ఏర్పడాలి. ఉన్నచోట పని సాగించాలి"

1939 త్రిపురీ సమావేశంనాటికి ఈ విధానాన్ని కాంగ్రెసు కొంతవరకు మార్చుకుంది :

"సంస్థానాలకు సంబంధించిన హరిపురకాంగ్రెసు తీర్మానం అందుతో వచ్చిన సమస్యలను సమాధానపరిచింది, సంస్థాన ప్రజలు సంఘటితులై తమ స్వతంత్ర పోరాటాలు నడుపుకునేందుకు ప్రోత్సాహపరచింది. అందువల్ల దాని అవసరం సక్రమమైందని కాంగ్రెసు అభిప్రాయపడుతున్నది ఆత్మవిశ్వాసాన్ని బలాన్ని అభివృద్ధిపరచుకునేట్టు ప్రజల యోగక్షేమాలకోసమని హరిపురా విధానం తయారుచేయబడింది. అప్పటి పరిస్థితులనుబట్టి అలా చేయవలసివచ్చిందేకాని, అదొక విధిగామాత్రంకాదు. సంస్థాన ప్రజలను నడపడంలో, వారికి తన ప్రాపునివ్వడంలో అదే తన కర్తవ్యం కాబట్టి కాంగ్రెసుకు ఎప్పుడూ హక్కున్నది. ప్రజల్లో ఉద్బుద్ధమవుతున్న చైతన్యం కాంగ్రెసు తనపై తానే విధించుకున్న పరిహద్దులను తొలగించేందుకు లేక సడలించేందుకు కారణం కావచ్చును, అందువల్ల కాంగ్రెసు సంస్థాన ప్రజలతో సమ్మిళితం కావడం క్రమంగా అభివృద్ధి చెందవచ్చును"

ఈ విధానాన్ననుసరించి, జాతీయనాయకులు సంస్థాన ప్రజాఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. 1939 ఫిబ్రవరిలో లూధియానాలో సమావేశమైన సంస్థాన ప్రజా మహాసభకు జవహర్లాల్‌నెహ్రూను అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. డాక్టర్ పట్టాభిసీతారామయ్యగారిని ఉపాధ్యక్షులుగా ఎన్నుకున్నారు బాధ్యతాయుత ప్రభుత్వానికైన పోరాటంలో సంస్థాన ప్రజలు పురోగమించినందుకు అభినందించి ఆ సమావేశమిలా అంది :

"ఈపోరాటం ఇంతకన్న విశాలమైన భారత స్వతంత్ర పోరాటంతో సమ్మిళితంకావలసిన సమయం వచ్చింది. ఆపోరాటంలో విడదీయరాని భాగమే ఈపోరాటం. అలాంటి యావద్భారత సంయుక్త పోరాటం కాంగ్రెస్ ఆధ్వర్యంక్రింద నడవడం అవసరం"

యుద్ధానంతరం 1945 డిసెంబరులో, ఉదయపురంలో అఖిలభారత సంస్థాన ప్రజా మహాసభ సమావేశమైంది: "స్వేచ్ఛాస్వతంత్ర భారతదేశంలో అంతర్గత భాగంగా సంస్థానాలలో ప్రజలు సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని శాంతియుత సక్రమపద్ధతుల్లో సాధించడం" ఆశయంగా అంగీకరించింది. అధ్యక్షోపన్యాసంలో నెహ్రూ ఇలాప్రకటించాడు.

"ఆర్థిక ప్రత్యేకప్రాంతాలుగా ఏర్పడలేని అత్యధిక సంస్థానాలు, ప్రక్కనున్న ప్రాంతాలలోకి కలిసిపోవడం తప్పదు .... అలాంటి చిన్న సంస్థానాల పాలకులకు ఏదో ఒకవిధమైన పెన్షన్‌లు (భృతులు) ఇవ్వ

వచ్చును. ఇంకొక హోదాలో - వారు తగిఉంటే పనిచేయమని ప్రోత్స హించవచ్చును

"మిగత సంస్థానాలు - అవి 15 లేక ఇరవయ్యో ఉంటాయి. — ఫెడరేషన్‌లో స్వపరిపాలిత ప్రాంతాలుగా ఉంటాయి. వాని పాలకులు ప్రజాతంత్ర ప్రభుత్వంక్రింద చట్టబద్ధ అధ్యక్షులుగా ఉండవచ్చును. ఈ సంస్థానాధిపతులలో కొందరు చరిత్ర, సంప్రదాయాలతో అతి సన్నిహిత మైన ప్రాచీన రాజవంశాలకు చెందినవారు."

రాష్ట్రాలలో ప్రజా ప్రతినిధి మంత్రివర్గాలు ఏర్పడ్డం, దేశాన్ని ముంచుకొని వస్తున్న విప్లవ ప్రవాహం ముందు రాజ్యాంగ రాయబారాలు ప్రారంభం కావడం- వీనితో భారత రాజకీయరంగంలో స్వదేశ సంస్థానాలలో తుపాను రేగినది. సంస్థానాలలో మధ్యయుగపు నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా హఠాత్తుగా పోరాటాలు చెలరేగాయి. బ్రిటిష్ రాజకీయశాఖ మద్దత్తుతో సంస్థానాధిపతులు అతి దారుణమైన నిర్బంధ విధానం అవలంబిస్తున్నారు. ఈ పోరాటాలు కాశ్మీర్‌లో పరాకాష్ట చెందాయి కాశ్మీర ప్రజలు నిరంకుశ డోగ్రా రాజవంశానికి వ్యతిరేకంగా అతి స్పష్టమైన "క్విట్ కాశ్మీర్" (కాశ్మీరం వదలి వెళ్ళు) అనే నినాదంతో పోరాటం సాగింప సాగారు.

కాంగ్రెస్‌విధానం ఇప్పటికికూడ ఇదే సంస్థాన చట్రాలలో, ఇదే సంస్థానాధిపతుల క్రింద సంస్కరణల కోసం మాత్రమే చూస్తున్నదని గమనించ వచ్చును. అలాంటిస్థితి కేవలం మజిలీ మాత్రమే. ఇది జాతీయోద్యమ చైతన్యంలో ఒకదశ మాత్రమే.

1946 బ్రిటిష్ ప్రణాళిక సంస్థానాధి పతుల భావి పాత్ర సమస్యను మరొక నూతన దశకు కొనివచ్చింది. ఈ ప్రణాళిక సూచించిన రాజ్యాంగ నిర్మాణసభలో మొత్తం 386 స్థానాలలో సంస్థానాధి పతులకు 93 స్థానాలు-మొత్తంలో నాలుగో వంతు ఇవ్వ బడ్డాయి ప్రజాతంత్ర పద్ధతిలో ఆస్థానాలకు ఎన్నిక జరిగే విషయమై ఏమీ ఏర్పాటు లేదు. 1935 ఫెడరల్ రాజ్యాంగంలోకి వలెనే, అఖిల భారత యూనియన్‌లోకి సంస్థానాధి పతులను తీసుకొని వస్తారు, కాని వారీ యూనియన్ లోకి ఏ షరతులపై రావాలి అన్నది మాత్రం వారిష్టపడి జరిపే సంప్రతింపులకు వదిలివేశారు, అయినప్పటికీ బ్రిటిష్ వారినుండి అధికారం మారగానే సార్వభౌమాధి కారాలు రద్దవుతాయని, అందుతో సంస్థానాధిపతులు చట్టప్రకారం, రాజ్యాంగ నీతి ప్రకారం "స్వతంత్రులు-సర్వ స్వతంత్రు"లవుతారని స్పష్టం చేయబడింది - వారిష్టపడి నడిపే సంప్రతింపులలో ఇంకో ఏర్పాటు చేసుకుంటేతప్ప -

భావిభారత ప్రజాతంత్రానికి అవ్యవస్థగాఉన్న ఈసంస్థానాధిపతులనూ, ఇష్టం వచ్చినట్టు నిరంకుశంగా ఏర్పరచిన సంస్థానాల ఏర్పాటులనూ శాశ్వతంగా నిర్మూలించడం అవసరం. స్వతంత్ర భారతదేశంలో స్వదేశసంస్థానాలకు స్థానం ఉండదు.

భారతదేశాన్ని బ్రిటిష్ ఇండియా, సంస్థానాల ఇండియా అని విభజించడం సహజ విభజన సూత్రాలకు అనుబద్ధమైందీకాదు. చారిత్రక అవసరమూకాదు. ప్రజల మనోభీష్టానికి అవసరమైందీకాదు; కేవలం ప్రజలను విభజించి క్రింద ఉంచుకోవాలనే సామ్రాజ్యవాదుల కుటిలనీతి ఫలితమైన చర్యమాత్రమే. సమాన హక్కులతో, సమాన పౌరసత్వంతో భారతదేశం యావత్తులోను ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని నెలకొల్పడమే జాతీయోద్యమం ఆశయం కావాలి.

> స్వదేశ సంస్థానాలు పూర్తిగా రద్దుచేయడం, మధ్య యుగపు నిరంకుశ శిధిలాలను పూర్తిగా నిర్మూలించడం, సహజ ప్రాదేశిక - ఆర్థిక - సభ్యతల ప్రాతిపదికపై ప్రజల ప్రాంతాలను విభజించి ఏర్పరచిన నిజమైన సమాఖ్య (ఫెడరేషన్) లో భారత ప్రజలను సంయుక్తపరచడం, (ఇప్పుడున్న నిరంకుశ పరిపాలనను నిలిపి, ప్రజాభీష్టాన్ని త్రొక్కిపెట్టే పెద్ద యంత్రంవంటి "సమాఖ్య" అనబడేదాన్ని కాదు) భారతజాతి ఐక్యతకు, భారత పురోభివృద్ధికి, భారతదేశంలో ప్రజాతంత్ర స్థాపనకు అత్యవసరం.

## 2. మత విభేదాలు

సంస్థానాధిపతులద్వారా భారత ప్రజలను విభజించాలనే విధానంతోపాటు, అతి సన్నిహితంగా వున్న హిందువులు ముస్లిముల విషయంలోకూడ అదే విభజన విధానాన్ని ప్రభుత్వం అనుసరిస్తోంది

మతవిభేదాల సాధారణ సమస్యకూ, గతయుగంలో ముస్లింలీగు, పాకిస్తాన్ వాంఛల అభివృద్ధితో ఈ సమస్యపొందిన ప్రత్యేక రాజకీయ రూపాలకూ మధ్య ఉన్న భేదం ఇక్కడ గుర్తించడం అవసరం ఈ రెండవది చాల ప్రధానమైన రాజకీయ సమస్యను లేవదీస్తున్నది. దానిని వచ్చే వర్గ (సెక్షన్)లో చర్చింతాము; కాని తొలుత మత విభేద సమస్యను, ముఖ్యంగా హిందూ-ముస్లిం విద్వేషాన్ని గూర్చి మనం తెలుసుకోవడం అవసరం.

వివిధమతాలకు, కులాలకు ఉన్న సంబంధాలనుగూర్చిన సమస్యనే "మత సమస్య" అంటుంటారు. ముఖ్యంగా జనాభాలో మూడువంతులున్న హిందువులకు దాదాపు నాలుగోవంతున్న ముస్లిములకూ, జనాభాలో పదోవంతున్న మిగత మతాలవారికీ మధ్యనున్న సంబంధాల సమస్య యిది. జాతీయోద్యమానికిది తీవ్ర సమస్య, కాని ఇది భారతదేశానికి ప్రత్యేకమైన సమస్య కాదు.

కొన్ని పరిస్థితులలో, ఒక్కదేశంలో విభిన్నజాతులూ, మతాలూ కలిసి ఉన్నప్పుడు చాల ఇబ్బందులు ఏర్పడడం - ఒకొకతూరి కొట్లాటలు, రక్తపాతం ఏర్పడడంకూడా-జరుగుతుంది. ఐర్లాండులో ఆరంజిమెన్ కాథలిక్కులు; మాండేటు

కిందనున్న పాలస్తీనాలో అరబ్బులు-యూదులు; జారునాటి రష్యాలో స్లావులు-యూదులు; నాజీ జర్మనీలో "ఆర్యన్లు" అన బడేవారు - యూదులు - ఇవి ఈ ఇరవయ్యో శతాబ్దిలో చాల పరిచితమైన సమస్యలు కాబట్టి మనమింకా పాత కాలపు ఉదాహరణలవరకు పోనక్కరలేదు. నేడు యూరోపులోని ఆంటీ సెమిటిజం (సెమిటిక్ జాతి వ్యతిరేకత), ఈ రకమైన జాతి మత విభేదాల, విద్వేషాల సమస్యయొక్క తీవ్రరూపం.

ఇలాంటి సమస్య ఎలాంటి పరిస్థితుల్లో ఉదయిస్తుందో చారిత్రక అనుభవం మూలంగా చాల ఖచ్చితంగా నిర్వచించ వీలున్నది.

బ్రిటిష్ మాండేటరీ పరిపాలనకు ముందు, పాలస్తీనాలో అరబ్బులూ, యూదులూ ఎన్నోశతాబ్దులుగా శాంతంగా కలిసి మెలిసి ఉన్నారు. బ్రిటిష్‌పాలన స్థాపితమైనప్పటినుండీ సామ్రాజ్య సైనికశక్తి, పశ్చిమ బాంకులపెట్టుబడిదారుల ఆధిపత్యంక్రింద బలవంతంగా యూదుల దిగుమతి ప్రవేశపెట్టబడినప్పటినుండీ పెద్దతగాదాలు ప్రారంభమయ్యాయి. వీనిని ఒక్కొక్కప్పుడు మత, జాతి (రేస్) తగాదాలుగా చెప్పడం కద్దు. కాని వాస్తవస్థితిలో, దురాక్రమణ, విదేశపాలనకు వ్యతిరేకంగా స్వతంత్రంకోసం జరిగే జాతీయ పోరాటాలే యివి.

జారునాటి రష్యాలో ముఖ్యంగా జారిజం, శిథిలమై పడిపోనున్న తుది రోజుల్లో యూదుల విధ్వంసయాత్రలు చరిత్ర పుటలను మలినపరచాయి, ప్రపంచ అంతరాత్మను బాధించినవి. ఈ పోగ్రోములు (విధ్వంసయాత్రలు) అజ్ఞానులు, క్రూరులూ అయిన రష్యాజనసామాన్యం రేపిన కొట్లాటలనీ, ఇవి అపరానివనీ అనుకునేవారు చాలమంది. తర్వాత ప్రకటితమైన రహస్యపోలీసు శాఖ రికార్డులు, చాలకాలంనుంచి నిందాపాత్రంగా ఉన్నట్టి ప్రభుత్వానికి "బ్లాక్‌హండ్రెడ్సు" సంస్థలో (రౌడీ "దేశభక్తి" సంస్థ) ఉన్న వింతసంబంధాలవల్ల చాలవరకు కన బడుతున్నట్టి సంగతులను ఆఖరుకు రుజువుచేశాయి. ఈ పోగ్రోములు ప్రత్యక్షంగా ప్రభుత్వంతో ప్రేరింపబడి, ప్రవేశపెట్టబడి నడపబడినవని తేలిపోయింది. రష్యన్లు తమ దేశాధికారాన్ని తాము సాధించిన మరుక్షణమే ఈ పోగ్రోములు పూర్తిగా ఆగిపోయినవి. సోవియట్ యూనియన్లో మరో విభిన్నమైన మానవ జాతులూ (రేస్), మతాలూ హాయిగా కలిసి జీవిస్తున్నవి.

వీమర్ రిపబ్లిక్ క్రింద జర్మనీలో జర్మన్లు, యూదులు శాంతంగా కలిసి జీవిస్తూ వచ్చారు. నాజీ జర్మనీలో పోగ్రోం రాజ్యపు పాతపునాది, జారిస్టు రష్యా నుండి మధ్యయూరపుకు మారింది.

కాబట్టి ఒకేదేశంలో విభిన్నమతాలు జాతులు (రేస్) కలిసి ఉన్నంత మాత్రాన తప్పనిసరిగా యిబ్బంది ఉండడం సహజము అనడానికి వీల్లేదు. ఇబ్బందులన్నీ సాంఘిక రాజకీయ పరిస్థితులవల్లనే ఏర్పడుతాయి. ముఖ్యంగా ఎక్కడైతే ఒక అభివృద్ధినిరోధక ప్రభుత్వం ప్రజాఉద్యమానికి విరుద్ధంగా తన్ను రక్షించు

కోవాలనుకుంటుందో అక్కడ ఈ సమస్యలు ఉదయిస్తాయి. ఆ రాజ్యం పతనం చెందడం ఇక తప్పదనేందుకు ఇవి నమ్మకమైన సూచనలు.

భారతదేశంలో ఇటువంటి సమస్యే మనలను ఎదుర్కొంటున్నది. భారత దేశంలో (1941 జనాభా లెక్కలనుబట్టి) 25 కోట్ల 40 లక్షల మంది హిందువు లున్నారు. జనాభాలో నూటికి 65.93 ఉన్నారు. ఇందులో 19 కోట్లు - నూటికి 64 5 - బ్రిటిష్ ఇండియాలోను, 6 కోట్ల 50 లక్షలు (సంస్థాన జనాభాలో 70 57 నూటికి) సంస్థానాలలోను ఉన్నారు. ముస్లిములు 9 కోట్ల 20 లక్షలు; ఇందులో బ్రిటిష్ ఇండియాలో 7 కోట్ల 90 లక్షలు-నూటికి జనాభాలో 26.84, సంస్థానాలలో 1 కోటి 20 లక్షలకు పైన లేక సంస్థాన జనాభాలో నూటికి 13 93 ఉన్నారు

బ్రిటిష్ ప్రభుత్వం రాకపూర్వం ఈ బ్రిటిష్ ప్రభుత్వంతో చేరివున్న హిందూ ముస్లిం తగాదాల వంటివావి పోలికే లేదు ఇవి ఇటీవల బ్రిటిష్ పాలనలో మరీ ఎక్కువయినవి. పాలకుడుగా హిందువుడనీ, ముస్లిమనీ రాజ్యాలకు మధ్య యుద్ధాలు జరుగుతుండేవి. కాని ఈ యుద్ధాలేనాడుకూడా హిందూ-ముస్లిం విద్వేష స్వభావాన్ని పొందలేదు. ముస్లిం పాలకులు హిందువులను స్వేచ్ఛగా అత్యున్నత పదవుల్లో నియోగించారు. హిందూ పాలకులు ముస్లిములను అలాగే పెద్ద అధి కారాల్లో ఉంచారు.

బ్రిటిష్‌వారు రాకపూర్వం సాంప్రదాయ సిద్ధంగా భారత దేశంలో వున్న మతైక్యతా లక్షణం సంస్థానాల్లో ఇప్పటికీ కనిపిస్తుంది. సైమన్ నివేదిక, "బ్రిటిష్ ఇండియాతో పోల్చిచూస్తే నేడు సంస్థానాల్లో మతకలహాలు అంతగా లేవు" అని వ్రాసింది. ఇటీవల సంస్థానాల్లో కొన్నిచోట్ల వచ్చిందనే మతతగాదా మత సమస్య వల్ల ఏర్పడిందికాదు. ఇలాగే కాశ్మీరులో 1931 - 32 లో మతతగాదా అన్నారు. కాశ్మీరులో అయిదులో నాలుగువంతులున్న ముస్లిములు సంస్థానాధిపతికి వ్యతి రేకంగా ప్రజాఉద్యమం లేవదీశారు. అక్కడ రాజు హిందువు; దీనికి మత తగాదా అని తప్పుడుపేరు పెట్టారు అయినా "ఈ మత తగాదాలో ఒక్క హిందువునూ చంపలేదు". "ఇదో విరోధభావం" అని బ్రిటిష్ పత్రికలు ఒప్పుకో వలసి వచ్చింది (డైలీ టెలిగ్రాఫ్, ఫిబ్రవరి, 1932) వాస్తవస్థితిలో ప్రజా ఉద్యమం విస్తరింపబడేకొద్దీ సంస్థానాల్లోకూడ ప్రజలను అభివృద్ధి విరోధకంగా విభజించడం ప్రారంభమయింది.

హిందూ ముస్లిం విద్వేషాన్ని గూర్చి వ్రాస్తూ సైమన్ నివేదిక రెండు ప్రత్యేక అంశాలను పేర్కొనక తప్పలేదని మనం గమనించాము. మొదటిది ఈ విద్వేషం ప్రత్యక్షంగా బ్రిటిష్ ప్రభుత్వం పాలించే ప్రాంతంలో ఎక్కువగా ఉంది. సంస్థానాల్లో అంతకన్నా తక్కువుంది, రెండు ప్రాంతాల్లోనూ జనాభా కలిసే ఉంటూ ఉంది, రెండింటినీ వేరు పరచడం కేవలం పాలనా సౌకర్యానికే తప్ప మరేమిటికీ కాదు; రెండోది బ్రిటిష్ ఇండియాలో కూడ ఇటీవలనే ఈ తగాదా

మరింత పెరిగింది. "బ్రిటిష్ ఇండియాలో ఒక తరం క్రిందట-మత ద్వేషం పౌర శాంతిని భంగపెట్టే స్థితిలో లేదు" అని కూడ ఒప్పుకో వలసి వచ్చింది. కాబట్టి మత విద్వేషం బ్రిటిష్ పాలనలో ప్రత్యేకించి ఏర్పడిన సమస్య. అందు లోనూ ముఖ్యంగా ఇటీవల బ్రిటిష్ పాలనలో ఇది ఏర్పడింది. అంతే వినాశ దశలో పడిపోతున్న సామ్రాజ్యవాద యుగంలో ఇది ఏర్పడింది.

భారతదేశంలో మతవిద్వేషాన్ని పెంచడంలో ప్రధాన బాధ్యత (ఇతర బాధ్యతలు లేవనికాదు. వానివి తర్వాత చూదాము) బ్రిటిష్ ప్రభుత్వంమీదనే ఉన్నది అంటే, ప్రభుత్వాధికారులు మండిపడతారు. అయినప్పటికి యథార్థాంశాలను వదిలి పెట్టలేము. అలాగే సాక్ష్యాలను, చారిత్రకాంశాలను వదిలివెయ్యలేము. ఊరికే మండిపడడం వాదంకాదు; సామ్రాజ్యవాదం సీజరుభార్యలాగా అనుమానాతీత మైందికాదు, సామ్రాజ్యవాదుల కుటిలనీతికి దిక్కు-లేనంత నిదర్శనముంది గనక ఈ ప్రత్యక్ష అంశాలన్నీ అబద్ధం అని మహాపవిత్రంగా నటిస్తూ చెప్పినంత మాత్రంతో ప్రపంచ ప్రజలు నమ్మరు.

ఇటీవల జాగర్తపడ్డ రోజుల్లోకన్నా, పూర్వయుగంలో "చీల్చి పాలించు" అనే సూత్రాన్ని మరీ బహిరంగంగా చాటేవారు. 1821 సంవత్సరంనాడే ఒక బ్రిటిష్ ఉద్యోగి కర్నాటికస్ అనే పేరుతో 1821 మే ఏషియాటిక్ రివ్యూలో ఇలా రాశాడు : "రాజకీయంకాని, పౌర-సైనిక పాలనంకాని-ఏ విషయంలోనైనా మన భారత పరిపాలన ఆశయం చీల్చి పాలించు అనేదిగా ఉండాలి." మూరాదాబాదు సేనాని లెఫ్టినెంటు కర్నల్ కాక్ 19 వ శతాబ్ది మధ్యభాగంలో ఈ సూత్రాన్ని విధించాడు ;

> "విభిన్నమతాలకూ, జాతులకూ మధ్య నేడున్న అనైక్యతను (మన అదృష్టంకొద్దీ అదుంది) బాగా పెంపొందించేందుకే మనంప్రయత్నిం చాలిగాని వాటిలో సమైక్యత ఏర్పరచేందుకు మనం ప్రయత్నించరాదు. విభజించి పాలించు అనేదే భారత ప్రభుత్వ సిద్ధాంతంగా ఉండాలి." (1)

1888 లో భారతదేశాన్నిగూర్చిన ప్రామాణిక గ్రంథకర్త సర్ జాన్ స్ట్రా ఇలా రాశాడు ;

> "ఈపరస్పర విరుద్ధమతాలు ప్రక్క-ప్రక్కన ఉండడం ఇండియాలో మన స్థానానికి గట్టి కారణమనేది పరిశుద్ధ సత్యం." (2)

(సర్. జాన్ స్ట్రాచే "ఇండియా" 1888, పుట 255.)

---

(1) బి., డి. బాసు "ఇండియాలో క్రైస్తవ ప్రభుత్వ విస్తరణ'' పుట 74 లో ఉదహరింపబడింది.

(2) పుస్తకాన్ని తర్వాత ముద్రించేప్పుడు, ఈ పచ్చిగా ఉన్న ప్రకటనను మార్చాలని చూచాడు, కాని ఫలించలేదు. కొద్దిగా దిద్దిన మాటలివి.

కాంగ్రెసు స్థాపకుడైన హ్యూము "విభజించి పాలించే విధానంతోనే నిలబడిఉంది బ్రిటిషు ప్రభుత్వ"మని తనతో స్పష్టంగా ఒప్పుకున్నట్లు గాంధీజీ వివరించాడు. (దీనిని జె. టి. సండర్లాండు "దాస్య భారతం" పుట 23 లో ఉదహరించాడు.)

1910లో జె. రాంసేమాక్డనాల్డు ముస్లింలీగుస్థాపననుగూర్చి ఇలా వ్రాశాడు:

"అఖిలభారతముస్లింలీగు 1906 డిసెంబర్ 30 తేదీనస్థాపించబడింది. లీగు ప్రయత్నం సాధించిన రాజకీయ విజయాలు....చాల ప్రాముఖ్యమైనవి కాబట్టి ఒక అనుమానం ప్రారంభమయింది కొందరు ఆంగ్లో ఇండియన్ ఉద్యోగుల ప్రోత్సాహంతో ముస్లింనాయకులు పనిచేస్తున్నారని. ఆ ఉద్యోగులు సిమ్లాలోను, లండన్‌లోను తంటాలు పెడుతున్నారని. ఇందుతో ముస్లిములపై ఎక్కువ పక్షపాతం చూపుతు హిందూ-ముస్లిములమధ్య ద్వేషబీజాలు నాటుతున్నారని అనుమానం ప్రబలింది"

(జె. ఆర్. మాక్డనాల్డు "భారతదేశ చైతన్యం" 1910, పుట 283-4.)

మిగత సాక్ష్యం దొరికిం తర్వాత ఈ "అనుమానం" మరింత ధృవపడింది.

తాను భారత రాజ్యాంగ కార్యదర్శిగా పనిచేసి అన్ని రికార్డులూ చూచిన లార్డు ఆలివర్ 1926 లో లండన్ టైమ్సుకు వ్రాసిన లేఖలో ఇలా వ్రాశాడు:

"భారత వ్యవహారాలతో సన్నిహిత సంబంధం కలవాడెవ్వడూ ఈ క్రింది అంశాన్ని కాదనజాలడు: ముస్లిములపై భారతదేశంలోని బ్రిటిష్ ఉద్యోగులు అదే పనిగా పక్షపాతం చూపుతున్నారు. ఇందుతో సానుభూతి ఎక్కువచూపడం అవసరమని భావించడం కారణమైనా, హిందూ జాతీయతకు పోటీగా ఉండాలనేదే ఎక్కువ కారణం."

(లార్డు ఆలివర్. టైమ్సులేఖ, జులై 10. 1926)

ఇటీవల యీ ప్రధాన దృక్పధమే మరింత సున్నితమైన రీతిగా ప్రకటితమైంది. 1941 లో టైమ్సు పత్రిక ఇలా రాసింది:

---

"విభజించి పాలించు అనే పాతసూత్రానికి మన భారత ప్రభుత్వ విధానం విరుద్ధమైనది; మన "యుద్ధ బాధిత నాగరికత ముఖ్యకర్తవ్యాలలో అన్నివర్గాలలో శాంతి ఏర్పరచాలనేది ప్రధానమైనది; కాని ఇంత మాత్రంతో, ఈ విరుద్ధశక్తులు ఒకదానిప్రక్క నొకటి కలిసి ఉండడం భారతదేశంలో మన స్థానానికి గట్టి కారణమవేం మనం మరచిపోరాదు. మహమ్మదీయులలోని ఉత్తమవర్గాలు మనకు బలకారకులేకాని దుర్బలకారకులుకాదు. వారు హిందువులతో పోలిస్తే తక్కువున్నా శక్తివంతమైన అల్పసంఖ్యాకవర్గమది. వారి ప్రయోజనాలు మనవంటివే. మన పాలనకన్నా హిందూపాలన మంచిదని వారు ఏ పరిస్థితుల్లోను భావించరు" (సర్ జాన్ స్ట్రాచే, "ఇండియా" 1894, పు. 241.)

మొదటి "పరిశుద్ధ సత్యానికీ, ఈ దిద్దుబాటుచేసిన మాటలకూ మధ్యనున్న భేదం సామ్రాజ్యవాదాన్ని సమర్థించడంలో అభివృద్ధిని సూచిస్తుంది. కొంత రాజనీతితో పదాలు మారినా కపట భావప్రకటన మరింత బయట పడుతూనే ఉంది. ఏమైనా విధానమేమీ మారలేదని సుస్పష్టమే.

"హిందూ - ముస్లిం ఒండబడిక అతి ప్రధానమని చెప్పినందువల్ల బ్రిటన్ 'విభజించి పాలించు' సూత్రాన్ని అనుసరిస్తున్నది అనుకోరాదు. విభేదాలున్నాయి. ఆ విభేదాలున్నంతదాక బ్రిటిష్‌పాలన తప్పదు."

(ది టైమ్సు. జనవరి 21, 1941)

పైవానిని పర్యాలోకిస్తే, ప్రధాన ప్రభుత్వ ప్రతినిధుల సాధికార ప్రకటనలలో, ప్రభుత్వ విధానం ఎలాంటిదో తగిన సాక్ష్యమున్నట్టు తేలుతుంది.

ఇటీవలనే ఈ సామాన్య విధానం ఒక పరిపాలనా పద్ధతిగా మారిపోయింది. జాతీయ పోరాట పురోగమనమూ, ఒకదానివెనుక ఒకటిగా వచ్చిన రాజ్యాంగ సంస్కరణలతోబాటు, ఆ సంస్కరణలలో అవలంబించిన విచిత్ర నియోజకవర్గ పద్ధతిద్వారా మత విభేదాలను ఎక్కువచేసే కార్యక్రమమూ సాగింది. ఈ నూతన విధానం 1906 లో ప్రవేశపెట్టబడింది. జాతీయాందోళన, పురోగమనం మొదట వెల్లువ రోజుల్లోనే సరిగ్గా.

ఈ పరిణామానికి పూర్వ రంగాన్ని అర్థం చేసుకొనేందుకు హిందూ-ముస్లిం ప్రజానీకాన్నికాక కొత్తగా ఉదయిస్తున్న మధ్యతరగతివారిలో వ్యాపించే సాంఘిక, ఆర్థిక పోటీ బీజాలను మనం గుర్తించడం అవసరం. వ్యాపారం, వాణిజ్యం, విద్యలు బొంబాయి, కలకత్తా, మదరాసులలో - అంటే హిందువులు అధికసంఖ్యాకులుగాఉన్న ప్రాంతాల్లో ఉత్తరపు ముస్లిం ప్రాంతాలలోకన్నా ముందు అభివృద్ధి చెందాయి. 1882 హంటర్ కమిషన్ నివేదికప్రకారం యూనివర్సిటీ విద్యలో ముస్లిముల సగటుసంఖ్య కేవలం నూటికి 3.65 వంతులు మాత్రమే. ఈ రోజుకుకూడ ముస్లిములలోకన్నా హిందువులలో చదువు వచ్చినవారి సంఖ్య హెచ్చు. కాబట్టి భారతపెట్టుబడిదారీవర్గం మొలకెత్తగానే ఆగుంపుకూ ఈగుంపుకూ పోటీకి తగిన పరిస్థితులున్నాయి. అవి సులభంగా మతస్వరూపాన్ని తాల్చగలవు. ముస్లిం ఉన్నతవర్గానికి ప్రధానప్రాతిపదికగా ఉన్న పెద్ద భూస్వాములు, వ్యాపారం పరిశ్రమలు నడుపుతున్న పెట్టుబడిదారీవర్గ పురోగతిని "హిందు"—"హిందూ కోమటి" ప్రమాదం అని భావించారు. ఇక కొత్తగా పైకివస్తున్న మధ్యతరగతుల్లో కూడా ఇంతే—ముస్లింతెగ ఎక్కువ వెనకబడి ఉందిగనుక, రెండు వ్యాపారుల తెగలకూ మధ్యఉన్న తగాదాలు మత విద్వేషానికి పునాది అయినవి; విద్యాయోగ్యత మీద ఆధారపడిన ప్రభుత్వోద్యోగాల పోటీలో ముస్లిములు అననుకూల స్థితిలో పడ్డారు; పరిమిత వోటింగుహక్కులతో ప్రతినిధిసంస్థలు ఏర్పడడం మొదలయి విద్య ఆస్తిమీద ఓటింగు ఆధారపడ్డంవల్ల ముస్లిములకు తగినన్ని స్థానాలు లేక ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని వాంఛించ సాగారు. ఇలాస్పష్టంగా ఉన్న తగాదాలపై నాటకమాడుతూ, దానిపైనే రాజకీయపద్ధతినంతటిని నిర్మించేందుకు సులభమైన కారణమిదే.

1890 లో ఒక ముస్లిం గ్రూపు సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ నాయకత్వం క్రింద ప్రత్యేక సౌకర్యాలు, ముస్లిములకు ప్రత్యేకస్థానాలు కావాలని కోరింది.

పర్ పయ్యద్ ప్రభుత్వానికి సన్నిహితుడు. కాని, ఏమైనా ఈ పద్ధతిని బాధ్యతగల ముస్లిములు వ్యతిరేకించారు. ఇలాచేస్తే "జిల్లాలలోని, గ్రామాలలోని సమాజ జీవనం విషమయమై భారతదేశం నరకప్రాయమవుతుం"దని ముస్లిం హెరాల్డు పత్రిక ఖండించింది. ఆ కాలంలో ఈ యెత్తుగడ తర్వాత ఇంతకన్నా వినబడలేదు.

మొదటితూరి భారతదేశంలో ప్రజా జాతీయ ఉద్యమం విస్తరిల్లగానే 1906లో బ్రిటిష్ప్రభుత్వం, "జిల్లాలోవి,గ్రామాలలోవి సమాజజీవనం విషమయమై, భారతదేశం నరకప్రాయమయ్యేట్టు" చేసే విధానాన్ని ప్రారంభించింది. ఒక ముస్లిం ప్రతినిధివర్గం వైస్రాయి వద్దకువెళ్ళి ఏరకమైన ఎన్నికల పద్ధతి పెట్టినా అందులో ప్రత్యేక ప్రాతినిధ్యం ఏర్పరచమని కోరింది. ఈ వాంఛను తానంగీకరించినట్టు వెంటనే వైస్రాయి లార్డుమింటో ప్రకటించాడు.

> "మీ స్థితిని కేవలం మీ సంఖ్యను బట్టే కాక మీ జాతి రాజకీయ ప్రాముఖ్యాన్ని బట్టి, ఆ జాతి సామ్రాజ్యానికి చేసిన సేవను బట్టి అంచనా వేయవలెనని మీరుకోరుతున్నారు. మీతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను"

లార్డుమింటో 1906లో ముస్లిం ప్రతినిధి వర్గానికి జవాబు; "లార్డుమింటో జీవితం" జోన్ బూచాన్ 1925 పుట 24-4)

ఈ ముస్లిం ప్రతినిధి వర్గం "చక్కగా ఆడించిన నాటక"మని, ప్రభుత్వమే దీనిని ఏర్పాటు చేసిందని 1923 కాంగ్రెస్ సమావేశపు అధ్యక్షోపన్యాసంలో ముస్లిం నాయకుడు మహమ్మదాలీ బయటపెట్టాడు. ఈ ఏర్పాటు ప్రభుత్వోద్యోగులే అసలు మొదలు పెట్టారని లార్డుమింటోకు 1906 ఆఖరున లార్డుమోర్లీ వ్రాసిన జాబులో సూచింపబడింది.

> "మన మహమ్మదీయ తగాదాలోనికి తిరిగి మిమ్మ నేను అనుసరించను. కాని ఈ విషయం మాత్రం మీకు సవినయంగా జ్ఞాపకం చేస్తున్నాను. వారి అధిక వాంఛల గూర్చి మీరు తొలుత చేసిన ఉపన్యాసమే తొలుత ముస్లిం వారసును లేవ గొట్టింది."

(లార్డు మోర్లీ లార్డుమింటోకు వ్రాసిన జాబు డిసెంబర్ 6, 1909 మోర్లీ "జ్ఞాపకాలు" సంపుటి 2 పుట 325)

ఇలాగా మత నియోజక వర్గాలు, ప్రాతినిధ్యమూ ఉన్న పద్ధతి ప్రారంభమై ఏ ప్రజాతంత్ర ఎన్నిక పద్ధతినైనా సమూలచ్ఛేదం చేసింది దీనికి ఉపమానం వేరొకటి చూడాలంటే ఉత్తర ఐర్లాండులో కాథలిక్కులనూ 'ప్రొటెస్టాంటు లనూ వేరువేరు ఓటర్ల జాబితాలలో చేర్చినట్టు భావించు కోవాలి. అప్పుడు ఎన్నుకొనబడిన ప్రతినిధులు వారు మొత్తం ఓటర్లకు బాధ్యులుగా ఉండక ఆయా మతాలకు బాధ్యత వహిస్తారు. ప్రత్యేక మత సంస్థలు ద్వేషాలు రెచ్చ గొట్టేందుకు ఇంతకంటే ఎత్తుగడ ఇంకేదీ ఊహించుకో లేము. మరి ప్రత్యేక ముస్లింలీగు స్థాపనకూడ 1906 డిసెంబరులోనే జరిగింది. ముస్లిములను హిందూ అధికసంఖ్యాక ప్రజ తుడిచిపారవేయకుండా ఆటంకపరచడానికి అలాంటి ప్రత్యేక నియోజకవర్గాలు,

ప్రాతినిధ్యం తప్పనిసరి అని, వాద మొకటి బయలుదేరదీశారు. అదేసమయంలో పాత సంయుక్త నియోజకవర్గ పద్ధతిపైన జరిగిన స్థానిక పరిపాలన సంస్థల ఎన్నికలు, ఈ వాదమెంత అబద్ధమో రుజువుచేశాయి. సంయుక్త పరగణాలలో 1910 లో జరిగిన సంయుక్త ఎన్నికలలో అక్కడ ముస్లిం జనాభా ఏడోవంతు మాత్రమే ఉన్నప్పటికీ జిల్లాబోర్డులకు 189 ముస్లిములు, 445 మంది హిందువులు ఎన్నుకోబడినారు. మునిసిపాలిటీలకు 310 ముస్లిములు, 562 హిందువులు ఎన్నుకోబడినారు.

ప్రత్యేక నియోజకవర్గాలను, ప్రాతినిధ్యాన్ని ఏర్పరచడంతోనేకాక ముస్లిములకు ప్రత్యేక సౌకర్యాలతో ప్రాతినిధ్యం ఇవ్వడంద్వారా వీని ప్రయోజనం రెండు మతాలకుమధ్య తీవ్రవిభేదాలు కల్పించడమేనని స్పష్టపడిపోయింది. విపరీతంగా ఎన్నికల ప్రాతినిధ్యంలో పక్షపాతంచూపబడింది. మోర్లీమింటో సంస్కరణల క్రింద ఒక్క ఓటరు కావాలంటే ముస్లిమయితే ఏటా 3000 రూ. ఆదాయమువస్తున్న కట్టేవాడుగా ఉండాలి. ముస్లిమేతరుడయితే ఏటా ఆదాయమువస్తున్న 3,00,000 రూపాయలు కట్టేవాడుగా ఉండాలి; ముస్లిం పట్టభద్రుడైతే (గ్రాడ్యుయేటు) మూడేండ్లు దాటితే ఓటరవుతాడు, అదే హిందూ పట్టభద్రుడయితే ముప్పైయేళ్ళు దాటాలి ప్రతినిధుల సంఖ్యలోకూడ ఇలాగే ప్రత్యేక పక్షపాతం (వైటేజి) ఇవ్వబడింది. ఇలా చేస్తే ఆ సౌకర్యాలుపొందిన అల్పసంఖ్యాకవర్గం ప్రభుత్వాన్ని బలపరుస్తుందని, అధికసంఖ్యాకులు ప్రభుత్వంపైగాక ఆ అల్పసంఖ్యాకులపై కక్ష పూనుతారని ప్రభుత్వం ఆశించింది.

ఈ పద్ధతిని జయప్రదంగా తర్వాత రాజ్యాంగ సంస్కరణల్లో విస్తారపరుస్తూ వచ్చారు. ఇది 1935 లో ఉచ్ఛదశకు పోయింది. ఈ చట్టమే ఈనాటికి (1946) అమలులో ఉంది. ఈ చట్టంక్రిందనే ఏర్పడిన శాసనసభలనుండే నూతన రాజ్యాంగ శాసనం నిర్మించే రాజ్యాంగ నిర్మాణసభకు పరోక్ష ఎన్నిక జరిగింది. 1935 ఇండియా చట్టంలో ఒక్క ముస్లిములకేకాక, సిక్కులకు, ఆంగ్లో ఇండియన్లకు, భారత క్రైస్తవులకు (1) నిమ్నజాతులకు వీరితోపాటు

---

(1) ప్రభుత్వం తమ వాంఛలనుబట్టికాక స్వార్థంకోసం తమపై రుద్దిన ఈ ప్రత్యేక నియోజకవర్గ పద్ధతిని, భారత క్రైస్తవనాయకులు తీవ్రంగా ఖండించిన సంగతి గుర్తింపదగిన అంశం. 1938 లో జరిగిన అఖిల భారత క్రైస్తవ మహాసభ అధ్యక్షోపన్యాసంలో యిలా ప్రకటించబడింది :

"ప్రత్యేక నియోజకవర్గాలగూర్చి నా పెద్ద ఆక్షేపణేమంటే, ఇందుమూలంగా మనం ఇతరమతాలవారితో సన్నిహితసంబంధం ఏర్పరచుకునేందుకు ఆటంకం కల్గుతుంది. మన పాతనాయకులు దారిచూపగా - ఆ నాయకులు కొందరిప్పుడు మనల వీడిపొయ్యారు - మనం వద్దన్నా పైనరుద్దిన ఈప్రత్యేక నియోజకవర్గ పద్ధతిని మనం ఎదిరిస్తూ వచ్చాము. ఈ మతనియోజకవర్గాలు భారతదేశాన్ని చీల్చివేసాయి. ఈపద్ధతివల్ల మనమతమెంత నష్టపడుతున్నదో ఏటేటా నాముందటి నాయకులు తెలుపుతూ

యురపియన్లకు, భూస్వాములకు, వాణిజ్య పరిశ్రమవర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం యిచ్చారు. ఫెడరల్ అసెంబ్లీలో 250 మొత్తం స్థానాలలో 82 - మూడువంతులు - ముస్లిములకు ప్రత్యేకించారు. అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న ఇతర జనాభా "సామాన్య స్థానాలను" 105 - అయిదులో రెండువంతులకు తగ్గించారు. మరీ ఇందులో 19 నిమ్నజాతిస్థానాలు వేరుపరచారు.

సామ్రాజ్యవాదము ఏర్పరచిన ఎన్నికల పద్ధతి ఇంత అవకతవకగా ఉన్నది.*

ఈ ఎన్నిక పద్ధతి మూలంగా మత విభేదాలను మరింత రెచ్చగొట్టాలనే ప్రభుత్వోద్దేశం. ఈ ఉద్దేశం పరిపాలన రంగం యావత్తులోను అనుసరించే విధానంలో బయట పడుతున్నది.

---

వచ్చారు. దేశ ప్రఖ్యాతికి కళంకమైన ఈ పద్ధతిని, వెంటనే రద్దుచేసేందుకు తీవ్ర ఐక్యప్రయత్నాలు చేయవలసిందని పదే పదే మనం అన్నిమతాల నాయకులకు విజ్ఞప్తి చేయడం అవసరమని నా అభిప్రాయం"

(డాక్టర్ హెచ్. సి. ముఖర్జీ, అధ్యక్షుడు అఖిల భారత క్రైస్తవ మహాసభ, మద్రాసు, డిసెంబరు 1938)

(*) ఇంత విపరీతంగా ముస్లిం వర్గానికి వారిసంఖ్యతో ఏమాత్రం సంబంధం లేకుండా ప్రాతినిధ్యం యెక్కువగా ఇవ్వడం అల్ప సంఖ్యాకుల రక్షణకే ననే వాదం 1935 చట్టంక్రింద బెంగాలు అసెంబ్లీకి స్థానాలు విభజించడంలో పూర్తిగా బట్టబయలయింది. బెంగాలులో - ఇప్పటి పరిహద్దులనుబట్టి-ముస్లిములు అధిక సంఖ్యాకులు అయినా మిగత రాష్ట్రాల్లో లాగే ఎక్కువ ప్రాతినిధ్యం ఇచ్చారు. జనాభాలో వందకు 55 మంది వున్న ముస్లిములకు 117 స్థానాలు; జనాభాలో వందకు 43 గురున్న హిందువులకు సామాన్య స్థానాలు 78 (ఇందులో 30 స్థానాలు నిమ్నజాతులకు ప్రత్యేకింప బడినవి. అంటే మిగత 48). హిందువులకు 78 స్థానాల దామాషాతో అయితే ముస్లిములకు 99 స్థానాలే రావాలి. కాబట్టి అల్ప సంఖ్యాకులకు రక్షణ అనే దిక్కుమాలిన వటాపంచ లయిపోయింది.

ఇక 1916 కాంగ్రెస్ లీగుల లక్నో ఒడంబడిక సిఫారసుల మూలంగానే ఈ మత నియోజక వర్గాల ఏర్పాటుకు ప్రోద్బలం కలిగిందన్న మరో కపటవాదముంది (దీనిని మాంటేగో ఛెమ్సుఫర్డు నివేదికలో లాగే సైమన్ నివేదికలోనూ వదలకుండా పెద్దగా చెప్పుకొచ్చారు.) లార్డుమింటో-మోర్లీలు ప్రవేశపెట్టిన మత నియోజక వర్గాలు తప్పవని అంగీకరించడంలో లక్నో ఒడంబడిక చాల పెద్దపొరపాటు చేసింది; కాని ఈ అధిక ప్రాతినిధ్యం ఏమతం వారు ఎక్కడ మైనారిటీగాఉంటే అక్కడ వారికివ్వాలి అని కోరింది. అలాఅయితే ముస్లిములు అల్ప సంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాలలో కొన్ని ఎక్కువ స్థానాలు వస్తాయి. మరి బెంగాలులోలాగా ముస్లిములు అధికంగా ఉన్నచోట్ల కొన్ని తక్కువ స్థానాలు వస్తాయి. అయినా మేము లక్నో ఒడంబడిక ప్రోద్బలంతో పని చేస్తున్నామని చెప్పుకొనే సామ్రాజ్య వాద ఉద్యోగులు మెజారిటీగా ఉన్నా మైనారిటీగా ఉన్నాసరే అది లెక్కించకుండా ముస్లిములకు అధిక స్థానాలిచ్చారు. ఇందువల్ల వారి ఉద్దేశం మైనారిటీల రక్షణకాదని కేవలం జనాభాలోని ఒక భాగంపై నిరంకశంగా పక్షపాతం చూపి ప్రజలను చీల్చడమే వారి అంతర్యమని తెలిసి పోతున్నది.

దోపిడీ సామ్రాజ్యవాదుల పాలన పద్ధతిని రక్షించు కొనేందుకై రెచ్చగొట్టబడిన మత విద్వేషాల వెనుక సాంఘిక ఆర్థిక సమస్యలున్నవి. పదవులకు ఉద్యోగాలకు పోటీ పడుతున్న మధ్యతరగతి మతవాదుల విషయంలో ఇది స్పష్టంగానే ఉంది. మత సమస్యలు ప్రజలవరకు పోయినచోట్లా ఇదే కనబడుతుంది. బెంగాలు పంజాబులలోని హిందువులలో పెద్ద భూస్వాములు వ్యాపార వర్తక వర్గాలూ ఉన్నాయి; ముస్లిం లక్కడ సామాన్యంగా పేద రైతులూ, ఋణగ్రస్తులూ అయి ఉన్నారు. ఇలాగే ఇతరచోట్ల హిందూరైతుల మధ్య ముస్లిం భూస్వాము లుంటాడు. పదేపదే మత కలహాలని వచ్చే వార్తలు, ముస్లిం రైతులు హిందూ భూస్వాములపై చేసే పోరాటమో. ముస్లిం ఋణగ్రస్తులు హిందూవడ్డీ వ్యాపారులపై చేసే తిరుగుబాటో. లేక హిందూ కార్మికులు పఠాన్ సమ్మె విచ్ఛిన్నకులతో పోరాడడమో, అయి ఉంటాయి. ఎవరో వెనుకనుండి రెచ్చగొట్టిన ఈ మతకలహాల రాక్షస ముఖం, కార్మికులు ముందుకు వెళ్ళిన ఏ పరిశ్రమ కేంద్రంలోనైనా పోలీసు కాల్పుల మరణాలతో జరిగినప్పుడు మరీ ఘోరంగా కనిపిస్తుంది. 1929 బొంబాయిలో పెద్ద సమ్మె ఉద్యమం సాగిన వెంటనే ఇవి వచ్చాయి. 1938 సమ్మె విజయం తర్వాత కాన్పూరులో 1939 లో మతకలహాలు వచ్చాయి. ఈ మతకలహాలు అభివృద్ధి నిరోధక వర్గాల ఆయుధమని కార్మికుల సమ్మె ఐక్యతను భగ్నం చేసేందుకే దీన్ని ప్రయోగిస్తారని. ఇదే దాని సాంఘిక ఆర్థిక ప్రయోజనమని స్పష్టంగా కనబడుతుంది. (1)

భారతదేశంలోని హిందూ-ముస్లిం ప్రజాసామాన్యానికి వేరువేరు లక్ష్యాలు ఉండవీలులేదు. హిందూదరిద్రం, దాస్యం. ముస్లిందరిద్రం. దాస్యంఅని ప్రత్యేకంగా

---

(1) మత కలహాలలో ఉద్యోగుల మద్దతునుగూర్చి 1931 కాన్పూరు కొట్లాటల విచారణ కమిటీ ఇలా వ్రాసింది :

"ప్రతి సాక్షీ - ఈ వర్గం ఆ వర్గం అనకుండా — ఈ ఒక్క విషయంలో ఏకీభవించారు. మతకలహాల సంఘటనలలో పోలీసులు పట్టించుకోకుండా ఏమీ చేయకుండా కూర్చున్నారు. ఈ మాటచెప్పిన సాక్షులలో అన్నిరకాలవారూ యూరపియన్ వర్తకులు, హిందువులు, ముస్లింలు, మిలిటరీ ఉద్యోగులు, ఉత్తర హిందూస్థాన వాణిజ్యమండలి కార్యదర్శి, భారత ఉద్యోగులుకూడ ఉన్నారు. ఇంత ఏకగ్రీవ సాక్ష్యాన్ని గుర్తించకపోవడం అసాధ్యం........ కొట్లాటలు జరిగిన మొదటి మూడు రోజులలో పోలీసులు నిర్వర్తించవలసినంతగా తమ కర్తవ్యాన్ని అనుసరించలేదనడంలో మాకేమీ అనుమానంలేదు.

"పోలీసుల ఎదుటనే ఎన్నో పెద్ద నేరాలు జరుగుతున్నా, సిరేమీ చేయి చేసుకోలేదని చాలమంది సాక్ష్యాలు చెప్పారు....అప్పుడే, పోలీసులేమీ చేయక నిర్లక్ష్యంగా ఉన్నారని ఫిర్యాదులు వచ్చినట్లు చాలమంది సాక్ష్యాలు, జిల్లా మాజిస్ట్రేటుకూడ మాకు చెప్పారు. ఈ ఫిర్యాదులను ఏమాత్రం శ్రద్ధగా అప్పుడు చూడకపోవడం విచారకరం."

(కాన్పూరు కొట్లాటల నివేదిక, 1931, పుట 39.)

లేవు. ఉన్నదల్లా భారత దారిద్ర్యమూ దాస్యమునూ. లక్షలకొలది భారతగ్రామాలలోని హిందువులు, ముస్లింములలో అధికసంఖ్యాకులు అదేభూస్వామి భారంక్రింద, అదేవడ్డీ వ్యాపారుల దోపిడీక్రింద, అదే పీకలునులిమివేసే సామ్రాజ్యతత్వంక్రింద జీవించుతున్నారు. వారిలో చీలికలు రేకెత్తించడం ఈదోపిడీపద్ధతిని నిలిపేందుకు ప్రయత్నించడమే అవుతుంది.

మతసమస్యకు ఆఖరుపరిష్కారం సాంఘిక, ఆర్థిక పురోగతి మార్గంలోనే కావాలి. కార్మిక సంఘాలలోను, రైతుసంఘాలలోను హిందువులు, ముస్లిములు ఏవిభేదమూ, ప్రత్యేకతా లేకుండా కలసి ఉంటున్నారు. (ప్రత్యేక నియోజకవర్గాల అవసరమే వీరికి కల్పించడంలేదు.); అందరికీ సమానంగాఉన్న వర్గ ఐక్యత, సమాన సాంఘిక, ఆర్థిక అవసరాలు మత కుల కృత్రిమ విభేద శృంఖలాలను విచ్ఛిన్నం చేస్తాయి. ప్రజాప్రయోజనాల పునాదిపై ప్రజాఉద్యమం పురోగమించడమూ, ప్రజాతంత్ర ఉద్యమపురోగతి వీనిద్వారా మతవిద్వేషాలు పూర్తిగా అణగిపోగలవు.

మతప్రాతిపదికమీద భారతప్రజలను రెండు "జాతుల"క్రింద కృత్రిమంగా విభజించాలనే ప్రయత్నం వాస్తవస్థితిలో అభివృద్ధి నిరోధకమైనది. ఆచరణయోగ్యంకానిది; ప్రజాతంత్ర స్వేచ్ఛకు వ్యతిరిక్తమైనదిన్నీ. 1931 కాంగ్రెస్ అంగీకరించిన ప్రధానహక్కులకు చెందిన ప్రధాన జాతీయోద్యమ విధానం సక్రమమైనది. కులమత, స్త్రీ పురుష విభేదంలేకుండా సమాన ప్రజాతంత్ర పౌరసత్వాన్నీ, అన్నిమైనారిటీల సంస్కృతులకు రక్షణనూ, మత విశ్వాసాలకు సంపూర్ణ స్వేచ్ఛనూ యివ్వడం అందులో ఉన్నది.

కాని ఇందుతోపాటు, పరిపూర్ణ ప్రజాతంత్ర పరిష్కారానికి, నూతనంగా ఉదయిస్తున్న ప్రాంతీయ లేక జాతీయ స్వయంనిర్ణయ వాంఛలనుగూడ గమనించవలసిఉంటుంది. ఈ జాతీయ స్వయం నిర్ణయవాంఛ వర్తమానయుగంలో తాత్కాలిక గందరగోళానికిలోనై హిందూ-ముస్లిం సమస్యతో చిక్కుపడి ఉన్నది. ఈ సమస్యలు ఇటీవల ముస్లింలీగు ఒక ప్రజాసంస్థగా అభివృద్ధి చెందడం,ఆ లీగు పాకిస్తాన్ వాంఛకు వస్తున్న బలమూ వీనిలో ప్రతిబింబిస్తున్నవి. ఇటీవల కాంగ్రెస్ ముస్లింలీగు సంబంధసమస్య అతి ప్రాముఖ్యానికి వచ్చింది. ఈ సమస్యలను వెంటనే పరిష్కరించడం అవసరం; ఎందుకంటే ఇటీవల కాంగ్రెసు లీగులకు మధ్యనున్న విభేదాలే సామ్రాజ్యవాద విధానానికి ప్రధానమైన ఆధారమయ్యాయి. ఈ సంగతి 1946 బ్రిటిష్ మంత్రివర్గ రాయబారాలలో స్పష్టపడింది. ఈసమస్యలు పరిష్కారం కావాలంటే, హిందూ-ముస్లిం సమైక్యత, మతవిభేద నిర్మూలనం మాత్రమేకాక, కొత్తగా ఏర్పడిన ప్రత్యేక రాజకీయ సమస్యలను పరిశీలించడం, పరిష్కరించడంకూడ ఆశయంగా పెట్టుకొని పనిచేయాలి.

## 3. వివిధ జాతులు - పాకిస్తాన్

వివిధ జాతుల సమస్యను, పాకిస్తాన్ సమస్యను, కాంగ్రెసు లీగు సమైక్యత సమస్యనూగూర్చి చర్చించేముందు సంగ్రహంగా ముస్లింలీగు అభివృద్ధియొక్క పూర్వరంగాన్నిగూర్చి, కాంగ్రెసు లీగు సంబంధాలగూర్చి పరిశీలించడం అవసరమవుతున్నది.

ముస్లింలీగు 1906 డిసెంబరులో స్థాపితమైనది. కాంగ్రెసు అసలుస్థాపన విషయంలోలాగే ముస్లింలీగు స్థాపనలోకూడ బ్రిటిష్ విధానం కొంత పాత్రను నిర్వహించింది.

మతనియోజకవర్గాలతోపాటు, ముస్లిములకు ప్రత్యేక మతరాజకీయసంస్థను స్థాపించడంవల్ల జాతీయోద్యమాన్ని విచ్ఛిన్నం చేయవచ్చుని కాంగ్రెసు బలప్రాబల్యాన్ని తగ్గించవచ్చుని బ్రిటిష్ అధికారవర్గాలు ఆశించారు. ఆ సమయంలో వైస్రాయి లార్డు మింటోకు ఒక బ్రిటిష్ ఉద్యోగి ఇలా వార్తపంపాడు.

> "నేడొక గొప్ప సంఘటన జరిగిందని మీకు తెలియజేయడం అవసరం. ఈ రాజనీతి విశారదత్వమును వెల్లడిచేసేపని చాల ఏళ్ళవరకు ఇండియాను, భారత చరిత్రను నడిపించగలదు. రాజద్రోహకర ప్రతిపక్షం (కాంగ్రెసు) నుండి వారిలో చేరకుండా ఆరుకోట్ల ఇరవైలక్షల ప్రజలను (ముస్లిములను) వెనక్కు లాగివేయడంకన్నా ఇది తక్కువపనికాదు."
>
> (లేడీమింటో, "ఇండియా మింటో అండ్ మోర్లే" 1934, పుట. 47,)

ఇలాంటి అభిప్రాయాన్నే బ్రిటిష్ ప్రభుత్వంకూడ వెల్లడించినట్లు లేడీ మింటో వ్రాసింది.

మొదటి సంవత్సరాల్లో ముస్లింలీగు ఒక సంకుచిత మతసంస్థగా ఉంది. ముఖ్యంగా పైతరగతుల ముస్లిం భూస్వాములకు చెందిన సంస్థాగా మాత్రమే ఉండేది కాంగ్రెసు విషయంలాగే, జాతీయ, సామ్రాజ్య వ్యతిరేకభావాలు ముస్లింలీగులోను తలసూపసాగాయి 1913 కల్లా భారతదేశం "సామ్రాజ్యంలో భాగంగా స్వపరిపాలిత ప్రభుత్వం" కావాలనీ, ఈ ఆశయసాధనకు "ఇతరమతాల సహకారం" కావాలని, ముస్లింలీగు తన ఆశయాన్ని ప్రకటించింది. కాంగ్రెసు లీగుల మధ్య రాయబారాలు నడిచాయి 1916 లో కాంగ్రెసు లీగుమైత్రి-లక్నో ఒడంబడిక-జరిగింది ఈ ఒడంబడిక మత నియోజకవర్గాలను అంగీకరిస్తూ రెండుసంస్థలూ, అధినివేశ స్వతంత్రంకోసం పనిచేయడం ఉభయుల ఉద్దేశంగా ప్రకటించింది.

లక్నోలో కాంగ్రెసు-లీగు సంయుక్త సమావేశం జరిగింది. కాంగ్రెస్ సమావేశంలో నాయకుడు తిలక్ ఇలా ప్రకటించాడు.

> "హిందువులమైన మనం, మన మహమ్మదీయ సోదరులకు చాల లొంగిపోయామని కొందరంటున్నారు మనం చాల ఎక్కువగ లొంగి

పోలేము అని నేను చెప్పడంలో యావద్భారతంలోని హిందువు లందరి భావాన్నీ ప్రకటిస్తున్నానని నా విశ్వాసం.....మనం మూడో పార్టీతో పోరాటం చేయవలసి ఉన్నప్పుడు ఈ వేదికపై జాతీయైక్యతతో, మతైక్యతతో అన్నివిధాల రాజకీయాభిప్రాయాలతో ఏకంగా నిలబడి ఉండడం చాల గొప్ప విషయం, చాల ప్రముఖమైన సంఘటన."

ఇలాగే కాంగ్రెస్ - లీగ్ సమైక్యతకు ఎక్కువ పనిచేసిన లీగు నాయకుడు యమ్. ఎ. జిన్నా లీగు సమావేశానికి అధ్యక్షత వహిస్తూ ఇలా అన్నాడు :

"నా జీవితమంతా నేను శుద్ధ కాంగ్రెసువాదిని. ప్రత్యేక విభేద వినాదాలను ప్రేమించేవాణ్ణికాదు. కాని ఈ మత మహాసంస్థ త్వరత్వరగా సంయుక్తభారత దేశ ప్రాదుర్భావానికి శక్తివంతమైన కారణం అవుతుండడం చూస్తే, ముస్లిములు ప్రత్యేక విభేదభావాలు ప్రకటిస్తారనే నింద సరికాదనీ, సత్యదూరమనీ నాకు తోస్తుంది."

మొదటి యుద్ధం తర్వాత ఆందోళనలో హిందూ - ముస్లిం ప్రేమబంధాలు మరింత బలపడినవి. గాంధీ నాయకత్వంక్రిందనున్న కాంగ్రెస్, ఆలీ బ్రదర్లు అగ్రేసరులుగా ఉన్న తీవ్రవాద ముస్లిం నాయకుల ఖిలాఫత్ కమిటీల మధ్య ఏర్పడిన మైత్రి స్వరాజ్య సాధనకై ప్రభుత్వ వ్యతిరేకంగా బలమైన సంయుక్త ప్రతిఘటన నేర్పరచించి. హిందూ - ముస్లిం సమైక్యతను అభినందిస్తూ ఉత్సాహపూరితులైన ప్రజానీకం వీధులలో ప్రదర్శనాలు చేశారు. 1919 ప్రభుత్వ నివేదిక ఈ "అభూత పూర్వ హిందూ - ముస్లిం సోదరభావాన్ని....సోదరభావం ప్రకటించే అపూర్వ దృశ్యాలను" పేర్కొనక తప్పలేదు.

ఈపోరాట మహాయుగంలో ముస్లిం నాయకులు, ప్రజలు కాంగ్రెస్‌తో పాటు తమతీవ్ర దేశభక్తిని రుజువుచేశారు. ముస్లిం నాయకులైన ఆలీసోదరులు, హుసేన్ అహ్మద్ మదానీగారలు ధైర్యంగా సైనికులకు రాజద్రోహాన్ని బోధించి ఆరేళ్ళ శిక్షకు పాత్రులయ్యారు. మలబారులోని మాప్లా రైతులు తమంతటే హఠాత్తుగా భూస్వాములపై, సామ్రాజ్యవాద పీడనపై నిర్భయంగా పోరాటం నడిపి వీరోచితంగా పోరాడి, పోరాటానికి, త్యాగానికి తమకున్నశక్తి సామర్థ్యాలను వెల్లడించారు.

స్వరాజ్యమంటే సంపూర్ణ స్వతంత్రమని నిర్వచించవలసిందిగా మొదట కోరినవారు ఖిలాఫత్‌నాయకులే. 1921 అహ్మదాబాదు కాంగ్రెస్‌లో హజరత్ మోహినీ తొలుత ఈవాంఛను వెల్లడించాడు. "ఆవాంఛలో బాధ్యతారాహిత్యం కనిపిస్తున్నదిగనక నాకు బాధకలిగిస్తున్నది" అని ఆవాంఛను వ్యతిరేకించినది గాంధీజీఅన్న సంగతి గుర్తింపదగిన అంశం.

ఇలాగే 1919 అమృతసర్ సమావేశంలో ముస్లింలీగు, భారతసేనలో ముస్లిములను చేరవద్దంటూ ఒకతీర్మానం చేసింది.

ఇలాగే 1922 లో లక్నోలో జరిగిన ఖిలాఫత్-జమియత్ ఉల్‌ఉలేమాల సంయుక్త సమావేశం ఇలా తీర్మానించింది : "భారతదేశ క్షేమంకోసం, కాంగ్రెస్ ఆశయాన్ని "స్వరాజ్యం" అని కాక ఆ స్థానంలో "సంపూర్ణ స్వతంత్రం"గా నిర్వచించవలసిందని ముస్లిములు వాంఛిస్తున్నారు.

ఇలాచేస్తే "కాంగ్రెస్ నియమావళిలో ప్రధానమైన మార్పు" చేయవలసి వస్తుందంటూ ఆ రోజుల్లో దురదృష్టవశాత్తు ఈ ప్రతిపాదనను కాంగ్రెస్ నాయకులు నిరాకరించారు.

కాంగ్రెస్-ఖిలాఫత్ పోరాటంలో సాధించిన సమైక్యత నిలబెట్టుకోలేదు. గాంధీజీ నాయకత్వంక్రింద కాంగ్రెస్ హఠాత్తుగా ఉద్యమాన్ని ఆపివేయడంతో విభేదాలు పొటమరిల్లాయి. 1922 ఫిబ్రవరిలో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమాన్ని ఆపివేసినప్పుడు, పోరాట మాపడం సరికాదని ఖిలాఫత్ నాయకులందరూ అసమ్మతి తెల్పారు.

తర్వాత నిరాశా నిస్పృహ దశ కాంగ్రెస్ లీగులు వేరుపడేందుకూ, హిందూ-ముస్లిం విద్వేషాలకు దారితీసింది. తమ కనుకూలమైన ఈ పరిస్థితిని సామ్రాజ్య వాదులు పూరా ఉపయోగించుకున్నారు. తర్వాతి సంవత్సరాలలో, స్వతంత్ర సంయుక్త పోరాటంస్థానే మతకలహాలు చెలరేగాయి. మత అభివృద్ధినిరోధకులు ముందుకువచ్చారు. ముస్లింలీగుకు ప్రతికక్షిగా హిందూమహాసభను యావత్‌భారత దేశ ప్రాతిపదికమీద 1925 లో స్థాపించారు. లాలాలజపతిరాయి అధ్యక్షుడయ్యాడు. కాంగ్రెస్ ముస్లింలీగులు 1927 లో సైమన్‌కమిషన్ బహిష్కరణలో ఏకమయ్యాయి; కాని 1928 అఖిలపక్షసభలో ఒడంబడికకై జరిగిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

ఇలా 1937 ఎన్నికలు వచ్చాయి. ఇంతకుముందు కన్నా 1935 ఇండియా చట్టంక్రింద జరిగిన ఈ ఎన్నికలలో రాష్ట్ర శాసనసభల ఓటింగుహక్కు విశాల పరచబడింది. ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ లీగులు పూర్తిగా పరస్పరం పోటీ చేశాయి. సాధారణ నియోజక వర్గాల్లో అత్యధిక స్థానాలు-రాష్ట్ర శాసనసభల క్రింది సభల్లో (అసెంబ్లీ) స్థానాల మొత్తంలో సగంవరకు-కాంగ్రెసు గెల్చుకొంది. (మొత్తం, 1,585 స్థానాల్లో 711) కాని ముస్లిం స్థానాలలో అంత ఎక్కువ రాలేదు. 482 ముస్లిం స్థానాలలో 58కి మాత్రం పోటీచేసి 26 మాత్రమే గెలిచింది (సరిహద్దు రాష్ట్రంలోనే 15, మిగత అన్ని రాష్ట్రాలలో కలిసి 11 గెలిచింది). ఇక ఆ వైపున వివిధ సముదాయాలకూ గ్రూపులకూ ఉన్న తీవ్రవిభేదాల మూలంగా ముస్లింలీగు బలం అంతగా కన్పించలేదు. కేవలం ముస్లిం వోట్ల మొత్తంలో నూటికి 4.6 మాత్రమే లీగు సాధించింది. (మొత్తం ముస్లిం వోట్లు 7,319,445, ముస్లిం లీగుకు వోట్లు 3,21,772 )

1937 ఎన్నికల తర్వాత రాష్ట్ర మంత్రివర్గ నిర్మాణంలో స్థానాల పంపకంలో ఒడంబడిక కుదుర్చుకోవాలని ముస్లిం నాయకులు అనధికార రాయబారాలను కాంగ్రెస్‌తో నడిపారు. అయినా ఈ సమయంలో కాంగ్రెస్ బలంగా ఉంది కాబట్టి, ముస్లింలీగు ప్రతిపాదనను త్రోసి పుచ్చింది. లీగు రాజకీయ పాత్రను ఖండించి భారతదేశం మొత్తానికి కాంగ్రెస్ ప్రతినిధి అని చెప్పింది. 1937 జనవరిలో జిన్నాకు వ్రాసిన-జాబులో నెహ్రూ ఇలా అన్నాడు :

"ఆఖరువివరణలో నేడు భారతదేశంలో రెండేశక్తులు కనిపిస్తున్నవి. ఒకటి బ్రిటిష్ సామ్రాజ్యతత్వం, రెండోది భారత జాతీయ ప్రతినిధి కాంగ్రెస్.... ముస్లింలీగు ముస్లింలలో ఒక భాగానికి ప్రతినిధి. వారు గొప్పవారేకాని ఉన్నత మధ్యతరగతులలోనే అది పనిచేస్తూ ముస్లిం ప్రజానీకంతో సంబంధం లేకుండావుంది. దిగువ మధ్యతరగతుల్లో కొద్దిమందే లీగర్లున్నారు."

ఈ ఘట్టంనుండి కాంగ్రెస్ ముస్లింలీగు విభేదాలు తీవ్రమయ్యాయి. అతి చతురుడైన జిన్నా నాయకత్వంక్రింద ముస్లింలీగు తన నిర్మాణాన్ని బలపరచుకొనేందుకూ ముస్లిం ప్రజానీకంలో బలాన్ని సంపాదించుకొనేందుకు వివిధ ముస్లిం సంస్థలనూ, గ్రూపులనూ కలుపుకొనేందుకు ప్రయత్నించ సాగింది. ముస్లింలీగును భారత ముస్లిముల ప్రధాన సంస్థగా చేయ సమకట్టారు. ఈ విధానం విఫలం కాలేదు. 1937-45 సంవత్సరాల్లో ముస్లింలీగు స్థానంలో, బలంలో విపరీతమైన భేదం కన్పించింది. ముస్లిం ప్రజానీకంలో లీగు పలుకుబడి హెచ్చింది. 1927లో కేవలం 1,330 ముస్లింలీగు సభ్యత్వం అది 1938 కి లక్షలకు పెరిగిందన్నారు. 1944 లో అధికార యుతంగా రెండులక్షల సభ్యత్వమున్నట్లు ప్రకటించారు. ఈ మార్పును 1946 ఎన్నికలు బయటపెట్టాయి. కేంద్రరాష్ట్ర శాసనసభల్లోని మొత్తం 533 ముస్లిం స్థానాలలో 460 స్థానాలను లీగుగెల్చింది ఈ యుగంలో భారత ముస్లిములలో ప్రధాన రాజకీయ సంస్థగా ముస్లింలీగు ఏర్పడిందనడంలో అనుమానం లేదు.

ఈ యుగంలో ముస్లింలీగు ప్రజాబలమింత పెంపొందడానికి కారణాలేమిటి ? చాల అంశాలను గమనించవచ్చు.

ఒకటి : గత పదిసంవత్సరాల రాజకీయాందోళన మూలంగా కొత్త ప్రజలు పూర్వం వెనుకబడి వున్నవారుకూడ తొలిసారిగా రాజకీయ చైతన్యం పొందారు. ఈ చైతన్యం ప్రథమరూపాలలో బయటపడింది ఈ యుగంలో కాంగ్రెసూ లీగూ కూడ చాల బలపడ్డాయి 1935-36 కు 1938-39 కి మధ్య కాంగ్రెసు సభ్యత్వం తొమ్మిదిరెట్లు పెరిగి 44 లక్షలయింది. కాని అందులో ముస్లింలు చాలకొద్దిమంది. 1938 జనవరిలో, నెహ్రూ ప్రకటనను అనుసరించి 31 లక్షల కాంగ్రెసు సభ్యులలో లక్షమంది మాత్రమే - అంటే వందకు 3 . 2 వంతులు మాత్రమే ముస్లిము

లున్నారు. కొత్తగా చైతన్యవంతులైన ముస్లింలు అధికసంఖ్యాకులుగా తమ రాజ కీయ సంస్థ అని లీగువైపు మరలారు.

రెండు : ముస్లింలీగు సంస్థలోనే ఒక యువ తీవ్ర భావవర్గం తయారై, పాత అభివృద్ధివిరోధక నాయకత్వం అడ్డుపడుతున్నా ఒక ప్రజాతంత్ర కార్య క్రమాన్ని ముందుకు కొనిపోసాగింది. పంజాబు, బెంగాలులలోలాగా కొన్ని జిల్లాల లోను, రాష్ట్రాలలోను ఈ యువకవర్గాలు ప్రజల సాంఘిక ఆర్థిక సమస్యలపై ఆందో ళన నడిపి, పేదముస్లింల బలాన్ని సమీకరించుకొన్నారు ఈ విధాన విజయం 1946 ఎన్నికల్లో కనిపించింది. పూర్వం ప్రధానంగా ఉన్న యూనియనిష్టుపార్టీ పంజాబులో ముస్లింలీగు దెబ్బకు పడిపోయింది.

మూడు : ఇలా ముస్లింలీగు ప్రజాబలం పెంపొందేందుకు, కాంగ్రెసులో ముస్లిం ప్రాతినిధ్యం కొఱవడినందుకూ, కాంగ్రెసు అనుసరించినవిధానంలోని రాజ కీయ, నిర్మాణ, కార్యక్రమ దౌర్బల్యాలుకూడ నిస్సందేహంగా కారణమయ్యాయి. కాంగ్రెసు అసలు ఉద్దేశం హిందువులనూ ముస్లింలనూ సమానంగా చేర్చుకోవాలనే. కాని ఆచరణలో సఖ్యత్వాన్ని చేర్చడంలో ఈఆశయమెన్నడూ కొనసాగలేదు. 1922 ప్రజా సహాయ నిరాకరణోద్యమాన్ని ఉచ్ఛస్థితిలో ఉండగా ఆపివేయడం, యెలా కాంగ్రెస్ ఖిలాఫత్‌ల ఐక్యతను విచ్ఛిన్నం చేసిందో గమనించాము. కాంగ్రెస్ మంత్రివర్గ యుగంలో ఒడంబడికకై లీగుచేసిన ప్రతిపాదనను త్రోసిపుచ్చడం, దాని బలాన్ని కాంగ్రెస్ తక్కువ అంచనా వేయడంవల్ల జరిగింది. ఇందుతో లీగు, కాంగ్రెస్ వ్యతిరేక ప్రచారాన్ని తీవ్రతరం చేయడానికి ఆధారం దొరికింది. యుద్ధసమయంలోనూ, తర్వాతి సమయంలోను ఏర్పడిన విషమ ఘట్టంలో కాంగ్రెస్ రాజకీయ నాయకత్వంలో వచ్చిన గందరగోళం,పరస్పర విరుద్ధభావాలు, డోలాయమానస్థితి (బోసును అధ్యక్షునిగా ఎన్నుకోవడం, అతన్ని తరిమివెయ్యడం సామ్రాజ్యవాద యుద్ధదశలో ఊరికే ఉండడం; వ్యక్తిసత్యాగ్రహం;జపాను దురా క్రమణ కాలంలో దురదృష్టకరమైన ఆగస్టు తీర్మానం, దాని తర్వాత నాయకుల అరెస్టు; రహస్య యుగంలోని ఇబ్బందులు, వాటంతటవి చెలరేగిన విధ్వంసక చర్యలు. నాయకులాసమయంలో వానిని తమకు సంబంధించినవి కావని ఖండిం చడం, తర్వాత జాతీయ పోరాటమని పొగడడం). యుద్ధంవల్ల ఏర్పడిన ఆర్థిక ఇబ్బందులను, కరువును నాయకులు నిర్లక్ష్యంగా చూడడం—ఇవన్నీ యుద్ధ అంతిమ సమయంలో కొంత రాజకీయ నిర్మాణరాహిత్యానికీ, నైతికబలశూన్యతకూ దారితీశాయి. ఈ సమయంలో సంయుక్త జాతీయ ఉద్యమంకావాలనే వాంఛ దుర్బలపడిపోయింది.

వీటన్నిటికన్నా ముస్లింలీగు బలానికి మరో కారణముంది : ముస్లిం ప్రజానీకాన్ని సమీపించేందుకు, ఆకర్షించేందుకు కాంగ్రెస్ ఏ తీవ్రప్రయత్నమూ వదలకుండా చేయలేదు. దీనికి పరిపూర్తిగా వ్యతిరేకమైనస్థితి సరిహద్దు రాష్ట్రంలో చూడండి ; అక్కడ అబ్దుల్ గఫార్‌ఖాన్ నాయకత్వంక్రింద ఖుదై ఖిద్మత్‌గార్లు

ముస్లింలలో తీవ్ర ప్రజా కార్యక్రమం నడిపారు. ఆ ముస్లిములను తమతో ఉంచుకోగలిగారు. కాంగ్రెస్ దీనిని నిదర్శనంగా తీసుకోవచ్చును. బహిరంగ వేదిక మత సంబంధమైంది కాకున్నా, కాంగ్రెస్ సభ్యులలో అతి ప్రధాన ముస్లిం దేశభక్తు లున్నప్పటికీ, కాంగ్రెస్ ప్రచారం ఎక్కువ భాగంలో ఉన్న దృఢహిందూ మతవాసన - ముఖ్యంగా మితవాద నాయకత్వంయొక్క, గాంధీజీయొక్క ప్రచారంలోహిందూమత ధోరణి ముస్లిం ప్రజానీకాన్ని ఆకర్షించలేకపోతున్నది. దీనిని కాదనలేము.

ఈ విషయంలో, జాతీయోద్యమంలోని ప్రధాన నాయకత్వంపై ఎక్కువ బాధ్యత వేయకతీరదంలేదు. మొదటి యుద్ధానికి ముందు జాతీయ చైతన్య ప్రథమ మహాతరంగంలో అతివాద జాతీయనాయకులైన తిలక్, అరవిందఘోష మొదలయినవారు తమ ఆందోళనకు హిందూమతాన్ని ప్రాతిపదికగా చేసుకొని, జాతీయ చైతన్యాన్ని హిందూమత పునరుజ్జీవనంతో కలిపివేశారు. ఈ సంగతిని ఇంతకు పూర్వమే మనం పరిశీలించాము. ఇందుతో వీరు ముస్లిం ప్రజానీకాన్ని దూరం చేసుకున్నారు. ప్రభుత్వం 1906 లో ముస్లింలీగును స్థాపించి ఎదురుదాడి తీసేందుకు అవకాశం ఏర్పడింది.

ఈ వినాశకరమైన పొరబాటు కేవలం నేషనలిస్టుపార్టీకి లేక పాతయుగంలో "అతివాదులు" అని పిలువబడేవారికి మాత్రమే చెందినదికాదు. వర్తమానయుగంలో కూడ ఇది సాగింది. గాంధీజీ ప్రచారంలో ఆందోళనలో అంతటా ఇది ప్రధాన స్థాన మాక్రమించింది. గాంధీజీ ప్రచార మంతటిలోనూ, హిందూమతం, దాని భావాల బోధనా, సర్వసామాన్య రాజకీయ ఆశయబోధనా విడదీయరాకుండా సమ్మిళితమై ఉంటాయి. 1920-22 జాతీయ సహాయ నిరాకరణోద్యమం ఉచ్ఛ స్థితిలో ఉన్నప్పుడు సంయుక్త జాతీయోద్యమ నాయకుడుగా గాంధీజీ నిలబడి ఉంటూ, తాను చెప్పే ప్రతిమాటనూ సంయుక్త ఉద్యమ నాయకుడుగా చెప్పవలసి ఉండగా, అప్పుడు తాను "సనాతన హిందువు" నని బహిరంగంగా గాంధీజీ ప్రకటించుకుంటున్నాడు.

"నేను సనాతన హిందువును. ఎందుకంటే :

(1) హిందువుల మత గ్రంథాలనబడే, వేదాలలో, ఉపనిషత్తులలో పురాణాలలో నాకు నమ్మకముంది— అందువల్ల అవతారాలను, పునర్జన్మాన్ని విశ్వసిస్తాను.

(2) నేను వర్ణాశ్రమ ధర్మాన్ని విశ్వసిస్తాను. నా అభిప్రాయం ఇందులో కేవలం వైదికమైనది — ఇప్పుడు అందరూ అనుకునే మోటు అర్థంలో కాదు.

(3) అందరు అనుకునేంతకన్నా విశాలమైన అర్థంలో నేను గోసంరక్షణలో విశ్వాసముంచుతాను.

(4) విగ్రహారాధనలో నాకు అపనమ్మకంలేదు.

(గాంధీ- యంగ్ ఇండియా, అక్టోబరు, 12, 1921 )

"సనాతను" డనేమాట ఎక్కువమంది ప్రజలెలా అర్థం చేసుకుంటారు అనేందుకు నెహ్రూ వర్ణనను జ్ఞాపకంచేసుకుంటే చాలును.

"ఈ తిరోగమనపు పందెంలో సనాతనులు హిందూమహాసభను వదలి ముందుకు చాల వెళ్ళారు. వీరు మతానికిచెందిన తీవ్రసంస్కార విహీన పాతభావాలనూ, బ్రిటిష్‌పాలనపై రాజభక్తినీ కలిపివేసి గట్టిగా ప్రకటిస్తుంటారు."

(జవహర్లాల్ నెహ్రూ "ఆత్మకథ'' పుట 382)

హిందూ ముస్లిం ఐక్యత కావాలనేప్పుడుకూడా గాంధీజీ రెండువర్గాలకూ విజ్ఞప్తిచేసే ఒక జాతీయ నాయకుడుగాకాక, హిందూనాయకుడుగా విజ్ఞప్తిచేశాడు. "హిందువులు "మనం"; ముస్లిములు "వారు" :

"మనం ముసల్మానుల హృదయాలను ఆకర్షించాలంటే మనం తపస్సు చేయాలి, ఆత్మ పరిశుద్ధులం కావాలి."

(గాంధీ యంగ్ ఇండియా సెప్టెంబర్ 1924)

ఆధునిక జాతీయ పోరాటమంతటా ఏ క్షణంలోనైనా గాంధీజీ కాంగ్రెస్ రాజకీయాలలో నుండి హిందూ సంస్కరణ ఉద్యమానికి, హిందూ సంస్కరణ ఉద్యమం నుండి కాంగ్రెస్ రాజకీయాలలోనికి (1932-33 పోరాట క్లిష్టదశలో లాగా) మార గలడు.

ఇలాగా కాంగ్రెస్ నాయకుడు ప్రజలదృష్టిలో కాంగ్రెస్ ప్రధాన ప్రతినిధి వరుసగా హిందూ మతానికి హిందూ పునరుజ్జీవనానికి, నాయకుడుగా కనబడుతూ వచ్చాడు. ఇలాంటి పరిస్థితుల్లో (ప్రధానమైన నేరం ఈ విషయంలో గాంధీజీదే అయినా. కాంగ్రెస్‌లోని ఇతర చిన్న నాయకులూ. ముఖ్యంగా గాంధీ వాదులదీ బాధ్యత ఉంది) అంత స్పష్టంగా ప్రచారం నాయకత్వం సాగిస్తుండగా కాంగ్రెస్‌కు విరోధులైన విమర్శకులేకాక చాలమంది, "హిందూ ఉద్యమం" అంటా రంటే ఇందులో ఆశ్చర్యమేముంది ? కొందరు ముస్లిం నాయకులు, విశ్వాసంతో ఇలాంటి పరిస్థితుల్లోనూ కాంగ్రెస్‌తోనే ఉన్నారంటే అదివారి దేశభక్తిని వేనోళ్ళ చాటు తుంది. కాని ఈ పద్ధతులు ముస్లిం ప్రజానీకాన్ని తనవెంట కొనిరాలేదు.

బ్రిటిష్ ప్రభుత్వం మత విభేదాలను స్వార్థానికి ఉపయోగించు కోవడంలో ప్రజా ఉద్యమంపై అతినీచమైన ఆయుధాన్ని ఉపయోగించడంలో సందేహంలేదు. కాని తిలకిజమూ, గాంధీజమూ, ఈ ఆయుధాన్ని ప్రభుత్వం చేతికిచ్చాయి.

1940 లో పాకిస్తాన్ కార్యక్రమం ఆమోదించిం తర్వాత ముస్లింలీగు ప్రజా బలం అభివృద్ధి చెందడంలో మరొక ప్రత్యేక కారణాన్నికూడ మనం గుర్తించ వలసిన అవసరముంది. పాకిస్తాన్ కార్యక్రమాన్ని తర్వాత వివరంగా పరిశీలిం చడం అవసరం, అసలిది భారత దేశ వాయవ్య, ఈశాన్య ముస్లిం అధిక సంఖ్యాక

ప్రాంతాలనుకలిపి ప్రత్యేకరాజ్యాలుగా ఏర్పరచాలనికోరింది. తర్వాత ఆరు రాష్ట్రాలతో ప్రత్యేకముస్లింరాజ్యం ఏర్పరచాలన్న కోరికగా ఇది మారింది. ఈ విధానాన్ని విమర్శించేందుకు బలమైన కారణాలున్నవి. కాని ఇటీవల ఈ కార్యక్రమం రాజకీయంగా అతిప్రధానతకురావడం, ఈ ప్రాంతాలలోని ముస్లింలలో అధికసంఖ్యాకుల ఆమోదానికిది పాత్రంకావడం గమనిస్తే ఈ కార్యక్రమం ఎంత గందరగోళమైన రూపంలోనైనాసరే ప్రజాభావాలను, వాంఛలనుకొంతవరకు ప్రతిబింబిస్తున్నదని తేలుతుంది. ఈ పాకిస్తాన్ కార్యక్రమానికి, అది ప్రజా బలాన్ని సంపాదించడానికి వెనకాల భారత జాతీయ జీవితంలో ఉత్పన్న మవుతున్న ఒక నూతనాంశాన్ని మనం చూడ వచ్చును.

జాతీయోద్యమం విశాల ప్రజానీకంలో వ్యాపించే కొలదీ జాతీయ చైతన్య నూతన రూపాలు బయట పడుతున్నవి. ఇందులో భారతప్రజల విభిన్న జాతీయ శక్తుల ప్రతిబింబిస్తున్నవి. భారత దేశపు వాయవ్య, ఈశాన్య భాగాలలో ముస్లిం ప్రజాబాహుళ్యం ఎక్కువగా ఉన్నచోట పాకిస్తాన్ నినాదం, ఎంత అసమగ్రరూపంలోనైనాగాని ఈ నూతన జాతీయ చైతన్యాన్ని కొంతవరకు ప్రతిబింబిస్తున్నది. జాతీయోద్యమం అభివృద్ధి చెందేకొద్ది భారతప్రజలలోని వివిధ జాతులు బయల్పడడాన్ని స్టాలిన్ 1912 లోనే గుర్తించాడు,

> "ఇండియా విషయంలోగూడ ఇది కనిపించవచ్చును. అంతవరకు సుప్తంగా పడిఉన్న అసంఖ్యాకజాతులు (నేషనాలిటీ) బూర్జువా అభివృద్ధి మరింత జరగడంతో సజీవం కాగలవు."

సామ్రాజ్యవాద వ్యతిరేకంగా తమ స్వతంత్రపోరాటంలో భారత ప్రజల సమైక్యత, భావిస్వతంత్ర భారతదేశ ఆర్థిక, రాజకీయ సమైక్యత అనే అభ్యుదయ లక్ష్యమూ అవసరమన్నంతమాత్రాన భారత ప్రజలందరూ ఏకైక సముదాయంగానే భావించాలన్న అర్థంకాదు. పైగా భారత ప్రజలలోని వివిధజాతుల లక్షణాలు గుర్తించేందుకు ప్రబలమైన కారణాలున్నవి. కాంగ్రెసు ఆచరణలో ఈ భాగాలను గమనించింది. ఇప్పుడు నిరంకుశంగా ఏర్పరచిన సరిహద్దులను వదలి, ఏక సంస్కృతి, ఏకభాషగల భాషాప్రయుక్తరాష్ట్రాలను వేరుపరిచింది. ఈ ప్రాంతాలకు భావి స్వతంత్ర భారతరాజ్యాంగంలో సంపూర్ణ స్వపరిపాలనను కాంగ్రెసు అంగీకరించింది. కాని ఈ యుగంలో ఈ ప్రాంతాలలోని జాతీయలక్షణాన్ని కాంగ్రెసు గుర్తించక వాటికి స్వయం నిర్ణయహక్కును అంగీకరించలేదు.

అయినప్పటికీ, ఈ భారత ప్రజల వివిధజాతి లక్షణానికీ, ముస్లింలీగు ప్రతిపాదించిన పాకిస్తాన్ కార్యప్రణాళికకూ మధ్య విభేదాన్ని గుర్తించడం అవసరం.

పాకిస్తాన్ వాంఛను (అప్పటికి ఆపేరులేకున్నా)అసలు 1940 లో ముస్లిం లీగు ఆమోదించింది. 1930 దశలో కొందరు వ్యక్తులు అసలు దీనిని ప్రతిపాదించారు (1930 లో కవి, ఇక్బాల్. 1933 లో కేంబ్రిడ్జి విద్యార్థులు). అప్పుడు

ముస్లింలీగు రాజకీయనాయకులు 1933 లోని సంస్కరణల జాయింటుకమిటీ ముందు సాక్ష్యమిస్తూ దీనిని "విద్యార్థుల స్వప్న"మని "ఆచరణయోగ్యం కాద"ని నిరాకరించారు. 1937 లో కూడ ముస్లింలీగు వార్షిక సమావేశంలో "స్వతంత్ర ప్రజాతంత్రరాజ్యాల సమాఖ్యరూపంలో భారతదేశంలో సంపూర్ణ స్వతంత్రస్థాపన" తమ ఆశయమని ప్రకటించింది. కాని ముస్లింలీగు లాహోరు సమావేశం(1940) లో ఈ క్రింది తీర్మానం చేసింది.

"ఈక్రింది ప్రధాన సూత్రాలపై ఏర్పరిస్తేతప్ప ఏ రాజ్యాంగ ప్రణాళికగాని ఈ దేశంలో పనిచేయజాలదని, ముస్లింల అంగీకారం పొందజాలదని ఈ అఖిల భారత ముస్లింలీగు సమావేశ నిశ్చితాభిప్రాయం. ప్రధాన సూత్రాలివి: ప్రాదేశికంగా వరుసగాఉన్న ప్రాంతాలను అవసరమైన ప్రాదేశిక సవరణలతో వేరుపరచాలి. భారతదేశంలోని వాయువ్య ఈశాన్యప్రాంతాలలాగా, ముస్లింలు అధికసంఖ్యాకులుగా ఉన్న ప్రాంతాలను స్వతంత్రరాజ్యాలుగా ఏర్పరచాలి. అందులోని రాష్ట్రాలు స్వపరిపాలిత స్వతంత్ర భాగాలుగా ఉండాలి."

తర్వాత ఈ అస్పష్టతీర్మానం మరింత స్పష్టంగా నిర్వచింపబడింది. 1945 డిసెంబర్ 10 వ తేదీ ఒక ఇంటర్వ్యూలో జిన్నా ముస్లింలీగు వాంఛను ఈ క్రింది విధంగా నిర్వచించాడు:

"భారతదేశంలోని ప్రతిష్టంభన అంతగా బ్రిటన్‌కూ ఇండియాకు మధ్య ఏర్పడిందికాదు: ఇది హిందూ కాంగ్రెసుకూ ముస్లింలీగుకూ మధ్య ఏర్పడింది.... పాకిస్తాన్ ఇచ్చేవరకు ఇదేదీ పరిష్కారంకాదు.... ఒకటికాక రెండు రాజ్యాంగ నిర్మాణసభలు ఏర్పడాలి - హిందూస్తాన్ రాజ్యాంగాన్ని తయారుచేయడానికొకటి, పాకిస్తాన్ రాజ్యాంగాన్ని తయారు చేసేందుకు ఇంకొకటి.

"ఈక్రింది మాటలు గాంధీగారు చెబితే భారత సమస్యను మనం పదినిమిషాల్లో పరిష్కరించగలం: 'పాకిస్తానుండాలని నే నంగీకరిస్తాను. నాలుగోవంతు భారతదేశం నేడున్న సరిహద్దులతో ఆరు రాష్ట్రాలు - సింధు, బెలూచిస్తాన్, పంజాబు, వాయవ్య సరిహద్దురాష్ట్రం, బెంగాలు, అస్సాం, పాకిస్తాన్ రాజ్యంగా ఏర్పడాలి;

"స్వేచ్ఛాపద్ధతిలో జరిగితే జనాభా మార్పుకూడ జరగాలి. ఇది సాధ్యమవుతుంది నిస్సందేహంగా సరిహద్దులు సరిచేయడమూ అవసరమే అవుతుంది.... అవన్నీ ఎప్పుడు జరిగినాకాని, తొలుత ఇప్పటిరాష్ట్రాల సరిహద్దులనే భావి పాకిస్తాన్ సరిహద్దులుగా గ్రహించడం అవసరం. స్వపరిపాలిత రాష్ట్రాల పద్ధతిపై ఒక ఫెడరల్ ప్రభుత్వంలాగా మన పాకిస్తాన్ ప్రభుత్వం బహుశా ఉండొచ్చు.........

"నేను వ్యక్తిగతంగా బ్రిటిష్ ప్రభుత్వం నిజాయితీని అనుమానించను, కాని భారతదేశ ముస్లిములకు సంపూర్ణ పాకిస్తానును ఇవ్వకుండా పరిష్కారమవుతుందని ఆశపడేవారి నిజాయితీని అనుమానిస్తున్నాను."

ఆఖరుకు 1946 ఏప్రిల్‌లో జరిగిన ముస్లిం శాసనసభ్యుల సమావేశం పాకిస్తాన్‌ను ఈక్రింది మాటల్లో నిర్వచించింది :

"ఈశాన్యంలోని బెంగాలు, అస్సాము, వాయవ్యంలోని పంజాబు, సరిహద్దురాష్ట్రం, సింధు, బెలూచిస్తానులు- అంటే ముస్లింలు అధిక సంఖ్యాకులుగా ఉన్న ఈ పాకిస్తాన్ ప్రాంతాలు సర్వస్వతంత్ర రాజ్యంగా ఏర్పడాలి."

హిందువులు - ముస్లిములు రెండు "జాతులు" అన్న భావంమీద పాకిస్తాన్ సిద్ధాంతం ఆధారపడింది. భారతదేశం అంతటా, అన్ని ప్రాంతాలలోను హిందువులు ముస్లిములు సమ్మిళితమై ఉండొచ్చు; హిందువులూ, ముస్లిములు ఒకే కుటుంబంలో సభ్యులై ఉండొచ్చు; కాని వారు రెండు "జాతులు" అని వీరు చెబుతారు. ఇలా మతంపై జాతిని ఆధారపడేట్టు చేయడం (ఆ మతంతోపాటు వచ్చిన కొత్త సమాన సభ్యతనుబట్టి), అంతర్జాతీయ చారిత్రక అనుభవంమూలంగా అంగీకరించిన జాతీయ లక్షణాని కంతటికీ ఇది వ్యతిరేకమనేది సుస్పష్టమే. యూరోపులోని కాథలిక్కులందరూ ఒక "జాతి" అనడంవంటిదే ఇది. అంతేకాదు, ఈ వాదసరళి ముస్లిమైనవాడల్లా ఒకజాతికి చెందినవాడనే నిర్వచనాన్ని సూచించేయెడల, ఉత్తరాఫ్రికా నుండి భారతదేశంవరకు ఉన్న ముస్లిములందరూ ఒకేఒక "జాతి" అవుతారు. ఈ పాకిస్తాన్ సిద్ధాంతం కడకు పాన్ ఇస్లామిజంలోకి దిగి సమగ్రమవుతుంది.

జాతంటే ఏది అనే విషయంలో మార్క్సిస్టు సిద్ధాంతాన్ని స్టాలిన్ తన "మార్క్సిజమూ- జాతుల వలసదేశాల సమస్య" అనే పుస్తకంలో ఇలా ప్రసిద్ధమైన నిర్వచనం చేశాడు : "ఒక భాష, ఒక ప్రాంతం, ఒక ఆర్థిక జీవితం, ఒక జాతీయ సభ్యతలో ప్రతిబింబితమైన మానసిక ప్రవృత్తి గలిగి, చారిత్రకంగా తయారయిన స్థిరమనుష్య సముదాయం ఒక జాతి అనబడుతుంది." ఇందుతోపాటు ఏది కాదో కూడ స్టాలిన్ కలిపి చెప్పాడు : "పై లక్షణాలలో ఏ ఒక్కటిమాత్రమే ఉన్నా అదే జాతి నిర్వచనానికి చాలదు అని చెప్పడం అవసరం. పైగా పై లక్షణాలలో ఏ ఒక్కటీ లేకపోయినాసరే ఆ జాతి జాతి కాకుండా పోతుంది."

ఈ పరీక్షతో భారత ముస్లిములు ఒక "జాతి" అనడం వీలుకాదని స్పష్టమవుతుంది. వారి భాషలువేరు, ప్రాంతాలువేరు, సభ్యతలు వేరు. మానవజాతి వర్గాలుకూడ వేరు. పఠానుకూ, బెంగాల్ ముస్లిముకూ మధ్యవున్న సామాన్య లక్షణమల్లా మతమూ, కొన్ని పాత సభ్యతాశిథిలాలు మాత్రమే. కాని ఇంతమాత్రమే జాతిగా ఏర్పరచలేదు. పాత రష్యా సామ్రాజ్యంలో యూదులు విభిన్న ప్రాంతాలలో విభిన్న భాషలు మాట్లాడుతూ ఉండేవారు. వారిని ఒక జాతి అనేందుకు స్టాలిన్ ఈ క్రింది కారణాలపై నిరాకరించాడు :

"వారి జీవితంలో ఏదైనా సమానతఉన్నదీ అంటే అది వారి మతమూ, సమానఉత్పత్తి. కొన్నిజాతీయ లక్షణాల శిధిలాలూ. వీటి విషయంలో సందేహంలేదు: కాని స్తబ్ధమైఉన్న మతాచారాలూ, మాసిపోతున్న మానసిక అభిప్రాయ శిధిలాలూ ఈయూదులపై వారిచుట్టూ సజీవంగాఉన్న సాంఘిక ఆర్థిక సభ్యతావాతావరణంకన్న ఎక్కువ ప్రభావంకలిగి ఉన్నాయనుకోవడం సాధ్యమా?"

ఇక్కడున్న సమస్య కేవలం జాతిలక్షణ నిర్వచనసమస్య మాత్రంకాదు ఇది కేవలం పదాలసమస్యే అయితే ఈవివాదం నిష్ప్రయోజనం. కాని మతంపై జాతిని ఆధారపడజేసే పొరపాటు ప్రయత్నం చాల తీవ్రమైన రాజకీయ నిర్ణయాలకు దారితీస్తుంది. ఇందువల్ల నిస్పష్టంగా, నిర్మొగమాటంగా చెబితే జాతి అనేది కేవలం ఒక నిర్ణీతప్రాంతంలో మటుకేవుండాలి రాజకీయ సిద్ధాంతజ్ఞులు సృష్టించిన ఈసిద్ధాంతం ప్రజలనుండి వచ్చిందికాదు దీనిఫలితంగా ఈ "జాతి" అని పేరుపెట్టినదానికి ఒకప్రాంతాన్ని కృత్రిమంగా ఏర్పాటుచేయడం జరిగింది. పాకిస్తాన్ భూగోళ లక్షణాన్ని పరీక్షించిన వెంటనే ఈసిద్ధాంతంలోని దౌర్బల్యం బయట పడుతుంది.

పాకిస్తాన్ ప్రాంతాలంటూ పేరుపెట్టిన ఈ ఆరురాష్ట్రాలలో "నేటి సరిహద్దులలో"— మొత్తం 10 కోట్ల 70 లక్షల జనాభా ఉన్నది. ఇందులో ముస్లిములు 5 కోట్ల 90 లక్షలు, లేక వందకు 55 మంది, ముస్లిమేతరులు 4 కోట్ల 80లక్షలు లేక వందకు 45 మంది ఉన్నారు. అంటే ఈముస్లింరాజ్యంలో ముస్లిమేతరులు దాదాపు సగంమంది ఉంటారు. మరి భారత ముస్లిముల మొత్తంలో $\frac{2}{5}$ వంతుల ముస్లిములు పాకిస్తాన్‌కు బయటఉంటారు నిరంకుశంగా ప్రాదేశిక ప్రాతిపదిక మీద పూర్తిగా కలసిపోయిఉన్న హిందూముస్లిం జనాభా సమస్యను పరిష్కరించే ఏప్రయత్నాలైనా ఎంత అసమగ్రమైనవో ఇందుతో స్పష్టపడుతున్నది. తూర్పు పంజాబు ఎక్కువగా ముస్లిమేతరమైనది; ఏ ముస్లిం రాజ్యంలోను తమ్ము చేర్చరాదనీ, అలాచేస్తే తాము తీవ్రంగా ప్రతిఘటిస్తామని సిక్కులు ప్రకటించారు; పశ్చిమ బెంగాలు కలకత్తాతో బాటు ఎక్కువభాగం ముస్లిమేతరమైనది; అస్సాం ముస్లిమేతరులనే శాసనసభకు అత్యధికంగా ఎన్నుకుంది; ముస్లిము లెక్కువ ఉన్న సరిహద్దు రాష్ట్రం కాంగ్రెసు ప్రాబల్యం ఎక్కువగా ఉన్న రాష్ట్రం.

ఈ ప్రాంతంలోని అత్యధిక సంఖ్యాకులైన ప్రజలు, అలా విడిపోయేందుకు ఇష్ట పడుతున్నారు అనేది నిర్ధారణ అయితే ఈ ప్రాంతాలను రాజకీయంగా వేరు పరచే కోరికను సమర్థింప వీలవుతుంది. ఇక్కడున్న సమస్య ఎన్నడో నిర్ధారితమై గుర్తింపబడిన బానిస ప్రజల జాతీయవాంఛ కాదు. బ్రిటిష్ ప్రభుత్వంనుండి వేరు పడాలనే భారత ప్రజల వాంఛవంటిది కాదిది. ఇక్కడున్న సమస్య ఏమిటంటే, చాల వివాదాస్పదమైన కోరిక. కొలది ఏండ్ల క్రితంనుండి పైపైనున్న రాజకీయ

సిద్ధాంత వేత్తలు తయారుచేసి, తీవ్ర మత విద్వేషం పెరిగిఉన్న పరిస్థితిలో రాజకీయాల్లోకి దీనిని ఎక్కించారు. ఈ సమస్య చాల వివాదాస్పదమైనది కాబట్టి, ఈ ప్రాంతాలలోని జనాభా చాల మిశ్రమంగాఉంది. కాబట్టి అలాంటి విభజన విషయంలో ప్రజల అభిలాషను ప్లెబిసైటు - ప్రజలఓటింగు - మొదలైన ప్రజాతంత్ర పద్ధతులద్వారా తొలుత స్థిరపరచడం. రుజువు చెయ్యడం అవసరం. ఈ ప్రతిపాదనను (ముస్లిం అధిక సంఖ్యాక ప్రాంతాల ప్రజలందరి ఓటింగు తీసుకోవాలన్న దానిని) 1942 లో శ్రీ సి. రాజగోపాలాచారి; 1944 లో జరిగిన గాంధీ జిన్నా సంప్రతింపులలో గాంధీజీ చేశారు కాని ఈ ప్రతిపాదనను ముస్లింలీగు పక్షంగా జిన్నా నిరాకరించాడు పూర్తిగా ముస్లిం అధిక సంఖ్యాక జిల్లాలు వరుసగా ఉన్నవాటినే పాకిస్తాన్‌గా ఏర్పరిస్తే అది కేవలం "నులిమివేసిన తెగిపోయిన. పురుగులు తినివేసిన పాకిస్తాన్ అవుతుంది" అని జిన్నా తిరస్కరించాడు రెండోది జనాభా అంతటితో ఓటు తీసుకోవడమంటే ముస్లిములకు ముస్లిములుగా ఉండవలసిన స్వయంనిర్ణయ హక్కును భంగపరచడమే అవుతుందన్నాడు అంటే ప్రజాభిప్రాయాన్ని తెలుసు కొనేందుకు జరిగే ఏ ఓటింగైనా జనాభాలో నూటికి 55 మంది మాత్రమున్న ముస్లిములలో తీసుకోవాలన్నమాట, జనాభాలోని వందకు 28 మంది (55% లో 51%) తమ ఇష్టంవచ్చినట్టు అక్కడున్న జనాభా అందరి పక్షంగా నిర్ణయించవచ్చు నన్నమాట. ఈ ప్రతిపాదనలను ఏ ప్రజాతంత్ర వాదం అంగీకరించ లేదనేది విశదమే. ప్రజాభిప్రాయాన్ని గణించకుండా ఏ ప్రజాతంత్ర పరిష్కారాన్ని అంగీకరించకుండా అంత్య హెచ్చరిక రూపంలో ఉన్న ఈ పాకిస్తాన్‌వాంఛ ఆచరణలో అభివృద్ధి నిరోధకంగాను, ప్రజాతంత్ర విరుద్ధంగాను, విచ్ఛిన్నకర వాంఛగాను పరిణమించింది. దీనిని సామ్రాజ్యవాదులు ఉపయోగించుకొనేందుకు వీలయింది.

అయినా ఇందువల్ల, పాకిస్తాన్‌వాంఛ వెనకాలఉన్న సత్యమైన జాతీయ భావాన్ని మనం గుర్తించకుండా పోరాదు.

ఈ సమస్యకు ఆఖరు పరిష్కారం ప్రజాతంత్రపద్ధతుల్లోనే జరగాలి ఎక్కడయితే ఒక్క ప్రత్యేక ప్రాంతంలో స్వయంనిర్ణయం స్పష్టంగా జాతీయ వాంఛగా ఉంటుంది అంటే, ఏ ఒక ప్రాంతంలోని ప్రజల్లో అధికసంఖ్యాకులు తమ ప్రత్యేకజాతి, సభ్యతా లక్షణాలనుబట్టి తమకు ప్రత్యేక రాజకీయసంస్థలు కావాలని కోరుతారో ఆ ప్రజలకు - ఇలా చేయడం భూగోళరీత్యా, ఆర్థికంగా సాధ్యమయితే - ఇలాంటి ప్రత్యేక రాజకీయసంస్థలను పెట్టుకునేహక్కు ఉంది అని ప్రజాతంత్ర స్వయంనిర్ణయ సూత్రం గుర్తిస్తుంది. ఎందుకంటే ఆ ప్రజలకు ఇష్టంలేని రాజకీయ సంస్థలను వారిపై రుద్ద ప్రయత్నించడం సమర్థనీయంకాదు గనక - ఈ ప్రజాతంత్ర స్వయంనిర్ణయ సూత్రాన్ని చక్కగా అనువర్తింపజేసినట్లయితే భారత దేశపు వివిధజాతి సమస్యాపరిష్కారానికీ ఫలవంతమైన దారి ఏర్పడుతుంది.

స్వేచ్ఛాపూర్వకంగా యూనియన్ ఏర్పరచేందుకు అనుకూల పరిస్థితులు ఏర్పడు తాయి. వివిధజాతులుగల సోవియట్ యూనియన్‌లోని జాతీయ సమస్యను జయప్రదంగా పరిష్కరించిన ఈ పద్ధతి మరొకతూరి రుజువవుతుంది.

ఈ సూత్రాన్ని గుర్తించినట్లయితే, భారత ప్రజలలోని ఏ భాగానికయితే, ఒకేచోటనున్న ప్రదేశం, ఒకే సమానభాష, ఒకే చారిత్రక సంప్రదాయం, సభ్యత, మానసిక ప్రవృత్తి, సమాన ఆర్థిక జీవనం ఉంటుందో అలాంటి భాగానికి ప్రత్యేక జాతి (నేషనాలిటీ)గా స్వతంత్ర భారతంలో తన పాత్రను నిర్వహించేహక్కు గుర్తించబడుతుంది అలాంటి ప్రత్యేక భాగానికి తన కిష్టముంటే స్వతంత్ర భారత యూనియన్‌లో లేక సమాఖ్యలో ఒక స్వపరిపాలిత రాజ్యంగా ఉండే హక్కు ఉంటుంది (విడిపోయేహక్కుకూడ ఉంటుంది).

ఇలా భావి స్వతంత్ర భారతదేశం, వివిధ స్వపరిపాలిత జాతుల ఫెడరేషన్ లేక యూనియన్‌గా ఉండగలదు అందులో పఠాన్లు, పంజాబీలు, సింధీలు, హిందూస్థానీయులు, రాజస్థానీయులు, గుజరాతీలు, బెంగాలీలు, అస్సామీలు, బీహారీలు, ఒరియాలు, ఆంధ్రులు, తమిళులు, కర్ణాటకులు, మహారాష్ట్రులు మొదలయిన జాతుల వారుంటారు ఇలా నిర్మితమైన నూతన రాజ్యాలలో మిశ్రమైఉన్న మైనారిటీలకు వారి సభ్యత, భాష విద్య మొదలయిన విషయాలలో ప్రభుత్వ శాసనం ద్వారా రక్షణ కల్పింపబడుతుంది ఆ హక్కులను భంగపరిస్తే శిక్షార్హమవుతుంది. కుల మత, జాతి విభేదాలు ప్రత్యేక సౌకర్యాలు, నిషేధాలు ప్రభుత్వ శాసనంద్వారా నిషేధింపబడతాయి. వీనిని ధిక్కరించడం శిక్షార్హమవుతుంది.

అలాంటి ప్రజాతంత్ర పరిష్కారం వాస్తవస్థితిలో కాంగ్రెసు 1931 ప్రధాన హక్కుల ప్రకటనలో పేర్కొనబడినట్టి ప్రజాతంత్ర సూత్రాలను సమగ్రంగా అనుసరించడమే అవుతుంది. పై ప్రకటనలోని సూత్రాలను 1946 కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక ఇలా పునరుద్ఘాటించింది.

> "భారతదేశంలోని ప్రతిపౌరునికి-స్త్రీకిగాని పురుషునికిగాని - సమాన హక్కులుండాలని కాంగ్రెసు ప్రకటిస్తున్నది. అన్నిమతాల కులాల ఐక్యత, వారిలో పరస్పర సహన సద్భావం ఉండాలి ప్రజలందరూ తమ ఇష్టప్రకారం, తమ మేధశ్శక్తినిబట్టి ఒక సముదాయంగా అభివృద్ధి చెందేందుకు సంపూర్ణ అవకాశాలుండవలెనని కాంగ్రెస్ ఆశయం; దేశం లోని ప్రతిప్రాంతమూ, ప్రతిగుంపూ విశాలదేశపు చట్టంలో తన జీవితాన్ని సభ్యతను అభివృద్ధిపరచుకునే హక్కు కలిగి ఉంటుందనికూడ కాంగ్రెస్ ఆశయం: ఇందుకోసం అలాంటి ప్రాంతాలు లేక రాష్ట్రాలు సాధ్యమైనంత వరకు భాషా, సభ్యతా ప్రాతిపదికమీద ఏర్పడాలనికూడ కాంగ్రెస్ ప్రకటిం చింది. సాంఘిక దౌర్జన్యానికి, అక్రమాలకు గురై బాధపడే వారందరి హక్కులను కాపాడి, సమానతకున్న అన్ని ఆటంకాలను తొలగించాలి

"కాంగ్రెస్ స్వతంత్ర ప్రజాతంత్ర రాజ్యాన్ని ఏర్పరుస్తుంది. ప్రధాన హక్కులూ, పౌరహక్కులూ రాజ్యాంగ శాసనంలో హామీ ఇవ్వబడతాయి. ఈ రాజ్యాంగశాసనం కాంగ్రెస్ దృష్టిలో ఫెడరేషనుగా ఉండాలి అందులోని భాగాలకు స్వపరిపాలన హక్కుంటుంది. దాని శాసనసభలన్నీ వయోజన వోటింగు హక్కుతో ఎన్నుకోబడాలి భారతదేశ సమాఖ్య. అందలి వివిధ ప్రాంతాలు స్వేచ్ఛాపూర్వకంగా చేరి ఏర్పరచాలి. ఫెడరేషన్‌లోని భాగాలకు సాధ్యమైనంత ఎక్కువ స్వేచ్ఛ నివ్వడంకోసం, సామాన్య ప్రధాన ఫెడరల్ శాఖల జాబితా ఒకటుంటుంది. ఇవి అన్ని ప్రాంతాలకూ అనువర్తిస్తాయి మరొక ఐచ్ఛిక అంశాల జాబితా ఉంటుంది ఈ జాబితాను ఇష్టమున్న ప్రాంతాలు మాత్రమే అంగీకరించవచ్చును."

ఏమైనా భారతదేశం ఏకంగా ఉండాలన్న తమ న్యాయమైన ఆదుర్దాతో నేటివరకు జాతీయ స్వయంనిర్ణయ సూత్రాన్ని పూర్తిగా అమలుపరిచేందుకు వ్యతిరేకిస్తున్నారు. భారత ఐక్యత భావి అభివృద్ధికి ప్రధానమని భావిస్తున్నారు. కాంగ్రెస్ భావాన్ని 1945 సెప్టెంబరునాటి పూనా తీర్మానం యిలా నిర్వచించింది:

"ఇండియన్ యూనియన్ లేక ఫెడరేషన్‌నుండి; అందులోని రాజ్యాలు లేక ప్రాంతాలు విడిపోయేందుకు స్వేచ్ఛనిచ్చి, భారతదేశాన్ని విచ్ఛిన్నపరచే ఏ ప్రతిపాదనకూ కాంగ్రెసు అంగీకరించదు. 1942 ఏప్రిల్‌లో వర్కింగుకమిటీ ప్రకటించినట్టుగా కాంగ్రెసు భారత స్వాతంత్ర్యానికి, ఐక్యతకు బద్ధమై ఉన్నది. ప్రజలందరి భావాలు తప్పనిసరిగా మరింత విశాలసమాఖ్యలవైపు పోతున్న ఈఆధునిక యుగంలో, ఏమాత్రం సమైక్యతకు భంగమేర్పడినప్పటికి అందలి వారందరికీ నష్టదాయకమనీ, అలాంటిది వూహించడం చాల బాధాకరమనీ కాంగ్రెస్ భావిస్తున్నది. అయినప్పటికి, ఏ ప్రాంతంలోని ప్రజలను, వారి నిశ్చిత ప్రకటిత అభిప్రాయానికి విరుద్ధంగా భారత యూనియన్‌లో ఉండమని బలవంత పరచాలనే దృష్టిలో తాను ఆలోచించలేదు అని కూడ కాంగ్రెస్ ప్రకటిస్తున్నది."

ఈ తీర్మానంలోని రెండుభాగాలకు కొంత పరస్పర విరుద్ధత ఉన్నట్లు కనిపిస్తుంది. విడిపోయే హక్కును గుర్తించకపోవడం, మరి యూనియన్‌లో ఉండమని ఏ ప్రాంతాన్నీ బలాత్కారంచేయ నిరాకరించడం రెంటికీవైరుధ్యముంది.

స్వయంనిర్ణయహక్కును విడిపోయే హక్కుతోబాటు గుర్తించడంలో విడిపోవడం అభిలషణీయమన్న సూచనలేదు. అంతేకాక భారతదేశం అభ్యుదయకరమైన ప్రజాతంత్రరీత్యా అభివృద్ధి చెందడానికి దృఢతరమైన భారత దేశైక్యత అవసరం.

వివిధప్రాంతాలు సమాన సహకారంద్వారా త్వరత్వగా అభివృద్ధి చెందడానికి, తగిన అఖిల భారత ఆర్థిక ప్రణాళిక అభ్యుదయాలకు. సాంఘికస్థాయిని

హెచ్చించేందుకు ప్రత్యేకించి భారతైక్యత ముఖ్యం. కావి యూనియన్ స్వేచ్ఛా పూర్వకంగా చేరిన ప్రాంతాల యూనియన్‌గానే ఉండాలి.

ఈ విధానాన్ని భారత కమ్యూనిస్టుపార్టీ అసలు 1942 లో ఒక తీర్మాన రూపంలో తెలియబరచింది. భారత ప్రజల వివిధజాతి లక్షణంవల్ల ఏర్పడిన నూతన సమస్యలను తీవ్రంగా పరిశీలించడానికి అదే మొదలు. ఇటీవల ఈ విధానాన్నే భారత కమ్యూనిస్టుపార్టీ 1946 లో బ్రిటిష్‌మంత్రుల రాయబారవర్గానికిచ్చిన నివేదికలో ఇలా తెలియబరచింది.

"ప్రజాపరిషత్తు సమస్యపై కాంగ్రెసు లీగులమధ్య ఉన్న తీవ్రభేదాభిప్రాయాలు సక్రమంగా స్వయంనిర్ణయ సూత్రాన్ని అమలు జరపడంవల్లనే పరిష్కారం కాగలవు.

"తాత్కాలిక ప్రభుత్వం సరిహద్దు నిర్ణాయకసంఘాన్ని ఏర్పరచాలని మేము సలహాయిస్తున్నాము. ఆ కమిటీ ప్రతి ప్రజల సహజ ప్రాచీన జన్మభూముల పునాదిపై సరిహద్దులను తిరిగి గీయాలి అలా సరిహద్దులు తిరిగి ఏర్పరచిన రాష్ట్రాలు సాధ్యమైనంతవరకు భాషా సంస్కృతులనుబట్టి ఏకజాతి ప్రాంతాలుగా తయారవుతాయి. ఆ రాష్ట్రాలు సింధు, పఠాన్‌భూమి బెలూచిస్తాన్, పశ్చిమ పంజాబు వగైరాలుగా ఉంటాయి. (1) అలాంటి ప్రాంతాల ప్రజలకు నిర్నిబంధమైన స్వయంనిర్ణయ హక్కుంటుంది. వారు ఇండియన్ యూనియన్‌లో చేరాలా, లేక ప్రత్యేక స్వతంత్రరాజ్యం ఏర్పరచుకోవాలా. లేక ఇంకొక ఇండియన్ యూనియన్ ఏర్పరుచుకోవాలా వారే తమ ఇష్టప్రకారం నిర్ణయించుకునేందుకు హక్కుంటుంది,

"కాబట్టి ప్రజా పరిషత్తుకు జరిగే ఎన్నికలు ఈ ప్రధాన హక్కును గుర్తించడంపైన జరగాలి. ఎన్నికల సమయంలో వేరు పడాలా యూనియన్‌లో ఉండాలా అనే సమస్యను రాజకీయ పార్టీలు ప్రజల ముందుంచాలి. ఆయా జన్మభూములనుండి ఎన్నుకోబడిన ప్రతినిధులు మెజారిటీతో తాము అఖిల భారత ప్రజా పరిషత్తులో చేరి ఇండియన్ యూనియన్ ఏర్పరచాలా లేక ప్రత్యేకంగా ఉండి తామే ఒక ప్రత్యేక స్వతంత్ర రాజ్యం నిర్మించుకోవాలా, లేక ఇంకో ఇండియన్ యూనియన్‌లో చేరాలా అనేది నిర్ణయించాలి.

"స్వతంత్ర స్వచ్ఛంద ప్రజాతంత్ర స్వపరిపాలిత రాష్ట్రాల ఇండియన్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ ఆశయం. భారత ప్రజలందరు కలసి

---

పై విధంగా ఏర్పరచి సంస్థానాలను అనుకున్నట్లు రద్దుపరిస్తే ఏర్పడే ప్రాంతాల పూర్తిజాబితా: తమిళనాడు. ఆంధ్రదేశం. కేరళం, కర్ణాటకం. మహారాష్ట్రం, గుజరాత్. రాజస్థాన్. సింధు, బెలూచిస్థాన్. పఠాన్‌భూమి, కాశ్మీరం. పంజాబు. హిందూస్థాన్. బీహార్. అస్సాం. బెంగాల్. ఒరిస్సా.

ఒకే ఒక యూనియన్‌లో తమ స్వతంత్రాన్ని రక్షించు కొనేందుకు అందరి సహకారం అవసరమైన దరిద్ర సమస్యలను పరిష్కరించు కొనేందుకు సోదర భావంతో కలిసి ఉండడంవల్ల భారత ప్రజాకోటి యోగ క్షేమాలకు లాభకరమని కమ్యూనిస్టుపార్టీ దృఢంగా విశ్వసిస్తున్నది పైన సూచించిన విధంగా స్వయంనిర్ణయ సూత్రాన్ని అనువర్తింప జేయడం మూలంగానే భారత దేశ సమైక్యత రక్షింప బడగలదు "

ఈ విధమైన ఆలోచన ఈ సమస్యల పరిష్కారానికి చాల అనుకూలమైన మార్గాన్ని చూపు తున్నది.

# అయిదో భాగం

# సామ్రాజ్యవాదం - జాతీయవాదం

## పదునాలుగవ అధ్యాయము

# సంస్కరణల యుద్ధరంగం

"బ్రిటన్ తనవలస దేశాలన్నిటిమీది అధికారాన్ని స్వచ్ఛందంగా వదిలివేయాలని, ఆ వలసలు తమ న్యాయాధిపతులను తామే ఎన్నుకునేందుకు, తమ చట్టాలను తామే చేసుకునేందుకు, తాము సక్రమమనుకున్న పద్ధతిలో యుద్ధము సంధిచేసుకునేందుకు ఆ వలసలకు బ్రిటన్ అధికారమిచ్చి వేయాలని చెప్పడం అభూతపూర్వమైన కార్యాన్ని చేయమని కోరడమే అవుతుంది. ప్రపంచంలో ఏదేశంకూడ అలాంటి పద్ధతిని ఇంతవరకు అనుసరించలేదు, ఇకమీద ఎన్నటికీ అనుసరించబోదు. ఏదేశంకూడ ఏ అధినివేశ రాష్ట్రాన్నికాని స్వచ్ఛందంగా వదిలిపెట్టలేదు."

ఆడమ్ స్మిత్ "దేశాల సంపద" 1776, భాగం 4, అధ్యాయం 7.

కాలం గడచినకొద్ది దానిమీద అభిమానంగూడా ఎక్కువకావలసిన ఒక ప్రచురణలో — రిఫార్మిస్టు ఇయర్ బుక్ '1906-1905 లో రష్యా' అనే అంశానికి ఒక్కపుటను' వదిలారు. ఆ సంఘటనాపూర్ణసంవత్సరంలో జరిగిన సంగతులన్నిటికి వదిలిన ముప్పై పంక్తులలో ఇరవైమూడు పంక్తులు 'డ్యూమా'— అప్పటి రష్యా శాసనసభ — వివరణలకే సరిపోయింది. ఆ సభా స్థాపనమూ అదెలా ఏర్పడేదీ, ఏయే నియోజకవర్గాలనుండి ఎన్నిక ఎలాజరుగుతుంది, దానికేయే అధికారాలున్నాయి, దాని భవిష్యత్తెలా ఉంటుంది, మొదలైన అంశాలు ఆ వివరణలో ఉన్నవి. ఏదో యాదాలాభంగా ఫాదర్ గాపన్ ప్రస్తావనకూడ అందులో ఉంది. మిగతా విప్లవ సంఘటనలన్నిటినిగూర్చి ఈ విధంగా చెప్పారు "జాతీయ ప్రతిష్టంభనమూలంగాను, పోలీసు దౌర్జన్యం మితిమీరిపోయినందువల్లను ఈ సంవత్సరంలో కార్మిక సంస్థలు తీవ్రంగా అభివృద్ధి చెందలేదు. రష్యాలోని ప్రతి భాగంలోను తిరుగుబాటు, కొట్లాటలు బయలుదేరాయి" ఆకాలపు ప్రపంచ పరిజ్ఞానంగల పశ్చిమ దేశీయులకు 1905 నాటి రష్యావిప్లవం అంతమాత్రంగానే కనిపించింది.

"భారత సమస్య" కూడా ఇలాగే కనిపించింది 1914-18 యుద్ధం తర్వాతి ముప్ఫైఏళ్ళలోను బ్రిటిష్ వాదోపవాదాలలో పేజీలకుపేజీలు ప్రచురితమైన భారత సమస్యకుచెందిన పుస్తకాల్లో పదికి తొమ్మిదిపాళ్లు ఇలాగే వివరిస్తాయి. భారత

ప్రజలకు, అప్పుడప్పుడూ బ్రిటిష్ సామ్రాజ్యవాదం ప్రసాదిస్తూవచ్చిన 'సంస్కరణలు' మాత్రమే వారికి భారత సమస్యగా తేలుతుంది. దీనికి పూర్వరంగంగా రాజ్యాంగ సంస్కరణ సమస్యకు పునాదిగామట్టుకే "అశాంతి"నిగూర్చి, "అతివాదుల" ప్రోద్బలంతో ప్రజలు జరిపిన అవాంఛనీయ ప్రదర్శనాలగూర్చి అస్పష్టమైన ప్రస్తావన అక్కడక్కడా కనిపిస్తుంది. అగోచర వ్యక్తిఅయిన గాంధీజీని గూర్చి కొన్నిచోట్ల ప్రస్తావించడంమటుకు కనిపిస్తుంది. ఉద్రిక్తమవుతున్న భారత విప్లవ రాజకీయ సాంఘిక తీవ్రసమస్యలన్నింటిని ఈ రాజ్యాంగ సంస్కరణల పదజాలపు నీరసభూమిలో పాతిపెట్టివేశారు. ఈ పదజాలం కలిగించే విపరీతమైన విసుగు బ్రిటిష్ రాజకీయవాదులకు విరక్తికలిగించి వేస్తున్నది. ఇందుతో భారత రాజకీయాలపై బ్రిటిష్ రాజకీయవాదులకున్న ఆదరాసక్తులన్నీ మాయమవుతున్నవి. "నూతన రాజ్యాంగమనే" బూటకపుతంతునే కేంద్రంచేసి, దానిపైనే దృష్టినంతా కేంద్రీకరింపజేయడంవల్ల ఈ పొగచూరిన అద్దంలోనుండి మానవజాతిలోని అయిదోవంతు ప్రజల ప్రధాన వాస్తవసమస్యలు మసక మసకగా మాత్రమే కనిపిస్తాయి.

ఆ ప్రత్యేక సమాజంలో వాస్తవమైన అధికారం ఎవరికి సంబంధించింది అనేదే నిజమైన రాజ్యాంగ సమస్య అని లాసెలీ ఒకతూరి అన్నాడు. ఈ అంశం అన్నిచోట్ల కన్నా "భారత రాజ్యాంగం" విషయంలో అతి స్పష్టంగా నిరూపితమైనది.

భారతదేశం విషయంలో సామ్రాజ్యవాదులు తయారు చేసిన వివిధ 'రాజ్యాంగ శాసనాలుగాని లేక వివిధ రాజ్యాంగ ప్రణాళికలుగాని' భారత సమస్యకు పరిష్కారాలు కావు. ఆఖరుకవి పరిష్కారానికై చేయబడిన ప్రయత్నాలు కూడా కావు. అవి కేవలం సామ్రాజ్య వాదానికీ జాతీయ వాదానికీ మధ్య జరుగుతున్న సంగ్రామంలోని వివిధ పద్ధతులు, వివిధ దశలు, వివిధ రంగాలున్నూ మాత్రమే. యథార్థాంశం పోరాటం దాని ఛాయా మాత్రమే రాజ్యాంగచట్టం.

## సామ్రాజ్యవాదమూ - స్వపరిపాలనా

బ్రిటిష్ సామ్రాజ్య తత్త్వాన్ని సమర్థింప జూచే అధికారవర్గం అప్పుడప్పుడు ఒక అంశం సూచనగా చెబుతూంటుంది. అదేమంటే భారతదేశ ప్రజలను స్వపరిపాలనలో సుశిక్షితులను చేయడమే భారతదేశంలో బ్రిటిష్ పాలన యొక్క ఆశయమట.

పూర్వపురోజుల్లో భారతదేశంలో పాలకులుగా ఉన్నవారి దృక్పథం ఇది కాదు. భారత స్వతంత్ర జాతీయ పోరాటబలం రాజకీయ రంగంలోనికి స్వపరిపాలన సమస్యను బలవంతంగా ముందుకు తోసేవరకు ఇలాంటి సంగతంటే మహానీచంగా బ్రిటిష్ అధికారులు త్రోసి పారవేసేవారు

ఈ దృక్పథంలో కన్సర్వేటివ్‌లే కాక లిబరల్ పక్షంవారు కూడ బ్రిటిష్ ఉన్నత స్థితి దశ అంతటిలోనూ ఏకీభవిస్తూ వచ్చేవారు. 1833 లో మెకాలే ఇలా ప్రకటించాడు.

"భారతదేశంలో ప్రతినిధిసంస్థలను పెట్టడం సాధ్యపడదు. భారత రాజకీయాలగూర్చి తమ సలహాలను ఇచ్చే అసంఖ్యాకజనంలో - వాడెంత ప్రజాసామాన్య అభిప్రాయాలు వెల్లడించనీగాక - ఒక్కడుకూడ ఈ సమయంలో భారతదేశానికి అలాంటి సంస్థలను ఇవ్వడానికి అవకాశముందని కూడ నాకు తెలిసినంతవరకు ఎన్నడూ చెప్పలేదు "

(టి బి. మెకాలే, కామన్సుసభలో ఉపన్యాసం, జులై 10. 1833)

తాత్విక ఉదారవాదానికి ప్రవక్తా. ప్రజా ప్రతినిధిసంస్థలు కావాలని తీవ్ర ప్రచారం చేసేవాడూ అయిన జాన్‌స్టువర్టుమిల్ కూడ భారతదేశంలో అలాంటి ప్రతినిధి సంస్థలు కూడదని చెప్పడంలో ఏమీ వెనుకాడలేదు. అదే ఉపన్యాసంలోనే మెకాలే, మిల్లుగారి దృక్పథాన్ని ఉదహరించాడు

"ఆయన (మిల్లు) స్వచ్ఛమైన ప్రజాతంత్ర పద్ధతికి అనుకూలంగా దృఢంగా - అతిదృఢంగా అని నా భావం - వ్రాశాడు .... గత సంవత్సరం కమిటీ సభ్యులు భారతదేశంలో ప్రతినిధి ప్రభుత్వం సాధ్యమవుతుందని మీ అభిప్రాయమా అని ఆయన్నడిగారు. ఆయన సమాధానమిది: 'అది బొత్తిగా సాధ్యంకాదు!'

భారతసమస్య విషయంలో 19 శతాబ్దంలోని మితవాదులు (లిబరల్స్)తమ అసమర్థతే చాటుకున్నారు. ఈ సంగతి గ్లాడ్‌స్టన్‌కూ బ్రైట్‌కూ మధ్య జరిగిన సంవాదం తెలుపుతున్నది

"ఈరోజు సాయంత్రం భారతదేశాన్నిగూర్చి నేను బ్రైట్‌తో చాల సేపు సంభాషించాను. .... ఆ ప్రజలను ప్రజాప్రతినిధులతో పాలించడం కష్టమని ఆయన అంగీకరించాడు: పరిశుద్ధమైన పార్లమెంటరీ ప్రభుత్వం ఇండియాలో ఏర్పరచడం కష్టం.

(సర్ జేమ్సు గ్రహాంకు 1858 ఏప్రెల్ 23 న గ్లాడ్‌స్టన్ వ్రాసిన ఉత్తరం: "సర్ జేమ్సు గ్రహాం జీవితమూ-ఉత్తరాలూ" వాల్యూం 2, పుట 340.)

ఈ యిద్దరు లిబరల్‌పార్టీ నాయకులకూకూడా భారతీయులు తమ్ముతామే పరిపాలించుకోవడం సంభవమనీ, అదే పరిష్కారమార్గమనీ తోచినట్టు ఏమాత్రం సూచనలేదు. (బ్రైట్ ఇండియాలో దుష్పరిపాలననుగూర్చి చాలా పెద్ద ఆందోళన జరిపినవాడు )

ప్రథమ ప్రపంచయుద్ధ ప్రారంభసమయంలో సామ్రాజ్యవాదుల దృక్పథాన్ని లార్డు క్రోమర్ ఖచ్చితంగా తెలియజేశాడు:

"ఈ పరిస్థితుల్లో భారతదేశానికి స్వపరిపాలన ఇవ్వాలని కోరడం, సంయుక్త యూరోపుకు స్వపరిపాలన కావాలని కోరడంలాంటిదే....ఇది కేవలం అర్థంలేని మాటేకాదు : ఇది కేవలం ఆచరణకు అసాధ్యమైనది మాత్రమేకాదు. ఇంకా ముందుకువెళ్ళి నే చెప్పేదేమంటే-అలా భావించడం నాగరిక ప్రపంచానికే ద్రోహంచేయడం; మన పాలబడిన నోరులేని కోట్ల కొలది భారతీయులకు ద్రోహంచేయడమే అవుతుంది."

(లార్డు క్రోమర్, "ప్రాచీన - ఆధునిక సామ్రాజ్యవాదం" 1910, పుట 123)

అదే సమయంలో లిబరల్‌పార్టీకి చెందిన లార్డుమోర్లీ అభిప్రాయంకూడ అంత ఖచ్చితంగానే ఉంది. మోర్లీమింటో సంస్కరణలను ప్రవేశపెడుతూ దీనిని పార్లమెంటరీసభల నిర్మాణానికి పునాది అని ఏవిధంగానైనా భావించరాదని మోర్లీ స్పష్టంగా చెప్పాడు :

"ఈ సంస్కరణల అధ్యాయం ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని భారతదేశంలో పార్లమెంటరీ పద్ధతి ఏర్పరచేందుకు కారణమవుతుంది అనే పక్షంలో, అందులో ఏమాత్రం సంబంధం పెట్టుకోని వారిలో నేనొకణ్ణి."

(లార్డు మోర్లీ. ప్రభువులసభలో ఉపన్యాసం 1908 డిసెంబరు 17)

భారతదేశ విషయంలో సామ్రాజ్యవాదుల దృక్పథం 1917 వరకు అల్లాగా ఉంది. తర్వాత వారి ప్రకటనల్లో హఠాత్తుగా మార్పువచ్చింది ప్రతినిధి ప్రభుత్వం భారతదేశంలో స్థాపించాలనడం నాగరిక ప్రపంచానికే ద్రోహమంటున్నవారు దానినే తమ లక్ష్యంగా ప్రకటిస్తూ వచ్చారు ఇలా అకస్మాత్తుగా వారి విధానం మారడం - లేక ప్రకటనల్లో వారి విధానం మారడంవల్ల ఏదో వారి ఉద్దేశాలలోనే మార్పువచ్చిందనుకోరాదు. ఇందుకు కారణం తీవ్రరూపం తాల్చిన బాహ్య సంఘటనలే.

అసలు మార్పు ఎంతవరకు వచ్చింది ?

ఇలా బయటికేమో విధానం మారినట్లు కనబడుతున్నది. కాని బ్రిటిష్ పెత్తనాన్ని ఏమాత్రం వదలకుండా గట్టిగా నిలబెట్టుకోవాలన్న ప్రధానాశయంతోనే, విధిలేక పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఇలా మాట్లాడుతున్నాననేది ఎంతవరకు నిజం ?

ఈ సమస్యనే మనమిప్పుడు ముఖ్యంగా పరిశీలించ వలసి ఉన్నది.

## 2. 1917 కు వెనుకటి సంస్కరణ విధానం

యుద్ధకాలం వరకు భారతీయులను క్రమక్రమంగా ఎక్కువ మందిని సామ్రాజ్యవాద పాలన యంత్రం క్రిందికి తీసుకొని రావడమే సామ్రాజ్యవాదుల ఆశయం. ఏ సామ్రాజ్యవాద పద్ధతి విజయానికైనప్పటికి తప్పనిసరిగా అనుసరించ వలసిన ఆశయమిది. (భారతదేశంలో ప్రభుత్వోద్యోగులు 15 లక్షలున్నారు. వీరిలో ఏకొద్ది మందికన్నా ఇంగ్లీషువారిని ఉంచడం సాధ్యంకాని సంగతి) ఈ ఆశ

యాన్ని వదలకుండా పదేపదే ప్రకటిస్తూ వచ్చారు. కాని కీలక స్థానాలన్నింటిలోను పెత్తనం తమచేతే ఉంచుకున్నారు. ఈ విధానాన్ని ఒక శతాబ్దికిపైగా అనుస రించారు ఈ ఆశయాన్ని స్వపరిపాలన ఆశయంతో కలగలుపు చేయరాదు. దాని కిది నిజస్థితిలో విరుద్ధమైన ఆశయం. స్వపరిపాలన ఆశయాన్ని 1917 వరకూ పదేపదే ఖండిస్తూ వచ్చారు కూడ. ఈ రెండింటినీ ఒకటనుకోవడం మూలానే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని క్రమంగా స్థాపించడమే సామ్రాజ్యవాదుల ఆశయమన్న అపోహకు చాలసాస్లు దారితీసింది.

1833 వ నాటి ప్రభుత్వ ప్రకటనలో ఇలా ఉంది.

"మా ప్రభుత్వంక్రింద ఏ స్థానానికిగాని, ఏ పదవికిగాని, ఏ ఉద్యోగా నికి గాని, ఏ భారతీయుడైనా నియమించబడవచ్చు అందుకు మతాన్ని బట్టిగాని, జన్మస్థానాన్ని, వంశాన్ని, రంగునుబట్టి ఏ భారతీయునిగాని నిషే ధించరాదు."

ఈ సూత్రాన్ని డైరెక్టర్ల సమితి ఈ క్రింది విధంగా వ్యాఖ్యానించింది.

"బ్రిటిష్ ఇండియాలో పాలక కులమేదీ ఉండరాదని ఈ సూత్రానికి మేము వ్యాఖ్యానంచేస్తున్నాము. యోగ్యతవిషయమై ఇంకేపరీక్షలైనాపెట్ట వచ్చుగాని, జాతి మత విభేదాలు అందుకు ఆటంకం కారాదు."

నూతన విధానానికి ప్రాతిపదికగా 1858 నాటి విక్టోరియా రాణి ప్రకటనను సామాన్యంగా అభివర్ణిస్తుంటారు కాని వాస్తవస్థితిలో ఆ ప్రకటన పైసూత్రానికి వివరణం మాత్రమే.

"మా ప్రజలు ఏ జాతికి, మతానికి చెందినవారైనప్పటికి, కార్యనిర్వ హణకు తగిన విద్య. సమర్థతా, నిజాయితీ ఉన్నట్టయితే ఏ పదవిలోనికిగాని తీసుకోవచ్చును. అందులో పక్షపాతం చూపరాదు ఇదే మా సంకల్పం"

పాలక పాలితులమధ్య విభేదాలుండవని, భారతీయులను సమానంగా చూస్తామని చెప్పిన ఈ వాగ్దానాలన్నీ చూచేందుకు చాల ఔదార్యవంతంగా కని పిస్తాయి. కాని వానిని అలా ఉదారంగా అమలు జరిపే ఉద్దేశం బ్రిటనుకులేదు. "చెవిలో చెప్పిన వాగ్దానాలను, హృదయంలోపల భగ్నం చేయడమే" బ్రిటన్ భారతదేశ విషయమై అవలంబిస్తున్న విధానమని లార్డు లిట్టన్ అందుకే అన్నాడు. 1876–80 లో వైస్రాయిగావున్న లార్డు లిట్టన్ ఇండియామంత్రి లార్డు క్రాన్ బ్రూక్‌కు వ్రాసిన "రహస్య లేఖ"లో పైమాటలున్నవి అవి చాల ప్రసిద్ధమైన మాటలు. లిట్టన్ ఇలా వ్రాశాడు :

"ఈ ఆశయాలు, ఆశలు ఎన్నటికీ అమలు జరుపబడవని మనమంద రమూ ఎరుగుదుము. మనకు రెండే దారులున్నవి : ఒకటి భారతీయులను నిషేధించడం, రెండు వారిని మోసగించడం. ఇందులో ఖచ్చితమైన నిర్దాక్షిణ్య పద్ధతిని వదలివేశాము. ఇది నేను రహస్యంగా రాస్తున్నాను.

"చెప్పిన వాగ్దానాలను భగ్నం చేయడానికే, తమచేతనైనన్ని విధాలా ప్రయత్నం చేస్తున్నారనే నేరారోపణకు ఇంతవరకూ బ్రిటిష్ ప్రభుత్వమూ భారత ప్రభుత్వమూ సంతృప్తికరంగా సమాధాన మివ్వలేకపోతున్నవని నా అభిప్రాయం."

భారతీయులకు బ్రిటన్ చేసిన వాగ్దానాలన్నీ "రాజకీయ వంచకత్వమే"నని లార్డు సాలిస్బరీ తనకు మామూలైన మోటుమాటలతో చెప్పివేశాడు. (నేటి బాల్డ్విన్‌లు, లాయడ్ జార్జీలు, మాక్డనాల్డు వగైరాలను సాలిస్బరీ ఏమని ఉండేవాడో ఊహిస్తే ఆకర్షకంగా ఉంటుంది.)

గతయుద్ధంలోని ఈ వాగ్దానాలూ, ప్రకటనలూ చూడ్డానికి మహోజ్వలమైన రూపంలో ఉన్నాయి. కాని వీటిలోని అంతర్యం పైపైనచూస్తే అపార్థాలకు కారణమై నిజంగా వారు భారతీయ సమానతను ఆశిస్తున్నారనిపిస్తుంది. కాని సామ్రాజ్యవాద పాలనాయంత్రంలో భారతీయులను తమకు లోబడిఉండేట్టు చేర్చుకోవడమే బ్రిటన్ ఆశయం. ఇలాగయితే ప్రజాసామాన్యాన్ని దాస్యబంధనాలతో బంధించేందుకు సాయపడే భారతీయ ఉన్నత మధ్యతరగతివారిని చక్కగా తయారుచేసి ఉంచ వీలుపడుతుందనే వారి ఆశయం. (ఈ వాగ్దానాలూ, ప్రకటనలూ గత యుగానికి చెందినవి. అయినప్పటికీ అదే ధోరణిలోనే నేడు మరొక ఉన్నత దశలోకి వచ్చాము. కాబట్టి వానినుండి మనం పాఠం నేర్చుకోవాలి.)

ఈ ఆశయాన్ని అనుసరించే 1861 తర్వాత చాల సంస్కరణలను అమలు జరుపుతూ వచ్చారు. ఇందుతోపాటు సివిల్ సర్వీస్‌లో భారతీయులకు స్థానాలను జాగ్రత్తగా కొద్దికొద్దిగా ఎక్కువచేస్తూ వచ్చారు. (కాని అసలు పెత్తనంగల అధికారాలు మాత్రం వారి కివ్వలేదు.)

1861 ఇండియన్ కౌన్సిళ్ళ చట్టం ప్రకారం వైస్రాయి కౌన్సిల్‌లో ఆరుగురు అనధికార సభ్యులను నామినేట్ చేయవచ్చు నన్నారు. ఆ నామినేటెడ్ సభ్యులను భారతీయులనుండి బహు జాగర్తగా పరిశీలించి తీసుకొనేవారు ప్రతిసారి కొత్త సంస్కరణలు పెట్టినప్పుడల్లా మరొక కొత్త నిర్బంధ విధానానికి తగిన ఆయుధాన్ని కూడ బయలుపరచేవారు ఆ సంగతిని గమనించడం ముఖ్యం. ఏ సమయంలోగాని ఆరునెలలు అమలు జరిగే ఆర్డినెన్సులను ప్రకటించడానికి వైస్రాయికి అధికార మిచ్చారు. ఈ అధికారాన్ని ఆధునిక యుగంలో స్వేచ్ఛగా ఉపయోగించడం జరిగింది

1883-84 లో స్థానిక స్వపరిపాలన చట్టాలు వచ్చాయి. వీని ప్రకారం పురపాలక సంఘాల సభ్యులు ఎన్నుకోబడాలన్న సూత్రం ప్రవేశపెట్టారు. జిల్లా కౌన్సిళ్ళు గ్రామ ప్రాంతాల బోర్డులు ఏర్పాటయ్యాయి,

1892 లో ఇండియన్ కౌన్సిళ్ళు చట్టం రాష్ట్ర శాసనసభల్లోనికి (లెజిస్లేటివ్ కౌన్సిళ్ళు, పరోక్షంగా ఎన్నుకోబడిన కొందరు సభ్యులను చేర్చింది (కాని వీరి

ఎన్నికనుకూడా, ఎన్నిక అనడానికి వీలులేదు. స్థానిక ప్రభుత్వం ఇతర సంస్థలు ఎన్నుకోకుండా కేవలం కొందరి పేరులను సిఫారసు చేయడం మాత్రమే జరుగుతుంది. ఆ జాబితాను పై అధికారులు ఆమోదించవలసి ఉంటుంది ) ఆ కౌన్సిళ్ళ నుండి వైస్రాయి శాసనసభకు ఇంకొక పరోక్షపు ఎన్నిక జరుగుతుంది.

1909 ఇండియా కౌన్సిళ్ళచట్టం — దీనినే మోర్లీ-మింటో సంస్కరణలంటారు. రాష్ట్ర శాసనసభల్లో ఎన్నుకొనబడిన సభ్యులే మెజారిటీగా ఉండేట్టు చేసింది. ఈ ఎన్నిక కొంత ప్రత్యక్షంగాను, పరోక్షంగాను జరుగుతుంది. ఇందుతోపాటు వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సిల్లో మైనారిటీకి ఎన్నుకొనబడిన సభ్యులకు స్థానం, ఈ చట్టప్రకారమే, ఏర్పడింది. ఈకౌన్సిళ్ళ కార్యక్రమంపై చాల నిర్బంధాలుంచారు. పరిపాలనమీదగాని, ఆర్థికవ్యవహారాలమీదగాని ఈ కౌన్సిళ్ళకు అధికారంలేదు. ఈ కౌన్సిళ్ళుచేసిన నిర్ణయాలను వైస్రాయి ఆమోదించకుండా నిరాకరించవచ్చును. వోటింగు హక్కు అతిసంకుచితమైనది. ఎన్నుకునే సంస్థలు చాలపెంచారు. ఇందుతోపాటు ప్రత్యేకముస్లిం నియోజకవర్గాలనుకూడ ఏర్పరచారు.

స్వపరిపాలనకోసం దేశవ్యాపితమైన జాతీయాందోళన జరుగుతున్నరోజుల్లో ఆ ఆందోళనకు ఫలితంగా ఈ మొదటి మోర్లీ-మింటో సంస్కరణలను అమలు జరిపారు. ఆ ఆందోళనను అణచివేసేందుకే, మోర్లీ వాక్యాల్లో "మితవాదులను కూడ గట్టుకొని రావడానికి" ఈ సంస్కరణలను ప్రవేశపెట్టారు. 1905 జాతీయోద్యమం విజృంభించిన వెంటనే 1906 లో ఈ సంస్కరణలను తొలుత తయారు చేశారు. 1905 లో సహాయనిరాకరణ స్వదేశ ఉద్యమాలూ, 1905 నాటి రష్యన్ విప్లవమూ జరిగింతర్వాతనే ఇది జరిగింది. ఆ రష్యావిప్లవం మరొక నిరంకుశప్రభుత్వాన్ని కదిల్చిపారవేసింది. ఇలాంటి పరిస్థితుల్లో, ఈచిన్న సంస్కరణలను నూతన యుగోదయమంటూ డప్పులు వాయిస్తూ అమలు పెట్టారు తర్వాత వచ్చిన మాంటేగూ చేమ్సుఫర్డు నివేదికలో (ఈ నివేదికకూడ పాతవిధానాన్నే మరికొంత పెద్ద ఎత్తున పునరుచ్చరణ చేసింది) మోటుగా ఇలా అన్నారు ; "అప్పటి తాత్కాలిక ఉద్రేకంలో ఆసంస్కరణలను (మోర్లీ-మింటో సంస్కరణలు) చాల అతిశయోక్తిగా పొగడారు........ ఆ ఆశలన్నీ త్వరలోనే సమసిపోయ్యాయి."

స్వరాజ్య ఉద్యమాన్ని పరాజయం పొందించడానికే తానీ సంస్కరణలను ఉద్దేశించినట్టు లార్డు మోర్లీ బహిరంగంగా చెప్పాడు. అప్పటి పరిస్థితిని ఆయన ఈ క్రింది సాభిప్రాయ వాక్యాలలో వివరించాడు ;

> "ఇలాంటి సంస్కరణలనుగూర్చి వ్యవహరించేటప్పుడు మనం, మూడువర్గాల ప్రజలనుగూర్చి ఆలోచించాలి. ఒకటి అతివాదవర్గం : వీరు ఏదో ఒకనాడు మనలను భారతదేశంనుండి తాము తరిమివేయగలరని గాలిమేడలు కట్టుకుంటుంటారు; .... రెండోవర్గానికిలాంటి ఆశలేవీ లేవు;

కాని వలసదేశాల పద్ధతిలో స్వపరిపాలనమో, స్వప్రభుత్వమో వీరు కోరు తుంటారు. ఇక మూడోవర్గంవారు. మరోపాలనలో సహకరించడానికి అనుమతిస్తే చాలునంటారు. అంతకంటే వారెక్కువ వాంఛించరు.

న్యాయంగా సంపూర్ణ సహకారానికి అవకాశమివ్వమని మాత్రం కోరే మూడోవర్గంలోకి వలసదేశ స్వపరిపాలనను ఆశించే రెండోవర్గాన్ని కొనిరావడమే మన సంస్కరణల ఉద్దేశం. పూర్వమూ, ఇప్పుడూ, రేపూ కూడా ఈ సంస్కరణల ఉద్దేశ మిదేనని నేను విశ్వసిస్తున్నాను."

(వైకౌంట్ మోర్లీ, ప్రభువులసభలో ఉపన్యాసం, 1909 ఫిబ్రవరి 23.)

అంటే రాజ్యాంగ సంస్కరణల మార్గంలో తమపాలనలో సహకారానికి అవకాశమివ్వడమే సామ్రాజ్యవాదులు అంగీకరించిన పద్ధతి. ఈ పద్ధతితోనే వారు స్వరాజ్యమనే జాతీయాశయాన్ని ఓడించాలని ఆశించారు.

ఈ సమయంలో సంస్కరణలను "స్వపరిపాలనకు సోపానం" అంటూ ప్రవేశపెట్టవలసిన అగత్యంలేదు. ఈ సంస్కరణలు "ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని, భారతదేశంలో పార్లమెంటరీ పద్ధతిని స్థాపించేందుకు" దారితీస్తాయని భావించరాదని లార్డు మోర్లీ స్పష్టపరచిన సంగతి ముందే చూచాము భారత దేశంలో బాధ్యతాయుత ప్రభుత్వంవేపు పురోగమనం అనే సమస్యే లేదన్న లార్డు మింటో ఆశయం. దానిని తాను అంగీకరించి, మరింత బలపరుస్తూ లార్డు మోర్లీ ఇలా మింటోకొక ఉత్తరం రాశాడు :

"పాశ్చాత్య దృష్టిలో భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని తాము పెట్టడం లేదన్నారు. అది నిజమే. యూరోపులో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాడాలని నొక్కి చెప్పేవారుకూడ కొందరు భారతదేశంలో తమకున్న అనుభవాన్ని పురస్కరించుకొని మీరన్న మాటలే అంటున్నారు. 'భారత సామ్రాజ్య జనాభాలో కలసియున్న వివిధతెగల మానసిక స్థితికి ఏమాత్రం బాధ్యతాయుత ప్రభుత్వ పద్ధతి సరిపడదు.....యూరోపు పద్ధతిలో ఏవిధమైన బాధ్యతాయుత ప్రభుత్వాన్ని, గాని ఇండియాలో తెచ్చిపెట్టే ఉద్దేశం కాని, వాంఛకాని లేదని ఖండిస్తూన్నాము. మీ కౌన్సిల్ చేయదలచుకున్నదల్లా 'తమ దేశ ప్రభుత్వంలో భాగం కావాలన్న విద్యావంతుల సహజ వాంఛలను గుర్తించేందుకు, ఉన్న పాలనా యంత్రాన్ని బాగు పరచడమో లేక మరొక కొత్త పద్ధతిని చూడ డమో మాత్రమే. ఈ విషయంలో హిస్ మెజస్టిస్, ప్రభుత్వం మీతో సంతోషంగా ఏకీభవిస్తుందని నేను వేరే చెప్ప నవసరంలేదు.

"లండన్‌లో కాని కలకత్తాలో కాని భారతదేశ విధానాన్ని నడప డంలో ఉండవలసిన ప్రధాన ప్రమాణం, పరీక్ష ఏమిటంటే ఏకొత్త సంస్కర

జలు పెట్టేవిగా అవి సార్వభౌమాధికారాన్ని బలపరిచేవిగా, పదిల పరిచేవిగా ఉండాలి,”

(లార్డు మోర్లీ మింటోకు వ్రాసిన జాబు; మాంటేగూ చేంసుఫర్డు నివేదికలో ఉదహరించినది, పుట 64.)

ఇప్పటివరకూ సామ్రాజ్యవాద విధానం స్పష్టంగానూ, నిస్సందిగ్ధంగానూ, ఉంది. స్వపరిపాలన వేపు పురోగమనంఅనే మాటేలేదు సార్వభౌమాధికారాల ప్రయోజనాలే పరమాశయంగా ఉంచుకున్నారు తమ రాజ్యాంగ సంస్కరణల పరమోద్దేశం సామ్రాజ్య ప్రయోజనాలకు ఉన్నత వర్గంలోని అల్పసంఖ్యాకుల తోడ్పాటును సంపాదించుకునేందుకు మాత్రమే.

## 3. అధినివేశ సమస్య

తర్వాత 1914—18 యుద్ధం వచ్చింది సామ్రాజ్యవాదపు పునాదులు కదిలాయి. మిగత వలసదేశ ప్రజలందరిలోవలెనే భారతదేశంలో చైతన్యం వెల్లివిరిసింది. హిందూ-ముస్లిం ఐక్యత ఏర్పడింది. 1916 లో స్వపరిపాలనను ఆశయంగా ఉంచుకొని కాంగ్రెసు, లీగు సంయుక్త ప్రణాళిక ఒకటి తయారయింది 1917 మార్చిలో రష్యావిప్లవం విజయవంతమైంది. అందులో అన్ని దేశాలలోను ప్రజా ఉద్యమ ప్రవాహం ఒక్క ఉదుటున ముందుకురికింది. ప్రపంచమంతటా జాతీయ స్వయంనిర్ణయ నినాదాలు ప్రతిధ్వనించాయి.

ఈ పరిస్థితిని బ్రిటిష్ ప్రభుత్వం 1917 అగస్టు 20 వ తేదీన ఒక కొత్త ప్రకటనతో ఎదుర్కొన్నది ఆ ప్రకటనను ఆధునిక సామ్రాజ్యవాద రాజ్యాంగ విధానానికి గీటురాయిగా భావించడం అలవాటు. ఆ ప్రకటనలోని ముఖ్యమైన భాగాలిలా ఉన్నవి :

“బ్రిటిష్ సామ్రాజ్యంలో విడదీయరాని భాగంగా భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వ సాధనమే మా ఆశయం. దీనిని దృష్టిలో ఉంచుకొని, అన్ని ప్రభుత్వశాఖలలోను భారతీయుల వాటాను ఎక్కువచేయడం; స్వపరిపాలన సంస్థలను క్రమంగా పెంపొందించడం బ్రిటిష్ ప్రభుత్వ విధానం. ఈ విధానంతో భారత ప్రభుత్వం సంపూర్ణంగా ఏకీభవిస్తున్నది ఇందుకు తగిన చర్యలను సాధ్యమైనంత త్వరలో తీసుకోవాలని బ్రిటిష్ ప్రభుత్వం నిశ్చయించింది.... ఈవిధానంలో పురోగమనం ఒక దశ తర్వాత మరొక దశగా మాత్రమే సాధ్యమవుతుంది భారత ప్రజల పురోగతికి, యోగక్షేమాల బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వంమీదను భారత ప్రభుత్వంమీదను ఉన్నది. కాబట్టి ఈ సంస్కరణలోని ప్రతి దశలోను పురోగమనం ఎంత ఉండాలి. అందుకు తగిన సమయమేది అని నిశ్చయించడానికి ఈ ప్రభుత్వాలే అధికారులుగా ఉండాలి. ఇప్పుడు ఉద్యోగాలకు నూతన అవకాశాలు గలవారు ఎంతవరకు సహకారం చేస్తారనే అంశంమీద ప్రభుత్వం తీసుకునే

చర్యలు ఆధారపడి ఉంటాయి. అంతేకాక, ఆ విద్యావంతులు బాధ్యతగలిగి ప్రవర్తించడంమీద వారిపై ఎంతవరకు విశ్వాసం వుంచవచ్చునో ప్రభుత్వం నిశ్చయిస్తుంది."

ఈ ప్రకటనను సామాన్యంగా మాంటేగూ ప్రకటన అంటారు. ఈ ప్రకటన ఇండియామంత్రి ఐ యస్ మాంటేగూద్వారా చేశారు కాబట్టి దానికాపేరు వచ్చింది. ఈ ప్రకటనను తయారు చేసినవారు బాగా గడుసువారిన బ్రిటిష్ సామ్రాజ్యవాదు లయిన కర్జన్, ఆస్టెన్‌ఛేంబర్లేన్‌గార్లు. 'బాధ్యతాయుత ప్రభుత్వం' అనే మాటను పై ప్రకటనలో కర్జన్ చేర్చాడు (రోనాల్డుషే, "కర్జన్ జీవితం" సంపుటి, 3 పుట 167) 1905 లో భారతదేశాన్ని వదలివెళ్ళుతూ లార్డు కర్జన్ ఇలా ప్రకటించాడు: "సంపూర్ణమైన భావంలో, భారత ప్రభుత్వ అధికారిగా పై ప్రాయి ఎల్లప్పటికీఉండి తీరాలని నేను హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను."

ఈ ప్రకటన తొందరపడి చేశారన్నందుకు నిదర్శనం చూడండి. ఈ ప్రకటన చేసినతర్వాతనే వివరంగా చాలకాలం ప్రభుత్వవిచారణలు జరపాలని నిశ్చయించారు. ఆ విచారణల ఫలితమే 1919 ఇండియా రాజ్యాంగచట్టం రూపంలో వెలువడింది.

ఆ ప్రకటన అర్థమేమిటి? అధినివేశ ప్రభుత్వం (ఈ మాటను ప్రకటనలో చేర్చలేదు) ఇస్తామని దానికి భావమా? స్వపరిపాలిత అధినివేశాలకున్న హోదాయే ఇస్తారా? అలాంటి హోదాను ఏదైన ఒక కాలనిర్ణయంచేసి అంతలోగా అమలు జరుపుతామని ఆ ప్రకటననుబట్టి అర్థంచేసుకోవచ్చునా? ఇదంతా వివాదాస్పదం గానే ఉండిపోయింది.

ఈ ప్రకటనలో కీలకం ఒకటుంది ఈ రాజ్యాంగ సంస్కరణలన్నీ కొన్ని "దశల" లో జరగాలన్నారు ఆ దశలలో "ఒకొక దశా ఎప్పుడు ప్రారంభం కావాలి, ఆదశ ఎన్నాళ్ళుండాలి అనే సమస్యపై" తీర్పుచేప్పే బాధ్యత సంపూర్తిగా బ్రిటిష్ అధికారుల చేతులోనే ఉంచుతున్నారు. మొదటి దశ గడవడానికి రెండేళ్ళు పట్టింది. రెండో దశతో పోల్చిచూస్తే ఇది వాయువేగ మనోవేగాలతో నడిచిందన్న మాట. మాంటేగూ చేంసుఫర్డు నివేదిక ప్రకారం: ఒకదశనుండి కొత్తదశకు మారేందుకు, పర్యవేక్షణ-సమీక్షజరగడానికి పదేళ్ళవ్యవధి ఉండాలి. రెండో దశ వచ్చేప్పటికి ఏమైనప్పటికీ పదహారేళ్ళు పట్టింది, విపరీతమైన విచారణలు కొనసాగించి 1935 ఇండియా చట్టం వచ్చేప్పటికి ఏడేళ్ళుపట్టింది పదేళ్ళవ్యవధి చాల తక్కువని సైమన్ నివేదిక తోసివేసింది.

> "కొత్తగా అమలుపరచిన 'విధానం', పరిపాలనా వ్యవహారాలలో ఎలాంటి పరిణామం చెందిందో తెలుసుకునేందుకు పదేళ్ళ వ్యవధిచాలదు."
>
> (సైమన్ నివేదిక, వాల్యూం 11, పుట 7)

వరుసగా విచారణలు జరుపుతూ, జాగ్రత్తగా ఒక్కొక్క అడుగే ముందుకు వెయ్యాలన్నదే భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కొత్తవిధానం. ఈ విధానంకోవి అంతర్యాన్ని బ్రిటిష్ ప్రధాని మాక్డనాల్డు గ్రహించాడు. (అతను అమలు జరిపిన బెంగాల్ ఎమర్జెన్సీ ఆర్డినెన్సులు, అందుతోపాటు విచారణలేకుండా జైల్లో ఉంచేపద్ధతిని స్థాపించడం వీనినిబట్టిచూస్తే ఆచరణలోమట్టుకు ఒకొక్క అడుగు ముందుకువేయడంకూడ వీలులేని విచ్ఛిన్న కుతంత్రాలే ఇవని బోధపడుతుంది.) ఈ విషయం మాక్డనాల్డు 1924 ఏప్రిల్‌లో యార్కులో ఇచ్చిన ఉపన్యాసం బాగా బోధపరుస్తూంది. ఆయన భారతదేశాని కిలా విజ్ఞప్తి చేశాడు:

> "బ్రిటిష్ ప్రజాతంత్రపద్ధతిలో మీరు విశ్వాసం ఉంచండి. లేబర్ ప్రభుత్వాన్ని నమ్మండి భారత ప్రభుత్వం విచారణలు సాగిస్తూన్నది ఆ విచారణద్వారా భారత రాజ్యాంగచట్టాన్ని సమాలోచించేందుకు తగిన పునాది ఏర్పడుతుందని లేబర్ ప్రభుత్వం భావిస్తుంది ఆ చట్టం అమలు జరగడం, దానితో వచ్చే అవకాశాలు భారతీయులకు సాయపడగలవని ఆశిస్తున్నాము. స్వపరిపాలనా పద్ధతి నిర్మాణమనే లక్ష్యంవైపు భారతీయులు పురోగమించేందుకు ఆ చట్టం తోడ్పడగలదని భావిస్తున్నాము."

ఈ కార్యక్రమంపై ఆశచూపడం, వాగ్దానాలివ్వడం వీటిలో నూతన సామ్రాజ్యవాద విధాన సారాంశమంతా ఇమిడిఉన్నది. మాక్డనాల్డుకు తనకు ప్రత్యేకమైన అనుకరించ వీలులేని రీతిలో దానిని వెల్లడించాడు.

ఈ నూతన విధానాన్ని అమలు జరపడానికై ఇప్పటివరకు రెండు చట్టాలు చేశారు.

మొదటిది 1919 ఇండియా ప్రభుత్వ చట్టం. ఈ చట్టం ద్వంద్వ పరిపాలనా పద్ధతిని ఏర్పరచింది. కేంద్ర ప్రభుత్వంలో ఏ విధమైన మార్పూచేయలేదు కాని రాష్ట్ర ప్రభుత్వాల్లోమట్టుకు మార్పువచ్చింది. ఆరోగ్యం, విద్యలాంటి నిర్మాణ కార్యక్రమ శాఖలు శాసనసభకు బాధ్యులైన భారత మంత్రులకు అప్పగించారు. కాని ఈ శాఖలకై ఖర్చుపెట్టేందుకుమట్టుకు డబ్బులేదు మరిఇతర పోలీసు, భూమిపన్ను మొదలైన శాఖలను మాత్రం. గవర్నరుకు బాధ్యులైన మంత్రులకే 'రిజర్వు' చేశారు (ప్రత్యేకించారు) ఆస్తినిబట్టి సంకుచితమైన వోటింగు హక్కునేర్పరచారు. దీని ప్రకారం జనాభాలో (బర్మాను విడిచిపెట్టి) నూటికి 2. 8 వంతు మందికి మాత్రమే వోటుచేసే హక్కుంటుంది, ఇలాంటి వోటింగు హక్కుతో ఎన్నుకొనబడిన సభ్యులు రాష్ట్ర శాసనసభలో అధికసంఖ్యలో ఉంటారు. రాష్ట్ర శాసనసభలు చేసిన చట్టాలను నిరాకరించేందుకు, శాసనసభలు నిరాకరించిన చట్టాలను ఆమోదించేందుకుకూడ గవర్నర్లకు అధికారం ఉంది.

కేంద్రప్రభుత్వంలో రెండు సభలను ఏర్పాటుచేసారు ఒకటి స్టేట్‌కౌన్సిల్. ఇందులో సగంమంది నామినేటెడ్ సభ్యులుంటారు. మరిసగంమందిని అతి సంకుచితమైన ఉన్నత వర్గం ఎన్నుకుంటుంది. (మొత్తం స్టేట్‌కౌన్సిల్ ఓటర్ల

సంఖ్య దేశమంతటికీ కలిపి 8000) రెండోది ఢిల్లీ అసెంబ్లీ. ఇందులో ఎన్నుకొనబడిన సభ్యులదే మెజారిటీ. కాని రాష్ట్ర శాసనసభల వోటింగు హక్కు కంటే ఇది మరీ సంకుచితమైనది (జనాభాలో రెండు వందలమందికి ఒకరికన్నా వోటింగు హక్కు పూర్తిగా ఉండదు) ఈ శాసనసభలు చేసిన తీర్మానాలను, చట్టాలను నిరాకరించేందుకు, ఆమోదించేందుకుకూడ గవర్నర్ జనరల్‌కు అపరిమితమైన అధికారాలున్నాయి:

ద్వంద్వపరిపాలనా విధానాన్ని సర్వులూ ఖండించారు ఒక భారతీయులే కాక, కొన్నిరోజుల అనుభవం తర్వాత సామ్రాజ్యవాద పాలకవర్గాలే ఖండించాయి. ఇందులో ఉన్న సంకుచిత తత్వాన్ని వివరించడం మనకు ప్రస్తుతం అనవసరం. అవి స్పష్టంగానే కనిపిస్తున్నాయి భారత రాజ్యాంగకార్యదర్శి 1925 లో దీనినిలా అభివర్ణించాడు. "విపరీతమైన వాగాడంబరం, అటూఇటూ కదల వీలులేని సంకుచితత్వంగల చట్టమిది ఇలాంటిదానికి ఆంగ్లో శాక్సన్‌జాతులు ఆమోదం చూపెట్టలేవు.........చాలభాగం ఆంగ్లో శాక్సన్‌ల పద్ధతిలోనే ఏర్పడిన రాజకీయాభిప్రాయాలుగల భారతీయులకిది నచ్చడం సాధ్యపడదనుకుంటాను." లార్డుబర్కన్ హెడ్డు పార్లమెంటు సభలో చేసిన ఉపన్యాసం, జులై 7, 1925). భారతమంత్రులకిచ్చిన బాధ్యతవట్టిబూటకం. ఏమాత్రం దాక్షిణ్యం చూపకుండా సైమన్‌కమిటీ దీనిలోని లోపాలను బట్టబయలుచేసింది "ప్రభుత్వం మనుషులు" అని భావించబడే "ప్రభుత్వోద్యోగులపై ఎక్కువగా" భారతమంత్రులు ఆధారపడవలసి వస్తుంది; "ప్రభుత్వాన్ని కేంద్రీకరించి ఏకీకరణం చేయాలన్న తీవ్రవాంఛ" ఇరువురిపైన బాధ్యత ఉంచాలనీ కాగితంమీది ప్రణాళికలను తలక్రిందులు చేసివేసింది.

అయినప్పటికీ ప్రతిసారి కొత్తగా విచారణజరిపి రాజ్యాంగ చట్ట నిర్మాణానికి పూనుకున్న ప్రతికమిటీకూడ, తనకంటే లోగడచట్టం తయారుజేసిన కమిటీ నివేదికలను ఏ మాత్రం దయాదాక్షిణ్యం లేకుండా అందులోని లోపాలను బయలు పెట్టడంమట్టుకు గుర్తించవలసిన విషయం మోర్లీమింటో సంస్కరణల కల్లిబొల్లి కబుర్లను మాంటేగూ - ఛెంసుఫర్డు నివేదిక నిర్దాక్షిణ్యంగా విమర్శించింది. అలాగే సైమన్‌కమిటీ నివేదిక మాంటేగూ ఛెంసుఫర్డు సంస్కరణల విఫలతను, అందులోని లోపాలను జంకుగొంకులేకుండా బట్టబయలు చేసింది; కాని యధాప్రకారం ఇప్పుడు అమలులో ఉన్న రాజ్యాంగచట్టం మాత్రం వారి దృష్టిలో ఆదర్శప్రాయమయిందట ! దూరదృష్టిలేని భారతీయులు మాత్రమే ఖండిస్తున్నారట !

1919 చట్టం తర్వాత, రెండో రాజ్యాంగచట్టం 1935 భారత ప్రభుత్వ చట్టం. ఇదే చట్టమే 1937 నుండి అమలులో ఉన్నది. (ఈ చట్టంలో ప్రధానమైన ఫెడరేషన్ భాగంమట్టుకు అమలు జరుగలేదు. యుద్ధ ప్రారంభంతో దీనిని కాల నిర్ణయం లేకుండా వాయిదావేశారు) ఈ చట్టం స్వపరిపాలనవేపు ఎంతవరకు పురోగమనాన్ని సూచిస్తున్నదో లేక సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని ఎంతవరకు

బలపరుస్తున్నదో నిర్ణయించడానికై వచ్చే ప్రకరణంలో వివరంగా పరిశీలించడం అవసరం.

ఇలాగా 1917 నుండి ఇరవైతొమ్మిదేళ్లు రాజ్యాంగ చట్టాలు, వానివి అమలు జరిపి చూడడం అనే ఎడతెరపిలేని కార్యక్రమంతో గడచిపోయాయి ఈ పాతికేళ్ళకు పైగా గడచినప్పటికి సామ్రాజ్యవాద అధికారం చెక్కుచెదర కుండానే ఉన్నది.

ఆధునిక సామ్రాజ్యవాద విధానంయొక్క ఆశయం "అధినివేశ ప్రతిపత్తి" యేనా ? అయితే ఆ ప్రతిపత్తి ఎలాంటిది ? సామాన్యంగా ఆ మాటకు అందరూ అర్థంచేసుకునేట్టి, కనడా, ఆస్ట్రేలియాలు అనుభవిస్తున్నట్టి అధినివేశ హోదాయేనా అది? లేక వెడ్జ్‌వుడ్ బెన్ చెప్పినలాంటి హోదాయా ఇది? 1929 లో భారత రాజ్యాంగ కార్యదర్శి వెడ్జ్‌వుడ్ బెన్ భారతదేశం ఇప్పటికే అధినివేశ హోదాను అనుభవిస్తున్న దంటూ శ్రోతలందరినీ దిగ్భ్రాంతులను చేశాడు ఆయన అందుకు చెప్పిన కారణా లేమిటంటే, భారతదేశం వేరుగా నానాజాతిసమితిలో 'ప్రాతినిధ్యం' వహిస్తున్న దనీ స్వతంత్రంగా వర్సైల్స్ సంధిలో సంతకం చేసిందనీ ఆయనంటున్నాడు ఇలాంటిదేనా వీరు ఏర్పరచాలనుకునే అధినివేశప్రతిపత్తి? ఈ అగోచర ఆశయం ఎన్నియేళ్లలో సాధించబడుతుంది ? ఈ ప్రశ్నలన్నిటికీ చాల విభిన్నమైన సమాధానాలు, పరస్పర విరుద్ధ ప్రకటనలూ జరిగాయి ఈ సమస్య అంతాపూర్తిగా చొరరాని రాజకీయతంత్ర పరిభాషఅనే పొగతో అచ్ఛాదితమైఉంది

1917 బ్రిటిష్‌ప్రభుత్వ ప్రకటనలో అధినివేశప్రతిపత్తి పేరే ఎత్తలేదు. 1919 ఇండియాచట్టంలోకూడ ఆమాట లేదు. మొట్టమొదటి సారి 1921 మార్చిలో కొత్తచట్టాన్నిగూర్చి చెబుతూ చక్రవర్తిగారు వైస్రాయికి పంపిన ఉత్తరువులో ఈ మాట పొడసూపింది అందులో "బ్రిటిష్ ఇండియా మన అధినివేశరాజ్యాలలో అర్హస్థానాన్ని పొందవచ్చును." అని ఉంది దీనికి ఏమైనా అర్థముంటే ఉండవచ్చు. లేదా లేదు అనేది స్పష్టమే 1935 ఇండియాచట్టం ఉపక్రమణిక (ప్రియాంబిల్) లో స్పష్టంగా అధినివేశప్రతిపత్తి నిస్తామని వాగ్దానం చేయమంటే ఆ కోరికను బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించింది.

చట్టసంబంధమైన రికార్డులలో కాకుండా. అప్పటికప్పుడు ఎంతోఒకంత స్పష్టంగా అనేకరకాలుగా వెలువడిన ప్రకటనలకు ఏమి వెలలేదు. అవి అమలు జరపాలన్నవిధి ఏమీలేదు. 1928 లో మాక్డనాల్డు ప్రధానపదవిలో లేనప్పుడు ఇలా ప్రకటించాడు.

> "కొన్ని సంవత్సరాలలో కాక, కొన్నినెలల్లో మన కామన్వెల్తులో ఒకకొత్త అధినివేశ ప్రభుత్వం చేరనున్నదని నేనాశిస్తున్నాను. ఇదివేరొక జాతివారి అధినివేశం. కామన్వెల్తులో దానికి సమాన ఆత్మగౌరవాన్ని సంపా

దించు కోగలుగుతుంది. ఈ మాటలు నేను భారతదేశం గూర్చి చెబు తున్నాను"

(జె. ఆర్. మాక్డొనాల్డు, బ్రిటిష్ కామన్వెల్తు లేబర్ మహాసభలో ఉపన్యాసం. జులై 2, 1928)

కొన్ని సంవత్సరాలలో కాక కొన్నినెలల్లో జరిగిన సంఘటనలు ఏమంటే మాక్డొనాల్డు ప్రధాని రాజ్యంలో స్వపరిపాలన కావాలని అందోళన చేసిన నేరానికి లక్షమంది భారతీయులు జైళ్ళలో పడ్డారు; దారుణ నిర్బంధవిధానం భారత దేశంలో తాండవించింది.

సర్వపక్షసమావేశానికి (రౌండు టేబిల్ కాన్ఫరెన్సు) పునాది ఏర్పరిచేందుకై లార్డు ఇర్విన్ (వైస్రాయి) 1929 లో ఒక ప్రకటనచేశాడు. ఆయనిలా అన్నాడు:

"భారతదేశ రాజ్యాంగ సంస్కరణల సహజలక్ష్య 1917 ప్రకటనలో ఉద్దేశించిన ప్రకారం అధినివేశప్రతిపత్తిని నెలకొల్పడమే. ఈ అంశం 1917 ప్రకటనలో అంతర్గతమై ఉన్నట్లు తమ అభిప్రాయమని బ్రిటిష్ ప్రభుత్వ పక్షంగా నేను ప్రకటిస్తున్నాను. ఇందుకు ప్రభుత్వం నాకు అనుజ్ఞ ఇచ్చింది."

(లార్డు ఇర్విన్ ప్రకటన, 1923 అక్టోబర్ 31)

ఈ ప్రకటనలో బ్రిటిష్ పార్లమెంటులోని వృద్ధరాజకీయవేత్తలంతా గందరగోళం రేపారు. కాని ఈ ప్రకటనమూలంగా క్లిష్టతరంగా ఉన్న భారత రాజకీయస్థితిలో "మంచిమార్పు, ఏర్పడింది" అనిచెప్పి బ్రిటిష్ ప్రభుత్వం దీనిని సమర్థించు కున్నది ఈప్రకటనకు అర్థమేమిఅని ప్రశ్నించడానికై చేసిన ప్రయత్నాలన్నిటినీ ఇండియామంత్రి నిరాకరించాడు: "వైస్రాయిచేసిన ప్రకటన ఎంతఉందో అంతే, మరిన్నిచిక్కులు కల్పించడానికై గౌరవసభ్యులు నన్ను ప్రశ్నించవద్దని కోరు తున్నాను" అన్నాడు.

"అధినివేశ ప్రతిపత్తి" అంటే అర్థమేమిటి? ఈప్రశ్నకు అనేకవిధాలైన సమాధానాలున్నవి. మనం ముందు గమనించినట్లుగా ఇండియామంత్రి విచిత్రవాద మొకటి కనిపెట్టాడు. వర్సైల్సు సంధిపత్రంలో సంతకంచేసి నానాజాతి సమితిలో సభ్యురాలైనప్పటినుండి భారతదేశం అధినివేశహోదాను అనుభవిస్తున్న దంటా డాయన. ఇలా సర్వసామాన్యంగా ఒకవేపున వాదిస్తూ, మరొకవేపున భారతదేశ రాజ్యాంగం సంస్కరణల భావిలక్ష్యం అధినివేశ ప్రతిపత్తి అనడం-వైస్రాయి ప్రకటనలోలాగా- వీనిలోని పరస్పర వైరుధ్యాన్ని ప్రభుత్వం వివరించలేదు

ఇంత మరొకమారే ఇంతకూ అధినివేశ హోదాఅంటే ఏదో నిర్వచించడం సాధ్యంకాదన్న వాదంకూడ ప్రభుత్వాధికారులు మొదలుపెట్టారు (వెస్టుమినిష్టర్ స్టాచ్యూట్ నిర్వచించినట్లు కనిపించినప్పటికి) ఇండియాబిల్లు ఉపక్రమణికలో అధి నివేశప్రతిపత్తే ఆశయమని చేర్చవలసిందన్న కోర్కెనుగూర్చి లండన్ టైమ్సు 1935 లో వ్రాస్తూ ఇలాఅన్నది.

"ఖచ్చితమైన రాజ్యాంగ చట్టంలో నిర్వచించడానికి 'అధినివేశ ప్రతిపత్తి' వీలైనదికాదు .... 'అధినివేశ ప్రతిపత్తి'కి వివిధ సమయాల్లో విభిన్నమైన అర్థాలు వచ్చాయి. ఇప్పుడు ఆ మాటను అనేక రకాలైన ప్రభుత్వాలకు ఉపయోగిస్తున్నాము. ఇలాంటిదానిని పార్లమెంటుబిల్లులో అందరికి ఒప్పుదలఅయిన మాటలో నిర్వచించ ప్రయత్నించడం నిష్ఫలం."

(టైమ్స్ సంపాదకీయం, జనవరి 25. 1935.)

ఇలా ఉజ్వలంగా మెరుస్తున్న ఆశయం, అగోచరమూ అజ్ఞేయమూ నైనస్థితిలోనికి పోయింది రాజ్యాంగ చట్టరీత్యా. పార్లమెంటరీ బిల్లు పద్ధతిలో వెస్టుమినిస్టర్ చట్టం ఖచ్చితంగా అధినివేశ ప్రతిపత్తి నిర్వచించిన తర్వాత పై మాటలు టైమ్సుపత్రిక వ్రాసింది కాని అలాంటి అధినివేశ హోదా కెనడాకు, ఆస్ట్రేలియాకూ-అంతేకాని భారతదేశానికికాదు.

ఇలా నిర్వచించని, నిర్వచించలేని ఈ అధినివేశ హోదాఅనే ఆదర్శం ఎంత దూరంలో ఉంది? ఆ సంగతెవరికీ తెలీదు. ఇందుకు ఏ తేదీనీ నిర్ణయించలేదు. అయినప్పటికి ప్రముఖ సామ్రాజ్యవాద రాజ్యాంగవేత్తలు, ఈ ఆదర్శం చాల దూరంలో ఉందన్న తమ విశ్వాసాన్నిమటుకు బాగా వెల్లడిచేశారు.

మాజీ ఇండియామంత్రి లార్డు బర్కన్‌హెడ్ 1929 లో ఇలా ప్రకటించాడు:

"భారతదేశం ఎప్పుడు అధినివేశ ప్రతిపత్తిని అందగలుగుతుందో ఏ తెలివిగలవాడూ ఒకవ్యవధి నిర్ణయించిచెప్పలేడు. మీరు ఫలానా అప్పుడు అధినివేశ హోదాను పొందడానికి వీలున్నదని భారత ప్రజలకు చెప్పే హక్కు ఎవరికీలేదు."

(లార్డు బర్కన్‌హెడ్, ప్రభువు సభలో ఉపన్యాసం 1929, నవంబర్ 5)

ఇలాగే బాల్డ్విన్‌కూడా స్పష్టంగా వ్యతిరేకార్థంలోనే చెప్పాడు

"బాధ్యతాయుత ప్రభుత్వం ఎప్పుడు స్థాపింపబడుతుందో ఎవ్వరూ చెప్పలేరు; అదేస్వరూపం పొందుతుందోకూడ ఎవరూ చెప్పలేరు... భారతదేశానికి స్వపరిపాలనాధికారం వచ్చినప్పుడు ఎలాంటి అధినివేశ ప్రతిపత్తి ఉంటుందో ఎవరికీ తెలీదు అలాంటి అధికారం వచ్చే తేదీ సమీపంలో ఉందో, దూరంగా ఉందో కూడ ఎవరికీ తెలీదు"

(స్టాన్లీ బాల్డ్విన్. కామన్సు సభలో 1929 నవంబరు 7)

ఇలాగా ఆ అగోచర ఆశయం, అగోచరభవిష్యత్తులో ఊహించరానంత దూరంలోకి వెళ్ళింది.

1939 లో యుద్ధం ప్రారంభమయినప్పటినుండి. అధినివేశ హోదా లక్ష్యమనే మాట తిరిగీ ముందుకువచ్చింది. స్వతంత్రవాంఛకు మార్గాంతరంగా దీనిని ప్రభుత్వాధికారులు చూపించమొదలెట్టారు 1939 అక్టోబరు 17 తేదీ వైస్రాయి లిన్లిత్‌గో ఇలా ప్రకటించాడు.

"గవర్నర్ జనరల్‌కు ఇచ్చిన విధినిర్వహణ ఉత్తర్వులలో (ఇన్‌స్ట్రుమెంటు ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్స్) చెప్పినట్టుగా, భారత దేశానికి బ్రిటన్‌కూ మధ్య సంబంధం సామ్రాజ్యంలో మరింత సన్నిహితపరచడమే. బ్రిటిషు ప్రభుత్వ ఉద్దేశము, ఆందోళనకూడా. ఆఖరున బ్రిటన్ అధినివేశ మహా దేశాలలో తగిన స్థానాన్ని ఇండియా పొందవచ్చుననే బ్రిటిషు ప్రభుత్వాశయం"

ఆ "తగిన స్థాన" మంటే ఏమిటో చెప్పలేదు. వైస్రాయి ప్రకటన తర్వాత పార్లమెంటుచర్చ జరిగింది అందులో ప్రభుత్వపక్షంగా సర్ సామ్యూల్ హోర్, తమ ఆశయం "1926 నాటి అధినివేశ ప్రతిపత్తి" అని ధ్రువపరిచాడు,

"కొందరనుకుంటున్నట్టుగా రెండురకాల అధినివేశ ప్రతిపత్తులులేవు మేము అనుకుంటున్న అధినివేశ హోదా 1926 నాటిదే"

(సర్ సామ్యూల్ హోరు, కామన్సుసభ 1939 అక్టోబరు 26.)

కాని వెంటనే అతనో క్రొత్త అగోచరభావాన్ని దీనికి తగిలించాడు

"అర్హులని తలంచిన వారికి బహుమానంగా ఇచ్చేదికాదు అధినివేశ హోదాఅంటే, వాస్తవస్థితిలో ఉన్న అంశాలను గుర్తించడమే అధినివేశ ప్రతిపత్తి. ఈ వాస్తవస్థితి భారతదేశంలో ఎంత త్వరగా ఏర్పడితే— అదెంత త్వరగా ఏర్పడితే అంత మంచిదని నా అభిప్రాయం అంతత్వరగా ఈ మన ఆశయం సాధింపబడుతుంది"

ఆమహర్షి సుభాషితంలో ఆంతర్యమేమిటో వాస్తవస్థితిలో అంత అగోచరమైందేమీ కాదు సర్ సామ్యూల్‌హోర్ ఆ ప్రకటన నింకా కొనసాగించాడు. అందులో వాగ్దానాల చీట్లపేకలో సుపరిచితమైన జోకర్ ముక్క కలిసిఉంది :

"ఆ లక్ష్యసాధన మార్గంలో ఇబ్బందులున్నాయంటే అవి మనం చేసినవికావు ఆ పెద్ద భూఖండంలో మతాలకు కులాలకు మధ్య వివిధ విభేదాలు సంప్రదాయ సిద్ధంగా ఉన్నాయి..... బ్రిటిష్ ఇండియా తమపై దొరతనం చలాయిస్తుందని సంస్థానాధిపతులు భయపడుతున్నారు; కేంద్ర ప్రభుత్వంలో హిందువులు అధిక సంఖ్యతో ఉండడానికి ముస్లింలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు; బాధ్యతాయుత ప్రభుత్వమంటే హిందువుల మెజారిటీపై ఆధారపడుతుంది కాబట్టి, నిమ్నజాతులు ఇతర మైనారిటీలు ఇలాంటి ప్రభుత్వంతమ ప్రయోజనాలను నీటగలుపుతుందని నిశ్చయంగా విశ్వసిస్తున్నారు. ఈ ఆందోళనలన్నీ ఇంకా ఉన్నవి. అలాంటివి ఉండకూడదనే నేను కోరుతున్నాను, కాని ఇలాంటివి ఉన్నంతవరకు ఒక నిర్ణీతవ్యవధి నాటికి కేంద్రంలో సంపూర్ణ బాధ్యత నిస్తామని వెంటనే ప్రకటించమనే కోరికను ప్రభుత్వం అంగీకరించడం సాధ్యంకాదు"

అంటే ఈ యెత్తుకూడ మనకు సుపరిచితమైనదే. ఏవిధంగాను నిర్ణీత రూపంలో కాకుండా, ఒక తేదీని నిర్ణయించకుండా ఒకవేపు అధినివేశ హోదా

నిస్తామని చెబుతున్నారు మరొకవేపు ఆ లక్ష్యం అమలుజరగనీకుండా భారత ప్రజలలో "విభేదాల" ను ముందుకు నెట్టుతున్నారు. విషమపరిస్థితినుండి బయట పడేందుకు, స్వతంత్రవాంఛకు ఎదురెత్తు వేయడానికి ఒక పాదికగా ఈ అధినివేశ ప్రతిపత్తి అనే మాటను ఉపయోగిస్తూవచ్చారు; మరి ఆ అధినివేశ హోదా ఇస్తామన్న వాగ్దానంచుట్టూ దిక్కులేనన్ని షరతులను పెట్టి, అసలా ఆశయం ఎప్పటికీ అమలుజరక్కుండా అదో అగోచరసమస్యగా అదెప్పుడు రాగలదో తెలియకుండా చేసివేశారు

ఇలా ఈ విషయంలోమట్టుకు ఇంత అపరిమితమైన అస్పష్టత కనబడుతుంది 1917 నాటి వాగ్దానం అమలుజరపాలన్న సమస్యగాని, "బాధ్యతాయుత ప్రభుత్వం" ఇండియాలో ఏర్పడే సమస్యగాని వచ్చినప్పుడు పై అస్పష్టత కనిపిస్తుంది కాని భారతదేశంలో చెక్కుచెదరకుండా బ్రిటిష్ పాలన మరికొంత కాలం ఉండగలదన్న విషయం చెప్పవలసివచ్చినప్పుడుమట్టుకు పై అస్పష్టతంతా మాయమయిపోయి అతివిశ్వాసంతో దృఢంగా చెప్పడం జరుగుతుంది. ఈ విషయంలో ఏమాత్రం సందేహంలేదు ఈ విషయంలో వారి కంఠస్వరం విశ్వాసంతో హెచ్చుస్థాయిలో వినిపిస్తుంది

బ్రిటిష్ ప్రధానిగా లాయడ్‌జార్జి 1922 లో ఇలా ప్రకటనలో చెప్పాడు. దీనికో ఇనపచట్రం ఉపన్యాసమని ప్రసిద్ధి

"ఏపరిస్థితులలోకాని, బ్రిటన్ భారతదేశంలో తన బాధ్యతను వదులుకోదు. ఇది ఇప్పుడున్న ప్రభుత్వంయొక్క మూలసూత్రమేకాదు. ఈ దేశ ప్రజల విశ్వాసంకల ఏప్రభుత్వానికైన అదే మూలసూత్రం .. ....

"ఈచిన్న బ్రిటిష్ సివిల్‌సర్వీస్‌యొక్క సహాయాన్ని, మార్గదర్శిత్వాన్ని భారతదేశం ఏదశలోకూడ విడిచిపెట్టి ఉండలేదు....ఆసివిల్‌సర్వీస్ ఆ యావత్తునిర్మాణానికీ ఇనుపచట్రం వంటిది."

(లాయడ్‌జార్జి, కామన్సుసభలో, ఆగస్టు 2, 1922) ఇలాగే1930 లో చర్చిల్ ప్రకటించాడు

"భారతదేశ జీవితాన్ని, అభివృద్ధిని వాస్తవంగా పరిశీలించడాన్ని వదులుకోవాలని బ్రిటిష్ దేశానికి ఏవిధమైన ఉద్దేశమూలేదు.

"రాజకిరీటంలోని మహోజ్వలమైన అమూల్యరత్నాన్ని తీసిపారవేయాలన్న ఉద్దేశంమనకులేదు.మిగత అధినివేశాలకన్నా-అధీనదేశాలకన్నా ఎక్కువగా బ్రిటిష్ సామ్రాజ్యశక్తిని, ప్రాభవాన్ని భారతదేశం చాటుతున్నది."

(విన్‌స్టన్‌చర్చిల్, భారత సామ్రాజ్యసమితిలో ఉపన్యాసం డిసెంబరు 11, 1930).

బాల్డ్విన్ ప్రధానమంత్రిగా 1934లో ఇలాగే ఖచ్చితంగా ప్రకటించాడు:

"ఈ విశాల ప్రపంచంలో నేడు జరుగుతున్న మార్పులెన్ని జరిగినా, ఎన్ని మారడానికి అవకాశమున్నప్పటికి, భారతదేశ ఉపఖండాన్ని శాశ్వతంగా మన సామ్రాజ్యంలో ఉంచుకునే సదవకాశం ఉంది అని నేను ఖచ్చితంగా అభిప్రాయపడుతున్నాను."

(స్టాన్లీ బాల్డ్విన్, కన్సర్వేటివ్-యూనియనిస్టు అసోసియేషన్ల నేషనల్ యూనియన్ కేంద్ర కౌన్సిల్‌లో ఉపన్యాసం, డిసెంబర్ 4, 1934.)

ఈ వివరణమూలంగా ఒక నిర్ణయానికి రాక తప్పదు. ఇలా లెక్కలేనన్ని ఉన్న ప్రకటనల్లో ఉన్న ద్వంద్వార్థం వివరించడం అసాధ్యమవుతుంది. భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వస్థాపన విషయంలో అన్ని ప్రకటనలూ ఒకే విధంగా సందేహాలను, అనుమానాలను వెలిబుచ్చుతూ ఖచ్చితంగా ఏమీ చెప్పకుండా వదిలివేస్తున్నాయి. మరి భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని శాశ్వతంగా రక్షించుకోవాలనే విషయంలోమట్టుకు దృఢంగా, అంధవిశ్వాసంతో ఈ ప్రకటనలు వెల్లడిస్తున్నవి. ఇక బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించిన రాజ్యాంగ సంస్కరణలు, ప్రణాళికలు అన్నీకూడ వాస్తవస్థితిలో ప్రతి కీలకస్థానాన్ని బ్రిటిష్‌వారి చేతిలోనే ఒకటి మూడు రక్షణలతో కాపాడుకోవడం జరిగింది. ఇవన్నిటిని చూచినప్పుడు ఆధునికయుగంలో భారతదేశ విషయమై బ్రిటిష్ విధానం నిజస్వరూపాన్నిగూర్చి మనకేమీ సందేహంలేని నిర్ణయానికి రావలసివస్తుంది, ఈ విషయంలో అనుమానాలకుగాని, అనవసర భ్రమలకుగాని, యదార్థాన్ని గుర్తించకుండా గుడ్డిగా ఉండేందుకుగాని ఏ మాత్రం వీలులేదు.

అసలు సామ్రాజ్యవిధానంలో ఏమీ మార్పులేదు ఎత్తుగడల్లో మాత్రమే మార్పులు వచ్చాయి.

ఊహాప్రాయంగా, అనిర్ణీతంగా, అగోచరంగా ఒకతేదీ నిర్ణయంలేకుండా "అధినివేశ హోదా" ఇస్తామనడం వలలోపడవేయ వీలున్న భారత రాజకీయవేత్తలను సహకార విధానంలోకి దింపడానికి వేసిన ఎరమాత్రమేగాని వేరుకాదు. కాని రాజ్యాంగ సంస్కరణల యదార్థస్వరూపం మాత్రం ఇందుకు పూర్తిగా భిన్నమైనదే.

గతయుగంలోలాగే, ఈ యుగంలోకూడ సామ్రాజ్యవాద పెత్తనాన్ని రక్షించుకోవడమే బ్రిటన్ ప్రధానాశయం. సంస్కరణలన్నీ 1917 కు ముందటి సంస్కరణలలాంటివే. క్రమంగా అవి మరింత చిక్కైన షరతులతో బంధింపబడుతూ వచ్చాయి. సామ్రాజ్యవాద వినాశదశ మరింత ఉన్నత స్థాయికి వెడుతూ వచ్చింది. భారతదేశంలో సామ్రాజ్యవాదాన్ని రద్దుచేసి, భారత ప్రజలకు భారత ప్రభుత్వాన్ని అప్పగించివేయాలన్న అభ్యుదయకర ఆదర్శం బ్రిటన్‌కులేదు. కేవలం భారతదేశంలో సామ్రాజ్యాన్ని రక్షించుకోవడం అనే ఆదర్శమే తొలినుంచీ వస్తూఉంది. కాని ఇప్పటి మార్పేమంటే చాలా జాగర్తగా రక్షణలు కల్పించుకొని, భారత ప్రజలను దాస్యంలో ఉంచి సామ్రాజ్యవాదపాలనను, దోపిడీని

కొనసాగించేందుకు భారతీయులలో అల్పసంఖ్యాకులైన ఉన్నతవర్గాల సహకారం తీసుకోవాలని బ్రిటన్ చూస్తున్నది. మహాగొప్పగా పొగుడుతూన్న రాజ్యాంగ సంస్కరణల ప్రధానప్రయోజనం ఇదే. "నూతనదృక్పథం" తో చూడాలంటూ చెప్పేమాటల ఆశయంకూడ ఇదే. 1935 ఇండియాచట్టాన్ని తయారుచేసిన బాల్డ్విన్ మాటల్లో:

"రాజకీయాధికారాన్ని భారత మంత్రులు, శాసనసభలు మనం ఉద్దేశించిన ప్రయోజనాలకోసం చలాయించేట్టు చూడడం అందుకు అవసరమైతే తోడ్పడం మన ప్రైవ్రాయీల, గవర్నర్ల, సివిల్‌సర్వీసు ఉద్యోగులవిధి. సివిల్ ఉద్యోగులను ఇండియామంత్రి ఎన్నుకుంటాడు వారికి పార్లమెంటు రక్షణ ఇస్తుంది"

(స్టాన్లీ బాల్డ్విన్ ఇండియా బిల్లుపై రేడియో ప్రసంగం. ఫిబ్రవరి 5. 1935.)

## 4. 1935 ఇండియా చట్టం

1935 భారతప్రభుత్వ చట్టంలో ఉన్న రాజ్యాంగం, 1937 లో అమలుకు వచ్చింది. మాంటేగూ ప్రకటన తర్వాత ఇరవైయేళ్ళకు ఇది అమలుజరిగింది. ఆధునికయుగంలో సామ్రాజ్యవాదులు తయారుచేసిన మూడో రాజ్యాంగ మిది. మొదటిది మోర్లీ మింటో సంస్కరణలు అనుకుంటే, దీనిని ఏడేళ్ళకుపైగా సాగదీసి పెద్దదిచేశారు. తొలుత సైమన్ కమిషన్ ఏర్పడడంతో దీనికి మొదలు. అప్పుడు బ్రిటన్‌లో వాదోపవాదాలు చెలరేగాయి, ఇండియాలో పోరాటం సాగింది.

ఈ రాజ్యాంగచట్టం దాదాపు స్వపరిపాలనను ఇచ్చివేస్తున్నదని, ఏవో కొన్ని పరివర్తనదశలో అవసరమైన రక్షణలుమాత్రమే ఇందులో ఉన్నవని, కనీసం చాల విశాలమైన స్వపరిపాలన ఇచ్చివేయడం జరిగిందని సామాన్యంగా బ్రిటిషువారంటుంటారు. ఇందుమూలంగా భారతప్రజలందరూ ఏకగ్రీవంగా దీన్ని విరాకరించడం, కాంగ్రెసేకాక భారతదేశ మితవాదులుకూడ విరాకరించడంచూచి ఆశ్చర్యం వెలిబుచ్చుతారు. వలసప్రజల విషయంలో తప్ప మిగతావిషయాలలో మితవాద ప్రజాతంత్రాభిప్రాయం కలిగినవారుకూడ, ఇలా విరాకరించడం సహేతుకంకాదని అంటుంటారు.

అసలీ చట్టంలోని అంశాలను జాగ్రత్తగా పరిశీలిస్తే వీనిని విరాకరించడానికి కారణాలేమో బోధపడతాయి భారతనాయకులు, ఈ రాజ్యాంగంలో ఉన్న అవకాశాలను గుర్తించి, వానిని ఉపయోగించుకొంటూ ముఖ్యంగా రాష్ట్రపాలనకు సంబంధించిన సెక్షన్లను జాతీయోద్యమం పెంపొందించుకునేందుకు ఉపయోగించుకుంటున్నారు, కాని మొత్తంమీద రాజ్యాంగాన్ని తిరస్కరించి, ముఖ్యంగా ఫెడరల్ సెక్షన్లను విరాకరించారు. ఇందులో స్వపరిపాలన ప్రణాళిక వారికి కనిపించడంలేదు. కేవలం భారతదేశంలో సామ్రాజ్యవాదుల పాలనను బలపరు.

కునే ప్రణాళికే వారికి కనిపించింది. ఇందుకు కాంగ్రెసు లేవో చట్టాన్ని పరిశీలిస్తే మనకు స్పష్టమవుతుంది

ఈ రాజ్యాంగ చట్టంలో రెండు ప్రధానమైన భాగాలున్నాయి. కేంద్ర ప్రభుత్వ విషయంలో బ్రిటిష్ ఇండియాకు, సంస్థానాలకు సంబంధించిన అఖిలభారత ఫెడరేషన్ బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్రాలకు సంబంధించిన రాష్ట్రభాగం రాష్ట్రాలకు సంబంధించిన భాగం 1937 లో అమలులోనికి వచ్చింది; ఫెడరేషన్ భాగం అమలులోకే రాలేదు. (ఇప్పుడున్న ప్రభుత్వం కొంతవరకు దానిని బట్టే ఏర్పడినప్పటికి) రాష్ట్రభాగాన్ని అనుసరించి, ఎక్కువ రాష్ట్రాలలో అధికారానికి వచ్చిన కాంగ్రెసు ఫెడరల్ భాగాన్ని అమలు జరగరాదన్నది

ఈ రాజ్యాంగానికి మూలసూత్రం ఫెడరేషనే ఇందులోనే దీని వినాశకత్వమంతా ఉంది; ఇందులోని అభివృద్ధి నిరోధకత్వమంతా ఇందులోనే ఆచ్ఛాదితమై ఉంది.

భారతదేశం రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందాలంటే రాజకీయ ఐక్యత అవసరం. ఈ అంశాన్ని ఏవిధ దృక్పథాలు గలవారూ గుర్తించారు భారతదేశాన్ని ముఖ్యంగా చిన్న చిన్న సంస్థానాలుగా వందలకొలది ముక్కలు అర్థంలేకుండా చేసివేశారు. బొత్తిగా సంబంధంలేని రెండు రకాల పాలక సంస్థల క్రింద భారతదేశ ఐక్యతను చీల్చివేశారు. ఒకభాగంలో 45 వంతులు మరొక భాగంలో 55 వంతుల ప్రాంతం విభజింపబడింది

ఈభాగాల సరిహద్దులను భూగోళరీత్యాకాని, ఆర్థికంగాకాని, తెగనుబట్టిగాని భాషా సాంప్రదాయాలనుబట్టికాని కాకుండా ఏకారణమూలేకుండా ఇష్టంవచ్చినట్టు ఏర్పరచారు. ఇదంతా ఏకాలంలోనో విధ్వంసంకావలసింది. దీని నిలాగే ఉంచడం బ్రిటిష్ పాలనలో అభివృద్ధినిరోధక పద్ధతులను అలాగే కొనసాగించడానికే. సంస్థానాలను కృత్రిమంగా బ్రిటిష్ ఆయుధబలంతో మాత్రమే నిలబెట్టారు ఇలా నిలబెట్టడం భారతప్రజలకు అవసరముండికాదు బ్రిటిష్ పరిపాలనకు అభివృద్ధి నిరోధక సహాయకారులుగా మాత్రమే ఈసంస్థానాలను నిలబెట్టుతున్నారు బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధి మాటలలో ఇవి తగాదాఉన్న ప్రాంతంలోని మిత్రులుంకోటలు."

కాని ఈవిభజనను తొలగించేందుకు ఫెడరల్ ప్రతిపాదనలు ఏమాత్రం ఏర్పడినవికావు. ఈపాతకాలపు నిరంకుశపరిపాలనను తొలగించి, ఎంతోఒకంత ఐక్యసమాన పరిపాలన వ్యవస్థను ఏర్పరచడం దీనిఉద్దేశంకాదు ఈ అభివృద్ధి నిరోధక సంస్థానాల అధికారాన్ని మరింత అధికంచెయ్యడమే ఆ ప్రతిపాదనల ఆశయం పైగా ఆసంస్థానాలను కేంద్రప్రభుత్వం గుండెకాయలోనికి ప్రవేశపెట్టి బ్రిటిష్ఇండియాలో దుర్బలమవుతున్న సామ్రాజ్యవాద పెత్తనాన్ని బలపరుచుకునేందుకు, జాతీయోద్యమానికి ఎదురెత్తు వేయడానికి మాత్రమే ఈఫెడరల్ ప్రతిపాదనలు చేశారు. అజాతీయోద్యమ మొక్కటే వాస్తవమైన జాతీయ ఐక్యతను కోరి అందుకై పోరాడుతున్నది

ఫెడరేషన్ అంటే ఏమిటి? నిజమైన ఫెడరేషనుకైనా సామాన్య సూత్రాలేమిటి? ఈ ప్రశ్నకు సమాధాన మివ్వాలంటే, గొప్ప చారిత్రక నిదర్శనాలైన అమెరికా సంయుక్తరాష్ట్రాల ఫెడరేషన్, స్విస్ రిపబ్లిక్కు, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్‌లను పరిశీలించడం అవసరం.

సర్వసమాన రాజకీయాదర్శాలు, సిద్ధాంతాలు లేక బాహ్యావసరాలు కల స్వతంత్రభాగాలు స్వేచ్ఛగా సర్వస్వతంత్ర కేంద్రప్రభుత్వాన్ని స్థాపించుకునేందుకు చేయడం ఫెడరేషన్ అంటారు. ఆ ఫెడరేషన్ అందులోచేరిన భాగాలపై ఆధారపడి వానికి బాధ్యత వహిస్తుంది. లేక ఆ భాగాలలోని ప్రజలకు బాధ్యత వహిస్తుంది. సంపూర్ణ కేంద్రీకరణ లాగ కాకుండా పరిమితమైన సమిష్టి నిర్మాణాన్ని ఏర్పరుచుకుంటుంది. స్వేచ్ఛాపూర్వకంగా అంగీకరించిన షరతులతో యూనియన్‌లోని పౌరులందరికి ఏకైక సమాఖ్య శాసనాన్ని నిర్మించుకుంటారు.

> ఈ అంశాలతో పోల్చిచూస్తే, ఇండియాలో ఏర్పరుస్తామన్న "ఫెడరేషన్" కేవలం అర్థంలేనిమాట కొన్ని అభివృద్ధి నిరోధక-కీలుబొమ్మలను ఆ నిర్మాణంలోనికి కొనివచ్చి, నిరంకుశ నియంతృత్వాన్ని ఏర్పరిస్తూ దానిని కప్పిపుచ్చేందుకు ఉపయోగించిన భాషా చమత్కారం మాత్రమే ఇది.

ఒకటి సర్వస్వతంత్రహక్కు ఫెడరేషన్‌కులేదు సర్వస్వతంత్రాధికారం ఆఫెడరేషన్‌కు వేరుగానున్న బ్రిటిష్‌ప్రభుత్వం చేతిలోవున్నట్టు స్పష్టంగా ఈచట్టం విధిస్తున్నది. ఆఅధికారం బ్రిటిష్ రాజుది; లండన్‌నుండి నియమింపబడిన బ్రిటిష్ గవర్నర్ జనరల్‌ది. అతను కేవలం బ్రిటిష్‌ప్రభుత్వానికే బాధ్యుడు. వాస్తవస్థితిలో నిరంకుశాధికారం చలాయిస్తుంటాడు. ఇంతేకాక ఈ అధికారం బ్రిటిష్ మంత్రివర్గంలోని ఇండియా మంత్రిది. అతను బ్రిటిష్ పార్లమెంటుకు బాధ్యుడు, ఆఖరు అంతిమ సర్వస్వతంత్రాధికారం బ్రిటిష్ పార్లమెంటుది ఫెడరేషన్‌లోగాని ఫెడరేషన్‌లోచేరిన సభ్యప్రాంతాలలోగాని సర్వస్వతంత్ర హక్కు ఉండదు. మరొకవిధంగా చెప్పవలసివస్తే, ఇది ఫెడరేషన్‌కాదు. కేవలం నిరంకుశ రాక్షస పాలనను సాగించేందుకు ఒక విధమైన పాలనాపద్ధతి; ఒకపన్నుగడ.

రెండు: స్వతంత్రప్రాంతాలు స్వేచ్ఛాపూర్వకంగా చేరిన యూనియన్ కాదిది. బ్రిటిష్ ఏజంట్లుగా, బ్రిటిష్ అభిప్రాయాలను వెలువరించే చిలుకలుగా సంస్థానాధిపతులున్నప్పటికి, వారు ఈఫెడరేషన్‌లో వారికిష్టమైతేనే చేరాలిఅని కుటిలరాజనీతి నుపయోగించి చెప్పారు. (కాని ఈసంస్థానాలలోని 9 కోట్ల ప్రజల కిందులో ఏమాత్రం భాగంలేదు వారి అభిప్రాయం తెలుసుకునేదిలేదు.) మరి బ్రిటిష్ రాష్ట్రాలు-ఇవే ఫెడరేషన్‌లో మూడువంతులు-మాత్రం తప్పక బ్రిటిష్ ప్రభుత్వం విధించిన చట్టంప్రకారం చేరితీరవలసిందే-వీరు స్వేచ్ఛాపూర్వకంగా చేరాలన్నమాటలేదు.

మూడు: అన్నిటికన్నా చిత్రమైన అంశమేమంటే ఏవిధమైన "ఫెడరేషన్" లోగాని ఉండవలసిన ఫెడరల్ శాసనం లేదు, శాసన నిర్మాణం లేదు, ఫెడరేషన్ మొత్తంమీద స్థాపించే పరిపాలనావ్యవస్థ ఉండదు. ఫెడరేషన్ పౌరుల ప్రాథమిక హక్కుల ప్రకటనలేదు. సంస్థాన ప్రజలకు ఏ హక్కులేదు. ఫెడరేషన్ ఏర్పడినా వారిస్థితిలో మార్పుండదు కాని నిరంకుశ ప్రభువులు మట్టుకు ఫెడరల్ శాసనసభలో పాల్గొని కొద్ది వోటింగుహక్కుగల బ్రిటిష్ ఇండియా పౌరులకు శాసనాలు చేస్తారు ఫెడరల్ శాసనసభ ఫెడరేషన్ కంతటికి చట్టాలు చేయదు. కేవలం అందులోని ఒకభాగమైన బ్రిటిష్ ఇండియాకు మాత్రమే చట్టాలు చేస్తుంది. అసలు ఫెడరేషన్ అనేందుకే విరుద్ధమైన ఇలాంటిదెక్కడైనా ఎప్పుడైనా ఉందా? ఈ "ఫెడరేషన్" అనబడే దానివల్ల యావద్భారత దేశం ఐక్యంకావడం లేదు. పైగా కొత్త అభివృద్ధినిరోధకశక్తులను బ్రిటిష్ ఇండియాలో నికి తేవడం మాత్రమే జరుగుతుంది.

కాబట్టి మొట్టమొదట ఈ ఫెడరేషన్ సమస్య భారతరాజకీయైక్యతసమస్యకు సంబంధించింది కాదని అర్థంచేసుకోవడం అవసరం. ఆ రాజకీయైక్యత అవసరం, అవసరమని అందరూ గుర్తించారుకూడ, అది ఏర్పడినప్పుడు వాస్తవమైన రాజకీయ సమాఖ్య ఏర్పడుతుంది. ఈ రాజ్యాంగ చట్టంలో "ఫెడరేషన్" అనబడేదిమాత్రం ప్రజాతంత్రవ్యతిరేకమైన పన్నాగం ఇప్పుడున్న రాజకీయవిభజన్ అలానే ఉంచి, నిరంకుశ సంస్థానప్రభుత్వాల నలానే ఉంచుతుంది. పైగా ఏదో పరిమితమైన సగం ప్రజాస్వామిక సంస్థలు సాధించినట్టి జాతీయోద్యమం ఉన్నత స్థాయిలో ఉన్నది. భారత దేశవిభాగంలోనికికూడ నూతన అభివృద్ధి నిరోధకశక్తులను ప్రవేశపెట్టడమే దీని ఉద్దేశం.

ఇందువల్ల ఈ "ఫెడరేషన్" అంటే — బ్రిటిష్ యజమానులకు తప్ప ఎవరికీ బాధ్యులు కాని నిరంకుశ ప్రభువులకు 27 కోట్ల ప్రజలున్న బ్రిటిష్ ఇండియాకు శాసనాలు చేసే అధికారమివ్వడానికై చేసిన ప్రణాళిక అని చెప్పవచ్చు. ఇక మీద ఫెడరేషన్"అని ఈ రాజ్యాంగ చట్టం విమర్శించేప్పుడు ఉపయోగించినా. అందుకు కాంగ్రెస్ వ్యతిరేకించిన విషయం చెప్పినా ఈ విషయాన్ని జ్ఞాపముంచుకోవాలి.

అభివృద్ధి నిరోధక శక్తులను బ్రిటిష్ ఇండియాలో బలపరచడమే దీని ప్రయోజనమన్న సంగతి, ఫెడరల్ శాసనసభలు రెండింటిలోను సంస్థాధిపతులకు ప్రత్యేకించి ఇచ్చిన ప్రాతినిధ్యం, అందులో చూపిన ఆధిక్యత చూస్తే బోధపడుతుంది.

ఫెడరల్ శాసనసభలు రెండు ఉంటాయి. పై సభ లేక స్టేట్‌కౌన్సిల్ అంటారు. క్రింది సభ లేక ఫెడరల్ అసెంబ్లీ అంటారు. ఈ రెంటిలోను సంస్థానాధిపతులకు ప్రాతినిధ్యం ఉంటుంది, అంతేకాక ఎక్కువ ప్రాతినిధ్యం — సంస్థానాల వైశాల్యానికంటె చాల ఎక్కువ — కూడ ఏర్పరచారు.

స్టేట్ కౌన్సిల్ 260 స్థానాలకు వీరికి 104 స్థానాలు ప్రత్యేకించారు. అంటే అయిదింట రెండు వంతులు

ఫెడరల్ అసెంబ్లీలో 375 స్థానాలకు. సంస్థానాధిపతులకు 125 స్థానాలు అంటే మూడోవంతు ప్రత్యేకించారు.

యావద్భారత జనసంఖ్యలో సంస్థానాల జనాభా దామాషా నూటికి 24 వంతులు — లేక నాలుగోవంతు.

ఇక ఆర్థిక ప్రాతిపదికమీద ఆలోచిస్తే ఈ దామాషా మరింత అర్థంలేనిదిగా కనిపిస్తుంది; ఫెడరల్ ప్రభుత్వం ఆదాయంలో నూటికి 90 వంతులు బ్రిటిష్ ఇండియానుండి లాగుతారు. కేవలం 10 వంతులుమాత్రమే సంస్థానాలనుండి వస్తుంది. అయినప్పటికి సంస్థానాధిపతులకు స్టేట్ కవున్సిల్లో అయిదింట రెండు వంతుల ప్రాతినిధ్యం, అసెంబ్లీలో మూడోవంతు ప్రాతినిధ్యం ఏర్పరిచారు

ఇలా ఈ ప్రాతినిధ్యవ్యవస్థ ప్రారంభంలోనే విచ్ఛిన్నం చేయబడింది. ఎవరికీ ప్రతినిధులుకాని, ఎన్నుకోబడని అభివృద్ధినిరోధక వర్గాన్ని, రెండు శాసనసభల్లోనూ పాతవుద్యోగవర్గం స్థానే ప్రవేశపెట్టడంతో "ప్రతినిధిసంస్థ" గాలిలో కలిసిపోయింది పాత మాంటేగూ చెమ్స్‌ఫర్డు రాజ్యాంగచట్టంలోకన్నా ఎక్కువగా ఉద్యోగవర్గంకన్న అభివృద్ధి నిరోధకమైన వర్గం ఇప్పుడు ఏర్పడింది. (ముందటి ఢిల్లీ అసెంబ్లీలో 145 సభ్యులు— అందులో ఎన్నుకోబడని ఉద్యోగుల సంఖ్య 40 — నాలుగోవంతుకన్న కొంచె మెక్కువ )

ఈ పవిత్ర శాసనసభల "అధికారాల" విషయం ఇంకా మనం చూడలేదు. ఈ చట్టంలో ఇచ్చామన్న "బాధ్యతాయుత" ప్రభుత్వంలోని మిగిలిన ఆకాస్త లవలేశమూ—ఆ సంగతిచూస్తే మాయమైపోతుంది.

ఒక మంత్రివర్గాన్ని గవర్నర్ జనరల్ నియమిస్తాడు ఆ మంత్రులు అతనికే బాధ్యులుగా ఉంటారు. కాని వారి శక్తిసామర్థ్యాలు చాల పరిమితమైనవి. నాలుగుశాఖల్లు - రక్షణ, విదేశాంగ, మత, ప్రత్యేక ప్రాంతాలశాఖలు - గవర్నర్ జనరల్ క్రింద ఉంటాయి మిగతశాఖల వ్యవహారాలు చూచేందుకు ప్రత్యేకోద్యోగులను నియమిస్తారు-ఆర్థిక విషయాలు, అప్పులు చూడుకునేందుకు ఆర్థికసలహాదారు; చట్ట వ్యవహారాలకు అడ్వొకేట్ జనరల్; మిగతావారిని ఫెడరల్ బాంకు, రైల్వేలు మొదలైనవానికి నియమిస్తారు. సివిల్‌సర్విస్, పోలీసు కేవలం బ్రిటిష్ ప్రభుత్వపు ఇండియామంత్రే నియమిస్తాడు. బ్రిటిషు ప్రభుత్వం చట్టాల ధిక్కారణ, బ్రిటిషు ఆర్థిక ప్రయోజనాలకు నష్టకరమైన చర్యలు ఇలాంటివానికి ఆస్కారంలేకుండా దిక్కులేనన్ని ప్రత్యేక రక్షణలున్నాయి, మైనారిటీల హక్కులు. సంస్థానాల హక్కులు ఇవన్నీ ప్రత్యేకమైనవిగా ఉంటాయి. వానిని ఫెడరల్ ప్రభుత్వం అంటడానికి వీల్లేదు. వీటన్నిటిమీదా గవర్నర్ జనరల్ సర్వాధికారాలు కలిగి

ఉంటాడు. ఇక మంత్రుల అధికారంలో ఏవి మిగిలాయో నిశ్చయించడం కష్టం. బహుశా ఆ మంత్రులకు, పోస్టాఫీసులు సమర్థంగా నడుస్తున్నాయా అని తనిఖీ చేయడానికి స్వతంత్రం ఉండవచ్చు.

మంత్రులు శాసన సభకు బాధ్యులుగా ఉండాలన్న సంగతి చట్టంలో చెప్ప లేదు. వారి జీతాలగూర్చి శాసన సభలో వోటుతీసుకో వీల్లేదు శాసనసభలో తమపై విశ్వాస రాహిత్య తీర్మానం ఆమోదింపబడినా ఆమంత్రులు రాజీనామా ఇవ్వనవస రంలేదు. గవర్నర్ జనరల్‌కు ఇచ్చిన నిబంధనావళిలో మాత్రమే మంత్రులను శాసన సభలో తగినంత మైనారిటీ ఉన్నవారినిగా చూచి నియమించాలని సిఫారసు చేశారు, కాని వారితోపాటు సంస్థాన ప్రతినిధులను, అల్పసంఖ్యాక ప్రతినిధులను కూడ చేర్చుకోవాలని అందులోఉంది

శాసనసభ అధికారాలేమిటి? ప్రతినిధి సంస్థ పాలన అంటే ప్రధానంగా ఆర్థిక వ్యవహారాలు వారిచేత ఉండాలి ఈ ఆర్థిక వ్యవహారాలలో ఆ సభ అధికారా లేవి?

బడ్జెట్ (ప్రభుత్వ ఆదాయ వ్యయపట్టిక)ను రెండు భాగాలుచేశారు. (1) "ఫెడరేషన్ ఆదాయంలో పెట్టేఖర్చులు" (2) ఇతర ఖర్చులు మొదటి తరగతిలో పెద్ద పెద్ద ఖర్చు పద్దులన్నీ — రక్షణవ్యయం అప్పులకు వడ్డీలు, పెద్ద ఉద్యోగుల జీతాలు, పెన్షన్లు వగైరాలు — చేర్చారు ఈ ఖర్చులగూర్చి శాసనసభ వోటు తీసు కోరాదు. ఇలా వోటు చేయవీలులేని మొత్తాలు, మొత్తం ఖర్చులో నాలుగింట మూడు వంతులనుండి, అయిదింట నాల్గు వంతులుంటాయి; ఈ మొత్తం నూటికి 75 వంతులుంటుందని "భారతపాలన" అనే పుస్తకంలో ప్రొఫెసర్ జి. యన్. జోషీ అంచనావేశాడు; ఎనభై వంతులుంటుందని కాంగ్రెసు అంచనావేసింది. ఏ ఖర్చుపద్దుకాని, ఈ "వోటుచేయవీలులేని" భాగంలో చేరుతుందని గవర్నర్‌జనరల్ స్వంతవిచక్షణతో నిర్ణయించవచ్చును.

ఇకమిగిలిన 20, లేక నూటికి 25 వంతుల చిల్లరఖర్చులగూర్చి శాసనసభ తన అభిప్రాయం ప్రకటించవచ్చును. అయినా అది అభిప్రాయంమాత్రమే! ఈ చిల్లర ఖర్చుల విషయంలోకూడ శాసనసభకు పెత్తనంలేదు. ఏఆర్థికబిల్లుకాని, ప్రతిపాదనకాని మొదట గవర్నర్‌జనరల్ సిఫారసుపొందితేతప్ప, శాసనసభలో ప్రవేశపెట్టవీలులేదు ఒకవేళ ఏఖర్చుపద్దునైనా శాసనసభ నిరాకరించినా, తగ్గించినా ఈపద్దు తన ప్రత్యేకబాధ్యతల నిర్వహణకు అవసరమని గవర్నర్ జనరల్ ప్రక టించవచ్చు: శాసనసభ వద్దన్నా దానిని ఖర్చుపెట్టడానికి ఆజ్ఞాపించవచ్చు కాబట్టి ఏప్రతినిధి సంస్థకైనా మొట్టమొదట సామాన్య అంశమైన ఆర్థికఅధికారం ఇందులో పూర్తిగా మాయమయింది.

ప్రతినిధిసంస్థ పాలనకు రెండో ముఖ్యవిషయమేమంటే మిలిటరీ, ఉద్యోగ వర్గాలపై ప్రభుత్వానికి పెత్తనం ఉండాలి.

రక్షణశాఖను శాసనసభ అధికారాలనుండి వేరుచేశారు. సివిల్ సర్వీస్, పోలీసుఉద్యోగులను బ్రిటిష్ఇండియామంత్రి నియమిస్తాడు ఈఉద్యోగుల హక్కులకు ఉద్యోగషరతులకు ప్రత్యేకాధికారాలక్రింద రక్షణ కల్పించారు. పోలీసు 'రూల్సు' (నిబంధనలు గవర్నర్ జనరల్ చేతిలో ఉంటాయి. అతనే రహస్య పోలీసుశాఖపై సంపూర్ణాధికారి)

మూడో ముఖ్యాంశం శాసననిర్మాణం: శాసనాలు చెయ్యడం, బిల్లులు నిరాకరించడం శాసనసభ చేతిలో ఉండాలి.

శాసనసభ చట్టాలేమో చేయవచ్చు అవి ప్రభుత్వానుమతితో కొన్ని పరిమితవిషయాలపై మాత్రమే చేయాలి ఈ విషయాలనుమాత్రం ప్రత్యేక నిబంధనల జాబితాతో సంకుచితపరచివేశారు. ముందుగా గవర్నర్ జనరల్ ఆమోదం పొందితే తప్ప ఆర్థికవిషయాలను ఈ సభ చర్చించడానికూడ వీలులేదు; బ్రిటిషు అధికారపు పునాదులకు సంబంధించిన శాసనాలుగాని, మిలిటరీ సమస్యలుగాని, సివిల్ సర్వీస్ హక్కులుగాని, సంస్థానాలగూర్చిగాని, మైనారిటీలగూర్చిగాని, బ్రిటిష్ ఆర్థికప్రయోజనాలకు దెబ్బతీసే శాసనాలుగాని ఈ సభ చర్చించ వీలులేదు. ఈ క్రింది అంశాలపై ప్రత్యేకించి ఏశాసనాన్నిగాని, ఫెడరల్ అసెంబ్లీ ఆమోదించ వీలులేదు.

1. ఇంగ్లాండులో నివసించే బ్రిటిష్పౌరులు బ్రిటిష్ ఇండియాలో ప్రవేశించేందుకు, సంచారం చేసేందుకు, ఇళ్ళు కట్టుకునేందుకు, ఆస్తులు సంపాదించుకునేందుకు లేదా అమ్మివేసుకునేందుకు, ఉద్యోగాలు చేసుకునేందుకు, ఏవిధమైన వృత్తిగాని, వ్యాపారంగాని, ఉద్యోగంకాని చేసుకునేందుకు ఆటంకపరిచే అంశాలు;

2 భారతదేశంలో పన్నులువేసేప్పుడు, బ్రిటిష్ పౌరులపైన, ఇంగ్లాండులో రిజిస్టరైన కంపెనీలపైన వివక్షతచూపే అంశాలు;

3. ఇంగ్లాండులో రిజిస్టరైన నౌకలపైన, నావికులపైన, ప్రయాణీకులపైన సరుకులు వగైరాలపైన వివక్షతచూపే శాసనాలు,

4. బ్రిటిష్ చట్టప్రకారం రిజిస్టరై ఇండియాలో వ్యాపారం సాగిస్తున్న కంపెనీలపైన, ఫెడరేషన్ ఆదాయంలోనుండి ఇవ్వవలసిన గ్రాంటులు, సబ్సిడీలు వగైరాలలో భేదంచూపించే శాసనాలు - ఇవేవీ శాసనసభ చేయరాదు.

ఈ షరతులన్నీ భారత పరిశ్రమలకు, వ్యాపారానికి, నౌకలకు ఏ మాత్రం ప్రత్యేక విరాళాలివ్వడానికి, వానిని అభివృద్ధి పరుచుకునేందుకు వీలులేకుండా చేస్తున్నవి వీని కివ్వాలంటే అలాంటి సౌకర్యాలే బ్రిటిష్ వ్యాపార, పరిశ్రమ సంస్థలకూడా ఇండియాలో సౌకర్యాలివ్వాలి. (బ్రిటన్లో బ్రిటిష్ ప్రభుత్వం తమ పరిశ్రమలకు, వ్యాపారానికి, నౌకలకు ఇచ్చేలాంటి రక్షణలు, ఇండియాలో

ఇండియా ప్రభుత్వం తన పరిశ్రమాదులకు ఇవ్వ వీలులేదు ) వీనినిచూస్తే ఇండియాలో బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడి ప్రయోజనాల రక్షణలను ఎంత భద్రంగా ఏర్పాటు చేసుకోవాలని బ్రిటన్ ఆదుర్దా పడుతున్నదో బయల్పడుతుంది

ఇక మిగిలిన విషయాలలోకూడ, శాసనసభకు సంపూర్ణాధికారం లేదు. ప్రభుత్వానికిష్టంలేని ఏ బిల్లునైనా శాసనసభ ఆమోదించినట్టయితే పరిపూర్ణంగా అభివృద్ధినిరోధకమైన స్టేట్ కౌన్సిలుకూడ ఆ బిల్లును ఆమోదించిందనుకుంటే అప్పటికూ్కడ గవర్నర్ జనరల్ ఆ బిల్లును అసలే "ఆపి"వేయవచ్చును. అలాగే దానిని పునర్విమర్శకని కొన్నాళ్ళు "నిలిపి" వేయవచ్చును ఇలా అతను 12 నెలల వరకు తన ఆమోదం తెలపకుండా ఆపుతూవస్తే ఆ బిల్లు ఇకవదలివేయవలసిందే. ఒకవేళ అతను తన ఆమోదం తెల్పినా, తర్వాత మనసుమార్చుకుంటే అప్పుడు కూడ దానిని "త్రోసి"వేయవచ్చును. అదింక పనికిరాకుండా పోతుంది.

ఇదేకాక, ప్రభుత్వం అవసరమనుకన్న చట్టాన్ని శాసనసభ ఆమోదించక పోతే, అప్పుడు గవర్నర్ జనరల్ దానిని "గవర్నర్ జనరల్ చట్టం" అని ఆమోదించవచ్చును అదికూడ సామాన్యచట్టాలలాగే అమలు జరుగుతుంది. ఇంతేకాక అప్పుడప్పుడు ఒకొకతూరి ఆరునెలలవరకు అమలుజరిగే అసాధారణ శాసనాలను (ఆర్డినెన్సులు) చేయవచ్చును.

ఈ "శాసనసభ" "అధికారా" లిలా ఉన్నాయి. ఇలాంటి దానిని ఎన్నుకోవడంలో చూపిన అత్యంత శ్రద్ధ అనవసరంగా కనిపిస్తుంది.

ఇంతకూ సామ్రాజ్యవాద అధికారులు తీసుకొన్న జాగ్రత్తలు ఏమాత్రం పూర్తికాలేదు. ఈవిధాన కవాటాలకు తగిలించిన గట్టితాళాలసందులనుండి స్వపరిపాలన అవకాశాన్ని ఏ కొంచెంసూచించే గుసగుసలుకూడ వినబడరాదని ఆ అధికారులు ముబ్బడిరక్షణలు కల్పించుకోజూచారు, ఇంకా ప్రత్యేకాధికారాలు, "రక్షణలు" అవే వాని ప్రాభవాన్ని మనం పరిశీలించనేలేదు,

శాసనసభల "అధికారాలనుండి, మనం గవర్నజనరల్ అధికారాలవేపు చూడామంటే చిమ్మచీకటిలోనుండి పట్టపగటివేళలోకి వెళ్ళినట్టుగా ఉంటుంది.

తొంభైనాలుగు సెక్షన్లు గవర్నర్ జనరల్‌కు ప్రత్యేక విచక్షణాధికారాలను అప్పగిస్తున్నవి. ఇందుమూలంగా తన విచక్షణను ఉపయోగించి గవర్నరుజనరల్ ఈ క్రింది పనులు చేయవచ్చును. (మంత్రుల సలహాగాని ప్రతినిధిసంస్థల అభిప్రాయంగాని తెలుసుకోకుండానే).

1. మంత్రులను నియమించవచ్చు, బర్తరఫ్ చేయవచ్చు.
2 శాసనసభలు ఆమోదించిన చట్టాలను నిరాకరించవచ్చు.
3 శాసనసభలో నిరాకరించిన చట్టాలను ఆమోదించవచ్చు.
4. ఏ చట్టమైనా చర్చించరాదని నిషేధించవచ్చు.
5. ఆర్డినెన్సులు జారీచేయవచ్చు.

6. గవర్నర్లను ఆర్డినెన్సులు జారీచేయమని ఉత్తర్వుచేయవచ్చు.
7. రాష్ట్ర శాసనసభలు చేసిన చట్టాలను నిరాకరించవచ్చు
8. పోలీసులకు నిబంధనావళిని జారీ చేయవచ్చు.
9. సేనల ఉపయోగాన్ని కంట్రోలు చేయవచ్చు
10. శాసనసభలను రద్దుచేయవచ్చు
11. రాజ్యాంగచట్టాన్ని తాత్కాలికంగా రద్దుచేయవచ్చు.

అతని విచక్షణాధికారాలలో కొన్ని మాత్రమే ఇవి.

వీనితోపాటు "రిజర్వుడు" (అతని స్వయం నిర్ణయంక్రిందివి) అధికారాలున్నవి ఈ స్వంతశాఖలుగా గవర్నర్ జనరల్‌చేతిలో మిలిటరీ, విదేశాంగ, మత, ప్రత్యేకప్రాంతాల శాఖలున్నవి.

ఆఖరున ప్రత్యేకాధికారాలు, బాధ్యతలు వేరే ఉన్నవి. ఏమైనా వీనిలో లోపముంటుందేమోనని ఊహించుకుని, అందుకుకూడ అవకాశం లేకుండా ఈ అధికారాలను, బాధ్యతలను ఏర్పరచారు. గవర్నరు జనరల్‌కు ఎనిమిది ప్రత్యేక బాధ్యతలున్నవి. ఈ బాధ్యతలను నెరవేర్చేందుకు, అవసరమని తాను తలచిన చర్యలన్నిటినీ గవర్నర్ జనరల్ తీసుకోవచ్చు. ఈ "ప్రత్యేక బాధ్యతల" (సామాన్యంగా వీనిని రక్షణలు అంటుంటారు కాని వాస్తవస్థితిలో ఇవి చట్టంలోని భాగాలుగానే అయిపోయ్యాయి ) లో ఈ క్రిందివన్నీ వస్తాయి.

1. "భారతదేశంయొక్కగాని, అందులోని ఒకభాగం యొక్కగాని శాంతిభద్రతలకు తీవ్ర ప్రమాద మేర్పడితే నిరోధించడం;

2. "ఫెడరల్ ప్రభుత్వంయొక్క ఆర్థికస్థాయిని, పరపతిని రక్షించడం;"

3 "మైనారిటీల న్యాయమైన హక్కులరక్షణ;

4. ప్రభుత్వోద్యోగవర్గంలోని సభ్యులయొక్క, మాజీ సభ్యుల యొక్క, వారి సంతానంయొక్క "న్యాయమైన ప్రయోజనాల, హక్కుల రక్షణ;"

5. ఇంగ్లాండులో రిజిష్టరైనవికాని, ఇండియాలో రిజిస్టరైనవికానీ ఇండియాలో పనిచేస్తున్న బ్రిటిష్ కంపెనీలకు, వ్యక్తులకు వ్యతిరేకంగా చూపే విభేదాలను అరికట్టడం,

6. ఇండియాలోనికి దిగుమతి అయ్యే బ్రిటిష్ వస్తువులకు వ్యతిరేకంగా పక్షపాతం చూపకుండా అరికట్టడం;

7. సంస్థానాల, సంస్థానాధిపతుల హక్కులరక్షణ;

8. ఇవన్నీకాక సర్వవ్యాప్తమైన మరో ఆఖరు రక్షణ ఇలాఉంది. "ఈ చట్టంలో గవర్నర్ స్వంత విచక్షణక్రింద నిర్వర్తించవలెనని నిర్ణ

యించిన అంశాల నిర్వహణకోసం, ఇతర విషయాలలో ఏవిధమైన చర్య తీసుకున్నప్పటికి అది భంగకరంకాదు. ఈయన ప్రత్యేక హక్కులను అరికట్టదు

బ్రిటిష్ బ్యాంకుల పెట్టుబడి ప్రత్యక్ష ప్రయోజనాలు, వ్యాపారం, ఇండియాలో పనిచేస్తున్నకంపెనీలు, పెట్టుబడి, అప్పు, రైల్వేలు, బ్యాంకింగు వగైరాలకు ప్రత్యేకించి రక్షణలు కల్పించే ప్రత్యేక సెక్షన్లు (ఇ. చాల పొడుగైనవికూడ) లేక ప్రత్యేక స్వతంత్ర అధికారులక్రింద ఆ శాఖలనుంచే సెక్షన్లు పరిశీలించాలంటే సామాన్యంగా ఈ చట్టం స్వరూపం మొత్తంగా తెలుసుకోవాలనేవారికి చాల దీర్ఘమై పోతుంది.

కాని, ఈ రాజ్యాంగ చట్టమంతా ఇండియాలో బ్రిటిష్ పెట్టుబడిదారుల దోపిడీని యధాప్రకారం కాపాడుకునేందుకు తయారుచేసిన వ్యవస్థేనని, ఈ విషయాన్ని వాస్తవరూపంలో ఈ సెక్షన్లు బయలుపరుస్తాయనిమాత్రం చెప్పి వదిలి వేస్తాను.

ఆ రాజ్యాంగంలోని రాష్ట్రాలకు సంబంధించిన సెక్షన్లు, కేంద్రంలోని అభివృద్ధినిరోధకమైన, కొంచెం యించుమించుగా నిరంకుశమైన ప్రభుత్వానికి అధీనమైనవే. పై కేంద్రంలోని ప్రభుత్వ వ్యవస్థలాంటిదే రాష్ట్రంలోకూడ సామాన్యంగా ఏర్పరచారు. కాని కొద్దిగా మార్పులు చేశారు. రాష్ట్రాలలో గవర్నరుకు కేంద్రంలోలాగే అసాధారణ అధికారాలున్నాయి శాసనసభ చేసిన తీర్మానాన్ని నిరాకరించవచ్చు; నిరాకరించిన తీర్మానాన్ని ఆమోదించవచ్చు. పోలీసు, శాంతి భద్రతలు, ఆర్థికస్థితి ఇతనిక్రిందనే ఉంటాయి. ఇవికాక ఇతనికొక ఏడు ప్రత్యేక బాధ్యతలుకూడ ఉన్నవి. కేంద్రంలోలాగే రాష్ట్రశాసనసభలనుకూడ మతప్రాతిపదికపై ఏర్పరచారు. ఇంతకుముందు ఏ రాష్ట్రంలోకూడాలేని ఉన్నత శాసనసభలు, ముఖ్యమైన బెంగాలు, బొంబాయి, మదరాసు, యు. పి., బీహారు రాష్ట్రాలలో బలవంతంగా రుద్దారు.

అయినప్పటికి కేంద్రంలోకన్నా రాష్ట్రాలలో ఏర్పాటు అంత నిర్బంధ పూరితమైనదికాదు. కొంతవరకు ప్రజాఉద్యమానికి వీలుచేకూరుస్తుందికూడ. అందుకి క్రిందివి కారణాలు :

ఒకటి : రాష్ట్రాలలో సంస్థానాధిపతుల సంపర్కంలేదు. పై సభలు అభివృద్ధి విరోధకంగా, చాల సంకుచితమైన వోటింగుపై ఎన్నుకోబడినప్పటికి, శాసనసభలు పూర్తిగా ఎన్నుకోబడినవి. అదికూడ ప్రత్యక్షంగా ఎన్నిక జరుగుతుంది.

రెండు . కేంద్రంలోలాగా రిజర్వుడు శాఖలులేవు— పోలీసు గురించిమాత్రం ప్రత్యేకం కొన్ని నిబంధనలున్నాయి. పోలీసు నిబంధనలు గవర్నర్ వ్యక్తిగతంగా కంట్రోలు చేస్తాడు; సి. ఐ. డి. శాఖ పూర్తిగా ప్రత్యేక చట్టాలతో ఏర్పడుతుంది. వారి రికార్డులుకూడ భారత మంత్రులకు అందుబాటులో ఉండవు; "చట్ట ప్రకారం

స్థాపింపబడిన ప్రభుత్వాన్ని తొలగించడానికి" ప్రారంభించిన ఉద్యమాన్ని అణచి వేయడానికి, "రాష్ట్రంయొక్క శాంతి భద్రతలకు భంగంకలుగుతుందని" ఆ గవర్నర్ భావిస్తే తనకు నచ్చినరీతిగా : ప్రభుత్వ వ్యవహారాలన్నీ స్వంత అధికారం లోకి తీసుకోవచ్చు. ఇలాంటి తీవ్రపరిమితి. నిర్బంధాలు ఉన్నప్పటికి, రాష్ట్రమంత్రి వర్గం పరిపాలనను సమిష్టిగా చూచుకోవచ్చు. కొంతవరకు సమిష్టి బాధ్యతను ఏర్పరుచుకోవచ్చు.

మూడు : శాసననిర్మాణ విషయంలో, కేంద్రంలో ఉన్నన్ని నిర్బంధాలు, నియమాలు రాష్ట్రాలలో లేవు , అంటే శాసననిర్మాణాధికారం విశాలమై కాదు, అవి సంకుచితం కాబట్టే ఈ ఏర్పాటు : బ్రిటిషు ప్రత్యేక ప్రయోజనాలకు ఆర్థిక పెత్తనానికి సంబంధించిన అఖిలభారత స్వభావం కల ప్రధానసమస్యలన్నీ రాష్ట్రాలలో అసలే ఉదయించవు.

కాబట్టి ఈ సంకుచిత పరిమితిలో ప్రజాతంత్రవర్గాలు పరిపాలకపాత్రను నిర్వహించ వీలులేదు కాని, పరిమితంగా రాష్ట్రాలలో ఉపయోగకరమైన పాత్రను నిర్వహించవచ్చును.

రాష్ట్ర శాసనసభల వోటర్ల సంఖ్య బ్రిటిషుఇండియాలో ఉన్న పదకొండు రాష్ట్రాలలోను మూడుకోట్లు, పదిలక్షలు అంటే — మొత్తం జనసంఖ్యలో నూటికి 11 వంతులు (దాదాపు మూడువంతులు మాత్రమే (2.8%) మాంటేగూ ఛెమ్సుఫర్డు రాజ్యాంగచట్టం ప్రకారం). బ్రిటన్‌లో జనాభాలో నూటికి 67 గురికి ఓటింగు హక్కుంది. ఓటరు యోగ్యత ముఖ్యంగా ఆస్తి, పన్ను చెల్లించడం, కొంత పన్నుకట్టే కౌలుభూమి ఇలాంటివానిమీదే ఆధారపడుతుంది. ఇందుకుతోడు చదువు రావడంకూడ వోటుకు యోగ్యతగా నిర్ణయించారు. స్త్రీఓటర్ల సంఖ్య 43 లక్షలు, 1937 ఎన్నికలలో, పోటీ జరిగిన నియోజకవర్గాలలో పోలైన ఓట్ల సంఖ్య కోటి యాభై అయిదు లక్షలు — అంటే ఆ నియోజకవర్గాలలోని వోటర్లలో నూటికి 55 గురు పాల్గొన్నారన్నమాట

పదకొండు రాష్ట్ర శాసనసభల్లో (మొత్తం 1,585 స్థానాలు) ఈ విధంగా ఉన్నాయి.

| | |
|---|---|
| సామాన్య నియోజక స్థానాలు (వీటికి ఎవరైనా పోటీచేయువచ్చు) | 657 |
| ముస్లింలు | 482 |
| నిమ్నజాతులు | 151 |
| వాణిజ్య - పరిశ్రమలు | 56 |
| స్త్రీలు | 41 |
| కార్మికులు | 38 |
| భూస్వాములు | 37 |
| సిక్కులు | 34 |

| | |
|---|---|
| యురపియన్లు | 26 |
| వెనుకబడిన ప్రాంతాలు కొండజాతి తెగలు | 24 |
| భారత క్రైస్తవులు | 20 |
| ఆంగ్లో ఇండియన్లు | 11 |
| విశ్వవిద్యాలయాలు | 8 |
| మొత్తం | 1,585 |

ఇప్పటికీ అభివృద్ధినిరోధకమైన వర్గీకరణం ఉన్నప్పటికి, ఫెడరల్ అసెంబ్లీలోకన్నా రాష్ట్రశాసనసభల్లో అవకాశాలు కొంత ఎక్కువని స్పష్టబడు తుంది

ఈ అవకాశాలే, ఎక్కువరాష్ట్రాలలో, కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడేందుకు వీలుకల్పించాయి ఈ రాష్ట్ర కాంగ్రెసు మంత్రివర్గాలకు అతిసంకుచిత అధికారాలు కాక ఎక్కువేమో అధికారముందనికాని, ఆ మంత్రులు ప్రధానసమస్యలను పరిష్కరింపబూనుకోవడానికాని అవకాశం ఉందని ఊహించడం మట్టుకు పొరబాటు. ఆ సమస్యలు స్వపరిపాలన సాధించేవరకు వేచిఉండవలసింది.

నిరంకుశ కేంద్ర ప్రభుత్వాధికారం బ్రిటన్ చేతిలోనే ఉండిపోయింది: బ్రిటిష్ ప్రయోజనాలకు సంబంధించిన విషయాలను ప్రజాప్రతినిధులు తాకడానికి వీలులేండా చట్టరీత్యా నిర్బంధాలుంచారు. పరిపాలనలో ప్రధానమైన మార్పులు చేయవీలులేదు. తగినంత డబ్బులేదు. రాష్ట్రగవర్నర్లకు నిరంకుశాధికారాలున్నాయి. ఇవన్నిటిని దృష్టిలోఉంచుకొని చూస్తే రాష్ట్ర మంత్రివర్గాల అధికారాలు చాల సంకుచితమైనవి. ముఖ్యంగా ఈ సంకుచితత్వం 'ఆర్థికరంగంలో అతిస్పష్టంగా కవిపిస్తుంది. ఆదాయాన్ని పెంచవీలుగల ఆదాయప్పన్ను, సుంకాలు కేంద్ర ప్రభుత్వంచేతనే ఉంచారు (నీమియర్ అవార్డు ప్రకారం కొంతభాగం రాష్ట్రాలకు అప్పగించారు) ఆ కేంద్రప్రభుత్వం బడ్జెట్‌లో ఖర్చు పద్దులలో నూటికి 80 వంతుల విషయంలో భారత ప్రతినిధులు వోటుచేయ వీలులేదు పైగా నిర్మాణయుతంగా ఖర్చుపెట్టవలసిన శాఖలలో ఆరోగ్యం, విద్య వగైరాలు రాష్ట్రప్రభుత్వాలకు అప్పగించారు. మరి అతిభారంగా పరిణమించి, ఇక పెంచవీలులేని ప్రజలకు అయిష్టమైన భూమిపన్నును వీరికి వదిలారు. వెంటనే తగ్గించవలసిన ఆదాయమిది. ఇలా శాఖలను విభజించడంలో ఉద్దేశమేమిటి ? రాష్ట్ర మంత్రివర్గాలకుబాగా సంకెళ్ళు తగిలించి, అందుతోపాటు సామ్రాజ్యవాదులిన్నాళ్ళు ఉదాసీనంగా చూచిన ఆరోగ్యం, విద్య వారికి అప్పగించారు. అంటే వీనివిషయంలోను అత్యవసరంగా చేయవలసిన సమాజసదుపాయాలు, నిర్మాణకార్యక్రమాభివృద్ధి జరక్కపోతే వచ్చే అపఖ్యాతి మంత్రులకే అంటగడదామనే సామ్రాజ్యవాదుల ఉద్దేశమనేది స్పష్టంగానే కనిపిస్తుంది.

ఇందువల్ల రాష్ట్ర మంత్రివర్గాలు ఏ విధంగాగాని స్వపరిపాలనను సాధించా యని భావించ వీలులేదు వారి అధికారాలు చాల పరిమితమైనవి. అనేక నిర్బంధా లతో కూడినవీ అని మాత్రమే కాదు; భారత ప్రజల నెదుర్కొంటున్న. అత్యవసర ప్రధాన సమస్యలను ఆ మంత్రివర్గాలు ముట్టడానికూడ వీలులేదుకాబట్టే ఇందులో స్వపరిపాలన ఏ మాత్రం లేదంటున్నాము ప్రధాన రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రి వర్గాలు స్థాపించడంవల్ల, జాతీయోద్యమంలో ఒకడుగు ముందుకు వేయడం జరి గింది. స్వరాజ్య పోరాటంలో మరింత కీలకస్థానాన్ని పట్టుకున్నట్టయింది. కాని స్వపరిపాలనకు పోరాటం. నిజమైన జాతీయ స్వతంత్రానికై పోరాటం ఇంకా సాగించవలసే ఉంటుంది.

ఈ రాజ్యాంగచట్టం మొత్తంగా. ముఖ్యంగా ఫెడరల్ కేంద్ర నిర్మాణంలో- మనం లోతుగా పరిశీలించే కొద్దీ దీనిబండారం బయటపడుతుంది: ఇందులో ప్రజా స్వామ్య పద్ధతేమీలేదనీ, భారత దేశంపై సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని మరింత దృఢంగా ఉంచుకునేందుకే ఇదొక పన్నాగమనీ బయటపడుతుంది. సామ్రాజ్యవాద పరిపాలనా ఆవరణంలోనే, అభివృద్ధి నిరోధక శక్తులను మరింత బలపరచేందుకే ఈ చట్టం చేశారని తేటతెల్ల మవుతుంది. "బాధ్యత" అప్పగించామనడం వట్టి బూటకం, సామ్రాజ్యవాద అధికారం స్థిరపరచి, మరింత దృఢతరం చేయబడింది. ఈ రాజ్యాంగ చట్టం హద్దుల్లో నిజమైన స్వపరిపాలనకోసం పోరాటం సాగించ వీలులేదు. ఈ యంత్రంద్వారా, అందుకు సన్నిహితమైనట్టి సన్నాహ కార్యక్రమం సాధించబడినప్పటికి అంతిమ పోరాటం ఈ చట్టానికి వెలుపల, ఈ చట్టానికి వ్యతిరేకంగా జరగవలసిందే.

ఈ చట్టాన్ని గూర్చి ఏప్రజాతంత్రవాది చెప్పే ఆఖరు తీర్పయినా ప్రొఫెసర్ ఎ.బి. కీత్ తీర్పుతో ఏకీభవించ వలసిందే. బ్రిటన్‌లో రాజ్యాంగ చట్టాల విష యంలో ప్రముఖ పండితుడయిన కీత్ నిర్దాక్షిణ్యంగా ఇలా వర్ణించాడు:

"బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచడం సాధ్యంకాదు. అవి స్పష్టంగా చెప్పి ఉండొచ్చు లేదా అదేదో నిజంగా ఇవ్వనైనా ఇచ్చి ఉండొచ్చు. అంతేగాని ఇలాంటిదెందుకని అనుకోకుండా ఉండలేము. వ్యక్తిగతమైన వివక్షణమీద ప్రత్యేక బాధ్యతలు, చర్యలుగల ఇలాంటి చట్టాన్ని అమలు జరపడానికి తగిన సహకారం రావడంలేదంటే, ఇందుకెవరూ కృతజ్ఞత చూపడంలేదంటే అందులో ఆశ్చర్యపడవలసిందేమీలేదు.

"ఫెడరల్ వ్యవస్థగూర్చి సంతృప్తిచెందడం ఏమాత్రం సాధ్యంకాదు. ఇందులో చేరవలసిన భాగాలు ఒకదానికొకటి కలుసుకోవడమే అసాధ్యంగా ఉంటుంది. బ్రిటిష్ ఇండియాభాగంనుండి వచ్చే ప్రమాదకరమైన ప్రజాస్వామిక శక్తులను ఎదుర్కొనేందుకు, పచ్చి అభివృద్ధినిరోధకవర్గాలకు స్థానమిస్తున్నందు వల్లనే ఈ పద్ధతికి బ్రిటిష్ ప్రభుత్వం అనుకూలంగా ఉంది .... బ్రిటిష్ ఇండియా

కేంద్ర ప్రభుత్వానికి, బాధ్యతను విశాలపరిచే సమస్యను త్రోసిపుచ్చేందుకే ముఖ్యంగా ఈ ఫెడరేషన్ ఏర్పరచారని భారతీయులు భావిస్తున్నారంటే దానిని కాదనడం కష్టం. ఇంతేకాక పైగా, ఫెడరల్ అధికారంనుంచి రక్షణ, విదేశాంగ శాఖలను వేరుపరచడంవల్ల, ఏదో బాధ్యతను అప్పగించామని చెప్పే మాటలన్నీ వట్టి అర్థంలేని మాటలేనని చెప్పక తప్పదు."

(ప్రొఫెసర్ ఎ. బి. కీత్, "ఇండియా రాజ్యాంగచట్ట చరిత్ర 1600-1935" 1936, పుటలు 473-4)

# పదిహేనో అధ్యాయం

# యుద్ధ ప్రారంభం ముందు జాతీయపోరాటం

"కాంగ్రెస్ రాజకీయవాదులు, స్వాతంత్ర్యం అనే పదాన్ని అర్థం లేకుండా వల్లించ మొదలెట్టారు; ఇది దురదృష్టకరం." — ఇండియామంత్రి జట్లాండు విలేఖరుల సభలో, 1940 ఫిబ్రవరి."

1930-34 లోని పెద్ద ప్రజాపోరాటాల తర్వాత, జాతీయఉద్యమాభివృద్ధిని రెండు స్పష్టదశలుగా విభజించవచ్చు నిర్బంధవిధానంతో తగిలిన దెబ్బనుండి తెప్పరిల్లి పునస్సంఘటితం కావడం; విధానంలో నూతనవైఖరుల ప్రవేశం; వెంటనే ఎన్నికలూ, కాంగ్రెసు మంత్రివర్గ స్థాపన, ఇదివరకెన్నడూ లేనంత అధికారప్రతిష్ఠను సంపాదించడం — ఇదీ మొదటిదశ. రెండోదశ 1938-39 లోనే కనిపించసాగి, అభివృద్ధిచెందుతున్న సంక్షోభం, యుద్ధప్రారంభంకాగానే మరో కొత్త పోరాటంగా ఈ సంక్షోభం పరిణమించసాగింది.

## 1. నూతన చైతన్యం

1934 లో ప్రభుత్వ నిర్బంధవిధానం తీవ్రతరమైనది, గొప్ప పోరాటం జరిపి, ఇందులో తగిలిన దెబ్బలనుండి తెప్పరిల్లి కాంగ్రెసు తిరిగి తన శక్తులను సమీకరించసాగింది. ఇట్టి పరిస్థితిలో 1936 సంవత్సరంలో లక్నో కాంగ్రెసు సమావేశమైంది. కాంగ్రెసు సభ్యత్వం 4 లక్షల 57 వేలు మాత్రమే ఉంది. 1934-36 సంవత్సరాలు కాంగ్రెసు జీవితంలో సౌఖ్యప్రదమైనవి కావు. 1934 లో అప్పటియుండవల్ల కాంగ్రెసు పురోగతికి అవకాశం చిక్కలేదు. కాంగ్రెసునుండి విడిపోతూ గాంధీజీ మార్పించిన 1934 బొంబాయి కాంగ్రెసులో ఆమోదించిన కాంగ్రెసు నియమావళి అభివృద్ధినిరోధకంగా ఉంది. ఇది కాంగ్రెసు సభ్యత్వాన్ని సంకుచితపరిచింది అందులో సందేహంలేదు. (లక్నోలో కొంతవరకు ఈ నియమావళిని సవరించవలసివచ్చింది.) కార్యవ్యగ్రత పూర్తిగా శాసనసభారంగంలోకి దిగింది. 1934 ఆఖరున శాసనసభల ఎన్నికలలో పాల్గొనడంతో ఈ మార్పు జరిగింది. కాని ఈ కార్యకలాపం ప్రజల్లో ఎట్టి ఆసక్తినీ రేపలేకపోయింది.

లక్నో కాంగ్రెసు అధ్యక్షోపన్యాసంలో నెహ్రూ ప్రస్తుత బలహీనతను అరమరిక లేకుండా విమర్శించాడు. మనం ప్రజలనుండి చాలవరకు విడిపోయాం" అన్నాడు.

లక్నో కాంగ్రెస్‌లోని నెహ్రూ అధ్యక్షోపన్యాసం జ్ఞాపకం పెట్టుకోదగింది. సోషలిజమే ఆశయమని ఆయన చాటాడు ఫాసిస్టు వ్యతిరేకంగా, అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా సమకూడుతున్న ప్రపంచ పోరాటంతో భారత స్వతంత్ర పోరాటాన్ని మేళవించాడు. కాంగ్రెస్‌లో అధిక ప్రాతినిధ్యంగల మధ్యతరగతులు కార్మికులను, కర్షకులను కలిపి సామ్రాజ్య వ్యతిరేక "సంయుక్త ప్రజాసంఘటన" ఏర్పడాలని కోరాడు. అన్నివేపులా కొత్తచైతన్యం పొడసూపుతోంది. కాంగ్రెస్‌లో సోషలిస్టు పక్షం అభివృద్ధి చెందుతోంది. 1936 డిసెంబరులో జరిగిన ఫైజ్‌పూర్ కాంగ్రెసులో అఖిలభారత కాంగ్రెస్ కమిటీలో సోషలిస్టులు మూడోవంతున్నారు. చిన్నదైనప్పటికి లక్నో కాంగ్రెస్‌నాటికే సోషలిస్టుపక్షం ప్రముఖస్థానం వహించింది. కార్మిక, రైతు సంఘాలను కాంగ్రెస్‌తో సమిష్టిగా కలపాలన్న నెహ్రూ సూచనను లక్నో కాంగ్రెస్ అంగీకరించలేదు. 35 వోట్లు వ్యతిరేకంగా, 16 వోట్లు అనుకూలంగా రావడంతో కమిటీలో ఇది ఆమోదం పొందలేదు ఈ విషయమై మరింత పరిశీలించడానికై ప్రజాసంబంధ ఉపసంఘం (మాస్ కాంటాక్టు కమిటీ) ఏర్పడింది. ప్రజలతోను ప్రజల సాంఘిక, ఆర్థికసమస్యలతోను సన్నిహితసంబంధం ఏర్పరుచుకోవాలనే భావం సర్వత్రాకనిపిస్తోంది. వడకడం, గ్రామ పునర్నిర్మాణం వగైరాలపై కేంద్రీకరించకుండా, వాస్తవ వ్యావసాయకకార్యక్రమాన్ని అవలంబించే ప్రయత్నాలు జరిగాయి. ఫైజ్‌పూర్‌లో తాత్కాలికంగా ఒక రైతు కార్యక్రమాన్ని కాంగ్రెస్ అంగీకరించింది. ఈ కార్యక్రమంలో 13 అంశాలున్నవి. ఇదంత స్పష్టంగాలేదు-కాని ఈక్రింది వాంఛలిందులో చేరాయి: జమీందారీ పన్నులను, భూమి శిస్తులను తగ్గించాలి; అప్పులను రద్దుచేయాలి, లేదా తగ్గించాలి; వెట్టిచాకిరీని, జమీందార్లకిచ్చే బాకీలను రద్దు చేయాలి, వ్యవసాయకూలీలకు జీవనానికి తగిన కూలి ఇవ్వాలి; రైతుసంఘాల హక్కులు ఇలాంటివి యిందులోఅస్పష్టంగానైనాసరే ఉన్నాయి.

1936 ఏప్రెల్ లక్నో కాంగ్రెస్‌నుండి, కాంగ్రెస్ నూతన చరిత్ర ఆరంభమయింది. తీవ్రంగా పురోగమనం సాగింది. 1936 డిసెంబరులో జరిగిన ఫైజ్‌పూర్ కాంగ్రెసునాటికి, కాంగ్రెస్ సభ్యత్వం 6 లక్షల 36 వేలకు పెరిగింది. 1937 ఆఖరున ఎన్నికలు జరిగి కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడిన తర్వాత కాంగ్రెస్ సభ్యత్వం 30 లక్షలకు పెరిగింది. 1938 ఫిబ్రవరికి 31 లక్షల రెండు వేలకు పెరిగింది ఇప్పుడే హరిపుర కాంగ్రెసు జరిగింది. 1938 ఆఖరుకు 40 లక్షలకు పెరిగింది. ఒక్క యు. పి. రాష్ట్రంలోనే 12½ లక్షల సభ్యులున్నారు. 1939 లో త్రిపురీ కాంగ్రెస్‌నాటికి కాంగ్రెసు సభ్యత్వం దాదాపు 50 లక్షలకు పెరిగింది.

## 1937 ఎన్నికల విజయం

నూతన రాజ్యాంగచట్టంగూర్చి కాంగ్రెసు దృక్పథం సూత్రప్రాయంగా 1934 లో తెలిపారు ప్రజాపరిషత్తు ఏర్పడాలని కాంగ్రెస్ కోరింది. లక్నో కాంగ్రెస్ వచ్చే ఎన్నికల్లో పాల్గొనాలని నిశ్చయించింది 1936 ఆగస్టులో ఎన్నికల ప్రణాళిక ప్రకటించారు. ఫైజ్‌పూర్ కాంగ్రెస్ దీని నామోదించింది. 1936 డిసెంబరులో జరిగిన ఈ కాంగ్రెస్, ఎన్నికలలో కాంగ్రెస్ ఎందుకు పోటీ చేస్తోందో ఖచ్చితంగా తెల్పింది :

"ప్రజాభీష్టానికి విరుద్ధంగా భారతదేశంపై రుద్దబడిన 1935 ఇండియా చట్టాన్ని కాంగ్రెస్ నిరాకరించింది దానిని తిరిగి పునరుద్ఘాటిస్తున్నాం. దీనితో ఏ విధంగా సహకరించినా భారత స్వతంత్రపోరాటాన్ని వంచించడమే అవుతుంది; సామ్రాజ్యవాదుల పెత్తనంక్రింద ఇప్పటికే దరిద్రస్థితికి వచ్చిన భారత ప్రజాసామాన్యాన్ని మరింత దోపిడీచేసేందుకు బ్రిటిష్ సామ్రాజ్యవాదబలాన్ని మద్దతుచేయడమే అవుతుంది అని మేము అభిప్రాయ పడుతున్నాం. కాబట్టి ఈ చట్టానికి ఏ విధంగా సహకారం చేయం, లొంగిపోము అనే కృతనిశ్చయాన్ని పునరుద్ఘాటిస్తున్నాం. శాసనసభల్లోను, వెలుపలాకూడ ఈ చట్టాన్ని భగ్నంచేసేందుకు పోరాటం సాగించాలి. భారత రాజ్యాంగ పద్ధతిని, ఆర్థికవ్యవస్థను బలవంతంగా ఏ విదేశప్రభుత్వం కాని రుద్దే అధికారం ఉందని కాంగ్రెస్ అంగీకరించలేదు. ఇక ఎప్పటికీ అంగీకరించబోదు. అలా రుద్దాలని చేసే ప్రతి ప్రయత్నాన్ని సంఘటిత ప్రజానీకం జంకుగొంకు లేకుండా విరోధిస్తారు. భారత ప్రజలే రాజ్యాంగ చట్ట నిర్మించాలి. భారత దేశ జాతీయస్వయంనిర్ణయాన్ని గుర్తించి స్వతంత్ర ప్రాతిపదికపై ఆ చట్టం ఏర్పడాలి తమ వాంఛలకు అవసరాలకు అనుగుణంగా అభివృద్ధికరంగా ఉంటే అలాంటి రాజ్యాంగాన్ని మాత్రమే భారత ప్రజలు గుర్తిస్తారు.

"సర్వ ప్రజలకు రాజకీయాధికారమిచ్చే, ప్రజలు పరిపాలించే వాస్తవ ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని కాంగ్రెస్ వాంఛిస్తున్నది. అలాంటి రాజ్యం వయోజన వోటింగు హక్కుపై ఎన్నుకోబడిన ప్రజాపరిషత్తు మాత్రమే అమలుపరచగలదు, ప్రజా పరిషత్తే ఆఖరుకు రాజ్యాంగ చట్టాన్ని తయారు చేయగలదు ఇందుకై కాంగ్రెస్ పనిచేస్తుంది. ప్రజలను సంఘటిత పరుస్తుంది. ఈ ఆశయాన్ని శాసనసభల్లోని కాంగ్రెస్ ప్రతినిధులెప్పుడూ జ్ఞాపకముంచుకోవాలి.

"శాసన సభలకు ఎన్నుకోబడిన కాంగ్రెస్ సభ్యులు, మంత్రిపదవులు స్వీకరించాలా లేదాఅనే సమస్యను, ఎన్నికలతర్వాత అఖిలభారత కాంగ్రెస్ కమిటీ నిర్ణయిస్తుంది అప్పుడే అలా నిర్ణయించడం సాధ్యమవుతుంది."

ఫైజ్‌పూర్ కాంగ్రెస్‌లో పదవీ స్వీకారం విషయమై అభిప్రాయ భేదం వచ్చింది. ఎక్కువమంది దీనిని వాయిదా వేయాలన్నారు. మీరట్ కుట కేసు బందీ అయిన డాంగే ఒక సవరణ తెచ్చాడు ప్రజా పరిషత్తు నిర్మాణానికై ప్రజా పోరాటాలను సన్నద్ధపరచాలని కోరాడు, ఈ సవరణ 83-45 వోట్లతో వోడిపోయింది, (అఖిలభారత కాంగ్రెసు కమిటీలో ఈ వోటమి) మహాసభలో 451—262 వోట్లతో వోడిపోయింది. పదవీస్వీకారంకూడదన్న సవరణ 87—48 వోట్లతో వోడిపోయింది,

దేశం మొత్తంమీద కాంగ్రెసు ఎన్నికల్లో పోటీచేసింది. కుల, మత తత్వాలపై ఏర్పడిన అనేక పార్టీలను — కాంగ్రెసుతో పోటీ చేసేందుకై ప్రభుత్వం రహస్యంగాప్రోత్సహించిన వివిధ రాష్ట్రాల్లోని అనేక రకాల కుక్కగొడుగు పార్టీలను జయించి కాంగ్రెసు సంయుక్త జాతీయ సంఘటనకు ప్రతినిధిగా విజయంపొందింది. సంపూర్ణ స్వతంత్రమే ఆశయంగా ప్రకటించడం, ఏళ్ళకొలది జరిపిన ప్రజా పోరాటాలు విచక్షణలేని అరెస్టులు శాసనసభ బయటజరిపిన ప్రజా పోరాటాలు కాంగ్రెసు ఎన్నికల్లో గెలవడానికి మూలకారణం.

కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక, సంపూర్ణ స్వాతంత్రం, ప్రజాపరిషత్తు అనే వాంఛలను ముందుపెట్టింది. సామ్రాజ్యవాద రాజ్యాంగచట్టాన్ని బేషరతుగా ఖండించింది. కాంగ్రెసు ప్రతినిధులను శాసనసభలకు పంపడం, "రాజ్యాంగచట్టంతో ఎలాంటి సహకారం చేసేందుకు కాదు - దానిని పోరాడి భగ్నం చేసేందుకే" అని అందులో ఉంది. ఎన్నికల ప్రణాళిక సర్వసామాన్య సూత్రాలను నిర్వచించడంతో తృప్తిపడక, నిశ్చిత తక్షణకార్యక్రమాన్ని వివరించింది. పౌరహక్కులు, ప్రజా స్వామ్యవాంఛలు అందులో ఉన్నవి. సాంఘిక, ఆర్థిక కార్యక్రమంకూడ ప్రకటించబడింది. ఇది ప్రజాసామాన్యానికి అన్వయించేదిగా ఉంది. ఇది కాంగ్రెసు విజయానికి రెండోకారణం.

ఎన్నికల ప్రణాళికలోని సాంఘిక, ఆర్థిక కార్యక్రమం చాల ముఖ్యమైంది. అదే తర్వాత కాంగ్రెసుమంత్రివర్గం ఎలా నడవాలో సూచిస్తోంది. ఇందులోని ముఖ్య భాగాలివి :

> "శాసనసభలద్వారా స్వతంత్రం సాధించలేమని దరిద్ర నిరుద్యోగ సమస్యలుకూడ పూర్తిగా పరిష్కారంకావని కాంగ్రెసు గుర్తిస్తోంది. ఇంతేకాక కాంగ్రెసు తన సాధారణ కార్యక్రమాన్ని ప్రజలముందు పెడుతోంది. ఇందులో కాంగ్రెసు ఎందుకు పోరాడుతున్నదో, కాంగ్రెసు అధికారానికి వస్తే ఏమిచేయనున్నదో ప్రజలు తెలుసుకోవీలవుతుంది.
>
> "కరాచీ కాంగ్రెసు, (1931) కాంగ్రెసు ప్రధానాశయాన్ని ప్రాథమిక హక్కుల తీర్మానంద్వారా ప్రకటించింది. ఇదే ఇంకా అమలులో ఉంది. అయిదేళ్ళగా ఏర్పడిన ఆర్థిక సంక్షోభం. దరిద్ర నిరుద్యోగాది ఆర్థిక సమస్యలను మరింత తీవ్రంగా ఆలోచించేట్టు చేసింది.

"దేశంలో దరిద్రం, నిరుద్యోగం, రైతుల అప్పులబాధలు అధ్వాన్నముగా ఉన్నాయి. ఈ దుర్భరస్థితికి మూలకారణం పాతకాలపు భూమిశిస్తు విధానం, భూ విధానం; వ్యవసాయ పంటలకు ఇటీవల ధరలు పడిపోవటంతో ఈ దుస్థితి మరింత హీనమైపోయింది.

"కరాచీ కాంగ్రెస్ తీర్మానాన్ని పునరుద్ఘాటిస్తున్నాము. అందులో ఇలా ఉంది: భూవిధానాన్ని, శిస్తు విధానాన్ని, జమీందారీ శిస్తు పద్ధతిని కాంగ్రెస్ సంస్కరించగోరుతున్నది. వ్యవసాయ భూమిపై పడిన భారాన్ని న్యాయంగా పంచాలని చూస్తుంది. భూమిపన్నును, జమీందారీ మగతాలను తగ్గించి వెంటనే పేద రైతులకు సహాయం చేయగోరుతున్నది ఆర్థికంగా తగినంత ఆదాయంరాని భూములపై మగతాను, శిస్తును తగ్గించగోరుతుంది.

"ఋణ సమస్య వెంటనే ఆలోచించాలి అప్పుల వసూలుకు వాయిదా వేయడం, ఋణాలను తగ్గించడం, ప్రభుత్వమే చౌక వడ్డీలతో అప్పులివ్వడం మొదలైన ఒక ప్రణాళికను ఏర్పరచాలి.

"పారిశ్రామిక కార్మికులను గురించి కాంగ్రెస్ విధానం యిది: దేశంలోని ఆర్థికపరిస్థితులు అవకాశం ఇచ్చినంతలో అంతర్జాతీయ స్థాయికి తగినట్లుగా కార్మికులకు జీతాలు, పనిగంటలు, పని షరతులు నిర్ణయిస్తుంది. కార్మికులకు - యజమానులకు మధ్యవచ్చే తగాదాలను తీర్చి సంఘాలను నియమిస్తుంది. వృద్ధాప్యం, వ్యాధి, నిరుద్యోగ భీమాలను చేకూరుస్తుంది; ట్రేడ్‌యూనియన్ హక్కును, సమ్మె హక్కును గుర్తిస్తుంది.

"చట్టరీత్యాగాని, సాంఘికంగాగాని, ప్రజాకార్యకలాపాల్లో వేనిలోనైన స్త్రీ పురుష విభేదాన్ని కాంగ్రెసు తొలగిస్తుందని పూర్వమే ప్రకటించాము. స్త్రీ కార్మికులకు రక్షణ, ప్రసూతి సౌకర్యాలు యిస్తాము. స్వతంత్ర పోరాటంలో భారత మహిళలు ఇంతకు పూర్వమే ప్రముఖ పాత్రను నిర్వహించారు. స్వతంత్ర భారత సదుపాయాలను. భారాన్ని పురుషులతోబాటు సమానంగా మహిళలుకూడా పంచుకుంటారని కాంగ్రెస్ ఆశిస్తున్నది.

"అంటరానితనం నిర్మూలించేందుకు, హరిజనులను, వెనుకబడిన తెగలను ఆర్థికంగా, సాంఘికంగా పునరుద్ధరించేందుకు కాంగ్రెసు పదే పదే చేసిన విజ్ఞప్తులు అందరెరిగినవే. సర్వ సమాన పౌరహక్కులు గల పౌరులుగా వారు పరిగణింప బడాలని కాంగ్రెసు కోరుతున్నది.

"చిరకాలంనుండి, ఖద్దరు-కుటీర పరిశ్రమలను పెంచడం కాంగ్రెసు కార్యక్రమంలో ప్రధాన భాగం. పెద్ద పరిశ్రమలకు రక్షణలు ఇవ్వాలి. కాని కార్మికుల హక్కులను, ముడిసరుకు ఉత్పత్తి చేసే రైతుల హక్కులను కాపాడాలి. గ్రామ పరిశ్రమలను తగిన జాగ్రత్తతో చూడాలి."

రైతుకూలీల తక్షణ వాంఛలను ప్రతిబింబించే, ఈ విశాల ప్రజాతంత్ర కార్యక్రమం, కాంగ్రెసుకు ఎన్నికలలో పెద్ద ప్రజాబలం వచ్చేందుకు (కేవలం వోటర్లే కాక ఇతర ప్రజలుకూడ బలపరిచేందుకు) కారణమయింది.

ఎన్నిక ఫలితాలు కాంగ్రెస్‌కు బ్రహ్మాండ విజయం చేకూర్చాయి. ప్రభుత్వమూ, నిరంకుశోద్యోగులూ విస్తుపోయారు సంయుక్త జాతీయ స్వాతంత్ర వాంఛ కిదొక మహత్తరమైన ప్రదర్శనం కాంగ్రెస్‌పైకి దొరికినవారినల్లా సమీకరించాలని ప్రభుత్వం సాయశక్తులా ప్రయత్నించింది ఎన్నికల ప్రచారం తర్వాత, కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి ఒక ప్రకటనచేస్తూ ప్రభుత్వం కాంగ్రెస్‌ను వోడించేందుకు తన పలుకుబడిని పూర్తిగా ఉపయోగించిందని తెలియజేశాడు :

"ప్రభుత్వం జాగ్రత్తగా ఉంది: కాంగ్రెస్ గెలిస్తే కొత్త రాజ్యాంగాని కేంగతి పడుతుందో వారికి తెలుసు తామెంత కాదన్నా ప్రభుత్వం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తమ పలుకుబడిని ఉపయోగించింది. పార్టీలను సృష్టించేందుకు తోడ్పడింది. యు పి.లో నేషనల్ అగ్రికల్చరిస్టుపార్టీ. పంజాబులో యూనియనిస్టుపార్టీ ఇలాగే ఇతర రాష్ట్రాలలో కొన్ని పార్టీలకు ప్రభుత్వపు మద్దతు ఉంది"

(ప్రధాన కార్యదర్శి నివేదిక, హరిపుర కాంగ్రెస్ 1938)

యు. పి. లో 'కోర్టు ఆఫ్ వార్డ్సు' కార్యదర్శి ఒక సర్క్యులర్‌ను జారీ చేశాడు :

"కోర్టు ఆఫ్ వార్డ్సు ఏ వర్గానికి ప్రతినిధో ఆ వర్గ ప్రయోజనాలను ముఖ్యంగాచూచి, సామాన్యంగా వ్యావసాయక ప్రయోజనాలను పాటించి కాంగ్రెస్‌పై సాధ్యమైనంత చావుదెబ్బకొట్టడం అత్యవసరం ……. కాబట్టి కాంగ్రెస్ తీవ్రంగా ఎదిరిస్తున్న అభ్యర్థులను ఈ కోర్టు ఆఫ్ వార్డ్సు బలపరుస్తుంది, జిల్లా ఉద్యోగులు, ఒక్కొక్క నియోజకవర్గాన్ని రాష్ట్రమంతటా పర్యవేక్షణ చేయాలి ప్రతి నియోజకవర్గంలోను రాజభక్తులైన అభ్యర్థులను బలపరచాలి అని సూచిస్తున్నాము"

ఈ సర్క్యులర్‌కు ప్రభుత్వం క్షమాపణ చెప్పుకోవలసి వచ్చింది. ప్రతిసారీ అంత బహిరంగంగా కాకపోయినా, తేవలసినంత ఒత్తిడి తెచ్చారనడంలో సందేహంలేదు.

కాంగ్రెస్ విజయం ఎంత విశాలమైందో చూడాలంటే ఎన్నిక ఫలితాలను చూడొచ్చు. మొత్తం శాసనసభ స్థానాలు 1585 స్థానాలున్నప్పటికి, అందులో 657 మాత్రమే సాధారణ నియోజకవర్గ స్థానాలు. మిగతావన్నీ ప్రత్యేక స్థానాలు. అయినా కాంగ్రెస్ 715 స్థానాలను సాధించింది ఇందువల్ల ఈ విజయం ఎంత ప్రాముఖ్యమో గమనించవచ్చు

## 1937 ఎన్నికల ఫలితాలు

| రాష్ట్రం | మొత్తం స్థానాలు | జనరల్ స్థానాలు | కాంగ్రెస్ | ముస్లిం లీగు | ముస్లిం స్వతంత్ర | ఇతర్లు |
|---|---|---|---|---|---|---|
| మదరాసు | 215 | 116 | 159 | 11 | — | 45 (1) |
| బొంబాయి | 175 | 99 | 88 | 20 | 10 | 57 |
| బెంగాల్ | 250 | 48 | 56 | 40 | 43 | 117 (1) |
| యు. పి | 228 | 120 | 134 | 27 | 30 | 37 (3) |
| పంజాబ్ | 175 | 34 | 18 | 1 | — | 156 (4) |
| బీహార్ | 152 | 71 | 98 | — | 15 | 39 |
| సి. పి. | 112 | 64 | 71 | — | 14 | 27 |
| అస్సాం | 108 | 40 | 35 | 9 | 14 | 50 |
| సరిహద్దు | 50 | 9 | 19 | — | 2 | 29 |
| ఒరిస్సా | 60 | 38 | 36 | — | — | 24 |
| సింధు | 60 | 18 | 7 | — | — | 53 |
| మొత్తం | 1585 | 657 | 715 | 108 | 128 | 634 |

1. జస్టిస్ పార్టీ స్థానాలు 17 కలుపుకొని
2. ప్రజాపార్టీ 38 స్థానాలు కలుపుకొని
3. నేషనల్ అగ్రికల్చరిస్టు పార్టీ 16 స్థానాలు కలుపుకొని
4. దాదాపు ఇవన్నీ యూనియనిస్టు పార్టీవే

కాంగ్రెసుకు పూర్తిమెజారిటీ ఈక్రింది రాష్ట్రాలలో వచ్చింది : మద్రాసు (కౌన్సిల్‌లోకూడ), బొంబాయి, యు పి, బీహార్ (కౌన్సిల్‌లోకూడ) ఒరిస్సా; బెంగాలు, అస్సాములలో బలవత్తరమైన ఒక పార్టీగా గెలిచింది. మితవాదులు ప్రతిచోటా మాయమయ్యారు. ప్రభుత్వం అభిమానంతో చూచే 'జస్టిస్‌పార్టీ' (ఇది పూర్వం బ్రాహ్మణేతర పక్షం) పూర్వం బలవత్తరంగా ఉండేది: ఇప్పుడు 12 పంతు స్థానాలు మాత్రమే వచ్చి నిర్మూలమైపోయింది. యు. పి. లో ఇలాంటిదే అయిన 'నేషనల్ అగ్రికల్చరిస్టు పార్టీ' ఇంతకంటె దుర్గతిపాలయింది ఒక పంజాబు, సింధులలోనే కాంగ్రెసుకు విజయం రాలేదు.

కాంగ్రెసు గెల్చినవన్నీ సాధారణ స్థానాలే 58 ముస్లింస్థానాలలో 26 కాంగ్రెసుకు వచ్చాయి. (15 సరిహద్దురాష్ట్రంలో) కొన్ని కార్మిక, సిక్కు, క్రైస్తవ స్థానాలుకూడ కాంగ్రెసు జయించింది 4 భూస్వామిస్థానాలను, మూడు వాణిజ్య, వర్తకస్థానాలనుకూడ గెల్చుకుంది. కాంగ్రెసు ఎన్నికల విజయం సామ్రాజ్యవాదులను కూడ మార్చింది. కాంగ్రెసు "కేవలం అల్పసంఖ్యాకమూ, అప్రాముఖ్యమూ అనే 'లండన్ టైమ్సు' పత్రికకూడ పాతవైఖరిని మార్చుకోవలసివచ్చింది అది ఇలా వ్రాసింది :

"కాంగ్రెసు ఒక్కటే అన్నిరాష్ట్రాలలోను సంఘటిత నిర్మాణం కలదని, భారతదేశంలోని ఎన్నికలు మరొకసారి స్పష్టపరిచాయి దాని విజయాలు గమనింపదగినవి.... మొత్తంమీద కాంగ్రెసు గెలిచింది; ఇందుకు చాలవరకు చక్కని సంఘ నిర్మాణమే కారణమైనా, కన్సర్వేటివ్‌లలో చీలికలు, సంఘటిత నిర్మాణం లేకపోవడంకూడా ఇందుకు కారణం. కాని ఇవే కాంగ్రెసు అసంఖ్యాక విజయాలకు కారణమని చెప్పలేము.... కాంగ్రెస్ ప్రతిపక్షులలో చాలమంది ప్రతిపాదనలకంటే, కాంగ్రెసు ప్రతిపాదనలు చాల ప్రజానుకూలమైనవిగాను, నిర్మాణాత్మకంగానూగూడ ఉన్నాయి - రైతు నియోజకవర్గాలలో కాంగ్రెసు తలవని తలంపుగా విజయం పొందింది. ఈ రంగంలో కాంగ్రెసు సువిశాలమైన గ్రామ పునర్నిర్మాణ ప్రణాళికను ప్రజలముందుంచింది.... లక్షల కొలది భారత గ్రామీణవోటర్లు, వోట్లులేని కోట్లకొలది ప్రజల ఆసక్తికి పాత్రమైన సమస్యలపై.... కాంగ్రెసు విజయం సాధించింది" (లండన్ టైమ్సు, 1937 మార్చి 9)

ఆఖరుహంశం చాల ప్రధానమైనది ఓట్లిచ్చిన 1 కోటి 55 లక్షల వోటర్ల నిర్ణయం అందులో అత్యధికంగా కాంగ్రెసుకు వోట్లిచ్చినవారినిర్ణయం, భారత జాతీయస్వతంత్రేచ్ఛ అభ్యుదయ ఆకాంక్షలకు జనాభీష్టప్రకటన (రెఫరెండం) లాంటిది. నియోజక వర్గాలను దేనికది వేరువేరుగా విభజించి, చొరడానికి వీలులేకుండా చేసి ఎన్నో పరిమితులు పెట్టినప్పటికీ వోటర్లు తమఅభీష్టం వెల్లడించారు. ఇక కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక బాగా నచ్చిందని టైమ్సుపత్రిక అంగీకరించింది. ఆ ప్రజలకే వోటింగు హక్కు ఉన్నట్లయితే, విజయాలింకెంత బ్రహ్మాండంగా ఉండేవి!

## 3. కాంగ్రెసు రాష్ట్ర మంత్రివర్గాలు

ఎన్నికల తదనంతరం, కాంగ్రెసు అధిక సంఖ్యాక స్థానాలను గెల్చిన రాష్ట్రాలలో, మంత్రివర్గ స్వీకరణ సమస్య తేల్చవలసి వచ్చింది. 1937 మార్చిలో, కొన్ని షరతులపైన మంత్రి పదవులను తీసుకోవచ్చునని అఖిలభారత కాంగ్రెసు కమిటీ నిర్ణయించింది. ఆ తీర్మానం ఇలా ఉంది :

"గవర్నర్ తనప్రత్యేకాధికారాలను ఉపయోగించి, జోక్యం కలిగించుకోడని, మంత్రుల చట్టబద్ధ కార్యకలాపాలలో మంత్రుల సలహాలను త్రోసివేయడని శాసన సభలోని కాంగ్రెసు పార్టీ నాయకుడు తృప్తిచెందాలి.— ఆ విషయాన్ని బహిరంగంగా ప్రకటించగలిగి ఉండాలి. అలాంటప్పుడు; శాసన సభలో కాంగ్రెసుకు అధికసంఖ్య ఉన్న రాష్ట్రాలలో మంత్రి పదవులను కాంగ్రెసు స్వీకరించేందుకు అఖిలభారత కాంగ్రెసు అనుమతినిస్తున్నది. అలా చేసే అధికారం ఇస్తున్నది."

ఈ తీర్మానాన్ని గాంధీజీ మరింత విపులీకరించాడు. 127–70 వోట్లతో తీర్మానం నెగ్గింది. సోషలిస్టులలో అధిక సంఖ్యాకులు, సామాన్యంగా అతివాద పక్షం వారూ పదవీ స్వీకారాన్ని వ్యతిరేకించారు: ఇది సామ్రాజ్యవాదులతో సహకారానికి దారితీస్తుందని భావించి, ప్రజాపోరాట పంథాకు ఇంకోమార్గం అవుతుందన్న అనుమానంతో వారిలా వ్యతిరేకించారు. పదవీ స్వీకరణ కూడదన్న సవరణకు 135 వోట్లు వ్యతిరేకంగా, 78 అనుకూలంగా రావడంతో వోడిపోయింది. నాయకత్వంలోని మితవాదులూ చట్టబద్ధ కార్యక్రమమే మంచిదనేవారు అయిన నాయకులపై విశ్వాసం లేకపోవడం వల్ల ఈ వ్యతిరేకత ఏర్పడింది. ఇందు మూలంగా ఈ మితవాద నాయకులెక్కడ మరింత రాజీ ధోరణికి దిగిపోతారో అని అతివాదులు అనుమానించారు.

ఇలా షరతుపై అధికారం స్వీకరించాలని నిర్ణయించింతర్వాత, కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడేందుకు మూడు నెలలుపట్టింది. మంత్రుల చట్టబద్ధ కార్యక్రమాలను నిరోధించే రీతిగా, గవర్నర్ ప్రత్యేకాధికారాలను ఉపయోగించడని, ప్రభుత్వం ముందుగా ప్రకటించాలన్న వాంఛపైనే కాంగ్రెసు నిలబడింది. ఈలోగా ఏప్రిల్ 1 వ తేదీ - ఆల్ ఫూల్సుడే - నూతన రాజ్యాంగచట్టాన్ని అమలుజరిపారు. (ఇందుకీ తేదీని ఏ వ్యుత్పన్నుడు నిర్ణయించాడో రికార్డులలో లేదు) ఆ రోజున అన్నిచోట్లా హర్తాళ్ జయప్రదంగా సంపూర్తిగా జరిపారు. కాంగ్రెసుకూ అధికారులకు మధ్య సంప్రతింపులింకా పరిష్కారం కాలేదు కాబట్టి, మెజారిటీలేని నడుమంత్రపు మంత్రివర్గాలు ఏర్పడ్డాయి. ఈ ప్రతిష్టంభన వైస్రాయి జూన్ 22 వ తేదీ చేసిన ప్రకటనతో ఆఖరుకు పరిష్కారం అయింది. "తమ మంత్రులు ఏ పార్టీకి చెందిన వారైనప్పటికీ, వారితో తగాదాలు తెచ్చుకోకపోవడమేకాక, అలాంటి తగాదా లేర్పడితే తొలగించడానికి అలాంటివి ఏర్పడకుండా చేసుకునేందుకుకూడ" గవర్నర్లు ఆసక్తి చూపుతున్నారు అని వైస్రాయి ప్రకటనలోఉంది. "ఈ ప్రకటనలు, కాంగ్రెసు వాంఛను తీర్చే ఉద్దేశాన్ని ప్రకటిస్తున్నప్పటికీ, అఖిలభారత కాంగ్రెసు వర్కింగ్‌కమిటీ తీర్మానం ప్రకారంకోరిన హామీలకు సరిపోవడం లేదు" అని స్పష్టంగా కాంగ్రెసు వర్కింగు కమిటీ చెప్పింది. అయినప్పటికి ఈ వైస్రాయి ప్రకటనపై కాంగ్రెసు మంత్రిపదవులను స్వీకరించింది.

క్రిందిసభలో కాంగ్రెసుకు సంపూర్ణంగా మెజారిటీ వున్న బొంబాయి, మదరాసు, యు. పి., బీహారు, సి. పి., ఒరిస్సాలు ఆరింటిలో 1937 జులైన కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడ్డాయి. సరిహద్దురాష్ట్రంలో కూడ తర్వాత, ఎనిమిదిమంది కాంగ్రెసేతర సభ్యులు చేరి, కాంగ్రెసు క్రమశిక్షణను (ప్రత్యేక ప్రకటనలో) అంగీకరించడంవల్ల అక్కడకూడ కాంగ్రెసుకు మెజారిటీ వచ్చింది. ఇందుతో సరిహద్దురాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడింది. ఇలాగే బ్రిటిషు ఇండియాలోని 11 రాష్ట్రాలలో ఏడింటిలో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడ్డాయి, దాదాపు 16 కోట్ల జనాభా — బ్రిటిషు ఇండియా మొత్తం జనాభాలో అయిదింట మూడు

వంతులు, మొత్తం భారతదేశ జనసంఖ్యలో అయిదింట రెండువంతులు గల ప్రాంతంలో కాంగ్రెసు అధికారంలోకి వచ్చింది. తర్వాత అస్సాంలోను, సింధు లోను, కాంగ్రెసు మిశ్రమ మంత్రివర్గాలు ఏర్పడ్డాయి.

కాంగ్రెసు రాష్ట్ర మంత్రివర్గాలు రెండేళ్ళకు పైగా పదవుల్లో ఉన్నవి. యుద్ధ సంక్షోభంతో కేంద్రప్రభుత్వంతో తగాదావచ్చి. ఆ మంత్రులు 1939 నవంబరులో రాజీనామా ఇచ్చారు. వారి పరిపాలన స్వభావంగూర్చి, జాతీయోద్యమంలో తీవ్ర మైన వాదోపవాదాలు చెలరేగాయి.

రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రివర్గాలు, ఆధునిక రాజ్యాంగదృష్టిలో ప్రభు త్వాలు కావు. 1938 ఆగస్టులో గాంధీజీ ఆ మంత్రుల అతి పరిమితాధికారాలను తెలియజేశాడు. వారు స్వతంత్రపోరాటంలో ఎలా సాధనాలుగా తమపాత్ర నిర్వ హించాలో చెప్పాడు :

"ప్రజాతంత్ర వ్యవస్థ గల బ్రిటన్, ఇండియాలో ఒక అపూర్వమైన రాజ్యాంగాన్ని ఏర్పరిచింది. దాని నగ్నస్వరూపం చూస్తే, ఇది కేవలం సంఘటిత సైనికపెత్తనం తప్ప మరేమీకాదు. ఇప్పటి ఇండియా చట్టం క్రింద అదేమీ తగ్గలేదు. నిజమైన అధికారం విషయంలోమటుకు, మంత్రులు కేవలం బొమ్మలు. గవర్నర్లు ఆజ్ఞాపిస్తేచాలు. కలెక్టర్లు, పోలీసు. మంత్రులను అధికారాన్నుండి తొలగించి, అరెస్టుచేసి. జైళ్ళలో బంధించవచ్చు. కాబట్టే కాంగ్రెసు అధికారం స్వీకరించడం, ఈచట్ట నిర్మా తలు ఉద్దేశించినట్టు చట్టాన్ని అమలుజరపడానిక్కాదు : నిజమైన భార తీయ నిర్మిత చట్టంతో దీనిని తొలగించేరోజును శీఘ్రంగా వచ్చేట్టుచేయ డానికేనని నేను సూచించాను."

కాని ఇలాంటి విధానాన్ని ఒక్క విప్లవకర నాయకత్వమే కొనసాగించ గలదు. మంత్రివర్గాలపై పెత్తనంచేసే ప్రధాన మితవాదనాయకులు, ఇందుకు భిన్న మైన విధానాన్ని అవలంబించారు. ఆచరణలో "ఆచట్ట నిర్మాతలు ఉద్దేశించిన పద్ధతిలో అమలు జరపడానికే" ప్రారంభించారు; ఈప్రయోగం 'విజయవంతం' అయినందుకు సామ్రాజ్యవాద ప్రతినిధులు తమ సంతృప్తిని దాచుకోలేదు. మొట్ట మొదట్లో, పౌరహక్కులు, రైతుచట్టాలు, సాంఘిక, విద్యా, ఆరోగ్యసంస్కరణ లకై చేసిన ప్రయత్నాలు వగైరాలలో కొంతవరకు పరిమితమైన విజయాలు సాధించారు. కాని ప్రధానమైన సామ్రాజ్యవాద దోపిడీ మూలపీఠాన్నిగాని, ప్రజా బాహుళ్య నిరుపేదతనానికి మూలకారణాలనుగాని వేనినీ ముట్టనేలేదు. యీ సంస్కరణలకు ప్రతిఫలంగా, ప్రజాకోటికి వ్యతిరేకమైన సామ్రాజ్యవాద పాలనా సంస్థలుగా ఈ మంత్రివర్గాలు క్రమక్రమంగా బాహాటంగా పనిచేయసాగాయి.

కాంగ్రెసుమంత్రులు సాధించిన ముఖ్య విజయం పౌరహక్కులరంగంలో. మొదటిదశలో ఈ విషయంలో చాల పురోగమనం కన్పించింది. క్రమక్రమంగా

రాజకీయ ఖైదీలందరినికూడ వదలిపెట్టారు. 1922 చౌరీచౌరా కేసుల్లో శిక్షలు పొంది, 1921 మాప్లా తిరుగుబాటులోశిక్షలుపడి ఇంకా జైళ్ళలో మ్రగ్గుతున్న వారినికూడ వదిలిపెట్టారు. గార్వాలీ సైనికులనుకూడ విడుదల చేశారు. రాజకీయ సంస్థలు చాలవాటిపై నిషేధం తొలగించారు (కాని కేంద్ర ప్రభుత్వం నిషేధించిన కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగలేదు) రాజకీయ వర్కర్లు స్వేచ్ఛగా తిరిగేందుకు ఇదివరకున్న నిర్బంధాలను తొలగించారు. పత్రికలనుండి తీసుకున్న ధరావతులను తిరిగి ఇచ్చేశారు. రాజకీయాభిప్రాయాలమూలంగా, ప్రభుత్వం తన అచ్చు పనులను - ప్రకటనలను వేయకూడదని నిర్ణయించిన పత్రికలపై ఆటంకాలు రద్దయ్యాయి. రాజకీయ వాజ్మయం విరివిగా వెలువడింది. ఇదికాంగ్రెసురాష్ట్రాలలో కొంతవరకు పత్రికా స్వాతంత్ర్యాన్ని, భావప్రకటనా స్వాతంత్రాన్ని తెలియజేస్తుంది.

అయినా మరోప్రక్క సామ్రాజ్య పోలీసు పరిపాలనా సంస్థలుగా కాంగ్రెసు మంత్రివర్గాల పాత్ర త్వరలోనే కనిపించింది. మద్రాసు ప్రభుత్వం, ఒకప్రముఖ సోషలిస్టుకు రాజద్రోహ నేరంక్రింద ఆరు నెలలు శిక్షవేసింది. ఇది అధికారానికి వచ్చిన కొన్ని నెలల్లోనే జరిగి ప్రజలకు విభ్రాంతి కలిగించింది. పాడు 124 ఏ (రాజద్రోహ ప్రచారానికి) సెక్షన్. 144 సెక్షన్లు అమలు జరపడం అక్కడక్కడా జరిగింది —— కాంగ్రెసు పూర్వం అపరిమితంగా ఖండించిన అనేక నిర్బంధ చర్యలనే మంత్రివర్గం అమలు జరిపింది. ఇందుతో కాంగ్రెసు పత్రికలలో తీవ్రవివాదం బయలుదేరింది. సామాన్యంగా దేనికైన వర్తింపచేయ వీలున్న 'అహింసా సిద్ధాంతం' ఈసారి పోలీసు చర్యలకు, 'హింసను ప్రచారం' చేశారని పరిగణింపబడే వారిని అరెస్టు చేసేందుకుకూడ అనువర్తింపజేయబడింది. 'హింసను ప్రచారం చేయడం' అనే పదం స్వేచ్ఛగా, ప్రతిదానికీ ఉపయోగించేవారు. అప్పుడున్న పాలనకు వ్యతిరేకమైన అభిప్రాయాలున్నా, సామాన్య ప్రజాపోరాటాలను బోధించినా అదంతా 'హింసా ప్రచారం' క్రిందకే జమకట్టబడింది. త్వరత్వరగా అభివృద్ధి చెందుతున్న కార్మిక, కర్షకోద్యమాలను చూచి, కాంగ్రెసులోని ఉన్నత వర్గాల, మితవాద నాయకుల భయం ఈఘర్షణ వెనుక కనబడుతుంది.

సామాజిక, ఆర్థిక రంగాలలో చాల పరిమితమైన 'కార్యక్రమానికేకాంగ్రెస్ మంత్రివర్గాలు ప్రయత్నించాయి. సామ్రాజ్యవాదం పునాదిగానున్న ఆర్థిక వ్యవస్థ. ప్రస్తుత భూమివిధానం తెస్తున్న పెద్ద ఆటంకాలను తొలగించ బూనుకోలేదు, కాంగ్రెసు నాయకత్వంలోని మితవాద కూటమి పై పలుకుబడిగల భూస్వాములకు ధనికులకు చాలా అనుకూలంగా మంత్రులు పనిచేశారు.

కొన్ని తాత్కాలిక చట్టాలను ముఖ్యంగా రైతుల విషయంలో చేశారు. రైతుల అప్పువిషయంలో, పాతబాకీలలో కొంత తగ్గించేందుకు మదరాసు రైతు ఋణవిమోచన చట్టంచేశారు. బొంబాయి, యు. పి. లో లాగే వెంటనే రైతు అప్పులను కొన్నాళ్ళు వసూలు చేయరాదని (మారుటోరియం) ప్రకటిం

చడం. అప్పులు తగ్గిచడం, వడ్డీ తగ్గిచడం జరిగింది. వడ్డి సామాన్యంగా నూటికి ఆరు తొమ్మిది వంతులు విధించబడింది. భూమినుండి వెళ్ళ గొట్టకుండా రైతులను కాపాడేందుకు, జమీందారీ మగతా పెంచకుండా చేసేందుకు, బాకీలను ఏవేవో చేర్చకుండా చేసేందుకు కౌలుచట్టం చేశారు. మగతా బాకీల వడ్డీ తగ్గింపుకూడ చేశారు. కొన్నిచోట్ల భూమిశిస్తును (రిమిషన్) మినహా యించారు. బొంబాయిలో వెట్టిచాకిరీ చేసే 40 వేలమంది 'దుబ్లా'కు విముక్తి కల్పించారు.

రైతుచట్టాల వ్యాప్తి. అందువల్ల కలిగే ప్రయోజనం చాల సంకుచితంగా ఉంది. ఈ చట్టాలకు రైతులెంతో పెద్ద ఆందోళన చేయవలసివచ్చింది. ఈచట్టాన్ని విస్పారంచేయాలని తమ పలుకుబడి నుపయోగించే భూస్వాముల ఆటంకాన్ని ఎదుర్కోవలసివచ్చింది. మొత్తం అప్పులలో చాల కొద్దిభాగాన్ని మాత్రమే చట్టం తొలగించింది. కౌలుచట్టం కొద్దిమంది జమీన్ రైతులకే ఉపయోగించింది. (బొంబాయి కౌలుచట్టంతోబాటు జతపరచిన ప్రకటనను బట్టి ఇది 100కి 4 గురు కౌలుదార్లకే వర్తిస్తుంది). ముఖ్యమైన కౌలు విధానాన్ని ఈ చట్టం ఎత్తుకోనేలేదు. వ్యవసాయకూలీలకు ఈ చట్టాన్ని వర్తింపజేయలేదు. మదరాసు రాష్ట్రంలో 100కి 40 మంది ఉన్న వ్యవసాయకూలీలకు రైతు ఋణవివారణ చట్టం అమలుజరపలేదు. అన్ని రైతు చట్టాలలోను ఈ పరిమితులు కన్పిస్తూనేఉన్నాయి ఇలా కొన్ని చిన్న తాత్కాలిక సౌకర్యాలుచేసినా, జనసామాన్యానికి పెద్ద సౌకర్యాలు చేయా లంటే. తీవ్రచర్యలకు పూనుకోవాలని పై పరిమితులు తెలుపుతున్నవి. భూస్వాముల వ్యతిరేకతను ఎదిరించలేని మంత్రుల బలహీనతవల్ల ఏర్పడిన అసంతృప్తి మూలంగా బీహారు. ఒరిస్సా. యు. పి. లలో రైతు ఆందోళన పరివ్యాప్తమైంది. "కాంగ్రెసు-జమీందారీ ఒడంబడిక" అనే దానిని తీవ్రంగా ఖండించారు. మొత్తం మీద కౌలుచట్టాలు చిన్న కౌలుదారును, భూమిలేని రైతును కాపాడడానికంటె పెద్దరైతును రక్షించడానికే ఉద్దేశింపబడ్డాయి.

ఇక పారిశ్రామిక కార్మికవర్గంలో కాంగ్రెస్ మంత్రివర్గ నిర్మాణంవల్ల కార్యక్రమం, జీతాల కోర్కెలు, కార్మికసంఘ నిర్మాణం పురోగమించింది. 1937 లో మొత్తం సమ్మెచేసిన రోజులు 90 లక్షలు - అంటే అంతక్రితం మూడేళ్ళలో మొత్తం సమ్మెచేసిన దినాలకంటె హెచ్చు - 1929 తర్వాత ఇన్ని సమ్మె లెన్నడూ జరగలేదు. సమ్మెలో పాల్గొన్న కార్మికుల సంఖ్య 6,47,000. ఇదే రికార్డులో ఉన్న అత్యుచ్చ సంఖ్య. కార్మికులకు - యజమానులకు మధ్య సమాధానం కుదర్చడానికి ప్రయత్నిస్తూ కాంగ్రెస్ మంత్రులు అందుకు 'కార్మిక తగాదా చట్టాన్ని' ఉపయోగించారు. కార్మికుల స్థితిగతులను బాగుపరచేందుకు కార్మికుల జీతాలు హెచ్చించేందుకు తమ పలుకుబడిని ఉపయోగించారు. బొంబాయి బట్టలమిల్లు కార్మిక విచారణ కమిటీ, మిల్లు కార్మికుల జీతాలు హెచ్చించాలని సూచించింది. (మిల్లు యజమానులు అందుకు అసమ్మతి తెలియజేస్తున్నప్పటికీ)

జీతాల హెచ్చింపు, యూనియన్ గుర్తింపు అనే ప్రాతిపదికపై యు. పి. ప్రభుత్వం కాన్పూరు సమ్మెను పరిష్కరించడంలో తోడ్పడింది 1938 లో ఈ నిర్ణయాలను వ్యతిరేకించాలని యజమానులు ప్రయత్నించగా కాంగ్రెస్ - కార్మికుల ఐక్యత విజయం పొందింది.

సమ్మె ఉద్యమం విషయంలో సమ్మెహక్కు, ట్రేడ్‌యూనియన్ గుర్తింపు అనే తీవ్రసమస్యలు దయించాయి. తగాదాలు వచ్చినప్పుడల్లా మదరాసు ప్రభుత్వం కార్మికులకు వ్యతిరేకంగానే జోక్యం కల్పించుకొంది. షోలాపూర్‌లో 144 సెక్షన్ (ఊరేగింపుల నిషేధం, అయిదుమంది కెక్కువ సమావేశం కాకూడదన్న నిషేధం) పెట్టడం, సమ్మెలకూ — కార్మిక కార్యకలాపాలకు వ్యతిరేకంగా ప్రభుత్వం గావించిన నిర్బంధచర్యలు వీనిమూలంగాబొంబాయి ప్రభుత్వానికి చాల చిక్కులేర్పడ్డాయి. ఈ చిక్కులు 1938 ఆఖరున బొంబాయి కార్మిక తగాదా బిల్లుతో అత్యుచ్చదశకు వచ్చాయి ఈబిల్లు మూలంగా సమ్మెహక్కు చాల నిరోధించబడింది. సమాధాన సంఘం పనిచేసేందుకు నాలుగు నెలల కాలహరణానికి తావు కల్పించారు. ఈ లోగా చేసే సమ్మెను 'అక్రమం'అని ప్రకటించారు; యూనియన్లను రిజిష్టర్ చేయాలంటే ఎన్నో చిక్కునిబంధనలు పెట్టారు. ఇందువల్ల కంపెనీ యూనియన్లపైనా, యజమానుల ఆదరమున్న సంఘాలపైన పక్షపాతంచూప వీలు ఏర్పడింది. ట్రేడ్ యూనియన్ ప్రతినిధుల సంప్రతింపుల మూలకంగా కొన్నిమార్పులు చేశారు. కాని ముఖ్య సూత్రాలేవీ మారలేదు. ఇందుకు వ్యతిరేకంగా నవంబర్ 7వ తేదీ అసమ్మతి సమ్మె చేయమని బొంబాయి ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కోరింది. ఈ సమ్మెలో కార్మికులెందరో పాల్గొన్నారు. దానిపై పోలీసులుపడి కార్మికులపై కాల్చారు. ఇద్దరు చనిపోయారు — ఎందరో గాయపడ్డారు.

సాంఘిక సంస్కారరంగంలో, కాంగ్రెసుమంత్రులు తమ దృష్టినంతా మద్యపాన నిషేధంపై కేంద్రీకరించారు. ఈ నిషేధం కొన్ని ప్రాంతాలకే వర్తింప జేశారు. (మత్తు పదార్థాల అమ్మకం సామ్రాజ్య ప్రభుత్వమే హెచ్చించింది. తన ఏజంట్లుద్వారా పెంచింది. ఇందులో ప్రభుత్వానికి ఆదాయం వచ్చేది. దీని నిషేధం అంటే ఆర్థికంగా నష్టపడడమన్నమాట) విద్యా సంస్కరణలవేపుకూడ కొంత పనిచేశారు. ఏదైనా తీవ్ర సంస్కరణకు డబ్బు అవసరం. కాని డబ్బులేదు. సాంఘికచట్టాలు కొన్ని తెచ్చే ప్రయత్నం జరిగింది. ఉదాహరణకు యు. పి. లో స్త్రీ కార్మికులకు ప్రసూతి సౌకర్యం ఇచ్చారు. ఉన్న డబ్బులోనే ప్రజారోగ్యానికి కొన్ని చర్యలు తీసుకున్నారు. ముఖ్యంగా గ్రామాల నీటి సరఫరాకు, పరిశుభ్రతకు శ్రద్ధ తీసుకున్నారు.

ప్రతి పనికీ ఎదురు వచ్చేది, అన్నిటికీ ఆటంకపడేది ఆర్థిక సమస్య. వాస్తవంలో సామ్రాజ్యవాదుల పెత్తనంక్రింద ఉన్న కాంగ్రెసు మంత్రివర్గం దుర్బలతవిది చాటసాగింది ఆర్థిక బలహీనతవల్ల ఏర్పడిన దుస్థితి రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెటులు చూస్తే తెలుస్తుంది. ఎంత కొద్దిమార్పు జరిగిందో బోధపడుతుంది.

## విద్యకు ఖర్చు (వేల రూపాయలలో)

| రాష్ట్రం | 1937—38 | 1938—39 | 1939—40 |
|---|---|---|---|
| యు. పి. | 20,615 | 21,056 | 21,514 |
| బొంబాయి | 18,290 | 19,074 | 20,092 |
| మద్రాసు | 25,796 | 26,751 | 26,457 |

## ప్రజారోగ్యానికి ఖర్చు (వేల రూపాయలలో)

| రాష్ట్రం | (1) 1937–38 | (2) 1938–39 | (3) 1939–40 |
|---|---|---|---|
| యు పి. | 2,252 | 2,456 | 2,378 |
| బొంబాయి | 2 232 | 3,159 | 3,148 |
| మదరాసు | 4 407 | 3 132 | 2,900 |

(1) 1937–38 అసలు ఖర్చయింది; (2) 1938–39 రెండో అంచనా; (3) 1939–40 బడ్జెట్ అంచనా।

మంత్రివర్గ చర్యలకన్నా, మంత్రివర్గ నిర్మాణానుభవం, కాంగ్రెసు పదవీ స్వీకరణ తొలిదశవల్ల కల్గిన ఆశలు, ప్రోత్సాహం మూలంగా జాతీయోద్యమం ఆత్మవిశ్వాసం. ప్రజాచైతన్యం వెల్లివిరిసింది. కాని ఇందువల్ల కలిగిన నష్టం కూడ ఎక్కువే. అప్పుడే రాజీధోరణి గల నాయకత్వంక్రింద, సామ్రాజ్యవాదుల పాలనాయంత్రంలో తగుల్కొవడంలో ఉన్న ప్రమాదాలు కాంగ్రెసు మంత్రులున్న రెండున్నరేండ్లలోను బాగా కనిపించాయి. కాంగ్రెసు సంస్థపైన, మంత్రులపైన, పెత్తనంగల ప్రధాన మితవాదనాయకత్వం ఆచరణలో సామ్రాజ్యవాదంతో సహకారం ఎక్కువ చేయసాగింది. పైవర్గాల భూస్వాముల, ధనికుల ప్రయోజనాలకై బహిరంగంగా పనిచేయసాగింది, ప్రజాపోరాటంలోని తీవ్రభావ ప్రకటననూ, విధానాలనూ తీవ్రమైనద్వేషభావంతో చూడసాగింది. మంత్రుల పాలనానుభవంతో పాటు అసంతృప్తి పెరిగింది. జాతీయ స్వతంత్రపోరాటపు నిశ్చితకార్యక్రమం కాంగ్రెసు మంత్రులద్వారా పరిష్కారం చేయ వీలుకాదని రానురాను స్పష్టపడ సాగింది కాబట్టి జాతీయోద్యమంలో నూతనసంక్షోభం వృద్ధికాజొచ్చింది.

## 4. ఫెడరల్ రాజ్యాంగం - వృద్ధిపొందుతున్న సంక్షోభం

1938 ఫిబ్రవరి హరిపుర కాంగ్రెసులో రాజ్యాంగచట్టంలో ఫెడరల్ భాగాన్ని గూర్చి, దానిని అమలుజరపడంగూర్చి తమ విధానాన్ని నిర్ణయించారు. ఈ క్రింది తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

"కాంగ్రెసు నూతన రాజ్యాంగ చట్టాన్ని నిరాకరించింది. భారత ప్రజలు అంగీకరించే రాజ్యాంగాన్ని ప్రజలే ప్రజాపరిషత్తుద్వారా స్వతంత్ర

ప్రాతిపదికపై నిర్మించాలని కాంగ్రెసు ప్రకటించింది. ఈ రాజ్యాంగ నిర్మాణంలో ఏ విదేశ ప్రభుత్వానికీ జోక్యంఉండరాదు. ఈ నిరాకరణ విధానాన్ని అనుసరించినప్పటికి స్వతంత్ర పోరాటంలో దేశాన్ని దృఢతరం చేసేందుకు కాంగ్రెసు మంత్రివర్గాలు రాష్ట్రాల్లో ఏర్పడవచ్చునని అంగీకరించాము. ఇక అమలు పరుస్తామంటున్న ఫెడరేషన్ విషయంలో ఇలాంటిఆలోచన తాత్కాలికంగా గాని, కొన్నాళ్ళవరకుగాని అనువర్తించదు. ఈఫెడరేషన్ను దేశంపై రుద్దితే భారతదేశానికి అపారనష్టం కలుగుతుంది. సామ్రాజ్యవాదుల పెత్తనము దాస్యంయొక్క శృంఖలాలింకా బిగుసుకుంటాయి. ప్రభుత్వ ప్రధాన కార్యక్రమంలో, బాధ్యతలో ఈ ఫెడరేషన్ ప్రజలను దూరంచేస్తున్నది.

"కాబట్టి ఫెడరల్ పద్ధతిని తిరిగి ఖండిస్తున్నాము. ఆ ఫెడరేషన్ ప్రవేశపెట్టకుండా విరోధించవలసిందని రాష్ట్ర స్థానిక కాంగ్రెసు కమిటీలను ప్రజలందరినీ, రాష్ట్ర ప్రభుత్వాలను, మంత్రులను కోరుతున్నాము. ప్రజాభీష్ట ప్రకటనకు విరుద్ధంగా దానిని రుద్దదలచితే ఆ ప్రయత్నాన్ని సర్వవిధాలా ప్రతిఘటించాలి. రాష్ట్ర ప్రభుత్వాలు, మంత్రి వర్గాలు అందుతో సహకారంచేయ నిరాకరించాలి. అలాంటి పరిస్థితే ఏర్పడేట్టయితే ఈ విషయంలో అవలంబించవలసిన పంథాను నిశ్చయించి దానిని అమలు పరచేందుకు అఖిలభారత కాంగ్రెస్ కమిటీకి అధికారమిస్తున్నాము."

ఈ తీర్మానం ఫెడరేషన్ను ఖచ్చితంగా త్రోసివేసింది. రాయబారాలకుకూడ ఆస్కారమివ్వలేదు. ఈ విధానం స్వపరిపాలన మార్గంలో ముందడుగు గాక, సామ్రాజ్యవాదుల పెత్తనం మరింత దృఢం చేసుకునేందుకేనన్న దృక్పథంపై ఇలా ఖచ్చితంగా బేషరతుగా కాంగ్రెస్ నిరాకరించింది.

ఫెడరల్ రాజ్యాంగాన్ని సామ్రాజ్యవాదం రుద్దదలంచితే కాంగ్రెస్ అనుసరించనున్న విధానం, కార్యక్రమం ఏమిటి? నూతన పోరాటదశ, కార్యక్రమ పద్ధతుల సమస్యంతా ఇందుతో ముందుకు వస్తుంది. ఇలాంటి విషమసమస్యకు సిద్ధాంతరీత్యా తప్పితే హరిపుర కాంగ్రెస్ ఖచ్చితమైన సమాధానమివ్వలేదు.

ఈ నిరాకరణ కేవలం ప్రాధమికచర్య అని, రాష్ట్రాలలోలాగే ఏదోఒక సమాధానం ఆఖరుకు కుదురుతుందని ప్రభుత్వవర్గాల దృక్పధం. ఇలా అనుకోవడం జాతీయ ప్రతిఘటనా బలాన్ని తక్కువ అంచనా వేయడమే అయినప్పటికి, ఇందుకు ఆస్కారం లేకపోలేదు. ఎందుకంటే నూతన మహాపోరాటాని కేమీ సన్నాహాలు జరగలేదు. కొన్ని సూత్రాలు మార్చే పద్ధతిపైన, చట్టాన్ని ఆచరణలో అమలు జరిపే పద్ధతిపై మితవాద నాయకత్వంలోని ప్రధానభాగం బేరం సాగిస్తుందన్న వైఖరి బహిరంగమైంది. కాబట్టే పై ఊహలకు ఆస్కారం ఏర్పడింది.

1938 లో వివిధ సామ్రాజ్యవాద ప్రతినిధులకు, వ్యక్తిగత కాంగ్రెసు నాయకులకు మధ్య అనేక సంప్రతింపులు సాగాయి. రాజీ కుదరవచ్చుననే

వదంతులు వ్యాపించాయి. కాని ఇలాంటి వానికి అధికార ప్రకటనల ఆధారం ఏదీలేదు. అయినప్పటికీ, ఫెడరల్ రాజ్యాంగ చట్టంలో కొన్ని మార్పులు చేసిన పక్షంలో, రాజీ కుదరవచ్చునని అర్థంవచ్చే ప్రకటనలు కొందరు మితవాదనాయకులు చేసిన మాట నిజమే. "పార్లమెంటరీ పద్ధతికి దిగజారడం" చూచి ఇప్పటికీ గాభరాపడుతున్న అతివాదులు, కాంగ్రెస్‌నాయకత్వంలో మితవాదపక్షమే ప్రాబల్యం కాగలదని తెలుసుకున్నారు. కాబట్టి ఎన్ని వీరవాక్యాలు పల్కినా ఆఖరుకు లొంగుబాటు తప్పదేమోనని సందేహించారు.

వాస్తవంలో ఈ వాదోపవాదాల వెనుక వేరొక తీవ్ర సమస్య ఉంది. అది కాంగ్రెస్ ప్రజాపునాదికి సంబంధించింది కాంగ్రెసుకూ, కార్మిక - కర్షక ప్రజా పోరాటానికి ఉన్న సంబంధంగూర్చిన సమస్య ఇది. కాంగ్రెస్ ప్రజా ప్రాతిపదికను ప్రజాపోరాటంలో తన సంఘటనాశక్తిని బలపరచుకోవాలి. అప్పుడే ఫెడరేషన్‌ను భగ్నంచేసి, తన షరతులను సామ్రాజ్యవాదులతో ఒప్పింపజేయ గల్గుతుంది. కాని దినదినాభివృద్ధి చెందుతున్న కార్మిక - కర్షక ఉద్యమంచూచి కాంగ్రెస్‌నాయకత్వం, పెత్తనం వహించేవారు గాభరాపడ్డారు. వర్గ పోరాటాన్ని, అహింసను ఉల్లంఘించిందన్న సాకుతో నిరుత్సాహపర్చారు. సమ్మెలకు, అశాంతికి వ్యతిరేకంగా పోలీసు నిర్బంధ చర్యలను ఉపయోగించ సిద్ధపడ్డారు లేదా అలాంటి చర్యలను సమర్థించారు. ఇవన్నీ చూస్తే ఆ నాయకులు సామ్రాజ్యవాదంతో క్రమంగా రాజీ ధోరణిలోనే నడుస్తున్నారని సహజంగా అనుకో వీలవుతుంది.

ఇలాంటి పరిస్థితిలో, క్రిందటిసారి పోటీ లేకుండా నియమితుడైన సుభాష చంద్రబోసు 1939లో కాంగ్రెసు అధ్యక్షపదవికి తిరిగి పోటీచేయ నిశ్చయించాడు దేశవ్యాప్త పోరాటాన్ని ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా సాగించాలి, రాజీధోరణులను నిరోధించాలి. అనే రాజకీయ సమస్యలపై ఆయన పోటీచేశాడు. రాజీధోరణి మితవాద నాయకత్వంలో కనిపిస్తున్నదని ఆయన అన్నాడు. అధ్యక్షపదవికిలా పోటీ చేయడం ఇదే మొదటిసారి. కాంగ్రెస్ వర్కింగుకమిటీ ఎన్నుకోబడదు. దానిని కేవలం అధ్యక్షుడే నియమిస్తాడనేది గమనింపవలసిన విషయం. అలాచూస్తే కాంగ్రెస్ విధానం విషయంలో సభ్యులవైఖరిని తెలిపేందుకు కూడ ఇదొక అవకాశం, బోసు ప్రతిపక్ష అభ్యర్థిని (డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య) గాంధీజీ, మాజీ వర్కింగుకమిటీ సభ్యులూ బల పరిచారు; బోసును అతివాద జాతీయవాదులు, సోషలిస్టులు. కమ్యూనిస్టులు బల పరచారు. బోసుకు 1575 వోట్లు, ప్రత్యర్థికి 1376 వోట్లు వచ్చాయి. బోసు అధ్యక్షుడయ్యాడు.

కాంగ్రెసు అధికార యంత్రానికి వ్యతిరేకంగా జరిగిన బోసుఎన్నిక తీవ్రమైన ఆంతరంగిక సంక్షోభానికి దారితీసింది. అధ్యక్షుని ఎన్నిక కాంగ్రెసు అనుయాయుల భావాలకొక కొలతబద్దగా ముఖ్యమే అయినప్పటికీ, ఇదొక రాజకీయ నిశ్చిత నిర్ణయమని కాని, సభ్యులలో తగినంత అతివాదులకు సంఖ్యా బలమున్నదనేందు

కిదొక నిదర్శనమని కాని తలంపవీలులేదు. ఈ విషయాన్ని తర్వాతిత్రిపురీ కాంగ్రెసు చర్చాంశాలు రుజువు చేశాయి. కాని సభ్యుల అభిప్రాయం క్రమంగా అతివాదంవేపు మొగ్గుతున్నదనేందుకిదొక సూచనఅని నిస్సందేహంగా చెప్పవచ్చు. గాంధీజీయే దీనిని తన స్వంత అపజయంగా భావించి ఇలా ప్రకటించాడు: "ప్రతినిధులు నేనే సిద్ధాంతాన్ని. విధానాన్ని అవలంబిస్తున్నానో వానిని ఆమోదించడంలేదని స్పష్టపడింది" టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక "బోసు ఎన్నిక కాంగ్రెసు అతివాదులవేపు మొగ్గుతున్నదనేందుకు సూచన" అని తన తీర్పునిచ్చింది. "అతివాదంవేపు. ప్రజల స్థిర సంకల్పం చెల్లాలనే ధోరణిని ఈ ఎన్నిక స్పష్టంగా సూచిస్తున్నది." అని బొంబాయి క్రానికల్ పత్రిక వ్రాసింది. బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఎన్నికలలో. కమ్యూనిస్టులు బాగా గెల్చారు. మీరట్ కుట్ర కేసులో ఖైదీగా ఉండిన అధికారికి. ఆ పట్టణంలో ఏ అభ్యర్థికీ రానన్ని అత్యధికమైన వోట్లు వచ్చాయి. ఈ విషయం గమనించదగింది. అంతేకాక తర్వాతవచ్చిన బొంబాయి మునిసిపల్ ఎన్నికలలో నలుగురు కమ్యూనిస్టు అభ్యర్థులు అందరికంటె ఎక్కువ వోట్లు సంపాదించారు.

ఈ అధ్యక్షుని ఎన్నిక ఫలితం, గాంధీజీకి, ప్రధాన మితవాదనాయకులకు ఆశాభంగం కలిగించింది. వారు ఈ ఫలితంతో ఏర్పడిన అసంతృప్తిని దాచుకోలేదు. కాంగ్రెసు "చెడిపోయింద"ని "దొంగ సభ్యులను" చేర్చారని గాంధీజీ ఒక ప్రకటన చేశాడు. అధికసంఖ్యాకుల విధానాన్ని ఆమోదించకపోతే మితవాదనాయకులు కాంగ్రెసును వదిలివెళ్ళి పోతారనికూడ ఆయన భయపెట్టాడు: "కాంగ్రెసుభావాలు కలవారు బయటఉన్నా. దానికెక్కువ ప్రాతినిధ్యం వహిస్తారు. కాబట్టి కాంగ్రెసులో ఉండడం కష్టంగాతోచినవారు బయటికి వచ్చివేయవచ్చును."

వర్కింగుకమిటీలోని 15 గురు సభ్యులలో పన్నెండుగురు రాజీనామా నిచ్చారు. ఇందుకు వారు చెప్పిన కారణాలు; బోసుకు స్వేచ్ఛగా రంగం వదిలివేయడానికని. బోసు తన ఎన్నికల ప్రచారంలో తమ విజాయితీనే శంకించాడని వారు వివరించారు. తన ప్రత్యేక దృక్పథాన్ని మరొక ప్రకటనలో వివరించినప్పటికి జవహర్లాల్ నెహ్రూకూడ రాజీనామానిచ్చాడు. (ఈ సంక్షోభంగూర్చి "మన మెక్కడున్నాం?" అనే కరపత్రంలో ఆయన తన దృక్పథాన్ని పూర్తిగా వివరించాడు)

1939 మార్చిలో జరిగిన త్రిపురీకాంగ్రెసు. సంస్థలో ఐక్యత నిలబెట్ట గలిగింది కాని. వివాదాన్ని పరిష్కరించలేకపోయింది. జాతీయవాంఛనుగూర్చి ప్రధాన తీర్మానం చేశారు. ఇండియాచట్టం (1935) లోని ఫెడరల్ భాగానికి ఏమాత్రం రాజీపడని ప్రతిఘటనను తెలియపరుస్తూ. దానిని రుద్దితే ప్రతిఘటించి తీరుతామని ఆ తీర్మానంలో పునరుద్ఘాటించారు.

నాయకత్వంలో వచ్చిన చీలిక విషయమై గాంధీజీ అనుయాయులు తెచ్చిన తీర్మానం తీవ్ర వాదోపవాదం జరిగింతర్వాత ఆఖరుకు నెగ్గింది. ఈ తీర్మానం

నాయకత్వంలో విశ్వాసాన్ని పునరుద్ఘాటించింది: గాంధీజీ విధానాన్ని ఆమో దించింది. గాంధీజీ ఇష్టానుసారంగా వర్కింగ్ కమిటీని, అధ్యక్షుడు ఎన్నుకో వాలని ఆ తీర్మానంకోరింది. ఇందులో కాంగ్రెసులో సభ్యుడు కాని గాంధీజీ వ్యక్తి గత నియంతృత్వం ఆచరణలో వాస్తవిక నిరూఢి అయింది. ఈ తీర్మానం విషయ నిర్ణయసభలో 218-135 వోట్లతో నెగ్గింది. కాంగ్రెస్ మహాసభ దీనిని ఆమోదిం చింది.

త్రిపురీ కాంగ్రెసు తర్వాతి అనుభవం, ఈ వివాదం పరిష్కారం కాలేదని తెలియజేసినది. వర్కింగ్ కమిటీ నియామకం విషయమై బోసుకు గాంధీజీకి మధ్య జరిగిన సంప్రతింపులు భగ్నమయ్యాయి. 1939 ఏప్రియల్‌లో బోసు అధ్యక్ష పదవికి రాజీనామాచిచ్చాడు; అఖిలభారత కాంగ్రెసు కమిటీ రాజేంద్ర ప్రసాదును కొత్త అధ్యక్షునిగా ఎన్నుకున్నది. ప్రతిపక్ష వర్గాలలో తన్ను బలపరిచే వారిని సంఘటితపరచి కాంగ్రెసులో "ఫార్వర్డుబ్లాకు" అనే సంస్థను ఏర్పరచడానికి బోసు పూనుకున్నాడు. "కాంగ్రెసులోని అతివాద, సామ్రాజ్య వ్యతిరేక వర్గాలను సంఘ టిత పరచడం" ఈ ఫార్వర్డుబ్లాకు ఆశయమని ప్రకటించాడు.

ఫార్వర్డుబ్లాకు, కాంగ్రెసు నియమావళినిగాని, ఆశయ విధానాలను, కార్య క్రమాన్నిగాని ప్రధానంగా విమర్శించలేదు. కేవలం అప్పుడున్న నాయకత్వం విషయంలో అసంతృప్తిని వెల్లడించింది; స్వతంత్రానికి, ఫెడరల్ హోదాకు వ్యతి రేకంగా పోరాటానికి సన్నాహాలు చేయాలన్నది. 1939 వసంతంలో ఈ విధానం చాల తీవ్రదశకు వెళ్ళింది. అఖిలభారత కాంగ్రెస్ కమిటీ. కాంగ్రెస్ నియమావళిని బిగించాలని తీర్మానించింది. కాంగ్రెసు మంత్రుల చర్యలగూర్చి కాంగ్రెసు రాష్ట్ర కమిటీల అధికారాలను పరిమితంచేశారు. కాంగ్రెసు కమిటీల అనుజ్ఞలేకుండా, కాంగ్రెసువాదులు సత్యాగ్రహోద్యమాలు నడపరాదని ఆ తీర్మానంలో నిశ్చయించారు. కాంగ్రెసు పెత్తనంనుండి విడిపోతున్న స్వతంత్ర కార్మిక, కర్షక ఉద్యమ అభివృద్ధిని అరికట్టడానికి ఇది ఉద్దేశింపబడింది. ఇది కార్మిక కర్షకుల రోజువారీ పోరాటానికి ప్రతిబంధకమని అంతా వ్యాఖ్యానించారు. ప్రతిపక్ష వర్గాలందరూ కలిసిన "అతివాద సంఘటనతో" బోసుకలిసి, ఇందుకు అసమ్మతి తెల్పుతూ, జులై 9 వ తేదీ బహిరంగ ప్రదర్శనలు జరపాలని కోరారు. ఇది కాంగ్రెసు క్రమ శిక్షణకు విరుద్ధమన్నారు. బోసును బెంగాల్ రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షతనుండి మూడేళ్ళవరకు కాంగ్రెసులో, ఏ హోదాను వహించరాదని నిర్ణయించారు.

కాంగ్రెసులోని ఈ తీవ్ర విభేదాలు, దేశంలో పెరిగిపోతున్న సంక్షో భానికి సూచనాప్రాయం. కాంగ్రెసు మంత్రివర్గాల నుపయోగించుకోవడం ద్వారా పురోగమనానికున్న అవకాశాలు అంతరించాయని, సామ్రాజ్య వాదానికి-జాతీయోద్యమానికి మధ్య పోరాటం తప్పనిసరిగా రానున్నదని రాను రాను అతిస్పష్టం కాజొచ్చింది. ఉన్నత కాంగ్రెస్ నాయకులలో వచ్చిన విభేదం, వ్యక్తిగత విభేదాలతో సమ్మిళితమైంది. కాబట్టి; ఇంకా ఖచ్చితమైన రాజకీయ

విభాగాన్ని ప్రతిబింబించడంలేదు. కాంగ్రెస్ సభ్యులలోను, ప్రజాసామాన్యంలోను సంక్షోభసమస్య లేదు. కాంగ్రెస్‌లో పెత్తనంలోవున్న గాంధీవాద నాయకులకూ, 'ఫార్వర్డుబ్లాకు'కూ మధ్య కార్యక్రమ, విధాన, ఆశయాల విషయంలో ఇప్పటికీ ప్రధానవిభేదంలేదు. "ఫార్వర్డుబ్లాకు, గాంధీజీ వ్యక్తిత్వంమీద, ఆయన అహింసాత్మక సహాయనిరాకరణ సిద్ధాంతంమీద అత్యంతగౌరవం కలిగిఉన్నది. అయినప్పటికి ఇప్పటి కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీపై తప్పక విశ్వాసం కనబరచాలిసిన అవసరంలేదు." అని బోసు ప్రకటించాడు. ప్రజాఉద్యమ ప్రధానకార్యక్రమమూ, నాయకత్వమూ ఇంకా అభివృద్ధి చెందవలసిఉన్నది కాని జాతీయోద్యమంలో నూతనదశకు పరిస్థితులు పరిపక్వస్థితికి వచ్చాయని రుజువయింది.

సామ్రాజ్యవాదానికీ, జాతీయోద్యమానికీ మధ్య తీవ్రమవుతున్న సంఘర్షణను యుద్ధంవచ్చి మరింత తీవ్రపరిచింది. నూతన సమస్యలను రేకెత్తించింది. ఆనాటి పరిస్థితి ఇది.

## పదహారో అధ్యాయము

# రెండవ ప్రపంచయుద్ధంలో భారతదేశం

["భారతదేశ భూగోళస్థితి క్రమక్రమంగా అంతర్జాతీయ రాజకీయాలలో భారతదేశాన్ని అగ్రస్థానానికి తేగలదు."—

లార్డుకర్జన్, ఇండియా కౌన్సిల్ ఉపన్యాసం, 1905 మార్చి 23]

రెండవ ప్రపంచయుద్ధగతి భారత దేశాన్ని అంతర్జాతీయ రాజకీయ ప్రవాహంలోనికి కొనివచ్చినది. భారతసేనలను, సంపదను విదేశాలలో ఉపయోగించినప్పటికీ, 1914 నాటి యుద్ధం భారతదేశానికి చాలదూరంలో ఉన్నది. కాని 1942-44 నాటి యుద్ధంలో దురాక్రమణదారులు దాడి భారతదేశానికి అతిసన్నిహితంగా ఉన్న దేశాలను కాజేసి తన సరిహద్దులవరకు వచ్చినది. 1914 నాటి యుద్ధం భారతదేశంపై మోయలేని ఆర్థికభారాన్ని మోపింది. కాని రెండో ప్రపంచ యుద్ధం అంతకన్నా ఎక్కువైన ఆర్థికపీడనకు తావిచ్చింది. అంతేకాక చెప్పరానంత నోట్లముమ్మరం (ఇన్‌ప్లేషన్) ఆర్థిక నిర్మాణవిచ్ఛేదనం, దుర్భర క్షామాలుకూడ రెండో యుద్ధంద్వారా వచ్చాయి. 1914 నాటి యుద్ధం భారతరాజకీయ సమస్యలను మరింత తీవ్రపరిచింది. కాని రెండో యుద్ధం భారత స్వతంత్ర ప్రధానసమస్యను భారతరాజకీయాలలో ప్రాముఖ్యానికి తెచ్చింది, నూతనసమస్యలను, వివాదాంశాలను, తగాదాలను భారతరాజకీయ హృదయంలోనికి చొప్పించింది, ఇందుతో వివిధపార్టీల సంబంధబాంధవ్యాలను తారుమారు చేసింది

1914 కు ముందు ప్రపంచరాజకీయలలో భారతదేశపాత్ర కేవలం బ్రిటిష్ విధానసమస్యగానే పైకి కనిపించి ఉంటుంది. జాతీయోద్యమం తన దృష్టినంతా భారతదేశంలో నడుస్తున్న పోరాటంపైననే కేంద్రీకరించింది. ఇది సహజంకూడ. భారతదేశం స్వతంత్రమయ్యేవరకు, ప్రపంచ రాజకీయాల్లో స్వతంత్ర పాత్రను నిర్వహించాలని వాంఛించడం సక్రమంగా కనిపించదు.

కాని 1931 తర్వాత ప్రపంచ ఫాసిస్టు దండయాత్రనాటినుండి పరిస్థితి మారింది. జాతీయోద్యమంలో విదేశాంగనీతి సమస్యలు ప్రాముఖ్యతనందుకొన్నవి.

రెండవ ప్రపంచ యుద్ధపు ప్రత్యేక సమస్యలనుగూర్చి పరిశీలించేముందు బ్రిటిషు ప్రపంచ సైనిక ఎత్తుగడలలో భారతదేశ పాత్రనుగూర్చి. విదేశాంగనీతి సమస్యలపై జాతీయోద్యమ దృక్పథాన్నిగూర్చి సంగ్రహంగా పూర్వ పరిస్థితులను తెలుసుకోవడం ప్రయోజనకరంగా ఉంటుంది.

## 1. ప్రపంచ వ్యవహారాల్లో బ్రిటిషు విధానం - భారతదేశం

బ్రిటిష్ పాలనక్రిందనున్న భారతదేశ సమస్య విశాలమైన అర్థంలో తొలి నుండీ ప్రపంచ రాజకీయ సమస్యగాను, ప్రపంచ రాజకీయాలలో ప్రధాన సమస్య గాను ఉంటూవచ్చింది.

భారతదేశ పరిపాలనాధికారమనే మూలస్థంభం చుట్టూరానే బ్రిటిషు ప్రపంచ విధానం కేంద్రీకృత మవుతూ వచ్చింది. ఈసంగతివి గత రెండు శతాబ్దులుగా జరిగిన సంఘటనలను పరిశీలిస్తే రాను రాను అతిస్పష్టంగా గోచరిస్తుంది 18 వ శతాబ్దిలో బ్రిటనుకూ ఫ్రాన్సుకూ మధ్యజరిగిన యుద్ధాలకు సన్నిహిత కారణం యూరపులోని సైనిక కేంద్రాల మార్పుగా పైకి కనిపించినప్పటికి. ఆయుద్ధాలు కొత్తప్రపంచంకోసం భారతదేశంపై పెత్తనంకోసమే ప్రధానంగా నడిచాయి. అమెరికా సంయుక్తరాష్ట్రాలు చేయిజారి పోవడంతో భారతదేశం మరింత ప్రధాన మయింది. నెపోలియన్ తన దండయాత్రలను ఈజిప్టుపైకీ, సమీప ప్రాచ్యదేశాలపైకి మళ్ళించినప్పుడు, భారతదేశానికి పురోగమించాలనే ఆశ అతని కుండెడిది. 19 వ శతాబ్దిలో రష్యా ఆశియాలో మరింత విస్తరిస్తుందని, భారత దేశానికి ప్రమాదకరంగా పరిణమిస్తుందని అనిపించింది. 20 వ శతాబ్ది ప్రారంభంలో బ్రిటన్ తానొకటే ప్రత్యేకంగా ఉండాలనే (Isolated) పద్ధతిని వదులుకుంటూనే జపానుతో మైత్రి చేసుకుంది. ఆంగ్లో-జపానుసంధిని సంస్కరించుకున్నప్పుడు. భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనకు జపాను సాయపడాలన్న షరతు చేర్చారు. జర్మనీతో వచ్చిన తగాదా ముఖ్యంగా మధ్యప్రాచ్యంలోని పెత్తనంపైకి తిరిగింది. అందుతో భారతదేశానికి దారి ఏర్పడింది.

తన విజయయాత్రలకేకాక. ఆశియా విస్తరణ విధానానికంతటికీ మనుష్య బలం. వస్తు బలాన్ని సమకూరుస్తూ. బ్రిటనుకు భారతదేశమొక అక్షయఖనిగా తొలినుంచీ పనికివచ్చింది. ఇతర ఆశియాదేశాలలో బ్రిటిష్‌విధాన ఆశయాలకోసం జరిపిన యుద్ధాలమూలంగాను. ఆశియా సరిహద్దులకు అవతలి దేశాలలో జరిపిన యుద్ధాలకుగాను అయినఖర్చులన్నీ భారతదేశంమీద వేసేవారు. ఈ ప్రాతిపదికమీదనే భారతదేశ ప్రభుత్వ ఋణంలో చాలభాగం పెరిగిపోయింది. 1859లో ఒక బ్రిటిష్ ఉద్యోగి ఇలావ్రాశారు.

> "మన సామ్రాజ్యపు హద్దులకు అవతలవున్న దేశాలతో మనం జరిపిన ఆశియాయుద్ధాలలో చాలవరకు భారతప్రభుత్వ ధన పేనా బలంతో జరిపినవే. మరి ఆయుద్ధాల ఆశయాలు చాలవరకు కేవలం బ్రిటిష్‌వారికి

మాత్రమే సంబంధించినవి. మరికొన్నిమాత్రం భారతప్రయోజనాలకు ఎంతో దూరమైన సంబంధంకలవి."

(మేజర్ విన్‌గేటు, "భారతదేశంలో మనఆర్థిక సంబంధాలు" 1859, పుట 17.)

ఈ ప్రాతిపదికమీదనే ఆఫ్ఘనిస్తాన్, బర్మా, సయాం, చైనా, పర్షియా, మెసపొటేమియా, అరేబియా, ఈజిప్టు, అబిసీనియా దేశాలలో యుద్ధాలు సాగింపబడినవి.

భారతదేశంమీద ఆధారపడి ప్రపంచాధిపత్యం సంపాదించుకోవాలనే బ్రిటిష్ సైనికోద్యోగుల, అధికారుల ఎత్తులు, అభిలాషలు అధికారవిస్తరణ యుగమైన 19వ శతాబ్దిలో ఛార్లెస్ నీపర్ వాగుడులో కనిపిస్తాయి. ఈయన 1857 తిరుగుబాటుకు పూర్వం లార్డు డల్హౌసీక్రింద సేనాధిపతిగా ఉన్నాడు :

"నేనే భారతదేశానికి రాజునైవుంటే: మాస్కో, పెకిన్ పట్టణాలను గజగజలాడిస్తాను....అయిదు నదులు, పంజాబు, ఇండస్, సింధునదులు, ఎర్రసముద్రం, మాల్టా ఎంత సన్నిహితమైన భూములు! నదులో ఇవన్నీ ఇండియాకు ఇంగ్లాండుకు ముడిపెట్టడానికి ఎంత అనుకూలమైనవి! నేనే ఇంగ్లాండు రాజునై ఉంటే, ఢిల్లీ రాజభవనంలోనుండి పిడికిలి బిగించి రష్యా, ఫ్రాన్సుల పళ్ళు రాలగొట్టేవాణ్ణి. పడమటంతటా ఇంగ్లాండు నౌకాదళమే విహరించాలి. తూర్పున ఎక్కడచూచినా భారతసేనే కనిపించాలి."

భారతసేనావైశాల్యం, దానికై పెట్టే ఖర్చు కేవలం భారతదేశ ప్రజలను దాస్యంలో బంధించి ఉంచడానికి మాత్రమేకాక, ఇండియా సరిహద్దులకు ఆవల దురాక్రమణకూ, యుద్ధాలకూ తగినట్టు అంచనావేసి ప్రభుత్వం నడుపుతూ వచ్చినది. 1885 లో వైస్రాయి కార్యవర్గసభ్యుడు సర్ కోర్టెనే ఇల్బర్టు నాటి విధానంపై అసమ్మతి తెలుపుతూ ఇలా వ్రాశాడు :

"దేశావసరాలకన్న ఎక్కువగా వున్న సేనా వాహిని సరిహద్దులకు ఆవలనున్న వారిపై దాడి చేయాలనే దురాశలకు కారణం మవుతుంది, అందుకు అప్రతిహతిమైన ఆయుధం అవుతుంది.

(సర్ కోర్టెనే ఇల్బర్టు, అసమ్మతి సూచన, 1885, ఆగష్టు, 14)

తర్వాత కొన్నాళ్ళకే బర్మాపై దాడిచేసి ఆక్రమించడంతో ఈ జోస్యం రుజువయింది. ఆ తర్వాత 1895 నాటి చిత్రాల్ దాడి, తిరాపై జరిగిన దారుణ దండయాత్ర, 1900 లో కర్జన్ క్రింద జరిగిన వాయవ్య సరిహద్దు ప్రాంతాల ఆక్రమణ, 1904 లోటిబెత్తు పైకి పోవడం వరుసగా జరిగాయి.

భారత జాతీయ నాయకుడైన గోఖలే ఈ దురాక్రమణ పద్ధతిని విమర్శించాడు. అందుకు 1904-5 బడ్జెట్ చర్చల సమయంలో సర్ ఇ. ఎల్లిస్ తమ విధానాన్ని సమర్థిస్తూ ఇలా అన్నాడు.

"క్రమ క్రమంగా ఆశియా రాజ్యాలన్నీ ఎందులోనో ఒకందులో కలసి పోతుంటేమనం పర్వత సరిహద్దుమాటున దాగుకొని మనకేంభయం

లేదన్న మూర్ఖ దృక్పథంతో సంతృప్తి పడుతూ కూచోవాలా ?........ ఆశియాలో ప్రభుత్వాల పోటీలో సరితూగేందుకు భారత సేనను భవిష్యత్తులో తప్పక ఉపయోగించాలని నేననుకుంటున్నాను. కేవలం ఆసేన స్థానిక రక్షణకు శాంతిభద్రతలకు మాత్రమేననుకోవడం ఇక ఎంతమాత్రం సాధ్యం కాదు."

ఇదే చర్చలోనే లార్డు కర్జన్ మరింత స్పష్టంగా ప్రకటించాడు ;

"ఇండియా దుర్గం లాంటిది. దానికి రెండువేపులా విశాల సముద్రాలున్నవి. మిగతా ప్రక్క పర్వత శ్రేణులు కోటలుగా నున్నవి. కాని ఈ పర్వతా లేవీ దాటలేనంత ఉన్నతంగాలేవు: సులువుగా ఇతరులు దూరిరాగల ప్రాంతాలు-ఈ కోటల కావల వివిధ వైశాల్యాలూ,ప్రమాణాలూగల ఏటవాలు ప్రదేశాలున్నాయి. ఈ ప్రాంతాలను మనం ఆక్రమించుకోదలచడంలేదు. కాని వీనిని మన శత్రువులు ఆక్రమిస్తుంటే చూస్తూ కూచోలేము. ఈ ప్రాంతాలు మనమిత్రుల చేతిలోఉంటే మనం పూర్తిగాసంతృప్తి చెందగలం; కాని విరుద్ధ శక్తులూ, మనకు మిత్రులు కానివారూ తలచూపితే, వారు మన కోటలక్రిందనే మకాంవేస్తే మనం జోక్యం తీసుకోక తప్పదు. ఎందుకంటే అందువల్ల ప్రమాదం ఏర్పడి, మన రక్షణకే ఒక రోజున భంగకరంగా పరిణమించవచ్చు. అరేబియా, పర్షియా, ఆఫ్ఘనిస్తాన్, టిబెట్ - సయాంవరకుకూడ ఇదే పరిస్థితి"

ఈ లార్డు కర్జన్ విధానం నేటివరకూ బ్రిటన్ అనుసరిస్తున్న విధానంలోకూడా అంతర్గత సూత్రంగా కనిపిస్తుంది. ఈ కర్జన్ విధానం ఆయన వ్రాసిన "దూర ప్రాచ్య సమస్యలు" అనే పుస్తకంలో మరింత విపులంగా వ్రాశాడు.

"భూగోళంలో అతిప్రధాన కీలకస్థానాలలో మూడవకేంద్రంలో భారత సామ్రాజ్యం ఉంది. .... కాని ఆ భారత సామ్రాజ్యం కేంద్రస్థితి, దాని పలుకుబడీ రాజకీయరంగంలో మరింత స్పష్టంగా కనిపిస్తుంది. ఆ దేశానికి దగ్గరలోను, దూరంలోనుఉన్న పొరుగురాజ్యాల భవిష్యత్తుపై ఆసామ్రాజ్యపు పలుకుబడి ఎంతో ఉంది. భారతదేశమనే ఇరుసుపై ఇరుగుపొరుగు రాజ్యాల భావిగతి తిరుగుతూ ఉంటుంది."

(జి యన్. కర్జన్, "దూరప్రాచ్య సమస్యలు" 1894, పుట 9-10 )

1913 ఇండియా కమిటీలో సేననుగూర్చి ఇలా ఉంది : "భారతదేశంలో సేనలను ఇతరదేశాల యుద్ధాలకు ఉపయోగించడంకోసమే బ్రిటిష్ ప్రభుత్వంక్రింద ఉంచడం లేదు, అయినప్పటికి పూర్వంలాగే, ఇండియా ఇతరవిధాల వీలుగాఉంటే విదేశ యుద్ధాలకు సేనలను ఎరువుగా యివ్వవచ్చును."

ఈ విషయంలో భారతదేశాన్నెలా ఉపయోగించుకున్నారో 1914-18 యుద్ధం ఉదాహరణ చూపెట్టింది. దాదాపు పదిలక్షల సేనను - ఇందులో సగానికి పైగా సాయుధదళాలు-ఫ్రాన్సుకు, తూర్పు ఆఫ్రికాకు, ఈజిప్టుకు, మెసపొటేమియా

వగయిరా విదేశాలకు పంపారు. ఇందుకుతోడు కోట్లకొలది పౌనులడబ్బు భారత దేశంనుండి లాగుకున్నారు. నూతన మధ్యప్రాచ్య సామ్రాజ్య ఆక్రమణకు భారతదేశాన్ని కేంద్రం చేసుకున్నారు. అయినప్పటికి టర్కీ పునరుజ్జీవనం, ఇబాన్ సౌదీ అరేబియా బలం ఈ విజయం పూర్తికాకుండా చేశాయి.

పైకమిటీ నివేదికలోకన్నా, ఈషర్ కమిటీ నివేదిక 1920 లో మరింత స్పష్టంగా ఈ విషయం చెప్పారు. భారతదేశానికి వెలుపల, బ్రిటిష్ సామ్రాజ్య ఆయుధంగా భారత సేనను ఉపయోగించుకోవాలన్న అధికారుల భావం ఇందులో తేటతెల్లమవుతున్నది :

"సామ్రాజ్యసేన యావత్తులో ఒక భాగంగా తప్ప, మరొకవిధంగా ఇండియాలోని సైనిక, పాలనను ఊహించలేము."

ఈ సూత్రాన్ననుసరించి, భారత సేనను నేడు మూడువర్గాలక్రింద నిర్మించారు. ఈ పద్ధతిని 1921 లో గత యుద్ధానంతరం సర్వసేనాని లార్డు రాల్సిన్ ఏర్పరచాడు. దీనినే తర్వాతి అధికార పుస్తకం "భారతదేశంలో సేన. దాని అభివృద్ధి"అనే దానిలో వివరించారు. ఈ పుస్తకం 1924 లో ప్రచురితమైంది. ఆ విభాగాలివి :

(1) భూసేన - విదేశాలలో పెద్ద యుద్ధాలకుగాను.

(2) సహాయకసేనలు (కవరింగ్ ట్రూప్స్) ఇవి సరిహద్దు యుద్ధానికిగా ఏర్పరచారు. పెద్దయుద్ధం వస్తే ఈ సేనను తెరగా ఉపయోగపరుచుకొని, ఒడుదుడుకులు లేకుండా సేనా సమీకరణను సాగించడానికిది పనికిరావాలి.

(3) అంతరంగిక రక్షకసేనలు - భారతదేశంలో సేనానివేశాలకుగా ఇవి ఏర్పరచారు.

భూసేనలో 4 డివిజన్లు, 4 (ఇప్పుడు యంత్రాలతో సన్నద్ధ పరచిన) అశ్విక దళాలు ఉంటాయి. దీనికి పెద్ద యుద్ధంలో భారతదేశం దెబ్బతీసే సేన అని అంటారు. సామ్రాజ్యయుద్ధ ఖర్చుల భారం ఎంత ఎక్కువగా భారతదేశం తలపై మోపారో, 1918 తర్వాతి యుగంలో అదెంత ఎక్కువవుతూ వచ్చిందో సైనిక ఖర్చునుగూర్చిన లెక్కలుచూస్తే బోధపడుతుంది. ఈ క్రింది పథకం 1913-1928 మధ్య బ్రిటన్, ఇండియా అధినివేశాల ఖర్చులను వివరిస్తుంది.

## మిలటరీ ఖర్చు. 1913 - 1928

(లక్షల పౌనులలో)

| | 1913 | 1928 | నూటికి ఎంత హెచ్చింది |
|---|---|---|---|
| బ్రిటన్ | 770 | 1150 | 49 |
| ఇండియా | 220 | 440 | 100 |
| అధినివేశాలు | 90 | 120 | 33 |
| మొత్తం | 1080 | 1710 | 57 |

(ఈస్టరన్ ఆర్మమెంట్ సప్లిమెంట్, అక్టోబర్ 19, 1929)

భారతదేశ భారాన్ని రెండింతలు చేశారు. (ఈ విషయంలో ఆ దేశీయులు నోరెత్తడానికూడా అధికారంలేదు) మరి బ్రిటన్ ఖర్చు సగంకన్నా తక్కువే పెరిగింది. అధినివేశాల ఖర్చు మూడోవంతు పెరిగింది. 1914 యుద్ధానికి పూర్వం మిలటరీ ఖర్చు బడ్జెట్‌లో అయిదింట రెండు వంతులుండేది; 1891-92 లో నూటికి 41; 1913-14 లో నూటికి 42.6; 1914 కు ముందున్న సగటు మూడు వేల లక్షల రూపాయలనుండి, ధరలు పెరిగిపోయిన 1920-21 లో 8740 లక్షలకు పెరిగింది అంటే బడ్జెట్‌లో నూటకి 51 వంతులు. ధరలు తగ్గినందువల్ల ఖర్చుతగ్గించినందువల్ల, 1925-26, లో 5600 కి తగ్గింది - అంటే నూటికి 39 వంతులన్నమాట: 1928-29 లో తిరిగీ ఇది నూటికి 45 వంతులకు హెచ్చింది. 1336-37 లో ఈ సైనికవ్యయం, అధికారుల అంచనాలను బట్టి కేంద్రప్రభుత్వం బడ్జెటులో నూటికి 54 వంతులుగా తేలింది. అంటే కేంద్రప్రభుత్వం బడ్జెటూ, రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెటులూ కలిపితే అందులో నూటికి 29 వంతులు సైనిక వ్యయమే ఉంది.

రెండు ప్రపంచయుద్ధాలకు మధ్యకాలంలో బ్రిటన్‌కు భారతదేశంయొక్క కీలకస్థితి ప్రాముఖ్యం హెచ్చింది. భారతదేశ ప్రాతిపదికమీదనే నూతన మధ్య ప్రాచ్య సామ్రాజ్యాన్ని. పలుకుబడిని పెంచుకోవడం నిర్మించుకున్నారు. సిమోన్‌స్టోవన్ నూతన నౌకాశ్రయంలో కేప్‌దారిలో కేంద్రీకరించారు. మధ్య ధరాసముద్రంమీద తమ సర్వాధిపత్యం తగ్గినందుకు ప్రత్యామ్నాయంగా దీని నేర్పరచారు - పసిఫిక్కులోనుండి హిందూమహాసముద్రంలోనికి ముఖద్వారమైన సింగపూరులో పగలగొట్టవీలులేదనే సింగపూరు నౌకాశ్రయం నిర్మించారు. ఇవన్నీ భారతదేశంమీద. భారతదేశానికి వెళ్ళే మార్గాలమీద సామ్రాజ్యవాద కీలక స్థానాలుగా బ్రిటన్ కేంద్రీకరించసాగింది అని తెలుపుతున్నవి. మధ్యధరాసముద్రం గుండాను, సూయజ్‌కాలవగుండాను పోయేమార్గం అనుమానాస్పదంకాగానే, బ్రిటన్ ఆస్ట్రేలియాలను బాగ్దాదు, కరాచీ, కలకత్తా. సింగపూరులద్వారా కలిపే సామ్రాజ్య విమానమార్గం అతిప్రధానమైంది. అలాగే ఇండియా, సయాములద్వారా దూర ప్రాచ్యానికి వెళ్లే విమానమార్గంకూడా సామ్రాజ్యానికి ప్రాణనాళంవంటిదిగా ఈ రెండూ పరిణమించాయి - జపాను విశాలమై పసిఫిక్కుసముద్రానికి, చైనా నదీమార్గాలకు, సముద్రతీరానికి వ్యాపించేటప్పటికి బర్మాగుండా వెళ్ళే భూమార్గం కూడ ప్రాముఖ్యతకు వచ్చింది.

ఈ సన్నాహాలన్నీకూడ అంతంతమాత్రమేనని రెండోయుద్ధంలో బయట పడింది. ఆశియాలో బ్రిటిష్ సామ్రాజ్యా శక్తితో విజయం చేకూరలేదు అక్షరాజ్యాలకు వ్యతిరేకంగా అమెరికా, సోవియట్ యూనియన్. బ్రిటన్‌ల సంయుక్తబలంతో మిత్రరాజ్యాలు ప్రపంచవిజయం సాధించడం; యూరోపులో జరిగిన నిర్ణాయకయుద్ధాలు - జపానుపై సర్వశక్తులను కేంద్రీకరించేందుకు వీలు కల్పించాయి. ఇందువల్ల ఆశియాలో బ్రిటిష్ సామ్రాజ్యం అనుభవించిన వినాశాలూ,

నష్టాలూ మార్చివేసి విజయం సాధించవీలయింది. కాని పాత వలసదేశపాలనా విధానాన్ని పునర్నిర్మించాలనే ప్రయత్నాలు యుద్ధానంతరం ఆరంభమయ్యాయి. ఆశియాలో మహోన్నతంగా అభివృద్ధిచెందిన స్వతంత్రోద్యమాలు ఈ ప్రయత్నాలను శక్తివంతంగా నిరోధించాయి.

అయినప్పటికీ రెండో ప్రపంచయుద్ధానంతరం బ్రిటిష్ ప్రపంచ సైనిక తంత్ర విధానంలో. భారతదేశం కీలకస్థానాన్ని ఆక్రమిస్తున్నది. ఇందులో సమస్యేమీలేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదం పెత్తనానికీ, పలుకుబడికీ ప్రధాన కేంద్రాలైన మధ్యప్రాచ్యం. ఇండియాలు రెంటిలో ఇండియా బ్రిటిష్ దృష్టిలో విడువరాని సైనికకేంద్రంగా ఉంది. లేబరుపార్టీ ప్రధానులలో ఒకడైన లార్డు పెథిక్ లారెన్సు అతి స్పష్టంగా 1944 జూలైలో జరిగిన పార్లమెంటు చర్చలో ఇలా చెప్పాడు :

> "ఏడు సముద్రాలలోను బ్రిటన్ ఒక్కటే శాంతిని రక్షించగలదా అనే విషయంలో కొంత సందేహం కల్గించే సంఘటనలెన్నో జరిగాయి. ఇది ఇండియా పరిసరప్రాంతంలో మరీ స్పష్టంగా కనిపించింది. నేను తెలుసుకున్నంతవరకు భారతదేశం ప్రధాన సైనికకేంద్రం"
>
> (ఇండియన్ యాన్యుయల్ రిజిష్టర్ 1944 వాల్యూం 2, పుట 298)

ఆసియాలోని స్వతంత్రోద్యమాలకు వ్యతిరేకంగా తాను నడపవలసివచ్చిన విషమ యుద్ధాలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, భారతదేశాన్ని తమ ప్రధాన సైనికకేంద్రముగా. సరఫరాలకు ఆలవాలంగా, సేనలను సమీకరించేచోటుగా, కూడ ఉపయోగించుకున్నారు (ఇండొనేషియామీద జరిపే యుద్ధంలో మాత్రం, జాతీయోద్యమం విరోధించి దీనిని ఆపగలిగింది) ఈ యుద్ధాలద్వారా ఆసియాలో భారతదేశానికి పొరుగురాజ్యాలైన బర్మా. మలయా. ఇండొనీషియాలలోని ప్రజాస్వతంత్ర పోరాటాలను అణచేందుకు. తిరిగి వలసవిధానం వానిపై రుద్దేందుకు బ్రిటన్ పూనుకుంది. సోవియట్ వ్యతిరేకముఠా కిట్టాలనే బ్రిటన్, అమెరికాలలో ప్రమాదకరమైన అభివృద్ధినిరోధక విధానంమూలంగా ఇండియా విషయంలో సామ్రాజ్యవాదుల దురాశలకు దోహదం ఏర్పడింది, 1946 లో రాజీ ప్రయత్నాలు. బ్రిటిష్ మంత్రివర్గ రాయబారాన్ని పంపడంలో. యీ భారతదేశ సైనికకేంద్ర ప్రాముఖ్యత చాల ప్రధానపాత్ర వహించింది. ఇందులో సందేహంలేదు. "స్వతంత్రం" అనబడే ప్రతిపాదనతోపాటు. ఇండియాలో బ్రిటిష్ మిలిటరీ కంట్రోలును దృఢపరుచుకునేందుకు తగిన చర్యలుకూడ తీసుకోబడినవి.

## 2. జాతీయతా, విదేశాంగనీతి

బ్రిటిష్ అంతర్జాతీయ విధానంలో భారతదేశానికున్న ప్రాముఖ్యత, బ్రిటన్ అంతరంగిక రాజకీయాలలో బ్రిటనుకు భారతదేశమెంత ప్రాముఖ్యం వహిస్తున్నదో మనం చూచాం. భారతదేశ పాత్ర కేవలం బ్రిటన్ చేతి పాచికలాంటిది. ప్రపంచ

శక్తుల పోటీలోను, తగాదాలలోను పెద్దభాగమే భారత దేశానికికుందిగాని, ఆ పాత్ర తన ఇష్టంపైకాని, తన పెత్తనం క్రిందగాని నిర్వహించడంలేదు.

ఆ పరిస్థితి నేడు అంతమవుతున్నది. నేడు భారత ప్రజలు తమ దేశ వ్యవహారాల్లోనే కాక, ప్రపంచ వ్యవహారాల్లో కూడ తమ విధానాన్ని తాము అవలంబిస్తున్నారు.

1914 యుద్ధానికిముందు, ప్రపంచ రాజకీయ సమస్యల విషయమై చెప్పుకోదగినంతగా భారత జాతీయోద్యమం తన పాత్రను నిర్వహించ ప్రయత్నించలేదు. విదేశాలలోని భారతీయుల ప్రత్యేక సమస్య, ఇతర సామ్రాజ్య దేశాలలో భారతీయులు పడుతున్న బాధలగురించి మాత్రమే ఆలోచించగలిగింది.

ఆయుగంలోని ప్రధాన ప్రపంచ వ్యవహారాల ప్రాధాన్యతను గుర్తించక పోవడం ఉదాసీన భావమనికాని, అదేపనిగా ప్రపంచంనుండి వేరుగా ఉండదలచెదమని కాని పొరబాటుపడరాదు. రాజకీయ ఉద్యమంలోను, ప్రజల్లోని కొన్ని వర్గాలలోనుకూడ విదేశ వ్యవహారాలపై తమ స్వతంత్రోద్యమానికి సంబంధించిన వానిలో తీవ్రమైన అభిమానం కనపబడుతుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదం దుర్బలపడే దక్షిణాఫ్రికా యుద్ధ సంఘటనలాంటి ప్రతిదానినీ ఎంతో ఆశతో పరిశీలిస్తూ వచ్చారు. 1905 నాటి జపాన్ విజయాన్ని అభినందించారు. ఇంతవరకు అజేయమనుకుంటూ వచ్చిన పశ్చిమ సామ్రాజ్యవాద శక్తులపై ఆశియా ప్రభుత్వం సాధించిన ప్రథమ విజయంగా దీనిని భావించారు. వారిలో ఒక నూతన విశ్వాసం ఏర్పడింది-ఈజిప్టు ఐర్లండులు బ్రిటిష్‌పెత్తనానికి ఎదురుతిరిగి పోరాటం సాగించడం పెద్ద ప్రభుత్వాల పన్నాగాలకు టర్కీ సామ్రాజ్యం ఎదురు తిరగడం,విభజించాలనే ఆంగ్లో రష్యన్ పన్నాగాలను పర్షియా ఎదిరించడం — వీనన్నిటివల్ల భారతీయులలో అత్యాదరయుతమైన సానుభూతి ఏర్పడింది, 1905నాటి రష్యా విప్లవం, టర్కీ విప్లవం, చైనా విప్లవం భారతీయ హృదయాలలో ప్రతిధ్వనుల నిచ్చినవి. ఇవన్నీ మొట్టమొదటిసారిగా విశాల అంతర్జాతీయ చైతన్యం ప్రారంభమవుతున్న దనేందుకు సూచనలు.

1914 నాటి యుద్ధం, 1917 నాటి రష్యా విప్లవం నూతన పరిస్థితి నేర్పరచినవి.

1914 యుద్ధంలో జాతీయోద్యమంలోని ఉన్నత వర్గ నాయకత్వం బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి సంపూర్ణంగా తోడ్పడింది - తద్వారా భారతదేశంలో ప్రజాతంత్రాభివృద్ధి ప్రతిఫలంగా సాధించవచ్చునని ఆశించింది. యుద్ధ ప్రారంభకాలంలో లండనులోనున్న కాంగ్రెసు ప్రతినిధులు - లజ్‌పతిరాయ్, జిన్నా, సిన్హా మొదలైనవారు "సామ్రాజ్యం త్వరలో విజయవంతం కావాలని" అందుకు తాము సహకారం చేస్తామని వెంటనే ప్రకటించారు. గాంధీజీ పాత్రకూడ తిరిగి పరిగణనకు వచ్చింది. యుద్ధం జరుగుతున్న మొదటి రోజుల్లో కాంగ్రెసుమహాసభలకు వచ్చిన ప్రధాన ప్రభుత్వోద్యోగులను అభినందించడం జరిగింది.

అతివాద జాతీయవాదులు కొందరు జర్మనీతో సంబంధం ఏర్పరచుకొని బెర్లిన్‌లో ఇండియా కమిటీని ఏర్పరచారు. వీరికి ప్రతినిధులు హరదయాల్, బర్కతుల్లా మొదలైనవారు. కాని వీరికి పెద్ద పలుకుబడేమీలేదు.

ఇక ఇండియాలోనే, జాతీయోద్యమంలో అతివాదపక్షం తీవ్ర పోరాటాలను సాగించింది.

స్వయంనిర్ణయసూత్రంగూర్చి పదే పదే చేస్తున్న వాగ్దానాలను భారత దేశంలో యుద్ధంముగుస్తూనే అమలుజరుపుతారని కాంగ్రెసు ఆశించింది. వర్సైల్స్‌లో కాంగ్రెసుకు ప్రాతినిధ్యం వహించేందుకు తిలక్‌ను నియమించించారు. కాని ఆయన సమావేశానికి వెళ్ళడానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రయాణ అనుమతి పత్రం ఇవ్వనిరాకరించింది. అప్పుడు తిలక్ భారతదేశవాంఛను బలపరచమని కోరుతూ శాంతి సమావేశ అధ్యక్షుడు క్లెమిన్సోకి వ్రాశాడు. ఆ లేఖలో ఇలాఉంది.

> "భావి ప్రపంచ శాంతికీ, భారత ప్రజలఅభివృద్ధికీ, భారతసమస్యను పరిష్కరించడం అత్యవసరమని ఇది ప్రధాన విషయమని నేను అనవసరంగా ఎక్కువ వివరించను భారతదేశం స్వయం సంపూర్ణమైనది. ఆశ్రయమివ్వగలది-ఇతర రాజ్యాలను ఆక్రమించుకోవాలనే దురుద్దేశాలు భారతదేశానికిలేవు. ఇతరులది కావాలనే దురాశలేదు. విశాల భూభాగమూ, అనంత సహజసంపదా, కావలసినంత మనుష్య బలం ఉన్న భారత దేశం ఆశియాలో ప్రధాన ప్రభుత్వం కావాలని వాంఛిస్తున్నది. కాబట్టి భారత దేశం ప్రపంచశాంతి రక్షణలో, తూర్పున నానాజాతి సమితికి బలవత్తరమైన ద్వార రక్షకంగా పనిచేయగలదు. దురాక్రమణ దారులకు శాంతి విధ్వంసకులకు వారు ఆశియాలోవారుగాని మరెక్కడివారుకాని - వ్యతిరేకంగా బ్రిటిష్ సామ్రాజ్య స్థిరత్వానికి తోడ్పడగలదు."

1919 నాటి ఈ జాతీయోద్యమపత్రం. అంతర్జాతీయ విధానానికి చెందిన మొదటి పత్రం. అప్పటి దృక్పధాన్నిది ప్రతిబింబిస్తున్నది.

ఈ ఆశలన్నీ భగ్నమయ్యాయి. "ఇండియా"కు నానాజాతి సమితిలో సభ్యత్వం ఇచ్చారు ఆ దేశంలో పెత్తనం అంతా బ్రిటన్‌దే అయినప్పుడు. దాని ప్రాతినిధ్యమూ, విధానమూ పూర్తిగా బ్రిటన్‌చేతనే ఉన్నప్పుడు ఇలాంటి 'సభ్యత్వం' ఇవ్వడం సరికాదని ప్రొఫెసర్ ఎ. బి. కీత్ తీవ్రంగా ఖండించాడు :

> "ప్రధానమైన పొరపాటు 1919 లో జరిగింది. ఆ దేశవిధానం ఆంతరంగికం. విదేశాంగంకూడ పూర్తిగా బ్రిటిష్ ప్రభుత్వంచేతిలో ఉండగా, ఇండియాకు నానాజాతి సమితిలో స్థానం ఇవ్వడమే ఆ పొరపాటు. ఆ సభ్యత్వ మివ్వడానికి, భారతదేశం స్వపరిపాలితమని చెబుతున్నారు. అధినివేశాల విషయాలలో ఇలా చెప్పవచ్చు. కాని భారతదేశం విషయంలో వాస్తవంకాదు. అటువంటి స్వపరిపాలన త్వరలో ఏర్పడగలదని చెప్పడం

కూడ కష్టమే. ఇలాంటి పరిస్థితుల్లో, నానాజాతిసమితిలో భారత దేశానికి ప్రాతినిధ్యమివ్వకుండా, ఎప్పుడాదేశం స్వపరిపాలితమైతే అప్పుడు సభ్యత్వం ఇచ్చేట్టు ఏర్పాటుచేసి ఉండొచ్చు .... ఇప్పుడున్నదున్నట్టుగా నానాజాతిసమితిలో భారతదేశ స్థితి పూర్తిగా నియమవిరుద్ధమైనది; ఎందుకంటే ఆ దేశ విధానాన్ని పూర్తిగా బ్రిటిష్ ప్రభుత్వమే నిర్ణయిస్తుంది. ఇంకా ఎన్నాళ్ళో ఇలాగే నిర్ణయించబడుతూకూడా ఉంటుంది."

(సర్ ఎ బి. కీత్, "భారత రాజ్యాంగ చరిత్ర", 1936, పుట 472-3)

1919 నాటి తిలక్ లేఖలోలాగా జాతీయోద్యమంలోని వృద్ధనాయకత్వం ఇంకా తమ నాయకుడుగా బ్రిటిష్ సామ్రాజ్యవాదం వేపే చూస్తున్నప్పటికి. "బ్రిటిష్ సామ్రాజ్యవాద రక్షకంగా భారతదేశాన్ని ఏర్పరుస్తా"మని చెబుతున్నప్పటికి. ప్రథమ ప్రపంచయుద్ధానంతరం నూతనభావాలు వ్యాపించసాగాయి 1917 నాటి రష్యావిప్లవం; యుద్ధానంతరం ప్రపంచాన్ని ముంచుకొని వచ్చిన విప్లవవెల్లువ; అధీనదేశాలన్నింటిలోని స్వతంత్ర ఉద్యమాల పురోగమనం వీనివల్ల నూతన ప్రపంచ పరిస్థితి ఏర్పడింది. ఇందులో భారతదేశం ఎంతో అనక్తమై ఉన్నది. పశ్చిమ సామ్రాజ్యవాదుల పాత అభివృద్ధివిరోధక శిబిరానికి వ్యతిరేకంగా సోవియట్ యూనియనుతో సమాన ప్రయోజనాలు, అంతర్జాతీయ కార్మికవర్గోద్యమం, వలసదేశాల జాతీయోద్యమం ఇవన్నీ నూతన ప్రపంచ మైత్రి నిర్మాణానికి ప్రాతిపదిక అయినవి. ఈ అంతర్జాతీయ సంఘటనకు భారత జాతీయ వాదులలోని అభ్యుదయభావాలు కలవారందరూ సహకారమిచ్చారు.

1925–27 ల మధ్య విజృంభించిన చైనా జాతీయవిప్లవం భారతదేశంలో నూతన చైతన్యాన్ని కల్పించింది 1927 లో, చైనావిప్లవానికి వ్యతిరేకంగా ఉపయోగించేందుకు భారతసేనలను షాంగైకి పంపినందుకు అసమ్మతి తెల్పుతూ కాంగ్రెసు ఒక తీర్మానం చేసింది. అదే సంవత్సరమే, సామ్రాజ్యవాద వ్యతిరేక అంతర్జాతీయ బాధిత ప్రజాసమితి (ఇంటర్నేషనల్ లీగ్ అఫ్ ది అప్రెస్డ్ పీపుల్స్ ఎగెనెస్ట్ ఇంపీరియలిజం) స్థాపనలో కాంగ్రెసు పాల్గొన్నది. అందుకు అనుబంధసంస్థగా చేరింది. ఆసమితి బ్రసెల్సు మహాసభకు నెహ్రూ కాంగ్రెసు ప్రతినిధిగా వెళ్ళాడు. వలసదేశ ప్రజలనూ. అంతర్జాతీయ కార్మికోద్యమాన్ని కలిపే. అంతర్జాతీయ సామ్రాజ్య వ్యతిరేక సంయుక్తసంఘటన బలపడడంలో ఇదొక ముఖ్యఘట్టం.

ఈ చైతన్యం ఫాసిస్టు దురాక్రమణ యుద్ధంతో మరింత పురోగమించింది. ఫాసిస్టు దురాక్రమణకు తోడ్పడంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం కనబరుస్తున్న సంతృప్తి, తద్వారా ప్రపంచయుద్ధానికి బ్రిటన్ దారితీస్తున్న సమయంలో ఆ చైతన్యం మరింత బలపడింది. కాంగ్రెసు తను అబిసీనియా ప్రజలతోను, స్పెయిన్ ప్రజాసామాన్యంతోను నిలబడి సహాయం చేసింది బ్రసెల్సులో 1936 సెప్టెంబరులో జరిగిన ప్రపంచ శాంతిసభకు కాంగ్రెసు ప్రతినిధిగా వెళ్ళింది. అంతర్జాతీయ శాంతి

ప్రచారంలో భాగస్వామిని అయింది. తన దృక్పథాన్నిలా ప్రత్యేకించి వివరించింది. సామ్రాజ్యవాద దోపిడీ అనే ప్రాతిపాకపై సుస్థిరశాంతిని నెలకొల్పలేము; సామ్రాజ్యవాదుల పెత్తనం నిలబెట్టే సంధిపత్రాల పవిత్రతను గుర్తించరాదు. నానాజాతి సమితిలో స్వతంత్ర సభ్యురాలుగా పనిచేసేందుకు ఇండియాకు స్వేచ్ఛ నివ్వాలి.

1936 లో స్పెయిన్ ప్రజాస్వామికప్రభుత్వానికి వ్యతిరేకంగా జర్మనీ, ఇటలీ యుద్ధంజరుగుతుంటే అందులో బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు, "తటస్థవిధానం" అవలంబించాలంటున్నారు. ఆ కాంగ్రెసు ఫైజ్‌పూర్ సమావేశం ఆ 1936 డిసెంబరులో ఇలా ఖండించింది.

> "ఫాసిస్టు దురాక్రమణ ఎక్కువవుతున్నది. ఫాసిస్టు ప్రభుత్వాలు తమ కూటమి నేర్పరుచుకొంటూ, యూరోపును, ప్రపంచాన్ని ఆక్రమించి, రాజకీయ, సాంఘిక స్వతంత్రాన్ని రూపుమాపేందుకు యుద్ధానికి తయారవుతున్నారు ఈ ప్రపంచ ప్రమాదాన్ని ఎదుర్కొనేందుకు ప్రపంచ ప్రజలతోను అభ్యుదయవంతములైన ప్రభుత్వాలతో సహకారం చెయ్యాలన్న అవసరాన్ని కాంగ్రెసు పూర్తిగా గుర్తిస్తున్నది."

1938 ఫిబ్రవరిలో హరిపుర కాంగ్రెసు 'సమిష్టి రక్షణ'ను బలపరిచింది. ఫాసిస్టు దురాక్రమణను బలపరిచే విధానాన్ని ఖండించింది, ఈ విధానమే యుద్ధ ప్రమాదాన్ని మరింత సమీపానికి తెచ్చింది 1938 లో జపానువస్తువుల బహిష్కరణను ప్రకటించింది. 1938 త్రిపురిసమావేశంలో కాంగ్రెసు మ్యూనిచ్ విధానంతో పూర్తిగా విడిపోయింది.

> "మ్యూనిచ్ సంధికి దారితీసిన బ్రిటిష్ విదేశాంగనీతికి పూర్తిగా కాంగ్రెసు తన అనంగీకారాన్ని తెలియజేస్తున్నది. ఆ బ్రిటిష్ విధానమే, ఆంగ్లో ఇటాలియన్ సంధికి, స్పెయిన్ తిరుగుబాటుదారులను గుర్తించడానికి మూలం ఈ విధానం బుద్ధిపూర్వకంగా ప్రజాతంత్ర పద్ధతిని వంచిస్తున్నది. తమ వాగ్దానాలన్నిటిని భంగపరుస్తున్నది. సమిష్టి రక్షణ పద్ధతినే అంతం చేస్తున్నది. అంతేకాక ప్రజాతంత్రవ్యవస్థకూ, స్వేచ్ఛా స్వతంత్రాలకు బద్ధశత్రువులయిన ప్రభుత్వాలతో సహకారానికి దారితీస్తున్నది.... ఫాసిస్టు ప్రభుత్వాలను ఒకేవిధంగా బలపరుస్తూ, ప్రజాతంత్రదేశానికి తోడ్పడుతున్న బ్రిటిష్ ప్రభుత్వ విదేశాంగ విధానంతో కాంగ్రెసు పూర్తిగా తన సంబంధం విడగొట్టుకుంటున్నది.

ఇలా భారత ప్రజలు తమ జాతీయ నాయకులద్వారా, తమ ఫాసిస్టు వ్యతిరేకతను చాటారు. ప్రజాతంత్ర, అభ్యుదయశక్తులతో ఫాసిజానికి వ్యతిరేకంగా తాము సంఘటితులవుతామని, 1939 లో జర్మనీపై బ్రిటన్ యుద్ధాన్ని ప్రకటించకపూర్వమే ఉద్ఘాటించారు. బ్రిటిష్ ప్రభుత్వం ఫాసిస్టు దురాక్రమణ

దారులకు ఆచరణలోను. రాజ్యాంగ విధానంలోను పూర్తిగా సహకారమిస్తున్న ఆ విషమ సంవత్సరాలలో కాంగ్రెసు తన అభిప్రాయాన్ని ప్రకటించింది.

## 3. భారతదేశమూ-యుద్ధమూ (1939-42)

బ్రిటన్ జర్మనీపై 1939 లో యుద్ధం ప్రకటించినప్పుడు 1914 లో తాను అవలంబించిన వైఖరినే ఇండియా విషయంలో అవలంబించ జూచింది. బ్రిటిష్ విధానంలో ఏ మాత్రం కర్తృత్వంలేని పాచికలా ఇండియా పడుండాలి. అలాగే భారత ప్రజలతో సమాలోచించేందుకు ఏ మాత్రం ప్రయత్నించకనే తనతోపాటు ఇండియాను బ్రిటన్ యుద్ధంలోకి లాగింది.

యుద్ధ ప్రకటన జరిగిన కొన్ని గంటలలో వైస్రాయి భారత ప్రజా ప్రతినిధుల సలహాను ఏ మాత్రం తెలుసుకోకనే భారతదేశాన్ని యుద్ధంలోదిగిన దేశంగా ప్రకటించాడు. ఇండియా సవరణచట్టం ఒకదానిని 11 నిముషాలలో బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించింది దీనిప్రకారం రాష్ట్ర స్వపరిపాలన విషయంలోను. రాజ్యాంగవిషయంలోను వైస్రాయికి నియంతృత్వాధికారాలిచ్చారు. 1939 సెప్టెంబర్ 3 వ తేదీ ఇండియా డిఫెన్సు ఆర్డినెన్సు ప్రకటించారు. దానిప్రకారం కేంద్ర ప్రభుత్వాన్ని డిక్రీలతో నడపవచ్చు. "బ్రిటిష్ ఇండియా రక్షణకోసం, శాంతి భద్రతలకోసం, ప్రజారక్షణకోసం, లేక యుద్ధాన్ని జయప్రదంగా నడపడంకోసం, లేక సరఫరాలను. జీవితావసర కార్యకలాపాలను నడిపించడంకోసం అవసరమని తలచిన ఉత్తరువులు నన్నిటిని" వైస్రాయి ప్రకటించే అధికారం వచ్చింది. సభలను ఇతర ప్రచార పద్ధతులను నిషేధించవచ్చు. వారంటు లేకనే అరెస్టు చేయవచ్చు. ఉత్తరువులను ధిక్కరించారని పెనాల్టీను వేయవచ్చు - ఉరిశిక్షలు, యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షలుకూడ విధించవచ్చు.

సెప్టెంబర్ 11 వ తేదీ వైస్రాయి ఫెడరేషన్ స్థాపనకుజరిగే సన్నాహాలను తాత్కాలికంగా రద్దుచేశాడు. భారతదేశంలో నిరంకుశ ప్రభుత్వం అలాగే కొనసాగుతుంది.

ఇందుకు ఏమాత్రం రాజ్యాంగచట్టం ముసుగులేకుండా విపరీతమైన అసాధారణ అధికారాలతో ఈ ప్రభుత్వం కొనసాగుతుంది. తిరిగి పాతికేళ్ళ ముందువలెనే భారత ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వం తోకపట్టుకుని యుద్ధంలోకి ఉరకవలసి వచ్చింది. ఇందులో వారి ఇష్టానిష్టాలకేమీ ఆస్కారంలేదు ఈ యుద్ధానికి మూలకారణమైన బ్రిటిష్ విధానాన్ని వారు తొలినుంచీ తప్పని. అసమ్మతి తెల్పుతూనే వచ్చారు. దానినికూడ గమనించనేలేదు.

పరిస్థితి 1914 కంటె భిన్నమని త్వరలోనే జరిగిన సంఘటనలు వెలువరించాయి.

సెప్టెంబరు 14 వ తేదీ కాంగ్రెసు వర్కింగుకమిటీ యుద్ధంగూర్చి తమ విధానాన్ని ప్రకటించింది అందులో:

"సామ్రాజ్యవాద పద్ధతులపై భారతదేశంలోను, ఇతర చోట్లను సామ్రాజ్యవాదాన్ని సుస్థిరంగా నిలుపుకునేందుకై జరిపే యుద్ధంలో మేము భాగస్థులంకాము. ఇందులో మేమేమీ సహకారం చేయలేము"

ఆ తీర్మానం ఈ క్రింది వాంఛను ప్రకటించింది.

"భారత ప్రజలకు స్వయంనిర్ణయహక్కుండాలి. ప్రజాపరిషత్తుద్వారా ఏ మాత్రం విదేశీయుల జోక్యం లేకుండా వారు తమ రాజ్యాంగచట్టాన్ని నిర్మించుకోవాలి. తమ విధానాన్ని తామే నడుపుకోవాలి."

దీనిననుసరించే కాంగ్రెసు, బ్రిటిష్ ప్రభుత్వాన్నిలా ప్రత్యక్షంగా సవాల్ చేసింది.

"కాబట్టి వర్కింగు కమిటీ బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఈ క్రింది విషయాలను ఖచ్చితంగా ప్రకటించ వలసిందని ఆహ్వానిస్తున్నది ; తమ యుద్ధాశయాలు ప్రజాతంత్ర వ్యవస్థ విషయంలోను, సామ్రాజ్యవాద విషయంలోను ఏమిటి ? ముఖ్యంగా తాము చేప్పే నూతన వ్యవస్థ సంగతేమిటి ? ఈ ఆశయాలను భారతదేశ విషయంలో ఎలా అమలు జరుపుతారు, ఇప్పుడు వాటి నెలా ఆచరణలో పెడతారు, సామ్రాజ్యవాదాన్ని వదిలిపెట్టి, భారత దేశాన్ని స్వతంత్ర దేశంగా చూడడంకూడ బ్రిటన్ యుద్ధాశయాల్లో చేరుస్తారా ? అప్పుడు భారతదేశ విధానం భారతీయుల వాంఛలకు అనుణంగా ఏర్పడుతుంది."

ఈ కాంగ్రెసు ముఖాముఖి ప్రశ్నకు, బ్రిటిష్ ప్రభుత్వం జవాబిచ్చింది, అది వాస్తవస్థితిలో 'కాదు' అన్నదే. ఏ వ్యవధినీ నిర్ణయించకుండా; ఎప్పుడో ముందుకు "అధినివేశ హోదా" ఇస్తామనే పాతవాగ్దానాలనే తిరిగి వల్లించింది. (ఇలాంటి వాగ్దానాలనే గత యుద్ధంలోను 22 ఏళ్ళ క్రిందటే చేశారు. అవిఇప్పటికీ పరిపూర్తి చెందవలసే ఉన్నవి ) వాటి చాటున ఇప్పుడు బ్రిటన్ అనుసరిస్తామన్న ప్రణాళికేదంటే : భారతదేశాన్ని బానిసగా ఉంచుకోవడంలోను, యుద్ధాన్ని చక్కగా నడపడంలోను పైస్థాయికి తోడ్పడేందుకు భారతీయుల "సలహా కమిటీ"ని వేస్తామన్నారు.

జాతీయ కాంగ్రెసు నాయకత్వానికీ, బ్రిటిష్ ప్రభుత్వానికీ మధ్య వచ్చిన ఈ ప్రాథమిక రాజ్యాంగ ఘర్షణ తీవ్రతరమవుతున్న పోరాటానికి చిహ్నం మాత్రమే కాంగ్రెసు నాయకత్వం పైస్థాయితో ఈ రాజ్యాంగ సంబంధమైన వాద వివాదాలు జరుపుతుండగానే, ప్రజలప్పుడే ఉద్యమానికి దిగారు. అక్టోబరు రెండవ తేదీ 90 000 మంది బొంబాయి కార్మికులు యుద్ధానికి వ్యతిరేకంగాను, సామ్రాజ్యవాదుల నిర్బంధ విధానానికి వ్యతిరేకంగాను ఒకరోజు రాజకీయసమ్మె చేశారు. యుద్ధంలోకి దిగిన దేశాలలో మొట్టమొదటిసారిగా జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక సమిష్టి సమ్మె ఇదే ఆ సమ్మె ముగిసిం తర్వాత కాంగార్ మైదానంలో జరిగిన బహిరంగసభలో ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేశారు, అందులో ఇలా ఉంది :

"సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఈ దారుణ వినాశకర యుద్ధంలోనికి ఈడ్చిన, ప్రపంచ ప్రజలతోను, అంతర్జాతీయ కార్మికవర్గంతోను, మా ఏకీభావాన్ని తెలియజేస్తున్నాము. అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యతకు ఈ యుద్ధం ఒక సవాలని భావిస్తున్నాము. మానవకోటికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులు చేసిన ఈ కుట్రను భగ్నం చేయడం, వివిధ దేశాల ప్రజల. కార్మికుల విధిఅని మేము ప్రకటిస్తున్నాము."

బొంబాయి కార్మికులు చేసిన ఈ తీర్మానంలో-భారతదేశ పాటక ప్రజల పోరాటం. అంతర్జాతీయ కార్మివర్గం సామ్రాజ్య వ్యతిరేకంగా జరిపే పోరాటంలో ఒక భాగమన్న సంగతి ప్రస్ఫుటమయింది.

కాంగ్రెసు ప్రతిపాదనకు వైస్రాయి వ్యతిరేక సమాధానమివ్వడం మూలంగా కాంగ్రెసు మంత్రివర్గాలన్నీ 1939 అక్టోబరులో రాజీనామా విచ్చాయి. 1940 వసంతఋతువులో సమావేశమైన రాంఘర్ కాంగ్రెసు ఇలా తన దృక్పథాన్ని ప్రకటించింది :

"భారతదేశాన్ని గూర్చి బ్రిటిష్ ప్రభుత్వ పక్షంగా ఇటీవల వెలువడిన ప్రకటనలు. బ్రిటన్ యుద్ధాన్ని కేవలం తన సామ్రాజ్యవాద ఉద్దేశాలకోసమే సాగిస్తున్నట్టు బయటపెట్టాయి.... ఈ పరిస్థితులలో కాంగ్రెస్ ప్రత్యక్షంగా గాని, పరోక్షంగాగాని యుద్ధంలో భాగస్వామిగా ఏ విధంగానూ చేరలేదు."

నాజీ దురాక్రమణ యూరోపులో వ్యాపించడం, ఫ్రాన్సు పడిపోవడంతో యుద్ధ సంక్షోభం తీవ్రతర మవుతుండగా 1940 వేసవికాలంలో కాంగ్రెస్ ఒక కొత్త ప్రతిపాదనచేసింది. ఒక షరతుపెట్టి అందుకు అంగీకరిస్తే యుద్ధంలో తోడ్పడతానన్నది. ఆ షరతేమంటే భారతదేశ స్వతంత్రాన్ని గుర్తించాలి. "కేంద్రంలో తాత్కాలిక జాతీయప్రభుత్వాన్ని స్థాపించాలి. అది పరివర్తన దశలో ఏర్పడినదైనప్పటికి కేంద్ర శాసనసభలోని ఎన్నుకోబడిన సభ్యులందరి విశ్వాసానికి పాత్రమై ఉండాలి .... ఈ పనులకు అంగీకరిస్తే దేశరక్షణ వ్యవస్థను జయప్రదంజేసే ప్రయత్నాలలో కాంగ్రెస్ తాను పూర్తిగా పనిచేయగలుగుతుంది" అని తెలిపింది. విదేశ దండయాత్రనుండి దేశాన్ని రక్షించుకోవడంలో గాంధీజీ అహింసా సిద్ధాంతాన్ని బహిరంగంగా నిరాకరించే ఈ తీర్మానం 1940 జూలై పూనాలో మూడింట రెండు వంతుల మెజారిటీతో ఆమోదింపబడింది. అహింసను నిరాకరించడంలో 91 - 63 వోట్లు. షరతుపెట్టి యుద్ధంలో సహకరిస్తామనేందుకు 95 - 47 వోట్లు వచ్చాయి.

ఈసారికూడ ఈ ప్రతిపాదనను బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించలేదు. వైస్రాయి 1940 ఆగస్టు 8వ తేదీన ఒక ప్రకటన చేశాడు (దీనినే 'ఆగస్టు ప్రతిపాదన' అంటారు. ఇదే తర్వాతి క్రిప్సు ప్రతిపాదనలు మొదలైన వాటికి మూలం) అందులో బ్రిటిష్ ప్రభుత్వం "భారతదేశ శాంతిసౌభాగ్యాలలో తమకున్న బాధ్యతను, భారత జాతీయ జీవితంలోని బలవత్తరశక్తుల ప్రాపకంలేని ఏ విధమైన

ప్రభుత్వానికిగాని అప్పగించదలచలేదు!" అంటే ముస్లింలీగుకు, సంస్థానాధిపతులకు జాతీయ ప్రభుత్వస్థాపనను నిరాకరించే అధికారమిచ్చారు. ఇందుకు బదులుగా బ్రిటన్ చేసిన ప్రతిపాదన ఇది :

1. "నూతన రాజ్యాంగచట్టం తయారుచేసేందుకై భారత జాతీయ జీవితంలోని ప్రధానశక్తుల ప్రతినిధుల సంస్థ నొకదానిని" యుద్ధానంతరం స్థాపిస్తారు.

2. మరికొంతమంది భారతీయులను నామినేట్ చేసి వైస్రాయి కార్యవర్గాన్ని పెద్దదిచేస్తారు.

3. భారత సంస్థానాల, ఇతర భారతీయుల ప్రతినిధులతో "యుద్ధ సలహా సంఘం" ఒకటి నియమిస్తారు.

ఈ అసంతృప్తికరమైన సమాధానంవల్ల కాంగ్రెస్ వ్యక్తిగత సత్యాగ్రహోద్యమాన్ని గాంధీజీ నాయకత్వంక్రింద ఆరంభించింది.1940 అక్టోబరులో ఈ ఉద్యమం ఆరంభమైంది.

సామ్రాజ్యవాదంపై తుదిపోరాటం సాగించాలనే శక్తులు బాగా అభివృద్ధి చెందాయి. ఈ అంశం ప్రభుత్వం కార్మిక, కర్షక, అతివాద వర్గాలపై జరిపిన దమననీతి (1939 – 40) లోనే కాక, మరీ పరిమితమూ, దిక్కులేనన్ని షరతులతో కూడినదీ అయిన గాంధీజీ సత్యాగ్రహంలోనుకూడ ప్రతిబింబించింది.

అది స్వతంత్రానికై జరిపే పోరాటంకాదు. వాక్స్వాతంత్ర్యాన్ని చాటేందుకై చేసే చిహ్నప్రాయమైన సత్యాగ్రహం। సత్యాగ్రహుల జాబితాను గాంధీజీ ఆమోదానికి పంపాలి ఆయన ఆమోదించిన వ్యక్తులు, తామెక్కడ, ఎప్పుడు యుద్ధానికి ఈ చిహ్నప్రాయమైన తమ అసమ్మతిని ప్రకటిస్తారో ముందుగానే పోలీసులకు తెలుపుతారు. ఇదిలా ఉన్నప్పటికి విపరీతంగా అరెస్టులు, శిక్షలు జరిగాయి. (12000 మంది యు. పి. లో మాత్రమే 1941 మే 24 వ తేదీనాటికి అరెస్టయ్యారు. ఇది అధికారరీత్యా జరిగిన ప్రకటననుబట్టే ఇచ్చిన సంఖ్య. యావద్భారతదేశం మొత్తంమీద 20 వేలమంది జైళ్ళలో పడ్డారు. వీరిలో 398 మంది రాష్ట్ర శాసనసభ్యులు, 31 మంది మాజీ మంత్రులూ, 22 మంది కేంద్ర శాసనసభ్యులూ ఉన్నారు.)

1941 ఉత్తరార్థంలో సోవియట్ యూనియన్‌పై జర్మనీ దాడిచేయడం, బ్రిటిష్ సోవియట్ సంధి దూరప్రాచ్యంలో జపాను దాడి, బ్రిటిష్ - సోవియట్ మైత్రి మిత్రరాజ్యసమితి స్థాపనగా పరిణమించడం ఇందుకు బ్రిటన్, అమెరికా, సోవియట్ యూనియన్, చైనాలు నాయకత్వం వహించడం మొదలైన సంఘటనలతో యుద్ధస్వభావంలో పెద్దమార్పు వచ్చినప్పుడు, భారతదేశంలోని ప్రతిష్టంభన ఈ స్థితిలో ఉంది.

ఈ యుద్ధంలోని మార్పును భారత జాతీయవాదులు త్వరగా గ్రహించారు. ఇందువల్ల భారతదేశ విషయంలో ఏర్పడే ప్రాముఖ్యతనూ గ్రహించారు. 1941

డిసెంబరులో జవహర్లాల్ నెహ్రూ ఇలా అన్నాడు : "రష్యా, బ్రిటన్, అమెరికా, చైనాలు ప్రాతినిధ్యంవహించే సముదాయంలో ప్రపంచ అభ్యుదయశక్తులు నేడు కలిసి ఉన్నవి."

యుద్ధస్వభావంలో వచ్చిన ఈమార్పును జాతీయోద్యమంలో అన్నివర్గాలూ అంతసులభంగా గ్రహించలేదు. కొన్ని తెగలవారు ఇంకా గాంధీజీ "అహింసా" యుద్ధవ్యతిరేక సిద్ధాంతాన్నే అనుసరిస్తూ వచ్చారు. మిగతావారు బ్రిటిష్ సామ్రాజ్య వాదంతో సహకారం చేయాలంటే సంశయిస్తూవచ్చారు. కాని జాతీయోద్యమంలోని ప్రధాన బాధ్యతాయుతనాయకత్వానికి ప్రతినిధులయిన మౌలానా అజాద్ (కాంగ్రెస్ అధ్యక్షుడు) జవహర్లాల్ నెహ్రూ అధికసంఖ్యాకబలంతో మిత్రరాజ్యాలతో సమాన మిత్రదేశంగా సహకరించాలనే కోరారు. ఈ ప్రాతిపదికపై సహకరించ ప్రయత్నించారు. ఈ శక్తులతో సమాధానపడేందుకు ఒక ప్రాతిపదిక నేర్పరుచుకోవడం బ్రిటన్‌కు మిత్రరాజ్యాలకు అనుకూలమని స్పష్టమే. ఇలాగే 1941 ఉత్తరార్థం నుండి బ్రిటిష్ ప్రభుత్వం నూతన పరిస్థితిని, నూతన దృక్పధంతో అందుకొనాలనే అనుకుంటే అనుకూలమైన స్థితి ఏర్పడిందని తేలింది.

మొట్టమొదట ఇందుకు బ్రిటన్ వైముఖ్యం చూపింది. 1941 ఆగస్టులో ప్రకటించిన అట్లాంటిక్ చార్టర్ బ్రిటిష్, అమెరికా ప్రభుత్వాల విధానంగా తెలుపబడింది. అం దుకు వారు బద్ధులుగా ఉండాలి తర్వాత మిత్రరాజ్యాలన్నీ ఈ చార్టరుకు సమ్మతించాయి. అందులో ఇలా ఉంది.

> "తాము ఏ ప్రభుత్వంక్రింద నివసిస్తారో, ఆ ప్రభుత్వ పద్ధతిని, తమ ఇష్టప్రకారం నిర్ణయించుకునే ప్రజల హక్కును గౌరవిస్తాము; బలవంతంగా తొలగింపబడిన సర్వ స్వతంత్రహక్కు, స్వపరిపాలనలను వారి వారికి పునరుద్ధరించేలా చూస్తాము."

ఈ ప్రకటన ఇలా ఉన్నప్పటికి. బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ప్రభుత్వ పక్షంగా చేసిన అధికార ప్రకటనలో ప్రత్యేకించి ఈ అట్లాంటిక్ చార్టర్ అమలుజరిపే ప్రాంతాలనుండి ఇండియా, బర్మా మొదలైన తమ సామ్రాజ్యంలోని భాగాలను వేరుపరచాడు. దాన్నిలా వివరించాడు

> "అట్లాంటిక్ సమావేశంలో, ఇప్పుడు నాజీ కోరలలో చిక్కుకున్న యూరపుదేశాల సర్వస్వతంత్ర హక్కును, స్వపరిపాలనను జాతీయ జీవితాన్ని పునరుద్ధరించాలన్నవిషయమే మామనస్సుల్లో ప్రధానంగా ఉం:"

ఇలా చేసిన దిద్దుబాటుతో భారత జాతీయవాదులు కోపోద్దీపితులయ్యారు. మిత్రరాజ్య సమితికి వ్యతిరేకత బలపడింది.

అయినప్పటికి 1941 డిసెంబరులో ప్రధాన కాంగ్రెసు నాయకులను ప్రభుత్వం విడుదల చేయడంతో, ఒక సహకార పద్ధతి ఏర్పడేందుకు అవకాశం ఏర్పడింది.

1941 డిసెంబర్ ఆఖరున కాంగ్రెసు బార్డోలీ తీర్మానం (1942 జనవరిలో దీనిని ఆమోదించారు) సూత్రప్రాయంగా మిత్రరాజ్యాలతో చేరి అక్షరాజ్యాలను సాయుధంగా విరోధించాలని అంగీకరించింది. కాని ఇందుకొక షరతుమాత్రం ఉంది. ఇండియా జాతీయ ప్రభుత్వం క్రింద సైనిక సమీకరణ చేయగలగాలి. ఆ తీర్మానంలో ఇలాఉంది.

"భారతదేశవిషయంలో బ్రిటిష్‌విధానంలో మార్పు లేనప్పటికి యుద్ధం పురోగమనంలో ఏర్పడిన నూతన ప్రపంచపరిస్థితిని, భారతదేశాన్ని యుద్ధం సమీపించిన సంగతిని గమనించ కోరుతున్నాము. దురాక్రమణకు ఆహూతై తమ స్వతంత్రంకోసం పోరాడుతున్న ప్రజలపైనే. కాంగ్రెసు సానుభూతి సహజంగా ఉంటుంది; కాని స్వతంత్ర భారతదేశం ఒక్కటే దేశరక్షణకు జాతీయ ప్రాతిపదికపై పూనుకోగలదు"

అహింసను వదిలివేయడంతో ఏకీభవించ నందువల్ల, గాంధీజీ ఈ తీర్మానం ఆమోదింపబడుతూనే కాంగ్రెసు నాయకత్వం వదులుకున్నాడు.

ఈ తీర్మానంపై టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక ఇలా వ్యాఖ్యానించింది:

ఈ తీర్మానం బ్రిటిష్ ప్రభుత్వంతో సంధికి దారి నేర్పరుస్తున్నది. ఇందువల్ల అమూల్యమైన సూచన చేయబడింది. దీనిని ఆ వేపువారు కూడ గ్రహించి సమాధానమిస్తారని ఆశిస్తున్నాము."

దారేమో చక్కబడింది — కేవలం బ్రిటన్ కొంత రాజకీయ నైపుణినీ, అనుకూలతను కనబరిస్తే సరిపోయేది.

ఈ అనుకూల పరిస్థితి, జనరలిజ్మో జంగ్‌కై షేక్ 1942 ఫిబ్రవరిలో ఇండియాకు రావడంతోను ఒకేసూరి ఇండియాకు, బ్రిటన్‌కు ఆయన చేసిన విజ్ఞప్తితోను మరింత అనుకూల స్థితి ఏర్పడింది. "దురాక్రమణదారులు, తద్ వ్యతిరేకులు అనే ఈ రెండు సైనిక శిబిరాలలో దేనిలోనో ఒకదానిలో చేరాలేగాని మధ్యే మార్గంలేద"ని భారతీయులకాయన ఖచ్చితంగా చెప్పాడు. భారత ప్రజలు సంపూర్ణ శక్తియుక్తులతో యుద్ధంలో పాల్గొనేందుకు వీలుగా, "నిజమైన రాజకీయ అధికారాన్ని ఎంత త్వరగా సాధ్యపడుతే అంతత్వరగా ఇవ్వాలని బ్రిటన్‌కు ఆయన విజ్ఞప్తిచేశాడు. యుద్ధంలో బలోపేతంగా పాల్గొనేందుకు భారత ప్రజలకు "నిజమైన రాజకీయాధికారాన్ని ఆయన ఇవ్వాలనడం యుద్ధ కార్యక్రమంగానే కాని యుద్ధానంతరపు మాటకాదు. ఈ దృక్పథం భారత జాతీయవాదుల దృక్పథంతో ఏకీభవించింది.

ఇలాగే ఆస్ట్రేలియా విదేశాంగశాఖామంత్రి, 1942 ఫిబ్రవరిలో ఇలాంటి అభిప్రాయాన్నే వెల్లడించాడు. యుద్ధసమయంలోనే ఇండియాకు స్వపరిపాలన ఇవ్వాలని, తద్వారా యుద్ధంలో భారతదేశం పాల్గొనడంవల్ల, బలపడుతుందని చెప్పాడు.

"స్వపరిపాలితదేశం తమది కావాలనే, భారత ప్రజల వాంఛలయెడ మేము సానుభూతి కనబరుస్తున్నాము. అలాంటి స్వపరిపాలిత దేశంగా ఆశియాలో మిత్రరాజ్య ఆశయరక్షణలో ఆ దేశంలో పాల్గొనాలని భారతీయులు కోరుతున్నారు."

(డాక్టర్ హెచ్. వి. ఇవాట్ ఆస్ట్రేలియా విదేశాంగమంత్రి, ఆస్ట్రేలియా పార్లమెంటులో 1942 ఫిబ్రవరి 27 న చేసిన ఉపన్యాసం.)

రూజ్వెల్టు అధ్యక్షుడు 1942, ఫిబ్రవరి 22 తేదీ అట్లాంటిక్ చార్టర్ "ప్రపంచాని కంతటికి" అనువర్తిస్తుందని స్పష్టంగా ప్రకటించాడు. (ఇలా 1941 సెప్టెంబర్‌లో చర్చిల్ చేసిన ప్రకటన సరిదిద్దాడు):

"అట్లాంటిక్ ప్రణాళిక, అట్లాంటిక్ సరిహద్దులో ఉన్న ప్రపంచ భాగాలకేకాక, ప్రపంచానికంతటికి అనువర్తిస్తుంది."

(రూజ్వెల్టు అధ్యక్షుడు. రేడియో ప్రసంగం 1942 ఫిబ్రవరి 22)

ఈ రేడియో ప్రకటనతోబాటు, రూజ్వెల్టు, భారతదేశ స్వతంత్రాన్ని బలపరుస్తూ బ్రిటిష్ ప్రభుత్వంతో ప్రత్యక్షంగా ఉత్తరప్రత్యుత్తరాలు నడిపాడు. ఈ అంశాన్ని 1946 లో మాజీ అమెరికా ప్రభుత్వ కార్యదర్శి సమ్నర్‌వెల్సు బయటపెట్టాడు:

"జపాను ప్రమాదం ఎక్కువగా ఉన్నప్పుడు, భారతదేశంలో సంక్షోభం తీవ్రంగా ఉన్నప్పుడు, 1942 లో రూజ్వెల్టు చర్చిల్ నిలా కోరాడు. భారతదేశ స్వతంత్రాన్ని ఇక ఆలస్యం చేయరాదని, అమెరికా కాన్‌ఫెడరేషన్ పద్ధతిలో జాతీయ రాజ్యాంగచట్టాన్ని తయారు చేసుకునేందుకు భారతనాయకులకు అవకాశ మివ్వవలసిందని ఆయన చర్చిల్‌ను అంగీకరించమన్నాడు ఇలాంటి తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచినట్లయితే, భారతనాయకులు కలిసి పనిచేయ ప్రోత్సాహమిచ్చేదనీ, ఆ అనుభవం మూలంగా తమ కే విధమైన రాజ్యాంగచట్టం, తమ ప్రత్యేక అవసరాలకు అనుకూలమైందో తెలుసుకోగలిగేవారని రూజ్వెల్టు విశ్వాసం. అలాంటి పరిష్కారమార్గాన్ని, అప్పుడు భారత నాయకులు అంగీకరించి ఉండేవారు. ఇప్పుడు ఇలాంటి ప్రతిపాదననే చేస్తున్న నేటి బ్రిటిష్ ప్రభుత్వం, నాలుగేళ్ళక్రిందట దీనిని ఆలోచించడానికే చర్చిల్ కోపంతో నిరాకరించినందుకు విచారపడాలి."

(సమ్నర్‌వెల్సు. క్రిష్టియన్ సైన్సు మానిటర్, జూన్ 1946.)

భారత జాతీయవాంఛను సరైన పరిసరాలలో అర్థంచేసుకోవడంకోసం అమెరికా, ఆస్ట్రేలియా, చైనాల ఒత్తిడి, నడిపిన వ్యవహారాన్ని గుర్తించడం ముఖ్యం. మిత్రరాజ్యసమితిలో బ్రిటిష్ ఉద్యోగులు మాత్రమే, యుద్ధసమయంలో భారతదేశంలో బాధ్యతాయుత జాతీయప్రభుత్వం ఏర్పరచేందుకు నిరాకరిస్తున్నారు. వీరు మిగత మిత్రరాజ్యాలనుండి వేరుపడ్డారు.

ఇలా 1942 వసంతంనాటికి అనుకూల వాతావరణం ఏర్పడింది. బంతి బ్రిటన్ కాలిదగ్గర విల్చుంది. ఇప్పటికీ ఇంకా మిగిలిఉన్న బ్రిటిష్ ఉద్యోగుల వైముఖ్యం. విరోధం. జపానువారు మార్చిలో రంగూన్ ప్రవేశించడంతో పోయి. తగిన చొరవకు అవకాశం ఏర్పడింది.

మార్చి 8 వ తేదీ రంగూన్ పతనమైంది.

మార్చి 11 వ తేదీ క్రిప్సురాయబారంగూర్చి ప్రకటన జరిగింది.

1942 మార్చి. ఏప్రిల్ నెలల్లోని క్రిప్సురాయబారం. యుద్ధసమయంలో ఇండో బ్రిటిష్ సంబంధాల ప్రతిష్టంభనలో ఒక పరివర్తనదశను సూచిస్తున్నది. బ్రిటిష్ మంత్రివర్గం తయారుచేసిన భారత రాజ్యాంగ సంస్కరణలు - క్రిప్సు ప్రతిపాదనలను భారతనాయకులతో చర్చించేదుకు సర్ స్టాఫర్డు క్రిప్సు ఇండియాకు వచ్చాడు. ఆయన ప్రతిపాదనల్లో రెండుభాగాలున్నవి;

## 1. యుద్ధానంతర ప్రతిపాదనలు

(అ) నూతన ఇండియన్ యూనియన్‌కు అధినివేశహోదా బ్రిటిష్ కామన్వెల్తులోనుండికూడ విడిపోయే హక్కుంటుంది;

(ఆ) యుద్ధం ముగుస్తూనే "రాజ్యాంగ నిర్మాణసభ" ఒకదానిని ఏర్పరుస్తారు. యుద్ధానంతరం ఎన్నుకోబడిన రాష్ట్రశాసనసభ్యులు దామాషా ప్రాతినిధ్య ప్రాతిపదికపై రాజ్యాంగ నిర్మాణసభకు ఎన్నుకోబడతారు. మిగత సభ్యులను నూతన రాజ్యాంగ నిర్మాణానికై. తమ జనాభా దామాషానుబట్టి సంస్థానాధిపతులు నామినేట్ చేస్తారు.

(ఇ) బ్రిటిష్ ఇండియాలోని ఏ రాష్ట్రంగాని. ఏ సంస్థానంకాని ఇందులో చేరకుండా ఉండే హక్కుంది. ఇప్పుడున్న పద్ధతిలోనే అవి ఉండొచ్చు. లేదా సమానహక్కులతో ప్రత్యేక అధినివేశంగా నూతన రాజ్యాంగచట్టం తయారుచేసుకొని ఏర్పడవచ్చు;

(ఈ) తెగలకు. మతాలకు చెందిన మైనారిటీల రక్షణకు బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన వాగ్దానాలకు అనుగుణంగా తగిన సూత్రాలు ఏర్పరచేందుకు బ్రిటన్‌కూ, రాజ్యాంగ నిర్మాణసభకూ మధ్య సంధి జరగాలి.

## 2. యుద్ధసమయంలో వెంటనే అమలుకువచ్చే ప్రతిపాదనలు

అధికారం బ్రిటన్ చేతనే ఉంచుకోవడం. భారత ప్రతినిధులు సలహాలద్వారా సహకారం చేయడం.

అధికారాలతో జాతీయ ప్రభుత్వాన్ని యుద్ధసమయంలోనే ఇవ్వ నిరాకరించడమనే ఆఖరు అంశం, ప్రతిపాదనల్లో ముఖ్యమైనది. ఇదే భగ్నమయ్యేందుకు కారణమైంది.

ఎంత పత్రికల్లో ప్రచారం చేయించినా, నూతన యుగకర్తలాంటి ప్రతిపాదన

లని డంబాలు పల్కినా, ఇందులో బ్రిటిష్ విధానం ఏ మాత్రం మార్పుచెందలేదు. భారత ప్రజలలోని వివిధవర్గాలు పూర్వమే నిరాకరించిన వైస్రాయి (1940) ఆగస్టు ప్రతిపాదననే ఇది పునరుచ్చారణ చేసింది. క్రిప్సు రాయబారంగూర్చి దాదాపు అధికార చరిత్రకారుడే ఈ సత్యాన్ని అంగీకరిస్తున్నాడు.

"ఈ ప్రకటనలో, విధానంలో తీవ్రమైన మార్పేమీ సూచించదు.... సూత్రరీత్యా ఆచరణలోనూకూడా, 'ఆగస్టు' ప్రతిపాదనకన్నా ఇదేమీ ముందుకుపోలేదు."

(ప్రొఫెసర్ ఆర్. కూప్లాండ్, "క్రిప్సు రాయబారం" ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, 1942, పుట 30)

ఇంతేకాక :

"ఈ ప్రతిపాదన యుద్ధ సమయంలో రాజ్యాంగ స్వరూపంలో ఏ పెద్దమార్పుగాని వచ్చే అవకాశంలేదని త్రోసివేసింది."

(అదే పుట 32)

ఏదో ఒక పరిష్కారం కుదుర్చుకోగలమన్న ఆశతో రాయబారాల్లో కాంగ్రెసు చాల వాటికి ఒప్పుకుంది. బాధ్యతలు, అధికారాన్ని ఇచ్చినట్టయితే బ్రిటిష్ వైస్రాయికింద పనిచేయడానికి అంగీకరించింది. మిలటరీ చర్యలపై పెత్తనమేకాక, మంత్రివర్గంలో సభ్యత్వంకూడ ఇచ్చి బ్రిటిష్ సర్వసేనాని ఉండ డానికి అంగీకరించింది.

కాని ఫలం లేకపోయింది. బ్రిటిష్ ప్రభుత్వం, యథాప్రకారం అచ్చంగా నిరంకుశంగా ఉండిపోవాలని వాదించి చెప్పారు. భారత రక్షణమంత్రి మహా చేయ గలిగితే స్టేషనరీ వస్తువులపైన, ఫలహార శాలలపైన అధికారం చెలాయించ వచ్చునని కాంగ్రెసుకు చెప్పారు. భేదాభిప్రాయాలను తగ్గించుకునేందుకై కాంగ్రెసు సంప్రతింపులు నడుపుతుండగా "ఇందుకు అంగీకరిస్తే అంగీకరించండి, లేదా వదలివేయండి" అని బ్రిటన్ అన్నది. ఇందువల్ల నిజంగా సంప్రతింపులు సాగిం చడం బ్రిటన్ ఉద్దేశంకాదని తిరిగీ తగాదాకు ప్రాతిపదిక కల్పించడమే వారి ఉద్దేశ మని కాంగ్రెసుకు తోచింది.

ఈ భావం లార్డు హాలీఫాక్సు ఏప్రిల్ 7 వ తేదీన చేసిన దురదృష్టకర ఉపన్యాసంతో మరింత బలపడింది. సంప్రదింపులింకా సాగుతుండగానే అవి భగ్నంకాగలవని అనుకొని అట్టి పరిస్థితి ఏర్పడితే బ్రిటిష్ ప్రభుత్వం అధికారాన్నే నిర్వహిస్తుందని హాలిఫాక్సు ప్రకటించారు. ఇకమీద భారతదేశంలో బ్రిటిష్ ప్రభు త్వాన్ని విమర్శించే భావి విమర్శకులకు తగిన గట్టి సమాధానంగా క్రిప్పు రాయ బారం పనికి వస్తుందని అందుతో అది సఫలమైనట్టేనని హాలిఫాక్సు అన్నాడు.

క్రిప్పు ప్రతిపాదనలకు భారతీయులందరూ ఆఖరుకు పూర్తి మితవాదులు కూడా అసమ్మతి తెలిపారు. కాంగ్రెసు ఒక్కటేకాక ముఖ్యమైన ప్రతి భారతీయ సంస్థా క్రిప్పు ప్రతిపాదనలను నిరాకరించింది.

ఈ వైఫల్యంపై కలకత్తా "స్టేట్స్‌మన్" పత్రిక తన తీర్పునిలా చెప్పింది.

"ఎంతవరకు, భారత ప్రభుత్వమూ భారత కార్యాలయమూ ప్రతిపాదనలను తయారుచేస్తుంటాయో అంతవరకూ ఏ రాయబారికూడా సఫలుడు కాలేడు. ఈ దేశానికి గంటగంటకూ తీవ్రతరమౌతున్న ప్రమాద పరిస్థితిని ఎదుర్కొనేందుకు ఏ ప్రయత్నమూ సాగదు.....

"ఇందుకు నిందింప దగినవారు భారత కార్యాలయంవారు, భారత ప్రభుత్వంలోని అధికారవర్గమున్నూ."

## 4. ఆగస్టు తీర్మానమూ, తర్వాతా (1942—1945)

రాజకీయ పరిస్థితి అధ్వాన్నమయి పోవడంతోపాటు క్రిప్సు రాయబారం భగ్నమైపోయింది.

ఇంకేమీ చేయవీలుపడదంటూ బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. భారత జాతీయోద్యమాన్ని అప్రతిష్ఠపాలు చేయాలని పాక్షికమైన ప్రచారం ఆరంభించింది. పాత వాదాలన్నిటిని ప్రపంచ ప్రజల యెదుట రుజువు చేయదలచుకొంది : కాంగ్రెసు ప్రజలందరకు ప్రాతినిధ్యం వహించదని, భారత ప్రజల్లో రాజకీయ విభేదాలు విపరీతంగా ఉన్నవని, వారు స్వపరిపాలన చేసుకోలేరని ప్రచారం ఆరంభించింది.

సహకారం చేయాలన్న ఆశ భగ్నం కావడంతో, కొంత తటపటాయించి కాంగ్రెసు, విభేదాలు వాదోపవాదాలు జరిపి, ఆఖరుకు జాతీయ వాంఛను అమలు జరిపించేందుకు సహాయ నిరాకరణమే సాధనమన్న వైఖరికిదిగింది.

కాంగ్రెసులోని ఒకభాగం, మదరాసు మాజీ ప్రధాని చక్రవర్తి రాజగోపాలాచారి నాయకత్వం క్రింద, ఇంతకన్న నిర్మాణాత్మకమైన విధానాన్ని సూచించింది. జాతీయ వాంఛను బ్రిటన్ నిరాకరించినప్పటికి, ముస్లిలీగు, ఇతర సంస్థల సహకారాన్ని సాధించి జాతీయ సంఘటనను ఏర్పరచాలని ఈ వర్గంవారు కోరారు. జపాను ప్రమాదం రానున్న సమయంలో సంయుక్త ప్రతిఘటనను నిర్మించుకునేందుకై, ముస్లిం అధికసంఖ్యాక ప్రాంతాలకు జాతీయ స్వయం నిర్ణయహక్కును గుర్తించే ప్రాతిపదికపై ఈ ఒడంబడిక కుదుర్చుకోవాలని కోరారు. ఈ ప్రతిపాదనను అఖిల భారత కాంగ్రెసు కమిటీ మేనెలలో 120—15 వోట్లతో నిరాకరించింది. ఒక సమాధానానికి రావడానికై ముస్లింలీగుతో సంప్రతించేందుకు ఒక ప్రతినిధి వర్గాన్ని నియమించడానికి కాంగ్రెసు సిద్ధంగా ఉందనిమటుకు కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా అజాద్ ప్రకటించాడు. అయినా తీర్మానం వోడిపోయింది. రాజగోపాలాచారి, తన విధానాన్ని ప్రచారం చేసుకునేందుకై కాంగ్రెసుకు రాజీనామాఇచ్చాడు.

1941 డిశంబరునుండి నాయకత్వంనుండి తొలగింపబడిన గాంధీజీ చేతికి, తిరిగి కాంగ్రెసు ప్రత్యక్షనాయకత్వం వెళ్ళింది. గాంధీజీ తన యుద్ధవ్యతిరేక

శాంతివాదాన్ని బోధిస్తున్నాడు. అందులోని సూత్రాలివి: (1) జపానును అహింసతో నిరోధించాలి; (2) బ్రిటిష్ అధికారులతో సహాయనిరాకరణం చెయ్యాలి; (3) ఫాసిస్టు వ్యతిరేక మిత్రరాజ్యసమితి ఆశయంపై నైతిక సానుభూతి చూపాలి; (4) తగాదాలో ఇండియా తగులుకోకుండా వేరుగా ఉండాలి ఇక ఈవాదం నెహ్రూవాదానికి విరుద్ధమైనది. సాయుధ ప్రతిఘటన చెయ్యాలని, గెరిల్లాదళాలను నిర్మించాలని. "భూదగ్ధ విధానా"న్ని అవలంబించాలని నెహ్రూ చెబుతూ వచ్చాడు.

కాంగ్రెసు గాంధీజీ శాంతివాదాన్ని అంగీకరించలేదు కాని, భారతస్వతంత్ర సాధనకిక మిగిలిన ఆయుధం గాంధీ చెప్పే సహాయనిరాకరణం ఒక్కటేనని భావించసాగింది. స్వతంత్రసాధనద్వారా భారత రక్షణను వాస్తవంగా చేయ వీలవుతుందని భావించింది. జూన్‌లో గాంధీ నెహ్రూ అజాదులమధ్య సంప్రదింపులు జరిగాయి. దానిద్వారా ఒక సమాధానం కుదిరింది. ఇందుకు ఫలితంగా జులై 14 న వర్కింగుకమిటీ చేసిన సహాయనిరాకరణ తీర్మానం వచ్చింది. ఫాసిస్టు వ్యతిరేకనాయకులూ, మిత్రరాజ్యాలతో సహకారం చేయాలని కోరుతున్నవారు గాంధీజీ వాదంలోకి పోయారు. జపానుదాడి ప్రమాదమున్న సమయంలో సహాయనిరాకరణోద్యమం నడపాలన్న ఆయన ప్రమాదకర ప్రతిపాదనలకు చెవియొగ్గారు.

అక్షరాజ్యాలిందుకో ఆనందపడి కాంగ్రెస్‌ను పొగడసాగాయి. అక్షరాజ్యయాజమాన్యంక్రింద ప్రచారం సాగిస్తున్న సుభాస్‌చంద్రబోస్ అనుచరులు తాము ప్రజలలోకిచొచ్చుకొని పోయేందు కిదొక మంచి అవకాశమనిభావించారు ఈ పరిస్థితికి కాంగ్రెస్ ఆందోళన చెందింది. (ఈ ఆశాభంగం బ్రిటన్‌పై ద్వేషం పెచ్చుపెరిగేట్టుచేసింది; జపాను సేనల విజయాలకు సంతృప్తిచెందడం ఎక్కువవుతున్నది; ఈ స్థితికి తీవ్ర అసమ్మతితో వర్కింగుకమిటీ చూస్తున్నది — కాంగ్రెస్ వర్కింగు కమిటీ తీర్మానం, జులై 14.)

ఎందుకైనా తెగించే బ్రిటిష్ అధికారవర్గాలలోని అభివృద్ధివిరోధక ప్రచారం కూడ కాంగ్రెస్‌ను అప్రతిష్ఠపాలుచేసేందుకు ఈ మాతన అవకాశాన్ని ఉపయోగించుకున్నది. మిత్రరాజ్యాలతో సహకారం చెయ్యాలని కోరే ముఖ్య ఫాసిస్టు వ్యతిరేక నాయకులైన నెహ్రూ, అజాదులను గాంధీజీ సహాయనిరాకరణ పంథాలో పడిపోయేటట్టు చేసిన తమ అసమర్థ విధానాన్ని గుర్తించడానికి బదులు, బ్రిటిష్ అధికార వర్గంపై తమకు విజయంచేకూరినట్టే భావించారు. శాంతివాదాన్ని, సంతృప్తి పరచాలనే ధోరణిని తెలిపే గాంధిజీ ప్రత్యేక లక్షణంగల ప్రతి మాటకూ భారత దేశంలోను, ప్రపంచంలోనుబాగా ప్రచారం చేయడానికి అవకాశం తీసుకున్నారు ఈమాటలన్నీ జాతీయోద్యమాన్నంతటినీ లొంగిపోయేదని, జపానుతో సంధిచేసుకునేందుకు సిద్ధంగా ఉన్నదని ప్రదర్శించేందుకు అధికారులు ఉపయోగించుకున్నారు. గాంధీజీ బహిరంగ ప్రకటన వల్లనే లోకవిదితమైన అంశాలను బయటపెట్టేందుకు పోలీసు

దాడి జరిపి కొన్ని పత్రాలను ప్రకటించారు. ఆవిధంగా బయటపడిన ఈప్రకటనకూడ తిరిగి తగాదా రెచ్చగొట్టాలనే అధికారుల ఎత్తుగడకు నిదర్శనం.

కాంగ్రెసుకు 'జనరలిస్సిమో' (సేనాధిపతి) గా గాంధీజీ నాయకత్వం వహించాడు. (ఈ బిరుదు తగినదే) ఇది భారతజాతీయోద్యమానికినష్టకరమైంది. ప్రపంచ ప్రజాభిప్రాయంముందు చాల తీవ్రమైన నష్టంకలిగింది. గాంధీజీ శాంతివాదాన్ని, శత్రువుతో సంధిచేసుకోవాలనే వాదాన్ని జాతియోద్యమ భావమని ప్రపంచ ప్రజలు సహజంగా అపోహపడ్డారు. కాని గాంధీ అహింస, సంతృప్తిపరిచే వ్యక్తిగత దృక్పధాన్ని ప్రతి కాంగ్రెసు ప్రకటనా, తీర్మానమూ స్పష్టంగా ఖండిస్తూవచ్చింది.

సహాయ నిరాకరణ తీర్మానం జులైలో ప్రకటితమైంది. ఆఖరుకు సవరించిన రూపంలో ఆగస్టు 8 వ తేదీ అంగీకరింపబడింది (13 వోట్లు వ్యతిరేకంగా వచ్చాయి. భారత కమ్యూనిస్టుపార్టీ ఈ ప్రతికూలత చూపింది. ఈ పార్టీపై జులై 22 వ తేదీ నిషేధం తొలగించారు. ఈ తొలగింపు పార్టీ పలుకుబడి, బలం పెంపొందుతున్నదనేందుకు నిదర్శనం )

ఈ తీర్మానం మిత్రరాజ్యసమితి యెడల సానుభూతి చూపింది. మిత్ర రాజ్యాల సహకారంతో, ఫాసిజంపై సాయుధ ప్రతిఘటన సాగించేందుకు; జాతీయ ప్రభుత్వం క్రింద భారతదేశాన్ని స్వతంత్ర మిత్రరాజ్యంగా గుర్తించాలని వాంఛించింది.

"తక్షణమే భారత దేశంలో బ్రిటిష్ పరిపాలన అంతంకావడం; భారతదేశానికి, మిత్రరాజ్యాల ఆశయం విజయవంతం కావడానికి రెంటికీ కూడా అవసరం.

"భారతదేశ స్వతంత్రాన్ని ప్రకటించిన వెంటనే తాత్కాలిక ప్రభుత్వ మొకటి స్థాపించబడుతుంది. స్వతంత్ర భారతదేశం మిత్రరాజ్యాలకు మిత్రమవుతుంది. స్వతంత్ర పోరాటంలో, సంయుక్త ప్రయత్నంలో వచ్చే పరీక్షలకు, బాధలకు వాటితోపాటు భాగస్వామివి అవుతుంది.

"తాత్కాలిక ప్రభుత్వం దేశంలోని వివిధ పార్టీల గ్రూపుల సహకారంమీదనే స్థాపితం కాగలదు.....ఆ ప్రభుత్వ ప్రధమకర్తవ్యం తనకున్న సాయుధశక్తిని, అహింసాశక్తిని ఉపయోగించి, మిత్రరాజ్యాలతోపాటు దురాక్రమణను ఎదుర్కోవడం.....

"స్వతంత్ర భారతదేశానికి, ఇతర మిత్రరాజ్యాలకు ఉండవలసిన భావిసంబంధాలను పరస్పర ప్రయోజనంకోసం, అందరికీ సమాన కర్తవ్యమైన దురాక్రమణ ప్రతిఘటనకోసం స్వతంత్రదేశాల ప్రతినిధులందరూ కలసి ఏర్పరచాలి ....

"చైనా లేక రష్యా రక్షణను ఏవిధంగాకూడ బాధించకూడదని ఈ కమిటీ ఆందోళన కనబరుస్తున్నది. ఆదేశాల స్వతంత్రం అమూల్య

మైనది. దానిని తప్పక రక్షించాలి. మిత్రరాజ్యాల రక్షణశక్తికి భంగం కలిగించరాదనికూడ కమిటీ భావిస్తున్నది"

ఇంతవరకు, ఈ తీర్మానాన్ని, భారతదేశంలోను ప్రపంచంలోను ఉన్న ప్రజాతంత్ర, ఫాసిస్టు వ్యతిరేక ప్రజలందరూ బలపరుస్తారు. కాని తీర్మానంలోని ఆఖరుభాగం, జాతీయవాంఛ నిరాకరింపబడితే సహాయనిరాకరణ కార్యక్రమాన్ని విధిస్తున్నది.

"ప్రపంచ స్వతంత్రంకోసం, ఈ ఆఖరునిమిషంలో కూడ ఈ విజ్ఞప్తిని బ్రిటన్‌కూ, అమెరికాకూ అఖిలభారత కాంగ్రెస్‌కమిటీ పునఃప్రకటిస్తున్నది.

"కాని తమ మేలుకోసమూ, మానవకోటి మేలుకోసమూ పనిచేయకుండా అడ్డగిస్తూ, పెత్తనం సాగిస్తున్న సామ్రాజ్యవాద నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తన వాంఛను నిలబెట్టుకోనీకుండా దేశాన్ని వెనక్కు నెట్టడం ఇక ఎంతమాత్రం న్యాయంకాదని యీకమిటీ భావిస్తున్నది.

"కాబట్టి భారతదేశపు స్వేచ్ఛా స్వతంత్ర జన్మహక్కును నిలబెట్టుకునేందుకై అతివిశాలమైన ప్రజాపోరాటాన్ని ప్రారంభించేందుకు అనుమతి నివ్వాలని కమిటీ నిశ్చయిస్తున్నది ఇలా అయితే 22 ఏళ్ళ శాంతి సంగ్రామంలో సంపాదించుకున్న అహింసా శక్తినంతటిని దేశం ఉపయోగించుకోగలదు.

"అలాంటి పోరాటం తప్పనిసరిగా గాంధీజీ నాయకత్వంక్రిందనే జరగాలి నాయకత్వం తీసుకొమ్మని, భావి చర్యలలో దేశాన్ని నడపమని గాంధీజీని కమిటీ ప్రార్థిస్తున్నది."

క్రిప్సు రాయబారం విఫలం కావడంతో ఏర్పడిన నిస్పృహఫలితమే ఆగస్టు తీర్మానం. ఏప్రిల్ 18 నెహ్రూ ప్రకటనలో ఆ నిరాశ కనిపిస్తున్నది.

"ఏంచేయాలో నాకేం తెలియడంలేదు. భారతదేశాన్ని శత్రువు దాడి చేయకుండగా అమెరికా, బ్రిటన్లు ఇతర దేశాలు తమపాత్ర నిర్వహిస్తుండగా నేను ఏమీ చేయలేకపోతున్నాను. ఈ భావంతో నేను అశాంతి ఆందోళనతో బాధ పడుతున్నాను."

ఆగస్టు తీర్మానంగూర్చి తీవ్ర వాదోపవాదాలు బయలుదేరాయి. ఈ తీర్మానాన్ని విమర్శించే ముందు క్రమంగా అంతర్జాతీయ ఫాసిస్టు వ్యతిరేక దృక్పధం కల భాగాలతోపాటు జాతీయ నాయకత్వం అలాంటి తెగింపు నిర్ణయానికి రావలసివస్తే అందుకు కారణమైన దారుణ సంధిగ్ధావస్థ ఏమిటి? అనేది మనం ముందు అర్థం చేసుకోవాలి. తమ కిష్టంలేకున్నా ఈ స్థితిలోనికి తమ్ము త్రోసివేశారని ఆ నాయకులు భావించారు. ఎందుకంటే స్వతంత్ర ప్రాతిపదికపై సహకారాన్ని సాధింతామని తాముచేసిన ప్రయత్నమల్లా భగ్నమైపోయింది. ఇక భారతప్రజలను సమీకరించి

అత్యవసరయుద్ధ సంక్షోభంలో వాస్తవమైన భారత రక్షణను సాధించేందుకు తమ కిక వేరే విధానం లేదని వారు భావించారు.

అయినప్పటికి, ఆగస్టు తీర్మానం, భారతదేశంలోనూ ప్రపంచప్రజల్లో దాని వల్ల కలిగిన ఫలితమూ కూడా వినాశకరమైనదని నిర్ణయించక తప్పదు. రాజకీయంగాచూస్తే ఈ తీర్మానం పరస్పరవిరుద్ధతను వెల్లడిస్తున్నది, ఈ వైరుధ్యం వల్ల ఆశయంలోని గందరగోళం బయటపడింది. అదే తీర్మానాన్ని అంగీకరించడానికీ హేతువైంది పీఠికకూ, సమాప్తికీ మధ్య స్పష్టమైన వైరుధ్యం కనిపిస్తున్నది. ఇది దేనితోనూ అతికించలేము, ఒకవేపు 1941 తార్వాత యుద్ధస్వభావం మారిందని. గుర్తించారు. ఇదిప్పుడు కేవలం విరుద్ధసామ్రాజ్యవాదులమధ్య యుద్ధం కాదని గుర్తించారు. అలా అయితే దాని ఫలితాన్ని ఔదాసీన్యంతో చూడవచ్చు. కాని మిత్రరాజ్యాల విజయంలో భారతదేశమెంతో ఆసక్తిచూపుతున్న యుద్ధమిది. అందుకనే ఈ తీర్మాన ఆశయంతో, "మిత్రరాజ్యాల విజయం" కూడ కలిసింది. భారతదేశం "మిత్రరాజ్యాలకొక మిత్రం"గా చేరాలనికూడ తీర్మానం తెల్పుతున్నది. "రష్యా లేక చైనాల రక్షణను ఏమాత్రం దుర్బలపరచకూడదని" "మిత్రరాజ్యాల రక్షణసామర్థ్యాన్ని భంగపరచరాదని" కాంగ్రెసు ఆందోళన పడుతున్నట్టు ఈ తీర్మానం స్పష్టంగా ప్రకటించింది. మరి ఇక ముగింపులోచూస్తే వీరు అవలంబించిన కార్యక్రమం అమలు జరపనే జరిపితే మిత్రరాజ్యాలలోని ఒకప్రధాన దేశంలో తీవ్ర ఆంతరంగిక సంక్షోభం ఏర్పడుతుంది. అలాంటి సంక్షోభం ఆచరణలో, మిత్రరాజ్యరక్షణశక్తికి భంగంకలిగించి అక్షరాజ్యాల విజయానికి సౌకర్యం కలుగజేస్తుంది.

యుద్ధం మొదటిరోజుల సంగతి చూదాం: అప్పటికింగా యుద్ధం ఆంగ్లో ఫ్రెంచి సామ్రాజ్యవాదానికీ నాజీ జర్మనీకీ మధ్యమాత్రమే సాగుతున్నది.; అప్పటికి భారతదేశం బ్రిటిష్ ప్రభుత్వం తోకగాతప్పితే యుద్ధంలో ప్రత్యక్షంగా తగులోకలేదు. తమ దేశంపై దాడి జరుగుతున్న ప్రత్యక్ష ప్రమాదమేమీ ఏర్పడలేదు. అలాంటప్పుడేమో యుద్ధ ప్రయత్నాలకు ఏ మాత్రం కష్టంకలక్కుండా ఉండేట్టు కాంగ్రెసు ప్రతిచర్యనూ జాగ్రత్తగా అమలు జరిపింది. 1939 సెప్టెంబర్ 5వ తేదీ బ్రిటన్ "న్యాయంకోసం" పోరాడుతున్నదని, భారతదేశం "బేషరతుగా సహకారం" ఇవ్వాలని గాంధీజీ ప్రకటించాడు ;

> "కాబట్టినేనుఇప్పుడు భారతదేశ విమోచనాన్నిగూర్చి ఆలోచించటం లేదు, అదేమోవస్తుంది. కాని ఇంగ్లాండు ఫ్రాన్సు పతనమైతే ఆస్వతంత్రం ఎందుకు?"

(హరిజన్, సెప్టెంబరు 9, 1939)

కాంగ్రెసు మాటలలో "సామ్రాజ్యవాదప్రయోజనాలకోసం" యుద్ధం చేస్తున్న ఈ దశలో భారత పురోగమనానికి బాగా అనుకూలంగాఉన్నప్పుడు ప్రజాపోరాటం, లేదా సమిష్టి సత్యాగ్రహం తేవాలన్న ప్రతిపాదననూ త్రోసిపుచ్చుతూ వచ్చారు —

ఇలాంటి చర్య తీసుకుంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదం యుద్ధ ప్రయత్నాలకు నష్టం వాటిల్లుతుందన్న కారణం చెబుతూ వచ్చారు. ప్రభుత్వానికి బాధకలిగించరాదని కేవలం నామమాత్రమైన వ్యక్తి సత్యాగ్రహాన్ని ఆరంభించారు; దాదాపు అధికార చరిత్రకారుడైన సర్ రెజినాల్డ్ కూప్లాండు ఇలా అంగీకరించాడు "ఈ ఉద్యమం ప్రభుత్వానికి పెద్దగా బాధకలిగించలేదు. ("ఇండియా పునః ప్రకటన" 1945, పుట 206)

అయినప్పటికీ యుద్ధ స్వభావమంతా మారిపోయినప్పుడు, ఆ మార్పును కాంగ్రెసు గుర్తించినప్పుడు. రష్యా చైనాలయొక్క, మిత్రరాజ్యాలయొక్క వర్గం విజయంతో భారతదేశ ప్రధాన ప్రయోజనాలు సంబంధమై ఉన్నాయని గుర్తించి నప్పుడు. ప్రత్యక్షంగా ఇండియాపై దాడి ప్రమాదం ఏర్పడినప్పుడు 1939-40 లో అసాధ్యమని తలంచిన ప్రజాప్రతిఘటనోద్యమాన్ని ఆరంభించేందుకు తగిన సమయ మని భావించారు.

అలాంటి పోరాటం ప్రారంభించాలనే ఉద్దేశం లేదన్నమాట నిజమే. అందుకేసన్నాహమూ నాయకులు చేయలేదు. సంప్రతింపులకోసం బెది రింపుగా మాత్రమే పోరాటం ఆరంభిస్తామన్నారు. వారు పదే పదే, తమ విధానాన్ని సమర్థించుకుంటు ప్రకటనచేశారు. కాని ఈ ప్రకటన వారి హృదయం మంచిదని చెబుతుందిగాని, వారి ఆలోచనాశక్తి కిది ఖ్యాతిని చేకూర్చదు పెద్ద యుద్ధం జరుగుతున్న సమయంలో, ఇలాంటి పద్ధతి నవలంబించడంవల్ల, వారు యదార్థ పరిస్థితిని, సామ్రాజ్యవాదుల ఎత్తుగడలను బొత్తిగా అర్థంచేసుకోలేదని తేటతెల్లమయింది.

ఎత్తుగడల దృష్ట్యాకూడ ఈ తీర్మానం సరైందికాదు జాతీయోద్యమంపై దాడిచేయడానికై వేచిఉన్న సామ్రాజ్యవాదులకు, ఈ తీర్మానం సాకుగా దొరికింది. క్రిప్సు రాయబారం విఫలమైనాటినుండీ, ఎలాగో కాంగ్రెసును సంధిగ్ధావస్థలోకితెచ్చి, ఏదో పొరబాటుదారిని పడేట్టుచేయాలని, అప్పుడు తాము నిర్బంధవిధానం అవలంబించేందుకు అవకాశం చిక్కుతుందని సామ్రాజ్యవాదులు చూస్తున్నారు. అందుకే వారు ఎత్తులు వేస్తున్నారు. కాంగ్రెసు ఎదురుచెప్పలేని ఫాసిస్టు వ్యతిరేక సంస్థగా ఉన్నంతవరకు, ఫాసిజంపై ప్రపంచ ప్రజా సమిష్టి పోరాటంలో భారత ప్రజలను సంఘటితపరచాలని కోరే రాజకీయశక్తిగా పనిచేస్తున్నంతవరకు సామ్రాజ్యవాదం పస బయటపడింది. తొలినుంచి ఫాసిస్టులకు అనుకూలంగా ప్రవర్తిస్తూ వచ్చిన సామ్రాజ్యవాదం ప్రజాసమీకరణకు ఆటంకంగా బయటపడింది. అప్పుడు సామ్రాజ్యవాదం ఎత్తులకు అనుకూలత కనిపించలేదు. తీర్మానం ఆమో దింపబడుతూనే సామ్రాజ్యవాదం, తాను రక్షణ వ్యతిరేక చర్యలను ఆపేందుకు తానుపూనుకున్నట్లు ప్రకటించేందుకు యీఅవకాశంఉపయోగించుకుంది. జాతీయోద్య మాన్ని ఫాసిస్టు అనుకూలురని, జపాను అనుకూలురని మిత్రరాజ్య ప్రజల యుద్ధ ప్రయత్నాలను విధ్వంసంచేస్తున్నారని ప్రచారం చేసింది. జాతీయోద్యమానికి

వ్యతిరేకంగా, అభివృద్ధినిరోధకంగా అణచివేయాలనే విధానానికి ఈ అవకాశాన్ని రాజకీయ ప్రాతిపదికగా ఉపయోగించుకుంది.

ఇలా చూస్తే ఈ తీర్మానం స్వతంత్రానికి దగ్గరిదారికాదు; సామ్రాజ్యవాదులు రెచ్చగొడితే అందుకు లొంగిపోవడం మాత్రమే. దీనిని ఆమోదించడమంటే సామ్రాజ్యవాదుల వలలోనికి సరిగా ప్రవేశించడమన్నమాట. ఈ వాస్తవస్థితిని జాతీయ నాయకులు దురదృష్టవశాత్తు బొత్తిగా గమనించలేదు తీర్మానం చేసిన తర్వాత వైస్రాయితో శాంతంగా రాయబారాలు సాగించేందుకు సిద్ధపడుతున్నారు, వారు అరెస్టులు జరుగుతాయనీ ఊహించలేదు. అలాంటి పరిస్థితికి తగిన ఏర్పాట్లు చేయలేదు. తర్వాతేంచేయాలోకూడ వారు నిబంధనను తయారుచేయలేదు.

ఈ తీర్మానాన్ని ప్రతిఘటించిన కాంగ్రెస్‌లోని అల్పసంఖ్యాకులు తొలినుంచీ ఈ ఫలితంగూర్చి హెచ్చరిక చేస్తూనే వచ్చారు జులై 26, 1942 న భారత కమ్యూనిస్టుపార్టీ బహిరంగ లేఖలో ఇలా వ్రాసింది :

> "మీరు పోరాటం ప్రారంభిస్తే ఏం జరుగుతుంది ? మిమ్మల్ను, వేలమంది యితర కాంగ్రెసు కార్యకర్తలను వారు జైళ్ళలో పడవేస్తారు. ఫాసిస్టు దురాక్రమణదారుల నుండి భారత దేశాన్ని రక్షించేందుకు తామీ విచారకరమైన విధిని నిర్వహించవలసి వచ్చినదని వారు ప్రకటిస్తారు."

కాని ఈ హెచ్చరికను నాయకులు వినలేదు అరెస్టులు వారికి విభ్రాంతి కలించాయని, తర్వాతి ప్రకటనలూ జ్ఞాపకాలూ తెలుపుతున్నవి. 1942 ఆగస్టు 14వ తేదీ గాంధీజీ, అరెస్టులు జరిగిన వెనువెంటనే వైస్రాయికి ఇలా వ్రాశాడు.

> "నేను ప్రజాఉద్యమాన్ని ప్రారంభించేవరకైనా, కనీసం భారత ప్రభుత్వం ఆగవలసింది. ఏ ఖచ్చితమైన చర్యకైనా పూనుకునేముందు, మీకొక జాబు వ్రాస్తానని నేను బహిరంగంగా చెప్పాను"

భారత కమ్యూనిస్టుపార్టీ ప్రాతినిధ్యం వహించే, జాతీయోద్యమంలోని ఫాసిస్టు వ్యతిరేక కార్మికవర్గం, తొలినుంచీ, విమోచన యుద్ధాన్ని గూర్చి ఒకే విధమైన స్పష్ట కార్యక్రమాన్నిస్తూ వచ్చింది. యుద్ధంవల్ల ఏర్పడిన బాధ్యతలకు, కర్తవ్యాలకు తగిన నిర్మాణాత్మక దృక్పథాన్ని వెలువరించింది భారత ప్రజల చొరవను జాతీయ వాంఛను బ్రిటిష్ అభివృద్ధి నిరోధకవర్గం నిరాకరిస్తున్నప్పటికి, అలాంటి నిర్మాణాత్మక విధానం ఎలాసాధ్యమో, అవసరమోకూడా ఉదాహరణ పూర్వకంగా చూపింది. ఈ ప్రాతిపదికపైనే వారు, ఈ విషమపరిస్థితిలో సహాయ నిరాకరణం కన్నా మరొక నిర్మాణాత్మక కార్యక్రమమిచ్చారు ;

1. ఫాసిజాన్ని నిరోధించడంకోసం సమిష్టి నివేదిక నేర్పరచాలి. అందుకు కాంగ్రెస్, ముస్లింలీగు, ఇతర రాజకీయవర్గాల ఐక్యతతో భారత సంయుక్త జాతీయ సంఘటనను ఏర్పరచాలి.

2. అలాంటి జాతీయ సంఘటన ప్రాతిపదికపై పరిష్కారాన్ని కోరాలి అన్నివర్గాల ఐక్య బలంతో జాతీయ ప్రభుత్వాన్ని సాధించాలి.

3. న్యాయమైన రాజకీయ వాంఛకోసం ఒత్తిడితెస్తూ అందుతోపాటు హృదయపూర్వకంగా యుద్ధ ప్రయత్నాలతో సహకరించాలి. ప్రజలను సమీకరించాలి. యుద్ధప్రయత్నాలను బలపరచేందుకు ఫాసిజాన్నెదుర్కొనే జాతీయ ప్రతిఘటనా శక్తిని పెంపొందించేందుకు జాతీయోద్యమ నాయకత్వంక్రింద ప్రజాసమీకరణకై అనధికార ప్రయత్నాలను ప్రారంభించాలి.

4 భారతప్రజల ప్రయోజనాలకు వినాశకరమైన సహాయనిరాకరణ విధానా లన్నింటిని ఖచ్చితంగా నిరాకరించాలి.

కాని జాతీయభావంలో ఏర్పడిన విద్వేషంవల్ల, జాతీయ ప్రభుత్వ వాంఛను బ్రిటిష్ ప్రభుత్వం అభివృద్ధి విరోధకంగా నిరాకరించడంవల్ల, ఈ విధానానికి జాతీయోద్యమ బలాన్ని ఇంకా సాధించలేకపోయ్యాయు

జాతీయ నాయకులలో అధికసంఖ్యాకులు త్వరగా, తీవ్రపోరాటం ముగించాలనుకున్నారు. (వల్లభాయి పటేల్ ఒకవారంలో విజయం వస్తుందన్నాడు. గాంధీజీ మట్టుకు "పోరాటం ఒక వారంలో ముగిస్తే, అదో మహోన్నతమౌతుంది." అన్నాడు) త్వరలో జాతీయస్వతంత్రాన్ని సాధించి, సమయం మించిపోకముందే జపాను దురాక్రమణను ప్రతిఘటించేందుకు తగిన స్థితిలో ఉంటామని, మిత్ర రాజ్యాలకు వాస్తవమైన మిత్రంగా పని చేయవచ్చునని వారు భావించారు. అలాంటి విజయం, తమవిధానాన్ని సమర్థించగలదని, భారతరక్షణకు, ఫాసిజంపై ప్రపంచ విజయానికి తామవలంబించిన ఎత్తుగడలు అనుకూలం కాగలవని వారుభావించారు. ఇలాంటిఆత్మహత్యాకరమైనగుడ్డిఅంచనా స్పష్టంగానేకనిపిస్తోంది. తమ విధానాలతో ఇరవై రెండేళ్ళుగా బ్రిటిష్ దుర్గాన్ని ఛేదించలేని ఈ అహింసాప్రవక్తలు, ఇప్పుడు అలాంటి ఉద్యమంతోనే అధికారాన్ని కొన్నివారాల్లో సాధించి, భారత కవాటాల దగ్గర కాచుకొనిఉన్న జపాను దురాక్రమణదారుని సమయం మించకముందే ఎదిరిస్తామని ఆశించారు.

ఇక తమ ఉద్యమం తీవ్రసాయుధ ప్రజావిప్లవంగా మారుతుందని భావించారాఅంటే, తామిన్నాళ్ళూ అహింసాపద్ధతులతో ఉద్యమాన్ని నడుపుతూ వచ్చారు. అలాంటిది యుద్ధంజరుగుతుండగా దురాక్రమణదారుల సేనలు సరిహద్దులో పొంచి ఉండగా నిరాయుధులైన ప్రజలతో అధికారాన్ని లాక్కొనే విప్లవపోరాటంగా మారుతుందని భావించారన్నమాట తమ ఉద్యమం భారత స్వాతంత్ర్యానికి దారితీయదని ఆంతరంగిక తగాదాలకు, అరాచకానికి, ప్రతిష్టంభనకు కారణమై భారత దేశంలో ఫాసిజం విజయానికి దారితేసేదనే. పొంచుకునిఉన్న ప్రమాదాన్ని వారు గమనించలేదు. భారత కమ్యూనిస్టుపార్టీ మోటుగా చెప్పినట్లుగా వీరివిధానం "మన గొంతులు మనమే కోసుకోవడంతో సమానమైనది. దురాక్రమణదారుల విష

యంలో దేశరక్షణ విధి దుర్బలపరుస్తుంది. ఫాసిస్టు దురాక్రమణదారుని పని విధి సులభతరం చేస్తుంది."

సహాయనిరాకరణ విధానం ఏదీతోచక తెగించిచేసినపని. కాని ఈ విధానాన్నవలంబించిన నాయకులు, వాస్తవస్థితిలో సహకారానికొక ప్రాతిపదికకోసం ప్రయత్నిస్తున్నారు. తామెన్నడూ ఉద్యమాన్ని నడపదలచుకోలేదని మొదట సమాధానంకోసం ప్రయత్నించామని వారు బహిరంగంగా స్పష్టపరచారు. అలాంటి పరిస్థితిలో సహాయనిరాకరణం చెయ్యాలనే విధానాన్ని విమర్శించేందుకు తగినఆధారం ఎంతఉన్నప్పటికి, ఇందుకు పెద్దబాధ్యతంతా ప్రభుత్వ అభివృద్ధివిరోధక విధానంపైనేఉంది. ఆప్రభుత్వం భారతదేశపు న్యాయమైన వాంఛలను నిరాకరించి, సమాన హోదాతో సహకారం చేయాలన్న దేశీయుల తీవ్రవాంఛను నాశనంచేసి ఈఫలితాన్ని రెచ్చగొట్టింది.

ఆఖరువరకూ కాంగ్రెసు సమాధానానికి రావాలని, సంప్రతించాలని ఎంతో వాంఛించింది. ఆచరణ సాధ్యమైన పరిష్కారం కుదుర్చుకోవాలని, ఫాసిస్టు ప్రతిఘటనలో సాయుధంగా సహకారం చేయాలని తాము కోరుతున్నట్లు స్పష్టపరిచేందుకై తీర్మానాన్ని సవరించారు. ఆఖరున గాంధీ నెహ్రూలుచేసిన ఉపన్యాసాలు రాయబారాలకు సంసిద్ధతను సూచించాయి. చర్చలకు సమాధానమిస్తూ నెహ్రూ ఇలా అన్నాడు. "ఈ తీర్మానం బెదిరింపుకాదు; ఇదొక ఆహ్వానం, ఇదొక వివరణం; సహకారానికై చేసిన ప్రతిపాదన ఇది." గాంధీజీ జనరలిజ్మో ఛంకైషేక్‌కు వ్రాసి, తదుపరి ప్రకటించబడిన జులై లేఖలో ఇలాఉంది

> "నేను తొందరపడి ఏ చర్యకూ దిగను. ఏ చర్యతీసుకున్నా, అందువల్ల చైనాకు నష్టంవాటిల్లకుండా ఉండేదిగా ఇండియాలోగాని చైనాలోగాని జపాను దురాక్రమణను ప్రోత్సహించేదికాకుండా ఉండాలనేదే గమనిస్తాను. బ్రిటిష్ ప్రభుత్వంతో ఘర్షణ ఏర్పడకుండా చూడాలని నేను నాశాయశక్తులా ప్రయత్నిస్తున్నాను."

తానేదైనా ఉద్యమం నడపాలనే ప్రశ్న రాకముందే, రాయబారాన్ని కోరుతూ వైస్రాయికి జాబురాయడం ప్రథమ చర్యగా తీసుకోదలచుకున్నట్లు గాంధీజీ వివరించాడు

కాంగ్రెసు కమిటీ సమావేశం ముగియగానే వెంటనే ఆ జాబువ్రాయ ప్రారంభించాడు, కాని ఆ వ్రాతను ముగించేందుకు సమయందొరకలేదు; కొన్ని గంటలలోనే మొత్తం అరెస్టులు జరిగిపోయాయి. అందుతో దేశవ్యాపితమైన ఘర్షణకు దారి ఏర్పడింది.

కాంగ్రెసు తీర్మానం ఆగస్టు 8 వ తేదీన ఆమోదింపబడింది. ఆగస్టు 9 వ తేదీ ఉదయం అందరు ప్రధాన కాంగ్రెసు నాయకులు గాంధీ, నెహ్రూ, అజాద్, పటేల్, కృపలానీ, రాజేంద్రప్రసాద్ మొదలైన వారు (ఒక్క బొంబాయిలోనే

148 మంది) అరెస్టుచేయబడినారు. కాంగ్రెసును చట్టవిరుద్ధ సంస్థగా ప్రభుత్వం ప్రకటించింది.

వర్కింగుకమిటీ సభ్యులను అహ్మద్‌నగర్‌కోటలో బంధించారు. గాంధీజీని ప్రత్యేకంగా ఆగాఖాన్ భవనంలో ఖైదుచేశారు. కాని వ్యక్తిగతంగా కష్టభూయిష్టముగా మాత్రం చేయలేదు. ("ప్రతి సకారణవాదియైన ప్రాణికీ హాయిగావుండే భవనంలో వున్నించారు. దీనిని నేను కర్తవ్యంక్రింద భావిస్తానేకాని సౌఖ్యంక్రింద భావించను." గాంధీజీ వైస్రాయికివ్రాసిన జాబు: 1942 డిసెంబర్ 31.) ఇలా చేసిన, వారిని ఆక్లిష్ట సంవత్సరాల్లో ఏ రాజకీయ పాత్రనూ నిర్వహించకుండా, నాయకత్వం వహించకుండా ప్రభుత్వం చేసింది. వాస్తవంగానే వర్కింగుకమిటీ సభ్యులు ఈ సంవత్సరాలలో రాజకీయసమస్యలను చర్చించడానికైనా ప్రయత్నించలేదని. తమ దృష్టినంతటినీ మతం, వేదాంతం, వినోదాలలో కేంద్రీకరించారని డాక్టరు పట్టాభి సీతరామయ్య జ్ఞాపికలమూలంగా తెలుస్తున్నది. ఇలా జాతీయోద్యమాన్ని నాయకత్వ విహీనంగా వదిలివేశారు. ఇంకొక నాయకత్వాన్ని ఏర్పర్చేందుకు గాని, అరెస్టులు జరిగితే అనుసరించవలసిన కార్యక్రమం చెప్పడంకాని ఏ విధమైన సన్నాహమూ జరుగలేదు.

జాతీయ నాయకులను నిర్బంధించడంవల్ల దేశవ్యాపితంగా ప్రదర్శనాలు జరిగాయి. రెచ్చిపోయి సంఘటితంకాని ఘర్షణలు, అల్లరులు బయలుదేరాయి. వీనిని దారుణ క్రూర హింసా విధానంతో పోలీసు, మిలిటరీ కాల్పులతో ప్రభుత్వం ఎదుర్కొన్నది. ఎందరో మరణించారు. ఎందరో గాయపడ్డారు.

కేంద్రశాసన సభలో పోలీసుశాఖా సభ్యుని అధికార ప్రకటన సారాంశం ప్రకారం 1941 ఆగస్టు 9 నుండి, 1942 డిసెంబరు 31 వరకు 66, 229 మందిని అరెస్టు చేశారు; ఇండియా డిఫెన్సు చట్టంక్రింద 18,000 మందిని డిటైన్‌చేశారు. 940 మంది పోలీసు, మిలిటరీ కాల్పులలో చనిపోయారు: 1,630 మంది పోలీసు మిలిటరీ కాల్పులలో గాయపడ్డారు. ("కాలగతి 1942-45", బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ప్రచురణ, 1945)

జాతీయ నాయకులను అరెస్టు చేయడంతో, దేశంలో బయలుదేరిన కోపం, ప్రజా అసమ్మతి ప్రకటన దావంతటదే వచ్చింది దేశమంతా వ్యాపించింది. కాని అక్కడక్కడ చెలరేగిన అల్లరులు, అశాంతి, గందరగోళం, ఒకొక్క వ్యక్తిగత ముఠాలు ఇచ్చిన పరస్పర విరుద్ధ ఆజ్ఞాపత్రాలు ఇవన్నీ సంఘటిత కాంగ్రెసు పోరాటాన్ని ప్రతిబింబించవు అక్కడక్కడ వచ్చిన ఈ అల్లరులను చర్చిల్ పార్లమెంటులో అన్నట్టుగా "ఎంతో సులభంగా" అణచివేశారు. అలాంటి సంఘటనలను కాంగ్రెసు ఎన్నడూ ఆమోదించి నడపమనలేదు. పోరాటం నడిపే అధికారాన్ని గాంధీజీ చేతిలోనే ఉంచారు. మరి గాంధీజీ ఈ సంఘటనలు తమకు సంబంధంలేదని బహిరంగంగా ప్రకటించాడు. 1942 సెప్టెంబర్ 23వ తేదీ గాంధీ వైస్రాయికిలా రాశాడు :

"మొత్తంగా కాంగ్రెసు నాయకులందరిని అరెస్టు చేయడంతో ప్రజలు కోపోద్దీపితులయ్యారు. ఆ కోపం ఆత్మ నిగ్రహాన్ని కోల్పోయేవరకు పోయింది. జరిగిన విధ్వంసనానికంతటికి ప్రభుత్వమే బాధ్యురాలని, కాంగ్రెసు కాదని నేను భావిస్తున్నాను"

తిరిగి పోలీసుశాఖకు 1943 జులై 15 న గాంధీవ్రాసిన జాబులో ఇలా అన్నాడు.

"భారతదేశం మొత్తంమీద ప్రభుత్వం అమలు జరిపిన అరెస్టులు మరీఘోరంగా ఉన్నపిగాబట్టి, కాంగ్రెసుపై సానుభూతిగల ప్రజాసామాన్యం ఆత్మనిగ్రహాన్ని కోల్పోయింది. దానితో కాంగ్రెసు చేరిందని చెప్పవీల్లేదు."

తయారు చేసిన చిత్తుసర్క్యులర్ (గాంధీ దీనిని తన లేఖలో 1343 జులై 15 న ఈ సర్క్యులర్ సంగతిలో తానేమీ అంగీకరించలేదు; కాని అందులోని ఒక వాక్యం సరైనదని పూర్తిగా అంగీకరించాడు.) లో ఇలాఉంది.

"మహాత్ముడు నిర్ణయించేవరకు, ఏ ఉద్యమాన్నిగాని ఆరంభించ రాదు, ఏ పనీ చేయరాదు. ఇంతకూ ఆయన మరో విధంగా నిర్ణయించవచ్చు. అప్పుడు మీరు అవసరమైన పెద్దపొంబాటుకు బాధ్యులవుతారు. సిద్ధంగా ఉండండి. వెంటనే సంఘటితులుకండి. జాగ్రత్తగా ఉండండి కాని, ఏవిధంగానూ ఏచర్యా తీసుకోవద్దు."

కాంగ్రెసు తరపున జవహర్లాల్‌నెహ్రూ, వల్లభాయిపటేల్, జి బి. పంత్ సంతకాలతో 1945 సెప్టెంబర్ 21 న వెలువడిన అధికార ప్రకటనలో ఇలా ఉంది:

"అఖిలభారత కాంగ్రెసు కమిటీగాని, గాంధీజీగాని ఏ ఉద్యమాన్నీ అధికారరీత్యా ఆరంభించలేదు."

తర్వాతనే ఏదో తాత్కాలిక రాజకీయ ఎత్తుగడలకోసమని కొత్తప్రయత్నం ఈ క్రింది విధంగా చేశారు: 1942 ఆగస్టునాటి నాయకవిహీనమైన, గందరగోళంతో నిండిన ఘటనలు "ఆగస్టు పోరాటం" అన్నారు; అధికారయుతమైన కాంగ్రెసు నాయకత్వం ఖండించి, తమదికాదన్న ఈ పోరాటాన్ని కాంగ్రెసు పోరాటమన్నారు; కాంగ్రెసు ఆశయానికి వ్యతిరేకంగా జరిగిన చిన్న చిన్న అరాచక హింసాకార్యాలు కాంగ్రెసు చర్యలన్నారు; ఆగస్టు తీర్మానానికి పూర్తిగా విరుద్ధంగా, జపాను కూటమిని బోసును బలపరుస్తూ, మిత్రరాజ్యాలను దూషించే ప్రచారాన్ని కాంగ్రెసు ప్రచారం అనాలని ప్రయత్నించారు; ఆఖరున అన్నిటికన్నా పరస్పర విరుద్ధమైనదేమంటే, ఈ ప్రధాన కాంగ్రెసు వ్యతిరేక ఉద్యమంలో చేరకపోవడం, కాంగ్రెసు శిక్షణకు విరుద్ధమన్నారు. అసలు కాంగ్రెసు శిక్షణ ప్రకారం. గాంధీజీ చెప్పేవరకు పోరాటం సాగించరాదని ఉంది. మరి గాంధీ తాను స్పష్టంగా ఆరంభించలేదని చెప్పనే చెప్పాడు కాని ఇందులో చేరక పోవడం శిక్షణకు భంగకరమనడం పరస్పర విరుద్ధంకాదూ?

ఆగస్టు ఘటనలతో జాతీయోద్యమం విచ్ఛిన్నమయింది; ఏసంఘటిత నాయకత్వమూలేదు-ఇందుమూలంగా తర్వాతి సంవత్సరాల్లో గందరగోళం, నిరాశా, నిస్పృహలతో కూడినవశ-రాజకీయ ప్రతిష్టంభనతోపాటు ఏర్పడింది. ఇదేసమయములోనే ముస్లింలీగుబలం హెచ్చింది.

మే 6, 1944 న గాంధీజీని అనారోగ్యకారణాలపై నిర్బంధంనుండి విడుదల చేశారు. వెంటనే ఆగస్టు తీర్మానంలోని శాసనోల్లంఘనానికి సంబంధించిన భాగం దానంతటదే రద్దయిపోయిందని, ఎందుకంటే 1944 లో తిరిగి 1942 కు పోలేమని ఆయన ప్రకటించాడు. కాని ప్రతిష్టంభన అలాగే కొనసాగింది. ఆగస్టు తీర్మానం ఉపసంహరించుకొనే వరకు రాయబారాలకు దిగమని ప్రభుత్వం నిరాకరించింది. ఇంతేకాక ఆగస్టుతీర్మానాన్ని పునర్విమర్శించగలవారూ, ఏదైనా నూతన విధానం ప్రకటించవలసినవారూ అయిన వర్కింగుకమిటీ సభ్యులను 1945 జూన్‌వరకు విడుదలచేయనుకూడ ప్రభుత్వం నిరాకరించింది.

1945 వసంతంలో, ప్రతిష్టంభనను పరిష్కరించేందుకు మరో ప్రయత్నం జరిగింది. మేనెలలో కేంద్రశాసన సభలోని కాంగ్రెస్‌పార్టీ నాయకుడు బులాభాయి దేశాయికి లీగుపార్టీ నాయకుడు లియాకత్ అలీఖాన్‌కు ఒక తాత్కాలికమైన ఒడంబడిక కుదిరింది. (బులాభాయిదేశాయి, గాంధీజీతో సంప్రతించి, ఆయన అనుమతితో పనిచేశాడు) కాంగ్రెసుకు లీగుకు సమాన స్థానాలు అన్న ప్రాతిపాదికపై (కాంగ్రెసుకు నూటికి 40 వంతులు, లీగుకు 40 వంతులు మిగత గ్రూపులకు 20 వంతులు) తాత్కాలిక జాతీయ ప్రభుత్వ స్థాపనకు ఇద్దరూ అంగీకరించారు. ఈ ప్రతిపాదనను వైస్రాయి లార్డువేవెల్ ముందుంచారు. అతను సలహాకోసం లండన్‌కు విమానంలో వెళ్ళాడు. ఆయనో నూతనవిధాన ప్రకటనతో తిరిగివచ్చాడు. ఈప్రకటనను బ్రిటిషు ప్రభుత్వం 1945 జూన్ 14 న ప్రకటించింది తాత్కాలిక జాతీయ ప్రభుత్వ స్థాపనకిందులో ఒక ప్రణాళిక సూచించారు. కాని ప్రాతినిధ్య విషయంలో కాంగ్రెసు లీగులు అంగీకరించిన దానిలో సున్నితంగా మార్పుచేశారు. కాంగ్రెసు - లీగు సమాన సంఖ్యకుబదులు "సవర్ణ హిందూ - ముస్లిం సమాన సంఖ్య"గా బ్రిటిషు ప్రణాళిక ఏర్పరిచింది. ఇలా సమస్యను మతరంగంలోకి తిరిగి త్రోసివేశారు. కొద్దిగా కనబడే ఈ మార్పు లండన్‌లోని బ్రిటిషు ఉద్యోగుల అతి తెలివి తేటలతో చేయబడిందే. ఇది తప్పక భంగమయ్యేట్టు చేస్తుందని వారికితెలుసు. కాంగ్రెసు హిందూసంస్థఅని ఒప్పుకోవాలి, లేదా ముస్లింస్థానాలలో కాంగ్రెసు ముస్లింకొక స్థానంకావాలని ఈసమాన సంఖ్య నిష్పత్తిని నిరాకరించాలి; లీగు, ముస్లిం స్థానాలలో ఒకదానిని కాంగ్రెసు ముస్లింకు ఇవ్వడానికి అంగీకరించి, కాంగ్రెసుకన్న తాను తక్కువదర్జాకు పోవాలి. లేదా ఇందుకు ఒప్పుకోకుండా సభ విఫలతకు బాధ్యతను తీసుకోవాలి-ఇదీ బ్రిటిష్ ఉద్యోగులపన్నాగం.

1945 జూన్‌లో కాంగ్రెసు, లీగు, ఇతర ప్రతినిధులతో సిమ్లా సమావేశం ఆరంభంకాగానే త్వరలోనే ప్రతిష్టంభన ఏర్పడింది. అసలు మొదటి ప్రణాళికకు సంయుక్తంగా పోరాడకుండా కాంగ్రెసు లీగు నాయకులు ఒకరికి వ్యతిరేకంగా మరొకరు, తమతమ లాభంకోసం బ్రిటిషు ప్రతిపాదనకు వ్యాఖ్యాలు చేయసాగారు. సిమ్లా సమావేశం భగ్నమయింది.

కాబట్టి యుద్ధం ముగిసేప్పటికి ప్రపంచమంతటా ప్రజలు, స్వతంత్రంవేపు పురోగమిస్తుండగా భారతదేశం మట్టుకు యుద్ధ ప్రారంభంలో ఉన్నట్టుగానే పరిపూర్తిగా బానిసదేశంగానే ఉండిపోయింది.

# పదిహేడో అధ్యాయం

## స్వ తం త్రం?

"మా సమ్మె మన జాతీయ చరిత్రలో చరిత్రాత్మకమైన సంఘటన. మొట్టమొదటసారిగా ఏకైకాశయంకోసం వీధులలోని ప్రజల, సేనలలోని ప్రజల రక్తం కలిసి ప్రవహించింది. సేనలోని మేమెన్నటికీ దీనిని మరచిపోము. మా సోదరీ సోదరులైన మీరుకూడ మరచిపోరని మేమెరుగుదుము. మన ఉత్తమ ప్రజానీకానికి విజయమగుగాక. జయ్‌హింద్"—నావికుల సమ్మె కేంద్రకమిటీ తుది సందేశం, 1946 ఫిబ్రవరి 23.

> "చాలమంది అభిప్రాయ ప్రకారం బ్రిటిష్ మంత్రుల రాయబారం వచ్చేముందు భారతదేశం విప్లవ ప్రాంగణంలో ఉన్నది. ఆ ప్రమాదాన్ని తొలగించక పోయినప్పటికి మంత్రుల రాయబారం కనీసం ఆ విప్లవాన్ని కొంతకాలం వాయిదా వేసింది."

(పి. జె. గ్రిఫిత్సు, భారత కేంద్రశాసనసభలో యూరపియన్ గ్రూపు నాయకుడు లండన్‌లోని ఈస్టిండియా అసోసియేషన్‌లో ఉపన్యాసం, జూన్ 24, 1946.)

1946 జూన్‌లో జరిగిన లేబర్‌పార్టీ మహాసభలో బ్రిటిష్ ప్రధాని అట్లీ ఇలా ప్రకటించాడు :

> "మనకు కావాలనికోరే స్వతంత్రం ఇతరులకుకూడ ఉండాలని మనం కోరుతున్నాము. స్వతంత్రాన్ని కేవలం ప్రకటించడమేకాక, దానిని అమలు జరిపేందుకు చూస్తున్నాము. ఇందుకు భారతదేశమే సాక్షి"

ఇలానే లేబర్‌పార్టీ అధ్యక్షుడు ప్రొఫెసర్ లాస్కీ విలేఖరులతో అన్న మాటలు, భారతదేశపత్రికల్లో 1946 మే 23 న ప్రకటింపబడినవి.

> "ఈ అధికారత్యాగం, ఆధునికచరిత్రలో మహత్తరమయినది. అహింసా పద్ధతిలో ఏ సామ్రాజ్యవాదప్రభుత్వం కాని, ఏ ప్రజలకుకూడ అధికారాన్నిలా అప్పగించిఉండదు. బంగారు పళ్లెరంలో అందిస్తున్న ఈ కానుకను, భారతనాయకులు సరిగా పరిగ్రహిస్తారని ఆశిస్తున్నాను."

భారతదేశంగూర్చి చేసిన నూతన ప్రతిపాదనలపై ఇలాంటి దృక్పథం, ప్రపంచపత్రికలలో ఎక్కువగా ప్రచారమయింది. బ్రిటిష్ ప్రభుత్వం పదవీసన్యాసం

చేస్తున్నదని, ముఖ్యంగా ఇంగ్లీషు, అమెరికా పత్రికలు విపరీతంగా పొగడ సాగాయి.

కాని మరోవేపుచూస్తే. భారతప్రజలు దీనిని ఏ మాత్రం అంగీకరించలేదు.

1946 జూన్ 1 వ తేదీ అఖిలభారత కాంగ్రెసు కమిటీ అధికారయుతంగా ప్రకటించిన వార్తాలేఖ ఇలా తీర్పుచెప్పింది.

"మనం అనుమానిస్తున్నది రానే వచ్చింది. మతవాదుల, సంస్థానాధిపతుల ప్రయోజనాలకు అనుకూలంగా ఉండాలని ప్రయత్నిస్తూ, బ్రిటిష్ మంత్రి రాయబారులు ప్రజల ప్రయోజనాలను త్రోసిపుచ్చారు. బ్రిటిష్ మంత్రులు. మంచి ఉద్దేశంతోనే, తమ చేతనైనంతా పనిచేశారు. కాని వారు చేసిన మేలల్లా 1942 మార్చిలో చర్చిల్, అమెరీలు ఇవ్వ సిద్ధపడిందాని కంటె ఉత్తమమైందికాదని దురదృష్టవశాత్తు తేలిపోయింది ............ ఇందులో వాగ్దానంచేసిన స్వాతంత్ర్యం, ఎన్నో షరతులతో నిర్బంధితమై ఉంది. కాబట్టి దీన్ని స్వాతంత్ర్యమనడం తగదు."

బ్రిటిష్ అధికారుల ఆత్మస్తుతికీ, భారతీయులలో వ్యాపించిన తీవ్ర అసంతృప్తికీ మధ్య ఇంత అఖాతం ఎందు కేర్పడింది ?

ఈ బ్రిటిష్ ప్రతిపాదనలు (1946) బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని వదులు కొని, భారతదేశ స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తున్నవా ? లేక భారతదేశ జాతీయవాంఛ బలవత్తరమవుతున్నందువల్లను, కొత్తపరిస్థితు లేర్పడడంవల్లను బ్రిటిష్ ప్రభుత్వం తన అధికారం చెక్కుచెదరకుండా చూచుకొని. పూర్వంలాగే ఏదో ఒక రాజీకి మాత్రమే ప్రయత్నిస్తున్నదా ? ఈ నూతన ప్రతిపాదనలు భారత స్వాతంత్ర్యాన్ని ప్రతిబింబిస్తున్నవా ? లేక పైకిమాత్రం స్వాతంత్ర మిస్తున్నట్టు నటిస్తూ. ఆచరణలో దిక్కులేనన్ని నియమాలు. షరతులు. నిర్బంధాలు విధించి ఆ స్వాతంత్ర్యాన్ని నామమాత్రం చేస్తున్నవా ?

## మారుతున్న ప్రపంచంలో భారతదేశం

బ్రిటిష్ రాయబారవర్గం భారత దేశానికి ఎందుకు వెళ్ళింది ?

బ్రిటిష్ విధానంలో ఈ నూతన వైఖరికి నాలుగు కారణాలను గుర్తించ వచ్చును.

ఒకటి : యుద్ధంముగింపుతో, ప్రపంచమంతటా ఒక నూతనప్రజావిజృంభణ వచ్చింది. వర్తమాన యుగంలో అభివృద్ధి నిరోధకవర్గానికి ప్రధానమూ, ప్రజాతంత్ర వ్యవస్థపై జరిగే దండయాత్రలో నాయకత్వం వహించేదీ. అతిపశుత్వంతో కూడినదీ, జాత్యహంకార సిద్ధాంతాన్ని నగ్నంగా ప్రబోధించేదీ అయిన ఫాసిజం, ప్రజాస్వామిక జనసంయుక్త పోరాటంలో వోడిపోయింది. జర్మనీ, ఇటలీ, జపాన్ సామ్రాజ్యవాదాలు ప్రధాన రాజ్యాల శ్రేణినుండి తుడిచి వేయబడినవి. ఆంగ్లో

అమెరికన్ సామ్రాజ్యతత్త్వం మిగిలిందికావి, ప్రపంచ నాయకత్వాన్ని పోషలిస్తు సోవియట్ యూనియన్‌తోపాటు పంచుకొని, ప్రపంచ అగ్రరాజ్యత్రయంలో ఇష్టం లేవి భాగస్వామిగా చేరవలసివచ్చింది. యుద్ధభారం ప్రధానంగా రెడార్మీ సోవియట్ ప్రజల మీద పడ్డంతో, విపరీతమైన నష్టాలకు గురికావలసి వచ్చినా సోవియట్, ప్రపంచ స్థానంలో పఱకుబడిలో బాగా బలపడింది.

విముక్త యూరోపు దేశాలు, అభ్యుదయవంతమైన ప్రజాస్వామిక శక్తితో పురోగమించసాగాయి, దేశాన్ని వంచించి హిట్లరుకు లొంగిపోయిన పాత భూస్వామి, మిలటరిస్టు; పెద్ద పెట్టుబడిదారీవర్గాలకు వ్యతిరేకంగా ముందుకు పోసాగాయి. చైనాపై జపానుకున్న పెత్తనం పడలింది చైనా జాతీయ ప్రజా ఉద్యమాల పురోగమనం తిరిగి మొదలయింది వీరి మార్గంలో అనేక ఆటంకాలను పెడుతూ అమెరికా అభివృద్ధి విరోధకవర్గం వొత్తిడి తెస్తున్నా వారు ముందడుగు వేస్తున్నారు. వలసదేశ ప్రంజలందరూ సంచలించారు. తమ ప్రతిఘటనోద్యమాలెందుకు యుద్ధం చేశాయో. ఆ స్వతంత్రాన్ని వాంఛించసాగారు. ఈలాంటి నూతన పరిస్థితిలో మార్పులకుండా పాత నిరంకుశోద్యోగ రాజ్యాన్ని భారతదేశంలో అలాగే ఉంచుకోవడం అనే ప్రశ్నరాదు. భారతదేశం అన్ని వలప దేశాలకన్నా పెద్దది - అతి బలవత్తరంగా అభివృద్ధి చెంచెన జాతీయోద్యమం కలది.

రెండు ; సమిష్టి విజయం భాగం అయినప్పటికి బ్రిటిషు సామ్రాజ్యం బాగా దుర్బలపడింది. దేశీయ ఆర్థికరంగంలోను, ప్రపంచ ఆర్థికరంగంలోను వలన దేశాలలోనుకూడ బ్రిటిషు పెట్టుబడిదారీ విధానం పూర్వంకన్న హీనస్థితికివచ్చింది. రెండు యుద్ధాలకు మధ్యనున్న కాలంలో ఇది ప్రధానమైన లక్షణం. పాతకాలపు ప్రపంచ స్థాయిలో ఏర్పడిన ఈ హీనస్థితి, రెండోయుద్ధంతో మరింత ఎక్కువయింది. పాత రాజకీయవాదులైన స్మట్సులూ. చర్చిల్‌లూ.గాభరాపడ్డారు. బ్రహ్మాండమైన శక్తితో నూతన ప్రపంచంలో రెండు ప్రభుత్వాలు - అమెరికా సోవియటు - అభివృద్ధిచెందిపోతున్నవని, బ్రిటన్ రెండో తరగతికో, మూడోతరగతికో పడిపోతున్నదని వారు వాపోయారు. ఇంతవరకు తమ గుప్పిటిలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉన్న దేశాల ప్రజలు సవాలుచేస్తూ ఈజిప్టు పాలస్తీనాలనుండి బర్మా మలయా. ఇండోనీషియాలవరకు బ్రిటిషు సామ్రాజ్యాన్ని చుట్టుముట్టారు.

బ్రిటిషు ప్రజలు నూతన పరిస్థితులకు అనుగుణంగా చైతన్యవంతులై అభివృద్ధివిరోధక మార్గంవదిలి, బ్రిటిషు అభ్యుదయ సౌభాగ్యాల మార్గానికి మరలారు. పాత సామ్రాజ్యనాయకులు సర్వవిధాలా శిథిలమవుతున్న పెత్తనాన్ని తిరిగి పునరుద్ధరించుకోవాలని ప్రయత్నిస్తున్నారు. బర్మా, మలయా. ఇండొనేషియా మొదలైనవి తిరిగిజయించిన—దేశాలలో పాత వలసదేశపాలన నిర్బంధ విధానాన్ని పునస్థాపించేందుకు చూస్తున్నారు. ఇలా మారిన ప్రపంచస్థితిని కొత్త ఎత్తులతో తలక్రిందులు చేయాలని చూచారు. ఇందుకై పడమటి యూరోపుకూటమిని ఏర్పరచాలనిచూచి విఫలులయ్యారు. యూరోపుప్రజలకు విరుద్ధంగా, సోవి

యట్ యూనియన్‌కు వ్యతిరేకంగా ఆంగ్లో - అమెరికన్ కూటమిని సృష్టించారు. ఈ కొత్తయెత్తులన్నింటిలోను భారతదేశం అతిప్రధానమైనది. దుర్బలమవుతున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, తన ఆర్థికావసరాలకు, యుద్ధతంత్రప్రణాళికకు కూడ భారత దేశంతో కొత్తఒడంబడిక చేసుకోవడం ముఖ్యమైంది. భారత దేశాన్ని సంతృప్తిపరచ వీలయితే జాతీయోద్యమంలోని పైవర్గాలవారిని తమవేపు త్రిప్పుకొనో ఎలానో భారత దేశాన్ని బ్రిటిష్ ఆర్థిక, కీలకచట్రంలో ఒదిగించుకోవాలి.

మూడు : ప్రపంచ స్థాయిలో బ్రిటన్‌కు వచ్చిన మార్పు బ్రిటన్ ఆంతరంగిక స్థాయిలోకూడ మార్పుతెచ్చింది. విజయోత్సాహాన్ని చర్చిల్ ప్రతిష్ఠను ఉపయోగించుకునేందుకు టోరీల ఎన్నికల ప్రచారం ఎంత ప్రయత్నించినప్పటికి, 1945 వేసవి ఎన్నికలలో కన్సర్వేటివ్‌పార్టీ ఘోరపరాజయం పొందింది. తొట్టతొలిసారిగా అధిక సంఖ్యతో లేబర్‌పార్టీ అధికారంలోకి వచ్చింది. నూతన ప్రభుత్వంలోని పాతమితవాద నాయకులు, ఆచరణలో బ్రిటిష్ కన్సర్వేటివ్ సామ్రాజ్యవాద విధానంలో పూర్తిగా కలిసే ఉన్నదని తర్వాతి అనుభవం రుజువుచేసింది అయినప్పటికి ఎన్నికలలో కన్సర్వేటివుల పరాజయం, బ్రిటిష్ ప్రజలు పాత సామ్రాజ్యవాద ప్రాతిపదిక నుండి మరల నూతన మార్గాలకోసం అన్వేషిస్తున్నారని తేలిపోయింది. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును అనుసరించి, లేబర్‌పార్టీ మహాసభ ఒక తీర్మానం ఆమోదించింది. భారతదేశ స్వతంత్రం గుర్తించాలన్న ఈ తీర్మానాన్ని ప్రారంభంలో కార్యవర్గం వ్యతిరేకించి నప్పటికి కార్మికోద్యమం ప్రవేశపెట్టి ఆమోదింపజేసింది. ఇలా కార్మికోద్యమం అధికార యుతంగా భారత దేశానికి స్వతంత్ర మివ్వాలని స్పష్టపరిచింది. కాబట్టి భారత దేశంలో అవలంబించే విధానంలో ఒక నూతన వైఖరిని కొత్త లేబర్ ప్రభుత్వం అవలంబించవలసి వచ్చింది.

అతిముఖ్యమైన నాలుగో కారణమేమంటే : భారత దేశంలోనే తీవ్రమైన సంక్షోభం ఏర్పడింది. వెంటనే స్వతంత్రం కావాలన్న జాతీయ వాంఛ దేశవ్యాపితంగా వెల్లడయింది. పాత పద్ధతిలో సామ్రాజ్యతత్వం భారతదేశాన్ని పరిపాలించడం ఇక సాధ్యంకాదు.

## 2. నూతన జాతీయ విజృంభణ 1945 - 46

ఫాసిజం పరాజయంతో ప్రపంచమంతటా వ్యాపించిన ప్రజా ఉద్యమం భారతదేశాన్ని కదపకుండా విడువలేదు. మిత్రరాజ్యాలతోచేరి మహోజ్వలంగా నడిచిన స్వతంత్రోద్యమాలు, ఫాసిస్టు ఆక్రమితదేశాలలో విజయసాధనకు ఎంతో గొప్పపాత్ర నిర్వహించాయి; యుద్ధానంతరం రాజకీయవ్యవస్థ మార్పుకు దారిని సంసిద్ధపరచాయి. అలాంటి స్వతంత్రోద్యమాలలో భారతదేశం భాగస్వామి కాలేకపోయినప్పటికి, ఆ దేశాలలోలాగే భారతదేశంలోకూడ జాతీయ స్వతంత్రేచ్ఛ ప్రజాతంత్ర అభ్యుదయేచ్ఛ కదిపివేసింది. అక్షరాజ్యాల సేనాశిబిరంలో బోసు స్థాపించిన "ఆజాద్ హింద్ ఫౌజు" ఉదాహరణలు : యుద్ధానంతరం బ్రిటిష్

సామ్రాజ్యవాదులు నడిపిన ఆజాద్ ఫౌజులోని ముఖ్యుల విచారణలు భారతదేశం లోని తీవ్ర దేశభక్తిజ్వాలకు మరింత దోహదం చేశాయి ఇందువల్ల సేనలలో ముఖ్యమైన మార్పు కలిగింది

1945 వేసవిలో సిమ్లా మహాసభ భగ్నమయింది ఇందుతో బ్రిటిష్ సామ్రాజ్యవాద విధానంలో ఏర్పడిన ప్రతిష్టంభన బయటపడింది కాని ఇందుతో పాటు కాంగ్రెస్-లీగుల మధ్య దాటరాని అఘాతం ఏర్పడి జా.గా విభేదాలు పాదు కున్నట్టుకూడ స్పష్టమయింది.

కాంగ్రెసు లీగు నాయకులిద్దరూకూడ, బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా తామొకలిసి సంయుక్త ప్రతిఘటన ఏర్పరచడంకంటె. తమలోనే ఒకరికి వ్యతిరేకంగా మరొకరు బ్రిటన్‌తో రాయబారాలు సాగించడం సులభమని భావించారు మొదటి యుద్ధం తర్వాతిదశకూ, రెండోయుద్ధం తర్వాతి దశకూ ఉన్న విభేదం ఇదే: మొదటియుద్ధం ముగుస్తూనే కాంగ్రెసు-లీగు-ఖిలాఫత్ ఉద్యమాల ఐక్యత ఏర్పడింది. అందుకు విరుద్ధంగా రెండోయుద్ధం ముగుస్తూనే ఈ విభేదాలు పెద్దవయ్యాయి. ఇదే జాతీయ సంఘటనలోని ప్రధానమైన దౌర్బల్యం

కాబట్టి యుద్ధం ముగుస్తూనే, భారతదేశంలో ఏర్పడిన ప్రజా విజృంభణకు వాస్తవమైన సంయుక్త నాయకత్వం-అధికారయుత జాతీయోద్యమ నాయకత్వం-లేకపోయింది సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జరిపే పోరాటంలో ఐక్యత కావాలనే ప్రజావాంఛ బలవత్తరంగా ప్రకటితమైంది. కలకత్తా, బొంబాయి మిగతా ప్రధాన పట్టణాలలో జరిగిన పెద్ద ప్రదర్శనాలలో ఈ ఐక్యతా వాంఛ కనిపించింది. ఆ ప్రదర్శనాలలో కాంగ్రెసు ముస్లింలీగు పతాకాలను, చాలచోట్ల కమ్యూనిస్టుపార్టీ పతాకాలనుకూడ కలుపుకొని ప్రజానీకం పాల్గొన్నారు దురదృష్టవశాత్తు ఈలోపలి భాగంలోని ఐక్యత, పైభాగంలో (నాయకత్వంలో) కనిపించలేదు.

ఏమైనప్పటికి ఈ ఉద్యమం. పౌరప్రజానీకంలోనేకాక, సేనావాహినిలో కూడ వ్యాపించింది. భారతదేశంలో ఇది నూతన లక్షణం. దీని విప్లవాత్మక ప్రాముఖ్యతను బ్రిటిష్ సామ్రాజ్యవాదులూ, జాతీయోద్యమంలోని ఉన్నతవర్గ నాయకులూ కూడ గ్రహించారు

పూర్వం 1930 లో గార్వాలీసేనలు కాల్చడానికి నిరాకరించాయి కాని ఇప్పుడు సేనలలో - ముఖ్యంగా వైమానికదళం, నౌకాదళాలలో బహుళవ్యాప్తము లయిన సమ్మెలు వచ్చాయి. తమ అధికారానికి అసలు పునాది అయిన సేనలోనే బ్రిటిష్ ప్రాబల్యం శిథిలమవుతున్నదని ఇందుతో అవగాహనకు వచ్చింది. భారత విప్లవంలో సన్నద్ధమవుతున్న ప్రధానశక్తులు, 1946 ఫిబ్రవరిలోని భారత నౌకా దళం తిరుగుబాటుతో మెరుపులా కనులు మిరుమిట్లు గొలిపాయి.

1905 రష్యా విప్లవంలో 'పొటెంకిన్' సంగతి 1917 రష్యాలో 'క్రాన్‌స్టాడ్' విషయం, 1918 జర్మనీలో కీల్ విషయం జ్ఞాపకం చేసుకుంటే ఈమహా

న్నత విప్లవాలలో నౌకాదళాల అగ్రేసరిత్వం, అందులోని ప్రాధా న్యత బోధపడుతుంది. 1946 ఫిబ్రవరిలోని నావికుల తిరుగుబాటు, అందుకు భారతదేశ ప్రజలిచ్చిన తోడ్పాటు. బొంబాయి కార్మికవర్గం ఆవిషయంలో అవలం బించిన వీరోచిత వైఖరిని ఇవన్నీ భారతదేశంలోని నూతన శకానికి అరుణో దయంవంటివి; భారతచరిత్రలో స్వర్ణఘట్టాలు. ఈఫిబ్రవరిరోజుల్లో భారతప్రజా పురోగమనానికి శత్రువులెవ్వరో, మిత్రులెవ్వరో బయటపడ్డారు.

బొంబాయి, కరాచీ, మదరాసులలో ఈ పట్టణాలలోను, ఇతర పట్టణాలలోను ఉన్న ప్రజానీకం తోడ్పాటుతో బయలుదేరిన రాయల్ నౌకాదళంలోని నావికుల తిరుగుబాటుకు బొంబాయి కేంద్రమైంది ఎన్నాళ్ళనుండో వారు కోరుతున్న కోర్కెలను తీర్చకపోవడం మూలంగా, ఫిబ్రవరి 18 తేదీ ఉదయం. తాల్వార్ ట్రైనింగుస్కూలులో ఈ తిరుగుబాటు ఆరంభమయింది, ఫిబ్రవరి 19 తేదీ ఉద యానికంతా బొంబాయితీరంలో నున్న 20,000 నావికులకు, హార్బర్‌లో నున్న 20 నౌకలకు ఈ సమ్మె వ్యాపించింది నౌకలపై యూనియన్‌జాక్‌ను తీసివేసి, కాంగ్రెసు, లీగు పతాకాలను కట్టారు, పట్టణప్రాంతంలో కాంగ్రెసు- లీగు, అరుణ పతాకాలతో ప్రదర్శనలు ప్రారంభమయ్యాయి "జయ్‌హింద్; ఇంక్విలాబ్ జిందా బాద్; హిందూముస్లింలు ఏకంకావాలి: బ్రిటిష్ సామ్రాజ్యవాదం నశించాలి; మాకోర్కెలను అంగీకరించాలి; అజాద్‌ఫౌజు, రాజకీయ ఖైదీలను వదలాలి; ఇండొనీషియానుండి జాతసేనను తిరిగి రప్పించాలి" అనే నినాదాలు దిక్కులు ప్రతిధ్వనించాయి. ఈసమ్మె భారత నౌకాదళంలోని ఇతర యుద్ధనౌకలకుకూడ వ్యాపించింది. ఇందులోచేరిన కరాచీలోని "హిందూస్తాన్" అనేనౌక తర్వాత సాయుధ తిరుగుబాటునుకూడ జరిపింది

ప్రారంభంనుంచే నావికులు కాంగ్రెసు, లీగు నాయకులతో సంప్రతిస్తూ వచ్చారు; కాని వారి తోడ్పాటునుకాని, సహాయాన్నికాని పొందలేకపోయ్యారు. వారొక కేంద్ర నావిక సమ్మెకమిటీని ఎన్నుకొని చాల కట్టుబాటుతో మెలిగారు. నౌకలలోనికి ఆహారంకూడ తెచ్చిఇచ్చిన బొంబాయి ప్రజల సహాయం బ్రహ్మాండ మైనది. ఈ ఉద్యమమింత పెరిగిపోవడంతో బ్రిటిష్ అధికారులు పూర్తిగా గాభరా పడి తీవ్ర హింసాచర్యలకు, నిర్బంధ విధానానికి దిగారు బొంబాయి, కరాచీలకు పెద్ద నౌకా, సైనిక దళాలను గబగబా పంపారు, భారత సైనికులు కాల్పడానికి నిరాకరించారు. అప్పుడు బ్రిటిష్ సైనికులను పిలవగా కాజిల్ బారక్సువద్ద ఫిబ్రవరి 21 వ తేదీ మధ్యాహ్నం అడ్మిరల్ గాడ్ఫ్రె, తన అంత్య సందేశం ఇచ్చాడు; "ప్రభుత్వం చేతిలోనున్న విపరీత సైనికబలం పూర్తిగా ఉపయోగిస్తాం...... ఇందువల్ల నౌకాదళం ధ్వంసమైపోయినాసరే వదలం" అన్నాడు. ఇందుకు సమా ధానంగా కేంద్ర నావిక సమ్మెకమిటీ ప్రజలకు విజ్ఞప్తిచేసింది, శాంతియుతమైన సమ్మె, హర్తాళ్ జరపమని పౌరులను కోరింది. గాడ్ఫ్రెతెచ్చే ప్రమాదాన్ని తొల గించి నావికుల జీవితాలను రక్షించడం అత్యవసర కర్తవ్యం అయినప్పటికీ,

కాంగ్రెసు నాయకులపక్షంగా వల్లభాయిపటేల్ ఈసమ్మెను, హర్తాళ్‌ను వ్యతిరేకించి జరపవద్దని కోరాడు అయినప్పటికి నావికుల సమ్మె కమిటీ పిలుపుని బొంబాయి ట్రేడ్‌యూనియన్లు, కమ్యూనిస్టు పార్టీలు బలపరచాయి ఈ పిలుపుని ఫిబ్రవరి 22న బొంబాయి కార్మిక ప్రజలు పాటించారు ఈ ప్రజా ఉద్యమాన్ని ఎటుబడితే అటు పోలీసు, మిలిటరీ కాల్పులతో అణిచివేయాలని బ్రిటిష్ అధికార్లు చూచారు మూడు రోజులలో - ఫిబ్రవరి 21 - 23 లోగా అధికారుల లెక్కల ప్రకారం కాల్పులలో 250 మంది చనిపోయ్యారు ప్రత్యక్షంగా ఈ సంఘటనలను చూచిన బ్రిటిష్ ఆఫీసర్ ఈ క్రింది విధంగా వ్రాశాడు :

బొంబాయి కార్మిక నివాస ప్రాంతం పరేల్‌లో సుపారీబాగ్‌రోడ్డు మీదుగా ఎలిఫిన్‌స్టన్‌రోడ్డు మలుపు దగ్గర, నేను సాయంత్రం 4 గంటలకు వెడుతున్నాను.

"వీధిలో చాలమంది ప్రజలే ఉన్నారు. కాని వారు గుంపుగా లేరు అల్లరిమూకగా అసలే లేరు, కమ్యూనిస్టుపార్టీ సలహా ననుసరించి ఆ ప్రజలు ఏ ఆయుధాలను పట్టుకోలేదు, ఆఖరుకు కర్రలుగాని, రాళ్ళుగాని, వారి చేతుల్లో లేవు

"హఠాత్తుగా, ఏమాత్రం హెచ్చరిక చేయకుండా రైఫిల్లూ ఒక బ్రెన్ గన్‌తోపాటు బ్రిటిష్ సోల్జర్లతో నిండిన లారీ ఒకటి ఎల్ఫిన్‌స్టన్ రోడ్డు గుండా దూసుకొని వచ్చింది.

"ప్రజలు ఇళ్ళవైపు పరుపులెత్తారు. నేనుకూడ పరువెత్తాను. వెంటనే ప్రజలవైపు బ్రిటిష్ సైనికులు కాల్చారు, ఆ కాల్పులలో 20 మంది గాయపడ్డారు. నలుగురు చచ్చిపోయారు.

"దీనికి మూలమేమిటి ?

"నావికులను బలపరుస్తూ, సర్వవ్యాప్తసమ్మె చేయవలసిందని ట్రేడు యూనియన్లు ఆదేశించాయి. బట్టల మిల్లులలో, ఫ్యాక్టరీలలో రైల్వే వర్కుషాపులలో పనిచేసే కార్మికులందరూ సమ్మెచేశారు. సర్వవ్యాప్త సమ్మె సంపూర్ణంగా విజయవంతమైంది.

"ఉన్నతోద్యోగులలో ఎవరో వీరికి పాఠం చెప్పాలి అనుకున్నాడు. వెంటనే యుద్ధానికి వెడుతున్నట్టు సాయుధ సైనికులు లారీలలో వీధులపై బడ్డారు ఎక్కడ జనం ఉన్నా అటూ ఇటూ చూడకుండా కాల్పులు సాగించారు. ఎవరైనా రాయో రప్పో తీసుకొనేలోగా భర్రున ముందుకు పోయారు.

"వీధుల్లో ఎక్కడా అంబులెన్సుకార్లు లేవు. ప్రజలే తమ చేతనైనట్టు ఆసుపత్రులకు చేరుకోవలసి వచ్చింది.

"తర్వాత డిలిస్లీరోడ్డులో బ్రిటిష్ సేనలు కార్మిక నివాసాలలోకి దూరడం చూచాను ఇళ్ళల్లో ఉన్నవారిని కాల్చారు. అందులో నలుగురు చనిపోయారు 16 మందికి గాయాలు తగిలాయి

"ఎన్నో పత్రికలు "బాధ్యతలేని తిరుగుబాటు" అంటూ చాలవార్తలు ప్రకటించాయి కాని, అధికారులు సమ్మెదారులను కాజిల్‌బారక్సులోనికి త్రోసి చుట్టూ కాపలాకాస్తూ, వారికి తిండికాని, నీళ్ళుకాని ఇవ్వకుండా చేశారు. సమ్మెదారు లెవరైనా దప్పితీర్చుకునేందుకు బయటికి వస్తే కాల్చి వేశారు (అధికార ప్రకటనలో "గేట్లు మూసివేయబడ్డాయి" అని వుంది) ఈ వార్తలనుమాత్రం పత్రికలు మీకు తెలియజేయలేదు

"ప్రజలు హింసాకాండకు దిగారని, రౌడీతనం చెలరేగిందనిమట్టుకే పత్రికలు మీకు తెలిపాయి కాని, శాంతంగా వెడుతున్న ఊరేగింపుపై మిలిటరీ లారీ నడిచిందని, ఇద్దరిని నలిచివేసిందని, అందుపై మొట్ట మొదటిసారి ఆ లారీమీద రాళ్ళుపడ్డాయన్న సంగతిని మాత్రం ఆ పత్రికలు ప్రకటించవు

"అర్థంలేని భయంకర సేనాహింసా రాజ్యాన్నుండి, తమ జీవితాలను, ఇళ్ళను రక్షించుకొనేందుకై ప్రజలు ఐక్యతతో జరిపిన పోరాటమిది

"ఐక్యపోరాట మిది ఊరేగింపులలో ఒకదానిప్రక్క నొకటిగా కాంగ్రెసు, లీగు, కమ్యూనిస్టు పతాకాలు ఎగురుతుండడం, "నర్మదా" యుద్ధనౌక శిఖరంపై కాంగ్రెసు లీగు పతాకాలు నర్తించడం ఇవి బ్రిటిష్ సైనికుల కళ్ళు కుట్టేట్టు చేశాయి.

"మేమొక ఇంటిలో ప్రవేశిస్తుండగా గుళ్ళు దూసుకపోతున్నాయి. అప్పుడొక భారతీయు డిలా అన్నాడు. "బ్రిటిష్ సోషలిజం కార్యక్రమం ఆరంభించింది చూచారా" లేబరు ప్రభుత్వంయొక్క ప్రతిష్ఠనుగూర్చే నా ఆందోళనంతా. ఇండోనీషియా తర్వాత మిగిలివున్న కాస్త ప్రతిష్టకూడా ఆ ఒకరోజులో లేబరుప్రభుత్వం గోల్పోయింది.

"అంతేకాక అన్నిటికన్నా బ్రిటిష్ ప్రజల గౌరవం ఏమవుతూంది అన్నది నాకు ముఖ్యం. అప్పటి కాల్పులన్నీకూడ బ్రిటిష్ సైనికులే జరిపారు పోలీసులు వెనుకబడ్డారు. భారతసైనికులు ఎక్కడా కనిపించలేదు. సైన్యంలోకి పాకుతున్న అసంతృప్తిని చూచి భయపడి, ఈ ఉద్యమ విధ్వంసన ప్రయత్నంతో భారతసైనికులను అధికారులు ఉపయోగించలేదని నాకు తెలిసింది."

ఆఖరుకు ఫిబ్రవరి 23 వ తేదీన సమ్మె కమిటీ వల్లభాయి పటేల్ ఒత్తిడితో లొంగిపోయింది. 'లొంగిపొమ్మని ఆయన సలహాయిచ్చి ఈ క్రింది వాగ్దానం చేశాడు. "ఈ సమ్మెలో పాల్గొన్నవారిపై అధికారులు చర్యతీసుకోకుండా కాంగ్రెస్

సాయశక్తులా పనిచేస్తుంది" అన్నాడు. ఇలాంటి వాగ్దానాన్నే ముస్లింలీగు నాయకులూ ఇచ్చారు. సమ్మె కేంద్రకమిటీ లొంగిపోవ నిశ్చయించుకుంది. రెండురోజుల్లోనే నాయకులను ప్రభుత్వం అరెస్టుచేసింది నావికుల కేంద్ర సమ్మెకమిటీ అధ్యక్షుని ఆఖరు ప్రకటనలో ఇలా ఉంది: "మేము భారతదేశానికి లొంగిపోతున్నాంకాని బ్రిటన్‌కు కాదు"

1946 ప్రారంభంలో ఇండియాలో తీవ్రతర మగుతున్న సంక్షోభ పరిస్థితిలో వివిధశక్తుల సమ్మేళనాన్ని ఫిబ్రవరి రోజులలో బొంబాయిలో జరిగిన నావికుల తిరుగుబాటు, వారికి ప్రజలిచ్చిన తోడ్పాటు స్పష్టీకరించాయి. ఒకవేపు ఉద్యమ మహాత్మ్యం, ప్రజల ధైర్యం, నిశ్చిత సంకల్పం, హిందూ-ముస్లిం ఐక్యతను, కాంగ్రెసు-లీగు ఐక్యతకు ప్రజలిస్తున్న గొప్పతోడ్పాటు స్పష్టపడింది. ఉద్యమం సేనలకుకూడ వ్యాపించిందని అది తెలియజేసింది. కాబట్టి బ్రిటిష్ పునాది ఇక భద్రంగా ఉండదని తేలిపోయింది. కాని, మరోవైపు జాతీయ నాయకత్వంలోని అనైక్యత, అసంసిద్ధత, జాతీయ పోరాటాన్ని నడపలేనివారి అసమర్థత తేటతెల్లమయింది.

ఇంతక్రితం బహిరంగోపన్యాసాల్లో మరీ మరీ పెద్దగా సుభాస్ బోసును పొగడడం జరిగింది. తొలుత జపానువారికి, తర్వాత బ్రిటిష్‌వారికికూడ లొంగిపోయిన ఆజాద్ హింద్ ఫౌజును ఏదో విప్లవాత్మక జాతీయ పోరాటానికి చిహ్నమంటూ పొగడడం జరిగింది. ప్రజాఉద్యమరూపం దాల్చని 1942 ఘటనలను గొప్పచేసేందుకు విపరీతమైన ప్రయత్నం జరిగింది.

కాని, నిజంగా ప్రజలు ఉద్యమంలో కదలి వచ్చినప్పుడు, హిందూ-ముస్లిం ఐక్యత సాధించి ఆచరణలో చూపుతున్నప్పుడు, సమిష్టి జాతీయ ఉద్యమంలో పౌరులతో సైనికులు చేరినప్పుడు, నిజమైన స్వతంత్ర పోరాటం బ్రిటిష్‌రాజ్య కవాటాలను భేదించినప్పుడు ఉన్నత వర్గ జాతీయ నాయకత్వం మరొక విధమైన వైఖరిని అవలంబించింది. కాంగ్రెసు, ముస్లింలీగు ఉన్నతవర్గ నాయకత్వం ప్రజాఉద్యమాన్ని వ్యతిరేకించి, ప్రజలకు విరుద్ధంగా శాంతిభద్రతల రక్షణకు ప్రతినిధి అంటూ బ్రిటిష్ సామ్రాజ్యతత్వంతో కలసిపొయ్యారు. మూడు రోజులూ ఎవరిపడితే వారిని కాలుస్తూ, వందలకొలది మందిని ఖూనీచేసిన సామ్రాజ్యవాద అధికారుల హింసాదర్యలను ఖండించకపోవడమేకాక, మిలిటరీ కాల్పులకు గురి అయిన నిరాయుధ ప్రజల "హింస"ను ఖండిస్తూ కుప్పలు తిప్పలుగా ఖండనలు, ప్రకటనలు చేశారు. వల్లభాయి పటేలు నావికులు యుద్ధానికి దిగిఉండవలసింది కాదని చెబుతూ "నేను కమాండర్‌యిన్ చీఫ్ చెప్పిన మాటలతో - నౌకాదళంలో కట్టుబాటుండాలి అనే మాటలతో ఏకీభవిస్తున్నాను" అని ప్రకటించాడు. కాంగ్రెస్ అధ్యక్షుడు ఆజాద్ ఇలా ప్రకటించాడు.

> "తాత్కాలికంగా ఆరోజు అధికారంలో ఉన్న అధికారులను ధిక్కరించి, సమ్మెలు, హర్తాళ్లు జరపడం సరికాదు. కేవలం తాత్కాలికంగా

పరివర్తనదశలో అధికారంలో ఉన్న విదేశపాలకులతో యుద్ధంచేసే, తక్షణ కారణమేమీ ఏర్పడలేదు "

హింసాకరమైన ఉద్దేశంకోసం ఏర్పడిన హిందూ ముస్లిముల "అపవిత్ర ఐక్యత" అంటూ గాంధీజీ ఇలా ఖండించాడు :

"వారు పైనుండి క్రిందివరకూ, ఏకమై ఉంటే నేను అర్థం చేసుకొని ఉందును. అలా జరిగి ఉంటే భారతదేశాన్ని అల్లరిమూకకు అప్పగించినట్లయ్యేది అలాంటి దుస్థితి పరిపక్వదశను చూట్టానికి నేను 125 ఏళ్ళు బ్రతుకదలచుకోలేదు ఆ జ్వాలలోపడి నశించి పోవడమే మంచిదనుకుంటాను.

(హరిజన్, ఏప్రిల్, 7, 1946)

ఇలా జాతీయ సంస్కరణవాద నాయకత్వానికీ, ప్రజావుద్యమానికి మధ్య ఉన్న అఖాతం మరొకతూరి సరికొత్తగా బయలుపడింది 1922 చౌరీచౌరాలోను 1935 గాంధీ ఇర్విన్ ఒడంబడికలోను బయల్పడినదే. ఈతూరి మరింత ఉన్నత స్థాయిలో తేటతెల్లమయింది. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సమిష్టిపోరాటానికై హిందూ-ముస్లిం ఐక్యతను భారత జాతీయ స్వతంత్రమార్గంగా నాయకులు తలంచలేదు. పైగా అదేదో గొప్ప ప్రమాదమని దాని నాపాలని తలచారు. ఎందుకంటే అలాంటిదే ఏర్పడితే అది భారతదేశంలో ప్రజానీకం విజయవంతమవుతుంది. ("భారతదేశాన్ని అల్లరిమూకలకు అప్పగించడం" — ప్రజాసామాన్యానికి ఉన్నతవర్గ నాయకత్వానికి మధ్య ఉన్న ద్వేషాన్ని ఈవాక్యం బట్టబయలు చేస్తుంది)

ఇంతవరకు భారతదేశాన్ని దోచుకుంటున్నదానినిగా బ్రిటన్‌ను చూచేవారు. ఇప్పుడు భారత ఉన్నతవర్గాల పక్షంగా "తత్కాలిక అధికారులు" గా భావించారు. ప్రజావిప్లవశక్తులను చూచి, సంక్షోభసమయంలో భయపడి ఇలాంటి నీచస్థితికి దిగజారి సామ్రాజ్యవాదంవేపు వెళ్ళిపోసాగారు. ఇలాంటి విప్లవశక్తులు భారత దేశంలో ప్రజాపోరాటం తీవ్రరూపం తాల్చినప్పుడల్లా పొంగి పొరలివచ్చాయి. ఈ నూతన భారత స్వతంత్ర సంగ్రామదశలోకూడ సరికొత్తగా బయటపడ్డాయి, వానినిచూచి భయపడి ఉన్నతవర్గ నాయకత్వం దిగజారిపోయింది.

జాతీయ సంఘటనలోని ఈ దౌర్బల్యాన్ని వెంటనే బ్రిటిష్ పాలకులు పసికట్టారు. దానిని బాగా ఉపయోగించుకోజూచారు. బ్రిటిష్ రాయబారుల తర్వాతి కార్యక్రమమంతా పరిశీలిస్తే ఈ సంగతి బోధపడుతుంది కాంగ్రెస్, ముస్లింలీగులు శాంతంగా తమకు పరిపాలనాధికారాన్ని అప్పగిస్తారని ఆశపడుతున్నారు. ప్రజానీకాన్ని చూచి భయపడుతున్నారు. వారిలో వారికి ద్వేషాలు - విభేదాలు వున్నవి — వీని నన్నిటినీ బాగా ఉపయోగించుకునేందుకే బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు తమ యెత్తుగడలను వేస్తున్నారు.

ఫిబ్రవరి 18 తేదీ. బొంబాయి నావికులసమ్మె ఆరంభమయింది.

ఫిబ్రవరి 19 తేదీ. బ్రిటిష్ రాయబారవర్గాన్ని ఇండియాకు పంపుతున్నామని బ్రిటిష్ ప్రధాని అట్లీ కామన్సుసభలో ప్రకటించాడు.

## 3. బ్రిటిష్ రాయబారవర్గం

బ్రిటిష్ మంత్రుల రాయబారవర్గం, 1946 మార్చిలో భారతదేశంలో దిగింది. 1945 సెప్టెంబరులో వైస్రాయి చేసిన రేడియో ప్రకటనలోని విధానాన్నే, ఈ మంత్రుల కార్యక్రమం అనుసరిస్తుంది.

వైస్రాయి 1945 సెప్టెంబరులో ఇలా ప్రకటించాడు ;

"రాజ్యాంగనిర్మాణసభ నొకదానిని సాధ్యమైనంత త్వరలో సమావేశపర్చాలనేదే బ్రిటిష్ ప్రభుత్వ ఆశయం ఇందుకు ప్రాథమికచర్యగా ఎన్నికలవుతూనే రాష్ట్రశాసనసభల ప్రతినిధులతో చర్చలు సాగించేందుకు నాకు అధికారమిచ్చారు 1942 నాటి ప్రతిపాదనలు అంగీకరిస్తారా లేక వేరే ప్రణాళికగాని, దానినే సవరించిగాని, అంగీకరిస్తారా అనేది ఆ ప్రతినిధుల ద్వారా తెలుసుకొమ్మన్నారు.

"రాజ్యాంగ నిర్మాణసభలో తామెలా తగినపాత్ర నిర్వహించగలరనేది తెలుసుకునేందుకై, సంస్థాన ప్రతినిధులతోకూడ సంప్రతిస్తాము.

"గ్రేట్ బ్రిటన్‌కూ ఇండియాకూ మధ్య చేసుకొనవలసిన సంధిలోని అంశాలగూర్చికూడ బ్రిటిష్ ప్రభుత్వం ఆలోచిస్తుంది.

"ఈ ప్రాథమికదశలో భారత ప్రభుత్వం కొనసాగుతూనే ఉంటుంది.... కాబట్టి రాష్ట్రశాసనసభ ఎన్నికల ఫలితాలు ప్రకటించబడగానే, ప్రధాన భారతపక్షాల తోడ్పాటుగల కార్యవర్గాన్ని నిర్మించేందుకు తగిన చర్యలు తీసుకొమ్మని నాకు బ్రిటిష్ ప్రభుత్వం అధికారమిచ్చింది....."

ఈ ప్రకటన 1942 క్రిప్సు ప్రతిపాదనల స్థూలరూపాన్నే అనుసరిస్తున్నదని, దానిని సవరించేందుకు మాత్రం అవకాశమిస్తున్నదని ఇందువల్ల తెలుస్తున్నది. ఇదే వైస్రాయి ప్రకటనతోపాటు, ప్రధాని అట్లీ ఇలా ప్రకటించాడు ;

"భారతదేశం గూర్చిన బ్రిటిష్ విధానం స్థూలనిర్వచనాన్ని 1942 ప్రకటనలో చేశాము ఆ ప్రకటనకు ఈ దేశంలోని అన్ని పార్టీలూ అంగీకరించాయి. అది సమగ్రంగా ఇప్పటికీ నిలిచి ఉన్నది."

1946 ప్రారంభంలో ఎన్నికలు జరిగాయి స్వతంత్రం ఆశయంగాగల రెండు ప్రధాన రాజకీయ సంస్థల వెనుక - సాధారణ నియోజకవర్గాలలో కాంగ్రెస్ ముస్లిం స్థానాలలో ముస్లింలీగు వెనుక - ప్రజాభిప్రాయం కేంద్రీకృత మవుతున్నదని ఎన్నిక ఫలితాలు తెలియజేశాయి. పూర్వమున్న చిన్నచిన్న పాక్షికసంస్థలు - హిందూమహాసభ, స్థానిక పక్షాలు, అధికారుల ఆదరంగల పంజాబు యూనియనిస్టు

పార్టీ. మదరాసులో జస్టిస్‌పార్టీలాంటివి అస్తమించిపొయ్యాయి కేంద్ర శాసన సభలో (పూర్వం 36 కాంగ్రెస్ స్థానాలు) కాంగ్రెసు 56 స్థానాలు సాధించింది. (ఈ శాసనసభ వోటింగు హక్కు అతి సంకుచితమైనది. బ్రిటిష్ ఇండియాలోని జనాభాలో రెండువందలమందికి ఒకరికి మాత్రమే ఈ వోటింగు హక్కువుంది); సాధారణ నియోజకవర్గాల వోట్లలో నూటికి 91 వోట్లు కాంగ్రెసుకు వచ్చాయి; మొత్తం శాసనసభ వోట్లలో నూటికి 59 వోట్లు వచ్చాయి. ముస్లింలీగు 30 ముస్లిం స్థానాలనూ (పూర్వం 25) జయించింది. ముస్లిం వోట్లలో నూటికి 86 వోట్లు. మొత్తం వోట్లలో 27.6% వోట్లు వచ్చాయి జనాభాలో నూటికి 11 గురికి, వయోజనులలో $\frac{1}{5}$ కు $\frac{1}{4}$ మధ్య వోటింగు హక్కున్న రాష్ట్ర శాసనసభల ఎన్నికలలో కాంగ్రెసుకు 930 స్థానాలు వచ్చాయి. గత ఎన్నికలలో (1937) 715 వచ్చాయి. మొత్తం వోట్లలో నూటికి 55.5 వోట్లు కాంగ్రెసుకు వచ్చాయి. ముస్లిం లీగుకు 507 ముస్లిం స్థానాలలో 427 స్థానాలు వచ్చాయి - 1937 యెన్నికల్లో 108 స్థానాలుండేవి. ముస్లిం వోట్లలో నూటికి 74.3 లీగుకు వచ్చాయి మొట్ట మొదటి సారిగా కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల్లో పోటీ చేయగలిగింది; 8 స్థానాలను, 6,84 928 వోట్లను సాధించగలిగింది

బ్రిటిష్ మంత్రులు ముగ్గురిని - ఇండియామంత్రి పెథిక్ లారెన్సు, వాణిజ్య మంత్రి స్టాఫర్డు క్రిప్సు, లార్డు అడ్మిరాల్టీ అలెగ్జాండర్లను - రాయబారవర్గంగా పంపు తామని బ్రిటిష్ ప్రధాని ఫిబ్రవరి 19 న ప్రకటించాడు. ఇందుతోపాటుఆ రాయబార వర్గం చేయవలసిన పనులను వివరించే ప్రకటనకూడ వెలువడింది ఈ రాయబార ఉద్దేశం "భారతపార్టీ నాయకులతో కలిసి, భారతదేశంలో స్వపరిపాలన సమ గ్రంగా త్వరలో ఏర్పడేందుకు తోడ్పడటం."

వారు తీసుకోవలసిన చర్యలలో ఈ క్రిందివికూడ ఉన్నవి

(1) "రాజ్యాంగ నిర్మాణపద్ధతిగూర్చి ఎక్కువ ఏకీభావాన్ని కుద ర్చడంకోసం, బ్రిటిష్ ఇండియాలో ఎన్నుకొనబడిన ప్రతినిధులతోను, సంస్థానాలతోను ప్రాథమిక చర్చలు జరపడం;

(2) రాజ్యాంగ నిర్మాణసభ ఏర్పాటు;

(3) ప్రధాన భారత పక్షాలబలం గల వైస్రాయి కార్యవర్గాన్ని ఏర్పరచడం.

బ్రిటిష్ రాయబారులు బయలుదేరే సమయంలో, మార్చి 15 తేదీ పార్ల మెంటులో బ్రిటిష్ ప్రధాని మరో ప్రకటన చేశాడు (చూడు ; మొదటి అధ్యాయం 6-7 పేజీలు) ఇందులో రెండు అంశాలు చాలమంది దృష్టిని ఆకర్షించాయి అందులో ఒకటి: భారతదేశం అధినివేశ హోదాకు బదులుగా "స్వతంత్రాన్ని" కోరుకోవచ్చుననే అంశం :

"తన భావిరాజ్యాంగచట్టం, తన భావి ప్రపంచస్థాయి ఎలా ఉండా లనేది భారతదేశమే నిర్ణయించుకోవాలి. ఇండియా బ్రిటిషు కామన్వెల్తులోనే ఉండేందుకు నిర్ణయించవచ్చని ఆశిస్తున్నాను.... కాని అలాకాక స్వతంత్రమే కావాలనుకుంటే - ఆ హక్కు దానికుందని మా అభిప్రాయం - అధికారం మార్పును సాధ్యమైనంత సుగమంగా చేయడానికి మనం తోడ్పడాలి."

రెండో అంశం అల్పసంఖ్యాకవర్గాలకు సంబంధించింది.

"అల్పసంఖ్యాకవర్గాల హక్కులను మనం గుర్తిస్తున్నాము. వారు నిర్భయంగా జీవించగలగాలి కాని అధికసంఖ్యాకుల పురోగతికి, అల్ప సంఖ్యాకులు వీటోవేస్తే మనం అలా జరగనీయము"

భారత రాజ్యాంగ పురోగమనంలో "స్వతంత్రం" ఆదర్శంగా ప్రస్తావించడం చాలమంది హర్షించారు. బ్రిటిష్‌విధానంలో గొప్పమార్పని, ఇండో బ్రిటిషు సంబంధాలలో నూతనసత్వక్పధాని కిది చిహ్నమని అన్నారు. ఇందులో కన్సర్వేటివు సభ్యులుకూడ అనుమానించదగిన రీతిగా చేరిపోయ్యారు. "స్వతంత్రం అనే పదంపై అంత గాభరాపడట మెందుకు" — అని గడుసువారిన సామ్రాజ్యవాది సర్ స్టాన్లీరీడ్ అన్నాడు. అయినప్పటికి ఊహామాత్రమైనదే వాగ్దానం — ఇకమీద ఏర్పడబోయే ప్రజాతంత్ర విరుద్ధమైన రాజ్యాంగసభ ఈ నిర్ణయం చేసుకోవాలి- ఆ సభ హోదాను, కార్యక్రమాన్ని బ్రిటిషుపాలకులే నిర్ణయిస్తారు. ఇలాంటిది నూతనవిధాన మేమీ కాదు. కన్సర్వేటివుల పెత్తనంతో ఉన్న మంత్రివర్గం ఆమోదించిన 1942 క్రిప్సు ప్రతిపాదనల్లోనే ఈ సంగతి ఉంది ;

"సాధ్యమైనంత త్వరలో భారతదేశంలో స్వపరిపాలనఏర్పడేందుకు కొత్త ఇండియన్ యూనియన్‌ను ఏర్పరచాలని బ్రిటిషుప్రభుత్వం చూస్తున్నది. దానికి పూర్తిగా అధినివేశహోదాఉంటుంది. దాని కిష్టమైతే బ్రిటిషు కామన్వెల్తునుండి తొలగిపోయే అధికారంకూడ దాని కుంటుంది."

అల్పసంఖ్యాకులు రాజకీయాభివృద్ధిని అరికట్ట నిరాకరించడంమట్టుకు సిమ్లాసమావేశంనాటి స్థితికంటె ముందడుగును సూచిస్తున్నది; రాజకీయ ప్రతిష్టంభనను తొలగించ నిశ్చయించుకున్నట్లు తెలుపుతున్నది. కాని అల్పసంఖ్యాక వర్గాలంటే, ముస్లింలుకాదని తర్వాత ఇండియాలో చేసిన అధికార వివరణల మూలంగా, ఈ మార్పు ప్రాముఖ్యత కాస్తా మాయమయింది.

గవర్నర్లు, సంస్థానాధిపతులు, రాష్ట్ర ప్రధానులు, ప్రతిపక్ష నాయకులు, కాంగ్రెసు - లీగు ఇతర సంస్థల ప్రతినిధులు - వీరందరిలో ప్రత్యేకంగా సంప్రతిస్తూ బ్రిటిష్ రాయబారవర్గం మొదట కొన్నివారాలు గడిపింది. ఇలా ప్రత్యేకించి రాయబారాలు నడవడంమూలంగా భారతదేశంలో విభేదాలు - ముఖ్యంగా కాంగ్రెసు లీగులకు మధ్య ఉన్నాయని లోకానికి చాటాలనే చేశారు. తరువాతి దశలో కాంగ్రెసు - లీగులకు సమాన ప్రాతిపదిక ఏర్పరచాలని — ఈస్టర్ సెలవుల

తర్వాత బ్రిటిష్ మంత్రివర్గం సంప్రతింపులు ఆరంభించింది. అందుకు రాయబారులు కొన్ని ప్రతిపాదనలు చేశారు. మూడు పార్టీల సమావేశాన్ని - రాయబారవర్గం కాంగ్రెసు, లీగు - సిమ్లాకు మే 5 నుంచి మే 12 కు వాయిదావేశారు. సంవత్స రానికి ముందుజరిగిన సిమ్లా సభలాగే రెండో సిమ్లా సమావేశంకూడ విఫలమైంది. ఇలా మొదటి ఏడువారాల్లో రాయబారవర్గ చర్యలు బ్రిటిష్ అవార్డుకు ప్రాతిపదిక వేశాయి.

మే 16 వ తేదీన వైస్రాయి, బ్రిటిష్ప్రభుత్వంతోచేరి రాయబారవర్గం తమ విధానాన్ని ప్రకటించాడు. ఇందులో నిర్ణయాలు, సిఫారసులుకూడ ఉన్నవి: ప్రజాపరిషత్తు నిర్మాణం. దాని స్వరూపం, దాని కార్యక్రమం విషయంలో నిర్ణయాలు చేశారు: మరి భావి రాజ్యాంగంలోని ప్రధాన సూత్రాలగూర్చి సిఫారసులు చేశారు. సిఫారసులను ప్రజాపరిషత్తు మార్చవచ్చుగాని. నిర్ణయాలనుమాత్రం అన్నీ అంగీక రించాలి లేదా ప్రణాళికనే త్రోసివెయ్యాలి. నిజానికి ఆ నిర్ణయాలే కీలకంవంటివి. తర్వాత రాజ్యాంగ స్వరూపాన్ని అవే నిర్ధయిస్తాయి కాబట్టి ఇది నిజానికి అవార్డే. (ఈ పదం వాడకుండా అసలిది అవార్డు కాదనికూడ అన్నారు) దీనిని బ్రిటిష్ అధికారులే నిర్ణయించి భారత దేశంపై రుద్దారు.

బ్రిటిష్ రాయబారులతో సంప్రదించడంలో భారత ప్రతినిధులలో ఉన్న దౌర్బల్యం ఏమంటే, కాంగ్రెస్ లీగ్ విభేదం. రెండు పార్టీలకు తమ తమ రంగా లలో ఉన్న బలం ఎన్నికల ఫలితాలు వివరించడంతో, విభేదం మరింత తీవ్ర మయింది. కాంగ్రెసు లీగులు సమిష్టిసంఘటనను ఏర్పరచ ప్రయత్నించే ఉంటే తొలుత స్వతంత్రం ప్రకటించాలని, అధికారం అప్పగించాలని కోరే విశ్వజనీన వాంఛను త్రోసిపుచ్చడం బ్రిటిష్ రాయబారులకు సులభమయ్యేది కాదు. మరొక విధంగా, కాంగ్రెసు లీగులు భావి రాజ్యాంగస్వరూపం గూర్చి వెంటనే అంగీకా రానికి రాకపోయినా ఒకటి సమిష్టిగా కోరిఉండవచ్చు. ప్రత్యేక సంప్రతింపులను నిరాకరించి, రెండు పార్టీలు కలిసి స్వతంత్రం ప్రకటించాలని, అధికారం అప్పగిం చాలని కోరిఉండొచ్చు (తర్వాత రాజ్యాంగ సమస్యలన్నీ అంతరంగిక భారతీయ సమస్యలుగనక, మూడోవారి జోక్యంలేకుండా భారత రాజకీయపార్టీలే వానిని పరిష్కరించుకుంటాయని చెప్పి ఉండొచ్చు); అలాగే చేసిఉంటే చొరవ బ్రిటన్ చేతిలోకి పోయిఉండేది కాదు. నిరంకుశమైన బ్రిటిష్ అవార్డు అసంభవమయ్యేది. కాని కాంగ్రెసు లీగు నాయకులిద్దరూ, దురదృష్టవశాత్తూ, ప్రత్యేకించి బ్రిటిష్ మంత్రులతో సన్నిహితంగా రహస్యసంప్రతింపులకు సిద్ధంగా వున్నారు కాని తమలో తాము సంప్రతించుకునేందుకు సిద్ధంగాలేరు. తమ పరస్పర విరుద్ధాశయా లను ఒకరికి వ్యతిరేకంగా మరొకరు చెప్పి తమతమ వైపు బ్రిటిషుమంత్రులను త్రిప్పుకోవాలని చూచారు. కాబట్టే ఈ పరిస్థితి ఏర్పడింది భారత స్వతంత్రానికి కాంగ్రెసు లీగు విభేదమొక్కటే ఆటంకంగా ఉన్నదని ప్రపంచప్రజలకు బ్రిటన్ ప్రచారం చేయగలిగింది, తాము నిరంకుశంగా రుద్దిన అవార్డును, భారత రా

కీయాల కిదొక్కటే పరిష్కారమార్గమని, తప్పనిదని, ఇలా చేయవలసివచ్చిందని బ్రిటిషుప్రభుత్వం చెప్పగిలిగింది

## 4. 1946 నాటి నూతన రాజ్యాంగ ప్రతిపాదనలు

మే 16 నాటి బ్రిటిష్ రాయబారవర్గ ప్రకటన ఈక్రింది ప్రతిపాదనలుచేసింది.

1. భావిరాజ్యాంగం గూర్చిన సిఫారసులు

1. బ్రిటిష్ ఇండియా, సంస్థానాలతో చేరిన ఇండియన్‌యూనియన్ ఉండాలి ఇది విదేశాంగ, రక్షణ, రవాణాశాఖల పాలన నిర్వహించాలి. అందుకు తగిన డబ్బును సంపాదించే అధికారంకూడ దీసికుండాలి.

2. బ్రిటిష్ ఇండియా, సంస్థాన ప్రతినిధులతో చేరిన ప్రభుత్వవర్గం, శాసనసభ, యూనియన్‌కు ఉండాలి. ప్రధాన మతసమస్యకు చెందిన యే నిర్ణయాన్నికావి శాసనసభ చేయాలంటే, రెండుమతాల (కాంగ్రెస్, లీగ్) హాజరైన సభ్యుల మెజారిటీ ఉండాలి. అందుతోపాటు మొత్తం సభ్యులందరి అధికసంఖ్యాక ఆమోదంకూడ ఉండాలి

3. యూనియన్ శాఖలు తప్ప మిగత అధికారాలు, విశిష్టాధికారాలు రాష్ట్రాల కుండాలి.

4 యూనియన్‌కు ఇచ్చిన అధికారాలుతప్ప మిగతావన్ని సంస్థానాలకే ఉండాలి.

5. రాష్ట్రాలు గ్రూపులుగా ఏర్పడే స్వతంత్రం ఉండాలి, వానికి మంత్రివర్గాలు, శాసనసభలుకూడ ఉంటాయి. ప్రతి గ్రూపూ సమిష్టిగా వ్యవహరించవలసిన రాష్ట్ర అధికారాలను నిర్ణయించుకొనాలి.

6. యూనియన్ గ్రూపు రాజ్యాంగచట్టాలలో ఒక సూత్రముండాలి. దానిప్రకారం ఏ రాష్ట్రంకాని పదేళ్ళకొకమాటు శాసనసభలో మెజారిటీ వోటుతో రాజ్యాంగ చట్టంలోని అంశాలను పునఃపరిశీలించవలసిందని కోరవచ్చును.

2. రాజ్యాంగ నిర్మాణసభకు ప్రతిపాదనలు :

1. ప్రజాపరిషత్తులో 389 మంది సభ్యులుంటారు; ఇందులో 292 మంది బ్రిటిష్ ఇండియా రాష్ట్రాలనుండి పరోక్షంగా, మత ప్రాతిపదిక జనాభానుబట్టి సాధారణ, ముస్లిం, సిక్కు స్థానాలక్రింద ఇప్పుడున్న రాష్ట్ర శాసనసభలే ఎన్నుకుంటాయి; సంస్థానాలనుండి 93 గ్గురు ప్రతినిధులు ఉంటారు. వీరెలా నియమించబడాలో సంప్రతింపులతో నిర్ణయించుకోవాలి.

2. రాష్ట్రాలు మూడు సెక్షన్లుగా ఏర్పడాలి.

(ఎ) హిందూ మెజారిటీ ప్రాంతాలు (మదరాసు, బొంబాయి, యు. పి., బీహారు, సి. పి, ఒరిస్సా.)

(బి) వాయవ్య సరిహద్దు ముస్లిం మెజారిటీప్రాంతం (పంజాబు, సరిహద్దు, సింధు, బెలూచిస్తాన్‌లు).

(సి) ఈశాన్య ముస్లిం మెజారిటీప్రాంతం (బెంగాల్, అస్సాం) ఈ గ్రూపుల సభ్యులు ప్రత్యేకంగా సమావేశమై, తమ గ్రూపులోని రాష్ట్రాల రాజ్యాంగచట్టాలను నిర్ణయించాలి. కొత్తరాజ్యాంగం తయారై దానిక్రింద మొదటి ఎన్నికలు జరిగిన తర్వాతనే రాష్ట్రాలకువిడిపోయే హక్కుంటుంది.

3. చిన్న మైనారిటీలకు సలహాకమిటీ ఏర్పడాలి

4 యూనియన్ ప్రజాపరిషత్తు, యూనియన్ రాజ్యాంగచట్టాన్ని నిర్ణయించాలి

ప్రధాన మతసమస్యలు రేకెత్తించే తీర్మానాలు హాజరైన రెండు మతాల సభ్యులలోను అధికసంఖ్యాకులు అంగీకరించాలి.

3 సంస్థానాలు

నూతన ఇండియన్ యూనియన్‌తో సంస్థానాల సహకారం సంప్రతింపులద్వారా నిర్ణయించాలి ప్రాథమికదశలో సంస్థానాలు ఒక సలహాదార కమిటీద్వారా ప్రాతినిధ్యం వహిస్తాయి.

బ్రిటిష్ ఇండియా స్వతంత్రమవుతూనే, సార్వభౌమాధికారాలు రద్దవుతాయి

4. బ్రిటిషు - ఇండియన్ సంధి

యూనియన్ ప్రజాపరిషత్తు, బ్రిటన్‌లమధ్య ఒక సంధి చేసుకోవాలి

5. తాత్కాలిక ప్రభుత్వం

"ప్రధాన రాజకీయపక్షాల తోడ్పాటుగల తాత్కాలిక ప్రభుత్వానికి" సిఫారసులు: ఈ ప్రభుత్వాన్ని, తన కార్యవర్గ పునర్నిర్మాణం ప్రాతిపదికపై వైస్రాయి ఏర్పరచాలి.

బ్రిటిష్ ప్రణాళికను వెంటనే కొందరు బాగుందన్నారు. కొందరు బాగు లేదన్నారు. సాధారణంగా బ్రిటిష్‌వారు, ఈ ప్రతిపాదనలు, భారతదేశానికి ఇస్తామన్న స్వతంత్రవాగ్దానాన్ని పరిపూర్తి చేస్తున్నవని, తమ రాజ్యాంగచట్టం నిర్మాణముకునే హక్కు భారతీయులకే ఇచ్చివేశారని అన్నారు. టోరీలలో మితవాదులప్రతినిధి చర్చిల్ చేసిన విమర్శకూడ ఈ విషయాన్నే వెల్లడించింది ఎందుకంటే భారత దేశానికి స్వతంత్రం ఈ ప్రణాళికలో ఉన్నదని ఊహపైనే ఆ విమర్శకూడ ఆధారపడింది.

భారతీయుల వ్యాఖ్యలు వివిధ విధాలుగా ఉన్నాయి. రాయబారాలు సాగుతున్నంతకాలమూ, రాయబారవర్గంయొక్క, బ్రిటిష్ ప్రభుత్వంయొక్క నిజాయితీని సద్భావాన్ని పొగడుతూ వచ్చిన ("వారు మనలను మోసం చెయ్యరు"అన్నాడు—దురాక్రమణదారులపై తిరుగుబాటు చేస్తున్న దేశానికి నాయకుడైన వాని నోటనుండి వచ్చిన ఈ మాటలు చాల సంగతులు వెల్లడిస్తున్నాయి విచిత్రంగా ఉన్నాయి) గాంధీజీ ఈ ప్రణాళికలో "ఈ విషాదభరిత భూమిని, దుఃఖమూ బాధలూలేని దేశంగాచేసే బీజాలు ఉన్నవి" అన్నాడు ప్రధాన కాంగ్రెసునాయకులు బలపరుస్తూ విమర్శించారు, మొదట లీగువర్గాలు జాగ్రత్తగా. ఖచ్చితంగా ఏమీ చెప్పలేదు. కాని తర్వాత జిన్నా. ఈ ప్రణాళిక "పాకిస్తాన్‌కు పునాది" వేస్తోందన్నాడు కాంగ్రెసులోని అతివాదులు బాహాటంగా దీనిని వ్యతిరేకించారు. ఫ్రీ ప్రెస్ జర్నల్ "భారతదేశ భవిష్యత్తును గందరగోళపరిచే బ్రిటిష్ ప్రణాళిక"అని ఖండించింది. కమ్యూనిస్టుపార్టీ నాయకుడు పి సి జోషీ "వలసదేశాలలో భారతదేశాన్ని మత కీలక సైనిక కేంద్రంగా ఉంచుకునేందుకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తయారుచేసిన పన్నాగమిది....స్వతంత్ర శాసనం ఆమోదింపబడకుండా అటంకపరిచేందుకు, భారతీయులను శాశ్వతంగా పరస్పర కలహాల్లో ముంచేందుకు తయారుచేసిన ప్రణాళిక ఇది"అని ఖండించాడు.

బ్రిటిష్ ప్రణాళిక ప్రకటితంకాగానే దీర్ఘంగా సంప్రతింపులు సాగాయి. మే 24 న కాంగ్రెసు వర్కింగుకమిటీ తమ దృక్పథాన్ని తెలియజేస్తూ తాత్కాలిక ప్రకటన నొకదానిని చేసింది. కాంగ్రెసు తీర్మానం తుదితీర్పు చెప్పలేదుకాని. కాంగ్రెసు దృక్పథానికీ, బ్రిటిష్ ప్రణాళికకూ మధ్యనున్న ఎన్నో విభేదాలను ఎత్తి చూపింది, ముఖ్యంగా తాత్కాలిక దశలో సైనిక ఆక్రమణ ("విదేశ దురాక్రమణ సేన అలాగే ఆక్రమించి ఉండడం, స్వతంత్రానికి వ్యతిరేకం"); ప్రజాపరిషత్తులో యూరపియన్ల ప్రాతినిథ్యం; విధిగా గ్రూపుల నేర్పరచి. రాష్ట్ర స్వపరిపాలనను సంకుచిత పరచడం; సంస్థానాలలో ప్రజాతంత్రపద్ధతికేమీ ప్రతిపాదన లేకపోవడం; ఏర్పరుస్తామని తాత్కాలిక ప్రభుత్వానికి అధికారం పరిమితంగా ఉండడం.

జూన్ 1 వ తేదీ, అఖిలభారత కాంగ్రెస్‌కమిటీ అధికారయుత వార్తాలేఖలో ఈ విమర్శను విపులీకరించి, ఈ ప్రణాళిక నిలా నిర్ణయించింది :

"చర్చిల్ అమెరీలుకూడ 1942 మార్చిలో ఇస్తామన్నంతకంటె ఇందులో పెద్దగా ఏమీలేదు.

"ఇందులో వాగ్దానంచేసిన స్వతంత్రం ఎన్నో షరతులతో, నిర్బంధాలతో పరిమితం చేయబడింది కాబట్టి దాన్ని స్వతంత్రమనడం తప్పు ప్రజాపరిషత్తు అనబడే సంస్థ. కేవలం నామకః ఆకారంమాత్రమే నిజానికది సర్వస్వతంత్ర సంస్థ కాదు. యూనియనూ, రాష్ట్రాలూకూడ బలవంతంగా రుద్దిన రాష్ట్రగ్రూపుల దయపై ఆధారపడాలి. భారతదేశాన్ని

మతప్రాదిపదికపై చీల్చితే ఉండే లోపాలన్నీ ఇందులో ఉన్నవి: కాని కనీసం పూర్తిగా ఆ పాకిస్థానైనా ఏర్పడలేదు—అలా ఏర్పడిఉంటే రాష్ట్రాలు ఏకంగా స్వతంత్రంగా ఉండేవి

"కరెన్సీ, బాంకింగు సుంకాలు, ప్లానింగు వీనిపై అధికారం లేని యూనియన్ ప్రభుత్వం ఆధునిక పారిశ్రామిక పరిస్థితులలో దేశ ఆర్థిక అభ్యుదయాన్ని నడిపేందుకు అతి దుర్బలంగా ఉంటుంది ..

"జాతీయ అభ్యుదయం, మత ప్రయోజనాలకే కాక, భూస్వామివర్గ ప్రయోజనాలకుకూడ లొంగిపోయింది. యూనియనుకూ, సంస్థానాలకూ మధ్య సంబంధాలను నిర్ణయించవలసింది. ఈ ప్రణాళిక ప్రకారం సంస్థానాధిపతులేకాని ప్రజలు కాదు........

"కనీసం ఈ ప్రణాళిక సుగమమైనదీ, సులభంగా ఆచరణ సాధ్యమైనదీ కూడా కాదు.

"ఫెడరల్ యూనియన్‌కూ, దానిక్రింది ఫెడరల్ గ్రూపులకూ, రాష్ట్రాలకూ, సంస్థానాధిపతులకూ (ఇక బ్రిటిష్ ప్రభుత్వం సంగతి చెప్పనక్కరలేదు. రాజ్యాంగచట్టం తయారయింతర్వాతకూడ, ఆఖరుమాట వారిదే,) మధ్య స్వతంత్రాధికారం బహు తేలికగా పంచారు. ఇందువల్ల ఈ స్వతంత్రం ఎక్కడుందో, ఎన్నడైనా తెలుసుకోగలమా అనేదొక సమస్య........

"నిర్బంధాలు, ప్రత్యేకాధికారాలు, రక్షణలు, ఒక మతానికి ఇంకొక మతానికి పోటీలు - ఈ కీకారణ్యంలో స్వేచ్ఛా స్వతంత్రాలుగల భారత దేశాన్ని గుర్తించడం కష్టం.

"భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దోపిడీకి ఇంతవరకు మత, సంస్థానాధిపతి వర్గాలు సాయపడుతున్నవి. ఇలాంటి వర్గాలను భారతదేశంలో శాశ్వతంగా, బలిష్ఠంగా ఉంచేందుకే ఈ ప్రణాళిక ప్రయత్నిస్తున్నది ఇందువల్ల బ్రిటిష్ ప్రభుత్వం తమ పూర్వీకుల సాంప్రదాయాన్ని వదిలివేయడంలేదన్న అనుమానం కల్గుతుంది. ఆ అనుమానం సకారణమైనదికూడ."

మే 24 తేదీ కాంగ్రెసు తీర్మానానికి సమాధానంగా, బ్రిటిష్ రాయబాయవర్గం మే 25 వ తేదీ మరొక ప్రకటనచేసి కొన్ని అంశాలు వివరించారు మిగతా అంశాలతోపాటు ఈ ప్రకటన క్రింది అంశాలను స్పష్టపరిచింది.

1. "ఈ ప్రణాళిక మొత్తంగానే ఉంటుంది;"-అంటే మొత్తంగా అంగీకరించాలి లేదా నిరాకరించాలి.

2. తమ ఇష్టమేదైనాసరే, మొదట రాజ్యాంగచట్టం నిర్మించి, అమలు జరిగి, ఎన్నికలు జరిగేవరకు రాష్ట్రాలకు గ్రూపులనుండి విడిపోయే హక్కు ఉండదు.

3. భవిష్యత్తులో భారతదేశానికిచ్చే స్వతంత్రం, రెండు షరతులకు లోబడి ఉంటుంది

(క) "మైనారిటీల రక్షణకు తగిన ఏర్పాట్లు";

(ఖ) "అధికారం మార్పుతో ఏర్పడే అంశాలపై బ్రిటిషు ప్రభుత్వంతో సంధి చేసుకునేందుకు సంసిద్ధత"

4 ప్రజాపరిషత్తులో సంస్థాన ప్రాతినిధ్యం. వారి అంగీకారంతోనే పరిష్కరించుకోవాలి "రాయబారవర్గం నిర్ణయించవలసిన విషయంకాదు."

5. తాత్కాలికదశలో ఇప్పటి రాజ్యాంగచట్టమే ఉంటుంది. కాబట్టి చట్టరీత్యా తాత్కాలిక ప్రభుత్వం కేంద్రశాసన సభకు బాధ్యత వహించదు.

6. తాత్కాలికదశలో సైనికాక్రమణ ఇలాగే ఉంటుంది. ఈచట్టం క్రింద భారత రక్షణ బాధ్యత ఆఖరుకు బ్రిటనుదే కాబట్టి బ్రిటిషుసేనలు ఉండిపోవాలి

తర్వాత ప్రజాపరిషత్తు ఎన్నికల సన్నాహంలో ఒకటి బయటపడింది; ప్రజా పరిషత్తు సభ్యులు ముందుగానే ఈ ప్రణాళికను ఆమోదించి, అమలు జరుపుతామని ప్రమాణం తీసుకోవాలి

ప్రణాళికలోని ఈ అంశాలన్నీ ఇది బలవంతంగా రద్దిన అవార్డన్న లక్షణాలను స్పష్టంగా చూపేకొద్దీ, కాంగ్రెసులోని ఎక్కువమంది, అతివాద వర్గాలు తీవ్రంగా వ్యతిరేకించాయి.

జూన్ 6న ముస్లింలీగు "సర్వతంత్ర స్వతంత్ర పాకిస్తాన్ ఇప్పటికీ భారత ముస్లిముల ఆశయ"మని పునరుద్ఘాటించి, ఈ ప్రణాళికను మొత్తంగా - ప్రజాపరిషత్తు తాత్కాలిక ప్రభుత్వ ప్రతిపాదనలు రెంటినీ - అంగీకరించింది. "ఈ ప్రణాళికలో పాకిస్తాన్‌కు పునాది, బీజం ఉంద"న్నది.

కాంగ్రెసు, లీగు, మైనారిటీల ప్రతినిధుల సమిష్టి ప్రాతినిధ్యమనే ప్రాతిపదికపై తాత్కాలిక ప్రభుత్వ స్థాపనకు సంప్రతింపులు జరిగాయి ఈ ప్రణాళికను అమలు జరపాలనే ప్రతి ప్రయత్నంలోను విభేదాలను శాశ్వతంగా ఉంచడం, తగాదాలు పెంచడమే ప్రధానమన్న సంగతిని ఈ రాయబారాలు బయటపెట్టాయి. తాత్కాలిక ప్రభుత్వ స్వరూపం విషయమై కాంగ్రెసు - లీగులకు సమాధానం కుదరలేదు. ఇందువల్ల తిరిగి బ్రిటిష్ పాలకులు ముందుకువచ్చి, జూన్ 16న ఒక అవార్డు ఇచ్చారు. ఈ ప్రతిపాదనల ప్రకారం: కాంగ్రెసు 5 (అందరూ హిందువులే, ఒక కాంగ్రెసు ముస్లిముకూడ లేడు;) ముస్లింలీగు 5, కార్మికులు 4

(సిక్కు, క్రైస్తవ, హరిజన్, పార్శీ - కాంగ్రెసును కొంత సంతృప్తిపరచాలని హరిజన ప్రతినిధిని కాంగ్రెసు హరిజన్‌ను నియమించి కాంగ్రెసు 6 స్థానాలు చేశారు )

ప్రభుత్వంలోకి చేరితే "మే 16 బ్రిటిష్ ప్రణాళిక ప్రకారం రాజ్యాంగ నిర్మాణ కార్యక్రమం నడుస్తుందన్న ప్రాతిపదిక మీదనే" అని స్పష్టపరిచారు.

ఈ తాత్కాలిక ప్రభుత్వనిర్మాణం తీవ్రంగా వ్యతిరేకించబడింది — ముఖ్యంగా కాంగ్రెస్‌ముస్లింను సుకోత, కాంగ్రెసును హిందూసంస్థగా చేయడం వ్యతిరిక్తమయింది జూన్ 24 న కాంగ్రెసు తాత్కాలిక ప్రభుత్వ ప్రణాళికను నిరాకరించింది కాని ప్రజాపరిషత్తులో పాల్గొన నంగీకరించింది. జూన్ 26 న కాంగ్రెస్ వర్కింగుకమిటీ చేసిన తీర్మానం బ్రిటిష్‌ప్రణాళికలోని "లోపాలను" నొక్కిచెప్పింది. "సంపూర్ణ స్వతంత్రం", సాంఘికాభివృద్ధి కాంగ్రెస్ ఆశయమని ప్రకటించింది. ఆ ఆశయాలకు ఈ ప్రణాళిక దూరంలో ఉన్నదని ప్రకటించింది." ఈ ప్రణాళికను అంగీకరించినట్లు కాంగ్రెసు తీర్మానం చెప్పలేదు కాని "స్వతంత్ర, సంయుక్త ప్రజాస్వామిక భారత రాజ్యాంగచట్టం నిర్మించే ఉద్దేశంతో" ప్రజాపరిషత్తులో చేరడానికి మాత్రమే నిర్ణయించింది తాము బలవంతపు రాష్ట్ర-గ్రూపులను అంగీకరించమని చట్టం తెలిసినవారి సలహా బలపరిచే తమ వ్యాఖ్యానాన్నిబట్టి ప్రవేశిస్తున్నామనికూడ కాంగ్రెస్ స్పష్టపరిచింది.

ఈ ప్రకటన తర్వాత, బ్రిటిషు రాయబారులూ, వైస్రాయి ఉద్యోగులతోసహా నడమంత్రపు ప్రభుత్వం ఏర్పరుస్తామని, తాత్కాలిక జాతీయ ప్రభుత్వంకోసం తిరిగి రాయబారాలు సాగిస్తామని ప్రకటించారు.

జూన్ 29 బ్రిటిష్ రాయబారులు భారతదేశం వదిలివెళ్ళారు.

ఈ 1946 బ్రిటిష్ ప్రణాళిక భారత స్వతంత్ర ప్రణాళికఅంటూ ప్రపంచానికి చాటారు. కాని దానిని పరిశీలిస్తే ఇది నిజానికి 1942 క్రిప్సు ప్రతిపాదనలకంటె ఎక్కువేమీలేదని బోధపడుతుంది. భారత స్వతంత్రస్థాపనకుగాని, ప్రజాతంత్ర బద్ధంగా ఎన్నుకోబడిన భారత ప్రజాప్రతినిధులు తమ భవిష్యత్తును నిర్ణయించుకునే హక్కుకిది చాల దూరమని అవగతమవుతుంది.

నూతన భారత పరిస్థితులకు అనుగుణంగా బ్రిటిష్‌విధానాన్ని చాకచక్యంతో సరిపెట్టుకోవడం మాత్రం నిస్సందేహం. ఇటీవల భారత రాజ్యాంగ అభివృద్ధిని అటంకపరిచి ప్రతిష్టంభనను తొలగించాలని ఈ ప్రణాళిక చేశారు. కాని ఇందులో సూచించిన యంత్రాంగమునకు కొత్త ప్రతిష్టంభనలు వరుసగా ఏర్పడుతూనే ఉంటాయనుకుంది. ఈ ప్రణాళిక కాంగ్రెసు లీగు సహకారానికి ప్రాతిపదిక ఏర్పరిచింది. ఎప్పుడో స్వతంత్ర మిస్తామన్న ఊహా మాత్ర వాగ్దానం ఇందులో వుంది ; ప్రధాన పార్టీల పునాదిపై తాత్కాలిక ప్రభుత్వం ఏర్పరిచే ప్రతిపాదనలు చేసింది. ఈ ప్రతిపాదనలు 1942 క్రిప్సు ప్రతిపాదనలకంటే, 1935 ఫెడరల్ రాజ్యాంగం కంటే మరీ కొద్దిగా ముందడుగు వేశాయి కాని ఇందులోని ఈ ప్రణాళికలోని లోపాలు మరీ స్పష్టంగా కనిపిస్తున్నాయి

ఒకటి : ఇందులో ఎన్నడో అధినివేశమో, స్వతంత్రమో కోరుకోవచ్చునని ఉంది. భారతరాజకీయ పక్షాలన్నీ ఒకటి మినహాయించకుండా వెంటనే స్వతంత్రం ప్రకటించాలని కోరుతున్నవి. ఇందుకిది చాలదూరం. ఈ స్వతంత్ర సమస్యను ప్రాతినిధ్య సంస్థకాని దానికి వదిలివేశారు - ఆసభ స్వరూపం, కార్యక్రమం బ్రిటిష్ అవార్డు నిర్ణయించింది. అది అభివృద్ధి విరోధకవర్గాలవైపే మ్రొగ్గుతున్నది.

రెండు : ఏ రాజ్యాంగ చట్టమైనా ప్రజాతంత్ర బద్ధంగా ఉండాలంటే దానికి పునాది, వయోజన వోటింగుతో ప్రజాతంత్ర ప్రజాపరిషత్తు నెన్నుకొనాలి. దీనిని త్వరగా కావాలన్న నామకః సాకుతో నిరాకరించారు. ఈ ప్రజాపరిషత్తు నిర్మాణం మతవిభేదాలను స్థిరపరుస్తోంది కాబట్టి ప్రజాతంత్రవిరుద్ధం;దీనిని జనాభాలోనూటికి 11 మందికి ప్రాతినిధ్యం వహించే రాష్ట్ర శాసన సభలు పరోక్షంగా ఎన్నుకుంటాయి. పైగామొత్తం సభ్యులలో నాల్గవవంతు 93 సభ్యులు సంస్థానాధిపతులు నియమించినవారు ఇందులోకి వస్తారు.

మూడు : భారత దేశంలో మూడోవంతున్న సంస్థానాలలో ప్రజాతంత్ర వ్యవస్థకేమీ అవకాశం కల్పించలేదు. సంస్థానాధి పతులతో చేసుకునే ఏర్పాట్లు —ప్రజాపరిషత్తులో ప్రాతినిధ్యం విషయంకూడా పూర్తిగా స్వేచ్ఛారాయబారాలకే వదలి వేయబడింది. సంస్థానాల నిలా ముట్టకుండా వదలివేయడమేకాదు : సార్వభౌమాధికారాలు రద్దుకావడంతో, ఆ సంస్థానాలు ఇష్టపడి యూనియన్‌తో సంధి చేసుకోకపోతే రాజ్యాంగ రీత్యా స్వతంత్ర రాజ్యాలయ్యే అవకాశ మిచ్చారు.

నాలుగు : ఈప్రణాళిక భారతదేశాన్ని నాలుగుముక్కలు చేసింది. - ఒక హిందూఅధిక సంఖ్యాకప్రాంతం, రెండుముస్లిం అధికసంఖ్యాక ప్రాంతాలు, ఒకసంస్థానాలప్రాంతం. ఈబలవంతంగా రుద్దిన విభజనవిషయంలో ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోదలచలేదు. ఈ విభజన స్వయంనిర్ణయ సూత్రానికేమాత్రం సంబంధం లేనిది. ఇందువల్ల ఎర్పడే మూడంతస్తుల రాజ్యాంగం ( రాష్ట్రాలు, గ్రూపులు, యూనియన్ ) చాలచిక్కులతో కూడిందేకాక ఆచరణలో అసాధ్యంకూడ కావచ్చు.

అయిదు : ఈవిభజనవల్ల కేంద్రం చాల దుర్బలంగా, పరిమితాధి కారాలతో ఉంటుంది. ముఖ్యంగా ఆర్థికప్రణాళికలకు, యావద్భారత ప్రాతిపదికపైసాంఘిక చట్టాలుచేయడానికి వీలుండదు. అలాంటి అధికారం ప్రజాతంత్రాభివృద్ధికి వాస్తవమైన బహుళఆర్థిక పునర్నిర్మాణానికి సాంఘిక స్థాయిని పెంచేందుకు అత్యవసరం.

ఆరు : పరివర్తన దశలో అధికారం అప్పగించే మాటలేదు: పాతరాజ్యాంగ చట్టంఅమలులో ఉంటోంది.తాత్కాలిక ప్రభుత్వం కేవలం వైస్రాయికౌన్సిల్ విత్య పునర్నిర్మాణం మాత్రమే, కాబట్టి అవసరమైతే వైస్రాయి అసాధారణ అధికారాలుంటాయి.

ఏడు : వ్యవధినిర్ణయించని ఈ పరివర్తనదశలో బ్రిటిష్‌సేన అలాగే ఉంటాయి, కాబట్టి విదేశసేనల ఛాయలక్రింద నూతన రాజ్యాంగచట్టం నిర్మితం కావలసిఉంటుంది.

ఎనిమిది ; ప్రజాపరిషత్తు సర్వస్వతంత్ర సంస్థకాదు. ఇదితయారుచేసే రాజ్యాంగచట్టం బ్రిటన్ ఆమోదించేవరకు అమలుకాదు; బ్రిటిష్ ఆమోదం రెండు షరతులకు లోబడి వుంటుంది — మైనారిటీల రక్షణకు తగినఏర్పాట్లు జరిగాయని బ్రిటిష్ పాలకులు తృప్తిపడాలి ; ఇండో బ్రిటిష్ సంధిని అంగీకరించాలి, ఇవిరెండూ అధికారం ఇవ్వకముందే జరగాలి.

భారత దేశంలోని వున్నతవర్గ నాయకత్వంతో మైత్రికి ప్రాతిపదిక ఏర్పర చాలని ఈ ప్రణాళిక చూస్తున్న దనడంలో సందేహంలేదు. ఈ రాజ్యాంగ సంప్ర దింపులతోపాటు, బ్రిటిష్ ఇండియన్ పెట్టుబడిదారుల సంబంధాలు మరింత సన్ని హితం చేసుకునేందుకు (బిర్లా - నఫీల్డు, తాతా - కెమికల్ ఒడంబడికలు వగైరాలు) తీవ్ర ప్రయత్నాలు సాగుతున్నాయి, వీనిని ఆరో అధ్యాయం 8 వ వర్గలో ముందే వివరించాను.

ఈ మైత్రికై చేసిన ప్రయత్నం, భారత ఆంతరంగిక పరిస్థితికేకాక, అంతర్జాతీయ పరిస్థినిబట్టికూడా ప్రాముఖ్యమైనది, అభివృద్ధి విరోధకులైన సంస్థా నాదిపతులకు ప్రాబల్యమిచ్చి, ఉన్నతవర్గ నాయకత్వంతో మైత్రిచేసుకునే పునాదిపై భారతదేశంతో పరిష్కారానికి బ్రిటన్ ప్రయత్నించింది. అంటే భారత పరిస్థితిని స్థిరపరుచుకొనేందుకు, విజృంభిస్తున్న ప్రజాశక్తులను అణచి వేసేందుకు, బ్రిటిష్ ప్రయోజనాలను కాపాడు కునేందుకు మాత్రమేకాదు; భారతదేశాన్ని ప్రధాన సైనిక కేంద్రంగా నిల్పుకొని బ్రిటిష్ సామ్రాజ్యవాదం అంతర్జాతీయ విధానంలో కూడా మిత్రురాలిగా చేసుకునేందుక్కూడా ఇలా బ్రిటన్ చేసింది. భారత సంప్ర దింపులతోపాటు బ్రిటన్ అనుసరిస్తున్న అభివృద్ధి విరోధక, ప్రజాతంత్ర విరుద్ధ సోవియట్ వ్యతిరేక విధానంచూస్తే, ఈ అంశం చాల ప్రధానమైనదని తేలుతుంది. సంప్రదింపుల సమయంలో సోవియట్ వ్యతిరేక ప్రచారం తీవ్రంగా భారతదేశంలో వ్యాపింప జేశారు. స్వతంత్రాన్నిగూర్చి మాట్లాడు తుండగానే, అందుతోపాటు సైనిక, కీలకస్థాన సన్నాహాలు ఆచరణలో మరింత బలపరుప బడినవి.

పదేళ్ళలోగా భారతసేనను భారతీయం చేయాలని కేంద్రశాసనసభలో ఒక తీర్మానంవచ్చింది. దానిపై మాట్లాడుతూ సర్వసేనాని ఇందుకొక కాలవ్యవధి పెట్ట వీలులేదనీ, అది ఇరవైయేళ్ళు, అంతకుపైగాకూడ పట్టవచ్చుననీ అన్నాడు. బ్రిటిష్ రాయబారుల ప్రణాళికతోపాటు, ప్రత్యేక సైనికతంత్ర సంప్రదింపులకై ఫీల్డు మార్షల్ మాంట్‌గోమరీ ఇండియాకు వచ్చాడు, బ్రిటిష్ ప్రణాళికతోపాటు జరిగిన ఈ తతంగం అప్పటికి ప్రజలదృష్టి నంతగా ఆకర్షించక పోయినప్పటికి ,భారతదేశ భవిష్యత్తుకు మాత్రం ఎంతోముఖ్యమైనవి, వీనిఫలితాలు దారుణంగా ఉండవచ్చును.

ఇవన్నీ పరిశీలించింతర్వాత ఆఖరునిర్ణయం తప్పదు. 1946 రాజ్యాంగ ప్రతిపాదనలు పాతపద్ధతినే సాగిస్తున్నవి. సామ్రాజ్యవాదులు భారతదేశ రాజకీయ జీవితంలోని విభిన్న వర్గాలను ఒకదానికొకటి పోటీపెడుతున్నారు; ముఖ్యంగా

మతవిద్వేషాలపై రాజకీయపరిస్థితిని నిర్మించుకున్నారు ; కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ముస్లింలీగును - సంస్థానాధిపతులను అభివృద్ధి విరోధక ప్రధానశక్తిగా పోటీపెడుతున్నారు — ఇవన్నిటిద్వారా ఎప్పుడో ఇస్తామన్న స్వతంత్రాన్ని ఆచరణలో నులిమివేస్తున్నారు. అసలు పెత్తనం తమచేతుల్లోనే ఉంచుకుంటున్నారు. విషమమైన. అంతులేని పరివర్తనదశలో బ్రిటన్‌దే పెత్తనం. తద్వారా రాజ్యాంగచట్టం లక్షణాలనే తమపలుకుబడి కిందికి తెచ్చుకునే వీలుంటుంది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఇంకా అధికారాన్ని భారతప్రజలకు అప్పగించివేయలేదు. ఇంకా తన తెలివితేటలను, యుగయుగాల అనుభవాన్ని ఉపయోగించి. ఎటుబడితే అటు లాగగల. క్లిష్టమైన ఒక విచిత్ర యంత్రాన్ని తయారు చేసింది. దీనిద్వారా భారతదేశ "స్వతంత్రం" అనే ముసుగు కిందకూడ, తన ఎత్తులు సాగించుకోవడానికి. తన ఆర్థిక సైనిక పెత్తనాన్ని కొనసాగించుకునేందుకు బ్రిటన్ అవకాశం కల్పించుకుంది.

బ్రిటిష్‌మంత్రి రాయబారవర్గం వస్తుందని ప్రకటించింతర్వాత. దీర్ఘకాలం సాగదీసి జరిపిన 1946 వేసవినాటి రాయబారాలు భారతదేశ ప్రజలకొక సంగతిని తెలియజేశాయి, భారతదేశ స్వతంత్రాన్నింకా తాము సాధించవలసే ఉన్నదని, అదింకా భవిష్యత్తులోనే ఉన్నదని భారతీయులు రానురాను స్పష్టంగా గ్రహించగల్గారు.

# ఆరో భాగం

# నిర్ణయాలు

**అధ్యాయం 18 ;  భవిష్యత్తు,**

1. బ్రిటిష్ ప్రభుత్వం తుది రోజులు,
2. ఎలాటి స్వతంత్ర భారతదేశం ?
3. పునర్నిర్మాణం, పరిశ్రమాభివృద్ధి, సోషలిజం
4. భారతదేశం ముందున్న కర్తవ్యం.

# పద్ధెనిమిదో అధ్యాయం

# భవిష్యత్తు

"ఒకదేశ పురోగతికి హద్దునిర్ణయించే హక్కెవ్వరికీ లేదు. 'ఇంతవరకే వెళ్ళాలి గాని ఆపైన వెళ్ళకూడదు' అని తనదేశాన్ని ఆదేశించే హక్కు ఎవ్వరికీ లేదు."

— పార్నెల్.

భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం, "ఒకమహత్తరమైన, మహోత్తమమైన కార్యక్రమాన్ని — శిధిలమైన సమాజాన్ని పునర్నిర్మించే కార్యక్రమాన్ని" నిర్వర్తిస్తున్నదని, ఒకశతాబ్దిక్రితం మెకాలేచెప్పాడు. ఆసమయంలో భారతదేశ ప్రాచీన సమాజాన్ని భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం, పూర్తిగా విచ్ఛిన్నం చేస్తున్నది. "రక్షణలేని భారతదేశంపై వరుసగా ఆలరిక్కులు, అత్తిలలు దాడిచేసి నంతకన్నా" ఎక్కువగా, వందలకొలది సంవత్సరాలుగావున్న భారత ప్రజలజీవన విధాన పునాదులనే కూల్చివేస్తున్నది. భారతదేశ పురాతన చరిత్రగూర్చి, అత్తిలల దాడిసంగతి మాత్రమే మెకాలేకుతెలుసు - యదార్థంగా బ్రిటిష్ ప్రభుత్వంచేస్తున్న విధ్వంసక చర్యలను, తనకాలపు ఆత్మసంతృప్తితో గుర్తించకుండా. మెకాలే హాయిగా వదిలివేశాడు (1)

---

(1) 1833 జూలై 10 వ తేదీన మెకాలే కామన్సు సభలో, భారత దేశానికి బ్రిటిష్ పరిపాలనచేకూర్చిన మహద్భాగ్యాన్నిగూర్చి బహుఘనంగా ఉపన్యసించాడు. ఈస్టిండియాకంపెనీ గుణగణాలను అభివర్ణించాడు. ఈ ఉపన్యాసంలోని అంతర్యాన్ని తెలుసుకోవాలంటే. అందుకు మూలమైన పరిస్థితులను పూర్తిగా తెలుసుకోవాలి ఆగస్టు 17, 1833 మెకాలే తన సోదరికిలా జాబు వ్రాశాడు.

"నేను జీవించాలి. నారచనలమీద ఆధారపడిమాత్రమే నేను జీవించగలను, తన జీవనానికి తగినంతడబ్బును, కేవలం రచనలద్వారానే సంపాదించుకుంటా. పైగా రాజకీయాలలో పాల్గొనాలంటే, ఎవరికీ సాధ్యంకాదు. నేను నారచనలతో ఏటా రెండువందల పౌన్లకంటే ఎన్నడూ సంపాదించలేదు. ఆయిదు వందలకు తక్కువైతే హాయిగా నేను జీవించలేను. ఇక తప్పనిసరిగా నామీద ఆధారపడేవారూ చాల మంది ఉన్నారు. మన కుటుంబ పరిస్థితులు. ఎన్నడూ లేనంత అధ్వాన్నంగానే ఉన్నాయి."

తమ్ము భారతదేశంలో న్యాయశాఖ సభ్యునుగా నియమించే అవకాశమున్నదని - ఇతనికి పదవి 1834 లో వచ్చింది. - అదితన సమస్యలను పరిష్కరించి వేస్తుందని ఆదేజాబులోనే ఇలా వ్రాశాడు.

ఆపరిస్థితి ఈనాడు తలక్రిందులయింది, సామ్రాజ్యవాదమే నేడుశిథిలిత మవుతున్నది. "వరుసగా అలరిక్కులు అత్తిబులు" వస్తారనే దుస్వప్నాలతో భయభ్రాంతమైన "శిథిలిత సమాజ" స్వరూపంనేడు యూరపియన్ నాగరికతను కాలికిందరాచి వేస్తున్నదని, ఫాసిజం అనుభవం ఇటీవలి సంవత్సరాలలో మనకు తెలియజేసింది. స్వతంత్రంకోసం ఫాసిజానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజలు పురోగమిస్తున్నారు, భారతప్రజలు ఆ పురోగమనంలో తమ అగ్రస్థానం ఆక్రమించేందుకు త్వరపడుతున్నారు.

## 1. బ్రిటిషు ప్రభుత్వం తుదిరోజులు

శాశ్వతంగా నిరంకుశ ఆధిపత్యాన్ని భారతదేశంలో నిలుపుకునే పాతఆశలు అడుగంటినవి. తప్పని సరిఅయిన నూతన సంస్కరణలనే తెరచాటున, సామ్రాజ్యవాద దోపిడీకి, సౌకర్యాలను ప్రధానమైన అంశాలను అలానేఉంచుకునేందుకు అనుకూలమైన రీతిగా ప్రవర్తించాలనేదే నేడు సామ్రాజ్య వాదులఆశ. ఈఆశయం సిద్ధించేందుకే గత అర్ధశతాబ్దిగాను. రాజ్యాంగసంస్కరణలూ, ఒక్కొకప్పుడు తీవ్రతరమైన నిర్బంధ విధానమూ కూడ సాగుతూవచ్చింది; 1946 లో ఈప్రయత్నాల పరమావధిని పొందిన నామకః "స్వతంత్ర" వాగ్దానంకూడ సామ్రాజ్యవాద పాలనకు అంతిమ ఘడియకాదు. రాజ్యాంగ పద్ధతులను నూతనపరిస్థితులకు అనుగుణంగా మార్చుకోవాలని ఎన్నాళ్ళగానో చేస్తూవచ్చిన ప్రయత్నాలలో ఇది తుదిప్రయత్నం మాత్రమే

భారతదేశంలో కఠినంగా నిర్బంధ విధానం అవలంబించాలని. అదేసులభమైన పరిష్కార మార్గమని. మితవాదులలోని పాతకన్సర్వేటివులుచెప్పే రోజులు గతిం

---

"సాంఘ్యరి జీతం పదివేలు. కలకత్తాను బాగా క్షయెరుగున్నవారూ, అక్కడ ఉన్నత పదవుల్లోవుండి ఉన్నతవర్గాలలో తిరిగినవారూ నాకునమ్మకంగా చెప్పిందేమంటే: ఏటా ఆయిదువేలతో ఆపట్టణంలో మహారాజులా బ్రతకవచ్చునట. మిగిలినజీతం వడ్డీకోసహా కూడబెట్టుకోవచ్చు: కాబట్టి ముప్పైతొమ్మిదేళ్ళ వయసుకే. మాంచిఉత్సాహం ఉన్నప్పుడే ముప్పైవేలపౌనుల ఆస్తితో నేను, ఇంగ్లాండుకు తిరిగి రాగలుగుతాను. నేనెన్నడూ ఆశించనంతకన్నా ఎక్కువ ఆస్తి నాకువస్తుంది."

ఈ చిన్నఉదాహరణ సామ్రాజ్య వాదంయొక్క, బూర్జువాజీవిత సిద్ధాంతంయొక్క గుట్టును బట్టబయలు చేస్తున్నది ఇది మెకాలేఉపన్యాసం ప్రతిముద్రణలలోనూ అనుబంధంగా చేర్చాలి. (ముఖ్యంగా స్కూలుపుస్తకాల్లో) ఎందుకంటే మెకాలే ఉపన్యాసాన్ని భారతదేశంలో బ్రిటిష్ ఆశయాల ఔదార్యాన్ని వెల్లడించే మహోత్తమప్రకటనగా చెబుతుంటారు. ఆ ఉపన్యాసంలోని రీతి సౌందర్యాన్ని ముఖ్యంగా ఈక్రింది, వాక్యాలవంటివానిని బట్టబయలు చేసేందుకు ఈ అనుబంధం (చెల్లెలికి వ్రాసిన జాబు) చాల పనికివస్తుంది

"ఏనోళ్ళ కృష్ణలు మాకిచిన లాగుతున్నప్పటికి, నిగ్రహాన్ని సూచించే గౌరవప్రదమైన దరిద్రాన్ని. నేనెంతో భక్తితోను, అనందంతోను గమనిస్తున్నాను. లక్షలకొలది ప్రజలను పరిపాలించి నాదేశ ప్రజలు - తమదేశానికి ఏదో తగినంతకంటె ఎక్కువశబ్దు లేకుండా తిరిగి వస్తుండడంచూచి, నేను ఊరట చెందు తున్నాను"

చాయి, "ఈ నల్లవారిని" (లార్డుసాలిస్బరీ, బ్రిటిష్ పార్లమెంటులోని ప్రథమభారతీయ సభ్యుడిలా పిలిచాడు) వారివారి స్థానాలలోనే ఉంచి, "గతరాజ్యం" పై మరణ గీతాలనువ్రాసి నిట్టూర్చే రోజులు పోయ్యాయి. సంస్కరణలు కావాలనే రాజకీయ వాదుల ఆదర్శవాద అభిమానంవల్లనే "భారత రాజ్యం" పోతున్నదని ఈ కన్సర్వేటివ్‌లు భావించవచ్చు. ఏమార్పులేని తూర్పుదేశపు కృతఘ్నభూమిలో పడమటి ప్రజాసంస్థలను అర్థంలేకుండాఏర్పరచాలని సంస్కరణవాదులు ప్రయత్నిస్తున్నారని వాదనవచ్చు. ("విల్లింగ్టను డ్యూక్ ఒకసారిలా అన్నాడనుకుంటాను: "మన మెన్నడైనా భారతదేశాన్ని పోగొట్టుకున్నామంటే అది పార్లమెంటు ద్వారానే ఇనుగుతుంది" — లార్డు క్రామర్ "ప్రాచీన — ఆధునిక సామ్రాజ్యవాదం" పుట 126) కాని, పొందొమ్మిదవ శతాబ్దినాటి పెత్తనాన్ని తిరిగి కేవలం హింసా పూర్వకమైన నిర్బంధ విధానంతో పునర్నిర్మించాలనే సులభమైన పరిష్కార మార్గాన్ని, ఇటీవల బ్రిటిష్ ఫాసిజం మాత్రమే స్పష్టంగా చెప్పింది. (1)

బ్రిటిష్ సామ్రాజ్యవాదంలో ఆరితేరిన రాజ్యాంగవేత్తలు, బలప్రయోగం మాత్రమే చాలదని ఎన్నడో గుర్తించారు. అందుతోపాటు తగినంత రాజకీయపు కొత్తరకం ఎత్తులు కలపాలని వారు గ్రహించారు.

జాతీయ విప్లవానికి వ్యతిరేకంగా ఏర్పరచాలన్న అడియాసతో లిబరల్ యూనియనిస్టూ, రాయబారోద్యోగంలో అనుభవం సంపాదించినవాడూ అయిన లార్డు డఫరిన్ తొలుత కాంగ్రెసుస్థాపనకు ప్రోత్సహించాడు కాని, అతివాది అయిన లార్డు రిప్పన్‌కాదు. స్వయంగా జాతీయోద్యమం వాస్తవస్థితిని పరిశీలించి లిబరల్ పార్టీ ప్రభుత్వమూ, మోర్లీ అనుకున్నంతకంటె ఎక్కువగా 1909 సంస్కరణలను పెట్టినవాడు కన్సర్వేటివ్ లార్డ్ మింటోయేగాని, అతివాది లార్డు మోర్లీకాదు.

రష్యావిప్లవం తర్వాత వచ్చిన విప్లవ వెల్లువను అరికట్టేందుకు ఇదే ఏకైకమార్గమని భావించి, 1917 లో బాధ్యతాయుత ప్రభుత్వం వాగ్దానం చేసే

---

(1) బ్రిటిష్ ఫాసిజం ఒక కార్యక్రమ ప్రకటన "ఫాసిజం - ఇండియా" అనేపేర ప్రకటించింది. వారికి సామాన్య సూత్రాలుకావి, ఇండియాలో త్వరత్వరగా బ్రిటిష్ పాలన అంతమవుతున్నదని వారికి తెలియదు. ఈ రాజకీయ అజ్ఞానం సాటిలేనిది. "ప్రాచ్యదేశీయు" లకు బాగా తెలిసేట్టుగా "బ్రిటిష్ పెత్తనం తొలగిపోవటం ఇంతలోగాని, ఎప్పటికీగాని లేనేలేదు" అని ఫాసిస్టు విధులు ప్రకటించారు; "పత్పరిపాలనకై పెద్ద జమీందారులను బలపరచా"లన్నారు; పరిశ్రమాభివృద్ధిని అటకాయించమన్నారు. ("భారత భవిష్యత్తు కేవలం వ్యావసాయికమైనది"): ఆధునిక విద్యను నిషేధించాలన్నారు; (మొత్తంమీద పశ్చిమవిద్య భారతీయుల కివ్వరాదు.") ఇలా నిర్బంధ విధానంతో 19 శతాబ్ది వ్యవస్థాన్ని పునస్థాపించాలట. "రెండు దేశాలమధ్య సమాన వ్యాపారం పెంచుతాం. బ్రిటన్ నుండి యంత్రవస్తువులు ఇండియానుండిఆహారం, ముడిసరుకులు" (మోస్లీ "ఫాసిజం-పత్రి 1935) "ఫాసిస్టు ప్రభుత్వం క్రింద భారతదేశంలో పెట్టుబడికి మంచి అవకాశాలుంటాయి" బాధ్యత లేకుండా సామ్రాజ్యవాద దుర్వాంఛ లిందులో స్పష్టంగా ప్రకటితమైనాయి.

ప్రకటనను చేసింది. లిబరల్ మాంటేగూ కాదు, మరీ పచ్చి కన్సర్వేటివ్ కర్జన్, ఆస్టిన్ ఛేంబర్లేనూ ఆపని చేశారు. మిల్నర్ కిండర్‌గార్టన్ శిష్యులైన రౌండ్ టేబిల్ సమావేశం పెద్దలే, ఆచరణకు అసాధ్యమైన "ద్వంద్వపాలనను" అతి తెలివిగా సిఫారసుచేసి, ఆచరణలో పెట్టించారు. రెండు లేబరు ప్రభుత్వాలూ కాక, బాల్డ్విన్ కన్సర్వేటివ్ ప్రభుత్వమే 1935 ఇండియా ప్రభుత్వ చట్టాన్ని, ఫెడరల్ రాజ్యాంగాన్ని తయారుచేశారు.

కాబట్టి ఈ ఆధునికయుగంలో వచ్చిన ప్రతి "సంస్కరణ" కన్సర్వేటివ్‌ల ప్రోత్సాహంతో. సలహాతోనే ఇండియాలో అమలు జరిగిందని చెప్పవచ్చును. ఇదంతా ఏదో సంస్కరణలపై ఉన్న మమతవల్లకాదు. స్వతంత్ర పోరాటం మహా ప్రవాహంలా వచ్చిపడుతుంటే గత్యంతరంలేక ఆనకట్ట కట్టాలనే ఉద్దేశమే ఇందుకు కారణం.

1946 లేబర్ ప్రభుత్వపు రాజ్యాంగ సంస్కరణలుకూడ, 1942 లో అమెరీ ఇండియా మంత్రిగా వుండగా, టోరీల పెత్తనంక్రింద ఉన్న మంత్రివర్గం తయారు చేసిన ప్రణాళికనే అనుసరిస్తున్నవి. కాని ఈ వరుసగా వేస్తున్న ఆనకట్టలూ. ఈ మారుతున్న దీర్ఘకాల పరివర్తన దశలూ, తాత్కాలిక పరిష్కారాలు-రాజీలూ వీని మూలంగా బ్రిటిష్ సామ్రాజ్యవాద నాయకులు మూలబలగాన్ని ముందుకు దింపే పెత్తనం తమ చేతిలోనే ఉంచుకునేందుకు ప్రయత్నించారు. భారతదేశంలో ఆర్థికంగా దోపిడి చేయగల పెత్తనాన్ని తమచేతనే ఉంచుకునేందుకే ఈ అనేక ప్రయత్నాలు చేసి తమ విధానాన్ని సమయానుకూలంగా మార్చుకుంటూ వచ్చారు. ఇంతేకాక భారతదేశంలో తమ సైనిక తంత్రానికి కీలక స్థానాల ఏర్పాటులో ఏమీ భంగంరాకుండాచూచుకొంటూ. ప్రజలను తిరుగబడకుండా ఉంచి, బ్రిటిష్‌సామ్రాజ్య వాదంతో సహకారానికి ప్రాతిపదిక నేర్పరిచే కార్యక్రమాన్నిమట్టుకే కొద్దికొద్దిగా భారతీయుల కిస్తూ వచ్చారు.

**కాని వారలా చేయగలరా ?**

సమస్య ఆఖరుపరిష్కారం అయిపోయిందని, భారతదేశంలో సామ్రాజ్యవాద పాలనకాలం ఇప్పటికే గతించిందనికాని భావించడం పెద్దపొరబాటు. పోరాటం లేకనే సామ్రాజ్యవాదం అధికారత్యాగం చేసిందని, ఇండియాలో ఆత్మహత్యచేసుకో దలుచుకున్నదనీ బ్రిటిష్ ప్రభుత్వాన్ని సమర్థించే రాజ్యాంగవేత్తలు చేసే ప్రకటనలవల్ల భావిస్తే అంతకంటే భ్రమ వేరే ఉండదు.

భారతదేశాన్ని తమపెత్తనంక్రింద ఉంచుకోవడం బ్రిటిష్ బూర్జువా వర్గ ప్రయోజనానికి ప్రధానమని చాలకాలంక్రితమే గుర్తించారు. ఇక ఇప్పుడు సామ్రాజ్యవాదం శిధిలదశలో పడింది. ప్రపంచవ్యాపారాన్ని గుత్తగొనే స్థితి కూలిపోయింది. ప్రపంచ మార్కెట్టులో బ్రిటిష్ పరిశ్రమల పెత్తనం దుర్బలమయింది. తెల్ల అధివివేశాల రాజకీయ, ఆర్థికస్వాతంత్ర్యం హెచ్చుతోంది.—ఇలాంటి దశలో భారత

దేశంలో పెత్తనాన్ని రక్షించుకోవడం, మరింత గట్టిపరచుకోవడం బ్రిటిష్ పాలక వర్గానికి అతిప్రధానంగా పరిణమించింది. దాని ప్రాధాన్యత తగ్గలేదు. ఈదశలో అంతటా ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పక్షంగా ఏరాజీకి దిగరాదని దుందుడుకుగా మాట్లాడే చర్చిల్ 1933లో ఈవిషయం ఇలా స్పష్టపరిచాడు.

"బ్రిటన్ సుఖ సౌభాగ్యాలకు భారతదేశం ప్రధానమైనది. మన ప్రజలకు ముఖ్యముగా ఆధారమైనవన్నీ నాశనమవుతుంటే చూచి ఆందోళనచెందకుండా ఉండలేకపోతున్నాను. విదేశాలలో పెట్టుబడి క్రమంగా తగ్గిపోతున్నది. నౌకా వాణిజ్యం తగ్గిపోయింది ఇందుకుతోడు భారతదేశాన్ని ఏదో ఒక విధంగా పోగొట్టుకున్నామంటే మన సమస్య లన్నింటికన్న ప్రమాదకరమైన సమస్యలు మనల నెదుర్కొంటాయి మన ప్రభుత్వం సరిగా పోషించ వీలులేని అధిక జనాభా ఏర్పడుతుంది."

(విన్‌స్టన్ చర్చిల్, ఎప్పింగ్‌లో ఉపన్యాసం, జులై 8, 1933.)

ఇలా భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రయోజనాలను దృఢంగా నిలబెట్టుకోవాలనడం సంస్కరణలు - సౌకర్యాలు ఇస్తూవచ్చిన దశలోకూడ కొనసాగింది. అమృతసర్ (జలియన్‌వాలాబాగ్) కాల్పులనాడు పంజాబు లెఫ్టినెంటు గవర్నరు సర్ మైకేల్‌ఓడ్వయ్యర్ "మన సామ్రాజ్యస్థాయికి ఇండియాలోని మన వారికి' ఇండియాలో పెట్టుబడిపెట్టిన నూరుకోట్ల బ్రిటిష్ పెట్టుబడికి" మనం నెరవేర్చవలసిన కర్తవ్యముందని స్పష్టంగా ప్రకటించాడు. (రచయితల సంఘంలో డయ్యర్ ఉపన్యాసం, లార్డు ఆలివర్, మాంచెస్టర్ గార్డియన్‌లో 1925 మార్చి 12 న ఉదహరించినది) 1930 మే 16 డైలీ మెయిల్‌లో లార్డు రూధర్మేర్ ఇలా అన్నాడు. "బ్రిటిష్ వ్యాపారం, బాంకింగు, షిప్పింగు (నౌకా) మొదలైనవన్నీ ముఖ్యంగా నూటికి 20 పాళ్ళు మనకు భారతదేశంతో ఉన్న సంబంధంపైనే ఆధారపడినవని చాలమంది అభిజ్ఞులు అంచనా వేశారు....బ్రిటిషు సామ్రాజ్యానికి భారతదేశం మూలాధారం. మనం భారతదేశాన్ని పోగొట్టుకుంటే మన సామ్రాజ్యం కూలిపోకతప్పదు - మొదట ఆర్థికంగా తర్వాత రాజకీయంగా కూలిపోతుంది." ఇట్లాంటి నగ్నంగాచేసిన ప్రకటనలగూర్చి ప్రస్తావించడం అనవసరం.

చాణక్యనీతి వెల్లివిరిసే భాషలో, తప్పించుకుంటూ అస్పష్టంగా చేసే వాగ్దానాల్లో, తిట్టుకుంటూ గత్యంతరంలేక ఇచ్చే సౌకర్యాలలో - అన్నిటా కేంద్రంగా ఉన్న ఉద్దేశం భారతదేశంలో బ్రిటిషు పెత్తనాన్ని నిలుపుకోవడమేనని ఈనాటికీ బ్రిటిషు ప్రధాని ప్రకటనలు ప్రతివానిలోనూ మనం పరిశీలించి కనుక్కోవచ్చును. ఇందువల్లనే, 1922 ఆగస్టులో లాయిడ్ జార్జి చేసిన "ఇనుపచట్రం" ఉపన్యాసంలో "బ్రిటన్ ఏ పరిస్థితిలోనూ భారతదేశంలో తన బాధ్యతను వదులుకోదు....బ్రిటిష్ ప్రభుత్వ నాయకత్వాన్ని ఏదశలోనూ ఇండియా వదలివేసుకోలేదు." అన్నమాటల ప్రాధాన్యత కనిపిస్తుంది. 1929 బర్కెన్‌హెడ్ "భారతదేశం అధినివేశహోదాను

ఏరోజుకు చెందగలదని మనం భావిస్తున్నామో ఇంచుమించుగా ఏ తెలివిగలవాడూ నిర్ణయించలేడు."అని హెచ్చరికనివ్వడంకూడ ఇందువల్లనే గమనించవలసివస్తున్నది. ఇలాగే "భారత జీవితం. అభివృద్ధులపై వాస్తవమైన పెత్తనాన్ని ఏవిధంగాను వదిలివేసే ఉద్దేశం బ్రిటిష్‌జాతికి లేదు."అని చర్చిల్ 1930 లో చేసిన హెచ్చరికా ఇందువల్లనే ప్రధానమైనది. 1935 చట్టం ఆంతర్యాన్ని వివరిస్తూ అధికారరీత్యా బాల్డ్విన్ ఇలా అన్నాడు: "బ్రిటన్‌నూ ఇండియానూ" సన్నిహిత పరిచే సంబంధాలను సడలింపజేయాలనే ఉద్దేశం మాకేమాత్రమూలేదు.అంతేకాక,ఇంతకు ముందెన్నడూ లేనంత సన్నిహిత సంబంధం ఏర్పరచాలనే మా అభిలాష. "ఈ మాటలు కూడా పైకారణంవల్లనే మనం గమనించివలసివస్తున్నది."

మరీ ఇటీవల భాష మారింది, అస్పష్టంగా అధినివేశ హోదా అనే లక్ష్యం వేపు ఒక్కొక్క అడుగే ముందుకు పోవాలని అధికార ప్రకటనల్లో ఇప్పుడు కన్పించడంలేదు ఇంతేకాక పైగా భారతదేశంలో బ్రిటన్ అధికార త్యాగం పూర్తి చెందిందని, భారతదేశానికి సంపూర్ణ స్వతంత్రం, ఇచ్చివేయబడుతుందని అంటున్నారు. అయినప్పటికి 1946 రాజ్యాంగ ప్రతిపాదనలను గత అధ్యాయంలో మనం పరిశీలించినదాన్ని బట్టే, ఇవి భారతదేశ స్వతంత్రానికి సమానమైన ప్రతిపాదనలుగా భావించ వీలులేదని మనం తెలుసుకున్నాము.

వాస్తవ స్థితిలో సామ్రాజ్యవాద దోపిడీ పోలేదు, మరి "స్వతంత్రం" "సామ్రాజ్యవాద సమాప్తి" గూర్చి విపరీతంగా మాట్లాడుతున్నారు. ఇలా సామ్రాజ్య విధానంలోను, ప్రచారంలోను వచ్చిన ఈ కొత్త మార్పును మనమేవిధంగా అర్థం చేసుకోవాలి? ఈ ప్రశ్నకు సమాధానమివ్వడానికి, ఆధునిక సామ్రాజ్యవాద అభివృద్ధిని విశాలంగాను, భారతదేశంలో మన దృష్టిని మరింత సునిశితంగాను చేసి పరిశీలింతాము. ఇటీవల సామ్రాజ్యవిధానం ఒక నూతనమైన ఎత్తుగడను తయారుచేసి, రాను రాను అధికంగా ఉపయోగిస్తూ వస్తున్నది. ఈ ఎత్తుగడను "నామమాత్ర స్వతంత్రపు" ఎత్తుగడ అని అనవచ్చు. ఇందలి ప్రధాన సూత్రమేమో నూతనమైంది కాదు; కాని దానిని ఆధునిక యుగంలో బాగా పదునుబెట్టి మరింత విశాలం చేశారు. దీనిని జాతీయ స్వతంత్రోద్యమాన్ని ఎదుర్కొనేందుకొక పద్ధతిగా ఉపయోగిస్తున్నారు.

దీనిని ఈజిప్టులో 1922 లో సమగ్రంగా అమలుజరిపారు. 1922 ఫిబ్రవరి 28 వ తేదీ బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటనద్వారా ఈజిప్టును స్వతంత్రంగా ప్రకటించారన్న సంగతి జ్ఞాపకం చేసుకోవాలి. కాని ఆ ప్రకటనలోనే కొన్ని అంశాలనుగూర్చి బ్రిటన్, ఈజిప్టు ప్రభుత్వాల మధ్య ఒక ఒడంబడిక కుదిరేవరకు ఆ అంశాలు బ్రిటిష్‌ప్రభుత్వం ప్రత్యేక విచక్షణక్రిందనే ఉండాలన్నారు. ఈ ప్రత్యేక అంశాలివి:

1. ఈజిప్టులోని సామ్రాజ్య రహదారుల రక్షణ,
2. ఈజిప్టు రక్షణ;

3. ఈజిప్టులోని మైనారిటీల. విదేశ పెట్టుబడుల రక్షణ,
4. సుడాన్;
5. ఈజిప్టు విదేశాల సంబంధం.

ఈ షరతులను ఈజిప్టు జాతీయోద్యమం నిరాకరించింది అయినప్పటికి ఈజిప్టును స్వతంత్రంగా ప్రకటించారు. ఫౌద్‌ను రాజుగా గద్దె నెక్కించారు. తగిన ప్రధానిని లాక్కొచ్చారు. 1923 ఆగస్టు వరకు ఈజిప్టులో బ్రిటిష్ మిలిటరీ రాజ్యం (మార్షల్‌లా) అమలు జరుపబడింది. ఈ విధంగా ఈజిప్టు "స్వతంత్రం" అయింది.

ఇరవైనాలుగేళ్ళు గడిచింతర్వాత 1946 లో కూడ, బ్రిటిష్ సేనల ఉపసంహారాన్నిగూర్చి బ్రిటిష్ ప్రభుత్వానికీ ఈజిప్టు ప్రభుత్వానికీ ఇంకా రాయబారాలు సాగుతూనే ఉన్నవి. అప్పటినుండి ఈ నూతన సామ్రాజ్యవాదపు ఎత్తుగడను మరింత సునిశితంచేసి, ఇరాక్‌లోను ఇతరచోట్ల అమలుజరిపారు.

ఇలా ఈ ఎత్తుగడ అప్పుడే బాగా పరిశీలించబడి, పరీక్షల్లో నెగ్గి భారతదేశంలో ఉపయోగించడానికి సిద్ధంగావుంది. ఈ నామమాత్రపు "స్వతంత్రం". భారతదేశం కోరుతున్న స్వతంత్రానికి సరిపోలదనేది స్పష్టంగానే కవిపిస్తున్నది. సామ్రాజ్యవాదం తన గుప్పిటనింకా వదలలేదు; అంతిమ పోరాటం ఇంకా ముందే ఉన్నది.

కాని, సామ్రాజ్యవాద పాలకులు తమ అధికారాన్ని నిల్పుకోగలరా ? అది వేరే ప్రశ్న, భారతదేశంలో నేడు మహా ప్రవాహంతో ముందుకు వెడుతున్న విప్లవ శక్తులను వారు ఆపగలరా ? భారత స్వతంత్రోద్యమాన్ని అదుపులో వుంచుకోగల్గి, సామ్రాజ్యవాద పీడనకు అనుకూలంగా ఆ ఉద్యమాన్ని వడిపేందుకు వీలైన నూతన పద్ధతులను, సాంఘిక పునాదిని వారు సంపాదించుకోగలరా ? ఈ ప్రశ్నకువచ్చే సమాధానంపైనే ప్రధానంగా భారతదేశంలో సామ్రాజ్యవాద భవిష్యత్తు ఆధారపడి వుంటుంది — అంతేకాని తళతళ మెరిసిపోతున్న రాజ్యాంగ సంస్కరణల రంగంపై ఆధారపడదు. ఈ సంస్కరణలు సామ్రాజ్యవాదుల క్లిష్టమైన ఎత్తుగడను, మారుతున్న సంబంధాలను మాత్రమే తెలియ బరుస్తాయి.

నిజానికి పాత భారతదేశం మాయమైపోయింది. అదింక తిరిగిరాదు. గతించిన నూటయాభై యేళ్ళలోను పెట్టుబడిదారీ విధానం ప్రవాహంలా చొచ్చుకొని పోవడంతో విధ్వంసమైన ప్రాచీన సాంఘిక వ్యవస్థ: పునాదులతో బయలుపడి పురోగమిస్తున్న విప్లవశక్తులతో ఒక సంచలనం బయలుదేరింది, అదింక ఆగదు. పాతపునాదులు కూలిపోవడంతో మెల్లమెల్లగానే అయినా తప్పకుండా పాతదృక్పథాలు, నమ్మకాలు, సాంఘిక అభివృద్ధి నిరోధకభావాలూ, పాతమతాలూ ఆటంకాలూ కరిగిపోతూ, మాయమవుతూవస్తున్నవి.

జంషెడ్‌పూర్ ఇనపకార్ఖానాలోను, బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజిలోను కులానికి ఏమి అవకాశంవుంది. ఇప్పుడు మూదోవంతునుండి సగంవరకు గ్రామ జనాభాలో రైతులు తమ భూములు దోపిడీ అయిపోగా గ్రామ కార్మికసంఘం పెరిగిపోతున్నది. ఇలాంటి స్థితిలో సమిష్టి కుటుంబం ఏమిపాత్ర నిర్వహించ గలదు ? బూర్జువా ఆస్తి సంబంధాల అగ్నిద్రావకం, సాంప్రదాయాలు, తాహతులమీద ఏర్పడిన సాంఘిక సంస్థల ఎముకలను తినివేస్తున్నది. బ్రిటన్, జపానుల చౌక యంత్రవస్తువులు లక్షలాది చేతిపనివారిని కడుపుకాల్చి క్రమంగా రూపుమాపు తున్నవి.

భారతదేశం ఇప్పటికీ కాలదోషం పట్టినసంస్థలతో నిండిఉంది. మధ్యయుగపు భూస్వామ్య విధానం శిధిలాలింకా ఉన్నవి - చిని కిపోయిన సంస్థానాధిపతులూ. వెట్టిచాకిరీ, బానిసరైతులు, మోటారు కారుల, పెలిగ్రాముల, రేడియోల మధ్య లోనే ఇంకా నిలిచిఉన్నవి. ఆధునికమైన కార్మికుల చట్టుగుడిసెలప్రక్కనే ప్రాచీన దేవాలయాలు, పూజాగృహాలు ఉన్నవి. పునాదిపోయి పాత పైకట్టడపు భూతమింకా వ్రేలాడుతూఉన్నది. ఎదీ తేలనీకుండా, అభివృద్ధి కానీకుండా ఆ గత, వర్తమాన సమాజ స్వరూపాన్నింకా సామ్రాజ్యవాదభూతం కలిపి పట్టుకొని, తనదోపిడీ విధానాన్ని రుద్దేందుకు, లోనుండి సామ్రాజ్యశక్తులు ప్రభవిల్లి మార్పుచేయ నీకుండా అణిచిపెట్టేందుకు చూస్తున్నది.

కాని ఇరవయ్యోశతాబ్ది జారుక్రింద రష్యాలోలాగా, ఇప్పుడు కేవలం పైచిప్ప మాత్రమే మిగిలిఉంది. తగిలితే పగిలిపోవడానికి సిద్ధంగా ఉంది. సామ్రాజ్యవాద వినాశదశలోని పాశ్చాత్యభావవాదులు, నూతన సభ్యతా పురో గతిలో తమకు కలిగిన ఆ వేదనలకు పవిత్ర రష్యా అనే పాడుభావంలో ఓదార్పు సంపాదించుకోవాలని చూచారు. ఆ పవిత్ర రష్యాలో భావమాత్రమైన విధేయభక్త రైతులతో శాశ్వత ఆధ్యాత్మికశక్తుల దేవాలయాలను ఊహించుకొని సంతృప్తిపడ జూచారు. ప్రజాతంత్ర సోషలిస్టు ఆధునికభావాలెన్నటికీ వారి దరిదాపులకు వెళ్ళవు. వారు శవానికి పూజచేస్తూ, తమచుట్టూ కమ్ముకున్న ఊబిని త్రోసిపారవేయ సిద్దంగా ఉన్న వాస్తవిక ప్రజల చైతన్యం, జీవనశక్తి మహత్యం ఆ భావవాదులు చూడ లేరు. ఇలాగే, భారతదేశంలో అనాది ప్రాచ్యదేశాన్ని చూడాలని - ప్రాచ్య ఆధ్యా త్మికభావోన్నతి మురికినీటిలో దప్పితీర్చుకోవాలనో, లేక "భారతమాత" అజ్ఞా నాన్ని పాపమంటున్నట్టే అసహ్యించుకుంటూ బయలుపరచాలనో వెళ్ళే పాశ్చాత్య యాత్రికుడు నేడు కేవలం మధ్యయుగపు పనిముట్ల ప్రదర్శనశాలలోకి మాత్రమే వెడుతున్నాడు. అతను భారత ప్రజల చైతన్యశక్తిని గమనించలేకపోతున్నాడు.

భారత ప్రజాశక్తులు కులానికి, అవిద్యకు, హరిజనుల నీచస్థితికి, మతవిభే ధాలకు, స్త్రీల దాస్యానికి, ప్రజలను అణచిపెట్టే ప్రతి ఆటంకానికి వ్యతిరేకించి నేడు పోరాటం సాగిస్తున్నవి. ఒకవేపు ప్రాచీన హిందూనాగరికతనుగూర్చి, మారని దాని లక్షణాలగూర్చి పండితోపన్యాసాలు జరుగుతున్నవి. మరొకవేపు

భారత ప్రజల అధికసంఖ్యాకబలంతో, భారత జాతీయోద్యమంలో ప్రధాన సంస్థ అయిన కాంగ్రెసు తన పతాకపై, సమగ్ర ప్రజాతంత్ర కార్యక్రమాన్ని వ్రాసుకున్నది - ఇందులో ఉన్నవి, కుల - మత జాతివివక్షతలేని సర్వజనీన సమాన హక్కులు, ప్రత్యేక హక్కుల, సౌకర్యాల రద్దు ; వయోజనవోటింగు; సంపూర్ణ ప్రాథమిక ఉచితవిద్య; మతవిషయంలో ప్రభుత్వ తటస్థత; వాక్సభా పత్రికా, సంఘ, భారత స్వాతంత్ర్యం-ఇవన్నీ సగం ప్రజాస్వామికమైన బ్రిటన్ కన్నా ఎంతో సమగ్రమైన ప్రజాతంత్ర కార్యక్రమాన్ని సూచిస్తున్నవి.

1930 ఆఖరు భాగంలో మితవాద పత్రిక మాంచెస్టర్ గార్డియన్‌లో "ఇండియాలో సంచలనం" అనే వ్యాసం పడింది. అందులో "పాత రాజకీయ జాతీయ వాదులు కలలో కూడా అనుకోని అతి ముఖ్యమైన విప్లవ ప్రారంభ సూచనలను" గుర్తించక తప్పలేదు.

"శాంతి సంధి పత్రం సంతకాలు ముగిసి పద్దెనిమిదేండ్లయింది. ఇప్పుడు ప్రపంచ శక్తులతో మారకుండా పాతకాలంలోలా ఒకేవిధంగా ఇండియా ఉంటుందని భావించలేము. ఆ స్థితింక రాదు. పాతకాలపు దుష్ట శక్తులను బ్రిటిష్ ప్రభుత్వపు కన్సర్వేటివ్ భావాలు ఆమోదించాయి. హేతువాదం, బలం, ధైర్యం ఇవేవీ బలపరచని పాతకాలపు ప్రత్యేక హక్కులన్నీ ప్రజాతంత్ర భావాలతోను, వోట్లకై పోరాడే పార్టీలతోను, వోటింగు హక్కు విశాలం కావాలని కోరే ప్రజాబలంతోను తుడిచిపెట్టుకొని పోగలవు. కుల హక్కులుండాలనేవారిప్పుడే వెనక్కు పరుగెత్తుతున్నారు. ఈ తిరోగమనం అసలు వినాశనానికే దారితీస్తున్నట్టు కనిపిస్తున్నది. .... అస్పృశ్యత వినాశమైపోతే కులభేదాలుండగలవా?.... హిందూ మత ప్రాబల్యం శాసనసభల్లోను దేవాలయాల్లోను కాక, ఇళ్ళలోనే ఉందనేందులో సందేహంలేదు. అయినప్పటికీ, ఇళ్ళలోనే ఆధునిక భావాలు, స్త్రీ విద్య ద్వారా పనిచేస్తున్నవి. స్త్రీ విద్య మూలంగాను, ప్రయాణ సౌకర్యాలు, ఇతర ప్రపంచంతో సంబంధంమూలంగాను కులభేదాలకు మూలమైన హిందూ సమిష్టి కుటుంబం శిథిలమయి పోతున్నది.

(మాంచెస్టర్ గార్డియన్ వీక్లీ, 4-12-1936)

ఇలాగా రాజకీయ రంగంలోనే కాక, సామాజిక రంగంలో కూడ ప్రజాతంత్ర వాహిని పారుతున్నది. అది "సమగ్ర సాంఘిక-ఆర్థిక విప్లవ" తీవ్రశక్తులు ప్రధాన సమస్య అయిన "భారతదేశ దరిద్రాన్ని" పరిష్కరించేందుకు సంఘటితమవుతున్నవని అదే వ్యాసమే ఒప్పుకోక తప్పలేదు.

"భారతదేశ దరిద్రంపై దృష్టి కేంద్రీకరింపబడుతుంది. భారత జనాభాతో ఆ దేశపు ఉత్పత్తిశక్తిని పోల్చి చూసేవారు ఈ రోగం బాగు పరచ వీలులేదని ప్రకటించాలనుకుంటారు, కాని కమ్యూనిజం సిద్ధాంతులు

భాగ్యవంతుల నిరాశావాదాలకు లొంగరు. అసాధ్య విషయాలలో ప్రయత్నించే ధైర్యం వారికుంది. వారి తీవ్ర పద్ధతులను భారత దేశంలోని బాధిత ప్రజలు నిందించరు. కాబట్టి నూతన భారతదేశ అధికారులు. ఈ సమగ్ర సాంఘిక ఆర్థిక విప్లవాన్ని నడుపుతారో, ఆటంకపరుస్తారో మనం చూడవలసి ఉన్నది."

ఈ శక్తులన్నింటిని సామ్రాజ్యవాదం తన కోరలలో నిలుపుకోగలదా ? తన దోపిడీ పద్ధతిని భారత ప్రజల దోపిడీ పద్ధతి కంతటికి మూలకారణమైన పద్ధతిని చెక్కుచెదరకుండా ఉంచుకునే రీతిగా ఆ శక్తులను నడపగలుగుతుందా ? మితవాద సామ్రాజ్యవాదుల ఆశల ఊహా సౌధాలలోగాని, రాజ్యాంగ సిద్ధాంతాల స్తన శల్య పరీక్షలోగాని ఈ ప్రశ్నకు సమాధానం చిక్కదు. మరి సామ్రాజ్యవాదపు ఆర్థిక పునాదులు, అందులో భారతప్రజల ఆర్థిక, సాంఘిక అవసరాలకున్న వైరుధ్యం అనే యథార్థాంశాలలోనే పై ప్రశ్నకు సమాధానం చిక్కుతుంది.

భారతప్రజలు నేడుమహత్కర్తవ్యతాబాధ్యత నెదుర్కొవలసి ఉన్నది. భారతదేశం వ్యాధిగ్రస్తమైనదేశం. వెనుకబడి ఉన్నదేశం. అభివృద్ధి కుంటువడిన దేశం. ప్రపంచంలో ఏదేశంలో లేనంతగా-వ్యాధులతో-దరిద్రంతో - పరాన్న భుక్కులతో - వ్యర్థశక్తులతో నిండివున్న దేశం. ఏ రాజకీయ సాంఘిక అభిప్రాయాలు కలవాడైనా ప్రతి ప్రేక్షకునికీ అనంత సహజసంపత్తీ, భారతదేశానికున్న అభ్యుదయావకాశాలో-ఆ దేశంలోనేఉన్న బాధలు, దరిద్రం - వీని పరస్పర విరుద్ధత వీని కున్న తీవ్ర విభేదం అతిస్పష్టంగా కనిపిస్తుంది. ఒక శతాబ్ది అభివృద్ధికి ఎడతెగని బాధ్యత వహించిన ప్రభుత్వ చర్యలపై. ప్రజలస్థితి ఇంకే దేశంలోనూ ఇంత స్పష్టంగా తీర్పుచెప్పడంలేదు. ప్రధాన భారత సమస్య ఆర్థికమూ - సాంఘికమూ; దేశస్వాతంత్ర్యానికి, ప్రజాతంత్రానికోసం జరిగే పోరాటం అనే రాజకీయ సమస్య. ఈపెద్దసమస్యకుబాహ్యప్రకటనం మాత్రమే.పోరాటంలో ఇది ప్రథమదశమాత్రమే. రైతు సంక్షోభం ఏటేటా భయంకర రూపంతో ఎక్కువవుతున్నది. ఇందుకు ఏ దృక్పథంగలవారి అభిప్రాయం తీసుకున్నప్పటికి, ఒక్క తీవ్రరూపమైన వ్యవసాయ విప్లవంతో తప్ప ఈ సమస్యకు పరిష్కారం దొరకదు. కాని, పరిశ్రమాభివృద్ధిని వదిలిపెట్టి, ప్రత్యేకంగా ఈ వ్యవసాయసమస్యను పరిష్కరించ వీలులేదు. బ్రహ్మాండమైన పరిశ్రమాభివృద్ధి కార్యక్రమాన్ని అవలంబించవలసిన అవసరాన్ని అందరూ గుర్తించారు - దేశంలోని వ్యర్థమయిపోతున్న సహజసంపత్తిని ఉపయోగించుకొనాలి; విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి నూతన ఆధారాలను కల్పించాలి. జాతీయాభ్యున్నతి కోసం మూలపరిశ్రమలను సృష్టించాలి; శాస్త్రీయాభివృద్ధి చెందిన దేశాలతో సరిసమానంగా ఉత్పత్తిస్థాయిని కొనిరావాలి - ఈ అవసరాన్ని బాగా గుర్తించడం జరిగింది. ఇక విద్య. ఆరోగ్యం, పరిశుభ్రత మొదలైన సాంఘిక సాంస్కృతిక కర్తవ్యాలు, ప్రజల కనిష్టావసరాల కల్పనం ఇవి అనంతంగా ఉన్నవి. భారత ప్రజముందున్న సమస్య ఇది ; అందరి దృష్టిని ఆకర్షించిన బ్రహ్మాండమైన

పునర్నిర్మాణ కార్యక్రమాన్నెవరు నడుపుతారు? ఆ కార్యంనెరవేరేందుకు అవసరమైన శక్తులేవి? ఇది ఏ పద్ధతులలో. ఏ రూపంలో నడపబడాలి?

భారతదేశంలో తప్పవిసరిగా వచ్చేమార్పులను తప్పించివేయాలని సామ్రాజ్యతత్వం ఇంకా ఆశిస్తూ, అందుకు ఎత్తులు వేస్తున్నది: ఒకవేపు సౌకర్యాలిస్తూ, మరొకవేపు పెత్తనం తనచేతులలోనే ఉంచుకొని, జరగవలసిన మార్పులను నిజమైన స్వంతంత్రభారతం ఏర్పడకుండా ఉండేరీతిగా కదిలించాలని సామ్రాజ్యతత్వం చూస్తున్నది బ్రిటిష్ పెట్టుబడిదారీవర్గం యధాప్రకారం దోపిడీ చేసేందుకు అనువుగా, భారతదేశంలో గుత్తపెత్తనంలోని ముఖ్యలక్షణాల నలాగే ఉంచుకోవాలని చూస్తున్నది.

కాబట్టి ఈ ఆధునికయుగంలో అతి ప్రధానంగా ప్రచారం చేసిన రాజ్యాంగ సంస్కరణలతోపాటు, ఈ రంగమంతటికీ సంబంధించిన రక్షణశ్రేణి నిర్మాణాన్ని అనేక ప్రత్యేక మిలిటరీ కమిషన్లద్వారా, చట్టాలద్వారా ఏర్పరచడం జరుగుతున్నది. 1916—18 లో భారత పరిశ్రమల కమిషన్, 1922-23 లో భారత ద్రవ్యకమిషన్ 1925—26 లో భారత ద్రవ్యం, నాణ్యాల రాయల్ కమిషన్, 1926—28 లో భారత వ్యవసాయంపై రాయల్ కమిషన్, 1929—31 లో భారత కార్మికులపై రాయల్ కమిషన్.

1935 నాటికి బ్రిటిషు బ్యాంకు పెట్టుబడిదారుల పెత్తనానికి కోటలాగా ఇండియా రిజర్వుబ్యాంకును ఏర్పరిచారు. భారతీయుల "రాజకీయ ఒత్తిడిని" తప్పించుకునేందుకు ఇంగ్లాండు బ్యాంకులాగా వ్యక్తిగత వాటాదార్ల ప్రాతిపదికపై దీని నేర్పరచారు: దీనికి సంపూర్ణ అధికారి బ్రిటిషు వైస్రాయి - అతనే బ్యాంకు గవర్నర్‌నూ, సహాయ గవర్నరునూ-నియమిస్తాడు. వీరు బోర్డు నిర్ణయాలను త్రోసిపుచ్చవచ్చును. ఇండియా ప్రభుత్వచట్టం (1935) లో 152 సెక్షన్‌ద్వారా ప్రత్యేకించి ఈ బ్యాంకు అధికారాన్ని వైస్రాయి "వ్యక్తిగత విచక్షణ"కు "నిర్ణయానికి వదిలివేశారు. ఇలాగా ఆధునిక పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థకు మూలమైన అధికారం, ద్రవ్యశక్తి, కరెన్సీ అప్పుల పెత్తనం ఇవన్నీ ప్రత్యేకం బ్రిటిషు బ్యాంకు పెట్టుబడిదారుల పెత్తనంక్రిందే ఉండేట్టు ఏర్పరచారు.

భారతదేశంలో ఈ బ్రిటిషు బ్యాంకుల ఉరిత్రాడు భవిష్యత్తేమిటి? "అధికారం అప్పగించిన వెంటనే ఏర్పడే కొన్ని సమస్య"లలో ప్రధానమైన భాగాలలో నివే ఈ సామ్రాజ్యవాద ఆర్థిక అధికారసమస్యలు - వీనిని బ్రిటిషు ఇండియన్ సంధిలో రాయబారాలతో చేరుస్తారు. భారత ప్రజలకు సర్వస్వతంత్రాన్నివ్వడానికి ముఖ్యమైన రెండు షరతులలో ఈ సంధిని అంగీకరించడం ఒకటని. మే 25, 1946 నాటి బ్రిటిషు రాయబార మంత్రుల ప్రణాళిక స్పష్టపరిచింది.

ఇందుతోపాటు బ్రిటిష్ పెట్టుబడిదారులిటీవల తీసుకుంటున్న చర్యలను మనం గమనించాలి. పెద్దగుత్త వ్యాపారసంస్థలైన ఇంపీరియల్ కెమికల్ ఇండ

స్ట్రీస్, నఫీల్డ్సు వగైరాకంపెనీలు నూతనశకానికి పునాదిగా, భారతదేశంలో తమకు కేంద్రాలను నిర్మించుకునేందుకు తగిన ఏర్పాట్లు చేసుకుంటున్నారు.

ఈవిషయంలో వారుపొందినవిజయాన్ని తక్కువగా అంచనా వేయడం పొరబాటు. రాజ్యాంగ సంస్కరణల మిరుమిట్లు గొలిపే తళతళలకు గుడ్డికావడం గాని, అధికారార్పణగూర్చి అరచే అరపులలో బోల్తాపడడంగాని, తమ భారత దేశంలో పెత్తనంపోయిందని లంకాషైర్ వర్తకులు ఏడ్చే బొల్లిఏడ్పులతో చెవులు దిమ్మిరెత్తించుకోవడంగాని బ్రహ్మాండమైన రాజకీయ తప్పిందం కాగలదు - వీట న్నిటినిచూచి - ఆధునికయుగంలో తమపెత్తనాన్ని మరింత గట్టిపరచు కోవడం కోసం బ్రిటిష్ బాంకు పెట్టుబడిదారీవర్గం అవలంబిస్తున్న సున్నితమైన మార్గాలను గుర్తించకపోవడంకంటె ఘోరమైన సంగతి మరొకటేదీ ఉండదు ఈ కార్య క్రమానికి తగిన సాక్ష్యాన్ని మనం ఆరో అధ్యాయంలో పరిశీలించాము. బ్రిటిష్ గుత్త వ్యాపారసంస్థలు ఇండియాలో భారత పారిశ్రామిక సంస్థలపేర ఊరేగు తున్నవి. ఈ నూతన సామ్రాజ్యవాద దురాక్రమణ ఇటీవల కొన్ని సంవత్సరాల నుండి జరుగుతున్నది దీనినిగురించి యుద్ధ ప్రారంభసమయంలో1939 లో సీనియర్ ట్రేడ్‌కమిషనర్ నివేదిక ఇలా వ్రాసింది. అందులో ఆ కమిషనర్ ఇలా వ్రాశాడు:

> "కొన్ని ముఖ్య విషయాలలో - ముఖ్యంగా సిగరెట్, అగ్గిపెట్టెలు, రబ్బర్ టైర్లు, సబ్బులు, రంగులు, కొన్ని రసాయన పదార్థాలు వగైరా ఉత్పత్తిలో ఈ పరిశ్రమలన్నీ బ్రిటన్ ఇతరచోట్లలోని ప్రధాన కర్మాగారాల శాఖలే. ఆ (విదేశ) సంస్థలు, భారతదేశపు సుంకాల గోడకు లోపలనే ఏర్పరచిన కంపెనీలద్వారా వ్యాపారం జరపడం తమకే మేలని గుర్తిం చాయి. అంతేకాక ప్రభుత్వానికి అవసరమైన వస్తువులను అమ్మేప్పుడు తమ వస్తువులు భారతదేశంలో తయారయినవని చెప్పడానికూడ ఇందు వల్ల అవకాశం ఏర్పడుతుందని ఆ బ్రిటిష్ సంస్థలు భావించాయి."
>
> (సర్ థామస్ లెన్‌స్కాఫ్, ఇండియాలో బ్రిటిష్ వ్యాపార పరిస్థితి, అవ కాశాలపై నివేదికకు ఉపోద్ఘాతం, 1939.)

ఈ విధంగా, భారత పరిశ్రమల రక్షణను ప్రభుత్వం భగ్నంచేస్తున్నదని, భారత పరిశ్రమలనే పేరుతో ఏర్పడిన బ్రిటిష్ పెట్టుబడి సంస్థలకే బాంకులు పక్షపాతం చూపుతున్నవని, ఇలాచేసి భారత పెట్టుబడిదారులకు ఇచ్చినామనిచెప్పే సుంకాల సౌకర్యాలను బ్రిటిష్ ధనిక తత్వాన్ని పెంచుకొనేందుకు ఉపయోగిస్తున్నారని భారత జాతీయవాదులు తీవ్రంగా ఫిర్యాదుచేశారు.

> "భారతీయుల పెత్తనం క్రింద, వారి యాజమాన్యము క్రింద, వారి తోనే నడపబడే పరిశ్రమల అభివృద్ధికని రక్షణలను ఏర్పరచారు. ఈ రక్ష ణల ఆశయం ఇండియాలోని విదేశ వ్యాపారాలతో భగ్నమవుతున్నది. ఇలా భారత భూమిలో దురాక్రణ చేస్తున్న విదేశ పెట్టుబడి పద్ధతి చాల

మున్నితమైనది. చాల చిక్కైనది.... ఇవేవో భారతీయమవి కేవలం పై పూతతో చూపుతున్నారు. ఎందుకంటే నిజానికి ఈ పరిశ్రమల పెత్తనం, యాజమాన్యం పూర్తిగా విదేశీయుల చేతిలోనే ఉంది. కేవలం తమ సహాయార్థం వీరు, కీలుబొమ్మ ఇండియన్ డైరెక్టర్లను పెట్టుకుంటున్నారు.

"ఇందువల్ల వచ్చే ప్రమాదం ఒక్క ఆర్థికమైనది మాత్రమే కాదు. ఎందుకంటే ఇలాంటి బ్రిటిష్ పెట్టుబడిదారీ ప్రయోజనాలు తమ రాజ్యాంగ రక్షణలను శాశ్వతంగా ఉంచుకుంటాయి. అందువల్ల భారత శాసనసభాధికారాలు, హక్కులు చాల పరిమితమవుతాయి ప్రధాన పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడానికిది పెద్ద ఆటంకం అవుతుంది. ఇలాంటి పరిశ్రమలలో ఇండో - బ్రిటిష్ సహకారం అనబడే ఈ సంస్థల బలమంతా. ఆఖరుకు రాజకీయంగా అభివృద్ధినిరోధక పక్షానికే బలం చేకూరుస్తుంది. అందువల్ల ఆర్థిక స్వరాజ్యం అనే ఆశయం భగ్నమైపోతుంది"

("నూతన ప్రమాదం" అమృతబజార్ పత్రికలో వ్యాసం (కలకత్తా) 1937 నవంబర్ 11)

1940 రాజ్యాంగ ప్రతిపాదనలతో ఏర్పడే దశలో బ్రిటిష్ పెట్టుబడిదారుల ఆర్థికాశలు ఫైనాన్షియల్ టైమ్సు పత్రికలో ప్రతిబించాయి.

"ఆర్థికంగా భారతదేశమును బ్రిటన్ విడువలేదు — బ్రిటన్ భారత వ్యాపారాన్ని వదులుకోలేదు. భారత అభివృద్ధి సౌభాగ్యంలో బ్రిటన్‌కింకా కావలసినంత పెట్టుబడి ఉన్నది. భారతదేశానికి బ్రిటన్ అనుభవమూ, యంత్రాలుఅవసరం. స్టెర్లింగునిల్వలు బ్రిటన్ ఆర్థికభవిష్యత్తుతో సన్నిహిత సంబంధంకలవిగా ఉన్నవి....బ్రిటన్ భారతదేశమును విడిచిపెట్టవలసివస్తే, తన సద్భావమంతటిని విడిచిపెట్టాలి బ్రిటిష్ ప్రయోజనాలను సరిగా చూస్తారనేందుకు ప్రధాన రక్షణ ఏమిటి? ఇది కేవలం జూదమా? ఈ ప్రణాళికంతా జూదంలో పందెం వేసినట్టే ఉంది. కాని యీ నిర్ణయం జరిగిపోయింది. ఇందువల్ల సామ్రాజ్యవాద ప్రయోజనాలకు నష్టం ఏర్పడవచ్చు-అలాగే బలంకూడా కలగవచ్చు. ఈ దశలో ఎవరూ ఏమీ చెప్పలేరు"

(ఫైనాన్షియల్ టైమ్సు, మే 18, 1940)

ఈ నూతనశకంలో, తన ప్రత్యేకస్థానాన్ని నిల్పుకునేందుకు అనుకూలంగా ఆర్థికరంగంలో కూడ రాజకీయరంగంలోలాగే నేడు సామ్రాజ్యవాదం తన ఎత్తులను వేస్తున్నది. ఇలాచేసి భారత జాతీయపతాక పైనెగురుతున్నప్పటికీ లోని నిజమయిన సరుకు, ఆర్థికాధికారం, లాభాల దోపిడీలో సారం అంతా సాధ్యమయినంతవరకు బ్రిటిష్ పెట్టుబడిదారుల చేతిలో ఉండేందుకు చూస్తున్నారు.

ఈ ప్రమాదం ఉన్నందువల్లనే, జాతీయోద్యమ లక్ష్యం సంపూర్ణ స్వతంత్రంకోసం పోరాటమేనని, దానిని మరింత అవసరమైనదిగా చేస్తున్నది. అలాంటి స్వతంత్రాశయం సమగ్రంగానెరవేరాలంటే సంపూర్ణ

ఆర్థిక రాజకీయ స్వతంత్రం ఏర్పడాలి: విదేశపెట్టుబడికున్న అన్ని సౌక ర్యాలూ తొలగించివెయ్యాలి: విదేశీయుల వ్యాపారం, తేయాకు కాఫీ తోటలు, ఫ్యాక్టరీలు, రైల్వేలు, నౌకా, రవాణావగైరాలన్నీ భారతదేశం స్వాధీనఃపరుచుకోవాలి.

ఆధునికయుగంలో సామ్రాజ్యవాదుల తెలివైన ఎత్తులు ఎలా ఉన్నప్పటికీ, నూతనశకంలో బ్రిటిష్ పెత్తనాన్ని, గుత్తవ్యాపారాన్ని నిలుపుకోవాలనే స్వప్నాలు యథార్థంకావడం కష్టం. బ్రిటిష్ పరిపాలకులు, తమ చెప్పుచేతల్లో భారతదేశ నూతనశక్తుల నంతసులభంగా పెట్టుకోవడం సాధ్యంకాదు. నేటి భారతదేశంలో అత్యవసర పరిష్కారానికై ఎదురుచూస్తూన్న ఆర్థిక సమస్యలు, సామ్రాజ్యవాద పరిహద్దులలో పరిష్కారం కావు. ఆధునికయుగంలో సామ్రాజ్యవాదం పెత్తనం కింద జరిగిన ఆర్థికాభివృద్ధి, సామ్రాజ్య నిర్బంధాలెన్ని ఉన్నా ఎలాగో జరిగిన పరిశ్రమాభివృద్ధికూడ చాల సంకుచితమైనది. దీనిలో జాతీయ పునర్నిర్మాణ లక్షణాలేవీ లేవు. గ్రేడు కమీషనరీ నివేదికలో చెప్పిన "నూతన పరిశ్రమలు" బ్రిటిష్ పెట్టుబడి యాజమాన్యం, చొరవలతో పెంపొందాయి ఇవికూడ కేవలం చిన్న పరిశ్రమలే ("సిగరెట్లు, అగ్గిపెట్టెలు, రబ్బరు టైర్లు, సబ్బులు, రంగులు మరికొన్ని రసాయన పదార్థాలు") ఇవి పరిశ్రమాభివృద్ధికి ప్రాతిపదిక కాలేవు. ఇంతవరకు అభివృద్ధిచేయని భారతదేశంలోని రసాయనిక సంపదభివృద్ధి ప్రణాళిక లను చాల ప్రకటించారు. వీని విషయంలో "ఐ. సి. ఐ. (ఇండియా) లిమిటెడ్" వారికి ప్రభుత్వం చాల సౌకర్యాలిచ్చినట్లు నమ్మడానికి కారణమున్నది, కాని ఇందుకు తగినట్లు ముఖ్యమైన భారీపరిశ్రమల అభివృద్ధి జరుగలేదు. అవసరాలను అవకాశాలను బట్టిచూస్తే ఇనుము, ఉక్కుపరిశ్రమల అభివృద్ధి మరీ అధ్వాన్నంగా ఉంది. ఈ విషయంలో ప్రారంభకార్యక్రమాన్ని బ్రిటిష్ పెట్టుబడికాక, టాటా భారత కర్మాగారం నడపడం గమనించవలసిన విషయం - తర్వాత తమ ద్రవ్య పెత్తనం పెట్టుకోవడంకోసం బ్రిటిష్ పెట్టుబడిదారులు ఇందులో దూరుతున్నారు. (ఇండియన్ ఐరన్ అండ్ స్టీల్ కంపెనీలో మెజారిటీ వాటాలను బ్రిటిషువారిక్రింద ఉన్న బెంగాల్ ఐరన్ కంపెనీ కొంది) 1935 లో ఉక్కు ఇనప పరిశ్రమలోని కార్మికుల సంఖ్య కేవలం 32000 మాత్రమే. 1924 కి 1939-40 కి మధ్య ఉక్కుకడ్డీలు 341,000 టన్నులనుండి 1,070,355 టన్నులకు పెరిగింది. ఇదే కాలంలో సోవియటు యూనియనులో 1924 నుండి 14,08 000 టన్నులనుండి 1936 నాటికి 1,63 00,000 టన్నులకు పెరిగింది.

సంకటావస్థలో, భారతదేశం ఒక్కమోటారు ఇంజన్‌గాని, ఒక్కవిమా నాన్నికాని ఉత్పత్తిచేయలేక పోయిందని గతయుద్ధం బయటపెట్టింది. ప్రభుత్వం యాజమాన్యంక్రింద ఉన్న బెంగుళూరులోని హిందూస్థాన్‌విమాన కర్మాగారంకూడా (కొన్నాళ్ళు అమెరికా సేనకు దీనినిచ్చారు), ఒక్కవిమానాన్నికూడ తయారు

చేయలేదు. యుద్ధానంతర ప్రణాళికలుకూడ ఇదేవైఖరినే వెలువరుస్తున్నవి. బిర్లా-నఫీల్డు ఒడంబడిక-తర్వాత తయారైన ప్రణాళికలలో, కొత్త 'భారతదేశపు' కారు "హిందూస్థాన్ టెన్" అనేదానిని తయారుచేస్తామన్నారు. ఇదికూడ కారుభాగాలన్నీ నఫీల్డు కంపెనీయే తయారుచేస్తుందని, ఆభాగాలను ఇండియాలో కేవలం బిగించడం మాత్రమే జరుగుతుందని బయటపడింది. ఇలాగే టాటా - ఐ. సి. ఐ. ఒడంబడిక కూడ తెలుపుతున్నది; భారతదేశం స్వయం సంపూర్ణం అయ్యేవరకు (ఈ దశ దాదాపు 20 ఏళ్ళకు తగ్గదట), ప్రధాన రసాయన పదార్థాలను ఇంగ్లాండునుండే దిగుమతిచేసి, "స్వదేశ" సరుకుగా ఇండియాలో అమ్ముతారు. భారతదేశంలో ఇంజన్ల ఉత్పత్తికై సింగ్ భూమ్‌లోని రైల్వే వర్కు-షాపును టాటా కంపెనీకి అప్పగించిన విషయాన్ని పెద్దగా చెబుతుంటారు; కాని ఇక్కడ తొలిఇంజన్ ఉత్పత్తి కావడానికి చాలఏళ్ళు పడుతుంది. ఇక హిందూస్థాన్ ఎయిర్‌క్రాఫ్ట్ ఫాక్టరీ విమానాల ఉత్పత్తిని ఆరంభిస్తుందని,దీనిని భారత ప్రభుత్వమే బ్రిటిష్ ఇంజనీర్ల నాయకత్వంక్రింద నడుపుతుందని ప్రపంచమంతటా మహా ఘనంగా చెబుతున్నారు. కాని ఆ ప్రకటనలోనే వివరించినదాన్నిబట్టి "విమానోత్పత్తిలో భారతదేశం స్వయం సంపూర్ణం" ఇరవై ఏళ్ళలోగా కాలేదు.

సమాన ఆర్థికాభివృద్ధికి ప్రధానావసరమైన ఘన పరిశ్రమలవిలా అభివృద్ధి పరచకపోవడం యాదృచ్ఛికంగా జరగలేదు. దేశంపై సామ్రాజ్యవాద పెత్తనం వల్ల ఏర్పడిన దుస్థితే ఇందుకు కారణం భారతదేశం యంత్రాలకింకా విదేశాలపైనే ఆధారపడి ఉంది. "ఘన పరిశ్రమాభివృద్ధి అంటే నిజమైన పారిశ్రామిక విప్లవం జరగడమే అవుతుంది. ఇంగ్లాండు, జర్మనీ, అమెరికా ఇవన్నీ తమ బట్టల మిల్లులను ఆరంభించడానికి ముందే ఉక్కు పరిశ్రమలను ఆరంభించాయి". (యల్. సి ఎ; నోయెల్స్, "విదేశ సామ్రాజ్య ఆర్థికాభివృద్ధి" పుట 443 —— ఈ ఉదాహరణ పూర్తిగా వెనకనే ఇచ్చాము.) ఈ కార్యక్రమం సోవియట్ యూనియన్‌లో మరింత శక్తివంతంగా సాగింది. భారత దేశంలో ఇది తలక్రిందులుగా జరగడానికి కారణం, వలస దేశంగా ఉండి పోవడమే. కావలసిన సహజ, వైజ్ఞానిక అవకాశాలుండి, అత్యవసరంగా ఉన్న భారతదేశ భారీ పరిశ్రమాభివృద్ధి వలసదేశంగా ఉన్నప్పుడు సాధ్యంకాదు. ఆ అభివృద్ధి ప్రపంచ స్థాయిలో ప్రధాన రాజ్యంగా స్వతంత్ర భారతం పెంపొందేందుకు మూలం కాగలదు

ఈకారణంవల్ల. భారతదేశ ఆర్థికాభివృద్ధి అవసరాలకూ - సామ్రాజ్య ఆధిపత్యం విధించే నిర్బంధాలకూమధ్య తప్పనిసరిగా వైరుధ్యం పెంపొందగలదు - అదితీవ్రతరమై సహకారం మైత్రి వీనికైచేసే ప్రయత్నాలను భగ్నంచేయ గలదు

ఎంత విధ్వంసనంచేసినా, ఎంతరాక్షసంగా ప్రవర్తించినా భారతదేశంలోని బ్రిటిషు బూర్జువాపరిపాలన ఒకశతాబ్దిక్రితం, ఇంకా పాతసమాజవ్యవస్థ పునాదు

లను విధ్వంసం చేసే "చారిత్రక సాధనంగా" పనిచేసింది. నూతన పరిస్థితులను సృజించినది. ఇప్పుడు పునర్నిర్మాణకార్యక్రమం సాగించవలసిన రోజులు వచ్చాయి. ఈనాడు సామ్రాజ్యవాదం పై పాత్రను నిర్వహించలేదు.

నేటి భారతదేశ పరిస్థితిలోను, ప్రజల దుస్థితిలోను భారతదేశంలో సామ్రాజ్యవాదమెంత నిర్వీర్యస్థితిలో ఉన్నదో స్పష్టంగా కనిపిస్తున్నది. గత పాతికేళ్ళలోను సోవియట్‌యూనియన్‌లో జరిగిన అభివృద్ధినీ (శిథిలితమైన జారు నాటి ప్రతిహీనస్థితినుండి జరిగిన అభివృద్ధి) అదేసమయంలో భారతదేశపు స్థితినీ పోల్చిచూడకుండా తప్పించుకోవడం సాధ్యంకాదు పైనిచ్చిన ఉక్కు, ఇనుప పరిశ్రమల లెక్కలూ; వ్యవసాయాభివృద్ధిలోను, జాతీయాదాయం పెంపులోను ఉన్న తారతమ్యమూ: సోవియట్‌యూనియన్‌లో అవిద్యనే నాశనం చేస్తే, ఇండియాలో ఇరవై ఏళ్ళలో కేవలం నూటికి ఇద్దరికి మాత్రమే చదువురావడం: సోవియట్‌లో ఆరోగ్య, సాంఘిక సేవా కార్యక్రమాల బహుముఖాభివృద్ధి: ఇండియాలో ఆ అభివృద్ధి అసలే లేకపోవడమూ ఇవన్నిటిని గమనిస్తే వీనినుండి భారతప్రజలు నేర్చుకోవలసిన పాఠాలెన్నో ఉన్నవి. ఆ పాఠాలను వారు శ్రద్ధగాగ్రహిస్తున్నారు కూడ.

కాని ఈనిర్వీర్యస్థితికి వ్యక్తిగత పరిపాలకుల అసమర్థతగాని, ఆఖరుకు వారి నిజాయితీ సద్భావాలు లేకపోవడంకాని కారణంకాదు. వారిలో బాగాజ్ఞానమున్న వారంతా ఈదుస్థితి ఎక్కడికి దారితీస్తుందాఅని చేతగాని ఆశ్చర్యంతో చూస్తూ వచ్చారు. సామ్రాజ్యవాద ప్రతినిధులు తలంచినా ఇంతకంటె వేరేఫలితాలను సృష్టించ లేరు ఎందుకంటె, సామ్రాజ్యవాద ఆధిపత్యం నిలుపుకోవడం, భారతదేశాన్ని వెనక్కునెట్టే శక్తుల సాంఘిక ప్రాతిపదికపైనే ఆధారపడిఉన్నది. భారతదేశంలో తీవ్రతరమవుతున్న వ్యావసాయిక సంక్షోభానికి మూలకారణాలను చర్చించడానిక్కూడ వ్యవసాయకమిషన్‌కు అధికారులు అనుమతినివ్వలేదు. అంటే భారతదేశంలో సామ్రాజ్యవాదమెంత అసమర్థస్థితికి వచ్చిందో తెలుస్తుంది. భూస్వామ్య విధానాన్ని నరిజేయకుండా, భూవిధానాన్ని అభ్యుదయ వంతంగా పరిష్కరించకుండా, ఏవిధమైన భారతదేశ అభివృద్ధి ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణ సమస్యలకుగాను పరిష్కరించ బూనుకోవడం సాధ్యపడదు కాని భూస్వామ్యవిధానంపై గొడ్డలిపెట్టు పెట్టడంఅంటే సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని మూలచ్ఛేదం చేసుకోవడమే అవుతుంది. ఇందువల్ల సాంఘికశక్తుల పురోగతికి దారితీయడ మవుతుంది. ఇందులో సామ్రాజ్యవాదమును పాతిపెట్టేందుకు సిద్ధపడడమే అవుతుంది. ప్రజాసామాన్యంయొక్క ప్రయోజనాలకు వ్యతిరేకులైన వర్గంవారి సౌకర్యాల నలాగే ఉంచి, తద్వారా తనకు సామాజిక ప్రాతిపదిక నేర్పరుచుకోవాలని సామ్రాజ్యతత్వం చూస్తుంది. కాబట్టి బ్రిటిష్ రాజ్యం అభివృద్ధి విరోధకంగా పరిణమించింది. సర్వసామాన్యమైన సంస్కరణలకుకూడ అందుకనే బ్రిటిష్‌ప్రభుత్వం వ్యతిరే

కిస్తుంది. (1) భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వ సౌభాగ్యం ఆదేశంలోని భూస్వాముల సౌభాగ్యంతోను, వంశక్రమంగా వచ్చేసంస్థానాధిపతుల సౌభాగ్యంతోను, మత విభేదాలతోకూడిన జమీందారీ పెట్టుబడిదారీ వర్గాల సౌభాగ్యంతోను సమ్మిళితమై ఉన్నది. అంటే అజ్ఞానం. వినాశదశతోకూడిన సర్వఅభివృద్ధి నిరోధకశక్తులతోను సామ్రాజ్యవాద ప్రయోజనాలు సంబద్ధమై ఉన్నవి.

భారతజాతీయ పెట్టుబడిదారీవర్గంతో సహకారప్రాతిపదిక నేర్పరుచుకోవాలని ఇటీవల ఆఖరుప్రయత్నం జరిగింది. కాని ప్రజాసామాన్య పురోగమనాన్ని అరికట్టడంలో సామాన్య ప్రయోజనాలుకొన్ని ఉన్నప్పటికి. ఈ సహకార ప్రాతిపదిక ఎన్నటికీ స్థిరంకాలేదు. భావియుగంలో పాతఅభివృద్ధి నిరోధకశక్తులన్నీ, ప్రజా పురోగమన పాదాఘాతంకిందపడి నలిగిపోతాయి. సామ్రాజ్యవాదంకూడ వాటితో పాటే నలిగి నుసికాగలదు.

---

(1) "ఢిల్లీశాసనసభా రికార్డులను - 1912 నాటివాటిని - పరిశీలిస్తూండగా, భూపేంద్ర నాథబసు తెచ్చిన ఒకబిల్లును చూచాను. అది వర్ణాంతర వివాహాలను అనుమతించాలనేబిల్లు. అది కూడా తాము 'ఏమతానికిచెందిన వారంకామ' అనిప్రకటించ కుండానే 1872 నాటి స్పెషల్ వివాహ చట్టాన్ని ప్రజలు వుపయోగించుకొనే వీలుకల్పించాలని మాత్రమే ఈబిల్లు కోరుతున్నది. (1872 చట్టం సివిల్ వివాహాలకు అవకాశం కల్పిస్తుంది.) ఈబిల్లుపై చర్చలో భారతీయ సభ్యులే పాల్గొన్నారు. ఒక్క మినహాయింపుమాత్రం వుంది - ప్రభుత్వం హోంమెంబర్ ( యూరోపియన్ ) ఈచర్చలో పాల్గొన్నాడు. ఈమార్పును అత్యధిక సఖ్యాకులు కోరుతున్నారని చూపగలిగితేతప్ప, ఈబిల్లును ప్రభుత్వం వ్యతిరేకిస్తుందని అతను మోటుగా ప్రకటించాడు. గోఖలే ఈబిల్లును సెలెక్టుకమిటీకి పంపమనికోరినా ప్రయోజనం లేకపోయింది. - అధికారసభ్యులే అధికసఖ్యాకులుగా ఉన్నారు. బిల్లును ప్రవేశపెట్టిన సభ్యుడు జవాబిచ్చిన తర్వాత, పదిమంది సభ్యులతనిని బలపర్చారు. యిందుకు మెజారిటీ వ్యతిరేకించింది. బ్రిటిషు అధికారసభ్యులందరూ దీనికివ్యతిరేకంగా వోటుచెయ్యాలని గవర్నర్ జనరలు ఆజ్ఞాపించాడు, ఈసభ్యుల వోట్లతో బిల్లు వోడిపోయింది.

" ఈవిషయాలలో భారత ప్రభుత్వ వైఖరి, సంఘ సంస్కర్తలకు హృదయ విదారకమైన ఆటంకాలు కలిగిస్తున్నది."

(లియోనల్ కర్టిస్, "ప్రతినిధి ప్రభుత్వంపై, భారత ప్రజలకు వ్రాసిన జాబులు." 1918, పుటలు 140—2.)

ఆ తర్వాత ఆ చట్టాన్ని సవరించారు. కాని అందరికీ అమవర్తించే సివిల్ మారేజి చట్టం లేదు. (ఇందువల్ల, జనాభాలో కృత్రిమమైన విభేదాలను బలపడానికే ఇది పనికి వస్తుందని నెహ్రూ వ్రాశాడు. చూడు, నెహ్రూ 'ఆత్మ కథ' పుట 451) ఇంగ్లీషు సామ్రాజ్య వాది చేసిన పై వ్యాఖ్యానంతో, నెహ్రూ స్వంతతీర్పును పోల్చిచూడవచ్చును.

"తర్వాత రానురాను, సంఘసంస్కార దృష్టితో చూస్తే పరిస్థితి మరీ అధ్వాన్నమయిపోయింది ఎందుకంటే బ్రిటిష్ ప్రభుత్వం ఈ సంఘ దురాచారాలకు పెద్దఅండగా తయారవుతూ వచ్చింది ఇలా ఎందుకు జరిగిందంటే, భారత దేశంలోని అతి అభివృద్ధినిరోధకులతో బ్రిటిష్ ప్రభుత్వం చాల సన్నిహితంగా ఉండడమే."

(నెహ్రూ, 'ఆత్మ కథ' పుట 382)

తుదిపోరాటం ఇంకా సాగవలసే ఉన్నప్పటికి, వస్తున్నయుగంలో భారతదేశ స్వతంత్రం సాధింపబడగలదు. అదెంత త్వరగా సాధితమవుతుంది అనేది, జాతీయోద్యమంలోని ఐక్యత, ప్రజాప్రాతిపదిక, ఆశయ స్పష్టత అనేవానిపై ఆధారపడుతుంది. భారతదేశంలో చారిత్రకంగా నడపవలసిన పునర్నిర్మాణ కార్యక్రమం సాగకతప్పదు. దానిని భారత ప్రజలే సాగించగలరు.

## 2. ఎలాంటి స్వతంత్రభారత దేశం

భారతదేశ భవిష్యత్తునుగూర్చిన తర్వాతి సమస్య, ఇందువల్ల భారత ప్రజలలోని ఆంతరంగిక శక్తులపై ఆధారపడుతుంది. తమ ప్రయోజనాలను నిల్పుకొనడం కోసం, బలవత్తరమైన అభివృద్ధినిరోధక శక్తులు సామ్రాజ్యవాదంతో చేరి ఉన్నవని మనం ముందు గమనించాము (సామ్రాజ్యవాదం దుర్బలమయ్యేకొద్దీ, వీనిలోకూడ ఊగిసలాడే వర్గాలు కనిపించసాగినప్పటికీ) భారతదేశపు పెట్టుబడిదారీవర్గం దోలాయమానపాత్ర (అటూఇటూ ఊగిసలాడేపాత్ర) ను చూదాం - ఆ భారత పెట్టుబడిదారీవర్గం బ్రిటిషు పెట్టుబడిదారీవర్గంతో తీవ్రవిభేదం కలిగి ఉన్నది. ఈ వర్గం భారత భవిష్యత్తును స్వతంత్రజాతిగా చూస్తున్నది - జాతీయోద్యమంలో ప్రధానశక్తివంతమైన పాత్రనుకూడ నిర్వహించింది; అయినప్పటికి ప్రతి ప్రజాపోరాటం పురోగమించినప్పుడు భయంతో, ఈ వర్గం జాతీయోద్యమంపై ఒక 'బ్రేకు'గా పనిచేసి, సామ్రాజ్యవాదం తాత్కాలికమైన రాజీలు చేసుకుంటూ వచ్చింది కాని తిరిగి తగాదాలు తప్పలేదు. భారత కార్మికవర్గం అభివృద్ధి చెందడమూ, రైతు తిరుగుబాట్లూ ఇందుమూలంగా ఏర్పడిన నూతన సాంఘిక సమస్యలు భారతరంగంలో ముందుకు రావడం మనం పరిశీలించాము. మేధావివర్గంలోను, విద్యార్థి యువక, పట్టణ చిన్నబూర్జువా వర్గంలోను ఈ విరుద్ధశక్తులూ, దృక్పథాల పలుకుబడి స్పష్టంగా కనిపించడం చూచాము - ఈ వర్గాలు స్వతంత్రపాత్రదేనినీ నిర్వహించలేవు. కాని జాతీయ సాంఘికసంక్షోభం తీవ్రతరమైనప్పుడు చైతన్యవంతమైన రాజకీయోద్యమంలో ఆందోళనచేసే, సంఘటితపరిచే శక్తులకివి ఆస్పదం మాత్రమవుతాయి.

సామ్రాజ్యవాదంనుండి పూర్తిగా స్వతంత్రాన్ని సాధించేవరకు, జయప్రదంగా జాతీయోద్యమ ఐక్యత నిలబడుతుందా; లేక బూర్జువావర్గంలోని అభివృద్ధి నిరోధక శక్తులు ప్రజాఉద్యమపు పురోగతికి భయపడి, సామ్రాజ్యవాదంతో మరింత సన్నిహితంగా కలసిపోతాయా : అలాచేసి సామ్రాజ్యవాదానికి మరికొన్నాళ్ళు జీవితం పోస్తారా? ఇలా జరిగితే జాతీయ స్వతంత్ర సాధన, సాంఘిక విమోచనకై నడిచే ప్రజాపోరాటాలతో సంబద్ధమవుతుంది. భారతదేశం స్వతంత్రం అయితే, బ్రిటిష్ పాలనస్థానే ఎలాంటి భారతదేశం ఏర్పడగలదు.? ప్రాచీన భారత - హిందూనాగరి

కతను ఆధునిక పరిస్థితులకు అన్వయించి, గ్రామ ఆర్థిక వ్యవస్థను పునర్జీవింపజేసి, పరిశ్రమలను పరిమితం చేయాలని కోరేవారి కలలు నిజమవుతాయా? లేక పారిశ్రామిక పెట్టుబడిదారులు, విద్యావంతులలోని వారిప్రతినిధులు నాయకత్వం వహించి, పాశ్చాత్యధనిక రాజ్యాల మాదిరిగా పెట్టుబడిదారీపద్ధతులలో ఆధునికభారతదేశాన్ని నిర్మిస్తారా? లేక ఒకపార్టీ జాతీయ పునర్నిర్మాణం, నియమబద్ధ ధనికవాద పద్ధతులపై తాత్కాలిక దశలో టర్కీలోలాగా ఏర్పడుతుందా? లేక ప్రజలపోరాటం బాధలు సన్నిహిత సంబంధ కాలంలో ప్రజల భారతదేశం సోషలిష్టుపద్ధతిలో పురోగమించేట్టు చేయగలుగుతాయా?

ఈ ప్రశ్నలు, ఇలాంటి ఇతరప్రశ్నలు, భారతదేశ విషయ పరిశీలనలో మరీమరీ ముందుకువస్తున్నవి ఇవికేవలం భవిష్యత్తునుగూర్చిన ఊహామాత్ర ప్రశ్నలుకావు. భావి ఆశయనిరూపణ, నేటి పోరాటంలోని విభిన్నసాంఘిక వర్గాల భాగాలపాత్రను అంచనావేయడం అనేవి నేటిపోరాటానికి, జాతీయస్వతంత్ర సాధనావకాశాలకూ చాలఅవసరం. భారతదేశంలో వర్గపోరాటం జాతీయపోరాటం సన్నిహితంగా ఒకటితోఒకటి కలిసిపోయిఉన్నవి. ఈ సమ్మేళనాన్ని అర్థం చేసుకోవడం భారతరాజకీయాలకు కీలకం, భారతప్రజలముందు సంక్షుభిత సముద్రాలు దాటేందుకు ఈ పరిజ్ఞానం అవసరం.

ఈ సమస్యలను పరిశీలించేందుకు నిజమైన సాంఘిక, వర్గశక్తులకున్న విభేదం గుర్తించడం అవసరం. ఈ శక్తుల తారతమ్యశక్తి, వాని పాత్ర పోరాటంలోని తర్వాత దశలనూ, అంతిమఫలితాన్నీ నడుపుతుంది. ప్రస్తుతం ఈ వర్గాలలో కనిపిస్తున్న వివిధ దృక్పధాలూ, సిద్ధాంతాలూ భావిపోరాటానికి ప్రాతిపదిక కాగలవు.

నేడు జాతీయోద్యమంలో మూడుప్రధాన వైఖరులులేక సాంఘిక దృక్పధాలు కనిపిస్తున్నవి.

మొదటిది అభివృద్ధినిరోధక వైఖరి (అంటే సామాజికదృష్టిలో - ఇది రాజకీయంగాగాని, సామ్రాజ్యవాదం యెడలగాని అభివృద్ధినిరోధకం కాకపోవచ్చు) ఈ వైఖరి తనకార్యక్రమాన్ని ప్రాచీనభారత నాగరికతను మహాఘనంగాపొగడి దానిపై ఏర్పరచాలను కుంటున్నది. పాత నాగరికతలోని పెద్దదోషాలను తొలగించి, ప్రధానమైన హిందూమత సంస్థలను నిల్పాలని చూస్తున్నది. ఆధునిక పరిశ్రమలను రాక్షసమైనవిగా (అవి ధనిక పద్ధతిలోఉన్నా కమ్యూనిస్టు పద్ధతిలోవున్నా రెండూ వీరికి ఒకటే) భావిస్తున్నది, నూలువడకడం, పాతకాలపు వ్యవసాయజీవనం రైతుల వాంఛలకు ప్రతిబింబాలని ఈవర్గం విశ్వసిస్తున్నది.

రెండవది, బలవత్తరమైన పారిశ్రామిక పెట్టుబడిదారుల దృక్పధం. వీరు పాశ్చాత్యపద్ధతిలో ఆధునికమైన పెట్టుబడిదారీ భారతదేశాన్ని నిర్మింపజూస్తున్నారు. కాని ఇందుతోపాటు తప్పనిసరిగావచ్చే కార్మికవర్గ ప్రబలవాంఛలను, రైతుల అసంతృప్తిని చూచి భయపడి, ఒకొకప్పుడు సగం సగం సోషలిస్టు లక్షణాలుగల ఆశయాలను చెబుతుంటారు. "వర్గకలహం లేని సోషలిజం" అనో లేక భారత

సామ్రాజ్యవాదం" అనో అంటారు - ఈ పదాలు అస్పష్టంగా జీవకారుణ్యవాదాన్ని వర్గసామరస్య విధానాన్ని మాత్రమే సూచిస్తాయి.

మూడోది: అభివృద్ధి చెందుతున్న సోషలిస్టు దృక్పథం. ఇది అతి స్పష్టమైన కార్మికవర్గ ఆశయానికి చైతన్యవంతమైన ప్రతిబింబం. భారతసమాజాన్ని పూర్తిగా మార్చాలని ఇది కోరుతుంది. ఈ దృక్పథానికి జాతీయోద్యమంలో, ముఖ్యంగా యువకలోకంలో క్రమంగా చాల బలంచేకూరుతున్నది - ఈ దృక్పథం అనేక స్థాయీలలో వారిలో కనిపిస్తున్నది.

వీనిలోని మొదటి దృక్పథం ఈ నాటికి బలవత్తరంగా ఉండడం ఏమాత్రం తక్కువగా అంచనావేయరాదు. ఈ దృక్పథానికి సాంఘిక ప్రాతిపదిక బలంగా లేనిమాటా, ఇది నెరవేరే అవకాశమూ లేదనేమాట నిజమే. ఈ భావం కలవారు తాము రైతుల వాంఛలను ప్రకటిస్తున్నారని, అందువల్ల "నిజమైనప్రజల"తో తమ దృక్పథానికి సన్నిహిత సంబంధమున్నదని, "భారతజీవితానికి అనుగుణమైనదని నమ్ముతున్నారు ఈ నమ్మకం వట్టిభ్రమ. రష్యాలోని ఒకప్పటి "పాపులిస్టుల" తోను, ఇతర చోట్ల అలాగే వచ్చిన ఉద్యమాలతోను ఈ భావాన్ని పోల్చవచ్చును ఈ భావం కార్మికవర్గ సన్నిహిత సంబరాలలోవచ్చే వ్యవసాయ విప్లవంతో శిధిలితం కాగలదు. నిజానికి ఈభావం దిగ్భ్రాంతులైన మధ్యతరగతులలోనుంచి ఏర్పడింది. తమచేతులు దాటి తీవ్రతరంగా ఆర్థికమైన మార్పులు సాగుతున్నవి. ఇందులో తమకు బాధలు కల్గాయి. తమకు ప్రమాదస్థితి ఏర్పడింది. తమకుటుంబాలు బాగా బాధలుపడ్డాయి. ఈమార్పు, తగాదాల సంక్షుభిత దశలో తమకేదో ప్రాచీన స్థిరత్వమనే శిలపై సంతృప్తి కలగాలని ఈమధ్యతరగతులవారు ఆశించా . ఈభావం సామ్రాజ్యవాదం విధ్వంసంచేసిన సామ్రాజ్య శక్తుల అసంతృప్తిని ప్రతిబింబిస్తున్నది. (వినష్టహస్త పారిశ్రామికులు, భూమినుండి వెళ్ళగొట్టబడిన రైతులు, దివాలాతీసిన చిన్నవర్తకులు ఈభావానికి మూలం) వీరికి " పశ్చిమ నాగరికతాభూతం" మాత్రమే కనిపించింది. యంత్రం తమకు శత్రువుగా తోచింది, తమహృదయాలలో భౌతికజీవిత నైరాశ్యం బాధలు, భ్రమలతో నిండివుండగా వీరందరూ తామేదో ఎక్కడోవున్న ఆధ్యాత్మిక ప్రపంచంలో ఓదార్పు పొందాలని చూచారు. - ఈదృక్పథంచాల అసౌఖ్యకరమైంది; విధ్వస్తశక్తుల భావప్రకటనయిది. కేవలం ఆశాపూరితమైన అభ్యుదయ జాతీయోద్యమంలోనే, ఈవర్గమప్పుడే పరాజితమౌతూ పోరాడుతున్నది. కాని దీనికి వర్తమానదశలో ఇంకా ప్రాముఖ్యత ఉన్నది. భారతదేశంలో సామ్రాజ్యవాదం మూలంగా వినాశంచేయబడిన కార్యక్రమములోని సాంఘిక లక్షణంగా మాత్రమే కాక, ఈభావంలో ఇంకొక లక్షణం కూడవుంది. గాంధిజీ ప్రవక్తగా, ఆయనచుట్టూ చేరిన కాంగ్రెసు ఉద్యమంలోని పాతకంపు సనాతనులకిది ప్రాతిపదికగా ఇంకా పని చేస్తున్నది.

ఈదృక్పథం కలవారు చెప్పేకార్యక్రమం, పరిశ్రమాభివృద్ధికి వ్యతిరేకంగా గ్రామపునర్నిర్మాణం.

"గ్రామ పరిశ్రమలను అభివృద్ధిపరచడంలోనే నిజమైన సోషలిజం ఉన్నది. విపరీతమైన ఉత్పత్తివల్ల, పాశ్చాత్యదేశాలలో ఏర్పడిన అరాచక పరిస్థితులు, తిరిగీ మన దేశంలో ఏర్పరచాలని మేము కోరము."

(వల్లభాయ్ పటేల్, అహ్మదాబాదులో ఉపన్యాసం, జనవరి 3, 1935)

"ఇండియా, చైనా, ఈజిప్టులు సభ్యతాభివృద్ధికై, తమ వ్యవసాయ సంస్కృతిరోజులను వెనక్కు మళ్ళి చూడాలి."

(జె సి కుమారప్ప, అఖిల భారత గ్రామ పరిశ్రమల సంఘకార్యదర్శి, "గ్రామోద్యమం ఎందుకు", 1936 పుట 56 )

స్వయం సంపూర్ణగ్రామాల ప్రాతిపదికపై (ఈ పద్ధతి మార్క్సు చెప్పినట్లుగా వాస్తవస్థితిలో ప్రాచ్యనిరంకుశతను, దాస్యాన్ని, మూఢవిశ్వాసాలను విశ్రైతన్యాన్ని కలిగించింది పూర్వం) ప్రాచీన "భారత నాగరికత"ను పునరుజ్జీవింపజేయడమే ఆవశ్యమని వీరంటున్నారు.

"భారతదేశ నాగరికత, ప్రపంచంలో పరాజితం కానిదని నేను విశ్వసిస్తున్నాను."

(గాంధీ. "భారత స్వరాజ్యం" 1908. కొత్త పీఠికలో 1919లో పునర్ముద్రితం, పుట 66

గాంధీజీ పాతరచనలోలాగా: ఏమాత్రం రాజీపడని ప్రకటనలలో ఆధునిక విజ్ఞానం పూర్తిగా ఖండింపబడింది.

"యంత్రాలు చెడ్డవని గ్రహించడం అవసరం. అప్పుడే క్రమక్రమంగా మనం వానిని తొలగించుకో గలుగుతాము."

(గాంధీ. "భారతస్వరాజ్యం" పుట 124) "పాపప్రచారానికి ఆలవాలమైనసంస్థలు ఆసుపత్రులు" (అదే. పుట 64.)

ఈదృక్పథం. 1909 లో గాంధీజీ ఒకమిత్రునికి వ్రాసిన "విశ్వాసప్రకటన" లో అతిస్పష్టంగా వివరింప బడింది.

"భారతదేశాన్ని పాలిస్తున్నది బ్రిటిష్ ప్రజలుకారు; రైల్వేలు, టెలిగ్రామ్, టెలిఫోన్ వగైరా నాగరికత విజయాలని చెప్పబడే, ప్రతి కొత్తగా కనిపెట్టిన వానిద్వారానూ ఆధునికసంస్కృతే భారతదేశాన్ని పాలిస్తున్నది....

"రేపు బ్రిటిష్ రాజ్యంస్థానే, ఆధునిక పద్ధతులమీద ఏర్పడిన భారత పాలనను ఏర్పరిస్తే, కేవలం ఇంగ్లాండుకు వెడుతున్న కొంతడబ్బు నిల్పుకోవడంకంటె భారతదేశమేమీ ఉత్తమం కాదు; అప్పుడు భారతదేశం యూరోపు, అమెరికా రాజ్యాలలో అయిదోదో, రెండోదో మాత్రమే అవుతుంది.

"వైద్యశాస్త్రం గారడీయొక్క సారసంగ్రహం మాత్రమే. ఉత్తమ వైద్య నైపుణ్యం అనబడే దానికన్నా, ఏమీతెలియని నాటువైద్యులేమేలు. "గత యాభైయేళ్ళలో నేర్చుకున్నదంతా మరచిపోవడం మీదనే, భారత దేశవిమోచన మార్గం ఆధారపడి ఉంది. రైల్వేలు, టెలిగ్రాములు, ఆసుత్రులు, లాయర్లు, డాక్టర్లు ఇలాంటివన్నీ పోవాలి. ఉన్నతవర్గాలన బడేవారు, దైవభీతితో, మతధర్మరీత్యా బతకడం నేర్చుకొనాలి. బుద్ధి పూర్వకంగా నిరాడంబరమైన రైతులా బతకాలి."

(గాంధీ, "విశ్వాసప్రకటన," 1909, ఉపన్యాసాలు, వ్యాసాలు. పుటలు 1041-43)

ఈ కార్యక్రమాన్ని అనుసరిస్తే, భారతదేశ దరిద్రానికేమి పరిష్కారం కుదరదు పైగా, దరిద్రమేదో అత్యధిక సంఖ్యాకమానవకోటికి దైవనిర్ణీతజీవిత స్థితి అనుకొనడం మాత్రమే జరుగుతుంది. ఇది అతి స్పష్టమే.

"భౌతిక సౌఖ్యాలేవీ, ఏమాత్రంకూడ నైతికాభివృద్ధికి తోడ్పడవు."

(గాంధీ 'విశ్వాసప్రకటన' పైపుస్తకంలోదే, పుట 1042)

"మనభౌతిక సంపద పెరిగేకొద్దీ, మనం భూమికి దాసులం కావడం పెరుగుతుంది "

(కుమారప్ప, 'గ్రామోద్యమం ఎందుకు' పుట 39)

"మనకున్న, అనేక వస్తుసంపత్తి మనలను సుఖవంతుల చేయలేదు"

(అదేపుస్తకం, పుట 65 )

ఇలా ఆకలిగొని, అసంతృప్తులై ఉన్న ప్రజానీకానికి బోధించడం, భారత పారిశ్రామిక కోటీశ్వరుల ఆదరాభిమానాలకు పాత్రమవుతుందనడంలో ఆశ్చర్య మేమీలేదు. వీరు తమకేదో విశ్రాంతిగా ఉన్నప్పుడు, కోట్లమంది నిరాడంబర జీవితంతో తాము సంతృప్తిచెందుతున్నామని చెప్పడానికి కొద్దిగా రాట్నం వడుకుతూ మరోవేపేమో యంత్రాలద్వారా ,పారిశ్రామిక దోపిడీద్వారా కోట్లడబ్బు కూడవేస్తు న్నారు ఇక ధనస్వామ్యంగూర్చి, గాంధీజీ వెల్లడించిన సాంఘికసిద్ధాంతం కొత్త దేమీకాదు.

"నా సాంఘిక సిద్ధాంత మిది: మనం పుట్టుకతో సమానులమే అయినా-అంటే మనకు సమానావకాశాలు పొందే హక్కు ఉన్నప్పటికి, మనందరి సామర్ధ్యము సమానమైనదికాదు. ప్రకృతి సిద్ధంగానే మనందరం ఒకేపొడవు, ఒకేరంగు, ఒకే స్థాయిగల ప్రతిభాశక్తి కలిగిఉండడం అసాధ్యం; ఇందువల్ల మనలో కొందరు ఇతరులకంటే ధనం చేకూర్చుటకు తగిన సమర్ధులుగా ఉండడం సహజమే. ఆ సామర్థ్యం కలవారు, ధనం సంపాదించాలనుకుంటే తమశక్తిని అందుకై వెచ్చిస్తారు. వారు సద్బుద్ధితో ద్రవ్యం సంపాదిస్తే,వారు ప్రజాసేవకులవుతారు. వీరు కేవలం 'ధర్మకర్తలు' మాత్రమే అవుతారుకాని ఇంకేమీ కాదు. ప్రతిభాశాలి ఎక్కువ సంపా

దిస్తుంటే నేను సంపాదించమంటాను. అతను తన సమర్థతను ఉపయో గించకుండా ఏ ఆటంకం పెట్టను."

(గాంధీ, ఛార్లెస్ పెట్రాష్. మాండే. ఫిబ్రవరి 20, 1932)

ఇందులో పై ఆధ్యాత్మికవాదం ముసుగులోంచి, సుపరిచితమైన బూర్జువా సిద్ధాంత సారం కనిపిస్తున్నది.

ఈ కార్యక్రమం, వెంటనే అవలంబించాలని ప్రచారంచేసే కార్యక్రమమిది. చర్ఖా తకిలీలు వడకాలి, జాతీయచిహ్నంగా ఖద్దరుకట్టాలి; గ్రామపరిశ్రమలను పెంపొందించాలి. "అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘాన్ని" కాంగ్రెస్‌కు ప్రధాన అనుబంధసంస్థగా ఏర్పరచారు. ఈ ఉద్యమానికున్న ఆచరణలోని ప్రాతిపదిక నిక్కచ్చిగా గుర్తించాలి. భారత ఆర్థికవ్యవస్థలోని బ్రహ్మాండమైన సమస్యలను, హీన ఉత్పత్తిస్థాయిని వడకడంతో, పాతపద్ధతులతో పరిష్కరించాలనుకునే అర్థంలేని, చరిత్రను వెనక్కునెట్టాలనే ఈ భావాన్ని చూచి, అభివృద్ధిచెందిన బూర్జువా ఆర్థిక వ్యవస్థకుచెందిన ఉత్తమ ఆర్థికవేత్తలు అసహ్యించుకోవచ్చు. తమ ఉన్నతస్థాయి నుండి ఛీఛీఅనవచ్చు. అయినప్పటికి ఈ ఉద్యమానికి ఏకొద్దో వచ్చినతోడ్పాటుకు, సిద్ధాంత కారణాలుకాక, ఆచరణలో కొన్నికారణాలున్నవి. ఎందుకంటే వ్యవ సాయం అధ్వాన్నస్థితిలో విచ్ఛిన్నమై పోయిఉంది. ఇందువల్ల అందుపై ఆధార పడిన కోటానుకోట్ల ప్రజలు దాదాపు ఏటా ఆరునెలలు పనిలేక పడిఉంటారు. ఇక పరిశ్రమలా లేవు. ఇలాంటి స్థితిలో ఈరోగం నివారణకుకాక, ఏదోకాస్త నెమ్మ దించడానికిమాత్రం ఈ వడకడం, చేనేత, చేతిపనులు పనికివస్తాయి. ఇందుకెక్కువ పరికరాలుకాని, అవసరాలుగాని అక్కరలేదు. ఇది చాలమందికి పనికివస్తుంది.

అయినప్పటికి ఇది కేవలం ఉపశమనమేగాని రోగనివారణంకాదు. భారత ఆర్థికవ్యవస్థ విధ్వంసమైవున్న నేటి అధ్వాన్నస్థితిని మార్చడానికిబదులు అదెటూ తప్పదనుకొని అందుకుతగినట్టు తమ జీవితాన్ని నడుపుకోవడం మాత్రమే అవు తుంది. పెట్టుబడిదారీ ప్రపంచంలో తిరిగి చేతిపనులను కృత్రిమంగా పునరుద్ధరించ బూనుకోవడమంటే ఆర్థికంగా దీనికి భవిష్యత్తులేదు. ఖద్దరు మిల్లుగుడ్డతో ధరల్లో పోటీ చేయలేదుకాబట్టి అతి దరిద్రులకిది అందుబాటులో ఉండదు, తన పత్రిక 'హరిజన్'లో 1938 నవంబరు 19వ తేదీ గాంధీ రాస్తూ, కాంగ్రెసు నియమావళి లోని ఖద్దరుధారణ షరతును "అనుసరించడంలో కాక, ధిక్కరించడంలోనే గౌర విస్తున్నారు" అని అన్నాడు.

"విదేశపు సున్నితమైన వస్త్రాలంత మృదువుగా, అందంగా కనిపించక పోయినా, అంతచౌక కాకపోయినా ఖద్దరునే కట్ట"మని సోదర దేశీయులకు విజ్ఞప్తి చేశాడు. - మొదటి ఆటంకం - దేశభక్తి ప్రేరణతో ఎలాగో తొలగించుకోవచ్చు; రెండో ఆటంకం ("అంత చౌక కాకపోయినా") ముఖ్యంగా ఇప్పటి ఆదాయాన్ని బట్టి భారతీయ ప్రజాసామాన్యానికి ప్రధానమైనది, భారత దేశంలాంటి అతి దరిద్ర దేశంలో అతి శ్రమతో - పాతకాలపు పద్ధతులతో మరీ తక్కువగా ఉత్పత్తి

చేయడంకాదు కావలసింది: దరిద్రాన్ని తొలగించేందుకు సాధనంగా, అత్యాధునిక పద్ధతులతో, పరికరాలతో అత్యధికంగా, అతిత్వరగా ఉత్పత్తిని ఎక్కువచేయడం అవసరం. ఇంతకూ గాంధీ తర్వాతి ప్రకటనల్లో యంత్రాల విషయంలో గాంధిజీ తన వాదం కాస్త సవరించుకున్నాడు. హరిజన్‌లో తర్వాత గ్రామ పరిశ్రమలపై రాస్తూ ఇలా వాదించసాగాడు: "పనికి అవసరమైనంతకన్నా ఎక్కువ మనుష్యులు లేనప్పుడు యంత్రాలు మంచివే. భారతదేశంలోలాగా అవసరమైనంతకన్న ఎక్కువమంది పనిచేయనున్నపుడు ఈ యంత్రాలు దోషంగా పరిణమిస్తాయి." ఈ వాదంలో ఉన్న అభివృద్ధివిరోధక భ్రమ స్పష్టంగానే కనిపిస్తుంది.

భారతదేశ సమస్యలకు, పాతకాలపు ఆర్థికవిధానం పరిష్కారకరమని ప్రచారంచేయడం అభివృద్ధివిరోధకమైనది. ఇందుకు పరిష్కారానికి వ్యతిరేక మార్గంలో ఇది నడవడం మాత్రమే కారణంకాదు, (ఎందుకంటే ఇప్పుడున్న దరిద్రం, బాధలకుమూలం పాతపద్ధతులతో ఉత్పత్తి జరగడమే; దానికిమూలం సామ్రాజ్యవాదంక్రింద ఏర్పడిన దోపిడీ విధానమే). అంతేకాక ప్రజలను, రైతులను ఎదుర్కొంటున్న సాంఘిక ముఖ్యకర్తవ్యాలనుండి దృష్టిని మరలుస్తుంది కాబట్టి ఇది అభివృద్ధివిరోధకమైనవాదం. భూమి సమస్యను, భూస్వామ్య సమస్యను, భూమిని తిరిగి పంపకంచేయడాన్ని ప్రారంభించకుండా వ్యవసాయాభివృద్ధి సాధ్యంకాదు కాని యిక్కడ వ్యవసాయ ఆధ్యాత్మికవాదులూ, గతించిన గ్రామ వ్యవస్థను పూజించేవారూ, ఆఖరుకు సిగ్గుమాలి, అస్పష్టంగా భూస్వామి విధానాన్ని రక్షించడానికి పూనుకున్నట్లు బయటపడుతున్నది. కాబట్టే గాంధీజీని యు. పి. రాష్ట్రంలోని జమీందారులు కలుసుకున్నప్పుడు, 1934 కాన్పూరులో, ఆయన సోషలిజం ప్రమాదం తప్పించుకోవాలనే ఆదుర్దాతో, ఆ జమీందారుల కిలా వాగ్దానమిచ్చాడు: "రెండువేపులా హృదయ పరివర్తనం కలిగితే, జమీందార్లకూ రైతులకూ మధ్య మైత్రి నేర్పరచవచ్చు. జమీందారీపద్ధతిని, తాలూక్దారీ పద్ధతిని రద్దుచేయడానికి నే నెప్పుడూ సుముఖుడనుకాను." ఆయనింకా ఇలా అన్నాడు:

> "సరైన కారణం లేకుండా, ఆస్తివంతులను వారి ఆస్తులనుండి తొలగించడంలో నేను భాగస్వామిని కాను. మీహృదయాలను మార్చి మీరు మీ స్వంత ఆస్తులను మీ రైతులధనం గా, వారిమేలుకై ఉపయోగించేట్టు చేయడమే నా ఆశయం. నేను కలలుకనే రామరాజ్యంలో, రాకుమారుని, దరిద్రుని హక్కులు రెంటికీ రక్షణలుంటాయి. వర్గకలహం రాకుండా చేసేందుకు, నా యావచ్ఛక్తినీ పలుకుబడినీ ఉపయోగిస్తానని మీరు నమ్మండి ....ఒకవేళ అన్యాయంగా మీ ఆస్తులను తొలగించాలనే ప్రయత్నం జరిగితే మీ వైపుండి నేను పోరాడుతాను. .... మన సోషలిజం లేక కమ్యూనిజం అహింసమీద, కార్మికుల పెట్టుబడిదార్ల మైత్రీ సహకారాలమీద, రైతు భూస్వామి సహకారంమీద, ఆధారపడాలి."

(గాంధీ, యు. పి. జమీందార్లకిచ్చిన ఇంటర్వ్యూ, జులై 1934, మహారాటా ఆగస్టు 12, 1934)

ఇలాగే పారిశ్రామిక పెట్టుబడిదారులను గాంధి సమర్థించడం, వర్గకలహంపై ఆధార పడే కార్మికసంస్థలను వ్యతిరేకించడం ముందుగానే మనంపరిశీలించాము.

ఇక్కడే ఈబోధనల్లోని అసలు గమనించదగిన విషయం - పెద్ద పెట్టుబడి దారుల దృక్పథందృష్ట్యా ఇదినడుస్తున్నదని తెలుస్తుంది. పెట్టుబడిదారులు ఈ బోధ నను సహించడమేకాక, ఈ ఊహావాంఛలను, అభూత కల్పనలను చిఋనవ్వుతో మరింత ప్రోత్సహిస్తున్నారు. ఎందుకంటే ఈ బోధనల వ్యాపారంవిలువ వారెరుగు దురు. తమవర్గ ప్రయోజనాలకిది రక్షకమని, ప్రజలనలాగే అదుపులో ఉంచుతుం దని, వర్గశాంతిని కాపాడుతూందని ఈ బోధనగూర్చి వారికితెలుసు. తనసాంఘిక సిద్ధాంతానికీ, బూర్జువా దృక్పదానికీ వైరుధ్యం పైపైనకనిపిస్తుంది. అయినప్పటికి గాంధి చారిత్రకపాత్ర సాంఘికంగా ఈ ఆధునిక విషమపరివర్తన దశలో అతిసమ ర్థుడైన బూర్జువా జాతీయనాయకుడని, ఆయన రాజకీయపాత్ర ఇందుతో సమ్మి శితమైందని స్పష్టపడుతుంది. బాగాకనపడుతున్న వైరుధ్యాలు, లోపాలు ఆయన బోధనలు, వ్రాతలలోనుండి ఏ సామాన్యవిమర్శకుడైనా సులభంగా ఏరి బయల్పరచ వచ్చు. ఇవన్నీ నిజానికి, ఆయన విశిష్టతకూ, ఆయనవిజయాలకూ తాళంచెవి వంటివి.

ఒకవేపు జాతీయోద్యమం చైతన్యం బూర్జువా నాయకత్వంక్రింద నడవడం - మరోవేపు ఇంకా చైతన్యంచెందని ప్రజానీకంగల ఈ పరి వర్తన దశలో ఇంకేనాయకుడూ ఈ అఖాతాన్ని పూడ్చివుండలేదు. మంచికీ, చెడ్డకూ కూడా గాంధీ ఈ విజయం సాధించి ఉద్యమాన్ని నడి పాడు. ఉద్యమాన్ని నిర్మించినట్టుకూడా కనబడ్డాడు. సామాన్య ప్రజానీకం తమ ప్రయోజనాలను చైతన్యవంతులై గుర్తించేస్థితి రాగానే అసలు వర్గ శక్తులు, వర్గసంబంధాలు భారతరంగంలో స్పష్టంగా ఏ అభూత ఆధ్యాత్మిక ఆచ్ఛాదనం లేకుండా కనిపించసాగేటప్పటికి ఈ గాంధీ పాత్రకు పూర్వ మున్నంత ప్రాధాన్యత లేకుండా పోయింది.

ఏమైనప్పటికి పారిశ్రామిక పెట్టుబడిదారులు తమకు ప్రధానంగా ప్రజాకు నాయకత్వంగా గాంధీ వాదాన్ని స్వేచ్ఛగా ఉపయోగించుకుంటూనే తమ అవసరా లకు, అభ్యుదయవంతమైన పారిశ్రామికాభివృద్ధి ఆశయాలకు ఈ గాంధీ వాదం ఆటంకం కానీయకుండా చూచుకున్నారు. పరిశ్రమాభివృద్ధి జాతీయోద్యమానికి అవసరమయిన కార్యక్రమంగా చేసుకున్నారు. సిద్ధాంతరీత్యా ఎంత సాంఘిక అభివృద్ధినిరోధకతను బోధించనిచ్చినా, ఆచరణలో మారక తప్పలేదు. యంత్ర నిర్మితమైన గుడ్డలకు సమానహక్కులనంగీకరించడంలోను, 1930 నాటి గాంధీ పదకొండు సూత్రాల ప్రణాళికలోను ఇది కనబడుతున్నది. ఈ ప్రణాళిక సామాన్యమైన బూర్జువా వ్యాపార, పారిశ్రామిక, ద్రవ్య సంబంధ మైన కార్యక్రమంమాత్రమే. నేడు జాతీయోద్యమంయొక్క, కాంగ్రెస్‌యొక్క

బలాన్నంతటిని త్వరగా పరిశ్రమాభివృద్ధి చేసే ప్రణాళికలవైపు మరలింది. 1938 పరిశ్రమల ప్రణాళికల మహాసభ జరిగిం తర్వాత, కాంగ్రెస్ జాతీయ ప్రణాళిక కమిషన్‌ను నిర్మించడంలో ఈ విషయం స్పష్టపడింది.

1938 ఆగస్టులో జరిగిన భారత వైజ్ఞానిక సంఘం వార్షికోత్సవంలో, పరిశ్రమ్యాభివృద్ధిగూర్చి కాంగ్రెస్ ఆధునిక దృక్పధాన్ని కాంగ్రెస్ అధ్యక్షుడు ప్రకటించాడు. ఈ సమావేశంలో ప్రొఫెసర్ మేఘనాధ్‌సాహా ఇలా ప్రశ్నించాడు :

> "భావిభారతదేశం గ్రామ జీవిత సిద్ధాంతాన్ని పునరుద్ధరించి, ఎద్దు బండి తత్వాన్ని అనుసరించి, దాస్యాన్ని శాశ్వతంగా ఉంచనున్నదా ? లేక ఆధునిక పారిశ్రామిక దేశంగా మారి, తన సహజసంపత్తినంతటిని అభివృద్ధిపరచుకొని, దరిద్ర-అజ్ఞాన-రక్షణ సమస్యలన్నింటిని పరిష్కరించుకొని, ప్రపంచ జాతులలో గౌరవస్థానాన్ని అలంకరించి, నూతన సభ్యతా చక్రాన్ని నడిపిస్తుందా ? ఈ సంగతిని నేను తెలుసుకోవచ్చునా ?"

కాంగ్రెసు అధ్యక్షుడు సుభాష్ చంద్రబోసు సమాధాన మిచ్చాడు.

> "విజ్ఞానం సహాయంతోనే జాతీయపునర్నిర్మాణం సాధ్యమవుతుంది.... భారతదేశమింకా, పారిశ్రామిక యుగానికి పూర్వస్థితిలోనే ఉంది. మన కిష్టమున్నా లేకున్నాసరే, ఆధునిక చరిత్రలో నేటి యుగం పారిశ్రామిక యుగమన్న వాస్తవాంశంతో మనం రాజీపడక తప్పదు. పారిశ్రామిక విప్లవాన్నుండి తప్పించుకోలేము. మనం చేయగలిగిందల్లా, ఈ పారిశ్రామిక విప్లవం బ్రిటన్‌లోలాగా క్రమక్రమంగా రావాలా, లేక, సోవియట్ రష్యాలోలాగా బలవంతంగా ముందుకు రావాలా అనేది నిర్ణయించొచ్చు. కాని ఈ దేశంలో కూడ బలవంతంగా ముందు కురకవలసి వస్తుందనే నా అనుమానం."

ఇలా పాతఆధ్యాత్మిక ఊహావాదులకు అనుభవం, అభివృద్ధీ జవాబిచ్చాయి. జాతీయోద్యమ కార్యరంగంలోనుండి సాంఘికఅభివృద్ధి విరోధకవాదం పోతున్నది - కేవలమదొక పాతవిశ్వాస హతశేషంలో వేలాడుతున్నదే కాని, నాయకత్వం వహించే విధానంగా మాత్రంలేదు. కాబట్టి, ఆచరణలో మూడు దృక్పధాలుకాక రెండే ప్రధానదృక్పధాలు, వర్గాలు, కార్యక్రమ విధానాలునేటి జాతీయోద్యమంలో కనిపిస్తున్నవి; ఒకటి ప్రధానపారిశ్రామిక పెట్టుబడిదారుల దృక్పధం - ఇది మధ్యతరగతులలో వివిధవిధాలుగా ప్రతిబింబిస్తున్నది; రెండోది పారిశ్రామిక కార్మికవర్గ దృక్పధం - సోషలిస్టు దృక్పధం. ఇది కార్మికవర్గంయొక్క, పేదరైతులయొక్క, పట్టణంలోని మధ్యతరగతుల క్రిందివారియొక్క ప్రయోజనాలను ప్రతిబింబిస్తున్నది. ఈ ప్రధానమైన రెండువిధానాలమధ్య వివిధకార్యక్రమాలు నాయకత్వాలు, తెగలు వాస్తవస్థితిలో అటోఇటో చేరుతున్నవి—ఎల్లప్పుడూ పద్ధతులు అతిస్పష్టంగా లేకపోయినప్పటికి ఇదినిజం.

ఈ వర్గాలన్నీ ఇప్పటికి జాతీయ పోరాటం ఆదర్శాల విషయంలోను, కొంతవరకు జాతీయ పునర్నిర్మాణ ఆశయాలలోను కలిసి మెలిసి ముందుకు సాగుతున్నారు. కాని సాంఘికంగా ఒక్కొక్కరికి ప్రత్యేకాశయాలున్నవి ఈ ఆశయాలిప్పటి సమస్యలపైకూడ ప్రతిఫలిస్తున్నవి ఈ రెండు విధానాల సంబంధాలు పరస్పరపాత్ర నిర్వహణపైననే భావిభారత రాజకీయ పురోగమన మార్గం ఆధారపడి ఉన్నది

## 3. పునర్నిర్మాణం, పరిశ్రమాభివృద్ధి, సోషలిజం

జాతీయ పునర్నిర్మాణ సమగ్ర కార్యక్రమం, పరిశ్రమాభివృద్ధి అవసరమని ఆధునికయుగంలో జాతీయోద్యమం ఏకాగ్రీవంగా అంగీకరించి వి. 1938 అక్టోబర్‌లో ఢిల్లీలో జరిగిన రాష్ట్రప్రభుత్వాల పరిశ్రమశాఖా మంత్రుల సమావేశం ఒక తీర్మానం చేసింది అందులో ఇలా ఉంది :

“దరిద్ర నిరుద్యోగ సమస్యలను, జాతీయ రక్షణ, ఆర్థిక పునరుజ్జీవన సమస్యలను పరిశ్రమాభివృద్ధి జరక్కుండా పరిష్కరించలేమని, ఈ పరిశ్రమశాఖామంత్రుల సమావేశం భావిస్తున్నది. అలా దేశాన్ని పారిశ్రామికం చేయడానికి ప్రథమ సోపానంగా జాతీయ ప్రణాళికను సమగ్రంగా తయారుచేయవలసి ఉన్నది ..

“వివిధ రాష్ట్రప్రభుత్వాల అభిప్రాయాలను సమాలోచించి మేమీ అభిప్రాయానికి వచ్చాము. యావద్భారత దేశానికి సమగ్రమైన పారిశ్రామిక ప్రణాళికను తయారుచేసి, పరిశీలించేలోగా ఈ క్రిందిప్రధాన భారీపరిశ్రమలను యావద్భారత ప్రాతిపదికపై ప్రారంభించాలి. ఈవిషయంలో అన్ని రాష్ట్రాల, సంస్థానాల ప్రయత్నాలు సాధ్యమైనంత వరకు ఏకైకమార్గంలో కలిసి పనిచేయాలి;

(క) అన్నిరకాల యంత్రాలు, పరికరాల నిర్మాణం:

(ఖ) మోటార్లు, మోటారుబోట్లు వగైరాలు, అందుకు కావలసిన అనుబంధవస్తువులు ఉత్పత్తి, రవాణా రహదారులకు చెందిన ఇతర పరిశ్రమల స్థాపనం;

(గ) విద్యుచ్ఛక్తి యంత్రాలు, అందుకు సంబంధించిన వాని ఉత్పత్తి;

(ఘ) భారీ రాసాయనిక వస్తువులు, ఎరువుల ఉత్పత్తి;

(ఙ) లోహ ఉత్పత్తి;

(చ) విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి, విద్యుచ్ఛక్తి సరఫరాకు చెందిన పరిశ్రమలు;

ఈ తీర్మానానికి అనుగుణంగా, కాంగ్రెసు ప్లానింగుకమిటీ ఆధ్వర్యంక్రింద ఒక అఖిలభారత జాతీయప్రణాళికా సంఘం ఏర్పడింది ఈ కమిటీ సిఫారసుల సారాంశ మిప్పటికే ప్రకటితమైంది.

నేడు భారతదేశంలో ఎన్నో పునర్నిర్మాణ ప్రణాళికలను, ప్లానింగులను చర్చిస్తున్నారు. తయారుచేస్తున్నారు. వీనిలో ప్రధాన భారత పారిశ్రామికుల ప్లానును ప్రత్యేకించి చెప్పాలి. దీనిని "ఇండియాకొరక ఆర్థికాభివృద్ధి ప్రణాళిక (సామాన్యముగా 'బొంబాయి ప్లాను') అంటారు. దీనిని 1944—45 లలో రెండు భాగాలుగా ప్రకటించారు పదివేలకోట్ల రూపాయల బ్రహ్మాండమైన పెట్టుబడి ప్రాతిపదికపై, పదిహేనేళ్ళలో జాతీయాదాయాన్ని మూడురెట్లు ఎక్కువచేయాలని ఈ ప్రణాళిక ఉద్దేశం ఇందుమూలంగా భారతీయుని సగటు ఆదాయాన్ని, జనాభా అభివృద్ధిని కూడ గమనించి రెండింతలు చేయాలని చూస్తున్నది. ఈ ఆశయ సాధనకు ముఖ్యంగా పరిశ్రమలపైననే ఆధారపడ్డారు ఈ ప్రణాళిక రచయితలు చెప్పినవి: పరిశ్రమలు అయిదింతలు పెరగాలి, వ్యవసాయం నూటికి నూటముప్పై అంతలు పెంచాలి. ఉద్యోగాలు రెండింతలు పెరగాలి ఇలా చేసినట్టయితే పరిశ్రమ లిప్పటి లాగా జాతీయాదాయంలో 17 వంతులుకాక నూటికి 35 వంతులు చేర్చగలుగుతుంది. వ్యవసాయం ఇప్పటిలా జాతీయాదాయంలో 53 వంతులుగాక, 40 వంతులు ఇవ్వగలుగుతుంది ఉద్యోగాలద్వారా 22 వంతులుకాక 20 వంతులికమీద వస్తుంది. ఈ ప్రణాళిక రచయితలు, ముందు భారీ పరిశ్రమలు - విద్యుచ్ఛక్తి గనులు, ఇంజనీరింగు, రసాయన పరిశ్రమలు, నౌకానిర్మాణం, మోటార్లు, విమానాల ఉత్పత్తి - ఇలాంటివానిని ముందు స్థాపించాలన్నారు చిన్న పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు తగిన అవకాశం కల్పించాలన్నారు.

ఈ ప్రణాళిక ఇంత పెద్ద ఉదారాశయాలను ప్రకటిస్తూ, వీని సాధనకు ముందుగా అవసరమైన వానిని గుర్తించలేదు. భారతదేశంలో పరిశ్రమాభివృద్ధికి ప్రధాన శృంఖలాలయిన జమీందారీల చావుపట్టు, బ్రిటిషు పెట్టుబడిదారీ పెత్తనం, వీనిని తొలగించాలన్నమాటే ఇందులోలేదు జాతీయాదాయాన్ని సమానంగా పంచే సమస్యనుకూడ సక్రమపద్ధతిలో పరిష్కరింప జూడలేదు ఇందుకు కావలసిన ధనంకూడ నోట్లు ముమ్మరంద్వారాను, విదేశపెట్టుబడిద్వారాను మాత్రమే చేకూర్చాలన్నారు. వాస్తవస్థితిలో జాతీయాభ్యుదయంకోసం, స్వతంత్ర పరిశ్రమాభివృద్ధిని భావించకుండా, ఈ ప్రణాళిక కేవలం బ్రిటిషు పెట్టుబడిదారులతో సహకరించి భారత పెట్టుబడిదారీవర్గం దేశాన్ని సంయుక్తంగా దోపిడీచేయడానికిమాత్రమే ప్రయత్నిస్తున్నది ఈ నిజమైన ఉద్దేశం, జీవితస్థాయి పెంచాలనే ఉదార వాక్యాలచాటునుండి అప్పుడే బయల్పడింది: ఈ ప్రణాళిక రచయితలలో ముఖ్యులైన జె. ఆర్. డి టాటా, జి. డి బిర్లా, సర్. శ్రీరామ్‌లు అప్పుడే బ్రిటిషు పెట్టుబడిదారులతో వ్యాపార ఒడంబడికలు చేసుకున్నారు.

భారతదేశంలో తీవ్ర సాంఘిక, ఆర్థిక పునర్నిర్మాణానికి కేంద్రంగా దేశాన్ని పారిశ్రామికం చేయాలన్న గుర్తింపు జాతీయోద్యమం వేసిన పెద్ద ముందడుగు. కాని అందువల్ల చాలతీవ్రమైన కొత్తసమస్యలు— ఆ కార్యక్రమం అమలు జరిపేందుకు అవసర పరిస్థితులు, వాని పద్ధతులుగూర్చి, ఆ పరిస్థితుల నేర్ప రచగల సాంఘిక శక్తులగూర్చి - ఉదయిస్తున్నవి. చాల అభివృద్ధిచెందిన ధనిక రాజ్యాలలో ఏర్పడిన ఆర్థిక సంకటావస్థను సోవియట్ యూనియన్‌లో విజయ వంతమైన సోషలిస్టు ప్లానింగును చూచి చాలమంది, 'ప్లానింగు' అంటూ సాంకేతిక పరిభాషలో ఆమాటను వాడుతున్నారు. కాని ధనికఆర్థిక వ్యవస్థలోను, సోషలిస్టు ఆర్థికవ్యవస్థలోను ఉన్న ప్రధానసూత్రాలను వీరుగుర్తించడంలేదు- నిజమైన సాంఘిక వర్గశక్తులను వీరుగ్రహించడంలేదు. ఇలాంటి దృష్టిలోని దౌర్బల్యాన్ని ధనిక దేశాల అనుభవం చూపెట్టింది. ఇవనన్నీ ఇండియాకు సరిపడనే సరిపడదు. ఎందు కంటే ఈదేశం విప్లవాత్మకమైన సాంఘిక మార్పును పొందుతున్నది. ఈమా ర్పులో ప్రధాననిర్ణాయకశక్తి రైతు, కార్మికులదే కాగలదు. ఎందుకంటే ఆకలిగొన్న కార్మికుల, రైతులవాంఛలే నేడుభారతరంగంలో కేంద్రస్థానం ఆక్రమిస్తున్నవి. ఆర్థిక పునర్నిర్మాణ సమస్యను ప్రధానసాంఘిక, వర్గసమస్యలనుండి వేరుపరచ వీలులేదు.

భారతదేశాన్ని పారిశ్రామికంగా చేయడం, పునర్నిర్మాణం చేయడం నేటి దరిద్రస్థితినుండి, పాతకాలపు వ్యవసాయ పద్ధతులనుండి అభ్యుదయవంత మైన పద్ధతికి మార్చడంఅంటే ఇందుకు మహత్తరబలంగల శక్తులెన్నో పని చేయాలి. ఇందుకు ప్రజానీకమంతా సహకారం చేయ్యాలి. జాతీయార్థిక వ్యవస్థలైన ద్రవ్యంపైన ప్రధానాంశాలలో ప్రభుత్వానికధికారం ఉండాలి

ఈకార్యక్రమాన్ని నడిపించగలశక్తి భారతదేశపు పెట్టుబడిదారీ వర్గానికున్నదా? భారతప్రజలు తాముపోరాడి జాతీయస్వతంత్రం సాధించి, ఆస్వతంత్రాన్ని ఏకొందరు దోపిడీవర్గంవారి చేతిలోను తమకష్టఫలితా న్నుంచి తాముదాస్యంలోనే సంతృప్తి చెందుతారా? భారతదేశంలో ఆర్థిక, సాంఘిక, అభ్యుదయ కార్యక్రమానికి పరిశ్రమాభివృద్ధికి, నూతనసమాజ నిర్మా ణానికి చేయవలసిన పనిప్రారంభ పెట్టుబడిదారీదశలో పాశ్చాత్యదేశాల్లో పారిశ్రామిక విప్లవ కార్యక్రమంకంటే భిన్నమైనదని తెలపడానికే పైప్రశ్న అవసరం. పెట్టు బడిదారీ విధానం శిథిలమవుతున్న ఈ యుగంలో, అంతర్జాతీయ కార్మికవిప్లవాలు ముందుకువస్తున్న ఈయుగంలో పారిశ్రామికాభివృద్ధి, భారత ఆర్థిక పునర్నిర్మాణం అనే కార్యక్రమం తప్పకుండా నూతన పద్ధతులలో, స్వరూపాలలోనే నడవవలసి వస్తుంది.

సమగ్రంగా వ్యవసాయాన్ని పునర్నిర్మాణం చేయకుండా పరిశ్రమాభివృద్ధి సాధ్యంకాదు. ఇప్పటికీ ఇదే భారత ఆర్థికవ్యవస్థలో ప్రధానసమస్యగా ఉన్నది.

ఇవి రెండూ వాస్తవస్థితిలో ఒకదానికొకటి ఉపస్కారకమైనవే పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థలోగూడ, వ్యవసాయదారులు అతి దరిద్రహీనస్థితిలో ఉండి, పారిశ్రామిక వస్తువులను దేశంలోని మార్కెట్టును ఉపయోగించుకోలేకపోతే పరిశ్రమాభివృద్ధి కుంటుపడుతుంది సంకుచితమైపోతుంది. ఇలాగే వ్యవసాయ పునర్నిర్మాణానికి పరిశ్రమాభివృద్ధి కూడ అవసరం - వ్యవసాయ పరికరాలను పరిశ్రమలే అందించగలవు అలాంటిదే ఉత్పత్తిస్థాయిని పెంచగలుగుతుంది. విశాలమైన బీడుభూములను సేద్యంచేయడం అప్పుడే వీలవుతుంది. అతిదరిద్రస్థితిలో నేడు ఏ కొంతకాలమో పనిదొరికి మిగతా అప్పుడంతా వ్యవసాయం పైనే క్రిక్కిరిసి తమశక్తిని వ్యర్థంచేస్తున్న కోట్లకొలది మందికి అప్పుడే ఉద్యోగం చిక్కగలదు. వీరందరూ వ్యవసాయ పునర్నిర్మాణంతోనే బయటపడగలరు.

కాని వ్యవసాయ పునర్నిర్మాణం జరగాలంటే మనం మూడోభాగంలో ఈ సమస్యను పరిశీలించినప్పుడు సూచించినరీతిగా జమీందారీవిధానం రద్దుకావాలి పొలాలను తిరిగి పంపకం చెయ్యాలి; ఆర్థికంగా లాభదాయకంకాని చిన్నచిన్న పొలాలనుంచే అసమర్థ పద్ధతిని రద్దుచేయాలి; క్రమంగా పాతకాలపు చిన్న స్థాయిలో జరిగే పద్ధతినుండి భారీగా సమిష్టి వ్యవసాయపద్ధతి వేపునకు పురోగమించాలి, ఈ విషయంలో సగంసగం పరిష్కారమేదీ సాధ్యంకాదు జమీందారీ విధానాన్నలాగే ఉంచి, ఇప్పుడున్న భూమి పంపకాన్ని తగలకుండా వ్యవసాయ "సంస్కరణ" అనీ, వ్యవసాయ "అభివృద్ధి" అనీ అవే మాటలు శుష్కమైనవి. ఇప్పుడున్న అధ్వాన్నస్థితిలో దిక్కులేనంతమంది ఉన్న జమీందారీ విధానపు పరాన్నభుక్కులకు, వారిక్రింది ఉపగ్రహాలకూ తావులేయు రైతులపైనున్న అనంత భారానికి ఆస్కారంలేదు. నేటి భూవిధానంద్వారా వ్యవసాయ పద్ధతిద్వారా ఏర్పడిన వ్యర్థభూమికి ఆలంబనంలేదు. భారతదేశ వ్యవసాయ విషయంలో ప్రధాన పండితుడైన ప్రొఫెసర్ రాధాకమల ముఖర్జీ - ఆయన దృక్పథంలో ఏమాత్రం సోషలిస్టు కాకపోయినా - చాల ముందుకు వెళ్ళాడు ఆగ్రా ఎక్స్టెన్షన్ ఉపన్యాసాలలో 1935 లో ఆయనెంతవరకు అన్నాడంటే; "భారతగ్రామం చిన్నచిన్న పొలాల సముదాయంగా ఉండడంపోయి ఒకేఒక సహకారక్షేత్రంగా మారేవరకు, వ్యవసాయం సమిష్టికార్యంగా భావింపబడేవరకు" భారత వ్యవసాయంలో ఏ అభివృద్ధీ సాధ్యంకాదన్నాడు. ఇలాంటి ఫలితం ఒకేఒక ఊపులో సాధ్యంకాదు, కాని ఇందుకు మొదటి అడుగుగా జమీందారీలను రద్దుచేయాలి; పొలాలను తిరిగి పంపిణీ చెయ్యాలి; సహకార పద్ధతిలో డబ్బు సహాయం, డిపో స్టేషన్లుపెట్టి వ్యవసాయపద్ధతిని అభివృద్ధిచేసేందుకు వ్యవసాయ యంత్రాలను ఎరువివ్వడం ప్రభుత్వం చెయ్యాలి. వ్యవసాయ విప్లవాన్ని వదిలివేసి ముందుకుపో వీలులేదు. మార్పునుతెచ్చే ప్రధానశక్తే అది. అదే నూతన భారతదేశానికి పునాదిరాయి కాగలదు.

భారత అభ్యుదయానికి భావి నాయకత్వంగా భారత బూర్జువావర్గంలోని దౌర్బల్యం ఇక్కడే సునిశితంగా బయల్పడుతున్నది. తన అభివృద్ధి ఉత్పత్తులను బట్టి భారతదేశంలోని పారిశ్రామిక, వ్యాపార పెట్టుబడిదారీవర్గం, భూస్వామి వర్గంతో సన్నిహితంగా సంబంధమై ఉన్నది. కాబట్టే భారత పరిశ్రమాభివృద్ధికి ఎంత ముఖ్యమైనప్పటికి జమీందారీల రద్దునుగూర్చి, భూమి విధానంలో ముఖ్య సంస్కరణలగూర్చి అభ్యుదయవంతమైన బూర్జువావర్గం తటపటాయిస్తున్నది. 1946 కాంగ్రెస్ ఎలెక్షన్ ప్రణాళిక జమీందారీల రద్దును సూత్రప్రాయంగా అంగీకరించింది. కాని అది జమీందారుకు "న్యాయమైన నష్టపరిహారం" ఇచ్చే ప్రాతిపదికపై జరగాలన్నది. అంటే యదార్థస్థితిలో ఈ భారం యథారీతిగా సాగించడమే అవుతుంది. కాంగ్రెస్ నేషనల్ ప్లానింగ్ కమిటీ ఆధ్వర్యంక్రింద 1946 లో ప్రకటితమైన ప్రాథమిక విద్యా ప్రణాళిక ముసాయిదా, చల్లగా రైతుల రూపాన్ని ప్రభుత్వం ఇవ్వాలన్నది - ఇందులో నూటికి 10 పాళ్ళు రైతులనుండి వసూలు చెయ్యాలని, అందులో అయిదుపాళ్ళు వడ్డీవ్యాపారికి వెళ్ళాలని, మిగత అయిదు పాళ్ళు ప్రాథమిక విద్యకు పెట్టాలని అన్నది.

ప్రధాన సమస్యయైన భూవిధాన సమస్యను పరిష్కరించడానికి భారత ధనికవర్గం వెనుదీస్తున్నదంటే, తమ ప్రయోజనాలు భూస్వామ్యవర్గ ప్రయోజనాలు ఒకలాంటివే కావడమూ, తమ ఇరువురిమధ్యా ఉన్న సంబంధాలూ మాత్రమే కారణంకాదు ఇంకో భయంకూడ వారికున్నది వ్యవసాయ విప్లవంద్వారా బయటపడే సామాజికశక్తులు తమ వర్గ సౌకర్యాలనుకూడ తుడిచిపెట్టివేసి, ధనికవాద అస్తిస్వత్వం, పీడనలయొక్క అసలు పునాదినే నిర్మూలిస్తాయేమోనని వారి భయం. ఈ భయాన్ని ఆధారంచేసుకునే సామ్రాజ్యవాదం, బుద్ధిపూర్వకంగా వదలకుండా నాటకమాడుతున్నది. ఇలా భారత ధనికవర్గంయొక్క ప్రతిపక్ష పోరాటాన్ని స్తబ్దంచేయాలని చూస్తూ వచ్చింది. తద్వారా లోనుండే జాతీయోద్యమాన్ని దుర్బలపరచాలని ప్రయత్నించింది, ఇందుకే లార్డు హైలే (అప్పటికి సర్. మాల్కం హైలే) 1924 నాటికే ఢిల్లీ శాసనసభలో స్వరాజ్యపార్టీ నిలా హెచ్చరించాడు :

> "భారతదేశంలో నిజమైన విప్లవంలాంటిదేదైనా రావడం అంటే అందువల్ల, ఇప్పుడు ఈ సభలోను, రాష్ట్రశాసనసభల్లోను ఉన్నవర్గానికే మహోపద్రవం సంభవిస్తుందన్నమాట; అజ్ఞాన భారతప్రజానీకంలో ఒక రాజకీయవిప్లవం రావడం అంటే, అది చాల త్వరలోనే సాంఘిక విప్లవం కాగలదు "

ఇందుతోపాటు, ఎన్నోసంగతులు బయటపెట్టే గాంధీవాక్యాలను పోల్చి చూడవచ్చు. 1940 జనవరిలో తన హరిజన్ పత్రికలో గాంధీజీ ఇలా వ్రాశాడు.

> "పెద్దపలుకుబడిగల ఒకకాంగ్రెసు వాది నాకిలా చెప్పాడు. నేను సత్యాగ్రహాన్ని ప్రకటించిన వెంటనే ఈసారి బ్రహ్మాండంగా ప్రజలా పిలుపు

నందుకుంటారని ఆయన చెప్పాడు. వెంటనే భారతదేశం వివిధభాగాలలో ఉన్న కార్మికలోకమూ, రైతులూ సత్యాగ్రహంతోపాటు సమ్మె ప్రకటిస్తారని ఆయన నాకు నమ్మకంగా చెప్పాడు. అలాజరిగితే, నే నెక్కువ బాధపడతానని, నా ఏర్పాట్లన్నీ తలక్రిందులవుతాయని ఆయనకు చెప్పాను. అరాచకంలోను, ఎర్రవినాశంతోను అంతమయ్యే పోరాటాన్ని తెలిసి తెలిసీ నేను ఆరంభించనని ఆశిస్తున్నాను."

కార్మిక కర్షకులు చేరడంతో "ఎర్రవినాశం" ఏర్పడుతుందనే భయం, అన్ని దేశాలలోని అభివృద్ధి విరోధకుల సుపరిచిత భాషలోను కనిపించేదే. ఇదే సామ్రాజ్యవాదానికి, జాతీయ పెట్టుబడిదారీవర్గానికి సమానవేదికను ఏర్పరుస్తున్నది.

ఇలా భారతదేశ పరిస్థితిలోని ప్రత్యక్షానుభవంవల్ల, దినదినానికి అత్యవసరమవుతున్న అవసరాలవల్ల, జాతీయ పోరాటంలో ఎన్నోసార్లు బూర్జువా నాయకత్వం దౌర్బల్యమూ, వైఫల్యమూ అనుభవించడంవల్ల వీటన్నిటికంటె పైగా కార్మికవర్గ చైతన్యం, బలం, కార్యవ్యగ్రత దినదినాభివృద్ధి చెందడంవల్ల, వ్యవసాయ విప్లవశక్తులు సంఘటిత మవుతుండడంవల్ల భారతదేశ జాతీయోద్యమంలో నేటి యుగంలో తప్పనిసరిగా సోషలిజం సమస్య ముందుకు వచ్చింది భారతదేశంలో సోషలిజం అనే భావం ఏ భావికాలానికో సంబంధించిన ఊహావాదం కాదు; బయటనుండి దిగుమతి అయినదీకాదు. మరి భారతపరిస్థితులలో, భారతీయుల అనుభవంలో ప్రత్యక్షఫలితంగా ఇతరదేశాలన్నిటిలో వలెనే ప్రపంచోద్యమపు సిద్ధాంతం ఆచరణలకు ఉపయోగించుకొని ఉత్పన్నమైనదేకాని వేరుకాదు. భారతదేశంలో రాజకీయ కార్మికవర్గ ఉద్యమం ఇంకా అభివృద్ధిచెందే దశలోనే ఉన్నది. సంఘటితపడుతూ, విస్పష్ట కార్యక్రమాన్ని, అనుభవాన్ని, ప్రజా ప్రాతిపదికను సంపాదించుకుంటున్నది; కాని ఇప్పటికే దీనిని అభివృద్ధిచెందుతున్న భావిశక్తిగా అందరూ గుర్తిస్తున్నారు.

జాతీయోద్యమంలో సోషలిస్టుభావాల పలుకబడి, సోషలిజానికి - జాతీయవాదానికి మధ్యఉన్న సంబంధప్రచారం గత పదేళ్ళలో పరివర్తనస్థితికి చిహ్నమైన జవహర్లాల్ నెహ్రూ నాయకత్వంలో స్పష్టపడింది. ఈయన 1929 లోను 1936–38 లోను కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్నాడు. ఈయన సంఘటిత సోషలిస్టు ఉద్యమానికి బయటనేఉంటూ పెంపొందుతున్న సోషలిస్టుభావాలకూ, పాత నాయకత్వానికీ మధ్య వంతెనగా పనిచేశాడు. జాతీయ స్వతంత్రానికీ, సాంఘిక స్వతంత్రానికీ మధ్యనున్న సన్నిహిత సంబంధాన్ని నెహ్రూ ముందుకు తెచ్చాడు :

"విదేశ ప్రభుత్వంస్థానే, దేశీయ ప్రభుత్వం ఏర్పడింది. జమీందారీ పెట్టుబడిదారీ వర్గాలను చెక్కుచెదరకుండా అలాగే ఉంచితే, అప్పుడది స్వతంత్రచ్ఛాయా మాత్రంకూడా కాదు.....

"కాబట్టి భారత ప్రజల దోపిడీని అంతమొందించే పద్ధతిలోనే భారతదేశ తక్షణాశయాన్ని ఊహించాలి. రాజకీయంగా స్వతంత్రం, బ్రిటిష్ సంబంధాన్ని తొలగించుకోవడం, అంటే సామ్రాజ్యవాదానికి లోబడి ఉండే స్థితిని తొలగించుకోవాలి; ఆర్థికంగా, సామాజికంగా స్వతంత్రానికి అర్థమేమంటే అన్ని ప్రత్యేక వర్గ సౌకర్యాలను, జమీందారీ పెట్టుబడిదారీ ప్రయోజనాలను తుదముట్టించాలి."

(జవహర్లాల్ నెహ్రూ, "భారతదేశమా ఎక్కడికి ?" 1933.)

కాంగ్రెస్ సోషలిస్టు, ఇతరవర్గాల జాతీయ పోరాటంలో కలయికను సూచిస్తున్నదని ఆయన గుర్తించాడు ఈ పోరాటంలో ఇతరులే ఇప్పుడు అధిక సంఖ్యాకులుగా ఉన్నారని గుర్తించాడు ఇందుతోపాటు జాతీయోద్యమం ఎలా సోషలిస్టు దృక్పథంవేపు పురోగమించాలో తన భావాలను ఆయన ఇలా వెల్లడించాడు :

"నేను భారత స్వతంత్రంకోసం పోరాడుతున్నానంటే నాలోని జాతీయవాద భావం విదేశీశాల ననుసరించదు కాబట్టి; అందుకై మరింత ఎక్కువగా ఎందుకు పనిచేస్తానంటే, సాంఘిక, ఆర్థిక మార్పులకు అది తప్పనిసరిగా మొదటిమెట్టని భావిస్తున్నాను కాబట్టే. కాంగ్రెస్ సోషలిస్టు సంస్థ కావాలని, నూతన సంస్కృతికోసం పనిచేస్తున్న ప్రపంచశక్తులతో చేరాలని నేను కోరుతున్నాను. కాని కాంగ్రెస్‌లోని అధికసంఖ్యాకులు - ఇప్పుడున్న పద్ధతిలో - అంత దూరంగా పోవడానికి సిద్ధంగా ఉండక పోవచ్చు.....

"ఈదేశంలో సోషలిజం అభివృద్ధి చెందాలని నేనెంత అభిలషిస్తున్నప్పటికీ. దీనిని కాంగ్రెస్‌పై బలవంతంగారుద్ది, తద్వారా స్వతంత్ర పోరాటమార్గంలో ఆటంకాలు ఏర్పరచ దలచుకోలేదని నేనుకోరుతున్నాను. స్వతంత్రంకోసం పనిచేసే వారందరితోను వారు సోషలిస్టు పరిష్కార మార్గాన్ని అంగీకరించక పోయినప్పటికి సంతోషంతో కలిసి నేను సర్వ శక్తులూ ఉపయోగించి సహకారంచేస్తాను, కాని, అలా సహకరించే టప్పుడు నాస్థితిని స్పష్టంగా ప్రకటనచేస్తాను. కొన్నిరోజులలో కాంగ్రెస్‌ను, దేశాన్నిగూడ నావైపునకు త్రిప్పుకోగలననే ఆశిస్తున్నాను. అప్పుడే దేశం స్వతంత్రాన్ని సాధించినట్టే నేనుభావించగలను."

(జవహర్లాల్ నెహ్రూ లక్నోకాంగ్రెస్ అధ్యక్షోపన్యాసం 1936.)

ఇందులో కాంగ్రెసును క్రమంగా సోషలిజంవైపు మార్చాలని, ఈమధ్య కాలంలో తాత్కాలిక సమానతను నిలపాలని సూచింపబడింది. ఏమైనప్పటికి నేటి వర్గశక్తులమధ్య ఏర్పడుతున్న ఈ తగాదాలు తప్పనిసరిగా కాంగ్రెసులో కూడ ప్రతిఫలించడం. కాంగ్రెసుకూ ప్రజాసామాన్యానికీ మధ్యఉన్న

సంబంధసమస్య - ఇవన్నిటివి పైభావం గుర్తించడంలేదు, కాబట్టి ఈ భావం జాతీయైక్యత అనేపేర వర్గసామరస్య సిద్ధాంతంగా పరిణమిస్తున్నది; అలాంటివర్గ సామరస్యం, ఆచరణలో జాతీయ బూర్జువా నాయకత్వం చేతికి ఆయుధంగా దొరు కుతుంది. ఆ నాయకత్వం జాతీయపోరాటం పురోగతిని వెనక్కు నెట్టుతుంది.

భారత సమస్యల తుదిపరిష్కారం, సోషలిస్టు పద్ధతిలోనే జరగాలన్న విషయాన్ని రానురానూ అభ్యుదయవాదు లందరూ గ్రహిస్తున్నారు. ఇందులో సందేహంలేదు, సంఘపరం చేయబడిన పరిశ్రమలు. సమిష్టి వ్యవసాయం తగిన పరికరాలను చేకూర్చగలదు - వానిద్వారా భారత దేశం కుక్కిగుడిసెలనుండి సౌభాగ్య సమృద్ధమైన దేశంకాగలదు. సమగ్రశ నందిన కార్మికవర్గ శక్తులు, వానినాయ కత్వ పాత్ర, దాస్యబంధనాలు విడగొట్టుకొన్న వ్యవసాయదారులు, తమతోపాటు స్పష్టాభిప్రాయాలుగల మేధావివర్గం, పట్టణ మధ్యతరగతులలోని అభ్యుదయకర భావాలుగలవారితో సహకరించి, కంపుగొడుతున్న మురికి తిప్పలను నిర్మూలం చేసి భారతదేశంలో నూతన సమాజాన్ని నిర్మించగలవు.

ఈ భారత భవిష్యత్తు దూరంనుండి పరిశీలించే కొందరు భావిస్తున్నట్టు చాల దూరంలోనూ లేదు. భారత సోషలిస్టు భవిష్యత్తులోని చైతన్యశక్తులు - కార్మిక వర్గం, రైతు ప్రజాకోటి శక్తులు అప్పుడే సంఘటిత మవుతున్నవి; దినదినాభివృద్ధి చెందుతూ ముందుకుపోతూ స్పష్టంగా రాజకీయ రంగంలో ప్రథమశ్రేణి నాక్ర మిస్తున్నవి. వర్గ పోరాటమనే ప్రాతిపదికపై కార్మికసంఘాలు తమ రాజకీయపార్టీ అభివృద్ధి చెందడంద్వారా కార్మికవర్గం పరిణతమైన నిర్మాణశక్తినీ, రాజకీయ నాయకత్వాన్ని సాధించాలి మార్క్సిస్టు సిద్ధాంతదృష్ట్యా నడపబడాలి. పేద రైతులు - వ్యవసాయ కార్మికులతో సంబంధం ఏర్పరచుకోవాలి. వీరప్పుడే తమ రైతుసంఘాల నేర్పరచుకుంటున్నారు; ఇలాంటిస్థితి ఒకసారి ఏర్పడినవెంటనే శ్రామికజనుల భారత ప్రజాస్వామ్య ప్రభుత్వ స్థాపనకు పరిస్థితులు చేకూరుతాయి. అభ్యుదయవంతులైన మేధావుల, ఇతర పట్టణ మధ్యతరగతుల సహకారంతో కార్మిక-కర్షకుల ప్రజాస్వామిక శక్తులకు 'ఇలాంటి ప్రజాస్వామ్య ప్రభుత్వం ప్రతి బింబంకాగలదు. ఈ కార్మిక - కర్షక - అభ్యుదయ మేధావివర్గం తమ సమిష్టి కార్య క్రమంతో సోషలిజం వేపుకు నడిపే సాంఘిక పునర్నిర్మాణానికి పునాదులను ఇప్పటికే వేశారు;

ఈవిషయంలో సోవియట్ యూనియన్ అనుభవమూ, అక్కడ ఏర్పడిన నూతన ప్రజాస్వామ్య పద్ధతీ భారతదేశంవంటి దేశానికి ఎంతో ముఖ్యమైన పాఠాలు నేర్పగలదు. ఆ అంశాన్నెంతో జాగ్రత్తగా పరిగ్రహించవలసి ఉన్నది విప్లవానికి ముందున్న పాతజారిస్టు రష్యాకు నేటిభారత దేశానికి ప్రధానమైన విభేదమున్నది. ఇందువల్ల యంత్రప్రాయంగా దానినీ దీనినీ పోల్చి చెప్పరాదు. ఆ ప్రధానమైన విభేద మేమంటే అనాటి రష్యా సామ్రాజ్యవాద దేశం, ఈనాటి భారతదేశం వలసదేశం. ఇలాంటి భేదం ఎంత ఉన్నప్పటికి సాంఘికశక్తుల సంబంధాలు,

ఎదుర్కొనవలసిన సమస్యలు చాలవరకు రెండుదేశాలకూ సమానంగా ఉన్నవి. నేడు భారతదేశం ఎదుర్కొనవలసిన సమస్యలనే సోవియట్ యూనియన్ సులువుగా పరిష్కరించుకున్నది కాబట్టి దానినుండి నేర్చుకోవలసింది చాలాఉన్నది

భారతదేశంలో నిరంకుశ విదేశ ప్రభుత్వం. అప్పుడే దుర్బలపడిపోయి, మధ్యయుగ సంస్థానాల భూస్వాముల అభివృద్ధినిరోధకశక్తులపై ఆధారపడడం నేడు కనిపిస్తున్నది; ఇక మరోవేపు దుర్బలమైన పారిశ్రామిక పెట్టుబడిదారీవర్గం పురోగమించాలని అభిలషిస్తూ, నిరంకుశ విదేశ ప్రభుత్వానికి అటొకసారి ఇటొకసారీ ఊగిసలాడే ప్రతిపక్షంగా ఉంటున్నది-కాని మరోవేపు ప్రజాశక్తులను చూచి ఈవర్గం భయపడుతున్నది; ఇక అభివృద్ధిచెందుతున్న పారిశ్రామిక కార్మిక వర్గం సంఖ్యలో చిన్నదయినప్పటికి తక్కువ కేంద్రాలలో పెద్ద పారిశ్రామిక ప్రాంతాల్లో కేంద్రీకృతమై ఉన్నది: ఇప్పటికే ఈవర్గం తీవ్రవర్గ చైతన్య కార్యక్రమం కల్గివున్నది మరొకవేపు జనాభాలో అత్యధిక సంఖ్యతో ఉన్న రైతు ప్రజానీకం మరీ నీరసమైన భూ విధానంక్రింద అతి అధ్వాన్నస్థితిలో బ్రతుకుతూ, అవిద్యా అజ్ఞానాలతో బాధపడుతూ తెగింపుచేసి ప్రధానమైన వ్యవసాయ విధానంలో మార్పు తేవడానికి ముందుకు దూకుతున్నది.

ఇలాంటి సాంఘిక పరిస్థితులుగల భారతదేశంవంటి దేశానికి, పార్లమెంటరీ పద్ధతి ప్రజాతంత్రం కాదని స్పష్టమవుతున్నది. ఇక్కడి ప్రజాసామాన్య జీవితానికీ, పరిస్థితులకూ సరిగా సరిపడేపద్ధతి - పనిచేసేరైతుల గ్రామసంఘాలను ఫ్యాక్టరీలలోని కార్మికసంఘాలతోను అలాంటి ఇతరసంఘాలతోను కలిపేపద్ధతి ఏర్పడాలి. అలాంటి ప్రజాస్వామ్యపద్ధతి సోవియట్ ప్రజాస్వామ్యమే. సోవియట్ ప్రజాస్వామ్యం - కర్మాగారాలలోని కార్మికులకూ, గ్రామాలలోని రైతులకూ - ప్రజలకు సన్నిహితంగా ఉంటుంది. నేటిపరిస్థితిలో తమ మేధాశక్తులను సమిష్టియోగక్షేమాలకు ఉపయోగించలేక అణగారిఉన్న మేధావుల, వైజ్ఞానికుల, సాంకేతిక విద్యా ప్రవీణులయొక్క, కార్మిక కర్షక వర్గంయొక్క సృజన శక్తులన్నీ సోవియట్ ప్రజాస్వామ్యపద్ధతితో విమోచనం పొందగలవు - ఇందుకు వేరేపద్ధతులేవీ అంతగా సరిపడవు. ఈ సోవియట్ ప్రజాస్వామ్యంలో పైశక్తులన్నీ విమోచనంపొంది నూతన భారతనిర్మాణమనే సమష్టికర్తవ్య నిర్వహణలో సహకారం చేయగలవు *

* 1936 లక్నో కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసంలో. జవహర్లాల్ నెహ్రూ సోవియట్ ప్రజాస్వామ్యపద్ధతిని అభినందించాడు. అది గమనించవలసిన అంశం. అందులో ఇలా ఉంది :

"వెబ్బు దంపతులు రష్యామీద వ్రాసిన కొత్త పుస్తకంలో-ఆ బ్రహ్మాండమైన రికార్డులో ఒక అంశం గమనించదగింది -సోవియట్ నిర్మాణమంతా సజీవ ప్రజాతంత్ర ప్రాతిపదికపై ఎంత విశాలంగా ఏర్పడిందో వివరించబడింది. పశ్చిమదేశాల పద్ధతిలో రష్యా ప్రజాస్వామిక దేశం కాదంటారు కాని ఇంకే దేశంలోనూ లేనంత ఎక్కువగా ప్రజాసామాన్యంలో అత్యుత్తమ ప్రజాస్వామ్య ప్రధానాంశాలు, రష్యాలో కనిపిస్తున్నవి.

# భారత దేశం ముందున్న కర్తవ్యాలు.

శ్రీ ప్రజల భారతదేశం, కార్మిక కర్షకుల భారతదేశం సోషలిజంవేపు పురోగమించడం మనకు కనిపిస్తున్నది. ఆధునిక ప్రపంచంలో భారత భావిచరిత్రం ఇలా కనిపిస్తున్నది; ఈ దృష్టితోనే మనం భారతదేశంలో సోషలిజం స్థాపనను చూడాలి. భవిష్యత్తులో దీని అంతిమపరిణామంగా వర్గరహిత సమాజం ఏర్పడగలదు. జాతీయవిభేదాలన్నీ (స్వతంత్రపరివర్తనదశలో విభేదం తప్పదు - ఆ ఏర్పాటు ఒకజాతిని మరోజాతి దాస్యంలో ఉంచడాన్ని రద్దుచేయడం కోసం ఏర్పడుతుంది) అప్పుడు పూర్తిగా మాయమయిపోతాయి; సంయుక్తప్రపంచ వర్గరహితసమాజంలో భారతదేశం ఒక భాగం కాగలదు.

కాని ఇలాచెప్పడంవల్ల, ఒక్క అంగలో ఈ ఆశయం సాధితమవుతుందని కాని, భారతదేశంలో ఇక వెంటనే రానున్న దశ సోషలిజమే అని కాని అర్థం కాదు.

ప్రప్రథమ కర్తవ్యం జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించడం. వెంటనే భారత ప్రజానీకం అనుసరించవలసిన ముందడుగు ఏదంటే - సామ్రాజ్యవాద పాలనను కూలద్రోసి జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించడం. ఆ సామ్రాజ్యవాద ప్రభుత్వానికి అండగా ప్రజలలోనే ఉన్న సంస్థానాధీశుల-భూస్వామి అభివృద్ధినిరోధక శక్తుల్ని నిర్మూలించడం- అంటే ప్రజాస్వామిక పోరాటాన్ని ముమ్మరంగా సాగించడం అన్నమాట.

కాని జాతీయ స్వతంత్ర కర్తవ్య నిర్వహణకు, భారతదేశంలో ప్రజాస్వామిక విప్లవ నిర్వహణకు, బ్రిటిష్ ప్రభుత్వం భారత ప్రభుత్వానికి అధికారాన్ని సర్వస్వతంత్ర హక్కును ఇవ్వడం మాత్రమే చాలదు.

---

ఆ దేశంలోవున్న అనులక్ష గ్రామాలు పట్టణాలలో విశాల ప్రజాస్వామిక నిర్మాణం వెలయుచున్నది. ప్రతి గ్రామంలో, పట్టణంలోను సోవియట్ ఉంది, అది చర్చిస్తూ, వాదోపవాదాలు జరుపుతూ, విమర్శిస్తూ, విధాన నిర్ణాణంలో సాయపడుతూ ఉంటుంది; పై కమిటీలకు ప్రతినిధులను ఎన్నుకుంటూ ఉంటుంది. ఈ నిర్మాణం 18 ఏళ్ళకు మించిన సమస్త ప్రజానీకానికి సంబంధించి ఉన్నది. వారందరూ పౌరహక్కులు కలిగి ఉన్నారు. ఇది పౌర నిర్మాణం. ఇలాగే ఇప్పటి ప్రజలు ఉత్పత్తి దారులుగా వంఘటితులైన మరో నిర్మాణం ఉన్నది. అలాంటి విశాలమే అయినవస్తు ఉపయోగదారులుగా ఈ ప్రజానీకం పాల్గొనే మరో నిర్మాణంకూడ ఉన్నది. ఇలాగా కోట్లకొలది స్త్రీలూ, పురుషులూ ఎవతెకవి లేకుండా ప్రజాహితకార్యాల చర్చలలోను, నిజానికి దేశ పరిపాలనలోను పాల్గొంటున్నారు. ఇలా ఆచరణలో ప్రజాస్వామ్య కార్యక్రమం అమలు జరపడం చరిత్రలో ఇంకెక్కడా కనిపించదు"

(నెహ్రూ, లక్నో కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసం, 1936)

మొదటిది : భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించడం. సామ్రాజ్యవాదుల పెత్తనం నిర్మూలించడం. జనగాలు కూడా కేవలం భారత దేశంలో సామ్రాజ్యవాద రాజకీయ పాలన నాయకత్వం అంతం కావడం మాత్రమే నని వేరుగా ముందే గ్రహించారు. భారత ప్రజల జీవితం, శ్రమశక్తి, సహజావకాశాలపై బ్రిటిష్ శాసకుల పెట్టుబడియొక్క ఉక్కు త్రాడును నరికివేసి భారతీయుల అభివృద్ధికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సంపాదించడం ఇందుకు అవసరం. అంటే, ఇప్పుడు విదేశీ పెట్టుబడికున్న సౌకర్యాలన్నీ రద్దుచెయ్యాలి. విదేశీయులక్రింద ఉన్న వ్యాపారసంస్థలు, తేయాకు, రబ్బరు, కాఫీ తోటలు, ఫ్యాక్టరీలు, రైల్వేలు, నౌకాయానం, జలాంధార వసతులు మొదలైనవన్నీ భారతదేశం స్వాధీనపరచుకోవాలి; ఇందుతోపాటు పరస్పర బలాబలాలనుబట్టి, రాజకీయంగా సాధ్యమైనంతవరకు ఋణ భారాన్ని తగ్గించుకోవాలి.

రెండోది : ప్రజాస్వామ్యపద్ధతిక దేశాన్ని మార్చడం – ఇందుకు పూర్వం మనం గమనించినట్లుగా వ్యవసాయవిప్లవం జరగాలి. జమీందారీ విధానాన్ని రద్దుచేయాలి ; భూమినితిరిగి పంపకంచేయాలి; రైతుల అప్పులను తుడిచివేయాలి ; వ్యవసాయాన్ని ఆధునిక పద్ధతుల క్రిందికి తేవాలి.

మూడోది : స్వతంత్ర భారత దేశానికి ఏకైక ప్రాతిపదిక అయిన పారిశ్రామికాభివృద్ధి, సాంస్కృతిక పురోగతి సాధ్యమయ్యేట్టు చెయ్యాలంటే అందుకు తక్షణమే ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణం జరగాలి. ఇందుకు కాంగ్రెస్ ప్రాథమికహక్కుల ప్రకటనలో సూచించినట్లుగా, స్వతంత్ర భారత ప్రభుత్వం చేతిలో. ప్రధాన ఆర్థిక వ్యవస్థలోని అంశాలుండాలి : ప్రధాన పరిశ్రమలు, ఉద్యోగాలు, ఖనిజసంపత్తి, రైల్వేలు, జలమార్గాలు, వ్యాపార నౌకలు, ఇతర ప్రజా రవాణామార్గాలు, బాంకింగు, అప్పులు ఇవన్నీ భారతప్రభుత్వం చేతిలోనే ఉండాలి.

ఇవన్నీ సోషలిజానికి ప్రాథమిక పునాదిని నిర్మించినప్పటికి ఇదే సోషలిజం నిర్మాణ కార్యక్రమం కాదు

నేటి జాతీయ స్వతంత్ర పోరాట ఆశయం భారతదేశంలో ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నిర్మించడం. ఈ ప్రజాస్వామిక ప్రభుత్వం తప్పకుండా అన్నో

నూతన సమాజంలోని ప్రజాస్వామ్య రాజ్యాంగంకాక తప్పదు. ఇం పాశ్చాత్యదేశాలలోని సామ్రాజ్యవాద బహుళసంఖ్యాక వర్గపు పాలనలో ఏర్పడిన అసమగ్ర ప్రజాస్వామిక పద్ధతిలో ఉండకూడదు. భారతదేశంలో ఏర్పడనున్న ప్రజాస్వామిక ప్రభుత్వం సంస్థాన నిరంకుశ పాలనమును, భూస్వామ్య విధానాన్ని నిర్మూలించగలగాలి. జాతీయాభివృద్ధికోసం ఆర్థిక వ్యవస్థ లోని కీలక స్థానాలను తనచేతి నుంచుకొనేదిగా ఉండాలి; కార్మిక వర్గంయొక్క, రైతులయొక్క సంఘ నిర్మాణాలకూ, పురోగతికీ సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చేదిగా ఉండాలి.

స్వతంత్రంకోసం భారతదేశం నడపనున్న తుదిపోరాటాలు దగ్గరలో నున్నవి. ఆ స్వతంత్రంవేపు జరిగే మార్పు సంక్షోభపూరితంగా ఉంటుందా అనంత త్యాగాలతో సాధించవలసి ఉంటుందా, లేక ఆ మార్పు సులువుగా త్వరగా జరుగుతుందా అనేవి భారతజాతీయోద్యమ బలంపై మాత్రమే ఆధారపడవు మరి బ్రిటిష్ కార్మికవర్గమూ, బ్రిటిష్ ప్రజాస్వామిక ఉద్యమమూ అర్థంచేసుకుని సహకరించడం మీదకూడ ఇవి ఆధారపడిఉంటుంది ఏమైనప్పటికీ, పోరాటం ఎలాంటి సూత్రాలపై జరిగినప్పటికి ఈ మార్పు పుట్టుక చారిత్రక సత్యం సమయం మించకముందే ఈ సత్యాన్ని బ్రిటన్‌లోని కార్మికవర్గమూ, ప్రజాస్వామ్యశక్తులూ గ్రహించడం మంచిది అంతిమ జాతీయపోరాటంయొక్క, సాంఘిక స్వతంత్ర పోరాటంయొక్క సమస్యలు భారతదేశంలో అంతకుముందే పరిణతస్థితికివచ్చాయి. వానిని యుద్ధం మరింత త్వరితగతిని రంగంలోనికి తెచ్చింది

భారతదేశంలో ప్రజాశక్తులు పురోగమిస్తున్నాయనడంలో వివాదమేలేదు పోరాటాలద్వారా కార్మికవర్గ, కర్షకశక్తులు పురోగమిస్తున్నవి ; తమబలాన్ని తాము తెలుసుకుంటున్నవి ; నిర్మాణ మహత్బాధ్యతను నిర్వహించేందుకు, సౌఖ్య ప్రదమైన భవిష్యంపైపు ఆశక్తులు అంగలువేసుకుంటూ ముందుకు నడుస్తున్నవి

ప్రపంచ భవిష్యత్తుకెంతో ప్రాముఖ్యమైనట్టి, ఆశాజ్యోతి అవుతున్నట్టి సంపూర్ణస్వతంత్ర పోరాటంలో భారతప్రజలకు, ప్రపంచంలోని కార్మిక వర్గమూ - అభ్యుదయశక్తులూ సానుభూతి సద్భావాలను ప్రదర్శిస్తున్నాయి భారతదేశ స్వతంత్రం అంటే మానవజాతి అంతిమ ఐక్యత స్వతంత్ర సమాన తలవేపుకు ఒక ముందడుగు వేయడమన్నమాట. ప్రపంచశాంతి, ప్రపంచ సామ్య వాదం విజయానికీ ముందడుగు వేయడమన్నమాట

స మా ప్తం.

